MRS. CHINNI. MANI MOHAN

# ఇంటింటా గీతాధ్యయనం

తృతీయ భాగము

అంగ్లమూలము

పరమపూజ్య స్వామి దయానంద సరస్వతి

తెలుగు అనువాదము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి



*Publishers :*

**AARSHA VIDYA SAGAR**

"TRIPTI" Plot No. 1165, Road No. 56,

Jubilee Hills, Hyderabad - 500 033.

ANDHRA PRADESH, INDIA

**Tel : 354 8425**

ప్రతులు లభించు స్థానము :
ఆర్ష విద్యా సాగర్,
టి.కె.ఎమ్. ఏజన్సీ,
సూర్య థియేటరు ఎదురుగా,
తిలక్ రోడ్డు, హైదరాబాదు.
ఫోను : 4754529, 4758060, 4758096.

ముద్రణ :
కె.యస్. లత
ఫోటో ఆఫ్ సెట్ ప్రింటింగ్ వర్క్స్,
4 - 3 - 51/ 21 - 22,
హనుమాన్ వ్యాయామశాల కాంప్లెక్స్,
సుల్తాన్.బజారు, హైదరాబాదు – 500 195.

# ముందు మాట

శ్రీ శంకర భగవత్పాదాచార్యులు శ్రీ మద్భగవద్గీతకు భాష్యమును వ్రాస్తూ, ఉపోద్ఘాతంలో ఇల్లా అంటారు :

అనేకైః వివృతపదపదార్థవాక్యార్థ న్యాయమపి అత్యంత విరుద్ధానేకార్థత్వేన లౌకికైః గృహ్యమాణముపలభ్యాహం వివేకతః అర్థనిర్ధారణార్థం...

''శ్రీమద్భగవద్గీతకు ఎందరో వ్యాఖ్యానాలను వ్రాసినారు. ప్రతిపదాన్ని, వ్యాక్యాన్ని వివరించేరు. ఫలితమేమి? ఒకే శ్లోకానికి అనేకములగు అర్థాల్ని చెప్తున్నారు. కొన్ని చోట్ల ఈ అర్థాలు పరస్పర విరుద్ధంగా కూడా ఉన్నాయి. నేనీ పరిస్థితిని చక్కదిద్దే యత్నం చేస్తాను. విషయవస్తువు కలగాపులగం కాకుండా దేనికి దానిని విడదీసి అర్థం చెప్తాను''.

విషయవస్తువును, అరటి పండును ఒలిచి చేతిలోకి అందించిన విధంగా, సందేహాలకు తావు లేకుండా, పరస్పర విరుద్ధములగు వాటిని కలిపివేసి సాధకులకు వ్యామోహం కలిగించకుండా, బోధించిన ఆచార్యులు శ్రీ శంకరులు. సంస్కృతభాషలో ఉన్న ఆ ప్రౌఢమైన భాష్యాన్ని ఆంగ్లభాషలో ఆధునిక కాలంలోని జిజ్ఞాసువులకు అర్థమయ్యే విధంగా బోధించి, గీతను ప్రపంచమంతటా ప్రచారం చేసిన అభినవ శంకర భగవత్పాదులు పరమ పూజనీయ బ్రహ్మ విద్యాచార్య జగద్గురు స్వామి దయానంద సరస్వతి.

అందమైన ఆంగ్ల భాషలో ప్రవహించిన ఆ జ్ఞాన గంగను స్వామి దయానంద సరస్వతి గారి శిష్యులు శ్రీ స్వామి తత్త్వ విదానంద సరస్వతి గారు తెలుగు భాషలోనికి తీసుకు వచ్చే భగీరథయత్నాన్ని ఆరంభించి కృతకృత్యులైనారు. ఆ ప్రయత్న ఫలితంగా 'ఇంటింటా గీతాధ్యయనం' అవతరించి, జిజ్ఞాసువులకు చక్కని ప్రయోజనాన్ని చేకూరుస్తున్నది.

1-5-2001

ఆర్ష విద్యాసాగర్

భాగ్యనగర్

## ఆరవ అధ్యాయము

ఆరవ అధ్యాయములో ప్రముఖ అంశము ధ్యానము. ఎట్లు కూర్చుండవలెను? కూర్చుండి ధ్యానము నెట్లు చేయవలెను? ఇత్యాది విషయములను శ్రీకృష్ణ భగవానుడు ఈ అధ్యాయములో వివరించెను. మనస్సును ఆత్మ యందు స్థిరముగా నుండునట్లు చేయవలెను. సాధకుడు ఇతరముల గురించి ఆలోచించరాదు (ఆత్మ సంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్, 6-25). మానవుని జీవనశైలి ఎట్లుండవలెను? ఆహారమును మితముగా భుజించి, ఇతర వ్యవహారముల యందు సముచితముగా ప్రవర్తించుచూ, నిద్రను జాగ్రదవస్థను తగుపాళ్లలో నియంత్రించుకునే యోగసాధకుని దుఃఖములను ఈ యోగము నశింపజేయును (యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు, యుక్త స్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా, 6-17). యోగసాధనకు ఆవశ్యకమగు భావనాత్మక పరిణతిని, మానసిక ప్రవృత్తిని, పరిణతమైన జీవనశైలిని, ధ్యానమయ జీవనమునకు ఆవశ్యకమగు ఇతర అంశములను భగవానుడు చర్చించెను. ప్రత్యగాత్మ ధ్యానముతో ఈ అధ్యాయము ముగిసినది. భగవానుడు ఈ ధ్యాన ప్రకరణములో ప్రముఖముగా ప్రత్యగాత్మను చర్చించెను. అయిననూ, మచ్చిత్తః .... ఇత్యాది స్థలములలో ఈశ్వరుని కూడ ప్రస్తావించెను.

ఈ ఆరు అధ్యాయములలో, జీవుడు తన జీవనశైలిలో మార్పులను తెచ్చుకోదగిన అధ్యాత్మ సాధకునిగా ప్రతిపాదింపబడినాడు. వీటిలో ప్రముఖముగా జీవుని ఆత్మ ప్రస్తావింపబడినది. త్వం పద విచారమనగా నిదియే.

## తత్పద విచారారంభము – ఏడవ అధ్యాయము – సార సంగ్రహము

ఏడవ అధ్యాయములోని విషయ వస్తువు పూర్తి భిన్నముగా నుండును.

## మొదటి శ్లోకము

మొదటి శ్లోకము 'మయ్యాసక్త మనాః' అని ఆరంభమగును. మయి అనగా ఈశ్వరుడనగు నా యందు. అనగా మొట్టమొదటి శ్లోకములోనే ఈశ్వరుని ప్రస్తావన ఆరంభమైనది. ఎవని మనస్సు ఈశ్వరుడనగు నా యందు అంకితమైనదో, పూర్వాధ్యాయములో చెప్పబడిన ఈ యోగమును ఎవడు అనుష్ఠించగోరునో, అట్టి సాధకుడవగు నీవు ఈశ్వరుడనగు నన్ను సమగ్రముగా తెలియు ఉపాయమును చెప్పెదను. వినుము.

## రెండవ శ్లోకము

రెండవ శ్లోకములో భగవానుడు ఇట్లు చెప్పినాడు: విజ్ఞానము (ప్రత్యక్షసాక్షాత్కారము)తో కూడిన ఈ జ్ఞానమును నేను నీకు చెప్పెదను. బోధించునది ఈశ్వరుడనగు నేను గనుక, నీకు గల కొద్దిపాటి పరోక్ష జ్ఞానమును అపరోక్ష జ్ఞానముగా మార్చివేసెదను. భగవానుడు ఈ జ్ఞానమును పరోక్ష రూపముగను, అపరోక్ష రూపముగను ప్రస్తుతించిన విధమును మనము చూచియున్నాము. ఈ జ్ఞానమును పొందిన వ్యక్తికి ఇంకనూ తెలియదగినది ఏదియూ మిగులదు.

## మూడవ శ్లోకము

తరువాత, మూడవ శ్లోకములో అర్జునుని ప్రోత్సహించుట కొరకై శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పెను. లక్షలలో ఒకడు నన్ను తెలియగోరును. అట్టివారిలో ఒక్కడు మాత్రమే నా వాస్తవ స్వరూపము (తత్త్వతః)ను యెరుంగును.

## నాల్గవ శ్లోకము

నాల్గవ శ్లోకములో భగవానుడు తాను బోధించెదనని వాగ్దానము చేసిన విషయమును ఉపదేశించ నారంభించెను. ఆయన సర్వమును పరాప్రకృతి, అపరాప్రకృతి అను రెండు భాగములుగా విభజించి, వాటిలో ముందుగా అపరాప్రకృతిలోని అష్ట విధ భేదములను వర్ణించనారంభించెను.

## అయిదు, ఆరు శ్లోకములు

భగవానుడు అయిదవ శ్లోకములో అపరా ప్రకృతిని వర్ణించి, ద్వితీయార్ధములో, మరియు ఆరవ శ్లోకము ప్రథమార్ధములో పరాప్రకృతిని నిర్దేశించెను. పరా ప్రకృతి చైతన్యమే. అది కేవల మనోవృత్తి కాదు. అది జీవత్వ సారభూతమైనది. అదియే వాస్తవంలో సర్వమునకు కారణము. దేని నుండి సర్వము పుట్టునో, దేనిచే సర్వము ధరింపబడుచున్నదో, దేని యందు సర్వము లయమగునో, అట్టి సర్వ కారణమగు చైతన్య ఆత్మ నేనే.

ఏడవ శ్లోకము .

నా కంటె గొప్పది లేదు; నా కంటె భిన్నముగా ఏదీ లేదు అని భగవానుడు ఏడవ శ్లోకములో చెప్పినాడు. నాకు కారణము మరియొకటి లేదు. వాస్తవంలో నా కంటె భిన్నముగా ఏదీ లేదు. వేర్వేరు పూసలు ఒకే త్రాడు నందు ఉన్నట్లుగా, ఈ జగత్తు అనే మహా చిత్రపటము నా యందు మాత్రమే నేయబడి ( ఓతప్రోత) యున్నది. సర్వమునకు కారణము నేనే. సర్వము యొక్క సత్యము నేనే అని భగవానుడు చెప్పినాడు. ఇచట ఈశ్వరుని పరోక్షరూపము ప్రతిపాదింపబడినది.

ఎనిమిదవ శ్లోకము

జలములలోని రసము నేనే అని భగవానుడు ఎనిమిదవ శ్లోకమును మొదలిడెను. నామరూపముల గురించి విస్తారముగా చెప్పి, వాటి సారమును నిరూపించెను. సర్వమునకు ఉపాదాన కారణము నేనే. సర్వ వస్తువులు నా మూలముగనే యున్నవి. సర్వము యొక్క సారతత్త్వము నేనే. మహిమలన్నియూ నాకు చెందినవే. సూర్య చంద్రులలోని కాంతి నేనే. సర్వ వేదముల సారమగు ఓంకారము నేనే. ఆకాశములోని శబ్దము నేనే. మానవుని బలము నేనే.

తొమ్మిదవ శ్లోకము

అగ్నిలోని వేడి నేనే. భూమిలోని సుగంధము నేనే. సర్వప్రాణుల జీవనము నేనే. తపశ్శాలి అట్లు అగుటకు మూలమైన తపస్సు నేనే. తపశ్శాలి ఆచరించే వ్రతములన్నింటి ఫలరూపములో నేనే ఉన్నాను. అతని వ్రతముల స్వరూపము కూడ నేనే అని భగవానుడు తొమ్మిదవ శ్లోకములో కొనసాగించినాడు.

పదవ శ్లోకము

సర్వప్రాణులు జన్మించుటకు హేతుభూతమైన బీజము నేనే; జ్ఞానులలోని జ్ఞానము నేనే; తేజశ్శాలులలోని తేజస్సు నేనే అని భగవానుడు పదవ శ్లోకములో చెప్పెను.

పదకొండవ శ్లోకము

కామనలు, రాగద్వేషములు అను వ్యక్తిగత సమస్యలచే దూషితము కాని, బలవంతుల బలము నేనే అని భగవానుడు ఈ శ్లోకములో చెప్పినాడు. ధర్మమే ఈశ్వరుడు గనుక, మానవుని ధర్మానురూపముగా నుండే కామనలు కూడ పరమేశ్వరుడే.

## పన్నెండవ శ్లోకము

భగవానుడు పన్నెండవ శ్లోకములో ఈశ్వరుని గురించిన పరోక్ష జ్ఞానముపై చర్చను కొనసాగించెను. సత్త్వగుణ ప్రధానులు, రజోగుణ ప్రధానులు, తమోగుణ ప్రధానులు అగు ప్రాణులన్నియూ నా నుండియే పుట్టినవి. సత్త్వరజస్తమో గుణాత్మకమగు వివిధ మనోవృత్తులు కూడ నా నుండియే పుట్టినవి. ఇవి అన్నియూ నా యందు ఉన్ననూ, నేను వాటి యందు ఆధారపడి ఉండను. కాని అవి పూర్తిగా నాపై ఆధారపడును. వాటికి ఉనికిని నేనే అనుగ్రహించెదను. వాటికి గల సౌందర్యములన్నియూ నేనే. అవి అన్నియూ నా విభూతులే.

## పదమూడవ శ్లోకము

నేనీ తీరున సర్వవ్యాపకుడనై యున్ననూ, సత్త్వ రజస్తమోగుణములచే వ్యామోహితులైన మానవులు నన్ను గుర్తించజాలరని భగవానుడు పదమూడవ శ్లోకములో చెప్పెను.

## పదునాల్గవ శ్లోకము

భగవానుడు పదునాల్గవ శ్లోకములో నిట్లు చెప్పెను. ఓ అర్జునా! ఇందువలననే ఈ త్రిగుణాత్మకమగు, నా వశము నందుండే మాయను తరించుట మిక్కిలి కష్టము. మాయను తరించుటకు మాయావి వద్దకు చేరవలెను. ఇంద్రజాలికుడు మనముందు ఒక అద్భుతమును ప్రదర్శించును. మనకు ఆ అద్భుతము యొక్క రహస్యము తెలియదు. కాని, ఇంద్రజాలికుని ప్రక్కన నిలబడి, అతడా అద్భుతమును చూపించిన తీరును పరికించినచో, దానిలో అద్భుతమేమియూ లేనే లేదని స్పష్టమగును. శ్రీకృష్ణ భగవానుడు తాను కూడా మాయావినే ననియు, సాధకుడు తన సమీపమునకు వచ్చి తనను ప్రత్యక్షముగా దర్శించవలెననియు చెప్పుచున్నాడు. 'నీవు నా మాయచే వ్యామోహితుడవై దీనిని దానిని పొందగోరుచున్నావు. వాస్తవంలో మాయామోహము చేతనే నీవు భగవంతుని అన్వేషించు సాధకుడవైనావు. ఈ ఇంద్రజాలము యొక్క రహస్యము తెలిసిననాడు అన్వేషణ ఉండదు. కావున నన్ను సాక్షాత్కరించుకొన గోరువారు ఈ మాయను తరించెదరు'.

## పదునైదవ శ్లోకము

అట్లైనచో, మానవులు భగవానుని పొందగోరకపోవుటకు కారణమేమి? శ్రీకృష్ణ భగవానుడు పదునైదవ శ్లోకములో సమాధానము నిచ్చుచున్నాడు. వారు భగవానుని గురించి

ఆలోచించుటకైననూ వీలుగాని జీవనశైలికి అలవాటు పడినారు. కావున, వారికి భగవంతునితో పని లేదు. మరియు భగవంతుని పొందగోరని భక్తులు కూడ గలరు. వారు భక్తులే అయిననూ, నన్ను సాక్షాత్కరించుకొనుటలో వారికి తాత్పర్యము లేదు. నన్ను పొందగోరు వ్యక్తులు చాల తక్కువ.

## పదునారవ శ్లోకము

తరువాతి శ్లోకములో భగవానుడు నాల్గు విధముల భక్తులను వర్ణించినాడు. విపత్తు వచ్చినప్పుడు ఈశ్వరుని శరణు జొచ్చు ఆర్తుడు మొదటివాడు. విపత్తులో మాత్రమే గాక, ఏదేని కామనతో గూడ భగవంతుని అర్థించు అర్థార్థి రెండవవాడు. ఈతడు తాను కోరే లక్ష్యమును సాధించుటకై ఈశ్వరుని ప్రార్థించును. మూడవ వాడు జిజ్ఞాసువు. ఈతడు ఈశ్వరుని యథార్థ స్వరూపమును తెలుసుకొనుట యందు అభిరుచి గలవాడు. ఆ తరువాతి వాడు జ్ఞాని. జ్ఞాని కూడా భక్తుడే. లక్ష్యమును చేరుటలో సఫలుడైన జిజ్ఞాసువు జ్ఞానియగును.

## పదునెనిమిదవ శ్లోకము

భగవానుడు పదునెనిమిదవ శ్లోకములో నిట్లు చెప్పినాడు: వారందరు నా భక్తులే. వారందరు ఉదారులే. కాని, జ్ఞాని నేనే. జ్ఞాని నాతో ఒక్కటి యగును. ఇది పరోక్ష జ్ఞానమా? ప్రత్యక్ష జ్ఞానమా? ఈ స్థాయిలో పరోక్షజ్ఞానము పరమాత్మ స్వరూపమగు అపరోక్ష జ్ఞానముగా మార్పుచెందును. భగవానుడు తాను బలవంతుల బలము ఇత్యాదిగా ఎన్నో విభూతులను బోధించి, ఇపుడు జ్ఞాని కూడ ఇట్టి వాక్యములను పలుక గల్గునని బోధించుచున్నాడు. నీవే సర్వము. ఈ అధ్యాయములోని రెండవ శ్లోకము నందలి విజ్ఞాన పదమునకు అర్థము ఈ ఎరుకయే.

## పందొమ్మిదవ శ్లోకము

పందొమ్మిదవ శ్లోకములో భగవానుడిట్లు చెప్పెను: అనేక జన్మల తరువాత సాధకుడు జ్ఞానమును పొంది నన్ను పొందును. ఇట్టి మహాత్ములు అరుదు. సాధకుడు అనేక జన్మల సాధన ఫలితముగా గీతను అధ్యయనము చేయును అని అభిప్రాయము. గీతను ఆశ్రయించిన తరువాత అనేక జన్మలు కలుగునని అభిప్రాయము కాదు.

## ఇరువదియవ శ్లోకము

'ఆర్తులు, అర్థార్థులు నన్ను ఏమాత్రమూ గుర్తించలేక, ఇతర దేవతల నాశ్రయించెదరు. నేను వారి శ్రద్ధను పదిలపరిచెదను' అని శ్రీకృష్ణ భగవానుడు ఇరువదియవ శ్లోకములో చెప్పెను.

## ఇరవై ఒకటి, ఇరవై రెండు శ్లోకములు

శ్రద్ధావంతుడగు ఇట్టి సాధకునకు అతని కర్మల కనురూపముగా ఫలములను నేనే అనుగ్రహించెదను అని భగవానుడీ శ్లోకములలో చెప్పెను.

## ఇరవై మూడవ శ్లోకము

భగవానుడు ఇరవై మూడవ శ్లోకములో అసలు విషయానికి వచ్చినాడు. ఫలములన్నియు సీమితములు, పరిచ్ఛిన్నములు (అంతవత్). ఇతర దేవతలను మాత్రమే ఆరాధించు భక్తులు ఇట్టి అల్పఫలములను పొందెదరు. కాని, నన్ను ఆరాధించే సాధకులు నాలో ఐక్యమగుదురు.

## ఇరవై నాలుగవ శ్లోకము

అయిననూ, మానవులు నా యథార్థ స్వరూపము నెరుంగక నన్ను కృష్ణుడు అనే ఒక వ్యక్తిగనో, లేక దివి నుండి భువికి వచ్చిన అవతారము మాత్రమే అనియో భావింతురు.

## ఇరవై అయిదు, ఇరవై ఆరు శ్లోకములు

ఉపనిషత్తు లన్నింటిలో కానవచ్చు తన యథార్థ స్వరూపమును గూర్చి భగవానుడు 25, 26 శ్లోకములలో చెప్పినాడు. 'నేను సర్వజ్ఞుడను. నేను కాలపరిచ్ఛిన్నుడను కాను. మానవులు నన్ను గుర్తించలేరు. కాని, నేను గడచిపోయిన సర్వమును, రాబోవు సర్వమును కూడ ఎరుంగుదును'. మానవులు భగవానుని గుర్తించకపోవుటకు కారణమేమి?

## ఇరవై ఏడవ శ్లోకము

ఇరవై ఏడవ శ్లోకములో భగవానుడిట్లు చెప్పెను: మానవులు జన్మించిన దాది నుండియు మోహితులై యుందురు. వారు ఇచ్ఛాద్వేషములతో కూడి జన్మించెదరు. వాటి వలన ద్వంద్వములు

కలుగును. ఈ ద్వంద్వములు మోహమును కలుగజేయును. మోహితులైన మానవులు వివేకముతో సత్యమును చూడజాలరు. ఈ రాగద్వేషముల వలన బాహ్యప్రపంచ సంబంధి జ్ఞానము కూడ కలుషితమగును. వారు ప్రపంచములోని వస్తువులను వాస్తవిక దృష్టితో చూడజాలరు. వారు నన్ను గుర్తించే అవకాశము గలదా?

## ఇరవై ఎనిమిది, ఇరవై తొమ్మిది శ్లోకములు

కాని, ఎవరిలోనైతే రాగద్వేషములు, మరియు పాపము పుణ్యకర్మలచే ప్రభావహీనములుగా చేయబడినవో, ఎవరైతే ద్వంద్వ మోహ విముక్తులై యుందురో, వారు జరామరణముల నుండి విముక్తి కొరకై నన్ను శరణు జొచ్చెదరు. వారు ప్రత్యగాత్మ-అభిన్నమగు పరబ్రహ్మను సాక్షాత్కరించుకొనగలరు. వారు కర్మాదుల స్వరూపమును కూడ ఎరుంగుదురు. కావున వారికి ఇతర సమస్యలు ఏమియూ ఉండవు.

## ముప్పదియవ శ్లోకము

వారు నన్ను ఎరుంగు ఉపాయమేది? భగవానుడీ విషయమును ఈ అంతిమ శ్లోకములో వివరించినాడు. వారు నన్ను సద్రూప ఆత్మగా మాత్రమే గాక, ఈ సర్వసృష్టి, సృష్టిలోని సర్వప్రాణులు, దేవతలు, యజ్ఞ యాగాదులు ఇత్యాది సర్వమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణముగా గుర్తించెదరు. వారు మరణకాలము నందు గూడ ఈ సర్వమును ఈశ్వరాభిన్నముగా దర్శించి నా స్వరూపమును ఎరుంగుదురు.

నన్ను ఈ రూపములో నెరుంగువారు నాలో ఐక్యమగుదురు. విజ్ఞానమనగా నిదియే.

అధ్యాయమునకు అంతములో ఒకటి రెండు శ్లోకములలో కొన్ని వినూత్న అంశములు ప్రస్తావింపబడును. అవి తరువాతి అధ్యాయములో విస్తారముగా చర్చించబడును. అవి అర్జునుని మనస్సులో ఒక శంక ఉదయించునట్లు చేయును. లేదా, శ్రీకృష్ణుడు ప్రశ్నతో సంబంధము లేకుండగనే వాటి వివరణను ఆరంభించవచ్చును.

మరణము ఆసన్నమైన సమయములోనైనను జ్ఞాని యొక్క యెరుకను గూర్చి శ్రీకృష్ణ భగవానుడు ఏడవ అధ్యాయములోని అంతిమ శ్లోకములు రెండింటిలో ప్రస్తావించి, ఆ ప్రస్తావనలో భాగముగా అనేక నూతన పదములను ప్రయోగించెను. ఇవి అర్జునుని ప్రశ్నలకు ఆధారమైనవి. రాబోవు రెండు శ్లోకములలో అర్జునుని ఈ ప్రశ్నలు నిబంధింపబడినవి.

అర్జునుని ప్రశ్నలు ఈ అధ్యాయమున కంతకూ ఉపక్రమరూపముగా నున్నవి.

**అధ్యాయము 8, శ్లోకము 1:**

अर्जुन उवाच ।
किं तद् ब्रह्म किमध्यात्मं किं कर्म पुरुषोत्तम ।
अधिभूतं च किं प्रोक्तमधिदैवं किमुच्यते ॥ १ ॥

**అర్జున ఉవాచ**
కిం తద్బ్రహ్మ కి మధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ
అధిభూతం చ కిం ప్రోక్త మధిదైవం కి ముచ్యతే (1).

**అర్జునః** = అర్జునుడు; **ఉవాచ** = పలికెను; **తత్** = ఆ; **బ్రహ్మ** = బ్రహ్మ; **కిం** = ఏది?; **అధ్యాత్మమ్** = దేహాదులపై కేంద్రితమై యుండునది; **కిం** = ఏది?; **పురుషోత్తమ** = ఓ పురుష శ్రేష్ఠ (ఎవని కంటె శ్రేష్ఠమైనది మరియొకటి లేదో); **కర్మ** = కర్మ; **కిం** = ఏది?; **చ** = మరియు; **అధిభూతం** = ప్రాణుల/పదార్థముల యందు కేంద్రితమై యున్నది; **కిం** = ఏది యని; **ప్రోక్తం** = చెప్పబడినది?; **అధిదైవం** = దేవతల యందు కేంద్రితమై యున్నది; **కిం** = ఏది యని; **ఉచ్యతే** = చెప్పబడును?.

ఓ పురుష శ్రేష్ఠా! ఆ బ్రహ్మ ఏది? దేహముల యందు కేంద్రితమై ఉండునది ఏది? కర్మ ఏది? ఏది భూతముల యందు కేంద్రితమై యున్నదని చెప్పబడినది? ప్రాణుల/పదార్థముల యందు కేంద్రితమై యున్నది ఏది? మరియు, దేవతలపై కేంద్రితమై ఉన్నది ఏది యని చెప్పబడినది? (1).

**అధ్యాయము 8, శ్లోకము 2:**

अधियज्ञः कथं कोऽत्र देहेऽस्मिन्मधुसूदन ।
प्रयाणकाले च कथं ज्ञेयोऽसि नियतात्मभिः ॥ २ ॥

**అధియజ్ఞః** కథం కోऽత్ర దేహేऽస్మిన్మధుసూదన
ప్రయాణ కాలే చ కథం జ్ఞేయోऽసి నియతాత్మభిః (2).

**మధుసూదన** = ఓ శ్రీకృష్ణా!; **అత్ర** = ఇచట; **అస్మిన్** = ఈ; **దేహే** = దేహము నందు; **అధియజ్ఞః** = యజ్ఞాది కర్మల యందు కేంద్రితమై యున్నది; **కథం** = ఎట్లు?; **కః** = ఏది?; **చ** = మరియు; **నియతాత్మభిః** = నిశ్చలమగు మనస్సు గలవారిచే; **ప్రయాణకాలే** = మరణ కాలము నందు; **కథం** = ఎట్లు; **జ్ఞేయః అసి** = తెలియబడుచున్నావు?

ఓ మధుసూదనా! ఇచట ఈ దేహము నందు యజ్ఞాది కర్మలలో కేంద్రితమై ఉండునది ఏది? ఎట్లు? మరియు నిశ్చలమగు మనస్సు గలవారు మరణ కాలమునందు నిన్ను ఎట్లు తెలియుదురు? (2).

జ్ఞానులు ఎరుంగుదురని నీవు చెప్పిన ఆ బ్రహ్మము ఎట్టిది? అని అర్జునుడు ప్రశ్నించెను. బ్రహ్మన్ శబ్దమునకు వేదము, బ్రాహ్మణుడు, బ్రహ్మగారు, ఇత్యాది అనేకార్థములు గలవు. బ్రహ్మన్ అనగా పెద్దది అని కూడా అర్థము గలదు. అది ఏదైననూ కావచ్చును. కావున, ఆ బ్రహ్మ ఏది? మరియు, నీవు 'అఖిలం కర్మ' అంటివి. దాని యర్థమేమి? ఆ కర్మ భూతకాలీనమా? వర్తమానములోనిదా? లేక భవిష్యత్తులోనిదా?

అధ్యాత్మ మనగా నేమి? అధిభూతమనగా నేమి? అధి దైవమనగా నేమి? ఈ దేహములో అధియజ్ఞుడు అనువాడు ఒకడు గలడా? ఈ అధియజ్ఞుడు ఎవరని ఎరుంగవలెను?

అర్జునుడిచట శ్రీకృష్ణ భగవానుని 'పురుషోత్తమ' అని సంబోధించెను. పురుషుడనగా వ్యక్తి. ఉత్తముడనగా సర్వశ్రేష్ఠుడు. కావున, పురుషోత్తముడనగా పురుషులందరిలో శ్రేష్ఠుడు. కాని, శ్రీకృష్ణ భగవానుడు పురుషులందరిలో శ్రేష్ఠుడనుట సరిగాదు. ఉన్న ఏకైక వ్యక్తి ఆయనయే. కావున ఇచట పురుషోత్తముడనగా, ఆయన పురుషుడు. మరియు ఆయనకు అతీతముగా ఏదీ లేదు. మనము పదునైదవ అధ్యాయములో పురుషోత్తమ శబ్దార్థమును మరింత వివరంగా తెలుసుకుంటాము.

స్థిరమైన (నియత) మనస్సు గలవారు దేహమును వీడు సమయము నందైననూ నిన్ను ఎరుంగుదురని నీవు చెప్పితివి. ఇది ఎట్లు సంభవము? మరణశయ్యపై నున్న వ్యక్తి తనకు ఆత్మీయులైన వ్యక్తులను స్మరించును; లేదా, తాను ఇంకా జీవించి ఉండాలని యత్నించును. అర్జునుని ప్రశ్నకు మూలమిదియే. మరణ సమయ మాసన్నమైనపుడు మానవుని మనస్సులో అనేక చింతలు ప్రవేశించి తొందరపెట్టుచుండగా, వారు నిన్ను ఎట్లు స్మరించగల్గుదురు? నిన్ను గుర్తించుట యెట్లు? వారి జ్ఞానములో నీవు విషయమగుట ఎట్లు సంభవమగును?

శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నలన్నింటికీ రాబోవు నాల్గు శ్లోకములలో సమాధానమును చెప్పి, ఆ పై మరింత వివరణను ఇచ్చును.

**అధ్యాయము 8, శ్లోకము 3:**

श्रीभगवानुवाच।
अक्षरं ब्रह्म परमं स्वभावोऽध्यात्ममुच्यते।
भूत भावोद्भवकरो विसर्गः कर्मसंज्ञितः॥ ३॥

అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే
భూత భావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః (3).

బ్రహ్మ = బ్రహ్మ; అక్షరం = వినాశము లేనిది; పరమం = అనంతమైనది; స్వభావః = వ్యక్తి యొక్క స్వీయ ప్రకృతి; అధ్యాత్మం = అధ్యాత్మమని; ఉచ్యతే = చెప్పబడుచున్నది; భూత భావోద్భవకరః = ప్రాణుల దేహములు పుట్టుటకు కారణమైన; విసర్గః = యాగములో చేయు ద్రవ్యత్యాగము; కర్మ సంజ్ఞితః = కర్మ యనబడును.

బ్రహ్మ వినాశము లేనిది, అనంతమైనది. వ్యక్తి యొక్క స్వీయ ప్రకృతి అధ్యాత్మ మనబడును. ప్రాణుల దేహములు పుట్టుటకు కారణమైన, యాగములో చేయు ద్రవ్యత్యాగము కర్మ యనబడును (3).

**అధ్యాయము 8, శ్లోకము 4:**

अधिभूतं क्षरो भावः पुरुषश्चाधिदैवतम्।
अधियज्ञोऽहमेवात्र देहे देहभृतां वर॥ ४॥

అధిభూతం క్షరో భావః పురుషశ్చాధి దైవతమ్
అధి యజ్ఞోఽహమేవాత్ర దేహే దేహ భృతాం వర (4)

దేహభృతాం = దేహధారులలో; వర = శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!; క్షరః = నశించే; భావః = పదార్థము; అధిభూతమ్ = అధిభూత మనబడును; చ = మరియు; పురుషః = హిరణ్యగర్భుడు;

**అధిదైవతమ్ = అధిదైవత మనబడును; అత్ర = ఈ; దేహే = దేహము నందు; అహమేవ = నేనే; అధియజ్ఞః = అధియజ్ఞుడను.**

దేహధారులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! నశించే పదార్థములు అధిభూతమనియు, హిరణ్యగర్భుడు అధిదైవమనియుచెప్పబడును. ఈ దేహము నందు నేనే అధియజ్ఞుడను (4).

## బ్రహ్మ అనంతము, ఆత్మభిన్నము

అక్షరం బ్రహ్మ పరమమ్. క్షరము (నాశము) లేనిది అక్షరమనబడును. నాశమును పొందే వస్తువు కాలమునకు అధీనమై, ఆరు భావ వికారముల వశములో నుండును. కావున క్షయము లేని వస్తువు ఈ వికారములకు కూడ అతీతముగ నుండును. పరబ్రహ్మ అక్షరము. అది ఎట్టి మార్పులకు అధీనము కాదు. అట్టి బ్రహ్మము మాత్రమే పరమమగును. అనగా దేశకాలములచే గాని, కొన్ని విశేషణములచే గాని నియంత్రింపబడదు. ఘటాది వస్తువు దానికి గల పరిమాణముచే దేశము నందు పరిచ్ఛిన్నమై యుండును. అది లేని కాలము ఒకటి ఉండెడిది. అది లేకుండు కాలము భవిష్యత్తులో ఉండగలదు. కాన, అది కాలపరిచ్ఛిన్నము. అది ఒక ఘటము గనుక, ఇతర ఘటముల కంటె మాత్రమే గాక, ఇతర వస్తువులన్నింటి కంటె కూడ భిన్నముగ నుండును.

బ్రహ్మ ఈ అంశములు వేటిలోనూ పరిచ్ఛిన్నము కాదు. దానికి పరిమాణము లేదు గనుక, అది దేశము నందు ఉండదు. ఇచట ఒక ప్రశ్న ఉదయించును. ఆకాశము లేని దేశము లేదు గదా! కాన, ఆకాశము కూడ దేశ పరిచ్ఛేద వినిర్ముక్తమేనా? సృష్ట్యంతర్గతముగా ఆకాశము సర్వవ్యాపకమను మాట సత్యమే. కాని, ఆకాశము బ్రహ్మను వ్యాపించదు. బ్రహ్మయే ఆకాశమును వ్యాపించును. మరియు, ఆకాశము కాలపరిచ్ఛిన్నము. ప్రలయము నందు, మరియు గాఢనిద్ర యందు దానికి ఉనికి లేదు. పైగా, అది ఆకాశము మాత్రమే. అనగా వాయువు, అగ్ని, కాలము ఇత్యాది ఇతర వస్తువులన్నింటి కంటె అది భిన్నమైనది.

బ్రహ్మ యందు స్వీయ అసాధారణ గుణము లేమియూ లేవు. కాన, అది ఇతర వస్తువులచే సీమితము కాదు. పైగా, సర్వము యొక్క సత్యత్వము అదియే. బ్రహ్మకు అతీతముగా ఏదియూ లేదు. అట్టి పరబ్రహ్మము మాత్రమే సచ్చిదానంద ఆత్మ కాగల్గును.

రాబోవు శ్లోకములలో (8-13) 'ఒకే వర్ణము గల ఓమ్' అను అర్థములో అక్షర శబ్దము ప్రయోగింపబడును. కావున, ఇచట కూడా అక్షర శబ్దమునకు అదే అర్థము నేల చెప్పరాదు? అని శ్రీ శంకరులు ఆశంకించిరి. కాని 'పరమమ్' అను విశేషణమును బట్టి ఈ అర్థము కుదరదు. మరియు, ఇచటి ప్రకరణము 'ఓమ్' కాదు. ఓమ్ బ్రహ్మమునకు పేరు మాత్రమే. ఓమ్ బ్రహ్మము కాదు. ఇచట అక్షరమనగా బ్రహ్మము.

స్వభావః అధ్యాత్మముచ్యతే. వ్యక్తి యొక్క స్వభావమునకు అధ్యాత్మమని పేరు. ఇచట ఆత్మ యనగా దేహము. కాన, స్థూల దేహముపై కేంద్రితమైనది అధ్యాత్మ మనబడును. అది దేహము గాని, జ్ఞానేంద్రియములు గాని, మనస్సు గాని, ప్రాణము గాని ఏదైనా కావచ్చును. కావున, జ్ఞానులు ఎరుంగుదురని శ్రీకృష్ణుడు చెప్పిన అధ్యాత్మమును అర్జునుడు తెలియగోరెను.

అధ్యాత్మమనగా జీవుడు గాని, ప్రత్యగాత్మ గాని కావచ్చును. ప్రకరణము ననుసరించి ఇచట అధ్యాత్మ మనగా ప్రత్యగాత్మయే. ప్రత్యగాత్మ సర్వప్రాణుల స్థూలదేహములలో చైతన్యరూపముగా ఉపలభ్యమగును. జీవుని స్వరూపము ఇదియే. జీవ స్వరూపమును విశ్లేషించినచో, జీవుని మూలధాతువు చైతన్యమేనని తెలియును. అదియే ఇచట అధ్యాత్మమని పిలువబడినది. అక్షర బ్రహ్మ కూడా జీవస్వరూపమగు అధ్యాత్మమేనని చెప్పబడినది.

బ్రహ్మన్, అధ్యాత్మమ్ అను రెండు పదముల అర్థము ఒక్కటియే. కాని అవి వేర్వేరు సందర్భములలో ప్రయోగింపబడును. మనము జగత్కారణమును చెప్పు సందర్భములో బ్రహ్మన్ శబ్దమును మాత్రమే వాడెదము. ఆత్మన్ శబ్దమును వాడము. స్థూలదేహము నందు కేంద్రితమై యున్న (అధ్యాత్మమ్) జీవునకు, బ్రహ్మమునకు అభేదము చెప్పబడినది. సర్వ కారణమగు బ్రహ్మమును జ్ఞాని ఎరుంగునని భగవానుడు చెప్పియున్నాడు గదా! అట్టి బ్రహ్మ ఒకానొక విశిష్ట వస్తువు అనే ధారణను నిరాకరించుటకై ఇచట 'అధ్యాత్మమ్' అను విశేషణము ప్రయోగింపబడినది. వారు బ్రహ్మమును ఎరుంగుదురు. కాని, తమ కంటె భిన్నముగా ఎక్కడనో దూరముగా నున్నట్లు కాదు. ఈ సత్యమును నిర్దేశించుటకై భగవానుడు 'అధ్యాత్మమ్' అనినాడు. బ్రహ్మను తెలుసుకుంటే ఆత్మ తెలిసినట్లే. ఆత్మ తెలిస్తే బ్రహ్మ తెలిసినట్లే. ఏలయన, బ్రహ్మ, ఆత్మ ఒక్కటియే.

**కర్మ కూడా భగవానుడే**

విసర్గః కర్మ సంజ్ఞితః. జ్ఞానులు కర్మను అశేషముగా ఎరుంగుదురని భగవానుడు చెప్పినాడు. అట్టి కర్మ ఏది? ఈ విషయమును అర్జునుడు తెలియగోరెను. సమర్పణము

(విసర్గః)నకు కర్మయని పేరు (కర్మ సంజ్ఞితః). విసర్గమనగా దేవతలకు సమర్పించే హవిస్సు శ్రీ శంకరులు వివరించిరి. కర్మ శబ్దము సామాన్యముగా సర్వక్రియలను బోధించును. కాని శాస్త్రములో దానికి దేవతల నుద్దేశించి చేసే వేదోక్త కర్మ అనే ప్రత్యేకార్థము వచ్చును. ఇట్టి వేదోక్త కర్మ ఇతర క్రియలన్నిటికీ ఉపలక్షకము.

భూత భావోద్భవకరః అనగా ప్రాణుల ఉనికి పుట్టుటకు హేతుభూతమైనది. జీవుడు పుట్టుటకు స్థూలదేహము ఒకటి ఆవశ్యకమగును. కర్మ దానిని ఇచ్చును. కర్మ దృష్టా దృష్ట ఫలములను రెండింటినీ ఇచ్చును. వాటిలో జీవుడు పొందే దేహము అదృష్టఫలము.

ఇప్పటికే దేహమును పొందియున్న జీవులను భూత శబ్దము నిర్దేశించును. జీవులకు పుట్టుక లేదు. పుట్టేది దేహము మాత్రమే. కుమారుడు పుట్టినాడు అని మనము అంటాము. వాస్తవంగా పుట్టినది ఏది? జీవుడా? లేక, దేహమా? ఒక విశిష్ట దేహము ఒకానొక తల్లిదండ్రులకు విశిష్ట దేశ కాలముల యందు పుట్టినది. నిత్యులగు జీవుల కొరకై దేహములు సృష్టింపబడును.

జీవునకు పుట్టుక లేదని యెరుంగుట ముఖ్యము. జీవునకు పుట్టుక గల దన్నచో, ఆత్మకు పుట్టుక ఉండాలి. అప్పుడు మోక్షమునకు అవకాశమే లేదు. జీవుని సారభూతమైన స్వరూప చైతన్యము సనాతనము. కావున, దానికి పుట్టుక లేదు. వ్యక్తిత్వ విశిష్టుడగు జీవునకైననూ పుట్టుక లేదు. ఏలయన, జీవత్వమునకు కారణమగు అజ్ఞానము అనాది. పుట్టేది ఒక విశిష్ట రూపము మాత్రమే. దానికి కారణము కర్మ.

కర్మ యైననూ బ్రహ్మము కంటె వేరుగా లేదు. బ్రహ్మమును ఎరింగిన వాడే సత్యము నెరుంగును. క్రియ, కర్త, మరియు క్రియలో అన్వయించే ఇతర కారకములు అన్నీ బ్రహ్మమేనని మనము నాల్గవ అధ్యాయములో చూచియున్నాము (4-24). అవి అన్నియూ సత్యబ్రహ్మమే అధిష్ఠానముగా గల మిథ్యలు. కావున, జ్ఞానులకు కర్మ స్వరూపమంతయూ (అఖిలం కర్మ) ఎరుకయే.

ఈ కర్మ వలననే దేహములు పుట్టును. వేద విహిత యాగాది కర్మల ననుష్ఠించు వ్యక్తి దేవతల ఉనికిని అంగీకరించినట్లు స్పష్టమే గదా! సృష్టి నిర్వహణ కావశ్యకమగు వర్షము, ఆహారము ఇత్యాది పదార్థముల నన్నింటినీ దేవతలు అనుగ్రహించుచున్నారు. కావున, అంతిమ విశ్లేషణలో ఇట్టి కర్మయే జీవుని పుట్టుకకు హేతువు అగును. మనమీ విషయమును మూడవ అధ్యాయములో (14, 15 శ్లోకములు) చూచియున్నాము. శ్రీ శంకరులు దానిని ఇచట మనకు మరల గుర్తు చేసినారు.

## పరివర్తన శీలముగు పదార్థములు కూడా భగవత్స్వరూపమే

అధిభూతం క్షరో భావః. పదార్థము లన్నియూ మార్పులకు, వినాశమునకు లొంగి యుండును. ఉనికి గలది భావము అనబడును. ఉనికి కలిగి మార్పులకు లోనగునది 'క్షరో భావః' అనబడును. పుట్టుక గలది, కాలాధీనముగ మనగల్గునది అగు ఈ సర్వ జగత్తు అధిభూతమనబడును. ఈ జగత్తులో ఉంటూ, పుట్టుక, ఉనికి, పెరుగుదల, పరిణామము, అపక్షయము మరియు మరణము అను వికారములకు లోనై యున్న స్థూల పదార్థము లన్నియూ నేనే అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు.

ఒక వస్తువులో మార్పు వచ్చినదనుకొనుడు. మార్పు వచ్చినంత మాత్రాన అది అదృశ్యము కాదు. కాన, మార్పు వచ్చినప్పుడు అది మార్పులేని అధిష్ఠానముపై ఆధారపడును. మార్పులు వచ్చే వస్తువు యొక్క మౌలికమైన ఉనికికి ఏనాడూ వినాశము లేదు. ఆ ఉనికి నేనే అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పెను.

వేదాంత విచారమును చేయు వ్యక్తి దృష్ట్యా అది అధ్యాత్మము. ఆ వ్యక్తి సంసారములో ఎదుర్కొనే వివిధ వస్తువుల దృష్ట్యా అది అధిభూతము. అధ్యాత్మము మాత్రమే గాక, అధిభూతము కూడా నేనే.

## సూక్ష్మ దేహములు కూడా భగవానుడే

పురుషశ్చాధి దైవతమ్. అధిదైవతమనగా పురుషుడు తక్క వేరొండు గాదు. సర్వ వ్యాపకుడు, సర్వదేవతా స్వరూపుడు నగు హిరణ్యగర్భుడే పురుషుడని శ్రీ శంకరులు వివరించిరి. సర్వ సూక్ష్మ శరీర ప్రవర్తకుడగు హిరణ్యగర్భుడు కూడా స్వరూపతః బ్రహ్మయే. కావున, పరివర్తన శీలములగు స్థూలదేహములు మాత్రమే గాక, సూక్ష్మ శరీరములు కూడా నేనే. జ్ఞానులు ఈ సత్యము నెరుంగుదురు.

## యజ్ఞము భగవానుడే; యజమానుడు కూడ భగవానుడే

అధియజ్ఞోऽహ మేవాత్ర దేహే దేహ భృతాం వర. వేదోక్త కర్మలకు యజ్ఞమని పేరు. యజ్ఞమును చేయువాడు యజమానుడు అనబడును. సర్వక్రియలకు అంతిమముగా కర్త అహంకారము అగును. యజ్ఞము కేంద్రితమై ఉండే అధియజ్ఞము అహంకారమే యగును. అట్టి

అహంకార రూప యజమానుడు యజ్ఞములకు అధిష్ఠాన దేవత యగు విష్ణువు కంటె వేరుగాడు. విష్ణువు సర్వసృష్టిని భరించి పోషించును గనుక, దేహములో నుండే దైవము ఆయనయే. జీవుని అతని కర్మ నిలబెట్టును. సృష్టిని నిలబెట్టునది విష్ణువు. ఈ సామ్యముచే యజ్ఞకర్త యగు అహంకారమునకు దేవత విష్ణువు అగును.

విష్ణువు ఉండునది ఎక్కడ? కర్మ ఉద్భవించేది ఎక్కడ నుండి? ఈ దేహము ఎవరి దేహము? దేహభృతామ్. అనగా దేహము గలవారి దేహము. దేహము లేనిదే కర్మ లేదు గదా! విష్ణువు దేహమునకు బాహ్యము నందు మాత్రమే లేడు. ఆయన కర్మ యందు ఫలము నిచ్చే సామర్థ్య రూపములో నున్నాడు. యజ్ఞము నేను తక్క వేరొండు గాదు (అధియజ్ఞః అహమ్) అని శ్రీకృష్ణ భగవానుడు ఇచట చెప్పుచున్నాడు. అనగా, అహంకారము తనదేనని విష్ణువు తన అధికారమును స్థాపించుకొని యున్నాడు. కావున, సాధకుడు కర్తృత్వమును తొలగింప బని లేదు. ఏలయన, విష్ణువు కంటె భిన్నమైన కర్త లేడు. విష్ణువు పరబ్రహ్మయే గదా! జ్ఞానులీ సత్యమును గుర్తించెదరు.

వరా! అనగా మానవులలో సర్వశ్రేష్ఠుడా! అని శ్రీకృష్ణ భగవానుడు అర్జునుని సంబోధించెను.

ఇప్పుడు అర్జునుని ప్రశ్నలలో ఒక్కటి మాత్రమే మిగిలియున్నది. ఈ సత్యము నంతనూ జ్ఞాను లెరుంగుదురు. కాని, మరణ సమయములో వారికి ఈ జ్ఞానము ఉండునా?

ఒక వ్యక్తి తన ఆత్మ పరబ్రహ్మయే అను సాక్షాత్కారము గలవాడనుకొనుడు. తన ప్రత్యగాత్మ బ్రహ్మము కంటె వేరుగాదని ఆతడు యెరుంగును. జగత్తు, తన్మూలకమగు యజ్ఞములు, ఇతరప్రాణులు, మరియు దేవతలు ఆత్మ రూపమగు బ్రహ్మ కంటె వేరుగాదు. ఆతడు ఆరోగ్యవంతుడుగా నున్నప్పుడు ఈ జ్ఞానము అతనికి సుస్పష్టముగా నుండవచ్చును. కాని, మరణము ఆసన్నమైనప్పుడు ఆ జ్ఞానము అతనిని విడిచిపోవునేమో! అపుడాతని మనస్సు ప్రాపంచిక చింతలతో వ్యాకులమై యుండవచ్చును.

మానవుడు జీవించియుండగా అతని భావాత్మక వ్యక్తిత్వమును ఆక్రమించి యున్న విషయములే మరణ సమయములో అతని స్మృతిపథమున ప్రకాశించును. ఇట్టి స్థితిలో నాతడు భగవానుని స్మరించుట ఎట్లు సంభవమగును? అంతకాలమునందు మానవుడు ఏదో తీరున ఇంకనూ జీవించాలనే ప్రయత్నమును చేయును గదా! అతని స్మృతిలో వైద్యుడు, నూతన చికిత్సా విధానములు, ప్రాణవాయువు ఇత్యాదులు ఉండును. ఆతడు మరణమును స్వీకరించుటకు

పిల్లవానికో, వైద్యుని కొరకు కబురు పంపును. అతడు మరణించుటకు సిద్ధపడినచో, తనకు ప్రియతములైన వ్యక్తులకు కబురు పంపును. బ్రహ్మను ఆ సమయములో స్మరించువారెవ్వరు?

కామనలకు అలంబమైన ఈ వస్తువు లన్నియూ మానవుల వివేకమును అపహరించును. వృద్ధ వ్యక్తులలో కామన అధికముగా నుండుటచే, ఆత్మా నాత్మ వివేకము, నిత్యా నిత్య వివేకము ఉండదు. వారి కాలమంతయూ కామనాపూర్తిలోనే గడచిపోవును.

**అధ్యాయము 8, శ్లోకము 5:**

अन्तकाले च मामेव स्मरन्मुक्त्वा कलेवरम् ।
यः प्रयाति स मद्भावं याति नास्त्यत्र संशयः ॥ ५ ॥

అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కలేవరమ్
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః (5)

యః = ఎవడైతే; అంతకాలే చ = మరణ కాలము నందు కూడా; మామేవ = నన్నే; స్మరన్ = స్మరించుచూ; కలేవరమ్ = దేహమును; ముక్త్వా = వీడి; ప్రయాతి = పయనమగునో; సః = వాడు; మద్భావం = నా స్వరూపమును; యాతి = పొందును; అత్ర = ఈ విషయములో; సంశయః = సందేహము; న అస్తి = లేదు.

ఎవడైతే మరణ కాలము నందు కూడా నన్నే స్మరిస్తూ దేహమును వీడి పయనమగునో,
వాడు నా స్వరూపమును పొందును. ఈ విషయములో సందేహము లేదు (5).

**మరణ సమయము నందైననూ జ్ఞాని తాను బ్రహ్మయేనని ఎరుంగును**

అంతకాలే చ. అనగా జీవితము అంతము అయ్యే వేళ. ఒక నిర్దిష్ట జన్మలో ఒక విశిష్ట స్థూల దేహము నుండి సెలవు తీసుకునే వేళ అది. దేహి మరణించు వేళయే అంతకాలము.

మాం స్మరన్. నన్ను స్మరించుచూ. తానే బ్రహ్మ యని యెరింగిన జ్ఞాని మరణశయ్యపై కూడ భగవానుని స్మరించును. మరియు అతని జ్ఞానము స్థిరముగ నుండును. ఇచట స్మరణ (గుర్తునకు తెచ్చుకొనుట) అను శబ్దప్రయోగము లాక్షణికము.

బ్రహ్మ మనము గుర్తుంచుకొనదగిన మనోవృత్తి విషయమగు వస్తువు అయినచో, మరణశయ్యపై అట్టి బ్రహ్మతో ప్రయోజన మేమియు ఉండదు. కాన ఆ బ్రహ్మ గుర్తు రాదు. మరణ సమయములో వ్యక్తి తనకు అత్యంత ప్రీతిపాత్రమైన వస్తువును స్మరించును. బ్రహ్మ మనో వృత్తిలో విషయము అయ్యే పక్షంలో, వ్యక్తికి మరణ సమయములో బ్రహ్మ స్మరణకు వచ్చిననూ, ఆతడు బ్రహ్మను పొందుననే నిర్ణయము లేదు. ఏలయన, బ్రహ్మను స్మరించుట బ్రహ్మను తెలియుట కాదు.

జీవుని మౌలిక స్వరూపమే బ్రహ్మ. 'నేను బ్రహ్మను' అనునది కేవల శబ్ద ప్రయోగము కాదు. అది జ్ఞానము. కాన, అది స్మృతి విషయము అగునా? నేను వంద విభిన్న విషయములను స్మరించవచ్చును. కాని, స్మరింపబడేది ఎన్నడూ బ్రహ్మ కాజాలదు. ఏలయన, సర్వమును స్మరించునది బ్రహ్మ. తాను బ్రహ్మయని ఎరింగిన వ్యక్తి విస్మరించే ప్రసక్తియే లేదు. బ్రహ్మ జీవుని స్వరూపము. అది స్మృతి విషయము కాదు.

కలేవరం ముక్త్వా యః ప్రయాతి = దేహమును వీడి పయనించువాడు. వాడు ఎచటకు పోవును?

సః మద్భావం యాతి. ఆతడు నా స్వరూపమును, అనగా పరమాత్మ స్వరూపమును పొందును. ఇట్టి వ్యక్తి జీవన్ముక్తుడగును. జీవించి యుండగనే ఆతడు ఆత్మ బ్రహ్మాభిన్నమని దర్శించును. ఆతడు మరణించిన తరువాత ఏమగును? అపుడు జీవుడు లేడు. ఉన్నది బ్రహ్మ మాత్రమే.

## జ్ఞాని మరణించినపుడు ఏమగును?

అజ్ఞాని విషయంలో, స్థూలదేహము నశించినా, కారణదేహమగు అజ్ఞానము ఇంకనూ ఉండుటచే సూక్ష్మదేహము కూడ కొనసాగును. ఆతనికి ఆత్మ జ్ఞానము లేదు గనుక, అతని కర్మలన్నియూ ఫలోదయమునకు వేచి యుండును. కావున, మరణ సమయము నందు ఆతడు ఆ కర్మలకు అనురూపమైన దేహమును ధరించి, వాటి పరిపూర్తి కొరకు ఉచితమగు స్థానమునకు పయనించును.

కాని, జీవన్ముక్తుని విషయంలో మరణ సమయము నందు సూక్ష్మ దేహము విలీనమగును గాన, ఈ ప్రయాణము ఉండదు. మానవుడు మరణానంతరము పయనించునని చెప్పిన శాస్త్రమే, జ్ఞాని విషయంలో ఈ పయనమునకు కావలసిన సూక్ష్మదేహము ఉండబోదని చెప్పుచున్నది.

సూక్ష్మ దేహమునకు హేతువైన అజ్ఞానము నశించుటచే, సూక్ష్మదేహము కూడ నశించును. అజ్ఞానమే కారణదేహము. ఆత్మ బ్రహ్మాభిన్నము అను జ్ఞానముచే ఈ అజ్ఞానము తొలగిపోవును. కారణము నశించగానే, కార్యము కూడ సహజముగనే నశించును. దారములు కాలిపోయిన తరువాత, వస్త్రశకలము మిగిలియుండదు గదా! అదే విధముగా, అజ్ఞానము నశించగానే, సూక్ష్మశరీరము మిగిలియుండజాలదు. కావున, ప్రయాణము ఉండబోదు.

జ్ఞాని దేహమును వీడి భగవానుని మాత్రమే పొందును. ఇచట పొందుట కేవల ప్రతీక మాత్రమే. వాస్తవంలో, శ్రీకృష్ణుడు తాను ఆత్మాభిన్నమగు పరమాత్మయే నని ముందుగనే స్పష్టము చేసియున్నాడు. కావున, పొందుట యనగా ఆత్మ బ్రహ్మాభిన్నమని గుర్తించుటయే.

కాని, ఒక వస్తువు మరియొక దాని స్వరూపమును పొందజాలదు గదా! (8వ అధ్యాయములో 15వ శ్లోకము వద్ద గల వివరణను చూడుడు). తన మౌలిక రూపములో ఉండే వస్తువు తన మౌలిక స్వభావమును వీడి మనజాలదు. కాని, ఇచటి పరిస్థితి అది కాదు. ఆత్మ స్వరూపతః త్రికాలముల యందు బ్రహ్మమే. జ్ఞాని జీవించియుండగనే ఈ సత్యమును దర్శించును. జ్ఞాని మరణించిన తరువాత ప్రత్యేకమైన జీవుడు లేనే లేడు.

జ్ఞాని జీవించి యుండగా కర్త వలె, భోక్త వలె కన్పట్టును. మరణానంతరము అది కూడా ఉండదు. జ్ఞానము కలుగుటకు పూర్వము అతడు కర్మలను చేయుచుండెను. జ్ఞానము కలిగిన తరువాత ఆయన చేయుచున్నట్లు కన్పట్టెను. ఆయన మరణించిన తరువాత, అనగా ఆయన దేహము మరణించిన తరువాత, ఆయన కర్మలను చేస్తున్నట్లు కన్పట్టుట యైననూ లేదు. ఆయన శాశ్వతముగా ఈశ్వరునిలో ఐక్యమగును.

అత్ర నాస్తి సంశయః. ఈ విషయములో సందియము లేదు. ఇది ఒక హామీ కాదు. ఇది సత్య కథనము మాత్రమే. బ్రహ్మ అనే వస్తువు సనాతనము గాన, అది పుట్టే ప్రసక్తియే లేదు. అట్టి బ్రహ్మ ఆత్మయే నని ఎరింగిన జ్ఞాని మరల పుట్టుట ఎట్లు సంభవమగును? సనాతన తత్త్వమునకు పుట్టుక లేదు. జ్ఞాని జ్ఞానోదయమునకు ముందు కూడా సనాతనుడే. కాని ఆ సత్యము అతనికి తెలియలేదు. కావుననే జీవుడు అనే మిథ్యాతత్త్వము ఒకటి ఉండెను. అది కర్మలను ప్రోగుచేయగా, ఫలానుభవమునకై పుట్టుక తప్పలేదు. ఇపుడాతడు తన స్వరూపము నెరింగినవాడు గాన, అతనికి మరల జన్మ ప్రసక్తి లేదు.

జ్ఞానోదయమునకు ముందు ఒక ఈశ్వరుడు, జ్ఞానోదయము తరువాత మరియొక ఈశ్వరుడు లేరు. ఉన్నది అంతా ఏకైక వస్తువు. దానిని ఎరింగినవాడు నా స్వరూపమును పొందును (మద్భావం యాతి).

పైగా, దీనిలో సందేహము లేదు. అతడు పరమాత్మను పొందునా? పొందడా? అనే సందేహము లేదు. జ్ఞాని సదా పరమాత్మయే గనుక, ఈ విషయములో సందేహము లేదు. పరమాత్మ వద్దకు వెళ్లుట అనే ప్రసక్తి ఎక్కడిది?

## శాస్త్ర తాత్పర్యము తెలియాలంటే మోక్ష స్వరూపము తెలియాలి

'మద్భావం యాతి' అను వాక్యమును వ్యాఖ్యాతలు అనేక విధములుగా వ్యాఖ్యానించిరి. మనకు శాస్త్రమును గురించి సరియగు అవగాహన కలగాలంటే, మోక్ష స్వరూపము స్పష్టముగా తెలియవలెను.

'నారాయణుడ నగు నన్ను స్మరిస్తూ దేహమును వీడినవాడు వైకుంఠమును పొందును' అను అర్థమును ఒక వ్యాఖ్యాత చెప్పెను. ఆయన అభిప్రాయంలో వైకుంఠప్రాప్తియే మోక్షము. వైకుంఠము స్థానంలో స్వర్గమును గురించిన ధారణను ఉంచవచ్చును. ఇట్టి ధారణలు లోకప్రియములై ఉన్నవి గనుక, మనము వీటిని ఇచట పరిశీలించెదము.

## బ్రహ్మ సాయుజ్యము – భగవానునితో ఐక్యమగుట

ఈ వాదముల ప్రకారముగా, మానవుడు స్వర్గమునకు వెళ్లి, అచట భగవానునితో ఐక్యమగును. ఈ పక్షములో, వెళ్లేది ఎవరు? వ్యక్తియా? ఆ వ్యక్తికి దేహము ఉండునా? దేహము లేనిచో, అది నిద్ర వంటిది యగును. నిద్రలో దేశకాలములు లేవు గనుక ప్రయాణము అను మాటయే లేదు. మరియు, దేహము లేకుండగా ఒకచోట నుండి మరియొక చోటికి పయనించుట అసంభవము. శాస్త్రము వివిధ లోకములను భౌతిక స్థానములుగా ప్రతిపాదించినది. కావున, ఆ లోకములకు వెళ్లుటకు స్థూలదేహము ఉండితీరాలి. ఆ దేహము దివ్యదేహము కావచ్చును. కాని, దేహమై ఉండాలి. కేవల స్థూలదేహము శవమే గదా! కాన, దానితో బాటు ఒక సూక్ష్మదేహము కూడా ఉండవలెను. ఇది చాల ప్రముఖమైన విషయము. జీవుడు తన స్థూల సూక్ష్మ దేహములతో గూడి నారాయణుడగుట యెట్లు? స్వీయదేహముతో గూడి యున్న వ్యక్తి నారాయణుని కంటె పూర్తిగా

భిన్నుడై యుండును. స్వీయ స్థూల సూక్ష్మ శరీరములు లేనిచో, నారాయణునిలో ఐక్యము కాదగిన వ్యక్తి ఏడి?

వ్యక్తి ఈశ్వరునిలో భాగము అయిన తరువాత తన వ్యక్తిత్వమును నిలబెట్టు కొనునా? అట్లైనచో, అది మోక్షము కాదు. ఈశ్వరుడు ఈశ్వరుడు గను, వ్యక్తి వ్యక్తి గను మిగిలియుందురు. వ్యక్తి ఈశ్వరునిలో విలీనమయ్యే పక్షంలో, వ్యక్తి సత్యము ఎట్లు అగును? వ్యక్తి విలీనం కావాలంటే, మిథ్య అయి ఉండాలి. అట్లైనచో, వ్యక్తికి ఈశ్వరునితో ఏనాడూ భేదము లేదు. ఈ సత్యము నెరుంగుటయే మోక్షము. ఇదియే వాస్తవమగు బ్రహ్మసాయుజ్యము. ఈ సాయుజ్యము ఒక శబ్దాలంకారము మాత్రమే. జీవుడు బ్రహ్మయే.

### సామీప్యము మోక్షమగునా?

మోక్షమును గురించి మరియొక వాదము గలదు. వ్యక్తి పరమ పవిత్రుడైనచో, భగవంతునితో ఇంచుమించు సరిదూగి, భగవంతునికి బాగా దగ్గరగా వెళ్లగల్గును. ఈ పక్షములో, ఒకడు భగవంతునకు కొంత దగ్గర అయినచో, మరియొకడు అతని కంటె మరింత దగ్గర అగును. అపుడాతడు రెండవ వానితో పోల్చి చూచుకుని దుఃఖియగును. మరోమాటలో చెప్పాలంటే, వ్యక్తి తన వ్యక్తిత్వముతో భిన్నముగా నున్నంత వరకు, తర తమ భేద ప్రయుక్తమగు సుఖదుఃఖములకు వశుడై యుండును. ఈ సామీప్య మోక్షములో వ్యక్తిత్వము విలీనము కాదు. కావున, పూర్ణ స్వాతంత్ర్యము కల్ల యగును.

స్వర్గమునకు పేరు ఏదైనా స్వర్గ ప్రాప్తి మోక్షము కాదు. కొన్ని సందర్భములలో స్వర్గమును ఆత్మ, మోక్షము ఇత్యాది పదములతో నిర్దేశించుట గలదు. కాని, స్వర్గములో సాపేక్షికమైన దుఃఖ విముక్తి గలదని చెప్పుట మాత్రమే వీటి తాత్పర్యమని స్పష్టమే. వ్యక్తి ఒక విశిష్ట కాలములో పొందు స్థానమే స్వర్గము గదా! వ్యక్తి యొక్క పుణ్యమును బట్టి నిర్ణయింపబడే కాలములో మాత్రమే అచట ఆ వ్యక్తి ఉండగల్గును. స్వర్గము గలదని మనకు శాస్త్రము వలన తెలిసినది. స్వర్గ ప్రాప్తి మూన్నాళ్ల ముచ్చటయేనని అదే శాస్త్రము మనకు స్పష్టము చేయుచున్నది. ఈ ముచ్చటకు హేతువగు పుణ్యము ఖర్చు కాగానే ముచ్చట అంతమగును. తీవ్ర ముముక్షు గల వానికి స్వర్గము నందు ఆకర్షణ ఉండదు. నేను త్రికాలముల యందు ముక్తుడనై ఉండగా, స్వర్గమును పొందాలని కోరుకొనుట మౌలికమైన అజ్ఞానమును బలపరచినట్లే యగును. బ్రహ్మ లోక ప్రాప్తి సంసారాంతర్గతమగు ఫలములలో సర్వశ్రేష్ఠముగా పరిగణింపబడును. ఈ లోకము లన్నియూ బ్రహ్మ కంటె వేరుగా

లేవనియు, అట్టి బ్రహ్మ నేనే అనియు ఎరింగిన జ్ఞానికి ఆ జ్ఞాన ప్రకాశములో బ్రహ్మలోక ప్రాప్తి కూడా నిరర్థకముగా భాసించును. కావున ఈ పరివర్తన చెందుట (becoming)లో మోక్షము లేదు. పరివర్తనలో దేహము మారును. దేశకాలములు మారును. కాని, వాస్తవంలో మోక్షము ఇప్పుడు ఇక్కడ ఉన్నది. ఈ దేహేంద్రియ మనస్సంఘాతము మోక్షమునకు ఏ విధముగనూ అడ్డు రాదు. 'నేను నిత్యముక్తమగు బ్రహ్మను' అను ఎరుకయే మోక్షము. ఈ మోక్షమును పొందుటకు ఈ మానవ శరీరము యోగ్యమైనదియే.

మోక్షమనగా స్వాతంత్ర్యము. అనగా అంతకు ముందు ఉన్నదానిని విడిచిపెట్టుట. దేహము, మనస్సు ఇత్యాదులను వీడవచ్చును. కాని, వాటిని వీడినచో మోక్షము ఎవరికి? మోక్షము స్థూలదేహమునకు అన్నచో, దానికి దేని నుండి మోక్షము అవశ్యకమగుచున్నది?

దేహము నుండి విముక్తుడైన వ్యక్తి ప్రియము నుండి, అప్రియము నుండి విముక్తుడగుననియు, అట్టి వానిని ద్వంద్వము లేమియూ స్పృశించవనియూ శ్రుతి చెప్పుచున్నది. మోక్షమనగా ద్వంద్వముల నుండి విముక్తియే అయినచో, అది దేహమును ధరించిన వానికెవ్వనికీ సంభవము కాదు. సూక్ష్మదేహము మాత్రమే గల జీవునకైననూ సుఖదుఃఖముల నుండి విముక్తి సంభవము కాదు. స్వప్నములో స్థూలదేహము లేకున్ననూ, సుఖదుఃఖములు గలవు. కాని నిద్రలో పరిస్థితి వేరే. స్థూల సూక్ష్మ దేహములు లేనప్పుడు మాత్రమే సుఖదుఃఖములు ఉండవు. అవి ఉన్నప్పుడు సుఖదుఃఖములు కూడ ఉండును. ఇది జీవుని గురించిన వాస్తవము. మోక్షమనగా సుఖ దుఃఖరాహిత్యమే గదా! ఇట్టి స్థితిలో స్వర్గప్రాప్తియే మోక్షమని ఎట్లు చెప్పగలము?

వైకుంఠమును పొందగల్గితే, అచట ప్రియముల అనుభవము మాత్రమే ఉండునని కొందరు వాదించెదరు. కాని మనస్సు క్రియాశీలముగా నున్నంతవరకు దాని లక్షణము లన్నియూ మిగిలి యుండును. కోరికలు ఉండును. ఆ కోరికలు ఎంత వరకు సిద్ధించును అను అంశముపై ఆధారపడి సుఖదుఃఖముల తారతమ్యములు ఉండును. వర్తమానములో దుఃఖహేతువు లేకపోవచ్చును. కాని భూతకాలీన అనుభవముల నుండి 'నేను దోషిని' అను భావన, 'నాకు హాని కలిగినది' అనే ధారణ మనస్సులో చిరకాలము వరకు ఉండి గుర్తుకు వచ్చుచుండును. ఆ స్మృతిని మనము తప్పించుకొనలేము గదా! సుఖ దుఃఖముల నిచ్చుటకు స్మృతి ఒక్కటి చాలును. దుఃఖము కలుగుటకు చుట్టూ పరికించి చూచిన చాలును. మనతో ఉన్నది ఎవరు? మన యెదుట ఉన్నది ఎవరు? ఇత్యాదులను మనము ఇతరులతో పోల్చి చూసుకుంటాము. మనలను దుఃఖగ్రస్తులను

చేయుటకు ఇది చాలును. ఒకచో, దుఃఖము లేకపోయిననూ, విసుగు, చికాకు కలుగుట అనివార్యమగును.

స్వర్గము మోక్షస్థానమని ఎట్లు చెప్పదగును? శాస్త్రము సుఖహేతువులగు లోకములను వర్ణించినదే గాని, వాటిలో ఒక లోకమును పొందుట మోక్షమగునని చెప్పలేదు. పైగా, ఏ లోకమునకు వెళ్లిననూ, మరలి వచ్చుట తప్పదని శాస్త్రము చెప్పుచున్నది.

తీవ్రమగు మోక్షేచ్ఛ గల సాధకుడు స్వర్గము కొరకు గాక, మరుజన్మలో నైననూ జ్ఞానము లభించే అవకాశము కొరకు ఎదురుచూచును. ఈ దేహమును జ్ఞానోదయమునకు సమర్థము గానిచో, ఈ జన్మలోని పరిస్థితులు జ్ఞానోదయమునకు అనురూపముగా లేనిచో, మరుజన్మలో సర్వము మెరుగుపడి మోక్షము లభించవలెనని ముముక్షువు కోరును. కాని స్వర్గమును కోరడు.

మనకు దేహేంద్రియ మనస్సులు ఉన్ననూ, మనము వాటి నుండి విముక్తులమే నని శ్రుతి ప్రదర్శించుచున్నది. ఆత్మ సుఖ దుఃఖములచే సంస్పృష్టము కాదు. దాని స్వరూపము ఆనందము. ఆత్మ నిత్యముక్తము గనుక, 'నేను దేహము కాదు, నేను విముక్తుడను' అను జ్ఞానమే మోక్షము అగును.

### రూపము ఉన్నంత వరకు మోక్షము అసంభవము

సద్భావమనగా ఒక రూపము కాదు. ఒక వస్తువు యొక్క సారము దాని భావమనబడును. ఈశ్వరుని సారము రూపము లేకపోవుట. మరియు సచ్చిదానంద ఆత్మ కూడ రూపరహితమే. అట్టి స్థితిలో మాత్రమే అభేదము పొసగును. రెండు రూపముల మధ్య అభేదము అసంభవము.

ఈశ్వరునకు ఒక విశిష్ట రూపము లేదు. రూపము లన్నియూ ఆయనకు సంబంధించినవే. ఈ సత్యమును జ్ఞాని ఎరుంగును. తాను ఈశ్వరుని కంటె వేరు గాదనియు, పూర్ణ తత్త్వము దేని నుండియూ భిన్నముగా నుండదనియు అతడు ఎరుంగును. పూర్ణ తత్త్వమునకు సీమలు గాని, అంశములు గాని ఉండవు. మరియు, పూర్ణ తత్త్వమునకు వ్యక్తితో ఏ రకమైన సంబంధమూ ఉండదు. ఏలయన, పూర్ణము వ్యక్తియే; వ్యక్తి పూర్ణతత్త్వమే. ఒకటికి, అనంతమునకు మధ్య ఏమియూ సంబంధము ఉండజాలదు. ఒకటిని అనంత భాగములు చేయవచ్చును. అనంతములో ఒకట్లు అన్నియూ అంతర్గతమగును. కావున, వాటి మధ్య సంబంధము ఉండదు. భగవానుడు

పూర్ణుడు గనుక, జీవుని కంటె వేరు కాజాలడు. భగవానుడు జీవుని కంటె వేరైనచో, ఆయన పరిచ్ఛిన్నుడగునే గాని, పూర్ణుడు కాజాలడు.

మనము ఈశ్వరునిపై ఆరోపించే రూపము ఏదైనా ఈశ్వరుని కంటె న్యూనము మాత్రమే అగును. ఏలయన, ఒక విశిష్టరూపమును ఆరోపించగానే, ఇతర రూపము లన్నియు వర్జితములగును గదా! సాధారణంగా ఒక రూపమును ఇచ్చి మిగిలిన రూపము లన్నియూ దానిపై అధ్యారోపము చేయబడును. అటులనే, ఒక నామమును ఇచ్చి, ఇతర నామములన్నియూ దానిపై అధ్యారోపము చేయబడును.

మనకు విభిన్న దేవతలు, అనేక ఆరాధనా పద్ధతులు గలవు. వాటిని అన్నిటినీ పాటించి మనము కర్మఫలమును మాత్రమే సంపాదించగల్గుతాము. కావున, రూపము గల ఈశ్వరుని ఉపాసించుట ద్వారా మోక్షము లభించే ప్రసక్తి లేదు. ఇట్టి ఉపాసనల వలన ఈశ్వరునికి కృప కలిగి, సంసారాంతర్గతములైన ఫలములు లభించును.

## జ్ఞానమే మోక్షము

శాస్త్ర వాక్యములను సరిగా తెలుసుకున్నచో, శాస్త్ర సారమంతయూ సచ్చిదానంద ఆత్మ యందు కేంద్రితమై ఉన్నట్లు స్పష్టమగును. ఈ సత్యము నెరింగిన వాడే జ్ఞాని. వస్తువును యథాతథముగా దర్శించినప్పుడు మాత్రమే యథార్థ జ్ఞానము కలుగును. త్రాడును త్రాడుగా చూచినప్పుడు మాత్రమే అది సత్య జ్ఞానమగును. అటులనే ఈశ్వర యాథార్థ్యమును ఎరింగినవాడు మాత్రమే ఈశ్వరుని ఎరుంగును. ఈశ్వరుని ఒక విశిష్ట రూపము యొక్క జ్ఞానము కంటె ఇది గొప్పది. ఆరాధనా సౌలభ్యము కొరకై భగవంతుని యందు ఒక విశిష్ట రూపమును ఆరోపించుట సత్కర్మయే. కాని అది సత్యజ్ఞానము కానేరదు. సత్యమును ఎరుంగనిదే ఈశ్వరప్రాప్తి అసంభవము. 'జ్ఞాని మాత్రమే నన్ను పొందును; జ్ఞాని యొక్క ఆత్మ నేనే' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ జ్ఞానమే మోక్షము.

మనము ధ్యానమును విడువనక్కరలేదు. ఏలయన, పరమేశ్వర యాథాత్మ్య జ్ఞానము ఉదయించుటకు అనుకూలమైన పరిస్థితులు ధ్యానఫలముగా నిర్మాణమగును. భక్తికి అతీతుడగుట కొరకై మానవుడు భక్తుడు అగును. భక్తి ఏదైనా ఈ నియమము సమానమే. ఒక వ్యక్తికి రాష్ట్రపతి భవనములో ప్రవేశించుట యందు నిష్ఠ గలదనుకొనుడు. అతడు రాష్ట్రపతిగా ఎన్నికైన నాడు మాత్రమే ఆ నిష్ఠ సమాప్తమగును. భగవద్భక్తుని భక్తి ఎప్పుడు పరిపూర్ణమగును? అతడు

భగవంతుడైన నాడు మాత్రమే. 'నన్ను ఆరాధించి, జీవిత చరమ క్షణములలో నన్ను ధ్యానించువాడు నన్ను పొందును'.

మరణకాలములో భగవానుని స్మరించువాడు భగవానుని పొందునని పూర్వశ్లోకములో చెప్పబడినది. ఈ నియమము ఇతర వస్తువులకు కూడా అన్వయించునని తరువాతి శ్లోకములో చెప్పబడుచున్నది.

**అధ్యాయము 8, శ్లోకము 6:**

यं यं वापि स्मरन् भावं त्यजत्यन्ते कलेवरम् ।
तं तमेवैति कौन्तेय सदा तद्भावभावितः ॥ ६ ॥

యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః (6).

**అపి** = మరియు; **అంతే** = జీవితాంతము నందు; **యం యం వా** = ఏయే; **భావం** = పదార్థమును; **స్మరన్** = స్మరించుచూ; **కలేవరమ్** = స్థూల దేహమును; **త్యజతి** = విడిచిపెట్టునో; **కౌంతేయ** = ఓ కుంతీపుత్రా!; **సదా** = ఎల్లవేళలా; **తద్భావ భావితః** = అదే పదార్థముచే ఆక్రమించబడిన బుద్ధి గలవాడై; **తం తం ఏవ** = దానిని మాత్రమే; **ఏతి** = పొందును.

ఓ కుంతీ పుత్రా! మరియు జీవితాంతమునందు ఏయే పదార్థమును స్మరిస్తూ స్థూలదేహమును విడిచిపెట్టునో, ఎల్లవేళలా అదే పదార్థముచే ఆక్రమించబడిన బుద్ధి గలవాడై దానిని మాత్రమే పొందును (6).

మానవుడు మరణ సమయములో దేనిని భావన చేయునో, దానినే పొందును. ఇది చాల చక్కని వ్యవస్థ అనిపించును. నేను స్వర్గమును పొందగోరెద ననుకొనుడు. శాస్త్ర విధుల ననుసరించినచో, నేను జీవితమంతయూ సుఖముల నన్నిటినీ వీడి, మంచికర్మలను చేస్తూ గడపాలి. నేను స్వర్గమును పొందగోరుచున్నాను. కాని సుఖముల నన్నిటినీ వీడి నా శక్తిని, కాలమును శాస్త్ర విహిత కర్మానుష్ఠానము కొరకు వినియోగించుట నాకు అభిమతము కాదు. నేను ఇచట భోగముల ననుభవించి, ఆపై స్వర్గమును పొందగోరెదను. కావున, నేనీ లోకములో నాకు ఇచ్ఛ వచ్చిన రీతిని జీవించి, మరణకాలములో స్వర్గమును భావనచేస్తాను. ఇది సరళము గదా!.

కాని ఒక సమస్య గలదు. ఇట్టి జీవనమును గడిపిన వ్యక్తికి మరణ సమయము నందు స్వర్గము స్మృతికి రాదు. మానవుని భావాత్మక జీవనములో ఏ అంశములు ప్రముఖ పాత్ర వహించునో, అవియే స్మృతికి వచ్చును.

మానవులు ఆలోచించే ప్రక్రియ సాపేక్షముగా నుండును. ఏ వస్తువుపై వ్యక్తికి మనస్సులో ప్రేమ, అంకితభావము గలవో, అట్టి మనస్సులో నెలకొన్న గాఢసంస్కారములు మరణ సమయములో అదే వస్తువును స్మృతికి దెచ్చును. స్మృతి వ్యక్తి యొక్క సంచిత సంస్కారములకు, భావనాత్మక జీవనమునకు అనురూపముగా కలుగును. పైగా కేవలము ఆలోచించుట చాలదు. ఆలోచనకు తోడుగా తత్సంబంధమైన కర్మను ఆచరించవలెను. ఇచట కర్మ చాల ప్రముఖమైనది. కర్మఫలము సంస్కారయుక్తమై స్వర్గాది ఫలము నిచ్చును. ఇచటి తాత్పర్యమేమనగా, వ్యక్తి ఏ లక్ష్యము కొరకు శ్రమించునో, అదే లక్ష్యమును పొందగల్గును.

జీవితము నంతనూ ధనము కొరకు వెచ్చించిన వ్యక్తికి మరణ సమయములో స్మృతికి వచ్చేది ధనము ఒక్కటి మాత్రమే. మరుజన్మలో కూడ అతడు ధనము కొరకు మరల పాటుపడును.

ఈ సూత్రము దేవతారాధనకు కూడ వర్తించును. నిరంతరముగా ఇంద్రుని ఆరాధించు వ్యక్తి ఇంద్రలోకమును పొందును. మానవుడు దేనిని గురించి ఆలోచిస్తాడో, దాని కొరకై శ్రమిస్తాడు. దానినే పొందుతాడు.

ఈశ్వరుని ఆరాధించువాడు, స్వరూపతః ఈశ్వరుడే గనుక, ఈశ్వరుడే యగును. ఇతర లక్ష్యములను ఆరాధించువారు, పరిస్థితులు సానుకూలపడినచో, ఆయా లక్ష్యములను మాత్రమే చేరెదరు.

ఇందువలననే, భగవానుడిట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 8, శ్లోకము 7:**

तस्मात्सर्वेषु कालेषु मामनुस्मर युध्य च ।
मय्यर्पितमनो बुद्धि र्मामेवैष्य स्यसंशयः ॥ ७ ॥

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ
మయ్యర్పితమనో బుద్ధిర్మామేవైష్య స్యసంశయః (7)

**తస్మాత్** = అందువలన; **సర్వేషు** = అన్ని; **కాలేషు** = వేళల యందు; **మాం** = నన్ను; **అనుస్మర** = గుర్తుచేసుకొనుము; **చ** = మరియు; **యుధ్య** = యుద్ధమును చేయుము; **మయి** = నా యందు; **అర్పిత మనో బుద్ధిః** = అర్పింపబడిన మనస్సు, బుద్ధి గలవాడవై; **మాం ఏవ** = నన్నే; [illegible] = పొందగలవు; **అసంశయః** = సందేహము లేదు.

అందువలన అన్నివేళల యందు నన్ను గుర్తు చేసుకొనుము. మరియు యుద్ధమును చేయుము. నా యందు అర్పింపబడిన మనస్సు, బుద్ధి గలవాడవై నన్నే పొందగలవు. సందేహము లేదు (7).

## మానవుడు అన్ని వేళలా పరమేశ్వరుని ధ్యానించవలెను

తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర. కావున అన్ని సమయములలో నన్ను ధ్యానించుము. వివిధ ఋతువులను, రాత్రింబగళ్లను నిర్దేశించుటకై కాలశబ్దము యొక్క బహువచనరూపము ఈ శ్లోకములో ప్రయోగింపబడినది. శీతకాలము, వేసవి కాలము, వర్షాకాలము, శరత్కాలము, ఈ సంవత్సరమంతా, మరియు రాబోవు సంవత్సరము కూడా నీవు నన్ను ధ్యానించుము.

ఇది కేవలము స్మరణము కాదు; అనుస్మరణము. 'అను' అనగా ఒకదానికి అనురూపముగా. శ్రీ శంకరులు 'శాస్త్రమునకు అనురూపముగా (యథా శాస్త్రమ్)' అని వ్యాఖ్యానించిరి. 'నీవు, శాస్త్రోపదేశమునకు అనురూపముగా నన్ను ధ్యానించుము'. దీనికి మరో మార్గము లేదు. భగవానుని గురించి ఏదో కొంత తెలియకుండగా, ఆయనను స్మరింపలేము గదా! పరమేశ్వరుని గురించి శాస్త్రోపదేశము ద్వారా మాత్రమే తెలియగల్గుతాము. కావున, మనము సర్వకాలముల యందు శ్రవణమనన నిది ధ్యానసముల ద్వారా పరమేశ్వరుని స్మరించుచుండవలెను.

## భగవానుని స్మరిస్తూ కర్తవ్య కర్మను అనుష్ఠించుము

యుధ్య చ. మరియు యుద్ధమును చేయుము. నన్ను ధ్యానిస్తూ, యుద్ధమును చేయుము. ఈ ఉపదేశము అర్జునుని కొరకే అయినా, దానిని మనకు కూడా అన్వయించుకోవాలి. అర్జునుడు ఉన్న పరిస్థితి యుద్ధము. కాని మన పరిస్థితి నిత్య ప్రార్థన కావచ్చును; లేదా, మరియొక కర్తవ్య కర్మ

కావచ్చును. నీ విధిని నీవు ఆచరింపుము. నీ పాత్రలను నీవు పోషించుము. మరియు నన్ను ఆరాధించుము. ఈ విధంగా చేస్తూ ఉంటే, నీవు నన్ను తెలియగలవు.

ఆత్మయే బ్రహ్మ యను జ్ఞానము అర్జునునకు కలిగిన దనుకొనుడు. అపుడు తాను కర్త కాదని ఆతనికి తెలిసి, కర్తవ్య కర్మను సహజ సిద్ధముగా అనుష్ఠించును. ఆతనికి ఉపదేశము గాని, సలహా గాని ఆవశ్యకమయ్యెడిది గాదు. కాని అర్జునునకు తెలియును, తెలియదు. ఈ పరిస్థితిలో యోగము ప్రముఖమగును. అందువలననే, అర్జునుని కర్మయోగివి కమ్మని శ్రీ కృష్ణ భగవానుడు ఉపదేశించెను.

జ్ఞాని బాహ్య పరిస్థితులచే ప్రభావితుడు కాడు గనుక, కర్తవ్య కర్మను సునాయాసముగా అనుష్ఠించును. కాని, అజ్ఞాని తన పాత్రను సరిగా పోషించవలసి యుండును. కర్మను చేయుటకు గల ప్రేరణ (motive) ఇచట ప్రముఖమైన విషయము. సేవకుడు తన విధులను తన ఇష్టానిష్టములతో సంబంధము లేకుండగా, యజమాని యొక్క ప్రేరణచే నిర్వర్తించును. ఆతనికి గల భావనలు గాని, వ్యక్తిగత ప్రేరణలు గాని త్రోసిపుచ్చబడును. కర్మయోగి కూడ తన విధులను అదే తీరున ఆచరించవలెను. విధి ఉల్లాసకరమైనది అయినచో, సమస్య లేదు. కాని అర్జునుని దృష్టాంతములో వలె కర్తవ్య కర్మ యుద్ధము అయినచో, ఆ వ్యక్తికి ధర్మమును గురించిన పరిజ్ఞానము ఆవశ్యకమగును. అర్జునుని వంటి క్షత్రియునకు ధర్మానురూపమైన కర్తవ్యము యుద్ధము కంటె గొప్పది మరియొకటి లేదు. శ్రీకృష్ణుడు ద్వితీయాధ్యాయములో (2-31) ఈ విషయమును అర్జునునకు గుర్తుచేసినాడు. కావున మానవుడు తన కర్తవ్యమును అనుష్ఠించవలెను. ధర్మమే ఈశ్వరుడు. ధర్మమునకు అనురూపముగా జీవించు వ్యక్తి ఈశ్వరుని సన్నిధిలో ఉన్నట్లే.

మయి అర్పిత మనోబుద్ధిః. పరమేశ్వరుడనగు నా యందు ఆతని మనస్సు, బుద్ధి అర్పింపబడినవి. ఈ విధముగా మనస్సును, బుద్ధిని భగవానునకు అర్పించినవాడే సాధకుడగును. కాని మనస్సును, బుద్ధిని భగవానునకు అర్పించుట యెట్లు?

కొన్ని విశిష్ట పరిస్థితులు కొన్ని విశిష్ట కర్మలను అపేక్షిస్తాయి. ఆ పరిస్థితులలో కర్తవ్య కర్మ స్పష్టముగా తెలుస్తూనే ఉంటుంది. ఆ పరిస్థితిలో 'ఈ పనిని చేయవలెను' అనే సంకల్పము మన మనస్సులో ఉదయిస్తుంది. ఆ పరిస్థితిని గాని, ఆ కర్మను చేయుట ధర్మము అను ధారణను గాని మనము సృష్టించలేదు గదా! కాన ఆ సంకల్పము ఈశ్వర సంకల్పమే. కాని, దుర్యోధనుని పరిస్థితి

ఇట్టిది కాదు. ఈ పరిస్థితిని అతడు సృష్టించెను. కాన అర్జునుడా పరిస్థితిని యోగ్యమగు కర్మను అనుష్ఠించి ఎదుర్కొనవలెను. ఈ ఔచిత్యమును, ఈ శిష్టాచారమును మానవుడు సృష్టించలేదు. ఇది సృష్టి నియతిలో భాగము. ఇదియే ధర్మము. ఇది అర్జునుని సృష్టి కాదు. దుర్యోధనుని సృష్టి అసలే కాదు. దుర్యోధనుడు దండమునకు అర్హుడు అనే సంకల్పమును అర్జునుని మనస్సులో సృష్టించినది ఆ ధర్మమే. ఆతని స్వీయ సంకల్పము ఈ సంకల్పమునకు వ్యతిరేకముగా నుండెను. నేను బంధువులతో యుద్ధము నేల చేయవలెను? అనునది భగవానుని సంకల్పము కాదు. ఇది అర్జునుని అనురాగము నుండి పుట్టిన వ్యక్తిగత సంకల్పము. దీనిని ఈశ్వర సంకల్పమునకు సమర్పించి వేసినచో, అది 'మయి అర్పితమనః' అగును.

నేనీ కర్మను చేయుచున్నాను, దీనికి కారణము నేనే ఇత్యాది కర్తృత్వ నిర్ణయమునకు బుద్ధి యని పేరు. కొన్ని కర్తవ్య కర్మలను చేసి తీరాలి. మనము వాటిని చేస్తూ అహంకారమును సమర్పిస్తాము. ఈ సందర్భములో బుద్ధి యనగా వ్యక్తిగత పూర్వధారణలు (personal prejudices) అని కూడ అర్థము చెప్పవచ్చును. ఈ బుద్ధిని కూడ పరమేశ్వరునకు సమర్పించి ఆరాధించవలెనని శాస్త్రము నిర్దేశించుచున్నది (మయి అర్పిత బుద్ధిః).

ఆత్మజ్ఞానాన్వేషణలో బుద్ధిని సమర్పించవలెను. కర్తృత్వధారణ రూపమైన బుద్ధిని ఈశ్వరునకు సమర్పించవలెను. మనస్సును ధర్మానురూపమగు సంకల్పములను చేయుట ద్వారా ఈశ్వరునకు సమర్పించవలెను. అట్టి సాధకుడు 'మయి అర్పిత మనోబుద్ధిః' అగును. ఇట్టి వ్యక్తికి సంఘర్షణ ఉండదు. ఈతని అంతఃకరణము శుద్ధమగును. ఆతడు ఆత్మజ్ఞానమును పొందుటలో విలంబము ఉండదు.

## అట్టి సాధకుడు మరణ సమయములో భగవానుని ఎరుంగుట నిశ్చితము

మామేవ ఏష్యసి. నీవు నన్ను మాత్రమే పొందెదవు. ఎట్లు? నీవు నన్ను గుర్తించి నాలో ఐక్యమును చెందెదవు. జ్ఞాని పరమేశ్వరుని కంటె వేరుగాదని భగవానుడిదివరకే చెప్పియున్నాడు. నన్ను స్మరించువారు నన్ను పొందెదరు అనుటలో భగవానుని అభిప్రాయమే మనగా, వారు పరమేశ్వరుని ప్రత్యగాత్మ కంటె అభిన్నముగా సాక్షాత్కరించుకొనెదరు.

అసంశయః. సందేహము లేదు. భగవానుడు వాగ్దానమును చేయుచున్నాడు. కాని ఇది భవిష్యవాణి కాదు. ఇది సరళమైన హేతుబద్ధమైన పరిణామము. ఇట్లు జరుగకుండుట అను

ప్రసక్తియే లేదు. ఇది పర్వతారోహణ ప్రయత్నము వంటిది కాదు. ఇచట సాధకుడు పొందే గమ్యము తానే. పర్వతారోహణములో ఏది జరిగిననూ జరుగవచ్చును. కాని ఆత్మ ప్రాప్తి కేవలము స్పష్టజ్ఞాన రూపము మాత్రమే.

కాని ఈ స్పష్ట జ్ఞానమును పొందే ప్రక్రియలో సాధకుడు మరణించినచో నేమగును? ఇట్టి వ్యక్తి మరుజన్మలో, సాధనను వీడిన స్థాయి వద్ద చేపట్టి మరల కొనసాగించు నని శ్రీకృష్ణు డిదివరలో వాగ్దానము నిచ్చియున్నాడు (న హి కల్యాణ కృత్కశ్చి ద్దుర్గతిం తాత గచ్ఛతి). జ్ఞానము ఉదయించకుండగనే ఆతడు మరణించిననూ, ఆతడు జీవించియుండగా చేసిన సాధన, అదే సమయములో ఆతడు చేయగలిగి ఉండే ఇతర కర్మలకు ఏ విధంగానూ తీసిపోదు. బయట నుండి చూచువారికి ఆతని జీవితము విషాదాంతముగా భాసించవచ్చును. ఆతడు జ్ఞాన సాధన కొరకై సర్వమును త్యజించినాడు. కాని అది ఆతనికి లభించలేదు అని ఇతరులకు అనిపించవచ్చును. కాని ఆతడు ఇతర విషయము లన్నింటికీ అతీతుడై, అతి విలువైన జ్ఞానసాధనను కొనసాగించినాడు.

ఆతడు తాను చేసిన పనికి ఆనందిస్తూనే మరణించినాడు. ఇతర లౌకిక లక్ష్యములను సాధింపబూను వ్యక్తులు కూడా మరణించునాటికి లక్ష్యమును చేరుదురనే నిశ్చయము లేదు గదా! ఆ లక్ష్యములను చేరకుండగనే ఎందరో మరణించెదరు. ధనమును సంపాదించే వ్యక్తి మరణ సమయములో 'నేను సంపాదించదగిన ధనము నంతనూ సంపాదించితిని గాన, ఇపుడు నిశ్చింతగా మరణించగలను' అని అనుకోడు గదా! సర్వము సుసంపన్నము అని భావిస్తూ మరణించువారు లేరు. పూర్ణ కృత కృత్యతా భావముతో మరణించువాడు జ్ఞాని ఒక్కడే. పూర్ణత్వ భావనతో జ్ఞాని మాత్రమే మరణించును. తాను పరమేశ్వరుని కంటె వేరుగాదనే సందేహ వినిర్ముక్తమగు దర్శనమును ఆతడు కలిగియుండును.

### మోక్షమునకు గల అవరోధములను తొలగించుట

#### అజ్ఞానము

మోక్షమునకు మూడు అవరోధములు సంభవమగును. వాటిలో ఒకటి ఆవరణము. ఆత్మ నిత్యముక్తము. కావున 'నేను బ్రహ్మ కంటె వేరు గాదు' అను సత్యమును మానవుడు గుర్తించి విముక్తుడు కావలెను. ఈ జ్ఞానమే మోక్షము. కాని అజ్ఞానావరణము మానవునకు ఈ మోక్షము దక్కకుండగా చేయుచున్నది.

## మాలిన్యము

ఏదేని జ్ఞానము ఉదయించుటకు మనస్సు సజ్జితమై ఉండాలి. ఆత్మజ్ఞానము విషయంలో నసిక సంసిద్ధత యొక్క అభావము ద్వివిధముగా నున్నది. మొదటిది మలము, అనగా ర్వజన్మలలో ప్రోగుచేసుకున్న మాలిన్యము. ఈ మాలిన్యము ఈ జన్మలో దుఃఖము నిచ్చే స్థితులకు హేతువు అగును. దీనిని నిర్ప్రభావితము చేయుట కొరకై మనము నిత్యకర్మలను, రియు ప్రార్థనలను చేసెదము. తీవ్రమగు రాగద్వేషములు కూడ ఈ జ్ఞానమునకు ఆటంకము ను. మనము వాటిని నిర్ప్రభావితము చేయుటకు కూడ కర్మను చేయవలెను.



## ాంతి

మరియొక ఆటంకము అశాంతి. మనస్సు ప్రసన్నముగా లేనిచో, విచారమును సరిగా ట సంభవము కాదు. అట్టి మనస్సును ధ్యానముచే నిశ్చలముగా చేయవలెను. ధ్యానములో న పద్ధతులు గలవు. వీటిని చేయుటకు అధికస్థాయికి చెందిన ఏకాగ్రత ఆవశ్యకమగును. టని అభ్యసించినచో మనస్సు నిశ్చలమగును. సాధకుడు మనస్సును ఒక వస్తువు నుండి రియొక వస్తువు పైకి గెంతుచుండగా పరిశీలించి, దాని స్వభావము నెరింగి, దానిని వెనుకకు మరల్చును. ఈ ప్రక్రియలో సాధకునకు మనోనిశ్చలత సిద్ధించును.

మనస్సులో శుద్ధి, నిశ్చలత కలిసిఉండును. వాటిలో ఒకటి పెరిగే కొలది రెండవది కూడ పెరుగును. కర్మ వలన చిత్త శుద్ధి కలుగును. ధ్యానము చిత్త నిశ్చలతను కలిగించును. కర్మ, ధ్యానము, విచారము అనే మూడు సాధనములతో మనస్సు నందలి ఈ మూడు అవరోధములను తొలగించుకొనవలెను.

తరువాతి రెండు శ్లోకములలో పరమేశ్వరుని ధ్యానించే సాధకుని గురించి శ్రీకృష్ణ భగవానుడు వర్ణించుచున్నాడు. ధ్యానములో వివిధ పద్ధతులు గలవు. ఇవి గాక నిదిధ్యాసనము వేరే గలదు.

## ధ్యానము – ఉపాసన

ధ్యానములో విషయము సగుణరూపమైనచో, దానికి ఉపాసన అని పేరు. ఉపాసనలు రెండు రకములు. సంపత్ ఉపాసన, అహం గ్రహ ఉపాసన.

## సంపత్ – ఉపాసన

సంపదుపాసనలో ఒక విశిష్ట వస్తువు నందు దాని కంటె మహత్తరమైన తత్త్వము భావన చేయబడును. ఇచట రెండు వస్తువులు గలవు. ఒకటి మన ఎదురుగా నున్నది. రెండవది మనము దానిపై అధ్యారోపము చేసేది. ఉదాహరణకు, మనస్సును ఈశ్వరునిగా భావించవచ్చును. ఈ ఉపాసనలో ఒక సామాన్య వస్తువు నందు ఒక గొప్ప తత్త్వము ఆరోపింపబడును. ఇట్టి సంపదుపాసన వలన మనస్సునకు కొంత నిశ్చలత లభించును. సర్వ విధముల ధ్యానమునకు ఫలము ఇదియే గదా! ఈ స్థితిలో మనస్సులోని అశాంతి దూరమగును. మనస్సునకు విషయ గ్రహణ శక్తి పెరుగును. ఒక విశిష్టస్థాయికి చెందిన అంతరంగ ప్రసన్నత కలుగును. ఇది మనము చూడగలిగే ప్రత్యక్ష ఫలము. దీనిని దృష్ట ఫలము అందురు.

ఇంతే గాక ప్రార్థనా రూపమగు సంపదుపాసన వలన అదృష్టఫలము కూడ కలుగును. ఈ అదృష్టఫలము పుణ్యలోక ప్రాప్తి యని శాస్త్రము చెప్పుచున్నది.

### అహం గ్రహ ఉపాసన

ఈ రెండవ రకం ఉపాసనలో సర్వకారణమగు బ్రహ్మ 'అహం' తో అభేదమును పొందును. ఇది నిదిధ్యాసనము వంటిది. కాని శుద్ధ జ్ఞానము కాదు. ఏలయన, ఈ రెండింటినీ కలిపే ఒక మనోవృత్తి ఉండును. కాన, అహంకార స్థాయిలో ఈ అభేదము గలదు. ఈ సాధకుడింకనూ అహంకారమును బాధించలేదు గనుక, ఈశ్వర సాక్షాత్కారము అతనికింకనూ కలుగలేదు.

రాబోవు రెండు శ్లోకములను అహం గ్రహోపాసనగా, లేదా నిదిధ్యాసనముగా స్వీకరించవచ్చును. మనము వాటిని నిదిధ్యాసనముగా స్వీకరించెదము.

### అధ్యాయము 8, శ్లోకము 8:

अभ्यासयोगयुक्तेन चेतसा नान्यगामिना ।
परमं पुरुषं दिव्यं याति पार्थानुचिन्तयन् ॥ ८ ॥

అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామి నా
పరమం పురుషం దివ్యం యాతి పార్థాను చింతయన్ (8).

**పార్థ** = ఓ అర్జునా!; **అభ్యాస యోగ యుక్తేన** = యోగాభ్యాసముచే సంపన్నమైన; **నాన్యగామినా** = ఇతరమువైపునకు ప్రసరించని; **చేతసా** = మనస్సుతో; **అనుచింతయన్** = ఉపదేశింపబడిన తత్త్వమును మననము చేయు యోగి; **దివ్యం** = ప్రకాశ స్వరూపుడైన; **పరమం** = అనంతుడగు; **పురుషం** = పరమాత్మను; **యాతి** = పొందును.

ఓ అర్జునా! యోగాభ్యాస సంపన్నమై ఇతరము వైపునకు ప్రసరించని మనస్సుతో ఉపదేశింపబడిన తత్త్వమును మననము చేయు యోగి ప్రకాశ స్వరూపుడైన అనంతుడగు పరమాత్మను పొందును (8).

ఈ ఉపాసకుడు దివ్య పరమ పురుషుని పొందును. పురుషుడనగా వ్యక్తి. ఆతడు పరమపురుషుడు. అనగా సర్వము తానే అయిన పురుషుడు. ఎవని కంటె సర్వము భిన్నముగా లేదో అట్టి అనంత పురుషుని కంటె ఈ పురుషుడు ఏ విధముగనూ తక్కువ కాడు.

ఈ పురుషుడు దివ్యపురుషుడు. అనగా రెండు అర్థములు వచ్చే అవకాశము గలదు. స్వర్గములో నుండే దేవత అని ఒక అర్థము. స్వయం ప్రకాశ స్వరూపుడు అని రెండవ అర్థము. అనగా ఆత్మాభిన్నమైన పరమేశ్వరుడు. సాధకుడు ఆ పురుషుని పొందును. సాధకుడు దీనిని ఎట్లు సాధించును?

అనుచింతయన్. చింతయన్ అనగా విచారమును, లేక నిదిధ్యాసనమును, లేక ధ్యానమును చేయుట. 'అను' అనగా శాస్త్రానురూపముగా ఒక ప్రమాణము ద్వారా తెలియబడిన దానికి అనురూపమైన ఆలోచనకు అనుచింతనమని పేరు. విద్యార్థి ఉపాధ్యాయుని వచనములను వింటూ, ఆతని మనస్సు ఉపదేశములోని విచారధారను అనుసరించినచో, ఆతడు అనుచింతనము చేసినట్లగును. ఉపాధ్యాయుడు శాస్త్రమును అనుసరించును గనుక, ఆయన చేసేది కూడా అనుచింతనమే.

ఈ చింతనలో విషయవస్తువును 'పరమం పురుషం దివ్యమ్' అను పదములు నిర్దేశించును. ఈ చింతనకు ఫలము ఆ పురుషుని పొందుటయే. ఏలయన, ఆ పురుషుడు ఆత్మయే. సాధకుడు అనంత తత్త్వమును ధ్యానించును. తనను గాని, మరియొక దానిని గాని దాని నుండి మినహాయించినచో, అది అనంత ధ్యానము కాజాలదు.

ఇచట చింతనమనగా శాస్త్రము ద్వారా పూర్వము తెలుసుకున్న సత్యమును దర్శించుటయే. శాస్త్రము బోధించే భావనాసోపానములను అధిష్ఠిస్తూ పోతే, అంతము నందు సాధకుడు శాస్త్రోపదేశమును సాక్షాత్కరించుకొనును. ఈ సోపానములు సాక్షాత్కారమును సుగమము చేయును. దర్శనమునకు మనస్సు సహజముగా ఆవశ్యకమగును. కావున, ఈ సాక్షాత్కారమునకు ఆవశ్యకమగు మనస్సును భగవానుడు నిర్దేశించినాడు.

అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా. చేతసా అనగా మనస్సుతో. ఆ మనస్సును వర్ణించే రెండు విశేషణములు గలవు. అభ్యాస యోగ యుక్తేన అనగా అభ్యాసమనే యోగముచే సంపన్నమైన మనస్సుచే. నాన్యగామినా అనగా ఇతరము వైపు ప్రసరించని మనస్సుచే.

మనస్సును ఎన్నుకున్న వస్తువుపై మాత్రమే కేంద్రీకరించవలెను. అది ఇతర వస్తువుల పైకి ప్రసరించుట ఆరంభము కాగానే, దానిని వెనుకకు మరల్చవలెను. ఇతర ఆలోచనలు ఉద్బుద్ధము కాగానే ధ్యానము ఆగిపోవునని తలంచరాదు. అట్లు ఆగిపోయే పక్షంలో ధ్యానము సంభవమే కాదు. ఒక విశిష్ట వస్తువును ధ్యానించుట మొదలిడినప్పుడు మనస్సు ఇటు నటు చెదరిపోయే అవకాశము సర్వదా ఉండును. అందువలననే ధ్యానాభ్యాసము ఆవశ్యకమైనది. మనస్సు ధ్యేయ వస్తువునకు దూరముగా చెదరిపోయినప్పుడు, మనము మరల దానిని వెనుకకు మరల్చి ధ్యేయ వస్తువుపై కేంద్రితము చేయాలని మనము ఆరవ అధ్యాయములో చూచియున్నాము. మనస్సును ధ్యేయవస్తువుపైకి మరల్చుట కూడా ధ్యానములో అంతర్భాగమే (యతో యతో నిశ్చరతి .... తతస్తతో నియమ్యై తత్, 6-26).

మనస్సు చంచలమనియు, దానిని నిగ్రహించుట తనకు చేతగాదనియు అర్జునుడు శ్రీకృష్ణ భగవానునితో చెప్పగా (6-34), భగవానుడు ముందుగా అంగీకరించెను. కాని, దానిని వైరాగ్యముచే మరియు అభ్యాసముచే లొంగదీసుకొనగలమని ఆయన చెప్పెను (6-35). ఆ అభ్యాసమే ఇచట ప్రస్తావింపబడినది. దానికి 'యోగ' అను సమానార్థక పదమును జోడించి భగవానుడు దాని ప్రాముఖ్యమును నొక్కి చెప్పెను. యోగమే అభ్యాసము, అభ్యాసమే యోగము. ఇది ఒక సాధనము.

ఈ ధ్యానయోగి అనంత స్వయం ప్రకాశ పురుషుని ధ్యానించును. తాను ఆ పురుషుని కంటె వేరుగాదనే సత్యమును అతడు గుర్తించును.

ధ్యానయోగి ఆత్మరూపముగా దర్శించే ఈ పురుషుని స్వరూపమును తరువాతి శ్లోకము ఇంకనూ వర్ణించుచున్నది.

**అధ్యాయము 8, శ్లోకము 9:**

कविं पुराणमनुशासितारमणोरणी यांस मनुस्मरेद्यः ।
सर्वस्य धातारमचिन्त्य रूपमादित्य वर्णं तमसः परस्तात् ॥ ९ ॥

కవిం పురాణమను శాసి తారమణో రణీయాంస మనుస్మరేద్యః
సర్వస్య ధాతారమచింత్య రూపమాదిత్య వర్ణం తమసః పరస్తాత్ (9).

**కవిం** = సర్వజ్ఞుడు; **పురాణం** = అతి ప్రాచీనుడు; **అను శాసితారం** = సర్వమును శాసించువాడు; **అణోః** = సూక్ష్మమగు దాని కంటె; **అణీయాంసం** = మరింత సూక్ష్మమగువాడు; **సర్వస్య** = సర్వ కర్మ ఫలములకు; **ధాతారం** = నిర్ణాయకుడైనట్టియు; **అచింత్యరూపం** = ఊహింపశక్యము గాని రూపము గలవాడు; **ఆదిత్య వర్ణం** = సూర్యుని వలె ప్రకాశించువాడు; **తమసః** = అజ్ఞానము కంటె; **పరస్తాత్** = అతీతమైన వాడు అగు పరమాత్మను; **యః** = ఎవడైతే; **అనుస్మరేత్** = ధ్యానించునో.

సర్వజ్ఞుడు, అతి ప్రాచీనుడు, సర్వమును శాసించువాడు, సూక్ష్మము కంటె సూక్ష్మతరుడు, సర్వ కర్మఫలములను నిర్ణయించువాడు, ఊహింప శక్యము కాని రూపము గలవాడు, సూర్యుని వలె ప్రకాశించువాడు, అజ్ఞానమునకు అతీతమైన వాడు అగు పరమాత్మను ఎవడు ధ్యానించునో (9).

యః అను స్మరేత్. ఎవడైతే యోగ్యము అగు రీతిలో ధ్యానమును చేయునో. మనము మనకు తెలిసిన విషయమును మాత్రమే స్మరించగల్గుతాము. అను స్మరణము అంతకు ముందు తెలుసుకున్నదానికి అనురూపముగ నుండును. కావున, ఈ పదములకు 'శ్రవణ మననముల తరువాత నిదిధ్యాసనమును చేయువాడు' అని యర్థము.

కవిమ్. అతడు కవిని ధ్యానించును. కవి యనగా నిగూఢ సత్యములను చూడగల్గువాడు. పరమేశ్వరుని నిర్దేశించే అత్యుత్తమ పదము కవి. కవనమును చెప్పు రచయిత కూడా కవి అనబడును. కంటికి బాహ్యముగా కనబడు దాని కంటె అధికమును కవి దర్శించగల్గును.

బాహ్యముగా కనబడు దాని కంటె అధికముగా చూడగల్గుట భగవానుడు కవి అనుటలో కారణము కాదు. భగవానుడు సర్వమును భూత భవిష్యద్వర్తమానములను చూచును. ఇచట కవి యనగా సర్వజ్ఞుడు.

పురాణమ్. అనగా ప్రాచీనుడు. భగవానుడు వాస్తవంలో సనాతనుడు.

అనుశాసితారమ్. సర్వ సృష్టిని పాలించువాడు. ఆ భగవానుని వలననే ధర్మనియతి మరియు మిగిలిన నీతి నియమము లన్నియూ ప్రవర్తిల్లుచున్నవి.

అణోః అణీయాంసమ్. మనము ఊహించగలిగే అత్యంత సూక్ష్మపదార్థము కంటె మరింత సూక్ష్మమైనవాడు పరమేశ్వరుడు. మనము దేనిని గురించి ఆలోచించినా, అది ఎంత సూక్ష్మతమ భావనయైనా, మనోవృత్తిలో విషయమగును. అట్టి సూక్ష్మతమ భావనలు దేనిచేత ప్రకాశింప చేయబడునో, అట్టి ఈశ్వర చైతన్యము యొక్క నిదిధ్యాసనము ఇచట వర్ణింపబడుచున్నది.

సర్వస్య ధాతారమ్. పరబ్రహ్మను నిదిధ్యాసనము చేయు సాధకుడు, ఈ కార్యకారణ సంబంధమును పాలించి సర్వ కర్మల ఫలముల నిచ్చునది ఆ పరమాత్మయే నని గుర్తించును. ఈతడు పూర్వము నందు ఈశ్వరుని కర్మనియతిచే సంప్రాప్తమైన స్వీయకర్మ ఫలములను అనుభవించే భోక్తగా నుండెను. అతడు పరమేశ్వర స్వరూప నిదిధ్యాసనమును చేసినవాడై, తన స్వరూపమైన సచ్చిదానంద ఆత్మను పరమేశ్వరాభిన్నముగా గుర్తించినాడు.

అచింత్యరూపమ్. ఊహింప శక్యము కాని రూపము గలవాడు. మనము ఊహింపలేని వస్తువు ఉనికి లేనిది కూడ కావచ్చును. కాని ఇచట దానికి ఉనికి గలదు. ఈ సృష్టి రూపములో నున్న భగవానుని రూపము అచింత్యము అన్నచో, అయనను స్మరించుట యెట్లు? ఆ స్థితిలో భగవద్రూపము తెలిసేదిగను, మరియు తెలియనిది గను ఉండును. భగవానుని సర్వజ్ఞతను గాని, సర్వసృష్టి తన రూపమే అయిన సర్వవ్యాపకతను గాని గుర్తించి భావన చేయుట ఎట్లు? మనస్సు ఒక కాలములో ఒక వస్తువును మాత్రమే భావనచేయగల్గును. సర్వమును ఏకకాలములో ఊహించగలిగే సామర్థ్యము మానవ మస్తిష్కమునకు లేదు. మరియు, భగవత్స్వరూపము ఆత్మయే నన్నచో, ఆత్మ ఇంద్రియ మనో గోచరమగు వస్తువు కాదు.

పరమాత్మ చైతన్యమనమని తరువాతి పదము నిరూపించును.

ఆదిత్య వర్ణమ్. సూర్యుని వలె ప్రకాశించునది. కాంతి కంటె భిన్నమైన రూపము సూర్యునకు లేదు. సూర్యుడనగా వచ్చి పోయే కాంతి కాదు. సూర్యుడు సర్వకాలములలో ప్రకాశించే, సర్వమును ప్రకాశింపజేసే కాంతిపుంజము. అటులనే, హెచ్చుతగ్గులు లేని చైతన్యము ఈ పురుషుని స్వరూపము. సూర్యుని వలెనే చైతన్యము కూడా ఎట్టి స్వార్థ చింతనయూ లేకుండగా సర్వదా సర్వమును ప్రకాశింపజేయును. 'అది సర్వమును ప్రకాశింపజేయును' అనే వాక్యములో క్రియా పదము గలదు. కనుక కర్త కూడా ఉండాలి. కాని ప్రకాశము ఆత్మ స్వరూపము. అది సూర్యుని వలె తన ఎదుట నున్న సర్వమును ప్రకాశింపజేయును. స్వయం ప్రకాశమగు ఆత్మ కర్తృత్వము లేకుండగనే సృష్టినంతనూ ప్రకాశింపజేయును. సర్వము ఆత్మను అనుసరించి ప్రకాశించును. కాని దాని ప్రకాశములో జరిగే క్రియలచే అది స్పృశించబడదు. ఆత్మ అసంగము.

తమసః పరస్తాత్. అది చీకటికి అతీతముగ నుండును. అది కాంతిని చీకటిని, విశేష జ్ఞానమును అజ్ఞానమును కూడ ప్రకాశింపజేసే శుద్ధ చైతన్యము.

**నిదిధ్యాసనమునకు, ధ్యానమునకు గల భేదము**

పూర్వ శ్లోకము నుండి 'యాతి' అను క్రియా పదము అనువృత్తమగును. మిగిలిన పదములన్నియూ ధ్యేయవస్తువును, మరియు ధ్యానఫలమును బోధించును.

నిదిధ్యాసనములో ధ్యేయము, ధ్యానఫలము ఒక్కటియే. కాని ఉపాసన చేయు సాధకుడు పొందే ఫలము, అతడు ధ్యానము చేయు తత్త్వము ఒక్కటి గావు. ఇంద్రుని ఉపాసించువాడు ఇంద్రుడు కాడు. ఉపాసకుడు పొందునది పుణ్యలోకము మాత్రమే.

కాని, ప్రస్తుతంలో పరమపురుషుని ధ్యానించువాడు పరమపురుషుని పొందును. అనగా ఇది జ్ఞాతృ జ్ఞేయ భేద విశిష్టమైన ధ్యానము కాదు. ఈ భేదము ఎంత అల్పముగ నున్ననూ అట్టి ధ్యానము ఉపాసన యగును. కాని ఈ భేదము లేని పక్షములో జ్ఞాత తన స్వరూపము పరమేశ్వరుడని గుర్తించును. కావున, యథార్థముగా జ్ఞాత లేడు.

ఈ పదము లన్నియూ ఈశ్వరుని నామములే. నిశ్చయముగా ఆ ఈశ్వరుడు నేనే. ఇది శుద్ధ జ్ఞానము. కావుననే నిదిధ్యాసనము ఉపాసన కంటె పూర్తిగా భిన్నమైనది. ఉపాసనలో జీవేశ్వరులు రెండు విభిన్న తత్త్వములు. పంపదుపాసనలో స్థితి ఇదియే. ఈశ్వరుని గుణములను జీవునిపై

ఆరోపించే అహం గ్రహోపాసనలో నైననూ స్థితి ఇదియే. అయిననూ, ఈ ఉపాసనలు జ్ఞానమునకు మార్గమును సుగమము చేయును. కావున ఈ ఉపాసనలు సఫలములుగనే పరిగణింపబడును. కాని శ్రవణ మననములు ఆధారముగా గల నిదిధ్యాసనము సర్వ విధముల ఉపాసనల కంటె సంపూర్ణముగా విలక్షణమైనది.

మనకు తెలిసిన విషయము ఏదో అంశములో మన అనుభవమునకు విరుద్ధముగ నున్నచో, నిదిధ్యాసనము చేయవలెను. 'నీవు సచ్చిదానందుడవు' అని శాస్త్రము చెప్పుచున్నది. కాని మనకు అట్లు తోచుట లేదు. అనగా మనము మన గురించి మనస్సు ఆధారముగా ఒక నిర్ణయమునకు వచ్చి యున్నామని స్పష్టమే గదా! కావున, విచారమును ఇంకనూ కొనసాగించవలెను. అవగాహనకు వచ్చే వరకు శాస్త్రమును అధ్యయనము చేయాలి. శాస్త్రము ప్రమాణము. 'నీవు పూర్ణుడవు' అని వేదాంతము ప్రదర్శించుచున్నది. కావున, 'నేను వేదాంతమును అధ్యయనము చేసి, ఇప్పుడు పరిపూర్ణత కొరకై నా దృష్టిని మరియొక అధ్యయనము వైపునకు మళ్లించుచున్నాను' అని చెప్పుట పొసగదు.

'నాకు ఆత్మ (నేను) తెలియును. కాని నాకు ఆనంద స్వరూపము గోచరించలేదు' అని చెప్పుట యుక్తియుక్తము గాదు. కాని ఒక విశిష్టమగు అవస్థ మనకు అనుభవములో నున్నట్లు తోచును. ఈ అవస్థలో ఏకకాలంలో జ్ఞానము ఉంటూ, దానితో బాటు సమస్య కూడా ఉండును. 'నాకు తెలియదు' అని చెప్ప వీలులేదు. కాని కొన్ని సమస్యలు ఉన్న కారణంగా, 'నేను బ్రహ్మను అనే జ్ఞానము నాకు గలదు' అని చెప్పుటకు వీలు లేదు. 'నేను ముక్తుడను' అనే జ్ఞానమునకు ఒక మానసిక అవస్థా విశేషము ఆటంకముగా నున్నట్లు తోచును. ఈ ఆటంకమును తొలగించవలెను. కాని ఈ సత్యమును ఒక అలవాటుగా ఆలోచించే అభ్యాసమును చేసినచో, ఆ జ్ఞాన ముదయించగలదని చెప్పవచ్చును. ఈ అభ్యాసమును చేయు విధములు అనేకములు గలవు. వాటిలో ప్రధానమైనది నిదిధ్యాసనము.

'నేను ఈశ్వరుడను' అను జ్ఞానముపై చేయు నిదిధ్యాసనము క్రియ కాదు. సత్య వస్తువును పునరావృత్తి చేసినప్పుడు గాని నిదిధ్యాసనము చేసినప్పుడు గాని ఫలము పుట్టదు. ఏలయన, సత్యకథనము అంతకు ముందే సిద్ధించి యున్న వస్తువును ఉద్దేశించి (సిద్ధ విషయ) ప్రవర్తిల్లును గదా! ఇది మనము తెలియదగిన ప్రముఖ విషయము. తత్పూర్వమే సిద్ధించి యున్న వస్తువు మరల ఉత్పన్నము కాదు గనుక, అది క్రియా సాధ్యము కాదు. క్రియ వస్తువులను ఉత్పత్తి చేయగలదు;

వస్తువులో మార్పులను తీసుకు రాగలదు; శుద్ధి చేయగలదు; లేదా, మన మింతకు ముందు చూచిన విధముగా ఒక గమ్య స్థానమును చేర్చగలదు. 'అగ్ని వేడిగా నుండును' అనునది సత్య కథనము. అటులనే 'ఆత్మ బ్రహ్మయే' అనునది కూడా సత్య కథనము. కాని, అది సిద్ధమే గాని, సాధ్యము కాదు. అది కర్మఫలము కాజాలదు. సత్యవస్తువును మనము తెలుసుకుంటే చాలును. కావున 'బ్రహ్మము నేనే' అను విషయమును ఎరుంగవలెను. శ్రవణ మనన నిదిధ్యాసనములు ఈ సత్యమును ఎరుంగుటలో పర్యాప్తమగు సాధనములు. నిదిధ్యాసనము శాస్త్రానురూపముగ నుండవలెను. కావున, పరమం పురుషం యాతి అనునది జ్ఞానరూపమగు ప్రాప్తి.

నన్ను ఎరింగిన వాడు సర్వదా నా యందు ఉండి మరణానంతరము నా యందు ఐక్యమగునని చెప్పి శ్రీకృష్ణుడు ఈ ప్రకరణము నారంభించినాడు. అట్టి వ్యక్తికి పునర్జన్మ లేదు. మరియొకడు ఆత్మయే పరమేశ్వరుడను జ్ఞానమును శాస్త్రము నుండి పొంది ఆ పరమేశ్వరుని ధ్యానించును. ఆతడు ధ్యానించు పరమేశ్వరుడే పరమపురుషుడు. ఆతనికి మరణానంతరము పునరావృత్తి లేదు.

మరియొక సాధకుడు గలడు. ఆతడు యోగముతో, ప్రత్యేకించి ప్రాణాయామముతో కలిపి నిదిధ్యాసనము ననుష్ఠించును. అట్టి వ్యక్తిని తరువాతి శ్లోకము వర్ణించును. ఆతడు కూడ ధ్యాన ప్రభావముచే నన్ను పొందును.

వివిధ సాధకులకు విభిన్న ఆటంకములుండును. వాటిని విభిన్నరీతులలో ఎదుర్కొని పరిష్కరించవలెను. కావుననే, సాధనలో ఇన్ని విభేదములు ప్రదర్శింపబడినవి. సాధకులు ఆటంకములను తొలగించుట కొరకై యోగమును, వివిధ రకముల ఉపాసనలను, మరియు ఇతర ఆవశ్యకమగు కర్మలను అనుష్ఠించెదరు.

**అధ్యాయము 8, శ్లోకము 10:**

प्रयाणकाले मनसाचलेन भक्त्या युक्तो योगबलेन चैव ।
भ्रुवोर्मध्ये प्राणमावेश्य सम्यक् स तं परं पुरुषमुपैति दिव्यम् ॥ १० ॥

ప్రయాణ కాలే మనసాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ
భ్రువోర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్ (10).

ప్రయాణ కాలే = మరణ సమయము నందు; అచలేన = స్థిరమైన; మనసా = మనస్సుతో; భక్త్యా = భక్తితో; చ = మరియు; యోగబలేన = యోగముచే లభించిన శక్తితో; యుక్తః ఏవ = కూడియున్నవాడు మాత్రమే; భ్రువోః = కనుబొమలు; మధ్యే = మధ్య భాగమునందు; ప్రాణం = ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలను; సమ్యక్ = సముచితముగా; ఆవేశ్య = స్థాపించి; సః = ఆ యోగి; తం = ఆ; దివ్యం = ప్రకాశ స్వరూపుడగు; పరం పురుషం = పరమపురుషుని; ఉపైతి = పొందును.

మరణ సమయమునందు స్థిరమైన మనస్సుతో, భక్తితో మరియు యోగశక్తితో కూడిన ఆ యోగి ఉచ్ఛ్వాస నిశ్శ్వాసలను కనుబొమల మధ్యలో చక్కగా నిలిపి ప్రకాశ స్వరూపుడగు ఆ పరమ పురుషుని పొందును (10).

ఈ ప్రకరణ మంతయూ మరణ సమయములో సాధకుని స్థితిని గూర్చి వర్ణించును. యోగి ప్రాణములను తన ఇచ్ఛచే పరిత్యజించగల్గును. యోగి మరణించాలనుకుంటే తన యోగశక్తిచే ప్రాణ ప్రవాహమును ఆపివేయగల్గును. జీవించియుండగా అతడు ప్రాణశక్తిని ఆత్మ యొక్క నిదిధ్యాసనము నందు కేంద్రీకరించును. అతడు జీవించియుండగనే స్పష్టమగు దర్శనము కలిగి, దేహ తాదాత్మ్యమును వీడి ఆత్మానుసంధాన పరుడై ఉండెను. కాని అతనిలో ఇంకనూ కర్తృత్వము గలదు. కావున, అతడు బ్రహ్మలోకమును పొందును. అచట అతనికి బ్రహ్మ గారు ఉపదేశించగలరు. దీనికి క్రమముక్తి అని పేరు.

ప్రయాణ కాలే అనగా ప్రయాణమునకు బయల్దేరు సమయము నందు. అనగా ఈ ప్రకరణములో మరణకాలము నందు అని యర్థము. అతడు మరణించు విధమెట్టిది?

అచలేన మనసా. ఇటునటు చెదరిపోని మనస్సుతో. భక్త్యా యుక్తః. అతడు ఏ పురుషుని నిదిధ్యాసనము చేయునో, ఆ పురుషుని యందు భక్తితో నిండియున్నవాడు. అతనికి తాను నిదిధ్యాసనము చేయుచున్న ఆత్మ యందు ప్రేమ అపారము. అతనికి మరియొక ప్రేమ లేదు.

యోగ బలేన చ ఏవ. యోగాభ్యాసముచే లభించిన శక్తితో. ధ్యానాభ్యాసముచే అతని మనస్సు నిశ్చలమైనది. అతడు అభ్యసించిన అష్టాంగ యోగము యొక్క పరాకాష్ఠయే ఈ యోగబలము.

ధ్యేయ వస్తువు మనస్సులో ఒక సంస్కారమును కలిగించును. ధ్యానాభ్యాసముచే సంస్కారము దృఢమగును. ముముక్షువునకు ఏకైక ధ్యేయవస్తువు ఆత్మ. ఆత్మ లీనుడై ఉండుటను

నిరంతరముగా అభ్యాసము చేయుటచే ఈ సంస్కారము పుట్టును. ఈతడు జీవితము నంతనూ యోగాభ్యాసముతో బాటు జ్ఞానసాధనను చేయుచూ గడిపెను. ఇట్టి వ్యక్తి మరణ సమయము నందు ఏమి చేయును?

భ్రువో ర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్. ముందుగా అతడు మనస్సును ఆత్మ యొక్క అంతరంగ నివాస గుహ యగు హృదయముపై లగ్నము చేయును. గుండెకి కుడివైపు అహంకారస్థానమని పెద్దలు చెప్పెదరు. ఆ స్థానము నాతడు మనస్సుతో భావన చేయును. ఇది కేవలము ఒక మానస దర్శనము మాత్రమే. కాని అది మనస్సు తల్లీనస్థితిని పొందుటలో సహకరించును. మంత్రమును జపించు సమయములో నైననూ సాధకుడు ఆ స్థానము నుండి మంత్రము ఉద్భమించుచున్నట్లు భావన చేసినచో, ఆ జపము మరింత తన్మయతను కలిగించును.

అపుడాతడు ప్రాణ సంచారమును ఆపివేయును. అతడు గాలిని పీల్చునే గాని వదలడు. శ్రీ శంకరులు 'నాడీ' అను పదమును జోడించిరి. ఇది యోగశాస్త్రములోని ఒక పారిభాషిక పదము. అది ఒక రకమైన నరము. హృదయము నుండి భ్రూమధ్యము వరకు ప్రసరించే ఈ నాడిని సాధకుడు మనోనేత్రముతో దర్శించును. అతడు ప్రాణమును ఈ నాడి గుండా ప్రసరింపజేసి, భ్రూమధ్యము వద్ద నిలిపి ఉంచును. మరియు పీల్చిన గాలిని విడువడు.

పరం పురుషం ఉపైతి. అతడు అనంతుడగు పరమాత్మను పొందును. ఈ వాక్యమును బట్టి ఆ సాధకుడు విద్వాంసుడగు యోగి యని మనకు తెలియుచున్నది.

ఇంత వరకు సాక్షాత్తుగా బ్రహ్మను నిదిధ్యాసనము చేయు సాధకులను గూర్చి భగవానుడు వివరించెను. ఈ నిదిధ్యాసనమును చేసే సామర్థ్యమును పొందుట కొరకై ఒక ప్రతీకను స్వీకరించి ధ్యానించే సాధకులు కొందరు గలరు. భగవానుడు వారిని తరువాతి శ్లోకములో పరిచయము చేయుచున్నాడు.

**అధ్యాయము 8, శ్లోకము 11:**

यदक्षरं वेदविदो वदन्ति विशन्ति यद्यतयो वीतरागाः ।
यदिच्छन्तो ब्रह्मचर्यं चरन्ति तत्ते पदं सङ्ग्रहेण प्रवक्ष्ये ॥ ११ ॥

యదక్షరం వేద విదో వదంతి విశంతి యద్యతయో వీతరాగాః
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే (11).

వేద విదః = వేదవేత్తలు; యత్ = ఏ; అక్షరం = వినాశము లేని పదమును గురించి; వదంతి = పలికెదరో; వీతరాగాః = రాగవిరహితులైన; యతయః = సన్న్యాసులు; యత్ = దేనిని; విశంతి = ప్రవేశించెదరో; యత్ = దేనిని; ఇచ్ఛంతః = కోరువారై; బ్రహ్మచర్యం = స్వాధ్యాయ, అనుశాసనములతో కూడిన జీవితమును; చరంతి = అనుసరించెదరో; తే = నీకు; తత్ = అట్టి; పదం = మోక్షరూప పదమును గూర్చి; సంగ్రహేణ = సంగ్రహముగా; ప్రవక్ష్యే = చెప్పగలను.

వేదవేత్తలు వినాశములేని ఏ పదమును వర్ణించెదరో, వీతరాగులగు సన్న్యాసులు దేనిని ప్రవేశించెదరో, దేనిని గోరి స్వాధ్యాయ అనుశాసనములతో కూడిన జీవితమును గడిపెదరో, నీకు అట్టి మోక్షరూప పదమును గూర్చి సంగ్రహముగా చెప్పగలను (11).

ఈ శ్లోకములోని మొదటి పాదము బృహదారణ్యకోపనిషత్తులోని ఒక శ్లోకపాదమునకు (3-8-8), మిగిలిన శ్లోకము కఠోపనిషత్తులోని శ్లోకమునకు (1-2-15) సమానముగా నున్నది. ఆ పదమును నేను నీకు సంగ్రహముగా చెప్పెదను. వేదము లన్నియు దానిని వివరించినవి. దానిని గోరి సాధకులు బ్రహ్మచర్య జీవనమును గడుపుచున్నారు. అదియే ఓమ్. భగవానుడీ విషయము నిచట మూడు శ్లోకములలో వివరించును.

యదక్షరం వేదవిదో వదన్తి. వేదవిదః అనగా వేదము నెరింగిన వారు. వేదమును వల్లించుట మాత్రమే గాక అర్థము కూడ తెలిసినవారు. ప్రతివ్యక్తి వేదము యొక్క స్వీయశాఖను, అనగా ఋగ్వేదమును గాని, సామవేదమును గాని, యజుర్వేదమును గాని, అథర్వ వేదమును గాని అధ్యయనము చేయవలెనని విధి (స్వాధ్యాయః అధ్యేతవ్యః) గలదు. వేదములను వల్లె వేయుటకు కూడ అధ్యయన మనియే పేరు. కాని ఫలమును అనుభవించినప్పుడు మాత్రమే విధి పూర్ణమగును. వేదము ఒక ప్రమాణము. కాన ఫలవంతమైన జ్ఞానమును ఉపదేశించు సామర్థ్యము వేదమునకు గలదు. వేదమును వల్లించుట నేర్చిన పిదప, వేద వాక్యములను విశ్లేషించి, శాస్త్రమును సమగ్రముగా తెలియవలెను. వేదాంత శాస్త్రమును మరింత శ్రద్ధగా తెలియవలెను. అంతవరకు స్వాధ్యాయ విధి పరిపూర్తి కాదు. దాని శక్తి అహం బ్రహ్మాస్మి అను జ్ఞానము ఉదయించువరకు కొనసాగును. కావున వేదార్థము నెరింగినవాడే వేదవిత్ అనబడును.

పరబ్రహ్మ అక్షరమనబడును. వినాశమునకు, కాలమునకు అధీనము కానిది అని దాని యర్థము. వేదము నెరింగిన వారు దీనిని వర్ణించెదరు. బృహదారణ్యకోపనిషత్తులో (3-8-8), యాజ్ఞవల్క్యుడు గార్గికి అక్షర పరబ్రహ్మము నుపదేశించెను. అది పెద్దది కాదు, అది చిన్నది కాదు, అది పొట్టి కాదు, అది పొడుగు కాదు. అది సర్వ విశేషణ వినిర్ముక్తము. ఈ అక్షర పరబ్రహ్మ ఒక పదార్థము కాదు. మనము ఇతర వస్తువులను పొందిన తీరులో దానిని పొందజాలము. అది అనుభవమునకు అందదు. దానిని తెలియవలెను.

యదిచ్ఛంతః బ్రహ్మచర్యం చరంతి. దీనిని తెలియగోరి సాధకులు గురుసన్నిధిలో అనుశాసనబద్ధమగు జీవనమును గడిపెదరో. ఈ అనుశాసనములో అధ్యయనము, ధ్యానము, మంత్రజపము ఇత్యాదులు అంతర్గతములై యుండును.

విశంతి యద్యతయో వీతరాగాః. యోగ్యమగు ప్రయత్నమును చేయు సామర్థ్యము గలవారు యతులు అనబడుదురు. ఈ జ్ఞానమునకు అవశ్యకమగు వాటిలో త్యాగము ప్రముఖమైనది. కావున, జీవితములో ఇతర అన్వేషణల నన్నిటినీ త్యజించి, తన జీవితమును ఈ జ్ఞానసాధనకు వినియోగించు వ్యక్తి యతి అనబడును. ఈతడు సన్న్యాసియై ఉండును. ఇట్టి సాధకులు తీవ్ర రాగద్వేషములకు దూరముగా నుండెదరు. ఏలయన, వారికి అర్థకామముల యందు అభిరుచి అల్పము. వారు మోక్షమునకు అంకితమైనవారు.

తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే. జ్ఞాన ప్రాప్యమైన ఆ పదమును నేను నీకు సంగ్రహముగా చెప్పెదను. 'పదమ్' అనగా సర్వశ్రేష్ఠ ఆరాధ్యము అని యర్థము.

తరువాతి రెండు శ్లోకములు ప్రణవము (ఓం)ను చర్చించును. భగవద్గీతలో ఓంకారము మొదటిసారిగా ప్రస్తావనకు వచ్చినది. ఇందువలననే శ్రీ శంకరులు అవతారికలో ఈ విషయమును ప్రస్తావించిరి.

ఓంకారధ్యానము

విధిధ్యానవోపయోగి పదము ఓమ్

ఓమ్ అను పదము పరబ్రహ్మను బోధించును. 'ఘటము' అనగానే దాని అర్థము మదిలో స్ఫురించును. ఓమ్ విషయంలో కూడా అంతే. దాని అర్థము తెలిసిన వారికి ఓమ్ వినపడగానే ఆ

అర్థము స్ఫురించును. కావున ఓమ్ పరబ్రహ్మకు వాచకము (నామధేయము) అగును. బ్రహ్మ వాచ్యము అనబడును.

సాధారణంగా పదమునకు, దాని అర్థమునకు మధ్యలో నిత్య సంబంధము గలదు. అదియే వాచ్య వాచక సంబంధము. ఉదాహరణకు, జామ అను పదము వాచకము, ఆ పండు వాచ్యము అగును. కాని, మానవుల పేర్ల విషయంలో పరిస్థితి వేరుగా నుండును. 'రాముడు' అంటే ఎవరైననూ కావచ్చును. రామశబ్దము ఘటాది శబ్దముల వంటి వాచకము కాదు. దానికి వాస్తవంలో వాచ్యము లేదు. కావున నిత్యమగు వాచ్యవాచక సంబంధము అచట లేదు. రామశబ్దము మనకు తెలిసిన ఒక విశిష్ట వ్యక్తిని స్ఫురణకు తెచ్చును. అంటే అది వాచక పాత్రను నిర్వహించుచున్నది. కాని వాస్తవంలో అది ఒక నామము మాత్రమే. అటులనే శాస్త్రము పరబ్రహ్మకు ఓమ్ అను పేరును పెట్టినది. శాస్త్రమును చదివినవాడు ఓమ్ అను పేరును బట్టి బ్రహ్మమును గుర్తించును. ఆత్మచైతన్యమే బ్రహ్మము. ఆ బ్రహ్మమే ఓమ్. 'సర్వము నేనే' అను భావనతో ఓంకారార్థముపై నిదిధ్యానన చేయాలి. అపుడు ఓమ్ మనస్సును ధ్యానము నందు గాక, నిదిధ్యాసనము నందు నిమగ్నము చేయును.

ధ్యానములో సహకరించే ప్రతీకలు ద్వివిధముగ నున్నవి. ఒకటి శబ్దరూపమైన ప్రతీక. మరియొకటి ప్రతిమ. మనము ఈ రెండింటిపై ఈశ్వర భావనను అధ్యారోపము చేసి, ఆరాధించెదము. కాని ఈశ్వరుడు నిత్యపరోక్షుడుగా స్వీకరింపబడును.

### ఓంకారము ప్రతీక – ధ్యానము

ఓంకారము శబ్దాత్మకమైన ప్రతీక. ఆ సందర్భములో దానికి అర్థము అపరబ్రహ్మ. అది కేవలము సాధకుడు తన పరోక్ష ఈశ్వరజ్ఞానమును ఆరోపించే ప్రతీక మాత్రమే యగును. ఈ సాధకుడు జ్ఞాని కాడు. ఓంకారము ఇచట బ్రహ్మవాచకము కాదు. ఇది కేవలము ఉపాసనార్థము ఉద్దేశింపబడినది మాత్రమే. ఈ ఉపాసనకు ఫలము బ్రహ్మలోక ప్రాప్తి. సాధకుడు ముముక్షువైనచో, పుణ్యాత్ముడైనచో, అచట అతనికి బ్రహ్మగారు ఉపదేశించెదరు. లేదా ఆ సాధకుడు మరల మానవ జన్మనెత్తి, జ్ఞానసాధనను కొనసాగించును.

ఓంకారమును ధ్యానించు సాధకుడు ఏ లోకమును పొందును? అని ప్రశ్నోపనిషత్తులో (5-1-2-5) సత్యకాముడు తన గురువును ప్రశ్నించెను. ఓంకారము పరబ్రహ్మ, అపరబ్రహ్మ అని ద్వివిధముగ నున్నది. ప్రతీకాత్మకమైనది అపరబ్రహ్మ. అది పరోక్ష ఈశ్వరునకు సంకేతము.

ప్రత్యగాత్మ భిన్నముగా పరమాత్మను నిదిధ్యాసనము చేయు సందర్భములో ఓంకారము పరబ్రహ్మ యని గురువు బోధించెను.

ఓంకారములోని మూడు వర్ణములు మూడు అనుభవరూపమగు అవస్థలకు ప్రతీకలని మనము చూచియున్నాము. ఓంకారమును ఉచ్చరించినప్పుడు ఆఖరి వర్ణమగు మకారము జాగ్రత్స్వప్న సుషుప్త్యభిమాన్యతీతమైన శుద్ధ చైతన్యరూపమైన నిశ్శబ్దములో లయమగును. ఆ నిశ్శబ్దము నుండి అకారము ఉద్బుద్ధమగును. ఓమ్‌ను ఉచ్చరించినప్పుడు ఆ శబ్దము చైతన్యముచే వ్యాప్తమై అకార ఉకార మకార భేదము అంతరించును. అది జాగ్రచ్చైతన్యము గాని, స్వప్న చైతన్యము గాని, వాటి మధ్యలో నుండే చైతన్యము గాని, నిద్రావస్థ యందలి చైతన్యము గాని, సర్వమునే తెలుసుకునే చైతన్యము గాని కాదు. అది అచేతనము కూడ కాదు. అది శుద్ధ చైతన్యము. దాని యందు సర్వము లీనమగును. అదియే బ్రహ్మవాచకమైన అమాత్ర ఓంకారము.

ధర్మాధర్మములకు కారణ కార్యములకు అతీతమైన దానిని చెప్పుమని కఠోపనిషత్తులో నచికేతసుడు పృచ్ఛించెను. ఇచట శ్రీకృష్ణుడు, అచట యముడు చేసిన ఉపదేశములు ఏకరూపముగా నున్నవి. పరబ్రహ్మను బోధించిననూ అర్థము కాని అజ్ఞులకు ఉపాసనా సౌలభ్యము కొరకై ఇతర స్థలములలో ఓంకారము ప్రతీకరూపముగా ఉపదేశింపబడినది.

గీతాశాస్త్రము ఈ ప్రకరణములో విభిన్నరీతుల జీవగతులను గూర్చి చర్చించుచున్నది. ఓంకారమును ప్రతీకగా ఉపాసన చేయు సాధకునకు ప్రయాణము, మరుజన్మ ఉండును. కాని ఓంకారార్థము నెరింగి నిదిధ్యాసనము చేయు జ్ఞానికి తరువాతి ప్రయాణ మేమియూ లేదు.

జీవితపు ఆఖరి ఘడియలలో ఓంకారధ్యానమును చేయువారిని గురించి, దాని ఫలమును గురించి భగవానుడు రాబోవు మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 8, శ్లోకము 12:**

सर्वद्वाराणि संयम्य मनो हृदि निरुध्य च ।
मूर्ध्न्याधायात्मनः प्राणमास्थितो योगधारणाम् ॥ १२ ॥

సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణామ్ (12).

**సర్వద్వారాణి** = అన్ని ద్వారము (జ్ఞానేంద్రియము)లను; **సంయమ్య** = మూసివేసి; **మనః** = మనస్సును; **హృది** = హృదయము నందు; **నిరుధ్య** = నియంత్రించి; **చ** = మరియు; **ఆత్మనః** = తన; **ప్రాణం** = శ్వాసను; **మూర్ధ్ని** = శిరస్సు ఉపరిభాగము నందు; **ఆధాయ** = నిలబెట్టి; **యోగధారణామ్** = యోగముచే శ్వాసను నిలుపుజేయు ప్రక్రియను; **ఆస్థితః** = స్థిరముగా స్వీకరించినవాడై యుండును.

అన్ని ద్వారము (జ్ఞానేంద్రియము)లను మూసివేసి, మనస్సును హృదయము నందు నియంత్రించి, మరియు శ్వాసను శిరస్సు పైభాగము నందు నిలబెట్టి, యోగముచే శ్వాసను నిలుపుజేయు ప్రక్రియను దృఢముగా స్వీకరించి యుండును (12).

ఈతడు ఓంకారధ్యానమును చేయు యోగి.

సర్వద్వారాణి సంయమ్య. ద్వారముల నన్నిటినీ మూసివేసి. ఈ ప్రపంచము జ్ఞానేంద్రియము లనే ద్వారముల గుండా మనలోనికి ప్రవేశించును. ఈ శ్లోకము వర్ణించునది యోగియే గాని, జ్ఞాని గాదు. సర్వము నుండి మనస్సును వెనుకకు లాగి ఏకాగ్రము చేయువాడు యోగి. జ్ఞాని బాహ్య ప్రపంచమును లోపలికి రాకుండా నిరోధించవచ్చును; నిరోధించకపోవచ్చును. ఆతడు సత్యము నెరింగినవాడు. ఆతని దర్శనములో మార్పు వచ్చినది. ప్రస్తుతంలో, ధ్యానయోగి జ్ఞానేంద్రియముల నన్నిటినీ ఉపసంహరించి సుఖాసనము నందు ఉపవిష్టుడై యుండును.

మనో హృది నిరుధ్య చ. మనస్సును లోనికి ఆత్మవైపునకు మరల్చుట. వాస్తవంలో మనము చేయవలసినది ఇంత మాత్రమే. ఇంద్రియములను వాటి అన్వేషణల నుండి వెనుకకు మరల్చి, మనస్సును ఆత్మాభిముఖముగా త్రిప్పిన చాలును.

మూర్ధ్ని ఆధాయ ఆత్మనః ప్రాణమ్. ఆతడు తన ప్రాణమును శిరస్సు యొక్క అగ్రభాగము నందుంచి, గాలిని విడువకుండగా నిరోధించును.

ఆస్థితః యోగధారణామ్. ఆతడు యోగశక్తిచే ఈ విధముగా ప్రాణవాయువును నిరోధించి స్థిరముగా నుండును.

ఆతడింకనూ ఏమి చేయును? తరువాతి శ్లోకము వివరించుచున్నది:

**అధ్యాయము 8, శ్లోకము 13:**

ओमित्येकाक्षरं ब्रह्म व्याहरन्मामनुस्मरन् ।
यः प्रयाति त्यजन्देहं स याति परमां गतिम् ॥ १३ ॥

ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ (13).

బ్రహ్మ = బ్రహ్మను బోధించే; ఓం ఇతి = ఓం అనే; ఏకాక్షరం = ఒకే ఒక అక్షరమును; వ్యాహరన్ = ఉచ్చరించువాడై; మాం = నన్ను; అనుస్మరన్ = స్మరించువాడై; యః = ఎవడైతే; దేహం = శరీరమును; త్యజన్ = త్యజించి; ప్రయాతి = పయనమగునో; సః = వాడు; పరమాం = సర్వోత్కృష్టమగు; గతిం = పదమును; యాతి = పొందును.

ఎవడైతే బ్రహ్మవాచకమగు ఓం అనే ఒక అక్షరమును ఉచ్చరించువాడై, నన్ను స్మరించుచూ, శరీరమును త్యజించి పయనమగునో, వాడు సర్వోత్కృష్టమగు పదమును పొందును (13).

ఓమిత్యే కాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్. బ్రహ్మకు వాచకమగు ఒకే వర్ణము గల ఓంకారమును జపిస్తూ, నన్ను స్మరిస్తూ.

యః ప్రయాతి త్యజన్ దేహమ్. ఎవడైతే దేహమును వీడి పయనమునకు సిద్ధమగునో. మరణము దేహమునకే గాని, జీవునకు లేదు. తాను సనాతనుడననే సత్యమును ఎరుంగనంత వరకు జీవుడు పయనించుచునే యుండును. జ్ఞానము కలిగిన తరువాత ఆత్మపై చేయబడిన జీవత్వమనే అధ్యారోపము తొలగిపోవును. జీవుని సత్యము ఆత్మయే గనుక, జీవుడు ఏ కాలము నందైననూ మరణించడు.

స యాతి పరమాం గతిమ్. అతడు సర్వశ్రేష్ఠమగు లక్ష్యమును చేరును. ప్రయాతి అను పదము ప్రయాణమును సూచించును. అతడు చేసిన మహిమాన్వితమగు ధ్యానాభ్యాసము వలన ప్రాణవాయువును నిరోధించి నన్ను ధ్యానిస్తూ ఓంకారమును జపిస్తూ ఈ దేహమును వీడి తిన్నగా బ్రహ్మలోకమును పొందునని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. అతడచట బ్రహ్మగారివి

ప్రార్థించి, ఈ జ్ఞానమును పొంది ముక్తుడగును. ఆత్మయే బ్రహ్మ అను సాక్షాత్కారమే 'పరమా గతిః' అని చెప్పబడిన లక్ష్యము. ఇదియే మోక్షము. దీనిని అతడు బ్రహ్మలోకము నందు పొందును.

**అధ్యాయము 8, శ్లోకము 14:**

अनन्यचेतास्सततं यो मां स्मरति नित्यशः ।
तस्याहं सुलभः पार्थ नित्ययुक्तस्य योगिनः ॥ १४ ॥

అనన్య చేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః (14)

**యః** = ఎవడైతే; **అనన్యచేతాః** = ఇతరము వైపునకు ప్రసరించని మనస్సు గలవాడై; **సతతం** = నిరన్తరముగా; **నిత్యశః** = చిరకాలము; **మాం** = నన్ను; **స్మరతి** = స్మరించునో; **పార్థ** = ఓ అర్జునా!; **నిత్యయుక్తస్య** = నిత్యము నా యందు లగ్నుడై ఉన్న; **యోగినః** = యోగి యగు; **తస్య** = వానికి; **అహం** = నేను; **సులభః** = తేలికగా లభించెదను.

ఓ అర్జునా! ఎవడైతే ఇతరము వైపునకు ప్రసరించని మనస్సు గలవాడై చిరకాలము నిరన్తరముగా నన్ను స్మరించునో, నిత్యము నాయందు లగ్నమైన మనస్సు గల అట్టి యోగికి నేను తేలికగా లభించెదను (14).

అనన్య చేతాః. ఆత్మ కంటె భిన్నమగు వస్తువు నందు గాని, దేవత యందు గాని లగ్నము కాని మనస్సు గలవాడు. ఈ పద ప్రయోగము గీతలో సర్వత్రా కానవచ్చును. 'అన్య' అనగా ఇతరము. తనకంటె భిన్నమైన వస్తువునందు – అది ధర్మము గాని, అర్థము గాని, కామము గాని, లేదా ఆత్మ భిన్నముగా భాసించే ఈశ్వరుడే గాని – అంకితమైన మనస్సు గలవాడు అన్యచేతాః అనబడును. ఈశ్వరుని గాని, లేక ఇతరమును గాని తన కంటె భిన్నముగా ఎవడు దర్శించడో, వాడు అనన్య చేతాః అనబడును.

**సాధకుడు ఎంతకాలము నిదిధ్యాసనము చేయవలెను?**

సతతం యః మాం స్మరతి. అతడు నన్ను సర్వకాలముల యందు స్మరించును. మనకు ఇంతకు ముందు తెలిసిన దానినే మనము గుర్తునకు తెచ్చుకొనగల్గుతాము గదా! అదే అభిప్రాయంతో

ఇచట 'స్మరణ' అను పదము వాడబడినది. ఈ స్మరణమునకు పూర్వము నందు శ్రవణము గలదు. మరియు స్మరణ శబ్ద ప్రయోగముచే, ఈ సాధకుడు నిదిధ్యాసనమును, సత్సంగమును, శ్రవణముతో బాటు మననమును చేసినవాడని సూచింపబడును. స్మరణమనగా మనస్సును ఒక దానిపై నిలబెట్టుట. మనము శాస్త్ర ప్రకాశములో వికసించిన వివేకిని గురించి మాటలాడుచున్నాము. కాని ఈతని కింకనూ, దేహము తాను అనే అభిముఖ్యము (దేహాత్మబుద్ధి) గలదు.

అభిముఖ్యమునకు, భ్రాంతికి గల తేడాను మనము చూచియుంటిమి (7-24). సరళమైన భ్రాంతిని తొలగించుటకు ఒకే ఒకసారి వివరణము ఇచ్చినచో సరిపడును. కాని, అలవాటుగా చేసే తప్పు (అభిముఖ్యము)ను అనేక పర్యాయములు దిద్దుకోవాలి. మనమిచట దేహాత్మబుద్ధిని చర్చిస్తున్నాము. దేహమే నేను; నేనే దేహము అను ధారణ మనకు గలదు. ఈ భ్రాంతిని శాస్త్రము తొలగించును. కాని, ఈ ధారణ చిరకాలము నుండి గలదు. కాన, దీని విషయమై సమస్య కొనసాగుచుండును. జీవితమంతా దేహాత్మభావనతో గడిచిన తరువాత, ఎవరో ఒకరు తత్ త్వం అసి అని బోధించినను, ఈ భావన వెనువెంటనే తొలగిపోవుట యెట్లు? ఈ అభిముఖ్యము పోవాలంటే స్మరణము (బ్రహ్మధ్యానము) తప్పనిసరి యగునని మనము చూచియున్నాము. ఈ అభిముఖ్యము తొలగిపోవు నంతవరకు సాధకుడు ఈ జ్ఞానముపై నిరంతరముగా మనస్సును లగ్నము చేయవలెను.

సతతం, నిత్యశః అను పదములు రెండింటికీ అర్థము ఒక్కటియే. ఎల్లవేళలా అని వాటి యర్థము. భగవానుడు ఒకే అర్థములో రెండు పదముల నేల ప్రయోగించెను? సతతం అనగా మధ్యలో విరామము లేకుండగా, నిరంతరముగా అని యర్థము. నన్ను నిరంతరముగా స్మరించు వ్యక్తి తన సమయము నంతనూ నిదిధ్యాసనము, ఆలోచన, బోధన, మరియు చర్చలతో గడుపును. అనగా నిరంతరముగా సత్సంగములో నుండు వ్యక్తిని ఈ శ్లోకము నిర్దేశించుచున్నది. నిరంతర స్మరణ ఒక రోజు గాని, ఒక వారము గాని, లేక అధికకాలము గాని కావచ్చును. ఇందువలననే భగవానుడు నిత్యశః అను పదమును కూడా జోడించినాడు. శః అను ప్రత్యయము ఆధిక్యమును గాని, పరిమితిని గాని బోధించును. నిత్యశః అను పదమును ప్రయోగించుటచే, అతడు నిదిధ్యాసనమును చేయునని అభిప్రాయము. అందువలననే, ప్రతి పదార్థములో 'ఎల్లవేళలా' అనుటకు బదులుగా 'చిరకాలము' అను అర్థము ఈయబడినది.

## భగవానుని సులభముగా పొందుట యెట్లు?

తస్య యోగినః అహం సులభః. ఆ యోగికి నేను సులభుడను. సులభుడు అనగా కష్టమేమియూ లేకుండగనే లభించువాడు. భగవానుడు సులభుడగుటకు అనేక హేతువులను చెప్పుటకు వీలుపడును.

మనము దేనిని సాధించవలెనన్నా, ప్రయత్నము ఆవశ్యకమగును. ఒక కార్యమును సాధించుటలో అత్యల్పమగు ప్రయత్నము కార్యసాధకము కావచ్చును. కాని ప్రయత్న లేశమునైననూ అపేక్షించు కార్యము నా అభిప్రాయములో సులభము అనుటకు తగదు. బ్రహ్మప్రాప్తి మానవుడు పొందగలిగే లాభము అన్నింటిలో గొప్పది. అనంతత్వమును మించిన లాభము ఉండబోదు. మరియు మనకు సంసార అభిముఖ్యము అధికముగా నున్నచో, బ్రహ్మప్రాప్తికి మరింత అధికమగు ప్రయత్నము ఆవశ్యకమగును. కాని, ప్రస్తుతంలో సర్వోత్కృష్టమగు ఉపలబ్ధి సులభమని చెప్పబడుచున్నది.

బ్రహ్మను పొందుటకై మానవుడు సర్వ ప్రేమ నిధానమైన బ్రహ్మయందు తల్లీనుడు కావాలని భగవానుడిచట చెప్పుచున్నాడు. మనము ప్రేమించే వస్తువుపై మనస్సును నిలుపుటకు ప్రయత్నమేమి కావలయును? ప్రేమకు ప్రయత్నముతో పనిలేదు. ప్రేమ సహజరీతిలో ప్రసరించును. వస్తువు విషయములో నైతే, కనీసము దానిని మనస్సులో స్మరించవలసి యుండును. కాని, ఇచట బ్రహ్మమనగా నీవే. ఆత్మయే పరమేశ్వరుడు. కావున, కోరదగినది ఏమియూ లేదు. పూర్ణత్వము దాని స్వభావము. కావున దాని యందు తల్లీనమగుట ఆనందదాయకమగు విషయము.

ఈ ప్రాప్తిలో కొత్తగా సృష్టింపబడేది ఏదీ లేదు. కాన, ఇది ప్రయత్న సాధ్యము కాదు. ఇది నిత్య సిద్ధ సత్యము గనుక, ఇది కేవల జ్ఞానగమ్యమగు ప్రాప్తి. దీనిలో నూతన సృష్టి ఏదీ లేదు. నూతనముగా జతగూర్చేది లేదు. పాతది తొలగింపబడుట లేదు.

### ఆ యోగి ఎవరు?

నిత్య యుక్త స్య. సర్వదా ప్రసన్నముగా నుండే మనస్సుతో అనుగ్రహింపబడినవాడు. ఇచట మనో నియంత్రణ యనగా, భగవానుని యందు తల్లీనమగుటలో మనస్సునకు సమస్య ఏమియూ లేదని అర్థము. అతనికి భగవచ్చింతన సహజ కృత్యము అగును. మనస్సు ఇతర వ్యాసంగము లేని సమయములో వెంటనే భగవానునిపై లగ్నమగును.

ఈతడు ప్రేమలో పడ్డ వ్యక్తి వంటివాడు. ప్రేమికుని మనస్సు సహజముగా ప్రియురాలి వైపునకు మళ్ళును. ప్రస్తుతంలో ఈ యోగి యొక్క మనస్సు సహజముగా పరమాత్మవైపు మళ్ళును. ఏలయన, ఆతడు పరమాత్మ తత్త్వము నెరింగినవాడు. మనకీ విషయము స్మరతి అను పదమును బట్టి తెలియుచున్నది. మనస్సు మరి ఎప్పటికి వెళ్లగలదు? ఆ స్థితి ప్రాప్తమగు వరకు ఆతడు శ్రవణమును కొనసాగించి, తన సంకల్పశక్తిచే భగవానుని యందు మనస్సును లగ్నము చేయును. ఆ తరువాత ధ్యేయము మనస్సును తన వశము చేసుకొనును. ఆతనికి అప్పుడు ధ్యానము కొరకై సంకల్పశక్తి ఆవశ్యకము కాదు. ఆతడు భగవానుని ధ్యానించవలెనని ముందుగా అనుకుంటే చాలును. ఆతని మనస్సు పరమేశ్వరునకు అంకితమై, పరమేశ్వరుని యందు లగ్నమై ఉండును. అనన్యచేతాః అనగా నిదియే అర్థము.

నన్ను ( భగవానుని) ఇంత సులభముగా పొందిన యోగి ఇంకనూ ఏమి సాధించగలడు?

**అధ్యాయము 8, శ్లోకము 15:**

मामुपेत्य पुनर्जन्म दुःखालयमशाश्वतम् ।
नाप्नुवन्ति महात्मानस्संसिद्धिं परमां गताः ॥ १५ ॥

మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్
నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతాః (15).

**మహాత్మానః** = జ్ఞానులు; **పరమాం** = సర్వోత్కృష్టమగు; **సంసిద్ధిం** = మోక్షరూపమగు సిద్ధిని; **గతాః** = పొందినవారై; **మాం** = నన్ను; **ఉపేత్య** = పొంది; **దుఃఖాలయమ్** = దుఃఖమునకు నిలయము; **అశాశ్వతమ్** = అనిత్యము అగు; **పునర్జన్మ** = పునర్జన్మను; **న ఆప్నువన్తి** = పొందరు.

నన్ను పొందిన జ్ఞానులు దుఃఖ నిలయము, అనిత్యము అగు పునర్జన్మను పొందరు.
వారు సర్వోత్కృష్టమగు మోక్షరూప సిద్ధిని పొందియున్నారు (15).

**యోగి తనకు ఈశ్వరునితోగల అభేదమును గుర్తించును**

మాం ఉపేత్య. నన్ను పొంది. ఉపేత్య అను పదము ఇచట పొందుట అనగా ఏక స్వరూపములో నుండుట అను అర్థములో ప్రయోగింపబడినది. ఏక స్వరూపములో నుండుట

ఎట్లు సంభవమగును? రెండు వస్తువులలో ఒకదాని స్వరూపమును మరియొకటి పొందలేదు గదా! ప్రతి వస్తువునకు స్వీయ గుణములుండును. ఒకటి రెండవదానిలో ఐక్యమైనచో, ఒకదాని స్వరూపము గాని, లేక రెండింటి స్వరూపము గాని నశించవలయును. ఉదాహరణకు, పాలకు నీటిని కలిపినచో, ఆ రెండింటి సాంద్రత కంటె విభిన్నమైన సాంద్రత గల మరియొక ద్రవపదార్థము లభించును. కావున, ఒక వస్తువు మరియొక వస్తువులో ఐక్యము కాజాలదు. స్వీయగుణములతో విలసిల్లే ఒక వస్తువు మరియొక వస్తువులో ఐక్యము కాజాలదు. అనగా అది తానుగా మిగిలియుండును.

కాని, ఒక భావము (పదార్థము) మరియొక భావమే ననుకొనుడు. అపుడు వాటి మధ్య అజ్ఞానము వలన మాత్రమే భేదము ఉండును. ప్రస్తుతములో పరిస్థితి ఇట్టిది. జీవేశ్వరుల మధ్య భేదమునకు అజ్ఞానము మాత్రమే హేతువు. ఈశ్వరుని ధ్యానించుట యనగా ఆ అజ్ఞానముపై దండయాత్రను చేయుటయే. ఏలయన, సాధకునికి గల అభిముఖ్యములు (అలవాట్లు) కూడ అజ్ఞానజనితములే. పరమేశ్వరునితోడి ఐక్యము నిత్య సిద్ధము. కావున, దానిని పొందుట సంభవమే.

### మరుజన్మ అభిలషణీయము కాదు

పునర్జన్మ న అప్నువన్తి. వారు మరల జన్మించరు. ఈ పునర్జన్మ యొక్క స్వరూపము రెండు పదములలో వర్ణింపబడినది.

మరల జన్మించుటయే అభీష్టమనియు, కాని ఇంతకంటె మెరుగైన పరిస్థితులలో మాత్రమే జన్మించవలె ననియు మానవులు కోరుకొందురు. కాని ఇచట సమస్య ఏమనగా, ఈ సంఘర్షణ ఏదో రూపములో తప్పదు. ఏలయన, అజ్ఞానము ఉన్నప్పుడు మాత్రమే పునర్జన్మ కలుగును. పునర్జన్మకు మనము భయపడము. కాని దానిలోని దుఃఖము వలన మనకు భయము కలుగును. కావుననే భగవానుడు ఇచట ఈ విషయమును స్పష్టము చేయుచున్నాడు.

దుఃఖాలయమ్. జన్మలన్నియు దుఃఖ నిలయములు. అలయము అనగా నివాసస్థానము. దుఃఖము త్రివిధమని మనము చూచియున్నాము. దేహము, మనస్సు, ఇంద్రియముల వలన కలిగే దుఃఖము; చుట్టూ ఉన్న పదార్థముల వలన కలిగే దుఃఖము; మరియు మన అధీనములో లేని అజ్ఞాతశక్తుల వలన కలిగే దుఃఖము.

కావున స్థూలదేహము దుఃఖములకు నిలయము (దుఃఖాలయము) అని నిర్వచించవచ్చును. సర్వదా ఏదో ఒక భాగములో ఇబ్బంది ఉండును. సర్వము సక్రమముగా ఉన్నదనుకొనే లోపులో

పంటినొప్పి ఆరంభమగును. దేహమును కారును వలె అన్ని కాలముల యందు ప్రయత్నపూర్వకముగా భద్రముగా నుంచుకొనవలెను. కారులో పెట్రోలు, నీరు ఉన్నవా, లేవా యను విషయమును చూసుకోవాలి. భాగము లన్నియూ సక్రమముగా నున్నవా, లేవా యను విషయమును చూసుకోవాలి. ఏదేని లోపమున్నచో, వైద్యశాలకు, అనగా గేరేజికి తీసుకుపోవాలి. ప్రమాదము జరిగే అవకాశము కలదు గాన, భీమా చేయించవలెను.

కాని, మనము స్వర్గమునకు పోయినచో, అచట దుఃఖము ఉండదు గదా! అచటి స్థూలదేహము దుఃఖాధీనమై ఉండదు గదా! ఈ ఆశంకను తొలగించుటకై భగవానుడు మరియొక పదమును ప్రయోగించినాడు. అశాశ్వతమ్. శాశ్వతము కానిది. దివ్యదేహము లభించవచ్చును. కాని అది శాశ్వతముగా నుండదు. ఆ దేహము పోగానే, మరుజన్మలో మరల దుఃఖాధీనమగు దేహమే లభించును. పైగా దివ్యదేహములో దుఃఖము ఉండి తీరును. జీవత్వమనగా భిన్న వ్యక్తిత్వము. అట్టి వ్యక్తిత్వము ఉన్నంతవరకు ఏదో కొంత దుఃఖము జీవునకు తప్పనిసరి యగును. జీవుని స్వర్గమునకు గొంపోయి, అచట భోగముల ననుభవింప జేసిన పుణ్యము కాలక్రమములో ఖర్చు అయిపోగానే, దివ్య దేహమును త్యజించవలసి వచ్చును. లేదా, సృష్టిలో భాగముగా నుండే స్వర్గము ప్రలయములో నష్టమగును.

ఈ జనన పునర్జననముల నుండి ఎవరు ముక్తిని పొందెదరు?

మహాత్మానః. ఎవరి ఆత్మ పరబ్రహ్మయో వారు.

పరమాం సంసిద్ధిం గతాః. సంసిద్ధి యనగా విజయము. వాస్తవమగు ఏకైక విజయము మోక్షము. దీనిని వారు పొందిరి. 'పరమామ్' అనగా పురుషార్థములలో కెల్ల శ్రేష్ఠమైనది అని యర్థము. ఈ విముక్తిని పొందినవారికి పునర్జన్మ లేదు.

భగవత్ప్రాప్తి సులభమే అయినా, సర్వోత్కృష్టమగు ఫలము. దీనికి భిన్నంగా, పుణ్యలోక ప్రాప్తి కష్టసాధ్యము. మరియు ఆ ఫలము దుఃఖాలయము. కాన ఈ రెండింటిలో రెండవ దానిని ఎన్నుకున్నచో, అది లాభసాటి బేరము కాబోదు. తరువాతి ప్రకరణములో భగవానుడు నష్టదాయకమైన బేరమును గురించి వివరించును.

నన్ను తమ ఆత్మరూపముగా గుర్తించిన జ్ఞానులకు పునర్జన్మ ఉండబోదని శ్రీకృష్ణ భగవానుడు పూర్వశ్లోకములలో చెప్పియున్నాడు. స్వభావతః దుఃఖదాయకమైన దేహము

వారికి మరల సంసర్గము కలుగదు. ఈ సాక్షాత్కారము లేని అజ్ఞానులగు ఇతరుల మాట యేమి? వారెచ్చటకు పోయెదరు? వారి గతి యేమి?

**అధ్యాయము 8, శ్లోకము 16:**

आब्रह्म भुवनाल्लोकाः पुनरावर्तिनोऽर्जुन ।
मामुपेत्य तु कौन्तेय पुनर्जन्म न विद्यते ॥ १६ ॥

ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే (16)

**ఆ బ్రహ్మ భువనాత్** = బ్రహ్మలోకము వరకు గల; **లోకాః** = ప్రాణులు నివసించు లోకములు; **పునరావర్తినః** = ప్రాణులను వెనుకకు వచ్చునట్లు చేయు స్వభావము గలవి; **అర్జున** = ఓ అర్జునా!; **తు** = కానైతే; **మాం** = నన్ను; **ఉపేత్య** = పొందిన తరువాత; **కౌంతేయ** = ఓ కుంతీపుత్రా!; **పునర్జన్మ** = మరల పుట్టుక; **న విద్యతే** = లేదు.

ఓ అర్జునా! బ్రహ్మ లోకము వరకు గల, ప్రాణులు నివసించే లోకములు ప్రాణులను వెనుకకు వచ్చునట్లు చేయు స్వభావము గలవి. ఓ కుంతీపుత్రా! కానైతే, నన్ను పొందిన పిదప మరల పుట్టుక లేదు (16).

ఆ బ్రహ్మ భువనాత్ లోకాః పునరావర్తినః. ప్రాణులు నివసించే, బ్రహ్మలోకము వరకు గల లోకములు ప్రాణులను వెనుకకు పంపును. 'ఆ' అను ఉపసర్గకు 'వరకు' అని గాని, 'వరకు, దానితో సహా' అని గాని అర్థము. కాన 'ఆ బ్రహ్మ' యనగా బ్రహ్మలోకము వరకు అని గాని, బ్రహ్మలోకముతో సహా బ్రహ్మలోకము వరకు అని గాని అర్థము. ఈ సృష్టిలో పరమాత్మ కంటె భిన్నమైన లోకము ఏదైనా, దాని నుండి పునరావృత్తి తప్పదని భగవానుడీ ప్రకరణములో చెప్పుచున్నాడు. బ్రహ్మలోకమునకు సత్యలోకము, లేక కృతలోకము అని పేరు. దానితో సహా లోకము లన్నియూ సృష్టింపబడినవే. కాన, ఇచట 'ఆ' యనగా 'దానివరకు దానితో సహా' అని యర్థము.

ప్రాణులు నివసించు లోకమునకు భువనమని పేరు. ఈ శ్లోకములో బ్రహ్మ యనగా బ్రహ్మలోకములో నివసించే హిరణ్యగర్భుడు. మరోమాటలో చెప్పాలంటే, బ్రహ్మలోకముతో సహా లోకములన్నీ వినశ్వరములే. ఈ లోకము, మనము నిలబడియున్న నేల, మరియు ఈ స్థూలదేహము

అన్నియు నశిస్తూనే ఉన్నాయి. ఈ లోకము నశించిన తరువాత, ఆ వినాశమును దర్శించుటకు మనము మిగిలి ఉండే ప్రసక్తి లేదు. ఏలయన, ఈ దేహము ఈ లోకములో ఒక భాగమే గదా! ఇతర లోకముల లోనైననూ జీవుడు తన దేహము శాశ్వతకాలము నిలబెట్టుకొనే ప్రసక్తి లేదు. ఏ లోకమునకు వెళ్లిననూ పరిస్థితి ఇంతే. సర్వస్థూలదేహములు, మరియు అవి నివసించియున్న లోకములు వినాశాధీనములై యున్నవి. ఒకానొక కాలములో సర్వము తన కారణములో లీనమగును. మహాప్రలయములో సృష్టిలోని సర్వస్థానములు వినాశమును పొందును. ఒక్క స్థానమైననూ మిగిలియుండదు. కావున, ఓ అర్జునా! నీవు బ్రహ్మలోకమునకు గాని, ఇతర లోకములకు గాని వెళ్లగోరుచున్నచో, నీవు మరల వెనుకకు రావలసియుండును. ఏలయనగా, ఆ లోకములు వినశ్వరములు.

దీనికి ఒక అపవాదము సంభవమే. బ్రహ్మ లోకమునకు వెళ్లినవారు తిరిగి జన్మించకపోవచ్చునని శ్రుతి అభ్యనుజ్ఞను ఇచ్చియున్నది. వారు మరలి రాకపోవుటలో అచటికి వెళ్లుట హేతువు కాదు. వారచట బ్రహ్మగారి ఉపదేశమును పొంది, ఆత్మ పరమేశ్వరుడే యను సాక్షాత్కారమును పొందినచో విముక్తులగుదురు.

మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే. కాని, ఓ కౌంతేయా! నన్ను పొందిన వారికి పునర్జన్మ లేదు. పరమేశ్వరుడనగా ఏదో ఒక లోకములో నుండు వాడు కాడు గదా! అట్టి పరమేశ్వరుని చేరుట ఎట్లు? ఈ లోకములు సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుని కంటె వేరుగా లేవు. ఈ సృష్టి అంతయూ పరమేశ్వరుని నుండి ఉద్భవించినది. ఈ సమస్త సృష్టి యొక్క సత్యము పరమేశ్వరుడే. వారు సచ్చిదానంద ఆత్మను ఎరింగి ఆ పరమేశ్వరుని పొందెదరు. ఆత్మ సాక్షాత్కారమును పొంది తద్ద్వారా నన్ను పొందినవారికి పునర్జన్మ లేదు.

లోకములన్నియూ కాలాధీనములే. జీవులు వాటి నుండి వెనుకకు మరలి వచ్చెదరని చెప్పుటకు ఈ ఒక్క కారణము చాలును. జీవుడు అచట ఎంతకాలము ఉండును అను విషయము అప్రధానము. ఎంతకాలము ఉన్ననూ శాశ్వతము కాదు.

ఇచట రెండు ప్రశ్నలకు అవకాశము గలదు. నిశ్చితముగా జీవులు వెనుకకు మరలివచ్చునట్లు ఈ లోకములు ఉండుటకు కారణమేమి? అవి కాలాధీనములు గనుక. అవి కాలాధీనములు ఎట్లు అయినవి? ఈ విషయమును తరువాతి శ్లోకము వివరించును.

**అధ్యాయము 8, శ్లోకము 17:**

सहस्रयुगपर्यन्तमहर्य द्ब्रह्मणो विदुः ।
रात्रिं युगसहस्रान्तां तेऽहोरात्रविदो जनाः ॥ १७ ॥

సహస్ర యుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః
రాత్రిం యుగ సహస్రాంతాం తేహోరాత్రవిదో జనాః (17).

**బ్రహ్మణః** = బ్రహ్మగారి; **సహస్ర యుగ పర్యంతం** = వేయి మహాయుగముల అవధి గల; **యత్** = ఏ; **అహః** = పగలు గలదో; **యుగసహస్రాంతాం** = వేయి మహాయుగముల అవధి గల; **రాత్రిం** = రాత్రిని; **తే** = ఆ; **అహోరాత్ర విదః** = అహో రాత్రములనెరింగిన; **జనాః** = జనులు; **విదుః** = ఎరుంగుదురు.

బ్రహ్మగారి పగలు వేయి మహాయుగము లనియు, రాత్రి వేయి మహాయుగము లనియు అహోరాత్రముల నెరుంగు జనులు ఎరుంగుదురు (17).

బ్రహ్మ గారి అహోరాత్రముల గురించి యెరింగిన విద్వాంసులు బ్రహ్మగారి ఒక దినము వేయి యుగములకు సమానమని యెరుంగుదురు. ఇచట యుగమనగా మహాయుగము. కావున, బ్రహ్మగారి ఒక దినములో వేయి మహాయుగములు గడిచిపోవును.

ఒక మహాయుగములో సత్య త్రేతా ద్వాపర కలియుగములనే నాల్గుయుగములు ఉండును. కలియుగము 4,32,000 సంవత్సరములు. దానికి రెట్టింపు ద్వాపర యుగము. అనగా 8,64,000 సంవత్సరములు. త్రేతాయుగము కలికి మూడు రెట్లు. అనగా 12,96,000 సంవత్సరములు. సత్యయుగము కలికి నాల్గు రెట్లు. అనగా 17,28,000 సంవత్సరములు. ఈ నాల్గు యుగములు కలిసి ఒక మహాయుగము అగును. అనగా 43,20,000 సంవత్సరములు. ఇట్టి వేయి మహాయుగములు బ్రహ్మగారికి ఒక పగలు. అనగా 4,32,00,00,00,000 సంవత్సరములు. బ్రహ్మగారి రాత్రి ఆరంభము కాగానే, లోకము లన్నియూ నశించును. అనగా, 4,32,00,00,000 సంవత్సరముల తరువాత బ్రహ్మలోకము తక్క మిగిలిన సృష్టి అంతయూ నశించి రాత్రియగును. బ్రహ్మగారు నిద్రపోవును. మనము నిద్రపోగానే, మన ప్రపంచము లయమగును. అటులనే, బ్రహ్మగారు నిద్రపోగానే, బ్రహ్మలోకము తక్క మిగిలిన సృష్టి అంతయూ నశించుట యుక్తి యుక్తమే గదా! ఆ

ప్రళయము 4,32,00,00,000 సంవత్సరములు కొనసాగును. తరువాత సృష్టి మరల ఆరంభమగును.

బ్రహ్మగారి ఆయుర్దాయము వంద ఏళ్లు. ఆ తరువాత బ్రహ్మలోకము కూడా నశించును. బ్రహ్మగారిని ప్రమాణముగా స్వీకరించి కాలమును గణించు పండితులకు ఈ సమాచారమంతయూ జ్ఞాతము. ఈ ప్రసంగము యొక్క ఉద్దేశ్యమేమనగా, 4,32,00,00,000 సంవత్సరముల కాలమైననూ పరిగణించుటకు అనువైనదియే. ఈ లోకములన్నియూ ఈ తీరున కాలపరిచ్ఛిన్నములై ఉండుట వలన, వాటి నుండి జీవులు మరలి వచ్చుట నిశ్చయము. కావున, బ్రహ్మలోకముతో సహా ఏ పుణ్య లోకమును పొందిననూ, అది ఆత్యంతిక సుఖము నీయజాలదు.

ఇంత పెద్ద ఆయుర్దాయము కూడా కాలాధీనమే. కావున, స్వర్గము శాశ్వతము కాదు. ఏలయన, కాలములో శాశ్వతత్వము అనేది లేదు. అయినచో, శాశ్వతత్వమేది? వర్తమానము శాశ్వతము. అది కాలమునకు వశమై లేదు. మరియొక శాశ్వతవస్తువు లేదు. అదియే నిశ్చయముగా ఆత్మ. అదియే పరమేశ్వరుడు.

బ్రహ్మగారి పగలు ఆరంభమైనప్పుడు, మరియు రాత్రి ఆరంభమైనప్పుడు ఏమగును?

**అధ్యాయము 8, శ్లోకము 18:**

अव्यक्ता द्व्यक्तस्सर्वाः प्रभवन्त्यहरागमे ।
रात्र्यागमे प्रलीयन्ते तत्रैवाव्यक्त संज्ञके ॥ १८ ॥

అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే
రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్త సంజ్ఞకే (18).

అహరాగమే = (బ్రహ్మగారి) పగలు ఆరంభమైనప్పుడు; అవ్యక్తాత్ = అవ్యక్తము నుండి; సర్వాః = సమస్తమైన; వ్యక్తయః = వ్యక్తరూపములు; ప్రభవన్తి = పుట్టుచున్నవి; రాత్ర్యాగమే = (బ్రహ్మగారి) రాత్రి ఆరంభమైనప్పుడు; అవ్యక్త సంజ్ఞకే = అవ్యక్తమను పేరు గల; తత్ర ఏవ = దాని యందు మాత్రమే; ప్రలీయన్తే = లీనమగుచున్నవి.

బ్రహ్మగారి పగలు ఆరంభము కాగానే అవ్యక్తము నుండి సమస్త వ్యక్తరూపములు ఆవిర్భవించును. బ్రహ్మగారి రాత్రి ఆరంభము కాగానే అవ్యక్తమను పేరు గల, దాని యందు మాత్రమే లీనమగుచున్నవి (18).

అవ్యక్తాత్ వ్యక్తయస్సర్వాః ప్రభవంతి అహరాగమే. బ్రహ్మగారి పగలు ఆరంభము కాగానే అవ్యక్తము నుండి సర్వ వ్యక్తరూపములు బహిర్గతములగును. బ్రహ్మగారి నిద్రలో నుండి సర్వరూపములతో సూర్యచంద్ర నక్షత్రాదులు, సర్వచరాచర ప్రాణులు, జడములు, చేతనములు, ఇవి అన్నీ ఉండే స్థానములు బహిర్గతములగును. మనకు స్వప్నము గాని, జాగ్రత్ప్రపంచము గాని నిద్రలో నుండియే ఉద్బుద్ధమగును గదా! అటులనే, సర్వ సృష్టియూ బ్రహ్మగారి నిద్రలో నుండి ఉద్బుద్ధమగును.

ఆ బ్రహ్మగారు పరమేశ్వరుని కంటె వేరుగాదు. దీనిని బట్టి మనము ఇంకొక అడుగు ముందునకు వేయవచ్చును. సర్వము పరమేశ్వరుడే. బ్రహ్మగారైననూ పరమేశ్వర భిన్నమగు తత్త్వము కాదు. సృష్టి దృష్ట్యా మాత్రమే, సర్వము బ్రహ్మ గారి నుండి వచ్చినదని మనము చెప్తాము. బ్రహ్మగారు ఈశ్వరుని కంటె వేరు గాదు. కాన, సర్వము ఈశ్వరుని నుండియే పుట్టినది. ఇది ఎప్పుడు జరిగినది? పగలు ఆరంభమైనప్పుడు. మరోమాటలో చెప్పాలంటే, బ్రహ్మగారు నిద్రలేచినప్పుడు సృష్టి ఉద్బుద్ధమగును.

రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్ర ఏవ అవ్యక్త సంజ్ఞకే. అదే విధముగా 4,32,00,00,000 సంవత్సరముల తరువాత రాత్రి రాగానే (రాత్ర్యాగమే), విశిష్టరూపములతో వ్యక్తమైయున్న పదార్థము లన్నియూ లీనమగును (ప్రలీయన్తే). ఎచట? అవి కారణములో లీనమగును. అవ్యక్తమను పేరు గల స్థితియే (అవ్యక్త సంజ్ఞకే) కారణము. అదియే బ్రహ్మగారి నిద్ర. ప్రతిరాత్రి మన స్వీయజగత్తు నిద్రలో మన యందు లీనమగును. మరల ప్రతిదినము తెల్లవారగనే ఆ జగత్తు తిరిగి వచ్చును. సరిగా అదే తీరున, బ్రహ్మగారికి తెల్లవారినప్పుడు సృష్టి, రాత్రి అయినప్పుడు ప్రలయము. ఈ చక్రము 36,000 సార్లు తిరిగేసరికి, బ్రహ్మగారి ఆయుర్దాయము పూర్తియై, బ్రహ్మలోకముకూడ నశించి పరమేశ్వరుడు మాత్రమే మిగిలియుండును.

ఆ పరమేశ్వరుడు నేనే నని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. నీవు నన్ను చేరినచో, ఈ చక్రములో తగుల్కొనవు. మిగిలేది నేను ఒక్కడినే. ఈ సృష్టిలో నిత్యతత్త్వము నేను మాత్రమే. ఆ నేనే సచ్చిదానంద ఆత్మ.

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా

దీనిని బట్టి బ్రహ్మ సత్యమనియు, జగత్తు మిథ్య అనియు మనకు తెలియుచున్నది. భూత భవిష్యద్వర్త మానములనే కాలాంశములకు అధీనమై ఉండేది ఏదైనా మిథ్య అనబడును. భూతకాలములో దానికి ఉనికి లేదు. ఇప్పుడు ఉన్నది. లేదా, దానికి భూతకాలములో ఉనికి ఉండెడిది. ఇప్పుడు లేదు. లేదా, ఇప్పుడు అది లేదు గాని, భవిష్యత్తులో ఉండగలదు. సర్వలోకములు, వాటిలోని ప్రాణులు, మరియు వాటి అధీశ్వరులు ఈ మూడు కాలాంశములలో బాధితులగుదురు. వారందరు (నామరూప దృష్ట్యా) బ్రహ్మ కంటె భిన్నులు. అనగా, బ్రహ్మ వారందరిపై ఆధారపడి లేదు. మరియు, వారికి బ్రహ్మ కంటె భిన్నముగా స్వతంత్రమైన ఉనికి లేదు. దేని కంటె భిన్నముగా బ్రహ్మకు స్వతంత్రమైన ఉనికి గలదో, అది లోకమనబడును. ఈ లోకముల లోపల అనేక జీవులు గలరు. లోకాధినేతలు అగు దేవతలుకూడ ఈ జీవులలోని వారే. ఈ జీవులు కాలవశవర్తులై, మృత్యువునకు అధీనులై ఉందురు.

అట్లైనచో, సత్యము ఏది? ఈ మూడు కాలాంశములకు వశవర్తి కానిది. అది భూతములో నుండెడిది. ఇప్పుడు ఉన్నది. భవిష్యత్తులో ఉండగలదు. చైతన్య ఆత్మ ఒక్కటి మాత్రమే అట్టి సత్యము కాగల్గును. కాలమునకు కూడా అధిష్ఠానముగా నుండే సత్య ఆత్మ నిత్యము. శాశ్వతము, సత్తారూపము అగు తత్త్వము ఒకే ఒకటి గలదు. అదియే బ్రహ్మ. అదియే ఆత్మ. ఈ సృష్టి స్వభావతః దృశ్య వస్తువు గనుక, మిథ్య. దృశ్యము సర్వము మిథ్య. అది నష్టమగును. కాని ద్రష్ట కాలమును కూడ తన దర్శనములో విషయముగా చేయగల్గును గాన, సనాతనుడగు ద్రష్టయే కాలమునకు అధిష్ఠానమగుచున్నాడు. ఆ ద్రష్టయే ఆత్మ; బ్రహ్మ; కాలమునకు వశవర్తిగాని ఏకైక తత్త్వము.

అదియే నేను; అది మాత్రమే నిత్యము అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు: నన్ను పొందిన వారు పునర్జన్మను పొందరు (మాం ఉపేత్య పునర్జన్మ ...న విద్యతే, 8-15) అని భగవానుడిచట చెప్పుటలోని తాత్పర్యమిదియే.

ఆత్మను ఎరుంగుట అని గాక, నన్ను పొందుట అని భగవానుడు చెప్పుటకు కారణమేమి?

శ్రీకృష్ణ భగవానుడు ఉత్తమ పురుషైక వచనమును ప్రయోగించిన సందర్భములన్నింటిలో ఆయన తాత్పర్యము పరమాత్మయే గాని, చారిత్రక శ్రీకృష్ణుడు గాదు. అట్లైనచో, నీవు నన్ను పొందగనే జరామరణాదుల నుండి విముక్తుడవగుదువని ఆయన చెప్పుటకు కారణమేమి? అను

శంక కలుగును. తెలియవలసినది ఆత్మయైనచో, 'ఆత్మానం జ్ఞాత్వా' అని శ్రీకృష్ణ భగవానుడు ఏల చెప్పుట లేదు? ఆత్మ జ్ఞానము మాత్రమే చాలదు. ఆత్మ ఈశ్వరాభిన్నమని ఎరుంగవలెను. 'నన్ను ఎరింగి' అని చెప్పి శ్రీకృష్ణుడు జీవేశ్వరుల అభేదమును బోధించుచున్నాడు. ఈ అభేదమే ఉపదేశ సారము. ప్రత్యగాత్మ చైతన్యఘనము అనునది ఉపదేశము కాదు. ఆ ప్రత్యగాత్మకు పరమేశ్వరునకు భేదము లేదు అనునదే ఉపదేశము. ఇందువలననే, నన్ను పొందినచో నీవు విముక్తుడవగుదువు, అనగా నన్ను ఆత్మగా ఎరింగినచో నీవు విముక్తుడవగుదువని భగవానుడు పదే పదే చెప్పెను. ఇట్టి ఉపదేశము మాత్రమే తత్త్వమసి అను ఉపదేశమునకు సమానార్థకమగును. అట్లు గానిచో, అది కేవలము విశేషానుభవ రూపముగ నుండును. కొన్ని మనోవృత్తులను త్రోసిపుచ్చుట యందు ఉపదేశమునకు తాత్పర్యము లేదు. సర్వము నేనే యను జ్ఞానమే ఉపదేశసారము.

ఈ అభేదమును నిర్దేశించుటకై, నన్ను పొందిన ఈ జీవుడు పునర్జన్మను పొందడు (మాముపేత్య పునర్జన్మ ----నాప్నువన్తి) అని భగవానుడు చెప్పుచున్నాడు. 'నేను బ్రహ్మను' అని యెరింగిన జ్ఞాని తాను నిత్యుడనని యెరుంగును. ఆత్మను తెలియుట యనగా బ్రహ్మను తెలియుటయే. ఏలయన, ఆత్మ కంటె భిన్నముగా బ్రహ్మ అనేది లేదు. ఆత్మను నిత్య బ్రహ్మగా గుర్తించిన వారికి పునర్జన్మ లేదు.

బ్రహ్మలోకమును, ఇతర లోకములను పొందినవారు నిశ్చయముగా తిరిగివచ్చి మరల జన్మించెదరు. మరియు బ్రహ్మలోకమును పొందుటకు పడవలసిన శ్రమ అసాధారణము. జటిలమగు ఉపాసనలతో కూడిన విస్తారమగు కర్మలను చేయవలెను. బ్రహ్మలోకము సిద్ధించిననూ, బ్రహ్మగారిచే తత్త్వమసి ఉపదేశింపబడనిచో, ఆ జీవుడు మరల జన్మించును. ఈ ఉపదేశము లభించుటకు అధికపుణ్యమును చేసుకొని ఉండవలెను. బ్రహ్మలోకమును పొందిన వారందరికీ ఈ ఉపదేశమును పొందే అవకాశము లభించదు.

దీనికి భిన్నంగా బ్రహ్మ జీవుని స్వరూపమే గనుక, తేలికగా పొందవచ్చును. నేను ఇంత సులభుడనై యుండగా, నీవు నన్ను వీడి లోకముల కొరకు ఏల ప్రయాస పడుచుంటివి? ఇది ఇచట భగవానుని వివక్ష.

సృష్టి, మహాప్రలయము అను విషయములో ఆశంకలు

బ్రహ్మగారు ప్రతిదినము నిద్రపోవునరికి సమస్త స్థూల సూక్ష్మ దేహములతో గూడిన సర్వబ్రహ్మాండము లీనమగును. బ్రహ్మగారు నిద్ర లేవగనే మరల సృష్టి అంతయూ ఉద్బుద్ధమగునవి

భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు. దీనిని అర్థము చేసుకొనుటలో తలయెత్తుటకు అవకాశము గల మూడు ఆశంకలను శ్రీ శంకరులు లేవనెత్తినారు.

కృత విప్రణాశము. కర్మచే సృష్టింపబడినది సంపూర్ణముగా నశించుట.

సర్వలోకములలోని సర్వజీవులు బ్రహ్మగారిలో లీనమై వినష్టమైనారనుకొనుడు. వారు అజ్ఞానులు గదా! అసంఖ్యాకములగు జన్మలలో వారు అనంతకర్మలను ప్రోగుచేసుకొనియున్నారు. ఈ కర్మలన్నియూ కూడ వినష్టమగును. కాన వాటికి ఫలమునిచ్చే అవకాశము ఉండదు. బ్రహ్మగారు నిద్రలోనికి జారుకోగానే ఈ జీవుల సమస్త కర్మలు ఫలము నీయకుండగనే బ్రహ్మగారిలో లీనమై వినష్టమగును గదా! అనగా, ఇంతకు ముందు కర్మచే సృష్టింపబడినది ఇపుడు పూర్ణముగా నష్టమగుచున్నది గదా! ఇది యుక్తి యుక్తముగా లేదు గనుక దోషము.

అకృత-అభ్యాగమము. కర్మచే సృష్టింపబడనిది ఉనికిని పొందుట

బ్రహ్మగారు నిద్రలేచిన ప్రతిసారి క్రొత్త జీవులను సృష్టించును. కాని ఇపుడీ నూతన జీవులకు సంచితకర్మ లేమియూ లేవు. అనగా భగవానుడు విభిన్న జీవులను తన వినోదము కొరకు సృష్టించినాడని గాని, లేక ప్రయోజనరహితముగా సృష్టించినాడని గాని చెప్పవలయును. అనగా సృష్టికి ఒక హేతువు గాని, క్రమబద్ధత గాని లేకుండవలయును. కర్మచే సృష్టింపబడనిది ఉనికిని పొందుట అనే ఈ స్థితి యుక్తి యుక్తము కానేరదు. ఇది రెండవ దోషము.

శాస్త్రము వ్యర్థమగును

ఇక మూడవ దోషము ఇట్లున్నది. కొన్ని కర్మలను విధిస్తూ, మరికొన్నింటిని నిషేధించే విధి నిషేధ శాస్త్రమొకటి గలదు. నిషిద్ధ కర్మల నాచరించువాడు పాపమును పొందును. విహిత కర్మల నాచరించువాడు పుణ్యమును పొందును. ఈ విధముగా కర్మలను చేస్తూ ఉండే జీవునకు బంధము తప్పదనియు, సత్యము నెరింగినవాడు విముక్తు డగుననియు బోధించే బంధమోక్ష శాస్త్రము కూడ గలదు.

ప్రలయములో జీవులు పూర్తిగా అదృశ్యమయ్యే పక్షంలో వారు తాము చేసిన వివిధములైన మంచి చెడు కర్మల ఫలమును అనుభవించరు. వారీ విధముగా జ్ఞానము లేశమైననూ లేకుండగనే మోక్షమును పొందెదరు. కావున, విధి నిషేధ శాస్త్రము, మరియు మోక్ష శాస్త్రము కూడ

నిరర్థకములగును. కావున, జీవుడు మోక్షమును పొందుటకై కల్పాంతము వరకు వేచియుండిన చాలును. ఇది రాజు అపరాధులకు సర్వులకు ఇచ్చే క్షమాదానము వంటిది అగును. జీవుడు చిరకాలము వేచియుండిన చాలును. మోక్షము లభించును. జీవుడు సంసారములో జీవిస్తూ ఉంటే చాలును. సర్వము ఒకనాడు నశించిపోయేదే గదా! మోక్షము దానంతట అదియే లభించును. మనము బ్రహ్మగారి రాత్రి కొరకు వేచియుండిన చాలును. సర్వము లయమగును గదా! తరువాతి శ్లోకము ఈ ఆశంకను కూడా తొలగించును.

## సృష్టి లయ చక్రములో జీవుని నిస్సహాయత

తరువాతి శ్లోకములో భగవానుడు జీవుని నిస్సహాయతను వర్ణించుచున్నాడు. జీవుడు ఈ సృష్టి లయ చక్రములో తగుల్కొని యున్నాడు. కర్మకు మూలములో పంచవిధ క్లేశములు గలవు. అవి: అవిద్య (అజ్ఞానము), అస్మిత (అహంకారము), రాగద్వేషములు (ఇష్టానిష్టములు) , మరియు అభినివేశము (అశాశ్వతమైన దానిని శాశ్వతమని భ్రమపడి ఆసక్తిని పెంచుకొనుట). వ్యక్తి కర్మను చేయుటకు కారణమేమి? ఒక వస్తువుపై ప్రేమతో గాని, ఒక వస్తువుపై తన్మయతతో (అభినివేశము) గాని మానవుడు కర్మను చేయును. ఉదాహరణకు స్వర్గమును పొందినచో మోక్షము లభించు నను భ్రాంతి కొందరికి గలదు. లేదా ఒక వస్తువును పొందినచో ఒక లక్ష్యము నెరవేరి తన పరిస్థితి మెరుగు పడగలదని భావించి మానవుడు కర్మను చేయును. ఇదే విధముగా రాగద్వేషములు కర్మకు మూలమగును. మరియు, కర్మను చేయుటకు ఒక కర్త (అస్మిత) ఉండవలయును. ఇవి అన్నియూ అవిద్యా జనితములు. ఇవి అయిదు కలిసి సర్వకర్మలకు మూలమగును. ఈ అయిదు క్లేశములు జీవుని మనస్సు నందు ఉండును గాన, జీవుడు కర్మకు ఆశ్రయము అగుచున్నాడు. జీవుడు ఈ కర్మ యొక్క బలముచే, తనకు ఇష్టము ఉన్నా లేకపోయినా, కర్మలను చేయునట్లు ప్రేరితుడగుచున్నాడు.

**అధ్యాయము 8, శ్లోకము 19:**

भूतग्रामस्स एवायं भूत्वा भूत्वा प्रलीयते ।
रात्र्यागमेऽवशः पार्थ प्रभवत्यहरागमे ॥ १९ ॥

భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే
రాత్ర్యాగమేవశః పార్థ ప్రభవత్యహరాగమే (19)

ఏ ఏవ = అదియే; అయం = ఈ; భూతగ్రామః = ప్రాణి సమూహము; భూత్వా భూత్వా = అనేక పర్యాయములు జన్మించి; రాత్ర్యాగమే = రాత్రి రాగానే; అవశః = తప్పనిసరిగా; ప్రలీయతే = లీనమగును; పార్థ = ఓ అర్జునా!; అహరాగమే = పగలు కాగానే; ప్రభవతి = ఉదయించును.

ఈ ప్రాణి సమూహము అదియే. ఇది అనేక పర్యాయములు జన్మించుచుండును. అర్జునా! బ్రహ్మగారికి రాత్రిపడగానే, ఈ ప్రాణి సమూహము విలీనమై, మరల పగలు కాగానే ఉదయించును (19).

జీవుడు వ్యక్తిగత ఇచ్ఛాశక్తితో సంబంధములేకుండా కర్మనియతిచే మరల మరల పుట్టుచుండును. బ్రహ్మగారికి పగలు వచ్చినప్పుడల్లా సమస్త ప్రాణులు ఉదయించును. కొంతకాలము ఉన్న తరువాత, మరల ఆ జీవులు లయమగును.

భూతగ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే. భూతగ్రామమనగా సర్వ చరాచర ప్రాణి సముదాయము. సః అయమ్ అను రెండు పదములు కలిసి 'పూర్వము ఏది గలదో, అదియే మరల ఇప్పుడు ప్రస్తావింపబడుచున్నది' అను అర్థము వచ్చును. పూర్వకల్పము నందు ఏ ప్రాణి సముదాయము ప్రలయములో లీనమైనదో, అదియే సముదాయము ప్రస్తావింపబడుచున్నది. అనగా ప్రలయము వాస్తవమగు వినాశము కాదనియు, అవ్యక్త స్థితి మాత్రమేననియు తేలినది. అదే జీవసముదాయము మరల ఉద్భవించునని అయమ్ అను శబ్దము సూచించుచున్నది. బ్రహ్మగారి గడచిన దినములోని కల్పము నందు ఉండిన జీవ సముదాయమే తరువాతి కల్పములో తిరిగి వచ్చును. ఈ కల్పములు చక్రాకారముగా వచ్చుచుండుననియు, ప్రలయములోనికి వెళ్లిపోయిన జీవసముదాయమే సృష్టిలోనికి మరల వచ్చుననియు 'భూత్వా భూత్వా' అను ఆవృత్తిచే సూచింపబడినది.

అవ్యక్త స్థితిని పొందిన జీవులే స్వీయకర్మ ఫల పరిపూర్తి కొరకై తిరిగి వచ్చెదరు గాన, జీవులు చేసుకున్న కర్మలకు కూడా వినాశము లేదు. జీవులు కొత్తగా సృష్టింపబడుట లేదు. పాతజీవులే మరలి వచ్చుచున్నారు. పైన చెప్పిన రెండు యుక్తి దోషములను ఈ శ్లోకము త్రోసిపుచ్చినది.

ముక్త జీవులు దీనికి అపవాదము. వారికి జీవరూపముగా ఉనికి లేదు. ఉన్నది కేవల పరబ్రహ్మ మాత్రమే. ప్రలయములోనికి వెళ్లినవారు మాత్రమే మరలి వచ్చెదరు.

వారు ప్రలయములో లీనమగుటకు కారణమేమి?

రాత్ర్యాగమే అవశః. బ్రహ్మగారి రాత్రి వచ్చినప్పుడు, వారు తప్పనిసరిగా లీనమగుదురు. 'అవశః' అనగా దీని విషయములో వారి ఇష్టానిష్టముల ప్రమేయము లేశమైననూ లేదు. వారు బలాత్కారముగా ప్రలయములోనికి నెట్టివేయబడుదురు.

పార్థ ప్రభవత్యహరాగమే. ఓ పార్థా! బ్రహ్మగారి పగలు ఆరంభము కాగానే ఈ ప్రాణి జాతమంతయూ మరల జన్మించును. జీవుల సంఖ్య అనంతము. వారి కర్మలు అసంఖ్యాకములు. కావున, వారు ఏ రూపములో నైననూ జన్మించవచ్చును. ఒకప్పుడు భూమిపై జంతువులు అధికముగనూ, మానవులు తక్కువగను ఉందురు. మరియొకప్పుడు మానవులు అధికమై, జంతువుల సంఖ్య అల్పము కావచ్చును. సృష్టి ప్రక్రియ యొక్క స్వభావము అట్లుండును. కాని ఈ ప్రాణులన్నియూ ఈ విశాలసృష్టిలో ఎక్కడో ఒకచోట ఉండును. కాలక్రమములో ప్రాణులన్నియూ జన్మించును.

మహావిస్ఫోటన (Big Bang) సిద్ధాంతము, సృష్టి పరిణామమును వివరించే జైవ సిద్ధాంతములు ఈ వర్ణనకు అనురూపముగా నుండును. ఏలయన, ఇవి క్రమముగా వికసించే సృష్టి ప్రక్రియను వర్ణించును. ఒకే క్షణములో సర్వము సృష్టింపబడుననే వాదమును మనము అంగీకరించము. సృష్టి ఒక ప్రక్రియ అని మనము స్వీకరిస్తాము. ముందుగా మౌలికవ్యవస్థ సృజింపబడును. తరువాత సర్వము, ఆ వ్యవస్థలో కొనసాగే ఒక ప్రక్రియలో భాగముగా సృష్టింపబడును. అందువలననే, ప్రాణులు మరల మరల పుట్టుచుండునని ఈ శ్లోకము వర్ణించినది.

మనము సంసారము నందు వైరాగ్యమును పెంపొందించుకొనుటలో తోడ్పడుట కొరకై భగవానుడీ విషయమును స్పష్టముగా వివరించినాడు. సంసారములో భాగముగా ఉంటూ సంసారము అనే సమస్యను పరిష్కరించుట సంభవము కాదు. సంసారమనగా ఒకటి తరువాత మరియొకటిగా జన్మను పొందుచుండుట. మరియు ప్రతిజన్మలో సుఖదుఃఖములు, ఉత్థాన పతనములు తప్పవు. సంసారమనగా నిదియే. ఇది పునః పునః ఆవృత్తమగుచుండును. నిరంతరంగా జన్మించి మరణిస్తూ, మధ్యలో జీవిస్తూ ఉంటే, కల్పము ఒకనాడు అంతమై మోక్షము లభించుననే భ్రాంతి ఉండరాదు. ఇట్టి సర్వ క్షమాదానము (amnesty) ఏదీ లేదు. కల్పాంతము నిద్ర వంటిది. మరునాడు ఉదయము బ్రహ్మగారు నిద్రలేవగానే, జీవులు మరల జన్మిస్తారు. ఈ స్థితిలో మోక్షశాస్త్రము ఆవశ్యకమగును.

విధినిషేధ శాస్త్రము కూడా సార్థకమగును. మానవుడు పుణ్యపాపములను సుఖదుఃఖరూపములో అనుభవించి ఋణమును తీర్చుకొనవలయును. పాపములను నెట్టుకు రావాలి. పుణ్యములను ఆనందంతో అనుభవించాలి. ఏవో కొన్ని కర్మలను ప్రభావ హీనము చేయవచ్చును. కాని అన్నింటినీ త్రోసివుచ్చుట అసంభవము. ఏలయన, కర్మకు దాని ఫలమునకు మధ్య ఉల్లంఘింప శక్యము కాని కారణ కార్య సంబంధము గలదు. ఇందువలననే కర్మఫలమునకు ఋతం, సత్యమ్ అని పేర్లు. కర్మఫలము మరియొక కల్పము వరకైననూ వేచియుండగలదు. కాని ఇప్పుడు గాకపోతే తరువాతైనా, ఇక్కడ గాని మరియొకచోట గాని, ఏదో ఒక రూపములో జీవుడు కర్మఫలమును అనుభవింపవలసినదే. బ్రహ్మగారు నిద్రలేవగానే, సూక్ష్మ దేహములన్నియూ ఏదో ఒక రూపమును ధరించి తమ తమ పుణ్యపాపములను అనుభవించును. దీనిని బట్టి విధి శాస్త్ర నిషేధ శాస్త్రములు రెండు సార్థకమగును. ఇది అంతయూ సంసారాంతర్గతమే. అపుడు బంధమోక్ష శాస్త్రము కూడ సార్థకమగును. జ్ఞానము వలన మోక్షము లభించును (జ్ఞానాత్ మోక్షః).

జీవులు ప్రలయములో వినష్టులు గారనియు, వారు ప్రలయములో కూడ ఉనికిని కల్గియుండి, తరువాత మరల జన్మించెదరనియు మనకీ శ్లోకము బోధించుచున్నది. భగవానుడు పూర్వములో చెప్పిన ఉపదేశమునకు ఉపోద్ఘాతముగా ఈ విషయమును చెప్పుచున్నాడు. నన్ను చేరుకొనుట తప్ప సంసార విముక్తికి మరియొక మార్గము లేదని భగవానుడు పూర్వము చెప్పియున్నాడు (8-15, 16). ఇచట పొందుట యనగా ఆత్మ పరమేశ్వరా భిన్నమనే అభేదమును గుర్తించుటయే. నిత్య వస్తువు ఆత్మ ఒక్కటియే.

**ఓంకారమునకు అర్థము**

ఓంకారోపాసన బ్రహ్మ ప్రాప్తి సాధనము అను విషయమును మనము ఈ అధ్యాయములోని 13, 14 శ్లోకములలో చూచియున్నాము. ఓమ్ బ్రహ్మకు నామము కూడ అగును. అప్పుడు అది జ్ఞానములో విషయము అగును. దానిని ఎరింగిన జ్ఞాని ముక్తుడు అగును. లేదా, దానిని పరమేశ్వరుని ప్రతీకగా స్వీకరించి ధ్యానించవచ్చును. అట్టి ఉపాసనను చేసిన సాధకుడు బ్రహ్మలోకమును పొందును. అతడచట బ్రహ్మజ్ఞానమును పొందవచ్చును.

ఓంకారము వాచకమైనచో, వాచ్యము ఏది? ఓంకారము సారరూపముగా ప్రదర్శించే తత్త్వమేది? ఈ విషయము తరువాతి మూడు శ్లోకములలో వివరింపబడినది.

ఇచట పునరుక్తి ఉనట్లు కనృట్టును. అందువలననే శ్రీ శంకరులు అవతారికలో శ్లోకముల ఉపక్రమమును ఇట్లు వివరించినారు: అక్షరం బ్రహ్మ అని వర్ణింపబడిన (8-13 ఓంకారము యొక్క అర్థమును ప్రదర్శించు కోరికతో భగవానుడీ శ్లోకములను బోధించినాడు. అక్షర బ్రహ్మకు ప్రతీకగా ఉండే ఓంకారము యొక్క యథార్థ స్వరూపము ఏమి? అర్థము ఏమి? ఓంకారము వాచకము (పేరు)గా గల ఆ బ్రహ్మ యొక్క స్వరూపమెట్టిది? ఈ విషయము నెరింగిన జ్ఞాని బ్రహ్మమును, అనగా మోక్షమును పొందును. తరువాతి మూడు శ్లోకముల ప్రయోజనము ఇదియే.

**అధ్యాయము 8, శ్లోకము 20:**

परस्तस्मात्तु भावोऽन्योऽव्यक्तोऽव्यक्तात्सनातनः ।
यस्स सर्वेषु भूतेषु नश्यत्सु न विनश्यति ॥ २० ॥

పరస్తస్మాత్తు భావో న్యో వ్యక్తో వ్యక్తా త్సనాతనః
యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి (20)

**తు** = కాని; **తస్మాత్** = ఆ; **అవ్యక్తాత్** = అవ్యక్తము కంటె; **పరః** = ఉత్కృష్టమైన; **అన్యః** = మరియొక; **అవ్యక్తః** = అవ్యక్తము; **భావః** = ఉనికి; **సనాతనః** = శాశ్వతతత్త్వము; **యః** = ఏది గలదో; **సః** = అది; **సర్వేషు** = సమస్తములైన; **భూతేషు** = ప్రాణులు; **నశ్యత్సు** = నశించినను; **న వినశ్యతి** = నశించదు.

కాని ఆ అవ్యక్తము కంటె ఉత్కృష్టమైనది, సత్తారూపమైనది, శాశ్వతమైనది అగు మరియొక అవ్యక్తము గలదు. సర్వప్రాణులు నశించినను అది నశించదు (20).

సర్వ సృష్టి అవ్యక్త స్థితికి చేరి, మరల ఆ అవ్యక్తము నుండి సర్వము ఉదయించునని భగవానుడు పూర్వశ్లోకములో చెప్పియున్నాడు. ఈ విషయమును స్పష్టముగా నెరుంగవలెను. 'జీవుడు అనిత్యుడు' అని చెప్పుట 'ఘటము అనిత్యము' అని చెప్పుట వంటిది గాదు. నామరూప ఘటము అనిత్యమే అయినా, ఘటదృష్ట్యా తత్కారణమగు మృత్తు అనిత్యము కాదు. ఘటరూపము నశించినను, తత్కారణము నశించదు. అదే విధముగా, 'జీవుడు అనిత్యము' అన్నప్పుడు, నామరూపాత్మకమగు ఉపాధి మాత్రమే అనిత్యము. స్థూలదేహము నశించినను, సూక్ష్మ దేహము

మిగిలియుండును. ప్రలయములో అది కూడా నశించి, కారణదేహము మాత్రమే మిగిలియుండును. ఆ కారణ దేహము కూడా పరబ్రహ్మాపేక్షచే అనిత్యమే.

ఆత్మ వస్తువు మాత్రమే నిత్యము. 'నేను జీవుడను' అన్నప్పుడు, ఆ 'నేను' వాస్తవంలో ఆత్మయే. 'ఇది ఘటము' అన్నప్పుడు, అచట మట్టి, మరియు నామరూపాత్మకమగు ఘటము ఉన్నవి గదా! అటులనే, 'నేను జీవుడను' అని నీవు అన్నప్పుడు, ఆత్మ, మరియు వ్యక్తిత్వము (జీవత్వము) గలవు. జీవత్వము ఆత్మ యందు అజ్ఞానముచే చేయబడిన అధ్యారోపము మాత్రమే. 'నేను జీవుడను' అన్నప్పుడు ఆత్మయే జీవుడనే భ్రాంతి కలిగినది. యథార్థమగు ఆత్మ యందు జీవత్వము ఆరోపింపబడినది గాన, ఆ జీవత్వము మిథ్య. జీవునిలోని జీవత్వము మాత్రమే అనిత్యము. జీవస్వరూపము నిత్యమే.

ఈ వివేకము లేనిచో వస్తువును అవస్తువుతో కలిపివేసే సమస్య (సత్యానృత మిథునీకరణము) ఉదయించును. కాన మనమీ విషయమును స్పష్టముగా తెలుసుకోవాలి. ఈ ద్వంద్వము పరిస్థితులన్నిటిలో గలదు. అవస్తువు యొక్క ఉనికి వస్తువుపై ఆధారపడి ఉండును గాన, వస్తువు మాత్రమే సత్యము అగును. అవస్తువు యొక్క సత్త, వస్తు సత్త కంటె వేరుగా లేదు గాన, అవస్తువు వస్తు భిన్నమగు వస్తువు కాజాలదు. కావున, ఉన్నది వస్తువు మాత్రమే. ఈ సర్వజగత్తు పరంబ్రహ్మ కంటె వేరుగాదు. నీవు చూచే సర్వము, ద్రష్ట మరియు దర్శనము వస్తువు తక్క వేరు గాదు. ఈ విషయము స్పష్టమైనచో, ప్రలయ కాలము నందు జీవులు అవ్యక్తోపాధి యందు లయమగుట కూడ స్పష్టమగును. ఈ అవ్యక్తోపాధికి అజ్ఞానోపాధి అని మరోపేరు గలదు.

బ్రహ్మగారు నిద్రపోవుట యనగా ఆయన తన సర్వజ్ఞత్వమును ఎరుంగని ఒక విశిష్ట అవస్థను పొందినాడని అర్థము. ఆ అవస్థకే అవ్యక్త అవస్థ యని పేరు.

పరః తస్మాత్ తు భావః అన్యః అవ్యక్తః అవ్యక్తాత్ సనాతనః. ఆ అవ్యక్తము కంటె విలక్షణమైన, ఉత్కృష్టమైన మరియొక అవ్యక్తము గలదు. అది సనాతనము. కఠోపనిషత్తులో (1-3-11) భగవానుని ఇతర కారణము'లన్నింటి కంటె విలక్షణముగా వర్ణించే 'పరాత్పరః' అను ప్రయోగము గలదు. ఇచటి 'తస్మాత్ పరః' దానిని పోలియున్నది.

మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః (1-3-11).

మహత్తు కంటె అవ్యక్తము ఉత్కృష్టమైనది. పురుషుడు, అవ్యక్తము కంటె ఉత్కృష్టమైనవాడు. పురుషుని కంటె అధికమైనది మరియొకటి లేదు. ఈ క్రమము పురుషునితో అంతమగును. పురుషుడు చరమ లక్ష్యము.

మనము సర్వదా సంసారాంతర్గతముగా నుండే లక్ష్యముల కొరకు యత్నిస్తాము. కాని ఇచట పురుషుడు పొందదగిన చరమలక్ష్యముగా వర్ణింపబడినాడు. పురుషుడు నా కంటె వేరుగాదు. నేను (ఆత్మ) సర్వమునకు చరమ సీమ. మనము పొందగలిగే చరమలక్ష్యము ఆత్మయే గదా! ఆ పురుషుడే పరమేశ్వరుడు. ఆ పురుషుడే ఆత్మ. ఈ ఎరుకయే అంతిమలక్ష్యము. మోక్షస్వరూపము ఈ ఎరుకయే.

మోక్షస్వరూపమును అనేక విధములుగా వర్ణించెదరు. బంధ విముక్తి, ఆత్మ విషయక అజ్ఞానము నుండి విముక్తి, సంసారము నుండి విముక్తి, విష్ణుపదమును చేరుట (అనగా ఒక స్థానమును చేరుట గాదు; నేను ఈశ్వరా భిన్నుడను అని గుర్తించుట), ఆనందమును పొందుట ఇత్యాదులు మోక్షమును వర్ణించే ప్రయోగములలో కొన్ని మాత్రమే.

వీటన్నింటిలో, 'పురుషుని పొందుట' అనేది చాల అందమైన ప్రయోగము. నేను సదా పురుషుడనై ఉండి, ఆ సంగతి నాకు తెలియునప్పుడు మాత్రమే ఈ మోక్షము సంభవమగును. అట్టి స్థితిలో నేను జ్ఞానముచే పురుషుని పొందగలను. పురుషుడు అగుట యనగా పురుషుడనని తెలియుటయే. ఇందువలననే బ్రహ్మను ఎరిగినవాడు బ్రహ్మ యగును (బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి) అని వర్ణింపబడినది.

వేదాంతము యొక్క వైలక్షణ్యమేమనగా, మోక్షవర్ణనయే వస్తు వర్ణన యగును. ఈ మోక్ష ఫలమును బంధ విముక్తి, ఆనందప్రాప్తి ఇత్యాది విభిన్న రీతులలో వర్ణించుట వలన కొందరు భ్రాంతికి లోనగుదురు. ఆనందమనగా ఒక విశిష్ట అసాధారణ సుఖానుభవమని భావించినచో, వ్యక్తి ఆ సుఖము వెంటపడును. సంసారములోని ఇతర వస్తువుల వలె, మోక్షము కూడ అన్వేషించి సాధింపదగిన అవస్థ యగును. కాని మోక్షరూపమగు ఆనందప్రాప్తి స్వరూపప్రాప్తి కంటె వేరు గాదు. ఇది అనుభవజన్యమగు ఆనందము కానే కాదు. ఇది ఆనందానుభవము లన్నింటి సారము. దీనిని గుర్తించుటయే ఆనందప్రాప్తి యనబడును.

## 'తు' అను పదము యొక్క ప్రాముఖ్యము

తస్మాత్ తు పరః. రెండు విభిన్న అంశములను వేరు చేసి చూపించుటకై 'తు' అను పదము తరచుగా ప్రయోగింపబడుచుండను. దానికి అనువాదమును, 'కాని', 'తద్భిన్నముగా', 'కానైతే' ఇత్యాదిగా చేయవచ్చును. ఈ పదము నూతన ప్రకరణమును అవతరింపజేయును. ఇంతవరకు చెప్పిన దానికి రాబోవు అంశము విలక్షణము సుమా! అను విషయమును ఈ పదము సూచించును. ఇచట పరవస్తువును ఇతరము సర్వము నుండియు వ్యావృత్తము (distinguish) చేయుటకై 'తు' ప్రయోగింపబడినది. ఇతరము సర్వము అవ్యక్తములో అంతర్గతమగును. కాని దాని కంటె గొప్పది మరియొకటి గలదు (తస్మాత్ తు పరః). రాబోవు వస్తువు యొక్క ప్రత్యేకతను 'తు' సూచించును. అట్టి వస్తువు మరియొకటి లేదు సుమా!

సర్వ వ్యక్త పదార్థములకు కారణము అవ్యక్తమే అయినా, అది చరమ కారణము కాదు. అది కూడా మరియొక ఉపాధి మాత్రమే. అవ్యక్తము యొక్క అధిష్ఠానము యథార్థ కారణమగును. అదియే బ్రహ్మ.

సర్వ జగత్తును తత్కారణమగు అవ్యక్తములో అంతర్లీనము చేసినాము. పురుషుడు అట్టి అవ్యక్తము కంటె కూడా అతీతుడు. అట్లైనచో అట్టి పురుషతత్త్వము శూన్యమగునేమో యను శంక కలుగుట సహజమే. దీనికి ఒక దృష్టాంతమును చెప్పవచ్చును. భూగోళము యొక్క ఉత్తర ధ్రువమునకు ఉత్తరముగా నేమున్నది? ఉత్తర ధ్రువముపై మనము నిలబడినచో, దానికి ఉత్తరముగా ఏమీ లేదు.

భావః. ఆ తత్త్వము శూన్యము కాదని నొక్కి చెప్పుటకై భగవానుడు భావః (ఉన్నది) అను పదమును ప్రయోగించినాడు. అది సర్వదా ఉన్నది. ఉనికి అక్షర పరబ్రహ్మము యొక్క స్వరూపము. దాని యందు అభావము లేదు. దాని యందు మార్పులు ఏమీలేవు. అవ్యక్తము కంటె విలక్షణమైనది, సద్ఘనము అగు తత్త్వమే పరం బ్రహ్మ.

## సాలక్షణ్య నిరాకరణము

అన్యః. సాలక్షణ్యమనగా అదే సముదాయమునకు చెందిన ఒక వ్యక్తిగా నుండుట. ఒక వస్తువు ఇతర వస్తువుల కంటె భిన్నముగా ఉంటూనే, ఇతర వస్తువులతో బాటు ఒకే సముదాయమునకు చెంది యుండవచ్చును. దీనికే సాలక్షణ్యము (ఒకే లక్షణమును కలిగియుండుట)

అని పేరు. ఉదాహరణకు, కుర్చీ, మేజా, సోఫా ఇత్యాదులన్నీ గృహోపకరణము అను సమాన లక్షణమును కలిగియున్నవి. అవి అన్నీ ఒకే తరగతికి చెందును. అదే విధముగా, బ్రహ్మ అవ్యక్తము కంటె భిన్నమైనది (అవ్యక్తాత్ పరః) అని అన్నాము. ఈ జగత్తులో అనేక వస్తువులు గలవు. బ్రహ్మ కూడా వాటిలో ఒకటి కావచ్చును. ఇతరము సర్వము కంటె భిన్నముగా నుండవచ్చును. కాని, పరిస్థితి అది కాదు. బ్రహ్మ ఇతరము సర్వము కంటె భిన్నమే అయినా, బ్రహ్మ కంటె భిన్నముగా ఏదీ లేదు. బ్రహ్మ అనేక వస్తువులలో ఒకటి కాదు. ఇతర వస్తువుల వంటి వస్తువు కాదు. కావున, బ్రహ్మ విషయములో సాలక్షణ్యము యొక్క సంభావనయైననూ త్రోసిపుచ్చబడును. బ్రహ్మను ఏ సముదాయములోనైననూ, లోకముల సముదాయములో గాని, దేవతల సముదాయములో గాని, ఇతరములో గాని దేనిలోనైననూ జమకట్టుట సంభవము కాదు. ఈ విషయమును చూపుటకై భగవానుడు అన్యశబ్దము (ఇతరము, భిన్నము)ను ప్రయోగించెను. కాని, ఈ భేదము మనము లోకములో సామాన్యముగా తెలుసుకునే భేదము వంటిది కాదు. బ్రహ్మ శూన్యము కాదు. క్షణికము కాదు. అది ఉన్నది. కాని ఇతరము సర్వము కంటె విలక్షణముగా నున్నది. అది యేది?

అవ్యక్తః. అది ఇంద్రియగోచరము కాదు. భగవానుడు భావశబ్దమును ప్రయోగించినాడు గాన, అది ఒక దృశ్యవస్తువు అనిపించవచ్చును. కాని, అది దృశ్యవస్తువు కాదని అవ్యక్త శబ్దము స్పష్టము చేయుచున్నది. సర్వ జ్ఞానేంద్రియ వ్యాపారములకు హేతువు అదియే. కావున, అది శబ్దరూప వర్ణాదుల వలె ఇంద్రియగోచరము కాదు. అట్లైనచో, దానిని తెలియుట యెట్లు?

అది మనస్సు యొక్క సారభూతము గనుక, మనస్సులో ప్రకటమగును. మనస్సులో గుర్తింపబడును. అది జ్ఞానేంద్రియములలో కూడ ప్రకటమగుచున్నది. అది శ్రోత్రమునకు శ్రోత్రము, కన్నుకి కన్ను. అనగా చూపునకు గోచరమయ్యే వస్తువు కాదు. దేని ప్రభావము వలన కన్ను చూచునో, చెవి వినునో, ఘ్రాణము అఘ్రాణించునో, అదియే పరబ్రహ్మము. అది జ్ఞానేంద్రియగోచరము కాకపోయినా, సర్వజ్ఞానేంద్రియములకు మరియు మనస్సునకు కూడ సత్యాధిష్ఠానమై సర్వకాలములలో భాసించుచునే యుండును. అదియే నీవు. మరియు, అది సర్వప్రాణులకు బీజము; లోక ప్రసిద్ధమైన అవ్యక్తము (ప్రకృతి)నకు మూలాధిష్ఠానమైన అవ్యక్తము.

సనాతనః అనగా సదా ఉండునది. అది కారణ కార్యములకు అతీతమై ఉండును. అది కాలాధీనముగ నుండదు. అది భూతకాలములో ఉండెడిది. ఇప్పుడు ఉన్నది. భవిష్యత్తులో ఉండగలదు. అది కాలాతీతము. మనము లోకవ్యవహారములో అతీతము అను శబ్దమును ప్రయోగించిననూ,

వాస్తవముగా అతీతముగా ఏదీ లేదు. మనము పొందగలిగేది మాత్రమే గాక, మన ఊహకు గోచరమయ్యేది కూడా అవ్యక్తములో అంతర్భాగమగును. అనగా, అది ద్రష్ట యొక్క మూలస్వరూపమై (దృక్ స్వరూపము) యున్నది. అదియే పరం బ్రహ్మ.

బ్రహ్మలోకాదులన్నియూ మన జ్ఞానములో అంతర్భాగములై కాలమునకు, దేశమునకు అధీనములై యున్నవి. ఈ దేశము (ఆకాశము) అవ్యక్తము నుండి ఆవిర్భవించినది. దాని కంటె అతీతముగా ఆత్మ గలదు. ఆత్మ సర్వప్రాణులలో 'నేను' రూపములో శుద్ధ చైతన్యరూపములో ప్రత్యక్షముగా ఉపలభ్యమగుచున్నది. 'నేను' యొక్క సారభూతమైన సత్యము అదియే.

యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి. వినాశి రూపము లన్నింటిలో ఉంటూ తాను ఎన్నటికీ నశించనిది నిశ్చయముగా ఆత్మ మాత్రమే.

**అధ్యాయము 8, శ్లోకము 21:**

अव्यक्तोऽक्षर इत्युक्तस्तमाहुः परमां गतिम् ।
यं प्राप्य न निवर्तन्ते तद्धाम परमं मम ॥ २१ ॥

అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్
యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ (21)

**అవ్యక్తః** = అవ్యక్తము; **అక్షరః** = వినాశము లేనిది; **ఇతి** = అని; **ఉక్తః** = చెప్పబడినది; **తం** = దానిని; **పరమాం** = సర్వోత్కృష్టమగు; **గతిం** = లక్ష్యముగా; **ఆహుః** = చెప్పెదరు; **యం** = దేనిని; **ప్రాప్య** = పొంది; **న నివర్తన్తే** = వెనుకకు మరలి రారో; **తత్** = అట్టి; **పరమం** = సర్వ శ్రేష్ఠమగు; **మమ** = నా యొక్క; **ధామ** = ధామము.

అవ్యక్తమునకు వినాశము లేదని చెప్పెదరు. దేనిని పొందినచో పునరావృత్తి లేదో, అట్టి సర్వోత్కృష్ట లక్ష్యము అదియే. అట్టి నా ధామము సర్వ శ్రేష్ఠమైనది (21).

**అవ్యక్తః అక్షరః ఇతి ఉక్తః, తం ఆహుః పరమాం గతిమ్.** అవ్యక్త ఆత్మ అక్షరము, అనగా వినాశము లేనిది. అది కాలాధీనము కాదు గనుక, మార్పులకు వేటికీ లోను కాదు. శాస్త్రజ్ఞులు దానిని పరమా గతిః అని వర్ణిస్తారు. మనము చేరే స్థలమునకు, లేక మనము సాధించే ఉపలబ్ధికి గతి

యని పేరు. సంసారి యగు జీవునకు బ్రహ్మలోక, విష్ణులోకాదులన్నియూ గతులే. కాని ఇచట ఈ లోకములలో సంచరించే ఆత్మయే గతి యని చెప్పబడినది.

ఇది ఎట్లు సంభవము? నాకు నేను గతి ఎట్లు అగుదును? పొందే ఆత్మ, పొందబడే ఆత్మ అని రెండు ఆత్మలు ఎట్లు ఉండగల్గును? దీనికి సమాధానమేమనగా, భ్రాంతిని పొందిన వ్యక్తికి సత్యము గతి యగును. మిగిలిన గతులన్నియూ సంసారాంతర్గతములై యుండును. భ్రాంతుడగు జీవుడు వాటి వెంటపడును. జీవుడు వాటి నుండి విముక్తిని కోరినప్పుడు, భ్రాంతజీవుని సారభూతమైన సత్యము ఆత్మయే గనుక, అదియే గతి యగును.

దానినే వారు పరమశ్రేష్ఠమగు లక్ష్యము (పరమా గతిః) అని వర్ణించెదరు. ఇతర గతులన్నియూ మరణము తరువాత లభించును. అవి పుణ్యగతులు కావచ్చును; లేదా దుర్గతులు కావచ్చును. పరమగతికి సాటి మరియొకటి లేదు. మోక్షమనగా నదియే. కావున, ఇచట మోక్షము ఆత్మ యగును. సాధకుని పురుషార్థము అతని ఆత్మ కంటె వేరుగాదు. ముముక్షువు మోక్షము కంటె భిన్నముగా లేడు. సాధకుడు, సాధ్యము ఒకటియే గనుక, సాధనకు అజ్ఞానము హేతువు అగును. నేనే లక్ష్యము. సాధకుడను నేనే. ఈ స్థితిలో వివేకము మాత్రమే ఆ లక్ష్యమును సాధించే సాధనము అగును. కాన, వివేకము సాధనము. అవ్యక్త ఆత్మ లక్ష్యము. అవివేకి సాధకుడగును.

యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ. అది పరమ గతి అగుటకు కారణమేమి? దానిని పొందినవారు మరలిరారు. ఏలయన, అది నీ కంటె భిన్నమైన లక్ష్యము కాదు. సాధకుని కంటె భిన్నముగా నుండే లక్ష్యము నుండి జీవుడు మరలివచ్చుట నిశ్చయము. కాని, ఆత్మయే లక్ష్యమైనప్పుడు, జీవుడు మరలివచ్చుట ఎట్లు సంభవమగును? అనుభవమైనచో మరలివచ్చుట సంభవమగును. ఉదాహరణకు, జ్ఞానరహితమైన కేవల నిర్వికల్ప సమాధి అను అవస్థ నుండి సాధకుడు మరలివచ్చును. కాని జ్ఞానము లక్ష్యమైనప్పుడు, మరలి వచ్చుట అసంభవము. మనస్సు ఉన్నప్పుడు నేను సచ్చిదానంద ఆత్మను. మనస్సు లేకున్ననూ నేను సచ్చిదానంద ఆత్మనే. నేను పొందవలసినది యేమున్నది? ఆలోచనకు ముందు సచ్చిదానంద ఆత్మ గలదు. ఆలోచన ఉన్న సమయములో కూడా అదే ఆత్మ గలదు. ఆలోచన పుట్టి సచ్చిదానంద ఆత్మను ప్రక్కకు త్రోసివేయదు. ఆలోచన సచ్చిదానంద ఆత్మ యొక్క అభివ్యక్తి తక్క మరియొకటి కాదు. ఆత్మ సచ్చిదానందము అని యెరింగిన జ్ఞాని మనస్సులో ఆలోచనలు పుట్టిననూ, ఆ జ్ఞానము తొలగిపోదు. అవికారి ఆత్మతత్త్వమును గురించి అజ్ఞానము తొలగిన జ్ఞానికి పునరావృత్తి లేదు.

ఆత్మ నిశ్చయముగా నా ధామము అని భగవానుడు చెప్పుచున్నాడు. అదియే పరమగతి. 'పరమా గతిః' అను ప్రయోగమును బట్టి, సాధకుడు చేరుకోదగిన స్థానమొకటి గలదను అభిప్రాయము ఏర్పడే అవకాశము గలదు. స్వర్గము అభీష్టమగు లోకము అని శాస్త్రము వర్ణించును. కాని, పరమగతి నీవే నని భగవానుడిచట చెప్పుచున్నాడు. నిన్ను మించిన స్వర్గము లేదు. మిగిలిన స్థలము లన్నింటి నుండియూ నీవు వెనుకకు మరలివచ్చుట తథ్యము. కాని, ఈ స్వర్గములోనికి నీవు ప్రవేశించి గల్గినచో, పునరావృత్తి లేదు. ధామ అను పదము, అది తప్పక పొందదగిన అభీష్టమగు గతియని సూచించును. అదే సమయములో, అది స్వర్గము వలె అభీష్టమే అయినా, అది సాధకుని ఆత్మ కంటె వేరుగా లేదనియు, దాని నుండి పునరావృత్తి లేదనియు స్పష్టము చేయబడినది. అది సర్వోత్కృష్ట ధామము. నా ధామము నీ కంటె వేరుగా లేదని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుడు మన బుద్ధి యందు నివసించి యుండును. జ్ఞానముచే ఈ ఆత్మను ఎరుంగుటయే దానిని పొందే ఏకైక ఉపాయముగా నున్నది. అదియే మోక్షము.

దీనిని సాధించగలిగే ఏకైక సాధనము అంకితభావముతో గూడిన విచారమని భగవానుడు తరువాతి శ్లోకములో చూపుచున్నాడు.

**అధ్యాయము 8, శ్లోకము 22:**

पुरुषस्स परः पार्थ भक्त्या लभ्यस्त्वनन्यया ।
यस्यान्त स्स्थानि भूतानि येन सर्वमिदं ततम् ॥ २२ ॥

పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా
యస్యాంతస్స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్ (22)

**పార్థ** = ఓ అర్జునా!; **సః** = ఆ; **పరః** = అనంతుడగు; **పురుషః** = పురుషుడు; **తు** = అయితే; **అనన్యయా** = ఇతర ప్రసక్తి లేని; **భక్త్యా** = భక్తిచే; **లభ్యః** = పొందబడును; **భూతాని** = ప్రాణులు (సృష్టి); **యస్య** = ఎవని; **అంతస్స్థాని** = విస్తారములోపల నున్నవో; **ఇదం** = ఈ; **సర్వం** = సర్వము; **యేన** = ఎవనిచేత; **తతమ్** = వ్యాప్తమై యున్నదో.

ఓ అర్జునా! ఆ అనంతపురుషుడు ఇతర ప్రసక్తి లేని భక్తిచే పొందబడును. ప్రాణులు (సృష్టి) ఆ పురుషుని విస్తారము లోపల నున్నవి. ఈ సర్వము ఆ పురుషుని చేతనే వ్యాప్తమై యున్నది (22).

## పురుష శబ్దము తటస్థ, స్వరూప లక్షణములను రెండింటినీ సూచించును

పురుషస్స పరః పార్థ భక్త్యా లభ్యః తు అనన్యయా. ఓ అర్జునా! ఆ పురుషుడు పొందదగినవాడు; పొందవచ్చును. పురుషుడనగా ఈ శరీరమునందు నిద్రించుచున్నట్లు కనపట్టువాడు; అనగా ఏ పనినీ చేయకుండగా దేహమునందు నివసించువాడు అని శ్రీ శంకరులు నిర్వచించిరి. ఇందువలననే విష్ణువును పరుండియున్నట్లు చిత్రిస్తారు. చైతన్య స్వరూపుడగు ఆయన యందు నిద్ర లేశమైననూ లేదు; ఆయన పూర్ణ జాగరూకుడు. చైతన్య స్వరూపమగు ఆత్మ ఈ స్థూల దేహము నందు విశ్రమించుచున్నది. ఇది పురుషుని తటస్థ లక్షణము. అనగా ఆ తత్త్వమును తత్సంబద్ధమైన మరియొక దాని ద్వారా నిర్వచించుట అని మనము చూచియున్నాము. దేని నుండి జగత్తు ఉద్భవించినదో, దేనిచే అది ధరింపబడి యున్నదో, దేనిలోనికి ఆ జగత్తు లీనమగునో, అదియే బ్రహ్మ అను నిర్వచనము తటస్థ లక్షణము. బ్రహ్మను నామరూపముల యందు అన్వేషించరాదనియు నామరూపములకు అతీతముగనైననూ అన్వేషించరాదనియు ఆ నిర్వచనము సూచించును. దాని నుండియే నామరూపములన్నియూ ఉద్భవించినవనియు, దాని చేతనే ధరింపబడియున్నవనియు, దాని యందే లీనమగుననియు దర్శించవలెను. నా స్థూల దేహము కూడా ఒక నామము, మరియు ఒక రూపము గాన, అది బ్రహ్మ కంటె వేరుగా లేదు. కాన, నేను బ్రహ్మ కొరకు వెదుక పని లేదు. నేను కొన్ని విశిష్ట పరిస్థితుల కొరకు వేచియుండ పని లేదు. బ్రహ్మను దర్శించుట కొరకై ఒక విశిష్ట పరిస్థితిలో నుండ పనిలేదు; ఒక విశిష్ట స్థానమునకు పోవ పని లేదు. సర్వ దేశములు, సర్వకాలములు బ్రహ్మమే. అనగా ఇప్పుడు నిత్య సిద్ధమై ఉన్నదానిని గుర్తించుటయే చేయవలసిన పని. జ్ఞాతచే తెలియబడే సర్వము జ్ఞాత కంటె వేరుగా లేదు. అటులనే జ్ఞాతృస్వరూపమునకు, జ్ఞేయబ్రహ్మకు తేడా లేదు. దీనిని బట్టి సర్వము బ్రహ్మయేనని తేలుచున్నది. ఇదియే తటస్థ లక్షణము.

పురుషుడనగా పూర్ణుడనియు అర్థము గలదు. ఇది బ్రహ్మ స్వరూపమును నిర్వచించే స్వరూపలక్షణము. దేశము గాని, కాలము గాని, ఇతర విశేషణములు గాని అన్నీ బ్రహ్మకు చెందినవే అయినా, అవి బ్రహ్మను సీమితము చేయజాలవు. పూర్ణమదః పూర్ణమిదమ్. అది పూర్ణము. ఇది పూర్ణము. ఆ పూర్ణము నుండి ఈ పూర్ణమును తీసివేయగా, ఆ పూర్ణమే మిగిలి యుండును. దానిని ఏ దృష్టి కోణము నుండి చూచిననూ, అది పూర్ణమే. కావుననే, అది పరము. ఈ స్థూలదేహము నందు ఉపలభ్యమయ్యే ఆ బ్రహ్మ అనంతము (పరము). అది పురుషుడగుటకు పరత్వము

కారణము. లేదా, పురుషుడు అనగా పరము తక్క మరియొకటి కాదు. ఈ రెండు అన్వయములలో తాత్పర్యము ఒక్కటియే.

అనన్యయా భక్త్యా. నీ స్వరూపముగా నిత్య సిద్ధుడై యున్న ఈ పురుషుని చేరుట యెట్లు? ఇతరములేని భక్తిచే (అనన్యయా భక్త్యా లభ్యః) పొందదగునని భగవానుడు చెప్పుచున్నాడు. జ్ఞాన సంపన్నమైన భక్తి ఇచట ప్రస్తావింపబడుచున్నదని శ్రీ శంకరులు వాక్రుచ్చిరి. ఆ పురుషుడు నీ కంటె వేరుగా లేడు గనుక, అంకితభావముతో జ్ఞాన సాధనను చేయుట ద్వారా మాత్రమే ఆ పురుషుని అన్వేషించుట సంభవమగును. సాధారణంగా ఇద్దరు వ్యక్తుల మధ్య ప్రేమ ఉదయించి వారు ఏకమవుతారు. భక్తి సాహిత్యంలో, జీవులకు ప్రతీకలైన గోపికలు పరమేశ్వరుడగు శ్రీకృష్ణుని అన్వేషణలో, ఆరాధనలో సంపూర్ణముగా నిమగ్నులైరి. ఒకే ఒక వస్తువును ఆరాధించే ఇట్టి భక్తిని అనన్య భక్తి అనవచ్చును. కాని వాస్తవంలో సాధకుడు తన కంటె భిన్నమైన ఈశ్వరుని ఆరాధించే సందర్భములో, అది అన్య భక్తి అగును. కాని, ఇచట భగవానుడు 'అనన్యయా భక్త్యా' అనుచున్నాడు గదా! ఈ భక్తిలో సాధకుని ఆరాధనలో ఆతని ఆత్మయే విషయమగును. అనగా ఇచట అన్యము లేదు. సాధారణంగా ఆరాధనాఫలము పుణ్యలోక ప్రాప్తి యగుచుండును. మానవులు ఆ ఫలము నపేక్షించి భక్తిని చేసెదరు. కాని, అనన్య భక్తిలో సాధకుడు అంకితమయ్యేది తన ఆత్మకు మాత్రమే. ఈ సందర్భములో భక్తి యనగా శ్రద్ధా జిజ్ఞాసలతో నిండియున్న విచారమని యర్థము. జిజ్ఞాసువు, లేక ముముక్షువు ఇట్టి విచారమును చేసి ఈ జ్ఞానమును పొందగలడు.

నా కంటె భిన్నముగా నుండే జ్ఞేయవస్తువును నేను ఊహించని విధంగా యాదృచ్ఛికముగా తెలుసుకొనుట సంభవమే. కాని ఆత్మ అట్లు గాదు. దీనికి కారణము లనేకములు గలవు. ఆత్మ దృశ్య వస్తువు కాకపోవుట వాటిలో అత్యంత ప్రముఖమైన కారణము. ఆత్మ గొప్ప రహస్యవస్తువు. ఏలయన, ఆత్మను అన్వేషించువాడు వాస్తవంలో తన కొరకు మాత్రమే అన్వేషించుచున్నాడు. కావున ఈ అన్వేషణ అనే సమస్య అతి పరశమగు జిజ్ఞాస అనే రూపాంతరమును పొందును. కోర్కెలన్నియూ జిజ్ఞాస అనే రూపాంతరమును పొందును. కోర్కెలన్నియూ ఒకే ఒక ప్రముఖమైన ఇతరకామనా నాశకమగు ఆత్మ జిజ్ఞాసగా రూపాంతరమును పొందును. ఇచటి అనన్య భక్తి ఇదియే.

అట్టి ఆత్మను గురించి భగవానుడిట్లు చెప్పుచున్నాడు:

యస్య అంతస్స్థాని భూతాని యేన సర్వం ఇదం తతమ్. దేని పరిధిలో సర్వప్రాణులు సర్వపదార్థములు ఇమిడియున్నవో, దేనిచే సర్వము వ్యాప్తమై యున్నదో, అదియే ఆత్మ. కార్యము

స్వీయ ఉపాదాన కారణముచే వ్యాప్తమై ఉండు తీరున, కార్యభూతములగు నామరూపము లన్నియూ కారణమగు ఆత్మచే వ్యాప్తమై యున్నవి★. కార్యభూతాని అను పదమును శ్రీ శంకరులు ప్రయోగించిరి. ఘటమనే కార్యము కారణమగు మృత్తునకు అంతర్గతముగా నుండు తీరున, సర్వ వస్తువులు పురుషునిలో ఉనికి గలవై, పురుషునిచే సమావిష్టమై ఉన్నవి. అంత మాత్రమే గాదు. ఈ జగత్తంతయూ పురుషునిచే వ్యాప్తమై యున్నది. ఘటము ఆకాశముచే వ్యాప్తమై యుండును. ఘటము లన్నియూ ఆకాశము నందు మాత్రమే ఉన్నవి. అటులనే, సర్వకారణమగు ఆత్మ యందు మాత్రమే సర్వము యొక్క ఉనికి గలదు. దాని చేతనే సర్వము వ్యాప్తమై యున్నది. ఆత్మ సర్వమునకు కారణము గనుక, దానికి దూరముగా ఏదీ లేదు. సర్వము యొక్క ఉనికి సచ్చిదాత్మకు సంబంధించిన ఉనికి మాత్రమే.

మనము సృష్టి అని పిలిచేది నామరూపములు తక్క వేరుగాదు. విశ్లేషణ చేస్తే ప్రతి నామము, ప్రతిరూపము మరియొక నామములో, రూపములో అంతర్గతమగును. ఈ ప్రక్రియలో అంతతో గత్వా సర్వము సచ్చిదానంద ఆత్మలో విలీనమగును. ఎక్కడ నామరూపములు గలవో, అచ్చట వాటి కంటె అభిన్నముగా ఆత్మయే గలదని తెలియుము.

ఈ ఆత్మను అనన్యభక్తిచే పొందదగును. భక్తిలో మన ప్రేమ, తద్విషయమగు వస్తువు కలిసియుండును. అనన్య భక్తిలో కామనా విషయములగు వస్తువులన్నీ ఒకే ఒక ఆత్మ యందు అంతర్లీనమగును. ఆ ఆత్మను తెలియాలనే కోరికకు జిజ్ఞాస అనియు, తెలియాలనే ప్రేమకు భక్తి అనియు పేరు. భక్తి యొక్క స్వరూపము ఏదైనా, దాని లక్ష్యము ఈశ్వరసాక్షాత్కారము. పరమేశ్వరుని ఆత్మాభిన్నముగా దర్శించుట జిజ్ఞాసకు లక్ష్యము.

ఈ శ్లోకములలో భగవానుడు ద్వివిధ సాధకులను నిర్దేశించినాడు. ఒక రకం సాధకులు సాక్షాత్తుగా, పూర్ణముగా బ్రహ్మకు అంకితమగుదురు. వారికి మరణానంతరము సూక్ష్మదేహము లయమగుటచే పయనము ఉండదు. దానికి కారణమైన అజ్ఞానరూపమగు దేహము స్వీయకార్యము లన్నింటితో సహా నశించినది. వారి ఖాతాలోని కర్మలన్నియూ నశించును. వారు బ్రహ్మ కంటె వేరుగా నుండరు. కర్మలు జీవునకు మాత్రమే ఉండును గదా!

---

★ త్రాడు పామునకు వలె, ఆత్మ మార్పులు చెందకుండగనే వివర్త ఉపాదాన కారణము అగుచుండును.

రెండవ రకం సాధకులు ధ్యానయోగులు. వారు బ్రహ్మలోకమును పొంది, అచట బ్రహ్మగారి ఉపదేశమును విని, మోక్షమును పొందెదరు. వీరు గాక ఇంకో రకం సాధకులు భవిష్యత్తులో సుఖ జీవనమును గోరి ధర్మ కార్యములను చేయుదురు. వారికి సుఖజీవనము లభించగలదు. కాని వారికి పునరావృత్తి తప్పదు. ఈ విషయమంతయూ ఇచట నిర్దేశింపబడినది.

**హరిః ఓం తత్సత్**

ఈ విభాగమును మనసు నందిడుకొని, శ్రీ శంకరులు తరువాతి నాల్గు శ్లోకముల అవతారికను ఇట్లు ప్రస్తావించిరి.

పరమేశ్వరుని ప్రార్థించి పొందగోరు ధ్యానయోగులు ఓంకార ప్రతీకయందు బ్రహ్మ భావన నారోపించి ధ్యానము చేసెదరు. వారికి మోక్షము మరణానంతరము మాత్రమే లభించును. ఇట్టివారు బ్రహ్మలోకమును పొందెదరని శ్రుతి చెప్పుచున్నది. మరణానంతరము జీవులు అనుసరించే మార్గములు రెండు గలవు. వాటిలోని ఉత్తరమార్గమునీ ధ్యానయోగులు అనుసరించెదరు. మరుజన్మలో సుఖజీవనమును గోరి ధర్మకార్యములను చేయువారు మరణించిన తరువాత దక్షిణమార్గము ననుసరించెదరు. సాధనలో రెండు విభిన్న దిశలు గలవని సూచించుటకై రెండు వేర్వేరు మార్గములు వర్ణింపబడినవి. ఉత్తరమార్గము గొంపోవు లోకము నుండి మరలి రాకుండుటకు అవకాశము గలదు. కాని దక్షిణమార్గము గొంపోవు లోకము నుండి జీవులు మరలి వచ్చెదరు. దక్షిణము సంసారమునకు, మరణమునకు ప్రతీక. ఉత్తరము మోక్షమునకు ప్రతీక. అందరికీ మోక్షము కావాలి. ఇతర లోకములను గోరి ప్రయానపడువారు కూడా వాస్తవంగా కోరేది మోక్షమే. కాని, వారు భ్రాంతిచే, అజ్ఞానముచే అల్పవిషయముల వెనుకపడి, తమ సమస్యకు వాటి యందు పరిష్కారమును వెదికెదరు. ఉత్తరమార్గమునకే శుక్ల మార్గమనియు, సూర్య మార్గమనియు పేరు. దక్షిణ మార్గమునకు ధూమ మార్గమనియు, కృష్ణ మార్గమనియు పేరు. ఉత్తర మార్గమును స్తుతించుట కొరకు మాత్రమే ఇచట రెండు మార్గములు నిర్దేశింపబడినవి.

**అధ్యాయము 8, శ్లోకము 23:**

यत्र काले त्वनावृत्तिमावृत्तिं चैव योगिनः ।
प्रयाता यान्ति तं कालं वक्ष्यामि भरतर्षभ ॥ २३ ॥

యత్ర కాలే త్వనా వృత్తి మావృత్తిం చైవ యోగినః
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ (23).

తు = కాని; యత్ర = ఏ; కాలే = కాలము నందు (మార్గము గుండా); ప్రయాతాః = పయనించు; యోగినః = ధ్యానయోగులు, మరియు కర్మిష్ఠులు; అనావృత్తిం = మరలిరాని స్థానమును; చ = మరియు; ఆవృత్తిం = మరలివచ్చు స్థానమును; యాంతి = పొందెదరో; తం = ఆ; కాలం = కాలమును; ఏవ = నిశ్చయముగా; వక్ష్యామి = చెప్పగలను; భరతర్షభ = భరత వంశములో శ్రేష్ఠుడైన వాడా!

భరత వంశములో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా! మరణానంతరము యోగులు పయనించే ఆవృత్తి లేని కాలము (మార్గము)ను, ఆవృత్తి గల మార్గమును కూడ నిశ్చయముగా చెప్పెదను (23).

భరతర్షభ. ఆవుల మందలో ఆబోతు కొట్టవచ్చినట్లు కనబడును. అటులనే, భరత వంశమునకు చెందినవారిలో అర్జునుడు ప్రముఖముగా కన్పట్టును.

ప్రయాతాః. అనగా ప్రయాణమును చేయువారు. ఇది 'యోగినః' కు విశేషణము. యోగులనగా ధ్యానయోగులు కావచ్చును; లేదా కర్మఠులు కావచ్చును. మరణానంతరము కొందరు యోగులు పునరావృత్తి గల మార్గములో పయనింతురు. నీకిపుడు ఈ రెండు మార్గముల గురించి చెప్పెదనని భగవానుడు అనుచున్నాడు. ఈ శ్లోకములో కాలశబ్దమునకు మార్గమని యర్థము. కాలము కాలాధిష్ఠాన దేవతను కూడా నిర్దేశించును.

జగత్తు ఈశ్వరుని కంటె భిన్నముగా లేదు గనుక, జగత్తులోని దృశ్యఘటనా చక్రమంతయూ ఈశ్వరుడే. ఒక విశిష్ట ఘటన గుండా చూచినచో అదే ఈశ్వరుడు దేవత యగును. భూమి, చెట్లు, నదులు ఇత్యాదులన్నీ పదార్థములుగనే గాక, దేవతామూర్తులుగా దర్శింపబడును.

మనము జగత్తులోని ఒక విశిష్ట ఘటనను దృష్టిలో నిడుకొని, ఈశ్వరుడు జగత్తునకు నిమిత్త కారణమని భావిస్తాము. ఈశ్వరుడే జగత్తునకు ఉపాదాన కారణమైనచో, జగత్తు ఈశ్వరుని రూపమే యగును. మనము సృష్టిలోని ఒక విశిష్ట రూపము గుండా ఈశ్వరుని దర్శించినచో, ఈశ్వరుడు ఆ రూపమునకు అధిష్ఠాన దేవత యగును. మనము ఈశ్వరుని కర్మ గుండా చూచినచో, ఈశ్వరుడు కర్మనియతిని సమీక్షించే అధ్యక్షుడు, మరియు కర్మఫలదాత అగును. సృష్టిలో అనేక ఘటనలు ఉన్నవి గనుక, ఎందరు దేవతలనైననూ భావన చేయవచ్చును. సృష్టిలోని ఏ అంశము గుండానైనా మనము ఈశ్వరుని చూడగలము గాన, మనకు అనేక దేవతలు గలరు. ఇన్ని విభిన్న దృష్టి కోణములలో దర్శింపబడే ఈశ్వరుడు ఒక్కడే.

ధ్యానయోగులు పొందే గతిని ప్రదర్శించుట మాత్రమే ఈ శ్లోకముల తాత్పర్యము కాదు. పునరావృత్తి లేని బ్రహ్మలోకమును పొందే ధ్యానయోగులను స్తుతించుట కొరకై ఇతరులగు కర్మిష్ఠులు, వారు పొందే గతి కూడా వర్ణింపబడినవి. దక్షిణమార్గము యొక్క పృష్ఠభూమికలో ఉత్తరమార్గమును స్తుతించుట ఇచట శ్రీకృష్ణుని తాత్పర్యమై యున్నది. మనము చెప్పదలచిన దానికి

విరుద్ధమగు తత్త్వమును చక్కగా ప్రదర్శించినచో అంత కంటె మంచి పృష్ఠ భూమిక మరియొకటి ఉండబోదు. రెండవ దానిని చులకన చేయుట తాత్పర్యము కాదు. మొదటి దానిని సుస్పష్టముగా తెలుపుట కొరకై తద్విరుద్ధమగు స్థితి ప్రదర్శింపబడినది.

**అధ్యాయము 8, శ్లోకము 24:**

अग्निर्ज्योतिरहश्शुक्लःषण्मासा उत्तरायणम् ।
तत्र प्रयाता गच्छन्ति ब्रह्म ब्रह्मविदो जनाः ॥ २४ ॥

అగ్ని ర్జ్యోతి రహశ్శు క్లష్షణ్మాసా ఉత్తరాయణమ్
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మ విదో జనాః (24).

**అగ్నిః** = అగ్నికి అధిష్ఠాన దేవత; **జ్యోతిః** = కాలదేవత; **అహః** = పగటికి దేవత; **శుక్లః** = శుక్లపక్షాధిష్ఠానదేవత; **షణ్మాసా ఉత్తరాయణమ్** = ఉత్తరాయణము (సూర్యుని ఉత్తరాభిముఖ గమనము) అనే ఆరుమాసముల కాలమునకు అధిష్ఠాన దేవత; **బ్రహ్మ** = బ్రహ్మలోకము; **తత్ర** = అచటకు; **ప్రయాతాః** = దేహమును వీడి పయనించు; **బ్రహ్మవిదః** = బ్రహ్మోపాసకులగు; **జనాః** = జనులు; **గచ్ఛంతి** = వెళ్ళెదరు.

బ్రహ్మోపాసకులగు జనులు దేహత్యాగానంతరము అగ్నిదేవత, కాలదేవత, అహర్దేవత, శుక్లపక్ష దేవత, ఉత్తరాయణ దేవతలచే అధిష్ఠింపబడిన మార్గము గుండా పయనించి బ్రహ్మలోకమును పొందెదరు (24).

ఇది అద్భుత ప్రకాశముతో గూడిన సుందరమార్గము. మార్గమధ్యములో దేవతలందరు గలరు. అగ్నిదేవత నిన్ను ఆహ్వానించుటకు సిద్ధముగా నున్నాడు. కాలాధిష్ఠాన దేవత యగు జ్యోతిస్సు, మరియు పగటికి అధిష్ఠానదైవమగు అహస్సు గలరు. శుక్లమనగా శుక్ల పక్షము. దానికి అధిష్ఠానము శుక్లదేవత. ఇచట తాత్పర్యము సర్వమును ప్రకాశరూపముగా ప్రదర్శించుట. సూర్యుడు ఉత్తరము వైపుగా సంచరించే కాలము ఉత్తరాయణము. ఉత్తరము మోక్షమునకు ప్రతీక. కావున, సూర్యుడు ఉత్తరముగా సంచరించే ఉత్తరాయణము పుణ్యకాలమనియు, సూర్యుడు దక్షిణముగా సంచరించే దక్షిణాయన కాలము కంటె శ్రేష్ఠతరమగు కాలమనియు ప్రసిద్ధి గలదు. 'షణ్మాసా ఉత్తరాయణమ్' అనగా ఉత్తరాయణములో ఆరు మాసములు అని పదముల అర్థమే

అయినా, ఇచట ఉత్తరాయణములోని అరుమాసాల కాలము యొక్క అధిష్ఠానదేవత నిర్దేశింపబడును. జీవుడు బ్రహ్మలోకమునకు పోవు దారిలో ఈ దేవతలందరు జీవునకు స్వాగతము పలికెదరు.

గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. ఓంకారమును అలంబనముగా చేసుకొని పరబ్రహ్మను ధ్యానించువారు బ్రహ్మలోకమును పొందెదరు. అచటకు చేరిన తరువాత వారు ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారమును పొందగల్గుదురు. వారికి ఇహలోకములో ఉపాసన ద్వారా చిత్త నైశ్చల్యము పూర్ణముగా కలుగకపోయిననూ, వారు చేసిన వేదాంత శ్రవణము బ్రహ్మలోకమును పొందిన తరువాత సఫలమగును. పిదప వారికి పునరావృత్తి ఉండదు. వారు దేవతలతో గూడియున్న మార్గమును అనుసరించెదరని చెప్పబడినది గాన, వారు బ్రహ్మ సాక్షాత్కారమును గాక బ్రహ్మలోకమును పొందినారని స్పష్టమైనది. వారు బ్రహ్మలోకమును చేరి క్రమముగా బ్రహ్మజ్ఞానమును పొందెదరని శ్రీ శంకరులు వాక్రుచ్చిరి. బ్రహ్మజ్ఞానులకు పయనము లేదని కూడ శ్రీ శంకరులు చెప్పిరి. వివిధ మార్గములను వర్ణించుట భగవానుని తాత్పర్యము కాదు. ధ్యానయోగులు బ్రహ్మలోకమును పొందెదరనియు, వారి మార్గము జ్యోతిర్మయమనియు చెప్పుట యందు మాత్రమే భగవానునకు తాత్పర్యము గలదు. కావున, ఇచట బ్రహ్మవిదః అనగా బ్రహ్మను ఉపాసించిన వారు అని చెప్పవలెనే గాని, బ్రహ్మను ఎరింగినవారు అని చెప్పరాదు. ఏలయన, స్పష్టమగు బ్రహ్మసాక్షాత్కారము గల జ్ఞానులకు రాకపోకలు లేవు. ఆత్మ బ్రహ్మభిన్నమని యెరింగిన జ్ఞాని మోక్షమును పొందును. మనము వారిని గురించి ఇచట చర్చించుట లేదు. ఇచట ఒక మార్గము బోధింపబడినది గనుక, అది ధ్యానయోగుల కొరకు మాత్రమే నని స్పష్టమగుచున్నది.

జ్ఞానికి స్థూలదేహము మరణించిన తరువాత, ప్రయాణమును చేయుట కావశ్యకమగు సూక్ష్మదేహము ఉండదు. అతని ప్రాణములన్నియూ బ్రహ్మలో లీనమగును. వ్యక్తి ఉండడు. కర్మలేపనమునకు ఆశ్రయమగు కేంద్రము ఉండదు. కర్మలు లేవు గనుక ప్రయాణము ఉండదు. అతడు బ్రహ్మరూపుడు గనుక, అతనికి రాకపోకలు ఉండవు.

**అధ్యాయము 8, శ్లోకము 25:**

धूमो रात्रिस्तथा कृष्णः षण्मासा दक्षिणायनम् ।
तत्र चान्द्रमसं ज्योतिर्योगी प्राप्य निवर्तते ॥ २५ ॥

ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్
తత్ర చాంద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే (25).

**ధూమః** = ధూమమునకు అధిష్ఠాన దేవత; **తథా** = అదే విధముగా; **రాత్రిః** = రాత్రికి అధిష్ఠానదేవత; **కృష్ణః** = కృష్ణపక్షమునకు అధిష్ఠాన దేవత; **షణ్మాసా దక్షిణాయనమ్** = సూర్యుడు దక్షిణదిక్కు నందు పయనించే ఆరుమాసముల కాలమునకు అధిష్ఠాన దేవత; **జ్యోతిః** = కర్మఫలాధిష్ఠాన దేవత; **తత్ర** = ఆ మార్గములో; **చాంద్రమసం** = చంద్రలోకమును; **యోగీ** = యోగి; **ప్రాప్య** = పొంది; **నివర్తతే** = మరలివచ్చును.

> ధూమాధిష్ఠాన దేవత, రాత్రి దేవత, కృష్ణపక్ష దేవత, దక్షిణాయన దేవత, కర్మఫల దేవతలతో గూడిన మార్గములో యోగి చంద్రలోకమును పొంది మరలివచ్చును (25).

కర్మయోగులు కాకున్ననూ, వేదవిహిత కర్మలను పుణ్యప్రాప్తి కొరకు ఆచరించు వారి కొరకు ఒక మార్గము గలదు. ఇట్టి వారు కర్మఠులే గాని, కర్మయోగులు గారు. కాని పాపకర్మలను వీడి విహితకర్మలను చేసినారు గాన వీరియందు 'యోగినః' అను శబ్దము ప్రయోగింపబడినది. వీరు చంద్రలోకము అనబడే స్వర్గలోకమును పొందెదరు. శుక్లమార్గమును స్తుతించుట కొరకు మాత్రమే ఈ మార్గము వర్ణింపబడినది. ఈ రెండు గతులలో ప్రయాణము సమానమే. కావున, శుక్లగతిలో పయనించు జీవునకు బ్రహ్మలోకములో బ్రహ్మ జ్ఞానప్రాప్తికి అవకాశము కలదు గాన పునరావృత్తి లేదు. దీనికి భిన్నంగా, కర్మఠులు ధూమమార్గము (పొగతో కూడిన మార్గము)ను అనుసరించెదరు. ఈ మార్గములోని దేవతలందరు చీకటికి ప్రతీకలగు తత్త్వములకు అధిష్ఠాతలై యుందురు. రాత్రి దేవత, చంద్రుని కళలు క్షీణించు కాలమునకు అధిష్ఠాన దేవత, సూర్యుడు దక్షిణముగా సంచరించే అర్ధ సంవత్సరకాలమునకు ప్రతీక యగు దేవత ఈ మార్గములో నుందురు. ఈ మార్గములో ప్రకాశానుభవమునకు అవకాశము లేదు. కాన, ఇచట జ్యోతిశ్శబ్దమునకు కర్మఫలమని యర్థము. విహిత కర్మల నాచరించిన వ్యక్తి వాటి ఫలమును కొంత కాలము వరకు అనుభవించి, మరల తిరిగి వచ్చును. కేవల విహిత కర్మాచరణము వలన జీవునకు ముక్తి లభించదు.

మరణము మోక్షము నీయదనియు, జీవుడు పయనించుచుండు ననియు ఈ శ్లోకము యొక్క తాత్పర్యము. జ్ఞానము మాత్రమే మోక్షము నిచ్చును. అది లభించని జీవుడు మరణానంతరము ఈ రెండింటిలో ఒకదారిన ప్రయాణము నారంభించును. ఇవి రెండు

పుణ్యమార్గములు. అపుణ్యమార్గము కూడ గలదు. జీవులు దుఃఖముల ననుభవించే నరకము గలదు. అది కూడా కర్మఫలమే. అది ఖర్చు అయిన జీవుడు మరల తిరిగి వచ్చును. కర్మఫలము శాశ్వతము కాదు గనుక, నరకములోని జీవులు కూడ మరలి వచ్చెదరు. ఇచట భగవానుడు పుణ్యఫలములను మాత్రమే ప్రస్తావించినాడు. పునరావృత్తి దీని యందు కూడ గలదు.

**అధ్యాయము 8, శ్లోకము 26:**

शुक्लकृष्णे गती ह्येते जगतश्शाश्वते मते ।
एकया यात्यनावृत्तिमन्ययावर्तते पुनः ॥ २६ ॥

శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః (26).

**ఏతే** = ఈ; **శుక్ల కృష్ణే** = శుక్లమార్గము, కృష్ణమార్గములు; **గతీ హి** = ప్రసిద్ధమైన మార్గములు; **జగతః** = జగత్తు యొక్క ఈ మార్గములు; **శాశ్వతే** = శాశ్వతములని; **మతే** = చెప్పబడినవి; **ఏకయా** = ఒక మార్గముచే; **అనావృత్తిం** = పునరావృత్తి లేని స్థానమును; **యాతి** = పొందును; **అన్యయా** = రెండవ మార్గముచే; **పునః ఆవర్తతే** = మరల తిరిగి వచ్చును.

ఈ శుక్ల కృష్ణ మార్గములు ప్రసిద్ధమైనవి. జగత్తులోని ఈ మార్గములు శాశ్వతములని చెప్పబడినవి. జీవుడు ఒక మార్గముచే పునరావృత్తి రహితమగు స్థానమును పొందును. మరియొక మార్గములో వెళ్లు జీవుడు మరలివచ్చును (26).

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః. వివిధ పుణ్యఫలములను ఇచ్చే ఈ రెండు మార్గములకు శుక్లగతి, కృష్ణగతి యని పేర్లు. ఈ విషయము శాస్త్ర ప్రసిద్ధమనియు, దీనిని తెలియుటకు శాస్త్రము తక్క మరియొక ప్రమాణము లేదనియు 'హి' అను అవ్యయముచే సూచింపబడినది. జగతః యనగా సృష్టిలోని మానవులకు, అనగా ధ్యానయోగులకు మరియు ధర్మకార్యములను చేయువారికి అని అర్థము. కర్మాధికారము గల ఇట్టి మానవులకు రెండు మార్గములు ఉపలభ్యమగుచున్నవి.

శాశ్వతే మతే. అవి శాశ్వతములని చెప్పబడినవి. సంసారము అనంతముగా ప్రవహిస్తూనే ఉంటుంది గనుక, ఈ మార్గములకు సాపేక్షికమైన సత్యత్వము గలదు. జీవుడు మోక్షమును పొందువరకు ఈ సంసారము అంతము కాదు. జీవుడు స్వస్వరూపమును ఎరింగి సంసారమును అంతము చేసుకోవాలి. ఈ రెండు మార్గములు శాశ్వతమనుటలో తాత్పర్యమేమనగా మోక్షము తనంత తానుగా లభించేది కాదు. మానవునకు తెలియాలనే కోరిక కలగాలి. అంతవరకు సంసారము కొనసాగును. అజ్ఞాని యగు జీవునకు సంసారము శాశ్వతమా అనిపిస్తుంది.

ఏకయా యాతి అనావృత్తిం అన్యయా ఆవర్తతే పునః. జీవుడు వీటిలో ఒక మార్గములో పయనించి పునరావృత్తి లేని గమ్యమును పొందును. అదియే శుక్లగతి. పొందే గమ్యము బ్రహ్మలోకము. సాధకుడు అచట బ్రహ్మగారి ఉపదేశమును పొంది మోక్షమును పొందును. రెండవది యగు ధూమ (కృష్ణ) మార్గములో పయనించు జీవుడు మరలివచ్చును. సాధకుడీ రెండు మార్గములలో మోక్షమునిచ్చే శుక్లమార్గమును ఎన్నుకొనుట సహజమే. కాని మోక్షము నిచ్చేది మార్గము (గతి) కాదు. మోక్షము నిచ్చేది జ్ఞానము అనే విషయమును భగవానుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 8, శ్లోకము 27:**

नैते सृती पार्थ जानन् योगी मुह्यति कश्चन ।
तस्मात्सर्वेषु कालेषु योगयुक्तो भवार्जुन ॥ २७ ॥

నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున (27).

పార్థ = ఓ కుంతీ పుత్రా!; ఏతే = ఈ; సృతీ = మార్గములను; జానన్ = ఎరింగిన; యోగీ = యోగి; కశ్చన = ఎవ్వరైననూ; న ముహ్యతి = మోహమును పొందడు; అర్జున = ఓ అర్జునా!; తస్మాత్ = అందువలన; సర్వేషు = అన్ని; కాలేషు = కాలముల యందు; యోగయుక్తః = యోగాభ్యాస సంపన్నుడవై; భవ = అగుము.

ఓ కుంతీ పుత్రా! ఈ మార్గముల నెరింగిన యోగి ఎవ్వరైననూ మోహమును పొందడు. ఓ అర్జునా! అందువలన అన్ని కాలముల యందు యోగాభ్యాస సంపన్నుడవు అగుము (27).

న ఏతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన. ఓ అర్జునా! ఈ రెండు మార్గముల నెరింగిన యోగి మోహమును పొందడు. ఇచట యోగి యనగా వివేకి యగు జిజ్ఞాసువు. ఒకటి సంసారమునకు, మరియొకటి మోక్షమునకు దారి యని అతడెరుంగును. కావున, ఆతడు ఈ రెండు మార్గముల విషయములో మోహమును పొందనే పొందడు. మరియొక లోకమును పొందుట వలన మోక్షము లభించదనే సత్యము విషయములో ఆతనికి భ్రాంతి లేదు. మోక్షము జ్ఞానము వలన మాత్రమే లభించును. జ్ఞానమును ఈ లోకములో గాని, బ్రహ్మలోకములో గాని పొందవచ్చును. స్వర్గమే మోక్షమనే భ్రాంతి మానవాళి నంతనూ పీడించుచున్నది. మతము లన్నియూ ఈ భ్రాంతిని ఒక క్రమపద్ధతిలో ప్రచారము చేయుచున్నవి. మానవులలో ఈ భ్రాంతి చాల విస్తరించియున్నది. అందువలననే భగవానుడు ఈ ధారణను ఈ శ్లోకములో భ్రాంతి యని సుస్పష్టముగా చెప్పినాడు. వివేకియగు యోగికి ఈ విషయములో భ్రాంతి లేశమైననూ ఉండదు.

తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తః భవ అర్జున. కావున, ఓ అర్జునా! సర్వకాలముల యందు నిన్ను నీవు ఈ జ్ఞానము కొరకు సజ్జితుడుగా చేసుకొనుము. ఈ జ్ఞానమును పొందుటకు ఏది అవశ్యకమో, దానిని చేయుము.

ఇచట యోగమనగా అంతఃకరణ శుద్ధి పూర్వకమగు జ్ఞానము. జ్ఞానము యోగమే; ఆ జ్ఞానమును పొందుటకు సహకరించే సాధనము కూడా యోగమే.

ఆఖరుగా, ఈ యోగమహిమ వర్ణింపబడుచున్నది.

**అధ్యాయము 8, శ్లోకము 28:**

वेदेषु यज्ञेषु तपस्सु चैव दानेषु यत्पुण्यफलं प्रदिष्टम् ।
अत्येति तत्सर्वमिदं विदित्वा योगी परं स्थानमुपैति चाद्यम् ॥ २८ ॥

వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్ (28).

వేదేషు = వేదముల యందు; యజ్ఞేషు = యజ్ఞముల యందు; చ ఏవ = మరియు, దానేషు = దానముల యందు; (శాస్త్రేణ = శాస్త్రము చేత); యత్ = ఏ; పుణ్యఫలమ్ = పుణ్యకర్మఫలము; ప్రదిష్టమ్ = నిర్దేశింపబడినదో; యోగీ = యోగి; ఇదం = దీనిని; విదిత్వా

= తెలుసుకొని; తత్ = ఆ; సర్వమ్ = పుణ్యఫలము నంతనూ; అత్యేతి = అతిక్రమించు
చ = మరియు; ఆద్యం = సృష్టికారణమగు; పరం = సర్వోత్కృష్టమగు; స్థానం = పదము
ఉపైతి = పొందును.

దీనిని (అర్జునుని 8-1, 8-2 శ్లోకములలోని ప్రశ్నలకు సమాధానమును) ఎరింగిన యోగి, వేదముల యందు యజ్ఞముల యందు మరియు దానముల యందు శాస్త్రముచే ఏ పుణ్య కర్మఫలము నిర్దేశింపబడినదో, ఆ పుణ్యఫలము నంతనూ అతిక్రమించును. మరియు సృష్టికారణము, సర్వోత్కృష్టమునగు పదమును పొందును (28).

ఈ శ్లోకములో రెండు వాక్యములు గలవు. 'తత్సర్వమత్యేతి యోగీ ఇదం విదిత్వా (దీనిని ఎరింగిన యోగి దాని నంతనూ అతిక్రమించును)' అనునది ఒక వాక్యము. పరం ఆద్యం స్థానం ఉపైతి (ఆదికారణము, సర్వోత్కృష్టము అగు పదము నాతడు పొందును) అనునది రెండవ వాక్యము.

వేదేషు యజ్ఞేషు తపస్సు చ ఏవ దానేషు ప్రదిష్టం యత్ పుణ్యఫలమ్. ఇవి అన్నీ మనకు పుణ్యమును సంపాదించి పెట్టే ఉపాయములు. కేవల వేదాధ్యయనము కూడా పుణ్యకర్మయే. వేదములో చెప్పబడిన వివిధ క్రతువుల నాచరించినచో పుణ్యఫలము లభించును. వేదాధ్యయనము, దాని తరువాత వేదోక్తకర్మానుష్ఠానము అనునది చాల ప్రముఖమైనవిగా పరిగణింపబడును. వివిధ ధార్మిక అనుశాసనములను పాలించినచో, అదియే తపస్సు అనబడును. ఇతరులకు సమయమును, నైపుణ్యమును లేదా ధనమును ఇచ్చుట దానమనబడును. ఇవి అన్నీ మన కంటికి ప్రత్యక్షముగా కానరాని అదృష్టమును ఉత్పన్నము చేయును. అది మన ఖాతాకు జమ యగును. దాని ఫలము ఈ జన్మలో గాని, మరు జన్మలో గాని లభించును.

తత్సర్వం అత్యేతి యోగీ ఇదం విదిత్వా. దీనిని, అనగా ఈ అధ్యాయములోని మొదటి రెండు శ్లోకములలో అర్జునుడు వేసిన ప్రశ్నలకు సమాధానముల నెరింగిన యోగి పరిచ్ఛిన్నమగు సాధనములకు, సాధ్యములకు అతీతుడగును. ఆతడు అనంత బ్రహ్మను, అనగా పరమేశ్వరుని ఆత్మరూపముగా నెరింగి పూర్ణస్వాతంత్ర్యమును పొందును.

పరం స్థానం ఉపైతి చ ఆద్యమ్. మానవుడు పొందగలిగే అత్యున్నత పదము ఈశ్వరత్వము. ఆతడు దానిని పొందును. ఆద్యమ్ అనగా ఆది యందు ఉన్నది, అనగా సృష్టికి కారణమైనది.

సృష్ట్యాదియందు బ్రహ్మ మాత్రమే ఉండెను. అపుడు సర్వజగత్తు సృష్టింపబడెను. ఇచట కారణము చాల ప్రముఖమైనది. కారణము సత్యమైనచో, కార్యము మిథ్య యగును. ఏలయన, కార్యమునకు కారణము కంటె భిన్నమైన ఉనికి లేదు. కారణమగు బ్రహ్మ సత్యము. కార్యము కూడ బ్రహ్మమే. కావున, బ్రహ్మ స్వరూపము నెరింగినచో, సృష్టి, తదంతర్గతమగు జీవుడు, ప్రథమకారణము (ఆద్యం కారణమ్) అగు ఈశ్వరుడు కూడ తెలిసినట్లే యగును. సర్వము నేనే; బ్రహ్మము నేనే అని ఎరింగిన జ్ఞాని దృష్టిలో ఈ లోకము లన్నింటికి విలువ ఏమీ లేదు.

వ్యాస విరచితము, లక్ష శ్లోకాత్మకము నగు మహా భారతమనే ఇతిహాస కావ్యములో భీష్మపర్వములో ఉపనిషత్తులతో సమానమైనది, బ్రహ్మవిద్య విషయవస్తువుగా గలది, కర్మయోగ శాస్త్రమును వివరించునది, శ్రీకృష్ణార్జున సంవాదరూపము నగు శ్రీమద్భగవద్గీతా అను భాగములో అక్షర (అవినాశి) పరబ్రహ్మమనే ఎనిమిదవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్.

# అధ్యాయము 9

## రాజ విద్య, రాజ గుహ్యము

పూర్వాధ్యాయములో అనేక విషయములతో బాటు ఆఖరుగా, బ్రహ్మలోక ప్రాప్తి మరియు క్రమముక్తికి గల అవకాశము అను విషయములు వర్ణించబడినవి. క్రమముక్తిలో సాధకుడు మోక్షము కొరకై భగవానుని సగుణరూపమును ధ్యానించును. తత్ఫలితముగా నాతడు బ్రహ్మలోకమును పొందును. అతనికి అచట 'నీవు సృష్టికారణమగు అనంత బ్రహ్మవు' అని బ్రహ్మగారు ఉపదేశించెదరు. తాను నిత్యముక్తుడనని యెరింగిన అతనికి పునరావృత్తి ఉండదు (అనావృత్తి). జననమరణ చక్రము అతనికి అంతమగును. అదియే మోక్షము. 'నేను బ్రహ్మనే' అను జ్ఞానము చేత మాత్రమే మోక్షము సంభవమగును. అట్టి మోక్షములో మాత్రమే దేహమును ధరించి పయనించే జీవతత్త్వము విలీనమగును.

సగుణ బ్రహ్మ ధ్యానము చేతనే, ఈ జన్మలో గాకపోయినా మరుజన్మలోనైనా, మోక్షము లభించునని కొందరు నిశ్చయించుకొనే అవకాశము గలదు. ఈ నిశ్చయము సరిగాదు. కావుననే, ఈ విషయమిచట నిర్దేశింపబడినది. ఈ అభిప్రాయము సరిగాదని చెప్పుటకై భగవానుడిచట ముక్తి తత్కాల జన్యమని చెప్పుచున్నాడు. స్వర్గమునకు వెళ్లినచో మోక్షము లభించుననే తప్పు ధారణను తొలగించుటకై భగవానుడీ విషయమును సుస్పష్టముగా చెప్పవలసి యున్నది. ఈ ప్రయోజనము కొరకై భగవానుడు గీతలోని తొమ్మిదవ అధ్యాయము నారంభించుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 1:**

श्री भगवानुवाच ।
इदं तु ते गुह्यतमं प्रवक्ष्याम्यनसूयवे ।
ज्ञानं विज्ञानसहितं यज्ज्ञात्वा मोक्ष्यसेऽशुभात् ॥ १ ॥

శ్రీ భగవానువాచ
ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే
జ్ఞానం విజ్ఞాన సహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ (1).

శ్రీ భగవాన్ = శ్రీ భగవానుడు; ఉవాచ = పలికెను; తు = కాని; ఇదం = ఈ; గుహ్యతమం = అత్యంత రహస్యమైన; విజ్ఞాన సహితం = విజ్ఞానము (ప్రత్యక్షజ్ఞానము)తో గూడిన; జ్ఞానం = జ్ఞానమును; అనసూయవే = దోష మాత్ర దర్శనము లేని; తే = నీ కొరకు; ప్రవక్ష్యామి = చెప్పగలను; యత్ = దేనిని; జ్ఞాత్వా = ఎరింగి; అశుభాత్ = అశుభమగు సంసారము నుండి; మోక్ష్యసే = విముక్తిని పొందగలవో.

శ్రీ భగవానుడిట్లు పలికెను -

అత్యంత రహస్యము, ప్రత్యక్షావగమము అగు జ్ఞానమును తప్పులెన్ను స్వభావము లేని నీకు వివరించి చెప్పెదను. దీనిని ఎరింగినచో నీవు అశుభమగు సంసారము నుండి విముక్తిని పొందగలవు (1).

అహం ప్రవక్ష్యామి. వక్ష్యామి అనగా నేను వివరించగలను. 'ప్ర' అను ఉపసర్గ ధాత్వర్థమునకు మరింత ఉత్కృష్టత నాపాదించును. కావున ప్రవక్ష్యామి అనగా నేను స్పష్టముగా విస్తరముగా వివరించగలను. వివరించుట దేనిని?

ఇదం = దీనిని. ఇదమ్ అనే సర్వనామము సాధారణముగా మన ఎదుట నున్న దానిని నిర్దేశించును. ఇప్పుడే అధ్యాయము నారంభించుచున్న భగవానుడు ఈ సర్వనామము నెట్లు ప్రయోగింప గల్గును? ఇచట ఆయన విషయవస్తువును నిర్దేశిస్తూ ఇదమ్ అనెను. ఇంతకు ముందు ఆరంభించి, ఇపుడు విస్తరముగా వివరింపబోవు విషయవస్తువును కూడా ఇదమ్ అను సర్వనామముచే నిర్దేశించవచ్చును. మరియు మన మనస్సులో నున్న విషయమును వివరింపబోతూ ఈ సర్వనామమును వాడవచ్చును. ఉదాహరణకు, 'నేను భాగ్యనగరము వెళ్లినప్పుడు ఈ వ్యక్తిని కలిసితిని' అని చెప్పవచ్చును. 'ఈ వ్యక్తి' నా మనస్సులో నున్నాడు. నేనా వ్యక్తిని గురించి మాటలాడబోవుచున్నాను. 'తద్బుద్ధౌ సన్నిధీకృత్య = ఆ విషయవస్తువును బుద్ధిలో స్మృతికి దెచ్చుకొని' అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. భగవానునకు తాను చెప్పబోవు విషయము బుద్ధిలో నిర్ణీతమై యుండెను. ఇదం = బ్రహ్మజ్ఞానమును. ఆయన రెండవ అధ్యాయములో మొదలిడి ఎనిమిదవ అధ్యాయము ఆఖరు వరకు ప్రదర్శించిన జ్ఞానమును ఇచట మరింత వివరించబోవుచున్నాడు. 'నీకు ఇంతకు ముందు చెప్పిన విషయమునే మరల చెప్పబోవుచున్నాను' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ అధ్యాయములో రాబోవు శ్లోకములలో చెప్పబోవు విషయ వస్తువు భగవానునకు స్పష్టముగా భాసించుచున్నది.

ఇది ప్రత్యక్ష జ్ఞానము అను విశిష్టతను 'తు' అను అవ్యయము సూచించును.

భగవానుడు ఇంతవరకు తాను చర్చించిన బ్రహ్మలోక ప్రాప్తి మరియు క్రమముక్తుల కంటె భిన్నమైన అంశమును ఉపక్రమిస్తూ, ఈ రెండు అంశములకు గల వివేకమును చూపుటకై 'తు' అను అవ్యయమును ప్రయోగించెను. ఈ తేడా ఏమనగా, భగవానుడు ఇవుడు ప్రదర్శించబోవు జ్ఞానము తరువాత లభించేది కాదు; ఇప్పుడు ఇక్కడ పొందదగినది. నీవు బ్రహ్మవు అనే సత్యము నెరుంగుటకై బ్రహ్మలోకమును పొందువరకు వేచియుండనేల?

నీవు బ్రహ్మవు అనునది గీతాదర్శనము. ఆ సత్యము నెరింగిన జ్ఞాని వెను వెంటనే విముక్తుడగును. మానవులందరు విముక్తిని గోరెదరు. 'నేను కోరేది విముక్తి కాదు; నేను కొన్ని వస్తువులను కోరుచున్నాను' అని తలంచువారు భ్రాంతిపడినారు. తాము వాస్తవంగా కోరేది ఏదో వారికి తెలియలేదు. ఆ భ్రాంతిని తొలగించుకొని 'నేనీ క్షణములో కూడ బ్రహ్మనే' అను సత్యము నెరుంగవలెను. నీవు సదా బ్రహ్మవై యున్నావు. నీవు వాస్తవంగా కోరేది ఖచ్చితంగా అది మాత్రమే. శాస్త్రము యొక్క దృష్టి (vision) లో నీవు సంపూర్ణముగా అంగీకారయోగ్యుడవు. 'నాకు అట్టి యోగ్యత లేదు' అని నీవు తలంచినచో, అది తప్పు. ఆ తప్పును సరిదిద్దుటకు జ్ఞానము ఆవశ్యకము. నీవు సర్వదా బ్రహ్మవై ఉండి, బ్రహ్మత్వమును వాయిదా వేయుట మూర్ఖత్వమగును.

ఒక ధనికుడు గలడు. అతని వద్ద గొప్ప సంపద గలదు. కాని అతనికా విషయము తెలియదు. అతడు ధనము కొరకు ఆరాటపడుచుండెను. ఇది అట్లున్నది. ధనికుడు అగుటకై అతడు తాను ధనికుడనను సత్యమును గుర్తించిన చాలును. ఇది కాక మరి ఏమి చేసిననూ, సత్యమును వాయిదా వేసినట్లగును. తాను ధనికుడు కావాలని అతనికి గల ఆకాంక్షకు, అతని ప్రస్తుత వాస్తవ స్థితికి మధ్యలో దూరమేమున్నది? వాటి మధ్య దేశగత దూరముగాని, కాలగత దూరముగాని లేదు. అతడు భవిష్యత్తులో ధనికుడగుట కాదు. అతడు ఇప్పుడే ధనికుడై ఉన్నాడు. ధనికుడనే వ్యక్తిత్వము అతనికి దూరముగా లేదు. అతడు ధనికుడు కాకుండా అడ్డుపడినది అజ్ఞానమొక్కటియే. దానిని తొలగించుకోవాలి.

నీవు ఇప్పుడు ఈ క్షణంలో బ్రహ్మవై ఉన్నావు. బ్రహ్మలోకమునకు వెళ్లి, తరువాత ఈ జ్ఞానమును పొందనేల? ఈ జ్ఞానమును వాయిదా వేయనేల? 'కాదండీ, ఏవో కొన్ని పనులు మిగిలి ఉన్నాయి. కొంత సొమ్ము వెనకేసుకోవాలి' అంటావా? నేను నిన్ను ఒక ప్రశ్న అడుగుతాను. నీకు ధనము దేని కొరకు? 'కొంత భద్రత కొరకు; కొంత ఆనందము కొరకు' అని నీవంటావా?

'బ్రహ్మము సరిగ్గా అదియే' అని నేనంటాను. నీకు భద్రత గలదు. ఆనందము నీదే. నీవు ఆనందంగా ధనమును సంపాదించవచ్చును కూడా. కాని, ధనమును సంపాదించిన తరువాత, నీకు ఆనందము ఇంకనూ లభించలేదనే సత్యమును నీవు కనుగొంటావు. కావున, దుఃఖియగుట అనే ఈ సమస్యను పరిష్కరించుకో. ఆ తరువాత ఆనందముగా నీకు ఏది చేయాలనిపిస్తే, దానిని చేయి. కాని ముమ్మందు సమస్యను పరిష్కరించుకో. నీవే బ్రహ్మవు. నీవు దేనిని వెదుకుతున్నావో, అది నీవే. 'తు' అనే అవ్యయములోని గంభీరార్థ మిదియే. భగవానుడు ఇప్పుడు ఉపదేశింపబోయే జ్ఞానమును ఇప్పుడు ఇచ్చట పొందవచ్చుననే విలక్షణమైన వైశిష్ట్యమును 'తు' అనే పదము నిర్దేశించును.

తత్క్షణముక్తికి ఈ స్పష్టమైన జ్ఞానము ఏకైక సాధనమని శ్రీ శంకరులు వివరించిరి. ఇది సరళమైన జ్ఞానము. దీనిలో అనుభవమేదియూ సమ్మిళితమై లేదు. దీని యందు సాధించవదగిన విశిష్ట అవస్థ ఏమియూ లేదు. 'తు' అను పదముచే విలక్షణముగా నిర్దేశించబడిన ఈ జ్ఞానమును వర్ణించుటకు శ్రీ శంకరులు అనేక శ్రుతులను, స్మృతులను ఉదహరించిరి. ఇది మోక్షప్రాప్తికి సాక్షాత్సాధనము.

ఆత్మైవ ఇదం సర్వమ్ (ఛాందోగ్యోపనిషత్తు, 7-25-2). ఈ సర్వము నీవే. సూర్య చంద్రులు, నక్షత్రములు, తెలిసినవి, తెలియనివి ఇత్యాది ఈ సర్వ జగత్తు నీ కంటె భిన్నముగా లేదు. నీ గురించి ఇంతకంటె అధికముగా ఏమి చెప్పవచ్చును? సర్వము నీవే. నీవు పరిచ్ఛేదరహితుడవు, అనంతుడవు.

ఏకం ఏవ అద్వితీయమ్ (ఛాందోగ్యోపనిషత్తు, 6-2-1). పరమాత్మ ఏకము, ద్వైతరహితము.

శ్రుతి ఈ జ్ఞానమును నిషేధరూపముగా కూడ ప్రకటించును: అథ యే అన్యథా అతో విదుః అన్యరాజానః తే క్షయ్యలోకా భవన్తి. ఎవ్వరైతే ఆత్మను బ్రహ్మము కంటె భిన్నముగా దర్శించెదరో, వారు వినశ్వరమగు అనుభవములకు అధీనులై యుందురు (ఛాందోగ్యోపనిషత్తు, 7-25-2).

మోక్షమును వర్ణించినచో బంధ స్వరూపము సుస్పష్టమగును. అయినను, శాస్త్రము సంశయమునకు తావు లేకుండుట కొరకై బంధమును కూడ నిర్దేశించును. తనను బ్రహ్మకంటె

భిన్నముగా దర్శించు వ్యక్తి తనను తాను మృత్యువునకు అప్పగించినట్లే నని శాస్త్రము నొ వక్కాణించుచున్నది. బ్రహ్మరూపముగా దర్శించు వ్యక్తి విముక్తుడగును.

ఈ జ్ఞానము మాత్రమే మోక్షములో సాక్షాత్సాధనము. మరియొకటి లేదు. ధ్యానము కర్మ, మానసిక ప్రవృత్తి, జీవన మూల్యములు ఇత్యాదులన్నీ ఈ జ్ఞానమును పట్టుకొనుటకు అవశ్యకమగు మనస్సును తయారీ చేయుటలో సహకరించి పరంపరా సాధనములగునే గాని సాక్షాత్సాధనములు కాజాలవు. వంటను చేయుటకు ఇంధనము, పాత్ర ఇత్యాదులన్నీ అవశ్యకమే కాని, అవి అన్నీ కలిసినా వంట అవదు. దానికి నిప్పు కావాలి. అదే విధముగా, మోక్షమునకు 'అహం బ్రహ్మాస్మి' అను జ్ఞానము సాక్షాత్సాధనము. కావుననే, మోక్షమునకు సుస్పష్ట జ్ఞానము మాత్రమే సాక్షాత్సాధనమనియు, మరియొకటి కాదనియు శ్రీ శంకరులు వాక్రుచ్చిరి.

జ్ఞానము విషయంలో, జ్ఞానోదయమునకు అవశ్యకమగు మానసిక తయారీ చాలా ప్రముఖమైన విషయము అగును. 1+1 = 2 అను విషయమును శిశువు అర్థము చేసుకొనుట అసంభవము. ఏలయున, శిశువు ఆ జ్ఞానము కొరకు ఇంకనూ తయారీ కాలేదు. 'నేను బ్రహ్మను' అను జ్ఞానము ఉదయించుటకు, జీవితానుభవములను జీర్ణము చేసుకొనగలిగే ఒక విశిష్ట పరిణతిని మనస్సు పొంది సంసిద్ధము కావలెను.

## అర్హులు ఎవరు?

ఈ జ్ఞానమును విస్తారముగా తాను ఎవరికి ఉపదేశించబోతున్నాడో శ్రీకృష్ణుడిచట వివరించెను. తే = అర్జునా! నీ కొరకు; అనసూయవే = అసూయ లేని వాని కొరకు. సంస్కృతములో అసూయ 'గుణేషు దోష దర్శనమ్ (గుణములున్న చోట దోషము దర్శించుట)' అని నిర్వచింపబడినది. ఒక మహాత్ముని ఉద్దేశించి లోపభూయిష్ఠుడనుట అసూయ యగును. ఇతరులలోని మంచి గుణములను, ఇతరుల విజయములను అంగీకరించలేని స్వభావము అసూయ రూపములో బయటపడును. మానవునకు గల సమస్యలలో ఇది అన్నింటి కంటె పెద్దది. సద్గుణ సంపన్నుడగు కర్ణునకు ఈ సమస్య ఉండెడిది. అతని యందు రాజకుమార లక్షణము లన్నియూ ఉన్ననూ, తాను సూతపుత్రుడ నని అతడు భావించి, ఆ కారణంగా నిర్మాణమైన మనోగ్రంథితో బాధపడెడివాడు. ఆ మనోగ్రంథి అసూయరూపములో బహిర్గతమయ్యెడిది. అర్జునునిలో అట్టి మనోగ్రంథి ఉండెడిది కాదు. కావున, అతనికి అట్టి సమస్య ఉండెడిది కాదు. అందువలననే, అతడు 'అనసూయుః' అని పిలువబడినాడు. అతడు మంచిగుణమును ఎక్కడ

ఉన్ననూ గుర్తించెడివాడు. అర్హుడగు వ్యక్తికి తగు విలువ నిచ్చి, అసూయ లేకుండగా ఆదరించెడివాడు. భగవానుడు పన్నెండు, పదమూడు అధ్యాయములలో అద్వేషము, అమానిత్వము, అదంభిత్వము, అహింస, క్షాంతి, ఆర్జవము ఇత్యాది సద్గుణముల నన్నింటినీ వివరించగలడు. అసూయ లేకుండుట వీటన్నింటికి ఉపలక్షకము. అనసూయా అనే ఒక్క పదములో ఈ గుణము లన్నియూ ఇమిడియున్నవి. ఈ గుణములు గల అర్జునుడు ఈ జ్ఞానమున కర్హుడు.

**ఈ జ్ఞానము రహస్యమైనది**

భగవానుడీ జ్ఞానమును గుహ్యతమమని వర్ణించెను. గుహ్యమనగా రహస్యము. 'తమ' ప్రత్యయమునకు 'అన్నింటికన్నా గొప్పది' అని యర్థము. ఈ జ్ఞానము రహస్యములలో కెల్లా గొప్ప రహస్యమగుటకు కారణమేమి? కారణము లనేకము గలవు.

**ఉపదేశించిననూ ఈ జ్ఞానము అర్థము కాదు.**

ఈ జ్ఞానమును ఎన్నిసార్లు ఉపదేశించిననూ, దానిని అర్థము చేసుకునే వారు చాల అరుదు. దీనిని ప్రదర్శించిన తరువాత కూడా రహస్యముగనే మిగిలిపోవును. ఒకవేళ అర్థమైననూ, ఈ జ్ఞానము వంటబట్టకుండా అడ్డుపడే అంశములు కొన్ని గలవు. కాన, ఈ జ్ఞానము గుహ్యతమమైనది. ఈ జ్ఞానము ఉదయించుటకై మనస్సును సంసిద్ధము చేయుట మానవుడీ జీవితములో సాధించగలిగే అతి గొప్ప విజయము. మానసిక పరిణతి కావాలి. అది తనంత తానుగా రాదు. దాని కొరకై శ్రమపడాలి. ఇందువలననే, వేదాంతమును దాచిపెట్ట పనిలేదని చెప్పెదరు. $E= mc^2$ అను సమీకరణము వలె వేదాంతము తనను తాను దాచిపెట్టును. ఈ సమీకరణమును వందసార్లు వ్రాసిననూ, అది అర్థము కాదు. వ్యక్తి చాల తయారీని చేసుకొని, దానిని అర్థము చేసుకోగలిగే స్థాయికి ఎదగాలి. కాన, ఈ జ్ఞానము గుహ్యతమమగుటలో ఇది మొదటి కారణము.

**ఇది మనకు ఉపలభ్యమయ్యే జ్ఞాన సాధనములకు అందదు.**

మనకు ఉపలభ్యముగా నుండే ప్రత్యక్షానుమానాది ప్రమాణముల చేత గాని, స్వీయ అనుభవము చేత గాని ఈ జ్ఞానమును పొంద శక్యము గాదు. ప్రత్యక్షము ద్వివిధము. ఇంద్రియ ప్రత్యక్షము, సాక్షి ప్రత్యక్షము. కాగితముపై అక్షరమును చూచుట ఇంద్రియ ప్రత్యక్షము. సుఖదుఃఖాది మానసిక అవస్థలు సాక్షి ప్రత్యక్షము. ఆ సాక్షి బ్రహ్మయే నను సత్యము ఈ ద్వివిధ

ప్రత్యక్షమునకు గోచరము కాదు. అది అనుభవాత్మకము కూడ గాదు. కావున, మరియొక ప్రమాణము లేనిదే, 'నేను బ్రహ్మను' అను సత్యమును ఎరుంగు ఉపాయమే లేదు. ఈ తీరున మనకు తెలిసిన ప్రమాణములకు లభించకపోవుట, ఈ జ్ఞానము గుహ్యతమమగుటలో రెండవ కారణము. ఉపదేశము చేత మాత్రమే జ్ఞానము లభించును గనుక, మరియొక ఉపాయము లేదు గనుక, జ్ఞానము గుహ్యతమము.

మిక్కిలి విలువైనది.

ఈ జ్ఞానము పరమ రహస్యమగుటలో దాని విలువ మరియొక కారణము. పవిత్రమైనది, విలువైనది ఏదైనా రహస్యముగనే ఉండును. పెద్ద వజ్రమును బల్లమీద కాగితాలపై పెట్టే బరువుగా వాడరు గదా! అట్లు వాడినచో, అది మరుక్షణములో మాయమగును. విలువైనది అరుదైనది ఏదైనా రహస్యముగా నుంచబడును. కాన అతి రహస్యమైన వస్తువు అతి విలువైనది కూడా అగును.

జ్ఞానం విజ్ఞాన సహితమ్. 'నీవే బ్రహ్మవు అను ఈ జ్ఞానమును నేను నీకీయబోవుచున్నాను. ఈ జ్ఞానము విజ్ఞానముతో కూడి యుండును. బ్రహ్మ ఉన్నది అని సరళముగా చెప్పుట నా అభిప్రాయము కాదు. నీవే బ్రహ్మవు అని నేను నిరూపిస్తాను. విజ్ఞాన సహితమనగా నిదియే. ఈ జ్ఞానము నీ స్వరూపమే అను గుర్తింపు నీకు ప్రత్యక్షమగునట్లు నేను చేసెదను'.

దీని వలన నాకేమి ప్రయోజనము? కాకులకు దంతము లుండవనే రహస్యమును నేను మీకు చెప్పితి ననుకొనుడు. దాని వలన నీకేమి ఒరిగినది? 'నీవే బ్రహ్మవు' అని నేను నీకు చెప్పగా, 'నేను బ్రహ్మను అయినచో కానిమ్ము. దాని వలన నాకు ఒరిగేదేమున్నది?' అని నీవు ప్రశ్నించవచ్చును.

యద్ జ్ఞాత్వా మోక్ష్యసే అశుభాత్. బ్రహ్మవు నీవే. అనగా సర్వము నీవే. ఈ జ్ఞానమును పొంది, నీవు అశుభము నుండి, అనిష్టము నుండి విముక్తిని పొందెదవు. దుఃఖము నుండి, అపూర్ణత నుండి, న్యూనత నుండి, బంధము నుండి, ఒక్క మాటలో చెప్పాలంటే సంసారము నుండి నీకు విముక్తి కలుగును. సంతత పరివర్తన శీలమైన (becoming) జీవితము నుండి నీకు విముక్తి కలుగును.

అంతము నందు మంగళము చేసేది శుభమనబడును. మంగళకరమైన సమాప్తిని సూచించుటకై ఈ పదమును పుస్తకమునకు, ఉత్తరమునకు అంతము నందు వ్రాసెదరు.

మంగళము కాని అంతము. వ్యక్తి మరణించి, దేహము నుండి విముక్తుడైనప్పుడు, అయినా, మంగళకరమైనది కాదు. ఏలయన, మరల జన్మ అరంభమగును గదా! ...రము. దాని నుండి నీవు విముక్తుడ వగుదువు (మోక్ష్యసే). అశుభమనగా ...యూ అర్థము గలదు. అనగా, నీవు సందేహము నుండి విముక్తుడవగుదువు.

...ముని సావధానుని చేయుటకై భగవానుడీ ఉపక్రమ శ్లోకమును చెప్పెను. ఇదే ...తో చెప్పబడిన శ్లోకము మరియొకటి గలదు.

9, శ్లోకము 2:

...विद्या राजगुह्यं पवित्रमिदमुत्तमम् ।
...ावगमं धर्म्यं सुसुखं कर्तुमव्ययम् ॥ २ ॥

...విద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్
...గమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్ (2)

... = ఇది; రాజవిద్యా = జ్ఞానము లన్నింటికీ రాజా; రాజగుహ్యమ్ = రహస్యములలో ...ము; పవిత్రమ్ = పవిత్రము చేయునది; ఉత్తమమ్ = గొప్పది; ప్రత్యక్ష-అవగమమ్ ...గా తెలియబడునది; ధర్మ్యం = ధర్మవిరుద్ధము కానిది; కర్తుం = సాధించుటకు; మిక్కిలి తేలికైనది; అవ్యయమ్ = నాశము లేనిది.

ఇది జ్ఞానము లన్నింటికీ రాజా, రహస్యములలో కెల్లా రహస్యము, గొప్ప పావనమైనది, ప్రత్యక్షముగా తెలియబడునది, ధర్మవిరుద్ధము కానిది, సాధించుటకు మిక్కిలి తేలికైనది, మరియు నాశము లేనిది (2).

...దటి శ్లోకములో ప్రస్తావింపబడిన జ్ఞానము ఇచట విద్య అని పిలువబడినది. ఈ ...రములకు మూలములోని ధాతువుల అర్థము (తెలియుట) సమానమే. మానవుని నుండి విముక్తి చేసే ఈ జ్ఞానము ఇతర జ్ఞానము లన్నిటి కంటె విలక్షణమై ఉండును ...నవే దీనికి రాజ విద్యా అని పేరు. అనగా, జ్ఞానము యొక్క శాఖలన్నింటిలో అని అర్థము.

## ఇది రాజ విద్య అగుటకు కారణమేమి?

### స్వయం ప్రకాశము .

రాజ్యంలో అనేక జనులు ఉంటారు. వారందరిలో అంతిమ అధికారము రాజున ఉండును. అటులనే, ఈ జ్ఞానము రాజా. అనగా జ్ఞానము యొక్క వివిధ శాఖలలో ఇది రా శ్రీ శంకరులు ఈ పదమునకు మూలమగు ధాతువును స్వీకరించిరి. రాట్ అనగా ప్రకాశిం ఇతరములు వేటిపైననూ ఆధారపడకుండగా స్వయముగా ప్రకాశించు విద్య రాజ రాజ్యములోని ప్రజలందరిలో రాజా స్వయముగా ప్రకాశించు వాడు, మహిమాన్వితుడు అగు అటులనే, స్వయం ప్రకాశమగు తత్త్వము ఆత్మ ఒక్కటియే.

స్వయం ప్రకాశమగు ఈ ఆత్మ యొక్క జ్ఞానము, జ్ఞానము అన్నింటిలో రాజా. ఏలయన ఇతర జ్ఞానము అన్నియూ తమను ప్రకాశింపజేసే ఆత్మ తత్త్వముపై ఆధారపడి యుండును ఇతర జ్ఞానము అన్నియూ బుద్ధి యందు ప్రకాశించును. కాని, ఆత్మ తనంత తానుగా ప్రకాశించున (స్వయం రాజతే).

## భేదములు ఉపమర్దితమగును

ఇతర రకముల జ్ఞానము అన్నియూ జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములను విడదీయును. వ్యక్తి తాను పరిచ్ఛిన్నుడనని అనుభూతిని పొందుటకు కారణమీ భేదమే. అట్టి భేదమును ఈ జ్ఞానములు నమర్దించును. ఈ జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ విభాగమే ద్వైతమున కంతకూ మూలము. వ్యక్తిగత భేదములను పరిశీలించుట మన అభిమతము గాదు. ఈ విభాజన ప్రక్రియను మనము శోధించుచున్నాము.

మనమింతకు ముందు చూచిన విధంగా, భేదములన్నియూ మూడు వర్గములుగా నున్నవి: విభిన్న జాతుల మధ్య గల భేదము (విజాతీయ); ఒకే జాతిలో విభిన్న వ్యక్తుల మధ్య గల భేదము (సజాతీయ); ఒకే వ్యక్తిలోని విభిన్న అంగముల మధ్య గల భేదము (స్వగత). ఈ భేదములు గలవని ఎరుంగుటలో సమస్య లేదు. కాని భేదభావన వలన వ్యక్తి తనకు తాను దోషములను, పరిచ్ఛేదములను ఆపాదించుకొనును. వస్తువులు విభిన్నముగ నున్నవి అను భావన నుండి, ఆ విభిన్న వస్తువులలో నేను ఒకడిని అను ధారణ పుట్టును. నేను ఒక విభిన్న వ్యక్తిని. నాకు కొన్ని

గుణములు గలవు. నా కంటె భిన్నముగా నున్న ఈ జగత్తుతో నేను వ్యవహరించుచున్నాను. నేను పరిచ్ఛిన్న వ్యక్తిని. నాకు కొన్ని విలక్షణమగు సమస్యలు గలవు. సమస్యలన్నియూ యుక్తి యుక్తముగనే భాసించుచున్నవి. నేను మరణధర్మిని. లింగము, వయస్సు, రంగు, జాతి ఇత్యాది అసంఖ్యాకములగు గుణములచే నేను పరిచ్ఛిన్నుడ నగుచున్నాను. ఇవి అన్నియూ జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానములనే మౌలిక విభాగము నుండి ఉద్భవించినవి. ఈ విభాగము సామాన్యమైనది కాదు. సంసారమును మన నెత్తిపై రుద్దే విభాగమిదియే. సంసార నాటకములో ఖలనాయక పాత్రను పోషించునదీ విభాగమే.

ఈ భేదము ఇతర విద్యలన్నింటిలో గలదు. మనో విజ్ఞానములో కూడ గలదు. నీవు నీ స్వంత మనోవృత్తిని స్వీకరించి పరిశీలించుము. అది నీ మనోవృత్తియే కావచ్చును. నీవు ఒక దోష లక్షణముతో ఆరంభించి, దాని మూలమును అన్వేషించే యత్నమును చేస్తావు. అనేక వ్యక్తుల ప్రవర్తనను, వారి చరిత్రను పరిశీలించిన మీదట ఒక నమూనా సాక్షాత్కరించును. ఆ నమూనా ఆధారంగా పైన పేర్కొనిన దోష లక్షణమునకు, దాని మూలమునకు మధ్య గల సంబంధమును ఊహించవచ్చును. ఆ నమూనా ఆధారంగా మరికొన్ని నిష్కర్షలను చేసి, ఒక నిర్ణయమునకు రావచ్చును. ఈ విధముగా ఊహించబడిన అల్పజ్ఞానములో కూడా జ్ఞాత, జ్ఞానము మరియు జ్ఞేయము ఉండును. ఈ మనో విజ్ఞానము వ్యక్తి యొక్క అంతరంగమునకు సంబంధించినదే అయినా, అది మన సంసారిత్వమును బలము చేసే విజ్ఞానము తక్క మరియొకటి గాదు.

జ్ఞానము యొక్క సత్యత దానిలో విషయమగు వస్తువు యొక్క సత్యతతో సమముగా నుండును. స్ఫటికము ఎంత సత్యమో, స్ఫటిక జ్ఞానము కూడ అంతే సత్యము. అనగా, స్ఫటిక ధర్మము లన్నియూ స్ఫటిక జ్ఞానములో సమ్మిళితమై యుండును. కాని స్ఫటికమును తెలుసుకొనే జ్ఞాత స్ఫటికము కంటె భిన్నముగా నుండును. కాని, ఆత్మ తెలియబడే వస్తువు కాదు. ఆత్మ జ్ఞానములో 'విషయము' అగు ఆత్మ, దానిని తెలియదగిన జ్ఞాత ఒక్కరే. ఈ సత్యము నెరింగిన వాడు అజ్ఞానము తొలగిపోవును. అజ్ఞాన నాశకమగు వృత్తి కూడ తొలగిపోవును. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ భేదముల లయమే ఆ వృత్తికి ఫలము. ఈ భేదములు నశించగానే, ఇతర భేదము లన్నియూ కూడ నశించును. జ్ఞానాంశము లన్నియూ నేను తక్క వేరుగాదు. సర్వజ్ఞేయములు నా కంటె వేరు గాదు. జ్ఞాత నా కంటె వేరు గాదని చెప్పబని లేదు. ఆ మూడు పూర్ణముగా నాపై ఆధారపడును. ఆత్మ జ్ఞాన ఘనము. ఇది ఎట్లు?

తెలియబడే వస్తువు దృష్ట్యా తెలుసుకొనే జ్ఞాత చేతనుడు(చైతన్య ఆత్మ). వృత్తిరూపమైన జ్ఞానము కూడ చైతన్యము తక్క వేరొండు గాదు. జ్ఞేయ వస్తువు కూడ చైతన్య ఆత్మ కంటె భిన్నము కాదు. వస్తువు సచ్చిదానంద ఆత్మకు బాహ్యముగా నెట్లున్నది? జగత్తులోని సత్తాంశమును గమనించినచో, ఆత్మ కంటె భిన్నముగా ఏదీ లేదు. ఈ జగత్తులోని సర్వము యొక్క ఉనికి సత్తు నందు గలదు. సత్ అనగా ఆత్మయే. జ్ఞాన దృష్ట్యా గమనిస్తే, చైతన్యము కంటె భిన్నముగా జ్ఞానాంశమేదియూ లేదు. చైతన్యము ఆత్మ యొక్క మూలస్వరూపమై యున్నది. ఆత్మ జ్ఞానము నందు ఇవి అన్నియూ అంతర్గతములై యున్నవి. జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను సర్వము నేనే. సర్వ జగత్కారణమగు అద్వయ బ్రహ్మను నేనే (అహం ఏకం అద్వైతం బ్రహ్మ). ఇదియే ఆత్మ విద్య. ఇది విద్య లన్నింటికి మహారాజనుటలో సందేహము లేదు (రాజవిద్యా). ఇతర విద్య లన్నియూ భేద నిర్వాహకములై యుండగా, ఈ విద్య భేదముల నన్నిటినీ కబళించును. ఇదియే యథార్థ జ్ఞానము.

ఇంకొక అడుగు ముందుకు వేసి, ఇదియే యథార్థముగా విద్య యగునని చెప్పదగును. మిగిలినదంతయూ అవిద్య. ఏలయన, భేదము అవిద్య. బ్రహ్మ కంటె భిన్నముగా జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ విభాగము అనేది ఏదీ లేదు. ఈ భేదములు అవిద్యచే సృజింపబడినవి. జ్ఞాత అని తలువబడే ఆత్మపై ఈ భేదము లన్నీ సంపూర్ణముగా ఆధారపడును. జ్ఞాతృ-జ్ఞేయ అన్వేషణ లన్నియూ ఆత్మ పైననే ఆధారపడి యుండును. దీని యర్థమేమి? ఆత్మజ్ఞానము కలిగిన వెంటనే ఈ జ్ఞాతృ-జ్ఞేయ అన్వేషణలు ఉండవా? ద్రష్టృ-దృశ్య, శ్రోతృ-శ్రోతవ్య భేదములు తొలగిపోవును. ఈ భేదములు ఉన్ననూ, భేదము బాధితమగును. జ్ఞాతృ-జ్ఞేయ అన్వేషణ ఉన్నట్లు భాసించినమా, జ్ఞాతృ-జ్ఞేయముల మధ్య వాస్తవ భేదము లేదు.అయినచో, ఈ అన్వేషణ ఎవరి కొరకు? సర్వము ఉన్నట్లుగా ఉండును (ఇవ). జ్ఞాతృ-జ్ఞేయ అన్వేషణ కూడ ఉన్నట్లుగా కన్పట్టును.

విద్య అనదగినది ఇది ఒక్కటియే.

ఇతర జ్ఞానాన్వేషణ లన్నింటిలో, తెలిసిన దాని కంటె తెలియని భాగము చాల అధికముగ నుండు ననుటలో సందేహము లేదు. ఒకప్పుడు మనకు తెలిసినదని భావించినది కూడ తరువాత అసత్యమని తేలును. కావుననే బాధింపబడనిది జ్ఞానము (అబాధితం జ్ఞానమ్) అని మనము జ్ఞానమును నిర్వచిస్తాము. మనకు గల జ్ఞానమంతయూ బాధితమగును. ఏలయన, దృష్టి కోణమును మార్చి చూడగానే, అది కూడా మారిపోవును. 'ఇది బల్ల' అని మనము అంటాము.

కాని, ఇంకో దృష్టి కోణములో అది చెక్క యగును. అంటే, బల్ల బాధితమైనది. కారణ జ్ఞానముచే తత్పూర్వమందున్న కార్యజ్ఞానము పూర్తిగా బాధితమైనది. కొత్త ఆవిష్కారము వెలువడినపుడు, తత్పూర్వమందలి తత్సంబంధి జ్ఞానము బాధితమగును. మరియు, ఏ జ్ఞానమైననూ పూర్ణము కాదు. ఈ విశ్వమును మనము పూర్ణమని స్వీకరించవచ్చును. దానిలో అంతర్గతములై ఉండే విభిన్న జ్ఞానాంశము లన్నియూ పరస్పర సంబంధము కలిగియుండును. పూర్ణములో ఒక లేశమును మాత్రమే తెలుసుకున్న వ్యక్తి ఆ ఎరుకను జ్ఞానమని వర్ణించుట ఎట్లు పొసగును? ఒక వస్తువులో లేశమును మాత్రమే తెలుసుకొని, దానిని పూర్తిగా తెలుసుకున్నామని చెప్పలేము గదా! పూర్ణ వస్తువు తెలియనిదే, భాగమును భాగముగా ఎరుంగటయూ సంభవము గాదు.

దేనిని తెలిస్తే సర్వము తెలియునో, అట్టి విద్య ఇది గాక మరియొకటి లేదు. ఇతర విద్య లన్నియూ తమ వెనుక కొంత అజ్ఞానమును మిగుల్చును. పూర్ణము తెలియనిదే, అంశ జ్ఞానమును సమగ్ర జ్ఞానమని వర్ణించుట పొసగదు. అట్టి పూర్ణము ఆత్మయే. కావున, పూర్ణము నేనే. ఈ పూర్ణము నందు అల్పాంశము లేమియూ లేవు. ఏలయన, ఆత్మ గుణ నిర్ముక్తము. నామరూపము లన్నియూ ఆత్మ యందారోపింపబడినవి మాత్రమే. ఆత్మయే పూర్ణ బ్రహ్మము అను జ్ఞానము పూర్ణ జ్ఞానము. ఏలయన, దాని యందు గుణములు లేవు. గుణములున్నచో వాటిని ఎరుంగవలెను. గుణముల నన్నిటినీ ఎరుంగుట సంభవము కాకపోవచ్చును. కావున అంశ జ్ఞానము వాస్తవంలో అవిద్యయే. అంశ జ్ఞానమును జ్ఞానమని వర్ణించుట పొసగదు.

ఆత్మ భిన్నమగు బ్రహ్మ యొక్క జ్ఞానములో అంశ జ్ఞానము సంభవము కాదు. ఏలయన, ఆత్మలో అంశములు లేవు. ఆత్మ నిష్కలము, పూర్ణము. కాన, మనకి ఆత్మ తెలిస్తే, తెలిసినట్లు. తెలియకపోతే, తెలియదు. అంతే గాని, అంశ జ్ఞానమునకు అవకాశము లేదు. ఆత్మ (నేను) సర్వ పరిచ్ఛేద వినిర్ముక్తము. ఆత్మ అద్వితీయ అనంత చైతన్యము, సర్వ విశేష వినిర్ముక్తము. దీనియందు అంశ జ్ఞానము సంభవము గాదు. కావున, ఒకే ఒక జ్ఞానము సంభవమగును. అదియే ఆత్మజ్ఞానము.

కావున అబాధిత జ్ఞానమనగా నిషేధింప శక్యముగాని జ్ఞానము మాత్రమే కాదు. జ్ఞానమనగా ఇది మాత్రమే అని కూడా ఆ పదము సూచించును.

ఆనందమును కలిగించుటలో రాజైన విద్య.

ఇతర విద్య ఏదైనా, దానిని తెలుసుకున్న వ్యక్తి పొందే అనుభవమెట్లున్నది? పి.హెచ్.డి. పట్టమును పుచ్చుకున్న ప్రతివ్యక్తి హృదయంలో కృతజ్ఞత ఉప్పొంగుతుంది. ఏలయన, తనకు ఎంత తక్కువ తెలియునో, అతనికి మాత్రమే తెలియును. తాను ఎంత చదివినాడో, తనకు తెలిసినది ఎంత తక్కువయో అతడెరుంగును. ఒకచో అతడు పరిశోధనా గ్రంథములో వ్రాసిన విషయము కూడా అతనికి పూర్ణముగా తెలియకపోవచ్చును. దానిలోని ప్రతివాక్యము మరియొక డాక్టరేటు పట్టమునకు కావలసిన పరిశోధనా విషయము అగును. ఈ పరిశోధన ఇట్లు సాగుచునే యుండును. ఒక విశిష్ట క్షేత్రములో గొప్ప పరిశోధనలను చేసిన వ్యక్తి కైననూ తనకు తెలిసిన జ్ఞానముతో సంతృప్తి కలుగదు. ఇక ఇతర క్షేత్రములలో అతని ఎరుక గురించి చెప్పనేల? హృదయమునకు సంతృప్తిని కలిగించుటలో ఆత్మవిద్య విద్యలన్నింటిలో అగ్రస్థానము నందుండును.

అసంతృప్తు లన్నింటియందు అహంకార రూపములో 'నేను' సమ్మిళితమై యుండును. నేను అసంతుష్టుడను. ఈ అసంతృప్తి అహంకారముపై కేంద్రితమై యున్నది. దానిని నీవు ఎట్లు తొలగించగలవు? దానిని తొలగించుట సంభవము కాదు. కాని అహంకారము మిథ్య అనియు, అది సచ్చిదానంద అద్వయ బ్రహ్మ యందు అధ్యారోపమాత్రమే ననియు తెలుసుకొనుట సంభవమే. ఆ జ్ఞానమే రాజవిద్య.

రాజగుహ్యమ్

గుహ్యతమ శబ్దమునకు పూర్వశ్లోకములో చెప్పిన వివరణ అంతయూ మరల ఇచట వర్తించును. ఈ జ్ఞానము గొప్ప రహస్యము. ఇతర రహస్యములు ఏదో ఒకనాడు బట్టబయలగును. కాని ఇది అనంత కాలము వరకు రహస్యముగ నుండగలదు. ఇతర రహస్యములను తేటతెల్లముగా మనము తెలియగల్గుతాము. ఏలయన, మనకు ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములు ఉప లభ్యమగుచున్నవి. కాని ఆత్మ జ్ఞాతృ స్వరూపమై యున్నది. అనగా తనకు తానే రహస్యముగ నున్నాడు. అట్టి ఈ ఆత్మను అతడు ఎట్లు తెలియవలెను? జగత్తులోని రహస్యముల నన్నిటినీ తెలుసుకుంటూ ముందుకు సాగిన ఈ జ్ఞాతకు తెలియని గొప్ప రహస్యము ఇది. అతడు తనను తానే అన్వేషిస్తున్నాడు. అతడు తనంత తానుగా ఈ అన్వేషణలో సఫలము కాలేడు. ఈ రహస్యమును మరియొకరు అతనికి తేటతెల్లమగునట్లు చెప్పవలసియుండును.

నేను నా కళ్లను చూడగోరినా నమకొనుడు. ఇది యుక్తి సంగతమగు కోరిక కాదు. వస్తువులను చూడగనే, నాకు నేత్రములు గలవని నాకు తెలియును. కాని, వాస్తవంలో ళ్లను నేను చూడగోరుట సమస్యయే. నేను ఉన్నాను. నేను చేతనుడను. ఇంతవరకు సమస్య కాని ఆత్మ యొక్క స్వరూపమును తెలియాలంటే సమస్యయే. కళ్లను చూడాలనుకుంటే కావాలి. అటులనే మనము తెలియగోరే ఆత్మ స్వరూపమును పదములు అద్దము వలె థమునుగా చూపగలవు. 'నేనే బ్రహ్మను' అను సత్యమును మనము సాక్షాత్కరించుకోవాలి. రకు అది గొప్ప రహస్యము (రాజగుహ్యమ్)గా మిగిలియుండును.

అది రహస్యమగుటలో దాని పవిత్రత కూడా మరియొక కారణమని మనము శ్లోకములో చూచియున్నాము. విలువైనది ఏదైనా గుహ్యము అగును. విలువైన వస్తువు ంటిలో ఎక్కువ విలువైనది ఆత్మజ్ఞానము. ఏలయన, మిగిలిన వస్తువులు వాటి విలువ పెరిగే ది, మనకు భద్రత తగ్గుతుంది. పదిలక్షల డాలర్ల విలువైన హారము ఒకామె వద్ద ఉండెడిది. మె దానిని భద్రముగా ఇనుపపెట్టెలో దాచి, దాని నకలును మాత్రమే ధరించెడిది. ఎందువలన? దాని విలువ అధికము గనుక. ఈ అధిక విలువ గల వస్తువు వలన ఆమెకు భద్రత పెరిగినదా? తగ్గినదా? తగ్గినది. ఏలయనగా, ఎవరైనను దానిని ఆమె వద్ద నుండి అపహరించే అవకాశము గలదు. పైగా, అపహరించే ప్రక్రియలో ఆమెకు హాని కూడా కలుగవచ్చును. ఈ ప్రపంచములోని విలువైన వస్తువులన్నియూ మనకు భద్రత లేకుండా చేయును. మనకు భద్రతను కలిగించే విలువైన ఒకే ఒక వస్తువు ఈ విద్య. అందువలన అది రాజగుహ్యమనబడును.

ఆత్మజ్ఞానము పావనములలో కెల్లా పావనము

పవిత్రమిద ముత్తమమ్. మనలను శుద్ధులను చేయునది పవిత్రమనబడును. శుద్ధి చేయు పదార్థములు గలవు. వీటిలో ప్రముఖమైనది అగ్ని. అగ్నికి పావకుడు (శుద్ధి చేయువాడు) అని పేరు కూడ గలదు. అయినను, ఆత్మ జ్ఞానముతో సమానముగా శుద్ధి చేయునది మరియొకటి లేదు. ఏలయన, శుచి, అశుచి అను ధారణలను ఆత్మ జ్ఞానము సమూలముగా పెకలించి వేయును. కావున, అది పరమపావనము, సర్వోత్తమము. అసంఖ్యాకములగు జన్మలను, వాటికి హేతువులగు పుణ్యపాపములను ఆత్మజ్ఞానము ఒక్క క్షణములో భస్మము చేయును గాన, అది సర్వోత్తమమని శ్రీ శంకరులు వివరించిరి.

ఒక వ్యక్తి శోచనీయమైన పనిని ఒకదానిని చేసినాడనుకొనుడు. అతని మనస్సులో పశ్చాత్తాపము ఉదయించును. ఆ పని తప్పు అని అతనికి తెలియును. అది తప్పని ఇతరులకు కూడ తెలియును. వారా విషయమును అతనికి స్పష్టము చేసియుండవచ్చును కూడా. ఆ పశ్చాత్తాప భావనను తొలగించే ఉపాయమెద్ది? అతడు తన మనస్సును దానిపై నుండి మరలించుటకు యత్నించవచ్చును. లేదా, ఆ దోషమును ఇంకొకరి నెత్తిపై రుద్దే యత్నమును చేయవచ్చును. లేదా, తన పనిని సమర్థించుకొనవచ్చును. తల్లిదండ్రుల పైకి గాని, లేక గ్రహములపైకి గాని ఆ దోషమును నెట్టి పాపి ననే భావన నుండి విముక్తిని పొందే యత్నము నాతడు చేయవచ్చును. లేదా, తన దోషమును అంగీకరించవచ్చును. కాని ఆ పాపిననే భావన పూర్తిగా తొలగిపోదు. ఆ భావనను ఒకసారి మనస్సులోనికి రానిస్తే,దానిని తొలగించజాలము. మనస్సునకు ఇతరులు ఖేదము కలిగించే విషయములో కూడా నింతే. ఆ ఖేదము యొక్క అవశేషములు మిగిలియుండును. మనో విజ్ఞానము ఆధారంగా గాని, లేక గ్రహజపముల ద్వారా గాని, లేక ధార్మిక కార్యముల ద్వారా గాని ఆ దోషమును క్షాళన చేసుకునే యత్నమును వ్యక్తి చేయవచ్చును. కాని 'అహంకారమే నేను' అను ధారణ ఉన్నంతవరకు అపరాధి భావన మిగిలియుండును. ఇట్టి పాపకార్యముల గుర్తులు అంటిపెట్టుకొని ఉండే కేంద్రకమే అహంకారము. 'ఆత్మ అకర్త' అనే జ్ఞానము కలుగనంతవరకు ఈ పాపపు గుర్తులను పూర్తిగా నిర్మూలించుట అసంభవమగును.

ఆత్మ రూపుడనగు నేను ఏ కాలము నందైననూ ఏ క్రియనైననూ ఆచరించుట లేదు. ఇది సత్యము. ఇది ఆత్మ సంమోహనము (self-hypnotism) గాదు. 'నేను ఒక కర్మను చేయలేదు' అని నన్ను నేను నమ్మింపజూచుట, సమ్మోహమునకు గురిచేయుట సంభవము కాదు. కాని, నేను ఏనాడూ ఏ క్రియనూ ఆచరించలేదు అనునది ఒక సత్యము (నైవ కించిత్ కర్మ కరోమి).

దీనికి దృష్టాంతముగా శ్రీకృష్ణుని గాథ ఒకటి గలదు. శ్రీకృష్ణునకు ఇద్దరు భార్యలు గలరని ఒకప్పుడు గోపికలు పెద్ద చర్చను చేసేరు. ఆయన వారికి ఒక పాఠమును బోధించదలచెను. ఒకనాడాయన యమునా నదీతీరమున విహరిస్తూ, ఆవలి తీరమున ఒక ఋషి ఉన్నాడనియు, ఆయన కొన్ని నెలల నుండి భుజించలేదనియు గోపికలతో చెప్పి, అచటకు వెళ్లి ఆయనకు ఆహారము నిండని చెప్పెను. గోపిక లందరు ఆహారమును తయారుచేసి పళ్లెములలో నుంచుకొని యమునా నదిని దాటుటకై తీరమునకు వెళ్లిరి. కాని యమున పొంగి యుండెను. నదిని

దాటించుటకు పడవలను నడిపే వాళ్లు సిద్ధపడలేదు. అపుడు వారు శ్రీకృష్ణుని వద్దకు వచ్చి, నదిని దాటే ఉపాయమును చెప్పుమని కోరిరి. 'ఓ గోపికలారా! మీరు యమున వద్దకు వెళ్లుడు. శ్రీకృష్ణుడు బ్రహ్మచారి యైనచో, ఓ యమునా! దారిని ఇమ్ము అని ప్రార్థించుడు' అని శ్రీకృష్ణుడు సలహాను ఇచ్చెను. గోపికలు నవ్వి, యమున వద్దకు వెళ్లి, అటులనే ప్రార్థించిరి. వారికి అయన మాటల యందు విశ్వాసము కలుగలేదు. కాని వారు అయన ఆదేశమును పాటించిరి. వెంటనే యమున దారిని ఇచ్చెను. వారు చకితులైరి. 'శ్రీకృష్ణుడు బ్రహ్మచారి కాదు. అతనికి రుక్మిణీ సత్యభామాది భార్యలు గలరు. ఇది ఎట్లు సంభవమయ్యెను?' అనుకుంటూ వారు అవలి తీరమునకు వెళ్లిరి. ఆ ఋషి వారు తెచ్చిన పళ్లెరములలోని ఆహారము నంతనూ భక్షించగా, వారు మరల ఆశ్చర్యపడిరి. వారు మరలి యమున వద్దకు రాగా, నది పొంగియుండెను. అపుడు వారు ఆ ఋషి వద్దకు మరలి వెళ్లి నదిని దాటు ఉపాయమును చెప్పుడని కోరిరి. 'మీరు యమున వద్దకు వెళ్లి, ఆమెను ప్రార్థించుడు. ఓ యమునా! ఆ స్వామి తన జీవితములో ఏనాడూ భోజనము చేయనిచో, మాకు దారిని ఇమ్ము అని కోరుడు' అని అయన సలహానిచ్చెను. వారు అటులనే చేయగా, యమున దారి నిచ్చెను. దీని యర్థమేమి?.

ఆత్మ కర్త, భోక్త కాదని (అహం అకర్తా అభోక్తా ఆత్మా) ఈ కథ వలన మనకు తెలియుచున్నది. కర్తృత్వ భోక్తృత్వములు ఆత్మ యందు ఒక దృష్టి కోణము నుండి ఆరోపింపబడిన ప్రాసంగిక గుణములు మాత్రమే. జ్ఞానేంద్రియముల దృష్ట్యా, మరియు కర్మేంద్రియముల దృష్ట్యా ఆత్మ యందు క్రియ ఆరోపితమై ఆత్మ కర్త యను ధారణ కలుగును. ఒకసారి ఆత్మ కర్త యను ధారణ కలుగగానే, ఆత్మ యందు ఇతర దోషములు అన్నియూ ఆరోపింపబడును. క్రియ ఏదైనా నిర్దోషము కాజాలదు. కావున, పశ్చాత్తాపము, 'నేను అపరాధిని' అను భావన సర్వదా మిగిలియుండును. తప్పును చేయకూడదనే ఆగ్రహము గల వ్యక్తి యైనచో, అతడు పరాజితుడనైతి ననే ధారణచే సర్వదా పీడింపబడును. తాను సక్రమముగా చేయలేకపోయిన పనులను స్మరించి అతడు దుఃఖించును. అట్టి వ్యక్తిని సమాజమంతయూ స్తుతించుగాక! అతడు తాను దేనినీ సాధించలేకపోయితినని దుఃఖించును. కర్తృత్వ ధారణ ఉన్నంతవరకు ఈ దుఃఖమును తప్పించుకొనుట అసంభవమగును. ఆత్మ క్రియలను వేటినీ ఆచరించదని ఎరుంగుట మాత్రమే దీని నుండి తప్పించుకునే ఏకైక ఉపాయము.

మనకు గల సమస్యను పరిష్కరించేది ఏదైనా పవిత్రమనబడును. ప్రార్థన, పూజలు, వ్రతములు, చికిత్స ఇత్యాదు లన్నియూ మనకు పశ్చాత్తాపము, హాని, అలసత్వము, భగ్నాశ,

విలంబనము ఇత్యాదులను నిర్మూలించుకొనుటలో సహకరించును. ఇట్టి పవిత్రము లన్నింటిలో రాజా ఏది? ఆత్మ జ్ఞానము. ఏలయన, ఈ సమస్య లన్నింటికి కేంద్రకముగా నుండే అహంకారము యొక్క ఆటను కట్టించగలిగేది ఆత్మ జ్ఞానము మాత్రమే. అహంకారము నేనే. కాని నేను అహంకారము గాదు. నేను పరబ్రహ్మను. ఈ జన్మలోని కర్మలనే గాక, పూర్వజన్మలలో సంచితమైన పుణ్య పాపములను కూడా ఆత్మ జ్ఞానము నశింపజేయును. ప్రార్థనాదులచే మనము పాపకర్మలను కొంత వరకు నిష్ప్రభావితము చేయగల్గుతాము. 'నేను అపరాధిని' అను భావన కొంత వరకు శమిస్తుంది. కాని, ఎంతటి ప్రాయశ్చిత్త కర్మలైననూ పాపకర్మలను కొంతవరకు మాత్రమే నిష్ప్రభావితము చేయగల్గును. కాని బ్రహ్మజ్ఞానము సర్వమును తుడిచిపెట్టును. వేలాది జన్మల నుండి సంచితమై యున్న కర్మలను మూలముతో సహా అది దగ్ధము చేయునని శ్రీ శంకరులు వివరించిరి.

మూలములో అజ్ఞానము గలదు. అహంకారము దాని కార్యము. జ్ఞానము వాటిని నశింపజేయుటలో విలంబము ఉండదు. జ్ఞానోదయమైన క్షణములో అజ్ఞానము నశించును. 'నేను బ్రహ్మను' అనే జ్ఞానము వ్యక్తికి కలిగినచో, అక్కడితో సరి. ఇది స్వప్నము నుండి నిద్ర లేచుట వంటిది. ఒకడు స్వప్నములో అనేక హత్యలను చేసినాడు. కాని నిద్రనుండి లేవగానే అతడు ఆ హత్యా నేరముల నుండి పూర్తిగా విముక్తుడగును. ఆ హత్యలకు అతడు బాధ్యుడు కాడు. ఏలయన, అతడా హత్యలను చేయలేదు. అట్టిస్థితిలో, ఈ జ్ఞానము యొక్క పవిత్రీకరణ సామర్థ్యమును గురించి చెప్పగలిగిన దేమున్నది? ఇది పరమపావనము (పవిత్ర మిదముత్తమమ్). ఈ జ్ఞానము ఎట్టిది?

### ధర్మ్యమ్ – శాస్త్రవిహితమైనది

మరియు ఈ జ్ఞానము ధర్మ్యము. అనగా శాస్త్ర విహితమైనది. వివిధ కర్మలను, వాటిని అనుష్ఠించు వారికి లభించు ఫలములను శాస్త్రము వర్ణించును. దీనికి ధర్మమని పేరు. కాని ఈ జ్ఞానము పుణ్యపాపములను నశింపజేయును గాన, ఇది ధర్మక్షేత్రములోనిది కాదేమో యను శంక కలుగవచ్చును. ఈ శంక సరిగాదు. ఇది ధర్మాధర్మములను నశింపజేసి వ్యక్తిని వాటికి అతీతునిగా చేయునదే అయిననూ, శాస్త్ర విహితమే. శాస్త్రములో రెండు కాండలు గలవు. జీవునకు సంసారములో అభ్యుదయము ఒక కాండకు ప్రయోజనము కాగా, రెండవది సర్వోన్నతమగు శ్రేయస్సు (మోక్షము) ను ఇచ్చును. కావున, మోక్ష శాస్త్రము దృష్ట్యా ఈ జ్ఞానము

్యము. 'ఆత్మను గుర్తించవలెను, ఆత్మను గురించి వినవలెను, ఆత్మను మననము చేయవలెను, ధ్యానము చేయవలెను (ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః, బృహదారణ్య కోపనిషత్తు, 4-5-6)' ఇత్యాది శాస్త్రవచనములను బట్టి, ఈ జ్ఞానము శాస్త్ర విహితమని మనకు తెలియుచున్నది. 'ఆత్మా వా అరే ద్రష్టవ్యః ....' అను వాక్యములోని తవ్య ప్రత్యయము విధిని సూచించును. శాస్త్రము ఒక కర్మను విధించిన సందర్భములో, సాధకుడు సంకల్పశక్తిని వినియోగించి ఆ కర్మను అనుష్ఠించ వలసి యుండును. పురుషుడు తన సంకల్పశక్తిచే విధిని అనుష్ఠించును. కాని మోక్ష శాస్త్రములో ఆత్మ జ్ఞానము విషయములో, విధి ...ము సామాన్యాకారముగా తెలుసుకొనే పద్ధతిలో వర్తించదు. ఏలయన, ఇచటి విషయవస్తువు ...వే. 'తత్ త్వం అసి (నీవే బ్రహ్మవు)' అనునది ఆదేశము కాదు. 'నీకు మోక్షము కావాలంటే, ...వు బ్రహ్మవు అగుట మంచిది' అని శాస్త్రము చెప్పుట లేదు. ఇది సరళమగు సత్య కథనము. సత్య కథనములో అన్వేషణ ఏమి గలదు? నీవు నీవుగా ఉండుటకై కర్మలను చేయనక్కరలేదు. దీని యందు కర్మలకు తావులేదు. కాని, కొన్ని ఏర్పాట్లను చేసుకోవాలి. సత్యము ఏదైనా, దానిని తెలుసుకోవాలి. అంటే, శాస్త్రము నిర్దేశించిన తీరున విచారమును చేయవలెను (ఆత్మా వా అరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసి తవ్యః). ధర్మ్యమ్ అను పదమునకు శాస్త్రాంతర్గతమైనది, బహిర్గతమైనది కాదు అని ఒక అర్థము.

### ధర్మ్యమ్–ధర్మమునకు ఏనాడూ విరుద్ధము కాదు

ధర్మ్యమ్ అనగా ధర్మమునకు ఏనాడూ విరుద్ధము కానిది. ధర్మమనగా నేమి? అని విశ్లేషిస్తే, అది ఈశ్వర స్వరూపమైన నియతి అని తెలుసు. నీవు ఆ నియతికి భిన్నంగా లేవు. నీకు గల భేదభావన, నీ అహంకారము బాధితమగును. అప్పుడు నీకు భయము ఉండదు. 'నేను ఒంటరిని, సర్వము కంటె వేరుగా నున్నాను' అను భీతి నీకుండబోదు. 'నేను బ్రహ్మను' అను జ్ఞానము ఉదయించిన పిదప నీవు నీ సామర్థ్యమును ఇతరుల యెదుట నిరూపించ బని లేదు.

గీతారంభములో అర్జునుడు తానున్న పరిస్థితిచే పరాభూతుడై, ధర్మాధర్మముల విషయములో భ్రాంతుడై యుండెను. కాని, అతడు సత్సంస్కారములు గలవాడు. అతని సంస్కృతిని బట్టి, మోక్ష శాస్త్రము ఒకటి గలదని అతడు ఎరుంగును. అతడు తన సమస్యకు శాశ్వత పరిష్కారమును గోరి, శ్రీకృష్ణుని ఉపదేశించు మని ప్రార్థించెను.

ఈ జ్ఞానము నీ గురించియే గనుక, బుద్ధి తన సావధానతను తన వైపునకు అంతర్ముఖము చేసుకోవాలి. సంస్కృతము కాని బుద్ధి యందు ప్రమాణము ఉండదు గాన, అది అంతర్ముఖము కాజాలదు. నీకు ప్రమాణము కావాలి. కావున, నీవు గురువు ఉపదేశించే శాస్త్రముచే నీ బుద్ధిని ఉద్భాసితము చేయవలెను. చదువు ఏదైనా, గురుశిష్యుల బుద్ధులు సమానరూపమైన స్థితిలో మాత్రమే గురువు శిష్యునకు జ్ఞానము నందియ గల్గును. అపుడు మాత్రమే గురువు బుద్ధిలో నున్న జ్ఞానమును శిష్యుడు పొందగల్గును. ప్రస్తుతంలో శ్రీకృష్ణుని బుద్ధి అర్జునుని బుద్ధి యగును; లేదా, నీ బుద్ధి యగును. కావున, గురువుచే ఉద్భాసితమైన నీ స్వీయబుద్ధియే నీకు యథార్థమగు గురువు అగును.

అట్టి స్థితిలో గురువు 'తత్ త్వం అసి' అని బోధించగల్గును. సర్వ కారణమగు ఆ బ్రహ్మము నీవే. ఈ ప్రక్రియలో 'నేను' మనస్సు నందు గాని, బుద్ధి యందు గాని తాదాత్మ్యమును పొంది యుండదు. కావున, అహంకారము పూర్తిగా తొలగిపోయి, దాని స్థానములో పూర్తిగా విలక్షణమైన అహంకారము ఉండును. శ్రీకృష్ణుడు మాటలాడుటను బట్టి, ఇట్టి అహంకారము ఉండునని తెలియుచున్నది. కాని, ఇది ఉద్భాసిత అహంకారము, బాధిత అహంకారము. అభద్రతా భావన, భయము, మరణభీతి ఇత్యాదిగా గల, అహంకార సీమలను నిర్ధారించే విభిన్న గుణములు దాని యందు ఉండవు గాన, ఆ అహంకారమునకు తన సామర్థ్యమును ఇతరుల యెదుట నిరూపించవలసిన అవసరము ఉండదు. ప్రతి వ్యక్తి తాను ఏదో కావాలని కోరుకుంటాడు. కాని జ్ఞాని తానే జగత్కారణమని కనుగొంటాడు.

ఈ జ్ఞానమును పొందిన వ్యక్తి ఎట్టి కర్మలను చేయును? ఆయన యొక్క ఆత్మ జ్ఞానము ధర్మమునకు విరోధియా? అమానిత్వ, అదంభిత్వ, అహింసా, క్షాంతి, ఆర్జవ, ఆచార్యోపాసన, శౌచ, స్థైర్య, ఆత్మ వినిగ్రహాది సద్గుణము లన్నింటికి ఈ జ్ఞానము విరోధియా? కాదు. ఈ గుణములన్నియూ జ్ఞాని యందు సహజముగా నుండును. సహజ ప్రవృత్తము, విశ్వజనీనము కానిచో, అది జీవనమూల్య మెట్లగును? ప్రేమ, అనురాగము, దయ, మైత్రి, ఇచ్చి పుచ్చుకునే స్వభావము ఇత్యాదులన్నీ అతి సహజములు. వాటిని మనము సృష్టించలేదు. అవి సృష్టి నియతిలో భాగములై యున్నవి. ఆ నియతియే పరమేశ్వరుడు. కావున, ఈ జ్ఞానము గల జ్ఞాని యొక్క జీవన మూల్యములు ధర్మమునకు, నియతికి అవిరుద్ధములై (ధర్మాత్ అనపేతమ్) ఉండును. ఇట్టి జీవనమూల్యములు జ్ఞానిలో సహజ ప్రవృత్తము లగును. జ్ఞానము ఉదయించుటకు పూర్వము నీవు దయా స్వభావమును, ప్రేమించే స్వభావమును కలిగి ఉండుటకు యత్నించితివి.

నీవు మానసిక పరిణతిని పొందుటకై ఇతరుల యందు సానుభూతిని కలిగియుంటివి. నీ స్థాయిని పెంచుకొనుట కొరకై దానమును చేయ ప్రయత్నించితివి. పరిణతి చెందిన వ్యక్తిగా నీవు ఇతరుల అవసరములను గుర్తించి, తదనుగుణముగా స్పందించెదవు. నీవు సదా సావధానుడవై ఉండెడివాడవు. ఈ సావధానత సాధకునకు చాల అవశ్యకము. కాని, జ్ఞానము ఉదయించిన తరువాత, ఇంతకు ముందు ఉండే సాధన అలంకారముగా మారును. జ్ఞాని పూర్ణుడు గనుక, ధర్మవిరుద్ధముగా ఆచరించే అవశ్యకత అయనకు ఉండదు. అధర్మము నుండి పొంద దగినది అయనకు ఏదీ ఉండదు.

మానవుడు చేయు తప్పు పని వెనుక భయము గాని, లోభము గాని ఉండును. మానవుడు న్యూనతా భావనను కలిగి యుండుటచే లోభి యగును. 'ఈ ప్రపంచము నన్ను పరాభూతుని చేయుచున్నది' అను భావనచే మానవుడు భయభీతుడగును. ఇదంతా అజ్ఞానము వలన కలుగును. అట్టి అజ్ఞానము తొలగిన తరువాత, అధర్మమునకు అవకాశమెక్కడిది? జ్ఞానికి ధర్మము సహజ ప్రవృత్తమగును. ఆత్మ జ్ఞానము, ధర్మము ఒకదానికి మరియొకటి తోడుగా నుండును. కావున, ఈ జ్ఞానము ధర్మ్యము (ధర్మాత్ అనపేతమ్).

## సుసుఖం కర్తుమ్

మరియు, అది చాల తేలిక – నీవు దాని కొరకై సంసిద్ధుడవైనచో.

భగవానుడీ జ్ఞానమును రాజ విద్యా, రాజగుహ్యమ్, పవిత్రమ్ ఇత్యాదిగా వర్ణించినాడు గాన, దీనిని పొందుటకు మనకు సాధ్యము కాదేమో యను భయము కలుగవచ్చును. సాధకుడు సాధనను అరంభించుటకైననూ ఈ భయము బాధకమగును. కావున, ఈ శంకను తొలగించవలసి యున్నది. ఒక వ్యక్తిని అతని శక్తికి మించిన బరువును ఎత్తుమని చెప్పినామనుకొనుడు. ఆ బరువును చూడగానే అతనికి నీరసము వచ్చును. అదే విధముగా, ఈ జ్ఞానమును పొందుటలో చాల శ్రమగలదను భావము మనకు కలుగవచ్చును. వాస్తవంలో, జ్ఞాన సాధన చాల తేలిక (సు సుఖం కర్తుమ్). ఏలయన, నీవు శ్రమ పడవలసిన దేదియూ లేదు. తెలుసుకున్నచో చాలును. జ్ఞానసాధనము (ప్రమాణము) సిద్ధముగా నున్నది. ఆచార్యుడు గలడు. నీవు నీ బుద్ధిని ఉపదేశముచే ఉద్భాసితము చేసిన చాలును. శాస్త్రము అహంకారమును అంతమొందించును. ఈ క్షణములో నీకు ఈ పదములు కనబడుచున్నవి గదా! దానిలో నీవు చేసే శ్రమ ఏమి గలదు? నీ కన్నులు

తెరచియున్నవి. ముద్రించిన పుట నీ ఎదుట నున్నది. పదములు కానవచ్చుచున్నవి. నీవు చేయుచున్నది ఏమీ లేదు. నీ కన్నులు తెరచియుండుటచే, అక్షరములు కనబడుచున్నవి. నీవు చూడకూడదని అనుకున్నా, కన్నులు తెరచియున్నచో చూచుట తప్పదు. నీ కన్నులు చూచు దానిని నీ మనస్సు గ్రహించుచున్నది. సర్వ జ్ఞానముల విషయములో పరిస్థితి ఇదియే. ఆత్మ సచ్చిదానందము. నీవు నీ బుద్ధిని ఉపదేశముచే ఉద్భాసితము చేసి, పదముల యర్థమును యథాతథముగా దర్శించవలెను. నీవు చేయవలసిన దింతే. దీనిలో నీ సంకల్పశక్తి గాని, ప్రయాస గాని అవశ్యకము గాదు. సమర్పణమనగా నిదియే. నీవు చేయవలసినది ఏదీ లేదు. ఆత్మ స్వరూపమును చూపుట అను పనిని పదములు చక్కబెట్టును. ఇదియే ఉపదేశము. కావున ఇది సుసుఖం కర్తుమ్.

జ్ఞానము ఏదైనా పరిస్థితి ఇదియే. వ్యక్తి తగినంతగా సంసిద్ధుడైనచో (అధికారిత్వము) జ్ఞానము తేలిక యగును. ఆత్మ జ్ఞానమునకు ఆవశ్యకమగు సంసిద్ధత మానసిక పరిపక్వతయే. నీవు నేర్చుకొనుటకు సిద్ధముగా నున్నచో, పరిపక్వతను పొందుటకు నిత్య జీవితములోని అనుభవములు చాలును. నీవు నీ ప్రవర్తనను, ఇతరుల ప్రవర్తనను గమనించుము. పరిణతిని పొందుటకై అసాధారణమగు అనుభవము అక్కరలేదు. ఉన్న అనుభవములను విశ్లేషించుకుంటే చాలును. పరిణతిని చెందుటకు నీవు అసాధారణ వ్యక్తివి కానక్కరలేదు. నీవు స్వీయ ప్రవృత్తి విషయంలో, నీ ఆలోచనల విషయంలో ఎట్టి సావధానతను కనబరచెదవు? అను విషయముపై నీ పరిణతి పూర్తిగా ఆధారపడి యుండును. దీనికి ఎవరి అనుభవములు వారికి చాలును. సమాజము మనకు నిరాశా నిస్పృహలను, క్రోధమును కలిగించే పరిస్థితులు తగినంతగా కల్పించును. పరిణతి చెందుటకు కావలసిన సామగ్రిని అందజేయుటలో సమాజము వెనుకాడదు. నీవీ సత్యమును గుర్తించినచో చాలును. నీకు పరిణతి లభించుట నిశ్చయము. ఇట్టి పరిణతిని చెందిన వ్యక్తికి ఈ జ్ఞానము సుసుఖం కర్తుమ్.

ఫలమును దృష్టిలో నిడుకొని ఆలోచిస్తే, ఈ జ్ఞానమును పొందుట మిక్కిలి కఠినమైన కార్యమని తోచును. ఏలయన, 'సర్వము నేనే' అని ఉపదేశింపబడును. ఫలము అల్పమైతే ప్రయాస అల్పమనియు, ఫలము అధికమైతే ప్రయాస అధికమనియు మనము సాధారణంగా అనుకుంటాము. అట్లైనచో, పూర్ణఫలమును పొందుటకు ప్రయాస ఎంత ఉండునో! పూర్ణ ప్రయాస అనేది ఏదీ లేదు. అవసరం కాదు కూడా. నీవు బ్రహ్మ అగుటకై 'నేను బ్రహ్మను' అని తెలుసుకుంటే చాలును. ఇది సరళమగు జ్ఞానము గాన, చాల తేలిక (సుసుఖమ్). ఇది రత్న

పరీక్ష వంటిదని శ్రీ శంకరులు చెప్పినారు. రత్న పరీక్షలో నిపుణుడగు వ్యక్తి వజ్రము మంచిదా, పకిలీదా అను విషయమును కొద్ది క్షణములలో తేల్చి చెప్పును. దీనికి విశిష్ట నైపుణ్యము ఆవశ్యకమగును గాన, శ్రీ శంకరులు రత్న దృష్టాంతము నిచ్చిరి. జ్ఞాని ఆత్మ జ్ఞానమనే నిపుణతను కలిగియుండును గాన, 'నేనే బ్రహ్మను' అను సత్యమును తేలికగా తెలుసుకొనును. నామరూపము లన్నియు అనాత్మ అనియు, ఆత్మ చైతన్య ఘనమనియు, ఆత్మ సన్నిధిలో సర్వ వస్తువులు తెలియబడుచున్న వనియు జ్ఞాని స్పష్టముగా ఎరుంగును. అతనికి ఈ ఎరుకలో సమస్య లేదు. తెలియుట చాల తేలిక. ఇతరము సర్వము ప్రయాస సాధ్యము. బ్రహ్మలోక ప్రాప్తికి సర్వాధికముగా సమయము, ప్రయాస ఆవశ్యకమగును. అది ఒక కర్మఫలము. కర్మఫలము లన్నింటికీ ఉండే యథార్థమైన ప్రయోజనము అధికారిత్వము, తద్వారా జ్ఞానము. దీనికి కావలసినది వివేకము. ఆత్మ బ్రహ్మ భిన్నము అని గుర్తించుట చాల తేలిక (సుసుఖం కర్తుమ్).

## ప్రత్యక్ష - అవగమమ్

నేనీ జ్ఞానమును పొందవలెను. పొందే ఉపాయమేమి? వైకుంఠాది స్థానముల గురించి చెప్పిన వెంటనే నాకు వాటి పరోక్ష జ్ఞానము కలుగును. ఆ జ్ఞానము తరువాతి కాలములో సత్యముగా నిరూపితమగునని ఆశించవచ్చును.

ఈ జ్ఞానము ప్రత్యక్షముగా తత్కాలమందు తెలియబడేది (ప్రత్యక్షావగమమ్) అని భగవానుడు చెప్పుచున్నాడు. ఉదాహరణకు, నేను ఘటమును తెలుసుకోవాలి. అంటే నాకు ప్రత్యక్ష జ్ఞానము కలగాలి. 'ఇది ఒక ఘటము' అని చెప్పినప్పుడు నాలో ఘటాకారవృత్తి ఏర్పడి నాకు గల ఘట-అజ్ఞానము తొలగును. ఈ వృత్తి ఏర్పడాలంటే, నేను ఆ ఘటమును చూడవలెను. అటులనే, ఆత్మజ్ఞానము కలగాలంటే, ఆత్మ దృశ్యము కావాలి. దాని వృత్తి కలిగి ఆత్మ-అజ్ఞానమును నిర్మూలించవలెను. ఆ వృత్తి శాస్త్రోపదేశము వలన జనించును. అది నాకు ప్రత్యక్ష జ్ఞానము (ప్రత్యక్షావగమమ్)ను కలిగించి, నా యందు గల ఆత్మ-అజ్ఞానమును నిర్మూలించును.

## అవ్యయమ్

ఆ జ్ఞానములో విషయమగు వస్తువు నాశము లేనిది (అవ్యయమ్). ఆ జ్ఞాన వృత్తి నశిస్తుంది (వ్యయమ్). కాని ఆత్మ జ్ఞానము నశించదు. ఏలయున, వస్తువు ఎంత సత్యమో, దాని జ్ఞానము కూడా అంతే సత్యము అగును. ఆత్మ కాలాధీనము గాదు. ఆత్మ నిత్యము. కావున

ఆత్మ జ్ఞానము కూడ నిత్యమే. జ్ఞానములో విషయమగు ఈ వస్తువు నిత్యము గనుక, ఈ జ్ఞానమును నిలబెట్టుకొనుటకు స్మృతి ఆవశ్యకము కాదు. నేను శతాధిక విభిన్న వస్తువులను స్మరించెదను. కాని ఆత్మను ఏనాడూ స్మరించను. ఏలయన, ఏ ఆత్మ వలన స్మృతులన్నియూ సంభవమగుచున్నవో, ఆ ఆత్మయే నేను. ఈ జ్ఞానము అవ్యయము. ఏలయన, అది నా స్వరూపము. నాకు నేను ఏనాడూ దూరము కాను గదా! నేను ప్రపంచమును చూచే సమయంలో సచ్చిదానందుడను; చూడని సమయంలో కూడా సచ్చిదానందుడను. నేనీ పదములను జపింప బని లేదు. ఈ పదములు సాక్షాత్కారము కొరకు ఉద్దేశింపబడినవే గాని, జపము కొరకు గాదు. చిత్ అనగా ఆత్మ అజ్ఞానము గాదనియు, ఆత్మ చైతన్య స్వరూపమనియు చెప్పే లక్షణము. ఆనందమనగా ఆత్మ సర్వ పరిచ్ఛేద విముక్తమని బోధించే లక్షణము. కావున, ఈ పదములు జ్ఞాన బోధకములే గాని, జపము కొరకు గాదు. సచ్చిదానందోऽహమ్ అని జపించి, మనము సచ్చిదానందుని అనుగ్రహమును ప్రార్థించుచున్నామని భావించరాదు. సత్, చిత్, ఆనంద అను పదములు బోధించే అర్థమును దర్శించుటకు ప్రయత్నిస్తూ, ఈ పదములను పదే పదే ఉచ్చరించవచ్చును. ఇది నిదిధ్యాసనమునకు దారిని సుగమము చేయును. ఇది కూడా ఒక రకం శ్రవణమే.

ఇచట మరియొక ప్రశ్న ఉదయించును. ఒకానొక జ్ఞానికి మెదడులోని స్మృతి కేంద్రములో రక్తము గడ్డ కట్టినదనుకొనుడు. అతనికి స్పృహ వచ్చిన తరువాత తన పేరును, ఇతర పరిచిత వ్యక్తులను కూడ మరచినాడు. ఒకప్పుడాతనికి ఉపనిషత్తులన్నియూ కంఠస్థమే. కాని ఇపుడాతడు సర్వమును విస్మరించినాడు. అట్టి స్థితిలో ఈ జ్ఞానము అవ్యయమని ఎట్లు చెప్పగలము? తాను సచ్చిదానంద స్వరూపుడనని అతనికి తెలియదా? అతనికి ఆ పదములు గుర్తుండకపోవచ్చును. కాని అతని మూల అజ్ఞానము తొలగిపోయినది. కావున, అతనికి పునర్జన్మ ఉండదు. ఇది నిద్రలోని పరిస్థితి వంటిది. తాను బ్రహ్మనని ఎరింగిన జ్ఞాని నిద్రించినాడనుకొనుడు. నిద్రలో అతనికి ఆ జ్ఞానము లభ్యము కాదు గదా! దాని అర్థము అతనిలో అజ్ఞానము మరల ప్రవేశించినదని గాదు. అటులనే, ప్రస్తుత దృష్టాంతములో జ్ఞాని యొక్క అంతఃకరణము సరిగా పనిచేయుట లేదు. కాని అతడు ఒకసారి జ్ఞానమును పొందినాడు గనుక, అతనిలో ఆత్మ-అజ్ఞానము మరల ప్రవేశించే ప్రసక్తి లేదు. కావున అతడు పునర్జన్మను పొందే సమస్య లేదు. ఈ జ్ఞానము అవ్యయము. ఏలయన దాని ఫలము నీవే. నీవు అవ్యయుడవు. కాన, ఈ జ్ఞానము తొలగిపోయే ప్రసక్తి లేదు.

ఈ జ్ఞానము యొక్క వర్ణన పొగడ్త కానే కాదు. నన్ను ఒక మహా ధనవంతునికి యం చేస్తూ, 'ఈయన ఈ నగరమును కొనగలడని' చెప్పినా వనుకో. నీవాతనిని పొగడుట నీవు సత్యమునే చెప్పుచున్నావు. అదే విధముగా, ఈ జ్ఞానము రాజవిద్యా, రాజగుహ్యం, ఉత్తమమ్, ప్రత్యక్షావగమమ్, సుసుఖం కర్తుమ్ అను వర్ణన సత్యము. వాస్తవంలో, ను వర్ణించుటకు ఈ పదములు కూడా చాలవు. మనమెంత వర్ణించినా, భగవానుని పూర్ణత తక్కువగనే ఉండును. భగవానుని ప్రశంస ఎన్నడూ మిథ్యా ప్రశంస కాదు. ఈ భగవద్ ను ఎంత వర్ణించినా, దాని యథార్థ స్థితికి తక్కువ మాత్రమే యగును. ఈ వర్ణన కంటె గు వర్ణనకు కూడా ఈ జ్ఞానము అర్హమైనదియే.

ఈ వర్ణన నంతయూ వినిన తరువాత అర్జునుడు మరింత సావధానుడై శ్రద్ధగా వినును. నకు ప్రయోజనమదియే. పైగా, ఈ పదము లన్నియూ కలిసి, ఉపదేశింపబడే జ్ఞానము స్వరూపమును బోధించును. మనము పొందే ఉపదేశము యొక్క స్వరూపమును టియూ ఉపదేశములో భాగమే గదా! ఈ ఆధ్యాత్మిక రంగములో తాము దేని కొరకు స్తున్నామో చాల మందికి తెలియదు. ఇది ఈ రంగములో ప్రముఖ సమస్య. ఈ జ్ఞానము స్వరూపము తెలియని సాధకులు తమను పూర్తిగా మార్చివేసే ఏదో ఒక అసాధారణ ు కొరకు ఎదురుచూస్తారు. ఆత్మ ఒకానొక ఘటన కాదు. ఘటన లన్నింటికీ ఆలంబనము కావున, ఈ జ్ఞాన స్వరూప వర్ణనము ఆవశ్యకము.

నీవు బ్రహ్మ అగుటకై ఏ పనినీ చేయనక్కరలేదు. నీవు నిన్ను మార్చుకొనక్కర లేదు. నేను ధనవంతుని దృష్టాంతము నిచ్చి యున్నాను. నీవు ధనవంతుడవై యుండి 'నేను డను' అనే భావనలో ఉన్న పక్షంలో, నీవు ధనవంతుడవు అగుటకు ఆ సత్యమును గ్రహిస్తే ను. అంతకు మించి చేయునది లేదు. సత్యమును గ్రహించుటకై, నీవు వినుటకు సంసిద్ధుడవు లి. 'నేను దరిద్రుడను' అనే భావన దృఢముగా నున్న వ్యక్తి వినుట కూడా దుష్కరమే గును. 'నా పితామహుడు దరిద్రుడు. నా తండ్రి దరిద్రుడు. నా మాతామహుడు కూడా ద్రుడే. నా సోదరుడు దరిద్రుడు. నా మిత్రులందరూ దరిద్రులే. నేను దరిద్రుడనని నాకు గా తెలుసు' అని అతడు భావించును. అతని వద్దకు వెళ్లి 'నీవు సంపన్నుడవు' అని చెప్పినచో, డు విశ్వసించునా? అట్లు చెప్పినవాడు పిచ్చివాడని తలంచి, అతడు ముష్టి ఎత్తుకొనుటను నసాగించును. దరిద్రుడు దుఃఖియై ఉండును. ఈ జీవనవేదికపై మనము సర్వదా ఆనందమును యాచిస్తూ ఉంటాము. అదృష్టదేవత ఇచ్చే ఆనందక్షణముల కొరకు ఎదురుచూస్తూ ఉంటాము.

మనము ఒక ఆనందఘడియ కొరకై ప్రార్థనలను చేస్తాము. అట్టి క్షణము పుట్టుటకు అనుకూలమైన పరిస్థితులను నిర్మించే ప్రయత్నమును చేస్తాము. పరిస్థితులలో మార్పును తెచ్చే ప్రయత్నముల వలన ఆనందము లభించుననే హామీ ఏనాడూ మనకు లేదు. ఒకప్పుడు ఆ ఆనంద ఘడియ వచ్చుసరికి మనము పూర్తిగా అలసిపోయి, దానిని అనుభవించ లేకపోవచ్చును. దరిద్రుని దుస్స్థితి ఇట్లుండును. అట్టి వానికి 'నీవు ఆనందఘనుడవు' ఇత్యాది వాక్యములు నమ్మశక్యము గాకుండును. అతడు ఆగి ఈ మాటలను వినుటకై అతనిలో శ్రద్ధ అనే గుణము ఉండాలి. శ్రద్ధ కొద్దిగా ఉంటే చాలదు. చాలా శ్రద్ధ కావాలి.

అధ్యాయము యొక్క విషయ వస్తువు రాజ విద్య అనియు, రాజగుహ్యము అనియు పరిచయము చేసిన తరువాత శ్రీకృష్ణ భగవానుడు, ఈ జ్ఞానమును పొందిన మానవుడు బంధ విముక్తుడగు నని చెప్పెను. కావున ఈ జ్ఞానము కొరకై శ్రద్ధతో సాధన చేయుటకు హేతువు తగినంత గలదు. జ్ఞాన స్వరూపము నందు, జ్ఞానఫలము నందు కూడ శ్రద్ధ ఉన్నప్పుడు మాత్రమే సాధకుడు శ్రవణమునకు ప్రేరితుడగును. ఇందువలనే, ఈ రెండు శ్లోకములలో ఈ రెండు అంశములు కూడ వర్ణించబడినవి. శ్రద్ధ లేనివాడు ఎంత అధికముగా నష్టపోవునో అను విషయమును భగవానుడు శ్రద్ధను పెంపొందించుటకై తరువాతి శ్లోకములలో వర్ణించుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 3:**

अश्रद्दधानाः पुरुषा धर्मस्यास्य परन्तप ।
अप्राप्य मां निवर्तन्ते मृत्युसंसार वर्त्मनि ॥ ३ ॥

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసారవర్త్మని (3).

హే పరంతప = శత్రువులను తపింపజేయు ఓ అర్జునా!; అస్య = ఈ; ధర్మస్య = ధర్మమునకు (నందు); అశ్రద్ధధానాః = శ్రద్ధ లేని; పురుషాః = పురుషులు; మాం = నన్ను; అప్రాప్య = పొందజాలక; మృత్యు సంసారవర్త్మని = మృత్యుగ్రస్తమైన సంసార మార్గము లోనికి, నివర్తంతే = మరలిపోయెదరు.

శత్రువులను తపింపజేయు ఓ అర్జునా! ఈ ధర్మము నందు శ్రద్ధ లేని పురుషులు నన్ను పొందజాలక, మృత్యుగ్రస్తమైన సంసారమార్గము లోనికి మరలిపోయెదరు (3).

పరంతపా! (శత్రువులను సంహరించు యోద్ధ) అని శ్రీకృష్ణుడు అర్జునుని సంబోధించెను.

అశ్రద్దధానాః పురుషాః. శ్రద్ధ ధానాః అనగా శ్రద్ధ గల పురుషులు. శ్రద్ధ లేనివారు అశ్రద్ధ ధానాః. జ్ఞాన స్వరూపమును గురించి, జ్ఞాన ఫలమును గురించి శాస్త్రము, ఆచార్యుడు చెప్పే వాక్యములు సత్యమై యుండుననే సందేహ లాభమును శాస్త్రమునకు ఇచ్చే ప్రవృత్తి శ్రద్ధ యనబడును. 'జగత్కారణ మగు పరబ్రహ్మ ఆత్మ కంటె భిన్నము కాదు' అనే ఈ ఆత్మ జ్ఞాన స్వరూపము నందు సాధకునకు శ్రద్ధ ఉండవలెను. సాధకునకు ఈ సత్యమింకనూ సాక్షాత్కరించలేదు. కాని, శాస్త్రము సత్యమనే విశ్వాసము అతనికి ఉండవలెను. బంధము, పరిచ్ఛేదము ఇత్యాది భావన లన్నింటి నుండి విముక్తిని కలిగించుట ఈ జ్ఞానమునకు ఫలము అను ఫల విషయములో కూడ శ్రద్ధ ఉండవలెను. సాక్షాత్కారము గల వానికి శ్రద్ధతో పనిలేదు. కాని సాక్షాత్కార పర్యంతము సాధకుడు శ్రద్ధను కలిగియుండి జ్ఞానసాధనను కొనసాగించవలెను.

అస్య ధర్మస్య. ధర్మ శబ్దమునకు జ్ఞానము, విధి, నియతి, మతము, ఔచిత్యము ఇత్యాది అనేక అర్థములు గలవు. మనము ప్రకరణమునకు అనురూపమగు అర్థమును స్వీకరించవలెను. ప్రస్తుతంలో ధర్మ శబ్దమునకు ఆత్మ జ్ఞానము అర్థము. ఏలయన, పూర్వశ్లోకములో ఈ జ్ఞానము యొక్క ఉపక్రమములో 'ధర్మ్యమ్' అను ప్రయోగము గలదు. ఇది శాస్త్ర విహితము. ఈ జ్ఞానమును పొందినవాడు ధర్మమునకు విరుద్ధముగా నాచరించడు. కావున ఈ జ్ఞానమునకు ధర్మమని పేరు.

జ్ఞాన స్వరూపము నందు గాని, జ్ఞాన ఫలము నందు గాని శ్రద్ధ లేని వ్యక్తుల (అశ్రద్ధ ధానా) గురించి భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు. శ్రద్ధ లేని వారగుటచే, వారు జ్ఞాన సాధనము ఆరంభించు అవకాశమైననూ లేదు.

శ్రద్ధ గలవాని దృష్టిలో శాస్త్రము జ్ఞానసాధనము (ప్రమాణము). ఇది ఇచట చాలా ప్రముఖమైన విషయము. శాస్త్రము జ్ఞానసాధనము అను నమ్మిక లేని నాస్తికునకు పుణ్యపాపములు లేవు. అతడు శాస్త్రమును నమ్మకపోయిననూ చాల నీతిమంతుడు కావచ్చును. కాని, అతనికి

పాపకర్మ వైపు ప్రవణత (tendency) ఉండును. ఏలయన, అతని సాధన అంతయూ తన సుఖము మాత్రమే ఉద్దేశ్యముగా కలిగియుండును. సుఖమనగా ఇంద్రియములచే విషయముల ననుభవించుట మాత్రమే. ఏది ఏమైనా, ఇంద్రియములకు ముసలిదనము తప్పదు. చాల అనుశాసన యుతమగు జీవితమును గడిపిన వానికైననూ, ఇంద్రియముల శక్తి క్షీణించుట తప్పదు. డెబ్బది ఏళ్ల తరువాత చూపు, వినికిడి తగ్గును. వాటిని అనుభవించినా, అనుభవించకపోయినా ఈ పరిస్థితిలో మార్పు ఏమి గలదు? కావున, 'అప్పును చేసి యైననూ ఇంద్రియములను తృప్తి పరచుము, బ్రతికియున్నంత కాలము కులాసాను చేయుము (యావజ్జీవేత్ సుఖం జీవేత్, ఋణం కృత్వా ఘృతం పిబేత్). దేహము భస్మమైన తరువాత కర్మ ఫలముల ననుభవించుటకు ఎవరు మిగిలియుందురు?' ఇది వారి వాదన. ఇట్టి నిష్కర్షలను కలిగియున్నవారి గతి యేమి?

అప్రాప్య మామ్. వీరు బ్రహ్మభిన్నముగా ఆత్మను గుర్తించి, పరమేశ్వరుని పొందగల్గుదురా? అను విషయములో సందేహమునకు స్థానము లేదు. అది అసంభవము. వారికి పుణ్యపాపముల యందు, ధర్మా ధర్మముల యందు శ్రద్ధ లేదు. వారు పరమేశ్వరునితో ఐక్యము కావాలని కోరుకునే ప్రసక్తి ఎక్కడిది? ఈ పరమపదమును పొందజాలని వారి గతి యేమి?

మృత్యు సంసారవర్త్మని నివర్తంతే. నివర్తంతే అనగా మరలి వచ్చెదరు, మిగిలి యుందురు అను రెండు అర్థములు గలవు. మృత్యు సంసారః అనగా మృత్యుయుక్త స్సంసారః. ఇది మధ్యమ పదలోపి సమాసము. ఈ సంసారము మృత్యువుచే ఆక్రాంతమై యున్నది. జన్మతో కలిసియే మరణము గలదు. మృత్యువు, పరివర్తనము ఈ సంసారమునకు సహజ లక్షణములు. ఒకప్పుడు వెలుగొందిన సామ్రాజ్యములు అన్నియూ మట్టిలో కలిసినవి. భూమిలోతు పొరలలో కొన్ని కుండ పెంకులు, నాణెములు ఇత్యాదులు మాత్రమే మిగిలియున్నవి. ఇట్లు మృత్యుదేవత (కాలము) విధ్వంసకదళము వలె విహరించుచున్నది. వర్త్మ యనగా దారి. ఇది దుఃఖము వైపునకు గొనిపోయే దారి. స్వర్గము కూడ సంసారములోనిదే. కాని మనమిచట శ్రద్ధా విహీనులగు వ్యక్తుల గురించి మాటలాడుచున్నాము గదా! నరకమునకు, లేదా పశు పక్ష్యాది యోనులలో జన్మకు గొనిపోవు మార్గములను అట్టి వారు పొందెదరు. వారు ఆ మార్గములలోనే మిగిలియుందురు (మృత్యు సంసార వర్త్మని నివర్తన్తే).

ఈ శ్లోకము యొక్క ఉద్దేశ్యము శ్రద్ధను కలిగించుట మాత్రమే. మొదటి రెండు శ్లోకములు ఆత్మ జ్ఞానము రాజ విద్య యని స్తుతించి అన్వయ ముఖముగా శ్రద్ధను కలిగించును.

..నము నందు శ్రద్ధ లేనివారు ఎంతటి నష్టమును పొందెదరో యను విషయమును శ్లోకము ఈ తీరున అర్జునుని సావధానునిగ జేసి, శ్రీకృష్ణుడు విస్తారమగు విషయ వస్తు కథనము ..ంచుచున్నాడు:

..యము 9, శ్లోకము 4:

मया ततमिदं सर्वं जगदव्यक्तमूर्तिना ।
मत्स्थानि सर्वभूतानि न चाहं तेष्ववस्थितः ॥ ४ ॥

మయా తతమిదం సర్వం జగదవ్యక్త మూర్తినా
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః (4)

ఇదం = ఈ; సర్వం = సమస్తమైన; జగత్ = జగత్తు; అవ్యక్తమూర్తినా = ఇంద్రియగోచరము రూపము గల; మయా = నాచేత; తతం = వ్యాప్తమైయున్నది; సర్వభూతాని = సర్వప్రాణులు; ..స్థాని = నా యందు ఉనికిని కలిగియున్నవి; అహం చ = నేను; తేషు = వాటి యందు; అవస్థితః = ఆశ్రయమును పొంది లేను.

ఈ జగత్తు అంతయూ ఇంద్రియగోచరము గాని రూపము గల నాచే వ్యాప్తమై యున్నది. సర్వప్రాణులు నాయందు ఉనికిని కలిగియున్నవి. నేను వాటి యందు ఆధారపడి లేను (4).

వ్యా: ఈ శ్లోకములో, మరియు రాబోవు శ్లోకములలో భూతశబ్దము జీవుడు అనే ..అర్థములో వాడబడినది. ఈ శబ్దము ప్రపంచము నంతనూ (జగత్) కూడ బోధిస్తుంది. జీవుడు సృష్టింపబడినాడు, రక్షింపబడినాడు, సంహరింపబడినాడు ఇత్యాది ప్రయోగములలో జీవశబ్దము ఉపాధితో కూడిన ప్రాణిని బోధించునని గ్రహించవలెను. జీవుడు ఆత్మ కంటె వేరు గాదు. ఆత్మకు ఏనాడూ సృష్టి స్థితి లయములు లేవు. కాని సూక్ష్మ స్థూల భూతముల నుండి పుట్టే సూక్ష్మ స్థూల దేహములకు సృష్టి స్థితి లయములు గలవు. కావున, జీవునికి సృష్టి ఇత్యాదులు ఈ ఉపాధుల దృష్ట్యా మాత్రమే సంభవమగును. ప్రలయములో జీవుల దేహములతో బాటు జగత్తంతయూ లయమై, సర్వజీవులు మరియు జగత్తు అవ్యక్త స్థితిలో నుండును. ఈ అవ్యక్త స్థితి మరల జగద్రూపముగా ప్రకట మగుటయే సృష్టి. జీవుడు తనకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించనంత వరకు ఈ జనన మరణ ప్రక్రియ తప్పదు.

## మయా తత మిదం సర్వం జగదవ్యక్తమూర్తినా

ఈ జగత్తంతయూ నాచే వ్యాప్తమై యున్నది. 'నాచే' అను పదమునకు 'అవ్యక్తమూర్తినా' అను విశేషణము గలదు. మూర్తి యనగా రూపము. ఒక వస్తువు యొక్క సత్యతత్త్వము కూడా మూర్తి యనబడును. అవ్యక్తమూర్తి యనగా ఇంద్రియగోచరము కాని రూపము. ఇంద్రియగోచరము కాని దానికి ఉనికి లేదని వ్యాఖ్యానించుట తొందరపాటు యగును. ఈ ఆశంకను తొలగించుట కొరకై భగవానుడు 'మూర్తి' అను పదమును ప్రయోగించినాడు. అవ్యక్తమూర్తికి ఉనికి గలదు. ఆ మూర్తిని తెలియుట కూడ సంభవమే. అది భగవానుడే. అట్టి భగవానుడు సమస్త జగత్తును వ్యాపించియున్నాడు. సర్వమును వ్యాపించియున్నది శ్రీకృష్ణుని దేహము కాదు. ఆయన యొక్క యథార్థ స్వరూపము (పరో భావః) సర్వమును వ్యాపించియున్నది. భగవానుడు ప్రయోగించిన 'మయా' అను పదము (అస్మచ్ఛబ్దము) సచ్చిదాత్మను నిర్దేశించును. ఇచట 'నేను' అనగా సద్ఘనము, చిద్ఘనము, ఆనందఘనము, దేశ కాల వస్తు పరిచ్ఛేద రహితము నగు పరబ్రహ్మ. అట్టి బ్రహ్మచే ఈ జగత్తంతయూ వ్యాప్తమైయున్నది (ఇదం సర్వం జగత్ తతమ్).

## మత్ స్థాని సర్వభూతాని

పుట్టిన వస్తువులు భూతము లనబడును. భూతములు పరివర్తనశీలములై ఉండును. ఆకాశ, వాయు, అగ్ని, అపః, పృథ్వీ అనునవి భూతములు. ఈ భూతముల నుండి అనేక లోకములు నిర్మితమైనవి. ప్రతి లోకములో వివిధాకారముల స్థూల దేహములు గలవు. ప్రతి స్థూల దేహము స్వీయ సూక్ష్మ దేహముతో కూడియుండును. ఇవి అన్నియూ ఈ అయిదు భూతముల కలయికచే నిర్మితమైనవి. ఇది జగత్తు యొక్క పాంచ భౌతిక నమూనా. ఈ అయిదు స్థూల సూక్ష్మ భూతముల నుండి సర్వలోకములు, ఆ లోకములలోని ప్రాణులు పుట్టినవి. ఇవి అన్నీ కలిపి 'సర్వభూతాని' అని నిర్దేశింపబడినవి. అహంకారము కూడా ఈ భూతములలోనిదే. ఆలోచన లన్నియూ పుట్టుక గలవియే. వాటికి పుట్టుక లేని అవ్యయ ఆత్మ ఆధారమై యున్నది. ఈ సర్వప్రాణులు నా యందు ఉనికిని కలిగియున్నవి (మత్ స్థాని సర్వభూతాని) అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు.

భగవానుడు లేనిదే ఏ ప్రాణియూ మనజాలదు. ఉనికి లేనిది ఏదైనా వ్యావహారిక ఆదాన ప్రదానములకు ఉపలభ్యము కాదు (న హి నిరాత్మకం కించిత్ భూతం వ్యవహారాయ అవకల్పతే) అని శ్రీ శంకరులు వివరించిరి. ఒక ప్రముఖమగు విషయమును వివరించుటకై శ్రీ శంకరులీ వాక్యమును వ్రాసిరి. విచారించినచో భూతము లన్నియు మిథ్య యని తెలును. ఏ వస్తువును

విశ్లేషించినను, అది మరియొక దానిలో విలీనమగును. కావున అది కేవల నామరూపములు మాత్రమే యగును. మనము విశ్లేషణము అదే స్థాయిలో నిలిపివేసినచో, శూన్యము మిగులును. సర్వ వస్తువుల అంతర్లీన తత్త్వము శూన్యమైనచో, వ్యవహారము అసంభవమగును. కావున ఒక తత్త్వము గలదు. అది శుద్ధ సత్త. సర్వము దాని వలననే ఉన్నట్లు భాసించుచున్నది. దేశము ఉన్నది. కాలము ఉన్నది. సర్వము ఉన్నది.

ఇక్కడ ఒక శంక ఉదయించును. కుందేటి కొమ్ము మొదలగు కొన్నింటిని మనము ఉనికిలేనివి యని పరిగణిస్తాము గదా! అది యథార్థమే. కాని కుందేలు ఉన్నది. కొమ్ము ఉన్నది. కుందేలు కొమ్మునకు ఉనికి లేదనుట వాస్తవమే. కాని, కుందేటి కొమ్మునకు ఉనికి లేదని నీ కెట్లు తెలిసినది? ఇది గమనించదగిన ప్రముఖమైన విషయము. ఈ సత్యము నెరుంగుటకు జ్ఞాత ఒకడు ఉండి తీరాలి. జ్ఞాత ముందుగా 'నేను ఉన్నాను' అని ఎరుంగును. తరువాత జ్ఞానసాధనమును వినియోగించి, అతడు కుందేళ్లకు కొమ్ములు ఉండవని యెరుంగును. కుందేళ్లకు కొమ్ములు ఉండవనునది కేవలము ఒక జ్ఞానాంశము. ఆ జ్ఞానము కలుగుటకు ఒక జ్ఞానసాధనము ఉండవలెను. ఆ జ్ఞానసాధనము కన్ను అని చెప్ప వీలు లేదు. ఏలయన, కన్నులు రూపమును, రంగును మాత్రమే గ్రహించగలవు; అభావమును గ్రహించలేవు. కన్నులు ఉనికిని తెలియగలవు. లేకపోవుటను దర్శించలేవు. కావున, ఇచట జ్ఞానసాధనము కన్నులు కావు. అట్లైనచో, కుందేళ్ళకు కొమ్ములుండవని నీకెట్లు తెలిసినది? ఇది అనుమాన ప్రమాణము కాజాలదు. అట్లు ఊహచే కల్పించుటకు వీలుపడదు. 'కుందేళ్లు నన్ను కొమ్ములతో పొడవలేదు; కాన వాటికి కొమ్ములు ఉండి ఉండవు' అని ఊహచే కల్పించి ఆ సంగతి తెలుసుకున్నా మనుటయూ పొసగదు. కాన, ఈ జ్ఞానము ప్రత్యక్షముచే గాని, అనుమానముచే గాని, అర్థాపత్తిచే గాని లభించినది గాదు. ఇది అనుపలబ్ధి అనే స్వతంత్ర ప్రమాణము వలన కలిగినది. మనకు గల జ్ఞానము ఆధారంగా కలిగే నిషేధాత్మక జ్ఞానముకు అనుపలబ్ధి యని పేరు. కుందేలు ఏమిటో మనకు తెలియును. కాని కొమ్ములు లేకపోవుట కంటికి కనబడేది కాదు. కుందేటికి కొమ్ములు గలవా యను ప్రశ్న ఉదయించినప్పుడు, లేవని మనము నిర్ణయిస్తాము. ఆ నిర్ణయమును మనము అనుపలబ్ధి అనే ప్రమాణముతో చేస్తాము. కాని, ఆ ప్రమాణమును వినియోగించే వ్యక్తి ఉన్నాడు. ఆ వ్యక్తి కుందేటికి కొమ్ము లేదనే సత్యమును ప్రమాణమును వినియోగించి తెలుసుకున్నాడు. ఆ సత్యము ఉన్నది. ఆ సత్యము నెరింగిన వ్యక్తి ఉన్నాడు.

సాధారణంగా వస్తువునకు ఉనికి విశేషణమని మనము అనుకుంటాము. ఉదాహరణకు 'ఈ ఘటము ఉన్నది' అని మనము అంటాము. ఈ ఉనికి ఘటమునకు విశేషణమై, లేని ఘటము నుండి, మరియు పగిలిన ఘటము నుండి ఈ ఘటమును వ్యావృత్తము (distinguish) చేయుచున్నది. ఈ ఉన్న ఘటము తరువాతి కాలములో నశించిన ఘటము కాగలదు. కావున, 'ఇది ఉన్న ఘటము' అను ప్రయోగములో 'ఉన్న' అను విశేషణము అభావమునకు, వినాశమునకు ప్రతియోగి (opposite)గా వాడబడినది. ఘటాభావము, వినష్టఘటము అనునవి మనకు అనుభవములో గలవు.

వాటికి విలక్షణంగా 'ఇది ఉన్న ఘటము' అని మనము అంటాము. మనకు ఉనికిని గురించి గల జ్ఞానము సర్వదా అభావమునకు విరోధి రూపములో నుండును. 'అది ఉన్నది' అనగా అది ఇంకనూ నశించలేదని యర్థము. మన బుద్ధి ఉనికిని గ్రహించే విధమిదియే. ఇందువలననే, ఉనికి వస్తువుపై ఆరోపింపబడే విశేషణముగనే మనచే తెలియబడుచున్నది.

## ఉనికి విశేషణము కాదు

మన బుద్ధికి గల ఈ అభిముఖ్యము (అలవాటు)ను వేదాంతము తల్లక్రిందులు జేయును. వాస్తవంలో ఈ అభిముఖ్యమును తిరస్కరించుట యందు మాత్రమే వేదాంతమునకు పూర్ణ తాత్పర్యము గలదు. ఉనికి విశేషణము గాదని వేదాంతము మనకు బోధించును. వేదాంత బోధకు, మనకు తెలిసిన దానికి సామ్యము ఏమీ ఉండదు. ఉనికికి వస్తువులు విశేషణముల వంటివి అగును. దీనిని మనము సరళముగా పరిశీలిద్దాము. 'ఇది ఒక బంగరు గొలుసు' అను వాక్యము పరిశీలించుడు. దీనిలో బంగారము విశేషణముగను, గొలుసు విశేష్యముగను ఉన్నవి. ఇది కేవల భాషా శాస్త్ర సంబంధి అభిముఖ్యము గాదు. ఇది వ్యక్తి యొక్క దర్శనములో, వ్యక్తి ప్రపంచమును, తనను చూచే తీరులో గల అభిముఖ్యమును ప్రకటించును. దీని యర్థమేమనగా, నేను ఇప్పుడు మాత్రమే ఉన్న మర్త్యుడననియు, నేను కాలమునకు, ముసలితనమునకు వశుడననియు, నేను మరణించబోతాననియు నేను తలుస్తాను. ఈ చిన్న వాక్యములో ఇంతటి దర్శనము ఇమిడియున్నది. వేదాంతములో ఈ దర్శనము తల్లక్రిందులగును. ఆ ప్రక్రియను నేను మీకు వివరిస్తాను.

'బంగరు గొలుసు' అను ప్రయోగములో గొలుసు విశేష్యము, బంగారము విశేషణము గదా! గొలుసు ఉండగా, దానికి కొంత బంగారము జత గూర్చబడినదా? అట్లైనచో, అది బంగరు

పూత గం గొలుసు అగును గాని, బంగరు గొలుసు కాదు. కాని, మనము బంగరు గొలుసు గురించి మాటలాడుచున్నాము. వాస్తవంలో ఉన్నది బంగారము మాత్రమే. గొలుసు కేవలము ఒక నామము, ఒక రూపము మాత్రమే. ఇది పూర్తి విలక్షణమగు దర్శనము. ఉన్నది, అనగా సత్యము బంగారము. గొలుసు బంగారముతో జతగూడినట్లు కన్పట్టే నామము, రూపము మాత్రమే. కన్పట్టుట యేల? అది వాస్తవమగు జతగూడుట అయినచో, అది బంగారము కంటె అదనము కావాలి. కాని, గొలుసు అనే రూపమును బట్టి బంగారము కంటె అదనముగా ఏదీ చేరలేదు. బంగారములో మార్పు రాలేదు. బంగారము అనే పదార్థము, దాని స్వరూపము, దాని బరువు, దాని ఇతర ధర్మములు ఉన్నవి ఉన్నట్లు గానే ఉన్నవి. గొలుసు రూపము కనబడుచున్ననూ, బంగారము యొక్క స్వరూపము అటులనే యున్నది. ఇందువలననే గొలుసు యొక్క రూపము బంగారములో జతగూడినట్లు కన్పట్టుటయే గాని, వాస్తవమగు జత గూడుట లేదు. గొలుసులో ఒక సృష్టి గలదు. దానిని మనము పూర్ణముగా నిరాకరించజాలము. గొలుసు కన్పట్టుచున్నది గదా! కాని, ఇది ఆభాసాత్మక సృష్టి మాత్రమే. ఏలయన, దీనియందు విశేష్యము ఆరంభమగుట (క్రొత్తగా పుట్టుట) లేదు. భూతకాలములో ఉన్నది బంగారము. ఇప్పుడు ఉన్నది బంగారము. భవిష్యత్తులో ఉండబోయేది బంగారము. గొలుసు వాస్తవంలో లేనే లేదు. గొలుసు బంగారముపై ప్రాసంగికముగా ఆరోపింపబడిన నామము, రూపము తక్క మరియొకటి గాదు. కావున, అది బంగారమునకు జతగూడినట్లు కన్పట్టుట మాత్రమే. బంగారము మాటలాడగల్గినచో, ఇట్లు చెప్పును. "బంగరు గొలుసు, బంగరు గాజు, బంగరు ఉంగరము, బంగారు కర్ణాభరణము, బంగరు ముక్కుపుడక ఇత్యాది బంగరు ఆభరణము లన్నింటి యొక్క ఉనికి నాయందు మాత్రమే గలదు". గొలుసు యొక్క ఉనికి పూర్ణముగా బంగారముపై ఆధారపడియున్నది. కావున, వేదాంత పరిభాషలో 'బంగరు గొలుసు' అని చెప్పము. 'గొలుసు బంగారము' అంటాము. ఈ దర్శనమును స్పష్టము చేయుటకై భాషను పూర్తిగా మార్చవలెను. వాస్తవంలో, మార్చవలసినది భాషను కాదు. దర్శనమును మార్చుకొనవలెను. 'బంగరు గొలుసు' అని మనము ప్రయోగించిననూ, 'గొలుసు బంగారమే' అను దృష్టికోణము మనకు స్పష్టముగా తెలియుట ఆవశ్యకము.

అదే విధముగా, 'ఈ సృష్టి అంతా ఈశ్వరుడే' అని మనము అంటాము. అనగా, సృష్టి విశేషణము, ఈశ్వరుడు విశేష్యము (వస్తువు). సత్యతత్త్వము పరమాత్మ. సృష్టి అంతా నామరూపములు తక్క మరియొకటి గాదు. కావున, సర్వభూతములు నా (ఆత్మ) స్వరూపమగు ఉనికి యందు ఉన్నవి (మత్ స్థాని సర్వభూతాని). వ్యక్తి యొక్క దేహము, ఇంద్రియములు, వ్యక్తికి విదితమగు సర్వము, వ్యక్తి యొక్క అహంకారము, మరియు అజ్ఞానము కూడా

సర్వభూతములలో అంతర్గతమగును. అజ్ఞానము ఉన్నది. ఆ ఉనికి ఆత్మచైతన్యమే. ఆలోచన ఉన్నది. జ్ఞాత ఉన్నాడు, ద్రష్ట ఉన్నాడు, శ్రోత ఉన్నాడు, మననము చేయువాడు (మంత) ఉన్నాడు, మననము ఉన్నది, భావావేగము ఉన్నది, స్మృతి ఉన్నది, ఇది ఉన్నది, అది ఉన్నది, మనము అనుకునే సర్వము ఉన్నది. ఈ ఉనికి ఆత్మయే. మనము చెప్పే వివిధవస్తువులచే విశేషింపబడే ఈ ఉనికి యందు వాస్తవముగా విశేషణములు లేవు. ఆ ఉనికియే ఆత్మ. ఇందువలనవే సర్వభూతములు నా యందు ఉన్నవి (మత్ స్థాని సర్వభూతాని).

సర్వము నాచే వ్యాప్తమై యున్నది (మయా తతమిదం సర్వమ్) అను వాక్యము స్పష్టమైనది. 'నా కంటె దూరముగా ఏదీ లేదు' అని దాని యర్థము. ఉన్న ఏ వస్తువు నందైనమా ఆ ఉనికి, ఆ జ్ఞానము నేనే. జ్ఞానము అన్నిటి యందు చైతన్యము సమ్మిళితమై యున్నది. ఆ చైతన్యము నేనే (సచ్చిదానందము).

ఆ చైతన్యము అవ్యక్తము. ఏలయన, అది దృశ్యము కాదు. మనకు లభ్యమయ్యే జ్ఞానసాధనములు దృశ్య వస్తువులను మాత్రమే మనకు చూపించగలవు. కాని వస్తువు ఉన్నది. ఆ ఉనికి నీవే. ఇది ఇతర వస్తువులను తెలుసుకొనే సాధారణ పద్ధతి గాదు. ఏలయన, వస్తువు మరియు వస్తు జ్ఞానముతో బాటు జ్ఞాత కూడా ఆత్మచే వ్యాప్తమై యున్నాడు. ఆత్మ తెలియబడే వస్తువు. ఆత్మ స్వయంసిద్ధము.

ముందుగా భగవానుడు 'నాచే ఈ సర్వము వ్యాప్తమై యున్నది (మయా తతమిదం సర్వమ్)' అని చెప్పినాడు. అనగా ఆత్మ సర్వభూతముల యందు గలదని యర్థము. తరువాత ఆయన 'సర్వభూతములు నా యందు గలవు (మత్ స్థాని సర్వభూతాని)' అని చెప్పి పరిస్థితిని పూర్తిగా మార్చివేసినాడు. ఈ వాక్యములో ఒక సమస్య నిగూఢముగా నున్నది.

ప్రతి హృదయములో దైవీ స్ఫులింగము (divine spark) ఉండునని జనులు సామాన్యంగా అనుకుంటారు. సర్వప్రాణుల బుద్ధిలో ఆత్మ నివాసముండునని జనులు భావిస్తారు. ఈ భావన ప్రకారంగా, బుద్ధి ఆధారమనియు, ఆత్మ ఆధేయమనియు భావించవచ్చును. అనగా బుద్ధికి, ఆత్మకు మధ్యలో ఆధారాధేయ భావమున్నట్లు అగును. ఈ ధారణను తొలగించి వేయుటకై భగవానుడు ఇట్లు వివరించుచున్నాడు.

న చ అహం తేషు అవస్థితః. సర్వభూతముల ఉనికి నా యందు గలదు. కాని ఈ భూతము లన్నింటిలో (తేషు) నేను లేను. ఇట్టి విరోధవచనములు మనకు వందలాదిగా కనబడును. దీని

అర్థము చాల సరళము. సర్వభూతములు నా యందు గలవు. కాని, నేను సర్వభూతముల యందు ఆధేయుడుగా నున్నాను అనుధారణ జనులకు కలిగే అవకాశమున్నది. కావున, నేను అట్లు లేనని భగవానుడు చెప్పినాడు. బంగారు ఆభరణము లన్నింటిలోని సద్వస్తువు బంగారమే అయిన విధముగా, సర్వభూతములలోని సద్వస్తువు నేనే. సర్వభూతములు నా యందున్నవి అనుటలోని తాత్పర్యమిదియే. బంగరు గొలుసు లన్నింటిలో బంగారము గలదు. బంగారము గొలుసు అనే నామరూపములపై ఆధారపడియుండదు. ఈ అభిప్రాయముతో 'బంగారము గొలుసు నందు ఉండదు' అని చెప్పబడును. గొలుసు యొక్క మూలభూతమగు ఉనికి బంగారమే. 'గొలుసు ఉన్నది' అనగా ఆ ఉనికి బంగారము యొక్క ఉనికి కంటె వేరుగా లేదు. కావున గొలుసు బంగారము నందు ఉన్నదియే గాని, బంగారము గొలుసునందు లేదు. బంగారము సత్యము, గొలుసు మిథ్య. సత్యము మిథ్యపై ఆధారపడి ఉండదు. కాని మిథ్య సత్యము లేనిదే మనజాలదు. ఇచటి ప్రధాన తాత్పర్యమిదియే.

కావున, సర్వభూతములు నాయందు ఉండును (మత్ స్థాని సర్వభూతాని). కాని, నేను వాటిలో దేని యందైననూ స్థిరనివాసముగా నుండను (న చాహం తేష్వవస్థితః). సర్వమునకు ఆధారము నేనే. కాని నేను ఆధేయము (ఆధారపడునది) కాను. నేను మిథ్యారూపములగు భూతములపై ఆధారపడి యుండను. వాటన్నింటిలోని సత్యము నేనే. వాటి ఉనికి నా యందే గలదు. కాని, నా ఉనికి వాటి యందు లేదు. నా ఉనికి కొరకై నేను వాటిపై ఆధారపడను. కాని అవి వాటి ఉనికి కొరకు పూర్తిగా నాపై ఆధారపడి యుండును.

ఇది రాజా-ప్రజల పరిస్థితి వంటిదని కొందరు వాదించెదరు. ప్రజలు పూర్తిగా రాజాపై ఆధారపడియుందురు. కాని రాజా ప్రజలపై ఆధారపడి యుండడు. రాజా స్వతంత్రుడు; ప్రజలు అస్వతంత్రులు. ఇదే తీరున సర్వభూతములు భగవానునిపై ఆధారపడి యున్నవి. కాని భగవానుడు సర్వభూతములపై ఆధారపడి లేడు. కాని, ఈ వాదములో భగవానునకు, సర్వభూతములకు మధ్యలో భేదము స్థిరమై ఉండును. అనగా భగవానుడు ఆధారము, జగత్తు ఆధేయము అగును. భగవానుడు 'అవ్యక్తమూర్తినా' అను విశేషణముచే ఈ వికల్పమును నిరాకరించినాడు. ఈ విశేషణము యొక్క గంభీరార్థమును శ్రీ శంకరులు వివరించిరి. రూపము గల రెండు వస్తువుల మధ్య ఇట్టి ఆధారాధేయ సంబంధము సంభవమగును. ఉదాహరణకు, పాత్ర బల్లపై గలదు. బల్ల నేలపై గలదు. వీటికి రూపము గలదు. కావ, ఇవి రూపముగల మరియొక వస్తువునకు ఆధారము కాగల్గును. ఇపుడు ఆకాశమునకు, రూపము గల వస్తువునకు మధ్య గల సంబంధమును

పరిశీలించుడు. ఆధేయము ఏది? భూగోళము కావచ్చును. గ్రహము లన్నియు కావచ్చును. ఇవి అన్నియూ, ఆకాశముపై ఆధారపడియున్నవి. కాని ఆకాశము చేతనుడనగు నా యందు గలదు. చైతన్యమునకు రూపమేదీ లేదు. వస్తువులన్నియూ ఆకాశము నందుండగా, ఆకాశము నా యందు ఉన్నది. కాని, నాకు ఒక స్థిరస్థానము లేదు. ఇట్టి స్థితిలో ఏ విధమైన ఆధారాధేయ సంబంధము పొసగును? స్థిరస్థానము లేని ఆత్మ విషయములో ఆధారాధేయ భేదము పొసగదు. నేను స్వయంసిద్ధుడను. ఇతరము సర్వము నాపై ఆధారపడియున్నది.

సరియగు అవగాహన లేనివారు బుద్ధి యను ఆధారము నందు ఆత్మ స్థిరముగ నుండునని తలంచెదరు. ఆత్మ బుద్ధి యందు సాక్షాత్కరించును. కాని, ఆత్మ బుద్ధి యందు స్థిరముగ నుండునని దాని యర్థము కాదు. బుద్ధితో సహా సర్వమును వ్యాపించి యుండునది ఆత్మయే (మయా తతమిదం సర్వమ్). ఆత్మ బుద్ధిలో ప్రకటమగునే గాని, బుద్ధిలో మాత్రమే స్థిరముగా నుండునది కాదు. బుద్ధి యనగా వృత్తి మాత్రమే గదా! వృత్తులన్నియూ చైతన్య ఆత్మ కంటె వేరుగా లేవు. చైతన్యముతో ఘటనామ రూపములు కలిసి ఘట వృత్తి యగును. తరంగములు పూర్తిగా జలముపై ఆధారపడి యుండు తీరున, వృత్తులన్నియూ చైతన్య ఆత్మపై ఆధారపడియుండును. కాని, చైతన్య ఆత్మకు ఒక దేశమును నిర్ధారించదగిన రూపము లేదు. కావున, అది మరియొక దానిపై ఆధారపడే వస్తువు కాదు. రూపరహితమగు వస్తువునకు ఇతరముతో సంబంధము కుదరదు. కాన, అట్టి వస్తువు ఇతరముపై ఆధారపడి ఉండే ఆధేయము కాజాలదు. పైగా, సర్వము దాని యందు ఆధారపడి యుండును. కావున, ఆత్మ స్వరూపతః నిస్సంగము అని శ్రీ శంకరులు వివరించిరి. జలమునకు తరంగముతో సంబంధమేమియూ లేదు. సత్యమునకు మిథ్యతో ఎట్టి సంబంధమైననూ ఉండదు. మిథ్య సత్యము కంటె భిన్నముగా మనజాలదు. వాటిలో ఒకటి అధిష్ఠానము కాగా, రెండవది అధ్యారోపము అగును. కావున, వాటిమధ్య ఆధారాధేయ భేదమైననూ లేదు. జగత్తు భగవానుని కంటె వేరుగా లేదు. కాని, భగవానుడు జగత్తుపై ఆధారపడడు. వాటిలో ఒకటి సత్యము, మరియొకటి మిథ్య.

రెండు సత్యవస్తువుల మధ్య మాత్రమే సంబంధము ఉండును. ఆత్మ సత్యము. ఆత్మతో సమముగా సత్యమగు మరియొక ఆత్మ ఉన్నచో, అపుడా రెండు ఆత్మల మధ్య సంబంధము ఉండునని మనము చెప్పగల్గుదుము. వాటిలో ఒకటి మరియొక దానికి ఆధారము కావచ్చును. కాని, రెండవ ఆత్మ లేనే లేదు. ఉన్నచో మనము గుర్తించి యుండెడివారము. ఆత్మకు విషయముగా గుర్తింపబడే వస్తువు అనాత్మ యగును. ఒకే ఆత్మ గలదు. స్వీయదృష్ట్యా అది అద్వయము; శుద్ధ చైతన్యము.

ఆత్మ నిస్సంగము గనుకనే, భగవానుడిట్లు చెప్పుచున్నాడు:

యము 9, శ్లోకము 5:

न च मत् स्थानि भूतानि पश्य मे योगमैश्वरम् ।
भूतभृन्न च भूतस्थो ममात्मा भूतभावनः ॥ ५ ॥

వ చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః (5)

వ = మరియు; భూతాని = ప్రాణులు; వ మత్ స్థాని = నా యందు లేవు; మే యొక్క; ఐశ్వరమ్ = ఈశ్వరీయమగు; యోగం = సంబంధమును; పశ్య = చూడుము; భావనః = ప్రాణులను సృష్టించు; మమ = నా; ఆత్మా = ఆత్మ; భూత భృత్ = ప్రాణులను ము పోషించునది; చ = మరియు; భూతస్థం = ప్రాణుల యందు నివసించునది; వ =

మరియు, ప్రాణులు నా యందు లేవు. నా ఈశ్వరీయ సంబంధమును చూడుము. ప్రాణులను సృష్టించు నా ఆత్మ ప్రాణులను భరించి పోషించును. కాని, ప్రాణుల యందు నివసించదు (5).

సర్వప్రాణులు నా యందున్నవి (మత్ స్థాని సర్వభూతాని) అని భగవానుడు మున్ముందుగా ను. సర్వప్రాణులు నా యందు లేవు (వ చ మత్ స్థాని భూతాని) అని తరువాత చెప్పినాడు. ట్టి భగవానుడు సర్వప్రాణులకు ఆధారుడనే శంకకు అవకాశము నిర్మూలింపబడినది. ఆత్మ ఒక్కటియై, సర్వము ఆత్మపై ఆధారపడియున్నచో, ద్వైతము ఉండెడిది. భగవానుడు పెద్ద సంసారి అయ్యెడివాడు. సంసారి యనగా తనపై ఆధారపడువారు చాలమంది గలవాడనియే గదా! ఈ ఆశంకను నిర్మూలించుటకై భగవానుడు భాషను తల్లక్రిందులు చేసి, ఈ సర్వప్రాణులు, వస్తువులు నా యందు లేవని చెప్పుచున్నాడు. మట్టి, ముందుగా 'ఘటము నా యందున్నది' అని చెప్పినదనుకొనుడు. అది తరువాత కొంత ఆలోచించి, 'వాస్తవంలో ఘటము నా యందు లేదు. ఉన్నది మట్టి యగు నేను మాత్రమే. నేను స్వతంత్రముగ నున్నాను. నేను ఘటముపై ఆధారపడను' అని చెప్పును. ఇచట మట్టి సత్యము. ఇతరమునకు స్వతంత్రమగు ఉనికి లేదు. ఇతరము నామరూపములు మాత్రమే.

ఇదే విధముగా ఆలోచనలన్నియూ నేనే. కాని నా యందు చైతన్యము మాత్రమే గలదు. నీవు నీ దృష్టిని ఆత్మవైపునకు సారించినచో, అచట ఆలోచనలు లేవు. దాని కొరకై నీవు చేయదగిన కర్మ ఏదియూ లేదు. ఒక ఆలోచన పోయి, ఇంకో ఆలోచన వచ్చులోపుల ఆలోచనలతో సంబంధము లేని ఆత్మ సర్వ జగత్సంబంధ విరహితమై ఉపలభ్యమగుచున్నది. అది ఆత్మ స్వరూపము. ఆ స్వరూపము నందు ప్రాణులు గాని, వస్తువులు గాని లేవు.

ఇంతవరకు చెప్పిన తరువాత, భగవానుడు చెప్పినదానిలో విరోధము లేదని స్పష్టము చేయుటకై మరల ఇట్లు చెప్పుచున్నాడు.

పశ్య మే యోగమైశ్వరమ్. పశ్య = చూడుము, తెలుసుకొనుము. ఐశ్వరం = ఈశ్వరునకు సంబంధించినది. ఇది యోగమునకు విశేషణము. యోగం = సంబంధమును. 'జగత్తుతో నాకు గల ఈ సంబంధమును పరికించుము. ఇది కారణమగు పరమాత్మకు కార్య జగత్తుతో గల సంబంధము. కారణ కార్య సంబంధమేదైనా, కారణము కార్యముపై ఆధారపడని స్వతంత్ర తత్త్వము కాగా, కార్యము కారణముపై ఆధారపడును. దీని కంటె ఇంకొక అడుగు ముందుకువేసి, కారణమును పరిశీలించుము. కార్యము గలదా? కారణము మాత్రమే కన్పట్టును. పశ్య మే యోగమైశ్వరమ్. సమస్త జగత్తునకు ఈశ్వరుడు కారణము. కావ, ఇది అంతయూ ఈశ్వరుని విభూతి.

ఆత్మ స్వరూపము కూడ ఇదియే అయినచో, భగవానునితో బాటు నీవు కూడ ఇటులనే పలుకవచ్చును. శ్రీకృష్ణునితో బాటు అర్జునుడు కూడా 'మయా తతమిదం సర్వమ్' అని చెప్పవచ్చును. ఏలయన, ఆత్మ సర్వమును వ్యాపించి ఉన్నదనియు, రెండవ ఆత్మ లేదనియు అతనికి తెలిసియుండును. సర్వభూతములు ఆత్మ యందు మాత్రమే గలవు. కాని, అదే సమయములో ఆత్మ సర్వప్రాణులతో సంగము లేనిదై ఉన్నది. ఇది ఆత్మ యొక్క స్వరూపము గనుక, ఈ జ్ఞానము గల వాడెవ్వడైననూ 'నా సంబంధమును, నా విభూతులను చూడుము (పశ్య మే యోగమైశ్వరమ్)' అని చెప్పగల్గును.

ఈ విరోధాభాసము లన్నియూ ఈశ్వర విభూతులే. ఆత్మ సర్వకారణము. ఈ జగత్తు గురించి జ్ఞానికి కలిగే జ్ఞానము 'ఈ జగత్తు కూడా నేనే' అని మాత్రమే. ప్రాణులకు కూడా బ్రహ్మము కంటె భిన్నముగా ఉనికి లేదన్నచో, ఇక చెప్పదగిన దేమున్నది? నేను చూచేది సర్వము బ్రహ్మమే. ఈ దర్శనములో జగత్తు లేదు (న చ మత్ స్థాని భూతాని). ఆత్మకు జగత్తుతో ఎట్టి సంపర్కమైననూ లేదు. ఏలయన, ఆత్మతో సమమగు సత్యత్వ శ్రేణికి చెందిన ద్వితీయ వస్తువు

లేనే లేదు. ద్వితీయ వస్తువు లేనిదే సంబంధము లేదు. ఇది ఆశ్చర్యము. అందువలననే, భగవానుడు 'పశ్య మే యోగమైశ్వరమ్' అని చెప్పెను.

మరియొక దృష్టికోణములో కూడా ఇది అద్భుతమే. ఈ దృష్టికోణమును భగవానుడు 'భూతభృన్న చ భూతస్థః' అనే విరోధాభాస యందు నిరూపించెను. భృత్ అనగా భరించి పోషించువాడు. భూతభృత్ అనగా సర్వభూతములను భరించి పోషించువాడు. ఆత్మ సర్వ భూతములకు ఉనికి (సత్త)ని ఇచ్చి నిలబెట్టును. మట్టి కుండను ధరించి యున్నట్లు, ఆత్మ జగత్తును ధరించి యుండును. కాని, అదే సమయములో ఆత్మ భూతముల యందు లేదు (న చ భూతస్థః). భగవానుడు ఈ జగత్తును పాలించి పోషించుట అనే బృహత్కార్యములో నిమగ్నుడై లేడు. ఇందువలననే విష్ణుభగవానుడు నడుమును వాల్చియున్నట్లు వర్ణింపబడును. శయానస్సర్వం బిభర్తి. ఆయన పరుండియే సర్వమును పాలించి పోషించును. అటులనే, ఆత్మ చైతన్యము ఏ విధముగనూ సంసర్గము లేనిదై, మన ఆలోచనలను ప్రకాశింపజేయును. అనగా ఆత్మ నిస్సంగము అని యర్థము. మరియు, ఆత్మ భూతముల యందు ఆధేయముగా లేదు. ఆత్మకు రూపము లేదు. కాన, ఆత్మ భూతముల యందు నివసించి ఉండజాలదు. సర్వభూతములు నన్ను ఆశ్రయించి ఉన్నవి. కాని, నేను భూతముల నాశ్రయించి లేను. నేను అసంగుడను.

### భగవానుడు 'మమ ఆత్మా' అనుటకు కారణమేమి?

'మమ ఆత్మా భూతభృత్ న చ భూతస్థః' అని భగవానుడు చెప్పినాడు. 'మమ' అను పదములోని షష్ఠీ విభక్తి సంబంధమును నిర్దేశించును. ఇది కేవలము సామాన్య అవగాహనకు అనురూపమైన ప్రయోగము మాత్రమేనని శ్రీ శంకరులు వివరించినారు. దేహమే ఆత్మ యను ధారణ మానవులలో సామాన్యముగా నుండును. కావున, 'మమ ఆత్మా' అనగా దేహమునకు సంబంధించిన ఆత్మ; అనగా అహంకారము. అహంకారము యొక్క దృష్టికోణములో 'మమ ఆత్మా' అని ప్రయోగించిన సందర్భములో నైననూ, అహంకారము యొక్క స్వరూపము ఆత్మయే. ఆత్మయే నేను. ఇంతేగాక, నా యొక్క నేను కూడ ఆత్మయే. నా యొక్క నేను అహంకారము. అది కూడా ఆత్మయే. ఈ నా నేను అద్భుతమైనది. సర్వమును అదియే భరించి పోషించును. అహంకారము ఆత్మపై చేయబడిన అధ్యారోపము మాత్రమే. కాన, ఆత్మ అహంకారము కంటె భిన్నము.

ఆధునిక వేదాంతులతో వచ్చిన ఇబ్బంది ఏమనగా, వారికి ఆత్మ తెలియకపోవుటచే, అహంకారమును ఆత్మపై అధ్యారోపము చేసెదరు. అట్లు చేసి, వారిట్లు చెప్పెదరు: 'నీవు నీ ఆత్మను దర్శించవలెను. నీవు ఇపుడు ఆత్మ అనుకునే దానికి అది భిన్నము. ఈ ఆత్మ సంసారమునకు వశవర్తియై ఉన్నది. కాని యథార్థమగు ఆత్మ ఒకటి గలదు. దానిని నీవు దర్శించి తీరవలెను'. ఇచట రెండు ఆత్మలు గలవు. ఒకటి దర్శించబడేది. రెండవది దర్శించునది. ఈ విధముగా మనము రెండింటిని కల్పించుకొని రెండుగా మిగిలి ఉంటాము. యథార్థమేమనగా, ఆత్మను దర్శించవలసినది దర్శింపబడవలసిన ఆత్మయే. ఇప్పుడు ఈ క్షణములో నున్న ఆత్మ కంటె అదనముగా మరియొక ఆత్మ లేదు. అహంకారమే ఆత్మ యను ధారణ భ్రాంతి జనితము. స్వయంసిద్ధమగు ఆత్మ విషయకమైన అజ్ఞానమును తొలగించి, తద్వారా ఈ భ్రాంతిని మనము నిర్మూలించుకొనవలెను.

కావున భేదము లేదు. దీనిని స్పష్టముగా నెరుంగవలెను. కేవలము అధ్యారోప దృష్ట్యా మాత్రమే 'మమ ఆత్మా' అని ప్రయోగింపబడినది. మనము దేహేంద్రియ మనస్సంఘాతమును ఆత్మపై అధ్యారోపము చేసినప్పుడు, ఆత్మ దేహతాదాత్మ్యములో నుండుటచే 'నేను మనుష్యుడను' అను నిష్కర్షను మనము చేసెదము. 'నేను'పై దేహేంద్రియ మనస్సులను అధ్యారోపము చేయగా సంసారి యగు ఆత్మ ఒకటి సంప్రాప్తమైనది. దీనికొరకై ఒక యథార్థ ఆత్మ స్వీకరింపబడినది. కావున 'మమ ఆత్మా' లేదు. ఉన్నది ఒకే ఒక ఆత్మ. నా స్వరూపము సచ్చిదానందము. వాస్తవంలో ఆత్మ కంటె భిన్నముగా శ్రీకృష్ణుడు లేడు.

ఈ 'మమ ఆత్మా', ఈ సచ్చిదానంద ఆత్మ 'భూతభావనః' అని వర్ణింపబడినది. ఆత్మ మాయా సహాయముతో కేవల సంకల్ప మాత్రముచే సర్వమును సృష్టించును. సృష్టి వ్యవస్థ అంతయూ క్రమముగా వికసించునట్లు చేయునది నా ఆత్మయే. మరియు, ఈ సృష్టి వృద్ధి చెందుటకు కావలసిన పాలన పోషణను ఆత్మయే సమకూర్చును. గృహములో పిల్లలను పెంచే దాదివలె ఈ ఆత్మ ఈశ్వరునిచే జగత్పరిపాలన కొరకు నియోగింపబడిన ప్రతినిధి అనుకోరాదు. భగవానుడు జగత్తును సృష్టించిన తరువాత దాని పాలనా బాధ్యతను ఆత్మకు అప్పగించి యుండుననుకోరాదు. జగత్తును ఆత్మ పాలించి పోషించినను, జగత్తు దాని స్వీయగృహము కాదు గనుక, ఆత్మకు జగత్తుతో సంగము లేదు కాబోలు! అను ధారణ సరిగాదు. ఈ శ్లోకములో భూతభావనః అను పదముతో కూడి యుండుటచే ఆత్మా అను పదమునకు సచ్చిదానంద ఆత్మ యని అర్థము. స్వరూపభూతమగు ఆత్మ తన మాయచే సర్వమును సృష్టించును. సర్వభూతములు మిథ్యయే గనుక భగవానుడు తానే సర్వప్రాణులను పాలించి పోషించు వాడవనియు ( భూత భృత్),

లేనే లేదు. ద్వితీయ వస్తువు లేనిదే సంబంధము లేదు. ఇది ఆశ్చర్యము. అందువలననే, భగవానుడు 'పశ్య మే యోగమైశ్వరమ్' అని చెప్పెను.

మరియొక దృష్టికోణములో కూడా ఇది అద్భుతమే. ఈ దృష్టికోణమును భగవానుడు 'భూతభృన్న చ భూతస్థః' అనే విరోధాభాస యందు నిరూపించెను. భృత్ అనగా భరించి పోషించువాడు. భూతభృత్ అనగా సర్వభూతములను భరించి పోషించువాడు. ఆత్మ సర్వ భూతములకు ఉనికి (సత్త) ని ఇచ్చి నిలబెట్టును. మట్టి కుండను ధరించి యున్నట్లు, ఆత్మ జగత్తును ధరించి యుండును. కాని, అదే సమయములో ఆత్మ భూతముల యందు లేదు (న చ భూతస్థః). భగవానుడు ఈ జగత్తును పాలించి పోషించుట అనే బృహత్కార్యములో నిమగ్నుడై లేడు. ఇందువలననే విష్ణుభగవానుడు నడుమును వాల్చియున్నట్లు వర్ణింపబడును. శయానస్సర్వం బిభర్తి. ఆయన పరుండియే సర్వమును పాలించి పోషించును. అటులనే, ఆత్మ చైతన్యము ఏ విధముగనూ సంసర్గము లేనిదై, మన ఆలోచనలను ప్రకాశింపజేయును. అనగా ఆత్మ నిస్సంగము అని యర్థము. మరియు, ఆత్మ భూతముల యందు ఆధేయముగా లేదు. ఆత్మకు రూపము లేదు. కాన, ఆత్మ భూతముల యందు నివసించి ఉండజాలదు. సర్వభూతములు నన్ను ఆశ్రయించి ఉన్నవి. కాని, నేను భూతముల నాశ్రయించి లేను. నేను అసంగుడను.

**భగవానుడు 'మమ ఆత్మా' అనుటకు కారణమేమి?**

'మమ ఆత్మా భూతభృత్ న చ భూతస్థః' అని భగవానుడు చెప్పినాడు. 'మమ' అను పదములోని షష్ఠీ విభక్తి సంబంధమును నిర్దేశించును. ఇది కేవలము సామాన్య అవగాహనకు అనురూపమైన ప్రయోగము మాత్రమేనని శ్రీ శంకరులు వివరించినారు. దేహమే ఆత్మ యను ధారణ మానవులలో సామాన్యముగా నుండును. కావున, 'మమ ఆత్మా' అనగా దేహమునకు సంబంధించిన ఆత్మ; అనగా అహంకారము. అహంకారము యొక్క దృష్టికోణములో 'మమ ఆత్మా' అని ప్రయోగించిన సందర్భములో నైననూ, అహంకారము యొక్క స్వరూపము ఆత్మయే. ఆత్మయే నేను. ఇంతేగాక, నా యొక్క నేను కూడ ఆత్మయే. నా యొక్క నేను అహంకారము. అది కూడా ఆత్మయే. ఈ నా నేను అద్భుతమైనది. సర్వమును అదియే భరించి పోషించును. అహంకారము ఆత్మపై వేయబడిన అధ్యారోపము మాత్రమే. కాన, ఆత్మ అహంకారము కంటె భిన్నము.

ఆధునిక వేదాంతులతో వచ్చిన ఇబ్బంది ఏమనగా, వారికి ఆత్మ తెలియకపోవుటచే, అహంకారమును ఆత్మపై అధ్యారోపము చేసెదరు. అట్లు చేసి, వారిట్లు చెప్పెదరు: 'నీవు నీ ఆత్మను దర్శించవలెను. నీవు ఇపుడు ఆత్మ అనుకునే దానికి అది భిన్నము. ఈ ఆత్మ సంసారమునకు వశవర్తియై ఉన్నది. కాని యథార్థమగు ఆత్మ ఒకటి గలదు. దానిని నీవు దర్శించి తీరవలెను'. ఇచట రెండు ఆత్మలు గలవు. ఒకటి దర్శించబడేది. రెండవది దర్శించునది. ఈ విధముగా మనము రెండింటిని కల్పించుకొని రెండుగా మిగిలి ఉంటాము. యథార్థమేమనగా, ఆత్మను దర్శించవలసినది దర్శింపబడవలసిన ఆత్మయే. ఇప్పుడు ఈ క్షణములో నున్న ఆత్మ కంటె అదనముగా మరియొక ఆత్మ లేదు. అహంకారమే ఆత్మ యను ధారణ భ్రాంతి జనితము. స్వయంసిద్ధమగు ఆత్మ విషయకమైన అజ్ఞానమును తొలగించి, తద్వారా ఈ భ్రాంతిని మనము నిర్మూలించుకొనవలెను.

కావున భేదము లేదు. దీనిని స్పష్టముగా నెరుంగవలెను. కేవలము అధ్యారోప దృష్ట్యా మాత్రమే 'మమ ఆత్మా' అని ప్రయోగింపబడినది. మనము దేహేంద్రియ మనస్సంఘాతమును ఆత్మపై అధ్యారోపము చేసినప్పుడు, ఆత్మ దేహతాదాత్మ్యములో నుండుటచే 'నేను మనుష్యుడను' అను నిష్కర్షను మనము చేసెదము. 'నేను'పై దేహేంద్రియ మనస్సులను అధ్యారోపము చేయగా సంసారి యగు ఆత్మ ఒకటి సంప్రాప్తమైనది. దీనికొరకై ఒక యథార్థ ఆత్మ స్వీకరింపబడినది. కావున 'మమ ఆత్మా' లేదు. ఉన్నది ఒకే ఒక ఆత్మ. నా స్వరూపము సచ్చిదానందము. వాస్తవంలో ఆత్మ కంటె భిన్నముగా శ్రీకృష్ణుడు లేడు.

ఈ 'మమ ఆత్మా', ఈ సచ్చిదానంద ఆత్మ 'భూతభావనః' అని వర్ణింపబడినది. ఆత్మ మాయా సహాయముతో కేవల సంకల్ప మాత్రముచే సర్వమును సృష్టించును. సృష్టి వ్యవస్థ అంతయూ క్రమముగా వికసించునట్లు చేయునది నా ఆత్మయే. మరియు, ఈ సృష్టి వృద్ధి చెందుటకు కావలసిన పాలన పోషణను ఆత్మయే సమకూర్చును. గృహములో పిల్లలను పెంచే దాదివలె ఈ ఆత్మ ఈశ్వరునిచే జగత్పరిపాలన కొరకు నియోగింపబడిన ప్రతినిధి అనుకోరాదు. భగవానుడు జగత్తును సృష్టించిన తరువాత దాని పాలనా బాధ్యతను ఆత్మకు అప్పగించి యుండుననుకోరాదు. జగత్తును ఆత్మ పాలించి పోషించినను, జగత్తు దాని స్వీయగృహము కాదు గనుక, ఆత్మకు జగత్తుతో సంగము లేదు కాబోలు! అను ధారణ సరిగాదు. ఈ శ్లోకములో భూతభావనః అను పదముతో కూడి యుండుటచే ఆత్మా అను పదమునకు సచ్చిదానంద ఆత్మ యని అర్థము. స్వరూపభూతమగు ఆత్మ తన మాయచే సర్వమును సృష్టించును. సర్వభూతములు మిథ్యయే గనుక భగవానుడు తానే సర్వప్రాణులను పాలించి పోషించు వాడనని యు ( భూత భృత్),

మరియు తాను ప్రాణుల యందు నివసించి ఉండననియు (న చ భూతస్థమ్) చెప్పగల్గును. సర్వభూతములు మిథ్య గనుక, 'సర్వభూతములు నా యందే ఉన్నవి (మత్ స్థాని సర్వభూతాని)' అని కూడ భగవానుడు చెప్పగల్గును. ద్వైతమును గురించి, సృష్టి గురించి గల వివిధ ధారణలను ఈ రెండు శ్లోకములు సమూలముగా పెకలించి వేయును. ఈ సృష్టి అంతయూ కేవలము ప్రతీకాత్మకము (ఉపచారము) మాత్రమే.

అట్లైనచో, సృష్టింపబడినది యేది? 'నా యందు ఏమీ లేదు (న చ మత్ స్థాని భూతాని). ఉన్నది ఆత్మ మాత్రమే' అని నేను చెప్పగల్గినచో, నేను సృజించిన దానికి నేను బాధ్యుడను గాను. ఒకడు కలగని నిద్ర లేచెను. 'నీవు కలలో ఏమి చేసితివి?' అని అడుగగా, తాను ఒక పూర్ణ ప్రపంచమును తన భావనామయ మగు జీవనము నుండి సృజించినానని అతడు చెప్పును. 'ఆ ప్రపంచము నీ కంటె వేరుగ నున్నదా?' అని అడుగగా, 'ఆ భూతము లన్నియూ నా యందే ఉండెను (మత్ స్థాని సర్వభూతాని)' అని అతడు చెప్పెను. 'నీవు వాటిపై ఆధారపడి ఉన్నావా?' అని ప్రశ్నింపగా, 'కానే కాదు, అది నా విభూతి, నా సృష్టి; పైగా, ఆ ప్రపంచము నంతనూ భరించి పోషించినవాడను (భూతభృత్) నేనే' అని అతడు చెప్పును. 'ఆ ప్రపంచమును సృష్టించిన దెవరు?' అని అడుగగా, 'నా ఆత్మయే స్వప్న ప్రపంచమును సృష్టించినది' అని అతడు చెప్పును. 'నేను సర్వమును సృజించితిని. నేను సర్వమును భరించి పోషించుచున్నాను' అని భగవానుడు చెప్పినాడు. మరియు, 'భూతము లేమియూ లేవు; కాన జగత్తును భరించి పోషించవలసిన శ్రమయూ లేదు (న చ మత్ స్థాని భూతాని)' అని అదే వరుసలో చెప్పినాడు. నిద్ర నుండి లేచిన మనిషి తాను చూచిన స్వప్న ప్రపంచమును స్వప్నము యొక్క దృష్టి కోణము నుండి మాత్రమే వర్ణించును. జాగ్రత్ వ్యక్తి ఒక్కడు మాత్రమే గలడు. అటులనే, జగత్తును మనము అంగీకరించిన పక్షంలో మాత్రమే, సృష్టిస్థిత్యాదులను వ్యాఖ్యానించవలసి యుండును. అప్పుడు మాత్రమే, 'జగత్తును సృష్టించిన దెవరు?' అనగా 'నేను' అనియు, 'జగత్తును రక్షించునదెవరు?' అనగా 'నేను' అనియు, 'నీవు జగత్తుపై ఆధారపడెదవా?' అనగా 'కాదు' అనియు, 'ఆ జగత్తు నీపై ఆధారపడియున్నదా?' అనగా 'అవును' అనియు చెప్పవలసియుండును. అప్పుడు భగవానుడు చాల శ్రమపడుచున్నా డనిపించుట సహజమే. కాని అదే ప్రశ్నను ఆయనను అడిగినచో, 'ఏమి శ్రమ?' అని ఆయన బదులిడును. ఆత్మ యందు యథార్థముగా జగత్తు లేదు.

శ్రీకృష్ణుడు ఉంటే సర్వత్రా ఉన్నాడు. లేదా, ఎక్కడనూ లేడు. ఆయన ఒక విశిష్ట దేశములో లేడు. జగత్తంతా ఆయనచే వ్యాప్తమై యున్నది. 'ఇది నా ఐశ్వర్యము. దీనిని

తెలుసుకొనుము (పశ్య మే యోగమైశ్వరమ్)'. ఈ శ్లోకములలో సత్యము, మిథ్య అనునవి సుస్పష్టముగా నిరూపించబడినవి. నా కంటె అధికముగా ఏదీ లేదు. సర్వమును సృష్టించిన వాడను నేనే. పాలించి పోషించు వాడను, సర్వమును సంహరించువాడను నేనే. వాస్తవంలో నా యందు జగత్తు అనేది ఏదీ లేదు.

పూర్వ శ్లోకములు రెండింటిలో చెప్పబడిన తత్త్వమును తరువాతి శ్లోకము ఒక దృష్టాంతముతో వివరించును:

**అధ్యాయము 9, శ్లోకము 6:**

यथाकाशस्थितो नित्यं वायुस्सर्वत्रगो महान् ।
तथा सर्वाणि भूतानि मत्स्थानीत्युपधारय ॥ ६ ॥

యథాకాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ (6).

యథా = ఏ విధముగా; సర్వత్రగః = అన్ని ప్రదేశములలో సంచరించే; మహాన్ = గొప్ప; వాయుః = వాయువు; నిత్యం = ఎల్లవేళలా; ఆకాశస్థితః = ఆకాశము నందుండునో; తథా = అదే విధముగా; సర్వాణి = అన్ని; భూతాని = ప్రాణులు; మత్‌స్థాని = నా యందున్నవి; ఇతి = అని; ఉపధారయ = తెలుసుకొనుము.

అన్ని ప్రదేశములలో సంచరించే గొప్ప వాయువు ఏ విధముగా నిత్యము
ఆకాశము నందుండునో, అదే విధముగా ప్రాణులన్నియూ నా యందున్నవి
యని తెలుసుకొనుము (6).

లోకములో వాయువు ఒక స్థానము నుండి మరియొక స్థానమునకు తిరుగుచున్ననూ (సర్వత్రగః), సర్వదా ఆకాశము నందుండును (నిత్యం ఆకాశస్థితః). కాశీలోని వాయువు మథురకు వచ్చినదనుకొనుడు. అనగా క్రొత్త ప్రదేశమునకు వచ్చినది. కాని, క్రొత్త ఆకాశమునకు కాదు. 'గః' అనగా వెళ్ళువాడు. సర్వత్రగః. వాయువు వెళ్ళని చోటు లేదు. అందువలననే, వాయువు మహాన్ అయినది. 'మహాన్' అను పదము వాయువు యొక్క గొప్ప పరిమాణమును నిర్దేశించును. వాయువు కాలదృష్ట్యా, నిడివి దృష్ట్యా, ఎత్తు దృష్ట్యా చాల గొప్పది (వాయుః మహాన్).

అదే తీరున, సర్వప్రాణులు నా యందున్నవని యెరుంగుము. ప్రాణులు ఎచటకు వెళ్లినను, నా యందే ఉండును. వాయువు ఎచటకు వెళ్లినను ఆకాశమునకు ఎన్నడూ దూరము కాదు. అటులనే, ప్రాణులు ఏ రూపమును పొందినను, నా యందే ఉండును.

ఈ ప్రాణులన్నియూ ఆత్మ యందుండుటచే ఆత్మ బరువుతో క్రుంగిపోవునని తలంచరాదు. ఆకాశము నందు వాయువు సంచరించే గుర్తులు ఉండవు. ఆకాశము అనంతము, సర్వ వ్యాపకము, అసంగము. ఆకాశము లేనిదే వాయువు మనజాలదు. కాని, ఆకాశమునకు వాయువుతో సంగము లేదు. వాయువు యొక్క ఉనికి ఆకాశము నందు మాత్రమే గలదు. వాయువు ఆకాశమునందు ఇటు నటు సంచరించును. ఆత్మ అసంగమని ప్రదర్శించుటకు మాత్రమే ఈ దృష్టాంతమీయబడినది. ఆత్మకు దేనితో నైననూ సంగములేదు. కాని, ఏ వస్తువైననూ, ఏనాడైననూ ఆత్మకు దూరముగా లేదు. వాయువు అంతటా సంచరించును. కాని ఎన్నడూ ఆకాశమునకు దూరము కాదు. అటులనే, ప్రాణులన్నియు ఒక స్థానము నుండి మరియొక స్థానమునకు సంచరించును. బ్రహ్మాండములు కొన్ని బద్దలై క్రొంగ్రొత్త బ్రహ్మాండములు పుట్టవచ్చును. కాని ఇవి అన్నియూ ఏనాడూ ఆత్మకు దూరముగా లేవు. జీవుడు ఇచట నుండి బ్రహ్మలోకమునకు వెళ్లెననుకొనుము. ఈ గతి అంతయూ బ్రహ్మము నందు మాత్రమే గలదు. జీవుడు బ్రహ్మమే. జగత్తు కూడ బ్రహ్మమే. కాన, బ్రహ్మమునకు దూరముగా ఏదీ లేదు. ఆత్మచైతన్యము గల జీవుడు ఒకచోటి నుండి మరియొక చోటికి వెళ్లినప్పుడు, ఆ గమనము సత్త (ఉనికి) యందు మాత్రమే గలదు. జీవుడు ఉన్నాడు. ఆ ఉనికి బ్రహ్మమే. జీవునిలోని చైతన్యము కూడ బ్రహ్మమే. కాన, జీవుడు ఏనాడూ బ్రహ్మకు దూరము కాజాలడు. నీవు ఇచట ఉండగా బ్రహ్మవు. బ్రహ్మలోకమునకు వెళ్లినా అదే బ్రహ్మవు. నీవు ఈ సత్యమును బ్రహ్మలోకములో గుర్తించగలవనుకో. దీనిని గుర్తించుటకై అచటకు గాని, మరియొక చోటికి గాని వెళ్లవలసిన పని యేమున్నది? సర్వచలనములు, సర్వప్రాణులు, సర్వ వ్యవహారములు, సర్వ విధముల గమనములు, దేహములు బ్రహ్మము నందు మాత్రమే గలవు.

సర్వము బ్రహ్మమే అని చెప్పుటకు బదులుగా, 'సర్వము బ్రహ్మము నందు గలదు' అని భగవానుడు చెప్పుటకు కారణమేమి? ఆత్మ అసంగము అని స్పష్టము చేయుటకై భగవానుడు అట్లు చెప్పెను. 'నా యందు' అను ప్రయోగము 'ఆకాశము నందు' వంటిది. వాయువు ఆకాశము నందు తిరిగిన గుర్తులను మిగల్చకుండగా తిరుగును. అదే విధముగా ఆత్మ చైతన్యము నందు సర్వప్రాణులు తమ చిహ్నములు పడునట్లు చేయవు. ఉపధారయ. నీవీ సత్యమును స్పష్టముగా యెరుంగుము.

భూతములు నా యందుండును (మత్ స్థాని) అని చెప్పి భగవానుడు స్థితి కాలము (భూతములు ఉండే కాలము)ను నిర్దేశించుచున్నాడు. వాయువు ఆకాశము నందు ఉనికి గలదై, ఆకాశము నందు సంచరించు తీరున, స్థితికాలములో నామరూపము లన్నియూ పరబ్రహ్మ యందు ఉనికి కలిగియుండును. సృష్టింపబడే ప్రతి పదార్థమునకు మూడు అవస్థలు ఉండును. ఆ పదార్థము పుట్టుట (సృష్టి), పదార్థముగా మనగల్గుట (స్థితి), మరియు వినాశము (లయము). ఈ మూడింటికి బ్రహ్మయే కారణము. లయకాలములో పరిస్థితి ఎట్లుండును? తరువాతి శ్లోకము వర్ణించుచున్నది.

**అధ్యాయము 9, శ్లోకము 7:**

सर्वभूतानि कौन्तेय प्रकृतिं यान्त मामिकाम् ।
कल्पक्षये पुनस्तानि कल्पादौ विसृजाम्यहम् ॥ ७ ॥

సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్ (7).

హే కౌంతేయ = ఓ అర్జునా!; కల్పక్షయే = కల్పము పూర్తి కాగానే; సర్వభూతాని = ప్రాణులన్నియూ; మామికామ్ = నా; ప్రకృతిం = ప్రకృతిని; యాన్తి = పొందును; అహమ్ = నేను; తాని = ఆ ప్రాణులను; పునః = మరల; కల్పాదౌ = కల్పము యొక్క ఆరంభము నందు; విసృజామి = విడిచిపెట్టెదను.

> ఓ అర్జునా! కల్పము పూర్తి కాగానే ప్రాణులన్నియు నా ప్రకృతిలో లీనమగును. నేను ఆ ప్రాణులను మరల కల్పారంభము నందు విడిచిపెట్టెదను (7).

ప్రాణము గలవి, ప్రాణము లేనివి అగు సర్వ పదార్థములు (సర్వభూతాని) నా ప్రకృతిని పొందును (ప్రకృతిం యాంతి మామికామ్). 'నన్ను పొందును' అని భగవానుడు చెప్పలేదు. నా ప్రకృతిని పొందును అనినాడు. ఇట్లు చెప్పి భగవానుడు ఒక సత్యమును నిరూపించినాడు.

ఈ సృష్టిచక్రము ఒకసారి చుట్టూ తిరుగుట పూర్తియగు కాలమునకు కల్పము అని పేరు. కల్పము పూర్తి యగునప్పటికి ప్రలయము వచ్చి సర్వము నశించును. దాని పేరు కల్పక్షయము. ఆ

కాలములో సర్వప్రాణులు నా ప్రకృతి యందు లీనమై ఉండును. ఇచట మనము ప్రకృతి శబ్దమును అనువదించవద్దు.

మరల సృష్టి ఆరంభమగు కాలములో (పునః కల్పాదౌ) నేను వాటిని విడుదల చేసెదను. అనగా, అవి బహిర్భూతము అగునట్లు చేసెదను (తాని విసృజామి అహమ్). 'విసృజామి' అను క్రియాపదములోని 'వి' అను ఉపసర్గకు, ప్రతి ప్రాణిని నేను పూర్వకల్పములో నున్న తీరుగనే సృజించెదను అని యర్థము. కనుక, సృష్టి పూర్వకల్పములలో నున్న తీరుగనే ఉండును. జీవుల కర్మలకు ఫలముల నిచ్చుటకై సృష్టి మరల ఆరంభమై ఈ చక్రము తిరుగుచుండును. తరువాత ఆ సృష్టి లయమగును. ఆ ప్రలయావస్థ నుండి మరల సృష్టి ఆరంభమగును. సృష్టింపబడిన ఈ జగత్తు యొక్క స్థితి నా యందే గలదు. జగత్తు ప్రళయములో నా ఉపాధి యందు లీనమగును. ఈ ఉపాధి ఏది? భగవానుడు దానిని ప్రస్తావించుటకు గల కారణమేమి? 'అది నా యందు లీనమగును' అని భగవానుడు చెప్పవచ్చును గదా! అట్లు చెప్పకుండుటకు కారణమేమి? ఉదాహరణకు ఘటము మట్టి నుండి పుట్టి మట్టిలో లీనమగును. 'కుండ నా ఉపాధిలో లీనమగును' అని మట్టి చెప్పదు గదా!.

ఒక వస్తువు దేని నుండి పుట్టినదో, దాని యందే స్థితిని కలిగియుండి, దాని యందే లీనమగును. ఘటము నశించి స్వకారణమగు మట్టిలో లీనమగును. ఘటము మట్టి నుండి పుట్టి, మట్టిలో లీనమగుటయే గాక, స్థితి కాలములో దాని మనుగడ మట్టియందు మాత్రమే గలదు.

జగత్తు భగవంతుని ప్రకృతిలో లీనమగుట అను విషయమును మనమిచట చర్చిస్తున్నాము. ఏలయనగా, 'అది నా బ్యాంకు ఖాతాలో జమ అగును' అన్న తీరున, 'అది నా ప్రకృతిలో లీనమగును' అని భగవానుడు చెప్పుచున్నాడు. నేను వేరు, నా బ్యాంకు ఖాతా వేరు అని స్పష్టమే గదా! ప్రకృతంలో, సృష్టింపబడిన ఈ జగత్తు భగవంతుని ప్రకృతిలో లీనమగును. 'జగత్తు నా యందు గలదు (మత్‌స్థాని). కాని అది నా ప్రకృతి యందు లీనమగును' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది విరుద్ధముగ నున్నట్లు కనుపట్టుచున్నది. ఏలయన, ఒక వస్తువు ఏ ఉపాదాన కారణము నుండి పుట్టునో, దాని యందే లయమగునని మనము చూచియున్నాము. భగవానుని నుండి పుట్టిన జగత్తు భగవానుని యందే లీనము కావాలి. కాని 'జగత్తు నా ప్రకృతి యందు లీనమగును' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది విరోధము కాదు. భగవానుడు చక్కగా ఆలోచించియే అట్లు చెప్పినాడు. అట్లు చెప్పుటకు గల కారణమును మనము పరిశీలించెదము.

## 'నా ప్రకృతి' అని భగవానుడు చెప్పుటకు కారణమేమి?

'ఈ సర్వభూతములు నా యందు ఉనికిని కలిగియున్నవి (మత్ స్థాని సర్వభూతాని)' అని భగవానుడు చెప్పినాడు గదా! ఈ భూతము లన్నియు భగవానునికి విశేషణ రూపములో నుండునా? అట్లైనచో, జగత్తు పరమాత్మకు సహజ విశేషణమై, పరమాత్మ సర్వదా సగుణుడగును. అట్టి స్థితిలో పరమాత్మకు ఆ విశేషణముల నుండి ఎన్నటికీ విముక్తి లభించదు. కాని, మన అనుభవము దీనికి పూర్తి విరుద్ధముగా నున్నది. మనము ఆత్మ స్వరూపమును విశ్లేషించినచో, అది సర్వ విశేషణ వినిర్ముక్తమని తెలును. ఏ క్షణములో నైననూ, రెండు ఆలోచనల మధ్య ఉండునది పరమాత్మయే. అది సర్వ విధ పరిచ్ఛేదములు లేని శుద్ధ చైతన్యము. పరమాత్మ స్వరూపతః నిర్గుణుడు. అందువలననే మోక్షము సంభవమగుచున్నది.

పరమాత్మకు జగత్తు విశేషణము కాదని అనుకున్నాము. కాని జగత్తు నా యందు గలదు (మత్ స్థాని) అని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా, ఈ ఉనికికి హేతువు అగు అంశము మరియొకటి ఉండవలెను. ఆ అంశమునకే మాయ అని పేరు. మాయా–ఉపాధి వలననే పరమాత్మ ఈశ్వరుడైనాడు. కేవల ఉపాధి మాత్రము చేతనే పరమాత్మ సర్వజ్ఞుడై, సర్వశక్తి మంతుడై సర్వమును సృష్టించినాడు. అటువంటి మరియొక ఉపాధి వలన మనము అల్పజ్ఞత్వాది గుణములను పొందియున్నాము. నీ స్వరూపము సచ్చిదానంద ఆత్మ. అది సత్యము, అనంతమునగు శుద్ధ చైతన్యము. అట్టి నీవు అల్పజ్ఞుడవు, అల్ప శక్తిమంతుడవు, దేశ పరిచ్ఛేదము గలవాడవు ఎట్లు అయినావు? ఉపాధి వలన. ఉపాధి ఒక దృష్టికోణమును నిర్మాణము చేయును. మనము దేహేంద్రియ మనస్సంఘాతము యొక్క దృష్టికోణములో, వాటితో తాదాత్మ్యమును చెందియున్న ఆత్మను స్వీకరించి, 'నేను పరిచ్ఛిన్నుడను' ఇత్యాది ధారణలను కలిగియున్నాము. ఇది చాల దురదృష్టకరమైన ధారణ. ఏలయన, ఇది సత్యము కాదు. ఆత్మ అల్పజ్ఞము కాలేదు. ఆత్మ సచ్చిదానందముగనే కొనసాగుచున్నది. అందువలననే 'నీవు సచ్చిదానందుడవు, తత్ త్వం అసి' అని నేను చెప్పుట సాగుచున్నది. నన్ను ఒకాయన 'స్వామీజీ! సచ్చిదానందుడనగు నేను అల్పజ్ఞుడనగు విధమెట్టిది?' అని ప్రశ్నించినాడనుకొనుడు. ఆ ప్రశ్నయే తప్పు. ఏలయన, సచ్చిదానందము మరేదీ కాదు. సచ్చిదానందుడ వగు నీవు అల్పజ్ఞుడ వగుట అసంభవము.

జీవుడు ఒకప్పుడు ఆరంభములో సచ్చిదానందుడుగ నుండెననియూ, కాని కాలక్రమములో అనేక జన్మలను పొందుట వలన అల్పజ్ఞుడైనాడనియు, మరల క్రమముగా ఆరంభస్థాయికి

ఎదుగవలసి ఉన్నదనియు ఒక వాదము గలదు. మనమందరము క్రమవికాస చక్రములో భాగములని ఈ వాదము బోధించును. క్రమవికాసము దేనికి? సచ్చిదానందమునకా? అది వికసించి ఏమగును? అది సర్వ పరిచ్ఛేద విహీనము, నిర్గుణము. దానిలో ఏ భాగము క్రమవికాసమును చెందును? ఉనికి (సత్) వికాసము చెందు విధమెట్టిది?

ఉనికి యొక్క వికాసము వినాశము మాత్రమే. ఆత్మ యొక్క ఉనికి పరిచ్ఛేదము లేనిది. ఇట్టి ఉనికికి వికాసము సంభవము కాదు. చైతన్యమునకు వికాసము ఉండునా? విశేషణము ( గుణము) గల వస్తువునకు వికాసము సంభవమగును. కాని శుద్ధ సత్తారూపము, నిర్విశేషము నగు చైతన్యము నందు వికాసము సంభవము కాదు. చైతన్యము అనంతమని మనము చూచియున్నాము. కాన, సచ్చిదానంద ఆత్మలో క్రమ వికాసము సంభవము కాదు.

సంసారాంతర్గతమైనది ఏదైనా వికాసము చెందుట సంభవమగును. మనము మనకు నచ్చిన ఒక గీతను గీసి, ఆ గీతను దాటే అభివృద్ధికి వికాసము అని పేరిడవచ్చును. మానవ మస్తిష్కమునకు ఇతర ప్రాణుల కంటె అధిక సామర్థ్యము కలదు గాన, మానవదేహము వికసితము అని చెప్పవచ్చును. కాని ఇది వికసితము అని నిర్ణయించే వ్యక్తి అల్పజ్ఞుడే గదా! 'నేను అల్పమగు జ్ఞానము గలవాడను (అల్పజ్ఞోऽహమ్)' అని నీవు చెప్పినప్పుడు, ఆ 'అహం' సచ్చిదానందమే. తక్కువ జ్ఞానమును కలిగి ఉండుట (అల్పజ్ఞత్వము) అనునది ఒకానొక దృష్టి కోణములో ఆత్మపై ఆరోపించబడిన ప్రాసంగికమగు విశేషణము మాత్రమే. ఆధునిక చిత్రకారుడు ఒకడు తాను పరుండినపుడు కనబడిన మేజాబల్ల యొక్క ఆకృతిని చిత్రించినాడు. అది మనకు మేజాబల్ల వలె కనబడకపోవచ్చును. అదే విధముగా ఒకడు తన కుంటి దేహము యొక్క దృష్టికోణముతో గాని, వయస్సు పైబడుటచే సామర్థ్యము తగ్గిన మస్తిష్కకణముల దృష్టి కోణముతో గాని, లేదా ఇటువంటి ఇతర దృష్టి కోణముతో గాని సచ్చిదానంద ఆత్మను చూచి, ఆ తరువాత, 'నా శక్తి అల్పము, నా జ్ఞానము అల్పము, నా వ్యాపకశక్తి అల్పము' అని చెప్పును. ఈ ధారణ ఒకానొక సాపేక్ష దృష్టికోణము మాత్రమే. చిత్రకారుని చిత్రముతో మేజాబల్లకు ఏదో కొంత సామ్యము ఉండునేమో గాని, ఈ దర్శనమునకు సచ్చిదానంద ఆత్మతో సామ్యము లేశమైననూ లేదు. ఇది ఉపాధి సాపేక్షమగు అజ్ఞాని దర్శనము మాత్రమే. అల్పజ్ఞుడు సచ్చిదానంద ఆత్మ కంటె భిన్నముగా లేడు. ఏలయన, అనంతమగు సచ్చిదానంద ఆత్మ కంటె భిన్నముగా ఏదీ లేదు.

సచ్చిదానంద ఆత్మ సర్వజ్ఞ సర్వశక్తిమత్ అగు ఉపాధిని స్వీకరించి సర్వకారణమగును. ఆ ఉపాధికి ఈశ్వరుడని పేరు. కాని సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వములు, జీవుడు జగత్తును దర్శించే

దృష్టికోణములో సంప్రాప్తమైన ప్రాసంగిక విశేషణములు మాత్రమే. మనమీ జగత్తును చూసిన క్షణములో, ఒకే సచ్చిదానంద ఆత్మ ద్రష్ట మరియు సర్వకారణమగు ఈశ్వరుడు అగుచున్నది. నామములన్నియూ ఈశ్వరుని నామములే. రూపములన్నియూ ఈశ్వరుని రూపములే. కావున, ఈశ్వరుని వర్ణించే పదములు లెక్కకు మించి యున్నవి. ఇది అంతయూ మాయా ఉపాధి, లేదా ప్రకృతి ఉపాధి అనబడే ఉపాధి వలన సంభవమైనది.

కావున, ఈశ్వరుని స్థానములో నుండి శ్రీకృష్ణ భగవానుడు 'మత్ స్థాని సర్వభూతాని' అని చెప్పిన సందర్భములో 'మాయోపాధికుడ నగు నా యందు' అని ఆయన అభిప్రాయము. ఉపాధి దృష్ట్యా మాత్రమే 'సర్వభూతములు నా యందు ఆధారపడియున్నవి' అని భగవానుడు చెప్పగల్గెను. మాయోపాధి ద్వారా మాత్రమే సర్వప్రాణుల ఉనికి పరమాత్మ యందుండుట సంభవమగుచున్నది. స్వరూపతః పరమాత్మకు సృష్టితో సంబంధము లేదు. ఏలయన, పరమాత్మ నిర్గుణుడు. కావున, మాయా సంబంధము చేత మాత్రమే భగవానుడు 'మత్ స్థాని సర్వభూతాని' అని చెప్పగల్గెను. మనము పరమాత్మను సర్వజగత్కారణముగా దర్శించిన సమయములో పరమేశ్వరుని యందు మాయ ఆయన శక్తియై విలసిల్లును. మాయ నుండి సర్వప్రాణులు పుట్టి, మాయ యందున్నవై, మాయ యందు లీనమగును.

### భగవానుడు, మాయ భిన్నములా?

కాని, ఇచట ఒక సమస్య గలదు. ఆత్మ (బ్రహ్మన్) అద్వితీయము. తద్భిన్నముగా ఏదీ లేదు. కాని, బ్రహ్మ యందు మాయ ఉన్నది యన్నచో, బ్రహ్మ ఒకటి, మాయ రెండు. అనగా రెండు తత్త్వములు గలవు. మౌలికముగా రెండు ఉన్నచో, బహుత్వము ఉండును. కాని, ఒకటి బ్రహ్మ, రెండవది మాయ అయినప్పుడు మనకే సమస్య లేదు. 'మాయ' అనేది చాల విచిత్రమైన శబ్దము. సంస్కృతములో ఆ శబ్దము 'యా మా సా మాయా (ఏది లేదో, అది మాయ)' అని నిర్వచింపబడినది. ఒక దృష్టికోణములో మాయ గలదు. మరియొక దృష్టికోణములో మాయ లేదు. బ్రహ్మము మాత్రమే గలదు.

బ్రహ్మ జగత్కారణము అనే దృష్టికోణములో, బ్రహ్మ మాయతో కూడియుండును (మాయా శబలం బ్రహ్మ). స్వరూప దృష్ట్యా మాయ లేదు. ఉన్నది సచ్చిదానందము మాత్రమే. మాయ మిథ్య గావున, దానికి సచ్చిదానంద ఆత్మకు ఉన్నట్లుగా స్వతంత్రమగు ఉనికి లేదు. అది స్వతంత్ర తత్త్వము కాదు. ఏది మరియొక తత్త్వము కంటె భిన్నముగా మనజాలదో, అది మిథ్య

యగునని నిర్వచించియున్నాము. కావున, మిథ్య యనగా అధిష్ఠాన – అనన్యము అని చెప్పదగును. ఉదాహరణకు, అంగీకి వస్త్రము కంటె భిన్నమైన ఉనికి లేదు. అటులనే, మాయ బ్రహ్మము కంటె భిన్నమైన తత్త్వము కాదు. మాయకు స్వతంత్రమగు ఉనికి ఉన్న పక్షంలో, మాయ మరియు బ్రహ్మ కలిసి జగత్తును సృష్టించిన వనియు, వాటి కలయిక సృష్టి కారణమనియు చెప్పి యుండెడివారము. కాని, అవి రెండు స్వతంత్ర తత్త్వములు గావు. మాయ బ్రహ్మ కంటె అన్యమగు స్వతంత్ర తత్త్వము గాదు.

ఇందువలననే, మనము భగవానుని పురుషరూపముగా గాని, స్త్రీ రూపముగా గాని ఆరాధించవచ్చును. దేవత ఎవ్వరైననూ, 1008 నామములలో సర్వసృష్టికి కర్త, సర్వమును పాలించి పోషించువాడు, సర్వసంహర్త, సర్వస్వరూపుడు అగు పరమేశ్వరుడు ఆరాధింపబడును. దేవీ (మాయాశక్తి) సహస్రనామములు కూడ ఇదే విధముగ నుండును. దేవియే సృష్టికర్త్రి, స్థితికర్త్రి, మరియు సంహర్త్రి. ఆమెయే సర్వము. ఈశ్వరుడు మాత్రమే గలడు అను సత్యమును ఈ ప్రక్రియ మనకు చూపించును. శక్తి దృష్ట్యా ఈశ్వరుడు గలడు. శక్తి అనే దృష్టి కోణము లేకున్ననూ, ఈశ్వరుడు గలడు. స్త్రీ పురుష విభాగము ఈశ్వరుని విషయములో అర్థ రహితము. ఏలయన, మాయ (శక్తి) ఈశ్వరుని కంటె భిన్నముగా స్వతంత్రముగా లేదు. అగ్ని యొక్క దాహకశక్తి అగ్ని కంటె భిన్నముగా లేదు. అది బ్రహ్మము యొక్క స్వీయశక్తియే గదా! బ్రహ్మ సర్వకారణము అనే దృష్టి కోణములో, బ్రహ్మకు మాయాశక్తి గలదు (మాయా శబలం బ్రహ్మ) అని అంటాము. ఇచట ద్వైతము యొక్క ఆశంక లేదు. ఒకటి సత్యము కాగా, మరియొకటి మిథ్య. ఒక సత్యమునకు ఒక మిథ్యను కలుపగా, అది ఒక సత్యము మాత్రమే యగును.

నీవు అద్దము ముందు నిలబడి నీ ప్రతిబింబమును చూడుము. ఇద్దరు ఉన్నట్లు అనిపిస్తుంది. రెండు తలలు, రెండు నోళ్లు ఉంటాయి. అంటే, రెండు భోజనములను ఏర్పాటు చేయాలా? వంటలాది ఇతర సమస్యలు ఉండునా? ఉండవని నీకు తెలుసు. ప్రతిబింబము మిథ్య అనియు, ఉన్నది ఒకే ఒక నీవు అనియు, నీకు తెలియును. ఈ సందర్భములో ఒకటికి ఒకటి కలిసి రెండు కాదు. నీవు అద్దాలగదిలో నిలబడినచో అనంత ప్రతిబింబములు కానవచ్చును. కాని ఒకే ఒక నీవు ఉన్నావు. దీనికి, సృష్టికి ఒక తేడా గలదు. అద్దాలలోని ప్రతిబింబము లన్నియు ఒక్క విధముగా నుండును. కాని, ఈశ్వరసృష్టిలో ఏ రెండు వస్తువులైననూ సమముగా నుండవు. రెండు బొటనవ్రేళ్లు అయిననూ సమముగా నుండవు. జగత్తులో అనంతవైవిధ్యము గలదు. అద్దములో కానవచ్చు ప్రతిబింబములను మనము అంతగా పట్టించుకొనము. అద్దము నీ అందమును తగ్గించలేదు. మరియు

పెంచలేదు కూడా. నీవు కుంభాకార కటకము ముందు నిలబడినపుడు, పొట్టి, లావు అయినట్లు, పుటాకార కటకము ముందు నిలబడితే సన్నబడి పొడుగైనట్లు కానవచ్చును. అపుడు నీవు భయపడవు. పైగా, నీకు మనోరంజనము కలుగును. ఎందువలన? అది మిథ్య గనుక. అది వాస్తవమైనచో, పెద్ద సమస్య యగును. అది మిథ్య గనుక సమస్య లేదు. మిథ్యలో మార్పులు వచ్చును. కాని, సత్యము ఏకరూపముగ నుండును. అనగా, దాని యందు మార్పులు ఉండవు. నామరూపములు మారుచుండును. కాని వస్తువు మారదు. వస్తువు నామరూపములకు కారణమగును. కావున, పరమాత్మతో మాయ కలిసి రెండు కావు. ఒక సత్యమునకు అనంత నామరూపములు జోడించిననూ, అది ఒకటిగనే ఉండును. మాయాదృష్టి కోణములో మాత్రమే జీవులన్నియు తనయందు లీనమగునని (మయి) భగవానుడు చెప్పెను. ఈ మాయ దృష్ట్యా మాత్రమే భగవానుడు 'మత్‌స్థాని సర్వభూతాని' అని చెప్పినాడు. స్వరూపదృష్ట్యా 'న చ మత్‌స్థాని భూతాని' అని చెప్పినాడు. అవి నా ప్రకృతి యందు లీనమగును అని గాని, అవి నా యందు లీనమగును అని గాని భగవానుడు చెప్పుట యుక్తి యుక్తమే.

సృష్టి మిథ్య యని నిర్ణయమైన తరువాత, మనము కారణము కూడ మిథ్య యగునని అంగీకరించవలెను. అదియే మిథ్యా ఉపాధి. బ్రహ్మ యొక్క శక్తియే మిథ్యా-ఉపాధి. దీని వలన మాత్రమే బ్రహ్మ జగత్కారణమగును.

కాని బ్రహ్మలో మార్పులేమియూ ఉండవు గాన, బ్రహ్మ వివర్త ఉపాదాన కారణమగునని మనము చూచియున్నాము. నిమిత్త, ఉపాదాన కారణములు రెండు బ్రహ్మయే. బహువైవిధ్యము గల ఈ జగత్తుగా అగుటకై, ఉపాదాన కారణము అనేక మార్పులకు గురి యగుట ఆవశ్యకమగును గదా! అట్టి తరి, బ్రహ్మ ఉపాదాన కారణమెట్లు కాగల్గును? సృష్టి తన కారణము కంటె భిన్నము కాని మాట వాస్తవమే. అయిననూ, ఈ జగత్తును సృష్టించుటలో బ్రహ్మ యందు ఆభాసరూపమగు మార్పు అయిననూ వచ్చుటకు వీలు లేదు. బ్రహ్మ యందు మార్పు ఉండదనియు, అందువలననే బ్రహ్మ వివర్త ఉపాదాన కారణమనబడుననియు మనము చూచియున్నాము. బ్రహ్మ స్వయముగా మార్పు చెందకుండగనే, మార్పులన్నియు సంపన్నమగునట్లు చేయును. దీనికి దృష్టాంతములు గలవు. పామునకు త్రాడు, మనము గనే కలలకు చైతన్యము వివర్త ఉపాదాన కారణములు. కల గనువాడు చేతనుడు. కలలోని ప్రపంచము చైతన్యము. కలలోని అనుభవము చైతన్యము. చైతన్యము లేనిది ఏ విధమైన సృష్టియూ సంభవము కాదు. కావున, కలకు చైతన్యము వివర్తోపాదానము, మన స్మృతులు పరిణామి ఉపాదానము అగును; ఇదే విధముగా, సర్వసృష్టికి

బ్రహ్మ మాత్రమే వివర్త ఉపాదాన కారణము. ఉపాధి ద్వారా బ్రహ్మ నిమిత్త కారణమగును. ఉపాధి ద్వారా అది ఉపాదాన కారణమగును. ఉపాదాన కారణము ద్వివిధము. జగత్తుగా అగుటకై మార్పులు చెందిన తత్త్వము పరిణామి ఉపాదాన కారణమగును. మాయోపాధి దృష్ట్యా బ్రహ్మలో మార్పులు వచ్చినట్లు కన్పట్టును. కాని ఆవశ్యకమగు మార్పులన్నియూ మాయ యందు మాత్రమే వచ్చును. కావున, బ్రహ్మ ఉపాదాన కారణమన్నచో, అది వివర్త ఉపాదాన కారణము. మాయ ఉపాదాన కారణమన్నచో, అది పరిణామి ఉపాదాన కారణము. ఈ విషయము నీ శ్లోకములు స్పష్టము చేయుచున్నవి.

తాను ఈ మాయ ద్వారా నిమిత్త కారణమగుదునని భగవానుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 8:**

प्रकृतिं स्वामवष्टभ्य विसृजामि पुनः पुनः ।
भूतग्राममिमं कृत्स्नमवशं प्रकृतेर्वशात् ॥ ८ ॥

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్ (8)

ఇమం = ఈ; అవశం = అస్వతంత్రమగు; కృత్స్నం = సమస్తమైన; భూతగ్రామం = ప్రాణి సముదాయమును; స్వాం = నా; ప్రకృతిం = ప్రకృతిని; అవష్టభ్య = నియంత్రించి; ప్రకృతేః = ప్రకృతి యొక్క; వశాత్ = వేగము వలన; పునః పునః = మరల మరల; విసృజామి = సృష్టించెదను.

> ఈ అస్వతంత్రమగు సమస్త ప్రాణి సముదాయమును నా ప్రకృతిని నియంత్రించి ప్రకృతి యొక్క వేగము వలన మరల మరల సృష్టించెదను (8).

విసృజామి పునః పునః. నేను మరల మరల సృష్టించుచున్నాను. ప్రతి కల్పాంతము నందు ప్రలయము కలుగును. దాని తరువాత నేను మరల (నన్నే) సృష్టించెదను. అనగా నా యందు మార్పులు వచ్చునని యర్థమా? కాదు.

ప్రకృతిం స్వాం అవష్టభ్య. స్వీయ ప్రకృతిని, అనగా స్వీయ మాయోపాధిని వశము నందుంచుకొని నేను సృష్టించెదను. జీవునకు, ఈశ్వరునకు గల భేదమిదియే. ఈశ్వరుడు మాయను తన వశములో నుంచుకొనును. జీవుడు ముక్తిని పొందు పర్యంతము మాయ (అవిద్య) యొక్క మోహమునకు వశుడై యుండును. 'ఈ మాయ (అవిద్య)ను నా అధీనములో నుంచుకొని, నేను మరల మరల సృజించెదను'. ఆయన దేనిని సృజించును?.

భూత గ్రామమిమం కృత్స్నమ్. భూత సమూహము నంతనూ అనగా జగత్తు నంతనూ. నీచే చూడబడే సర్వమును నేను సృజించితిని (అహం విసృజామి). 'నీవేల సృజించితివి? నేను ఈ సృష్టిలో భాగము అగుటచేతనే నాకీ సమస్య లన్నియూ కలిగినవి. దీని నంతనూ నీవు సృజించుటకు గల హేతువు ఏది?' అని మనము ప్రశ్నించవచ్చును.

## భగవానుడు సృష్టిని చేయుటకు కారణమేమి?

అవశమ్. అనగా అది జరిగి తీరవలెను. జీవుని ఇచ్ఛతో సంబంధము లేకుండగనే ఈ సృష్టి జరుగును. 'భగవానుడు జగత్తును ఏల సృజించినాడు?' అను ప్రశ్న లక్షలసార్లు అడుగబడినది. సమాధానము లన్నియూ ఊహాజనితములే. 'ఇదంతా భగవానుని లీల' అనేది తరచుగా వినబడే సమాధానము. కాని భగవానునకు లీలతో పనియేమి? ఆయన చికాకుగా నున్నాడా? ఒంటరితనముతో విసుగెత్తినదా? అట్లైనచో, ఆయన భగవాను డెట్లగును? వాస్తవంలో, తాను దేనినీ సృష్టించలేదని ఆయన చెప్పుచున్నాడు. ఆయన సృష్టించిన పక్షంలో మాత్రమే, ఈ ప్రశ్నకు సమాధానమును చెప్పవలసియుండును. తాను దేనినీ సృష్టించలేదని ఆయన తరువాతి వాక్యములోనే చెప్పబోవుచున్నాడు. సృష్టి గలదు అని స్వీకరించిన పక్షంలో, ఆ సృష్టి ఆయన ఇచ్ఛతో సంబంధము లేకుండగనే సృష్టింపబడినది. అట్లైనచో, ఎట్లు సృష్టింపబడినది?

ప్రకృతేః వశాత్. ప్రకృతి శక్తి నుండి మాత్రమే. ప్రకృతి స్వభావము సృష్టి. ఈ మాటను మనము కూడా చెప్పవచ్చును. ఒక విశిష్టకాలములో మనము ఒక విశిష్ట వస్తువును స్మరించుటకు కారణమేమి? ప్రకృతి యొక్క బలమే కారణము. 'నేను తలంచుచున్నాను' అన్నచో మనకు సమస్యలు తప్పవు. 'ప్రకృతి తలంచుచున్నది' అన్నచో, సమస్యలు లేవు. ఇపుడు ఇచట మనకు వర్తించే సత్యము భగవానునకు కూడా వర్తిస్తుంది. ఏలయన, ఆత్మ సమానము. మరియు సృష్టి ప్రతిబింబము మాత్రమే. నీ మనస్సులో ఒక ఆలోచన ఉదయించిన దనుకొనుము. నీవు ఆ ఆలోచనను పొందాలని సంకల్పించక పోయిననూ, అది కూడా సృష్టియే. సంకల్ప పూర్వకమగు

ఆలోచనలు కూడా ఉన్నమాట వాస్తవమే. కాని, మనమిచట సంకల్పంతో సంబంధము లేకుండగా మస్తిష్కంలో తనంత తానుగా ఉదయించే ఆలోచనను గురించి మాటలాడుచున్నాము. ఈ ఆలోచన కలుగుటకు కారణమేమి? అది ఏల సృష్టింపబడినది? అది స్వభావవశమున (ప్రకృతేర్వశాత్) పుట్టినది. దాని పుట్టుకలో నీ సంకల్పమునకు ప్రమేయము లేదు. కాన, దాని బాధ్యతను నీవు నీ నెత్తిపై ఎట్లు వేసుకొనగలవు? ఆ ఆలోచన నీది అనుటలో సందేహము లేదు. కాని, దాని విషయంలో నీ సంకల్పమునకు స్థానము లేదు గనుక, దానితో నీకేమీ సంబంధము లేదు. ఈ పరిస్థితి జ్ఞానికి, అజ్ఞానికి కూడా సమానము. వారిద్దరికీ కూడ సంకల్పముతో ప్రమేయము లేకుండగా పుట్టే ఆలోచనలతో సంబంధము లేదు. కావున, అట్లు కలిగే ఆలోచనలను కలుగనిమ్ము. అట్లు కలుగుటకు ఏదో ఒక హేతువు ఉండును. కాని దానితో నీకు సంబంధము లేదు. అది స్వభావవశమున కలిగినది (ప్రకృతేః వశాత్). అజ్ఞానికి ఇంకో రకం ఆలోచన కలుగును. అది అతని సంకల్పము నుండి ఉదయించును. తన సంకల్పము నుండి జనించిన ఆలోచనలపై అతడు తన అధికారమును, కర్తృత్వమును ప్రకటించును. అతనికి అహంకారము ఉన్నది గదా! కావున, ఆలోచనను సృష్టించేది తానేనని అతడు తలంచును. ఈ రకం ఆలోచన జ్ఞానికి కూడా కలుగును. కాని, ఈ సంకల్పమనబడేది ప్రకృతిలో భాగమని అతడు దర్శించును. ఆలోచనలు పుడుతూనే ఉన్నా, అతని దర్శనములో అతనికి వాటిపై కర్తృత్వము లేదు. 'చూచుచున్ననూ, వినుచున్ననూ, స్పృశించుచున్ననూ, ఆఘ్రాణించుచున్ననూ, తినుచున్ననూ, నడుచుచున్ననూ, ఇతర కర్మలను చేయుచున్ననూ, నేను ఏ కర్మలనూ చేయుట లేదు (పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్..... అహం న కించిత్ కర్మ కరోమి, 5-7, 8)'.

జ్ఞానికి, అజ్ఞానికి గల భేదమిదియే. ప్రకృతి ప్రభావముచే, కోరబడని ఊహించని ఆలోచనలు పుట్టుట అనే అనుభవము ఇద్దరికీ సమానమే. తానే ఆలోచనలను సృజించినాననియు, తానే కర్తననియు అజ్ఞాని తలపోయును. అందువలన, అతని భ్రాంతి రెండింతలగును. తన సంకల్పము లేకుండగా పుట్టిన ఆలోచనలకు అతడు బాధ్యతను స్వీకరించి, తన యందు దోషిత్వము నారోపించుకొనును. అపుడాతడు మానసిక చికిత్స ద్వారా ఈ దోషిత్వభావనను దూరము చేయుటకు యత్నించును. కాని అతనిలో అహంకారము మిగిలియుండుటచే, సమస్యలు ఒక రూపములో గానిచో మరియొక రూపములో ఉదయించుచునే యుండును. మరియు సంకల్పపూర్వకము లగు ఆలోచనలు కూడ అతనికి ఉండును. వాటి యందు అతనికి నిశ్చితముగా 'వీటికి కర్తను నేనే' అను ధారణ ఉండును. కాని, ఆత్మ అకర్తయను సాక్షాత్కారము గల జ్ఞాని

సర్వకర్మల యందు కర్తృత్వధారణను పరిత్యజించి యుండును. ఆత్మ అకర్త గనుక, ప్రకృతి వశము చేతనే ఆలోచనలు ఉదయించును. వాటికి మూలములో ఇచ్ఛ గాని, సంకల్పము గాని, ఇతర కర్మగాని లేదు. ఈ ఆలోచనలన్నీ పుట్టుచుండును. నేను కర్మలను చేయుచున్నానా యన్నట్లు కనపట్టును. కాని, నేను చేయుట లేదు. ప్రకృతి యొక్క ప్రభావము వలన (ప్రకృతేర్వశాత్) సర్వము జరుగుచున్నట్లు కనపట్టుచున్నది.

శ్రీకృష్ణ భగవానుడు అదే విషయమును చెప్పుచున్నాడు. ఈ సృష్టి జరుగుచున్నది. 'సృష్టి ఎందులకు?' అను ప్రశ్నకు సమాధానము ఇదియే. సర్వజీవుల కర్మలు కలిసి ప్రకృతి యగును. ప్రళయము పూర్తికాగానే, ఆ కర్మలు పరిపక్వమై, కల్పాదియందు సృష్టి వ్యక్తమగుట ఆరంభమగును. భగవానుడు ప్రకృతిని వశము నందుంచుకొని (ప్రకృతిం స్వామవష్టభ్య) సృష్టిని ఆరంభించునని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. అనగా, ఆయన ప్రకృతి యొక్క మోహములో పడడు. కాని, ఈ 'నేను' సంకల్ప రహితమగు సచ్చిదానంద ఆత్మ. అట్లైనచో, సంకల్పమును చేయున దెవ్వరు? ప్రకృతి దృష్ట్యా నా సన్నిధిలో ఒక సంకల్పము గలదు. 'నేను అనేకము కావాలి' అని ఈశ్వరుడు సంకల్పించెను (సోऽకామయత, బహు స్యాం ప్రజాయేయేతి, తైత్తిరీయోపనిషత్, 4-6-1). ఆయన అట్లు ఏల సంకల్పించవలెను? ప్రకృతేః వశాత్. ప్రకృతి దృష్ట్యా మాత్రమే ఆత్మ సంకల్పించినట్లు భాసించును. ఇందువలననే ప్రకృతిని నా వశములో నుంచుకుని (ప్రకృతిం స్వామవష్టభ్య) అని ఆయన చెప్పుచున్నాడు. నేను సంకల్పించకుండగనే, ప్రకృతి వలన మాత్రమే ఈ సృష్టి జరుగుచున్నది.

ఈ సృష్టి బహు విచిత్రమైనది. జీవుడు తాను చేసిన కర్మల కనురూపముగా విభిన్నమైన అనుభవములను పొందవలసి యున్నది గదా! ఈ సృష్టిలో వివిధ స్థూల దేహములు గలవు. ప్రతి స్థూలదేహములో ఒక విలక్షణమైన సూక్ష్మ శరీరము గలదు. దేహములన్నియూ జీవుల కర్మల కనురూపముగా సృష్టింపబడినవి. జీవులు పొందే దేహములు, వారు అనుభవించే పరిస్థితులు ఇత్యాది సర్వము వారి వారి కర్మలను బట్టి లభించును గదా! ఈ స్థితిలో భగవానుడు చేయునదేమున్నది? రాజు ప్రజలకు ధనము, రక్షణ, దండన ఇత్యాదుల నిచ్చును. వాటిని ఆయన ప్రజల ప్రవృత్తులకు అనురూపముగా మాత్రమే ఇచ్చును. కాని, బహుమతిని, శిక్షను ఇచ్చువాడు రాజు అన్నట్లు కనపట్టును. ఇదే పరిస్థితి భగవానునికి కూడా వర్తిస్తుంది. పుణ్యమును చేసిన వ్యక్తికి చక్కని ప్రతిఫలము లభించును. పాపమును చేసిన వ్యక్తికి దండన తప్పదు. కుక్కకి మనము ఇచ్చే శిక్షణ అటువంటిదే గదా! దానితో యోగ్యమగు రీతిలో ప్రవర్తించిన వానికి లాభము కలుగును. దానిని

ఇబ్బంది పెట్టిన వానికి కష్టాలు తప్పవు. పుణ్యమును చేసుకున్న జీవుడు మంచి కుటుంబములో మంచి దేహముతో పుట్టును. అతని జీవితము పూలబాట వలె నుండును. మరియొక జీవుడు దీనికి పూర్తి విరుద్ధముగా కష్టాల మధ్యలో పుట్టును. ప్రతి వ్యక్తి తాను చేసుకున్న ధర్మాధర్మములచే ప్రభావితుడగును. వాటిని ఆచరించుటలో వ్యక్తికి ఎన్నుకునే స్వేచ్ఛ గలదు. ఎన్నుకునే స్వేచ్ఛ ఉన్న సందర్భములో కర్తృత్వము ఉండుట నిశ్చయము. కాని, భగవానునకు ఈ సమస్య లేదు. ఏలయన, సర్వము ప్రకృతి వశములో నున్నది (ప్రకృతేర్వశాత్). ఆయనకు దీనియందు యథార్థమగు భాగస్వామ్యము లేదు. 'నేను దేనినీ సృష్టించుట లేదు' అని భగవానుడు చెప్పిన సందర్భములో ఆ 'నేను' సచ్చిదానంద ఆత్మయే. ఉన్న ఒకే ఒక ఆత్మ అదియే. నా సన్నిధిలో ప్రకృతి సర్వమును చక్కబెట్టును.

ఈ సన్నిధిని ప్రక్కన బెడితే, మిగిలేది సాంఖ్య సిద్ధాంతము అగును. దాని ప్రకారంగా ప్రకృతి సర్వమును చేయుచుండును. ఆత్మ అసంగముగా మిగిలియుండును. కాని, ఇది సరిగాదు. ఏలయన, రెండు సమాంతర సత్తలు లేవు. ప్రకృతి పరమాత్మ కంటె భిన్నము, స్వతంత్రము కాదు. అది పరమాత్మపై అధ్యారోపము మాత్రమే. అది తన ఉనికి కొరకు పరమాత్మపై పూర్తిగా ఆధారపడియుండును. ప్రకృతి తనంత తానుగా సృష్టించలేదు. ఆత్మ తనంత తాను సృష్టించలేదు. ఈ రెండు ఏదో విధంగా కలుసుకుని, ఈ సృష్టిని చేస్తాయి. కాని, అవి సమాన సత్యత్వ శ్రేణికి చెందిన రెండు విభిన్న తత్త్వములు గావు. వాటిలో ఒకటి సత్యము, రెండవది మిథ్య. కావున, స్థిరంగా కొనసాగేది ఒక్కటియే. ఈ సత్యము తెలియకపోతే, మనకు ద్వైతము మిగులును. ఇందువలననే, 'సర్వమును నేనే సృజించితిని; నేను దేనినీ సృజించలేదు' అని శ్రీకృష్ణ భగవానుడు చెప్పగల్గినాడు. ఇది సరిగా తెలియనిచో, పరస్పర విరోధము వలె భాసించును.

ఈ సృష్టిలో అధికభాగము దుఃఖము గలదు. దీనికంతకూ భగవానుడే బాధ్యుడనిపించును. ఆయన మానవులను అద్భుతమగు దేహముతో, ఇంద్రియములతో, మరియు మనస్సుతో సృష్టించెను. కాని, అదే కాలములో మానవుని పీడించుటకు దోమలను, ఇతర క్రిములను సృజించెను. మానవుడు జీవితమంతా, తనకు తెలియకుండా పీడను కలిగించే వాటితో సంఘర్షణ చేయాలి. ఈ దుఃఖమును సృష్టించిన వాడు ఈ సర్వముచే నిశ్చితముగా ప్రభావితుడు అగును గదా! "లేదు. సృష్టిలో ఏది ఎట్లు ఉన్ననూ, అది అంతా ప్రకృతి మూలముగనే (ప్రకృతేర్వశాత్) అట్లున్నది. నాకు దానితో సంబంధము లేదు. ఈ కర్మలు నన్ను ఏ మాత్రమూ ప్రభావితుని చేయవు" అని భగవానుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు.

**అధ్యాయము 9, శ్లోకము 9:**

न च मां तानि कर्माणि निबध्नन्ति धनञ्जय ।
उदासीनवदासीनमसक्तं तेषु कर्मसु ॥ ९ ॥

న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ
ఉదాసీన వదాసీన మసక్తం తేషు కర్మసు (9).

**ధనంజయ** = ఓ అర్జునా!; **చ** = మరియు; **ఉదాసీనవత్** = ఉదాసీనుని వలె; **ఆసీనం** = కూర్చుండినట్టియు; **తేషు** = ఆ; **కర్మసు** = కర్మలయందు; **అసక్తం** = సంగము లేని; **మాం** = నన్ను; **తాని** = ఆ; **కర్మాణి** = కర్మలు; **న నిబధ్నంతి** = బంధించవు.

మరియు ఉదాసీనుని వలె కూర్చున్నట్టియు, ఆ కర్మల యందు సంగము
లేని నన్ను ఆ కర్మలు బంధించవు (9).

ఈ సృష్టి బహు విచిత్రమైనది. ఒకడు గొప్పవాడు. మరియొకడు అల్పుడు. ఒకడు ఆరోగ్యవంతుడు. మరియొకనికి ఆరోగ్యము తక్కువ. ఈ సృష్టి నన్ను ప్రభావితుని చేయదు. ఏలయన, నేను అసంగుడను (అసంగోఽహమ్). పరమేశ్వరుడు పూర్తి ఉదాసీనుడై విశ్రమించుచున్నాడు (ఉదాసీన వదాసీనమ్). అందువలననే, ఆయన ఈ కర్మలన్నిటికీ సంబద్ధుడు కాడు (అసక్తం తేషు కర్మసు). 'ఉదాసీనవదాసీనమ్' అనునది 'మామ్ (పరమేశ్వరమ్)' నకు విశేషణము. పరమేశ్వరుని ఈ కర్మలు బంధించకపోవుటకు గల కారణమును ఈ విశేషణము స్పష్టము చేయును.

ఉదాసీనుడనగా ఏ మాత్రమూ పట్టించుకొనకుండగా అసంగముగా నుండువాడు. రాగి, ద్వేషి అను రెండు రకముల మధ్యలో ఉదాసీనుడు ఉండును. ఉదాసీనుడు రాగి కాదు, ద్వేషి కాదు. ఆసీనుడనగా కూర్చున్నవాడు. ఆత్మ మన బుద్ధి యందు కూర్చున్న తీరున, పరమేశ్వరుడు మాయోపాధి (ప్రకృతి) యందు కూర్చుని యున్నాడు. మన బుద్ధియందు కూర్చుని యున్న సచ్చిదానంద ఆత్మ దేనినీ కావాలని కోరదు గనుక, 'ఉదాసీనము' అనదగును. ఆత్మ మంచి కర్మను గాని, చెడు కర్మను గాని, మంచి తలపును గాని, చెడు తలపును గాని కోరదు. ఆత్మ దేనినీ అపేక్షించకుండగా, సర్వమును ప్రకాశింపజేయును. కాన ఆత్మను 'ఉదాసీనవదాసీనః అసక్తః' అని వర్ణించవచ్చును.

అసక్తః అనగా సంబంధము గాని, ఆసక్తి గాని లేనివాడు. బుద్ధి యందు కూర్చుండియున్న మాయకు అధిష్ఠానముగా కూర్చుండియున్న పరమేశ్వరుడు కర్మఫలముల యందు వాడై, కర్తృత్వ తాదాత్మ్యము లేనివాడై ఉండును. ఆయనకు కర్మఫలముతో సంబంధము యు, ఆయనకు 'నేను కర్తను' అను ధారణ లేదు. ఈ ఆత్మ ఎట్టి వికారములకైననూ కానిదై పూర్తిగా అసంగమై ఉండును.

ఒక వస్తువును చూడగా, నీ అంతఃకరణములో ఒక మార్పు కలుగును. అది నీకు నచ్చిన అయినచో, ఒక విశిష్టమగు పరివర్తనము కలుగును. అది చికాకును కలిగించునదైనచో, భిన్నమైన పరివర్తనము కలుగును. ఇట్లు గాక, ఒక వస్తువు నీ అంతఃకరణములో నీవు తెలుసుకునే వృత్తి కంటె అదనముగా మరియొక మార్పును కలిగించనిచో, అంతఃకరణ అట్టి ప్రతిక్రియ ఉదాసీనత యనబడును. పూర్ణ ఉదాసీనమైన మనస్సు వలెనే, ఆత్మ మార్పులకు వేటికీ లోను కాదు. కాన ఆత్మను 'ఉదాసీనవదాసీనః' అని వర్ణింపదగును. స్థితి లయములు అను త్రివిధకర్మల విషయములో (తేషు కర్మసు) నేను యథార్థముగా రితుడను గాను అని భగవానుడు చెప్పుచున్నాడు. ఆయన యందు కర్తృత్వధారణ లేదు. స్వరూపము నెరిగిన ఇతర వ్యక్తుల యందైననూ ఇట్టి కర్తృత్వధారణ లేకపోవుట సంభవమే. మేశ్వరుని ఆత్మ సచ్చిదానందము. జీవుని ఆత్మ కూడా సచ్చిదానందమే. ఈ జ్ఞానము గల యందు ఆత్మ కర్త యనే తప్పు తాదాత్మ్యము ఉండదు.

ఆత్మ యందు కర్మఫల సంబంధము కూడ లేదు. కాన, ఆత్మకు భోక్తృత్వధారణ కూడ దు. సంసార సంబంధము లేకుండుటకు, కర్తృత్వభోక్తృత్వములు అనే ఈ రెండు లేకుండుటయే రణమగును. ఈ రెండు ఉన్నచో, సంసారమంతయూ నీతో గూడియుండును. 'నేను కర్తను, నేను భోక్తను' అనుకుంటే చాలును. సంసారబంధము లేని స్వాతంత్ర్యము వస్తునిష్ఠ సత్యము. సత్యమును సాక్షాత్కరించుకొనవలెను. ఈ సాక్షాత్కారమును పొందిన జ్ఞానికి ఆత్మయందు కర్తృత్వ భోక్తృత్వములు లేవని స్పష్టమగును.

కొన్ని విరోధాభాసలను దూరము చేయుటకై మరికొన్ని విరోధోక్తులను చెప్పే ఇట్టి భాగములు చాల ప్రముఖమైనవి. 'ఈ సర్వప్రాణి సముదాయమును నేను సృజించెదను (భూతగ్రామమిమం విసృజామి)' అని భగవానుడిచట చెప్పినాడు. ఇది శ్రీకృష్ణుడు ఈశ్వరుని భూమికను స్వీకరించి చెప్పిన వాక్యము. 'నేను సృజించుచున్నాను (విసృజామి)' అని ఆయన

నిర్ద్వంద్వముగా చెప్పినాడు. ఆ తరువాత 'నేను పూర్తి ఉదాసీనతతో మాయోపాధి యందు కూర్చుండియున్నాను గనుక, ఈ సృష్టి స్థితి లయ కర్మలు నన్ను బంధించవు' అని ఆయన చెప్పినాడు. అనగా ఆయన తన బాధ్యతను పూర్తిగా నిరాకరించుచున్నాడు. ఈ జగత్తులో నిరంతరంగా కొనసాగుతూ ఉండే సృష్టి స్థితి లయములనే త్రివిధ కర్మలకు తాను బాధ్యుడను గాదని ఆయన చెప్పుచున్నాడు. మనమీ కర్మలను ఈశ్వరుని యందు ఆరోపిస్తాము. తాను ఉదాసీనుడు గనుక, అవి తనను బంధించవని ఆయన చెప్పుచున్నాడు. దీని యందు విరోధమున్నట్లు కన్పట్టును. 'నేను సృజించుచున్నాను' అని చెప్పి, 'ఈ కర్మకు నా బాధ్యత లేదు' అని చెప్పుట విరోధమే గదా! ఒకడు ఇతరుల బలాత్కారమునకు తలవంచి ఒక కర్మను చేసిన సందర్భములో నైననూ, ఆతడు కర్మను చేసినట్లే యగును గదా! ఆ కర్మ యొక్క ఉత్తర దాయిత్వమును మరియొకరిపైకి నెట్టివేసిననూ, కర్తృత్వము తప్పదు.

ఒక కర్మను చేయుమని ఈశ్వరుని బలవంతపెట్టువాడు మరియొకడు లేడు గనుక, ఈశ్వరుడు తన కర్మల బాధ్యతను మరియొకని మీదకు నెట్టివేయుటకు వీలుపడదు. కావున, సృష్టి స్థితి లయములనే త్రివిధ కర్మలకు ఈశ్వరుడే బాధ్యతను వహించవలెను. కాని ఆయన తన చేతులను పూర్తిగా కడిగివేసుకున్నాడా యన్నట్లు పలుకుచున్నాడు. 'నేను సృజించెదను. కాని ఈ కర్మల ఫలములచే నేను ప్రభావితుడను గాను' అని ఆయన చెప్పుచున్నాడు. ఈ విరోధాభాసము భగవానుడు తరువాతి శ్లోకములో పరిష్కరించును:

**అధ్యాయము 9, శ్లోకము 10:**

मयाध्यक्षेण प्रकृतिस्सूयते सचराचरम् ।
हेतुनानेन कौन्तेय जगद्विपरिवर्तते ॥ १० ॥

మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే (10).

మయా = నేను; అధ్యక్షేణ = అధ్యక్షుడనై యుండగా; ప్రకృతిః = ప్రకృతి; సచరాచరమ్ = జంగమ స్థావరములతో గూడిన జగత్తును; సూయతే = సృష్టించుచున్నది; కౌంతేయ = ఓ అర్జునా!; అనేన = ఈ; హేతునా = కారణము చేత; జగత్ = జగత్తు; విపరివర్తతే = అనేక మార్పులకు లోనగుచున్నది.

నేను అధ్యక్షుడనై యుండగా, ప్రకృతి స్థావర జంగమములతో గూడిన ఈ జగత్తును సృష్టించుచున్నది. ఈ కారణము చేత ఈ జగత్తు అనేక మార్పులకు లోనగుచున్నది (10).

ఈశ్వరోపాధి యగు ప్రకృతి ఈ జగత్తును సృజించుచున్నది (సూయతే). ఈ జగత్తులో చరములు (కదిలేవి), అచరములు (కదలనివి) అనే ద్వివిధ వస్తువులు గలవు. చర, అచర శబ్దములు రెండు చేతన పదార్థములను నిర్దేశించును. చెట్లు, మొక్కలు మొదలగు కదలని ప్రాణులు అచరములు. నడయాడే ప్రాణులు చరములు. లేదా, సచరాచరమ్ అనగా చేతనములతో (చర), మరియు జడములతో (అచర) కూడిన జగత్తు. ప్రకృతి సర్వమును సృజించుననే భగవానుని ఈ వాక్యములో ఒక సమస్య దాగియున్నది. ప్రకృతి సర్వమును సృజించుననగా, ఈశ్వరునకు బాధ్యత ఏమియూ లేదని అర్థము. పరమాత్మకు ఈ సృష్టితో సంబంధమేమియూ లేదన్నచో, మన ముందు రెండు సత్యములు నిలబడును. కర్మలను వేటినీ చేయని ఆత్మ ఒకటి. సర్వకర్మలను చేయు ప్రకృతి మరియొకటి. అపుడు ప్రకృతి చేతనమా, జడమా? అను ప్రశ్న ఉదయించును. రెండవ చేతనము యొక్క ఉనికిని నిరూపించుట సంభవము కాదని మనము చూచియున్నాము. ఆత్మ చైతన్యము ఒక్కటియే. మిగిలిన సర్వము చైతన్యములో విషయమగు అనాత్మ మాత్రమే. ప్రత్యక్ష ప్రమాణము గాని, అనుమాన ప్రమాణము గాని, రెండవ చేతనతత్త్వము యొక్క ఉనికిని స్థాపించలేవు. అవి చేతన విషయములగు అనాత్మను మాత్రమే స్థాపించగలవు. మరియు, చైతన్య విధానము ఆత్మ ఒక్కటియే నని వేదము కూడా సుస్పష్టముగా బోధించుచున్నది. ఇట్టి స్థితిలో జడమగు ప్రకృతి సృష్టిని ఎట్లు చేయగల్గును?

సాంఖ్యులు ప్రకృతిని ప్రధానము అనియు, చేతన తత్త్వమును పురుషుడు అనియు పిలిచెదరు. పురుషునకు ప్రకృతితో సంబంధము లేశమైననూ లేదనియు, పురుషుడు అసంగుడనియు వారు చెప్పెదరు. ఇది పూర్ణ అసంగత్వము. ఏలయన, వారి సిద్ధాంతములో ప్రకృతి సత్యము. ప్రకృతి ఒకటి. పురుషులు అనేకము. పురుషునితో సంబంధములేని జగత్తు అంతా ప్రకృతియే. ఇది సమాంతరమగు సత్యము. పురుషుడు సృష్టి ప్రక్రియలో పాల్గొనడు.

ఈ సిద్ధాంతము మనకు సమ్మతము కాదు. ఏలయన, ఇది శాస్త్రమునకు, మరియు యుక్తికి కూడ విరుద్ధము. ఈ సాంఖ్య సిద్ధాంతమును విరసిస్తూ బ్రహ్మ సూత్రములలోని మొదటి రెండు అధ్యాయములలో అనేక యుక్తులు ప్రదర్శింపబడినవి. సర్వమును ప్రకృతి సృజించు

నన్నచో, సృష్టికి ముందు ఏమి ఉండెను? అసంగుడగు పురుషుడు, ప్రకృతి మాత్రమే ప్రలయములో ప్రకృతి ఎట్టి అవస్థలో నుండెడిది? ప్రకృతి యొక్క సత్త్వరజస్తమో గుణ మూడు సామ్యావస్థలో నుండెడివి యని, వాటిలో కదలిక ఏర్పడువనియు, అప్పుడు సృష్టించనారంభించె ననియు వారు చెప్పెదరు. ఇచట ఒక ప్రధానమైన ప్రశ్న ఉదయిం ప్రకృతిలో కదలికను తీసుకు వచ్చినదెవ్వరు? ప్రకృతి జడము. కాన, తనంత తాను కద పొందజాలదు. 'నేను సృష్టించెదను గాక!' అని ప్రకృతి సంకల్పించజాలదు. ఈ ప్రకృతిల తెచ్చే అంశము మరియొకటి లేదు. అట్టి తరి, ఈ సృష్టి ఎట్లు ఆరంభమాయెను?

భగవానుడీ ప్రశ్నకు ప్రత్యుత్తరము నిచ్చుచున్నాడు: 'నేను అధ్యక్షుడనై యుండగా ( అధ్యక్షేణ), నేను అనుగ్రహించగా, ప్రకృతి సృష్టించును'. ఇచటి 'నేను' శుద్ధచైతన్యము ( పరమ సభలకు అధ్యక్షుడు ఉన్నట్లే, సృష్టికి అధ్యక్షుడు గలడు. సర్వ పరిస్థితులలో శుద్ధ చైతన్య ఉపలభ్యమగుచుండును గనుక, 'మయా అధ్యక్షేణ' అనగా 'దృశిమాత్ర స్వరూపేణ' అని శంకరులు వివరించిరి. శ్రీ శంకరులకు ప్రియమగు పదములలో నిదియొకటి. ఉపదేశ వారు ఒక విశిష్ట రూపములేని ఆకాశమును దృష్టాంతముగా నుడివిరి. రూపము లేని చైతన్య ఆత్మ యొక్క స్వరూపము. కావున, భగవానుడు 'అధ్యక్షేణ మయా' అన్నప్పుడు, 'మయా అనగా సర్వవిక్రియా రహితమగు ఆత్మ అని యర్థము. ఆత్మ సన్నిధిలో నీ బుద్ధి, ఇంద్రియము సచేతనములై సృష్టింప సమర్థము లగును. అదే విధముగా, నేను అధ్యక్షుడనై యుండగా ప్రకృతి (మాయ) సృష్టిని చేయును. నా సన్నిధి వలన ప్రకృతికి సృష్టిని చేయు సామర్థ్యమ కలిగినది.

శ్రీ శంకరులిచట ఒక ప్రముఖమగు మంత్రము నుదహరించిరి: ఏకో దేవస్సర్వభూతేషు గూఢస్సర్వ వ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షస్సర్వ భూతాధివాసస్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ (శ్వేతాశ్వతరోపనిషత్తు, 6-11).

ఇచట ఆత్మ 'దేవః' అని పిలువబడినది. ఆత్మ అద్వయమని ఏకః అను పదము స్పష్టపరుచును. అద్వయ పరమేశ్వరుడు సర్వప్రాణులలో దాగియున్నాడు ( సర్వ భూతేషు గూఢః). ఆయన సర్వప్రాణుల బుద్ధి యందు లభించుచున్నాడు. ఆయన అనుగ్రహము చేతనే ఇంద్రియజ్ఞానము లన్నియూ సంభవించుచున్నవి. కాని, ఆయన ఇంద్రియగోచరుడు కాడు. అందువలననే, గూఢః ( దాగియున్నవాడు) అని వర్ణింపబడెను. ఆత్మ స్వయం సిద్ధము, స్వయం ప్రకాశము. ఈశ్వరుడు

ఆకాశములో ఒక స్థానమునకు పరిమితమై లేడు. అయన సర్వ వ్యాపియై, సర్వప్రాణుల అంతరాత్మ రూపములో నున్నాడు. భగవానుని సృష్టి స్థితి లయ రూప కర్మల యందు మాత్రమే గాక, జీవుల సర్వకర్మల యందు కూడా అయన సాక్షి రూపములో నున్నాడు. తాను ఏ కర్మలను చేయకుండగా, సర్వకర్మలను అనుగ్రహించువాడు గనుక, అయన కర్మాధ్యక్షుడైనాడు. అయన సర్వ పదార్థములకు అధిష్ఠానము (అధివాసః). సర్వ పదార్థముల ఉనికి అయన యందు గలదు. అయన సాక్షి, చేతనుడు (చేతా). దృశ్య పదార్థముల అపేక్షయా, చైతన్యమునకు సాక్షిత్వము ధర్మమగును. కాని, చేతనము స్వరూపతః సాక్షి కాదు; దర్శనము అను క్రియను చేసే కర్త గాదు. అందువలననే ఉన్న ఏకైక తత్త్వము పరమాత్మయే (కేవలః). రెండవ వస్తువు లేదు. పరమాత్మ యందు గుణములు ఏమియూ లేవు (నిర్గుణః చ). నేను అధ్యక్షుడనై యుండి సచేతనము చేయుటచే ప్రకృతి చేతనమగుచున్నది. చైతన్యము మాయోపాధి యందు అవచ్ఛిన్నమై, ఆ ఆత్మ పరమేశ్వరుడై, సర్వజ్ఞత్వ సర్వకారిత్వములనే విశేషణములను పొందినది. ఈ ఆత్మ యొక్క అనుగ్రహము చేతనే ప్రకృతి సర్వమును సృష్టించును.

ఈ కారణము చేతనే (అనేన హేతునా) జగత్తు మార్పుల నన్నిటినీ పొందుచున్నది (జగద్విపరివర్తతే). సృష్టి లయములనే మార్పులు, సృష్టి లోపల జరిగే విభిన్న పరివర్తనములు ఈ కారణము చేతనే జరుగుచున్నవి. వీటన్నింటిపై అధ్యక్షుడను నేనే. కాన భగవద్రూపములోని ఆత్మ 'నేను సృజించుచున్నాను (అహం విసృజామి)' అని చెప్పుట పొసగును. 'నేను సృష్టించుట లేదు' అని కూడా అయన చెప్పగలడు. ఎట్లు? దీనిని పరిశీలించుడు.

నీవు నీ విషయమును పరిశీలింపుము. దేహము కదలుచున్నప్పుడు, ఆ కదలిక అనే గుణము దేహము లోపల నివసించు జీవునిపై ఆరోపించబడును. అదియే నేను. దేహమును, దానిలోని కదలికను తెలియువాడను నేను. కాని, జ్ఞాతనగు నాపై కదలిక యను క్రియ అధ్యారోపము చేయబడును. ఇచట మనము సచ్చిదానంద ఆత్మను చర్చించుట లేదు. దేహము నందు నివసించే జీవుడు, కారులో పయనించే వ్యక్తి వలె, క్రియను దేనినీ చేయుట లేదు. కారులో పయనించిన వ్యక్తి క్రియను దేనినీ చేయకపోయినా, కారు కదలికను తనపై ఆరోపించుకొని, 'నేను గంటకు 60 మైళ్ల వేగముతో పయనించితిని' అని పలుకును. ఒలింపిక్స్ పరుగు పందెము విజేత కూడ గంటకు 60 మైళ్ల వేగముతో పరుగెత్తలేడు. అట్టి పరుగు కారునకు మాత్రమే సాధ్యమగును. కాని తానే గంటకు 60 మైళ్ల వేగముతో పయనించినానని అతడు చెప్పును. ఆరోపమనగా ఇదియే. కారునకు చెందిన గంటకు 60 మైళ్ల వేగపు కదలిక దేహముపై ఆరోపించబడినది. అదే విధముగా స్థూలదేహము పరుగెత్తినప్పుడు, లేదా నడిచినప్పుడు ఆ కదలిక ఆత్మపై అధ్యారోపము చేయబడి 'నేను పరుగెత్తితిని, నడిచితిని' ఇత్యాదిగా చెప్పుచుందురు.

భగవానుని విషయములో కూడా ఇంతే. ప్రకృతి యందు నివసించి యుండే చైతన్యము (అధ్యక్షః) సర్వము సంభవమగునట్లు అనుగ్రహించును. చేతన ఆత్మానుగ్రహముచే ప్రకృతి సర్వ వికారములను పొందును. కావున, ఈ జగత్కార్యమును అంతనూ చేసేది ప్రకృతియే.

ప్రకృతి యందుండే క్రియ ఆత్మయందు ఆరోపింపబడినదనియు, ఆత్మ (నేను) లేనిదే ప్రకృతి తనంత తానుగా సృజించలేదనియు ఎరింగినచో, ఆ ఎరుకలో 'నేను సృజించుచున్నాను (అహం విసృజామి)' అను మాట పొసగును. నా సన్నిధిలో ప్రకృతి సర్వకార్యములను చక్కబెట్టును. మార్పులన్నియూ ప్రకృతి (మాయ) యందు సంభవించును. నేను మాయోపాధి యందు సర్వకాలముల యందు ఏ కర్మనైననూ ఆచరించకుండగా నుండెదను (ఉదాసీన వదాసీనః).

ఇచట భగవానుడు 'సచరాచరమ్' అను శబ్దమును ప్రయోగించి, సర్వజగత్తును నిర్దేశించినాడని గమనించుట ముఖ్యము. ఏ కర్మనూ చేయని నా అనుగ్రహమును పొంది ప్రకృతి సమస్త జగత్తును సృజించినదని భగవానుడు చెప్పుచున్నాడు. ఆ సర్వ జగత్తులో నీ దేహము, మరియు పంచభూతములు కూడ అంతర్భాగములే. అవి చైతన్యానుగ్రహముచే మాయ నుండి పుట్టిన కార్యములు తక్క వేరొండు గాదు. మాయాకార్యము మాయకు దూరము కాదు. మాయ ఆత్మకు దూరము కాదు. కావున, సచ్చిదానంద ఆత్మ కంటె దూరముగా ఏదీ లేదు. మనమిపుడు నీ స్థూల దేహమును గురించి చర్చిద్దాము. ఇది సృష్టింపబడినదా? కాదా? ఈ స్థూలదేహము కూడా ప్రకృతి (మాయా) వికారమే. కావున, ఇది ప్రకృతిచే సృష్టింపబడినది. ప్రాణము, మనస్సు, ఇంద్రియములు అన్నీ ప్రకృతిచే సృష్టింపబడినవి. దాని వెనుక సచ్చిదానంద ఆత్మ గలదు. పరమేశ్వరుని అనుగ్రహముచేత మాత్రమే (మయా అధ్యక్షేణ) నీ మనస్సు పనిచేయుచున్నది. వృత్తులన్నియూ చైతన్య ఆత్మచే అనుగ్రహింపబడుచున్నవి. ఆత్మ ఒక్కటియే గనుక, ఈ స్థితి వ్యక్తిగత సృష్టిలో, మరియు సర్వ జగత్సృష్టిలో సమముగా నున్నది. నీ వ్యక్తిగత సృష్టికి, మరియు సర్వబ్రహ్మాండ సృష్టికి వెనుక ఈ చైతన్య ఆత్మ మాత్రమే గలదు. కావున భగవానునితో సమముగా నీవు కూడా 'నాచే అనుగ్రహింపబడిన ప్రకృతి ఈ చరాచర జగత్తును సృజించుచున్నది (మయా అధ్యక్షేణ ప్రకృతి సూయతే సచరాచరమ్)' అని చెప్పదగును. అదియే జ్ఞానము. నేను క్రియలను వేటినీ ఆచరించను. నా సన్నిధి యందు మాత్రమే క్రియలు జరుగును. అచేతనము సృష్టిని చేయజాలదు. చేతనము సృష్టిని చేయదు. వీటి మధ్యలో సృష్టి అనబడేది ఉన్నది. కావ జడ ప్రకృతి ఆత్మ చైతన్యముచే అనుగృహీతమై సర్వసృష్టికి కారణమగును.

ప్రకాశింపజేయుచున్నది. కోరికలను కోరే అహంకారముతో సహా సర్వమును ప్రకాశింపజేయును. అదే చైతన్యము నీవు చేయు కర్మలను కూడ ప్రకాశింపజేయును. కావున, చైతన్యము లేనిదే కర్మలు (ప్రవృత్తి) ఎట్లు సంభవమగును? కాని, చైతన్యము స్వయముగా కర్మలను చేయదు. కర్త, కర్మ, కరణము మొదలైన, క్రియలో అన్వయించే అంశము లన్నియు (కారకములు) ఒకే చైతన్యముచే ప్రకాశింపచేయబడును. చైతన్యము స్వయముగా క్రియను ఆచరించదు. కాని, సర్వమును ప్రకాశింపజేయును. కావున, 'నేను కర్తను గాను (అహం అకర్తా)' అని నీవు చెప్పవచ్చును. కాని ఆత్మ ప్రకాశము లేనిదే క్రియ అను ప్రసక్తియే లేదు. ఒక కోరికను గుర్తించనిదే తీర్చుకొనుట ఎట్లు సంభవమగును? నీవు (ఆత్మ) లేనిదే గుర్తించుట సంభవము కాదు. ఈ సత్యము స్పష్టమైనచో, 'సర్వము నేనే చేసితిని; కాని, నేను దేనినీ చేయలేదు. నేను కర్తను, నేను అకర్తను' అని నీవు చెప్పుట యుక్తి యుక్తమే యగును.

'ఈ జ్ఞానమునకు ప్రయోజనము అహంకార నిర్మూలనము' అనే తప్పు అవగాహన సామాన్యంగా జనులలో గోచరిస్తుంది. అట్టి స్థితిలో ఒక ప్రశ్న ఉదయించుట సహజమే. 'నేను అహంకారమును నిర్మూలించినచో, ఆపైన నేను ఏ విధమైన సాధనను గాని, అన్వేషణను గాని ఎట్లు చేయగల్గుదును?' మనమిచట అహంకారమును నిర్మూలించబోవుట లేదు. అహంకారము ఆత్మయే. కాని ఆత్మ అహంకారము కాదు అని మనము చెప్తాము. ఈ జ్ఞానమును పొందినచో అహంకారమును నిర్మూలన చేసినట్లే యగును. ఏలయన, ఆత్మ అహంకారమే నను తప్పు భావన తొలగినది. అహంకారము తనపై తాను ఆత్మ యొక్క తాదాత్మ్యమును ఆరోపించుకున్నది. తాను స్వతంత్రమగు సత్త గల్గిన దాని వలె భ్రమపడుచున్నది. ఈ తాదాత్మ్య భ్రాంతి వలన పరిచ్ఛేదము, బంధము కలుగును. ఒకడు కొన్ని తపాలా బిళ్లలను దుర్వినియోగపరచి, ఆ కారణంగా లక్షరూపాయల ఉద్యోగమును పోగొట్టుకున్నాడట! ఇది అట్లున్నది. దానికి ఆత్మ లేకుండా అహం (నేను) అనే భావన యైననూ లేదు. కాని, అది దేహమును, మనస్సును, ఇంద్రియములను తనలో కలుపుకొని, ఒక పరిచ్ఛిన్న తత్త్వమై నెలకొనును. కావున, మనము దానిని బాధించ (negate) వలెను. అహంకారము బాధితమగును. జ్ఞాన ప్రకాశమును పొందిన తరువాత నైననూ అహంకారము ఒక తత్త్వముగా కొనసాగును. కాని సాధకునకు తన స్వరూపమును గురించి గల అల్పత్వాది ధారణలు తొలగినవి. ఈ స్థితిలో అహంకారము ఉన్నదని చెప్పవచ్చును; లేదని కూడ చెప్పవచ్చును. కర్మణ్యతను చేపట్టే కర్త ఉన్నది. కాని ఆత్మ యందు కర్మణ్యత లేనే లేదు.

ఈ ప్రవృత్తి (కర్మణ్యత) యొక్క స్వరూపమును శ్రీ శంకరులు వివరించిరి. ఈ విశిష్ట వస్తువును నేను భోగించుచున్నాను, నేను దీనిని చూచుచున్నాను, నేను దీనిని వినుచున్నాను, ఈ సుఖమును నేను అనుభవించుచున్నాను, ఈ ప్రయోజనము కొరకు మాత్రమే నేనీ పనిని చేయుచున్నాను, నేను దీనిని ఎరుంగుదును ఇత్యాది సర్వ ప్రవృత్తి యొక్క ఉనికి చైతన్యము నందు గలదు. ప్రవృత్తి యొక్క స్వరూపము అట్లున్నది. ఈ సత్యమును నిరూపించుటయే భాష్యకారుల తాత్పర్యమై యున్నది. 'నేను చూచుచున్నాను' అని నేను అన్నప్పుడు, నేను ఒక వస్తువును చూడగల్గుతున్నాను అను సత్యము నందు జ్ఞానము, చైతన్యము ఇమిడి యున్నవి. 'నేను చూచుచున్నాను' అని నేను అన్నప్పుడు, ఆ ద్రష్ట యొక్క ఉనికి చైతన్యము నందు గలదు. దర్శనము యొక్క ఉనికి కూడ చైతన్యము నందు మాత్రమే గలదు. దృశ్య వస్తువు కూడ చైతన్యము కంటె భిన్నముగా లేదు. 'నేను దీనిని చూచుచున్నాను' అని నేను అన్నప్పుడు, ఆ దర్శన క్రియలో కర్మ 'ఇది'యే గదా! ఆ 'ఇది' చైతన్యము కంటె భిన్నము ఎట్లైనది? కావున, ద్రష్ట, దృశ్యము, దర్శనములలో ఏదీ చైతన్యము కంటె భిన్నము కాదు. ఇదే విధముగా భోక్తను, భోగ్యమును, భోగమును ప్రకాశింపచేయనిదే, 'నేను భోగించుచున్నాను' అని నీవు ఎట్లు చెప్పగల్గుదువు? కావున, నేనీ పనిని చేసెదను, నేనీ వస్తువును తెలుసుకొనెదను, నాకు ఈ వస్తువు తెలియును, నేను ఈ వస్తువును గురించి వినుచున్నాను ఇత్యాది ప్రవృత్తులన్నింటికీ ఉనికి చైతన్యము నందు గలదు. ఈ సర్వము చైతన్యములో లీనమగును. ఒక కర్మ పూర్తి కాగానే, నీవు మరియొక కర్మ కొరకు సంసిద్ధుడవగుదువు. అది కూడా చైతన్యములో లయమగును. నీవు మరల ఇంకొక దాని కొరకు సంసిద్ధుడవగుదువు.

మనస్సు చాల తెలివి గలది. అది కెమెరా వంటిది. కెమెరా కంటె గొప్పది. వస్తువుల నుండి ప్రసరించు కాంతి కెమెరాలోని ఛాయా గ్రాహకముపై పడి వస్తువు ప్రతిబింబము ఏర్పడును. కాని, ఇట్లు ఒకేసారి సంభవమగును. ఆ ఛాయాగ్రాహకమును తుడిపివేసి, మరల వినియోగించుటకు వీలుపడదు. ఒకసారి ప్రతిబింబమును గ్రహిస్తే, దాని పని అయినట్లే. కాని మనస్సు అట్లు కాదు. మీరు గమనించుడు. మనస్సులో వస్తువు దర్శింపబడును. వస్తు ప్రతిబింబమును మనస్సు గ్రహించును. ఇంతలో మనస్సు ఆ వస్తువు నుండి ప్రక్కకు మరలిపోవును. ఆత్మ చైతన్యము గలదు. కెమెరాకు వలెనే కంటికి కూడా కొంత కాంతి అవసరమగును. కాని కంటికి కాంతి లోపలి నుండి వచ్చి వస్తు జ్ఞానమును కలిగించును. అది పూర్తి కాగానే, మరల ఇంకో వస్తువు యొక్క జ్ఞానము కొరకై సర్వము సిద్ధముగా నుండును. మనస్సులో మరో మంచి లక్షణము గలదు. అది ఈ ప్రతిబింబము లన్నింటిని భద్రపరచి, తరువాత సమయం వచ్చినప్పుడు స్మరింపచేయగల్గును. క్రమంగా కొద్ది

కాలము గడిచిన తరువాత, మనస్సులోని కొన్ని ప్రతిబింబములు తుడిచివేయబడును. 'నిన్న మధ్యాహ్న భోజనములో కూర ఏమిటి?' అని అడిగినచో, నీవు కొంత ఆలోచిస్తే, గుర్తుకు రావచ్చును. నెలరోజుల క్రితం ఇదే రోజున కూర ఏమిటి? అని అడిగినచో, నీవు చెప్పజాలవు. ఇది చాల అద్భుతమైన విషయము. ఇట్లు మరువజాలనిచో, మన మస్తిష్కము నిండా కూరలు, విందులు, భోజనములు, మనము చూసిన చదివిన వస్తువులు నిండియుండును. కాని, కొన్ని ప్రముఖ విషయములు సర్వదా స్మృతిపథములో భద్రపరుచబడును. ఈ స్మృతి చాల అద్భుతమైనదని నా అభిప్రాయము. కొన్నింటిని మరిచిపోయే శక్తి లేనిచో, మనస్సు ఎట్లు పనిచేయగల్గును? కాని, మనస్సు కొన్ని విషయములను తనంత తానుగా మిక్కిలి స్పష్టముగా గుర్తులో ఉంచుకునే సామర్థ్యమును కలిగియున్నది. మనస్సు సువ్యవస్థితమైన ఒక అద్భుతము. ఆత్మ చైతన్యము స్మృతితో సహా సర్వమును ప్రకాశింపజేయును. వస్తు దర్శనము పూర్తి కాగానే, మనస్సు నుండి ఆ వస్తువు తొలగిపోవును. సర్వము చైతన్యములో లీనమగును. సర్వము యొక్క ఉనికి చైతన్యము నందు గలదు. సర్వము యొక్క జ్ఞానము చైతన్యములో లీనమగును. ఇదియే అవగతి అనబడును. సర్వము అంతమగు అవధి చైతన్యము. ఈ విషయము మరింత గంభీరమైనది. దీనిని మనము మరల చర్చిద్దాము.

ప్రకృతి సచరాచరమగు జగత్తును సృష్టించునని మనము గడచిన రెండు శ్లోకములలో చూచియున్నాము. జగత్తును పాలించి పోషించి నాశమును చేయునది కూడా ప్రకృతియే. నాశమనగా సృష్టిని తన లోనికి లయము చేసుకొనుట. ప్రకృతి నా అనుగ్రహముతో మాత్రమే దీని నంతనూ చేయగల్గుచున్నది అని భగవానుడు చెప్పుచున్నాడు. పరమాత్మను ఆశ్రయముగా చేసుకొని ప్రకృతి సర్వమును సృజించును. ఈ ఆశ్రయము లేనిదే ప్రకృతి సచేతనము కాజాలదు. కావున, సృష్టించజాలదు. ప్రకృతికి మాయ అని కూడ పేరు గలదు. దాని ఉనికి పరమాత్మ యందు గలదు. పరమాత్మ వలననే అది సచేతనమై సృష్టించగల్గుచున్నది (మాయతే). మాయోపాధి సాపేక్షముగా భగవానుడు అహం శబ్దమును ప్రయోగించినచో, 'నేను సృష్టించుచున్నాను (అహం విసృజామి)' అని చెప్పగల్గును. ఆ అహం శుద్ధ పరమాత్మయే. 'నేను సృజించుచున్నాను' అను వాక్యము కేవల సాపేక్ష (referential) కథనము మాత్రమే.

'ఈ కర్మలు నన్ను లేశమైననూ బంధించవు (న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి). ఏలయన, నేను పూర్తిగా ఉదాసీనుడు వంటివాడను (ఉదాసీనవత్)' అని కూడా భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుని స్వరూపదృష్ట్యా కర్మ లేశమైననూ లేదు. ఇచట ఇట్లు రెండు రకముల వాక్యములు చెప్పబడినవి. ఈ రెండింటినీ కలిపి తెలుసుకున్నచో, అదియే జ్ఞానము.

'నేను చేయుచున్నాను' అని నీవు పలికే సందర్భములో కూడా ఈ ప్రక్రియ అంతా ఇమిడి యున్నది. దేహేంద్రియ మనస్సంఘాతము అనే ఉపాధిలో జరిగే క్రియను ఆత్మ యందు ఆరోపించుకొని 'నేను చేయుచున్నాను' అని నీవు చెప్పుచున్నావు. ఈ సత్యము నీకు అవగతమైనచో, నీవు క్రియను చేయుటయే లేదని నీకు స్పష్టమగును. ఈ కారణముగనే ఈ కర్మలు నిన్ను బంధించవని భగవానుడు చెప్పుచున్నాడు.

## సృష్టి ఎవరి కొరకు?

శ్రీ శంకరులిచట ఒక ప్రధానమైన ప్రశ్నను లేవనెత్తిరి. భగవానునకు భోగ్య వస్తువులతో సంసర్గము లేదు గదా! భోక్త యనదగిన మరియొక చేతన తత్త్వము లేదు గదా! భగవానుడీ సృష్టిని ఎందులకు చేసినాడు?

## మరియొకరి కొరకా?

సృష్టి మరియొక భోక్త కొరకు అని చెప్పవలెనన్నచో, మున్ముందుగా మరియొక భోక్త గలడని మనము స్థాపించవలసి యుండును.

## మరియొక భోక్త గలడా?

శ్రీ శంకరులు ఇంతకు ముందు ఉదహరించిన మంత్రము ఇట్లు ఉపదేశించును: సర్వప్రాణులలో నిగూఢముగా (సర్వభూతేషు గూఢః) ఒకే ఒక భగవానుడు (చేతన పురుషుడు) గలడు (ఏకో దేవః). అనగా, మనమింతకు ముందు చూచిన విధముగా, ఒకే ఒక ఆత్మ గలదు. అది స్వరూపతః చైతన్యఘనము. అదియే ఈ సర్వ సృష్టిరూపముగా నున్నది. ఈ సృష్టిలో నానాత్వము లేనే లేదు (సర్వం బ్రహ్మైవ నేహ నానాస్తి కించన). జగత్తు కూడ మిథ్య గనుక, ద్వితీయ వస్తువు కాజాలదు. శ్రుతి యొక్క తాత్పర్యమిదియే.

ఆత్మలు అనేకము అని వాదించువారిని ఒక ప్రశ్న అడుగవలసియున్నది. రెండవ ఆత్మ నీకు తెలియునా? తెలియదా? రెండవ ఆత్మ ఉన్నది అని నీవు అన్నచో, అది నీకు తెలిసి ఉండాలి.

## రెండవ ఆత్మ తెలియబడే విధమెట్టి?

### ఆత్మ చేత తెలియబడునా?

ద్వితీయ ఆత్మ తెలియబడే పక్షంలో, దానిని తెలుసుకొనేది ఆత్మయా? అనాత్మయా? అని మేము ప్రశ్నిస్తాము. ఆత్మచే రెండవ ఆత్మ తెలియబడిన దనుకొనుడు. రెండవ ఆత్మకు నీ ఆత్మకు మధ్య గల భేదమును నీవు దర్శించగల్గిన నాడు మాత్రమే రెండవ ఆత్మ ఉనికి నీకు తెలుస్తుంది. అది సంభవము కావాలంటే, ముందుగా నీ ఆత్మను ఇతర ఆత్మల నుండి వ్యావృత్తము చేసే (distinguish) ఒక విశేష లక్షణమును నీ ఆత్మ యందు నీవు దర్శించవలెను. నీవు నీ ఆత్మలోనికి చూచుకొనుము. ఏమి కనబడుచున్నది? తెలుపా? నలుపా?

నీకు ఆత్మ నల్లనిదిగా కనబడినచో, ఆ నల్లదనము ఆత్మదా? అనాత్మదా? అనాత్మదైనచో ఆత్మ నల్లనిది ఎట్లగును? ఆత్మదే అయినచో, దానిని నీవు ఎట్లు చూచెదవు? ఆత్మధర్మమును నీవు చూడగలగాలంటే, అది దృశ్యము (అనాత్మ) అయి ఉండాలి. కాన ఆత్మధర్మమును నీవు చూచుట అసంభవము. ఒక వస్తువును చూడగలగాలంటే, కర్తృ కర్మ భేదము ఉండవలెను. కావ ఆత్మధర్మమును దేనినైననూ చూడగల్గుటకు, ఆత్మను ద్రష్ట ఆత్మ, దృశ్య ఆత్మ అను రెండు ముక్కలుగా చేయవలెను. ఒకే ఆత్మను ద్రష్ట, దృశ్యము అను రెండు ముక్కలుగా చేయుట ఎట్లు? ఇది సంభవము కానే కాదు. కావున నీ ఆత్మను ఇతర ఆత్మల నుండి వ్యావృత్తము చేసే ధర్మములను నీవు చూడజాలవు. కావున విభిన్న ఆత్మల మధ్య భేదమును ఆత్మ తెలియజాలదు.

### అనాత్మ చేత తెలియబడునా?

అట్లైనచో, అనాత్మచే తెలియబడునని చెప్పవలెను. కాని, అనాత్మ జడము. అది నాచే చూడబడే దృశ్యము. జడమగు అనాత్మ ఇతరమును దేనినీ చూడజాలదు. కావున, ఈ వ్యావర్తక లక్షణము ఆత్మచే కాని, అనాత్మచే గాని చూడబడుట లేదు. అది చూడబడనిచో, రెండవ ఆత్మ గలదని నీవు నిరూపించజాలవు.

దీనిని మరి కొంత పరిశీలించెదము. మాటవరుసకు ఈ ఆత్మ భేదము గలదని అంగీకరించెదము. ఈ భేదము ఆత్మ కంటె భిన్నమా, కాదా? అది ఆత్మ కంటె భిన్నము అన్నచో, అది ఆత్మకు ధర్మము అగును. అవగా అది అనాత్మ యగును. అది ఆత్మ కంటె భిన్నము

దానిని నీవు చూడగల్గుట అసంభవము అను సమస్య మిగిలియే యుండును. ఆత్మ
ణములను తానే చూడలేదు గనుక, దాని ఉనికిని స్థాపించే ప్రమాణము లేకుండును.
ద్రష్ట దృశ్య విభాగము (subject-object division) ఆత్మ యందు లేదు.

ఈ చర్చకు సారాంశమేమనగా, ఆత్మలు అనేకము అయినచో, వాటిలో గల భేదములను వాటిని మనము విడివిడిగా గుర్తించగలగాలి. వాటిలో గల పరస్పర భేదమును స్థాపించుటకు నీవు నీ ఆత్మకు గల లక్షణమును చూచి, ఆపై ఇతర ఆత్మకు గల విభిన్న లక్షణమును గాలి. ఆత్మల మధ్య గల భేదములను స్థాపించకుండగా, ఆత్మ నానాత్వమును స్థిరపరచుట దు.

నీ ఆత్మ సచ్చిదానందమైనచో, మరియొక ఆత్మ ఏమి అయి ఉండును? ఆత్మలు అనేకము; అన్నియూ సచ్చిదానందములే అనెదవా? ఈ ఆనందము అఖండమై ఉండగా, దీని కంటె గా మరియొక ఆనందము ఎట్లు ఉండగల్గును? ఒక సచ్చిదానంద ఆత్మ అనంతమైనచో, అనంత ఆత్మకు అవకాశమేది? అనంతములు రెండు ఉండజాలవు. కావున ఈశ్వరునితో నీవు కూడా 'మయా ధ్యక్షేణ ప్రకృతిః ....' అని చెప్పదగుదువు. జ్ఞానమనగా నిదియే. కృష్ణ భగవానునితో బాటు నీవు కూడా 'సర్వమునకు నేను అధ్యక్షుడను' అని చెప్పగల్గునట్లు టయే ఈ ఉపదేశమున కంతకూ సారము. ఏలయన, ఆయన 'నేను' అన్న సందర్భములో 'నేను' సచ్చిదానంద ఆత్మయే. ఒకే ఒక సచ్చిదానందము గలదు.

## అనుమాన ప్రమాణముచే రెండవ ఆత్మ సిద్ధించునా?

ఆత్మ కంటికి కనబడకపోవచ్చును. కాని మనము ఎదుటి వ్యక్తితో మాటలాడినప్పుడు మనకు అతని నుండి ప్రతిస్పందన లభ్యమగుచున్నది గదా! కావున, అతనిలో మరియొక ఆత్మ గలదని మనము అనుమితి (inference)ని చేయుట సంభవమేనని వాదించవచ్చును. ఇది సరిగాదు. అనుమితి చేయబడేది ఆత్మ గాదు. ఇతర వ్యక్తిలో మస్తిష్కము గలదని మాత్రమే అనుమితి చేయగల్గుతాము. మనకు మరియొక ఆత్మ తారసిల్లే ప్రసక్తియే లేదు. మనకు తారసిల్లే దేహము గాని, మనము అనుమితి చేయగలిగే మనస్సు గాని అనాత్మలే. మనకు ఒక వ్యక్తి తారసిల్లినప్పుడు అతనిలో ఆలోచనలు గలవని మాత్రమే మనము అనుమితి చేయగలము. అతడు తన ఆలోచనలకు సాక్షియై ఉండును. కాన, మనకు తారసిల్లేది, మనము అనుమితి చేయగలిగేది

అనాత్మయే గాని ఆత్మ గాదు. కావున నీకు గాని, నీ ఎదుటి వ్యక్తికి గాని తారసిల్లేది ఆత్మ గాదు. ఆత్మ ఏనాడూ తారసిల్లేది కాదు గనుక, నీవు మరియొక ఆత్మను చూచి 'ఇది రెండవది' అని లెక్కించే సందర్భము రానే రాదు.

భోక్త లేనిదే సృష్టికి ప్రయోజనము లేదు. నీవు ఒక వస్తువును నిర్మించిన తరువాత దానిని నీవు అనుభవించవలెను. లేదా, మరియొకడు దానిని అనుభవించవలెను. ఒకే ఒక చేతన ఆత్మ గలదని మనము ఇప్పుడే చూచియున్నాము. కాన భోక్తృస్థానము నలంకరించుటకు మరియొక ఆత్మ లేదు. ఈ స్థితిలో ఈ జగత్తును అనుభవించే భోక్త ఎవరు?

## సృష్టి భగవానుని కొరకా?

సృష్టి సృష్టి కొరకు అన్నచో, పరమాత్మ సృష్టిని భోగించవలెను. అనగా ఆయన భోక్త కావలెను. భోక్త యందు ఒక మార్పు కలుగనిదే భోగము సంభవము కాదు. పూర్వక్షణములో లేని భోగమును భోక్త ఈ క్షణములో భోగించుచున్నాడు గదా! భోగము ఒక అనుభవరూపమగు అవస్థ. ఈ అవస్థ కొద్ది క్షణముల క్రితం లేకుండెను. ఇప్పుడు ఉన్నది. తరువాత ఉండబోదు. వర్తమానంలో మాత్రమే భోగము గలదు. భోగమనగా ఒకానొక మానసిక వృత్తి విశేషము. కావున ఆ అవస్థ లోనికి ప్రవేశించుటలో, దానిని కోల్పోవుటలో భోక్త యందు వికారము ఉండును. తాను చేసిన సృష్టికి భోక్త యగుటకై పరమాత్మ యందు వికృతి ఏర్పడవలెను. కావున, పరమాత్మ భోక్త కాజాలడు. సృష్టి సృష్టి కొరకు కాదు అని చెప్పుటలో ఇది ఒక హేతువు.

మరియు పరమాత్మ యందు అపర్యాప్త (చాలదు అనే) భావన ఉన్నచో, అది సృష్టిని చేయాలనే ప్రేరణను కలిగించును. కాని అట్టి న్యూనతా భావన లేశమైననూ పరమాత్మ యందు లేదు. ఆత్మ పరిపూర్ణము, అనంతము, అఖండము. 'నేను పూర్ణుడను కావాలి' అను కోరికకు ఈశ్వరుని యందు తావు లేదు. అట్టి పూర్ణ ఈశ్వరుడు సృష్టిని ఏల చేయును? కావున పరమాత్మ సృష్టిని చేయుట గాని, సృష్టిని భోగించుట గాని పొసగదు. కావున, ఈ జగత్సృష్టిని ఇదమిత్థముగా వ్యాఖ్యానించగల వారెవ్వరూ లేరు.

*హరిః ఓం తత్సత్*

## సృష్టి యేల? అను ప్రశ్న నిలబడదు

'ఈ సృష్టి ఏల?' అని ప్రశ్నించినచో, నీవేమి సమాధానము నీయగలవు? ఈ ప్రశ్న, దాని సమాధానము రెండు కూడా నిలబడవని శ్రీ శంకరులు చెప్పిరి. ఒకే ఒక ఆత్మ చైతన్యము గలదు. దానికి భిన్నంగా భోక్త లేడు. అట్టిచో నీవీ ప్రశ్నను ఏల వేయుచున్నావు? నీకు అద్వైతము అవగాహనకు వచ్చినదని భావింతును. కావున ఈ ప్రశ్న ఉదయించదు. ఒకే ఒక ఆత్మ చైతన్యము గలదని నీకు తెలిసినచో, యథార్థమగు సృష్టి లేదు గనుక, సృష్టికి ప్రయోజనమేమి? అను ప్రశ్న అసంగతమగును. ప్రశ్నను వేయుటయే అసంగతమైనచో, దానికి బదులిడుట అసంగతమనుటలో సందేహము లేదు. ఈ అభిప్రాయమును శ్రుతి కూడ వ్యక్తము చేసినది. శ్రుతి ఇట్లు చెప్పుచున్నది: కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః. ఈ జగత్తు నెరింగిన వాడెవ్వడు? సర్వమును సమగ్రముగా ఎరింగిన వాడెవ్వడు? ఈ జగత్తును దర్శించునది ఎవ్వరు? (ఋగ్వేదము 10–129–6) చూచుటకు జగత్తు లేదు. ఆత్మ కంటె భిన్నముగా నీవు జగత్తును చూడజాలవు. ఆత్మ యందైననూ నీవు జగత్తును చూడలేవు. 'ఈ విషయవస్తువును గురించి ఎవరు మాటలాడగల్గుదురు?' అనగా ఈ ప్రశ్నకు సమాధానమును ఎవరు ఈయగల్గుదురు? జగత్తు లేదు గనుక, దీనికి ఎవ్వరైననూ బదులిడజాలరు. ఏమి ఈ ఆశ్చర్యము! చూడుడు. 'ఎచ్చట నుండి, ఎచ్చట నుండి ఈ సృష్టి వచ్చినది?' ఈ ఆవృత్తి (కుతః) సంభ్రమమును ప్రదర్శించును. కంగారులో నున్న వ్యక్తి 'వాడెక్కడ? వాడెక్కడ?' అని ఆవృత్తిని చేయుట మనకు తెలిసినదే.

## సృష్టి భగవానుని లీలయా?

సృష్టి భగవానుని లీలయని కొందరి వాదము. అంటే నా నడుము నొప్పి, నా గుండెనొప్పి, నా కడుపులోని పుండు ఆయనకు ఆట. ఇది యేటి ఆట? ఆయన ఆడుతూ నన్ను కూడా ఆడనిస్తే, భగవానుడు ఆటయందభిరుచితో ఆటలో జట్టుకై మరికొందరిని సృజించినాడనుట సంగతముగ నుండును. ఆయన ఆట ఇతరులకు కూడా ఆట కావాలి. లేనిచో అది పరపీడనారతి యగును. ఈ ప్రపంచము ఆటకాదని మనకు తెలుస్తూనే ఉంది. కాన ఇది లీల యనుట అసంగతము. ఆట అనుకున్నా, ఆటలోని వినోదమును అనుభవించే భోక్త ఎవరు? ఆ లీలను అనుభవించే భోక్త, అవిక్రియము అగు ఆత్మ ఎట్లు కాగల్గును? శుద్ధచైతన్యము నందు లీల లేదు.

పైగా ఇట్టి లీలకు ప్రయోజనము లేదు. ఏలయనగా, ఏదో ఒకదానిని సృష్టించుటకై ఈశ్వరుని ప్రేరేపించగలిగే అపర్యాప్తత (inadequacy) గాని, పరిచ్ఛేదముగాని ఈశ్వరుని యందు

లేవు. ఈశ్వరునకు సృష్టితో ప్రయోజనము లేదన్నచో, పరమాత్మకు అసలే లేదు. మాయోపాధి విశిష్ట ఆత్మయే ఈశ్వరుడు. ఈ ఉపాధిచే ఆత్మ సర్వజ్ఞమగును. సర్వజ్ఞమగు ఆత్మ యందు పరిచ్ఛేద భావన గాని, అపర్యాప్తత గాని ఉండవు గాన, అట్టి ఆత్మ యందు కామనలేమియూ ఉండవు.

## సృష్టి అసంభవమన్నచో, ఈ కనబడే సృష్టి మాట యేమి?

కావున సృష్టి సంభవము కాదు. అట్లైనచో, ఈ సర్వమును ఏమని వివరించదగును? మనము సృష్టి అని పిలిచేది మాయ తక్క వేరొండు గాదు. ఘటిల్ల శక్యము కాని దానిని మాయ ఘటిల్లజేయును. మాయ ఎట్లు ఘటిల్ల జేయును? అన్నచో, మాయ అనగా నదియే. అఘటన ఘటనా సామర్థ్యమే మాయ. భగవానుడీ విషయమును అయిదవ అధ్యాయములో 'జ్ఞానము అజ్ఞానముచే ఆవృతమై యున్నది; అందువలననే ప్రాణులు మోహితులగుచున్నారు (అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః)' అని వివరించెను. సృష్టి గలదు అనే దృష్టి కోణములో మాత్రమే ఈ ప్రశ్న ఉదయించును. సృష్టిని అంగీకరించినప్పుడు మాత్రమే, 'మాయోపాధికుడగు ఈశ్వరుడు సృష్టికి కారణము' అని చెప్ప,బడును. మాయోపాధి విశిష్టమగు ఆత్మ ఈశ్వరు డనబడుననియు, ఉపాధి సంబంధము లేని పరమాత్మ మార్పులను చెందకుండగనే జగత్కారణమగు ననియు, అదియే వివర్త ఉపాదాన కారణమనబడుననియు, సృష్టిని అంగీకరించి మనము వివరణను ఇస్తాము. భగవానుడు కూడా ఇదే విషయమును ఇచట, 'మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్' అని చెప్పుచున్నాడు. ఈ వివరణ అంతయూ 'సృష్టి గలదు' అనే దృష్టి కోణములో మాత్రమే ఉండును. ఆత్మ యొక్క దృష్టికోణములో ప్రశ్నయే ఉదయించదు.

## ఆత్మస్వరూపదృష్ట్యా ప్రశ్న విలబడదు

సచ్చిదానందము నందు జగత్తు లేదు. కాన, ఈ జగత్తు ఎట్లు పుట్టినది? అను ప్రశ్నకు సమాధానమును వెదుక పని లేదు. సచ్చిదానందములో జగత్తు లేదు గనుక, దానిని గురించి వర్ణింప పనిలేదు. జగత్తు వేరు, సచ్చిదానందము వేరు అన్నట్లు కన్పట్టును. కాని అది సత్యము కాదు. ఏలయన, నీవు జగత్తును చూచినప్పుడు సచ్చిదానందము ఉపస్థితమై యున్నది. సచ్చిదానందము కంటె భిన్నముగా జగత్తు లేదు. కాని సచ్చిదానందములో జగత్తు లేదు.

ఈ జగత్తు ఎట్లు పుట్టినది? అను ప్రశ్న ఉదయించదు. సచ్చిదానంద దృష్టికోణంలో, ఉన్నది సచ్చిదానందము మాత్రమే. నేను జగత్తును దర్శించినప్పుడు అది సచ్చిదానందము కంటె

భిన్నముగా స్వతంత్రముగా లేదని గుర్తిస్తాను. ఈ స్థితిలో, 'మత్ స్థాని సర్వభూతాని, న చ భూతాని మత్ స్థాని' అను వాక్యములు సుస్పష్టమగును. సచ్చిదానందమగు నేను తప్ప వేరొండు లేదు. కావున జగత్తు మరియొక దాని నుండి పుట్టే ప్రసక్తి లేదు. అది సచ్చిదానంద ఆత్మ నుండి మాత్రమే పుట్టును. అయితే, జగత్తునకు ఒక కారణముండవలెను. 'మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్'. నా (ఆత్మ) చేత అనుగృహీతమైన ప్రకృతి సర్వమును సృజించి, సర్వమును పాలించి పోషించి, సర్వమును లీనము చేసుకొనును. నా అనుగ్రహముచేతనే జగత్తు ఉనికిని పొంది యున్నది.

ఈ సృష్టి పరమాత్మ కొరకు కాదు. ఇతరుడు లేడు గనుక, ఇతరుని కొరకైననూ గాదు. కావున, సృష్టి ఎవరి కొరకైననూ గాదని సుస్పష్టమగుచున్నది. పరమాత్మ కంటె భిన్నముగా మరియొక ఆత్మ లేదు. పరమాత్మకు సృష్టితో పనిలేదు. సృష్టి అనేది ఘటిల్లే సంభావనయే త్రోసివుచ్చబడినది. ఇట్టి స్థితిలో 'సృష్టికి హేతువు ఏమి?' అను ప్రశ్న అసంగతమగును గదా! అద్వయ సత్యము నెరింగిన వ్యక్తి సృష్టి లేదనుట ద్వారా ఈ ప్రశ్నకు సమాధానమును చెప్పినట్లే అయినది. అయిననూ, ఇచట గమనించదగిన అంశము ఒకటి గలదు.

**ఇట్టి అసంగతమగు ప్రశ్నను లేవనెత్తుటకు కారణమేమి?**

'కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః' అను శ్రుతికి వాస్తవమగు సృష్టి లేదని నిరూపించుటయే తాత్పర్యము. యథార్థమగు వస్తువు ఉన్నచోట ప్రశ్న సమాధానములకు తావుండును. కాని సృష్టి యథార్థము కాదు. స్వతంత్రమగు ఉనికి లేని ప్రకృతి తనంత తాను సృష్టింపజాలదు. ఆత్మ సృష్టించు ప్రసక్తియే లేదు. కావున, సృష్టి కేవలమాయ చేతనే ఘటిల్లుచున్నది. మాయలో సర్వము సంభవమగును.

సత్యమేమనగా ఆత్మ సృష్టించదు. ప్రకృతి తనంత తానుగా సృష్టించజాలదు. దానికి పరమాత్మ యొక్క అధ్యక్షత, సహకారములు అవశ్యకమగును. ప్రకృతి యొక్క ఉనికి పరమాత్మ యొక్క ఉనికి కంటె వేరు గాదు. సృష్ట్యాదులను చేయుటకు కావలసిన సామర్థ్యము, మరియు అవశ్యకమగు జ్ఞానము ప్రకృతికి పరమాత్మ నుండియే లభించును. పరమాత్మచే అనుగ్రహింపబడిన ప్రకృతి సృష్టికి కారణమైన సృష్టి యొక్క ఉనికిని ఘటిల్లజేయును. ప్రకృతి దృష్టికోణములో మాత్రమే భగవానుడు 'నేను సృజించుచున్నాను (అహం విసృజామి)' అని చెప్పుచున్నాడు. ఆయన స్వయముగా సృష్టికర్త గాడు. అందువలననే 'న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి (ఆ కర్మలు

నన్ను లేశమైననూ బంధించవు)' అని ఆయన చెప్పగల్గును. నీవు కూడా అటులనే చెప్పగల్గుదువు. దేహము, మనస్సు, ఇంద్రియములు అన్నీ ఆత్మ యొక్క అధ్యక్షతన, ఆత్మయొక్క అనుగ్రహముచే తమ తమ కార్యములను నిర్వర్తించుచున్నవి. కాని ఆ కార్యములేమియూ నన్ను లేశమైననూ బంధించవు. ఏలయన, ప్రకృతికి ఆత్మకు మధ్య కలయిక లేదు. రెండు విభిన్న వస్తువుల మధ్య కలయిక ఉండును. కాని ఇచట ఒకటి సత్యము కాగా మరియొకటి మిథ్య. సత్యము మిథ్యచే ప్రభావితము గాదు. కాగా, ప్రకృతి ఆత్మపై అధ్యారోపము మాత్రమే. సర్వజగత్తు భాసించుచున్నది గదా! కాన, ఆత్మపై ఆరోపితమైన ప్రకృతి ఒకటి గలదు. ఇది నిశ్చితముగా అధ్యారోపము మాత్రమే. ఏలయన, ఆత్మయే పరబ్రహ్మము అను జ్ఞానములో ప్రకృతి యొక్క ప్రసక్తియే లేదు.

ఈ రెండు దృష్టికోణములను మీరు తెలుసుకోవాలి. ఏలయన ఈ జ్ఞానమే మోక్షము. ఇది కర్తృత్వ భోక్తృత్వ విముక్తమగు ఆత్మను గుర్తించుట. సర్వము ఆత్మకు సంబద్ధమై యున్నది. సర్వమునకు అధిష్ఠానము ఆత్మయే. కాని, అదే సమయములో ఆత్మ అసంగముగ నుండును. ఆత్మ సదా అస్పృష్టము, కర్తృత్వ భోక్తృత్వ వినిర్ముక్తము. ఆత్మ క్రియల నాచరించదు. క్రియాఫలమును ఆత్మ భోగించదని చెప్పనేల? నీవు నిత్యముక్తుడవు. నీ కర్మలన్నియూ ఆత్మరూపుడవగు నిన్ను బంధించజాలవు. సర్వ వేదాంత దర్శన సారమిదియే.

కావున, ఈ శ్లోకములోని 'నేను' సర్వప్రాణుల ఆత్మయే ననియు, అది స్వరూపతః శుద్ధము, జ్ఞానఘనము, ముక్తము (నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము) అని శ్రీ శంకరులు వివరించిరి. భగవానుడు ఒక విశిష్ట ప్రాణికి మాత్రమే సచ్చిదానంద ఆత్మ అనియు, ఇతరులకు కాదనియు తలంపరాదు. సర్వప్రాణుల ఆత్మ నేనే. ఈ విషయమును ఉపదేశించుచున్న శ్రీకృష్ణ భగవానుడు ఈశ్వరుని ఆత్మ. అనగా జగత్కారణమగు పరమాత్మ. ఈ పరమాత్మ కంటె భిన్నముగా ఏ ప్రాణియూ లేదు. పరమాత్మ నిత్య శుద్ధము, సర్వక్రియా వినిర్ముక్తము, పుణ్యపాప వినిర్ముక్తము, దుఃఖాది రహితము. పరమాత్మ యందు అజ్ఞానము లేశమైననూ లేదు (నిత్య బుద్ధము). కావ పరమాత్మ నిత్యముక్తము. ఆత్మ యందు మాలిన్యముగాని, అజ్ఞానము గాని లేదు. కాన, ఆత్మను శుద్ధి చేయబని లేదు. ఆత్మకు జ్ఞానమును కలిగించవలసిన పని లేదు. ఆత్మ సర్వజ్ఞము; సర్వ సృష్టికి కారణము. ఆత్మ యందు ఏ విధమగు బంధమైననూ లేదు గాన, ఆత్మను విముక్తము చేయ బని లేదు. భగవానుడు సర్వప్రాణులలో ఆత్మరూపముగ నున్ననూ, మానవులు తెలియలేకున్నారు.

**అధ్యాయము 9, శ్లోకము 11:**

अवजानन्ति मां मूढा मानुषीं तनुमाश्रितम् ।
परं भावमजानन्तो मम भूतमहेश्वरम् ॥ ११ ॥

అవ జానంతి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్
పరం భావమజానంతో మమ భూతమహేశ్వరమ్ (11)

**మమ** = నా యొక్క; **పరం** = అనంతమగు; **భావం** = స్వరూపమును; **అజానంతః** = ఎరుంగని; **మూఢాః** = మూర్ఖులు; **భూతమహేశ్వరమ్** = సర్వప్రాణులకు అధీశ్వరుడనగు; **మానుషీం** = మనుష్య సంబంధి యగు; **తనుం** = శరీరమును; **ఆశ్రితమ్** = ఆశ్రయించి ఉన్న; **మాం** = నన్ను; **అవజానంతి** = తెలియకున్నారు.

నా అనంత స్వరూపము నెరుంగని మూఢులు మనుష్య దేహము నందు వలభ్యమయ్యే, సర్వప్రాణుల అధీశ్వరుడనగు నన్ను గుర్తింపజాలకున్నారు (11).

మూఢాః అనగా విమోహితులు, అనగా ఈ వివేకజ్ఞానము లేని వ్యక్తులు. వారు కర్తృత్వ ధారణ గలవారై, తాము చేసిన పాపములను, తప్పు పనులను స్మరించి తాము దోషులమను ధారణను కలిగియుందురు. మరియు వారి యందు తమ కర్మలకనురూపమైన ఫలమును తాము అనుభవించుచున్నామనే భోక్తృత్వధారణ కూడ సహజముగ నుండును. ఆత్మ అకర్త, అభోక్త అనియు ప్రకృతి నియమము ననుసరించి సర్వము ఘటిల్లుచున్నదనియు వీరు గుర్తించజాలరు. ఆత్మ తన సన్నిధిచే సర్వమును అనుగ్రహించుచుండును. ఆత్మకు చెందని కర్తృత్వభోక్తృత్వములు ఆత్మపై అధ్యారోపము చేయబడినవి. ఈ వివేకము లేనివారు నన్ను పూర్తిగా ఉపేక్షించెదరు. లేదా, అవమానించెదరు. అనగా వారు నన్ను గుర్తించలేకపోవుటయే గాక, విచారము చేసి నన్ను ఎరుంగవలె ననే తలంపు కూడ వారిలో నుండదు. ఎందువలన?

మమ పరం భావం అజానంతః. వారికి నా అనంత స్వరూపము తెలియదు గనుక. భగవానుడు ఆకాశము వలె ఒక విశిష్టరూపముచే గాని, దేశముచే గాని పరిచ్ఛిన్నుడు కాదనియు, ఆయన నిత్యశుద్ధుడు, సర్వవ్యాపకుడు అనియు శ్రీ శంకరులు వివరించిరి. సర్వసృష్టి ఆకాశము

దుండగా, ఆకాశము పరమాత్మ యందున్నది. ఆకాశమునకు అధిష్ఠానమైన పరమాత్మ ఆకాశము కూడా సూక్ష్మతరుడు.

భూతమహేశ్వరమ్. ఆయన సర్వప్రాణులకు అధీశ్వరుడు. ఆయన సర్వప్రాణులకు ఆత్మరూపుడని శ్రీ శంకరులు వివరించిరి.

మానుషీం తనుమాశ్రితమ్. ఆయన మానవ దేహములో ఉపలభ్యుడగుచున్నాడు. మానవులు నన్ను ఎరుంగక, నన్ను పరమేశ్వరునిగా గుర్తించలేక, నన్ను దేహాకారునిగా మాత్రమే తలంచెదరు. వారు దేహసంబంధి యగు మరణశీలము ఇత్యాది ధర్మములను ఆత్మకు అంటగట్టి, తాము మర్త్యులమనియు, దేహగతదోషము లన్నింటికి తాము వశులై ఉన్నామనియు నిర్ణయించుకొందురు. వాస్తవంలో ఈ అధ్యారోపము ఎంత దృఢముగా నాటుకున్నదో! దేహమునకు, ఆత్మకు గల భేదము లేశమైననూ భాసించుట లేదు. మానవుడు స్థూలదేహము యొక్క బాగోగులను తన బాగోగులుగా స్వీకరించును. ఈ పరిస్థితి ఎంతవరకు దిగజారినదంటే, 'నేను తెల్లనివాడను', 'నేను నల్లనివాడను' ఇత్యాది ధారణలను మానవులు కలిగియున్నారు. 'నేను లావుగా మున్నాను, నేను పొడుగుగా మున్నాను' ఇత్యాది వాక్యములు దేహము యొక్క ఒడ్డు పొడుగులను వర్ణించును. ఇది కొంత వరకు నయమే. కాని 'నేను తెల్లనివాడను' అను వాక్యము దేహము యొక్క పై చర్మము నందు గల రంగు పదార్థమును గురించి మాత్రమే చెప్పుచున్నది. ఆత్మ యందు ఈ రంగును ఆరోపించుట మరీ దారుణముగ నున్నది. స్థూల శరీరము నందు నివసించు జీవుడు స్థూలదేహమే ఆత్మ యను భ్రమలో నుండుటచే ఈ దుస్స్థితి దాపురించినది. ఈ భ్రాంతిలో పడిన మానవుడు భగవానుని ఉపేక్షించి, తద్ద్వారా తనను తాను ఉపేక్షించుకొనును.

**ఈశ్వరుని ఉపేక్ష తన ఉపేక్ష ఎట్లగును?**

మానవుడు అనేక కార్యములను చేయును. వాటిని తన ఈశ్వరత్వమును సాక్షాత్కరించుకొనుట కొరకు మాత్రమే చేయును. మానవుడు తన చుట్టూ ఉన్న ప్రపంచములో సర్దుబాట్లను చేసి, పరిస్థితిని తన అదుపులోనికి తెచ్చుకొనే ప్రయత్నమును చేయును. మానవుడు స్వరూపతః ఈశ్వరుడు గనుకనే, ఈశ్వరుడు అయ్యే ప్రయత్నమును చేయును. కాని మానవునకు శీఘ్రముగనే తన నిస్సహాయత ఎదురగును. మానవుడు శాశ్వతముగా నిస్సహాయుడనియు, దోషి యనియు, కావున భగవానుని అనుగ్రహమును పొందుట ఆవశ్యకమనియు కొందరు మతవాదులు

చెప్పెదరు. మానవుడు తాను యథార్థముగా నిస్సహాయుడనని విశ్వసించి ఈ మాటలను స్వీకరించును. కాని సర్వసృష్టిని నియంత్రించే ఈశ్వరునితో జీవుని స్వరూపము అభిన్నమగుటచే, మానవుడు ఇట్టి నియంత్రణ శక్తిని పొందగోరుచుండును. అనగా, మానవుడు వాస్తవంలో తన స్వరూపమును ఆవిష్కరించుకొనే యత్నమును మాత్రమే చేయుచున్నాడు. మానవుడు ముందుగా తనను తాను విస్మరించి, తరువాత తాను ఉపేక్షించిన స్వీయ స్వరూపమును పొందగోరును. కావున, ఆత్మ స్వరూపము కేవల తత్త్వ మీమాంస కాదనియు, జీవనమూల్యమనియు నేను చెప్పెదను. ప్రస్తుతంలో సత్యము, జీవన మూల్యము ఒక్కటి అయినవి. మానవుడు విముక్తిని గోరును. విముక్తియే సత్యము కూడా. మానవుడు ఆనందమును గోరును. ఆనందము మానవుని యథార్థ స్వరూపమై యున్నది. ఇందువలననే ఈ మోక్షప్రవృత్తి పూర్తిగా విలక్షణమైనది. ఇది ఒక తాత్త్విక అన్వేషణ కాదు. ఇది జీవితమునకు సార్థకతను కలిగించే మౌలిక జీవితాన్వేషణ. అన్వేషణ లన్నింటికీ లేమి భావన నుండి విముక్తియే ప్రయోజనమై యున్నది. మానవుడు నిత్యముక్తుడు అనేది సత్యము. ఈ సత్యమును గుర్తించకుండగా, మానవుడు విముక్తి కొరకు యత్నించుచున్నచో, ఆ యత్నము ఎన్నటికీ సఫలము కానేరదు. మానవుడు తన యథార్థ స్వరూపమును పూర్ణముగా విస్మరించి, పరిచ్ఛిన్నమగు దేహముతో, మనస్సుతో లేమి భావన నుండి విముక్తిని పొందుటకు యత్నించును.

భగవానుడిట్లు చెప్పుచున్నాడు: మహా పుణ్యసలమగు ఈ మానవదేహములో నేను నివసించియున్నాను. మానవులు అందరు నన్నే వెదుకుచున్నారు. కాని నా స్వరూపమును గుర్తించలేకున్నారు. వారు వెదుకవలసిన ఆత్మను ఉపేక్షించుచున్నారు. ఇది మాయచే కల్పింపబడిన ఆశ్చర్యము. మానవ దేహములో ఉపలభ్యమయ్యే ఈ ఆత్మ సర్వ విధ కర్మల నుండి సర్వదా విముక్తమనియు, అజ్ఞాన విముక్తమనియు, నిత్యముక్తమనియు (నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావః) శ్రీ శంకరులు వివరించిరి. నిత్య ముక్తుడగు ఈ జీవుడు తన స్వరూపభూతుడనగు నన్ను గుర్తించలేకున్నాడని భగవానుడు చెప్పుచున్నాడు. 'నా అనంత తత్త్వము (పరం భావమ్)ను ఎరుంగని మానవుడు ఆత్మరూపుడను, సర్వేశ్వరుడను అగు నన్ను అనాదరము చేయుచున్నాడు. అట్లు చేసి దేనిని వెదుకుచున్నాడు? నన్నే. తమ స్వరూపమును గుర్తెరుంగని మానవులు దశమపురుషుని వలె, వాస్తవంలో రాజకుమారుడై యున్న బిచ్చగాని వలె నన్ను వెదుకనారంభించు చున్నారు. ఈ సమస్యకు అంతకూ మూలము అజ్ఞానము.

## ఈశ్వర కృప ఆవశ్యకమగును

ఒక వ్యక్తికి వజ్రము యొక్క స్వరూపము తెలియదు. కర్బనము (బొగ్గు), వజ్రము టియే ననియు, వాటిలో ఒక దానిని మరియొకటిగా మార్చవచ్చుననియు అతడు ఎరుంగడు. నేను అతనికి బోధించి, ఈ పరిజ్ఞానము కల్గునట్లు చేయగల్గుదును. వజ్రము ఒక పదార్థము , దాని విజ్ఞానమును నేను అతనికి అందియగల్గుదును. కాని తన గురించి, తాను ఎరుంగని కోరుకునే సర్వము – విముక్తి, ఆనందము, సంక్షోభము నుండి విడుదల – అతని స్వరూపమే ఉన్నది. అతని దృష్టిని ఈ సత్యము వైపునకు త్రిప్పుటకై నేనేమి చేయవలయును? అతని ూపమును నేనాతనికి ఎట్లు చూపగల్గుదును? 'శాస్త్ర ప్రతిపాదితమగు ఆత్మ గలదు' అనే ద్ధ అతనికి లేనిచో నేను చేయగలిగేది లేదు. 'అది గలదు (అస్తి)' అని మున్ముందుగా గుర్తించిన నికి మాత్రమే ఆత్మజ్ఞానము ఉదయించు అవకాశము గలదు. శ్రద్ధ ఉండి తీరాలి. వెదుకబోయిన గ కాలికి తగిలిన చందాన, ఈ జ్ఞానము యాదృచ్ఛికంగా ఉదయించబోదు. ఆత్మ కంటె భిన్నమైన వస్తువు ఏనాడైననూ తారసిల్లుటకు అవకాశము గలదు. కాని ఆత్మ అట్లు తారసిల్లదు.

'ఆత్మ నిత్య ముక్తము అను మాట సత్యము అయ్యే అవకాశము గలదు' అనే గుర్తింపు లేని వ్యక్తి ఆత్మ సర్వ పరిచ్ఛేద విముక్తమనే సత్యమును అంగీకరింపజాలడు. ఇందువలననే ఈశ్వరానుగ్రహముచే మాత్రమే మానవునకు అద్వైతము నందాభిముఖ్యము కలుగునని (ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా) పెద్దలు చెప్పెదరు.

పరిస్థితులను తనకు అనుకూలముగా మార్చుకొనుటలో నిస్సహాయుడైన మానవుడు నిరాశోపహతుడై బహుశః ఏదో ఒక కోవకు చెందిన భక్తుడు కావచ్చును. కాని ఇంతటి అల్పమైన గుర్తింపు కలుగుట కైననూ ఈశ్వరకృప ఆవశ్యకమే. ఆపదలో నున్న వ్యక్తి ఆపదలోనే కొనసాగి నిరాశోపహతుడు కావచ్చును. అట్టి వ్యక్తి ఈశ్వరుని శరణు పొందుననే నియమము లేదు. ఆపదలో మున్న వ్యక్తి భక్తుడగు ననే నియమము లేదు. అట్టి వాడు మానసిక రోగి కూడ కావచ్చును. ఈశ్వరకృప ఉంటేనే భక్తుడు కాగల్గును.

కాని, 'సర్వము నేనే' అనే గుర్తింపు కలుగుటకు కొంత కృప చాలదు; అసాధారణమగు కృప కావాలి. ఏలయన, ఇది సాధారణ పరిజ్ఞానము కాదు. ఇది అద్వైతము. ఇది ఆత్మ జ్ఞానము. దీనిని బోధించినా, ఈశ్వరకృప లేనివాని బుర్రలోనికి ఇది ప్రవేశించదు. కాని ఈశ్వరకృప ఉన్నవానికి మొదటిసారి విన్ననూ, దానిలోని సత్యము గోచరించును. దానికి కారణము

సంస్కారబలము. అట్టి సంస్కారము కలుగుటకు హేతువు ఏది? ఇది కేవలము ఈశ్వరకృప మాత్రమే నని మేము చెప్పెదము. తాను అపూర్ణుడననే అనుభవము అందరికీ గలదు. దీనికి జ్ఞానముతో పని లేదు. కాని తాను, పూర్ణతత్వము ఒక్కటియే అను గుర్తింపు కలుగుటకు విస్తృతమగు జ్ఞానసాధన ఆవశ్యకమగును. దీనికి ఈశ్వరకృప అత్యావశ్యకము.

ఈశ్వరుని కృపలేనివారు సర్వప్రాణుల ఆత్మరూపుడనగు నన్ను నిరాదరించి పతితులగుదురు. వారు తక్కువస్థాయికి చెందినవారని శ్రీ శంకరులు వాక్రుచ్చిరి. వారికి వివేకశక్తి ఈయబడిననూ, వారు దానిని వినియోగించలేదు. భగవానుడు తరువాతి శ్లోకములో ఇట్టి వారిని గురించి వర్ణించుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 12:**

मोघाशा मोघकर्माणो मोघज्ञाना विचेतसः ।
राक्षसीमासुरीं चैव प्रकृतिं मोहिनीं श्रिताः ॥ १२ ॥

మోఘాశా మోఘ కర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః (12).

మోఘాశాః = వ్యర్థమగు ఆశలు గలవారు; మోఘకర్మాణః = వ్యర్థమగు కర్మలు గలవారు; మోఘజ్ఞానాః = వ్యర్థమగు జ్ఞానము గలవారు; విచేతసః = వివేకహీనులు; మోహినీం = మోహమును కలిగించునట్టియు; రాక్షసీం = రాక్షసులకు సంబంధించినది; చ ఏవ = మరియు; ఆసురీం = అసురులకు సంబంధించినది అగు; ప్రకృతిం = స్వభావమును; శ్రితాః = ఆశ్రయించినవారు.

వ్యర్థమగు ఆశలు గలవారు, వ్యర్థమగు కర్మలు గలవారు, వ్యర్థమగు జ్ఞానము గలవారు, వివేకహీనులు అగు మానవులు, మోహమును కలిగించునట్టియు, రాక్షసులకు అసురులకు సంబంధించినది అగు స్వభావమును ఆశ్రయించెదరు (12).

మోఘాశాః. వ్యర్థమైన ఆశలు గలవారు. లేదా, తమకు లభించిన ఈశ్వరకృపను వ్యర్థము చేసినవారని చెప్పవచ్చును. మానవునిగా జన్మించుటకైననూ కొంత ఈశ్వరకృప కావాలి. కాని

అట్లు జన్మించిన తరువాత మానవుడు తన ఇచ్ఛా స్వాతంత్ర్యమును సరిగా వినియోగించకపోతే ఆ కృప వ్యర్థమగును.

## అవగాహన లేని కర్మలన్నియు నిరర్థకములు

మోఘకర్మాణః. వారు చేయు కర్మలన్నియూ నిరర్థకములు. ఏలయనగా వారా కర్మలను ఆత్మజ్ఞానము ఉదయించుటకు ఆవశ్యకమగు అంతఃకరణ శుద్ధి కొరకై చేయుట లేదు. వారికి సుస్పష్టమగు లక్ష్యము లేదు గావున, వారు చేయు కర్మలు వ్యర్థమగును. మరో మాటలో చెప్పాలంటే, వారు రాగద్వేషముల పట్టు నుండి విడిపించుకొని, ఆత్మయే పరబ్రహ్మ యను సత్యమును గుర్తించుట కొరకై కర్మలను చేయు కర్మయోగులు (ముముక్షువులు) కారు. ముముక్షువులకు లక్ష్యము స్పష్టముగా కానబడుటచే, వారికి సర్వము సార్థకమగును. వివాహము సార్థకమగును. కుటుంబ జీవనము సార్థకమగును. జీవితములో ఎన్ని స్థాయిలు గలవో, అవి అన్నియూ ఆశ్రమములై సార్థకమగును. కాని 'నేను ఈ పనిని చేసి ఈ ఫలమును పొందెదను' అను వ్యర్థమగు ఆశలు గల వ్యక్తులు చేసే కర్మలు అంతిమ విశ్లేషణలో నిరర్థకములని తెలును. ఏవో కొన్ని ఫలములు వారికి లభించును. కాని తాము పూర్ణులము కావాలనే వారి కోరిక తీరదు గాన, అంతిమంగా ఈ ఫలములు వ్యర్థములగును. ఆత్మ ఈశ్వరాభిన్నమని గుర్తించకపోవుటయే దీని కంతకూ కారణము.

## వారు విద్యావంతులే; కాని విద్యకు యథార్థఫలమగు పరిపక్వత లేదు

మోఘజ్ఞానాః. వారు చదువుకున్న వారు, పండితులు కూడా. కాని పరిపక్వత లేదు. కాన పరమేశ్వరుని వారు గుర్తించలేరు. ఈశ్వరుని గుర్తించగలిగే పరిణతిని చదువు ఇవ్వగలగాలి. పెరుగుదలలో ఇది ఒక భాగము. మన పూర్వీకులు ఒక పనిని చేసినారు గనుక, మనము కూడా అదే పనిని చేయనక్కరలేదు. ఏదో ఒకనాడు 'నేను చేయుచున్నది ఏమి?' అని నీవు ప్రశ్నించుకుంటావని నేను ఆశిస్తాను. అపుడు నీవు చేసే కర్మలలో నూతనోత్తేజము కలుగును. లేనిచో ఒక వ్యవస్థ లోపల ఒకే పనిని ప్రతిదినము చేస్తూ ఉండుటయే యగును. వ్యవస్థ ఏదైనా నిస్సారమైనదియే. కాని వ్యవస్థ మానవునకు భ్రమపూర్ణమగు భద్రతా భావనను కలిగించును. వ్యవస్థ యొక్క అభావములో ఇట్టి మానవుడు వినాశమును పొందును. వ్యవస్థాయుతమగు సమాజములో చక్కగా పెరిగిన వ్యక్తి వ్యవస్థ లేనిచోట విపన్నుడయ్యే పక్షంలో అతడు పరిణతుడు

కాలేదని యర్థము. ఎటువంటి వ్యవస్థలోనికైననూ అడుగిడి పూర్ణునిగా ఉండగలిగే వ్యక్తిగా మానవుడు ఎదగాలి.

చదువునకు ప్రయోజనము కూడు, గుడ్డ మాత్రమే కాదు. మానవునిలో ఇట్టి పరిణతిని చదువు ఈయగలగాలి. పశువులు విద్యాలయాలకు వెళ్లకపోయినా కూడును సంపాదించుకుని నీడలో బ్రతుకగల్గుచున్నవి. మానవులు కూడా ఎన్నో తరాలు అడవులలో, పర్వతాలలో చదువులేమీ లేకుండగనే బ్రతికినారు. వారు బ్రతుకుటయేగాక, మనవంటి నాగరికులకు జన్మనిచ్చి ప్రపితామహ, ప్రప్ర పితామహులైనారు. ఆధునిక వైద్యము, విజ్ఞానము లేకుండగానే, వారు ఇంచుమించు పూర్ణజీవనమును గడిపి తమ సంతానమును అభివృద్ధి చేసుకొనిరి. కూడు, గుడ్డ, నీడల కొరకు భాష, సంస్కృతి, సంగీతము ఇత్యాదులతో పనిలేదు. మానవుడు ఏ సామగ్రితో పుట్టినాడో, ఇంతమాత్రానికి అంతకుమించిన సామగ్రి అక్కరలేదు.

ఈశ్వరుడు ఎక్కడో అనంతాకాశంలో కూర్చుండియున్నవాడు కాడనియు, ఆత్మ స్వరూపుడే ననియు గుర్తించగలిగే జ్ఞానమును ఇచ్చునదియే చదువు. ఈ జ్ఞానములేని మానవుడు పొందే ఇతరజ్ఞానము లన్నియూ అతనిలో ఈ పరిణతిని కలిగించలేవు గాన వ్యర్థములే యగును.

## పరిపక్వత లేనివాని ఆలోచన, ప్రవర్తనలు మోహపూర్ణములై యుండును

విచేతసః. విద్యావంతులై ఉండియూ వివేకము లేని వ్యక్తుల గురించి మనమిచట చర్చిస్తున్నాము. వారిలో ధర్మాధర్మ వివేకమే మృగ్యమై యుండగా, ఆత్మానాత్మ వివేకము లేదని వేరుగా చెప్పవలయునా? ఒక విశిష్టపరిస్థితిలో ఏది ధర్మము అను నిర్ణయమును వారు చేయజాలరు. వారి దృష్టిలో ఏది సానుకూలమో అదియే ధర్మమగును. అట్టివారు ఏమగుదురు?

రాక్షసీం ఆసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః (భవంతి). వారు రాక్షసుల, మరియు అసురుల స్వభావమును ఆశ్రయిస్తారు. రాక్షసుని యందు రజోగుణము యొక్క ఆధిక్యము ఉండును. వానికి మహత్త్వాకాంక్ష అధికముగా నుండి, నిరంతర కర్మణ్యతకు, గర్వమునకు హేతువు అగును. అతనికి తన ఆకాంక్షలు పూర్తియగుట జీవితములో అతి ప్రధానమగు లక్ష్యము అగుటచే, దానికి అడ్డువచ్చిన వస్తువులను, మరియు వ్యక్తులను నాశనము చేయుటకు అతడు వెనుకాడడు. మనకు ఇటువంటి రాక్షసులనేకులు వ్యాపారుల ప్రపంచములో దర్శనమిస్తారు. పెద్ద పెద్ద కంపెనీల అధికారుల, అధిపతుల ప్రపంచములో ఈ రాక్షసులు ఎవ్వరినైననూ నాశనం చేస్తారు. తమ

వ్యాపారానికి పోటీదారుడగు వ్యక్తి ఎంతటి చిన్నవాడైనా, ఎక్కడ ఉన్నా, వానిని వీరు ధనబలంతో కొనేసి వాని వ్యాపారమును తమ వ్యాపారములో కలిపేసుకుంటారు. ఇతరుల ప్రాణ మాన సుఖములకు వారి దృష్టిలో ఏమీ విలువ ఉండదు. రాక్షస ప్రకృతి యనగా నిదియే. ఈశ్వరుని గుర్తించకుండుటయే దీనికంతకూ కారణము.

అసురుల స్వభావము తమోగుణ ప్రధానముగ నుండును. వీరు విచక్షణా రహితముగా తిని త్రాగుచుందురు. నియమములను వేటినీ పాలించరు. నేను ఒక వ్యక్తిని ఎరుంగుదును. అతడు పదిరోజులకు సరిపడే పెరుగును కొని గూటిలో ఉంచినాడు. ఆ ప్రాసాదములో సర్వత్రా దుర్వాసన వ్యాపించినది. ఎలుక చచ్చినదేమో యని మేము వెతుకనారంభించగా, మాకు ఆ పెరుగు కనబడినది. దీనిని ఇట్లు ఉంచుటకు కారణమేమి? అని అతనిని అడిగితిమి. అతడు దానిని భుజించుట కొరకై ఆ విధముగా కుళ్లబెట్టుచున్నాడట! దీనికి తమస్సు అని పేరు.

భగవానుడీ మాయను మోహిని యని వర్ణించెను. అనగా మనలను మరింత విమోహితులను చేయునది. వారు సంపూర్ణమగు దేహాత్మాభిమానమును తాము ఆశ్రయించుటయే గాక ఇతరులకు కూడా అదే ప్రవృత్తిని బోధిస్తారు. 'దేహము పోతే నేను పోతాను. దేహము బాగుంటే, నేను బాగుంటాను. కావున దేహమును అన్ని విధములుగా పెంచి పోషించినచో చాలును. ఇంద్రియ సుఖములను విచ్చలవిడిగా అనుభవించాలి. ఈ ఇంద్రియములు చిరకాలము ఉండవు. డెబ్బది ఏళ్ల ముదుసలి చూడలేడు, తినలేడు, ఏ పనినీ చేయలేడు. కావున, దీపము ఉండగనే ఇల్లు చక్కబెట్టుకోవాలి గదా! రెండో అవకాశము లభించదు. కావున, అనుభవించాలి'. వారి వాదము ఇట్లుండును. ఈ వాదములో సారమేమియూ లేదు. మోహిని అను విశేషణమును బట్టి, ఇది పరవశమగు స్వభావము మాత్రమే కాదనియు, వీరి వద్ద తమ స్వభావమును సమర్థించుకునే సిద్ధాంతము గలదనియు తెలియుచున్నది. ఈ సిద్ధాంతము వారి ప్రకృతి నుండి పుట్టినదియే. ఈ సిద్ధాంతము రజ స్తమో గుణముల ఆధిక్యము గల మస్తిష్కము నుండి పుట్టినది. ఇట్టివారు కొన్ని సందర్భాలలో మతాధిపతులు గాని, పిడివాదమునకు అధినాయకులు గాని అగుదురు. విచారము, ఆలోచన లేని చోట ఇట్టి పిడివాదములు, తీవ్రవాదములు రాజ్యమేలును.

సాధారణంగా ఇట్టివారు ఆలోచించుటకు ఇష్టము లేనివారు గాని, ఆలోచించలేనివారు గాని అగుదురు. కావున, ప్రజలను ఆలోచించమని ప్రోత్సహించవలెను. ఒక వ్యక్తి సక్రమముగా ఆలోచించగలిగే విధంగా మీరు నచ్చచెప్పగలిగినచో, అంతకంటె పెద్ద ఉపకారము మరియొకటి

ఉండబోదు. దీనికంటె తక్కువ స్థాయిలో ఎంత చేసినా, మళ్లీ మళ్లీ చేయవలసి యుండును. సలహాను ఇచ్చినచో, మరల సలహాను ఈయవలసి యుండును. కావున, తమంత తాము ఆలోచించుకొని, సత్యమును దర్శించునట్లు చేయవలెను. వ్యక్తి ఎదిగే ప్రక్రియ ఇది మాత్రమే.

రాక్షసుల, మరియు అసురులు ప్రవృత్తిని శ్రీ శంకరులు మరికొంత వివరించినారు: ఛింధి. 'వానిని నరికివేయుము'. భింధి. 'వానిని చంపుము. వానిని నాశనము చేయుము. ఏదో ఒకటి చేయుము. తుపాకీతో కాల్చి చంపుము. బుర్రను బ్రద్దలు కొట్టి చంపుము. నేలలో పాతిపెట్టి చంపుము. ఆ తరువాత తాగుము (పిబ). ఏదైనా పరవాలేదు. అది పులిసిన సారా అయినా పరవాలేదు. త్రాగుము. తరువాత తినుము. ఏదైనా సరే. పాకేది, ఎగిరేది, నడిచేది. ఈదేది. ఏది దొరికితే దానిని తినుము'. 'అతి సహజమగు శాకాహారమును గురించిన చర్చ కాదిది. ఇతరుల సొత్తును అపహరించుము (పరస్వం అపహర)'. ఇతరుల సంపదను కాజేసి, 'నేను అగ్రగామిని (pioneer)' అని చాటించుకో. మిగిలిన వారందరు సామాన్య మానవులు. నీవు ఒక్కడివే అగ్రగామివి. ఈ ప్రవృత్తి నాకు చాల విస్మయమును కలిగించును. ఇతరుల సంపదను, భూమిని కబ్జా చేసి 'నేను చాల ప్రయోజకుడను' అని చెప్పుకో. ఇట్టి వారు 'మేము గూండాలము, చోరులము' అని ప్రకటించుకున్నచో, అది వాస్తవ స్థితికి అద్దము పట్టును.

వారు చేసే పనులు ఇట్లు ఉండును. వారి సంభాషణల తీరు తెన్నులు ఇట్లుండును. రాక్షసుల, లేక అసురుల సమావేశంలో ఇట్టి పదములే వినబడును. వారిలో వారు తాము ఎంతమందిని పొట్టబెట్టుకుంటిమో, తాము ఎంతటి అధికారమును పొందితిమో, తాము ఏమి భుజించితిమో, తాము ఏయే ఆభరణములను ధరించితిమో ఇత్యాదిగా తమ తమ గొప్పలను చెప్పుకొనెదరు. వారి ప్రసంగమును జాగ్రత్తగా వినినచో, విషయము వీటిలో ఒకటి అయితీరును. వారు క్రూరకర్ములు. వారికి లభించిన ఈశ్వరకృపను వారు సద్వినియోగము చేసుకొన లేకపోయెదరు. వారు తమను తాము వినాశము చేసుకొనెదరు.

వివేకము ఈశ్వరకృపయే. మనము దానిని గ్రహించి వినియోగించుకోవాలి. లేనిచో ఈశ్వరకృప వ్యర్థమగును. ఈ ప్రకృతి మనలను అతిశయించి మోహింపచేయును. దాని నుండి బయటపడుట చాల కష్టము. మనకు ఎంత కృప లభిస్తే, అంతయూ ఆవశ్యకమే.

## శ్రద్ధ ఉన్నచో ప్రవృత్తిలో మార్పు వచ్చును

వారి యందు శ్రద్ధ లేకపోవుట చేతనే వారు నన్ను గుర్తించలేకున్నారు. భగవంతునితో ఇట్టి సంబంధమును పెట్టుకొనుట చాల ప్రముఖమైన విషయము. మీమాంసా శాస్త్రములో ఒక నియమము గలదు. నీవు వేదవిహితమగు నిత్యకర్మలను చేయనిచో, నీకు పాపము చుట్టుకొనును (అకరణే ప్రత్యవాయః). ఈ వాదములో కొంత సత్యము లేకపోలేదు. కాని, చేయని కర్మ ఫలము నిచ్చునని ఎట్లు చెప్పగలము? కర్మను చేయకపోవుటచే ఫలము లభించినచో, జీవితములో కర్మలను ఒకనాడైననూ చేయనేల? ఇది కర్మ నియమము లన్నింటికి విరుద్ధము. కాన 'అకరణే ప్రత్యవాయః' అను నియమమును యథాతథముగా గ్రహించరాదు. కర్మను చేయకపోవుటచే పాపము రాదన్న మాట వాస్తవమే. కాని కర్మాభావము ఒక శూన్యమును సృష్టించును. ఆ శూన్యములో చెడు కర్మలు ప్రవేశించును. అపుడు పాపము అకృష్టమగును. దీని సారమేమనగా, నీవు మంచి కర్మను వీడినచో, నిష్క్రియునిగా చిరకాలము ఉండజాలవు గనుక, చెడు కర్మను ఏదో ఒక దానిని ఆరంభించుటకు ఎక్కువ కాలము పట్టదు. కావున, మానవుడు మంచి పనిని తప్పనిసరిగా చేయవలెను.

కాని సత్కర్మను చేయాలనే సహజ సంస్కారము లేని వ్యక్తి మాట యేమి? ఇట్టి స్థితిలో శ్రద్ధ యొక్క ప్రాముఖ్యము నిరూపితమగును. సామాన్య వివేకము (common sense)తో చేసే మంచి పనులను గురించి మాత్రమే మనము చర్చించుట లేదు. అట్టి కర్మలతో బాటు మతపరమైన విధులను కూడా మనము పరిశీలిస్తున్నాము. కావున, ఏ పనిని చేయాలి? ఏ పనిని చేయకూడదు? ఏది పుణ్యము? ఏది పాపము? అను విషయములను తెలియాలంటే, వ్యక్తికి శాస్త్రము నందు శ్రద్ధ ఉండాలి. శాస్త్రము నందు శ్రద్ధ గల వ్యక్తి సత్కర్మను చేసే అవకాశము అధికము. అట్టి శ్రద్ధాళువు కూడా ఇంకనూ కొన్ని తప్పు పనులను చేయవచ్చును. కాని అతడు సత్కర్మను చేయుటకు బద్ధుడై యుండును. ఇట్టి శ్రద్ధ లేని వాని ఆశలు, చేయు కర్మలు వ్యర్థములు (మోఘాశా మోఘ కర్మాణః). శాస్త్రము నందు శ్రద్ధ లేని వారు భగవానుని పూర్తిగా ఉపేక్షిస్తారు అని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుని నిరాదరించే వారు దేనిని ఆదరిస్తారు? వారు శాస్త్రము నాదరించరు గాన, పుణ్యపాపముల ప్రసక్తి వారికి లేదు. కావున, వారు మోఘాశా మోఘ కర్మాణః అగుదురు. అకరణే ప్రత్యవాయః అను నియమమునకు ఇది యథార్థమైన వివరణము అగును.

## వివేకముతో కూడిన శ్రద్ధ ఆవశ్యకము

వీరికి భిన్నంగా, శ్రద్ధ గలవారిని గూర్చి భగవానుడు ఇప్పుడు చెప్పగలడు. కాని శ్రద్ధ ఒక్కటి మాత్రమే చాలదు. ఏలయన, దృష్టా దృష్ట ఫలములను పొందుటకై కర్మలను చేయుటకు కావలసిన ప్రేరణను శ్రద్ధ ఈయగలదు. అంటే, ఇంకనూ సమస్య గలదని తెలియుచున్నది. కర్మిష్ఠులకు శ్రద్ధ గలదనుటలో సందేహము లేదు. కాని వారు పుణ్యమును ప్రోగుచేసుకొని దానితో భవిష్యత్తులో సుఖములను అందుకొనుటకై క్రతువులు మొదలగు వాటిని చేస్తారు. ఈ ఫలము లన్నియూ అనిత్యములే గదా! వారు అనిత్య ఫలములతో తృప్తిపడతారు. వారు వాటికి అతీతంగా ఆలోచించరు. ఇట్టి సాధకులు శ్రద్ధావంతులే అయినా, వారికి ధర్మార్థ కామముల యందు మాత్రమే అభిరుచి గలదు. పరలోకములో, లేదా మరుజన్మలో మరింత అనుకూల పరిస్థితి కొరకై వారు కర్మలను చేయుదురు. వారికి మోక్షము నందభిరుచి లేదు.

ముముక్షువునకు కూడా శ్రద్ధ ఉండును. మోక్షకాములై సాధన చేయు సాధకులను ఈ శ్లోకము నిర్దేశించునని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. వీరు నాల్గురకముల భక్తులలో ఒకరగు జిజ్ఞాసువులు. వీరు ఆత్మ ఉన్నది అని గుర్తించి, మానవీయ సమస్యను మౌలికముగా విశ్లేషించినారు. వారి సాధన అంతయూ మోక్షము కొరకు మాత్రమే. వారి ఈ సాధనలో శ్రద్ధాయుక్తమగు భగవద్భక్తి కూడ భాగమై యుండును. వారు భగవానుని ఎరుంగుటకై భగవానుని కృపను అర్థించుచున్నారు. భగవత్కృపను అర్థించుట మొదటి అడుగు. భగవంతుని తెలియగోరుట రెండవ అడుగు.

**అధ్యాయము 9, శ్లోకము 13:**

महात्मानस्तु मां पार्थ दैवीं प्रकृतिमाश्रिताः ।
भजन्त्यनन्यमनसो ज्ञात्वा भूतादिमव्ययम् ॥ १३ ॥

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్ (13)

పార్థ = ఓ అర్జునా!; తు = కానైతే; మహాత్మానః = మహాత్ములు; దైవీం = సత్త్వగుణ (ప్రకాశ) ప్రధానమగు; ప్రకృతిం = మానసిక ప్రవృత్తిని; ఆశ్రితాః = ఆశ్రయించినవారై; భూతాదిం

= సర్వప్రాణులకు, పంచభూతములకు కారణమైనట్టియు; **అవ్యయమ్** = వినాశము లేని; **మాం** = నన్ను; **జ్ఞాత్వా** = ఎరింగి; **అనన్యమనసః** = పూర్ణమగు అంకిత భావము గలవారై; **భజంతి** = సేవించెదరు.

> ఓ అర్జునా! మహాత్ములైతే సత్త్వగుణ ప్రధానమగు మానసిక ప్రవృత్తిని ఆశ్రయించినవారై, సర్వ ప్రాణులకు పంచభూతములకు కారణమైన, వినాశము లేని నన్ను ఎరింగి పూర్ణ అంకితభావము గలవారై సేవించెదరు (13).

మహాత్మానస్తు మాం పార్థ. విశాల హృదయము, ప్రేమతో దయతో ఆర్ద్రమైన హృదయము గల వ్యక్తి మహాత్ముడనబడును. ఈ కారణముగనే సాధువులందరు మహాత్ములనబడుదురు. సాధువు అనగా పరోపకారము నభ్యసించువాడు (పరకార్యం సాధ్నోతి) అని యర్థము. అతడు ఇతరులకు హాని చేయడు. పైగా వీలైనంత వరకు ఇతరులకు సహజరీతిలో సాహాయ్యమును చేయును. అతడు దయామయుడై ఉండును గనుక, ఇతరులకు సహాయపడుట అతనికి సహజప్రవృత్తి యగును. ఇట్టి వ్యక్తి సాధువు, మహాత్ముడు అనబడును.

హే పార్థ! పూర్వ శ్లోకములో వర్ణింపబడిన వారి స్వభావమునకు పూర్తిగా విరుద్ధమగు స్వభావమును వీరు కలిగియుందురు. ఈ రెండు రకముల వ్యక్తులకు గల భేదమును 'తు' అను పదము వేరు చేసి చూపించును.

దైవీం ప్రకృతి మాశ్రితాః. వీరు సత్త్వప్రధానమైన స్వభావమును కలిగియుందురు. భగవానుడిచట రాక్షసీ, అసురీ, దైవీ అను నామములతో మాత్రమే నిర్దేశించిన మూడు రకముల ప్రకృతులను తరువాత మరల చేపట్టి వివరించగలడు. దైవీ యనగా భగవానునకు (దేవ) సంబంధించినది. వీరికి సత్త్వ ప్రధానమగు దైవ స్వభావము గలదు. దమము (ఆత్మ నియంత్రణ), ఆత్మ విశ్వాసము, శాస్త్రము నందు శ్రద్ధ ఇత్యాది గుణములు ఈ స్వభావములో భాగములై యుండును. జ్ఞానోదయము కలుగు వరకు ఈ శ్రద్ధ అవశ్యకమగును.

### శ్రద్ధ, వివేకము కలిసి పనిచేయు విధము

కర్మిష్ఠికి తాను మరణించు వరకు శాస్త్రముపై విశ్వాసమే ఉండును. తాను పుణ్యకర్మల నమష్ఠించుటచే స్వర్గమును పొందగలనని అతడు విశ్వసించును. కాని, వేదాంతములో శాస్త్రము

నందు సాక్షాత్కారము కలుగు నంతవరకు మాత్రమే శ్రద్ధ ఆవశ్యకమగును. సాక్షాత్కార పర్యంతము సాధకుడు శాస్త్రము సత్యమని స్వీకరించును. ఇది స్వీకారమే అయినా, మిక్కిలి అభిలషణీయమైనది.

నీ స్వరూపము ఆనందము, నీవు పూర్ణుడవు, సృష్టికి అంతకూ కేంద్ర బిందువు నీవే, నీ యందు దోషము లేవియూ లేవు అని ఎవరైననూ చెప్పినచో, అంత కంటె కోరదగినది మరి ఏది ఉండును? మానవుడు పొందగోరు స్థితి సరిగ్గా ఇదియే. ఇందుకొరకు మాత్రమే మానవుడు తన ప్రతిభను నిరూపించ యత్నించును. నీవు నీ ప్రతిభను ఎవరి ముందు నిరూపించాలి? వాస్తవంలో నీకు నీవే నిరూపించుకోవాలి. ఇతరుల కోసమని నీవు అనుకోవచ్చును. కాని, నీవు ఇతరులకు అంగీకార యోగ్యుడవైతే, ఆ కారణంగా నీకు కూడా నీవు అంగీకార యోగ్యుడవు కాగలవు. అనగా నీ అంచనాలో నీవు దేనికైననూ కొరగానివాడవని తేలుచున్నది. నీ యందు గల సామర్థ్యములు అత్యల్పములని స్పష్టమగుమనే యున్నది. ఈ దోషములతో నిన్ను నీవు అంచనా వేసుకుంటావు గనుక, నీ సామర్థ్యమును నిరూపించవలసిన ఆవశ్యకత ఏర్పడుచుండును. ఈ దోషములు నీ ప్రయత్నము వలన తొలగిపోయేవి కావు. నీవు సాధించిన ఘనకార్యములు నీకు ఆరోగ్యకరమైన ఆత్మగౌరవము నీయవచ్చునే గాని, నీకు గల పరిచ్ఛేదములను, దోషములను గురించిన భావనలను తొలగించజాలవు. పరిచ్ఛిన్నుడగు వ్యక్తి పరిచ్ఛిన్నుడుగనే కొనసాగును. తమిళంలో ఒక సామెత గలదు. నీ వ్రేలు వాచినప్పుడు, ఎంత పెద్దది కాగలదు? దానికి ఒక పరిధి కలదు గదా! గుమ్మడికాయంత పెద్దది కాలేదు గదా! అటులనే, నీవు ఎంత ఘనకార్యమును సాధించినా, అది సీమితముగనే ఉండును. నేను స్వభావతః పరిచ్ఛిన్నుడనైతే, ఏవో కొన్ని పై మెరుగులు దిద్దినంత మాత్రాన నాలోని పరిచ్ఛిన్న భావన తొలగిపోదు. పరిచ్ఛిన్నుడగు వ్యక్తి చేసే ప్రయత్నమేదైననూ దోషయుక్తముగను, అల్పముగను ఉండుట నిశ్చయము.

ఆత్మ నియంత్రణ, భూతదయ ప్రధానలక్షణములుగాగల వ్యక్తిత్వము గల మానవులు నన్ను ఆరాధించెదరు. ఎట్టి నన్ను?

భూతాదిమ్. సర్వభూతముల పుట్టుకకు ముందు ఉన్న నన్ను ఆరాధించెదరు. ఆది యందు ఉన్నది కారణమగును. కాన, భూతాది యనగా జగత్కారణమగును. సర్వ జగత్కారణము (భూతాది) అనుటచే, భగవానునిలో మార్పులు వచ్చియుండునని మనము తలంచవచ్చును. అనగా, ఒకనాడు పరబ్రహ్మ ఉండెడిది. ఇప్పుడు అది జగత్తు అయినది. అనగా నేమి? జగత్తు మాత్రమే గలదు. పరబ్రహ్మ లేదు.

పరిస్థితి ఇది కాదని స్పష్టము చేయుటకై భగవానుడు 'అవ్యయమ్ (మార్పులు లేనిది)' అని ప్రయోగించినాడు. జగత్కారణమగు బ్రహ్మ నుండి జగత్తు పరిణామము (మార్పు) వలన పుట్టలేదు. ఈ మార్పు ప్రాతిభాసికము మాత్రమే. సర్వ సృష్టి హేతువు అగు పరబ్రహ్మము యొక్క స్వరూపములో మార్పు లేదు. ఈ మార్పు కేవల నామరూపాత్మకమైన మిథ్య. మిథ్యా భూతమగు సృష్టికి, కారణమగు అధిష్ఠానము ఉన్న చాలును. దానిలో మార్పులు రాదగిన ఆవశ్యకత లేదు.

మాం జ్ఞాత్వా మాం భజన్తి. సృష్టికి కారణము నేనే; నేను అవ్యయుడను అని వారు ఎరింగినవారై నన్ను ఆరాధించెదరు. భగవానుడు ఇట్టి వాడని వారికెట్లు తెలియును? వారి ఈ జ్ఞానము ఆచార్యుని నుండి శాస్త్రము ద్వారా పొందబడిన పరోక్ష జ్ఞానము మాత్రమే. వారు ఆ కొద్ది జ్ఞానమును పొంది, దాని సాక్షాత్కారము కొరకై నన్ను ఆరాధించెదరు.

వీరి ఆరాధన ఏదో ఒక కాలాంశములో మాత్రమే చేసేది గాదు. వీరి మనస్సులు ఇతరములచే ఆకృష్టములు కావు (అనన్యమనసః). వివేకబలముచే వారికి ధర్మార్థ కామముల యందు అభిరుచి తొలగినది. సంస్కారబలముచే వారు ముముక్షువులైనారు. వారి ప్రవృత్తిలో ఆత్మ నియంత్రణ, భూతదయ అంతర్భాగము లైనవి. వారికి ఆచార్యుని ఉపదేశము నందు, శాస్త్రము నందు, శ్రద్ధ గలదు. వారు చేసిన ప్రార్థనల ఫలమే వారి ముముక్షుత్వము.

**సాధకుని అంకితభావము**

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. నేను గృహస్థుడను. నాకు కుటుంబ బాధ్యతలు గలవు. కాని ఈ సాధనను విక్షేపము లేమియూ లేకుండగా చేయవలెను. ఇది నాకు ఎట్లు సంభవమగును? తల్లి తండ్రులు తమ పిల్లలను పెంచవలెనా? లేక వేదాంతమును అధ్యయనము చేయవలెనా? దీనిని ఏకాకియై సాధన చేయాలా, లేక కుటుంబ బాధ్యతలను నిర్వర్తిస్తూ సాధన చేయాలా అనునది ప్రముఖము కాదు. నీకు గల అంకిత భావము మాత్రమే పరిగణనలోకి వచ్చును. అంకితభావము ఉన్నచో, ఏ వృత్తిలో నున్నా, ఈ సాధన కొనసాగుచునే యుండును. ఇది ప్రేమలో పడినవాని మనఃప్రవృత్తి వంటిది. ప్రేమికుడు కొన్ని పూర్వ నిర్దిష్ట సమయములలో మాత్రమే తన ప్రేయురాలిని గురించి తలంచును అనుకోరాదు. ఒక దినములో చేయవలసిన పనుల జాబితాలో ప్రేయురాలిని గూర్చి తలపోయుట ఒకానొక అంశము అనుకోరాదు. ప్రేమలో పడిన వ్యక్తి ఆ ప్రేమచే పూర్తిగా ఆవిష్టుడగును. అతడు ఒక పనిని చేస్తూ ఉన్నా, చేయకపోయినా, దాని ప్రభావము అతనిపై పడదు. ముముక్షు జ్ఞానసాధన కూడా ఇట్టిదియే. ఇచట అనన్య మనసః అనగా నిదియే.

శ్రీ శంకరులిట్లు వివరించిరి. ఈ సాధకులు స్వార్థపరులు గాదు. వారు 'నేను, నాది' అను సిద్ధాంతమునకు విలువ నీయరు. వారు పూర్తి పరిజ్ఞానముతో సాధన చేయుదురు. 'మేము ఆదరించే వ్యక్తి అట్లు చేసినాడు గాన, అతని అడుగు జాడలలో నడిచే మేము కూడా ఈ సాధనను చేపట్టినాము' అను ధోరణికి వీరికి సంబంధము లేదు. ఇతరులు నడిచిన దారిలో నడిచినచో దారి తప్పే ప్రమాదము లేదు. ఆ దారిలో ఇట్టి సౌకర్యము నిశ్చితముగా గలదు. కాని, యోగ్యమగు విచారమే ఇచటి మార్గము. ఈ మార్గములో గల సోపానముల నన్నిటినీ అధిరోహించిన వ్యక్తికి సాక్షాత్కారము సునిశ్చితము. సాక్షాత్కారము కాకపోయే ప్రసక్తి ఉండదు. ఇది గణితము వంటిది. గణితములో లెక్క లోని అంశముల నన్నిటినీ సరియగు క్రమములో వేసుకున్నచో, జవాబు లభించి తీరును. జవాబు సరికాని పక్షములో, అనుసరించిన క్రమములో తప్పు ఉండుట నిశ్చితము. మనము విలోమక్రమములో వెనుకకు పరిశీలించినచో, ఆ తప్పు దొరకును. దానిని సరిచేసినచో, సరియగు జవాబు లభించును. కాని ఈ సరియగు జవాబులో అనిశ్చితత్వము గాని, వివిధత్వము గాని ఉండవు. అది సునిశ్చితముగ, ఏకరూపముగ నుండును. జ్ఞానమార్గపు తీరు ఇట్టిది. కావున ఈ సాధకులు తాము అనుసరించిన మార్గమును గురించి పూర్ణ పరిజ్ఞానముతో సాధన చేయుచుందురు.

ఈ విషయమును తరువాతి రెండు శ్లోకములు మరింత వివరించును.

వారు నిన్ను (భగవానుని) అన్వేషించు విధమెట్టిది?

**అధ్యాయము 9, శ్లోకము 14:**

सततं कीर्तयन्तो मां यतन्तश्च दृढव्रताः ।
नमस्यन्तश्च मां भक्त्या नित्ययुक्ता उपासते ॥ १४ ॥

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే (14)

**సతతం** = ఎల్లవేళలా; **మాం** = నన్ను; **కీర్తయంతః** = కీర్తించుచున్నవారై; **చ** = మరియు; **యతంతః** = ఆవశ్యకమగు యత్నమును చేయువారై; **దృఢవ్రతాః** = స్థిరమగు అంకితభావము గలవారై; **చ** = మరియు; **మాం** = నన్ను; **నమస్యంతః** = నమస్కరించువారై; **నిత్యయుక్తాః** = సర్వదా నాతో సంబంధము గలవారై; **భక్త్యా** = భక్తితో; **ఉపాసతే** = ఉపాసించెదరు.

> వారు ఎల్లవేళలా నన్ను కీర్తించుచూ, ఆవశ్యకమగు యత్నమును చేయుచూ, స్థిరమగు అంకితభావము గలవారై, నన్ను నమస్కరిస్తూ, నాతో నిత్య సంబంధము కలిగి భక్తితో నన్ను ఉపాసించెదరు (14).

సతతం కీర్తయంతో మామ్. అనగా పరమేశ్వరుడనగు నా మహిమలను సదా కీర్తించువారై. భగవానుని మహిమను ఎల్లవేళలా దర్శించి, కీర్తిస్తారు. ఈ మహిమ సాధారణమైనది కాదు. ...ములు, సర్వ పదార్థములు తమ ఉనికిని నా యందు కలిగియున్నవి. కాని నేను వాటి ...పూర్ణముగా విముక్తుడను. నేను నా ఉనికి కొరకై వాటిపై ఆధారపడును. ఇది అద్భుతమైన ...ము. అయన స్వయముగా మార్పులను చెందకుండగనే, సర్వజగద్రూపముగా అయినాడు. ... ఏ పనినీ చేయడు. కాని సర్వసృష్టికి కర్త, భర్త, సంహర్త ఆయనయే. ఇది పరమేశ్వరుని ...భూతి. దీనిని వారు తెలుసుకొని స్తుతిస్తారు. కీర్తయంతః అనగా విచారయంతః. అనగా నన్ను ...ార్థి శ్రవణముచే గాని, మననముచే గాని, నిదిధ్యాసనముచే గాని విచారమును సలుపువారు. ...ట్టి విచారమును చేయు వారెవ్వరు? యతంతః. ఆవశ్యకమగు యత్నములను చేయువారు. ఈ యత్నము లేవి?

## ఆవశ్యకమగు యత్నము

శ్రవణ మననములు మాత్రమే చాలవు. వాటికి మనోబలము తోడు కావాలి. ఏలయనగా, సాధకుని మనస్సు ఎట్టిది అనుదానిపై జ్ఞానోదయము ఆధారపడియుండును. మనస్సు పరిపక్వమై ఉండాలి. యతంతః (తమ మనస్సును యథాయోగ్యముగా నియంత్రించువారు) అను పదము ఈవిషయమునే నిర్దేశించుచున్నది. ఎట్లు? 'ఇంద్రియోఘసంహార శమ దమ దయా–అహింసాది ధర్మైః ప్రయతంతశ్చ' అని శ్రీ శంకరులు వివరించిరి. ఇది సన్న్యాసికి ఖచ్చితమైన నిర్వచనము. ఇంద్రియోవ సంహారమనగా మనో విలాసముల వెనుక పడకుండుట. దీని యందు స్థూలదేహ స్థాయిలో దమము, మానసిక స్థాయిలో శమము సహజముగనే అంతర్భాగములగును. మనము తరచు యాంత్రికముగా ఆలోచిస్తాము. మన మనస్సు యొక్క అవస్థలు (moods) తరచుగా మారిపోతూ ఉంటాయి. సాధకుడు ఇట్టి పరిస్థితులను నియంత్రించగలగాలి. సాధకుడు ఈ ఆలోచనా ధోరణుల వ్యామోహములో పడకుండగా, వాటిని దర్శించే సాక్షిగా, వాటికి అతీతుడుగా నుండి, వాటి వెనుక పడకుండగా, వాటిని తన అధీనములో నుంచుకొనవలెను. వాటికి అనుగుణముగా సాధకుడు ప్రవర్తించరాదు. ఇది సాధ్యం కావాలంటే, సాధకుడు అంతర్ముఖుడు

కావాలి. మరియు పూర్ణ మనో నియంత్రణను పొందుటకు శమము, దమము, దయ, అహింసా ఇత్యాది సద్గుణములు కూడ అత్యావశ్యకము లగును. ఇవి అన్నీ ఉన్న వ్యక్తియే పరిణతుడగును. దయ సహజ గుణము కావచ్చును. లేదా, పెంపొందించుకున్న గుణము కావచ్చును. కాని ప్రస్తుతంలో యత్నము గలదు గనుక, ఈ దయ పెంపొందించుకున్న గుణము అని చెప్పదగును. అనగా, సాధకుడు దయామూర్తిగా నుండుటకు యత్నించును. దయ అదృశ్యమైన సందర్భములలో, దయాళువు అగుటకు కావలసిన మానసిక ప్రయత్నమును చేయును. ఈ దయాగుణమును నిలబెట్టుకొనుటకై సాధకుడు సంకల్పపూర్వకముగా ప్రయత్నించును.

శ్రీ శంకరులు దయాగుణమును పునః పునః ప్రస్తావించిరి. ఏలయనగా, సన్న్యాసులు అందరు సర్వప్రాణుల యందు దయను కలిగి ఉంటామని ప్రతిజ్ఞను చేయుదురు. సన్న్యాసి సన్న్యాస స్వీకార సమయములో బుద్ధిపూర్వకముగా ఇతర ప్రాణిని హింసించనని (అహింస) ప్రతిజ్ఞను చేయును. ఇది చాల గొప్ప ప్రతిజ్ఞ. సన్న్యాసికి ఇది ప్రముఖ లక్షణము. సన్న్యాసికి అమానిత్వము, అదంభిత్వము, ఆర్జవము ఇత్యాది ఇతర గుణములు కూడ ఉండవలయును. ఏలయన, ఈ జ్ఞానము ఉదయించుటకు ఆవశ్యకమగు అంతఃకరణ శుద్ధికి ఈ గుణములు ఆవశ్యకమగును. ఈ సద్గుణములను పెంపొందించుకొనుటకై యత్నించువారు యతులు అనబడుదురు.

ఇందువలననే భగవానుడిచట 'యతయః' అని ప్రయోగించినాడు. సన్న్యాసి ప్రయత్నమును చేయును గాన యతి అయినాడు. సన్న్యాసి చేయు పనులు రెండు గలవు. జ్ఞానాన్వేషణ మొదటిది. అవసరమైనచో, మానసిక పరిపక్వత కొరకు ప్రయత్నించుట రెండవది. సన్న్యాసి అహింసకు బద్ధుడై ఏ దినమునకు ఆ దినము ఏ క్షణమునకు ఆ క్షణము జీవించును. అనగా గృహస్థుల వలె భవిష్యత్తు కొరకు సంగ్రహమును చేయడు. జీవితమును ఏ దినమునకు ఆ దినము జీవించు వేదాంతి మాత్రమే సన్న్యాసమునకు అధికారి యగును. అట్లు గానిచో వేదాంతము కార్యకారి కాదు. సన్న్యాసి ఒక దినమునకు మాత్రమే యోజన చేయును. ఒకవో భవిష్యత్తును గురించి యోజన చేసిననూ, అది ఈనాటి యోజన మాత్రమే. మరునాడు దానిని మార్చివేయుటకు అతడు వెనుకాడడు. వేదాంతి యొక్క జీవితమట్లుండును. కావున, ఇట్టి అధికారిత్వమును పొందుటకు యత్నము కొంత ఆవశ్యకమగుట సహజమే గదా! పైగా, శాస్త్ర శ్రవణాదులను కొనసాగించుటలో యత్నము ఆవశ్యకమే గదా!

## అంకితభావము యొక్క ప్రాముఖ్యము

దృఢవ్రతాః. వారు దృఢమైన అంకితభావము గలవారు. చాల మంది ఆరంభములో శూరులుగ నుండి, తరువాత మెల్లిగా జారుకుంటారు. కాని దృఢవ్రతులు తాము చేపట్టిన కార్యమును అంకితభావముతో కొనసాగిస్తారు. వారు ఒకసారి ఒక పనిని చేపట్టినచో, దానికి బద్ధులై, పరిస్థితులు పూర్తిగా ప్రతికూలము అని తేలిన సందర్భాలలో మినహాయించి, ఆ పనిని కొనసాగిస్తారు. పాంథుడు దారిలో అనేక ఆటంకములు ఎదురైనప్పుడు, తాను వచ్చినదారిని మరల సరిచూసుకుంటాడు. నేను వెళ్ళుచున్న దారి ఏది? ఇట్లు వెళ్ళుట హితకారియేనా? అని అంచనా వేసుకుంటాడు. అట్లు కానిచో, వెనుకకు మళ్ళి, మరల సాధన సంపత్తిని సమకూర్చుకుని, మరల యాత్రను ఆరంభించును. అటులనే, మనము ఒక హామీని ఇచ్చునప్పుడు, సదా తక్కువ స్థాయిలో ఈయవలెను. తరువాత, ఇచ్చిన హామీ కంటె అధికమగు ఫలమును చూపవలెను. అట్లు గానిచో, అనావశ్యకమగు ఒత్తిడులకు మనలను మనమే గురిచేసుకొనెదము. దీనివలన సర్వదా మనస్సులో పరాజిత భావన నెలకొనును. ప్రస్తుతంలో, మోక్షమునకు అంకితమైనవారు దృఢవ్రతులనబడుదురు. అనగా వారి లక్ష్యములో మార్పు ఉండదు. వ్రతమనగా ఈశ్వరార్పనకు సంబంధించిన అనుశాసనము అని సామాన్యార్థము. కాని ఇచటి వ్రతము అట్టి అనుశాసనము కాదు. ఇచట అంకితభావమే వ్రతము. ఒక విశిష్ట లక్ష్యమును గోరు మానవుడు ఒక విశిష్ట అనుశాసనమును చేపట్టును. కాని ఇచట మౌలిక పరివర్తనము ఆవశ్యకమై యున్నది. వీరు మోక్షము అనే పరమ పురుషార్థమునకు అంకితమైనవారు. కావున ధర్మార్థ కామములకు వీరి మనస్సును ఆక్రమించే శక్తి లేదు. ఇందువలననే 13వ అధ్యాయములో 'తత్త్వజ్ఞానార్థ దర్శనమ్' అనునది అంతిమ విశేషణముగా చెప్పబడినది. జ్ఞానఫలము మోక్షము అనే సత్యమును దర్శించుటను వారు నిదిధ్యాసన రూపముగా అభ్యసించినారు. అనగా వారికి తమ జీవితములో సాధించదగిన లక్ష్యము సుస్పష్టముగా నున్నది (పురుషార్థ నిశ్చయః). అందుచేతనే వారి అన్వేషణకు ఒక నిర్దిష్ట దిశ గలదు. వారు చేయు పనులన్నియు విచార విమర్శపూర్వకముగా చేయబడి పూర్ణతః సార్థకములగును. మోక్షము తత్త్వజ్ఞాన గమ్యమనే ఎరుక వారికి కలదు గనుక వారి యందు జిజ్ఞాస నెలకొన్నది. ఇది దిశానిర్దేశరహితమైన కేవల మోక్ష కామన కాదు.

సాధకునకు తాను అన్వేషించే లక్ష్యముపై ఎంతటి స్పష్టమగు కల్పన గలదు? అతని సాధన అంతయూ ఈ అంశముచే నిర్ణయింపబడును. మానవ జీవిత లక్ష్యమును సుస్పష్టముగా నెరింగినవానికి జీవితములో ఒక నిర్దిష్ట దిశ లభించును. ఇట్టి పురుషార్థ నిశ్చయము గలవానికి మాత్రమే జ్ఞానప్రాప్తి మార్గము, దానిలో అంతర్గతములుగా నుండే ఇతరము సర్వము ప్రేమకు

అస్పదమగును. మోక్ష నిశ్చయము అస్పష్టముగా నున్నచో, అనేక సమస్యలు ఉదయించును. ఇందువలననే, పురుషార్థ నిశ్చయము జ్ఞానసాధనకు ఆవశ్యకమగు జీవనమూల్యములలో ఒకటిగా నిర్దేశింపబడినది. ఈ జీవనమూల్యములను వర్ణిస్తూ భగవానుడు 'అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్' అని చెప్పినాడు. ఆత్మ విషయవస్తువుగా గల జ్ఞానము (అధ్యాత్మజ్ఞానమ్) అనగానే, ఆత్మ పాపి, పరిచ్ఛిన్నము అనే నిర్ణయమే ఈ జ్ఞానము అగునని కొందరు పొరపడే అవకాశము గలదు. అందువలననే, భగవానుడు 'తత్త్వజ్ఞానార్థ దర్శనమ్' ని జతచేసినాడు. ఇది చాల ప్రముఖమైన జీవనమూల్యము. ఆత్మ జ్ఞానమే మోక్షము. ఇంతకు మించి మరియొకటి లేదు. జీవితములోని అన్వేషణ లన్నియూ పరిచ్ఛిన్నములేనని సాధకుడు శ్రుతి సహాయముతో, శ్రుత్యనుకూల విచారము యొక్క సహాయముతో గుర్తించును. దీనికి అనిత్యత్వ నిశ్చయమని పేరు. దీని వలన వైరాగ్యము కలుగును. ఆత్మజ్ఞాన మొక్కటియే మోక్షహేతువు అను ఎరుక ఈ నిశ్చయము నుండియే పుట్టును. ఇట్టి పురుషార్థ నిశ్చయము గలవారు దృఢవ్రతులు అగుదురు. వారు మూడు రకముల ఏషణల నుండి విముక్తులగుదురు. అనగా పుత్రైషణ, విత్తైషణ మరియు లోకైషణ (పరలోక సుఖముల యందలి ఇచ్ఛ) వారికి లేవు. కావున వారు సర్వమును త్యజించి, ఆత్మ జ్ఞానము (మోక్షము) కొరకై సన్న్యాస జీవనమును గడిపెదరు. వారు దృఢవ్రతులనబడుదురు.

### ఈశ్వర కృప ఆవశ్యకము

ఇట్లు అగుటకు ఈశ్వరకృప అత్యంత ఆవశ్యకము. అందువలననే భగవానుడిచట 'మాం భక్త్యా నమస్యంతః' అనినాడు. ఈ సాధన అంతయూ భక్తితో గూడిన వాతావరణములో మాత్రమే చేయబడును. ఇట్టి వాతావరణములో సాధకుడు తన పరిధులను గుర్తించగల్గును గాన, ఉపలబ్ధి ఏది లభించినమూ అతని యందు 'ఇది నా గొప్పతనము' అను అహంకారము తలయెత్తదు. జ్ఞానసాధనను సమర్పణాభావముతో భక్తి పూర్ణ హృదయముతో చేయువారు అని 'నమస్యంతః' అను పదమునకు అర్థము.

మానవులు వేర్వేరు చోట్ల ఆత్మ సమర్పణమును చేయుదురు. కొందరు ధనమును లక్ష్మీరూపములో, లేదా కుబేరరూపములో ఈశ్వరునిగా మార్చుకొని దానికి సమర్పితులగుదురు. మానవులు తమ తమ విచారమునకు, రాగద్వేషములకు, లక్ష్యమునకు అనురూపముగా వివిధ విషయములకు సమర్పితులగు చుందురు. ఇది వారి వారి పరిపక్వతపై ఆధారపడి యుండును.

కాని, ప్రస్తుతంలో ఈ సాధకులు బుద్ధికి అధీశ్వరుడై యున్న ఆత్మకు సమర్పితులగుదురని శ్రీ శంకరులు వివరించినారు. వారు తమ సర్వస్వమును పరమాత్మ సన్నిధానములో నుంచి ఆత్మరూపుడగు అయనకు మాత్రమే అర్పితులగుదురు. ఈ సత్యమును మనము గమనించవలెను.

లేదా, సర్వ జగత్తునకు సృష్టి స్థితి లయ కర్తయగు పరమేశ్వరుని కృపను గోరి అయనను వారు శరణాగతి చేసినారని కూడా మనము అర్థమును చెప్పవచ్చును. శాస్త్రకృప, గురుకృప, మరియు సాధకుని స్వీయకృపలతో బాటు ఈశ్వరుని కృప కూడ ఆవశ్యకమగును. భక్తిపూర్ణమగు వాయు మండలములో ఈశ్వరుని భజించుట అత్యావశ్యకము. కావుననే ఈ సాధన కేవల సిద్ధాంతపరమైనది (academic) కాదని చెప్పబడినది. మరియు ఇది కేవల మత సంబంధి సాధన కూడా కాదు. ఏలయన, దీనిలో విచారము అతి ప్రముఖ భాగముగ నుండును. శ్రుతి పదములను, వాటి తాత్పర్యమును విచారణ చేయుదురు. దీనిలో వ్యాకరణము, తర్కము ఇత్యాదులు కూడ సమ్మిళితమై యుండును. ఇది సైద్ధాంతిక చర్చ యన్నట్లు భాసించును కాని ఈ సాధనలో జీవనమూల్యములు ప్రముఖ పాత్ర వహించును. శరణాగతితో, మరియు భక్తితో నిండిన వాతావరణములో ఈ సాధన కొనసాగును. కావుననే, ఈ సాధన కేవలము కొన్ని విశ్వాసములకు లోబడి కొనసాగేది కాకపోయినా, దీనిని మతము నుండి విడదీయుట సంభవము కాదు. దీని యందు విషయ పరిజ్ఞానము ప్రముఖముగా నుండును. ఇందువలననే, నమస్యంతశ్చ మాం భక్త్యా (శరణాగతి చేసి, భక్తిపూర్ణ మగు హృదయముతో నన్ను అన్వేషించువారు) అని భగవానుడు వర్ణించినాడు.

ఈశ్వరుడు కర్మల ఫలమును ఇచ్చువాడు (కర్మఫలదాత) మరియు కర్మల న్నింటికీ సాక్షి అను గుర్తింపునకు భక్తి అని పేరు. ఇసుమంత కర్మయైననూ ఈశ్వరుని వలననే సంభవమగుచున్నది. అనగా కర్మను చేయుట, కర్మఫలమును పొందుట అను రెండు స్థాయిలలో భక్తులు ఈశ్వరుని గుర్తించెదరు.

## స్థిరమగు భక్తి మాత్రమే చాలును

భక్త్యా నిత్య యుక్తాః అనగా వారు స్థిరమగు భక్తి గలవారు అని యర్థము. లేదా భక్త్యా మాం ఉపాసతే అని అన్వయించవచ్చును. దేహళీ దీపన్యాయము (గడపమీద పెట్టిన దీపము అను దృష్టాంతము)చే 'భక్త్యా' అను పదమును రెండు వైపులకు అన్వయించవచ్చును. గడపమీద పెట్టిన దీపము ఇంటి లోపలా, మరియు బయట ప్రకాశమును వెదజల్లును. అటులనే భక్త్యా అను

పదమును నమస్యంతః, నిత్యయుక్తాః అను రెండు పదములతో కలిపి అన్వయించినచో, 'భక్తితో సర్వదా నాకు అంకితమై నన్ను ఉపాసించెదరు' అను అర్థము వచ్చును. స్థిరమగు భక్తి ఉన్నచో చాలును అని సూచించుటకై ఇట్లు నిర్దేశింపబడినది.

శ్మశాన వైరాగ్యము వలె భక్తి కూడా కాదాచిత్కముగా కలుగవచ్చును. కావలసిన వ్యక్తి మరణించినప్పుడు శ్మశానమునకు వెళ్లిన వ్యక్తికి జీవితములోని అన్వేషణలపై ఒక వైరాగ్యము ఏర్పడును. మానవుడు తాను కష్టపడి సంపాదించిన సర్వములో ఏదీ తనతో బాటు రాదనే సత్యమును శ్మశానములో గుర్తించును. జీవితమునకు వాస్తవమగు సార్థకత ఏది చెప్పుమా! యని అతడా సమయములో విస్మితుడగును. ఆ క్షణములో అతడొక గొప్ప సాధకుడగును. కాని, ఇంటికి వెళ్లు వరకు మాత్రమే. ఇంటికి చేరగానే, Business World పత్రిక కంటబడును. వెంటనే వైరాగ్యము మటుమాయమై, అతడు సంపదను వృద్ధి చేయు మార్గమును గురించి ఆలోచించును. ఆ వైరాగ్యము తత్కాలీనము మాత్రమే. ఇటువంటి ప్రశ్న ప్రతి మానవుని మస్తిష్కములో ఉదయించును. కాని మానవుడు ఆ ప్రశ్నపై విచారమును కొనసాగించడు. ఇటులనే మానవులకు భక్తి కూడా మెరుపువలె ప్రకాశించినమా, తగినంత పరిజ్ఞానము లేకపోవుటచే ఆ మెరుపు తొలగిపోవును.

సాధకునకు గల పరిజ్ఞానము నుండియే ఇట్టి భక్తి భావన ఉద్బుద్ధమగును. పరిజ్ఞానము స్పష్టముగా లేనిచో, భక్తిలో కూడ ఆటు, పోటు వచ్చుచుండును. ఇందువలననే, భక్త్యా నిత్య యుక్తాః (చిరస్థాయిగా నుండు భక్తితో సంపన్నమైన వారు) అని గీత వర్ణించుచున్నది. వారి భక్తికి లక్ష్యము ఈశ్వరుని ఎరుక. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని అను నాల్గురకముల భక్తులు గలరని ఇదివరలో చెప్పబడియున్నది. వారిలో మూడవ వాడగు జిజ్ఞాసువును గురించి మనమిచట మాటలాడుచున్నాము. ఈశ్వరుడే సర్వమని శాస్త్రము చెప్పుచున్నది. అట్టి ఈశ్వరుని సత్య స్వరూపమును ఈ నిత్య యుక్తులగు సాధకులు తెలియగోరెదరు.

వారు భగవానుని భజించెదరు. భగవానుని ఆరాధించెదరు. ఎట్లు?

**అధ్యాయము 9, శ్లోకము 15:**

ज्ञानयज्ञेन चाप्यन्ये यजन्तो मामुपासते ।
एकत्वेन पृथक्त्वेन बहुधा विश्वतोमुखम् ॥ १५ ॥

జ్ఞాన యజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ (15)

చ = మరియు; అన్యే అపి = మరి కొందరు కూడా; విశ్వతో ముఖమ్ = అనేక రూపములు గల; మాం = నన్ను; ఏకత్వేవ = ఒక్కనిగా; పృథక్త్వేవ = ఆ రూపములు అన్నిటికంటె విలక్షణమైన వానిగా; బహుధా = అనేక విధములుగా; యజంతః = ఆరాధించువారై; జ్ఞానయజ్ఞేవ = జ్ఞానమనే యజ్ఞముతో; ఉపాసతే = ఉపాసించుచున్నారు.

అనేక రూపములు గల నన్ను మరికొందరు ఒక్క ఈశ్వరునిగా, మరియు
వివిధ రూపముల కంటె విలక్షణమైన వానిగా అనేక విధములుగా ఆరాధించి,
జ్ఞానమనే యజ్ఞముతో ఉపాసించుచున్నారు (15).

**ముముక్షువులు చేయు యజ్ఞము జ్ఞానసాధన మాత్రమే**

అన్యే, ఇతరులు. అనగా మోఘాశాః. మోఘకర్మాణః అని వర్ణింపబడిన వారి కంటె వీరు ఇతరులు. వీరు దైవభక్తితో నిండిన మనస్సు గలవారు (దైవీం ఆశ్రితాః). వీరు విశాలహృదయులు (మహాత్మానః).

జ్ఞాన యజ్ఞేన యజంతః. అనగా జ్ఞానమనే యజ్ఞము ద్వారా నన్ను ఆరాధించువారు. వీరికి జ్ఞానమే యజ్ఞము. ఈ జ్ఞానములో విషయము భగవానుడు. సన్న్యాసి యజ్ఞములను చేయడు. అతడు సమాజములోని బాంధవ్యములతో బాటు, వైదిక మార్గానుయాయులకు విధింపబడిన అగ్నిహోత్రాది కర్మలను కూడా త్యజించును. అతడు చేయదగిన కొన్ని కర్మలు గలవు. కాని అవి కేవలము ఆత్మ స్వరూపమును ప్రదర్శించే జపాది మానసిక కర్మలు మాత్రమే. వైదిక కర్మల నన్నిటిని త్యజించిన సన్న్యాసి చేయు యజ్ఞము జ్ఞానసాధన మాత్రమే. అతడు కర్మలను చేయడు గాన, భక్తుడు గాడని తలంచరాదు. అతడు భగవానుని జ్ఞానసాధన రూపములో ప్రార్థించి ఆరాధించును. జ్ఞానమే అతని యజ్ఞము.

మాం ఉపాసతే విశ్వతోముఖమ్. అనగా బహురూపములు గల నన్ను వారు ఆరాధించెదరు. సర్వమునకు కారణము నేనే. నిమిత్త కారణము నేనే. ఉపాదాన కారణము నేనే. అనగా కార్యము కూడా నేనే. పంచభూతములు నేనే. వాటి కార్యములు (పాంచభౌతికములు) నేనే. మీరు చూసే

సర్వము నేనే. మేఘములు, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, వరుణుడు, బృహస్పతి మొదలగు దేవతలు అందరు నేనే. ఈ విషయమును భగవానుడు మరల విస్తారముగా వర్ణించగలడు. 'సర్వము నా యందు ఉనికిని కలిగియున్నది. కాని 'నేను' సర్వము నుండి విముక్తుడను. ఈశ్వరుడనగు నా ఈ మహిమను చూడుము' అని భగవానుడిదివరకే చెప్పియున్నాడు (మత్ స్థాని సర్వభూతాని, న చ మత్‌స్థాని భూతాని, పశ్య మే యోగమైశ్వరమ్). ఈశ్వరుడు విశ్వతోముఖుడగు తీరు ఇట్లుండును. ఉపాసతే అనగా వారు నన్ను శ్రవణ మనన నిది ధ్యాసనముల ద్వారా ఆరాధించెదరు.

ఎట్లు?

ఏకత్వేన పృథక్త్వేన. ఏకత్వేన యనగా సర్వజగద్రూపములో నున్న వానినిగా. మరియు పృథక్త్వేన. అనగా వాటికంటె భిన్నుడై ఉన్నవానినిగా అని యర్థము. 'సర్వప్రాణుల ఉనికి నా యందు గలదు (మత్ స్థాని సర్వభూతాని)' అను భగవానుని వాక్యములో ఆత్మానాత్మ విభాగము నిహితమై యున్నది. 'ఈ సర్వము బ్రహ్మమే (సర్వం ఖల్విదం బ్రహ్మ)' 'ఈ సర్వమును ఈశ్వరునిగా దర్శించవలెను (ఈశావాస్యం ఇదం సర్వమ్)' అను వాక్యములలో కూడా ఈ భేదము చూపబడినది. కళ్లముందు జగత్తు గలదు. కాని వారు జగత్తును చూస్తూ ఉండగనే, వస్తువును వివిక్తముగా గుర్తిస్తారు (పృథక్త్వేన ఉపాసతే). దీనిని మనకు మనమే అన్వయించుకొనవచ్చును. స్మృతి, విభిన్న జ్ఞానములు మరియు వేర్వేరు మనోవృత్తులు అనువాటి నుండి విలక్షణుడుగా, వాటి నుండి విముక్తుడనై నేను గలను. కాని ఏ మనోవృత్తి యైననూ నన్ను వీడి లేదు. అనగా నామరూపాత్మకమగు మనోవృత్తి వస్తువు (ఆత్మ) కంటె భిన్నముగా లేదని మనకు తెలియుచున్నది. ఈ నామరూపములకే సృష్టి యని పేరు. నేను నామరూపముల కంటె వేరుగా నున్నాను (పృథక్). కాని నామరూపములు నా కంటె వేరుగా, స్వతంత్రముగా లేవు. 'గ' 'క' యే. కాని 'క' 'గ' కాదు. కావున ఒక విశిష్ట నామరూపములు ఆత్మ కాదు. సాధకుడు సత్యమును, మిథ్యను స్పష్టముగా నెరుంగవలెను. అప్పుడు మాత్రమే ఈ జ్ఞానము పరిపూర్ణమగును. కావున, వారు నన్ను సర్వముగా, మరియు సర్వము కంటె విలక్షణమైన తత్త్వముగా ఆరాధించెదరు (విశ్వతో ముఖం ఏకత్వేన పృథక్త్వేన).

వారు ఈశ్వరుని వివిధరూపములలో (విశ్వతోముఖమ్) ఆరాధించెదరని చెప్పబడెను. ఆ రూపము లేవి? దీనికి ఒకే వాక్యములో సమాధానము నీయవచ్చును. సర్వము భగవానుని నుండి పుట్టి, భగవానునిచే పాలింపబడి, మరల భగవానుని యందు లీనమగును. ఆ భగవానుడే బ్రహ్మ. లేదా, ఈ బ్రహ్మను వివిధ రూపములుగా కూడ వర్ణించదగును. 'సూర్యుడను నేనే.

చంద్రుడను నేనే. ఆకాశము నేనే. కాలము నేనే. కారణము నేనే. కార్యము నేనే. ఈ తీరున నిఘంటువును పూర్తిగా ఏకరువు పెట్టవచ్చును. లేదా అవగాహన కొరకై ఏవో కొన్నింటిని మాత్రమే చెప్పవచ్చును. 'నేనే సర్వము' అని సరళముగా చెప్పుటలో ఒక ప్రమాదము గలదు. ఇతరులు దాని లోతైన అర్థమును తెలియజాలరు. అందుకొరకై శాస్త్రము కొన్ని వివరములను కూడ చెప్పును. సర్వ పదార్థములను ఏకరువు పెట్టబని లేదు. కాని సర్వత్వ భావన సరిగా కలుగుటకై కొన్ని వివరముల నమూనా ఉంచబడును. ఈ అధ్యాయములోనే గాక, తరువాతి అధ్యాయములో కూడా ఇట్టి విశిష్టరూపములు కొన్ని ప్రస్తావించబడినవి.

**అధ్యాయము 9, శ్లోకము 16:**

अहं क्रतुरहं यज्ञ स्स्वधाहमहमौषधम् ।
मंत्रोऽहमहमेवाज्यमहमग्निरहं हुतम् ॥ १६ ॥

అహం క్రతురహం యజ్ఞ స్స్వధాహమహమౌషధమ్
మంత్రోహమహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్ (16)

అహం = నేను; క్రతుః = క్రతువు; అహం = నేను; యజ్ఞః = యజ్ఞము; అహం = నేను; స్వధా = పితృదేవతల కిచ్చు ఆహారము; అహం = నేను; ఔషధమ్ = ఆహారము; అహం = నేను; మంత్రః = మంత్రము; అహమేవ = నేనే; ఆజ్యం = ఆజ్యము; అహం = నేను; అగ్నిః = అగ్ని; అహం = నేను; హుతమ్ = హోమద్రవ్యము.

క్రతువు నేనే. యజ్ఞము నేనే. పితృదేవతల కిచ్చు ఆహారము నేనే. ఆహారము నేనే. మంత్రము నేనే. ఆజ్యము నేనే. అగ్ని నేనే. హోమద్రవ్యము నేనే (16).

**వైదిక కర్మలోని కారకము లన్నియూ భగవానుడే**

వైదిక కర్మలోని ప్రతి అంశము తానేనని భగవానుడీ శ్లోకములో ఉద్ఘాటించుచున్నాడు. కర్మలన్నింటిలో శ్రేష్ఠమైనది వేదవిహిత కర్మ. అట్టి క్రతువు నేనే అని చెప్పుట ద్వారా, ఇతర విధముల సర్వకర్మలు, వాటిలోని సర్వకారకములు సహజముగా తన స్వరూపమే నని భగవానుడు స్పష్టము చేసినాడు.

వైదిక కర్మలో పరమేశ్వరుడు ఇంద్రవరుణాది విశిష్టదేవతారూపములో ఆరాధింపబడును. దానిలో ముందుగా అగ్నిని వ్రేల్చి దాని యందు దేవత నుద్దేశించి హవిస్సు సమర్పింపబడును. యజ్ఞమనగా నిదియే. కాని జ్ఞాన యజ్ఞములో పరమేశ్వరుడొక్కడు మాత్రమే ఆరాధింపబడును. ఏలయన, కర్మలోని ఏ అంశమైననూ ఈశ్వరభిన్నము కాదు. అగ్ని ఈశ్వరుడు, క్రతువు ఈశ్వరుడు, హవిస్సు ఈశ్వరుడు, యజ్ఞమును చేయు యజమానుడు ఈశ్వరుడు, ఆ యజ్ఞమును చేయుట వలన లభించే ఫలము కూడ ఈశ్వరుడే. జ్ఞాన యజ్ఞమనగా నిదియే. మనము నాల్గవ అధ్యాయములో చూచియున్నాము. 'బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్' అను శ్లోకములోని భాష యజ్ఞ సంబంధియే అయినా, దానిలోని దర్శనము జ్ఞానమే. హవిస్సును అర్పించే స్రుక్స్రువాదులు బ్రహ్మము. ఆజ్యము ఇత్యాది హవిస్సు బ్రహ్మము. అది అర్పింపబడే అగ్ని బ్రహ్మము. దానిని అర్పించే కర్త కూడా బ్రహ్మమే. బ్రహ్మము అకర్త యని మనకు తెలియును. అనగా కర్త లేడు. ఇట్టి కర్తలేని యజ్ఞము వలన సాధింపబడే జ్ఞానమనే ఫలము కూడ బ్రహ్మమే. ఈ ఫలమును సంపాదించిన జ్ఞాని సర్వపరిస్థితులలో బ్రహ్మమునే దర్శించును. సర్వము ఈశ్వరుడే అను ఎరుకచే కర్మలన్నియు ఈశ్వర స్వరూపములే యగును. 'ఓ భగవాన్! నేను చేయు కర్మల నన్నిటినీ నీకు సమర్పించుచున్నాను (యద్యత్ కర్మ కరోమి తత్తదఖిలం శంభో తవారాధనమ్)' అను వాక్యమునకు తాత్పర్యమిదియే. ఇది ఒకానొక మానసిక ప్రవృత్తి అయినచో భక్తి. సర్వము ఈశ్వరుడనే సాక్షాత్కారమైనచో జ్ఞానము. ఏ వైదిక కర్మయైననూ తన కంటె భిన్నముగా, స్వతంత్రముగా లేదని భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు.

అహం క్రతుః అహం యజ్ఞః. క్రతు యజ్ఞ శబ్దములకు సామాన్యార్థము ఒక్కటియే కాని కలిసి ప్రయోగింపబడుటచే, మనము ఏదో ఒక తేడాను చూపవలెను. యజ్ఞ శబ్దము సర్వసాధారణ శబ్దము. ఏదైనా యజ్ఞమే. తినుట కూడా యజ్ఞమే. కాని క్రతువు అనగా వేద విహిత కర్మ. వైదిక కర్మ (క్రతువు) నేనే అని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా వైదిక కర్మను చేయుట ద్వారా భగవానుని ఆరాధించవచ్చును. కాని, భగవానుని ఎరింగిన జ్ఞాని సర్వవైదిక కర్మలను ఎరింగినట్లే యగును. అట్టి జ్ఞానికి ఇట్టి వైదిక కర్మ సాధ్యములగు ఫలములతో పని లేదు. భగవానుని అభిప్రాయము ఇదియే. స్మార్త కర్మలు, పూజ, ప్రార్థన, సమర్పణ ఇత్యాదులు యజ్ఞ శబ్దార్థమని శ్రీ శంకరులు వివరించిరి. వేదముచే సాక్షాత్తుగా విధింపబడక పోయిననూ, శ్రుతిని సమర్థించే ద్వితీయశ్రేణికి చెందిన స్మృతి గ్రంథములచే విధింపబడిన కర్మ యజ్ఞ శబ్దవాచ్యమగును. గీత కూడ ఇట్టి స్మృతి గ్రంథములలో నొకటి. జ్ఞానము, అధికార సంపద గల మహర్షులు శ్రుతి ఆధారంగా ఈ గ్రంథములను నిర్మించియున్నారు. వీటిచే విధింపబడే కర్మలు శ్రుతివిహితములు

గాకపోయిననూ, వాటి మూలము శ్రుతియే అగును. భగవానుడు ఈ రెండింటినీ ప్రస్తావించుటచే సర్వకర్మలను వ్యాఖ్యానించినట్లైనది.

పక్షుల యందు గాని, బ్రాహ్మణుల యందు గాని పితృదేవతలను ఆవాహన చేసి వారికి సమర్పించే అన్నపు ముద్దకు స్వధా అని పేరు, అట్టి స్వధా నేనే (అహం స్వధా).

సర్వప్రాణులు తినే ఆహారము నేనే (అహమౌషధమ్). చెట్లు చేమలు, లతలు మొదలగునవి ఓషధులనబడును. ఓషధుల నుండి పుట్టినది ఔషధము. అనగా శాకాహారము మాత్రమే ఆహారమనదగును. ధాన్యము, రాగులు, జొన్నలు మొదలగున వన్నియూ ఔషధము అనబడునని శ్రీ శంకరులు వివరించిరి. మందులు ప్రధానముగా వృక్షలతాదులనుండి పుట్టును గాన, ఔషధశబ్దమునకు మందు అనియూ అర్థము గలదు. కాని ఇచట ఔషధమనగా సర్వ క్రతువులలో ప్రముఖభాగముగా నుండే ఆహారమనియే అర్థము.

పితరులకు, దేవతలకు హవిస్సులను సమర్పించేటప్పుడు పఠించవలసిన మంత్రములు నేనే. అగ్నిలో హోమము చేయబడే ద్రవ్యము లన్నింటిలో ఆజ్యము ప్రముఖమైనది. అది నేనే. ఆజ్యము హోమము చేయబడే అగ్నిహోత్రము కూడ నేనే.

ఈ హవిస్సును విభిన్నదేవతలకు అర్పించే హవనక్రియ (హుతమ్) నేనే.

ఈ వేదాంతములో తెలియదగిన ప్రముఖ విషయమొక్కటి గలదు. కర్మ ప్రకరణములో చేయదగిన కర్మలు అనేకములుగ నుండును. వాటిని సమగ్రముగా అనుష్ఠించుట అసంభవము. కర్మలో కొన్ని లోపములు, తప్పులు జరిగే అవకాశము మెండుగా నుండును. కావున కొన్ని సమస్యలు తలయెత్తుచుండును. ఇట్టి దోషము లున్నచో, కోరిన ఫలమునకు విరుద్ధమగు ఫలము పుట్టును. కర్మ యొక్క స్వరూపమే ఇట్లున్నది. కోరిన ఫలము సిద్ధించే సందర్భములు అరుదు. కాని సత్యవస్తువు ఒక్కటియే అను సత్యమును నీవు గుర్తించినచో, సర్వము ఆ గుర్తింపులో లీనమగును. కావుననే, ఈ జ్ఞానమునకు రాజవిద్యా రాజగుహ్యమ్ అని పేరు వచ్చినది. ఈ ఏకసత్య వస్తు జ్ఞానములో సర్వము అంతర్గతమగును. కావున వివేకి ఈ సత్య వస్తువును మాత్రమే అన్వేషిస్తాడు.

భగవానుడు తన విశ్వతోముఖత్వమును మరికొన్ని దృష్టాంతముల ద్వారా ప్రతిపాదించుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 17:.**

पिताहमस्य जगतो माता धाता पितामहः ।
वेद्यं पवित्रमोङ्कार ऋक् साम यजुरेव च ॥ १७ ॥

పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్రమోంకార ఋుక్ సామ యజురేవ చ (17)

అస్య = ఈ; జగతః = జగత్తునకు; అహం = నేను; పితా = తండ్రిని; మాతా = తల్లిని; ధాతా = పోషించువాడను; పితామహః = తాతను (అంతిమ కారణము); వేద్యం = తెలియదగినది; పవిత్రం = శుద్ధము చేయునది; ఓంకారః = ఓంకారము; ఋుక్ = ఋుగ్వేదము; సామ = సామవేదము; చ = మరియు; యజుః ఏవ = యజుర్వేదము కూడా.

ఈ జగత్తునకు తండ్రి నేనే. తల్లి నేనే. పోషకుడను నేనే. తాత (అంతిమ కారణము)ను నేనే. తెలియదగినది నేనే. పావనము చేయునది నేనే. ఓంకారము నేనే. ఋుగ్వేదము నేనే. సామవేదము నేనే. మరియు యజుర్వేదము కూడా నేనే (17).

**జగత్తునకు తల్లి నేనే, తండ్రి నేనే, స్రష్టను నేనే, ఉపాదానము నేనే**

పితాహమస్య జగతః. ఈ జగత్తునకు తండ్రిని నేనే. అంతమాత్రమే గాదు. నేను తండ్రిని అని చెప్పుటచే, భగవానుడు ఈ సర్వ జగత్తునకు స్రష్ట (నిమిత్తకారణము) అని స్పష్టమగును. తరువాత 'నేను తల్లిని కూడా (అహం మాతా చ)' అని భగవానుడు చెప్పెను. ప్రకృతి (మాయా) నా కంటె వేరుగా లేదు. కావున, ఈ సృష్టికి ఆధారమగు ఉపాదాన కారణము కూడా నేనే. తల్లి, తండ్రి కూడా నేనే.

తల్లి, తండ్రి ఆయనయే. ఆయనకు తండ్రి ఎవరు? అను ప్రశ్న ఉదయించును. భగవానుడు జగత్తును సృష్టించినాడని చెప్పగానే, పిల్లలు ఆ భగవానుని సృష్టించినది ఎవరని ప్రశ్నించెదరు. ఇది తరచుగా తారసిల్లే ప్రశ్న. ఈ జగత్తు చాల సువ్యవస్థితముగా నుండి, బుద్ధి పూర్వకముగా చేయబడిన రచన వలె కన్పట్టుచున్నది. కావున, దీనికి ఒక కర్త ఉండి తీరాలి అను భావన

యించును. వండిన అన్నమును చూచినపుడు, ఒక వ్యక్తి దానిని వండియుండునని మనము ంచెదము. అటులనే ఇంత చక్కటి అమరికతో నున్న ఈ జగత్తునకు ఒక స్రష్ట ఉండవలెను. న్నది. ఆ స్రష్టను సృష్టించినది ఎవరు? అను ప్రశ్న ఉదయించును. నాకు తల్లి దండ్రులు రు. అటులనే, భగవానునకు కూడా తల్లిదండ్రులు ఉండియుందురు. అందువలననే, 'నేను తను (అహం పితామహః)' అని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా 'నేను కారణము లేని రణము' అని యర్థము. ఈ సర్వసృష్టికి మూలమగు పరబ్రహ్మ పితామహు డనబడును.

జగత్తును పాలించి పోషించి కర్మఫలముల నిచ్చువాడను నేనే (అహం ధాతా).

యబడే, తెలియదగిన ఏకైక వస్తువు నేనే

అహం వేద్యమ్. తెలియదగిన వస్తువు నేనే. ఏలయన, సద్వస్తువునగు నన్ను ఎరింగినచో, సర్వమును ఎరింగినట్లే. వాస్తవంలో తెలియగలిగే వస్తువు అది ఒక్కటి మాత్రమే. మనము తెలుసుకొనే ఇతరము సర్వము పాక్షిక జ్ఞానము మాత్రమే. ఈ సర్వము తనంత తాను మనుగడ లేని మిథ్య. కాన, అది పాక్షికముగా మాత్రమే మనచేత తెలియబడుటకు అవకాశము గలదు. ఒక విశిష్ట దృక్కోణములో మాత్రమే మనము దీనిని తెలియగల్గుతాము. ఇది ఒక పుష్పగుచ్ఛము అని మనము అన్నప్పుడు, ఒక ప్రత్యేక దృష్టికోణములో మాత్రమే ఆ మాట ప్రయోగింపబడినది. పుష్పగుచ్ఛమనగా కొన్ని పుష్పముల, పత్రముల కట్టయే గాని మరియొకటి గాదు. పత్రమును మనము విశ్లేషించినచో, దానిలో ఇంకనూ అవయవములు కన్పట్టును. ఇదే విధముగా ఈ జగత్తులో మనకు తెలిసినది అనిపించే ప్రతి వస్తువును మరింత విశ్లేషించి మరింత తెలియవచ్చును. అనగా మనము సర్వమును ఒక ప్రత్యేక దృష్టికోణములో మాత్రమే తెలియుచున్నాము. మనము ఒక గిరి గీసుకుని, ఆ గిరి లోపలనే ఉంటూ, వస్తువులకు పేర్లను పెడుతున్నాము. అనగా సర్వత్రా మనకు తెలిసినది నామరూపములే గాని, వస్తువు యొక్క అంతిమ తత్త్వము కానే కాదు. మనము స్థిరముగా నుండే తత్త్వమును మాత్రమే సమగ్రముగా తెలియగల్గుతాము (వేద్యమ్). అదియే అహమ్. అహమ్ నందు ఒక విశిష్ట దృష్టికోణముగాని, అంశములు గాని లేవు. మరియు అహమ్ సత్యము. మిథ్య కాదు. దానికి మరియొక అధిష్ఠానము లేదు. కావున, అది స్వతంత్ర సత్త గలది, స్వయం సిద్ధము. దాని జ్ఞానము విశ్లేషణను బట్టి మారేది కాదు. అది సర్వగుణ వినిర్ముక్తమని మనకు స్పష్టమగును. నేను సర్వవిశేష రహితుడను అని ఎరింగిన తరువాత, ఇంక తెలియవలసినది మిగలదు. కావున, వేద్య వస్తువు అను మాట ఆత్మ యందు మాత్రమే పొసగును. మరియు దానిని ఎరింగినచో, సర్వమును ఎరింగినట్లే. ఈ ఎరుకయే విముక్తి.

మన బుద్ధి సర్వదా కారణమును అన్వేషిస్తూ ఉండును. గడియారమును చూచిన పిల్లవాడు దానిని విప్పి లోపల చూడాలని, అది సమయమును తెలుపుడు చేయుటకు కారణమైన యంత్రభాగములను తెలుసుకోవాలని ప్రయత్నిస్తాడు. అది పనిచేసే ప్రక్రియను తెలియగోరే ఈ బుద్ధి కారణాన్వేషణశీలి యని చెప్పవచ్చును. ఈ బుద్ధి వ్యక్తికి చిన్నవయసులో నుండగనే ఆరంభమగును. ఇది ఆగేది ఎక్కడ? ఇట్టి బుద్ధియే మానవుని బ్రహ్మ విచారములోనికి నడిపించును. ఈ జగన్నాటకమును తెర వెనుక నుండి నడిపే వాని గురించి మానవుడు తెలియగోరును. ఈ దిశలో పయనించే నీ మనస్సు ఆగేది ఎప్పుడు? 'సర్వము నేనే' అను సత్యమును గుర్తించి అంతర్ముఖమైన నాడు మాత్రమే దాని యాత్ర అంతమగును. ఈ జ్ఞానము మాత్రమే దానికి విశ్రామస్థానము. కాన 'అహం వేద్యమ్' అనగా 'దేనిని తెలిస్తే సర్వము తెలిసినట్లు అగునో, అట్టి సత్య బ్రహ్మ నేనే'. అహం మాత్రమే సత్యమనియు, మిగిలినది సర్వము మిథ్య అనియు, అనగా సర్వము నేనే అనియు నీవు గుర్తించిన చాలును. ఈ జ్ఞానమే విముక్తి. ఈ జ్ఞానము కలుగువరకు బుద్ధి యొక్క అన్వేషణ కొనసాగుచునే యుండును.

**నేను తెలియబడే విధమెట్టిది?**

సర్వైః వేదైః. నన్ను నేను సర్వ వేదములచే తెలియదగును.

పవిత్ర వస్తువులు అనేకములు గలవు. పవిత్రము అనగా శుద్ధి చేయునది. యథార్థముగా శుద్ధిని కలిగించునది ఏది? జీవుడు రాగద్వేషాధీనుడై, వాటి ప్రేరణచే అనేక కర్మల నాచరించి వివిధ రకముల పుణ్యపాపములను ప్రోగుచేసుకొనును. వీటి నన్నిటినీ నిర్మూలించి జీవునకు శుద్ధిని కలిగించునది యేది? ఆత్మజ్ఞానము మాత్రమే. కావున 'అహమ్' పవిత్రమైనది. 'అహమ్' యొక్క యథార్థ స్వరూపము నెరింగినచో, ఆ జ్ఞానము జీవుని శుద్ధుని చేసి సంసార బంధము నుండి సాకల్యముగా విముక్తిని కలిగించును.

ఓంకారము నేనే. అది నా పేరు. ఓంకారము చాల గొప్పది. దాని గొప్పదనము శబ్దగతము కాదు. దాని అర్థము నేనే గనుక అది గొప్పది అయినది. అది భగవానుని నామము గనుక గొప్ప పదము, గొప్ప శబ్దము అయినది. అట్టి ఓమ్ నేనే.

తరువాత భగవానుడు 'ఋగ్వేదము నేనే, సామవేదము నేనే, యజుర్వేదము నేనే' అని చెప్పుచున్నాడు. వేదములు నాలుగు. కాని యజ్ఞములో వినియోగింపబడునవి ఈ మూడు

వేదములు మాత్రమే. ఈ మూడు నా స్వరూపమే. మనము అథర్వ వేదమును, స్మృతి పురాణాదుల నన్నింటిని గూడ జోడించవచ్చును. ఈ వేదముల రూపములో నున్న జ్ఞానరాశి నేనే.

కర్మ తానేననియు, కర్మను చేయు విధి విధానము తన స్వరూపమే ననియు, మరియు కర్మఫలముల నిచ్చునది కూడ తానేననియు భగవానుడు ఇంతకు ముందే చెప్పియున్నాడు. భగవానుడు ఇపుడు ఇంకనూ ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 18:**

गतिर्भर्ता प्रभुस्साक्षी निवासश्शरणं सुहृत् ।
प्रभवः प्रलयस्स्थानं निधानं बीजमव्ययम् ॥ १८ ॥

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయస్స్థానం నిధానం బీజమవ్యయమ్ (18)

**గతిః** = లక్ష్యము, సర్వకర్మల ఫలము; **భర్తా** = పోషించువాడు; **ప్రభుః** = అధీశ్వరుడు; సర్వ సంపదలకు నిధానము; **సాక్షీ** = సాక్షి; **నివాసః** = నివాసస్థానము; **శరణం** = శరణు నిచ్చువాడు; **సుహృత్** = స్వభావము చేతనే ఉపకారమును చేయువాడు; **ప్రభవః** = సృష్టికి మూలమైనవాడు; **ప్రలయః** = సృష్టి లయమగు స్థానము; **స్థానం** = జగత్తునకు ఆశ్రయమైన వాడు; **నిధానం** = సర్వమునకు అధిష్ఠానమైనవాడు; **అవ్యయమ్** = వినాశము లేని; **బీజం** = కారణము.

సర్వ కర్మల ఫలము, లక్ష్యము నేనే. పోషించు అధీశ్వరుడు, సర్వసంపదలకు నిలయము నేనే. సాక్షి, నివాసస్థానము, శరణము నేనే. నేను స్వభావము చేతనే ఉపకారమును చేసెదను. సృష్టి నా నుండి బయలుదేరి, నా యందు ఉన్నదై, నా యందు లీనమగును. జగత్తునకు ఆశ్రయము, సర్వమునకు అధిష్ఠానము నేనే. వినాశము లేని ఆది కారణము నేనే (18).

గతి (కర్మఫలము) నేనే. మానవులు ప్రయత్నము చేసి పొందే లక్ష్యము లన్నియూ నేనే. స్వర్గాది లోకము లేవియూ నా కంటె వేరుగా లేవు. అవి అన్నియూ నా విశ్వరూపములో అంతర్గతములుగా ఉండే దేశములు మాత్రమే. పరమేశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదు.

ఈ జగత్తును భరించి, పోషించువాడను (భర్తా) నేనే. భర్త అను పదమును మొగుడు అను అర్థములో వాడెదరు. పూర్వకాలములో పురుషుడు మాత్రమే సంపాదించి కుటుంబమును పోషించుటచే, ఈ ప్రయోగము స్థిరపడినది. సర్వమును శాసించువాడు, సర్వ విభూతులు గలవాడు ప్రభువు అనబడును. ఈ జగత్తులో భగవానుడు తక్క మరియొక ప్రభువు లేడు. 'నేను ధనవంతుడను' అని భావించే వ్యక్తి పొరబడుచున్నాడు. మానవుల సంపద లన్నియూ పూర్ణముగా భగవానునిపై ఆధారపడును. సర్వ సంపదలకు మూలాధారము ఆ భగవానుడే.

సాక్షిని నేనే. సృష్టిని భరించి పోషించే భర్త, సృష్టిని ఉపసంహరించే సంహారకర్త, మరల సృష్టిని చేసే సృష్టి కర్త నేనే. అయిననూ, నేను ఏ క్రియను చేయని సాక్షిని మాత్రమే. కావుననే, నాకు, నీకు అభేదము పొసగుచున్నది.

ఓ భగవాన్! నీవు నన్ను ఇట్లేల సృజించితివి? ఇప్పుడున్న స్థానములో గాక మరియొక స్థానములో నన్నేల సృజించవైతివి? అని మనము సృష్టికర్తయగు పరమేశ్వరునకు ఫిర్యాదు చేయవచ్చును. 'నేను సాక్షిని. దానికి నేను బాధ్యుడను కాను. అది అంతయూ నీ కర్మయే' అని భగవానుని సమాధానము.

నేను సృజింపబడితినా? అనునది యథార్థమగు ప్రశ్న. నీవు సృజింపబడినచో ఈ ప్రశ్నలన్నియూ ఉదయించును. ఇది అంతయూ కర్మ ప్రకారముగనే యున్నదని భగవానుడు సమాధానమునిచ్చెను. 'నేను సృష్టింపబడితినా?' అని నీవు ప్రశ్నించే పక్షములో, 'ఇట్లేల యున్నది?' అను ప్రశ్నకు తావు లేదు.

ఈ ప్రశ్నలకు వివిధ స్థాయిలలో సమాధానమీయబడును. నీవు సృష్టింపబడుటను అంగీకరించే పక్షంలో, నీ స్థితికి మూలములో నున్న రూపరేఖ (blue print) నీవు నిర్మించుకున్నదియే. దాని విషయములో భగవానుడు చేయగల్గినది లేదు. నీవు భవిష్యత్తులో పరిస్థితిలో మెరుగుదలను గోరి భగవానుని ప్రార్థించవచ్చును. కాని ప్రస్తుత స్థితిలో మార్పు సంభవము కాదు. నీవు దర్జీ వానికి నీ కొలతల నిచ్చి, ఇంతలోనే శరీరమును పెంచినచో, ఆ అంగీ నీకు సానుకూలముగా నుండబోదు. కాని దానిలో దోషము దర్జీవానిది కాదు. నీవు కోరిన విధముగనే అతడు అంగీని కుట్టినాడు. కాని 'నేను సృజింపబడితినా?' అను ప్రశ్నను నీవు వేసినచో, ఈ ప్రశ్న 'నిన్ను నీ మౌలిక స్వరూపములోనికి తీసుకువెళ్లును. నేను సృజింపబడలేదు. సర్వమునకు కారణమగు (అహం సర్వస్య కారణమ్) సాక్షిని నేనే.

సాక్షి అనగా రెండవ అర్థము గలదు. మనము చేయు పుణ్య పాపకర్మల ఖాతాను నిర్వహించువాడు సాక్షి యనబడును. మనము భగవానుని దృష్టి నుండి తప్పించుకొనలేము. మనుష్యుల దృష్టిలో పడకుండా మనము తప్పించుకొనగల్గినమా, భగవానుడు చూచి తీరును. భగవానుడు కర్మ నియతి రూపములో నున్నవాడై మానవుల కర్మలను ఖాతాలో జమ చేయుచుండును. కావుననే, భగవానుడు సర్వజ్ఞుడు, సాక్షి యనబడును.

నివాసః. మనము మకాము చేసే ఇంటికి నివాసమని పేరు. ప్రస్తుతంలో నివాసమనగా ప్రాణులు నివసించు స్థానమని శ్రీ శంకరులు వివరించిరి. మనము భూగోళముపై ఇంటిలో నివసిస్తాము. భూమి సౌరమండలములో నివసించియున్నది. సౌరవ్యవస్థ గెలాక్సీలో నివసించియున్నది. ఈ గెలాక్సీలు ఎచట నివసించి యున్నవి? నా యందు. ఈ సృష్టికంతకూ ఆశ్రయము నేనే. ఏలయన, సర్వమునకు అధిష్ఠానము నేనే.

శరణమ్. భగవానుడు అంతిమ శరణ్య స్థానము. స్వర్గము లభించినమా, అది తాత్కాలిక శరణము మాత్రమే అగును. స్వర్గలోకవాసి యగు జీవుడు కాలక్రమంలో స్వర్గము నుండి చ్యుతుడై భూలోకమునకు రావచ్చును. భూమికి, స్వర్గమునకు మధ్యలో జీవుడు తిరుగాడుచుండును. ఇది ఏటి శరణ్యము? మానవునకు ఎచ్చోట పూర్తి విశ్రాంతి లభించునో, ఎచట నుండి మానవుడు త్రోసివేయబడడో, అట్టి స్థానమును శరణమనదగును. అదియే అంతిమ శరణ స్థానము. ఇచట శరణమనగా మానవుని సంసారదుఃఖము నుండి పూర్ణముగా ముక్తుని చేయు అంతిమ శరణ స్థానమని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి.

సుహృత్. భగవానునకు సుహృత్ అని పేరు. మనమీ విషయమును ఆరవ అధ్యాయములో చూచియున్నాము. ప్రత్యుపకార అపేక్ష లేకుండా ఇతరునకు, మిత్రుడు కాకపోయినా, ఉపకారమును చేయువాడు సుహృత్ అనబడును. తెలిసియున్న మిత్రునకు ఉపకారమును చేయుట సహజము. అట్లు సహాయమును చేయువాడు మిత్రుడనబడును. మనము మిత్రుని యందలి ప్రేమచే, మైత్రీభావనా ప్రేరితులమై ఉపకారమును చేస్తాము. మిత్రుడు కష్టపడితే, అది మన కష్టమే యగును. కావున, మిత్రునకు సహాయపడుట సహజము. అందరూ దానిని అపేక్షిస్తారు కూడా. కాని సుహృత్ ముక్కు మొహం తెలియని వాడు. అతడు మనకు పూర్తిగా కొత్తవాడై ఉంటాడు. పైగా, అతడు మనలను మొదటిసారిగా చూచుచుండవచ్చును. కాని అది అతనికి చాలును. అతడు చేయగల్గిన సాహాయ్యమును చేయును. అతడే భగవానుడు. అతడే గొప్ప సుహృత్. అతనిని

మనము ఏ సాహాయ్యమునైననూ కోరవచ్చును. అతనితో పరిచయము కలుగు వరకు వేచియుండ బనిలేదు. మధ్యవర్తుల సిఫారసుతో బనిలేదు. అనేక జన్మల పరిచయము గలవానిని వలె అతనిని తిన్నగా సాహాయ్యమును కోరవచ్చును. ఇట్టి సుహృత్ ఎవరైననూ భగవానుడే.

ప్రభవః ప్రలయస్స్థానమ్*. ఈ జగత్తంతయూ నా నుండియే ఉదయించును (ప్రభవః). ఈ సర్వము నా యందే లీనమగును (ప్రలయః). ఈ సర్వము నాచేతనే ధరింపబడి, నా యందే ఉనికిని కలిగియున్నది (స్థానమ్).

నిధానమ్. సర్వ సృష్టికి కారణమగు బ్రహ్మ యందు మార్పులు కలుగకుండునా? అను శంక ఉదయించవచ్చును. నిధానమ్ అను పదము ఈ ప్రశ్నకు సమాధానము నిచ్చును. నిధానమనగా సర్వకారణములు, కార్యములు ఉనికిని పొందే అధిష్ఠానము. అనగా బ్రహ్మ. బ్రహ్మలో మార్పులేమియు లేకుండగనే, జగదపేక్షయా సృష్టికర్త యనబడును. బ్రహ్మయందు మార్పులు లేకపోవుట చేతనే నిధానమని పేరు వచ్చినది. దేని యందు సర్వము నిహితమగునో, అనగా అధ్యారోపముచేయబడునో, అది నిధానమగును. అదియే పరబ్రహ్మ.

అవ్యయం బీజమ్. ఈ నామరూపాత్మక కార్యప్రపంచమంతయూ పరివర్తనశీలమై నశించును (వ్యయమ్). కాని దాని కారణము నశించదు (అవ్యయమ్). అనగా సంసారమున్నంత వరకు అవ్యయబీజము ఉండును. ఏ నిర్విభాగ బీజము నుండి సర్వజగత్తు ఉద్భవించుచున్నదో, అట్టి బీజము నేనే. జగత్తు అంకురమన్నచో నేనే దాని బీజము అగుదును. అనగా జగత్తు నా యందు అవ్యక్తరూపములో నామరూప విభాగరహితముగ నున్నది. భగవానుడు ఏతత్పూర్వములో సృష్టిహేతువును గురించి, సృష్టి యొక్క పాలన పోషణ గురించి (సృష్టి స్థితి కారణమ్) చెప్పియున్నాడు. కావున, ఇచట అయన ప్రలయమును గురించి ప్రత్యేకముగా చెప్పుచున్నాడు. సర్వము దానిలో లీనమై, దాని నుండి మరల ఆవిర్భవించును గాన అది అవ్యయ కారణమగును. వృక్షబీజములో వృక్షము అవ్యక్తరూపములో నుండును. అదే విధముగా, ప్రలయావస్థలో నామరూప విభాగము లేని అవ్యయ బీజము నేనే.

భగవానుడు తన విశ్వతోముఖత్వమును ఇంకనూ వివరించుచూ, ఇట్లనుచున్నాడు:

---

* ప్రభవః = ఉత్పత్తిర్నిర్గతః యస్మాత్; ప్రలయః = ప్రలీయతే అస్మిన్; స్థానమ్ = తిష్ఠతి అస్మిన్.

**అధ్యాయము 9, శ్లోకము 19:**

तपाम्यहमहं वर्षं निगृह्णाम्युत्सृजामि च ।
अमृतं चैव मृत्युश्च सदसच्चाहमर्जुन ॥ १९ ॥

తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున (19)

**అర్జున** = ఓ అర్జునా!; **అహం** = నేను; **తపామి** = లోకములకు వేడిని ఇచ్చెదను; **అహం** = నేను; **వర్షం** = వర్షమును; **నిగృహ్ణామి** = ఆపివేయుదును; **చ** = మరియు; **ఉత్సృజామి** = విడిచిపెట్టెదను; **చ** = మరియు; **అమృతం ఏవ** = అమృతస్వరూపము నేనే; **మృత్యుః చ** = మృత్యువు కూడా నేనే; **సత్** = కార్యము; **చ** = మరియు; **అసత్** = కారణము; **అహం** = నేనే.

ఓ అర్జునా! లోకములకు (సూర్యుని రూపములో) వేడిని ఇచ్చువాడను నేనే. వర్షమును ఆపివేయునది, విడిచిపెట్టునది నేనే. అమృత స్వరూపము నేనే. మృత్యువు కూడా నేనే. కారణ కార్యములు నేనే (19).

అహం తపామి. జగత్తునకు కావలసిన శక్తిని ఇచ్చి, ప్రకాశింపజేయునది నేనే. సూర్యరూపములో నున్న నేను జగత్తునకు కాంతిని, మరియు వేడిని ఇచ్చుచున్నాను. ఈ వేడి వలన నీరు ఆవిరిగా మారి, వర్షములు కురియును. ఇది ఒక చక్రము. భూమి ఎండి బీటలు దీయును. నీరు ఆవిరియగును. అపుడు భూమిని అట్లు ఎండించిన నేను వర్షమును నియంత్రించే ప్రకృతి ధర్మరూపములో నున్నవాడనై, వర్షమును విడిచిపెట్టెదను. తరువాత మరల దానిని ఉపసంహరించెదను. అనగా వర్షము కురియకుండునట్లు చేసెదను (నిగృహ్ణామి). ఈ పరిస్థితి భారతదేశములో సుస్పష్టముగా గోచరించును. భగవానుడు వరుసగా ఎనిమిది మాసములు వర్షము లేకుండగా చేసి, తరువాత ఋతుపవనములు వీచుట ఆరంభము కాగానే నాల్గుమాసములు కుంభవృష్టిని కురిపించును. అనగా ఈ ఋతువులు ఈశ్వరస్వరూపమే. ఋతువులకు చాల ప్రాముఖ్యము గలదు. విస్తృతమగు ప్రకృతి నియమరచనలో, మనము పూర్వానుమానము (prediction) చేయగలిగే వాటిలో ఋతువులు ఒకటి. మనము పూర్వానుమానము చేయగల్గుటకు, అవి నియమానుసారముగా ప్రవర్తిల్లుటయే హేతువు. ఆ నియమములు నేనే నని భగవానుడు చెప్పుచున్నాడు.

అమృతం చ ఏవ. దేవతలు ఏ పుణ్యముచే దేవతలై అమరులై ఆనందించుచున్నారో, ఆ పుణ్యము నేనే.

మృత్యుః చ. ఏ పుణ్యపాపములచే ఈ ప్రాణులు పుట్టి గిట్టుచున్నవో, ఆ పుణ్యపాపములు నేనే. మరియు, మృత్యు నియతి, లేదా మృత్యుధర్మము నేనే. యమధర్మరాజు నేనే. మనము భగవానుని నుండి తప్పించుకొనలేము. మనిషి మరణించును. ఆ మరణము నేనే. మృత్యువు మాత్రమే గాక, ప్రాణము (అమృతము) కూడా నేనే. భగవానుడు ఈ తన స్వరూపమును రెండు పదములలో చెప్పినాడు. సదసచ్చాహమర్జున. మనము గుర్తించగలిగే రూపమును కలిగియుండి ఘటము, వృక్షము, వస్త్రము ఇత్యాది నామము గల వస్తువు సత్ అనబడును. ఈ ప్రకరణములో అసత్ అనగా ఉనికి లేనిది అని అర్థము కాదు. నామరూపములు వ్యక్తమగుటకు ముందు ఉన్న తత్త్వము అసత్ అనబడును. మరోమాటలో చెప్పాలంటే, అసత్ అనగా కారణము. సత్ అనగా కార్యము. నేను కారణము (అసత్) కాదు, కార్యము (సత్) కాదు అని భగవానుడు తరువాత చెప్పబోతాడు. కాని, అదే సమయములో 'కారణకార్యములు నేనే' అని కూడా భగవానుడు చెప్తాడు. ఈ పరస్పర విరుద్ధములగు రెండు విచారధారలు మనకు గీతలో నిరంతరంగా కనబడును. వీటి తాత్పర్యము నెరుంగుట చాల ముఖ్యము. నేను కారణము కాదు, కార్యము కాదు అనే నిషేధము ఒకటి. కారణము నేనే, కార్యము నేనే అనునది రెండవది. ఈ రెండింటినీ భగవానుడు చెప్పవలసియున్నది. ఈ కారణ కార్యవాదము వలన నేనే సత్యమనియు, మిగిలిన దంతయూ మిథ్య అనియు, అట్టి మిథ్య సత్యము కంటె వేరుగాదనియు నిర్దేశించును. కావున, అవ్యక్తకారణము నేనే. సృష్టింపబడిన కార్యము కూడా నేనే. వాస్తవంలో నేను వీటన్నింటి నుండి విముక్తుడను. ఏలయన, ఈ రెండింటికీ అధిష్ఠానము నేనే. ఈ శ్లోకములోని అసత్ మరియు సత్ రెండు మిథ్యయే. రెండు నేనే అని చెప్పుటచే కారణ కార్యములు నిషేధింపబడినవి.

వేదముల యందు, యజ్ఞముల యందు, ప్రార్థనల యందు మరియు మరణానంతర గతి యందు శ్రద్ధ గలవారు, కాని అజ్ఞానులు అగువారి గురించి భగవానుడిప్పుడు చెప్పుచున్నాడు. అట్టి శ్రద్ధ కలుగుటకైననూ కొంత పరిపక్వత ఉండాలి. కాని ఈ పరిపక్వత వివేకమునకు చాలదు. వారిని గురించి భగవానుడే తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు.

**అధ్యాయము 9, శ్లోకము 20:**

त्रैविद्या मां सोमपाः पूतपापा यज्ञैरिष्ट्वा स्वर्गतिं प्रार्थयन्ते ।
ते पुण्यमासाद्य सुरेन्द्रलोकमश्नन्ति दिव्यान् दिवि देवभोगान् ॥ २० ॥

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్ (20)

**త్రై విద్యాః** = మూడువేదములనెరింగినవారు; **సోమపాః** = సోమయాగమును చేసినవారై; **పూతపాపాః** = పాపముల నుండి విశుద్ధిని పొందినవారై; **మాం** = నన్ను; **యజ్ఞైః** = యజ్ఞములచే; **ఇష్ట్వా** = ఆరాధించి; **స్వర్గతిం** = స్వర్గమునకు వెళ్లుటను; **ప్రార్థయంతే** = ప్రార్థించెదరు; **తే** = వారు; **పుణ్యం** = పుణ్యఫలమగు; **సురేంద్రలోకమ్** = దేవేంద్రలోకమును; **ఆసాద్య** = పొంది; **దివి** = స్వర్గము నందు; **దివ్యాన్** = దివ్యములగు; **దేవ భోగాన్** = దేవతా సుఖములను; **అశ్నంతి** = భోగించెదరు.

> మూడు వేదముల నెరింగినవారు సోమయాగమును చేసి పాపముల నుండి విశుద్ధులై నన్ను యజ్ఞములచే ఆరాధించి స్వర్గప్రాప్తిని ప్రార్థించెదరు. వారు పుణ్య ఫలరూపమగు దేవేంద్రలోకమును పొంది అచట దివ్యములగు దేవ భోగముల ననుభవించెదరు (20).

త్రైవిద్యాః. ఋగ్యజుస్సామములను మూడు వేదములను చదివినవారు. ప్రతివేదము ఒక విద్య. మూడు కలిస్తే త్రివిద్యాః అగును. ఈ మూడు వేదములను వల్లెవేసి, బహుశః వాటిలో చెప్పిన యజ్ఞాదులను చేయు విధానము నెరింగినవారు త్రైవిద్యాః అనబడుదురు.

సోమపాః. అనువాదములు తప్పు త్రోవ పట్టించే సందర్భమునకు ఇది ఒక చక్కని దృష్టాంతము. 'ఋగ్యజుస్సామ వేదములను వల్లించి వాటి అర్థము నెరింగి, వారు సోమరసమును త్రాగి, దాని ప్రభావముచే పాపములను పోగొట్టుకొనెదరు' అని అనువదించే అవకాశము గలదు. 'తేనైవ సోమపానేన పూత పాపాశ్శుద్ధ కిల్బిషాః (ఆ సోమపానము చేతనే వారి పాపములన్నియూ క్షాళన అయినవి)' అని శ్రీ శంకరుల భాష్యములోని వాక్యము. ఇచట సోమపాన పదము పారిభాషిక ప్రయోగము. దీని యర్థమేమి? పుణ్యలోక ప్రాప్తి కొరకై ఆచరించబడే సోమయాగమనే క్రతువు ఒకటి గలదు. ఆ క్రతువులో సోమమనబడే లత యొక్క రసమును పరమేశ్వరునకు హోమము

చేసి, మిగిలిన(శేష) రస లేశమును యాజ్ఞికులు భగవత్ప్రసాదముగా స్వీకరింతురు. ఈ యజ్ఞమును చేయువారు, మరియు పాల్గొనువారు సోమపాః అనబడుదురు. కావున, సోమపాః అనగా ఈ క్రతువులను చేసినవారని అర్థము. సోమరసమును త్రాగువారని కాదు.

ఇట్టి వారి యందు ఇతరులతో పోలిస్తే, పాపములు తక్కువగా నుండుటచే వీరు 'పూతపాపాః' అనబడుదురు. ఈ పవిత్రత రాగద్వేష నివృత్తి రూపమైనది గాదు. వారు శ్రద్ధావంతులగుటచే, కామనా ప్రేరితులై ఈ క్రతువులను (కామ్యకర్మలను) చేయుట ద్వారా, చేయరాని పనులకు (నిషిద్ధ కర్మలకు) దూరముగా నుండెదరు. ఈ కర్మలు వైదికములు, ధర్మానురూపములు గనుక, ఇట్లుండుటలో తప్పేమీ లేదు. వారు నిత్య నైమిత్తిక కర్మలను కూడ చేయుదురు గాన, ఏవేని కొన్ని పాపములను వారు ఆచరించిననూ, ఈ నిత్యకర్మలు వారిని శుద్ధులను చేయుచుండును. కావుననే, వారు తొలగిన పాపములు గలవారై (పూతపాపాః) యజ్ఞములను చేయగల్గుదురు. వారు ఘోరకృత్యములను వేటినీ ఆచరించరు. చిన్న చిన్న తప్పులను ఆచరించిననూ, నిత్య నైమిత్తిక కర్మానుష్ఠానముచే ఆ దోషములు నిష్ప్రభావితము అగును. ఇది చాల అద్భుత జీవనము.

వారు చేసేది కామ్యకర్మయే అయినా, వారు ధర్మమును పాలించుచున్నంతవరకు సమస్య లేదు. ఒకనాడు వారికి వివేకము ఉదయించగలదు. వర్తమానములో వారికి వివేకము లేదు. ఏలయన, వారీ యజ్ఞములను పుణ్యలోక ప్రాప్తి కొరకు చేయుచున్నారు గదా! అనగా, వారు కర్మయోగులు కాదు. వారు భక్తి శ్రద్ధలు గలవారే. అయినా, తాము యథార్థముగా అన్వేషించునది ఏది అను విషయములో నిశ్చయజ్ఞానము లేనివారగుటచే, వారు స్వర్గాది లక్ష్యములను పొందుట యందు మాత్రమే అభిరుచిని కలిగియుందురు. వారికి పురుషార్థ నిశ్చయము లేదు. అర్థకామములు, ధర్మము వారికి అతి ప్రముఖములగు విషయములగును. వాస్తవంలో ఇవి నిస్సారములు. కాని వారికి తాము కోరేది వాస్తవంగా ఏది అను వివేకము లేకపోవుటచే, వారు నిస్సారములగు వాటి వెంట పడెదరు. వారు ధర్మార్థ కామముల ద్వారా వాస్తవములో మోక్షమునే గోరుచున్నారు. కాని, 'నేను వాస్తవముగా అన్వేషకుడనేనా? నేను ఏల అన్వేషకుడనైనాను?' అను ప్రశ్నలను వారు వేసుకోరు గనుక, వారి అన్వేషణలకు ఈ మూడు ప్రముఖ లక్ష్యములగును.

మాం యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే. ఇంద్రవరుణ అగ్ని ఇత్యాది దేవతలందరి రూపములో నున్న నన్ను పరమేశ్వరుని వారు ప్రార్థించెదరు. అగ్నిష్టోమము మొదలగు వివిధ

యజ్ఞములచే వారు నన్ను ఆరాధించి (యజ్ఞైః మాం ఇష్ట్వా), వారు కోరేది (ప్రార్థయన్తే) ఏది? స్వర్గమనే లక్ష్యమును (స్వర్గతిం) వారు కోరెదరు. స్వర్గములో అనేక ఆహ్లాదకరమగు అనుభవములు కలుగుననియు, అచట చిరకాలము యౌవనముతో నుండగల్గుదుమనియు వారు వినియున్నారు. అది ఒక సాపేక్షిక అమృతత్వము వంటిది. స్వర్గమును గురించి ఇట్టి ఆకర్షకములగు వర్ణనలు వేదములలోనే గాక, పురాణాదుల యందు కూడ గలవు. కావున, వారు ఏమీ ఆలోచించకుండగా, స్వర్గప్రాప్తి కొరకై భగవానుని ఆరాధించుట సహజమే.

తే పుణ్యమాసాద్య సురేంద్రలోకమ్. దేవతలందరికీ ప్రభువగు ఇంద్రుని లోకమును (సురేంద్రలోకమ్) వారు పొందెదరు. ఈ లోకము పుణ్యఫల రూపముగా లభించును గాన, దీనికి పుణ్యలోకమని పేరు. పుణ్యము ఉంటే చాలదు. దానిని సుఖరూపముగా మార్చుకోగలగాలి. ఇట్లు, ఉంత కొలను, మారుతీకారు ఇత్యాది రూపములలోనికి పుణ్యమును మనము మార్చుకోవాలి. ఇవి అన్నీ పుణ్యఫలములే. వారు యజ్ఞాదుల నన్నిటినీ చేసి పుణ్యమును సంపాదిస్తారు. ఆ పుణ్యమునకు ఫలము సురేంద్రలోకము. వారచటకు చేరి ఏమి చేస్తారు?

అశ్నన్తి. వారు కన్నులతో మరియు చెవులతో అనుభవిస్తారు. స్వర్గములో దేవతలు చూపులతో మాత్రమే తృప్తిని చెందుతారట! ఆకలి వేసినప్పుడు భుజించనక్కరలేదు. ఆహారపదార్థము లన్నిటినీ చూచినచో చాలును! ఇంతేగాక, అచట సంగీతము మొదలగు మరింత చతుర సుఖములు కూడ ఉండును. స్వర్గములో ఇంద్రియములు ప్రముఖపాత్రను వహించును. అవి పొందే సుఖములు అసాధారణమైనవి.

దివ్యాన్ దివి దేవ భోగాన్. దివ్యాన్ అనగా దేవలోకమునందు లభించునవి. ఆ భోగము లిచట తెలిసేవి గావని శ్రీ శంకరులు వివరించిరి. ఇచటి సంగీతనృత్యములు అచట దేవతలు భోగించే సంగీతనృత్యముల ముందు దిగదుడుపు. అవి దివ్య భోగములు. ఇహలోకభోగములు గావు. ఎచట? స్వర్గము నందు. అవి దేవతలకు మాత్రమే లభించును (దేవభోగాన్). మర్త్యులకు అందుబాటు కావు.

కాని వాటిలో ఒక దోషము దాగియున్నది. భగవానుడు తరువాతి శ్లోకములో దానిని వివరింపనున్నాడు:

**అధ్యాయము 9, శ్లోకము 21:**

ते तं भुक्त्वा स्वर्गलोकं विशालं क्षीणे पुण्ये मर्त्यलोकं विशन्ति ।
एवं त्रयीधर्ममनु प्रपन्ना गतागतं कामकामा लभन्ते ॥ २१ ॥

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి**
**ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నా గతాగతం కామాకామా లభంతే (21).**

**తే** = వారు; **తం** = ఆ; **విశాలం** = విశాలమైన; **స్వర్గలోకం** = స్వర్గలోకమును; **భుక్త్వా** = భోగించి; **పుణ్యే** = పుణ్యము; **క్షీణే** = ఖర్చుకాగానే; **మర్త్యలోకం** = మనుష్యలోకమును; **విశంతి** = ప్రవేశించెదరు; **ఏవం** = ఈ విధముగా; **కామకామాః** = వివిధ భోగముల యందు కామన గలవారు; **త్రయీధర్మం** = వేదోక్త కర్మరూప ధర్మమును; **అనుప్రపన్నాః** = అనుష్ఠించువారై; **గతాగతం** = రాకపోకలతో గూడిన సంసారమును; **లభంతే** = పొందెదరు.

వారా విశాలమైన స్వర్గలోకమును భోగించి, పుణ్యము ఖర్చుకాగానే మనుష్యలోకమును ప్రవేశించెదరు. ఈ విధముగా, వివిధ భోగములయందు కామన గలవారు వేదోక్త కర్మల రూపములో నున్న ధర్మమును అనుష్ఠించువారై రాకపోకలతో గూడిన సంసారమును పొందెదరు (21).

స్వర్గలోకం విశాలమ్. స్వర్గలోకము చాల విశాలమైనది. సమృద్ధి, వైచిత్రి మరియు కాలము అను వాటి దృష్ట్యా స్వర్గము విశాలమని చెప్పబడినది. ఈ విశాల స్వర్గలోకము ననుభవించిన పిదప (భుక్త్వా), పుణ్యము అంతయూ ఖర్చు అయిన తరువాత (క్షీణే పుణ్యే), వారేమి చేస్తారు? వారు క్రిందకు త్రోసివేయబడి, మర్త్యలోకమును ప్రవేశించెదరు. అంతే. స్వర్గములో ఉండగా, వారికి తాము అమృతులమే ననిపించినది. కాని, హఠాత్తుగా, వారు మర్త్యులగుదురు. వారు మరో ప్రపంచములోనికి అడుగిడెదరు. ఇచటి దేహము, పుట్టుక, బాల్యము, అనేకములగు ఇతర సమస్యలు ఇత్యాది సర్వము భిన్నముగా నున్నది. ఇచట మృత్యువు స్వైరవిహారము చేయుచున్నది. ఇక్కడ క్రిమికీటకములు అధికము. ఇచటి మనుష్యులు విసిగిస్తున్నారు. మరణము ఇచటి నియమమై యున్నది. పరివర్తనము ఇచటి నిత్యధర్మము. ఎచ్చటి నుండి పారిపోవాలని వారు కోరిరో, అచ్చటికి వారు మరల వచ్చినారు. తిరిగి తిరిగి ఆరంభబిందువు వద్ద తేలినారు. ఈ సత్యము నెరింగినవానిలో వివేక వైరాగ్యములు వర్ధిల్లును. మనలను అంతర్ముఖులను చేయుట కొరకై ఈ

శ్లోకము లన్నియూ ఉద్దేశింపబడినవి. మానవుడు మరోగతి లేక మోక్షకామి యగువరకు, శాస్త్రము మానవుని ఇట్టి కష్టములలోనికి నెట్టుచుండును.

వీరు స్వర్గమునకు వెళ్ళుటకు హేతువు పుణ్యము. కాన, ఆ కారణము మిగిలి యున్నంతవరకు వీరు స్వర్గములో నివసించవచ్చును. వారు పూర్వజన్మలో పుణ్యకర్మలను చేయుటచే స్వర్గలోకములో నివసించ యోగ్యమైన స్థూలదేహము లభించినది. తరువాత వారు అనుభవించే ప్రతి భోగమునకు కొంత కొంత పుణ్యము చొప్పున ఖర్చు అగుచుండును. ఈ పుణ్యము పూర్తిగా ఖర్చు కాగానే (క్షీణే పుణ్యే), వారు మర్త్యలోకమునకు మరలి వచ్చెదరు. దీనిని బట్టి అమృతలోకమనబడే స్వర్గము వాస్తవముగా అమృతము కాదని తెలియుచున్నది. ఈ విషయములోనే మానవులు తరచుగా తప్పిదమును చేస్తారు. స్వర్గము అమృతమని శాస్త్రము చెప్పుచున్నది. అమృతమనగా మరణము లేనిది యని అర్థము గదా! కావున స్వర్గము శాశ్వతము అని జనులు భ్రమించెదరు. కాని ఈ అమృతత్వము సాపేక్షికము మాత్రమే. మన కాలమానము ప్రకారంగా చూస్తే, స్వర్గము సాపేక్షికమగు అమృతత్వము కలది యగును. దేవతల దినము మన దినము కంటె చాల అధిక ప్రమాణము గలది. స్వర్గము అమృతలోకము అనే ఈ వైదిక భావనను మతము లన్నియూ తమ స్వంతము చేసుకున్నవి. కాని ఈ అమృతత్వము ఒక విశిష్టకాలమానాపేక్షమైనది. ఇది కాలాతీతము గాదు. మోక్షము గాదు. ఇందువలననే పుణ్యాత్ములు పుణ్యప్రభావముచే స్వర్గమును పొంది, అచట కొంతకాలము స్వర్గ భోగముల ననుభవిస్తూ ఉంటే, ఆ పుణ్యము ఖర్చు అయిపోవుటచే, వారు మరలివచ్చెదరు. మరియు, అచట వారి యందు భోక్తృత్వమే గాని కర్తృత్వము ఉండదు గాన, స్వర్గములో పుణ్యకర్మలను చేయుటకు వీలుండదు. కావున, అచట వారు తమ నివాసకాలమును పొడిగించే అవకాశము లేనే లేదు. కావున, వారు మరలివచ్చెదరు.

ఏవం త్రయీ ధర్మమను ప్రపన్నాః అనగా, ఈ విధముగా వేదవిహితములగు యజ్ఞాది కర్మల ననుష్ఠించువారు. ఏవమ్ అనగా పూర్వ శ్లోకములో చెప్పిన తీరున సోమయాగము మొదలగు క్రతువుల ననుష్ఠించి పాపమును పరిహరించినవారు. మూడు రకముల వేదములకు త్రయీ అని పేరు. పుణ్యలోక ప్రాప్తి మొదలగు ఫలముల నాశించి ఈశ్వరుని, లేదా దేవతలను ఆరాధిస్తూ చేసే వేదవిహిత కర్మలకు ధర్మమని పేరు. ఆ కర్మలు ధర్మ విరుద్ధములు కావు (ధర్మాదనపేతమ్) గనుక, వాటికి ధర్మమని పేరు. వీరు ధర్మబద్ధమగు సుఖములను మాత్రమే సంపాదించి భోగింతురు.

వేదములో రెండు కాండలు గలవు. మొదటిది కర్మకాండ. ఉపాసన కూడా దీనిలో నంతర్గతమగును. రెండవది జ్ఞానకాండ. ఇచట శ్రీకృష్ణుడు వేదవిహిత కర్మల నాచరించువారిని

గురించి మాత్రమే చెప్పుచున్నాడు. జ్ఞానుల గురించి కాదు. జ్ఞానము త్రయీ ధర్మాంతర్గతమైనదే అయినా, ఈ ప్రకరణములో త్రయీ ధర్మ శబ్దమునకు కర్మ అనియే అర్థమును చెప్పవలెను. అనుప్రపన్నాః అనగా మూడు వేదములలో విధింపబడిన వివిధ కర్మల ననుష్ఠించువారు అని యర్థము. వీరిని భగవానుడింకనూ వర్ణించుచున్నాడు.

కామ కామాః. మనము ఒక వస్తువును కాంక్షించే మానసిక ప్రక్రియ కామమనబడును. కామము అనగా కోరబడే వస్తువు అని కూడా అర్థము గలదు. కామకామాః అనగా వివిధ వస్తువులను కోరువారు అని యర్థము. కోరికలను కోరువారు అని గాదు. మనము కోర్కెలను కోరబని లేదు. అవి సదా మనతో నుండును. కావున, విభిన్న వస్తువులను గోరువారు కామకామాః అనబడుదురు. వేదము అనేక వస్తువులను వర్ణించును. కాని మానవుడు తన పరిపక్వతకు, వివేకమునకు అనురూపముగా తాను ఎన్నుకున్న కోర్కెలను మాత్రమే తీర్చుకొనుటకు యత్నించును. మనము సూపర్‌బజారుకు వెళ్లినప్పుడు ఏ వస్తువులను కొనెదము? మనకు అభిరుచి గలవాటిని మాత్రమే కొంటాము. కేశవర్ధక తైలము అమ్మకమునకు ఉన్ననూ, బట్టతలవాడు దానిని కొనడు గదా! ప్రకృతంలో, వీరు పరిచ్ఛిన్నములగు లక్ష్యములను మాత్రమే గోరువారై, మూడు వేదములలో వర్ణింపబడిన వివిధ కర్మలను శ్రద్ధతో అనుష్ఠించెదరు.

మూడు వేదములలో సన్న్యాసము, మోక్షము అను అంశముల వర్ణన కూడ గలదు. కాని ఇచటి ప్రకరణము అది కాదనియు, ఈ వర్ణన సన్న్యాసిని గురించి కాదనియు శ్రీ శంకరులు సూచించిరి. భగవానుడు కామకామాః అని ప్రయోగించుటచే, వీరు మోక్షకాములు గాదని మనకు స్పష్టమగుచున్నది. అట్లుగానిచో ముముక్షువులు కూడా త్రయీ ధర్మాను ప్రపన్నులలో అంతర్భూతులై ఉండెడివారు.

### వారి శ్రమకు లభించిన సంమెట్టిది?

గతాగతం లభన్తే. వారు వెళ్లినారు. మరలి వచ్చినారు. వారు పొందినది ఇది. వారు వెళ్లుటచే తిరిగివచ్చుట తప్పనిసరి అయినది. ఈ రాకపోకలతో గూడిన జీవగతికి గతాగతమని పేరు. గతం చ ఆగతం చ గతాగతమ్. సంసారమనగా నిదియే. వివిధ వస్తువులను కోరే ఈ వ్యక్తులు పొందేది సంసారమే గాని, స్వాతంత్ర్యము కాదు (న తు స్వాతంత్ర్యం క్వచిత్ లభన్తే). కర్మాదుల మోహము వారిని వెంటాడుచునే యుండును. వారు కర్మబంధములో చిక్కి నిస్సహాయులుగ నున్నారు. వారు పదే పదే కామనలచే ప్రేరితులై, విభిన్నరకముల కర్మలను చేసి, పుణ్య పాపములను

ప్రోగుచేసుకుంటారు. వాటిని అనుభవించుటకై వారు అనేక జన్మల నెత్తెదరు. జన్మించిన తరువాత వారు కర్మలను చేసెదరు. కర్మల వలన మరల జన్మించెదరు. ఈ సంతత పరివర్తనారూపమగు చక్రములో తగుల్కొని వారు నిస్సహాయులై ఉందురు. వారు ఆత్మను గురించిన సత్యమును గుర్తించక పోవుటయే దీనికంతకూ కారణము. మానవుడు తనను తాను కర్తగా స్వీకరించినంత కాలము, అతడు సంసారము పకడ్బందీగా కొనసాగుటకు కావలసిన ఏర్పాటు చేసినట్లే యగును. దీనిలో కర్తృత్వము ఖలనాయక భూమికను పోషించును. మానవుడు ఎంత గొప్ప కర్మలను చేసిననూ, అతడు సాధించగలిగే అత్యున్నత లక్ష్యము బ్రహ్మలోకము. అది కూడా సంసారాంతర్గతమే. మానవుడు శాస్త్రసహాయములో కర్తృత్వధారణను త్యాగముచేయవలెను. జ్ఞానోదయము కలిగినప్పుడు మాత్రమే అది సంభవమగును. అదియే మోక్షము. కావున, మోక్షము నందలి కామన (ముముక్షా) ఎంత ప్రముఖమైనదో మనకీ ప్రసంగమును బట్టి మరల స్పష్టమగుచున్నది.

దీనికి భిన్నముగా తరువాతి శ్లోకములో కామనల నుండి విముక్తులై స్పష్టమగు ఆత్మ సాక్షాత్కారము గల జ్ఞానులు వర్ణింపబడుచున్నారని శ్రీ శంకరులు అవతారికలో వ్రాక్రుచ్చిరి. ఈ జ్ఞానులు సర్వమానవ సాధారణమగు ధర్మార్థ కామములకు బద్ధులై ఉండరు. ఈ మూడింటిలో ధర్మమును మిగిలిన రెండింటితో పోలిస్తే తక్కువ మంది మాత్రమే పాటించెదరు. మోక్షమును గోరువానిని ఇతరమును గోరువారితో కలిపి కామీ అనుట సరిగాదు. మోక్షము కూడా ఒక కోరికయే అగుగాక! కాని అది వివేక వైరాగ్యముల నుండి పుట్టిన కోరిక. ముముక్షువునకు ఆత్మజ్ఞానమనే లక్ష్యము సుస్పష్టముగా గోచరించునని శ్రీ శంకరులు వ్రాక్రుచ్చిరి.

**అధ్యాయము 9, శ్లోకము 22:**

अनन्याश्चिन्तयन्तो मां ये जनाः पर्युपासते ।
तेषां नित्याभियुक्तानां योगक्षेमं वहाम्यहम् ॥ २२ ॥

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ (22).

యే = ఏ; జనాః = మానవులు; అనన్యాః = నన్ను ఆత్మ కంటె అభిన్నముగా దర్శించువారై; మాం = నన్ను; చింతయంతః = విచారించువారై; పర్యుపాసతే = ఉపాసించెదరో; నిత్యాభియుక్తానాం = వాతో సర్వకాలముల యందు ఐక్యము చెంది ఉండే; తేషాం = వారి యొక్క; యోగక్షేమం

= యోగ (లేనిదానిని పొందుట), క్షేమ (ఉన్నదానిని రక్షించుకొనుట)ములను; **అహం** = నేను; **వహామి** = భద్రపరచెదను.

> ఏ మానవులు నన్ను ఆత్మ కంటె అభిన్నముగా దర్శించువారై నన్ను గుర్తించి విచారించెదరో, నాతో సర్వకాలములలో ఐక్యము చెంది ఉండే వారి యోగ (లేనిదానిని పొందుట) క్షేమ (ఉన్నదానిని రక్షించుకొనుట)ములను నేను భద్రపరచెదను (22). (జ్ఞాని విషయములో).

> ఏ మానవులు నన్ను ఆత్మ కంటె అభిన్నముగా విచారణచేసి అన్వేషించెదరో, నాతో సర్వకాలములలో ఐక్యము చెంది ఉండే వారి యోగక్షేమములను (లేనిదానిని పొందుట, ఉన్నదానిని రక్షించుకొనుట) నేను భద్రపరచెదను (22). (జిజ్ఞాసువు విషయములో).

ఇది చాల ప్రఖ్యాతి గాంచి తరచుగా ఉదహరింపబడే శ్లోకము. దీని స్థానము కూడ ప్రముఖమైనది. పదునెనిమిది అధ్యాయముల నడుమ నున్న తొమ్మిదవ అధ్యాయములో ఈ శ్లోకము ఇంచుమించు మధ్యలో నున్నది.

ఈ శ్లోకమును రెండు విధములుగా వ్యాఖ్యానించవచ్చును. ఈ శ్లోకమును జ్ఞాని పరముగ వ్యాఖ్యానించవచ్చును. లేదా, ముముక్షువునకు తన లక్ష్యముపై గల అంకితభావమును ఈ శ్లోకములో దర్శించవచ్చును. ఈ శ్లోకము జ్ఞానిపరమని శ్రీ శంకరుల అభిప్రాయము. భగవానుడు పూర్వశ్లోకములలో వర్ణించిన వారి కంటె విలక్షణుడగు జ్ఞాని ఇచట చర్చింపబడుచున్నాడు. యే అనన్యాః అను ప్రయోగమును బట్టి మనకీ విషయము తెలియునని వారు విశదీకరించిరి.

అనన్యాః అనగా భగవానుని కంటె భిన్నముగా లేనివారు. దీని యర్థమేమి? భగవానుని దృష్టిలో ఒక రకం వ్యక్తులు ఆయన కంటె భిన్నము కాని వారు, మరియొక రకం వ్యక్తులు ఆయన కంటె భిన్నమైన వారు అను రెండు రకములు గలవా? ఇది ఇంతవరకు భగవానుడు చెప్పిన దానికి విరుద్ధమగును. కావున, అనన్యాః అనగా భగవానుని తమ కంటె భిన్నముగా మరియొక వ్యక్తిగా దర్శించనివారు అని యర్థము. భగవానుడు తమ కంటె భిన్నముగా ఒక విశిష్టరూపములో నుండునని వారు భావించుట లేదు. వీరు అనన్యులనబడుదురు. వీరు ఏనాడూ భగవానుని కంటె భిన్నముగా లేరు.

ఇది ఎట్లు సంభవమగును? వీరు సర్వస్వరూపుడగు ఈశ్వరుని కంటె అభిన్నులు ఎట్లగుదురు? వారందరి ఆత్మ భగవానుడే గనుక వారు అభిన్నులగుట సంభవమేనని శ్రీ శంకరులు వాక్రుచ్చిరి. కావున, తమ ఆత్మ పరమేశ్వరుడే అని గుర్తించువారు పరమేశ్వరుని కంటె అభిన్నులగుదురు. ఈశ్వరుని ఆత్మ జీవుని ఆత్మ ఒక్కటియే. అదియే అద్వితీయ చైతన్యము. అదియే సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ. తాము బ్రహ్మాభిన్నులమని గుర్తించగల్గినవారు అనన్యులనబడుదురు.

స్పష్టమగు సాక్షాత్కారము గల జ్ఞానులను (సమ్యగ్దర్శినః) ఈ శ్లోకము వర్ణించుచున్నదని శ్రీ శంకరులు అవతారికలో ఉద్ఘాటించుటకు అనన్యాః అను పదమే హేతువు. ఇతరులందరు కూడా బ్రహ్మాభిన్నులే. కాని వారికా సత్యము తెలియదు. అనగా ఈ రెండు రకముల వ్యక్తులకు మధ్యలో గుర్తింపు ఉండుట, లేకపోవుట అనగా జ్ఞానము, అజ్ఞానము అను తేడా మాత్రమే గలదు. ఈ తేడా చాల పెద్ద తేడా.

వీరు అహంకారమును గూడ పరమేశ్వర స్వరూపముగా గుర్తించెదరు. ఈ విషయమును వివరించు శ్లోకములు కొన్ని గలవు. యత్ర యత్ర మనో మదీయం తత్ర తత్ర తవ పాదపంకజమ్. నా మనస్సు ఎక్కడ ఉంటే, నీ పాద పద్మములు అక్కడనే యున్నవి. ఇది ప్రార్థన అనుకోవచ్చును. ఇది సత్య కథనము కూడా. మరో సందర్భములో 'యత్ర యత్ర మనో యాతి తత్ర తత్ర సమాధయః' అని చెప్పబడినది. నా మనస్సు దేనిపై ప్రసరిస్తే, అదియే సమాధి (ఈశ్వరదర్శనము). మనస్సు పరమేశ్వరునకు దూరముగా పోజాలదు. ఏలయన, మనస్సు పరమేశ్వరుడే. ఒకడు ఆకాశమునకు దూరముగా పోవలెనని తలంచినాడట. ఇది అట్లున్నది. అతడు ఎక్కడకు పోగల్గును? అతడు వెళ్లగలిగే స్థలము లేదు. అటులనే, వీరు ఈశ్వరుని సర్వవ్యాపకునిగా దర్శించగల్గుదురు.

నన్ను గుర్తించిన వారు, లేదా నా గురించి విచారణ చేయువారు (మాం చింతయంతః) నన్ను ఆరాధించి పొందెదరు (మాం పర్యుపాసతే). నా కంటె ఏనాడూ భిన్నముగా లేని (నిత్యాభి యుక్తానామ్) ఆ సాధకుల (తేషాం) యోగక్షేమములను నేను వహించెదను. గీతలో మిక్కిలి ప్రసిద్ధి గాంచిన వాక్యములలో ఇది ఒకటి.

యోగక్షేమం వహామి అహమ్.

మనము సంపాదించుకున్నదానిని నిలబెట్టుకొనుటకు క్షేమమని పేరు (ప్రాప్తస్య రక్షణం క్షేమః). భారతదేశములో ఆచారమొకటి గలదు. ఉత్తరం వ్రాసేటప్పుడు ఎడమవైపు పైభాగంలో

'క్షేమము' అని వ్రాస్తారు. దానిని చూడగానే చెడువార్త కాదని స్పష్టమగును. మరణవార్తను తెలిపే ఉత్తరంలో ఈ పదము కానరాదు. దానిని బట్టి ఎవరో ఒకరు మరణించినారని తెలుస్తుంది. లేనిదానిని నిలబెట్టుకొనుట సంభవము కాదు గనుక, ఆ సందర్భములో క్షేమము అను పదము త్యజింపబడినది. మనము కోరే అభిలషణీయ వస్తువులకు మాత్రమే ఈ పదము వర్తించును. ఉదాహరణకు, శరీరములో పెరిగిపోయిన కొవ్వును నిలబెట్టుకొనుట 'క్షేమము' అనబడదు.

యోగశబ్దమునకు అనేకార్థములు గలవు. ఉదాహరణకు, అధ్యాయము యొక్క శీర్షిక యోగమనబడును. కాని యోగక్షేమ శబ్దములు ఒకే సమాసములో కలిసి ఉన్నప్పుడు, యోగశబ్దమునకు 'లేని వస్తువును సంపాదించుట (అప్రాప్తస్య ప్రాపణమ్)' అను అర్థము వచ్చును. ఇట్టి వస్తువు మనకు అభిలషణీయమై ఉండవలెను.

నీ జీవితమును నీవు పరిశీలించుకొనుము. నీ చింతలన్నియూ ఈ రెండింటిలో ఒకదానికి చెందియుండును. నీకు మనోవ్యథను కలిగించునది యేది? నీవు ఏదో ఒక వస్తువును పరిశీలించుము. అది నీవు పొందగోరునది (యోగ) గాని, లేక నీవు పోగొట్టుకుంటానని భయపడేది (క్షేమ) గాని అయి ఉండును. నాకు శాంతి లేదు అంటే శాంతి యోగము అగును. నా వద్ద తగినంత ధనము లేదు అంటే ధనము యోగమగును. నా జుట్టు ఊడిపోవుచున్నది, నా ఆరోగ్యము చెడినది అను సందర్భములలో జుట్టును, ఆరోగ్యమును పరిరక్షించుకొనుట క్షేమము అగును. జీవుని జీవితములో యోగక్షేమముల పాత్ర చాల ప్రముఖమైనది. యోగక్షేమములను పరిరక్షించినచో, సర్వము పరిరక్షింపబడినట్లే యగును.

ఎవ్వరైతే సర్వదా నాకు దూరము కాకుండగా ఉందురో (నిత్యా భియుక్తానామ్), వారి యోగ క్షేమములను నేను పరిరక్షించెదనని భగవానుడు చెప్పుచున్నాడు. శ్రీ శంకరు లిచట ఒక టిప్పణిని చేసినారు. ఇతర భక్తుల యోగక్షేమములను కూడ భగవానుడే పరిరక్షించును. భక్తులు ఆయనను ప్రార్థించెదరు. కర్మఫలదాత యగు ఆ భగవానుడు వారికి ఫలముల నొసంగును. ఇట్టి స్థితిలో ఈ నిత్యాభియుక్తుల యోగక్షేమములను భగవానుడు పరిరక్షించునని చెప్పుట ఎట్లు పొసగును? దీని యర్థమేమి? భగవానుడు అందరి యోగ క్షేమములను పరిరక్షించువాడే అయినా, నిత్యాభియుక్తుల విషయములో ఒక తేడా గలదని శ్రీ శంకరులు వివరించిరి.

భక్తుని ప్రార్థనకు అతడు అభిలషించే వస్తువు లక్ష్యము అగుచుండును. పూర్వశ్లోకమును పరిశీలించుడు. ఈ భక్తులు స్వర్గమనే విశిష్టఫలమును గోరి భగవానుని ప్రార్థించి క్రతువుల ననుష్ఠించెదరు.

వారి ప్రేమ భగవానుని యందు గాక, స్వర్గము నందు గలదు. వారికి తమ లక్ష్యమును చేరుటలో భగవానుడు ఒక సాధనము మాత్రమే. తమ కోర్కెను తీర్చుకొనుటకై వారు ఎవ్వరినైననూ వాడుకొందురు. తమ కోర్కెను తీర్చుటకు తమ అధీనములో నున్న వనరులు సరిపడవని వారికి తెలియును. మరియు, భగవానుడు సర్వజ్ఞుడనియు, సర్వశక్తి మంతుడనియు, దయాళువనియు వారు ఎరుంగుదురు. కావున వారు తమ కోర్కెను తీర్చుకొనుటకు భగవానుని వాడుకొనెదరు.

మీరు మరియొక విషయమును కూడ గమనించుడు. చింతయంతః మామ్ = నన్ను గూర్చి విచారణ చేసినవారై; మాం పర్యుపాసతే = ఈశ్వరుడనగు నన్ను ఆరాధించెదరు. అపుడు వారికి ఏమి లభించును? మోక్షమును గోరు ముముక్షువును పరిశీలించుడు. అతడు కూడ భగవానుని ప్రార్థించును. కాని అతని ప్రార్థనకు లక్ష్యమేమి? ఈశ్వరుడు లక్ష్యము. అతనికి ఈశ్వరుని ఎరుంగుట తక్క మరియొక కోరిక లేదు. 'నిన్ను కనుగొనుట మాత్రమే నా లక్ష్యము. నీవు ఎవట నున్నావు? నీ స్వరూపమేమి? నేను తెలియగోరి నిన్ను ప్రార్థించుచున్నాను' అని అతడు పలుకును. పరమేశ్వరుని ఎరింగిన పిదప అతడు దేనిని కోరును? 'నేను దేనినీ కోరను. నేను నీ కంటె అభిన్నుడనని యెరుంగుట తక్క'. ఇట్టి ముముక్షువులు వాస్తవంలో ఈశ్వరుని తమ కంటె భిన్నునిగా దర్శించరు. ఈ క్షణంలో అజ్ఞానము వలన భేదభావన గలదు. దానిని లీనము చేయుటకై వారు సర్వదా ఈశ్వర స్వరూప విచారమును చేస్తారు (మాం చింతయంతః). భగవానుడు అద్వయుడు గనుక నా కంటె భిన్నముగా లేడు. కాని ఇదెట్లు సంభవము? నేను అల్పుడనెట్లు కాగల్గుదును? వారికి సందేహములు ఇంకనూ గలవు. వారికి ఇంకనూ జ్ఞానోదయము కాలేదు. కాని వారికి శ్రద్ధ గలదు. కావున, వారు ఆరాధించెదరు (యే పర్యుపాసతే). ఎట్లు? వారు శ్రవణ మనన నిదిధ్యాసనముల ద్వారా, మరియు భక్తితో, అంకితభావముతో ఈశ్వరుని ఆరాధించెదరు.

వారి ప్రార్థనకు లక్ష్యము పరమేశ్వరుడు. వారి అన్వేషణ పరమేశ్వరుని కొరకు మాత్రమే. వారు పరమేశ్వరుని వాడుకొనుటను ఎరుంగరు. వారు పరమేశ్వరుని తెలియగోరి సాధనము చేయుచున్నారు. ఇదియే భేదమని శ్రీ శంకరులు వ్రాక్రుచ్చిరి. తాము జీవించియున్నా, మరణించినా వారు లెక్కచేయరు. ఇట్టి వివేకవంతులను అనన్యదర్శులు అని చెప్పదగును. తమ క్షేమమును గురించి వారు ఆదుర్దాపడరు. తమకు ఏమగునో యను భయము వారికి లేదు. వారు భగవానుడు తోడుగా గలవారై, ఆయన కంటె అభిన్నులై, తమ యోగక్షేమముల గురించి చింతలేనివారై ఉందురు.

ఏది జరుగవలెనో, అది జరుగును. కోర్కెలతో సహా సర్వము ప్రారబ్ధ కర్మాధీనమై యున్నది. ప్రారబ్ధకర్మ ఈశ్వరుని కంటె భిన్నముగా లేదు. కర్మ నియతి పరమేశ్వరుని కంటె వేరుగాదనే గుర్తింపు వారికి కలదు గాన, ఏది జరిగినా వారి దృష్టిలో అది పరమేశ్వరుడే. వారు తమ యోగ క్షేమ పరిపాలన కొరకై పరమేశ్వరుని వాడుకొనరు. భగవానుడు కర్మనియతి రూపములో స్వయముగా వారి యోగ క్షేమములను పరిపాలించును. కావున, వారికి తమ యోగక్షేమముల గురించి చింత లేదు.

సామాన్యభక్తునకు తన యోగక్షేమముల గురించి తీవ్రమగు ఆదుర్దా ఉండును. అతని యందు కర్తృత్వముండుటచే ఈ ఆదుర్దా ఉండుట సహజమే. అతడు యోగక్షేమముల కొరకు చేయు ప్రయత్నమంతయూ ఈ కర్తృత్వధారణపై కేంద్రితమై యుండును. తాను ఎంత ప్రయత్నము చేసినా, తాను కోరే సర్వము తనకు లభించదనియు, తాను సంపాదించిన దంతా నిలబడదనియు భక్తునకు తెలియును. అతడు భక్తుడై ఉండుటచే దైవసాహాయ్యము నపేక్షించును. భక్తుడు గనుక అతడు లేనిదానిని పొందుటకు, ఉన్నదానిని నిలబెట్టుకొనుటకు వేదోక్తకర్మల ననుష్ఠించును.

దీనికి భిన్నంగా జ్ఞాని యందు కర్తృత్వాధారణ ఉండదు. అట్లైనచో, కర్త ఎవరు? కర్త అనేవాడు ఉన్న పక్షంలో, అది భగవానుడు మాత్రమే. సృష్టికర్త అయనయే. స్థితికర్త అయనయే. లయకర్త కూడా అయనయే నని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. శ్రీ శంకరుల ఈ టిప్పణి మిక్కిలి ఉత్కృష్టమైనది.

సర్వజగత్కారణమగు బ్రహ్మ ఆత్మాభిన్నము అను జ్ఞానము వలన మాత్రమే మోక్షము లభించును. ఈ జ్ఞానము ఉదయించుటకు విచారణ అవశ్యకమగును. విచారణను చేయుటకు యోగ్యమగు జ్ఞానసాధనము (ప్రమాణము) అవశ్యకము గదా! ఈశ్వరుని గురించి విచారణ చేయుట యెట్లు? పదముల రూపములో నున్న ప్రమాణము ఆధారంగా విచారణను చేయవలెను. కావున, భగవానుని గురించి విచారణ చేయుట యనగా, శాస్త్ర పదములను విచారణ చేయుటయే. ఈ విధముగా వారు ఆత్మరూపుడగు భగవానుని ప్రార్థించి, ఆరాధించి విచారించెదరు. ఇది సర్వ శ్రేష్ఠమగు ఆరాధన. ఇచట మనము భక్తులగు జిజ్ఞాసువుల గురించి చర్చించుచున్నాము. భగవానుడు వారికి హామీని ఇచ్చుచున్నాడు. నా యందు పూర్ణ అంకితభావముతో జీవించువారికి అవశ్యకమగు సర్వము (యోగము మరియు క్షేమము)ను నేను సంపన్నము చేసెదను. జిజ్ఞాసువు

-ందగోరునది, నిలబెట్టుకొనగోరునది జ్ఞానము మాత్రమే. జిజ్ఞాసువు భక్తుడు గనుక, భగవానుడాతని -ంతలను పరిచూచును. ఇచటి వివక్ష యేదనగా, శ్రద్ధ ఉన్నచో సర్వము సుసంపన్నమగును.

సన్న్యాసులు సర్వమును పరిత్యజించే సమయములో తమను సమాజము గాని, లేదా -వరో ఒక వ్యక్తిగాని పాలించెదరని ఆశ పెట్టుకొనరు. సమాజము వారి అవసరములను కొంతవరకు -ర్చున్ను అనుటలో సందియము లేదు. కాని వారు ఆ నమ్మకముతో సన్న్యసించుట లేదు. వారి తమను ఎవరో ఒకరు పాలించి పోషించవలసిన అవశ్యకత లేదు. సర్వము దానంతట -యు సంపన్నమగును. సన్న్యాసి యొక్క మానసిక ప్రవృత్తి ఇటులనే యుండును: ''నేను నీ యోగ క్షేమములను సంపన్నము చేసెదను'' అని భగవానుడీ శ్లోకములో వారికి హామీని ఇచ్చుచున్నాడు.

జ్ఞానుల యోగక్షేమములను భగవానుడే పరిపాలించును. భక్తుల విషయంలో వారి భక్తియే వారిని యోగక్షేమముల చింతనుండి విముక్తులను చేయును. వారికి ఈశ్వరుని యందు గల అంకితభావమే వారిని యోగక్షేమముల బెంగ నుండి విడుదల చేయును. అనగా, వారు ఈశ్వరునకు అంకితులైనారు గాన, యోగక్షేమముల గురించి ఉత్కంఠ లేకపోవుట వారి సహజ లక్షణమగును. ఈశ్వరుడే సర్వమును చూసుకొనగలడు. అహం యోగక్షేమం వహామి అను వాక్యములోని తాత్పర్యమిదియే.

సాధారణంగా మనము యోగక్షేమముల కొరకై అనేక శక్తులను, మన అధికారములను, మనకు గల జ్ఞానమును, మనకున్న నైపుణ్యములను, మన అధీనములో నున్న సర్వసాధనములను వినియోగించెదము. బాహ్య శక్తుల నన్నింటినీ కూడ వినియోగించెదము. కాని తరచుగా ఇవి అన్నీ కలిసి కూడా చాలకపోవచ్చును. కావున, మనము భగవానుని కూడా ప్రార్థించెదము. దీనిలో తప్పేమీ లేదు. వ్యక్తి ఈశ్వరుని గుర్తించ గలిగేటంతటి పరిపక్వత పొందినాడని మనకు దీనిని బట్టి తెలియుచున్నది. కాని, ఈశ్వరప్రార్థన యోగక్షేమముల సంపాదనకు సాధనమగును. భగవాముని యెరుక గురించి అతడు ప్రార్థించుట లేదు. అనగా, ఈతడు ఒక సాధారణ భక్తుడు.

కాని భగవానుడిచట యోగక్షేమములను గాక, 'నన్ను' అన్వేషించువారిని గురించి వర్ణించుచున్నాడు. ఎవరు వీరు?

అనన్యాః ఇచట శ్రీకృష్ణుడు తనను ఈశ్వరునిగా పరిచయము చేయుచున్నాడు. లేదా, వ్యాసుడు శ్రీకృష్ణుని ఈశ్వరునిగా పరిచయము చేయుచున్నాడని చెప్పవచ్చును. ఏదైనా ఒకటియే.

ఈశ్వరుని స్థానములో నున్నవాడై, ఈ జనులు నా కంటె వేరుగాదని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. వారు నన్ను వారి స్వరూపముగా, ఆత్మరూపముగా గుర్తించెదరు. ఈశ్వరుడు నీతో సహా ఏ వస్తువు కంటె నైననూ వేరుగాడు. కావున, ఈశ్వరుడు తమ కంటె వేరుగా లేడని వారు గుర్తించెదరు. స్థూల దేహదృష్టితో చూచినా, ఈశ్వరుని దేహములో నీ దేహము అంతర్గతమగును. సృష్టిఅంతయూ కలిపి ఈశ్వరుని స్థూలదేహము అగును. జీవుని దేహము దానిలో అంతర్భాగమగును. నా అంతఃకరణము గూడ ఈశ్వరుని అంతఃకరణములో అంతర్గతమగును. కావున, దేహము అనే దృష్టికోణములో చూచిననూ, ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదు. 'నేను (అహం)' అను దృష్టికోణములో నైననూ, భేదమునకు అవకాశము లేనే లేదు. ఇచట ఈ 'నేను' చాల ప్రముఖమైనది. జీవుడు ఈశ్వరుని కంటె భిన్నముగా లేడు. ఈశ్వరుని ఆత్మ జీవుడు. జీవుని ఆత్మ ఈశ్వరుడు. మాయోపాధి దృష్ట్యా మాత్రమే ఈశ్వరుడు గలడు. కాని ఈశ్వరుని ఆత్మ జీవుని సారభూతమైన చైతన్య ఆత్మ కంటె వేరుగాదు. జీవుని ఆత్మ ఈశ్వరునికంటె వేరుగాదు. ఉన్నది ఒకే ఒక అనంత ఆత్మ. అదియే జీవేశ్వరు లిద్దరి సారభూతమగు సత్యము. ఈ అభేదమును గుర్తెరింగిన వారు అనన్యులనబడుదురు. వారు అనన్యులు ఎట్లు కాగల్గిరి?

మాం చింతయంతః. వారు తమ యోగక్షేమములను గాక, భగవానుని స్మరించెదరు. పరమేశ్వర విచారము వారి జీవితలక్ష్యము. వారు జిజ్ఞాసువులు. వారు ఈశ్వరీయ జ్ఞానసాధనకు అంకితమైనారు. వారు స్వీయ యోగ క్షేమముల గురించి యత్నించుట లేదు. వారి యత్నమంతయూ ఈశ్వర సాక్షాత్కారము కొరకు మాత్రమే. జ్ఞానులు (సన్న్యాసులు) అనన్యులై ఉందురని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. వారి సన్న్యాసము జీవనశైలి రూపమైనది గాదు. అది 'అహం అకర్తా (ఆత్మ కర్త కాదు)' అను జ్ఞానము లక్షణముగా గల సర్వ కర్మ సన్న్యాసము. ఆత్మ ఏ కాలము నందైననూ ఏ క్రియనైననూ ఆచరించదు. భగవానుడు ఉపదేశించు సమయము నందు కూడా కర్మను చేయుట లేదు. ఈ వివిధ కర్మల నాచరించు సమయము నందు కూడా (పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్) ఆత్మ క్రియలను వేటినీ ఆచరించుట లేదు. భగవానుడు చూస్తూ (పశ్యన్), నేను చూచుట లేదు (అహం న పశ్యామి) అనియు, వింటూ (శృణ్వన్) నేను వినుట లేదనియు (అహం న శృణోమి) చెప్పగల్గును. దీని తాత్పర్యమేమనగా, 'నేను' అను ప్రత్యయమునకు సారభూతమైన ఆత్మ క్రియలను వేటినీ ఆచరించదు. కాని, క్రియా కలాపమంతయూ దాని సన్నిధి యందు సంపన్నమగును. ఏ చైతన్యము సన్నిధిలో మనస్సు మనస్సు అగునో, ఇంద్రియములు ఇంద్రియము అగునో, అట్టి చైతన్యము నా స్వరూపము. మనస్సు సంకల్పించగా, బుద్ధి నిశ్చయించగా,

కర్మేంద్రియములతో జీవుడు కర్మల నాచరించును (మనసా సంకల్ప్య బుద్ధ్యా నిశ్చిత్య కర్మ కరోమి కర్మేంద్రియైః). ఇదియే జ్ఞానము.

'యే జనాః పర్యుపాసతే. అనుభవాత్మకమగు అవస్థ లన్నిటి యందు నన్ను గుర్తించి ప్రార్థించువారు. ఉపాసతే అను క్రియాపదమునకు ముందు భగవానుడు పరి అను ఉపసర్గను ప్రయోగించినాడు. ఆ ఉపసర్గకు సర్వకాలములలో, అనుభవాత్మకమగు అవస్థలన్నిటి యందు అని యర్థము. వీరెవరు? పరమేశ్వరుని శ్రవణమనన నిదిధ్యాసనముల ద్వారా అంకితభావముతో అన్వేషిస్తూ, అమానిత్వాది గుణములతో విరాజిల్లువారై, వీరు జ్ఞానమును పొందినారు.

నిత్యాభియుక్తానామ్. ఎవరి బుద్ధి సర్వదా ఈశ్వరుని యందు జాగృతమై ఉండునో, ఎవరు ఈశ్వరుని ఆత్మ-అభిన్నముగా గుర్తించినారో, వారు. వారికి, వారి సాక్షాత్కారమునకు మధ్యలో మనస్సు అవరోధము కాదు. అభియుక్తులనగా అమానిత్వాది గుణసంపన్నులు. వీరు చిత్త శుద్ధి ప్రక్రియలో పూర్ణముగా పయనించి, జ్ఞానోదయమునకు అడ్డుపడే మాలిన్యముల నన్నిటినీ తొలగించుకొనినారు. వీరు నిత్యాభియుక్తులనబడుదురు.

మనము ఒక ఆశంకను ఇంతకు ముందు విస్తారముగా చర్చించియున్నాము. శ్రీ శంకరులు అదే ఆశంకను రాబోవు శ్లోక అవతారికలో లేవనెత్తినారు. సర్వము ఈశ్వరుడేనని మనము చెప్తాము గనుక, ఈ దేవత లందరు కూడా ఈశ్వరుడే. కావున భక్తులు శ్రీకృష్ణునిగాని, శ్రీరాముని గాని, లేక ఇతర దేవతలను గాని ఎవరిని ఆరాధించినా, వారందరూ ఆరాధించేది ఈశ్వరుని మాత్రమే గదా! ఈశ్వరుడు కాని దేవతను ఎవ్వరైనమా ఆరాధించరు గదా! కావున ఈశ్వరుడు ఆ భక్తుల యోగక్షేమములను చక్కబెట్టుకుండునా? జ్ఞానిని, జిజ్ఞాసువును ప్రత్యేకించి భగవానుడు చెప్పుటకు కారణమేమి? ఈ ఆశంక యుక్తి యుక్తమే (సత్యం ఏవమ్). కాని ఒక తేడా గలదు.

**అధ్యాయము 9, శ్లోకము 23:**

येऽप्यन्यदेवताभक्ता यजन्ते श्रद्धयाऽन्विताः ।
तेऽपि मामेव कौन्तेय यजन्त्यविधिपूर्वकम् ॥ २३ ॥

యేప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్ (23)

**యే** = ఏ; **అన్యదేవతా భక్తాః అపి** = ఇతర దేవతల భక్తులు కూడా; **శ్రద్ధయా** = శ్రద్ధతో; **అన్వితాః** = కూడినవారై; **యజంతే** = ఆరాధించెదరో; **కౌంతేయ** = ఓ అర్జునా!; **తే అపి** = వారు కూడ; **అవిధి పూర్వకమ్** = విధి విధానము కాని పద్ధతిలో; **మామేవ** = నన్ను మాత్రమే; **యజంతి** = ఆరాధించుచున్నారు.

> ఇతర దేవతల భక్తులు కూడా ఎవరైతే శ్రద్ధతో గూడినవారై ఆరాధించెదరో, ఓ అర్జునా!, వారు కూడా విధి విధానము కాని పద్ధతిలో నన్ను మాత్రమే ఆరాధించుచున్నారు (23).

యే అపి అన్యదేవతా భక్తాః. ఎవరైతే ఈశ్వరుని తమ కంటె భిన్నమైనవానినిగా ఆరాధిస్తారో. ద్వైతులు అపవ్యాఖ్యానము చేయుటకు అనువైన శ్లోకములలో ఇది ఒకటి. అన్యదేవతా భక్తాః అనగా ఇత దేవతల నారాధించువారు గదా! దీనిని బట్టి శ్రీకృష్ణుడు మాత్రమే భగవానుడని నిర్దేశింపబడుచున్నది అని వారు వ్యాఖ్యానిస్తారు. ఈ వ్యాఖ్య సరిగాదు.

దేవతలంధరూ నా స్వరూపమే. సర్వము నేనే. నా కంటె భిన్నముగా ఏదియూ లేదని నిరూపింపబడినది. కావున, మానవుడు ఏ రూపమును, ఏ నామమును, ఏ పద్ధతిలో ఆరాధించినమా నన్ను మాత్రమే ఆరాధించినట్లు అగును. ఈ దేవతలందరూ ఈశ్వర స్వరూపులే నని ఈ భక్తులు గుర్తించలేదు. వారు అయా దేవతలను వాస్తవంగా భిన్నమైన వారినిగా భావించెదరు.

యజంతే. వారు నన్ను అనేక పద్ధతులలో ఆరాధించెదరు. ఎట్లు? శ్రద్ధయా. శ్రద్ధతో. గిరిజనుల మతములోనైనా, లేక సుపరిష్కృతమగు మతములోనైనా, భక్తులందరికీ శ్రద్ధ ఉండును.

తే అపి మామేవ కౌంతేయ యజంతి. ఓ అర్జునా! వారు కూడా నన్నే ఆరాధించుచున్నారు. కాని ఒక సమస్య గలదు. వారి ఆరాధనకు అజ్ఞానము ఆలంబనమై (అవిధిపూర్వకమ్) యున్నది. వారు నన్ను ఆరాధించుచున్నారనుటలో సందియము లేదు. కాని వారు నన్ను ఎరుంగరు. వారి దృష్టిలో దేవతలందరు పరస్పరభిన్నులు, మరియు ఈశ్వరుని కంటె భిన్నులు.

వారి వివిధ ఆరాధనా పద్ధతులను నేను ఆనందముగా స్వీకరించెదను. ఏలయన, దేవతలందరి ద్వారా ఆరాధనలన్నియూ నన్నే చేరును. కాని వారు అజ్ఞానముచే ఈ సత్యమును గుర్తించరు. వారి ఆరాధనకు ఆలంబనము అజ్ఞానమని భగవానుడు చెప్పుటకు కారణమేమి?

**అధ్యాయము 9, శ్లోకము 24:**

**अहं हि सर्वयज्ञानां भोक्ता च प्रभुरेव च ।**
**न तु मामभिजानन्ति तत्त्वेनातश्च्यवन्ति ते ॥ २४ ॥**

**అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ**
**న తు మామభిజానంతి తత్త్వేనాతశ్చ్యవంతి తే (24).**

**హి** = ఏలయనగా; **అహం** = నేను; **సర్వ యజ్ఞానాం** = యజ్ఞము లన్నింటికీ; **భోక్తా** భోక్తను; **చ** = మరియు; **ప్రభుః ఏవ చ** = ఒకే ఒక ఈశ్వరుడను; **తు** = కాని; **తే** = వారు; **మాం** = నన్ను; **తత్త్వేన** = యథార్థముగా; **న అభిజానంతి** = తెలియజాలరు; **అతః** ఇందువలన; **చ్యవంతి** = జారిపోవుదురు.

ఏలయన, యజ్ఞము లన్నింటికీ భోక్తను నేనే. మరియు ఒకే ఒక ఈశ్వరుడను నేనే. కాని వారు నన్ను యథార్థముగా నెరుంగరు గాన వారు జారిపోవుదురు (24).

అహం సర్వయజ్ఞానాం భోక్తా. ఆరాధన వేదవిహితమగు (శ్రౌత) యజ్ఞము గావచ్చును. లేదా, వివిధ రకముల పూజా ప్రార్థనాదికము (స్మార్త) కావచ్చును. ఆరాధన లన్నింటిలోని సమర్పణలను స్వీకరించేది నేనే. ఆరాధనలన్నింటిలో ఆరాధ్యము నేనే. వారు ఏ రూపములో ఆరాధించినా, అది నేనే. వారి సర్వవిధముల ఆరాధనకు చరమవేది నేనే.

ప్రభుః ఏవ చ. యజ్ఞమునకు ప్రభువు కూడా నేనే. యజ్ఞము ఒక ఫలము నిచ్చును. ఆ ఫలము ఇచ్చునది (కర్మ ఫలదాత) నేనే గాని, నీవు ఆరాధించే దేవత గాదు. ఫలము ఆ దేవత ద్వారా రావచ్చును. కాని నా నుండి వచ్చును. అంతతో గత్యా ఫలదాతను నేనే. ఆఫ్రికా జాతీయులు వర్షం కోసం నృత్యమును చేస్తారు. వర్షము పడుతుంది. దీనిలో ఆశ్చర్యము లేదు. ఆరాధనారూపమగు ఆ నృత్యము వర్షము పడునట్లు చేయును. మానవులు ఆరాధించే చరమదైవము నేనే. ఏ దేవత వారాధించినా, తేడా లేదు.

కాని దీనిలో ఒక సమస్య గలదు. న తు మాం అభిజానంతి తత్త్వేన. వారు నా యథార్థ స్వరూపము నెరుంగరు. ఈశ్వరుని యథార్థ స్వరూపమేమి? ఈ దేవత లెవ్వరు? ఈ కర్త ఎవడు?

ఈ విషయములను వేటినీ వారెరుంగరు. వారు చేయు ఆరాధన వలన అంతఃకరణ శుద్ధి కలిగి, తద్ద్వారా వారికి మోక్షము లభించు అవకాశము ఉన్ననూ, వారా మహాఫలమును పొందరు. 'ఈశ్వరుడొక్కడే. ఆయనయే సర్వము. ఈశ్వరుని ఈ యథార్థ స్వరూపము తెలియుటకు అంతఃకరణశుద్ధి ఆవశ్యకము. దాని కొరకై మేము ఈశ్వరుని ఆరాధించుచున్నాము' అను ఎరుక వారికి కొద్దో గొప్పో ఉన్నప్పుడు మాత్రమే వారు మోక్షమార్గములో ముందడుగు వేయగల్గుదురు. కాని అట్టి జ్ఞానము వారికి లేదు. అట్లైనచో, వారికి ఏది లభించును?

చ్యవంతి తే, వారు జారిపోవుదురు. వారికి సామాన్యఫలములు లభించునే గాని, అంతఃకరణ శుద్ధి లభించదు. మోక్షమునందభిరుచి కలిగి, ప్రార్థన అంతఃకరణశుద్ధి కొరకు చేయబడుచున్నది యను ఎరుక గల వానికి మాత్రమే అంతఃకరణశుద్ధి కలుగును. అట్టి వ్యక్తి మాత్రమే ఉన్నత ఫలము (మోక్షము)ను పొందును. వేదోక్త కర్మను అనుష్ఠించుటలో కర్మయోగికి, కామ కామికి మానసిక ప్రవృత్తి పూర్తి భిన్నముగా నుండును. కామ కామి కొన్ని విశిష్ట ఫలములను గోరి, విశిష్ట దేవతను వాటి పరిపూర్తి కొరకు వాడుకొనును. కావున, అతనికి ఆ ఫలము మాత్రమే లభించును. అతడు ఉన్నత ఫలము నుండి చ్యుతుడగును. వాస్తవంలో సర్వ ఆరాధనలకు ఫలము అంతఃకరణశుద్ధియై ఉండవలెను. అట్టి ఆరాధన మోక్షమునకు దారితీయును. వారు నన్ను ఆరాధించుచున్నారు. కాని, అదే సమయంలో నన్ను గుర్తించుట లేదు. కావుననే, అనంతత్వమునకు బదులుగా అల్పఫలమును మాత్రమే పొందుచున్నారు. వారి ప్రార్థనలో లోపము లేదు. కాని ఆ ప్రార్థన యొక్క సామర్థ్యము అజ్ఞానముచే కుంటువడినది. నీకు జిజ్ఞాస యున్నచో, ఈశ్వరుని తెలుసుకునే సాధనలో భాగముగా యజ్ఞమును చేయుము. అపుడు నీకు అంతఃకరణశుద్ధి కలుగును. దానివలన వివేకము కలుగును. అది మోక్షమునకు దారితీయును. జిజ్ఞాస లేనివారు దీని నుండి చ్యుతులగుదురు.

కాని ఒక సత్యమును మనము గమనించవలెను. ఆ భక్తులందరూ నిశ్చితముగా ఫలములను పొందెదరు. కర్మఫలము నుండి ఏ ఒక్కరూ వంచితులు గారు. ఈ విషయమును తరువాతి శ్లోకము ప్రస్తావించుచున్నది.

అధ్యాయము 9, శ్లోకము 25:

यान्ति देवव्रता देवान् पितॄन् यान्त पितृव्रताः ।
भूतानि यान्ति भूतेज्या यान्ति मद्याजिनोऽपि माम् ॥ २५ ॥

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్ (25).

దేవవ్రతాః = దేవతలకు అంకితమైనవారు; దేవాన్ = దేవతల లోకములను; యాంతి = పొందెదరు; పితృవ్రతాః = పితృదేవతలకు అంకితమైన వారు; పితౄన్ = పితృదేవతల లోకములను; యాంతి = పొందెదరు; భూతేజ్యాః = భూతముల నారాధించు వారు; భూతాని = భూతముల స్థానమును; యాంతి = పొందెదరు; అపి = దీనికి భిన్నముగా; మద్యాజినః = నన్ను ఆరాధించువారు; మాం = నన్ను; యాంతి = పొందెదరు.

దేవతలకు అంకితమైన వారు దేవతల లోకవములను, పితరులకు అంకితమైనవారు పితృలోకవములను పొందెదరు. భూతవముల నారాధించువారు భూతములుండు స్థానమును పొందెదరు. కాని నన్ను ఆరాధించువారు నన్ను పొందెదరు (25).

యాంతి దేవవ్రతా దేవాన్. దేవతల యందు భక్తి, అంకితభావము గలవారు దేవవ్రతాః అనబడుదురు. వీరు ఇంద్రాది విశిష్ట దేవతల నుద్దేశించి, వేదోక్తమగు యజ్ఞాదుల ననుష్ఠించెదరు. ఆ కర్మల ఫలముగా వారు దేవతలు నివసించే పుణ్యలోకములను పొంది సుఖముల ననుభవించెదరు. కాని, వారచట కర్మలచే తమకు లభించిన పుణ్యము ఉన్నంత వరకు మాత్రమే ఉండెదరు. పుణ్యఫలములు కూడ పరిచ్ఛిన్నములు మాత్రమే నని నిర్దేశించుట భగవానుని తాత్పర్యము.

పితౄన్ యాంతి పితృవ్రతాః. మరి కొందరిలో రాజసిక ప్రవృత్తి దృఢముగా నుండును. మరణించిన జీవుల కొరకు ప్రతి సంవత్సరము వారు మరణించిన దినమున చేయబడే శ్రాద్ధమును, ఇతర వేద విహిత కర్మలను చేస్తారు. ఇంతియే గాక, వారు వేదముచే విధింపబడని స్మార్తకర్మలను కూడా చేస్తారు. మనుష్యలోకము కంటె అధికమగు సుఖానుభవము గల ఒకానొక పుణ్యలోకములో నివసించు జీవులు పితరులు అనబడుదురు. పుణ్యాత్ములు మరణానంతరము పొందే ఈ పుణ్యలోకమునకు పితృలోకమని పేరు.

కర్ణాటక లోని కూర్గు జిల్లాలో, ప్రధానముగా పితృదేవతల నారాధించే జనజాతి ఒకటి గలదు. బ్రాహ్మణులను, వైదిక సంప్రదాయములోని సర్వమును విరోధించే నాస్తిక ఉద్యమము ఒకటి తమిళనాడులో గలదు. ఆ ఉద్యమకారులు దేవాలయములను దర్శించరు. వైదిక కర్మల

నమష్ఠించరు. ఈ ఉద్యమములో ఇద్దరు ప్రధాన నాయకులు ఉండెడివారు. వారు ఇప్పుడు జీవించి లేరు. వారి అనుయాయులు ప్రతి ఏడాది వారి సమాధుల వద్దకు వెళ్ళి, ధూపమును వేసి, పుష్పములను అర్పించెదరు. అది పూజకాదని వారి అభిప్రాయము. కాని వాస్తవంలో వారు చేసేది పూజయే. వారు ఈశ్వరుని ఆ రూపములో ఆరాధించుచున్నారు. వారు పితృవ్రతులు.

వైదిక క్రతువులను చేయకపోయినా, నిత్యపూజాది స్మార్తకర్మల ననుష్ఠించువారు మరణానంతరము అగ్నిష్వాత్తులగుదురని శ్రీ శంకరులు వ్రాక్రుచ్చిరి. ఒక పితృదేవతా సముదాయమునకు అగ్నిష్వాత్తులని పేరు. ఆ ఉన్నతలోకమును వారు మరణించిన తరువాత పొందెదరు.

భూతాని యాంతి భూతేజ్యాః. భూతములు, యక్షులు, రాక్షసులు, గణములు ఇత్యాది చిల్లర దేవతల నారాధించువారు భూతేజ్యాః అనబడుదురు. గణములకు ప్రభువగు గణేశుడు వీరిలో ఒకడు. కాని గణేశుని పరబ్రహ్మరూపముగా ఆరాధించినచో, అది వేరే. అది ఈశ్వరారాధన యగును. కాని గణేశుని గణముల కధిపతి రూపములో ఆరాధించెదరు. అనగా వారు ఒక విశిష్ట భూతమును ఆరాధించుచున్నారని చెప్పవచ్చును. వారికి ఆ స్థాయికి చెందిన పుణ్యానుభవము మాత్రమే కలుగును. ఆ అనుభవము ఇహలోకానుభవముతో పోలిస్తే గొప్పదిగ నుండును.

ఈ విధముగా అనేక గతులను వర్ణించిన తరువాత నాకు అంకితమైనవారు నన్ను పొందెదరని (యాంతి మద్యాజినః అపి మామ్) భగవానుడింకనూ చెప్పుచున్నాడు. వీరందరు తాము చేయు ఆరాధనకు అనురూపమగు ఆయా ఉత్తరగతులను పొందెదరు. అటులనే, నన్ను ఆరాధించువారు నన్ను మాత్రమే పొందెదరు. నన్ను అనగా సర్వకారణమగు పరమేశ్వర, పరమాత్మను. విష్ణువును భగవానునిగా గుర్తించువారు వైష్ణవులనబడుదురని శ్రీ శంకరులీ శ్లోకభాష్యములో వ్రాక్రుచ్చిరి. సర్వవ్యాపకుడై, సర్వదేవతలను తనలో ఇముడ్చుకున్న భగవానుడు విష్ణువు అనబడును. వీరు నన్ను తమ స్వరూపముగా గుర్తించి, నన్ను పొందెదరు.

ఇప్పుడు చెప్పుము. నీకేమి కావాలి? పుణ్యలోకములలో ఒక దానిని గోరుచున్నావా? లేక, సర్వ పుణ్యలోకముల అనుభవసారమును గోరుచున్నావా? సర్వానుభవములు నేనే. నా కంటె భిన్నముగా ఏదీ లేదు. కావున, సర్వ దేవతా స్వరూపునిగా నన్ను గుర్తించి, ఆరాధించువారు మద్యాజులు అనబడుదురు. వారు ఆరాధించే తీరుతెన్నులు పూర్తి విలక్షణముగా నుండును. వారు ముముక్షువులు. వారిని భగవానుడు ఇంతకు ముందు 'అనన్యాః' అని వర్ణించియున్నాడు.

## ప్రయాస సమానమే, కాని అజ్ఞానముండుట వలన ఫలము అత్యల్పము

శ్రీ శంకరులిచట ఒక టిప్పణిని చేసిరి. అజ్ఞానముతో భగవంతుని ఆరాధించువారికి ప్రయాస సమానమే అయినా, వారికి లభించు ఫలము అల్పముగ మాత్రమే నుండును. భక్తులందరికీ శ్రమ సమానమే. యజ్ఞము లన్నింటిలో శ్రమ తప్పదు. వారు ఆరాధించే ఈ దేవతలందరు నా స్వరూపమే గనుక, వారందరు నన్నే ఆరాధించుచున్నారు. కాని వారి పూజలన్నిటిని వాస్తవంగా స్వీకరించేది నేనే అని వారు అజ్ఞాన ప్రభావము వలన తెలియకున్నారు. విభిన్నలోకములు మొదలగు ఫలముల కొరకు తాము విభిన్న దేవతల నారాధించుచున్నామని వారు తలపోయుదురు. ఆ కారణము వలన, వారు తమ ఆరాధనను ఒక విశిష్ట పుణ్యలోకానుభవము వరకు మాత్రమే పరిమితము చేసుకొనెదరు. వారు అంతఃకరణశుద్ధి కొరకు వైదిక క్రతువుల నాచరించే పక్షంలోనైననూ, పడే శ్రమ సమానముగనే యుండును. కాని, అజ్ఞానము వలన వారు అల్పఫల భాజనులు మాత్రమే అగుదురు.

ఈ పరిస్థితికి ఒక దృష్టాంతము నీయవచ్చును. ఒకనివద్ద పురాతన వస్తువు ఒకటి గలదు. కాని దాని విలువ ఆతనికి తెలియదు. ఆతడు కష్టపడి పురాతన వస్తు విక్రేతను వెతికి పట్టుకొనెను. ఆతడా వస్తువును తీసుకొని వేయిరూపాయల నీయగా, ఈతడు సంతసించెను. కాని దాని వాస్తవ మూల్యము కొన్ని లక్షల రూపాయలు గలదు. అనగా, ఆతడు పురావస్తు విక్రేతను వెదికి బట్టుకొనుటలో అధికమగు శ్రమను బొందిననూ, అజ్ఞానము వలన అల్పఫలము మాత్రమే లభించినది.

సర్వము ఈశ్వరుడే అని చెప్పగలగాలంటే, ఆ జ్ఞానము ఉండవలెను. ఆ జ్ఞానము లేనిచో, ఆ మాటను ఎట్లు చెప్పగలము? భగవానుడు సర్వము అగుచుండగా నీవు చూడలేదు గదా! కావున నీవు గుర్తించవలెను. ఆత్మయే నిమిత్తోపాదాన కారణమగు పరంబ్రహ్మ అని గుర్తించనిదే 'సర్వము భగవానుడే', 'సర్వము నేనే' అని నీవు చెప్పజాలవు. ఈ విషయము తెలిసినది గదా! కావున దీని ఫలము అనంతము; పూర్వమునందు చెప్పిన ఫలముల కంటె విలక్షణమైనది. ఈ సత్యము నెరింగిన జ్ఞానిలో అహంకారము బాధితమగును. కావున అట్టి జ్ఞాని ముక్తుడగును. వానికి పునరావృత్తి లేదు. ఈ విషయమంతయూ చర్చించబడినది.

ఇంత మాత్రమే గాదు. ఫలము అనంతమగుటయే గాక, తేలికగా లభించునది (సులభః). ఏలయన, అది నీ గురించిన నిత్య సిద్ధమగు సత్యము. పంచదార తాను మధురముగా అగుటకు

ఏమి చేయవలెను? నేను మధురము అని తెలుసుకుంటే చాలును. చాల తేలిక. అదే విధముగా 'నేను పూర్ణుడను (ఆనందోఽహమ్)' అని తెలియవలెను. కాన ఇది సులభము. కాని అంతఃకరణశుద్ధి కొరకై అనేక క్రతువులను చేయవలసి యుండును గదా! అక్కరలేదని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. అటులైనచో, నేనేమి చేయవలెను?

**అధ్యాయము 9, శ్లోకము 26:**

पत्रं पुष्पं फलं तोयं यो मे भक्त्या प्रयच्छति ।
तदहं भक्त्युपहृतमश्नामि प्रयतात्मनः ॥ २६ ॥

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః (26).

**యః** = ఎవడైతే; **మే** = నా కొరకు; **పత్రం** = పత్రమును; **పుష్పం** = పుష్పమును; **ఫలం** = ఫలమును; **తోయం** = జలమును; **భక్త్యా** = భక్తితో; **ప్రయచ్ఛతి** = సమర్పించునో; **ప్రయతాత్మనః** = పవిత్రమగు అంతఃకరణము గల ఆ భక్తుని యొక్క; **భక్త్యుపహృతం** = భక్తితో సమర్పింపబడిన; **తత్** = దానిని; **అహం** = నేను; **అశ్నామి** = స్వీకరించెదను.

ఎవడైతే నా కొరకు పత్రమును, పుష్పమును, ఫలమును, జలమును భక్తితో సమర్పించునో, పవిత్రమగు అంతఃకరణము గల ఆ భక్తుని, భక్తితో సమర్పింపబడిన ఆ వస్తువును నేను స్వీకరించెదను (26).

నీవు దేనిని సమర్పిస్తావనేది ముఖ్యము కాదు. నీవు ఒక బిల్వపత్రమును గాని, తులసి ఆకును గాని, పుష్పమును గాని, ఫలమును గాని, నీటిని (తోయమ్) గాని సమర్పించవచ్చును. కాని ఈ సమర్పణ అను క్రియ చాల ఆవశ్యకము. మరియు, సమర్పించిన తీరు కూడ చాల ముఖ్యము.

యః మే భక్త్యా ప్రయచ్ఛతి. ఎవడైతే నాకు భక్తితో సమర్పించునో! అతడు నన్ను ఈశ్వరునిగా గుర్తించి భక్తితో నాకు సమర్పించును. 'నేను దీనిని అంతఃకరణ శుద్ధి కొరకు, జ్ఞానము కొరకు ఈశ్వరునికి సమర్పించుచున్నాను'. ఇట్టి కర్మ ఏదైనా యోగమే అగును. ఇచట 'భక్త్యా' అను పదము తృతీయా విభక్తి. భక్తి అను వస్తువు ఏదీ లేదు. అది ఒక మానసిక స్థితి

మాత్రమే. సమర్పించుట అనునది ఒక కర్మ. భక్త్యా ప్రయచ్ఛతి అనగా ఆ కర్మను భక్తితో చేయుచున్నాడు. అపుడది కర్మయోగమగును. భక్తి ఉన్నచో సర్వకర్మలు యోగమే యగును. పూజ ఒక కర్మ. కీర్తనల నాలాపించుట వాచిక కర్మ. ధ్యానము మానస కర్మ. ఇవి అన్నీ కర్మలు. భక్తి తోడైతే, ఇవి యోగమగును. ఇట్టి సమర్పణను భగవానుడిచట చర్చించుచున్నాడు.

ఈ సమర్పణను చేయునది ఎవరు?

ప్రయతాత్మనః. యథోచితమగు ప్రయత్నమును చేయు వాని సమర్పణ. ఇట్టి భక్తుని మనస్సు శుద్ధముగా నుండును. పవిత్రమగు హృదయము భక్తి రూపములో వ్యక్తమగును. సమర్పణ శుద్ధ హృదయముతో చేయబడును. అట్టి శుద్ధ హృదయమును పొందుటకు కూడా మనము పూజాది కర్మలను భక్తితో చేస్తాము.

## భక్తితో చేయు కర్మ ప్రముఖమైనది

కర్మ తదనురూపమగు భావావేశమును కలిగించును. కావున కర్మకు ప్రముఖ పాత్ర గలదు. కర్మను చేయకుంటే, భావావేశము మాయమగును. కావున, కొన్ని విశిష్ట భావావేగములు వ్యక్తమగుట కొరకై, మనకు కొన్ని కర్మలు గలవు. కర్మ స్వరూపము, మరియు దాని వెనుక గల స్ఫూర్తి అను వాటిని నేనిదివరలో వివరించి యున్నాను. అంతఃస్ఫూర్తి యొక్క అలంబనము లేని కేవల కర్మకాండ మృతప్రాయమగును. అంతః స్ఫూర్తి ఉన్నచో, దాని బాహ్యరూపము లేకున్ననూ పరవాలేదు. భగవానునకు సమర్పణ చేయాలంటే, స్థూలదేహ నిర్వర్త్యమగు కర్మ ఆవశ్యకము కాదు. భగవంతుని యందు నీకు భక్తి ఉన్నచో, ఉన్నట్లే. దానిని వ్యక్తం చేసే ఒక విశిష్ట ప్రక్రియ ఆవశ్యకము గాదు. ఈశ్వరుని గురించి నీకు సరియగు పరిజ్ఞానమున్నచో, దాని వ్యక్తీకరణ యగు భక్తి నీ యందు సదా ఉండును. కాని, దీనిలోని సమస్య ఏమనగా, 'నేను భక్తుడను' అను ధారణ ఉన్నంతవరకు, అది యథార్థమగు భక్తి కాజాలదు. అహంకారము ఉన్నంతవరకు, నీ యోగక్షేమములను తానే పరిరక్షించుచనను ధారణ దానికి ఉన్నంతవరకు, అది ఈశ్వరుని ఒక సహాయకునిగా వాడుకునే యత్నమును చేయుచున్నంతరకు, నీవు భక్తియుక్తమగు క్రియను ఆచరించవలసి యుండును. అట్టి నీకు భక్తి యొక్క స్ఫూర్తి ఎంత ప్రముఖమో, భక్తిని వ్యక్తీకరించు క్రియ కూడా అంతే ప్రముఖము అగును.

నేనింతకు ముందు మీకు చెప్పియున్నాను. నీవు ఒక వ్యక్తిని ద్వేషించుచున్నచో, అతనిని నీవు ప్రేమిస్తున్నావా యన్నట్లు ప్రవర్తించుట ఉత్తమ పద్ధతి యగును. ఇది మోసము కాదా యని నీవనవచ్చును. అతనిని మోసగించవలెననే తలంపు నీకు ఉన్నచో, అది మోసమే. ద్వేషమును విడనాడుటయే నీ లక్ష్యమైనచో, అది మోసము కాదు. నీవాతనికి ప్రతిదినము ఒక పుష్పము నిమ్ము. ఇట్లు 41 దినములు చేయుము. ఈ భూగోళముపై గల సంస్కృతు లన్నింటిలో పుష్పమును ఇచ్చుట ప్రేమకు గుర్తుగా స్వీకరింపబడును గదా! భారతీయ సంస్కృతిలో పుష్పము నిచ్చుట మర్యాదకు, భక్తికి సంకేతము. ఆ క్రియ ప్రేమానురాగములకు సంకేతమని నీ అంతరంగమునకు తెలియును. కాని నీ మనస్సులో ఆ వ్యక్తి యెడల ద్వేషపూర్వకమగు భావావేగము గలదు. ఈ రెండు భావనలకు మధ్యలో నిశ్చితముగా సంఘర్షణ కలుగును. కాని నీవే ద్వేషమును పారద్రోల నిశ్చగించుచున్నావు గదా! కావున, నీవు పుష్పమును ఇచ్చుచుండుము. కొద్దిరోజుల తరువాత, ఆపైన పుష్పమునిచ్చే అవసరముండదు. ప్రేమకు సంకేతమగు క్రియను చేసినప్పుడు ప్రేమ వ్యక్తమగును. కావున తద్విరుద్ధమగు ద్వేషము ప్రేమగా మారిపోవును. దీనికే ప్రతిపక్ష భావనమని పేరు. ఒక భావావేగమును తొలగించుటకు తద్విరుద్ధ భావావేగమును ఆశ్రయించవలెను. ద్వేషమున్నచోట ప్రేమను భావన చేయవలెను. అసూయ ఉన్నచోట అవగాహనను, అంగీకారమును భావించి ఆ వ్యక్తిని మెచ్చుకొనవలెను. మనము మార్పు పొందే తీరు ఇదియే.

ప్రస్తుతంలో, భక్తి ఎంత ప్రముఖమో, భక్తితో చేసే క్రియ కూడా అంతే ప్రముఖము. అట్టి క్రియలో భక్తి వ్యక్తమగును. ఈ వ్యక్తీకరణకు మిక్కిలి ప్రాముఖ్యము గలదు. మానవునిలో భక్తి సర్వమును కబళించి వేసే భావావేగముగా రూపు దిద్దుకోవాలి. నేను భక్తి సార స్వరూపుడను కావాలి. అనగా, నాలోని అహంకారము పూర్తిగా నశించవలెను. ఇందువలననే, నిత్యపూజ ఆవశ్యకమని పెద్దలు చెప్పెదరు. పూజలోని అర్థము తెలియకపోయినా, పూజను చేయవలెను. దాని యందు మన సంస్కృతి వ్యక్తమగును.

## సమర్పింపబడే వస్తువు ప్రముఖము కాదనుటకు కారణమేమి?

మనము కొన్ని పుష్పములను సమర్పించిన కారణంగా భగవానుడు సంతోషించడు. మనము చేసే సమర్పణ వలన గాని, స్తోత్రముల వలన గాని భగవానుడు పొంగిపోడు. ఏలయన, నీవు భగవంతుని గురించి ఎంత ఎక్కువ ఊహించినా, అది ఆయన యథార్థ మహిమ కంటె తక్కువగనే యుండును. అప్పుడే గుణకారములను నేర్చిన శిశువు తనకు హోమ్‌వర్కులో

సహాయపడిన తండ్రితో 'నాన్నగారూ! మీరు గొప్ప గణిత శాస్త్రజ్ఞులు' అనును. ఆ శిశువు ఎట్లు తెలియును? ఆ శిశువు తనకు తెలిసిన కొద్ది గణితమును దృష్టి యందిడుకొని, 'గొప్ప' గణితజ్ఞుని గురించి మాటలాడును. లోకములో బిరుదుల నిస్తూ ఉంటారు. వాస్తవంలో బిరుదునిచ్చే యోగ్యత గలవాడు మాత్రమే బిరుదునీయవలెను. మనము 'సర్వజ్ఞుడు' అను పదమునైననూ వర్ణదోషము లేకుండగా వ్రాయనేరము. భగవానుడు సర్వజ్ఞుడు అని అంటాము. అంటే మనకు వాస్తవంగా తెలిసినది ఏమి? మనకు గల అల్పజ్ఞానముతో భగవానుని సర్వజ్ఞతను గుర్తెరుంగుట ఎట్లు సంభవమగును? మనకీ సర్వజ్ఞత్వమును గూర్చి ప్రత్యక్షజ్ఞానము లేనే లేదు. వ్యక్తి తన వైయక్తిక మస్తిష్కపు పరిధి నుండి బయటపడనిదే జ్ఞానము ప్రత్యక్ష జ్ఞానము కాజాలదు. అపుడు మానవుడు 'ఆ సర్వజ్ఞుడను నేనే' అని చెప్పగల్గును. అదియే ముక్తి. స్వీయ మస్తిష్కపు పరిధిలో నుంటూ సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వ శక్తిమాన్ అగు ప్రసక్తియే లేదు. కావున, భక్తుడు చేయు స్తోత్రములన్నియూ భగవానుని యథార్థ మహిమ యొక్క దరిదాపులకైననూ చేరవు. కావున, మన స్తోత్రములతో భగవానుడు పొంగిపోడు. మన సమర్పణలతో ఆయనకు పనిలేదు.

మనము భగవంతునకు ఏదైనా సమర్పిస్తే, ఆయన దానిని పట్టుకుపోడు. ఆయన పట్టుకుపోయే పక్షంలో, ఎవ్వరూ దానిని సమర్పించరు. కాని మన ఇంటికి వైదిక కర్మను చేయించటానికి వచ్చే పురోహితుడు సంచిని తెచ్చుకువచ్చును. కర్మ జరుగుతూ ఉంటే, వివిధ సమయములలో వివిధ వస్తువులను ఆయనకు సమర్పిస్తాము. ఆయన వాటిని తన సంచీలో వేసుకుంటాడు. భగవానుడు మన సమర్పణలను తీసుకుపోయే పక్షంలో, వాటిని పదిలపరచే సంచీ ఒకటి ఆయనకు అవశ్యకమగును. భగవానునకు తనదైన స్థానము ప్రత్యేకముగా ఏది గలదు? భగవానుడు లేని స్థలము ఒకటి ఉన్నచో, ఆయన స్వంత స్థలము ఒకటి ఉండును. కాని ఆయన సర్వవ్యాపి. స్థలములన్నీ ఆయన స్థలములే. సర్వము ఆయనయే గనుక, ఆయనకు స్వంత స్థలము లేదు. కావున, మనము సమర్పించిన వస్తువులు ఎక్కడ ఉన్నవి అక్కడనే ఉండును. ఇట్టి స్థితిలో సమర్పించుట ఎందులకు?

## ప్రార్థనకు ప్రయోజనమేమి?

జనులు తరుచుగా నన్ను ఒక ప్రశ్నను వేస్తారు. భగవానుడు సర్వవ్యాపి గదా! ఆయన నాకు లోపల, బయటా కూడ గలడు. అట్లైనచో, నేను ప్రార్థనను ఏల చేయవలెను? 'అట్లైనచో' అను సందేహమును విడనాడుడు. భగవానుడు సర్వత్రా ఉన్నాడు. ఈకా సత్యము తెలిసినచో,

ప్రార్థన చేయవలసిన పనిలేదు. కాని, నీకా సత్యము తెలియనిచో, ఆ జ్ఞానమును పొందుటకై ప్రార్థించుము. భగవానుడు సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు. నీవు కూడా భగవానునిలో భాగమే. కాని నీవు నిన్ను భగవానుని కంటె భిన్నముగా దర్శించుచున్నట్లున్నావు. నీవు భగవంతుని తెలియకపోతివి. నీవా భగవంతుని ప్రార్థించుము. 'ఓ భగవాన్! నీవు సర్వ వ్యాపివని చెప్పగా నేను విన్నాను. నీవు సర్వవ్యాపివి ఎట్లు అగుదువో నాకు చూపుము. నీలో నేను అంతర్భూతుడనెట్లయితిని? ఉన్నది భగవానుడొక్కడేనా? అంటే, నేను భగవానుడనేనా? ఇదెట్లు సంభవము? ఈ విషయమును దయతో నాకు ప్రదర్శించుము'.

ప్రార్థన వెనుక గల స్ఫూర్తి, భావన ఎంత ప్రముఖమో, ప్రార్థన అనే క్రియ కూడ అంతే ప్రముఖమైనది. జ్ఞాని విషయంలో తప్పిస్తే, అజ్ఞానుల విషయంలో క్రియ లేనిదే స్ఫూర్తి కూడ ఉండదు. జ్ఞాని యొక్క జీవనమే ఒక ప్రార్థన. కాని, జ్ఞాని కాని వ్యక్తికి, స్ఫూర్తి లేకపోయినా, క్రియను ఆచరిస్తూ ఉంటే, స్ఫూర్తి ఉదయించగలదు. ఏలయన, ప్రార్థన అనే క్రియను స్ఫూర్తికి ప్రవేశము లేని విధంగా ఆచరించుట సంభవము కాదు. దీనికి కారణమేమనగా, ఈ ప్రపంచములో పరిపూర్ణస్వేచ్ఛతో చేయబడే కర్మలలో ప్రార్థన మొట్టమొదటిది. ప్రార్థన వెంటనే ఫలము నీయని కర్మ గదా! కావున, ప్రార్థనలో ఇచ్ఛా స్వాతంత్ర్యము (free will) పరిపూర్ణముగా ప్రకటమగును. ఇతర కర్మ లన్నింటి యందు ఏదో ఒక ప్రేరణ ఉండి తీరును. తాను కోరిన దానిని సాధించి తీరాలనే తీవ్రాకాంక్ష గల వ్యక్తి అట్టి ఆకాంక్షలచే ప్రేరితుడై అనవరత కర్మణ్యతలో నుండును. కాని అదే వ్యక్తి చూస్తూండగానే పనులన్నిటినీ వీడి, ప్రార్థనము చేసినాడనుకొనుడు. అది నిశ్చితముగా స్వేచ్ఛాకృతమగు కర్మ యని చెప్పవచ్చును. మరియు, ఒక వ్యక్తి మరియొకనిని ప్రార్థన చేయునట్లు చేయలేడు గదా! పిల్లలు కళ్లని మూసుకుని భగవానుని నామమును ఉచ్చరించునట్లు పెద్దలు చేయగల్గుదురు. కాని వారు ప్రార్థన చేయుచున్నారని చెప్ప వీలు లేదు. ప్రార్థన పూర్తిగా వ్యక్తి వశములో నుండును.

నా బాల్యంలో మాకు పెద్దలు కొన్ని నియమాలను పెట్టేవారు. గాయత్రీ మంత్రజపమునకు ముందు, మరియు వెనుక పెద్ద తంతు గలదు. దానిని పూర్తి చేయుటకు 50 నిముషముల సమయము పట్టును. దానిని పూర్తిచేయనిదే మాకు కాఫీని ఇచ్చెడివారు కాదు. కావున, కాఫీ కొరకై మేము ఆ ప్రార్థనను చేయవలసి వచ్చెడిది. కాని, తల్లిని సంతోషపెట్టి ఉదయమే కాఫీని సంపాదించుటకై జపమును చేసినచో, అది ఒక క్రియ అగునే గాని, ప్రార్థన కాజాలదు. కాని, క్రియను ఆచరిస్తూ ఉంటే, స్ఫూర్తి క్రమంగా అలవడుతుంది.

ప్రార్థనా క్రియలో కొంత స్ఫూర్తి కూడ ఉన్నచో, అది వాస్తవమగు ప్రార్థన యగునని మనము చెప్తాము. నీవు నీ నిస్సహాయతను గుర్తించి ఈశ్వరుని తెలుసుకునే ప్రయత్నమును చేయుచున్నావను సత్యము ప్రార్థనలో వ్యక్తమగును. నీవు వివేకిగా జీవితమును కొనసాగించుటలో ఇది సహాయపడును. తనలోని దోషములను, మరియు గుణములను కూడ తెలుసుకున్నవాడు అత్యంత వివేకి యనదగును. తన గుణములను మాత్రమే ఎరింగినవాడు అత్యంత వివేకి యని నేను చెప్పను. తన నిస్సహాయతను మాత్రమే గాక, అనంతత్వాది గుణ విశిష్టుడగు ఈశ్వరుని కూడ గుర్తించిన వ్యక్తిలో వివేకము పూర్ణముగ నుండును. అట్టి వ్యక్తి యొక్క పూర్ణజీవనము ప్రార్థన యొక్క వ్యక్త రూపము తక్క మరియొకటి గాదు.

## ప్రార్థనలోని తంతు మారినా, స్ఫూర్తి సమానమే

మతములు, సంస్కృతులు అన్నింటిలో ప్రార్థన యొక్క ప్రాముఖ్యము గుర్తింపబడినది. కాని విభిన్న మతములకు విభిన్న ప్రార్థనా రీతులు గలవు. ఈ రీతులకు ఆయా సంస్కృతులు మాత్రమే ఆధారమై యున్నవి. అన్నింటిలో ప్రార్థన సమానమే. ప్రార్థన చేసే తీరు విభిన్న మతములలో వివిధముగా విధింపబడియున్నది. కొందరు షోడశోపచార పూజను ఒక క్రమములో చేస్తారు. పరమేశ్వరునకు ఒక పత్రమును, ఒక పుష్పమును, ఒక ఫలమును, మరియు నీటిని సమర్పిస్తారు. ఇవి ఏమీ దొరక్కపోయినా పరవాలేదు. వాటిలో కొన్నింటిని గాని, లేదా అన్నింటిని గాని మానసికముగా సమర్పించవచ్చును. పూజను అంతనూ కూడ మానసికముగా చేయవచ్చును. కాని మానసిక పూజలో సమర్పణను పత్రపుష్పాదులకు మాత్రమే పరిమితము చేయనక్కరలేదు. ఎంతవరకు ఊహించగలమో, అంతవరకు మానసపూజలో అర్పించవచ్చును. కాని, ప్రార్థన అనే క్రియ ప్రముఖమైనదని భగవానుడిచట నిర్దేశించుచున్నాడు. పూజ అనే ఒక ఆరాధనా క్రియను ఈ శ్లోకము సిఫారసు చేయుచున్నది. నీవు వైదిక క్రతువులను చేయకపోవచ్చును. నీవు పత్రపుష్ప ఫలములను, జలమును అర్పించి పూజను మాత్రము చేసిన చాలును.

కలియుగములో మానవుల మనస్సులు కల్మషముతో నిండి, విధ్యుక్తకర్మలను చేయజాలరనియు, అట్టి మానవులు భగవాముని నామమును జపించినచో కృతార్థులగుదు రనియు చెప్పే శ్లోకమొకటి గలదు*. కల్మష చిత్తులు అన్ని యుగములలో గలరు. కాన, అంతఃకరణశుద్ధిని

---

* కలౌ కల్మష చిత్తానాం పాప ద్రవ్యోప జీవినామ్
విధి క్రియా విహీనానాం హరే ర్నామైవ కేవలమ్.
అంతఃకరణశుద్ధి కొరకు

గోరు మానవులందరికీ ఈ శ్లోకము వర్తించును. మానవులలో రాగద్వేషాది దోషములుండుటచే, వారు ఆదాయమునకు మించిన భోగవిలాసములకు అలవాటుపడి, అధర్మ మార్గములో ధనమును సంపాదించెదరు (పాప ద్రవ్యోప జీవినామ్). మానవుడు తన అన్వేషణలను విశ్లేషించినచో, తాను పొందే భోగము లన్నియు మరియొకనికి నష్టములగునని తెలును. తరచుగా మరియొక ప్రాణిపై దురాక్రమణ లేనిదే వ్యక్తికి పండుగ అవదు. అనగా మానవుని నిత్యజీవితములో పాపము అంతర్భాగమై యున్నది. పూర్వజన్మలలో సంచితమైన కల్మషములకు తోడు ప్రతినిత్యము కల్మషములు జతగూడుచున్నవి. ఈ కల్మషములను తొలగించుట శక్యము కాకున్నది. వేదములలో వర్ణాశ్రమానురూపముగా విధింపబడిన అగ్నిహోత్రాది నిత్య నైమిత్తిక కర్మల ననుష్ఠిస్తే ఈ కల్మషములు తొలగిపోవును. కాని వీరికి వర్ణాశ్రమానురూపముగా విధింపబడిన కర్మలతో సంబంధము లేదు. వీరు తమయందలి కల్మషముల నన్నిటినీ క్షాళన చేసుకొని, అంతఃకరణ శుద్ధిని పొందుట యెట్లు? వారికి హరినామస్మరణయే ఏకైక ఉపాయము (హరేర్నామైవ కేవలమ్). పూజ, కీర్తన ఇత్యాదులు స్మరణ లోనివే యగును.

సమర్పణ ఏదైనా భక్తితో కూడినదై ఉండాలి (భక్త్యుపహృతమ్). సాధకుడు శుద్ధ హృదయముతో పత్ర పుష్పాదుల నర్పించి భక్తిచే ఆర్ద్రమగు హృదయము కలవాడగును. ఆ సమర్పణ ఏమగును?

### భక్తితో చేసిన సమర్పణను భగవానుడు స్వీకరించును

'అహం అశ్నామి. నేను భుజించెదను. అనగా నేను స్వీకరించెదను' అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. అనగా, భక్తుడు తాను చేసిన సమర్పణకు ఫలమును (అంతఃకరణ శుద్ధిని) పొందును. విస్తారమగు క్రతువులను చేయ బనిలేదు. గుర్తించి ప్రార్థించినచో చాలును. ప్రార్థన అను క్రియ చాల ప్రముఖమైనది. దానిని అంతఃకరణ శుద్ధి కొరకు ఆచరించవలెను. తద్ద్వారా మోక్షము సుగమమగును. ఈ శ్లోకములోని తాత్పర్యమిదియే. భగవానుడు మన ప్రార్థనను స్వీకరించినచో, ఆ క్షణములో నీవు అనుగ్రహింపబడితివి.

భాగవత పురాణములో దీనిని వివరించు గాథ ఒకటి గలదు. సుదాముడను బీదవాడొకడుండెను. అతనికి కుచేలుడను పేరు కూడ గలదు. అతనికి భార్య, 27గురు పిల్లలు గలరు. సాందీపని మహర్షి పాదముల చెంత అతడు, శ్రీకృష్ణుడు కలిసి ఒకే గురుకులములో విద్య నభ్యసించిరి. ఆ మహర్షి వద్ద అధ్యయనము చేసిన సుదామునకు గొప్ప అంతర్ముఖత్వము,

అబ్బినవి. అతడు గృహస్థుడు. అతని కుటుంబము పెద్దది. వారందరికీ ఆహారమును ముకూర్చవలసిన బాధ్యత అతనికి గలదు. కాని అతడు ఉల్లాసముగా, భగవంతుని ఆరాధిస్తూ ండెడివాడు. అతని చిరుసంపాదనతో ఇల్లు గడచుట కష్టమయ్యెను. అతని భార్య కష్టముల ర్వలేకుండెను. ఒకనాడామె సుదామునితో నిట్లనెను: 'మీరు శ్రీకృష్ణునితో కలిసి ఒకే రుకులములో అధ్యయనము చేసితిరి గదా! శ్రీకృష్ణుడిపుడు ద్వారకాధిపతి. ఆయన హాయ్యమును కోరుడు'. శ్రీకృష్ణుని వద్దకు వెళ్లి స్నేహము పేరిట దానము నడుగుట దామునకు సమ్మతము కాలేదు. కాని ఆమె మాటయే నెగ్గినది. సుదాముడు అంగీకరించెను. ని ఆయన మనస్సులో నిట్లు చింతిల్లెను: 'నేను బాల్యమిత్రుడగు శ్రీకృష్ణుని వద్దకు ము లేకుండగా, రిక్తహస్తములతో నెట్లు వెళ్లగలను? ఆయన సామాన్య పౌరుడు కాడు. వ మహారాజు. రాజు, దైవము, గురువుల వద్దకు ఉత్తి చేతులతో వెళ్లరాదు. (రిక్తపాణి ర్న ్యత రాజానం దైవతం గురుమ్). ఆయనకు ఇచ్చుటకై నా వద్ద ఏదియూ లేకున్నది'. ఆయనకు ఈయదగిన వస్తువు ఒకటి తన వద్ద గలదని అతని భార్య చెప్పెను. ఒకనాడు సుదాముడు కొన్ని టుకులను ఇంటికి తీసుకురాగా, ఆమె వాటిలో కొన్నిటిని దాచిపెట్టినది. అవి మూడు గుప్పెళ్లు మాత్రమే గలవు. ఆమె వాటిని ఒక పాతగుడ్డలో మూట గట్టి ఇచ్చెను. సుదాముడు ద్వారకకు వెళ్లెను. అతని రాక గురించి శ్రీకృష్ణునికి తెలిసెను. ఆయనను పూర్ణ సమ్మానముతో అంతఃపురములోనికి దోడ్కొని రండని శ్రీకృష్ణుడు ఆదేశించెను. శ్రీకృష్ణుడు క్రిందకు వచ్చి సింహద్వారము వద్ద సుదాముని ఆహ్వానించి, పాద ప్రక్షాళనముచేసి, అంతఃపురములోనికి దోడ్కొని వెళ్లెను. బ్రాహ్మణుడు అతిథియై వచ్చినచో రాజు సాదరముగా ఎదురేగి, పూజించవలెననే శాస్త్ర విధి ఆ రోజులలో పాటించబడేది. అపుడు శ్రీకృష్ణుడు సుదామునితో 'నా కొరకు నీవు ఏమి తెచ్చితివి?' అని అడిగెను. సుదాముడు ముందు మాటలాడలేదు. తాను తెచ్చిన విలువలేని ఉపహారమును చూచి శ్రీకృష్ణుడు తప్పు పట్టునేమో యని ఆయన తలంచెను. ప్రాసాదమును, అంతఃపురమును చూచినంతనే సుదామునకు మతిపోయెను. అతని చుట్టూ లక్ష్మి తాండవించుచుండెను. ఇట్టి శ్రీకృష్ణుని కొరకు పాతగుడ్డలో మూటగట్టిన అటుకులను తెచ్చుట ఎంతటి మూర్ఖతయో అని ఆయన తలపోసెను. కాని అతని వస్త్రములలో దాగియున్న చిన్నమూటను శ్రీకృష్ణుడు వెదికి బయటకు తీసెను. ఆయన వాటిని తినుట మొదలిడెను. ఒక గుప్పెడు తిని, రెండవ గుప్పెడు కూడా తినెను. ఆయన మూడవ గుప్పెడు తినబోతూ ఉంటే, ప్రక్కనే ఉన్న ఆయన భార్య యగు రుక్మిణి చేయి పట్టుకొని ఆపివేసెను. భగవానుడు తీసుకొని తినుట అనే క్రియ (గ్రహణము) అనుగ్రహమై విలసిల్లును. శ్రీకృష్ణుడు ఒక గుప్పెడు అటుకులను

తినగానే, అక్కడ సుదాముని గ్రామములో అతని పూరిగుడిసె ప్రాసాదముగా మారిపోయెను. అతని భార్యకు, పిల్లలకు హఠాత్తుగా క్రొత్త దుస్తులు అమిరెను. శ్రీకృష్ణుడు అటుకుల నన్నిటినీ తిన్నచో, జగత్తు అంతా సుదాముని వశమై ఉండెడిది. భగవంతుని అనుగ్రహము అట్టిది. అందువలననే రుక్మిణి ఆయనను ఆపివేసెను. భగవానుడు స్వీకరించిన మరుక్షణము ఆయన అనుగ్రహము లభించును. శ్రీకృష్ణుని స్వాగత సత్కారములకు సుదాముడు బ్రహ్మానందపడెను. ఆయనకు అన్ని సౌకర్యములతో గూడిన చక్కని వసతి ఈయబడెను. చిరకాలము తరువాత మిత్రుని కలిసిన ఆనందములో అతడు శ్రీకృష్ణుని సాహాయ్యమును కోరుట మరచెను. అతడు తన గ్రామమునకు తిరిగి వెళ్లెను. కాని ఆ గ్రామము తనదేనా, లేక మరియొక గ్రామమా అని అతనికి సందేహము కలిగెను. అచటి సర్వము మారిపోయెను. ఒకప్పుడు ఎండి ఉన్న చెరువులు నీటితో నిండియుండెను. చెట్లు పుష్ప ఫలభరితములై యుండెను. అతడా స్థలమును గుర్తుపట్టలేకపోయెను. ఇంతలో అతని భార్య, పిల్లలు అతనిని చుట్టుముట్టిరి. భగవానుడు తీసుకున్నాడంటే, ఇచ్చినట్లే.

మనము ప్రార్థించగల్గుతున్నామంటే, అది కూడా ప్రార్థనాఫలమే. నీవు నీ హృదయమును విప్పి ప్రార్థించగలవా? పరిశీలించుకొనుము. మన మనస్సులో చాల దుఃఖము, ద్వేషము, నిరాశ నిండియుండగా, మనస్సును విప్పి ప్రార్థించుట చాల కష్టము. ప్రార్థన వ్యర్థము అని బోధించే శతాధిక యుక్తులు మనకు తోచుచుండును. కావున, అసంఖ్యాకము లగు ప్రార్థనాభాసలను (as though prayers) చేయనిదే, యథార్థమగు ప్రార్థన సిద్ధించదు. వ్యక్తి పూర్ణ స్వేచ్ఛతో చేయు క్రియ ప్రార్థన యని నేను చెప్పియున్నాను. ప్రార్థనలో మానవుని ఇచ్ఛా స్వాతంత్ర్యము అత్యధికముగా వ్యక్తీకరణ చెందును గాన, ప్రార్థన అత్యంత ప్రభావ శాలియగు కర్మ. సంకల్పశక్తి యొక్క పాత్ర ప్రార్థనలో పూర్ణముగా నుండును. మానవుడు ఇతరుల ఒత్తిడికి తల యొగ్గి ప్రార్థనను చేయడు. వ్యక్తి తనంత తానుగా ప్రార్థనను చేయును. దాని ఫలము నిశ్చితముగా లభించును. ఇందువలననే, శ్రీ శంకరులు గృష్ణామి అనగా అనుగృష్ణామి అని వ్యాఖ్యానించిరి.

భక్తితో చేయు క్రియ అంతఃకరణ శుద్ధికి సాధనమగును గాన, అది చాల ప్రముఖమైనది. తన దోషములను, అల్పత్వములను గుర్తించిన వ్యక్తిలో ఒక స్థాయికి చెందిన శరణాగత భావన ఉదయించి, ఇట్టి క్రియల నాచరించును గాన, ఈ క్రియలు వ్యక్తి మనస్సును భక్తితో నింపగల్గును. మానవుడు తన నిస్సహాయతను గుర్తించిన తరువాత, ఈశ్వరుడు అనంతుడని గుర్తించగల్గితే, ఆ గుర్తింపు యథార్థ జ్ఞానముగా పరిణతి చెందుటకు భక్తితో చేసే ఈ క్రియ సహకరించును.

శరణాగతి అనే కర్మ ద్వారా శరణాగతి భావన క్రమముగా దృఢమగుచుండును. కాన భావనతో బాటు కర్మ కూడ ప్రాముఖ్యమును సంతరించుకొనును. వచ్చి పోయేదిగా ఉండే ఈ భావన కర్మ ప్రభావముచే స్థిరమగును. ఇట్టి స్థిరమగు భక్తి భావనతో నిండిన హృదయము గల వ్యక్తి భక్తిని వ్యక్తము చేయు కర్మలను సాధనగా స్వీకరించి చేయబని లేదు. ఈ విషయమును తరువాతి శ్లోకము స్పష్టము చేయుచున్నది.

**అధ్యాయము 9, శ్లోకము 27:**

यत्करोषि यदश्नासि यज्जुहोषि ददासि यत् ।
यत्तपस्यसि कौन्तेय तत्कुरुष्व मदर्पणम् ॥ २७ ॥

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ (27).

**యత్** = దేనిని; **కరోషి** = చేసెదవో; **యత్** = దేనిని; **దదాసి** = దానము చేసెదవో; **యత్** = దేనిని (ఏ తపస్సును); **తపస్యసి** = తపస్సు చేసెదవో; **కౌంతేయ** = ఓ అర్జునా!; **తత్** = దానిని; **మదర్పణమ్** = నాకు సమర్పణముగా; **కురుష్వ** = చేయుము.

> ఓ అర్జునా! నీవు ఏ కర్మను చేసినా, ఏ పదార్థమును భుజించినా, ఏ హోమమును అనుష్ఠించినా, ఏ దానమును చేసినా, ఏ తపస్సును చేసినా, దానిని నాకు సమర్పింపుము (27).

నీవు చేయు కర్మల నన్నిటినీ – అవి లౌకిక కర్మలే గాని, శ్రుతి విహిత కర్మలే గాని, స్మృతి విహిత కర్మలే గాని – నాకు సమర్పిస్తూ అనుష్ఠింపుము (కురుష్వ మదర్పణమ్). భగవానుడిచట ఇట్లు చెప్పుటకు కారణమేమి?

సాధారణంగా మానవులు స్వీయ యోగ క్షేమముల కొరకై క్రతువులు, ప్రార్థనలు ఇత్యాదుల ననుష్ఠించెదరు. ఒక వైదిక కర్మ కామ్య కర్మ కావచ్చును; లేదా నిష్కామ్య కర్మ కావచ్చును. నిష్కామ్యమనగా మనము ఫలము నపేక్షింపము అని అర్థము గాదు. ఫలము నపేక్షింపకుండగా ఎవ్వరైననూ కర్మను చేయజాలరు. దాని యర్థమేమనగా అంతఃకరణ శుద్ధి మినహా మరియొక ఫలము నపేక్షింపకుండుట. మనము ఏ కర్మను చేసినా, ఇట్టి పూర్తి విలక్షణమగు

మానసిక ప్రవృత్తితో చేసినచో, అది కామ్య కర్మ కాబోదు. మనము అపేక్షించేది అంతఃకరణ శుద్ధి మాత్రమే.

ఈ చిత్త శుద్ధి యనగా ఖచ్చితమగు అర్థమేమి? రాగద్వేషములకు వశుడు కాకుండుట. వాస్తవంలో మిగిలిన మానసిక సమస్య లన్నీ ఈ రెండు పదములచే వ్యాఖ్యానించ బడును. మనకు గల సమస్యను దేనిని విశ్లేషించినా, అది రాగద్వేషముల పరిధిలోననే యుండును. పూర్వము జరిగిన ఘటనలు నా ఇచ్ఛకు అనురూపముగా జరుగలేదు. కాన నాకు సమస్య కలిగినది. ఇప్పటి పరిస్థితులైననూ నాకు అనుకూలముగా లేవు. కాన నాకు సమస్య తలయెత్తుచున్నది. భవిష్యత్తులో నా కోర్కెలు తీరునని నాకు తోచుట లేదు. కాన అది నాకు మరియొక సమస్య అగును. సాధారణ సమస్యలైనా, అసాధారణ సమస్యలైనా, అన్నీ రాగద్వేషములలో అంతర్గతము లగుచుండును.

## ప్రార్థనకు, చిత్త శుద్ధికి మధ్య గల సంబంధము

అంతఃకరణ శుద్ధి అత్యంత ప్రముఖమైనది. దానిని పొందుటకై సాధన అనివార్యము. ఎందువలన? ప్రార్థనాయుతమగు మనస్సు మాత్రమే దీనినంతనూ అంగీకరించగల్గును. నేను నిస్సహాయుడనని గుర్తించిన నాడు మాత్రమే, నన్ను నేను క్షమించుకోగల్గుతాను. 'నేను అల్పశక్తి గల వ్యక్తిని' అని నేను సుస్పష్టముగా గుర్తించిన నాడు మాత్రమే నా గతమును, గతములో నేను చేసిన సర్వమును నేను పూర్ణముగా స్వీకరించగల్గుదును. గతములో జరిగిన దాని కంటె అధికమును నేను చేయగలిగి ఉండెడివాడను గాను అని నేను అంగీకరించగల్గుతాను. అట్టి గుర్తింపు కలిగి, మనస్సు ప్రార్థనా పూర్ణమైననాడు ప్రశాంతి నెలకొనును. ఈ విధముగా స్థిరపడిన మనస్సు యోగ్యమగు విచారమును చేయగల్గును. మోక్షము నందిచ్ఛ గల వ్యక్తిని గురించి భగవానుడిచట వివరించుచున్నాడు. ఇట్టి వాడు కర్మలను అంతఃకరణశుద్ధి కొరకై ఆచరించును. అదే కర్మను అతడు కామకామియై ఆచరించగల్గును. కాని అతని ఆకాంక్ష సాంసారిక వస్తువులపై లేదు. అతనికి మోక్షము నందు మాత్రమే ఆకాంక్ష గలదు. మోక్షము అతని కంటె భిన్నముగా లేదు. అతడు కర్మయోగియై కర్మఫల త్యాగమును చేసియున్నాడు. అతడు తన పాత్రను పోషిస్తూ కర్మలను చేయుచున్నాడు. కాని అతడు ధర్మార్థ కామముల కొరకు గాక, అంతఃకరణ శుద్ధి కొరకు మాత్రమే కర్మల నాచరించుచున్నాడు. లేదా అతడు విధులను పరిత్యజించి సన్న్యాసి కావచ్చును. అపుడాతడు పోషించవలసిన భూమికలు ఉండవు. ఈ తీరున కర్మయోగి మరియు సన్న్యాసి ఈశ్వరుని గుర్తించినవారై యుందురు. ఈ గుర్తింపునకే భక్తి యని పేరు.

తత్ కురుష్వ మదర్పణమ్. నీవు దేనిని చేసినా నాకు అర్పించుము. దీని భావమేమనగా యోగక్షేమరూపమగు ఫలమును నీవు అపేక్షించకుము. కర్మను చేసి భగవానునకు అర్పించుము. నీవు చేయు కర్మ భగవానుని యందు నీకు గల భక్తికి చిహ్నమగును. నీకు కావలసినది అంతఃకరణ శుద్ధి మాత్రమే. ఇట్టి సమర్పణ అంతఃకరణశుద్ధిని కలిగించును. మన సమర్పణ వలన భగవానుని స్థితి ఉన్నతము కాబోదు. కాని సమర్పణను చేయు వ్యక్తి యొక్క మనస్సు దానిచే సంపన్నమగును.

యత్ కరోషి. నీవు ఏ కర్మను చేసిననూ. భగవానుడిచట తిన్నగా అర్జునుని సంబోధించుచున్నాడు. నీవు చేయు కర్మల నన్నిటినీ సమర్పణముగా మార్చివేయుము. ఆ కర్మ యొక్క ఫలమును ప్రసాదబుద్ధితో స్వీకరించుము.

యత్ అశ్నాసి. నీవు దేనిని భక్షించిననూ. మనము భోజనము చేయుటకు ముందు ప్రాణాయ స్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయ స్వాహా, ఉదానాయ స్వాహా, సమానాయ స్వాహా అని చెప్పి, తరువాత బ్రహ్మణే స్వాహా అని కూడా చెప్పి ఆహారమును భగవంతునకు సమర్పించుటకు కారణమిదియే. ప్రాణరూపుడై ఉచ్ఛ్వాస నిశ్వాసములను నియంత్రించునట్టియు, అపానరూపుడై దేహము నందలి మాలిన్యమును విసర్జించుటలో తోడ్పడునట్టియు, సమానరూపుడై జీర్ణవ్యవస్థను కాపాడునట్టియూ, వ్యానరూపుడై రక్తప్రసారము నంతనూ అనుగ్రహించునట్టి భగవానునకు నేను సమర్పించుచున్నాను. బ్రహ్మణే స్వాహా. సమష్టి విరాట్ స్వరూపుడై వ్యష్టి దేహముల నన్నిటినీ అంతరాత్మ రూపుడుగా వ్యాపించి యున్న హిరణ్యగర్భునకు నేనీ ఆహారమును సమర్పించుచున్నాను.

యద్ జుహోషి. నీవు ఆచరించే శ్రౌతకర్మలను, స్మార్త కర్మలను, నిత్యకర్మలను, నైమిత్తిక కర్మలను నాకు సమర్పించుము. ఆ కర్మలను ధర్మార్థ కామముల కొరకు గాక, సమర్పణాభావముతో ఆచరించుము. దీని యందు మానసిక భావన ప్రముఖమైనది. నీవు చేసే సమర్పణతో భగవానుడు ఉప్పొంగిపోడు. సమర్పించకపోతే క్రుంగిపోడు. అయిననూ, ఈశ్వరునితో ఒక విశిష్ట మానసిక సంబంధమును కలిగి మనము సమర్పణ చేసినచో, అది దిన దినము మరింత ప్రభావశాలియై, మనలో ఒక విశిష్ట భావనను, మానసిక ప్రవృత్తిని నిర్మాణము చేయును. విష్ణువు అలంకార ప్రియుడు. శివభగవానుడు అభిషేక ప్రియుడు. సూర్యభగవానుడు నమస్కార ప్రియుడు. కాని, వాస్తవంలో వీటినన్నిటినీ మనము మన కొరకు, మన భక్తిని మరింత ప్రభావశాలిగా చేయుటకు అనుష్ఠిస్తాము. ఇచట మానసిక భావనకు మాత్రమే ప్రాధాన్యము గలదు. రెండు కర్రముక్కలు కలిపి శిలువయగును. టెలిఫోను స్తంభము లన్నియూ అటులనే యుండును. కాని అది ఒక భావనకు ప్రతీక. కావ అది ప్రభావశాలి యగును. ముస్లిము, క్రిస్టియను, యూదు, పార్శీ ఇత్యాది ఏ

మతమునకు చెందినవాడైనా తాను చేసిన ప్రార్థన యొక్క ఫలము నుండి ఏనాడూ వంచితుడు కాడు. ఈ విషయమును మనము స్పష్టముగా గ్రహించవలెను. సర్వమతములు భావనపై ఆధారపడి యున్నవి. భావనయే వ్యక్తిని భక్తునిగా తీర్చిదిద్దును.

యద్ దదాసి. నీవు దేనిని దానము చేసెదవో. బంగారము, అన్నము, నేయి, వస్త్రములు ఇత్యాదులను మానవులు దానము చేసెదరు. మనము ఇట్టి వస్తువులను ధార్మిక జీవనమునకు అంకితమైన బ్రాహ్మణులకు, పురోహితులకు దానము చేసెదము. పూర్వకాలంలో వారు సమాజహితము కొరకు కృషి చేసెడివారు. సమాజము వారి అవసరములను తీర్చెడిది. కావున, సాధారణముగా బ్రాహ్మణులకు దానములు ఈయబడెడివి. ఈ రోజులలో బీదలకు ఎవరికైననూ దానము చేయుచుండుట పరిపాటి.

యత్ తపస్యసి. ఒక విశిష్ట ఆధ్యాత్మిక అనుశాసనమును దేనిని అనుష్ఠించెదవో. ఉపవాసము, జపము ఇత్యాదిగా తపస్సులో అనేక రకములు గలవు.

వీటిలో దేనిని ఆచరించిననూ, నాకు సమర్పిస్తూ ఆచరించుమని భగవానుడు చెప్పెను. సమర్పణ ఇత్యాది అస్పష్ట ప్రయోగములను మనము సరిగా తెలుసుకోవాలి. లేనిచో, అనేక సమస్యలు ఉదయించును. 'కర్మ లన్నిటినీ భగవానునకు సమర్పిస్తూ చేయుట' అనగా నేమి? ఏ భగవానుడు? ఎక్కడి భగవానుడు? సమర్పించుట యెట్లు?

### సర్వమును భగవానునకు సమర్పించుట అనగా నేమి?

ఈశ్వరుడు మోక్షస్వరూపుడై ఉన్నాడని మనము ఎరుంగవలెను. మోక్షము కావలెనన్నచో, అంతఃకరణ శుద్ధి కొరకు యత్నించుము. ధర్మము ఈశ్వర స్వరూపమే గనుక, విధులన్నియూ ఈశ్వరుని కొరకు మాత్రమే. విధి యందు ఈశ్వర భావన యున్నచో, కర్తవ్య కర్మ ప్రముఖమై, రాగద్వేషములు వెనుకకు నెట్టివేయబడును. ఇంతేగాక, మనము ఆచరించే నైమిత్తిక కర్మలకు కూడా మోక్షమునకు దారితీయు అంతఃకరణ శుద్ధియే ప్రయోజనము గాని మరియొకటి గాదు. మోక్షేచ్ఛ యనగా ఈశ్వరుని యందు ఇచ్ఛ అనియే అర్థము. ఏలయన, మోక్షము ఈశ్వరుని కంటె వేరుగాదు. 'సర్వజగత్కారణమగు ఈశ్వరుడను నేనే; నా స్వరూపము పూర్ణము' అను ఎరుకయే మోక్షము. కావున మోక్షము కొరకు యత్నించుట యనగా ఈశ్వరుని కొరకు యత్నించుట కంటె వేరుగాదు. వివిధ క్రతువులను, ప్రార్థనలు మొదలగువాటిని అన్నింటినీ మోక్షమునకు ఆవశ్యకమగు అంతఃకరణ

కొరకు ఆచరించినచో, ఈశ్వరుని కొరకు అనుష్ఠించినట్లే యగును. కారణమేమంటే, మోక్ష రూపము ఈశ్వరుడు తక్క మరియొకటి గాదు. కావున, సాధకుడు చేసే ప్రార్థనలు, వైదిక ములు ఇత్యాది సర్వము ఈశ్వరుని కొరకు మాత్రమే ఉద్దేశింపబడినవి యగును.

ఇదే విధముగా దైనందిన జీవితములో మనము చేయవలసిన కర్తవ్య కర్మలన్నియూ ర్మనురూపము లైనచో, ఈశ్వరుని కొరకు ఉద్దేశింపబడినవే యగును. నీ రాగద్వేషములకు, బలహీనతలకు నీ కర్తవ్యముతో విరోధము ఉన్ననూ, వాటిని ప్రక్కన బెట్టి నీవు ధర్మానురూపముగా ము. ఏలయన, ధర్మమనగా ఈశ్వరుడే.

జీవితమునీ తీరున వెళ్లబుచ్చు అర్జునుని వంటి వ్యక్తికి ఏమి లభించును?

ధ్యాయము 9, శ్లోకము 28:

शुभाशुभफलैरेवं मोक्ष्यसे कर्मबन्धनैः ।
सन्न्यास योगयुक्तात्मा विमुक्तो मामुपैष्यसि ॥ २८ ॥

శుభా శుభ ఫలై రేవం మోక్ష్యసే కర్మ బంధనైః
సన్న్యాస యోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి (28)

ఏవం = ఈ విధముగా; శుభాశుభ ఫలైః = ఇష్టానిష్ట ఫలరూపములైన; కర్మ బంధనైః = కర్మ బంధములచే (నుండి); మోక్ష్యసే = విముక్తిని పొందగలవు; విముక్తః = విముక్తుడవై; సన్న్యాసయోగ యుక్తాత్మా = త్యాగము, కర్మయోగములతో సంపన్నమగు మనస్సు గలవాడవై; మాం = నన్ను; ఉపైష్యసి = పొందగలవు.

ఈ విధముగా ఇష్టానిష్ట ఫలరూపములైన కర్మ బంధముల నుండి విముక్తిని పొందగలవు. విముక్తుడవై, త్యాగముతో కర్మయోగముతో సంపన్నమగు మనస్సు గలవాడవై నన్ను పొందగలవు (28).

మోక్ష్యసే. నీవు విముక్తిని పొందెదవు. దేని నుండి? శుభాశుభఫలైః కర్మ బంధనైః. ఇష్టానిష్టములగు ఫలములను, అనగా సుఖదుఃఖములను ఇచ్చే కర్మలు మనలను బంధించును. కర్మ రెండు రకముల ఫలము నిచ్చును. ఒకటి ఇష్టఫలము (శుభఫలము). రెండవది అనిష్టము

(అశుభఫలము). కర్తకు ఇట్టి ఫలములనిచ్చు ఈ కర్మలు స్వరూపతః బంధకములై యున్నవి. సుఖ దుఃఖరూపములో సంప్రాప్తమయ్యే కర్మ ఫలమును కర్త అనుభవించవలసి యుండును. వాటిని అనుభవించుట కొరకై కర్తకు ఒక దేహము, మనస్సు, ఇంద్రియములు మొదలగునవి ఆవశ్యకమగును. అనగా అతనికి జన్మ ఆవశ్యకమగును. కర్మ వలన జన్మ వచ్చును. జన్మ నుండి కర్మ పుట్టును.

ఈ సర్వము నుండి విముక్తిని నీవు పొందగలవని భగవానుడు చెప్పుచున్నాడు. ఎట్లు?

ఏవమ్. ఈ తీరున. అనగా పూర్వశ్లోకములు రెండింటిలో చెప్పిన విధముగా చేయుట వలన. కర్మల నన్నిటినీ అచట వివరించిన తీరున ఈశ్వరార్పణ బుద్ధితో చేయు సాధకుని మనస్సు యోగముతో, మరియు సన్న్యాసము(త్యాగము)తో సంపన్నమగును(సన్న్యాసయోగయుక్తాత్మా). ఇదియే మోక్షము. మనమిచట కర్మను చేయు వ్యక్తిని గురించి చర్చించుచున్నాము గదా! (యత్కరోషి యదశ్నాసి యత్తపస్యసి). అట్టి స్థితిలో ఈ సన్న్యాసమునకు అర్థమేమి? శ్రీ శంకరులీ విషయమును స్పష్టీకరించిరి. ఇచట ఏక కాలములో సన్న్యాసము, యోగము అను రెండు గలవు. సాధకుడు కర్మ ఫలములను త్యజించినాడు గాన ఇది సన్న్యాసమగును. సాధకుడు సర్వకర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో నాచరించును. అతని అభిరుచి ఈశ్వరుని యందు మాత్రమే గలదు. ఇతరము నందు లేదు. అతనికి మోక్షమునందు మాత్రమే అభిరుచి గలదు. కాని ఈశ్వరుని కంటె మోక్షము వేరుగా లేదు గావున, అతనికి ఈశ్వరుని యందు మాత్రమే అభిరుచి గలదని చెప్పవచ్చును. సన్న్యాస శబ్దమునకు ధాత్వర్థము త్యాగము. సర్వమును పరిత్యజించిన జీవనశైలికి సన్న్యాసమను పేరు లోకప్రసిద్ధమై యున్నది. కాని మనమిచట ధాత్వర్థమును మాత్రమే స్వీకరించెదము. అతడు కర్మఫల త్యాగము చేసినాడు గాన, ఆ త్యాగము సన్న్యాసమే యగును. అతడుచేసినది కర్మత్యాగము కాదు. అతని త్యాగము మానసిక భావనారూపమైనది. సర్వక్రతువులు, ప్రార్థనలు, విధులు ఇత్యాదుల అనుష్ఠానమే ఇచటి ప్రకరణము. ఇచట మనము కర్మయోగమును గురించి మాటలాడుచున్నాము. అయినా దీని యందు కర్మఫల త్యాగము గలదు గాన ఇది సన్న్యాస యోగమైనది. ఈ సాధకుడు తన రాగద్వేషములను విడనాడి కర్మను ఇతరము కొరకు గాక, ఈశ్వరుని కొరకు మాత్రమే ఆచరించును. ఈసాధకుడు ఈశ్వరునకు అంకితమైనవాడు. కావున, అతని వ్రతము సన్న్యాసము అగుట సహజమే. అయినచో, అది యోగము ఎట్లగును? కర్మపద సామర్థ్యముచే అది యోగమగునని శ్రీ శంకరులు వివరించిరి. మరియు సన్న్యాసపదము కలదు గాన, అది కర్మయోగమగును. అట్లు కానిచో, అది అర్థకామముల కొరకు ఆచరింపబడే

కేవల కర్మయగును. అట్టి కర్మ పుణ్యపాపములను ఉత్పన్నము చేసి మానవుని బంధించును కర్మబంధనః). కాని ఈ సాధకుని కర్మలు అంతఃకరణశుద్ధిని కలిగించి తద్వారా మోక్షమునకు మార్గమును సుగమము చేయును గాన, ఇవి బంధించవు.

ఇచట ఒక క్రమము గలదు. ఇదే క్రమము అయిదవ అధ్యాయములో కూడ చెప్పబడినది.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మ భూతాత్మా కుర్వన్నపి న లిప్యతే (5-7)

ఇది గీతాశైలికి సంబంధించిన క్రమము. దీనిని తప్పక తెలుసుకోవాలి. లేనిచో, కర్మయోగమే మోక్షసాధనమనే అసంగతమగు అర్థము వచ్చును. దానితో శాస్త్రము పూర్తిగా చెడి, అనేక సమస్యలు తల యెత్తును. కావున, ఈ శ్లోకములో యోగయుక్తః అను విశిష్టపదమునకు కర్మయోగ సంపన్నుడు అను అర్థము వచ్చునని మరువరాదు. అట్టి వాడు ఏమగును? విశుద్ధాత్మా. శుద్ధమగు అంతఃకరణము గలవాడగును. అనగా అతడు ఇంకెంత మాత్రమూ రాగద్వేషముల వశములో లేడని యర్థము. కావున అతడు విజితాత్మా అగును. అనగా మనో నియంత్రణ గలవాడని యర్థము. మరియు జితేంద్రియః అగును. అనగా ఇంద్రియములను జయించినవాడని యర్థము. ఇట్టి వాడు సర్వభూతాత్మ భూతాత్మా యగును. కాలక్రమములో అతడే జ్ఞానమును పొందును. అపుడాతని ఆత్మ పరిచ్ఛిన్నముగ నుండదు. తనపై ఆరోపింపబడిన పరిచ్ఛేదముల నుండి, దోషముల నుండి ఆత్మ విముక్తమగును. సర్వప్రాణుల ఆత్మ అతడే యగును. అతడు కర్మలనాచరించినమూ, అవి వానిని బంధించవు (న లిప్యతే). ఈ విషయమే ఇచట మరల ప్రస్తావించబడినది.

కావున ఈ క్రమమును పాటించు వ్యక్తి కర్మనుండి విముక్తుడగును. ఈ విషయమును గమనించుడు. సాధారణముగా కర్మ బంధించును. కాని మానసిక ప్రవృత్తిని మార్చుకొని అదే కర్మను చేసినచో, అది మోక్షమునకు సాధనమగును. బంధకమగు కర్మయే బంధము నుండి విడిపించును.

ఈ సాధకుడు సర్వకర్మలను ఈశ్వరుని కొరకు చేయు భక్తుడు. అంతే గాదు. అతడు జిజ్ఞాసువు, కర్మయోగి, ముముక్షువు కూడా. అతడు సన్న్యాస యోగ యుక్తాత్ముడు గనుక, అతనికి జ్ఞానోదయమునకు కావలసిన అర్హతలన్నియూ గలవు. కావున, అతనికి జ్ఞానోదయము సరళమగును.

విముక్తః మాముపైష్యసి. కాలక్రమములో ముక్తుడవై నీవు నన్ను పొందెదవు. భగవానుడు మోక్ష్యసే అని ప్రయోగించినాడు. అనగా నీవు మోక్షమును పొందగలవు. కాని కొంత కాలవ్యవధి గలదు. జ్ఞానము కలుగుటలో సమయము పట్టదు. కాని అవరోధములను తొలగించుటకు సమయము పట్టును. కర్మయోగి అంతఃకరణశుద్ధిని పొందును. అట్టి శుద్ధమగు మనస్సుతో అతడు శాస్త్రమును తెలియగల్గును. తద్ద్వారా అతడు ముక్తుడగును. అతడు జీవించియుండగనే ముక్తుడగును. శాస్త్రము ద్వారా ఆత్మజ్ఞానమును పొందిన జ్ఞానికి అతని మనస్సు ఎట్టి సమస్యలనూ సృష్టించదు. కర్మయోగము లేనిచో జ్ఞానమునకు అవరోధములు తప్పవు. కాని కర్మయోగికి ఇట్టి అవరోధములుండవు. అవరోధములు లేని ఆత్మ జ్ఞానమే మోక్షము. ఉపదేశము, ప్రమాణము మరియు వస్తువు ఉపలభ్యమగుచునే యున్నవి. కావున, జ్ఞానము ఉదయించి తీరాలి. కాని జ్ఞానము ఉదయించవలసినది మనస్సులో గదా! ఆ మనస్సులో సమస్య ఉన్నచో, దానిని తొలగించవలెను. ఆ పనిని కర్మయోగము నెరవేర్చును.

జ్ఞాని జీవించియుండగనే ముక్తుడైనచో, మరణ సమయము నందాతనికి ఏమగును? మరణ సమయములో దేహము పతనము కాగానే, జ్ఞాని భగవంతునిలో ఐక్యమగును. అతని దర్శనములో జీవత్వధారణ నిర్మూలింపబడినది గనుక, మిగిలి యున్నది ఈశ్వరుడు మాత్రమే. జీవుడు ఈశ్వరునిలో లయమైనాడు. ఈశ్వరునితో ఒకటి అయినాడు. జ్ఞాని జీవించియున్నప్పుడు కూడా ఈశ్వరుడే. కాని ప్రారబ్ధకర్మ ప్రభావముచే, దేహేంద్రియ సంఘాతము కొనసాగుచుండును. అనగా దాని యందు భాసించే పరిచ్ఛేదములు, దోషములు కొనసాగును. కొంతకాలము తరువాత ఆ దేహము పతనమగును. ఆభాసరూపములైన పరిచ్ఛేదములు, దోషములు కూడ తొలగిపోవును. ఈశ్వరుడు మాత్రమే మిగిలియుండును.

ఇందువలననే, నీవు నన్ను పొందగలవు అని శ్రీకృష్ణ భగవానుడిచట చెప్పుచున్నాడు. ఇది భగవానుడు ఇప్పుడు ఉపదేశమును వినుచున్న జీవుని ఉద్దేశించి చెప్పిన మాటయే గాని, సచ్చిదానంద ఆత్మను ఉద్దేశించినది గాదు. ఇచట 'నీవు' అనగా జీవుడు, జిజ్ఞాసువు మాత్రమే. సర్వోత్కృష్టమగు సచ్చిదానంద ఆత్మ కాదు. 'నీవు నన్ను పొందెదవు' అనగా వ్యక్తిరూపములో నీవు మిగిలియుండవు. కాని సచ్చిదానంద బ్రహ్మ యగు నీవు ఉండెదవు.

తప్పుగా అర్థము చేసుకునే అవకాశము గల ప్రయోగములలో ఇది ఒకటి. నీవు నేనే. కాని, నీవు మరల నన్ను పొందెదవు. నీవు అపరిచితుడవా యున్నట్లు, నా వద్దకు మరలి వచ్చెదవు.

ఒక ప్రతీక రూపమగు శబ్దప్రయోగము మాత్రమే. భగవానుని వద్దకు వచ్చుట గాని, భగవానునకు దూరమగుటగాని లేదు. నీవు సర్వకాలములలో భగవానుని కంటె అభిన్నుడవు. సత్యమును గుర్తించుటయే పొందుట యగును.

## భగవానునకు పక్షపాత బుద్ధి గలదా?

'ఓ అర్జునా! నీవు చేయు కర్మల నన్నిటినీ (యత్ కరోషి యదశ్నాసి యజ్జుహోషి) నాకు సమర్పించుము' అని భగవానుడు పూర్వశ్లోకములో చెప్పియున్నాడు. ఈశ్వరుని కొరకు సర్వకర్మలను చేయువారు ఈశ్వరుని పొందెదరు. అట్లు చేయనివారు ఈశ్వరుని పొందజాలరు. ఈ నిర్ణయములో ఒక సమస్య గలదు. సామాన్య జనులకు వలెనే భగవానునకు కూడా రాగద్వేషములున్నట్లు తెలును. నీవు ఇంద్రుడవు, చంద్రుడవు ఇత్యాదిగా స్తోత్రములను చేయువారికి అయన లాభమును చేకూర్చును. అయనను విమర్శించువారికి అయన మొండిచేతిని చూపును. ఈనాడు రాగము, రేపు ద్వేషము. అయనను పొగిడినచో సర్వమునిచ్చును. అయనకు కోపము వచ్చినచో, నీకు దేనినీ దక్కనీయడు. ఈ ప్రపంచములో ఇట్టి పరిస్థితియే ఉన్నది గదా! భగవంతుడు దీనికి భిన్నంగా ఉండుననియు, అందరి యందు సమబుద్ధిని కలిగి ఉండుననియు, సర్వులకు ఇచ్చుననియు మనము తలపోసితిమి. సర్వకర్మలను భగవానుని కొరకు చేయు సాధకునిపై అయనకు ప్రీతి కలిగి 'నా వద్దకు రమ్ము' అనును. అయనను లెక్కచేయని ఇతరులను అయన కూడా లెక్కచేయడు. ఇది ఏమి? నీవు అయనను పరిగణిస్తే, నిన్ను అయన పరిగణిస్తాడు. లేనిచో లేదు. ఇది ఎట్టి భగవత్త్వము? నేను అయనను లెక్కచేయకపోయినా, అయన నన్ను పాలించవలెను. నాకు అయన ఉపకారమును దేనినీ చేసినట్లు దాఖలాలు లేవు. మరియు, అయన నాకు ప్రత్యక్షము కాడు. నేను అయనను లెక్కచేయుట ఎట్లు సంభవమగును? నాకు నా జీవితములో శతాధిక చింతలు గలవు.

కాని భగవానుడు సర్వజ్ఞుడు, పరమప్రేమ స్వరూపుడు, కరుణానిధి. అయన చూపు, అయన దయ నాపై ప్రసరించకుండునంత అపరాధమును నేను చేయలేదు. అయన నన్ను ఉపేక్షించుట తగదు. పిల్లవాడు బొద్దింకను చంపినాడనుకొనుడు. దానిని మనము పాపముని పరిగణించము. పిల్లవాడు భయముతో ఏదో చేసినాడు. ఒక వ్యక్తి చిన్న అపరాధమును చేసినమా, మనమాతనితో సర్దుబాటు చేసుకొనెదము. ప్రభుత్వ శాసనములు చిన్నపిల్లల విషయంలో చాల దయను చూపుచున్నవి. పిల్లలు ఏ పనిని చేసినా అమాయకత్వంతో చేస్తారు. ఇట్టి స్థితిలో సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు, పరమప్రేమ స్వరూపుడు, దయాసముద్రుడు అగు భగవానుని

ప్రవృత్తి ఎట్లున్నది? అయన దృష్టిలో క్షమించరాని నేరమును దేనిని నేను చేయగల్గుదును? వాస్తవంలో ఆయనకు కోపము రావాలంటే, నేనీ పూర్ణ జగత్తును నాశనము చేయవలసి యుండును. నేను కుజగ్రహమును చెల్లాచెదరు చేసి, భూమండలము నంతనూ ఎచటికో అపహరించుకొనిపోయి, ఆయన ఇంటిని పాడుచేసినచో, అపుడు ఆయన నాపై క్రోధమును పొందవచ్చును. కాని మానవుడు చేయగలిగే ఈ చిన్న చిన్న అపరాధములను, ఆయన తప్పక క్షమించవలయును. నేను రావణుని వలె వరుణ భగవానుని రప్పించి నా పూదోటలో మొక్కలకు నీళ్లను పెట్టించలేదు. వాయువును రప్పించి ఇల్లు ఊడిపించలేదు. రావణుడు దేవతలందరిపై దుర్వ్యవహారమును చేసినాడు గాన, అతనిని దండించుట న్యాయమే. కాని చిన్న చిన్న అపరాధములను చేసిన నన్ను దండించుట అయుక్తము. పొగిడిన వానిపైన మాత్రమే అమిత దయను చూపే ఈ భగవానుడు ఎట్టి వ్యక్తియో? నీవు అనంతుడవు, నీవు కృష్ణుడవు, నీవు రాముడవు, నీవు ఇది, నీవు అది అంటూ పొగడుటను నేను ఉపేక్షిస్తే, నేను మంచివాడను కానని ఆయన నిర్ణయించి, ఆ కారణంగా ఆయన నన్ను ఉపేక్షించును. అమాయకత్వముచే చిన్నదనముచే నేనాయనను ఉపేక్షించి యుండవచ్చును. కాని జ్ఞాన నిధి, దయాసముద్రుడు అగు ఆయన నన్ను రక్షించి తీరవలెను. ఆయనకు కూడ రాగద్వేషము లున్నచో, ఆయన ఏటి భగవానుడు?

ఇట్టి భగవానునకు భద్రత లేదని సుస్పష్టమగుచున్నది. ఆయనకు భక్తులనబడే అభిమానులు గలరు. కావున, ఆయన వారిపై శ్రద్ధను జూపును. తమ పనిని తాము చేసుకుంటూ, పెరిగి పెద్ద అయిన వారిని ఆయన ఇష్టపడడు. వాస్తవంలో ఆయన వారిని చూసి గర్వపడాలి. కాని వారు సర్వకాలములలో తనను చూచుచుండవలెనని ఆయన అపేక్షించుచున్నాడు. వారు పెరుగుట ఆయనకు సమ్మతమగుట లేదు. ప్రబుద్ధులైన పక్షపాతములేని తల్లిదండ్రులే ఆయన కంటె నయమనిపించుచున్నది. ఇంతటితో భగవానుని మనము మన స్థాయికి దింపివేసినాము. ఇదంతయూ ప్రతివాది వాదన (పూర్వపక్షము) అని మరువకుడు. దీనికి సమాధానము తరువాతి శ్లోకములో ఈయబడినది:

**అధ్యాయము 9, శ్లోకము 29:**

समोऽहं सर्वभूतेषु न मे द्वेष्योऽस्ति न प्रियः ।
ये भजन्ति तु मां भक्त्या मयि ते तेषु चाप्यहम् ॥ २९ ॥

సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్ (29)

**అహం** = నేను; **సర్వభూతేషు** = ప్రాణులన్నిటి యందు; **సమః** = సముడను; **మే** = నాకు; **ద్వేష్యః** = ద్వేషింపదగినవాడు; **న అస్తి** = లేడు; **ప్రియః** = ప్రియమైనవాడు; **న** = లేడు; **తు** = కాని; **యే** = ఎవరైతే; **మాం** = నన్ను; **భక్త్యా** = భక్తితో; **భజంతి** = సేవించెదరో; **తే** = వారు; **మయి** = నా యందున్నారు; **చ** = మరియు; **అహమపి** = నేను కూడ; **తేషు** = వారి యందున్నాను.

నేను ప్రాణులన్నిటి యందు సముడను. నాకు ద్వేషింపదగిన వాడు లేడు. ప్రియమైన వాడు లేడు. కాని ఎవరైతే నన్ను భక్తితో సేవించెదరో, వారు నా యందు, నేను వారి యందు ఉండెదము (29).

సమః అహం సర్వభూతేషు. సర్వప్రాణులలో నేను సమముగా నున్నాను. నేను ప్రాణులన్నిటి కంటె భిన్నముగా లేను. సర్వప్రాణుల ఆత్మ నేనే గనుక, అన్ని ప్రాణులలో సమముగా ఉన్న అనంత ఈశ్వరుడను నేనే. ప్రతి ప్రాణి నన్ను తన స్వరూపముగా భావించవచ్చును. వారు నా వద్దకు రాదగిన పనియే లేదు. వారే నేను. ఇట్టి స్థితిలో వారిపై నా ప్రవృత్తి ఎట్లుండును?

న మే ద్వేష్యః అస్తి. సర్వులు నేనే అయి ఉండగా, నాకు ద్వేషము ఉండుట ఎట్లు సంభవమగును? నన్ను నేను ద్వేషించలేను. తన గురించి ఎరుంగని వ్యక్తి మాత్రమే తనను తాను ద్వేషించగలడు. అట్టి అజ్ఞానము నాకు లేదు. సర్వము నేనే యని నేను ఎరుంగుదును. కావున, సర్వులు నేనే అగుదును గదా! నాకంటె భిన్నమగు వ్యక్తి ఎవ్వరూ లేనే లేరు. ప్రతి వ్యక్తియు ఏకైక పూర్ణ స్వరూపుడై ఉన్నాడు. అందువలననే మానవునకు పురుషుడని పేరు వచ్చినది. ఇట్టి స్థితిలో ద్వేషింపదగిన వారెవ్వరూ లేరు.

భగవంతుడు ఎవ్వరినీ ద్వేషించకపోవచ్చును. కాని, ఆయనకు ఒకనిపై ప్రేమగలదనుకొనుడు. ఆయన ఇతరుల యందు ఉపేక్షాభావము కలిగి ఉన్నాడని చెప్పుట కది చాలును. మరియు దాని వలన జీవులలో ఒక తర తమ భేదము స్థిరమగును. నేను ఎవ్వరినీ ద్వేషించను (న మే ద్వేష్యః అస్తి) అని చెప్పినంతమాత్రాన చాలదు. అందువలననే భగవానుడింకనూ చెప్పుచున్నాడు.

న మే ప్రియః అస్తి. నాకు ప్రియుమైన వారెవ్వరూ లేరు. మానవులలో ఇట్టి రాగద్వేషము లన్నియూ ఉండును. కాని ఈశ్వరునకు ఉండవు. అట్లైనచో, నన్ను ఆరాధించువారు నన్ను పొందెదరు ఇత్యాది వచనములను భగవానుడు చెప్పుటకు కారణమేమి? ఆయన బహుమతులను పంచుచున్నచో, కొందరు విశిష్ట వ్యక్తులకు మాత్రమే ఇచ్చి, ఇతరులను విడిచిపెట్టినాడని వ్రేలెత్తి చూపవచ్చును. కాని ఇచటి సమస్య ఏదనగా, అందరూ నా స్వరూపమేనని భగవానుడు చెప్పుచున్నాడు. వారు నన్ను ఎరుంగవలెను. వారికి ఇప్పుడు నేను ఏమగుదునో, అంతకు మించి అగుట సంభవము కాదు. వారికి ఇంతవరకు నేను ఎంత చేసితినో, అంతకు మించి నేను చేయజాలను. వారు నా స్వరూపమే అయి ఉన్నారు. వారు నా కంటె భిన్నముగా లేరు. నేను ఎవ్వరికీ బహుమతులను పంచుట లేదు. కాని నన్ను ఎరింగినవారు నన్ను పొందెదరు. ఇదంతయూ కర్మనియతి ప్రకారముగా జరుగుచున్నది. ఈశ్వరకృప కూడా కర్మఫలమే యగును. ఆ కృపను సంపాదించుటకు గాని, సంపాదించకుండుటకు గాని మానవులకు స్వేచ్ఛ గలదు. కావున ఇట్లు చెప్పదగును.

యే మాం భజంతి భక్త్యా. ఎవరైతే నన్ను అన్వేషించుచున్నారో, నన్ను స్తుతించుచున్నారో, నన్ను భక్తితో ఆరాధించుచున్నారో. ఇన్ని అర్థములను చెప్పవచ్చును.

మయి తే తేషు చాప్యహమ్. వారు నా యందు ఉన్నారు. మరియు నేను వారి యందు ఉన్నాను. వారు నన్ను అన్వేషిస్తున్నారు గనుక,వారు నా యందు గలరని చెప్పవచ్చును. తరువాత వారు నాలో ఐక్యమగుదురు గనుక, నేను వారి యందున్నానని చెప్పదగును. ఇతరుల మాట ఏమి? వారైననూ నా కంటె భిన్నముగా లేరు. కాని వారు నన్ను అంకితభావముతో, భక్తితో (భక్త్యా) ఆరాధించుట లేదు. వారట్లు చేసినచో, నేను వారి యందు, వారు నా యందు ఉండగలము. భగవానుడు ఇంతకు ముందు 'మత్ స్థాని సర్వభూతాని, న చ అహం తేషు అవస్థితః' అను స్థలములో సత్య మిథ్యా దృష్టికోణములో నుండి మాటలాడెను. కాని ఇచట ఆయన ఆ దృష్టికోణములో నుండి మాటలాడుట లేదని గమనించవలెను. సాధకుని ఆత్మ నేనే ననియు, కావున సాధకులందరు నా యందు గలరనియు, నేను వారి యందు గలననియు, వారికి నాకు మధ్య భేదము లేదనియు చెప్పి భగవానుడిచట శుద్ధ ఆత్మను నిర్దేశించుచున్నాడు. భగవానుడు జీవేశ్వరుల మధ్య గల సంబంధమును గురించి గాక, జీవేశ్వరుల అభేదమును గురించి చెప్పుచున్నాడు. అనగా, వారే నేను. వారు నా యందు ఉన్నారు. వారి అందరి ఉనికి ఆత్మ యందు గలదు. ప్రతి వ్యక్తి 'నేను ఫలానా' అని చెప్తూ ఉంటాడు. ఆ 'నేను' అనే ఉనికి పరమేశ్వరుడే. వారందరు ఏకైక పరమాత్మ వగు నా యందు ఉనికిని కలిగి యున్నారు. నేను వారందరి రూపములో నున్నాను.

భగవానుడిట్లు చెప్పుటకు కారణమేమి?

## ...శ్వరుల మధ్య గల సంబంధము అంశాంశి సంబంధము కాదు

ఒక సముదాయమునందు వివిధ భాగములు ఉండు తీరున, ప్రాణులన్నియూ భగవంతుని ...ందు ఉండునని కొందరు తలపోయుదురు. విశిష్టాద్వైతమనగా నిదియే. ఆత్మ సర్వదా పూర్ణము ...క, దాని యందు అంశములు లేవు. ఆత్మను విభాగము చేయ వీలు లేదు. ఒకే అగ్ని నుండి ...ధ స్ఫులింగములు వెలువడినట్లు, ఒకే ఈశ్వరుని నుండి విభిన్న జీవులు వెలువడినారనుటయూ ...ాదు. ఇచట స్ఫులింగము వేరుగా లేదు. స్ఫులింగమే పూర్ణము. ఈ మతవాదము లన్నింటికి ...ాలములు మానవుల మనో వైజ్ఞానిక సమస్యలలో నిహితమై యున్నవి. మానవుడు తన లోపల ...లోటును భావన చేసి, దానిని భర్తీ చేయుటకై 'నా వెనుక ఒక గొప్పవాని అలంబనము గలదు' ...భావించుకొనును. నాకు ఒక పెద్ద వ్యక్తి ఆసరాగా ఉన్నాడను భావన మానవులకు ఊరట ...ు. కావున, మేము విష్ణువు అనే ఒక పెద్దవానికి చెందిన వారము అను భావనలో ఒక ఊరట ... ఇది కేవలము ఒక మనోవైజ్ఞానిక విషయము మాత్రమే. ఒక పెద్దవాని అలంబనము ...ండాలనే భావనలో దోషమేమియూ లేదు. కాని మనమిచట సరళమగు మనోవైజ్ఞానిక ...ున్యలను గురించి చర్చించుట లేదు. మన చర్చ దానికి అతీతమైనది. జీవుడు ఈశ్వరునకు ...ందినవాడు గాదు. జీవుడే ఈశ్వరుడు.

'నేను ఈశ్వరునకు చెందినవాడను' అని భావించు వ్యక్తి 'ఈశ్వరుడు నాకు చెందినవాడు' ... కూడ భావించును. ఈశ్వరుని గురించి పదిలక్షల మంది ఇటులనే భావించెదరు. వారందరూ ...మాహితులే. ఈశ్వరుడు తనకు మాత్రమే గాక ఇట్టి బంధుత్వభావనను, అలంబనమును మరి ...ందరికి కూడా అనుగ్రహించినాడని తెలియగానే, వారి భక్తి పటాపంచలగును. ఒక వ్యక్తి ...అభినందన పత్రములను (greeting cards) విక్రయించు దుకాణములో ఒక విశిష్ట పత్రము కొరకు వెదుకుచుండెను. చాలసేపు వెదికిన తరువాత, దుకాణదారుని సహాయముతో తాను కోరిన పత్రమును కనుగొనెను. 'నేను నిన్ను మాత్రమే ప్రేమించుచున్నాను' అనిదానిపై ముద్రింపబడియుండెను. అపుడాతడు అట్టి పత్రములను ఒక డజను అతని వద్దనుండి కొనుగోలు చేసెను! ఇదే విధముగా, ఈశ్వరుడు కూడా ప్రతి ఒక్క భక్తునకు 'నేను నీవాడను' అను భావనను కలిగించును. ఆయన అటులనే చేసి తీరవలెను. లేనిచో, భక్తుడు ఒక్కడైననూ ఉండడు. కాని భక్తుల మధ్యలో ఒకడు మరియొకనిపై కన్ను వేసి ఉంచును. 'భగవానుడు నా వాడు. ఆయనకు ప్రీతిపాత్రుడను

నేనొక్కడినే. ఆయనయే నాకీ మాటను చెప్పినాడు' అని ప్రతి భక్తుడు తలపోయును. 'నాకు కూడ సరిగ్గా ఇటులనే చెప్పినాడండీ!' అని మరియొక భక్తుడు చెప్పగనే, అతని భక్తి చెల్లాచెదరగును. భగవానునిలో నేను ఒక అంశము అనే ధారణలో ఇట్టి ప్రమాదము గలదు. ఇదియే విశిష్టాద్వైతము. అందరు ఈశ్వరునకు చెందినవారే. కాని ప్రతి భక్తుడు తనకు మాత్రమే ఈశ్వరుడు కావలసినవాడు అని తలంచును. అట్టి భక్తునకు ఒకనాడు నిరాశ తప్పదు. 'ఈశ్వరునకు నా యందు ప్రత్యేకాభిమానమేమియూ లేదు. ఆయనకు సాధారణ భక్తులెందరో గలరు. వారిలో నేనొకడిని' అను భావన కలుగగానే, భక్తుని భక్తి ఎగిరిపోవును. కావున, ఇచట ఒకరికి మరియొకరు చెందియుండుట అను ప్రసక్తి లేదు. నీవే ఈశ్వరుడవు. ఈశ్వరుని అంశములుగా విభజించుటయూ, ఆ అంశములే విభిన్న జీవులు అనుటయూ పొసగదు. కావున జీవేశ్వరుల మధ్య భేద ప్రసక్తియే లేదు. కావున సర్వత్రా భగవానుడు గలడు. సర్వము భగవానుని యందు గలదు. సర్వమునకు, భగవానునకు భేదము లేదు.

నన్ను ఆరాధించని వారి యందు ద్వేషము గాని, ఆరాధించు వారి యందు రాగము గాని నాకు లేవని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుడు సర్వప్రాణులలో సమముగా నుండి (సమోఽహం సర్వభూతేషు) సర్వులకు ఉపలభ్యమగుచున్నాడు. కావున భగవంతుని స్వస్వరూపముగా గుర్తించవలసి యున్నది. సర్వుల ఆత్మ పరమేశ్వరుడే. భగవానుడు కొందరికి పరోక్షుడై దాగి ఉన్నాడనియు, ఆయన కొందరిని మాత్రమే ఎన్నుకొని దర్శనమిచ్చు ననియు భావించుట సరిగాదు. భగవానుడు కొందరికి ఉపహారములను, మరికొందరికి దండనలను ఇచ్చుననుట సరిగాదు. సర్వప్రాణులు తమ తమ కర్మల ఫలమును మాత్రమే అనుభవించుచున్నవి.

హరిః ఓం తత్సత్

శ్రీ గణేశాయ నమః

ఈశ్వరీయ జ్ఞానమును పొందుటకై మానవుడు చేయు సాధనకు భక్తి యని పేరు. అంకిత భావముతో గూడిన అట్టి భక్తి యొక్క చర్చను భగవాను డింకనూ కొన సాగించు చున్నాడు. 'అట్టి భక్తి యొక్క మహిమను గురించి వినుము' అని శ్రీ శంకరులు అవతారికలో ప్రస్తావించిరి.

**అధ్యాయము 9, శ్లోకము 30:**

अपि चेत् सुदुराचारो भजते मामनन्यभाक् ।
साधुरेव स मन्तव्य: सम्यग्व्यवसितो हि स: ॥३०॥

అపి చేత్సుదురాచారో భజతే మామనన్య భాక్
సాధురేవ స మంతవ్యస్సమ్యగ్ వ్యవసితో హి సః (30)

**సుదురాచారః** = మిక్కిలి చెడు నడవడి గలవాడు; **అపి** = అయిననూ; **అనన్యభాక్** = భేదభావన లేని వాడై; **మాం** = నన్ను; **భజతే చేత్** = సేవించినచో (అన్వేషించినచో); **సః** = అతడు; **సాధుః ఏవ** = మంచి వ్యక్తి అనియే; **మంతవ్యః** = పరిగణించదగును; **హి** = ఏలయనగా; **సః** = అతడు; **సమ్యగ్ వ్యవసితః** = స్పష్టమగు దర్శనము గలవాడు.

మిక్కిలి చెడు నడవడి గలవాడైననూ భేద భావనలేని వాడై సేవించినచో/ అన్వేషించినచో, అతడు మంచి వ్యక్తి అనియే పరిగణించదగును. ఏలయనగా, అతడు స్పష్టమగు దర్శనము గలవాడు (30).

అపి చేత్సుదురాచారః. అతని ప్రవర్తన మిక్కిలి దుష్టమే అయిననూ. సుదురాచారః అనగా మిక్కిలి చెడు నడవడి గలవాడు. అనగా అతడు కర్తవ్యకర్మలనన్నిటినీ పరిత్యజించి నిషిద్ధకర్మల నన్నిటినీ ఆచరించెడి వాడు. అతడు ఇతరుల సంతోషము గురించి గాని, క్షేమము గురించి గాని ఏమాత్రము పట్టించుకోడు. ఇట్టి పూర్తి స్వార్థపరుడుగు వ్యక్తి దురాచారుడగును. స్వార్థపరత్వములో అందరిపై అతనిదే పై చేయి అగును. లోకములో దుష్టులు చాల మంది గలరు. కాని వారందరిలో అతడు అగ్రసరుడు. సాధారణంగా దుర్ ముందు 'సు'ని ప్రయోగించరు. కాని ఇచట శ్రీ కృష్ణుడు దురాచార శబ్దమునకు ముందు 'సు'ని ప్రయోగించినాడు. ఈతని నడవడి ఇట్లు ఉన్ననూ, సర్వము నందు ఈశ్వరుని గాంచినాడు. ఈతనికి ఈశ్వరుడు తక్క మరియొకటి

కానరాదు (అనన్య భాక్). ఎన్నో దుశ్చర్యలను చేసినవాడే అయినా, ఒకానొక పూర్వపుణ్యవిశేషముచే ఈతడు ఈశ్వరుని యందు, ఈశ్వరీయ జ్ఞానమునందు భక్తిని తనలో ఆవిష్కరించుకొనినాడు. కావున ఈతడు అనన్యభాక్ అయినాడు. ఈశ్వర జ్ఞానము కొరకు చేయు సాధనలో అంకితమైనాడు. అతని నడవడి దుష్టమే అయిననూ, పరమేశ్వరుడనగు నన్ను అతడు అన్వేషించు చున్నాడు.

ఇపుడాతనికి ఏమగును?

సాధుః ఏవ స మంతవ్యః. అతడు సాధు స్వభావము గలవాడనియే పరిగణింపవలెను. ఏలయన, అతని ఆలోచన, లేదా అవగాహన స్పష్టముగా నున్నది (సమ్యగ్ వ్యవసితః సః). జీవేశ్వరుల గురించి అతని అవగాహన స్పష్టముగా నున్నచో, ఈశ్వరీయ సాధనకు అంకితమైన వానినిగా, యోగ్యమగు అవగాహన కలవానినిగా అతనిని గుర్తించుట సహజమే గదా!

ప్రవర్తనను బట్టి వ్యక్తిని సర్వదా అంచనా వేయజాలము

అతనికి ఇట్టి జ్ఞానము ఉన్నచో, ప్రవర్తన చెడుగా నుండుటకు కారణమేమి? ఇది ఒక తర్కము మాత్రమే. అందువలననే అపి చేత్ అని ప్రయోగింపబడినది. ఇది ఒక ఊహ. అటువంటి వ్యక్తి ఒకడు గలడనుకో ఒకడు ఈశ్వరుని కొరకు సాధన చేయుచున్నాడు. లేదా ఈశ్వరుడు ఆత్మకంటె వేరుగాదనే సరియగు అవగాహన అతనికి గలదు. అతని శీలమును అంచనా వేయుట ఎట్లు? అతనియందు అహంకారము లేదు. కాని అతడు తన తాత వద్దనుండి కొన్ని అలవాట్లను నేర్చుకొనెను. అతడు వాటిని కొనసాగించు చుండును. అవి మంచి అలవాట్లు కాకపోవచ్చును. దీనికి దృష్టాంతముగా మహాభారతములో ఒక గాథ గలదు.

ఒక బ్రాహ్మణుడు ఒక చెట్టు క్రింద కూర్చుండి భగవానుని కొరకు తపస్సును చేయుచుండెను. క్రమంగా అతనికి కొన్ని సిద్ధులు లభించెను. వాటి గురించి అతనికి తెలియదు. ఒకనాడాతడు చెట్టు క్రింద కూర్చుని యుండగా చెట్టుపై నుండి కొంగ అతనిపై రెట్ట వేసెను. అతడు దానికేసి కోపముతో చూడగా, అది కాలి బూడిద అయ్యెను. అపుడాతనికి తన శక్తిని గురించి తెలిసెను. అతడు ప్రతిదినము ఒక గ్రామములో భిక్షాటన చేయుచుండెడివాడు. అతడు చాల వినయము గల సాధువు. కాని తనకు గల శక్తి గురించి తెలియగానే, అతనిలో గర్వము ప్రవేశించెను. అతడొక ఇంటికి వెళ్లి భిక్షను గోరెను. కాని ఆ ఇల్లాలు అతనిని ఒక గంట సేపు నిలబెట్టి తరువాత భిక్షను వేసెను. అతనికి కోపము వచ్చి 'నీవిట్లు నన్ను నిలబెట్టుట దగునా?'

అని ప్రశ్నించెను. నేను చాల ప్రముఖమైన కర్తవ్యకర్మను చేయుచుంటినని ఆమె బదులిడెను. 'ఎవరితో మాటలాడు చుంటివో నీకు తెలియునా?' అని అతడు గద్దించెను. 'నాకు తెలుసు. కాని నేను కొంగను కాను' అని ఆమె చెప్పెను. 'నీకు కొంగ సంగతి ఎట్లు తెలిసినది?' అని అతడు ప్రశ్నించగా 'పోయి ధర్మవ్యాధుడనే మాంస విక్రేతను అడుగుము' అని ఆమె చెప్పెను. ఈతడు వెళ్లు సరికి ధర్మవ్యాధుడు ముదుసలి తండ్రి సేవలో తలమున్కలై యుండెను. ఈ బ్రాహ్మణుడు మరల వేచి యుండక తప్పలేదు. అయనకు చాల కోపము వచ్చి, ధర్మ వ్యాధునితో 'నీవు నన్నేల నిలబెట్టితివి?' అని గద్దించెను. 'ఆ ఇల్లాలు నిన్ను ఇచ్చటకు పంపినదా యేమి?' అని అతడు ప్రశ్నించెను. ఈ కథకు నీతి ఏమనగా, వ్యక్తి చేయుచున్న పనిని బట్టి అతనిని అంచనా వేయరాదు. ఒకామె గృహిణి. రెండవ వాడు మాంసవిక్రేత. కాని వారిద్దరు తమ కర్తవ్యములను నిర్వర్తించు చుండిరి. ఈ బ్రాహ్మణుడు గొప్ప తపశ్శాలియే అయినా, ఈతని కంటె వారిద్దరు గొప్పవారనుటలో సందియము లేదు.

## దుష్ట శీలము కొనసాగదు

ఉచితమగు అవగాహన కలిగి జ్ఞానసాధన చేయువాడు (సమ్యగ్ వ్యవసితః హి సః) సాధువు అని పరిగణింపబడినాడు. అట్టి వానిలో చెడు నడవడి కొనసాగబోదు. ఎట్లు కొనసాగగలదు? విశ్లేషించినచో దురాచారములన్నీ రెండు రకములుగా నుండును. ఒకటి అలవాటు. రెండవది వాస్తవమగు దుశ్చర్య. అలవాటు కాలక్రమంలో తొలగిపోవును. భద్రతలేని, పరిచ్ఛిన్నమగు అహంకారమే మానవులనేరప్రవృత్తికి కేంద్రముగా నుండును. అభద్రతా భావన అధికముగా గల వ్యక్తిలో ఘర్షణకు దిగే ప్రవృత్తి అధికముగా నుండును. కాని, అదే వ్యక్తిలో ఈశ్వర భక్తి ఉన్నచో, అట్టి ఈశ్వరస్వీకారము చేతనే అహంకారము పలుచబడును. ఈశ్వరీయ జ్ఞానమును అన్వేషించువానిలో ఈ అహంకారము మరింత పలుచబడును. ఇట్టి వానిలో మోసంచేయుట, కొట్టుట ఇత్యాది అభద్రత నుండి పుట్టే ప్రవణతలు (tendencies) అన్నీ సహజముగా దూరమగును.

దీనికి ఒక దృష్టాంతమును పరిశీలించుడు. దట్టమైన పత్తిలో నలకలు ఉండును. వాటిని ఒక్కొక్కటిగా ఏరుట చాల కష్టము. పత్తిని పలుచని చిన్న చిన్న అంశములుగా విడదీసుకుంటూ పోతే నలకలు వాటంతట అవియే జారిపోవును. అతుకు కొని ఉండే అవకాశము వాటికి ఉండదు. అదే విధముగా అహంకారము పలుచబడితే ఈ ప్రవణతలు దాని యందు అతుకు కొని ఉండలేవు. అవి అన్నీ జారిపోవును. నేరములన్నింటికి మూలములో భయము, స్వార్థము ఉండును. అవి అహంకారము

నుండి పుట్టును. అట్టి అహంకారము పలుచబడినచో, ఇవి దానికి అంటి పెట్టు కొని ఉండే ప్రసక్తి ఎక్కడిది?

శ్రీ శంకరులు తరువాతి శ్లోకమునకు అవతారికలో ఇదే సంగతిని వివరించినారు. అంతరంగములో ఆత్మను గురించి, ఈశ్వరుని గురించి స్పష్టమగు అవగాహన గల వ్యక్తి లో బాహ్యముగా దుశ్చర్య కాన వచ్చిననూ, అతడు దానిని శీఘ్రమే విడనాడును.

**అధ్యాయము 9, శ్లోకము 31:**

क्षिप्रं भवति धर्मात्मा शश्वच्छान्तिं निगच्छति ।
कौन्तेय प्रतिजानीहि न मे भक्तः प्रणश्यति ॥ ३१ ॥

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి (31)

క్షిప్రం =తొందరలో; ధర్మాత్మా = ధర్మమునకు అనురూపమగు మనస్సు గలవాడు; భవతి = అగును; శశ్వత్-శాంతిం = శాశ్వతమగు శాంతిని; నిగచ్ఛతి = పొందును; కౌంతేయ = ఓ అర్జునా!; ప్రతి జానీహి = నిశ్చితముగా తెలుసు కొనుము; మే = నా; భక్తః = భక్తుడు; న ప్రణశ్యతి = నశించడు.

అతడు తొందరలో ధర్మమునకు అనురూపమగు మనస్సు గల వాడగును.
శాశ్వతమగు శాంతిని పొందును. ఓ అర్జునా! నిశ్చితముగా తెలుసు కొనుము.
నా భక్తుడు నశించడు (31).

క్షిప్రం భవతి ధర్మాత్మా. ధర్మమునకు అనురూపమగు మనస్సు గలవాడు ధర్మాత్ముడన బడును. ధర్మమునందలి నిబద్ధత భక్తిలో భాగమే గనుక, ఇట్టి భక్తునకు ధర్మము సహజ లక్షణమగును. నైతిక వ్యవస్థ ఒక వ్యక్తి నిర్మించినది కాదు. అది సృష్టిలో భాగమై ఉన్నది. ఇచ్ఛా స్వాతంత్ర్యముగల మానవులకు నైతిక వ్యవస్థ యొక్క ఆవశ్యకత ఎంతేని గలదు. ఇచ్ఛా స్వాతంత్ర్యము గల వ్యక్తి ప్రపంచములో వ్యవహరించునప్పుడు కొన్ని నీతినియమములకు కట్టుబడి ఉండవలెను. అట్లు గానిచో అది సరియగు నియంత్రణలు లోపించిన శక్తి యగును. కావున, మానవులలో ఈ నైతిక వ్యవస్థను గురించిన జ్ఞానము అతి సహజముగా సామాన్య వివేక రూపములో నుండును. కావుననే, మౌలిక

మగు మంచి చెడులగురించి విశ్వజనీన మైన అంగీకారము గలదు. దీనికి తోడుగా సాంస్కృతిక పరమైన మంచి చెడులు, మరియు ఒక విశిష్టపరిస్థితికి అన్వయించే మంచి చెడులు కూడ గలవు. సృష్టిలో భాగముగా విశ్వజనీనమగు నియతి ఒకటి కలదు గనుకనే, వివిధ వ్యాఖ్యానములు సంభవమగుచున్నవి. ఈశ్వరుని ఈ సృష్టి ఈశ్వరుని కంటె భిన్నముగా లేదు. కావున ధర్మమే ఈశ్వరుడు. ధర్మము సామాన్యవిషయము గాదు.

ఈ పరిస్థితి మనకు వైదిక దర్శనములో మాత్రమే కన్పట్టును. ఇతర సమాజములలో ధర్మమనగా మతాధికారుల అధ్యాదేశ రూపముగా మాత్రమే గలదు. దానిని పాటించువారికి బహుమానము, పాటించని వారికి దండన లభించును. ఆ సమాజములలో ధర్మమును, అనగా జీవన మూల్యములను, నీతి నియమములను ప్రతి పాదించే తీరు ఇదియే. కాని, వైదిక దర్శనములో ధర్మము ఈశ్వరుని కంటె భిన్నము కాదు. కావున, ఈశ్వరీయ సాధన చేయువాడు ధర్మమునకు దూరము గాబోడు.

అతని మనస్సు ధర్మమునకు కట్టుబడి యుండును గాన, అతనికి ధర్మాత్ముడని పేరు. ధర్మము ఎల్లవేళలా వ్యక్తి ప్రవర్తనలో ప్రకటమగుచుండును. సర్వధర్మాన్ పరిత్యజ్య అను శ్లోకమును మనము తరువాత చూడ బోతాము. సర్వధర్మములను పరిత్యజించుట యనగా సర్మకర్మలను పరిత్యజించుట అని యర్థము. ఏలయన కర్మ ఉన్న సందర్భములో మాత్రమే ధర్మ ప్రసక్తి ఉండును. కర్మ ధర్మముచే నియంత్రింపబడాలి. కర్మ ధర్మమునకు అనురూపంగా ఉండాలి. కావున కర్మయే ధర్మము.

ఒకప్పుడు దుష్టుడైన వ్యక్తియే, స్పష్టమగు అవగాహన కలుగుట వలన (సమ్యగ్ వ్యవసితః) ఇప్పుడు ధర్మాత్ముడైనాడు. అతడు ఈశ్వర భక్తుడు గనుక, ఈ మార్పు శీఘ్రముగా సంపన్నమగును. అతడీ సాధనను ఆరంభించుటకు ముందు దురాచారుడై ఉన్ననూ, అతని భక్తి జ్ఞానములు అతని చెడు నడవడిని మ్రింగివేసినవి. ఇట్టి వ్యక్తిలో సంఘర్షణకు చోటు లేదు. కావుననే,

శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి. అతడు శాశ్వతానందమును పొందును. అతడు కర్తవ్య కర్మలననుష్ఠించి, నిషిద్ధ కర్మలకు దూరముగా నుండును గాన, అతని అంత రంగములో శాంతి సహజముగా సామ్రాజ్యమేలును. ఇది సాపేక్షిక శాంతి. ఈతనికి స్పష్టమగు అవగాహన కలదు గాన, ధర్మాత్ముడైనాడు. అతని నడవడిలో మార్పు వచ్చే కొలదీ, అతని అవగాహన కూడ పెరుగును. ఆత్మ పరిణామి కాదనియు, నిత్య శాంత ఆనందమనియు అతడు ఎరుంగును. కావున ఈ శాంతి శాశ్వత

శాంతి. ఏలయన ఇది ఆత్మ యొక్క స్వరూప భూతమైన శాంతి. ఆలోచనలు ఉన్న సమయంలో కూడా ఆత్మ స్వరూపము శాంతియే. కావున, ఆలోచనలు వస్తూ పోతూ ఉండవచ్చును. స్పష్టత అనగా నిదియే. మానసిక స్థితి ఏదైనా ఆత్మను అంచనా వేయుటలో అది ఆధారము కాదు. ఏలయన, ఆత్మ మార్పులకు లోను కాదు (అవి క్రియము) అనే నా జ్ఞానములో మానసిక స్థితి మార్పును కలిగించలేదు. అదియే శాశ్వత శాంతి. ఇందువలననే ఆత్మ జ్ఞానమునకు శాంతి అని పేరు.

ఈ జ్ఞానము ఆలోచనలచే కలుషితము కాదు. జ్ఞానము లన్నింటిలో పరిస్థితి ఇంతే. నీకు మోటారు గురించి తెలిస్తే, ఆ జ్ఞానము నీ మనస్సులో చెలరేగే అశాంతిచే ఏ విధముగనూ ప్రభావితము గాదు. మనస్సులో దుఃఖము నిండియున్నప్పుడు కూడా 1+1=2 అను జ్ఞానములో మార్పులేదు. మనస్సులో కలిగే విక్షిప్తస్థితులు గాని, దేహములో వచ్చే అలసట, వృద్ధాప్యము ఇత్యాది పరిస్థితులు గాని జ్ఞానమును చెదరగొట్ట జాలవు. జ్ఞానస్వరూపము అట్టిది. స్పష్టమగు జ్ఞానము గల వ్యక్తి, మనస్సు ఎల్లా ఉన్నా ఆత్మ శాంతమని ఎరుంగును. మనస్సు శాంతమైనచో, ఆత్మ శాంతమగుననుట సరిగాదని అతడు ఎరుంగును.

కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి.

అర్జునా! నాభక్తుడు నశించడని నీవు ఖచ్చితముగా తెలుసుకొనుము. ఈ వాక్యము చాల ప్రసిద్ధమైనది. ఇచ్చట భక్తుడు అనగా అంకిత భావము గలవాడు. అనగా ఈశ్వరుని గుర్తించిన వాడని అర్థము. ఈ గుర్తింపు ఒక గొప్ప వరము. ఈశ్వరుని గుర్తించగల్గుట సరళమగు విషయము గాదు. ఈశ్వరుడు గలడని గుర్తించుట చాల పెద్ద ముందడుగు. ఆ ఈశ్వరుని స్వరూపమును తెలియ గోరువాడు యథార్థమగు భక్తుడు. మనము అట్టి భక్తుని గురించి మాటలాడు చున్నాము. అతని ప్రవృత్తి పూర్వము ఎట్లు ఉండిననూ, అతడు దుర్గతిని పొందు ప్రసక్తి లేదు.

భక్తునకు తన అన్వేషణలో లక్ష్యమును గురించి స్పష్టమగు కల్పన ఉండును. ఈశ్వరుని గుర్తించిన వ్యక్తికి ఆత్మస్వరూప భూతమైన శాంతి సహజముగా లభించును. అతడు వినాశమును పొందడు, దుర్గతిని పొందడు. ఈ సత్యము అందరికీ వర్తించును.

అధ్యాయము 9, శ్లోకము 32 :

मां हि पार्थ व्यपाश्रित्य येऽपि स्युः पापयोनयः ।
स्त्रियो वैश्यास्तथा शूद्रास्तेऽपि यान्ति परां गतिम् ॥ ३२ ॥

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేపి యాంతి పరాం గతిమ్ (32)

**యే** = ఎవరైతే; **పాపయోనయః** = చెడు నడవడి గల కుటుంబములలో జన్మించిన వారు; **స్యుః** = ఉందురో; **తే అపి** = వారు అయిననూ; **స్త్రియః** = స్త్రీలు; **వైశ్యాః** = వైశ్యులు; **తథా** = అదే విధముగా; **శూద్రాః అపి** = శూద్రులు కూడా; **మాం** = నన్ను, **వ్యపాశ్రిత్య** = శరణు పొంది; **పరాం** = సర్వోత్కృష్టమగు; **గతిం** =పదమును; **యాంతి** = పొందెదరు.

> ఎవరైతే చెడు నడవడి గల కుటుంబములలో జన్మించెదరో వారైననూ, మరియు స్త్రీలు, వైశ్యులు, శూద్రులు కూడా నన్ను శరణు పొంది సర్వోత్కృష్టమగు పదమును పొందెదరు (32).

నేరగాళ్లు మొదలగు దుష్టచరితులగు తల్లి దండ్రులకు జన్మించిన వారు పాపయోనయః అనబడుదురు. లేదా పాపయోనయః అనగా పశుపక్ష్యాదులు అని చెప్పవచ్చును. ఏలయన, పశు పక్ష్యాది జన్మను పొందిన జీవులు కూడ మోక్షమును పొందిన గాథలు మనకు గలవు. గజేంద్రుడు మోక్షమును పొందుట మనకు తెలిసినదే. గజేంద్రుని కాలిని సరస్సులోని మొసలి పట్టు కొనగా, ఆయన ఒక పద్మమును తుండముతో లాగి పరమేశ్వరునకు అర్పించినాడు. భగవంతుడు అతని భక్తికి సంతసిల్లి మొసలి పట్టు నుండి విడిపించినాడు. మరియు, జటాయువు అను పక్షి మోక్షమును పొందెను. ఇంతే గాక హనుమంతుడు అను కోతి మనకు సుపరిచితుడు.

దుఃఖము అధికముగా నుండే జన్మ ఏదైనా పాపయోని అనబడును. మన సంస్కృతిలో పాపము అనగా దుఃఖమునిచ్చునది. పాపమునకు sin పర్యాయము కాదు. దోమ కరచినచో, ఒక పాపము పోయినది. పాపయోనయః అను పదమును స్త్రియః, వైశ్యాః, శూద్రాః అను పదములకు విశేషణముగా శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. శారీరక, మానసిక దుఃఖములు పురుషుని కంటె స్త్రీకి అధికము గనుక, స్త్రీ జన్మను పాపయోనిగా పరిగణించవచ్చును. వైశ్యశూద్రులకు యోగ్యమగు ఆరంభము దొరకదు. వైశ్యులు వ్యాపారమును చేయుచుందురు గనుక వారిలో వస్తువును అమ్మాలనే ప్రేరణ సత్యమును పలుక వలెననే ప్రేరణ కంటె అధికముగా నుండును. 'ఇది పనికిరాని వస్తువు. నీకు కావాలంటే కొనుక్కో' అని వర్తకుడు చెప్పజాలడు గదా! అట్లు చెప్పగలిగిన వర్తకుడు సన్న్యాసి యగుటకు ఇంచుమించు సంసిద్ధుడని చెప్పవచ్చును. కావున, వైశ్యుడు కూడ పాపయోనిగనే

పరిగణింపబడినాడు. నాకీ వ్యాఖ్యానము అంగీకారము కాదు. తథా అను పదము ఉన్నది గనుక, స్త్రీలు మొదలగు వారు పాపయోనులు కారని సుస్పష్టమగుచున్నది. శ్లోకదండాన్వయమెట్లనగా, పాపయోనులు,స్త్రీలు, వైశ్యులు మరియు శూద్రులు కూడా (యే అపి స్యుః పాపయోనయః తథా స్త్రియః వైశ్యాః శూద్రాః). పైగా వైశ్యులు, శూద్రులు పాపయోనులని మరెక్కడనూ చెప్పబడలేదు. పాపయోనులనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనే చాతుర్వర్ణ్యమునకు అవల జన్మించినవారు. పాపయోనయః అనగా అధర్మ జీవనమునకు అలవడిన తల్లిదండ్రులకు జన్మించినవారు అనునది అన్నిటి కంటె సరైన అర్థము అగును. స్త్రీలు చాతుర్వర్ణ్యములోని వారే గనుక, ఇచటి పాపయోనులలో స్త్రీలను కలుపుటకు వలనుపడదు. కావున, పాపయోనులనగా చండాలురు మొదలగు వారని చెప్పవచ్చును. ఎటువంటి ధర్మమునకు కట్టుబడని ఒకానొక జనజాతి లోని వారు చండాలురనబడుదురు.

ఇచ్చటి సారాంశ మేమనగా, వీరందరు ముక్తిని పొందెదరు. కావున ఒక వ్యక్తి జన్మించిన వంశము గాని, వర్ణము గాని అతనికి మోక్షార్హతను ఈయజాలవు. వ్యక్తి యొక్క ఆశ్రమము కూడా మోక్షార్హత నీయదు. మోక్షమునకు ఇవి ఏవీ ముఖ్యము కాదు. వర్ణాశ్రమ వ్యవస్థ పని చేసే సందర్భములో, వ్యక్తి చేయవలసిన విధులను నిర్ణయించుటలో మాత్రమే ఇవి తోడ్పడును. జ్ఞానరూపమగు మోక్షమునకు అర్హతను నిర్ణయించుటలో ఇవి ఏవీ పనికి రావు. కావున వారందరు కూడ పునరావృత్తి లేని పరాగతిని పొందగలరు. ఈ గతి కంటె గొప్ప గతి ఉండబోదు. ఇది పరమగతి. ఆత్మ ఈశ్వరుని కంటె వేరు గాదు అనే గుర్తింపు గల వ్యక్తి హృదయములో సాక్షాత్కరించే అంతరంగిక శాంతి స్వాతంత్ర్యములే ఈ గతి.

వీరందరు మోక్షమును పొందెదరన్నచో...

**అధ్యాయము 9, శ్లోకము 33 :**

किं पुनर्ब्राह्मणाः पुण्या भक्ता राजर्षयस्तथा ।
अनित्यमसुखं लोकमिमं प्राप्य भजस्व माम् ॥ ३३ ॥

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్ (33)

పుణ్యాః = పుణ్యజన్మ గల; బ్రాహ్మణాః = బ్రాహ్మణులు; తథా =మరియు; భక్తాః =భక్తులగు; రాజర్షయః = రాజర్షులు (క్షత్రియులు); కిం పునః = నన్ను పొందెదరని వేరుగా చెప్పవలెనా?; అనిత్యం = నిత్యము కానిది; అసుఖం = అల్పసుఖము గలది అగు; ఇమం = ఈ; లోకమ్ = ప్రపంచమును/అను భవమును; ప్రాప్య = పొంది; మామ్ = నన్ను; భజస్వ = సేవించుము.

> పుణ్యజన్మ గల బ్రాహ్మణులు, మరియు భక్తులగు రాజర్షులు (క్షత్రియులు) నన్ను పొందెదరని వేరుగా చెప్పవలెనా? నిత్యము కానిది, అల్పసుఖము గలది అగు ఈ ప్రపంచానుభవమును పొందిన నీవు నన్ను సేవించుము (33).

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యాః భక్తాః. పుణ్యయోనులలో జన్మించిన బ్రాహ్మణుల గురించి చెప్పునదేమున్నది? ఒక విశిష్ట పుణ్యము చే వారు సాధనామార్గములో అందరికంటె ముందు సాధనను ఆరంభించెదరు. వారు వైదిక సంస్కృతి గల కుటుంబములో జన్మించుటచే ఆదినుండియు వైదిక కర్మలు మొదలగు వాటిని చూస్తూ ఉంటారు. బ్రాహ్మణ బాలకుడు ఏడవ ఏటనే గాయత్రీ జపమును ఆరంభించును. ఇది సామాన్యమగు అవకాశము కాదు. కాని వారు ఈశ్వరభక్తులై ఉండాలి. వారు తమకు లభించిన అవకాశమును నాశనము చేసుకొనరాదు. వారు ఈ జ్ఞానసాధనకు భక్తి భావముతో అంకితులు కావాలి.

రాజర్షయస్తథా. అదే విధముగా రాజులు మరియు ఋషులు అగు క్షత్రియులు కూడా. వారికి ప్రయోజనకారియగు ఆరంభము గలదు. వారు రాజులు (రాజానః) మరియు ఋషులు (ఋషయః). వారు రాజవంశములో జన్మించుటయే గాక, బ్రహ్మజ్ఞానము కలవారు కూడా (రాజర్షయః).

భగవంతుడు అందరినీ లెక్కించినాడు. కావున, నీవు ఎక్కడ ఉన్నావు? అనునది ప్రధానము కాదు. నీవు ఏది అయి ఉన్నావు? అనునది ప్రధానము. భక్తి, అంకిత భావము అనునవి బ్రాహ్మణులకు, పాపయోనులకు కూడ సమానముగా ఆవశ్యకమగును. మరియు, జీవితములో ఏ స్థాయి (ఆశ్రమము) కి చెందినవాడైనా, మౌలికమగు అర్హత సమానమే. భగవానుడు దానిని సుస్పష్టముగా వర్ణించినాడు.

అనిత్యం అసుఖం లోకం ఇమం ప్రాప్య. మానవుడు పొందియున్న ఈ ప్రపంచము, ఈ అనుభవము. శూద్రుడు మానవుడే. వైశ్యుడు మానవుడే. బ్రాహ్మణుడు మానవుడే. చండాలుడు మానవుడే. కేవలనైసర్గిక వృత్తిచే నియంత్రింపబడే (controlled by instinct) పశువు వలె గాక, ఆలోచించే సామర్థ్యము గల హనుమంతుని వంటి కోతి గూడా మానవుని వంటిదే. వీరందరికి ప్రపంచము సమానమే. ప్రపంచము అశాశ్వతము (అనిత్యమ్), సుఖము లేనిది (అసుఖమ్). మానవ ప్రపంచములో ఉండే అనుభవములు తాత్కాలికములు మరియు దుఃఖపూర్ణములు. అసుఖమ్ అను పదములోని 'అ' కు అర్థము నిషేధము కాదు. దానికి కొద్దిగా అని యర్థము. సుఖము లేనిచో మానవుడు జీవించాలని కోరుకొనడు. ప్రతివానికి కొంత సుఖము గలదు. కాని అది అపర్యాప్తము, అనిత్యము. అది లభించిన తరువాతనే అది పరిమితమనియు, క్షణికమనియు మానవుడు గుర్తించును.

సర్వపురుషార్థములను సంపాదించుటలో సాధనమగు మానవ దేహము అతి దుర్లభమని శ్రీ శంకరులు చెప్పిరి. వారి తాత్పర్యమేమనగా, ఈ అవకాశమును చెడగొట్టుకోరాదు. అయినచో మానవుడు ఏమి చేయవలెను?

మాం భజస్వ. పరమేశ్వరుని జ్ఞానమును సాధించే జీవనమునకు అంకితము కమ్ము. దీనికంటె తక్కువ ఫలము ఏదైనా నీకు తృప్తిని ఈయజాలదు. పరమేశ్వర స్వరూపమే మోక్షము. అదిలేక పోయినా, ఇతర ఫలములు నాకు చాలునని ఎవ్వరైననూ చెప్పజాలరు. ఫలానా వస్తువు లభిస్తే నాకు అన్నీ లభించినట్లే అని మనము అనుకుంటాము. కాని తీరా అది లభించిన తర్వాత, అది చాలలేదని మనకు స్పష్టమగును. కావున, మానవులందరూ కోరేది మోక్షమే. ఈ పరచ్ఛేద భావననుండి విముక్తిని పొందుటకు నీవు నావద్దకు రావలెనని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా నన్ను తెలుసుకొనవలెను  అని ఆయన అభిప్రాయము. కావున, నన్ను భజించి, అన్వేషించుము (మాం భజస్వ).

ఆఖరుగా, భక్తుడు నిన్ను ఆరాధించు విధమెట్టిది?

**అధ్యాయము 9, శ్లోకము 34 :**

मन्मना भव मद्भक्तो मद्याजी मां नमस्कुरु ।
मामेवैष्यसि युक्त्वैवमात्मानं मत्परायणः ॥ ३४ ॥

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః (34)

మన్మనాః = నాకు అంకితమైన మనస్సు గలవాడవై; మద్భక్తః = నాయందు భక్తి గలవాడవై; మద్యాజీ = నాకు అర్పితమైన వైదిక కర్మలను చేయువాడవై; భవ = అగుము; మాం = నన్ను; నమస్కురు = నమస్కరించుము; ఏవం = ఈ తీరున; ఆత్మానం = నిన్ను; యుక్త్వా = సంసిద్ధము చేసుకొని; మత్పరాయణః = నేనే చరమగతిగా గలవాడవై; మాం ఏవ = నన్ను మాత్రమే; ఏష్యసి = పొందగలవు.

నాకు మనస్సును అంకితము చేయుము. నా భక్తుడవు కమ్ము. వైదిక కర్మలను నాకు అర్పించుము. నన్ను నమస్కరించుము. ఈ తీరున నిన్ను నీవు సంసిద్ధము చేసుకొని, నేనే చరమ గతిగా గలవాడవై నన్ను మాత్రమే పొందగలవు (34).

మన్మనా భవ. నీ మనస్సును నాకు అర్పించుము. పరమేశ్వరుడనగు నాకు అంకితము చేయుము. భగవానునకు అంకితమగుట యనగా భగవానుని జ్ఞానమునకు అంకితమగుట. సాధారణముగా మనము ప్రపంచములోని వివిధ విషయములకు అంకితమై, మన అర్థకామముల కొరకు భగవానుని వాడుకుంటాము. అట్లు చేయుటలో తప్పేమీ లేదు. కాని మనము కోరిన వస్తువు లభించిన తరువాత కూడా పూర్ణత్వము కొరకు మనము చేసే ప్రయాణము అంతము కాబోదు. కావున, నీవు తిన్నగా నన్ను నీ పరమగతిగా ఎన్నుకొని, నాకు నీ మనస్సును అర్పించి వేయుము. ఇచ్చట ప్రాప్తి జ్ఞానరూపములో నుండును గావున, నీ మనస్సును నాకు అంకితము చేయుము.

మద్భక్తః భవ. నా భక్తుడవు కమ్ము. నీ మనస్సు భగవానుని అన్వేషణలో లగ్నము కావాలంటే, నీ ప్రేమ మరియొక్క దానిపై ఉండరాదు. నీ బుద్ధిలో మోక్ష సాధన గురించి నిశ్చితమగు నిర్ణయము ఉండియూ, నీ హృదయము వివిధ విషయములయందు వ్యాపృతమై యున్నచో, ప్రయోజనము లేదు. అట్టి స్థితిలో నీకు ఈశ్వరుని అన్వేషించే మనస్సు ఉండబోదు. భక్తి యనగా ప్రేమావేశము. ప్రేమ స్వరూపా భక్తిః అని భక్తి నిర్వచింపబడినది. భక్తి యొక్క స్వరూపము భక్తియే. కావున ప్రస్తుత ప్రసంగములో విషయవస్తువు అగు భగవానుడు నీ ప్రేమలో విషయము కావాలి. మరో మాటలో చెప్పాలంటే, నీ భక్తి ఈశ్వరుని జ్ఞానము కొరకై ఉద్దేశింపబడి నీవు జిజ్ఞాసువు కావాలి.

మద్యాజీ భవ. నీ ప్రార్థనలు, వేదవిహిత కర్మలు మొదలగునవి నాకు మాత్రమే అర్పింపబడవలెను. అనగా వాటి ప్రయోజనము అంతఃకరణశుద్ధి, తద్ద్వారా ఈశ్వర ప్రాప్తి మాత్రమే కావాలి. ప్రార్థనలన్నింటిలో ప్రార్థింపబడేది ఈశ్వరుడే. కాని మనము సాధారణముగా విహిత కర్మలను ఈశ్వరుని కొరకు చేయము. వాటిని మనము స్వర్గము కొరకు గాని, లేదా అటు వంటి మరియొక ప్రయోజనము కొరకు గాని చేస్తాము. ప్రార్థింపబడేది ఈశ్వరుడే అయినా, ప్రయోజనము ఈశ్వరుని కంటె పూర్తి భిన్నముగా నుండును. కాని ప్రకృతంలో సాధకుడు ఈశ్వరప్రాప్తి కొరకు మాత్రమే ఈశ్వరుని ప్రార్థించును. సాధకునకు మరియొక ఫలముతో పనిలేదు. ఇది సర్వశ్రేష్ఠమగు సాధన. ఈశ్వరుని తెలియుట కొరకు ఈశ్వరుని కృపను అర్థించే ఈ ప్రక్రియలో, అదే ప్రార్థన ఒక గొప్ప సాధనగా రూపాంతరము చెందినది. ఈశ్వరుని కంటె తక్కువ ఫలము సాధకునకు అక్కర లేదు. అప్పుడు,

మాం నమస్కురు. నీవు నన్ను శరణు పొందుము. కురు అను పదము క్రియావాచకము గాన, ఈ శరణాగతి యోగము అగును. నీవు నీ కర్తృత్వ భోక్తృత్వములను నాకు సమర్పించి, నిన్ను నీవు నాకు అంకితము చేసుకొనుము. 'నాకు ఈశ్వరుడు ఏది ఇస్తే, దానితో నేను సంతోషిస్తాను. ధర్మము ఈశ్వరస్వరూపమే గనుక, నేను చేయు కర్మలనన్నిటినీ ధర్మాను రూపముగా చేస్తాను. నా వ్యక్తిగత ఇష్టానిష్టములను ఆ ఈశ్వరునకు నేను సమర్పిస్తున్నాను'. నమస్కారము లేక శరణాగతి అనగా నిదియే.

యుక్త్వా ఆత్మానం ఏవమ్. ఈ విధముగా సాధకుడు తనను తాను సన్నద్ధము చేసుకోవాలి. ఈ విధంగా వీటినన్నిటినీ చేస్తూ ఉంటే, నీకు అంతః కరణ శుద్ధి కలిగి, నీ మనస్సు ప్రసన్నముగా, ఏకాగ్రముగా నుండునని (సమాధాయ చిత్తమ్) శ్రీ శంకరులు వివరించిరి. మనస్సును దేనియందైననూ ఏకాగ్రము చేయవచ్చును. కాని ప్రకృతంలో సాధకుడు మనస్సును భగవంతునిపై ఏకాగ్రము చేయును.

**అట్టి స్థితిలో ఏమగును?**

మత్పరాయణః. అట్టి సాధకునకు నేను లక్ష్యము అగుదును. అతనికి చరమ లక్ష్యము, ఏకైక లక్ష్యము పరమేశ్వరుడే. అతడు మన్మనాః మద్భక్తః మద్యాజీ అయినాడు గనుక, నన్ను శరణు జొచ్చినాడు గనుక, ఈ స్థితి సంభవమయ్యెను. అతడు నన్ను శరణు జొచ్చి, నేనే చరమ లక్ష్యముగా కలవాడైనాడు. కావున,

. మాం ఏవ ఏష్యసి. నీవు నన్ను మాత్రమే పొందగలవు. ఆత్మ పరమేశ్వరాభిన్నమని యెరింగి, నీవు నాతో ఏకము కాగలవు. నాతో ఏకము అగుట అను ప్రయోగము ఎప్పటికి సమస్యయే. సాధకుడు ఒక స్థానమునకు వెళ్లి, అచట భగవానునితో ఏకమగునా? భగవానునితో ఏకమగుట యెట్లు? భగవానునితో సాధకునకు ఏదేని ప్రత్యేక సంబంధముండుటచే ఐక్యమగునా? భగవానునితో ఐక్యమయ్యేది ఏది? ఇది ఒక రకం భావావేశపరమైన ఏకతయా? లేక, ఒక విశిష్ట బౌద్ధిక ఏకతయా? లేక అమీబా మానవుని ఉదరములో ఏకమైనట్లు, ఇది ఒక రకం స్థూల దేహముల ఏకతయా? భక్తుడు ఈశ్వరునితో ఐక్యమయ్యే ఖచ్చితమగు విధమెట్టిది?'

'నేను సర్వప్రాణుల ఆత్మను. కాన నన్ను గుర్తించుట యనగా నిన్ను నీవు గుర్తించు కొనుటయే. నీవు నీ వద్దకు వచ్చినపుడు, ఈశ్వరుని వద్దకు వచ్చినట్లు అగును' అని భగవానుడు చెప్పు చున్నాడు.

'ఏవం ఆత్మానం యుక్త్వా ' అని మనము అన్వయించినాము. కాని శ్రీ శంకరులు 'ఏవం యుక్త్వా మాం ఏవ ఏష్యసి ' అని అన్వయించినారు. అనగా 'ఈ తీరున మనస్సులో ప్రసన్నతను పొంది నీవు నన్ను చేరగలవు.'

తరువాత శ్రీ శంకరులు 'ఆత్మానం ఏష్యసి' అని అన్వయించినారు. అనగా 'నీవు నిన్ను పొందగలవు'. ఈ అన్వయములో 'భగవానుని పొందుట యనగా నీవు నిన్ను పొందుటయే' అను అర్థము మనకు లభించును.

ఇదంతా 'కౌంతేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి' అను వచనమునకు అనురూపముగా మన్నది. 'ఓ అర్జునా! నీవీ విషయమును స్పష్టముగా నెరుంగుము. నా భక్తులు ఎన్నటికీ వినాశమును పొందరు.'

ఓం తత్ సత్. ఈ వాక్యము అధ్యాయాంతమును సూచించును. ఓం అనగా పరబ్రహ్మ. అది మాత్రమే సత్యము. ఇతి శ్రీ మద్భగవద్గీతా సూపనిషత్సు. ఉపనిషత్తులకు సమానమగు భగవద్గీతలో. గీతలో ఆత్మబ్రహ్మల ఐక్యము ప్రదర్శింపబడినది గాన, అది ఉపనిషత్తు అనబడినది. బ్రహ్మవిద్యాయామ్. గీతలోని విషయవస్తువు బ్రహ్మ విద్య. యోగ శాస్త్రే. అది సత్యవస్తువును వివరించే బ్రహ్మ విద్య మాత్రమే గాదు. యోగ శాస్త్రము కూడా. అంతః కరణము గురించి, కర్మలను గురించి, అంతఃకరణ శుద్ధికి ఉపాయములను గురించి కూడ గీత వివరించును. ధర్మము, వివిధ అను

సనములు, జీవన మూల్యములు, ప్రార్థన ఇత్యాదులన్నీ యోగశాస్త్రాంతర్గతములే. శ్రీకృష్ణార్జున ంవాదే. శ్రీకృష్ణునకు, అర్జునునకు మధ్య జరిగిన సంవాదములో. నవమోఽధ్యాయః ఇది తొమ్మిదవ ధ్యాయము. దీనికి రాజవిద్యా రాజగుహ్య యోగమని పేరు. రాజ విద్య అనగా బ్రహ్మవిద్య. ఇది రమ రహస్యము గనుక రాజగుహ్యము అయినది. రహస్యములనేకములు గలవు. కాని ఈ విద్య బోధించిన తరువాత కూడ రహస్యముగనే ఉండును గాన, ఇది రహస్యములలో కెల్ల రాజా. ఒకసారి వివు తెలుసుకుంటే, దీనికంటె విలువైనది మరియొకటి లేదు.

## పదవ అధ్యాయము
## భగవానుని విభూతులు

భగవద్గీత బ్రహ్మవిద్య మాత్రమే గాక, యోగశాస్త్రము కూడా. బ్రహ్మ విద్యా రూపములో దానిని తత్త్వమసి (అది నీవే అయి ఉన్నావు) అను ఒకే ఒక వాక్యముగా కుదించవచ్చును. ఈ వాక్యములోని 'నీవు' ఎవరు? 'అది' యేది? వాక్యార్థము తెలియుటకై ప్రతి పదార్థము తెలియవలెను.

తత్ అను పదమునకు సర్వజగత్కారణమగు ఈశ్వరుడు అర్థము. ఈ ఈశ్వరుడు ఎవరు? త్వం పదము జీవుని నిర్దేశించును. ఈ జీవుడు ఎవరు? ఈ రెండు విషయములపై విచారమును చేయాలి.

మొదటి ఆరు అధ్యాయములలో త్వం పదార్థము ప్రముఖముగా చర్చించబడినదని మనము చూచి యున్నాము. ప్రథమాధ్యాయము అర్జునుని శోకమును వర్ణించినది. అర్జునుని అవస్థ సర్వజీవుల అవస్థకు ప్రతీక. అర్జునునకు శ్రీకృష్ణునిలో ఆచార్యుడు సాక్షాత్కరించగా, అతడు తనను శిష్యునిగా ప్రకటించి ఆయనను శరణువేడెను. శ్రీ కృష్ణ భగవానుడాతనికి రెండవ అధ్యాయములో ఆత్మస్వరూపమును బోధించెను. మూడవది యగు కర్మయోగము కూడా జీవుని కొరకు ఉద్దేశించబడినదియే. నాల్గవ అధ్యాయము ఆత్మ అకర్తయని బోధించును. అనగా ప్రత్యగాత్మ స్వరూపమే అవట బోధింపబడినది. అయిదవ అధ్యాయము జీవుని సన్న్యాసమును వివరించగా, ఆరవ అధ్యాయము ధ్యాతయగు ప్రత్యగాత్మ దృష్ట్యా ధ్యానప్రక్రియను వివరించినది.

ఏడవ అధ్యాయమునుండి విషయ వస్తు ప్రతి పాదనములో పూర్తిగా మార్పు వచ్చినది. ఈశ్వరుని స్వరూపము, ఈశ్వరుని విభూతి అనునవి ఈ అధ్యాయములలోని ప్రముఖ విషయములు.

విభూతి యోగము అనబడే ఈ పదవ అధ్యాయములో ఈశ్వరుని విభూతులు (glories) ప్రస్తుతింపబడినవి. భగవానుడు సర్వవ్యాపి మరియు సర్వాత్ముడు అయినను, విభూతికిరణములు ఉన్న ప్రతివస్తువునందు భగవానుని విభూతి కానవచ్చును.

పూర్వకాలములో మంచి స్థలమేదైనా భగవానునకు అంకితము చేయబడెడిది. రెండు నదులు కలుసుకునే సంగమస్థానము ఒక అద్భుత దృశ్యము. అచట మనకు దేవాలయము కానవచ్చును. పర్వత శిఖరముపై నుండి క్రిందకు చూచినచో, అద్భుత సుందరదృశ్యము కానవచ్చును. అట్టి శిఖరముపై దేవాలయము ఉండును. రామేశ్వరము ఒక దీవి. అచట దేవాలయము గలదు. విభిన్న వర్ణములు గల మూడు సముద్రములు, అనగా బంగాళాఖాతము, అరేబియా సముద్రము, హిందూమహాసముద్రములు కన్యాకుమారి వద్ద కలుసుకొనును. అది ఒక అద్భుతదృశ్యము. అచ్చట మనకు కనబడేది దేవాలయమే గాని ప్రాసాదము కాదు; ధర్మనిరపేక్షమగు మరియొక కట్టడము కాదు.

తిరుపతిలో ఏడుకొండలపైన సుప్రసిద్ధమగు బాలాజీ దేవాలయము గలదు. అద్భుత సుందరస్థలము లన్నింటిలో దేవాలయము దర్శనమిచ్చును. హిమాలయములలో బదరీనాథ్ వద్ద దేవాలయము గలదు. మంచుతో నిండి ఉండే ఎత్తైన కైలాస శిఖరము సాక్షాత్తుగా శివ భగవానుడే. సర్వసామాన్యమగు స్థలములో దేవాలయమును నిర్మించినను, అది ఎత్తైన గోపురములతో సుందర శిల్పములతో రమణీయమగు స్థానముగా వన్నెకెక్కును.

ఈ విధముగా మహిమాన్వితమైన, సుందరమైన స్థలములన్నియూ భగవానునకు అర్పింపబడినవి. ఎందువలన? అది అంతా భగవానుని సౌందర్యము గనుక.

ఏ పరిస్థితిలోనైనా, ఏ వస్తువులోనైనా, ఒకింత మహిమ కానవచ్చినచో, భగవంతుని దాని యందు గుర్తించి ధ్యానించవలెనని శ్రీ శంకరులు విభూతి యోగమనే ఈ అధ్యాయము యొక్క ఉపక్రమ భాష్యములో వక్కాణించిరి.

భగవంతుని యథార్థ స్వరూపమును తెలియుట తేలిక కాదు గనుక, అనేక పర్యాయములు చెప్పవలసి యుండును. తెలియదగిన విషయములో పునరావృత్తి అంగీకారమే.విశ్వసించదగిన విషయములో పునరావృత్తి నిరర్థకము. శ్రీ శంకరులు పునరావృత్తిని ఈ తీరున సమర్థించి, దానికి మాన్యతను కలిగించిరి. ఇది సరళమగు పునరావృత్తి కాదని గ్రహించవలెను. దీనిలో కొంత వివరణ

…ఉ గలదు. బోధనా ప్రక్రియలోని ఒక శైలి ఇచ్చట ప్రదర్శింపబడుచున్నది. ఒక చోట క్లుప్తముగా …ప్పబడిన విషయమే మరియొక చోట విస్తారముగా వ్యాఖ్యానింపబడును. ఇంతకు ముందు …భూతులను క్లుప్తముగా చెప్పుట అయినది. ఇపుడు అవియే ప్రముఖ విషయ వస్తువుగా చేపట్టబడును. …ర్థబోధనా శైలి ఇటులనే యుండును. ఒక విషయ వస్తువును వివరించుట కొరకై మరియొక …వు స్పృశించబడును. అట్లు స్పృశించబడిన వస్తువు తరువాత విస్తారముగా వ్యాఖ్యానించబడును. …రకు అది వేచి యుండును. ఇచ్చట భగవంతుని విభూతి అను విషయవస్తువు చర్చించబడు …ది. భగవంతుడు కానిది ఏదీ లేదు. ఈ అధ్యాయములో ఆఖరుగా తేలే విషయము అదియే. ఏ …స్థితిలోనైనా మహిమ కానవచ్చినచో, అది భగవానుని విభూతియని గుర్తించవలెను. ఒక సుందరమగు …స్తువును చూచి 'ఇది సుందరమగు వస్తువు' అనుకుంటే చాలదు. ఆ సౌందర్యమే భగవానుడు. …ర్వయశస్సులకు, సర్వసౌందర్యములకు నిధానము భగవానుడే. ఈ సత్యమును దర్శించే వివేకము …ం భక్తుని దృష్టిలో యశస్సు గలవాడు భగవానుడు మాత్రమే. మరియొకరు కాదు. యశస్సు …క్కడ ఉన్నా, అది భగవద్విభూతి మాత్రమే. దీనిని స్పష్టము చేయుటయే ఈ అధ్యాయము యొక్క ఉద్దేశ్యము. కావున దీనికి విభూతి యోగమను పేరు పొసగియున్నది.

**భగవానుడు చెప్పిన దానినే మరల చెప్పుటకు కారణమేమి?**

చెప్పిన విషయమునే మరల ఇప్పుడు చెప్పుటకు గల కారణమును శ్రీకృష్ణ భగవానుడు వివరించుచున్నాడు. భగవానుడిట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 10, శ్లోకము 1 :**

श्रीभगवानुवाच ।
भूय एव महाबाहो शृणु मे परमं वचः ।
यत्ते ऽहं प्रीयमाणाय वक्ष्यामि हितकाम्यया ॥ १ ॥

శ్రీ భగవానువాచ
భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తే ఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా (1)

శ్రీ భగవాన్ = శ్రీ భగవంతుడు; ఉవాచ = ఇట్లు పలికెను; మహాబాహో = గొప్ప

బాహువులు గల ఓ అర్జునా!; మే = నా; పరమం = అనంతుని బోధించు; వచః = మాటను; భూయః ఏవ = నిశ్చయముగా మరల; శృణు = వినుము; యత్ = దేనిని; ప్రీయమాణాయ = ప్రియుడగు; తే = నీ కొరకు; హితకామ్యయా = హితమును చేయు కోరికతో; అహం = నేను; వక్ష్యామి = చెప్పగలనో.

శ్రీ భగవానుడిట్లు పలికెను :

> ఓ గొప్ప బాహువులు గల అర్జునా! ప్రియుడవగు నీ కొరకు హితమును చేయు కోరికతో నేను చెప్ప బోవు అనంతుని గురించిన నా మాటలను మరల నిశ్చయముగా వినుము (1).

'మహాబాహు' అను పదమునకు రెండు పొడవైన చేతులు గలవాడని యర్థము. కాని ప్రకృతంలో ఆ పదమునకు శక్తి గలవాడు, మహిమ గలవాడు అని యర్థము. భగవానుడు విభూతుల గురించి మాటలాడబోతూ, మహాబాహో అన్నాడు గనుక 'నీకు గల మహిమ నాదే' అని దాని యర్థము. ఈ విషయమునే భగవానుడు నిరూపించ బోవు చున్నాడు. 'ధనుర్ధారులలో నేను అర్జునుడను' అని కూడా భగవానుడు తరువాత చెప్పబోవు చున్నాడు. కావున, ఓ అర్జునా! నీయందు గల విభూతి నాదే. కావున, ఓ మహాబాహో! అర్జునా! దయచేసి వినుము (శృణు). ఎందులకు? నీవు దీనిని వినుటకు అర్హుడవు గనుక.

భూయ ఏవ శృణు మే పరమం వచః. మరల నా శ్రేష్ఠవచనములను వినుము. భూయః (మరల) అనుటను బట్టి విషయ వస్తువు పునరావృతమగు చున్నది. భగవంతుని యథార్థ స్వరూపము (భగవత్తత్త్వము), మరియు ఏడు తొమ్మిది అధ్యాయములలో ప్రస్తావింపబడిన భగవంతుని విభూతులు ఇచటి విషయవస్తువు. వచః (మాట) కు పరమం అను విశేషణము గలదు. దీనిని అను వదించుట ఎట్లు? సర్వోత్కృష్ట మనియా? పదములు స్వతః సర్వశ్రేష్ఠములు కావు. అవి అనంత వస్తువును ప్రదర్శించు చున్నవి గాన ప్రకృష్టవచనములగునని శ్రీ శంకరులు వివరించిరి. పరమవస్తువును, అనగా పరం బ్రహ్మను ప్రదర్శించు వచనములు గనుక పరమవచనములైనవి.

యత్ తే అహం ప్రీయమాణాయ వక్ష్యామి హిత కామ్యయా. నామాటలను విని సంతసించే నీకు నేను దేనిని చెప్పబోవుచున్నానో. అర్జునుని చూపులు, ఆదుర్దా మొదలగు వాటిని బట్టి అతడు వినుటకు ఇష్టపడు చున్నాడని స్పష్టమగు చుండెను. అతడు దేని కొరకై ప్రతీక్షించు చుండెనో, అదియే

ంపన్నము కాబోవు చున్నట్లు ఉండెను. కావున అర్జునుడు ఆ సమయములో నున్న పరిస్థితులలో
్ౕరలి ఉల్లాసముగా నుండెను.

కొద్ది గంటల క్రితంలో అర్జునుని యందు ఉల్లాసమేమియూ లేకుండెను. మొదటి
ధ్యాయములో ఆతని యందు ఉల్లాసము లేదనుట నిశ్చయమే. కాని నేను నీ శిష్యుడను అని
కిన క్షణంలో రోదనము అంతమయ్యెను. ఆ క్షణము నుండియూ బాధ్యత శ్రీ కృష్ణునిపై
ు. ఇప్పుడు అర్జునుడు చాల ఉల్లాసముగ నున్నట్లు కన్పట్టెను. అర్జునుని మాట ఎట్లున్ననూ,
ర్జునుని విషయంలో శ్రీ కృష్ణుడు చాల ఉల్లాసముగ నుండెను. భగవానుని 'ప్రీయమాణ' అను
చనమును బట్టి మనకీ విషయము స్పష్టమగు చున్నది. అర్జునుని ముఖకవళికలు మొదలగు వాటిని
బట్టి ఆతడు ఉల్లాసముగా నున్నట్లు కానవచ్చుచుండెను. శ్రీ కృష్ణుడు సర్వజ్ఞుడగు భగవానుడు
గదా! కావున, అర్జునుడిపుడు అతిశయించిన ఉల్లాసముతో నున్నాడని ఆయన ఎరుంగును.
నామాటలను విని ఆనందించే నీకు చెప్పబోవు చున్నాను (వక్ష్యామి).

'అమృతమును త్రాగి పరమానందముగా నున్నవాని వలె' అని శ్రీ శంకరులు
దృష్టాంతమునిచ్చిరి. అమృతము అత్యంతమధురముగ నుండుననియు, దానిని త్రాగినవ్యక్తి యొక్క
స్థూలదేహమునకు మరణము ఉండదనియు చెప్పెదరు. ఇది సాపేక్షిక అమృతత్వము. కాని ఈ
అమృతము కొరకై దేవతలకు, రాక్షసులకు మధ్య యుద్ధము జరిగెను. అది అత్యంత మధురము,
మరియు దానిని మించి రుచ్యమగు పదార్థము మరియొకటి లేదు. దానిని మించి ఆనందము
నిచ్చునది, అభిలషణీయమైనది, అమృతత్వము నిచ్చునది మరియొకటి లేదు. సాధారణంగా
ఆరోగ్యకరమగు పదార్థములను ముక్కు మూసుకొని భక్షించవలసి యుండును. ఆరోగ్యము, రుచి
ఒకే పదార్థము నందు ఉండవు. కాని అమృతములో ఈ రెండు గలవు. మనమీ అమృతము అను
పదమును పురాణములలో మాత్రమే విన్నాము. కాని పురాణములలో నిష్ణాతులగు శ్రీ శంకరులు
మొదలగు వారికి అది తరచుగా వినబడే పదమే యగును. కావున, అది ఎవ్వరికీ ప్రత్యక్షము
కాకపోయినా, ఖచ్చితముగా దృష్టాంతమని చెప్పే వీలు లేకపోయినా, శ్రీ శంకరులు దానిని
దృష్టాంతముగా నిచ్చిరి. జనులకు దాని పరోక్ష జ్ఞానము గలదు. దానిని ఆధారంగా చేసుకొని శ్రీ
శంకరులు అమృతమును దృష్టాంతముగా నిచ్చిరి. వివిధ భాష్యములను రచించే సమయములో
పురాణములను కూడ అవలోడనము చేయు శ్రీ శంకరులకు అమృతమును దృష్టాంతముగానిచ్చే
అర్హత గలదు. ఆయన దృష్టిలో అది ప్రసిద్ధమైన పదమే. కాని మనము అమృతమును దృష్టాంతముగా

నీయరాదు. శ్రీశంకరుల భావమును మనము అర్థముచేసుకొను విధము ఎట్టిదనగా–'అమృతమును త్రాగిన వ్యక్తి ఎంత ఉల్లాసముగా నుండునో, అటులనే నీవు కూడా నా మాటలను పానము చేయుచున్నావా యన్నట్లు కన్పట్టు చున్నావు. కావున ఇట్టి ప్రీతితో నిండిన నీకు నేను చెప్పెదను (ప్రీయమాణాయ అహం వక్ష్యామి)'.

దేనికొరకు ?

హితకామ్యయా. నీకు హితమును కలిగించు కోరికతో. హితమనగా మోక్షము. సర్వవిభూతులు భగవానుడే అను భగవత్తత్త్వము తెలియనిదే తత్త్వమసి తెలియదు. ఈ వాక్యమును ఎరుంగుట కంటె గొప్ప హితము(శ్రేయస్సు) ఉండబోదు. ఒక వ్యక్తికి చేయగలిగే సర్వోత్కృష్టమగు హితము అతడు ఈశ్వరుడే అను గుర్తింపు కలిగించుటయే. ఇంతకంటె గొప్ప హితము ఏమి ఉండును? వ్యక్తికి తాను ఈశ్వరుడనే సాక్షాత్కారమును మించిన హితము ఉండబోదు.

ఓ అర్జునా! నీకు హితమును చేయగోరి చెప్పెదను. ఏలయన, నీ క్షేమమునందు నాకు అభిరుచి గలదు. నీవు తెలియగలిగితే చరమ సత్యము భగవత్తత్త్వము మాత్రమే. దాని కంటె ముందుగా భగవద్విభూతిని గుర్తించుటయూ నీకు హితము కాగలదు.

ఈశ్వర విభూతిని గుర్తించుట ఎట్లు హితకారి యగును?

విభూతులన్నిటినీ ఈశ్వరవిభూతులుగా నీవు గుర్తించినచో, నీ గర్వము అహంకారము తగ్గిపోవును. దాని వలన ఈశ్వర స్వరూపము నెరుంగుటకు దారి సుగమమగును. నీకు ఈశ్వరునకు మధ్యలో అడ్డుగా ఉన్నది నీ అహంకారము మాత్రమే. ఆ అహంకారమును విస్తరింపజేసి, తరువాత జ్ఞానముచే త్రోసి పుచ్చవలెను.

ఈ అహంకారవిస్తారము తేలిక కాదు. ఏలయనగా సాధారణంగా శాస్త్రజ్ఞానము అహంకారమును మరింత పెంచును. దానిని బలహీనముగా చేయుట యెట్లు?

'నేను యశస్విని ' అనే ధారణను నాకీయ గలిగే సర్వము భగవానునకు చెందినదియే. నేను చాల కష్టపడి విలువైన సంపదను కూడ బెట్టినానను కొనుడు. అది మరియొకనికి చెందినదని నేను చెప్పలేను. అదంతా నా కష్టార్జితము. మనము అధికారమును చెలాయించే తీరు ఇట్లుండును. ఇట్టి స్వాధికారము మనకు ఒకానొక ఆత్మగౌరవమును కలిగించును. కాని నేను ఆత్మగౌరవమును

ఆపేక్షిస్తున్నాను గనుక నాలో అది ఉప్తమైనదని స్పష్టమగుచున్నది. ఇట్టి స్థితిలో, నేను కష్టపడి సంపాదించిన విజయములను పరిత్యజించి, విభూతులన్నియూ భగవానునకు చెందునని చెప్పగల్గుట ఎట్లు సంభవమగును?

నీవు దేనినీ పరిత్యజించ బనిలేదు. ఒక వ్యక్తికి సుస్పష్టముగా ఆలోచించగలిగే శక్తి గలదనుకొనుడు. ఆలోచనలోని ఆ స్పష్టత ఒక విభూతి. అది సామాన్యమగు ఉపలబ్ధి కాదు. అది మానవుడు పొందగలిగే సర్వోత్తమమగు ఉపలబ్ధి. ఆలోచనలో స్పష్టత కంటె సుందరమైనది మరియొకటి ఉండబోదు. ఇట్టి సామర్థ్యము గల వ్యక్తిలో దానిని గురించి గర్వము ఉండజాలదు. ఈశ్వరుని గుర్తింపు మాత్రమే ఉండగల్గును. ఆలోచనలో గల స్పష్టత వలన, ఈ సర్వము భగవానునకు చెందినదే యని ఆ వ్యక్తి గుర్తించగల్గును. దీనిలో వ్యక్తిగతమగు ఉపలబ్ధి ఏమీ లేదు. సర్వము ఈశ్వరుడే. నాలో ఏదేని విభూతి ఉన్నచో, అది ఈశ్వరుని విభూతియే. ఈ గుర్తింపు సాపేక్షికమే అయినా, దానిని పొందియున్న వ్యక్తికి ఎంతో హితమును చేగూర్చును.

కావున, ఈ విభూతి యోగము మీకు రెండు విధములుగా ఉపకరించును. ఇది భగవత్తత్త్వమును ప్రదర్శించి, అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మనై యున్నాను) అను మహావాక్యము సాక్షాత్కరించుటలో తోడ్పడును. అది చరమహితము (శ్రేయస్సు). కాని ఈ శ్రేయస్సు లభించుటకు ఒక సాపేక్షిక హితము ఆవశ్యకమగును. నీవు ఈశ్వర విభూతిని గుర్తించినచో, పరిస్థితి పూర్తిగా మారిపోవును. 'ఏవో కొన్ని విభూతులు నాయందు గలవు. మరికొన్ని విభూతులు అతని యందు గలవు. ఒకప్పుడు ఈశ్వరుడు నాయందు కంటె అతని యందు మధురతర సంగీత రూపములో ప్రకటమగుచున్నాడు'. ఇట్లు నీవు భావించగల్గినచో నీ గర్వము, నీ హైన్యభావన ఇత్యాది సర్వము దూరమగును. సుందరమైనది ఎక్కడ ఏది కనబడినా, నీవు ఈశ్వరుని విభూతిని మాత్రమే గుర్తించగల్గుతావు. సాధకునకు ఇది చాల ప్రముఖమగు అధ్యాయమని నా అభిప్రాయము. సాధకుడు పరిణతిని చెందాలంటే, భగవానుడీ అధ్యాయములో చెప్పిన విషయములను ఆకళింపు చేసుకొనుట అత్యావశ్యకము.

### భగవాముని విభూతులను వర్ణించుటకు అర్హులెవరు?

'నీకు హితమును కలిగించు కోరికతో మాత్రమే నేను నీకు ఈ విషయమును చెప్పుచున్నాను గనుక శ్రద్ధగా వినుము' అని భగవానుడిచట చెప్పదగిన ఆవశ్యకత ఏమున్నది? బహుశః ఈ

సమాచారము ఇతరత్రా కూడ లభ్యము కావచ్చును. భగవానుడు తన సమయమును వెచ్చించి హిమాలయముల విభూతి నేనే, ఎవరెస్ట్ శిఖరము యొక్క విభూతి నేనే, గంగానది యొక్క విభూతి నేనే అంటూ ఆవృత్తి చేయుటకు కారణమేమి? పండితులెవ్వరైననూ ఈ ఆవృత్తిని చేయగల్గుదురు గదా! కాని ఈ మాటను పండితుడు చెప్పినప్పుడు అది అర్థవంతము కావాలంటే, ఆ మాటకు ప్రామాణ్యము ఉండాలి. అది భగవానుని నుండి మాత్రమే లభించగలదు. కావున, దీనిని చెప్పదగ్గ అధికారము భగవానునకు గలదు. ఈ విషయమునే భగవానుడు తరువాతి శ్లోకములో స్పష్టము చేయుచున్నాడు. భగవానుడిట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 10, శ్లోకము 2 :**

न मे विदुस्सुरगणाः प्रभवं न महर्षयः ।
अहमादिर्हि देवानां महर्षीणां च सर्वशः ॥ २ ॥

న మే విదుస్సురగణాః ప్రభవం న మహర్షయః
అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః (2)

మే = నాయొక్క; ప్రభవం = ఈ జగద్రూపముగా ప్రకటమగుటను/ విభూతిని; సురగణాః = దేవతా గణములు; న విదుః = ఎరుంగరు; మహర్షయః = మహర్షులు; న = ఎరుంగరు; అహం = నేను; చ = మరియు; సర్వశః = అందరు; దేవానామ్ = దేవతలకు; మహర్షీణామ్ = మహర్షులకు; ఆదిః = కారణము; హి = ఏలయనగా.

> నేను ఈ జగద్రూపముగా ప్రకటమగుటను/ నా విభూతిని దేవతాగణములు ఎరుంగరు. మహర్షులు ఎరుంగరు. ఏలయనగా, నేను అందరు దేవతలకు మరియు మహర్షులకు కారణము (2).

మే ప్రభవమ్ అనగా నా విభూతులు. నా శక్తులు, లేదా నేను ఈ జగద్రూపముగా ప్రకటమగుట అని చెప్పవచ్చును.

న విదుః. వారు పూర్ణముగా ఎరుంగరు. వారందరు ఎరుంగుదురు. కాని పూర్ణముగా కాదు. వారెవరు? మనమిచట స్థానిక వ్యక్తుల గురించి మాటలాడుట లేదు.

సురగణాః. సర్వదేవతా సమూహములు. సురులనగా ఇంద్రవరుణాది దేవతలు. వారైననూ పూర్ణముగా నెరుంగరు. తాము పరమాత్మ స్వరూపులమేనని వారు ఎరింగిననూ, వారికి శ్వర విభూతులన్నియూ తెలియవు. బ్రహ్మగారైననూ సృష్టించగలడే గాని, స్థితిని చేయలేడు. ష్ణువు స్థితిని చేయగలడే గాని, సృష్టించలేడు. సృష్టి ఆయన విధి కాదు. శివుడు రుద్రరూపుడై ంమును చేయగలడే గాని, సృష్టి స్థితులను చేయజాలడు. త్రిమూర్తులలో ప్రతి ఒక్కరికి ఒక ధి గలదు. కావున, బ్రహ్మాదులకైననూ నా విభూతులు పూర్తిగా తెలియవు.

అంత మాత్రమే గాదు. మహర్షులు కూడా ఎరుంగరు. మహాన్ చ అసౌ ఋషిః మహర్షిః. డు గొప్పవాడు, మరియు ఋషి కూడా. జ్ఞానమును పొంది మనందరికి జ్ఞానమును అందించువారు ్షులు. వారికైననూ ఈశ్వరుని విభూతులు పూర్తిగా తెలియ వు. వారికి సాధారణంగా సర్వము యుండును. 'సత్యబ్రహ్మను నేనే (అహం సత్యం బ్రహ్మ). బ్రహ్మ కంటె భిన్నమైనది సర్వము ్య. కావున తెలిసినది, తెలియనిది సర్వము నేనే' అని ఆ జ్ఞానులు ఎరుంగుదురు. ఆ జ్ఞానమే ్వము. కాని అది ఈశ్వరుని సర్వజ్ఞత్వము కంటె భిన్నమైనది. ఈశ్వరుని యందు ఆ త్యముతో బాటు మిథ్యయొక్క వివరములన్నియూ కూడ గలవు. ఈ వివరములను హర్షులు కూడా ఎరుంగరు.

**హర్షులకు, దేవతలకు తెలియక పోవుటకు కారణమేమి?**

అహం ఆదిః హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ఏలయనగా దేవతలకు ఋషులకు అందరికీ కారణము నేనే. ఒక దృష్టాంతమును గమనించుడు. తండ్రి కొడుకుతో తన వివాహము ఎంత గొప్పగా జరిగినదో చెప్పుచుండెను. వివాహము నాల్గు రోజులు జరిగెను. మొదటి రోజు భానుమతి వచ్చి నాట్యప్రదర్శనను ఇచ్చెను. రెండవ రోజు రామానుజం కచేరి, మూడవ రోజు మహారాజపురం, నాల్గవ రోజు సెమ్మన్ గుడి వచ్చిరి. వందలాది బంధువులు విచ్చేసిరి. పెద్ద పందిళ్ళు వేయబడెను. అంతా విని, 'నీవు నన్నేల తీసుకు వెళ్లలేదు?' అని కుమారుడు ప్రశ్నించెను. తండ్రి ఎంత వివరంగా వర్ణించినా, కుమారునకు ఆ వివాహము గురించి ప్రత్యక్ష జ్ఞానము ఎట్లు కలుగగలదు? వానికి పదముల వర్ణన నుండి పుట్టే పరోక్ష జ్ఞానము మాత్రమే కలుగును. పదముల సామర్థ్యమునకు హద్దులు గలవు. ఈ హద్దులు చెప్పేవానికి, వినే వానికి కూడా అనుభవములో నున్నవియే. చెప్పేవాని వివక్షను వినేవాడు అన్ని వేళలా గ్రహించడు. భాషావిషయకమైన హద్దులు చెప్పువానికి, విను వానికి కూడ గలవు. కొందరు తమ వ్యక్తి గత అనుభవము నైననూ మార్పులతో చేర్పులతో వర్ణిస్తారు.

సంగ్రహించి విపరీతార్థము వచ్చునట్లు చేస్తారు. పరోక్ష జ్ఞానములోని సమస్య ఇదియే. కావున పై దృష్టాంతములో పెళ్ళి జరిగిన సమయంలో లేని కుమారునకు తండ్రితో సమమగు జ్ఞానము కలుగదు. అదే విధముగా, ఈ దేవతలు, ఋషులు నా విభూతులను పూర్తిగా ఎరుంగరు. ఏలయన, ఈ దేవతలకు, ఋషులకు అందరికీ కారణము నేనే.

సృష్టి ప్రక్రియను శ్రుతి విభిన్న రీతులలో వర్ణించినది. భగవానుని నుండి సర్వము ఒక్కసారిగా (యుగపత్) ఆవిర్భవించినది. లేదా ముందుగా ఆకాశము, తరువాత వాయువు, అగ్ని మొదలగునవి, తరువాత స్థూల భూతములు పుట్టినవని ఒక క్రమము ఈయబడినది. లేదా, ముందుగా హిరణ్యగర్భుడు జన్మించి, తరువాత సర్వమును సృజించెను. ఈ తీరున శాస్త్రములో విభిన్న సృష్టిప్రక్రియలు గలవు. కాని నీవు ఏ ప్రక్రియలో చూచిననూ, కారణము నేనే (అహం ఆదిః). దీనిలో వికల్పమేమియూ లేనే లేదు. దేవతలకు, మహర్షులకు నేను కారణము (ఆది) అయి ఉండగా, నాగురించి వారు ఏమి తెలియగలరు? వారికి తెలిసినది అంతా నేను బోధించినదియే. నాకు తెలిసిన సర్వము వారికి తెలియదు.

ఈశ్వర విభూతులను వర్ణించుటకు సర్వోత్తమమైన అర్హత గలవాడను నేనే అని భగవానుడీ శ్లోకములో నిర్దేశించు చున్నాడు.

**భగవద్విభూతులను చెప్పే అర్హత భగవానునకు మాత్రమే ఉండుటకు కారణమేమి?**

మహర్షులందరు మానవులే. వారు గొప్ప సిద్ధులు, శక్తులు గలవారే. కాని వారందరు మర్త్యులే (జీవులు). దేవతలు కూడా అంతే. కావున వారందరికి నా విభూతి పూర్ణముగా తెలియదు. ప్రభవమనగా సృష్టి. కాని అధ్యాయములోని విషయవస్తువునకు అనురూపముగా శ్రీ శంకరులు 'భగవానుని పూర్ణ శక్తి, లేక విభూతి' అని అర్థము చెప్పిరి. వారందరికీ పరిమితమగు జ్ఞానముమాత్రమే కలదు గాన, వారు నా విభూతులను పూర్ణముగా నెరుంగరు. దేవతలకు ఇచటి మర్త్యులకంటె అధికమగు జ్ఞానము ఉండును. ఋషులకు ప్రాకృత జనులకంటె అధికముగు జ్ఞానము ఉండుననుటలో సందేహము లేదు. కాని సర్వజ్ఞత్వ దృష్టికోణములో పరిశీలిస్తే, వారందరు పరిమితమగు జ్ఞానము గలవారే (కించిద్ జ్ఞాః). కావున, వారికి నా విభూతులను గురించి పూర్ణ జ్ఞానము లేదు. కావున వారికి వాటి గురించి చెప్పగలిగే సామర్థ్యము లేదు.

వాటిని వర్ణించే అర్హత నాకు మాత్రమే గలదు. విషయవస్తువును ప్రశంసించుట యనగా

నేను మాత్రమే వర్ణించుటకు అర్హమైన విషయమును నీకు చెప్పబోవుచున్నాను. శ్రీ కృష్ణుడిచట గవత్త్వమును పరిచయము చేయుచున్నాడు. శ్రీ కృష్ణుడు తనను తాను ఈశ్వరావతారముగా యము చేయుచున్నాడు. లేదా, వ్యాసుడు అయనను ఈశ్వరునిగా ప్రస్తుతించుచున్నాడు. ఏది శ్రీ కృష్ణుడు ఈశ్వరుడు. కావున ఇది ఈశ్వరుడగు శ్రీ కృష్ణునకు, జీవుడగు అర్జునునకు జరిగిన సంవాదము.

## సర్వజ్ఞుడనని చెప్పునది ఎవరు?

ఈ తీరున మాటలాడే శ్రీకృష్ణుడు ఈశ్వరుడని మనకు తెలుస్తూనే ఉంటుంది. దానిలో స్య లేదు. కాని ఈ వాక్యమును చెప్పునదెవరు? 'నేను సర్వమును ఎరుంగుదును (అహం జ్ఞః). కావున నేను నీకు సర్వమును చెప్పెదను' అని చెప్పునదెవరు? సర్వజ్ఞ సచ్చిదానంద యా? లేక ప్రమాతయా?

తెలుసు కొనే వాడు ప్రమాత యనబడును. ఈ గ్రంథమును నీవు చదివి తెలుసుకున్నచో ప్రమాతవు అగుదువు. నీవు తెలుసుకొనేది ప్రమేయము అగును. ఈ తెలియుటకు ప్రమ యని తెలుసుకునే సాధనమునకు ప్రమాణము అని పేరు. కావున ఇచ్చట ఒక శంక గలదు. ర్వజ్ఞుడు ప్రమాతయా? లేక సచ్చిదానంద ఆత్మయా? సచ్చిదానంద ఆత్మ జ్ఞానఘనమగు శుద్ధ న్యము. ఆ దృష్టితో చూస్తే ఆత్మలన్నియూ సర్వజ్ఞములే. కాని మనమిచట అట్టి సర్వజ్ఞత్వమును రించి చర్చించుట లేదు. వ్యక్తి సర్వజ్ఞుడు కావాలంటే ఆత్మకంటె అధికముగా ఒక ఉపాధి ఉండి వాలి. ఉపాధి లేనిదే ఎరుక సంభవము కాదు. భగవానుడు 'నేను ఎరుంగుదును' అని మాత్రమే క, 'నేను నీకు చెప్పగలను' ఇత్యాది వాక్యములను కూడా చెప్పుచున్నాడు. మార్పులకు వేటికీ ను కాని ఆత్మ వక్తృస్థాయిని గాని, సర్వజ్ఞత్వ స్థాయిని గాని పొందజాలదు. సర్వజ్ఞత్వ వక్తృత్వములు శుద్ధ సచ్చిదానంద ఆత్మకు వర్తించవు. కావున ఈ మాటలను చెప్పునది శుద్ధ సచ్చిదానంద ఆత్మ కాదు.

అట్లైనచో తెలుసుకొనేది, మరియు మాటలాడేది ఎవరు? ప్రమాత మాత్రమే తెలుసుకొనును. మరియు మాటలాడును. కాని శ్రీకృష్ణ భగవానుడు ప్రమాత (జ్ఞాత) అని అంగీకరించినచో, ప్రమాతలందరు జీవులే గనుక, అయన సర్వజ్ఞుడు కాజాలడు. సర్వజ్ఞుడు కానిచో, ఈశ్వర విభూతులు మొదలగు వాటి గురించి మాటలాడే అర్హత అయనకు ఉండదు. కావున తెలుసు కొనేది, మాటలాడేది ప్రమాత అని చెప్ప వీలులేదు.

కావున ఆత్మగాని, ప్రమాత గాని సర్వజ్ఞము కానేరదు. అయినచో సర్వజ్ఞుడు ఎవరు? జీవునకు రెండు రూపములు గలవు. ఆ జీవుడు దేవత గావచ్చును, మానవుడు గావచ్చును, లేదా క్రిమి కావచ్చును. ఒకటి వాస్తవ రూపము. ఇది తత్త్వ దృష్ట్యా సత్యము. దీనిని బాధించుట (negate) అసంభవము. రెండవది ఆధ్యాసిక రూపము. ఇది ఒక కల్పిత పాత్ర. ఇది ఆత్మపై అధ్యారోపము చేయబడిన ఒక అవస్థ. నటుని యందు ఒక వాస్తవిక వ్యక్తిత్వముతో బాటు అతడు నటించే పాత్ర కూడా ఉండును. నటునకు ఈ రెండు రూపములు గలవు. అటులనే సర్వ జీవులకు ఒక అధ్యారోపిత రూపముతో బాటు తాత్త్వికరూపము కూడా ఉండును. ఈశ్వరుని విషయంలో కూడా పరిస్థితి ఇంతే.

జీవేశ్వరుల మధ్య వాస్తవిక భేదము లేదు. రెండు సచ్చిదానందములే. క్రిమి స్వరూపమైననూ సచ్చిదానందమే. దేవత, గంధర్వుడు, యక్షుడు, మానవుడు, కాకి ఇత్యాది సర్వప్రాణుల వాస్తవరూపము ఒకే ఒక సచ్చిదానందము. దానిలో భేదము లేశమైననూ లేదు. భగవానుడు అహమ్ అన్నప్పుడు మరియు జీవుడు అహమ్ అన్నప్పుడు, ఆ అహమ్ ఒకే ఒక సచ్చిదానందము.

దీనికి భిన్నమైన రెండవ రూపము, అనగా ఆధ్యాసిక రూపము జ్ఞాత, కర్త ఇత్యాది స్థితులను పొందు చుండును. జీవేశ్వరుల మధ్య కన్పట్టు భేదము ఇదియే. జ్ఞాతతో బాటు బుద్ధి కూడా రంగములోనికి వచ్చును. అకర్తయగు సచ్చిదానంద ఆత్మ కర్తృత్వ స్థాయిని పొందినట్లు భాసింపజేయు ఉపాధి ఈ బుద్ధియే.

జీవుడు బుద్ధితో తాదాత్మ్యమును పొంది జ్ఞాత యగును. జీవుని ఈ ఆధ్యాసిక రూపమును (ఉపాధికృతరూపమును) నిరూపించేది బుద్ధియే. బుద్ధి ఆత్మయందు అధ్యారోపితమై జ్ఞాత యనబడు చున్నది. కాని అది యథార్థము కాదు. కావున ఈశ్వరునకు, జ్ఞాతృత్వమనే స్థితిని పొందియున్న జీవునకు మధ్యలో భేదమున్నట్లు కాన్పించును. ఇద్దరు జీవుల మధ్య కూడా భేదమున్నట్లు కన్పట్టును. ఇద్దరు వ్యక్తుల రెండు ఆత్మలు సచ్చిదానందమే. కాని బుద్ధులలో భేదము నిశ్చయముగా గలదు. కావున, జ్ఞాత అనే స్థాయిలో ఏ రెండు జీవుల మధ్యలోనైననూ భేదము గలదు. సచ్చిదానందుడగు జీవుడు జ్ఞాత ఎట్లు అయినాడు? ఉపాధి వలన మాత్రమే జ్ఞాత అయినాడు. వ్యావహారిక దృష్టి కోణములో జీవుడు ద్రష్ట, శ్రోత, మంత, కర్త ఇత్యాదిగా అగుచుండును. వ్యావహారిక సృష్టి యొక్క దృష్టికోణములో ఈశ్వరుడు కూడా ప్రమాతయే. జీవునివలెనే ఈశ్వరుడు కూడా ఉపాధి మూలకంగా ప్రమాత అయినాడు.

ఈ కారణంగానే జ్ఞానములో తారతమ్యము గలదు. వ్యక్తులలో ఒకడు న్యాయశాస్త్ర విద్వాంసుడైతే, మరియొకడు వైద్యశాస్త్రములో నిష్ణాతుడు. కావున న్యాయవాది వైద్యుని వద్దకు వెళ్లవలసియుండును. వైద్యుడు న్యాయవాది వద్దకు వెళ్ళ వలసియుండును. వారిద్దరి జ్ఞానములు పరిమితమైనవే. న్యాయవాదికి తెలిసినది వైద్యునకు తెలియదు. వైద్యునకు తెలిసినది న్యాయవాదికి తెలియదు.

అట్లైనచో, ఈశ్వరుని మాట యేమి? జీవునకు తెలిసినది ఈశ్వరునకు తెలియదని చెప్ప జాలము గదా! ఈ పరిస్థితి గురుశిష్యుల పరిస్థితిని బోలియున్నది. శిష్యునకు తెలిసినది గురువునకు తెలియును. కాని గురువునకు తెలిసినది శిష్యునకు తెలియదు. జీవుని జ్ఞానము అల్పము. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఈ దృష్ట్యా మాత్రమే జ్ఞానములో తారతమ్యము గలదని మనము చెప్తాము.

**జ్ఞాన తారతమ్యము ఉపాధికృతము ఎట్లు అగును?**

జీవుడు అవిద్యయే ఉపాధిగా గలవాడు. ఈ ఉపాధి ఆత్మను పరిచ్ఛిన్నము చేసినట్లు కన్పట్టును. దీనికి భిన్నంగా ఈశ్వరుని ఉపాధియగు మాయ పరిచ్ఛిన్నము చేయదు. పైగా అది ఆత్మను సర్వజ్ఞముగా, జగత్కారణముగా చేయును.

వ్యక్తమైన రూపములో జీవునకు ఒక విశిష్ట బుద్ధి ఉండును. జీవుడు దానితో కొన్ని వస్తువులను తెలియగల్గును. కాని మాయోపాధికుడ గు ఈశ్వరుడు సర్వజ్ఞుడు. మాయకు గల కప్పివేసే (ఆవరణ) శక్తి జీవుని యందుండును. కావున జీవుడు సర్వమును ఎరుంగజాలడు. తద్భిన్నంగా ఈశ్వరుని యందు ఈ ఆవరణము లేదు. ఈశ్వరుని యందు సృష్టిని చేయు శక్తిమాత్రమే గలదు. ఈ తీరున, ఒకే మాయ జీవుని విషయంలో వ్యామోహకమై, ఈశ్వరునకు విభూతి యగు చున్నది. ఇది సచ్చిదానంద ఆత్మరూపుడగు పరమేశ్వరుని ప్రప్రథమ విభూతి.

బుద్ధి ఒక స్థానమునకు అధీనమై యుండును గాన, దానికి హద్దులు గలవు. స్థూల ఉపాధిలోని మస్తిష్కకణములు ఇత్యాదిపై ఆధారపడి అది పని చేయును. ఏతద్భిన్నముగా, సర్వకారణమగు మాయకు సీమలు ఏ మాత్రమూ లేవు.

ఇది నీకెట్లు తెలియును? ఇది శాస్త్రముచే స్థాపించబడినది. కావున శ్రీకృష్ణుని రూపములో నున్నవాడు మాయోపాధి పరిచ్ఛిన్నుడై ఉన్నాడు. నాల్గవ అధ్యాయములో శ్రీకృష్ణభగవానుడు స్వవచనములలో తాను ఈశ్వరుడనని పరిచయము చేసి యున్నాడు.

కావున మాయోపాధికమగు ఆత్మ జ్ఞాతయై, విషయమై, శ్రీ కృష్ణుడు అని ప్రఖ్యాతి గాంచిన స్థూలదేహమునందు ప్రతిబద్ధమై యున్నది. మాయను వశములో నుంచుకొని భగవానుడు ఒక విశిష్టరూపములో జన్మించినాడు. అయన అవతారపురుషుడు. కావున అయన స్వీయ కర్మఫల రూపముగా అవశుడై జన్మించినవాడు కాదు. ఈశ్వరుడు స్వేచ్ఛచే దేహమును స్వీకరించినాడు. అయన సర్వజ్ఞుడు. కాని ఇంద్రాది దేవతలు అల్పజ్ఞులు. కావున దేవతలు అయన విభూతుల నెరుంగజాలరని పూర్వశ్లోకములో చెప్పబడినది. వారందరు పరిమితమగు బుద్ధులను కలిగి యున్న జీవులు గాన, వారి జ్ఞానమునకు హద్దులు గలవు.

ఉపాధి దృష్టి కోణంతో జీవుడు కించిద్ జ్ఞుడు, ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఉపాధియందు ఉపలభ్యమయ్యే సచ్చిదానంద ఆత్మ ప్రమాత యనబడును. ఆత్మకే ప్రమాత యని పేరు. ఉపాధికి కాదు. బుద్ధికి కాదు. అదే సచ్చిదానంద ఆత్మ మాయోపాధి విశిష్టమై ఈశ్వరుడై, సర్వజ్ఞ ప్రమాత అయినది. ఉపాధి దృష్టికోణంలో చూస్తే జీవేశ్వరుల అభేదము అసంభవము. కాని ప్రమాత వాస్తవము కాదు. అది ఆధ్యాసికము, మిథ్య. భేదము ఉన్నట్లు కన్పట్టినను, తత్త్వములో భేదము లేదు. వాస్తవంలో జీవేశ్వరులిద్దరూ శుద్ధ చైతన్య, ఏక అద్వితీయ సచ్చిదానంద ఆత్మయే. తత్త్వమసి అను మహావాక్యము ఈ అభేదమును ప్రదర్శించును.

తరంగ సముద్ర దృష్టాంతమును పరిశీలించుడు. నీవే సముద్రము అని తరంగముతో చెప్పినచో, అది ఇట్లనును: 'నేను సముద్రము ఎట్లు అగుదును? నేను పుట్టుటకు ముందే సముద్రము ఉండెను'. కాని 'నీవు' అను పదమునకు వాచ్యార్థము తరంగమనియు, లక్ష్యార్థము నీరు అనియు ఆ తరంగము గ్రహించును. తరంగ సముద్రములు కేవల నామ రూప ఉపాధులు మాత్రమే. తరంగము లేదు. సముద్రము లేదు. అవి కేవల రూపములు మాత్రమే. వాటికి ఆ పేర్లు ఈయబడెను. విశ్లేషించినచో తరంగ సముద్రములు రెండు జలమేనని తెలును. అదియే వస్తువు, లెక్కించదగినది. వాస్తవ భేదము లేదు. నామరూపములను లెక్కించ మొదలిడినచో, సముద్రములో అనేక తరంగములు, భగ్నతరంగములు ఇత్యాదులు గలవు. అట్లు గాక నీటిని లెక్కించి, దానికంటె అదనముగా తరంగము గాని, సముద్రముగాని ఉన్నదేమో పరికించుడు. ఉన్నది సర్వము జలము మాత్రమే. ఇదియే అద్వైత జ్ఞానము.

శ్రీ కృష్ణ దేహములో మాత్రమే మాయోపాధి నియంత్రిత చైతన్యము గలదు. మన స్థూల దేహములో అదే చైతన్యము అజ్ఞానము, బుద్ధి మొదలగు వాటిచే నియంత్రితమై ఉన్నది. ఈ

భేదమును తెలుసుకొనుట ఎట్లు? శ్రీ కృష్ణునకు దేహము గలదు. అర్జునునకు కూడ దేహము గలదు. అర్జునుని ఆత్మ చైతన్యమే. శ్రీకృష్ణుని ఆత్మయూ చైతన్యమే. ఆయన చైతన్యము ఆయన దేహేంద్రియ మనస్సులచే ఉపహితమై యున్నది. కావున నా చైతన్యము అజ్ఞానోపహితము (conditioned by ignorance) అనియు, ఆతని చైతన్యము మాయోపహిత మనియు ఎట్లు చెప్పవచ్చును? కించిద్ జ్ఞత్వ సర్వజ్ఞత్వ దృష్టి కోణములో మాత్రమే ఈ విభాగము గలదని చెప్పగల్గుదుము. ఆయనకు తెలియును. నాకు తెలియదు. ఆయనకు తెలియనిది లేదు. నాకు తెలిసిన అల్పమును మినహాయిస్తే, మిగిలినదంతా నాకు తెలియనిదియే. అల్పజ్ఞుడగు మానవుడు లేశమైననూ చెప్పజాలని విషయములను భగవానుడిచట చెప్పుచున్నాడు.

వ్యవహారమున్నంత వరకు జీవుడు జీవుడే, ఈశ్వరుడు ఈశ్వరుడే. ప్రమాతలగు జీవుల మధ్య ఐక్యము కుదరదు. ఇంద్ర వరుణాది దేవతల మధ్య కూడ ఐక్యము పొసగదు. కాని పరమాత్మ దృష్టి కోణములో వారి మధ్య గాని, జీవేశ్వరుల మధ్యగాని భేదము లేశమైననూ లేదు.

ఈశ్వరుడు ప్రమాతయే అయినా సర్వజ్ఞుడు. కావున, నేను నీకు చెప్పబోవు విషయములను ఋషులు, దేవతలు కూడ నెరుంగరు అని ఆయన చెప్పుట పొసగును. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు గనుక, అట్లు చెప్పుట ఆయనకు తగును.

దేవతలకు, మహర్షులకు కూడ కారణము నేనే గనుక, వారు నన్ను ఎరుంగరు. నేను సర్వజ్ఞుడను. మిగిలిన వారందరు అల్పజ్ఞులు.

**భగవానుడు సర్వకారణము**

**అధ్యాయము 10, శ్లోకము 3:**

यो मामजमनादिं च वेत्ति लोकमहेश्वरम् ।
असम्मूढस्स मर्त्येषु सर्वपापैः प्रमुच्यते ॥ ३ ॥

యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్
అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే (3)

**యః** = ఎవడైతే; **అజం** = పుట్టుక లేని; **చ** = మరియు; **అనాదిం** = కారణము లేనివాడు;

లోకమహేశ్వరమ్ = లోకములకు (ప్రాణులకు) అనంత ప్రభుడు అగు; మాం = నన్ను, వేత్తి = ఎరుంగునో; మర్త్యేషు = మానవులయందు; అసమ్మూఢః = వ్యామోహములేని; సః = అతడు; సర్వపాపైః = పుణ్యపాపములన్నింటిచే (అన్నింటినుండి); ప్రముచ్యతే = విముక్తుడగును.

పుట్టుక లేని వాడు, కారణము లేనివాడు మరియు లోకములకు / ప్రాణులకు అనంత ప్రభువు అగు నన్ను ఎవడు ఎరుంగునో, మానవులలో వ్యామోహము పొందని వాడగు నాతడు పుణ్యపాపములన్నింటినుండి విముక్తుడగును (3).

సర్వదేవతలకు, మహర్షులకు నేనే కారణమని భగవానుడు ముందుగా చెప్పి యున్నాడు. ఒక దేవత యొక్క ఆత్మకు గాని, లేక మహర్షి యొక్క ఆత్మకు గాని ఆయన కారణము కాదు. ఏలయన, ఆయనయే ఆత్మ. ఉపాధికి ఆయన కారణము. ఉపాధి వలననే ఈ జీవుడు మహర్షియని, దేవతయని, మానవుడని, లేక పశువు అని పిలువబడుచున్నాడు. ఉపాధులకు, అనగా దేహేంద్రియ మనస్సంఘాతములన్నింటికి నేనే కారణము (ఆది). సృష్టింపబడేది ఉపాధి మాత్రమే.

సర్వమునకు కారణము నేనే గనుక, నాకు కారణము లేదు. కావున, నాకు పుట్టుక లేదు (అహం అజః). ఎందువలన? నేను కారణము లేని వాడను (అనాదిః) గనుక. ఇట్లు భేదమును చూపనిచో, అజ అనాది అను పదములు ప్రయోగింపబడుటకు కారణమేమి? నాకు పుట్టుక లేదు(అజః). ఏలయనగా, నాకు ఆదిలేదు (అనాదిః); అనగా కారణములేదు. కావున పుట్టుక లేకపోవుట (అజత్వమ్) కు కారణము లేక పోవుట (అనాదిత్వమ్) కారణము.

దీనిని మరోరకముగా వ్యాఖ్యానించవచ్చును. పుట్టుక లేనివాడు అనగా కార్యము కాని వాడు. కారణము లేనివాడు అనగా తానే సర్వమునకు కారణమైన వాడు. శ్రీ శంకరులీ తీరున వ్యాఖ్యానించినారు. తానే సర్వమునకు కారణము అని భగవానుడు చెప్పుచున్న ఈ ప్రకరణములో శ్రీ శంకరుల వ్యాఖ్యానము యుక్తి యుక్తముగా నున్నది.

లోకమహేశ్వరమ్, సర్వమానవులకు ప్రభువు, మరియు అనంతుడు. పుట్టుక లేనివాడు. జాగ్రదభిమాని గాని, స్వప్నాభిమాని గాని, సుషుప్త్యభిమాని గాని కానివాడు అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. జాగ్రత్ప్రపంచముగాని, సూక్ష్మ ప్రపంచముగాని, కారణ ప్రపంచముగాని ఆయన స్వరూపము కాదు. ఈ మూడింటికి అధిష్ఠానము, మూడింటి సత్యము అగు తత్త్వము

తురీయమనబడును. అట్టి తురీయుడగు పరమాత్మ అజ్ఞానమునుండి, తత్కార్యము నుండి విముక్తుడు. ఆయన సర్వమునకు అధీశ్వరుడు.

**భగవానుని ఈ విధముగా తెలుసుకొనుట వలన కలుగు ఫలము**

ఈ సత్యము నెరింగినవాడు మోహమునుండి విముక్తుడై యుండును (అసమ్మూఢః). మోహితుడైన వ్యక్తి సర్వకారణమగు సచ్చిదానంద ఆత్మ కార్యమని భ్రమపడును. రూపము లేని దానిని రూపము కలదిగా స్వీకరించును. కాలాతీతమైన దానిని కాలాధీనముగా స్వీకరించును. ఒక్క మాటలో చెప్పాలంటే, ఆత్మను అనాత్మగా స్వీకరించును. నేను పొడుగరిని అని నీవు అన్నప్పుడు పొడుగాటి దేహము ఆత్మగా స్వీకరించబడినది. ఆత్మపై స్థూలదేహాదికము, స్థూలదేహముపై ఆత్మ అధ్యారోపము చేయబడినవి. దీని ఫలితమే సంసారి. సంసారులందరికీ ప్రతీకయనదగిన ఇట్టి వ్యక్తి సమ్మూఢుడనబడును. ఈ మోహము నుండి విముక్తుడైన వాడు అసంమూఢుడనబడును.

సః మర్త్యేషు. అతడు మర్త్యులలో ఒకడై ఉన్నా, అతనిని మర్త్యుడు గా పరిగణింపరాదు. అతడు విముక్తుడైనాడు (ప్రముచ్యతే).

సర్వపాపైః. పాపములన్నింటిచే విడువబడినాడు. పాపములు రెండు రకములు. ఒకటి బుద్ధి పూర్వకంగా యోజనాబద్ధముగా చేసినవి. ఉదాసీనత వలన, అజాగ్రత్త వలన చేసిన పాపములు రెండవరకము. ఇతర ప్రాణులకు హాని కలుగ కుండునట్లు మనము జాగరూకులమై ఉండాలి. అట్లు ఉండనిచో, అట్టి అశ్రద్ధ పాపములకు హేతువు అగును. ఒకసారి వివాహంలో భోజనాల కొరకు అరటి ఆకులను తెమ్మని ఒక వ్యక్తికి అప్పజెప్పినారు. అవి పదిమైళ్ల దూరంలో దొరకుచుండెను. ఆ దూరమును పయనించుట అతని విధి. వివాహమునకు విచ్చేసిన అతిథులకందరికీ భోజనమును సమకూర్చుట చాల ప్రముఖకర్తవ్యము. కాని, ఈతడు అరటి ఆకులను తీసుకురాలేదు. కన్యాదాత అరటి ఆకుల గురించి ప్రశ్నించగా, 'నాది పొరపాటు; నా పొరపాటు అంగీకరించుచున్నాను' అని చెప్పెను. ఒక పనిని చేయవలసిన సమయంలో చేసి తీరాలి. పనిని మాని పొరపాటును అంగీకరించుట వలన లాభము లేదు. అతని అశ్రద్ధచే ఆ పని చెడినది. మనము సావధానులమై, శ్రద్ధాళువులమై ఉండాలి. నడుస్తూ ఉంటే, అనుకోకుండా కాలి క్రింద పడి క్రిమి మరణిస్తే అది తెలియక చేసిన పాపము అగును. నిత్యకర్మను చేయుట వలన ఈ పాపములన్నియు ప్రభావహీనములగును.

భగవానుడు సర్వశబ్ద ప్రయోగమును చేసినాడు గాన, పుణ్యము కూడ దానిలో కలిసి

పోవును. పుణ్యము కూడా బంధమే. అది బంగరు సంకెల. వ్యక్తిచే మెరుగైన పరిస్థితిని అనుభవింపజేసి పుణ్యము బంధించును.ఆతడు ఈ పాపము లన్నిటి నుండి విముక్తిని ఎట్లు పొందును? ఆత్మ సర్వదా అకర్తయే. కాని ఆత్మ కర్తయనే భ్రాంతి ఉండెడిది. ఇపుడు ఆతడు ఆత్మ యొక్క యథార్థ స్వరూపమును గుర్తించినాడు. ఈ గుర్తింపు లేని సమయములో ఆతడు వివిధములైన పుణ్యపాపకర్మలకు వశుడై ఉండెడివాడు.

ఇపుడాతడు ఆత్మ అకర్తయనే సత్యమును గుర్తించి పుణ్యపాపములనుండి విముక్తిని పొందినాడు. ఇదియే మోక్షము. ప్రస్తుతానికి ఆతనికి ఇంకనూ ప్రారబ్ధ కర్మ మిగిలియున్నది. కాని ఆతడు కొంత కాలము తరువాత దాని నుండి కూడా విముక్తిని పొందును.

**భగవానుని కారణత్వములోని వివరములు - భగవానుని విభూతులు**

భగవానుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు: నేను సర్వ ప్రాణులపై అధీశ్వరుడను. ఏలయనగా-

**అధ్యాయము 10, శ్లోకము 4:**

बुद्धिर्ज्ञानमसम्मोह : क्षमा सत्यं दमश्शमः ।
सुखं दुःखं भवोऽभावो भयं चाभयमेव च ॥ ४ ॥

బుద్ధిర్ జ్ఞానమసమ్మోహః క్షమా సత్యం దమశ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ (4)

బుద్ధిః = తెలియగలిగే శక్తి; జ్ఞానమ్ = జ్ఞానము; అసమ్మోహః = వ్యామోహము లేకుండుట; క్షమా = సహన శక్తి; సత్యం = సత్యవాక్యము; దమః = బాహ్యేంద్రియ నిగ్రహము; శమః = మనోనిగ్రహము; సుఖం = సుఖము; దుఃఖమ్ = దుఃఖము; భవః = సృష్టి; అభావః = ప్రలయము; చ = మరియు; భయం = భయము; అభయమ్ = భయము లేకుండుట, ఏవ = నిశ్చయముగా.

తెలియగలిగే శక్తి, జ్ఞానము, వ్యామోహము లేకుండుట, సహనశక్తి, సత్యవాక్యము, బాహ్యేంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, సుఖము,

దుఃఖము, సృష్టి, ప్రలయము, భయము మరియు భయము లేకుండుట
అనునవి నిశ్చయముగా (నానుండియే పుట్టినవి) (4).

**అధ్యాయము 10, శ్లోకము 5:**

अहिंसा समता तुष्टिस्तपो दानं यशोऽयशः ।
भवन्ति भावा भूतानां मत्त एव पृथग्विधाः ॥ ५ ॥

**అహింసా సమతా తుష్టిస్తపో దానం యశోఽయశః**
**భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః (5)**

**అహింసా** = హింసను చేయకుండుట; **సమత** = సమమగు మనస్స్థితిని కలిగియుండుట; **తుష్టిః** = సంతృప్తి; **తపః** = ధార్మిక అనుశాసనము; **దానం** = దానము; **యశః** = కీర్తి, **అయశః** = అపకీర్తి; **భూతానామ్** = ప్రాణులయొక్క; **పృథగ్విధాః** = వివిధ రకముల; **భావాః** = భావములు; **మత్తః ఏవ** = నా నుండి మాత్రమే.

హింసను చేయకుండుట, సమానమగు మనస్స్థితిని కలిగి యుండుట,
సంతృప్తి, ధార్మిక అనుశాసనము, దానము, కీర్తి, అపకీర్తి మొదలగు
ప్రాణుల వివిధ భావములు నా నుండి మాత్రమే పుట్టు చున్నవి (5).

ఇవి అన్నీ నా నుండియే పుట్టుచున్నవి (మత్త ఏవ) అని భగవానుడిచట చెప్పుచున్నాడు. ఇవి ఏవి? భగవానుడు వాటిని ఒక జాబితాగా ఇచ్చినాడు. దేనినీ విడిచి పెట్టలేదు. ఇందువలననే, ఈ అధ్యాయమునకు విభూతి యోగమను పేరు వచ్చినది. నీకు కనబడే సర్వమహిమలు, సృష్టిలోని సర్వయశస్సులు నాకు చెందినవే. ఒక వ్యక్తిలో తేజస్సు గాని, ఉపలబ్ధి గాని ఉన్నచో, అది నాకు చెందినదియే అగును. ఒక వస్తువులో కొట్టవచ్చినట్లు సౌందర్యమున్నచో, అది నాకు చెందినదే. కొన్ని నదులు ఇతర నదులకంటె అధిక పవిత్రత కలవి యని పురాణాదులలో గనబట్టును. నా వలననే వాటికి ఆ పవిత్రత వచ్చినది. కావున, నీవు అసాధారణమగు దానిని దేనిని పూజించినా, ఆదరించినా, ఆ పూజ, ఆదరము నన్ను మాత్రమే పొందును. ఏలయన, సర్వమునా నుండియే పుట్టినది.

## ప్రాణుల గుణములకు కారణము భగవానుడే

బుద్ధి, జ్ఞానము అను పదములు ఒకే అర్థములో ప్రయోగింపబడు చుండును. కాని మనమిచట వాటికి గల భేదమును గమనించవలెను. ఇంద్రియ గోచరము కాని సూక్ష్మ వస్తువులను ప్రదర్శింపచేయగల అంతః కరణ శక్తి బుద్ధి యన బడునని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. ఒక వస్తువు సుందరముగ నున్నదని మనము అన్నప్పుడు, ఆ సౌందర్యము కేవల ఇంద్రియగ్రాహ్యము కాదు. కాని దానిని మనము ఆస్వాదిస్తున్నాము. మనము పొందే సుఖాను భవములన్నియూ సూక్ష్మమైనవే. మనము పొందే అనుమితి జ్ఞానము (inferential knowledge) కూడా సూక్ష్మమైనదియే. ఇవి ఇంద్రియగ్రాహ్యములు కాకున్ననూ, వాటి ఉనికిని మనము తెలుసుకుంటున్నాము. ఇట్టి సత్యములను ప్రదర్శించే సామర్థ్యము బుద్ధికి సంబంధించినది. ఈ సామర్థ్యము గలవాడు బుద్ధిమాన్ అనబడును. అతడు విజ్ఞానవేత్త కావచ్చును, లేదా సంగీతజ్ఞుడు కావచ్చును. కాని మనమాతనిని బుద్ధిమాన్ అంటాము. స్వభావతః సూక్ష్మములగు విషయములను దర్శించ గలిగే శక్తి అతనికి గలదు.

బుద్ధి నుండి జ్ఞానము పుట్టును. బుద్ధిగలవారికి ఆత్మ మొదలగు పదముల అర్థము యొక్క జ్ఞానము లభించును. వస్తువు ఉన్నది గనుక, దాని జ్ఞానము సంభవమగు చున్నది. ఆ వస్తువు నానుండి పుట్టినది. మరియు జ్ఞానము కూడ నావలన పుట్టినది. ఏలయన, జ్ఞానమంతయూ సర్వజ్ఞుడనగు నాయందు గలదు. నీకు ఎప్పుడు ఏ జ్ఞానము కలిగినా, అది నానుండియే వచ్చినది. సర్వజ్ఞత నాయందు సర్వదా ఉన్నది గనుక, వాస్తవంలో జ్ఞానమును ఎవ్వరైననూ సృష్టించుట లేదు. ఒక వస్తువుగురించి నీకు గల అజ్ఞానమును నీవు తొలగించు కొనెదవు. అంత మాత్రమే. జ్ఞానము 'పుట్టుట' అనగా నిదియే. నేను ఒక విశిష్టజ్ఞానమును ఉత్పన్నము చేసితిని అని నీవు అనవచ్చును. అది సరిగాదనియు ఆ జ్ఞానము నానుండియే వచ్చినదనియు భగవానుడు చెప్పు చున్నాడు. తెలుసుకొనే సామర్థ్యము కూడ నానుండియే వచ్చినది. జ్ఞానము నా నుండియే లభించినది. ఈ సత్యమును దర్శించు వ్యక్తిలో అహంకారము తగ్గి పోవును.

అసంమోహః. భ్రాంతినుండి విముక్తి. వస్తువు కనబడగానే దానిని మనము యథాతథముగా తెలుసుకుంటాము. అనగా మనము వివేకముతో జ్ఞానమును అన్వేషిస్తాము. అసమ్మోహమనగా నిదియే. అట్లు గాక, వివేకము లేకుండగా ఆ వస్తువు గురించి తొందర పాటు నిర్ణయమును చేసినచో, దానికి సమ్మోహమని పేరు. నీవు త్రాడును చూచి పాము అనుకొని ఎగిరిపడతావు. దాని పేరే సమ్మోహము. కంగారు లేకుండా సావధాన చిత్తముతో వస్తువులను చూచి వాటిని యథాతథముగా

తెలుసుకొనుటయే అసమ్మోహము. విచారసహముగు మనస్సును కలిగి యుండుము. పరిశీలించి తెలుసుకొనుము. అదియే అసమ్మోహము.

ఇంద్రియములు మోసగించే అవకాశము గలదని నీవు గ్రహించుము. అవి వస్తువులను యథాతథముగా చూపించవు. విరూపితము (distort) చేసి చూపిస్తాయి. మన ఇంద్రియ జ్ఞానము మనకు గల భయము, ఆదుర్దా ఇత్యాదుల నుండి పుట్టే అవకాశము కూడ గలదు. మనము ఒకచో బాహ్యముగా లేని వస్తువులను కూడా బహిః ప్రసారితము చేసి (project) దర్శించే అవకాశము కూడ గలదు. ఈ విశిష్ట సత్యమును ఎరుంగుట చాల ముఖ్యము. ఈ ఎరుక నిన్ను సావధానుని చేయును. అట్టి అసమ్మోహము కూడ నా నుండియే లభించునని భగవానుడు చెప్పుచున్నాడు.

క్షమా. నిన్ను ఇతరులు నిందించినారనుకో. లేదా, నీ స్థూలదేహమునకు హాని కలిగించినాడనుకో. అది నీ మనస్సు లోపలికి ప్రవేశించకుండగా చేయగలిగే మనస్థితికి క్షమ అని పేరు. ఒకడు నీపై కోపగించినాడనుకొనుము. నీ వాతని క్రోధమును ఎదుర్కొవాలి. కాని ఆ ప్రక్రియలో నీకు కూడా కోపము వచ్చినదనుకొనుము. అంటే, ఆ సమస్య నీ హృదయములోనికి ప్రవేశించిన దనియే గదా! అట్లు హృదయములోపలికి ప్రవేశించకుండనిచో అదియే క్షమ. ఇతరుని క్రోధమును అతనితో మాత్రమే సరిపెట్టుము. అతని క్రోధమునకు గల కారణమును తెలుసుకునే యత్నము ను చేయుము. ఆ సందర్భములో నీ కర్తవ్యము నాచరింపుము. దానిని ఎదుర్కొనుట అనగా నిదియే. అవాంఛిత పరిస్థితులలోనైననూ, ఆ స్థితి హృదయములోనికి ప్రవేశించి స్థిరము (internalisation) కాకుండా ఉండగలిగే మనస్సులో క్షమాగుణము ఉన్నదని స్పష్టమగును.

సత్యమ్. శ్రీ శంకరులిటు సత్యమును నిర్వచించినారు. నీవు చూచిన దానిని, విన్నదానిని, లేదా అనుభవించిన దానిని, ఇతరుని మనస్సు తెలుసుకోగలిగే విధంగా, దానికి అనురూపంగా పలికే పలుకునకు సత్యమని పేరు. నీవు ఒక విషయమును గురించి విన్నావు, లేక చూచినావు, లేదా అనుభవించినావు. కావున, దాని గురించి నీవు మాటలాడగలవు. అనగా సర్వమును గురించి సర్వులతో చెప్పుకుంటూ పోవాలని తాత్పర్యము కాదు. అట్లు చేయుట ఆవశ్యకము కాదు. కాని నీవు చెప్పాలని నిర్ణయించినచో, నీ మాటలు నిజాయితీగా ఉండాలి. నీవు జ్ఞానేంద్రియములతో ప్రత్యక్షముగా దర్శించినదానికి, లేదా ఇతరులనుండి నీవు విని సేకరించిన దానికి, లేదా నీవు వ్యక్తిగతముగా అనుభవించిన దానికి అనురూపముగా ఇతర వ్యక్తికి తెలియాలనే ఉద్దేశ్యంతో నీవు మాటలాడవలెను. సత్యమనగా నిదియే.

ఈ గుణములన్నియూ ఒక విశిష్ట ధార్మిక రచనకు, నైతిక వ్యవస్థకు సంబంధించినవియే. ఈ వ్యవస్థను నిర్మించినది వ్యక్తి కాదు. ఇది అంతా భగవానుని సృష్టి. సత్యదమశమాదులు భగవానుని సృష్టి. అవి నీలో ఉన్నచో, నీకు సృష్టితో మరియు భగవానునితో సమరసత ఏర్పడును. కావున మనకు తెలిసిన దానినే మనము పలుకవలెను. సత్యం వద. సత్యమును పలుకుము. మరియు ఆ సత్యము ప్రీతికరముగా కూడ నుండవలెను. ప్రియం వద. మనము దీని కొరకు కూడా ప్రార్థనను చేసెదము. జిహ్వా మే మధుమత్తమా. నా నాలుకపై తేనె ఉండుగాక. ఇతరులకు ఆనందము కలుగునట్లు నేను పలుకుదను గాక! నా మాటలవలన వారి మనస్సునకు గాయము కలుగకుండును గాక!

పరుషముగా మాటలాడే అర్హత ఆచార్యునకు తక్క మరియొకనికి లేదు. ఆచార్యుడు సత్యమును పలుకవలెను. కాని ఆయన పలికే సత్యము సర్వదా ఉల్లాసకరముగా నుండదు. అటువంటి ఆచార్యుడు కూడ సత్యమును శిష్యుడు భయపడి పారిపోని విధంగా తెలుపవలెను. కొన్ని సమయాలలో ఆయన చేదు సత్యమును తెలుపవలసి వచ్చిననూ, ఆయన దానిని మధురముగా చెప్పవలెను. కావున, సత్యమును పలుకవలెను. కాని నీవు వివేకముతో ఆలోచించి పలుకుము. వివేకమును ప్రక్కన పెట్టకుము. ఇట్టి సద్గుణములన్నియూ నా నుండియే పుట్టునని భగవానుడు చెప్పుచున్నాడు.

బాహ్యేంద్రియ నిగ్రహమునకు దమమని పేరు. కామన ఇంద్రియముల ద్వారా బహిర్గతమయ్యే ఇంద్రియస్థానములో పాటించే నియంత్రణకు దమమని పేరు. మనస్సులో ఉదయించిన కామన ఇంద్రియముల స్థాయిలో అమలు కాకుండా నియంత్రించే శక్తికి దమమని పేరు.

సంకల్పస్థాయిలో ఉండే నియంత్రణకు శమమని పేరు. హానికరములు, లేదా నిరర్థకములు అగు ఆలోచనలను సాధకులు దరికి చేరనీయరు. సాధకుడు తనకు, మనస్సునకు మధ్యలో గల దూరము ( భేదము) ను గుర్తించి ఆలోచనా విధానముపై నియంత్రణను పొందగల్గును. ఇదియే శమము. శమము ఉన్నచో దమముతో పని లేదు. కాని శమము లేనిచో, దమము ఆవశ్యకము. లేనిచో సమస్యలు ఉత్పన్నమగును.

సుఖమ్. అంతరంగములోని ఆనందము. సుఖము కూడా నానుండియే పుట్టినదని భగవానుడు చెప్పుచున్నాడు. దీనిని బట్టి 'ఇది నాది' అని నీవు చెప్పగల్గినది ఏదీ లేదని తెలుచున్నది. ఇంతవరకు అభిలషణీయములగు వస్తువులు చెప్పబడినవి. అవి అన్నీ నానుండియే ఉద్భవించినవి.

అభిలషితములు కాని గుణములు కూడా నామండియేనని భగవానుడు తరువాత చెప్పగలడు. కాని ఇచ్చట ఆయన అభిలషితములగు వాటిని మాత్రమే నొక్కి వక్కాణించుచున్నాడు. ఏలయనగా, అనభిలషితములగు వాటివలన మనలో అహంకారము పెరిగే సమస్య లేదు. కాని అభీష్ట విషయములు లభించినపుడు వ్యక్తిలో గర్వము ఉదయించుట అర్థరహితమని భగవానుడు స్పష్టము చేయుచున్నాడు. దీనిని ఆయన నిరూపించగోరు చున్నాడు. కొని యాడదగిన వస్తువు ఎక్కడ ఏది ఉన్నా, దాని మూలము నేనే. కాన దాని గురించి నీవు గర్వించదగదు. కాని అహంకారము ఏదో ఒక రూపములో జీవించి యుండుటకు యత్నించును. కావుననే, నీవు ఏది సాధించినా, ఆ ఉపలబ్ధి నాకు మాత్రమే చెందునని భగవానుడు చెప్పు చున్నాడు. సర్వము నా విభూతి, నా యశస్సు. నేనే ఈశ్వరుడను అని నీవు చెప్ప గలిగితే తప్ప, వ్యక్తిత్వ విశిష్టుడవగు నీకు యశస్సు లేదు. అట్లు నీవు చెప్ప గల్గినచో, నీవు వ్యక్తివి కావు. అప్పుడు నీవు 'సర్వము నాదే' అని చెప్పవచ్చును. కాని కేవల వ్యక్తిత్వస్థాయిలో నున్న మానవుడు సర్వవిభూతులు మరియు ఉపలబ్ధులు భగవానునకు మాత్రమే చెందునని గుర్తించవలెను.

దుఃఖమ్. దుఃఖము కూడా నా నుండియేనని భగవానుడు చెప్పుచున్నాడు. సర్వ దుఃఖములు కర్మనియతి ప్రకారముగనే లభించును. కర్మనియతి నా స్వరూపమే. కావున, దుఃఖము కూడా నా నుండియే లభించును.

భవః. సృష్టి. సర్వసృష్టియు నా నుండియే కలుగును. శిశువు యొక్క తండ్రి ఆ శిశువు తన నుండి జన్మించినదని చెప్పును. కాని వాస్తవములో ఆశిశువు నామండి జన్మించినదని భగవానుడు చెప్పుచున్నాడు. నేను ఒక హాస్యచిత్రము (cartoon) ను చూచితిని. దానిలో చిన్నపిల్లవాని రూపములో నున్న భగవానుడు కోడిపిల్లను సృష్టించు యత్నమును చేయుచుండెను. ఆయన దానికి అవసరమగు జన్యుకణముల (genes) నన్నిటిని ఒక పరీక్ష నాళికలో నుంచెను. ఇంతలో ఆ నాళిక పగిలి ఆ కణములన్నియూ నేలపై చెల్లా చెదరయ్యెను. ఆ బొమ్మలోని దేవుని ముఖములో ప్రశ్నార్థకము, ఏమి చేయాలో తోచని స్థితి కన్పట్టు చుండెను. ఆయన భగవానుడు! కాని ఏమి చేయాలో తోచని స్థితిలో ఆయన చూపబడెను! ఈ బొమ్మలోని సందేశము చాల బాగున్నది. జన్యుకణములన్నిటిని ఒక చో గూర్చి కోడిపిల్లను సృష్టించుట సామాన్యకార్యము కాదు. కావున 'నేనే కర్తను' అని ఎవరైనా భావిస్తే, అది అర్థరహితము. కోడిపిల్లను నేనే సృష్టించినానని వుంజా అనవచ్చును. 'కాదు, నేను' అని పెట్ట వాదించవచ్చును. కాని సృష్టిలోని అంతస్సృష్టి కూడా భగవానుని నుండియే ఉద్భవించుచున్నది. ఇచటి సారము ఇదియే.

అభావః. అభావశబ్దమునకు అనేకార్థములు గలవు. 'అ' అను ప్రత్యయమును పూర్తిగా లేకుండుట అను అర్థము (అభావార్థ)లోగాని, చాలక పోవుట అను అర్థము (అల్పార్థ) లో గాని, విరుద్ధమైనది అను అర్థము (విపర్యయార్థము) లోగాని వాడవచ్చును. 'వెలుతురు లేదు' అన్నచో 'చీకటి ఉన్నది' అని గాని 'చాలినంత వెలుతురు లేదు' అని గాని అర్థము కావచ్చును. ప్రస్తుతంలో శ్రీశంకరులు విపర్యయార్థమును స్వీకరించిరి. ఎందువలన? ఏలయన, ముందుగా భగవానుడు సృష్టి(భవ)ని గురించి చెప్పినాడు. సృష్టి మాత్రమే గాక తద్విపరీతమగు లయము కూడ భగవానుని వలన మాత్రమే కలుగును. వినాశమునకు గల అవకాశము (possibility) కూడ భగవానుని వలననే కలుగుచున్నది. లయమనగా సృష్టింపబడిన పదార్థము నాశమును పొందుట. జీవనమును నియంత్రించే విధి ఒకటి గలదు. ఆ విధి వలననే జీవనము కొనసాగుచున్నది. ఆ విధి ప్రకారముగనే జీవనము అంతమగును. ఆ విధి భగవానుడే. అందువలననే 'వినాశము కూడా నావలన కలుగు చున్నది' అని భగవానుడిచట చెప్పుచున్నాడు.

భయమ్. భయము కూడా నా వలననే కలుగునని భగవానుడు చెప్పుచున్నాడు. ఏలయన, సృష్టి యొక్క అతిశయించిన విస్తారమే భయమునకు మూలము. ఈ సృష్టిలోని ఘటనా క్రమమును వెనుకకు త్రిప్పుట అత్యంత అసంభవము. ఇది కూడా భయమునకు హేతువు. మరణము, కాలము ఇత్యాదులను వెనుకకు త్రిప్పుట అసంభవము. వీటియందలి ఇట్టి అవశ్యం భావిత్వము మరియు అనివార్యత్వము (inevitability) భయమునకు హేతువు అగును. మరణము, కాలము కూడ భగవానుడే. కావున సర్వభయములను కలిగించునది భగవానుడే. నీవు ఈశ్వరుని పట్టుకున్నచో భయమునుండి తప్పించుకొనగలవు. కాని నీవు ఘటనలను ఆపివేయగలనని తలంచినచో, భయము తప్పదు. మానవుడు తాను వ్యక్తిననియు, ఇతరము సర్వము నుండి భిన్నుడననియు తలంచు చున్నంత వరకు భయము తప్పదు. అట్టి స్థితిలో ఈశ్వరుడు స్వయముగా భయకారణమగును.

తైత్తిరీయోపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది. ఈశ్వరుని భయము వలననే వాయువు వీచుచున్నది; సూర్యుడు ఉదయించుచున్నాడు. అనగా ఈశ్వరుని ఆదేశము వలన ఈఘటనలు ఘటిల్లుచున్నవి. అగ్ని మరియు ఇంద్రుడు తమ విధులను నిర్వర్తించుచున్నారు. ఈశ్వరుని అధ్యాదేశము చేతనే అగ్ని మండుచున్నది. ఇంద్రుడు స్వర్గమును పాలించుచున్నాడు. ఈశ్వరుని కారణంగానే మృత్యుదేవత విహరించుచున్నది★.

---

★ భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషా స్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి.

అభయమ్. భయము లేకుండుట. అదే ఈశ్వరుని నీవు అభిన్నముగా దర్శించ గల్గినచో, ఆయన అభయనిధానము అగును. భయము, అభయము కూడా ఈశ్వరుని నుండి కలుగును. ఈశ్వరుడు నీకు తెలియదు. అంటే, జగత్తు సర్వము నీకంటె భిన్నముగా నున్నది. ఏలయన, ఈశ్వరుని తెలియుట యనగా సర్వము ఈశ్వరుడని తెలియుటయే. ఈ సత్యము తెలియనిచో, భయము బొద్దింకలతో ఆరంభమగును. ఇది తెలిసినచో, భయము లేశమైననూ లేదు.

అహింస. బుద్ధి పూర్వకముగా ఇతర ప్రాణిని హింసింపకుండుట. అహింస ఈశ్వరుని నుండి పుట్టినదని మనకెట్లు తెలియును? శాస్త్ర గ్రంథములలో అట్లు వ్రాయబడి యున్నదా? అట్లు వ్రాసి యుండనిచో ఒక విశిష్ట గుణము ఈశ్వరుని నుండి వచ్చినదని ఎట్లు నిరూపించగలము? అహింసను ప్రదర్శించి నిరూపింప బనిలేదు. ఏలయన, అహింస మనకు తెలియును. సామాన్య వివేకముచే అది మనకు తెలుస్తూనే ఉంటుంది. నియతి (Nature's law) ఉన్నది. అది మనందరికీ తెలియును. మానవుడు తనకు హాని కలగాలని కోరుకోడు. హాని కలగాలని కోరుకునే వ్యక్తులెవ్వరూ మనకు తారసిల్లరు. కావున, అహింస నైతిక నియతిలో అవిభాజ్యమగు అంగమై విరాజిల్లుచున్నది. నైతిక నియతి సృష్టిలోని ఒక భాగము. దానిని ఈశ్వరుడు ఏదో ఒక శాస్త్ర గ్రంథములో అధ్యాదేశముగా ప్రకటించవలసిన అవశ్యకత లేదు. ఇట్టి నియమములు విశ్వజనీనములు. విశ్వజనీన నియమము మనుష్యకృతము గాదు. అట్టి నియమము ఈశ్వరుని నుండి వచ్చినదియే. కావున, అహింస నానుండి వచ్చినదని భగవానుడు చెప్పుచున్నాడు.

ఇవి అన్నియూ నా నుండియే వచ్చినవనియు, వీటిని పాటించు మానవునకు నాతో సమరసత సిద్ధించుననియు, తద్వారా నన్ను పొందవచ్చుననియు భగవానుడు చెప్పుచున్నాడు.

సమతా. అభీష్టము లభించినా, అభీష్టము కానిది లభించినా సమానముగా నుండే మానసిక ప్రవృత్తికి సమత యని పేరు. తుష్టిః అనగా సంతోషము. కోరిన వస్తువు లభించినపుడు మానవునకు సంతోషము కలుగుటకు అవకాశము గలదు. అన్నివేళలా అట్లు జరుగనని చెప్పజాలము. ఒకప్పుడు వస్తువు లభించగానే వ్యక్తిలో పేరాస మొదలగును. ఎక్కువగా లభించు కొలదియూ మరింత కావాలనే కోరిక పెరిగి పోవును. ఉన్నదానితో ఆనందించి 'ఇక చాలును' అనే భావనను కలిగి యుండుటకు తుష్టి యని పేరు. తుష్టిగల వ్యక్తి ఏకోరికనైననూ నియంత్రించ గల్గును. తుష్టి నుండి ఉదయించే కోరిక నైసర్గిక ప్రవృత్తి రూపమును దాల్చును. అట్టివ్యక్తికి కోరుకునే సామర్థ్యము కలదు గనుక కోరిక కలిగినది. అట్టి వ్యక్తి సంతోషము కొరకై విలాసవస్తువును కోరుటలేదు.

అతనికి గల సంతోషము నుండి కోరిక పుట్టినది. అట్టివాడు చేయు క్రియలన్నియు ఈశ్వరుని ప్రకటరూపము అగును. తుష్టి నానుండి పుట్టినదని భగవానుడు చెప్పుచున్నాడు. సత్త్వగుణము అధికముగా గల మనస్సునందు మాత్రమే తుష్టిని పొందే ప్రవృత్తి ఉండును. సత్త్వగుణమే ఈశ్వరుని మాయ. కావున, తుష్టి భగవానుని నుండియే జన్మించును.

తపః. ధార్మిక వ్రతానుష్ఠానము. తపస్సు అనగా జ్ఞానేంద్రియములను నియంత్రించి దేహమును అనుశాసనములో నుంచుట యని శ్రీశంకరులు నిర్వచించిరి. ఒక వ్యక్తి తనకు పరిస్థితులు సానుకూలముగా లేవని తలంచి నాడనుకొనుడు. తనకు సామర్థ్యము అల్పముగా నుండుటచే వివిధ పరిస్థితులు చీకాకు పెడుతున్నవని అతడు గ్రహించినాడను కొనుడు. అపుడాతడు ఒక ధార్మిక వ్రతమును అనుష్ఠించి తన జీవిత గతిలో మార్పును తెచ్చుకొనవలెనని నిశ్చయించుకొనెను. దీని పేరే తపస్సు. ఒక వస్తువును సాధించుట కొరకై వ్యక్తి తన ఇచ్ఛచే స్వీకరించే క్లేశమునకు తపస్సు అని పేరు. కాని తపస్సునకు అంతః కరణ శుద్ధి, లేక అంతః కరణవైశాల్యము లక్ష్యము కావాలి. లేదా, తత్సదృశమగు ధార్మిక లక్ష్యము ఉండవలెను. ఇట్టి లక్ష్యము కొరకై పడే క్లేశమునకు తపస్సు అని పేరు. అట్టి తపస్సు కూడా నా నుండియే నని భగవానుడు చెప్పుచున్నాడు. ఎందువలన? వివిధ అను శాసనముల వలన వివిధ నిర్దిష్ట ఫలములు లభించును. అను శాసనమునకు, దాని ఫలమునకు మధ్య గల సంబంధమును నిర్ణయించే కర్మనియతి భగవానుని నుండియే జన్మించినది. నీవు అగ్గిపుల్లను రాపిడి చేస్తే నిప్పు పుట్టును. ఆ నియతి నా నుండియే వచ్చినదని భగవానుడు చెప్పుచున్నాడు. అగ్గిపుల్లను రాపిడి చేయుట సాధనము. నిప్పు పుట్టుట సాధ్యము. తపః ఫలము సాధ్యము. తపస్సులో ఒక అపరివర్తనీయత (invariability) గలదు. ఒక విశిష్ట తపస్సును చేసినచో, ఒక నిశ్చిత ఫలము లభించును. అనగా ఒక విశిష్టసాధన సాధ్యసంబంధము గలదని స్పష్టమగు చున్నది. ఇట్టి తపస్సు ఈశ్వరుని నుండియే పుట్టినది.

దానమ్. ఇచ్చుట. శక్తికి అనురూపముగా దానమును చేయవలెనని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఇది చాల విలక్షణమైన యోగ్యత. వ్యక్తి దానము చేయుటలో తన హద్దులను దాటి పోరాదు. వ్యక్తి హద్దులను దాటి దానము చేసినచో, కొంత కాలము తరువాత దానమును తీసుకోవలసిన పరిస్థితి ఏర్పడును. కావున వ్యక్తి తన హద్దులలో నుండి ఇచ్చుటను దానము అందురు. ఇట్టి దానము నిశ్చితముగా ఈశ్వరుని నుండియే వచ్చును. ప్రతి వ్యక్తి దానమును చేయజాలడు. దానమును చేయ గలవారు మాత్రమే దానమును చేయుదురు. ఒక విశిష్ట సంస్కారము, పరిణతి మరియు వినయము కలవాడు మాత్రమే దానమును చేయగల్గును. ఇట్టి దాన స్వభావము పుణ్యములలో నొకటి. ఆ

ణ్యము గలవాడు మాత్రమే ఇచ్చును. ఈయ గలవారు ఇచ్చుచునే యుందురు. లేశమైననూ యజాలని వ్యక్తులు కొందరు గలరు. మరికొందరు దానమును చేసి, అన్నివేళలా దానిని గురించి ్యాదును చేయుచుందురు. మరికొందరు దానమును చేసి విస్మరించెదరు. అదియే వాస్తవమగు నము. దానములో మరియొక ప్రముఖమగు అంశము గలదు. ఆ అంశమే ప్రతిగ్రహీత. ప్రతిగ్రహీత గ్యుడనే నిశ్చయము కలిగిన తరువాతనే ఈయవలెను. దానము సమవిభాగము (యోగ్యమగు లో పంచి పెట్టుట) కావలెనని శ్రీశంకరులు వివరించిరి. సమవిభాగమనగా ప్రతిగ్రహీతగా గ్యమైన వానిని ఎన్ను కొనవలెను.

యశః. కీర్తి. ధర్మమునుండి పుట్టిన కీర్తి (ధర్మనిమిత్తా కీర్తిః) అని శ్రీశంకరులు చెప్పిరి. శ్వరుడు కీర్తిని ఇచ్చునని ఎట్లు చెప్పగలము? ఒక వ్యక్తికి కీర్తి గలదనుకొనుడు. ఆతనికి కీర్తి ంచుటకు కారణమేమి? అతడు గొప్ప దాత యనుకొనుడు. ఆ కారణంగా ప్రజలాతనిని మంచి డు, గొప్పవాడు అని గుర్తించినారు. అతడు మంచిని చేయుటచే గుర్తింపు వచ్చినది. అనగా ్వజనీనముగా గుర్తింపబడే మంచి అనేది ఒకటి గలదు. ఆ మంచి భగవంతుడే. అది విశ్వజనీనమగు యతి. ఈతడు అందరితో మంచిగా నుండెను. కావుననే కీర్తి మంతుడాయెను. అట్లు గాక అతడు న దానిని ఎవ్వరూ గుర్తించలేదనుకొనుడు. లేదా, వ్యర్థమని భావించినారనుకొనుడు. అప్పుడాతనికి లభించదు. ప్రజలాతనిని మూర్ఖుడని భావించి యుందురు. మరియు అతడు ప్రతిదినము ంటాయిలో కొన్ని లక్షల రూపాయల విలువ గల నిషాద్రవ్యములను దానము చేసినాడనుకొనుడు. రకం వ్యక్తులలో అతడు మంచివాడనే కీర్తిని గడించవచ్చు! కాని ఇచట చెప్పబడే కీర్తి అది కాదు. దువలననే శ్రీశంకరులు ధర్మనిమిత్తా కీర్తిః అని వ్రాసిరి. కాని అపకీర్తి కూడా భగవానుని ండియే కలుగును.

అయశః అనగా అపకీర్తి. ఇచట 'అ' ప్రత్యయము విరుద్ధార్థము (విపర్యయ)లో యోగింపబడినది. కావున అయశః అనగా పేరు ప్రఖ్యాతులు లేక పోవుట కాదు. ఒకవో అదే ర్థము అనుకున్నా, అది కూడా భగవానుని నుండియే వచ్చినది. అయశః అనగా అధర్మ కార్యమును యుట వలన కలిగే అపకీర్తి (అధర్మ నిమిత్తా కీర్తిః) అని శ్రీశంకరులు వ్రాసిరి. ఇది మాఫియా డాన్ గల కీర్తి వంటిది. అతడు అధర్మ కార్యములను చేసి ప్రఖ్యాతి గాంచినాడు. ఆయన అధర్మ ార్యములను చేసినవాడుగా ప్రఖ్యాతి గాంచుటకు కారణమేమి? ధర్మము అనేది ఒకటి ఉన్నది .ుక. ధర్మమును ఈశ్వరుడు సృష్టించెను. నాణెమునకు బొమ్మ బొరుసు ఉన్నట్లే, ధర్మముతో ాటు అధర్మము కూడా ఉండుట సహజమే. అధర్మము నాచరించువాడు అపకీర్తిని పొందును.

భగవానుడింత వరకు ప్రాణుల వివిధరకముల (పృథగ్విధాః) భావములను (భూతానాం భావాః) గురించి ప్రస్తావించినాడు. ప్రాణుల ఈ వివిధ రకముల భావములు నా నుండియే సంపన్నమైనవని భగవానుడు చెప్పుచున్నాడు.

ఈ గుణములన్నియూ భగవానుని నుండియే వచ్చినవని ఎట్లు చెప్పగలము? అయన ఆ గుణములను తనకు నచ్చిన వారికి పంచిపెట్టునా? కాదు. మానవులు ఈ గుణములను తమ కర్మకు, ప్రయత్నమునకు అనురూపముగా పొందెదరు (స్వకర్మానురూపేణ) అని శ్రీశంకరులు వివరించిరి. కర్మనియతి నానుండియే వచ్చినది గనుక, తదనురూపముగా లభించే సర్వము నానుండియే లభించినట్లు అగును. లోకములో కనబడే అసమానతలు ప్రాణుల కర్మలకు అనురూపమైన వియే గాని, భగవానునకు పక్షపాత బుద్ధి లేదని సూచించుటకై శ్రీశంకరులు భాష్యములో 'స్వకర్మాను రూపేణ' అనే పదము నొకదానిని జోడించిరి. 'స్వకర్మాను రూపేణ' అను పదములోని కర్మలో ప్రాణుల భూత కాలీన కర్మలు మరియు వర్తమానములోని కర్మలు కూడా అంతర్భూతములగును. ఈ ద్వివిధ కర్మలు కలిసి ఈ వివిధ భావములకు ఆధారము అగును. ఈ భావములు మననుండి గాక భగవంతుని నుండి వచ్చినవి. మరియు,

**మనువులకు, మహర్షులకు మూలకారణము భగవానుడే**

**అధ్యాయము 10, శ్లోకము 6:**

महर्षयस्सप्त पूर्वे चत्वारो मनवस्तथा ।
मद्भावा मानसा जाता येषां लोक इमाः प्रजा : ॥ ६ ॥

మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః (6)

మద్భావాః = నాయందు ఐక్యమును పొందిన; పూర్వే = పూర్వీకులైన; సప్త = ఏడ్గురు; మహర్షయః = గొప్ప ఋషులు; తథా = మరియు; చత్వారః = నల్గురు; మనవః = మనువులు; మానసాః = మానసపుత్రులై; జాతాః = పుట్టినారు; యేషాం = ఎవరి యొక్క; లోకే = లోకమునందు; ఇమాః = ఈ; ప్రజాః = ప్రాణులుగలవో.

నాయందు ఐక్యమును పొందిన పూర్వీకులైన ఏడ్గురు గొప్ప ఋషులు

మరియు నల్గురు మనువులు నా మానస పుత్రులై పుట్టిరి. ఈ లోకములోని ప్రాణులన్నియు వీరి సంతానమే (6).

పూర్వే అనగా చాల కాలం క్రితం జీవించిన వారు. సృష్టిలోని ఒకానొక కల్పములో భృగు, రీచి, అత్రి, పులస్త్య, పులహ, క్రతు, వసిష్ఠులనే ఏడ్గురు మహర్షులు ఉండిరి.

పురాణాలలోని వర్ణనల ప్రకారంగా పదునాల్గురు మనువులు గలరు. వారిలో వైవస్వతుడనే ★ యొక్క శాసనములో మనమిపుడు ఉన్నాము. నేనీ యోగమును వివస్వానునకు ంచితినని భగవానుడు నాల్గవ అధ్యాయములో చెప్పి యున్నాడు. ఆ వివస్వానుని కుమారుడు మనువు. ఈ మనువు కాలములోని నాల్గు అవాంతర కాల ఖండములలో బ్రహ్మ సావర్ణ, ర్ణ, ధర్మ సావర్ణ, దక్షసావర్ణులు శాసనమును చేసెదరు. సావర్ణ అనునది వారి బిరుదము. మరియు సప్తర్షులు నా నుండియే పుట్టినారని భగవానుడు చెప్పు చున్నాడు. వారందరు ఐక్యమై ఉన్నవారే (మద్భావాః).

మద్భావాః మనస్సు, మానసిక ప్రవృత్తి ( భావన) భగవానుడనగు నా యందు లీనమైనవారు శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. అనగా వారు జ్ఞానమును పొంది నాతో ఏకమైనారని యర్థము. ఈశ్వరుని (విష్ణువు) శక్తులతో అనుగ్రహింపబడినారు.

మానసా జాతాః మనస్సంకల్పము నుండి మాత్రమే పుట్టిన వారు. వారు ఈశ్వరుని సంకల్ప వేళ, స్త్రీ పురుష సంబంధము లేకుండగనే, జన్మించినారు. ఈ నల్గురు మనువులు గురు మహర్షులు ఈశ్వరుని మానసపుత్రులని పురాణములలో చెప్పబడినది. పురాణములలో న్ను విషయమును భగవానుడిచట పుష్టి చేసినాడు.

యేషాం లోక ఇమాః ప్రజాః ప్రపంచములోని ప్రాణులన్నియూ ఎవరి సంతానమో. ందుగా మనువులు, తరువాత ఋషులు సృష్టింపబడిరి. ఋషుల తరువాతి తరములో ఋషిపుత్రులు

---

మనువు యొక్క శాసన కాలము బ్రహ్మగారి ఒక పగలులో, అనగా 43,20,000 మానవ సంవత్సరములలో పదునాల్గవ వంతు. అనగా పదునాల్గు మన్వంతరములు బ్రహ్మ గారికి ఒక పగలు అగును. మన్వంతరము మరల నాల్గు కాల ఖండములుగా విభజింపబడినది. ఈ నాల్గు ఖండములలో నాల్గు వేర్వేరు శాసనములు ఉండును.

గలరు. ఈ జగత్తులోని సమస్త ప్రాణులు వారి నుండి పుట్టినవి. సర్వప్రాణులు మనువు యొక్క శాసనములో నడుచుకొనుచున్నవి. ఇందువలనే మనకు మానవులని పేరు వచ్చినది. మానవులందరు ఋషుల వంశీకులే. కావుననే, ప్రతివానికి గోత్రము కలదు. వారందరు నానుండియే జన్మించిరని భగవానుడు చెప్పుచున్నాడు.

**భగవానుని విభూతులను, వాటితో ఆయనకు గల సంబంధమును తెలుసుకొనుట వలన కలిగే ఫలము**

**అధ్యాయము 10, శ్లోకము 7:**

एतां विभूतिं योगं च मम यो वेत्ति तत्त्वतः ।
सोऽविकंपेन योगेन युज्यते नात्र संशयः ॥ ७ ॥

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః (7)

**యః** = ఎవడైతే; **మమ** =నాయొక్క; **ఏతాం** = ఈ; **విభూతిం** = మహిమను; **చ** = మరియు; **యోగమ్** = దానితో నాకు గల సంబంధమును; **తత్త్వతః** = యథార్థముగా; **వేత్తి** = ఎరుంగునో; **సః** = అతడు; **అవికంపేన** = చలనము లేని; **యోగేన** = సాక్షాత్కారముతో; **యుజ్యతే** = అనుగ్రహింపబడును; **అత్ర** = ఈ విషయములో; **సంశయః** = సందేహము; **న** = లేదు.

> ఎవడైతే నా ఈ మహిమను, మరియు దానితో నాకు గల సంబంధమును యథార్థముగా నెరుంగునో, అతడు చలనములేని సాక్షాత్కారముతో అను గ్రహింపబడును. ఈ విషయములో సందేహములేదు (7).

**వేత్తి తత్త్వతః**. యథార్థముగా నెరింగిన వాడు. ఇంతవరకు వర్ణింపబడిన నా విభూతిని (ఏతాం విభూతిం మమ) అతడు ఎరుంగును. ఏతామ్ అను పదమునకు 'ఇంతవరకు చెప్పబడిన' అని యర్థము. విభూతి యనగా భగవానుని నుండి ఉద్భవించినది అని శ్రీశంకరులు వివరించిరి.

నాకు వాటన్నింటితో గలసంబంధమును కూడా (మమ యోగం) అతడెరుంగును. అతడు

భూతులను మాత్రమే గాక, వాటితో నాకు గల వాస్తవిక సంబంధమును కూడా ఎరుంగును. ానునకు, విభూతులకు మధ్య గల సంబంధమేమి? సచ్చిదానంద స్వరూపుడగు ఈశ్వరునకు సంబంధమును చెప్పగలము? నీ ఆత్మకు, నీ పరిచ్ఛిన్న జ్ఞానమునకు మధ్య ఎట్టి సంబంధము , ఖచ్చితముగా అదే సంబంధము ఈశ్వరునకు స్వీయ విభూతితో గలదు. ఆ సంబంధమేదనగా: గలదు, మరియొకటి గలదు. ఒకటి గలదు, మరియొకటి లేదు. సత్యమునకు, మిథ్యకు మధ్య సంబంధమిదియే. సర్వసంబంధములు మాయ ద్వారా ఘటిల్లును. అంతకు మించిన సంబంధము పరమాత్మకు, సృష్టిలో ప్రకటమయ్యే విభూతికి మధ్యలో సంబంధమును మాయ ఘటిల్లి ను. ఆ సంబంధము నెరింగిన వాడు సత్యమును, మిథ్యను ఎరుంగును. పరమేశ్వరుని, భూతిని యథాతథముగా నెరింగిన వాడు సత్యము ఏది, మిథ్య ఏది అను విషయమును ుట సహజమే.

అట్టి జ్ఞానము గల వ్యక్తికి వివిధ స్థాయిలలో అనేక ప్రయోజనములు సమకూరును.

నా యందు, మరియు ఇతరుల యందు గల విభూతు లన్నింటికీ మూలాధారము శ్వరుడేనని గ్రహించినచో, అంతమాత్రాన మనకు చాల సమస్యలు తొలగిపోవును. ఒక యకుడు అద్భుతముగా పాడుచున్నాడు. అది ఈశ్వరుని విభూతి అని మనము తెలుసుకోగల్గితే, పై అసూయ కలిగే అవకాశమే లేదు. నేను బాగా పాడగల్గితే అది నాలోని అహంకారము ిగిపోవునట్లు చేయదు. ఇట్టి సరళమగు గుర్తింపు గల మానసిక ప్రవృత్తి వలన గర్వము, అసూయ, ు ఇత్యాదులు దూరమగును. ఈ మనః ప్రవృత్తి వలన ఒక విశిష్టమగు ప్రసన్నత, అంతః కరణ , అంతః కరణనైర్మల్యము లభించును. అట్టి వ్యక్తి ఈ విభూతులను, అవి ఉద్భవించిన తీరును, టికి ఈశ్వరునకు గల సంబంధమును కాలక్రమంలో తెలుసుకొని అచలమైన దర్శనము కలవాడగును వి కంపేన యోగేన యుజ్యతే). ఆత్మ పరమేశ్వరాభిన్నమనే స్పష్టమగు సాక్షాత్కారము సమ్యగ్దర్శనము) అతనిలో దృఢముగా, స్థిరముగా నెలకొనును. అతని దర్శనములో చలనము గాని, అవరోధము గాని ఉండవు. ఇచ్చట యోగమనగా దర్శనము. దర్శనము కంటె భిన్నమైన యోగములో చలనము తప్పదు.

న అత్ర సంశయః. ఈ విషయములో సందియము లేదు. ఈశ్వరుడు, ఆయన విభూతులు, మరియు ఆయనకు విభూతులతో గల సంబంధము ఇత్యాదులను నీవు ఎరింగినచో, అది చాలును. అపుడు నీకు ఏ గురించి తెలుస్తుంది. ఈశ్వరదర్శనమే ఆత్మదర్శనము. ఆత్మదర్శనము కంటె

భిన్నముగా ఈశ్వరదర్శనము లేదు. కావుననే, ఈశ్వర దర్శనము కేవల అను భవరూపము కాదు. నిశ్శబ్దమును తెలుసు కుంటే చాలదు. నిశ్శబ్దమును అర్థం చేసుకోవాలి. అదే విధంగా ఈశ్వరుని, ఈశ్వరునకు జగత్తు తో గల సంబంధమును తెలుసుకోవాలి. ఈశ్వరుని తెలియుట యనగా ఈశ్వరుడు జగద్రూపుడు అని తెలియుటయే. జగత్తు చైతన్య-ఆత్మయగు పరమాత్మ నుండి పుట్టినది అని స్వీకరించే పక్షంలో, సంబంధమును స్పష్టముగా అర్థం చేసుకోవాలి. ఈ సంబంధము తెలిసినచో, సత్యము మరియు మిథ్య తెలిసినట్లే. అదియే మోక్షము. ఆత్మదర్శన రూపమైన ఈ ఈశ్వరదర్శనము ఇచట విభూతి వర్ణన ద్వారా ప్రతి పాదింపబడినది.

ఈ తీరున భగవానుడు తనను గురించి వర్ణించే అధ్యాయమును, తన విభూతులను ప్రదర్శించే అధ్యాయమును, ఈ శ్లోకములతో ఉపక్రమించినాడు.

యోగపదము ప్రయోగింపబడినది గనుక, దాని అర్థమును మనము స్పష్టంగా తెలుసుకోవాలి. యోగపదమునకు అనేకార్థములు గలవు. కావున, భగవానుడు యోగపదమును తరువాతి శ్లోకములో నిర్వచించుచున్నాడు.

జ్ఞానము మాత్రమే కంపింప శక్యము కానిది కాగలదు. భగవానుడు జగత్కారణుడు అను అవగాహన చాలదు. సంబంధము కూడా స్పష్టంగా తెలియాలి. సృష్టికర్త వాస్తవముగా సృష్టి కర్తయేనా? ఈ సృష్టి ఎట్టిది? ఈ విషయములన్నీ తెలియాలి. అప్పుడు మాత్రమే ఈశ్వర స్వరూపము అవగాహనకు వచ్చును. సృష్టి యొక్క వాస్తవికత ఏ శ్రేణికి చెందినది? అను విషయమును ముందుగా తెలుసు కోవాలి. అది తెలిస్తే, సృష్టికర్త యొక్క యథార్థస్వరూపము కూడా స్పష్టముగా తెలుస్తుంది. అట్టి ఎరుక గల జ్ఞాని ఈ అకంప్యమైన దర్శనముతో సంపన్నుడై యుండును.

అవి కంప్యమగు ఆ దర్శనము యొక్క స్వరూపమెట్టిది? తరువాతి శ్లోకము వివరించును.

సమ్యగ్దర్శన స్వరూపము

అధ్యాయము 10, శ్లోకము 8 :

अहं सर्वस्य प्रभवो मत्तस्सर्वं प्रवर्तते ।
इति मत्वा भजन्ते मां बुधा भावसमन्विताः ॥ ८ ॥

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః (8)

**అహం** = నేను; **సర్వస్య** = సర్వమునకు; **ప్రభవః** = ఉత్పత్తి స్థానము; **సర్వమ్** = సర్వము; **మత్తః** = నావలన; **ప్రవర్తతే** = పోషింపబడుచున్నది; **భావసమన్వితాః** = సాక్షాత్కారముతో అనుగ్రహింపబడిన; **బుధాః** = జ్ఞానులు; **ఇతి** = ఈ విధముగా; **మత్వా** = ఎరింగి; **మాం** = నన్ను; **భజంతే** = పొందెదరు.

సర్వమును సృష్టించి భరించి పోషించునది నేనే అని ఎరింగి సాక్షాత్కారముతో అను గ్రహింపబడిన జ్ఞానులు నన్ను పొందెదరు (8).

అహం సర్వస్య ప్రభవః. సర్వము యొక్క సృష్టికి కారణము నేనే. ఇచట అహం అనగా వాసుదేవ శబ్ద వాచ్యుడగు పరం బ్రహ్మ. వాసుదేవుడు అనగా సర్వపదార్థముల ఉనికికి నిధానమైన వాడు. ఈ పదమును మనమంతకు ముందు చూచియున్నాము. ఘటముల ఉనికి మట్టి యందున్నది. అటులనే జగత్తు యొక్క ఉనికి స్వయం సిద్ధమగు సద్వస్తువు నందు గలదు. ఇతరము సర్వము దానిపైననే ఆధారపడి యుండును. స్వయంసిద్ధ సద్వస్తువు ఒకే ఒకటి గలదు. అదియే ఆత్మ. ఆత్మ ఒక్కటియే స్వయంసిద్ధము. ఇతరము సర్వము ఆత్మకు దృశ్యము అగును. స్వయం ప్రకాశతత్త్వము మాత్రమే స్వయం సిద్ధము అగును. స్వయం ప్రకాశము కానిది స్వయంసిద్ధము కాలేదు. ఆత్మ ప్రకాశించుటలో ఇతరాపేక్ష లేదు. ఆత్మ ఇతర ప్రమాణ గమ్యము కాదు. ఆత్మ స్వయంసిద్ధము. దీనికే వాసుదేవ అని పేరు. సర్వము యొక్క సృష్టికి భగవానుడే కారణము ( అహం సర్వస్య ప్రభవః) అను వచనము యుక్తి యుక్తముగ నున్నది.

ఒకడు ఒక వస్తువును సృష్టించవచ్చును. కాని దానిని రక్షించే బాధ్యత మరియొకనిపై పడును. ఆధునిక కాలములో తల్లిదండ్రుల స్థితి ఇటులనే ఉన్నది. వాళ్లు పిల్లలను బాగానే కనెదరు. కాని వారిని పెంచ వలసినది మరియొకరు. అటులనే, భగవానుడు సర్వమును సృజించిన తరువాత, ఆ సృష్టిని పరిరక్షించుటకు మరియొకరిని నియమించును కాబోలు! కాదు.

మత్తస్సర్వం ప్రవర్తతే. సర్వము నావలననే పోషింపబడుచున్నది. నావలననే ఈ జగత్తు కొనసాగుతూ ధరింపబడుచున్నది. సృష్టింపబడిన వస్తువు కొంతకాలము వరకు చిన్న చిన్న మార్పులకు లోనవుతూ తనను తాను నిలబెట్టుకొనును. అంతములో అది పూర్ణ మగు పరివర్తనకు లోనై

అదృశ్యమగును. మనుష్య దేహములో చిన్న చిన్న మార్పులు వచ్చుచుండును. పది సంవత్సరముల క్రితం నేను చూచిన వ్యక్తికి ఈనాడు బట్టతల వచ్చినది. అయిననూ నేనాతనిని గుర్తింపగల్గుదును. మానవదేహము మరణానంతరము విఘటితమై మట్టిలో కలియును. దీనిలో యథార్థమగు వినాశమేమియు లేదు. ఒక విశిష్టరూపము పాక్షికముగా గాని, పూర్ణముగా గాని విఘటిత మగుచుండును. కొంతకాలము నిలబడుట, పరివర్తనము, విఘటనము అనునవి జగత్తు యొక్క అసాధారణ లక్షణములై యున్నవి. మరియు కర్మఫలములు, వాటి భోగము వీటికి తోడు అగుచున్నవి. సుఖాను భవము, దుఃఖాను భవము, భోగ స్థానములు, కర్మలు, వాటినుండి ఉత్పన్న మయ్యే ఫలాను భవమునకు అనురూపమగు పరిస్థితులు మొదలగు సర్వము జగత్తులో అంతర్భాగమగును. ఇవన్నీ కలిసి జగత్తు అగును. ఈ జగత్తు ఇట్లు సృష్టింపబడుటకు మాత్రమే గాక, జగత్తు యొక్క పాలన పోషణకు కూడా కారణము నేనే. నా కారణంగానే సర్వము ఉనికిని పొంది, తన స్వభావమునకు అనురూపముగా ప్రవర్తిల్లుచున్నది.

**ఈ దర్శనమును గురించి స్పష్టమగు కల్పన గలవారు దానిని పొందుటకు అంకితమగుదురు**

ఇతి మత్వా = ఇట్లు తెలుసుకొని; మాం భజంతే బుధాః = జ్ఞానులు నన్ను గుర్తించెదరు. ఈ సందర్భములో జ్ఞానులు అనగా పరమాత్మ స్వరూపము నెరింగినవారు (అవగత పరమాత్మ తత్త్వాః) అని శ్రీ శంకరులు నిర్వచించిరి. ఇట్టి జ్ఞానులను భగవానుడు నిర్వచించుచున్నాడు.

భావసమన్వితాః. భావముతో గూడిన వారు. భావశబ్దమునకు అనేకార్థములు గలవు. సందర్భమును బట్టి మనము అర్థమును చెప్పవలెను. ఇచటి ప్రకరణము దర్శనము. ఏమి దర్శనము? నేను బ్రహ్మను అను సత్యము యొక్క నిశ్చయ జ్ఞానము. అహమ్ (నేను) అను పదము యొక్క అర్థము జగత్కారణమగు అనంత పరబ్రహ్మము. ఇట్టి స్పష్టమగు దర్శనము గలవారు భావసమన్వితాః అనబడుదురు. మాం భజంతే, నన్ను వారు పొందెదరు. జీవేశ్వరుల మధ్య తాత్త్విక భేదము లేదు గనుక, వారు నాతో ఏకమగుదురు. ఈశ్వరుడు పరబ్రహ్మయే. జీవుడు పరం బ్రహ్మయే. ఈ అభేదమును వారు పొందెదరు. మరియు,

**అధ్యాయము 10, శ్లోకము 9:**

मच्चित्ता मद्गतप्राणा बोधयन्तः परस्परम् ।
कथयन्तश्च मां नित्यं तुष्यन्ति च रमन्ति च ॥ ९ ॥

మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ (9)

**మచ్చిత్తాః** = నాయందు లగ్నమైన చిత్తము గల వారై; **మద్గత ప్రాణాః** = నాయందు లీనమైన జీవనము గలవారై; **పరస్పరమ్** = ఒకరికొకరు; **బోధయంతః** = బోధించువారై; **చ** = మరియు, **నిత్యమ్** = ఎల్ల వేళలా; **మాం** = నా గురించి; **కథయంతః** = చెప్పుకొనుచున్నవారై; **తుష్యంతి చ** = సంతోషించెదరు; **రమంతి చ** = రమించెదరు.

నాయందు లగ్నమైన చిత్తము గలవారై, నాయందు లీనమైన జీవనము గలవారై, మరియు ఒకరి కొకరు బోధించువారై మరియు ఎల్లవేళలా నా గురించి చెప్పుకొనుచున్న వారై సంతోషించి రమించెదరు (9).

ఈశ్వరుడు జగత్కారణమనియు, ఈశ్వరుని యథార్థస్వరూపము ఆత్మయేననియు వారెరుంగుదురు. ఈ ఉపదేశ ప్రక్రియకు మూలము కారణ కార్యభావమునెరుంగుటయే. కార్యము కారణమగు బ్రహ్మము కంటె భిన్నముగా లేదు. కావున కార్యమును బ్రహ్మము నుండి వేరు చేయజాలము. భిన్నముగా లేదు గనుక కార్యము మిథ్య, ఆభాస మాత్రమే.

కావున దేహేంద్రియ మనస్సంఘాతముతో సహా జగత్తు అంతా కార్యము గనుక మిథ్య. కావున కారణకార్యముల మధ్య గల ఈ సంబంధము చాల చిత్రమైనది. వాటిలో ఒకటి స్వతంత్ర సత్త కలదికాగా, రెండవది అస్వతంత్ర సత్తాకమగు తత్త్వముపై నాధారపడును గాన మిథ్య యనబడును. కుండ-మట్టి, అంగీ-వస్త్రము దీనికి దృష్టాంతములు. విశ్లేషించినచో, వస్త్రము మిథ్యయగును, దారము సత్యము అగును. దారము మిథ్య యగును, దారపు పోగులు సత్యమగును. దారపు పోగులు మిథ్యయగును, కణములు సత్యమగును. దీనిని ఇంకా ముందుకు కొనసాగించవచ్చును. అట్లైనచో, ఏది సత్యము? ఇతరము దేనిపైననూ ఆధారపడనిదే సత్యము. అదియే బ్రహ్మము. ఇచట కారణ కార్యవాదము బోధనా ప్రక్రియలో ఒక భాగముగా ప్రస్తావింపబడినది.

సర్వము ఈశ్వరుడే అని ఎరింగి, వారు ఈశ్వరునితో ఏకమగుదురు. ఇది ఎట్లు? ఈ రెండవ అడుగు చాల విచిత్రమైనది. ఈశ్వరుడు సృష్టి కర్తయే గాక, ఉపాదాన కారణము కూడా. కావున కార్య సృష్టి ఈశ్వరుని కంటె వేరుగా లేదని యెరుంగుట మొదటి అడుగు.

ఇదియే ఈశ్వరజ్ఞానము. ఇది తెలిసిన వ్యక్తి ఆ ఈశ్వరుడు తానేనని గుర్తింపగల్గును. ఇది రెండవ అడుగు.

ఈశ్వరుడే సర్వము గదా! నీ స్థూలదేహము ఈశ్వరుడే. నీ మనస్సు ఈశ్వరుడే. నీ ఇంద్రియములు కూడా ఈశ్వరుడే. ఈశ్వరుడు కానిది ఏది గలదు? సృష్టింపబడిన సర్వము ఈశ్వరుడే. కాని చైతన్యము సృష్టింపబడలేదు. కావున బహుశః చైతన్యము ఈశ్వరుడు కాదేమో! ఇట్లు చెప్పుట సరిగాదు. ఏలయన, సృష్టికి ముందు సత్ ఉండెను. సృష్టింపబడని చైతన్యము ఆ సత్‌యే అగును. అదియే ఈశ్వర స్వరూపము. కావున, ఈశ్వరుని ఎరింగిన వాడు ఈశ్వరునితో ఏకము అగును. ఇది సామాన్యమగు మాట కాదు. సృష్టికి కారణము నీ కంటె భిన్నముగా ఒకటి గలదా యన్నట్లు ముందుగా చెప్పబడెను. తరువాత లోతైన విచారము చేసిన పిదప, నీవే ఆ కారణమని తెలినది. నీకు ఈశ్వరునకు గల భేదమును ఈశ్వరసాక్షాత్కారము గుటుక్కున మ్రింగి వేసినది. కావున ఈశ్వరసాక్షాత్కారమే ఆత్మ సాక్షాత్కారము, సర్వ సాక్షాత్కారము కూడా.

మచ్చిత్తాః. పరమేశ్వరుడనగు నాయందు లగ్నమైన మనస్సు గలవారు. వారి జ్ఞానములో మనస్సు పరమాత్మకంటె వేరు గాకుండుట సహజమే గదా! కాన మనస్సు పరమాత్మకు దూరముగా పోలేదు. మాకు తెలుసుననియు, కాని మా మనస్సు దూరమగు చుండు ననియు కొందరు నాతో ఫిర్యాదు చేసెదరు. కాని ఈ ఎరుక ఏ క్షణములోనైననూ మనస్సునకు దూరము గాదని నేను చెప్పెదను. మనస్సు ఆత్మకంటె ఏ కాలమునందైననూ వేరుగా లేదు అనునదియే జ్ఞానము. జ్ఞానము గలవారికి మనస్సు పూర్ణుడనగు నా నుండి దూరము కాదు. ఏలయన, మనస్సును ధరించునది సత్య ఆత్మయే.

మద్గత ప్రాణాః . జ్ఞానేంద్రియములన్నియూ ప్రాణములనబడును. ఇవి అన్నియూ ఈశ్వరుని యందు జాగృతములై యున్నవి. అవి వస్తువులను స్పష్టముగా గ్రహించును. కాని జ్ఞానులు అవి గ్రహించు దాని కంటె అధికమును దర్శించెదరు. కన్ను చూచేది రూపము. ఒక రూపము ఇతర రూపములన్నిటికంటె భిన్నము. ఆ రూపమును వారు చూచెదరు. అంతేగాక, చూడబడే వస్తువు, చూచుట మరియు చూచువాడు అనే మూడు స్వయంసిద్ధమగు ఒకే ఒక చైతన్యము నందు ఉనికిని కలిగియున్నవని వారెరుంగుదురు. ఈ సత్యము విషయములో అజ్ఞానము లేనిచో, అట్టి జ్ఞానులు మద్గత ప్రాణాః అగుదురు. జ్ఞానేంద్రియవ్యాపారములన్నియూ కొనసాగుచున్ననూ, వారు పరమేశ్వరునకు ఏనాడైననూ దూరము గారు. ఆత్మ జ్ఞానమునకు జ్ఞానేంద్రియముల జ్ఞానము

ంకము కాదు. కావున ఆత్మదర్శనమునకు ప్రాపంచిక వ్యవహారము ఏవిధముగనైననూ అడ్డంకి
దు. అనుభవములకు దూరముగా నున్నచో సాక్షాత్కారము కలుగ బోదు. ఆటంకము అజ్ఞానమే
ఇంద్రియజ్ఞానము గాదు.

అట్టి ఆటంకములేని వారు మచ్చిత్తాః మద్గత ప్రాణాః అని వర్ణింపబడినారు. మరో మాటలో
ంటే, వారి జీవితములో ఈశ్వరునకు దూరముగా నుండే కాలము ఒక్క క్షణమైననూ లేదు.

ప్రాణశబ్దమునకు జీవనము, లేదా శ్వాస క్రియ అని అర్థమును చెప్పవచ్చును. కావున ఎవరి
నము ఈశ్వరుని కంటె భిన్నము కాదో, ఈశ్వరుని యందు లయమగునో, అట్టివారు మద్గత
ణాః అనబడుదురు. అనగా ఆధ్యాత్మిక జీవనము, భౌతిక జీవనము అను విభాగము లేదు.
దరు ఇట్టి విచిత్రమగు విభాగముతోగూడిన తాత్త్విక ధోరణిని ప్రతిపాదించెదరు. ఇట్టి
గములు (compartments) లేవు. సర్వము ఒకే ఒక పూర్ణతత్త్వములో అంతర్భూతమై
ది. ఈ జ్ఞానము గలవానికి ఈ దర్శనము కంటె భిన్నమగు జీవనము లేదు. నీ గురించి నీకు
రకు తెలియునో అదియే నీ స్వరూపము అగును. నీ స్వరూపము పూర్ణమైనచో, దానికి నీవు
డు దూరము కాగలవు? నీవు ఏమి చేసినా దానినుండి దూరము కాలేవు. ఏలయన, నీవు
దైననూ దూరము కాలేని వస్తువు ఏదైనా ఉన్నచో, అది నీవే. నీవు ఇతర వస్తువులన్నిటినుండియూ
రము కావచ్చును. కాని నీ నుండి నీవు దూరము కాలేవు. ఇట్టి జ్ఞానులు మద్గత ప్రాణాః,
చిత్తాః అనబడుదురు.

వారు ఎట్లు జీవించెదరు?

రమన్తి. వారు రమించెదరు. ఎట్లు? పరస్పరం బోధయంతః. ఒకరికి మరియొకరు
ధిస్తూ. వారు చేయగలిగినది మరి యేమున్నది? నేర్చుకొనగోరు వారు బోధించెదరు. కథయంతః
మామ్. పరమేశ్వరుడనగు నా విభూతులను వర్ణిస్తూ. వారి పనులన్నిటిని ఎప్పుడు చేసెదరు?
త్యమ్. సర్వదా.

కథయంతః, బోధయంతః అనునవి ఒకటి కాదు. తరగతిలో ఉండే స్థితి, లేదా
శ్నోరూపమైన సంవాదము బోధ యనబడును. కథనమనగా కేవల వర్ణన. భగవానుని విభూతులు,
నము, బలము ఇత్యాదులను వర్ణించినచో, అది కథనమన బడును. నన్ను గురించి

మాటలాడుటలో- అది బోధ కావచ్చును, లేదా వర్ణన కావచ్చును-వారికి ఒక ఆనందము కలుగును. వారు దానిలో రమించి (రమంతి) సంతోషించెదరు (తుష్యంతి). రమించుటకు పరమేశ్వరుడు తక్క ఇతరముల ఆవశ్యకత లేదు.

భగవానుడిచట రమంతి, తుష్యంతి అను రెండు పదములను ప్రయోగించినాడు. వీటి అర్థము ఇంచుమించు సమానము. అర్థములో అల్పమగు భేదము మాత్రమే గలదు. రమంతి బాహ్య ప్రపంచమునకు సంబంధించినది గాన, దానిలో ఇతర వ్యక్తులు కూడ సమ్మిళితులగుదురు. తుష్యంతి వ్యక్తి నిష్ఠమగు ఆనందమును నిర్దేశించును. అనగా, వారు సంతోషమును పొంది యున్నారు గనుక, ఆనందము కొర్కకై వివిధ వస్తువుల వెనుకబడుట ద్వివిధముగా నున్నది. ఆనందము కొరకు వెంటబడుట, లేదా ఆనందముగా వెంటబడుట. ఆనందమును వెదుకుతూ వస్తువుల వెనుకబడుట వలన సాధారణంగా ప్రయోజనము చేకూరదు. అట్లు గాక ఒక వ్యక్తిగా తనతో తాను సంతోషముగా నున్న మానవుడు వస్తువుల వెనుక బడవలసిన పని లేదు. ఇట్టి వ్యక్తి కర్మలను ఆనందముగా చేయగల్గును. వస్తువుల వెనక బడే వ్యక్తికి ప్రయోజనము ఉండదు.

వారు ఈశ్వరుని గురించిన ప్రసంగములో ఎట్లు రమించెదరు? అనుదానికి శ్రీ శంకరులు ఒక దృష్టాంతమునిచ్చిరి. ఒక వ్యక్తి తాను గాఢంగా ప్రేమించిన వ్యక్తితో కలిసి ఉన్నాడనుకొనుము. తాను ప్రేమించిన వ్యక్తి యొక్క సాంగత్యములో నుండి ఆ వ్యక్తితో సంభాషించే వానికి ఎంత ఆనందము లభించునో గదా! ఈశ్వరుని గుర్తించి తనకు గల ఈశ్వరీయ జ్ఞానమును నలుగురితో పంచుకొనే వ్యక్తి అంతటి ఆనందముతో రమించును.

ఈశ్వరుని ప్రత్యక్ష జ్ఞానము లేక పోయినా, తాము చూచిన భగవానుని విభూతులను బోధిస్తూ, ఆ జ్ఞానమును నలుగురితో పంచుకునే వారికి కూడా ఇంతటి ఆనందము లభించును. మనము ఒక అందమైన పుష్పమును చూచినామను కొనుడు. 'పుష్పము అందముగా నున్నది' అని మాత్రమే మనము చెప్పవచ్చును. లేదా, మనము అంతకంటె అధికమగు అంశమును కూడ దర్శించ గల్గుదుము. పుష్పములోని అందము ఈశ్వరుని విభూతియే. ఎచటనైననూ మహిమ యొక్క లేశము గాని, కొట్ట వచ్చినట్లు కానవచ్చే ప్రతిభ గాని ఉన్నచో, దాని యందు మనము ఈశ్వరుని ఉనికిని గుర్తించవలెను.

ఈ విధముగా ఈ శ్లోకమును జ్ఞాని పరముగా గాని, లేక జ్ఞానమును గోరి జ్ఞానమునకు అంకితమైన జిజ్ఞాసువుల పరంగా గాని వ్యాఖ్యానించ వచ్చును. జిజ్ఞాసువులు తాము ఎరింగిన

అర్పు జ్ఞానమును ఇతరులతో పంచుకొనెదరు. ఆ ప్రక్రియలో వారి అవగాహన మరింత స్పష్టమగును.

మనకు తెలిసిన దానిని ఇతరులతో చర్చించినప్పుడు మాత్రమే, మనకు ఎంతవరకు తెలిసినది అను విషయము స్పష్టమగును. మనకు గల జ్ఞానమును ఇతరులతో పంచుకున్నప్పుడు మాత్రమే అవగాహనలో స్పష్టత ఏర్పడును. నిన్ను రెండు కన్నులు పరిశీలిస్తూ ఉంటే, అది నీపై ఒక నియంత్రణ యగును. నీ ఆలోచనలో గూడు కట్టు కున్న దోషములు తొలగి, నీ అవగాహన సుస్పష్టమగును. ఏలయన, నీవు చెప్పినది తప్పు అయినప్పుడు, ఎదుటి వాని కళ్లు ఆ సంగతిని చెప్పకనే చెప్పి వేయును. ఆ కళ్లను చూడగానే, నీ మనస్సు జాగృతమగును. మనస్సు అస్పష్టాంశములను కూడ స్పష్టముగా సాక్షాత్కరించుకొనుట మొదలగును. ఇద్దరు సాధకుల మధ్య చర్చలో జ్ఞానమును పరస్పరము ఇచ్చి పుచ్చుకొనుట సంభవమగును. వారిద్దరు బ్రహ్మాభ్యాసమనే సాధనలో భాగస్వాములగుదురు. బ్రహ్మ ఆత్మాభిన్నమని ఎరుంగుటకు చేయు సాధన బ్రహ్మాభ్యాస మనబడును. దీనికంటె భిన్నమగు సాధన లేదు. ధ్యానము చేస్తూ ఉంటే ఆ వేడిలో హఠాత్తుగా సాక్షాత్కరించేది ఆత్మ జ్ఞానము కాదు. ఆత్మ నీ స్వరూపమే. అది నీకు కనబడకుండా క్షణమైననూ దాగియుండదు. దానిని కప్పివేయ గలది ఒక్క అజ్ఞానము మాత్రమే. కావున, శ్రవణము చేయుము. నీవు తెలుసుకున్నదానిని ఇతరులకు బోధించుట ద్వారా, మరియు తోటి సాధకులతో చర్చల ద్వారా మననము చేయుము.

**భగవత్తత్త్వ జ్ఞానమునకు అంకితమైన సాధకులకు భగవంతుడు అంకితమగును.**

**అధ్యాయము 10, శ్లోకము 10:**

तेषां सततयुक्तानां भजतां प्रीतिपूर्वकम् ।
ददामि बुद्धियोगं तं येन मामुपयान्ति ते ॥ १० ॥

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధి యోగం తం యేన మాముపయాంతి తే (10)

సతతయుక్తానామ్ = ఎల్లవేళలా నాకు అంకితమైనట్టియు; ప్రీతి పూర్వకమ్ = ప్రేమతో; భజతాం = ఆరాధించు; తేషాం = వారికి; తం = ఆ; బుద్ధి యోగమ్ = జ్ఞానసాక్షాత్కారమును; దదామి = ఇచ్చెదను; యేన = దేని చేత; తే = వారు; మామ్ = నన్ను; ఉపయాంతి = పొందెదరో.

ఎల్ల వేళలా నాకు అంకితమై ప్రేమతో ఆరాధించు వారికి నేను

జ్ఞానసాక్షాత్కారమును కలిగించెదను. దానిచే వారు నన్ను పొందెదరు (10).

తేషాం సతతయుక్తానామ్. ఎల్లవేళలా అంకిత భావముగల ఆ సాధకులకు. కేవలము ఉదయము గాని, సాయంకాలము గాని మాత్రమే గాక, ఎల్లవేళలా ఈ తీరున సాధన చేయు సాధకులు ఇంతకు ముందు నిత్యాభియుక్తాః అని వర్ణింపబడినారు. చేయవలసిన అనేక పనులలో ఈశ్వరారాధన కూడ ఒకటి అను ధోరణి వారిది గాదు. వారికి స్పష్టమగు ప్రాథమికతలు (priorities) గలవు. వారు జీవితానుభవములను జీర్ణము చేసుకొని, వాటి నుండి నేర్చుకొనినారు. తాము కోరే లక్ష్యము గురించి వారికి స్పష్టముగా తెలియును. సర్వము యొక్క సత్యము నెరుంగుట అనేది వారికి వినోద కాలక్షేపము కాదు. అదియే వారి జీవితము. అంతకు మించి విలువైన మరియొక అన్వేషణను వారెరుంగరు. వారు పరిపక్వత చెందిన మనస్సు గలవారు. అట్టి వ్యక్తులు ఈశ్వరీయ జ్ఞానమును ప్రేమించెదరు. ఏమిటోయను కుతూహలముతో నారంభించి వారిపుడు జిజ్ఞాసువులైనారు. ఏలయన, తెలియ వలసినది గలదు అని తెలిసిన మానవునకు అజ్ఞానము అంగీకారము కాబోదు. నేను తరుచుగా చెప్తూ ఉంటాను. ఒకని నిద్రను నీవు చెడగొట్ట దలచినచో ఆతనితో 'ఒక గొప్ప రహస్యము గలదు. అది రేపు ఉదయము చెప్పెదను' అని చెప్పుము. తెలియవలసినది గలదని ఎరింగిన మానవుడు తెలియకుండగా నుండజాలడు. అది జిజ్ఞాసారూపమును దాల్చును. జ్ఞానమునందలి ఈ కోరిక తరువాత జ్ఞానము నందలి ప్రేమగా మారును. జ్ఞానమునందు ఇట్టి ప్రేమ గల సాధకులు రమించెదరు (రమంతి), మరియు సంతోషించెదరు (తుష్యంతి). ఇట్టి సాధకుడు, 'స్వామీజీ ఈ అన్వేషణ ఎప్పుడు అంతమగును?', అని ప్రశ్నించడు. 'ఈ ప్రేమ ఎప్పుడు అంతమగును?' అని ఎవ్వరూ ప్రశ్నించరు. ప్రేమలో సర్వదా ఆనందము గలదు. ఆ ప్రేమ జ్ఞానము నందలి ప్రేమ అయినచో, ఆనందము మరింత మిక్కుటముగ నుండును. అది కామనా రూపములో నున్నంతవరకు దుఃఖము తప్పదు. ఏలయన కామనాపరి పూర్తికి విఘ్నములు వాటిల్లు చుండును. ఒకసారి అది జ్ఞానమునందలి ప్రేమగా రూపాంతరమును చెందినచో, అపుడది ఆనందమునకు నిధానమగును. అట్టి సాధకుడు ఆటంకములను పరిగణనలోనికి తీసుకొనడు.

నన్ను ప్రేమతో అన్వేషించు వారికి నేను ఇచ్చెదను (అహం దదామి) అని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుడు ఇచ్చునది ఏది? భగవద్దర్శనము (బుద్ధి యోగము). నీవు ఈశ్వరుని అన్వేషిస్తూ ఉంటే, ఆయన ఇచ్చి తీరవలెను; ఆయన సాక్షాత్కరించవలెను.

సత్యదర్శనము, ఈశ్వర దర్శనము అనే బుద్ధియోగమును నేను వారికి ఇచ్చెదను. తద్వారా నన్ను పొందెదరు; నాతో ఐక్యము అగుదురు. కాని హరే కృష్ణ మతము వారు ఈ వాక్యమును ...ుకు అనుకూలముగా మలిచి అనువదించిరి: వారికి నేను కృపను ఇచ్చెదను. దానిచే వారు నా ...కు రాగలరు. ఎచటకు? గోలోక బృందావనమునకు. ముందుగా శ్రీకృష్ణుడిచట ఉండెడివాడు. ...రువాత ఆయన గోలోకమునకు బదిలీ అయినాడు. అచట వీరి రాక కొరకు ఆయన ఎదురు ...చుచున్నాడు. సర్వకాలములయందు భగవానుని విభూతులను ప్రస్తుతించు భక్తులు అచటకు ...కముగా ఆహ్వానింపబడుదురు. వారచటకు వెళ్లి ఆయనతో క్రీడించెదరు. కాని ఆయన ...తో క్రీడించుచుండగా ఇతరులు వేచియుండవలెను. ఆ కాలంలో గోపికలకు కూడ ఇదే సమస్య ...ది. శ్రీకృష్ణుడు ఒక గోపికతో క్రీడించుచుండగా, మరియొక గోపిక అసూయను చెందెడిది. మనకు గల మౌలిక సమస్యలే గదా! ఇచ్చట భూలోకములోనున్న ఈ సమస్య గోలోక ...వనములో కూడ నుండును. ఏ శాస్త్రము గోలోక బృందావనమును చెప్పు చున్నదో ...యంగను. ఉపనిషత్తులలో దాని ప్రస్తావము లేదు. గో అనగా వేదవచనములని యర్థము. లోకము ఆ వచనముల ప్రకాశము. గోలోకమనే పదమును ఇట్లు అనువదించవదగును.

'నేను బుద్ధి యోగమునిచ్చెదను' అను భగవానుని కథనము ప్రతీక మాత్రమే. ఆయన ...్నను. మనము తీసుకొనెదము. ఇట్లు మనము చెప్పవచ్చును. కాని అంతతో గత్వా ఈశ్వరుడే ...దా! కావున, దేనినైనమా ఆయన ఇచ్చే ప్రసక్తి ఏమున్నది? ఎవరికి ఇచ్చును? బుద్ధియోగము ...నది. దానిలో విషయము ఏమి? ఆత్మాభిన్నమగు పరమేశ్వరుడే. ఆ జ్ఞానములో విషయవస్తువు ...ముగా భగవానుడే. కావున, బుద్ధి యోగం దదామి అనగా వారు నన్ను గుర్తించి, నాలో ...గుదురని అభిప్రాయము.

కాని ఈ మొత్తం ప్రక్రియలో భగవత్కృప కూడ కొంతవరకు సమ్మిళితమై యున్నది. ...యన, ఈ సమ్యగ్దర్శనమును పొందుటలో ప్రతి బంధములు అనేకము గలవు. కావున నన్ను ...ంచు వారికి అవశ్యకమగు కృప లభించి తీరునని భగవానుడు చెప్పుచున్నాడు. ఏలయన నన్ను ...లియగోరు సాధకులు (జిజ్ఞాసువులు) భక్తులు కూడా అగుదురు.

ఈ సాధనయే భక్తి. కావున దీని వలన ఒక విశిష్ట కృప లభించుట సహజమే. ఈశ్వరధ్యానము ...సాధనలో భాగమగుటయే గాక, అది ఒక కర్మ కూడా. ధ్యానము మానసిక కర్మ గనుక, ...ర్మఫలమును ఉత్పన్నము చేయగల్గును. ఆ కర్మ ఫలమునకే ఈశ్వరానుగ్రహమని పేరు. మనకు ...నుకూలమైన అదృష్ట ఫలమేదైనా కృప లేక పుణ్యము అనబడును.

ఈ సాధన నుండి కృప ఉత్పన్నమగును. జిజ్ఞాసువులు భక్తులుగనే పరిగణింపబడుదురు. కావున వారి సాధనలో భాగమై యున్న భక్తి భావము విశిష్టకృపను ఉత్పన్నము చేయును. గీతలోని అర్థము తెలియక పోయినా, దానిని పారాయణము చేసినచో, అది ఈశ్వర ప్రార్థన యగునని వారు చెప్పెదరు. అదే విధముగా ఉపనిషత్తులను ప్రతిదినము పారాయణము చేసినచో, అది ప్రార్థన యగును. ఏలయన, భగవానుని వర్ణించే ఆ పదములన్నియు భగవానుని నుండి ఉద్గమించినవి. కావున ఈ దర్శనమును పొందుటకు ఈశ్వరుని కృప అవశ్యకమని చెప్పవచ్చును.

అది ఎవరికి ఈయబడును? ఈ ప్రశ్నను ఇచ్చట లేవనెత్తినారు. అటంకములన్నిటినీ తొలగించివేసి, సమ్యగ్దర్శనమునీయ సమర్థమగు బుద్ధి యోగమును భగవానుడు తన భక్తులకు మాత్రమే ఇచ్చుననుకొనుడు. అయన భక్తులకు మాత్రమే ఇచ్చుటకు కారణమేమి? తరువాతి శ్లోకములో ఈ ప్రశ్నకు సమాధానము ఈ యబడినది.

**అధ్యాయము 10, శ్లోకము 11:**

> तेषामेवानु कंपार्थ मह मज्ञानजं तम : ।
> नाशयाम्यात्म भावस्थो ज्ञानदीपेन भास्वता ॥ ११ ॥

> తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజం తమః
> నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా (11)

**తేషాం ఏవ** = వారికి మాత్రమే; **అనుకంపార్థమ్** = దయను చూపుట కొరకై; **అహమ్** = నేను; **ఆత్మ భావస్థః** = మనోవృత్తులయందున్నవాడనై; **అజ్ఞానజమ్** = అజ్ఞానమునుండి పుట్టిన; **తమః** = చీకటిని; **భాస్వతా** = ప్రకాశించే; **జ్ఞానదీపేన** = జ్ఞానమనే దీపముతో; **నాశయామి** = నశింపజేసెదను.

> వారికి మాత్రమే దయను చూపుట కొరకై నేను మనో వృత్తుల యందున్నవాడనై అజ్ఞానమునుండి పుట్టిన చీకటిని, ప్రకాశించే జ్ఞానమనే దీపముతో నశింప జేసెదను (11).

అను కంపార్థమ్. పూర్ణమగు అనుగ్రహము కొరకు. ఈ అనుగ్రహము (దయ) సాధకుని ప్రార్థనల వలన, కర్మల నుండి, ఉత్పన్నమైనది.

ఈ అను గ్రహమును ఇమ్చు నది ఎవరు?

అహం ఆత్మ భావస్థః. ఇది చాల ప్రముఖమైన పదము. మనస్సులో ఆలోచనల రూపములో నుండువాడు (ఆత్మభావే తిష్ఠతి) అని సరళమైన అర్థము. ఇచట ఆత్మయనగా అంతః కరణము. భావము అనగా ఆలోచనా రూపము (వృత్తి). ఆత్మ భావస్థుడనగా సర్వమానవుల ఆలోచన (వృత్తి) యందు ఉపలభ్యమగువాడు. 'నేను ఇచ్చెదను (దదామి)' అని చెప్పుటచే ఉత్పన్నమయ్యే అవకాశము గల ఒకానొక ధారణను భగవానుడిచట తొలగించుచున్నాడు. నేను ఇచ్చెదను అనగానే, ఈశ్వరుడు ఎచ్చటనో ఒక చోట ఉండి మన అభ్యర్థనలను విని, కష్టములను దీర్చుననే ధారణ మనకు కలుగును. మనకు, ఈశ్వరునకు మధ్యలో దూరమును భావించే ఈ ప్రవణత (tendency) ఈ నాటి సమస్య కాదు. ఇది చిరంతనమగు సమస్య. 'నేను ఇచ్చెదను' ఇత్యాదిగా భగవానుడు చెప్పే సందర్భములన్నింటిలో ఈ సమస్య ఉదయించును. దీనిని నిరాకరించుటకై 'నేను సాధకుల ఆలోచనలన్నిటియందు ప్రత్యగాత్మరూపుడనై ఉన్నాను (ఆత్మ భావస్థః అహమ్)' అని భగవానుడు చెప్పు చున్నాడు. భగవానుడు మన మనస్సులలో శుద్ధచైతన్యరూపమగు అహంవృత్తి రూపుడై ఉపలభ్యమగు చున్నాడు. ఈశ్వరుడు స్వస్వరూపుడై ప్రకాశించుచున్నాడు. 'నేను అందరి హృదయములలో లభించుచున్నాను (సర్వస్య చాహం హృది సన్నివిష్టః)' అని భగవానుడు తరువాత 15 వ అధ్యాయములో చెప్పగలడు. ఇదే భావమును భగవానుడిచట 'అహం ఆత్మ భావస్థః' అను వాక్యములో ప్రకటించినాడు.

పరమేశ్వరుడు సర్వమనోవృత్తుల సారరూపుడుగా ఉపలభ్యమగు చున్నవాడై ఏమి చేయును?

నాశయామి. నశింపజేసెదను. జిజ్ఞాసువులు తమ సాధనను అంకిత భావముతో, భక్తితో, దృఢచిత్తముతో కొనసాగించుటచే, వారి మనస్సులలో ఒక విశిష్టమగు అనుకూల ప్రవృత్తి నిర్మాణమగును. అట్టి అనుకూల స్థితికి అనుగ్రహమని పేరు. ఆ స్థితిలో భగవానుడు నశింపజేయును (అహం నాశయామి). దేనిని నశింపజేయును?

తమః, చీకటిని. మోహమనే చీకటిని (మోహాంధకారమ్) భగవానుడు నశింపజేయునని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. ఈ మోహము అజ్ఞానము నుండి పుట్టినది. లేదా అవివేకము అని కూడ చెప్పవచ్చును. ఆత్మయే దేహము, ఆత్మయే మనస్సు ఇత్యాది తప్పు ధారణలు, మరియు దీనికి విలోమముగా దేహేంద్రియ సంఘాతమే ఆత్మ అనే ధారణ అవివేకమునుండియే పుట్టును. తన గురించి వ్యక్తికి గల ఈ తప్పు ధారణలకు మిథ్యాప్రత్యయములు అని పేరు. భగవానుడు వాటిని

నశింపజేయును (అహం నాశయామి). ఈ అహమ్ ఎవరు? ఎక్కడనో ఉండే అజ్ఞాత ఈశ్వరుడు గాదు. ఆలోచనలన్నింటియొక్క సత్యాధిష్ఠానతత్త్వమే ఇచట అహమ్ శబ్దముచే చెప్పబడును. ఆయన నశింపజేయు విధమెట్టిది?

జ్ఞానదీపేన భాస్వతా, ప్రకాశించే జ్ఞానము అనే దీపముతో. మోహమును నశింపజేయుటకు ఆయుధముతో పని లేదు. చీకటిని పోగొట్టుటకు చిన్న దీపమును వెలిగించిన చాలును. సమస్య అజ్ఞానమోహములు మాత్రమే గనుక జ్ఞానదీపము బుద్ధిలో అస్పష్టాంశములను మిగల్చకుండగా పూర్తిగా ప్రకాశింపజేసినచో చాలును. అందువలననే, జ్ఞానదీపేన అను పదమునకు భాస్వతా అను విశేషణము జోడించబడినది. ఇది సంశయములచే మరియు అస్పష్టతచే కప్పివేయబడియున్న జ్ఞానము కాదు. ఇది పొగలేకుండా ప్రకాశించే జ్ఞానదీపము. దీనిని పొందిన తరువాత కోరదగినది మరియొకటి ఉండబోదు. అది మన మనస్సులో అజ్ఞానము యొక్క ఛాయలనైననూ మిగల్చదు. ఆ దీపముతో నేను నశింపజేసెదనని భగవానుడు చెప్పుచున్నాడు. 'నీవు నశింపజేయనక్కరలేదు, నేను నశింప జేసెదను' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది గమనించదగిన ప్రముఖమైన విషయము.

నదీ సాగర సంగమములో నది సముద్రములోనికి ప్రవహించునా? లేక సముద్రమే ఎదురేగి నదిలో ప్రవేశించునా? ఈ విషయమును నిర్ణయించుట కష్టము. సముద్రములో కలియుటకు ముందు ఒక మైలు దూరము వరకు నదిలోని నీరు ఉప్పగా నుండును. ఇంతేగాక, ఒకప్పుడు సముద్రమునకు పోటు వచ్చినప్పుడు నదీ ప్రవాహ దిశ వెనుకకు మళ్లును. కావున నది సముద్రములో ప్రవేశించునో, లేక సముద్రము ఎదురేగి నదిలో కలియుచున్నదా అను విషయము మనకు తెలియదు. ఇదే విషయము ఇచట చెప్పబడుచున్నది. జ్ఞానము సాధకునకు ఎదురేగి చీకట్లను పారద్రోలునా యనిపించును.

### ఆత్మ జ్ఞానమును మనము పొందెదమా? లేక మనకు ఈయబడునా?

శాస్త్రములో మనకు ఈ రెండు రకముల కథనములు కన్పట్టును. 'నీవు సాధన చేసి ఈ జ్ఞానమును పొంది నన్ను గుర్తించి నన్ను పొందుము'. ఇది ఒకటి. కాని వాస్తవములో ఈ జ్ఞానము నీవు పొందేది కాదు. ఇతర జ్ఞానము లన్నింటిలో ఒక జ్ఞానకర్త, మరియు జ్ఞానములో విషయమగు ఒక వస్తువు ఉండును. ఉదాహరణకు 'ఇది కుండ (అయం ఘటః)' అనే జ్ఞానములో కుండ విషయము. ఆ జ్ఞానమును పొందిన వ్యక్తి తన మనస్సు ద్వారా కుండను జ్ఞాన విషయముగా చేసి 'ఇది కుండ (అయం ఘటః)' అని చెప్పును. దీనిలో కర్త బాధింపబడుట లేదు. వస్తువును తెలుసుకునే

కర్త మిగిలియే యుండును. జ్ఞానములన్నింటిలో పరిస్థితి ఇదియే. కాని ఆత్మ జ్ఞానము వద్దకు వచ్చుసరికి కర్తృత్వమే నశించును. 'బ్రహ్మాభిన్నమగు శుద్ధచైతన్యము నేనే (అహం శుద్ధం కేవలం చైతన్యం బ్రహ్మ)' అను జ్ఞానముచే 'నేను జ్ఞాతను' అను ధారణ నశింపచేయబడును. అహంకారము వ్యయముగా జ్ఞానాగ్నిలో లీనమగును.

ఈ జ్ఞానములో కర్త లేకుండుటకు కారణమేమనగా, ప్రమాణము అహంకారమునకు అధీనమై లేదు. మనము ప్రత్యక్షమును జ్ఞానసాధనముగా వినియోగించే సందర్భములో ప్రత్యక్ష ప్రమాణము మన అధీనములో నుండుటచే మనము కర్తలము అగుదుము. ప్రత్యక్షము అనే జ్ఞానసాధనమును వినియోగించి మనము 'ఈ ఘటము, ఈ వృక్షము' ఇత్యాదులను చూస్తాము. అదే విధంగా, అనుమానము (inference) లో కూడా కర్త ఉండును. జ్ఞాతయగు కర్త యొక్క ఉనికిని ముందుగా నిర్ధారణ చేసుకున్న తరువాతనే అనుమానము పని చేయును. 'నేను ఊహించుచున్నాను' అన్నపుడు కర్త గలడు. అనుమానములో మరియొక రకమైన అర్థాపత్తిలో కర్త ముందుగనే నిర్ధారితమగును. నా చేతిలో ఘటము లేదు (తలే ఘటః నాస్తి) ఇత్యాదిగా వస్తువుల అభావజ్ఞానమును మనకు కలిగించే అనుపలబ్ధిలో కూడ కర్త గలడు. వస్తువు లేదు అను జ్ఞానమును అనుపలబ్ధియను ప్రమాణము ద్వారా పొందే కర్త గలడు. ఉపమానము ద్వారా జ్ఞానమును పొందుటలో కూడా పరిస్థితి ఇంతే. 'గవయమృగము గోవును పోలియుండును' అని నీకు చెప్పినారు. నీవు గోవును ఎరుగుదువు. కాని గవయమునెరుంగవు. కాని గోవుతో పోల్చుటవలన నీకు గవయము యొక్క పరోక్ష జ్ఞానము కలుగును. నీవు గవయమును చూచినప్పుడు గోదృష్టాంతమును గుర్తు చేసుకొని, గవయమును గురించి ప్రత్యక్ష జ్ఞానమును పొందెదవు. ఈ మొత్తం ప్రక్రియలో కర్త గలడు. కావున కర్త ఎన్నడూ బాధింపబడుటలేదు. జీవకణము, పరమాణువు, కణము ఇత్యాదుల జ్ఞానములో కర్త గలడు. నీవు నీ మనస్సు లోపలి పొరలలోని గతించిన కాలపు గుర్తులను మనోవిజ్ఞాన దృష్టితో పరిశీలించే సందర్భములోనైనను కర్త గలడు. 'పూర్వము నాకు ఇట్లు జరిగినది గనుకనే, ఇపుడు నేనీ తీరున స్పందించుచున్నాను' అని నీవు అనుమానమును చేసెదవు. గతమునకు, వర్తమానమునకు మధ్యలో అనుమానిక సేతువును నిర్మించునది కర్తయే.

ఈ సందర్భములలో కర్త లేశమైననూ బాధింపబడుటలేదు. కాని నీవు శబ్ద ప్రమాణమును స్వీకరించి వేదాంత ప్రకాశములో నిన్ను ఉద్భాసితము చేసుకొనే సందర్భములో కర్తకు పని లేదు. కర్తయగు నీవు ఈ జ్ఞానము కలిగే పరిస్థితిని సృష్టించుకున్న తరువాత, కర్త చేసే పని అంతమగును. నది సముద్రమునకు కను చూపు దూరము వరకు పయనించి చేరుకున్నది. ఆపైన నది చేయవలసినది

ఏదీ లేదు. మిగిలిన పనిని సముద్రము చూచుకొనును. ఇక్కడ కూడా పరిస్థితి ఇంతే. నీవు నీ సంకల్ప శక్తిచే గురువు వద్దకు వెళ్లి బోధనతో నిన్ను నీవు ఉద్భాసితము చేసుకొనెదవు. ఇంతవరకు కర్తవు నీవే. ఈ పని దానంతట అది జరిగేది కాదు. జ్ఞానోదయమునకు సానుకూలమగు పరిస్థితిని సృష్టించుకోవలసినది నీవే. ఆపై పనిని పదములు (శబ్దము) చేసుకు పోతాయి.

తత్ త్వం అసి అను వాక్యములోని తత్పదార్థమును, త్వం పదార్థమును సరిగా విశ్లేషించినచో, అప్పుడు తత్త్వమసి మహావాక్యమునకు తాత్పర్యమగు అభేదము (అఖండార్థము) గుర్తింపబడును. ఆ గుర్తింపు ఏమి చేయును? ముందుగా ఆ గుర్తింపు ఉదయించే ప్రక్రియను మనము తెలుసుకుందాము. ఆ గుర్తింపు బుద్ధిలో ఉదయించును. ఏలయన, ఆత్మ కర్తయనే ధారణను నశింపజేసే వృత్తి ఉదయించేది బుద్ధిలోననే గదా! కర్త ఆత్మయే అయినా, ఆత్మ కర్త కాదు. జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు మూడు ఒకే ఒక చైతన్యము. కర్త ఎక్కడ గలదు? కర్మ ఎక్కడ గలదు? ఆత్మ ఈ మూడింటినుండియూ విముక్తమై ఉన్నది. అదియే బ్రహ్మము.

ఆత్మ బ్రహ్మమే యను ఈ గుర్తింపు కర్తను కబళించును. అట్టి స్థితిలో 'నేను పొందితిని' అని చెప్పుట ఎట్లు పొసగును? ఈ జ్ఞానమును శాస్త్రము ద్వారా ఈశ్వరుడు మాత్రమే ఇచ్చును. దీనిని పొందుటకు నీవు చేయవలసినది ఏదీ లేదు. దీనిలో అహంకారమునకు పాత్ర లేదు గనుక, ఈ జ్ఞానమును ఈశ్వరుడిచ్చునని చెప్పుటయే యుక్తము.

ఈ దర్శనమును నేనే ఇచ్చెదను (అహం దదామి బుద్ధియోగమ్) అని భగవానుడు పూర్వశ్లోకములో చెప్పి యున్నాడు. కాని, ఈ శ్లోకములో 'నేను ఇచ్చేది ఏదీ లేదు' అని చెప్పుచున్నాడు. భగవానుడు బుద్ధియందు బుద్ధి వృత్తుల సారస్వరూపుడుగా నుండి అజ్ఞానమును తొలగించును (అజ్ఞానజం తమః నాశయామి). అంతే.

దదామి స్థానములో ఇపుడు నాశయామి వచ్చినది. ఒకటి సకారాత్మకము కాగా రెండవది నకారాత్మకము (negative). సకారాత్మక (Positive) కథనములో భేదమునకు అవకాశము గలదు. ఒకడు ఇచ్చువాడు, మరియొకడు పుచ్చుకొనువాడు. ఈ భేదములో ద్వైతము సమ్మిళితమై ఉండును గనుక, ఇచ్చువాడు ఒకడు వేరుగానున్నాడనియు, వాడే ఈశ్వరుడనియు తప్పుగా తెలుసుకునే అవకాశము గలదు. ఏదో ఒక కొంగ్రొత్త జ్ఞానము బుద్ధిలోనికి ప్రవేశపెట్టబడునా యనిపించును. కాని అది సరి గాదు. ఇచట వాస్తవమగు ఇచ్చుట లేదు. భగవానుడు అజ్ఞానమును నశింపజేయును. అంతే. జ్ఞానము కొంగ్రొత్తగా పుట్టేది కాదు. వాస్తవంగా జరిగేది ఏమంటే, అజ్ఞానము

తొలగించి వేయబడును. అట్లైనచో, జ్ఞానము పొందుట ఇత్యాది ప్రయోగము లుండుటకు కారణమేమి? అజ్ఞానమును నశింపజేయుటకు ఒక వృత్తి ఆవశ్యకమగును గాన, జ్ఞానము ఉదయించినదని మనము చెప్పెదము. కాని వాస్తవంలో జ్ఞానము పుట్టదు. జరిగేది ఏమంటే, వృత్తి పుట్టి అజ్ఞానమును నశింపజేయును. జ్ఞానము ఉత్పన్నము కాదు. అజ్ఞానము తొలగింపబడును.

ఇందువలననే ఈ ప్రక్రియ అంతా నివృత్తి ప్రక్రియయే గాని, ప్రవృత్తి గాదు. ప్రవృత్తిలో కర్త ఉండును. ఈ నివృత్తిలో కర్త నిషేధింపబడును. ఆత్మయే బ్రహ్మము అనే సత్యమును మరుగు పరిచే అజ్ఞానము యొక్క నివృత్తియే ఇచట జ్ఞానమని చెప్పబడినది. కొంగ్రొత్తగా పుట్టేది ఏదీ లేదు.

ఇతర వస్తువులను ఇచ్చినట్లుగా జ్ఞానమును ఈయగల్గినచో, దానిని అజ్ఞానికి ఇచ్చిన తరువాత కూడా ఆ వ్యక్తి అజ్ఞాని గానే మిగిలి యుండును. ఆ జ్ఞానము అతనిపై కేవల అధ్యారోపము మాత్రమే అగును. దీనిలోని సత్యమేమనగా, జ్ఞానము సర్వదా ఉండును. దానిని కప్పివేసే అజ్ఞానమును మనము నిర్మూలించెదము. అంతే. జ్ఞానము సర్వదా వస్తుస్వరూపమునకు అనురూపముగా నుండును. ఆత్మయే బ్రహ్మము. ఆ బ్రహ్మము అనంతమైనచో, అది సర్వకాలములయందు అనంతమై యుండును. దాని జ్ఞానము కూడా ఆ వస్తుతత్త్వముతో ఏకరూపమై యుండును. ఈశ్వరుడు సర్వజ్ఞుడు గనుక, జ్ఞానము క్రొత్తగా పుట్టే ప్రసక్తి లేదు. ఒక జ్ఞానము నీ మస్తిష్కములో లేకపోవచ్చును. ఆ పరిస్థితిని సరిదిద్దుటకై అజ్ఞానమును నశింపజేయగలిగే విశిష్టబుద్ధి వృత్తిని నిర్మించిన చాలును. ఆత్మను గురించి ఉన్న అజ్ఞానమును నశింపజేయు బుద్ధి వృత్తిని ఉదయింపజేసినచో ఆత్మయే బ్రహ్మయను జ్ఞానము కలుగును. ఆ ప్రక్రియకు ఆటంకములుండ వచ్చును. వాటిని నిర్మూలించుటకై మనకు ఈశ్వరకృప ఇత్యాదులు ఆవశ్యకమగును. ఆ దృష్టి కోణములో 'నేనీ దర్శనమునిచ్చెదను (అహం బుద్ధి యోగం దదామి)' అని భగవానుడు చెప్పగల్గును.

**జ్ఞానోదయము తైలదీపమును వెలిగించుట వంటిది**

శ్రీశంకరులు తైలదీపదృష్టాంతముతో ఈ విషయమును చక్కగా వివరించిరి. వెలిగింపబడిన తైలదీపములో నూనె, వత్తి, దీపశిఖ మరియు ప్రాణ వాయువు అను అంశములు గలవు. శ్రీశంకరులిచట వాటినన్నిటినీ వివరించిరి.

భక్తి మరియు ఉత్సాహము ఈ దీపమునకు తైలము (స్నేహము). స్నేహ శబ్దమునకు ప్రేమ అని కూడా అర్థము గలదు. ప్రేమకు, భక్తికి గల తేడా ఏమి? ఆదరము, సమ్మానము

ఉన్నచోట భక్తి ఉండును. ప్రేమ ఈశ్వరాభి ముఖమైనచో, దాని యందు ఒక విశిష్ట ప్రార్థన, శరణాగతి, రక్షింమననే అపేక్ష సమ్మిళితమై యుండును. ఈశ్వరుని గుర్తించుట, వినయముతో ప్రార్థించుట భక్తి యనబడును. సమాదరము, శ్రద్ధలతో గూడిన ప్రేమకు భక్తి యని పేరు. చిక్కని ద్రవమేదైనా స్నేహమనబడును. మైత్రి ఇత్యాదిగా గల కొన్ని రకముల ప్రేమ ఇట్టి ద్రవము వలెనే మనలకు అతుకుకొని బంధించును. ఇట్లు బంధించే ప్రేమయే స్నేహమనబడును. ఈ జ్ఞానదీపము యొక్క వత్తిని ఉత్సాహము, భక్తి అనే తైలము (స్నేహము)తో తడుపవలెను (అభిషిక్తః) అని శ్రీశంకరులు వివరించిరి.

ఆధ్యాత్మిక సాధకులు గంభీరవదనులై యుండుటను నేను గాంచితిని. వారి యందు ఒక ఖేదము నాకు కనబడినది. ఈశ్వరాన్వేషణ కొరకై కొన్ని వ్యవస్థిత (organised) మతములకు తమ జీవితములను అంకితము చేసిన సాధకులు మిక్కిలి భయభీతులై యుండుటను నేను చూచితిని. దీనికి కారణమేమనగా, వారి దృష్టిలో కొన్ని పవిత్రమగు ఆలోచనలు, మరికొన్ని పాపపు ఆలోచనలు అను విభాగము గలదు. కాని వాస్తవంలో మంచి లేక చెడు ఆలోచనలు లేవు. కేవలమగు ఆలోచనలు, మంచికర్మలు మరియు చెడు కర్మలు మాత్రమే గలవు. కర్మలు మాత్రమే ఫలములనిచ్చును. బుద్ధి పూర్వకముగా నీవు ఒక వ్యక్తి పతనమును గురించి ధ్యానమును గాని, ప్రార్థనను గాని చేసినచో, అది ఒక మానసిక కర్మ యగును. అది కర్మయని మనము అంగీకరిస్తాము. కాని, మంచి, లేక చెడు ఆలోచనలు అనేవి లేవు. ఆలోచనలు మాత్రమే గలవు. మంచి, చెడు కర్మలు కూడ గలవు. కర్మలు మానసికము గాని, వాచికము గాని, కాయికము గాని కావచ్చును. ఈ అవగాహన సామాన్యమైనది గాదు. ఇది ఉన్న వ్యక్తి మాత్రమే ఉల్లాసముగా నుండగలడు. ఈ దీపమును వెలిగించుటకు వత్తిని ఉల్లాసము మరియు భక్తి అనే తైలములో తడుపవలెను.

గురువు యొక్క శిక్షణలో ఉంటూ అనుశాసనములన్నింటినీ పాటిస్తూ, సరియగు మనఃప్రవృత్తితో శాస్త్రములను అధ్యయనము చేసి తద్వారా సాధకుడు తన బుద్ధిని శుద్ధమొనర్చుకొనును. అట్టి సంసిద్ధమైన బుద్ధియే వత్తి. ఈ వత్తి అహంకారమనే దీపమునందు గలదు. ఈ దీపమును పెనుగాలుల నుండి రక్షించవలెను. అనగా తీవ్రమగు రాగ ద్వేషములుండరాదు. మరియు, ప్రాణవాయువు లేనిదే దీపశిఖ నిలువజాలదు. ఆత్మకు ఈశ్వరునితో గల అభేదమును గుర్తించు బుద్ధి వృత్తియే ఆ ప్రాణవాయువు అని శ్రీశంకరులు వివరించిరి. జీవేశ్వరుల అభేదము యొక్క సమ్యగ్దర్శనమే ఈ దీపము నుండి వెలువడే కాంతి. నిరంతర నిదిధ్యాసనము వలన ఈ దర్శన ము సంపన్నమగును.

ఈశ్వరుని విభూతుల గురించి శ్రీకృష్ణుడు చెప్పిన మాటలను వినిన పిదప, అర్జునుడిపుడు ఒక ప్రశ్నను లేవనెత్తినాడు. గీత ఒక సంవాదము అను విషయమును మనము తెలుసు కొనుట చాల ముఖ్యము. దానిలోని విషయ వస్తువు ప్రధానముగా తెలియదగినది. విశ్వసించవలసిన విషయములు చాల కొద్దిగా మాత్రమే గలవు.

గీతలోని ప్రధానాంశములను అవగాహన చేసుకోవాలి. జీవన మూల్యములు, మనః ప్రవృత్తులు ఇత్యాది కొన్ని విషయములను అవగాహన చేసుకొని, జీవితములో అనుసరించవలెను. అనగా దీనికి ఒక విశిష్టసంకల్పము ఆవశ్యకమగును. కాని భగవంతుడు తత్త్వములను గురించి నిరూపించినపుడు, అవి కేవలము అవగాహన చేసుకొనదగినవి మాత్రమే. విశ్వాసముల వెనుక కూడా కొంత అవగాహన ఉండుట మంచిది. తెలుసుకోవలసిన భాగము అధికము గనుక, సంవాదరూపములో ప్రతి పాదించబడినది. ఇచట అర్జునుని ప్రశ్న ప్రార్థనను బోలియున్నది.

**బోధింపబడిన విషయముపై తనకు గల అవగాహనను అర్జునుడు ప్రదర్శించుచున్నాడు**

**అధ్యాయము 10, శ్లోకము 12:**

अर्जुन उवाच ।
परं ब्रह्म परं धाम पवित्रं परमं भवान् ।
पुरुषं शाश्वतं दिव्यमादि देवमजं विभुम् ॥ १२ ॥

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ (12)

అర్జునః = అర్జునుడు; ఉవాచ = పలికెను; భవాన్ = నీవు; పరమ్ = సర్వాతీతమగు; బ్రహ్మ = బ్రహ్మవు; పరమ్ = సర్వోత్కృష్టమగు; ధామ = లక్ష్యము; పరమమ్ = సర్వోత్తమమగు; పవిత్రమ్ = శుద్ధికరము; శాశ్వతమ్ = శాశ్వతుడు; దివ్యమ్ = దివ్యుడు; ఆదిదేవమ్ = దేవతలకు కారణమైన వాడు; అజమ్ = పుట్టుకలేనివాడు; విభుమ్ = సర్వవ్యాపకుడు అగు; పురుషమ్ = పురుషుని.

అర్జునుడిట్లు పలికెను:

నీవు సర్వాతీతమగు బ్రహ్మవు, సర్వోత్కృష్టమగు లక్ష్యమవు,

సర్వోత్తమమగు శుద్ధి కారకుడవు. శాశ్వతుడు, దివ్యుడు, దేవతలకు కారణమైనవాడు, పుట్టుక లేని వాడు, సర్వవ్యాపకుడు అగు పురుషుడు నీవే (12).

ఈ అధ్యాయములన్నిటినీ శ్రీకృష్ణుని నుండి విని తరువాత, అర్జునునకు విషయవస్తువు గురించి కొంత అవగాహన ఏర్పడినది. ఈ అవగాహన నుండి అర్జునుడి పుడు పలుకు చున్నాడు: 'ఓ కృష్ణా! నీవు పరంధాముడవని మహర్షులందరు చెప్పెదరు'. ఇచట ధామ శబ్దము ప్రకాశము అను అర్థములో ప్రయోగింపబడినది. ధా అను ధాతువు నుండి పుట్టిన ధామ శబ్దమునకు ప్రకాశము, నివాస స్థానము అను రెండు అర్థములు గలవు. వస్తువులను చూచుటలో మనకు ప్రకాశము సహకరించును. అటులనే ఇది ప్రకాశములన్నింటినీ ప్రకాశింపజేయు చైతన్య ప్రకాశము. చైతన్యమున కంతకూ మూలస్రోతస్సు నీవే. చైతన్యము నీవే. ధామశబ్దమునకు ఆవాసము అను అర్థము కూడ గలదు. నీవు సర్వోత్కృష్టలక్ష్యమై ఉన్నావు. నిన్ను చేరిన వ్యక్తికి మరియొక లక్ష్యము సంభవము కాదు, అవశ్యకము కాదు.

తరువాత అర్జునుడు 'పవిత్రం పరమం భవాన్' అనినాడు. మనస్సును శుద్ధిచేసి ఊరటను కలిగించే సాధనలు అనేకము గలవు. కాని పుణ్యపాపకర్మాధీనముగా నుండే అంతః కరణమును పూర్ణముగా శుద్ధిచేయుట ఎట్లు సంభవమగును? ఈశ్వర జ్ఞానము తక్క మరేదీ పుణ్యపాపములను తొలగించజాలదు. కావున, ఓ భగవాన్! పవిత్రము చేయువాటిలో సర్వశ్రేష్ఠుడవగు నీవు పావనుడవు. జీవుడు ఏకాకి, భయభీతుడు మరియు బద్ధుడు. అట్టి జీవుని జీవత్వము ఈశ్వరజ్ఞానముచే, ఈశ్వరసాక్షాత్కారముచే నశింపచేయబడును. ఈశ్వర జ్ఞానముచే జీవత్వము నశించుటకు కారణమేమనగా, ఈశ్వర జ్ఞానము ఈశ్వరుని కంటె వేరు గాదు. జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అనునవి ఒక్కటియే అనునదియే ఈ జ్ఞానము. ఇది ఆత్మజ్ఞానము కూడా. కావున జ్ఞేయము కూడా ఆత్మయే. నేను ఎంత సత్యమో, ఈ జ్ఞానము కూడా అంతే సత్యము. జ్ఞాతను కూడా నేనే. ఈ జ్ఞానముచే ఈశ్వరుడు జీవుని పూర్ణముగా పవిత్రుని చేయును. జన్మమరణములకు అధీనుడై సంసారియగు అల్పవ్యక్తి పూర్తిగా విముక్తుడగును. దీనికంటె ఎక్కువగా శుద్ధి చేయునది (పావనము) మరియొకటి లేదు.

పురుషం నిత్యం శాశ్వతమ్. ఇచట పురుషశబ్దమునకు రెండు అర్థములు గలవు. దేహేంద్రియమనస్సంఘాతము నందు నివాసము చేయువాడు, సంఘాతముచే ఉపహితుడు

పురుషుడనబడును. సర్వమును పూరించి పూర్ణము చేయువాడు పురుషుడనబడును. కావున పురుష శబ్దమును రెండు సార్లు ఉచ్చరించినచో అది మహా వాక్యమగును. పురుషోऽహం పురుషః అని నీవు అన్నచో, దేహేంద్రియ మనస్సంఘాతమునందు ఉపలభ్యమగుచూ దాని యందు బద్ధుడై ఉన్నాడా యన్నట్లు కన్పట్టు చేతనుడు అనంతుడు, సర్వమును వ్యాపించి పూరించువాడు అని యర్థము. అనంతుడగు పురుషుడు కాలపరిచ్ఛిన్నుడు కాదు (శాశ్వతుడు). ఈ లోకమునకు సంబంధించని (అలౌకిక), ఉదాత్త స్వభావము గలది దివ్యము అనబడును. అది మనకు తెలిసిన సర్వము కంటె గొప్పది. ఒక అసాధారణ వస్తువును వివరించుటకు దృష్టాంతము దొరకని పరిస్థితిలో మనము దివ్యము అను పదమును ప్రయోగిస్తాము. దేవతలందరు పుట్టుటకు ముందు కూడా ఉన్నవాడు అది దేవుడనబడును. అతడు దేవతలకు దేవత. దేవతలకు కారణమైన వాడు. ఆయనకు ఏనాడూ పుట్టుక లేదు (అజః). మరియు ఆయన సర్వకారణుడు, సర్వవ్యాపకుడు (విభుః). సర్వము ఆయన నుండియే పుట్టినది. ఆయన సర్వమును ధరించి యుండును. అనగా సర్వులు ఆయన అధ్యాదేశమును పాలించెదరు.

**ఈ అభిప్రాయముతో అంగీకరించే ఇతరులను అర్జునుడు ఉదహరించుచున్నాడు**

శ్రీకృష్ణుని గురించి ఈ విధముగా జ్ఞానులు మాత్రమే వర్ణించగల్గుదురు. ఇట్టి జ్ఞానులు ప్రతి తరములో కొద్ది మంది ఉంటారు. అర్జునుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 10, శ్లోకము 13 :**

आहुस्त्वामृषयस्सर्वे देवर्षि र्नारदस्तथा ।
असितो देवलो व्यासस्स्वयं चैव ब्रवीषि मे ॥ १३ ॥

ఆహుస్త్వా మృషయస్సర్వే దేవర్షి ర్నారదస్తథా
అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషి మే (13)

త్వాం = నిన్ను గురించి; సర్వే = అందరు; ఋషయః = ఋషులు; తథా = మరియు; దేవర్షిః = దేవర్షియగు; నారదః = నారదుడు; అసితః = అసితుడు; దేవలః = దేవలుడు; వ్యాసః = వ్యాసుడు; ఆహుః = చెప్పుచున్నారు; చ = మరియు; స్వయం ఏవ = నీవు స్వయముగనే; మే = నాకు; బ్రవీషి = చెప్పుచున్నావు.

నిన్ను గురించి అందరు ఋషులు, మరియు దేవర్షి యగు నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు ఇట్లు చెప్పుచున్నారు. మరియు నీవే స్వయముగా నాకు చెప్పు చున్నావు (13).

పూర్వశ్లోకములో అర్జునుడు శ్రీకృష్ణుని గురించి చెప్పిన విషయము స్వీయ అనుభవముతో చేసిన టిప్పణి మాత్రమే గాదు. ఈ విషయవస్తువును యథార్థముగా నెరింగిన ఋషులు కూడా అటులనే చెప్పినారు. ఋషుల అభిప్రాయమును మనము నిరాకరించజాలము. మరియు, దేవర్షి నారదునితో సహా, దేవలోకమునందలి ఋషులందరు కూడా ఇదే మాటను చెప్పుచున్నారు. అసిత, దేవల, వ్యాసాది ఇతర ఋషులు కూడా శ్రీకృష్ణ తత్త్వమును ఇటులనే చెప్పుచున్నారు. వారందరు అట్లు చెప్పుగాక! కాని శ్రీకృష్ణుడు 'నేను భగవానుడను గాను' అని చెప్పి యుండవచ్చును గదా! ఇచట అట్లు చెప్పలేదు. ఆయన తానే ఈశ్వరుడనని స్వయముగా చెప్పియున్నాడు (స్వయం చ ఏవ బ్రవీషి మే).

**అధ్యాయము 10, శ్లోకము 14:**

सर्वमेतदृतं मन्ये यन्मां वदसि केशव ।
न हि ते भगवन् व्यक्तिं विदुर्देवा न दानवाः ॥ १४ ॥

సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః (14)

**కేశవ** = ఓ భగవాన్ !; **మాం** = నన్ను ఉద్దేశించి; **యత్** = ఏ మాటను; **వదసి** = చెప్పుచున్నావో; **ఏతత్** = ఈ; **సర్వమ్** = అంతా; **ఋతమ్** = సత్యమని; **మన్యే** = తలంచుచున్నాను; **భగవన్** = ఓ భగవంతుడా!; **తే** = నీ; **వ్యక్తిమ్** = వ్యక్తిత్వమును; **దేవాః** = దేవతలు; **న విదుః** = ఎరుంగరు; **దానవాః** = దానవులు; **న** = ఎరుంగరు; **హి** = నిశ్చయము.

ఓ భగవంతుడా! కేశవా! నాతో నీవు చెప్పిన ఈ మాటలన్నియూ సత్యమని నేను భావించుచున్నాను. నీ వ్యక్తిత్వమును దేవతలు గాని, దానవులుగాని ఎరుంగజాలరు. ఇది నిశ్చయము (14).

ఈ ఋషులచే ఈయబడిన వర్ణనలన్నియు యథార్థమేనని నేను భావించుచున్నాను.

పూర్వాధ్యాయములలో నీవు నాకు చెప్పిన విషయములు, మరియు ఇతరులు చెప్పిన విషయములు పరిపూర్ణ సత్యములని (ఋతమ్) నేను తలంచుచున్నాను.

ఋత, సత్య శబ్దములను కలిపి ప్రయోగించిన సందర్భములలో వాటి మధ్య కొంత భేదము ఉండును. సత్యమనగా యథార్థము. వచనములు వర్ణించుదానికి, వస్తుస్థితికి మధ్యలో భేదము లేకపోవుట సత్యము, లేక ఋతమనబడును. కాని సత్య ఋత శబ్దముల సహప్రయోగములో, మరియు వాటిని ఆవృత్తి చేసినప్పుడు, వీటి అర్థములో భేదము ఉండును. నీవు చూచిన దానిని చూచినట్లుగా వర్ణించినచో, అది సత్యము అగును. నీవు నీ మనస్సులో ఎట్లు దర్శించితివో, అటులనే బయటకు చెప్పే యథార్థభాషణమునకు సత్యమని పేరు. కాని నీవు సరిగా చూడలేదనుకో. కొన్ని సందర్భాలలో నీకు యథార్థజ్ఞానము లేకపోవుటచే నీవు సత్యమని భావించినది అసత్యమని తెలును. నీవు నీకు తెలిసిన దానిని యథాతథముగా వర్ణించితివి. కావున అది సత్యము. కాని నీవు వాస్తవమని భావించినది వాస్తవము కాదు. కాని నీవు దర్శించిన దానిని ఋషులు అంగీకరించినచో, శాస్త్రమునకు అనురూపముగా నున్నచో, దానికి ఋతమని పేరు. ఏనాడైననూ బాధింప శక్యము కాని సత్యమునకు ఋతమని పేరు. కావున ఋతము సత్యము కంటె ఎక్కువ శక్తి గలది. కావున, శ్రీకృష్ణుని వచనములు ఋతము అని అర్జునుడు చెప్పుటలో అభిప్రాయమేమనగా, ఆ వచనముల గురించి ఏవిధమగు శంకకైననూ అవకాశము లేదు.

రెండవ పాదములో అతడిట్లు చెప్పెను : ఓ భగవాన్! దేవతలు గాని, రాక్షసులు గాని, దానవులు గాని నీ స్వరూపము నెరుంగరు. నీవు సర్వమునకు కారణము. కాని వారు నిన్ను ఏ మాత్రము దర్శించజాలరు. సర్వులు ఈ కార్యసృష్టిని చూచెదరే గాని, దాని కారణమును ఎవ్వరైననూ చూచుటలేదు.

అర్జునుడు ఇంతవరకు తాను సంపాదించిన జ్ఞానమును ప్రదర్శించువాడై ఇంకనూ ఇట్లు కొనసాగించుచున్నాడు :

అధ్యాయము 10, శ్లోకము 15:

स्वयमेवात्मनात्मानं वेत्थ त्वं पुरुषोत्तम ।
भूत भावन भूतेश देव देव जगत्पते ॥ १५ ॥

స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే (15)

**పురుషోత్తమ** = సర్వోత్కృష్టుడైన పురుషా!; **భూత భావన** = సర్వ ప్రాణులను సృష్టించిన వాడా!; **భూతేశ** = సర్వప్రాణులను పాలించువాడా!; **దేవ దేవ** = దేవతలచే ఆరాధింపబడే దైవమా!; **జగత్పతే** = సృష్టికి ప్రభువైనవాడా!; **త్వమ్** = నీవు; **స్వయం ఏవ** = స్వయముగనే; **ఆత్మనా** = నీ మనస్సుతో; **ఆత్మానమ్** = నిన్ను; **వేత్థ** = ఎరుంగుదువు.

ఓ సర్వోత్కృష్ట పురుషా! సర్వప్రాణులను సృష్టించి పాలించువాడా! దేవతలచే ఆరాధింపబడే దైవమా! సృష్టికి ప్రభువైన వాడా! నీవు స్వయముగనే నీ మనస్సుతో నిన్ను ఎరుంగుదువు (15).

**అధ్యాయము 10, శ్లోకము 16 :**

वक्तुमर्हस्यशेषेण दिव्या ह्यात्म विभूतयः ।
याभिर्विभूतिभिर्लोकानिमांस्त्वं व्याप्य तिष्ठसि ॥ १६ ॥

వక్తు మ్మర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః
యా భిర్విభూతిభిర్లో కాని మాంస్త్వం వ్యాప్య తిష్ఠసి (16)

**అశేషేణ** = పూర్తిగా; **వక్తుమ్** = చెప్పుటకు; **అర్హసి** = తగుదువు; **హి** = ఏలయనగా; **ఆత్మవిభూతయః** = నీ మహిమలు; **దివ్యాః** = దివ్యమైనవి; **త్వమ్** = నీవు; **యాభిః** = ఏ; **విభూతిభిః** = విభూతులతో; **ఇమాన్** = ఈ; **లోకాన్** = లోకములను; **వ్యాప్య**=వ్యాపించి; **తిష్ఠసి** = ఉంటివో.

నీ మహిమలు దివ్యమైనవి. వాటిని నీవు పూర్ణముగా చెప్పదగుదువు. నీవు ఈ విభూతులచే ఈ లోకములన్నింటినీ వ్యాపించి యున్నావు (16).

**భగవానుడు మాత్రమే తన విభూతులను వర్ణించుటకు తగినవాడు**

శ్రీకృష్ణుడు ఈశ్వరుడే యను ఋషుల అభిప్రాయమును అర్జునుడు పుష్టిచేసినాడు. సకల బ్రహ్మాండమును తన విభూతులచే ఆచ్ఛాదించి బ్రహ్మాండరూపుడై ఉన్న భగవాని విభూతుల

నన్నింటినీ వర్ణించగలిగే అర్హత ఒక్క శ్రీకృష్ణునకు మాత్రమే గలదని అర్జునుడు తరువాత వివరించినాడు. ఇతరులు కూడ విభూతులను వర్ణించ గల్గుదురు గాక! కాని నీవు వాటిని వర్ణించగలిగే సర్వశ్రేష్ఠవక్తవు అని అర్జునుడు చెప్పుచున్నాడు.

త్వం స్వయం వేత్థ. నీవు స్వయముగా, ఇతరుల బోధతో సంబంధము లేకుండగా, ఎరుంగుదువు. భగవానునకు తెలిసినది ఏది? ఆత్మానమ్. నీ గురించిన సత్యమును నీవు ఎరుంగుదువు. ఎట్లు? ఆత్మనా, నీ స్వీయ మనస్సుచే. ఇందువలననే 'నేను ఈశ్వరుడను' అని నీవు అనేక పర్యాయములు చెప్పగల్గినావు. 'నేను జ్ఞానిని, జగదధీశ్వరుడను, సర్వశక్తిమంతుడను. నాకు కోరదగినది ఏదీ లేదు' అను ఆత్మజ్ఞానము నీకు గలదు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఈశ్వరుడవు, పురుషులందరిలో శ్రేష్ఠుడవు (పురుషోత్తముడవు) నీవే అని నీకు తెలియును అని శ్రీ శంకరులు వివరించిరి.

అర్జునుడు ఆయనను 'భూతభావన' అని సంబోధించెను. అనగా సర్వప్రాణులను వాటి వాటి దేహేంద్రియ మనస్సంఘాతములతో సహా సృష్టించినవాడు. ప్రతిప్రాణికి దాని కర్మకు అనురూపముగా ఒక విలక్షణమైన స్థూలసూక్ష్మశరీరమును ఆయన సృష్టించును. ఆయన సర్వప్రాణులను సృష్టించుట మాత్రమే గాక, వాటిని భరించి పోషించుటచే భూతేశుడైనాడు. మరియు అర్జునుడు ఆయనను దేవదేవ (దేవతలందరికీ ప్రభువు), జగత్పతే (సర్వసృష్టికి అధీశ్వరుడు) అని కూడ సంబోధించినాడు. ఇవన్నీ భగవానుని పేర్లు.

వక్తుం అర్హసి అశేషేణ. దేనినీ విడువకుండగా చెప్పుటకు నీవు సమర్థుడవు. ఈ లోకమునకు సంబంధించని (అలౌకిక) నీ స్వీయ విభూతులను (దివ్యాః ఆత్మవిభూతయః) ప్రదర్శించెదవు. ఆత్మ శబ్దము భగవానుని మాత్రమే గాక నీ స్వరూపమును కూడ నిర్దేశించును. 'నీవు నాగురించి ఎరుంగుదువు. నీకు విభూతులు అన్నియూ చాల బాగుగా తెలియును. కావ నీవు వాటి గురించి మాటలాడగల్గుదువు' అను భావమును అర్జునుడు సూచితము చేసినాడు.

ఈ జగత్తులను ఏ విభూతులచే నీవు వ్యాపించి యున్నావో (యాభిః విభూతిభిః లోకాన్ ఇమాన్ త్వం వ్యాప్య తిష్ఠసి), అట్టి విభూతులనన్నిటిని వర్ణించుటకు నీవు మాత్రమే అర్హుడవు. అర్జునుడు తరువాత ఇట్లు చెప్ప బోవుచున్నాడు: 'నీవు నీగురించి ఇంతవరకు చెప్పిన దానితో నాకింకనూ తృప్తి కలుగలేదు. నీవు నా విభూతులను దర్శించగలవు గాన, నీ విభూతులను మాత్రమే గాక, నా విభూతులను కూడ వర్ణించుము. మే మందరము మా విభూతులను వినగోరుచున్నాము.

కావున ఇంకనూ చెప్పుము'. తానే సర్వము అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునితో ఒక్కముక్కలో చెప్పి ఊరకుండలేదు. తానే సర్వము అను సత్యమును ఆయన నిరూపించినాడు. అర్జునుని మాట సత్యకథనమే గాని పొగడ్త కాదు. కావుననే, అది అర్థము కాని వారికి కూడా దానిలో సత్యము, యుక్తి ధ్వనించును.

ఇచట మానవుని ఉన్నతుని చేయు సత్యములు చెప్పబడినవి. వీటిని వినే కొలదీ, ఇంకనూ తెలుసుకోవాలనే అభిరుచి కలుగును. మనము అందరము ఆవశ్యకమైన దాని కంటె అధికముగా అద్దములో ముఖమును చూచుకునే ప్రయత్నమును చేస్తాము. మనందరిలో ఆత్మ ప్రేమ గలదు. ఆత్మను ప్రేమించకుండుట సంభవమే కాదు. ఆత్మ స్వరూపతః పూర్ణము, ఆనందము. మానవులకు తమ స్వరూపమును గురించి కొంత సూక్ష్మజ్ఞానము కలదు గనుకనే, ఒకనాడు తాము అద్భుతమగు ఆనందస్వరూపులము కాగలమనే ఆశను మానవులు విడనాడలేరు. కావున ఎవ్వరైననూ పదములనే అద్దమును చూపి 'సర్వము నీవే' అను సత్యమును ప్రదర్శించినచో, వినువారలకు విసుగు కలుగదు.

అర్జునుడు ఇట్లుపలికెను– 'నీ విభూతులను ప్రదర్శించే ఈ అమృతతుల్యమగు వచనములను వినుచున్న నాకు తృప్తి కలుగుట లేదు. కావున ఈ విభూతులను ఇంకనూ వర్ణించుము. నిన్ను ప్రత్యక్షముగా గుర్తించలేని మావంటి వారలకు ధ్యేయవస్తువులుగా ఉపయోగపడే వస్తువులను, స్థానములను బోధింపుము. వాటియందు నీ మహిమ మాకు స్పష్టముగా గోచరించగలదు'. ఇట్లు అర్జునుడు ఇంకనూ వర్ణించుమని గోరెను

'ఇంకనూ వర్ణించుట చాల కష్టము. నేను కొన్ని దినములు చెప్పిననూ, ఈ విభూతులు తరగవు. అయిననూ, నేనే ఏవో కొన్ని విభూతులను వర్ణించు యత్నమును చేసెదను' అని శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు. తరువాత, 11వ అధ్యాయము లో ఆయన అర్జునునకు ప్రచండమగు తన విశ్వరూపమును ప్రదర్శించినాడు.

**విభూతులను ప్రదర్శించుమని అర్జునుడు భగవానుని ప్రార్థించుట**

**అధ్యాయము 10, శ్లోకము 17:**

कथं विद्यामहं योगिंस्त्वां सदा परिचिन्तयन् ।
केषु केषु च भावेषु चिन्त्योऽसि भगवन्मया ॥ १७ ॥

కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోసి భగవన్మయా (17)

యోగిన్ = ఓ యోగీ; సదా = ఎల్ల వేళలా; పరిచింతయన్ = నిదిధ్యాసనమును చేయు; అహమ్ = నేను; త్వామ్ = నిన్ను; కథమ్ = ఏవిధముగా; విద్యామ్ = తెలియవలెను; భగవన్ = ఓ భగవంతుడా!; కేషు కేషు = ఏయే; భావేషు = వస్తువులయందు; చ=మరియు; మయా = నాచేత; చింత్యః అపి = ధ్యానము చేయ తగుదువు.

ఓ యోగీ! నేను ఎల్లవేళలా ధ్యానమును చేయుచూ నిన్ను ఎట్లు తెలియవలెను? హేభగవాన్! నేను నిన్ను ఏయే వస్తువులయందు ధ్యానించదగును? (17)

పరిచింతయన్. సదా ధ్యానిస్తూ. నేను నీ విభూతిని తెలియుట ఎట్లు? అని అర్జునుడీ శ్లోకములో ప్రశ్నించుచున్నాడు. మనము మనచుట్టూ వివిధ వస్తువుల రూపములోనున్న ఈశ్వరుని చూస్తూ ఉంటాము. పురుషుడే వివిధ వస్తురూపములో కనబడుచున్నాడు. ఈశ్వరుని గుర్తించగలగాలంటే, మనము వస్తువులను కంటికి కనబడునంతవరకు మాత్రమే గాక, కారణ దృష్టితో చూడవలెను. ఇది కేవలము బుద్ధితో మాత్రమే దర్శించవలెను. అనగా, మనము జ్ఞానము అనే కన్ను (జ్ఞాన చక్షుః) తో చూడవలసి యుండును. ఈశ్వరధ్యానమనగా ఈశ్వరవిభూతి ధ్యానమే.

ఏయే వస్తువులయందు (కేషు కేషు చ భావేషు) నిన్ను ధ్యానించదగును (చింత్యః అసి)? ఈ జగత్తులో అనేక వస్తువులు గలవు. వీటిలో కొన్నిటియందు భగవానుని విభూతులు విశేషముగా ప్రకటమగును. వీటిని ప్రత్యేక ఉపలబ్ధి స్థానములుగా వేదములు, పురాణములు గుర్తించినవి. మరియు కొన్ని వస్తువులు పరిపాటిగా లోకప్రియములై యుండును. కొందరు వ్యక్తులు తమ కర్మలచే లోకప్రియులగుదురు. వీరిని లోకప్రియులను చేసిన మహిమ ఈశ్వరస్వరూపమే. కావున వారు ధ్యాన బిందువు కాగల్గుదురు.

'ఓ భగవాన్! నీవు అతిశయించి ప్రకటమై ధ్యేయవస్తువుగా ఉపకరించే విభూతులనన్నింటినీ నాకు చెప్పుము'. భగవానుడు సర్వములో ప్రకటమగుట వాస్తవమే. కాని కొన్ని వస్తువులు, మరియు వ్యక్తులు ఈ సృష్టిలో అతిశయించిన మహిమతో కొట్టవచ్చినట్లు కానవచ్చెదరు. ఈ విభూతులన్నింటిలోని ఉత్కర్ష మరియు సారము ఈశ్వరుడే. మరియు, ప్రాణుల పరమసార

తత్త్వమగు ప్రత్యగాత్మకూడ ఈశ్వరుడే. ఒక వస్తువు లోని సారము ఒక ప్రాణికి సంబద్ధమై యుండును. ఒక సత్యతత్త్వమునకు గల స్వరూప భూతమైన మహత్త్వము ఈశ్వరునకు మాత్రమే చెందియుండును.

ఇటువంటి మహత్త్వము బంగారము నందు వలె కల్పితము గాని, అధ్యారోపితముగాని, కాదు. బంగారము నందు రెండు రకముల మహత్త్వము గలదు. ఒకటి ఆరోపితము, రెండవది వస్తుతత్త్వమునకు సంబంధించినది. బంగారము ప్రకాశవంతమైన, తీగలుగా సాగే, అరుదైన, తుప్పు పట్టని లోహము. ఇంతవరకు దాని మహత్త్వము స్వరూప నిష్ఠమైనది (intrinsic). దాని యందు గల ఆర్థిక మహత్త్వము ఆరోపితమైనది. దానికి గల స్వరూపనిష్ఠ మహత్త్వమునుండి మన యొక్క బహిః ప్రసారిత మనోవిలాసము (projection) ను తీసి వేసినచో ఈశ్వరవిభూతి మిగులును. ఈశ్వర ధ్యానమునకు మూలసూత్రము ఇదియే. మనము స్వీయమానసిక కల్పనలను తొలగించివేసి వస్తువు యొక్క స్వరూపనిష్ఠ మహత్త్వము ఈశ్వరవిభూతి కంటె భిన్నము కాదని గుర్తించవలెను. ఈ స్వరూప భూతమగు మహత్త్వమే ఈశ్వరవిభూతి.

'కావున, ఏ వస్తువులలో నేనీ తీరున నిన్ను దర్శించగల్గుదునో, దయచేసి నాకు చెప్పుము'.'

**అధ్యాయము 10, శ్లోకము 18 :**

विस्तरेणात्मनो योगं विभूतिं च जनार्दन ।
भूयः कथय तृप्तिर्हि शृण्वतो नास्ति मेऽमृतम् ॥ १८ ॥

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ (18).

జనార్దన = ఓపరమేశ్వరా!; ఆత్మనః = ఆత్మ/నీ యొక్క; యోగమ్ = శక్తిని గూర్చి; చ = మరియు; విభూతిమ్ = మహిమను గూర్చి; భూయః = మరల; విస్తరేణ = వివరముగా; కథయ = చెప్పుము; హి = ఏలయనగా; అమృతమ్ = ఈ అమృతమువంటి మహిమను గూర్చి; శృణ్వతః = వినుచున్న; మే = నాకు; తృప్తిః = తృప్తి; న అస్తి = కలుగుట లేదు.

ఓ పరమేశ్వరా! ఆత్మ/నీయొక్క శక్తిని మరియు విభూతిని మరల

వివరముగా చెప్పుము. ఏలయనగా, ఈ అమృతము వంటి మహిమను వినుచున్న నాకు తృప్తి కలుగుటలేదు (18).

ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. ఈశ్వరుని ఈ లక్షణములను ఈ శ్లోకములోని ...పదము నిర్దేశించును. ఈ గుణములు సృష్టిలో విభూతి రూపములో ప్రకటమగును. ...ంద్రులు పరమేశ్వర శక్తి యొక్క విభూతులు. 'ఓ జనార్దనా! నీ విభూతిని దయతో విస్తరముగా నాకు చెప్పుము (విస్తరేణ విభూతిం భూయః కథయ)'.

జనార్దనుడనగా చెడు నడవడి గలవారిని నశింపజేయువాడు (దుష్టజనాన్ అర్దతి ఇతి ...). ఇచట నశింపజేయుట యనగా కర్మఫలము నిచ్చి అనుశాసించుట అని యర్థము. ...న అను పదములోని అర్ద ధాతువునకు రెండు అర్థములు గలవు. ఒకటి వెళ్లుట (గమన). ...మ్మని కోరుట (యాచన). ధాతువునకు ఈ రెండు అర్థములను స్వీకరించి, శ్రీశంకరులు ...పదమును నిర్వచించిరి. గమనార్థమును స్వీకరించినచో, దేవశత్రువులగు అసురులనందరినీ ...ది యాతనా స్థానములను పొందునట్లు చేయువాడు జనార్దనుడగును. భగవానుడు తనచే ...ృదిష్టమైనది, తన కంటె భిన్నము కానిది అగు కర్మనియతి ప్రకారముగా వారిని నరకాది ...ములకు పంపును. ధాతువు యొక్క రెండవ అర్థమును స్వీకరించినచో, అల్పఫలముల కొరకు అనంత ఫలము (నిశ్శ్రేయస్) కొరకు గాని, మానవులందరిచే ప్రార్థింపబడువాడు ...ర్దనుడగును. సంపద, సుఖము మొదలగు అభ్యుదయములు అల్పఫలములు. మోక్షము తక్క అభీష్టలక్ష్యములన్నియూ అభ్యుదయములనబడును. ఈ రెండు రకముల ఫలముల కొరకై ...లు జనార్దనుని భజించెదరు. ప్రార్థనలో రెండు అంశములు గలవు. దేని కొరకు ...ర్థించుచున్నామో అది ప్రధానమగు అంశము. ఎవరిని ప్రార్థించుచున్నాము అనేది గౌణాంశము. ...సారి దృష్టిలో ఈ రెండు అంశములు భిన్నములు. కాని సాధకుడు భగవానుని తెలియుటకై ...గవానుని ప్రార్థించును. అనగా ఈ రెండు అంశములు ఒక్కటియైనవి. ఇట్టి ఫలములనన్నిటినీ, అభ్యుదయము గాని, నిశ్శ్రేయసముగాని, ఎవని నుండి ప్రార్థించెదరో, ఆ భగవానుడు ...నార్దనుడనబడును (జనైః అర్ద్యతే యాచ్యతే యస్మాత్ సః జనార్దనః).

'శ్రోతవగు నాకు దయతో ఈ అమృతమును వర్ణించుము'. మనకు తృప్తిని, ఆనందమును ఇచ్చేది ఏదైనా అమృతమే. శ్రీకృష్ణుని ముఖము నుండి బయల్వెడలే పలుకులు అమృతము వంటివని అర్జునుని అభిప్రాయము అని శ్రీశంకరులు వివరించిరి. 'నాకు చాలును అనే తృప్తి కలుగుట లేదు (తృప్తిః నాస్తి మే)'. అతడు వినిన కొలదియూ, ఇంకనూ వినగోరుచున్నాడు.

## శ్రీకృష్ణ భగవానుడు తన విభూతులను చెప్పు చున్నాడు

**అధ్యాయము 10, శ్లోకము 19:**

श्रीभगवानुवाच ।
हन्त ते कथयिष्यामि दिव्या ह्यात्म विभूतयः
प्राधान्यतः कुरुश्रेष्ठ नास्त्यंतो विस्तरस्य मे ॥ १९ ॥

శ్రీభగవానువాచ
హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే (19)

**శ్రీ భగవాన్** = పరమేశ్వరుడు; **ఉవాచ** = పలికెను; **హంత** = బాగున్నది; **తే** = నీ కొరకు; **ప్రాధాన్యతః** = ప్రధానమైన వాటిని; **కథయిష్యామి** = చెప్పెదను; **ఆత్మవిభూతయః** = నా విభూతులు; **దివ్యాః** = దివ్యమైనవి; **హి** = నిశ్చయము; **కురుశ్రేష్ఠ** = కురువులలో ఉత్తమమైన వాడా!; **మే** = నాయొక్క; **విస్తరస్య** = విస్తారమునకు; **అంతః** = అవధి; **న అస్తి** = లేదు.

బాగున్నది! నా విభూతులు దివ్యములు. ఇది నిశ్చయము. నీకొరకు ప్రధానమైన వాటిని చెప్పెదను. కురువంశములో ఉత్తమమైన వాడా! నా విస్తారమునకు అవధి లేదు (19).

**అధ్యాయము 10, శ్లోకము 20 :**

अहमात्मा गुडाकेश सर्वभूताशयस्थित : ।
अहमादिश्च मध्यं च भूतानामन्त एव च ॥ २० ॥

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ (20).

**గుడాకేశ** = ఇంద్రియములను జయించిన వాడా!; **ఆత్మా** = ఆత్మనై; **అహమ్** = నేను; **సర్వభూతాశయ స్థితః** = ప్రాణులన్నింటి హృదయమునందు ఉన్నాను; **చ** = మరియు; **అహమ్**

= నేను; భూతానామ్ = ప్రాణులకు; ఆదిః = కారణము; చ = మరియు; మధ్యమ్ = పాలకుడను; చ = మరియు; అంతః ఏవ = లయ స్థానము కూడా.

> ఇంద్రియములను జయించిన వాడా! నేను ఆత్మనై సర్వప్రాణుల హృదయమునందు గలను. మరియు ప్రాణులకు కారణము నేనే. పాలకుడును నేనే. లయస్థానము కూడా నేనే (20).

హంత అను పదము ఆశ్చర్యమును, లేక ఆనందమును బోధించును. ఇట్టి ప్రశ్నను అర్జునుడు అడిగినందులకు శ్రీకృష్ణుడు ఆనందించెను. ఆయన ఇట్లు చెప్పెను: కథయిష్యామి. ఈ నా దివ్యవిభూతులను (దివ్యా ఆత్మవిభూతయః) నీకు వివరించెదను. నా విభూతులు అనంతములు (నాస్తి అంతః విస్తరస్య మే). కాన ప్రధానమైన వాటిని (ప్రాధాన్యతః) వివరించెదను.

శ్రీ శంకరులిట్లు వివరించిరి: దేనినీ విడువకుండగా, విభూతులనన్నింటినీ చెప్పుట సంభవము కాదు. వంద సంవత్సరములు చెప్పినా ఆ జాబితా అంతము కాదు. కావున నేను నీకు కొన్ని ప్రముఖమగు వాటిని చెప్పెదను.

నేను ఇప్పుడు నీకు మొట్టమొదటి విభూతిని చెప్పుచున్నాను. ధ్యానమున చేయగోరుచున్నానని నీవు చెప్పితివి. నిన్ను నీవే ధ్యానించుము. ఏలయన, నీవు నేనే (అహం ఆత్మా) ఈశ్వరుని కొనియాడుటకు బదులుగా, నిన్ను నీవే తెలుసుకొనుము. ఏలయన, ఆ ఈశ్వరుడవు నీవే. విభూతులన్నియు నీకు మాత్రమే చెందును.

నిద్రను జయించినవాడు గుడాకేశుడనబడును. తమస్సు అనే నిద్రను జయించిన వా (జితనిద్రః), జాగరూకుడు, సావధానుడు అని శ్రీశంకరులు వ్యాఖ్యానించిరి. గుడాకేశ శబ్దమున దట్టమగు జుట్టు గలవాడు అను అర్థము కూడ గలదు.

ధ్యానించుటకు అనుకూలముగా భగవానుడు ఏయే వస్తువులలో ఉపలభ్యమగుచున్నాడ అని అర్జునుడు ప్రశ్నించగా, నేను నీ ఆత్మను (అహం ఆత్మా గుడాకేశ) అని శ్రీకృష్ణ చెప్పుచున్నాడు. అర్జునునిలోని అహమ్ భగవానుడే. అర్జునుడు అనే నామరూపములు ఒక ఉ మాత్రమే. విభూతులన్నియు భగవానునివే గనుక, అహమ్ భగవానుడే గనుక, విభూతులన్నిం ప్రత్యగాత్మకు చెందినవి యగును. ప్రత్యగాత్మయే వస్తువు అనునది శాస్త్రము యొక్క మా

కథనము. మిథ్యాభూతమగు అవస్తువు దృష్ట్యా 'నేను సర్వమునకు కారణము (జగత్కారణము)' అనునది గౌణ కథనము. 'నేను సర్వప్రాణుల బుద్ధియందు ప్రత్యగాత్మరూపముగా ఉపలభ్యమగుచున్నాను (సర్వభూతాశయ స్థితః). కావున, ముందుగా నీవు నన్ను ఈశ్వరస్వరూపముగా గుర్తించుము'.

'అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః' అనునది ఒక సమీకరణము. సర్వప్రాణుల బుద్ధియందు ఉపలభ్యమయ్యే ఆ ఆత్మ నేనే అయి ఉన్నాను. అహమ్, ఆత్మ అను రెండింటికి అభేదము విధింపబడుచున్నది. సర్వభూతాశయస్థితః అను పదము ఆత్మకు విశేషణము. ఇచట అహమ్ అనగా ఈశ్వరుడు. కావున ఈశ్వరునకు, ఆత్మతో అభేదము విధింపబడినది. సర్వప్రాణులలోని ప్రత్యగాత్మను నేనే (అహం అస్మి). నీవు ఈశ్వరుని మౌలిక స్వరూపమును ధ్యానింప గోరుచున్నావా? అయినచో ప్రత్యగాత్మను ధ్యానించుము; నిదిధ్యాసనమును ఒనర్చుము. శ్రవణమే (శాస్త్రవిచారము) వాస్తవమగు జ్ఞానసాధనము. నిదిధ్యాసనము శ్రవణమునకు అంగము. ఈశ్వరుని ఈ రూపములో నిత్యము ధ్యానించ వలెనని (నిత్యం ధ్యేయః) శ్రీశంకరులు చెప్పిరి.

'నేను నీకు వివరించబోయే వివిధ వస్తువులయందు నన్ను ధ్యానించవలెను. నేను వాటియందు గుర్తించుటకు వీలుగా ఉపలభ్యమగుచున్నాను' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇది ఎట్లు సంభవము?

అహం ఆదిః భూతానామ్. నావలననే సర్వసృష్టి ప్రవర్తిల్లుచున్నది. సృష్టికి అభిన్ననిమిత్తోపాదానకారణము నేనే. మధ్యం చ. సృష్టిని భరించి పోషించే స్థితికి కారణము నేనే. సర్వప్రాణులు నావలననే భరించి పోషించబడుచున్నవి. అంతః. అవి అన్నియూ లీనమయ్యే కారణము నేనే. ప్రలయములో అవి అన్నియూ ఉపాదాన కారణమగు నాయందు లీనమగును. ఇది ఇట్లున్నది గాన, సర్వపదార్థములు నేనే. సర్వపదార్థములయందు నన్ను ధ్యానించవచ్చును. వ్యక్తమయ్యే రూపము గల పదార్థములన్నింటిలో గల సారభూతమగు మహత్త్వము నేనే. ఉదాహరణకు చెరుకు గడలోని పంచదార నేనే. నీకు పంచదారపై ప్రీతి ఉండవచ్చును. అది నీవు వ్యక్తిగతముగా ఆరోపించిన మహత్త్వము. కాని చెరుకు గడ, మాధుర్యము వలననే చెరుకు గడ అయినది. కావున పంచదారలోని మాధుర్యమునందు నీవు భగవానుని దర్శించుము. ఈ జ్ఞానముతో మనము కొద్ది మహిమ గల వస్తువులన్నింటియందు ఈశ్వరుని దర్శించి ప్రార్థించగల్గుతాము. ఈశ్వరుడు నిమిత్తోపాదానకారణము గనుక, ఆయన కంటె భిన్నంగా ఏదీ లేదు. ధ్యానమునకు ఉపకరించే

నామరూపములు అసంఖ్యాకముగా నున్నవి. కాని నీవు కొన్ని వస్తువులను చూచి నంతనే నీ అహంకారము పైకి లేచి వాటిని కొనియాడ నారంభించును. నీవు నీ అహంకారమును మాత్రమే దర్శించెదవు. వాస్తవంలో నీ అహంకారము ఒక వస్తువును పరిశీలించి కొనియాడుటకు కారణమైన మహత్త్వమునకు మూలము ఈశ్వరుడు తక్క వేరు గాదు.

సృష్టి స్థితిలయకారణుడు ఈశ్వరుడే గనుక, ఈ సృష్టిలోని సర్వవస్తువులు ధ్యానమునకు ఉపకరించును. ఈశ్వరుని ఏ రూపములోనైననూ ప్రార్థించవచ్చును. కాని కొన్ని స్థలములలో ఈశ్వరుని మరింత తేలికగా గుర్తించి ప్రార్థించగల్గుతాము.

**అధ్యాయము 10, శ్లోకము 21:**

आदित्यानामहं विष्णुर्ज्योतिषां रविरंशुमान् ।
मरीचिर्मरुतामस्मि नक्षत्राणा महं शशी ॥ २१ ॥

అది త్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్
మరీచిర్మరు తామస్మి నక్షత్రాణా మహం శశీ (21)

**అది త్యానామ్ = ఆదిత్యులలో; అహమ్ = నేను; విష్ణుః = విష్ణువును; జ్యోతిషామ్ = జ్యోతిః పిండములలో; అంశుమాన్ = కిరణములుగల; రవిః = సూర్యుడు; అహమ్ = నేనే; మరుతామ్ = మరుత్తులలో; మరీచిః = మరీచిని; అస్మి = అగుదును; అహమ్ = నేను; నక్షత్రాణామ్ = నక్షత్రములలో; శశీ = చంద్రుడను.**

నేను ఆదిత్యులలో విష్ణువును. జ్యోతిః పిండములలో కిరణములతో నిండియున్న సూర్యుడను. మరుత్తులలో మరీచిని. నక్షత్రములలో చంద్రుడను నేనే (21).

**అధ్యాయము 10, శ్లోకము 22:**

वेदानां सामवेदोऽस्मि देवानामस्मि वासव : ।
इन्द्रियाणां मनश्चास्मि भूतानामस्मि चेतना ॥ २२ ॥

వేదానాం సామవేదోస్మి దేవానామస్మి వాసవః
ఇంద్రియాణాం మన శ్చాస్మి భూతానామస్మి చేతనా (22)

**వేదానామ్** = వేదములలో; **సామవేదః** = సామవేదము; **అస్మి** = అగుచున్నాను; **దేవానామ్** = దేవతలలో; **వాసవః** = ఇంద్రుడను; **అస్మి** = అగుచున్నాను; **చ** = మరియు; **ఇంద్రియాణామ్** = ఇంద్రియములలో; **మనః** = మనస్సును; **అస్మి** = అగుచున్నాను; **భూతానామ్** = దేహధారులగు ప్రాణులలో; **చేతనా** = బుద్ధిశక్తి; **అస్మి** = అగుచున్నాను.

> వేదములలో సామవేదము నేనే. దేవతలలో ఇంద్రుడను నేనే. ఇంద్రియములలో మనస్సును నేనే. దేహధారులగు ప్రాణులలో బుద్ధి శక్తి నేనే (22).

ఈశ్వరుని దర్శించి ధ్యానించుటకు అనువైన వస్తువులు పురాణములలో, వేదములలో మరియు లోకములలో కానవచ్చును.

పురాణముల దృష్టి కోణంలో చూస్తే పన్నెండుగురు ఆదిత్యులలో విష్ణువు నేనే. భరించి
పోషించుట అనే దృష్టికోణంలో ఈశ్వరుని చూస్తే కనబడేది విష్ణువు. కాని ఇచటి విష్ణుశబ్దము
పురాణములలో వర్ణింపబడే పన్నెండుగురు ఆదిత్యదేవతలలో ఒకరి పేరు. మిగిలిన ఆదిత్య (సూర్య)
దేవతలందరు తమ క్షేత్రములోని ప్రాణులను మాత్రమే భరించి పోషించెదరు. కాని విష్ణువు
సర్వవ్యాపకుడై ఆదిత్యులతో సహా సర్వులను భరించి పోషించును.

ఈ లోకము దృష్ట్యా చూస్తే, ఆకాశములో ప్రకాశించే గోళములలో సూర్యుడు అత్యధిక
ప్రకాశము గలవాడు. సూర్యునకు అంశుమాన్ (కిరణములు గలవాడు) అని పేరు. మన
సౌరమండలమునకు కేంద్రస్థానములోనున్న సూర్యుడు శక్తిని ఇచ్చి భూమిపై ప్రాణి కోటిని
నిలబెట్టుచున్నాడు. కావున ప్రకాశించే గోళములలో ప్రాణశక్తినిచ్చే సూర్యుడు నేనే. వేదములో
అనేక దేవతలు ప్రస్తావింపబడిరి. వారిలో మరుద్దేవతలు కూడ గలరు. ఈ మరుద్దేవతలలో నేను
మరీచిని. రాత్రి యందు ఆకసములో కనిపించే జ్యోతిః పిండముల (నక్షత్ర) లో నేను అత్యధిక
ప్రకాశము గల చంద్రుడను (శశి). ఈ వాక్యమునకు మరి యొక వ్యాఖ్యానము గలదు. మనము
వెళ్లే ప్రదేశమునకు నక్షత్రమని పేరు. కొన్ని క్రతువుల సామర్థ్యముచే కర్త నక్షత్రలోకములను
పొందును. ఈ నక్షత్రలోకములన్నింటిలో చంద్రలోకము మెరుగైనది. కాని ఈ చంద్రలోకము
మనము చూచే చంద్రుని కంటె భిన్నము.

వీటన్నింటిలో ఈశ్వరుడు ఉపలభ్యమగుచున్నాడు. అట్టి ఈశ్వరుని విభూతి ఇచట నిర్దేశించబడు చున్నది. దేవతల మహిమ గాని, జ్యోతిః పిండముల మహిమ గాని ఈశ్వరుని మహిమ కంటె అతిరిక్తము గావు. కావున ఏ దేవతలను పూజించవలెను? అనునది ఇచటి విషయవస్తువు కాదు. ఒక వస్తువు యొక్క సార భూత స్వరూపము ఈశ్వరుని మహిమయే అనునది ఇచటి విషయవస్తువు. ఈ విషయమును మనమిచట గ్రహించవలెను.

హరిః ఓం తత్సత్.

**श्रीगणेशाय नमः**

వేదములలో సామవేదము నేనే. నాల్గు వేదములు ఈశ్వరుని విభూతులను వర్ణించును. ప్రతివేదములో ప్రథమకాండ కర్మలను, కర్మనియతిని వర్ణించును. కర్మనియతి (Law of Karma) ఈశ్వరుని కంటె భిన్నము కాదు. భగవానుడు కర్మనియతిని ప్రవర్తిల్ల జేయు అధీశ్వరుడనియు (కర్మాధ్యక్షః), కర్మల ఫలమును ఇచ్చువాడనియు (కర్మ ఫలదాతా) ఆ భాగము నిరూపించును. వేదోక్త క్రతువులనాచరించినచో, పుణ్యము అనే కర్మ ఫలము లభించును. పుణ్యము కంటికి కనపడేది కాదు. మనకు అభీష్టములగు ఫలములనిచ్చి, మనచే అదృష్టమని భావింపబడేది ఈ పుణ్యమే. పుణ్యము శాస్త్రీయమైన పేరు. కొన్ని విశిష్టక్రతువుల నాచరించి పుణ్యమును సంపాదించవచ్చును. ఒక విశిష్ట కర్మవలన ఒక విశిష్ట ఫలము లభించును అనేది ఈశ్వరుని అధ్యాదేశము. కాన ఆ కర్మలో ఈశ్వరుడు అంతర్భాగమై ఉన్నాడు. సాధనము ఈశ్వరుడే. సాధ్యము ఈశ్వరుడే. ఈ తీరున కర్మకాండ అంతా పరోక్షముగా ఈశ్వరుని మాత్రమే వర్ణించు చున్నది. జ్ఞానకాండ సాక్షాత్తుగా ఈశ్వరుని వర్ణించును. కావున వేదములన్నియు ఈశ్వరుని వర్ణించును. ''వాటిలో సామవేదము నేనే''. సామవేదములో మంత్రములన్నియూ సరళ సంగీతరూపములో గానము చేయబడును. సామగానము వేరు. వేద పఠనము (recitation) వేరు. గానము పఠనము కంటె విశిష్టమైనది. కావున, వేదములలో సామవేదమునకు విశిష్టత గలదు. అంత బలమైనది కాకపోయినా, మరియొక కారణము కూడ గలదు. లోక ప్రసిద్ధి చెందిన 'తత్త్వమసి' మహావాక్యము సామవేదములోనిదే. వేదములలో గాన రూపములో నుండి ఉల్లాసమును కలిగించు సామవేదము నేనే.

'విభిన్న దేవతలలో ఇంద్రుడు నేనే'. ఇంద్రుడు దేవతలకు అధీశ్వరుడు గనుక, వారందరిలో శ్రేష్ఠుడు. కావున ఇంద్రునిలోని మహిమ ఈశ్వరుడే. అనగా దేవతలలో ఉత్కృష్టుడగు ఇంద్రునియందు మనము ఈశ్వరుని దర్శించి ప్రార్థించెదము.

కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు అని ఇంద్రియములు రెండు రకములుగా నున్నవి. 'అవి అన్నీ నేనే'. కాని వాటిలో మనస్సు నేనే అని భగవానుడు చెప్పుచున్నాడు. ఏలయన, ఇంద్రియములన్నింటికీ ఆధారము మనస్సే. మనము మనస్సు ద్వారా ప్రపంచమును తెలుసుకొని, మనస్సు ద్వారా కర్మేంద్రియములను వాటి కార్యములయందు నియోగించెదము. జ్ఞానేంద్రియముల వెనుకనున్నదై మనస్సు ఇంద్రియగోచరమగు జ్ఞానమునంతనూ స్వీకరించు చుండును. మరియు మనస్సు కామనలకు మూలస్థానము. ఈ సంకల్పములను కర్మేంద్రియములు నెరవేర్చుచుండును. కర్మేంద్రియములు మరియు జ్ఞానేంద్రియములు కూడా మనస్సుపైనే ఆధారపడును. అందువలననే,

మనస్సు కూడా ఒక ఇంద్రియము (కరణ)గా పరిగణింపబడినది. ఇంద్రియములలో మనస్సు అతి ప్రముఖమైనది. అది లేనిదే ఇతర ఇంద్రియములేవియూ పనిచేయలేవు. ఇంద్రియములలో అట్టి మనస్సు నేనే. ఇట్టి మహిమ ఎచ్చట ఉన్ననూ, అది ఈశ్వరుని మహిమయే. మనస్సులోని విభూతి ఈశ్వరుడే.

'దేహధారులగు ప్రాణులలో (భూతానామ్) గల తెలుసుకొనే (బోధ), గుర్తించే (సంజ్ఞాన) సామర్థ్యము నేనే'. విచారణచేసి తెలుసుకొనే శక్తి బుద్ధిలో ప్రకటమగును. ఆ శక్తి ఈశ్వరుడే. సుస్పష్టమగు జ్ఞానము కంటె సుందరమైనది మరియొకటి లేదు. 'ఆ చేతనము నేనే' అని భగవానుడు చెప్పుచున్నాడు. చేతనలో స్పష్టత మాత్రమే గాక, ఇచ్ఛాశక్తి గూడ సమ్మిళితమై యున్నది. ప్రకృతి యొక్క వ్యక్తీకరణ ప్రక్రియలో సర్వోత్కృష్ట రూపమే ఇచ్ఛాశక్తి. మనము క్రమ వికాస ప్రక్రియను అంగీకరించే పక్షంలో, ఉపాధి ఇచ్ఛాశక్తి (బుద్ధి)ని పొందు సరికి ప్రకృతి పరిణామములో అత్యుత్కృష్ట స్థానమును చేరుకొని, పరిణామము పూర్ణమగును. పెరిగి పెద్ద అయ్యే సామర్థ్యము శిశువులో నిగూఢముగా నిర్మితమై యున్నది. పెరిగి పెద్దయగుటకు ఇచ్ఛాశక్తితో పనిలేదు. అది యాంత్రికముగా జరిగిపోయే జైవ(biological) ప్రక్రియ. దీనికే భావ వికారమని పేరు. కాని ఇచ్ఛాశక్తిని ఇచ్చి ప్రకృతి పరిపూర్ణతను చేరుకున్నది. ఇంతకు మించిన ఉన్నతిని నీకు ప్రకృతి ఈయజాలదు. నీవు నీకు ఈయబడిన ఇచ్ఛాశక్తిని వినియోగించుకొని పరిణతి చెందిన వ్యక్తిగా ఎదగాలి. నీవు నీ అనంత స్వరూపమును గుర్తించే స్థాయివరకు ఎదుగుటకు అవకాశము గలదు. ప్రాణుల రూపములో ఈశ్వరుడే వ్యక్తమైనాడు. కాని అట్టి ప్రాణులన్నింటిలో మానవుడు సర్వోత్కృష్టుడు.

**అధ్యాయము 10, శ్లోకము 23**

रुद्राणां शंकरश्चास्मि वित्तेशो यक्षरक्षसाम् ।
वसूनां पावकश्चास्मि मेरुश्शिखरिणामहम् ॥२३ ॥

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తే శో యక్షరక్షసామ్
వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్ (23)

రుద్రాణామ్ = రుద్రులలో; శంకరః = శంకరుడను; అస్మి = అగుచున్నాను; చ = మరియు; యక్ష రక్షసామ్ = యక్షులలో, రాక్షసులలో; విత్తేశః = కుబేరుడను; వసూనామ్ = వసువులలో; పావకః = (పవిత్రము చేయు) అగ్ని; అస్మి = అగుచున్నాను; చ = మరియు;

**శిఖరిణామ్** = మంచు శిఖరములతో గూడిన పర్వతములలో; **మేరుః** = మేరువు; **అహమ్** = నేనే.

> రుద్రులలో శంకరుడను నేనే. యక్షులలో రాక్షసులలో కుబేరుడను నేనే. వసువులలో అగ్నిని నేనే. మంచుతో నిండిన శిఖరములు గల పర్వతములలో మేరువు నేనే (23).

పురాణములలో మరియు వేదములలో వర్ణింపబడిన ఏకాదశ రుద్రులను గురించి భగవానుడిపుడు చెప్పుచున్నాడు. వారిలో నేను శంకరుడను. ఆదిత్యులలో భరించి పోషించే విష్ణువు నేనేనని ఇంతకుముందు ఆయన చెప్పి యున్నాడు. రుద్రులలో సంహారకర్తయగు శంకరుడను నేనేనని ఇపుడు ప్రకటించుచున్నాడు. పరమేశ్వరుని శివరూపములో మోక్షమును గోరి ఆరాధించుట మన సంప్రదాయము. శివుడు అజ్ఞానమును, తత్కార్యములగు సంసారమును, మరియు దుఃఖమును నశింపజేయును. ఉపనిషద్ అను పదములో 'సద్' అను పదమునకు 'అవిద్యను నశింపజేసి (అవసాదయతి) సంసారమును విఘటితము చేయునది' అని అర్థము. దీనిలో వినాశము ఇమిడి యున్నది గాన, మోక్షకాములు సర్వదా శివుని ఆరాధించెదరు. శమ్ అనగా మంగళము, అనగా మోక్షము. అజ్ఞానమును నాశనము చేసి చరమ లక్ష్యమును ఇచ్చువాడు గనుక శివునకు శంకరుడను పేరు వచ్చినది (శం కరోతి).

''అహం విత్తేశః. నేను సంపదకు అధిష్ఠాన దేవతను.'' అనగా లక్ష్మి కాదు. లక్ష్మియే సంపద. ఆమె ఈశ్వరుని విభూతి. సంపద అనే దృష్టి కోణములో ఈశ్వరుని దర్శిస్తే, అపుడు ఈశ్వరుని శక్తియగు లక్ష్మియే ఈశ్వరుడు. కాని సంపదకు అధిష్ఠానదేవత కుబేరుడు. కావున ఇచట విత్తేశః అనగా యక్షులలో ఒకడగు కుబేరుడు. సంధ్యాపుత్రులగు దివ్యజీవుల రెండు సముదాయములకు యక్షులు, రక్షస్సులు అనిపేరు. 'వారిలో నేను కుబేరుడను.' ఎనమండుగురు వసుదేవతల సముదాయము మరియొకటి గలదు. 'వారిలో నేను అగ్ని దేవతను (పావకః)'.

తరువాత భగవానుడు పర్వతముల గురించి మాటలాడుచున్నాడు. పర్వతములలో రెండు రకములు గలవు. శిఖరములు గలవి (శిఖరిణః), మరియు శిఖరములు లేనివి (అశిఖరిణః). భగవానుడిచట శిఖరములు గల పర్వతములను ప్రస్తావించి, 'వాటిలో నేను మేరువును' అని చెప్పినాడు. దానికే ఇపుడు ఎవరెస్టు అని పేరు.

**...ంము 10, శ్లోకము 24:**

पुरोधसां च मुख्यं मां विद्धि पार्थ बृहस्पतिम् ।
सेनानीनामहं स्कन्दः सरसामस्मि सागरः ॥ २४॥

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్
సేనానీనా మహం స్కందః సరసామస్మి సాగరః (24)

పార్థ = ఓ అర్జునా!; మాం = నన్ను; పురోధసామ్ = పురోహితులలో; ముఖ్యమ్ = ...ుడగు; బృహస్పతిమ్ = బృహస్పతియని; విద్ధి = తెలుసుకొనుము; అహమ్ = నేను; ...నీనామ్ = సేనా నాయకులలో; స్కందః = కుమారస్వామిని; సరసామ్ = సరస్సులలో; ...రః = సముద్రుడను; అస్మి = అగుచున్నాను.

ఓ అర్జునా! నన్ను పురోహితులలో ప్రముఖుడగు బృహస్పతియని తెలుసుకొనుము. నేను సేనానాయకులలో కుమారస్వామిని. సరస్సులలో సముద్రుడను (24).

పురః అనగా భవిష్యత్తు. కాన పురోధస్ అనగా క్రతువులు మొదలగు వాటిని ఆచరింపజేసి ...ష్యత్తునకు పుణ్యమును సంపాదించుకొనుటలో సహకరించువాడు★. అనగా పురోహితుడు. ...రాజులు కూడా పురోహితులకు ప్రణమిల్లెదరు. అట్టి పురోహితులందరిలో చాలా గొప్పవాడు బృహస్పతి. ఆయన దేవతలకు ప్రభువు అగు ఇంద్రునకు గురువు. దేవతల ప్రభువగు ఇంద్రుడైననూ దేవలోక గురువగు బృహస్పతికి ప్రణమిల్లును. రాజ పురోహితులలో ముఖ్యుడగు ఆ బృహస్పతి నేనే.

సేనానీనామ్★★. సైన్యమును నడిపే సైన్యాధ్యక్షులలో నేను స్కందుడను. స్కందుడనగా సుబ్రహ్మణ్య భగవానుడు. ఆయన దేవ సేనాధిపతియని పురాణములలో వర్ణింపబడినది. ఆయనకు షణ్ముఖుడని పేరు. సర్వవిధముల భయమునుండి రక్షణ కొరకై ఆయనను ప్రార్థించెదరు. కావున

---

★ పురః అగ్రే (భవిష్యత్తులో), యజమానమ్ (వేదోక్తకర్మను చేయువానిని), దధాతి (పుణ్య సంపాదనలో సహాయతను చేయువాడు) ఇతి పురోధాః

★★ సేనాం నయతి స్వవశం ఆపాదయతి ఇతి సేనానీః

ఈ విభూతియందు ఈశ్వరుడు రక్షకుని రూపములో ఆరాధింపబడుచున్నాడు. స్కందుని మహిమ ఈశ్వర విభూతియే.

నీటిని నిలువ జేయు సరస్సులు రెండు రకములుగా నున్నవి: దేవకృతములు, మానవకృతములు. దేవకృతములగు స్థిరజలాశయములలో (సరసామ్) నేను సముద్రుడను. ప్రవహించు నదులు సరస్సులలో అంతర్గతము కావు. వాటిని ఆయన తరువాత ప్రస్తావించగలడు. కావున, స్థిరముగా నుండే సహజ జలాశయములలో విశాలమగు సముద్రము నేనే.

**అధ్యాయము 10, శ్లోకము 25 :**

महर्षीणां भृगुरहं गिरामस्म्येकमक्षरम्।
यज्ञानां जपयज्ञोऽस्मि स्थावराणां हिमालयः ॥ २५ ॥

మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః (25)

మహర్షీణామ్ = మహర్షులలో; భృగుః = భృగువు; అహమ్ = నేనే; గిరామ్ = వాక్కులలో; ఏకం అక్షరమ్ = ఒకే అక్షరము గల ఓంకారము; అస్మి = అగుచున్నాను; యజ్ఞానామ్ = యజ్ఞములలో; జపయజ్ఞః = జపము అనే యజ్ఞము; అస్మి = అగుచున్నాను; స్థావరాణామ్ = పర్వతములలో; హిమాలయః = హిమవంతుడు నేనే.

మహర్షులలో భృగువు నేనే. వాక్కులలో ఒకే అక్షరము గల ఓంకారము నేనే. యజ్ఞములలో జపము అనే యజ్ఞము నేనే. పర్వతములలో హిమవంతుడు నేనే (25).

ప్రాచీన మహర్షులలో భృగువు సర్వోత్తముడనే మాన్యత గలదు. తైత్తిరీయోపనిషత్తులో భృగువు ప్రస్తావింపబడినాడు. వరుణుని కుమారుడగు భృగువు తన తండ్రి వద్ద నుండి ఈ జ్ఞానమును పొందినాడు. ఈ భృగువు నేనే నని భగవానుడిచట చెప్పుచున్నాడు.

గీః అనగా వాక్కు. ఈ సందర్భములో గీః అనగా పదము అని శ్రీ శంకరులు వివరించిరి. అనేక భాషలలోని అనేకానేక పదములలో, సర్వమును తనలో ఇముడ్చుకున్న ఒకే అక్షరము గల

పదము ఒకటి గలదు. అదియే ఓమ్. ధ్వని విజ్ఞానము దృష్ట్యా ఓంకారము ఏ ఒక్క భాషకైననూ చెందినది గాదు. అది విశ్వజనీన శబ్దము. దానిలో అ, ఉ, మ అను మూడు భాగములు గలవు. ఎవ్వరైననూ నోటిని తెరుస్తూ చేయు శబ్దము అ. నోటిని మూస్తూ శబ్దము చేసినచో 'మ్' అను శబ్దము పుట్టును. నోటిని గుండ్రముగా చేసినచో అకారమే ఉకారముగా మారును. కావున సర్వమానవులలో సహజముగా పుట్టే శబ్దములు ఈ మూడే. మిగిలిన శబ్దములన్నియూ అకారము యొక్క వికారములు మాత్రమే. ఈ శబ్దముల కలయిక చేతనే పదములన్నియు పుట్టుచున్నవి. సర్వ భాషలలోని పేర్లు అన్నీ పదములే గదా! కావున, భగవానుని పేరు అగు ఓమ్ అనే ఏకాక్షరము పదములన్నిటికీ ప్రతీక. భగవానునకు అది మిక్కిలి సముచితమైన పేరు. లేనిచో, భగవంతునకు, పేరును ఇచ్చుట ఎట్లు సంభవమగును? భగవంతునకు ఒక విశిష్ట నామమును ఈయవలెనన్నచో, మిగిలిన నామముల నన్నింటినీ విడిచి పెట్టవలెను. అంటే, అవి భగవానుని పేర్లు కావా? భగవానునకు, ఇతరవస్తువులకు గల భేదమిదియే. 'జామపండు' అనగానే ఒక విశిష్ట వస్తువు నిర్దేశింపబడి, ఇతర ఫలములన్నియూ మాత్రమే గాక, ఇతర వస్తువులన్నియూ కూడా త్రోసి పుచ్చబడును. అదే విధముగా 'రామ' అనగానే కృష్ణుడు, శివుడు, నీవు ఇత్యాది సర్వులు బహిష్కరింపబడినారు. కావున భగవానుని నామము సర్వమును తనలో ఇముడ్చు కొనేదిగా ఉండవలెను. ఇందువలననే ప్రార్థనలలో మనము ఒక విశిష్ట నామమును 108 సార్లు జపిస్తాము. మనము సాధారణంగా పరిగణనలోనికి తీసుకోని కొన్ని అక్షర రూపములతో కలుపుకొని అకారము నుండి హకారము వరకు సంస్కృతములో 54 అక్షరములు గలవు. నామములన్నియూ భగవానుని నామములే. నామములన్నియూ పదములు తక్క వేరు గాదు. పదములు అక్షరముల కంటె వేరు గాదు. ఆరోహణ క్రమములో అక్షరములను లెక్కించి, తరువాత అవరోహణ క్రమములో లెక్కించినచో 108 అగును. పదములన్నియూ ఈ 108 లోనివే. కావున నీవు ఒక నామమును 108 సార్లు జపించినచో, భగవానుని నామములన్ని తెలిసిన వాటిని మరియు తెలియని వాటిని అన్నింటినీ ప్రతీకాత్మకముగా ఉచ్చరించినట్లు అగును. ఇది సంస్కృత భాషకు సంబంధించిన విషయము. ఇక ధ్వని విజ్ఞాన దృష్టితో చూస్తే సర్వ భాషలలోని సర్వశబ్దములు, నోటిని తెరిచే అకారమునకు, మూసే మకారమునకు మధ్యలో నుండును. ఉకారము ఆ రెండింటి మధ్యలోని ఇతర శబ్దము లన్నింటికీ ప్రతీక. వీటి కలయికయే ఓంకారము. ఓంకారములో నామములన్నియూ అంతర్గతమైనవి గనుక, ఓంకారము ఈశ్వరుని దృశ్యరూపమగు జగత్తును వ్యాపించి కప్పి వేయును. ఓంకారము నుచ్చరించిన పిదప ఉచ్చరించదగినది మిగలదు. అది భాషలకు అతీతమైన, ధ్వని విజ్ఞానమునకు సంబంధించిన ఈశ్వర సంకేతము.

భగవానుడు ఒక్కడు, అద్వితీయుడు. ఓంకారముచే నిర్దేశింపబడే సర్వభావములు

ఆయనయందు ఇమిడియున్నవి. కావున ఓంకారము ఏకము, అద్వితీయము. 'పదములలో ఓంకారము నేనే'. ఇందువలననే ఈశ్వరుని ధ్యానించుటకు ఓంకారము ప్రతీకగా స్వీకరింపబడినది.

అకారము జాగ్రత్ప్రపంచమునకు, ఉకారము మనోరాజ్యమునకు, మకారము అవ్యక్త స్థితికి ప్రతీక. ఓంకారము సృష్టితో ఆరంభమై బ్రహ్మలో లీనమగును. కావుననే ఓంకారము పరబ్రహ్మ ధ్యానమునకు శబ్దప్రతీకయై సహకరించును. మరియు ఓంకారము ద్వారా పరబ్రహ్మను మనము తెలియగల్గుతాము. ఈ విధముగా ఓంకారము పరబ్రహ్మను తెలిపే శబ్దముగా, మరియు ఈశ్వర ధ్యానమునకు శబ్దప్రతీకగా రెండు విధములుగా ఉపయోగపడును.

ఓమ్ అను పదమునకు సర్వమును భరించి పోషించి రక్షించునది అని అర్థము (అవతి రక్షతి). ఈ అర్థమును బట్టి ఓమ్ భగవానునకు పేరు అయినది.

వేద విహితములగు యజ్ఞములు ఎన్నియో గలవు. వాటిని అనుష్ఠించుటకు అనేక వస్తువులు ఆవశ్యకమగును. అగ్నిలో సమిధలను వ్రేల్చినపుడు మనకు తెలియకుండగా వాటిలో ఉండే కొన్ని సూక్ష్మజీవులు నశించును. యజ్ఞసామగ్రిని కొనుటకు ధనము కావలెను. ఆ ధనమును సమాజములోని ఇతరులతో పోటీపడి సంపాదించవలెను. ఆ ధనమును సంపాదించుటలో ఇతరులకు హాని కలుగవచ్చును. ఒక వ్యక్తి నష్టపోనిదే మరియొకడు సంపాదించుట సంభవము కాదు. ఈ విధంగా ఒక యజ్ఞమును చేసే ప్రక్రియ మనకు తెలియకుండగనే ఇతరులకు హాని కలుగుటకు సూక్ష్మజీవులు నశించుటకు కారణమగును. ఈ పాపములకు ప్రతీకారముగా మనము కొన్ని ప్రార్థనలను చేసెదము. సర్వప్రార్థనలు, యజ్ఞములు అంతఃకరణ శుద్ధికి సహకరించును. కాని వాటిలో మనసా భగవానుని నామమును ఆవృత్తి చేయుట అనే జపయజ్ఞము శ్రేష్ఠమైనది. ఏలయన, దీనిలో ఇతరులకు హానిగాని, హింసగాని లేదు. కావున వివిధయజ్ఞములలో, పాపసంపర్కము లేని జపయజ్ఞము నేనే.

స్థావరాణాం హిమాలయః. పర్వతములలో హిమాలయము నేనే. ఇచట భగవానుడు చెప్పుచున్న పర్వతములు శిఖరములు కలవి గాని, లేనివి గాని కావచ్చును. స్థావరమనగా కదలిక లేనిది. ఇట్టి స్థావరముల (పర్వతముల)లో నేను హిమాలయుడను. హిమము అనగా మంచు. ఆలయమనగా ఉండే స్థానము. పర్వతములలో హిమాలయమునకు ఒక ప్రత్యేకత గలదు. హిమాలయ పర్వతపంక్తి అతిశయించిన విస్తారము గలది.

ఉత్కృష్ట వ్యక్తులలో ప్రకటమయ్యే విభూతుల వర్ణనను భగవానుడింకనూ కొనసాగించుచున్నాడు. పురాణములలో మరియు శ్రుతులలో ప్రసిద్ధమైన వాటితో బాటు జగత్తులో లోక ప్రియములగు వస్తువులన్నిటినీ ఆయన ఎన్నుకొనెను. మానవులలో అర్జునుడను నేనే అని భగవానుడు తరువాత చెప్పగలడు. ఉత్కర్ష ఎచ్చట నున్ననూ, అది భగవానునకు మాత్రమే చెందును.

**అధ్యాయము 10, శ్లోకము 26:**

अश्वत्थस्सर्ववृक्षाणां देवर्षीणां च नारदः ।
गन्धर्वाणां चित्ररथस्सिद्धानां कपिलो मुनिः ॥ २६ ॥

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథస్సిద్ధానాం కపిలో మునిః (26)

సర్వవృక్షాణామ్ = వృక్షములన్నింటిలో; అశ్వత్థః = రావిచెట్టు నేనే; చ = మరియు; దేవర్షీణామ్ = దేవర్షులలో; నారదః = నారదుడను నేనే; గంధర్వాణామ్ = గంధర్వులలో; చిత్రరథః = చిత్రరథుడను నేనే; సిద్ధానామ్ = సిద్ధులలో; మునిః = మునియగు; కపిలః = కపిలుడను నేనే.

వృక్షములన్నింటిలో రావిచెట్టు నేనే. దేవర్షులలో నారదుడను నేనే.
గంధర్వులలో చిత్రరథుడను నేనే. సిద్ధులలో కపిలముని నేనే (26).

వేదమునందు, గీతయందు ప్రస్తావింపబడుటచే రావిచెట్టు లోక ప్రసిద్ధిగాంచినది. ఈ చెట్టు (అశ్వత్థము) సంసారమునకంతకూ ప్రతీక. వైదిక హవన క్రియలలో రావి సమిధలను వినియోగిస్తారు. సంతానమును గోరువారు ఆ వృక్షమును పూజించెదరు. రావి చెట్టుతోబాటు పెరిగే వేపచెట్టు దానికి భార్యయను నామడి గలదు. వివాహమైన దంపతులు సంతానమును గోరి ఈ రెండు వృక్షములకు కల్యాణమును చేస్తారు. ఈ విధంగా చెట్లలో రావి మిక్కిలి పవిత్రమైనది. దాని ప్రతి భాగము పూజింపబడును. అందువలననే, ఇచట భగవానుడు 'వృక్షములన్నింటిలో అశ్వత్థ వృక్షము నేనే' అని చెప్పుచున్నాడు. ఈ వృక్షమును గురించి ఒక శ్లోకము గలదు:

మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే। అగ్రత శ్శివరూపాయ వృక్షరాజాయ తే నమః॥

మూలమునందు బ్రహ్మ, మధ్యలో విష్ణువు, అగ్రమునందు శివుడు స్వరూపముగా గల శ్రేష్ఠ వృక్షమగు అశ్వత్థమునకు నమస్కారము.

తరువాత భగవానుడు ఋషుల గురించి చెప్పుచున్నాడు. ఋషులలో మనుష్య-ఋషులు, దేవ ఋషులు అని రెండు రకములు గలరు. ఋషి యనగా తెలిసినవాడు. ఋషులు వేద మంత్రముల నన్నిటినీ తమ బుద్ధియందు దర్శించెదరు గాన, వారికి మంత్ర ద్రష్టలను పేరు కూడ గలదు. ప్రతి మంత్రమునకు దానిని దర్శించే ఋషి ఒకడు ఉండును. ఉదాహరణకు, గాయత్రీ మంత్రమునకు ఋషి విశ్వామిత్రుడు. వేదములోని అన్ని భాగములకు ఋషులు గలరు. ఈ ఋషులందరిలో నేను నారదుడనని భగవానుడు చెప్పుచున్నాడు. పద్దెనిమిది పురాణములలో నారదుడు తరుచుగా తారసిల్లును. ఆ నారదునకు గల మహత్త్వము నేనే నని భగవానుడిచట చెప్పుచున్నాడు.

దేవతలలో అనేకరకములు గలరు. వారిలో గంధర్వులొకరు. వారు కళలను, సంగీతమును ప్రేమించెదరు. 'గంధర్వులలో చిత్రరథుడను నేనే'. కశ్యపుడనే గంధర్వరాజునకు గల పదునార్గురు కుమారులలో ఒకడగు చిత్రరథుడు గొప్ప కళాకారుడు.

పుట్టుక నుండియూ జ్ఞానులైనవారు సిద్ధులనబడుదురు. 'అట్టి సిద్ధులలో కపిలుడను నేనే'. కపిలుని అందమగు గాథ భాగవత పురాణములో గలదు. అతడు చిన్నవయసులో నే తన తల్లియగు దేవహూతికి బ్రహ్మవిద్యను బోధించెను.

**అధ్యాయము 10, శ్లోకము 27:**

उच्चैः श्रवसमश्वानां विद्धि माममृतोद्भवम्।
ऐरावतं गजेन्द्राणां नराणां च नराधिपम्॥ २७॥

ఉచ్చై(శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ (27)

**మామ్** = నన్ను; **అశ్వానామ్** = అశ్వములలో; **అమృతోద్భవమ్** = అమృతమథనము నందు పుట్టిన; **ఉచ్చై(శ్రవసమ్** = ఉచ్చై(శ్రవసమని; **విద్ధి** = ఎరుంగుము; **గజేంద్రాణామ్** = గొప్ప ఏనుగులలో; **ఐరావతమ్** = ఐరావతమని; **చ** = మరియు; **నరాణామ్** = మానవులలో; **నరాధిపమ్** = మహారాజుని; **విద్ధి** = తెలుసుకొనుము.

అశ్వములలో అమృతమథనమునందు పుట్టిన ఉచ్చైశ్రవసము, గొప్ప ఏనుగులలో ఐరావతము, మనుష్యులలో మహారాజు నేనే నని యెరుంగుము (27).

"గుఱ్ఱములలో ఇంద్రుని గుఱ్ఱమగు ఉచ్చైశ్రవస్సు నేనే". పురాణములలో ఒక ప్రసిద్ధ గాథ గలదు. దేవాసురులు అమృతము కొరకై క్షీర సముద్రమును మథించిరి. మందర పర్వతము కవ్వము కాగా, వాసుకి సర్పము త్రాడుకాగా దేవాసురులు సముద్రమును మథించిరి. ఈ మథనములో అనేక వస్తువులు బయటకు వచ్చెను. వాటిలో ఒకటి ఈ విశిష్టమగు అశ్వము. ఇది ఇంద్రునకు ఈయబడెను. అమృతము నిచ్చిన సముద్రము నుండి పుట్టుటచే, మరియు అమృతము కొరకు చేసిన మథనములో పుట్టుటచే దీనికి అమృతోద్భవమని పేరు. అమృతమనగా పాలు (క్షీరము). ఉద్భవమనగా దానినుండి పుట్టుట. అమృతోద్భవమనగా పాల (పాల సముద్రము) నుండి పుట్టినది.

'ఇరావాన్' నకు పుట్టిన తెల్లని ఏనుగునకు ఐరావతమని పేరు. ఇది కూడా అమృతము కొరకు చేసిన సముద్రమథనము నుండియే పుట్టినది. ఇరా అనగా నీరు. తద్వాన్ అనగా అది గలవాడు. కావున ఇరావాన్ అనగా నీరు గలది, అనగా సముద్రము. ఇరావాన్ నుండి పుట్టినది ఐరావతము. అది కూడా ఆ రకమునకు చెందిన ఒకే ఒక ఏనుగు. అది కూడా ఇంద్రునిదే. ఏనుగులలో ఐరావతము నేనే. మానవులలో ప్రజాపాలకుడను (నరాధిపః) నేనే. రాజాయొక్క సర్వాధికారములు, వైభవము నాకు సంబంధించినవియే. అతనిని రాజాను చేసిన కిరీటము నేనే.

**అధ్యాయము 10, శ్లోకము 28:**

आयुधानामहं वज्रं धेनूनामस्मि कामधुक् ।
प्रजनश्चास्मि कन्दर्पस्सर्पाणामस्मि वासुकिः ॥ २८ ॥

ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కందర్ప స్సర్పాణా మస్మి వాసుకిః (28)

ఆయుధానామ్ = ఆయుధములలో; అహమ్ = నేను; వజ్రమ్ = వజ్రము; ధేనూనామ్ = గోవులలో; కామధుక్ = (కోర్కెలను తీర్చు) కామధేనువును; అస్మి = అగుచున్నాను; చ =

మరియు; ప్రజనః = సంతాన హేతువు అగు; కందర్పః = మన్మథుడను; అస్మి = అగుచున్నాను; సర్పాణామ్ = సర్పములలో; వాసుకిః = వాసుకి; అస్మి = అగుచున్నాను.

> ఆయుధములలో వజ్రము నేనే. గోవులలో కామధేనువు నేనే. సంతాన హేతువు అగు మన్మథుడను నేనే. మరియు సర్పములలో వాసుకి నేనే (28).

వివిధ ఆయుధములలో వజ్రాయుధము నేనే. ఆయుధములలో కెల్లా అత్యధిక శక్తి గల వజ్రము దధీచి మహర్షి యొక్క ఎముకతో చేయబడినది. అది కూడా ఇంద్రునిదే. ఆయుధములలో కెల్లా అత్యధిక శక్తి గల వజ్రాయుధము నేనే.

పాలిచ్చే గోవులు అసంఖ్యాకంగా ఉన్నాయి. కాని కామధేనువు అడిగిన కోర్కెలన్నిటినీ దీర్చును. కావున వరదాతలలో కామధేనువు వంటి వారు లేరు. అది కూడా, సముద్రమును మథించుచుండగా పుట్టినదియే. అది వసిష్ఠ మహర్షికి చెందినది. దీని గురించి ఒక గాథ గలదు. విశ్వామిత్ర మహారాజా తన సైన్యముతో పరివారముతో అడవిగుండా పయనిస్తూ వసిష్ఠుని ఆశ్రమమునకు వచ్చెను. వసిష్ఠుడు చిన్న గుడిసెలో నివసించే వాడైనమా, కామధేనువు యొక్క దానశీలత వలన రాజునకు, అతని సైన్యమునకు విందును చేయగలిగెను. ఈ సంగతి తెలిసిన విశ్వామిత్రుడు కామధేనువును తనకిమ్మని కోరెను. ఆ గోవు బ్రాహ్మణునకు మాత్రమే లొంగునని వసిష్ఠుడు చెప్పెను. తాను బ్రాహ్మణుడ నగుదునని విశ్వామిత్రుడు ప్రతిజ్ఞ చేసెను. ఆ గోవు అతనికి దక్కలేదు. అతడు రజోగుణము గలవాడై కోపము, తృష్ణ ఇత్యాదులను కలిగియున్నంత వరకు ప్రయోజనమేమియూ లేకపోయెను. అంతలో గత్వా విశ్వామిత్రుడు జ్ఞానమును పొంది, సర్వమును త్యజించి, స్వయముగా మహర్షి అయెను. ఇది కామధేనువు గాథ. వరదాతలలో నేను కామధేనువునని భగవానుడు చెప్పుచున్నాడు.

ప్రజనః అనగా సంతానమునకు కారణమైన వ్యక్తి, లేక భావము. సంతానమును గన్న తల్లిదండ్రులలో ప్రేమదేవతయై వెలుగొందు కందర్పుడు అధి దైవము. ప్రజనః అనునది కందర్పునకు విశేషణము. ''సంతానమును గన్న తల్లిదండ్రులలో'' అని మనము అధ్యాహారము చేసుకోవాలి. సంతానమునకు కారణము తల్లి దండ్రులుగాదు. ప్రేమకు అధి దైవమగు కందర్పుడే కారణము. కందర్పుని మహిమ భగవానునిదే గాని, అతని స్వంతము కాదు.

విషసర్పములలో వాసుకి నేనే. అమృతము కొరకై చేసిన సముద్ర మథనములో వాసుకిని వినియోగించుటను మనము చూచియున్నాము. వాసుకి దేవలోకములో నుండే చాల పెద్ద పాము. దాని శ్వాస మాత్రముచే ప్రాణులు భస్మమగును. దాని పేరు చెప్తే భయము కలుగును. ఆ భయస్థానము మరియు ఆ విషము నేను తక్క మరియొకటి కాదు. నాకంటె భిన్నముగా ఏదీ లేదు.

**అధ్యాయము 10, శ్లోకము 29:**

अनन्तश्चास्मि नागानां वरुणो यादसामहम् ।
पितॄणामर्यमा चास्मि यमस्संयमतामहम् ॥ २९ ॥

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్
పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్ (29)

నాగానామ్ = అనేక తలల పాములలో; అనంతః = అనంతుడను; అస్మి = అగుచున్నాను; చ = మరియు; అహమ్ = నేను; యాదసామ్ = జలాధి దేవతలలో; వరుణః = వరుణుడను; చ = మరియు; పితౄణామ్ = పితృదేవతలలో; అర్యమా = అర్యముడను; అస్మి = అగుచున్నాను; అహమ్ = నేను; సంయమతామ్ = అనుశాసనమును పాటింపజేయువారిలో; యమః = యముడను.

అనేక తలల పాములలో అనంతుడను నేనే. జలాధి దేవతలలో వరుణుడను నేనే. పితృదేవతలలో అర్యముడను నేనే. అనుశాసనమును పాటింపజేయు శాసకులలో యముడను నేనే (29).

ఒక తల గల పాములు మాత్రమే గాక, అనేక తలలు గల పాములు కూడా పురాణములలో వర్ణింపబడినవి. అనేక శిరస్సులు గల పాములలో నేను అనంత ఆదిశేషుడను. శేషుడు విష్ణుభగవానుని గొప్ప భక్తుడు. ఆయనకు వేయి తలలు గలవు. ఆదిశేషుడు చుట్టుకొని యుండగా అతనిపై విష్ణుభగవానుడు నడుము వాలుస్తాడు. శేషుడు మొట్టమొదటి హంసతూలికా తల్పము.

యాదసామ్. గంగా యమునాది నదుల అధిష్ఠాన దేవతలలో నేను వరుణుడను. వరుణుడు జలాధి దేవత గనుక, నదులు మొదలగు అధిష్ఠాన దేవతలందరిలో ఆయన సర్వోత్తముడు. ఆయనకు గల మహిమ భగవానుని మహిమయే.

'పితృ దేవతలలో నేను అర్యముడను'. ధార్మిక జీవనమును గడిపిన వారు, కాని అగ్నిష్టోమాది వైదిక క్రతువులను ఆచరించలేక పోయినవారు అగ్నిష్వాత్తాది పితృదేవతలు అగుదురు. వారికి రాజు అర్యముడు. అర్యముని ఈ విభూతి భగవానునిదే.

పోలీసు, న్యాయ వ్యవస్థ మొదలైన చట్టమును అమలు చేసే వ్యక్తులలో నేను మృత్యు దేవతయగు యమధర్మరాజును. ఆయనను దాటి ఎవ్వరూ పోలేరు. మృత్యుదేవత అంటే అందరికీ భయమే. ఆయనకు గల శక్తి నేను తక్క వేరు గాదు.

**అధ్యాయము 10, శ్లోకము 30:**

प्रह्लादश्चास्मि दैत्यानां कालः कलयता महम्।
मृगाणां च मृगेन्द्रोऽहं वैनतेयश्च पक्षिणाम्॥ ३० ॥

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేంద్రో ఽహం వైనతేయశ్చ పక్షిణామ్ (30)

**దైత్యానామ్** = రాక్షసులలో; **ప్రహ్లాదః** = ప్రహ్లాదుడను; **అస్మి** = అగుచున్నాను; **చ** = మరియు; **అహమ్** = నేను; **కలయతామ్** = కాలమును గణించువారిలో; **కాలః** = కాలము; **చ** = మరియు; **మృగాణామ్** = వన్యమృగములలో; **అహం** = నేను; **మృగేంద్రః** = మృగరాజగు సింహము; **చ** = మరియు; **పక్షిణామ్** = పక్షులలో; **వైనతేయః** = గరుడుడను.

రాక్షసులలో ప్రహ్లాదుడను నేనే. కాలమును గణించు వారిలో కాలము నేనే. మరియు పక్షులలో గరుడుడు నేనే (30).

దితి యొక్క పుత్రులు దైత్యులు. వంశవృక్షమును తండ్రివైపునుండి గాని, తల్లివైపునుండి గాని స్వీకరించవచ్చును. ఇచట తల్లివైపునుండి స్వీకరించబడినది. కుంతియొక్క పుత్రుడు కౌంతేయుడు అనునది కూడా తల్లి వైపునుండి వంశ నామమును స్వీకరించిన దృష్టాంతమే. దితి కుమారు లందరు అసురులే. అసురులు, వారి సంతానము దైత్యులనబడుదురు. వారిలో అసురుని కుమారుడే అయినా భక్తుడు ఒకడు గలడు. అతడే ప్రహ్లాదుడు. అతని తండ్రియగు హిరణ్యకశిపుడు అతనిని భగవన్నామమును ఉచ్చరించవద్దని ఆజ్ఞాపించెను. అతని ఉపాధ్యాయులు అతనికి భగవద్విరోధమును బోధించే ప్రయత్నమును చేసిరి. అయినను అతడు నిరంతరముగా

భగవన్నామమును జపించెడి వాడు. హిరణ్యకశిపుని రాజ్యములోని ప్రజలందరు 'హిరణ్యాయ నమః' అను వాక్యమును జపించవలెనని రాజాజ్ఞ ఉండెను. కాని ఒక్క ప్రహ్లాదుడు మాత్రమే 'ఓం నమో నారాయణాయ' అంటూ నారాయణ జపమును చేసెడివాడు. ఒకనాడు అతని తండ్రి ఇట్లు ప్రశ్నించెను: 'నీ ఈ నారాయణుడు ఎక్కడ గలడు? ఈ స్తంభమునందున్నాడా?' ఆ బాల కుమారుడు 'ఉన్నాడు' అని చెప్పెను. అపుడు హిరణ్యకశిపుడా స్తంభమును తన్నెను. అతడు ఒకప్పుడు తపస్సు చేసి అమరత్వమును పొందే ప్రయత్నమును చేసెను. మానవుడు గాని, మృగము గాని నిర్దిష్ట ప్రదేశములలో సంహరించకుండునట్లు అతడు వరములను పొందియుండెను. ఆ స్తంభము పగిలి విష్ణు భగవానుడు సింహపు తల గల మానవ శరీరము (నరసింహ)తో బయటకు వచ్చెను. ఆయన పగలు, రాత్రి కాని సంధ్యాసమయములో వచ్చెను. ఆయన లోపలా, బయటా కాకుండగా గడపపై కూర్చుండెను. నేలపై హిరణ్యకశిపునకు మరణము లేదు. కనుక ఆయన వానిని తన ఒడిలో నుంచుకొని, అతనికి ఈయబడిన సమగ్రమైన వివిధ వరములకు భంగము వాటిల్లని విధముగా సంహరించెను. తరువాత ఆయన ప్రహ్లాదుని పట్టాభిషిక్తుని చేసెను. దైత్యులలో గొప్ప భక్తుడగు ఆ ప్రహ్లాదుడు నేనే.

జమా ఖర్చులను వ్రాసిపెట్టుకునే వారు చాలామంది గలరు. అట్టి గణకులలో కాలము నేనే. కాలము నిరంతరంగా ముందుకు సాగిపోతూ ఉంటుంది. కాలగణనను తప్పించుకొన గలది ఏదీ లేదు. అట్టి కాలము నేనే.

అడవిలో నివసించే మృగము లన్నింటిలో, మృగరాజగు సింహము (లేదా పెద్దపులి) నేనే. ఇతర మృగములకు వేటికీ సింహము భయపడదు. పెద్దపులి సింహపు పిల్లను చంపే అవకాశము గలదు. కాని అది ఏనాడూ తనంత తానుగా సింహముతో యుద్ధమునకు పూనుకొనదు. సింహమును చూచి సింహము పారిపోదు. కొన్ని సందర్భములలో సింహము ఏనుగును చూచి చికాకు పడవచ్చును. కాని దానికి ఏనుగు వలన భయము లేదు. సింహము ఏనుగును చంపగలదు. సింహములు లేకపోవుటచే కొన్ని అడవులలో పెద్దపులి రాజ్యమేలును. మృగమనగా వన్యజీవి. ఇచట భగవానుని తాత్పర్యమును మనము స్పష్టముగా తెలుసుకోవాలి. మృగరాజులో కానవచ్చు నిర్భయత్వము, శక్తి నేనే.

పక్షులలో నేను గరుడుడనని భగవానుడు తరువాత చెప్పుచున్నాడు. వినతకు గరుడుడు, అరుణుడు అను ఇద్దరు పుత్రులు గలరు. అందువలననే గరుడునకు వైనతేయుడని పేరు. ఆయన విష్ణు భక్తుడు. రాబందులు కూడ ఎగుర జాలని ఎత్తులో గరుడపక్షి ఎగురును. గరుడపక్షి మెడ

చుట్టూ తెల్లని చారను కలిగి గ్రద్దను పోలియుండును. గరుడ దర్శనము శుభ సూచకము. మిక్కిలి ఎత్తునకు ఎగురుట, అందముగా ఎగురుట అనునవి దాని ప్రత్యేక లక్షణములు. గరుడుని ఈ విభూతి నేను తక్క వేరుగాదని భగవానుడు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 10, శ్లోకము 31:**

पवनः पवतामस्मि रामश्शस्त्र भृतामहम् ।
झषाणां मकरश्चास्मि स्रोतसामस्मि जाह्नवी ॥ ३१ ॥

పవనః పవతామస్మి రామశ్శస్త్ర భృతామహమ్
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ (31)

**పవతామ్** = పవిత్రము చేయువారిలో; **పవనః** = వాయువు; **అస్మి** = అయి ఉన్నాను; **అహమ్** = నేను; **శస్త్ర భృతామ్** = ఆయుధ ధారులలో; **రామః** = శ్రీరాముడను; **ఝషాణామ్** = చేపలలో; **మకరః** = తిమింగలము; **అస్మి** = అగుచున్నాను, **చ** = మరియు; **స్రోతసామ్** = నదులలో; **జాహ్నవీ** = గంగానది; **అస్మి** = అగుచున్నాను.

పవిత్రము చేయువారిలో వాయువు నేనే. ఆయుధ ధారులలో నేను శ్రీరాముడను. చేపలలో తిమింగలము నేనే. మరియు నదులలో గంగానది నేనే (31).

పవనః అనునది వాయువునకు మరియొక పేరు. 'పవిత్రము చేయు వివిధవస్తువులలో (పవతామ్) నేను వాయువును'. వాయువు వాతావరణమును శుచిగా నుంచి ప్రాణశక్తిని ఇచ్చును. వాయువు చెట్లకు బొగ్గుపులుసు వాయువును, మానవులకు ప్రాణవాయువును ఇచ్చును. పవిత్రము చేసి ప్రాణశక్తినిచ్చే ఆ సామర్థ్యము నేనే.

ఆయుధములను ధరించి ప్రయోగించువారిలో నేను శ్రీరాముడను. రాముడు సాక్షాత్తు విష్ణువు యొక్క అవతారము. శ్రీరాముని రూపములో మర్త్యావతారుడైన విష్ణువునకు గొప్ప శౌర్యము ఉండెను. ఆయన ఒకే ఒక బాణముతో సముద్రమును ఎండింప జేయగలడు. ఆయన బాణములకు అమోఘమైన శక్తి గలదు. వాటితో ఆయన నమ్మ శక్యము గాని సాహస కార్యములను చేసినాడు. పరశురామ, బలరామ అను అవతారములు గూడ శక్తిమంతులు, మరియు రామ అను పేర

గలవారు అగుటచే, శ్రీ శంకరులు దాశరథీ రామః (దశరథ కుమారుడగు రాముడు) అని వాక్రుచ్చిరి.

ఝషాః అనగా చేపలు మొదలగు సముద్ర జీవులు. వాటిలో తిమింగలము నేనే. తిమింగలము ఎంతటి పెద్ద చేపలనైననూ మ్రింగివేయగలదు. దాని శరీరమంతా దంతములే గలవా యనిపించును. శరీర పరిమాణము, బలము, మరియు అందములలో తిమింగలము సాటి మరియొకటి లేదు. అది నీటిలో తిరుగాడే ఏనుగువంటిది. తిమింగలము యొక్క ఆ మహత్త్వము నేనే.

నదులలో గంగానది నేనే. గంగానదికి జాహ్నవి అను పేరు గలదు. గంగా జలము సర్వదా స్వచ్ఛముగా నుండును. గంగా జలములో సూక్ష్మ జీవులు (bacteria) జీవించలేవని చెప్పెదరు. అది సత్యము అయినా కాకపోయినా, ప్రతి హిందూ గృహములో గంగాజలముతో నిండియున్న ఒక చిన్న కుండ ఉండును. ఆ నీరు ఎన్నటికీ పాడుగాదు. గంగానది పుట్టిన పరిస్థితులను బట్టి, మరియు సాహచర్యము వలన, జ్ఞానమునకు ప్రతీకయైనది. గంగ శివుని శిరస్సునుండి వచ్చినదని చెప్పెదరు. గంగ జ్ఞానమునకు, పవిత్రీకరణకు నిధానమని వర్ణించే గాథలు వందలాదిగా గలవు. భారతదేశములో నదులన్నియూ పూజింపబడును. కాని గంగకు విశిష్ట స్థానము గలదు. అది కేవల జల ప్రవాహము మాత్రమే కాదు. అది జ్ఞాన స్వరూపము (జ్ఞాన గంగా). ఒక్కసారి స్నానము చేస్తే పాపములన్నియూ దూరమగునని చెప్పెదరు. గంగపై ప్రజలకు అంతటి శ్రద్ధ గలదు. గంగను ప్రజలు ఒక దేవతగా పరిగణించెదరు.

**అధ్యాయము 10, శ్లోకము 32:**

सर्गाणामादिरन्तश्च मध्यं चैवाहमर्जुन ।
अध्यात्म विद्या विद्यानां वादः प्रवदतामहम् ॥ ३२ ॥

సర్గాణామాదిరంతశ్చ మధ్యం చైవాహమర్జున
అధ్యాత్మ విద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ (32)

**అర్జున** = ఓ అర్జునా!; **సర్గాణామ్** = సృష్టులకు; **ఆదిః** = ఆరంభము; **చ** = మరియు; **అంతః** = అంతము; **చ** = మరియు; **మధ్యమ్** = మధ్యము; **ఏవ** = నిశ్చయముగా; **అహమ్** = నేనే; **విద్యానాం** = విద్యలలో; **అధ్యాత్మ విద్యా** = ఆత్మకు సంబంధించిన విద్య; **ప్రవదతామ్** = చర్చించువారి యొక్క; **వాదః** = తత్త్వ నిర్ణయమును ఇచ్చే చర్చ; **అహమ్** = నేనే.

ఓ అర్జునా! సృష్టుల ఆరంభము, అంతము మరియు మధ్యము కూడా నిశ్చయముగా నేనే. విద్యలలో ఆత్మ విద్య నేనే. చర్చించు వారియొక్క తత్త్వ నిర్ణయోప యోగియగు చర్చ నేనే (32).

ఇచట సర్గమనగా ఎటువంటి కార్యకలాపమైననూ కావచ్చును. మాటలాడుట, తినుట మొదలగు నీవు చేసే వివిధ కర్మలకు ఆది, మధ్యము మరియు అంతము నేనే. సృష్టి క్రియ, పాలించి పోషించు క్రియ, మరియు లయ క్రియ అనునవి క్రియలన్నింటిలో అతి ప్రముఖమైనవి. ఈ వాక్యమును మరియొక విధముగా అన్వయించ వచ్చును. ఒక పనిని చేయాలనే సంకల్పమే దానికి ఆరంభము అగును. సర్వక్రియల ఆదిలో గల సంకల్పము నేనే. క్రియను చేసే విధానము కూడా నేనే. క్రియాఫలము కూడా నేనే. నాకంటె భిన్నముగా ఏదీ లేదు.

వివిధ విద్యా భేదములలో ఆత్మస్వరూప బోధకమగు అధ్యాత్మవిద్య నేనే. ఆత్మ స్వరూపము నెరింగినచో సర్వమును ఎరింగినట్లే యగును. మానవుని అజ్ఞానము నుండి పూర్ణముగా విముక్తి చేయునది ఈ విద్య ఒక్కటి మాత్రమే. ఏలయన, నీవు అజ్ఞానివి కాదు. నీవు సచ్చిదానంద స్వరూపుడవు.

వాద జల్ప వితండములనే త్రివిధ చర్చా రూపములలో సత్యమును కనుగొనుటకు ఉద్దేశించిన వాదము నేనే. జల్పములో ఇద్దరు వ్యక్తులు తమ అభిప్రాయములను ఇతరునిచే ఒప్పించే ప్రయత్నమును చేయుచుందురు. ధార్మిక విశ్వాసము గల ఇద్దరు వ్యక్తుల మధ్య ప్రసంగము ఇటులనే యుండును. ఈ ప్రసంగమునకు తాత్పర్యము తన అభిప్రాయమును ఇతరునిపై రుద్దుటయే గాని, సత్యమును కనుగొనుట కాదు. వితండములో ఎదుటి వాడు చెప్పినది తప్పని నిరూపించుటయే ప్రధానోద్దేశ్యము. ఇది వ్యక్తుల మధ్య ఘర్షణ యగునే గాని, సత్యాన్వేషణ కాజాలదు. జల్పములో దురభిమానము, వితండములో దురహంకారము ప్రముఖ పాత్రను వహించును. మూడవది వాదము. ఇది సత్యమును కనుగొనుటకు ఉద్దేశించిన చర్చ. సత్యమును కనుగొను చర్చయే యథార్థమగు చర్చ. ఇట్టి వాదములలో సత్యవస్తువును కనుగొనే యత్నము జరుగును. సత్యవస్తువు ఈశ్వరుడు మాత్రమే. మిగిలిన రెండు రకముల చర్చలలో వ్యక్తుల అహంకారములు, మానసిక అస్పష్టతలు, భ్రాంతులు చోటు చేసుకొనును. వాటిలో సత్యమునకు స్థానము లేదు. వీటికి భిన్నంగా వాదము మనలను ఈశ్వర సాక్షాత్కారము వైపునకు గొని పోవును. అట్టి వాదము నేనే అని భగవానుడు చెప్పుచున్నాడు. 'ప్రవదతామ్' అను షష్ఠీ విభక్తికి 'యొక్క' అని యర్థము. చర్చలు చేయు వారియొక్క

(ప్రవదాతమ్) సత్యాన్వేషణా రూపమగు చర్చ (వాదము) నా స్వరూపమే. ప్రవదతామ్ అను పదములోని ప్ర అను ఉపసర్గను బట్టి, వీరు వాదమునందు మాత్రమే అభిరుచి గలవారనియు మిగిలిన రెండు రకముల చర్చలకు వీరు దూరమనియు సూచింపబడినది★

ఈశ్వర విభూతుల ప్రసంగమింకనూ కొనసాగుచున్నది. ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదు. అయిననూ జ్ఞానము, సౌందర్యము, శౌర్యము ఇత్యాది విషయములలో మహిమ ఎక్కడ కానవచ్చిననూ, అది ఈశ్వరునిదే యని దర్శించవలెను. ఈ నియమము వ్యక్తులకు మాత్రమే గాక, స్థలములకు కూడా వర్తించును.

పదములలో (గిరామ్) ఓంకారము నేనే. ధ్వని విజ్ఞాన దృష్టితో పరిశీలిస్తే, సర్వ భాషలలోని సర్వపదములు ఓంకారములో అంతర్గతమగునని మనము చూచియున్నాము. రూపము లన్నియు భగవానుని రూపములే. నామములన్నియు భగవానుని నామములే. కావున, భగవానునకు మిక్కిలి యుక్తమైన నామము ఓమ్. పదములలో పరమేశ్వర నామధేయమగు ఏకాక్షర ఓంకారము నేనే.

భగవానుడు ఇపుడు తరువాతి శ్లోకమును అరంభిస్తూ, అక్షరములలో కెల్లా మిక్కిలి ప్రధానమగు అక్షరమును గురించి మాటలాడుచున్నాడు.

**అధ్యాయము 10, శ్లోకము 33 :**

अक्षराणामकारोऽस्मि द्वन्द्वस्सामासिकस्य च।
अहमेवाक्षयः कालो धाताहं विश्वतोमुखः (३३)

అక్షరాణామ కారోస్మి ద్వంద్వస్సామాసికస్య చ
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః (33)

అక్షరాణామ్ = అక్షరములలో; అకారః = అకారము; అస్మి = అగుచున్నాను; చ = మరియు; సామాసికస్య = సమాస పదములలో; ద్వంద్వః = ద్వంద్వ సమాసము; అక్షయః =

---

★ ఈ భాగములో రెండు రకముల షష్ఠీ విభక్తులు ప్రయోగింపబడినవి. ఒకటి శేష షష్ఠీ. రెండవది నిర్ధారణ షష్ఠీ. శేష షష్ఠికి 'యొక్క' అనియు, నిర్ధారణ షష్ఠికి 'వాటిలో' అనియు అర్థము వచ్చును.

ప్రవాహనిత్యమగు; కాలః = కాలము; అహం ఏవ = నేనే; విశ్వతోముఖః = సర్వవ్యాపకుడగు; ధాతా = కర్మ ఫల ప్రదాత; అహం = నేనే.

> అక్షరములలో అకారము నేనే. సమాసములలో ద్వంద్వ సమాసము నేనే. ప్రవాహ నిత్యమగు కాలము నేనే. సర్వవ్యాపకుడగు కర్మఫల ప్రదాత నేనే (33).

అక్షరాణాం అహం అకారః అస్మి. అక్షరములన్నింటిలో అకారము నేనే. మొదటి అక్షరము అకారము. సర్వభాషలలోని అక్షరములు, మాండలిక ఉప భాషలన్నింటిలోని శబ్దములు అకారమనే మౌలిక ధ్వనియొక్క వికారములు మాత్రమే. కావున అక్షరము లన్నింటిలో మౌలిక తత్త్వము నేనే. ఆ మౌలిక ధ్వనిలోని మహిమ నేనే. స్వర పేటిక నుండి ఆ ధ్వని బయల్వెడలనిదే, భాష ఎట్లు సంభవమగును? ఈ సృష్టిలో సర్వకాలములయందు అతి శ్రేష్ఠమగు సంగీత ఉపకరణము మానవుని వాగింద్రియమే. సంగీత సాధనములన్నింటిలో స్వరములు ఉండును. కాని గీతములు, భావన మానవుని వాగింద్రియమునుండి మాత్రమే ఉదయించ గల్గును. మానవుని వాక్కులో మౌలిక ధ్వని అకారము. భగవానుడు అకార రూపములో ప్రకటమగుచున్నాడు. మిగిలిన ధ్వనులన్నియు దాని వికారములే. ఆ మౌలిక ధ్వని భగవానుడే గనుక, ధ్వనులన్నింటిలో భగవానుడు ఉన్నాడు. భగవానునకు దూరముగా ఏదీ లేదు.

భాషలన్నింటిలో సమాసపదములు గలవు. ఆంగ్ల భాషలో work-place (కార్యస్థలి), foot-path ( కాలిబాట) మొదలగునవి సమాస పదములే. అవి అన్నీ వాడుకలో తయారైనవి. కాని సంస్కృతములో నియమ బద్ధముగా సమాసములు తయారగును. కావున మనము సరిగా తయారుచేసి సమాసమును ప్రయోగిస్తే దానిని మరెవ్వరైననూ తెలుసుకొనగల్గుతారని సిద్ధాంతపరంగా (theoretically) చెప్పవచ్చును.

సంస్కృత భాషలో రెండు సుందర లాక్షణిక ప్రయోగములు గలవు. ఒకటి సమాసము. రెండవది నామవాచక వ్యుత్పన్నము (తద్ధిత). ఉదాహరణకు, ఆర్షము అనగా ఋషులకు సంబంధించినది అని యర్థము. వేదాంతము ఆర్షము. అది మరి ఎవ్వరికీ చెందినది గాదు. ఆర్షవిద్యా అనునది సమాస పదము. ఋషుల నుండి పుట్టిన (ఆర్ష) జ్ఞానము (విద్యా) అని దాని అర్థము.

ఒక దృష్టాంతముగా 'కటాక్ష కిరణా చాంతన మన్మోహబ్ధయే' అనే అందమగు సమాసమును

గమనించుడు. ఇది ఒకే పదము. కట,అక్ష, కిరణ, అచాంత, నమస్, మోహ, అబ్ధి అను పదములన్నియూ కలిసి ఈ పదము తయారైనది. అంతమునందు ఒకే ఒక ప్రత్యయము గలదు. మోహాబ్ధయే నమః. ఈ ఒక్క వ్యక్తికి నమస్కారము. కటమనగా కొన. అక్షమనగా కన్ను. కనుక కటాక్షమనగా కంటి కొనచూపు. నీవు కంటికొనగుండా ఒక వ్యక్తిని చూచినచో నీ చూపులోని కిరణములు అతనిని ప్రకాశింపజేయును. కావున కటాక్ష కిరణములనగా కంటిగొన చూపుయొక్క కిరణములు. ఈ కిరణములు సూర్యకిరణములు వలె సర్వమును ప్రకాశింప జేయుటయే గాక, ఎండింపజేయు శక్తిని కూడ కలిగి యుండును. ఈ కిరణములు దేనిని ఎండింప జేయును? మోహాబ్ధిని. మోహము అనగా అజ్ఞానము మరియు భ్రాంతి. అబ్ధి అనగా సముద్రము. అజ్ఞానము, భ్రాంతి అను సముద్రమును కంటికొనచూపుల కిరణములచే ఎండింపజేయునది ఎవరు? మరియెవరు? ఈశ్వరుడే. ఇతరుల చూపులు సముద్రమును ఎండింప జేయలేవు. ఇతరుల చూపులు కన్నీటి నైననూ ఎండింప చేయజాలవు. మనమిచట భగవంతుని తిన్ననైన చూపును కోరుట లేదు. ఒక్క ఓరకంటి చూపు చాలును. అనంతుడగు భగవానునకు నా దుఃఖము లెక్కలోనిది కాదు. కటాక్ష కిరణమనగా అనుగ్రహమే. భగవానుని కటాక్ష కిరణములు ఎవరి మోహ సముద్రమును ఎండింపజేయును? నమస్కృతానామ్. అయనను శరణు జొచ్చిన వారికి. అయన వద్దకు వెళ్లిన వారికి అయన చూపు లభించును. అట్టి భగవానునకు నమస్కారము. అనంతానంద కృష్ణాయ జగన్మంగళ మూర్తయే. ఇవి అన్నీ సమాసపదములే. కృష్ణుడు అనంతుడు, ఆనంద ఘనుడు. రాముడు మానవుడా యన్నట్లు ప్రవర్తించెను. కాని శ్రీ కృష్ణుడు అట్లుకాదు. ఆయన ఏనాడూ దుఃఖము నెరుంగడు. భగవానుడు ధర్మరూపములో మూర్తీభవించి రాముడైనాడు. ఆనందరూపములో మూర్తీభవించి కృష్ణుడైనాడు. ఆనందమునకు ఆకర్షణ గలదు. ఈ ప్రపంచములో ఆకర్షకమైనది ఆనందమొక్కటియే. ఆ ఆనందమే శ్రీకృష్ణుడు. ఎవని రూపము జగత్తునకు వరమో, అట్టి శ్రీకృష్ణుడు జగన్మంగళమూర్తి.

ఇంతకంటె పెద్ద సమాసములు కూడ గలవు. ఒకే సమాసములో ఎంతో అర్థమును ఇముడ్చవచ్చును. ఇది సంస్కృత భాషలోని సౌందర్యము. అవ్యయీ భావము, తత్పురుష, బహువ్రీహి, ద్వంద్వము అను నాలుగు ప్రధాన వర్గములుగా సమాసములను విభజించవచ్చును. అవ్యయీ భావ సమాసములో మొదటి పదము అవ్యయము, మరియు ప్రధానమైనది. ఉదాహరణకు, ఉపకుంభమ్ అనగా కుండకు సమీపములో. తత్పురుష సమాసములో అంత్య (ఉత్తర) పదము ప్రధానమైనది. ఉదాహరణకు, రాజపురుషః అనగా రాజాగారి సేవకుడు. బహు వ్రీహిలో సమాసములో లేని మరియొక పదార్థము ప్రధానమగును. ఉదాహరణకు 'ఏకకర్ణం అనయ

అను వాక్యమును పరిశీలించుడు. ఏక అనగా ఒకటి. కర్ణ అనగా చెవి. ఆనయ అనగా తీసుకొని రమ్ము. అనగా నీకు మున్ముందుగా కనబడే వ్యక్తి యొక్క చెవిని తెగగోసి తీసుకు రావలెనని యర్థమా? కాదు. ఏక కర్ణుడనగా ఒకే చెవిగల వ్యక్తి. ఇది బహువ్రీహి సమాసము. గీతలో అనేక సమాసములు ఈ కోవకు చెందినవియే. నాల్గవది ద్వంద్వము. ఇది విలక్షణమైన సమాసము. రామకృష్ణౌ అను సమాసములో ఏది ప్రధానపదము? రెండు పదములకు సమాన ప్రాధాన్యము గలదు. సమాసములో భగవానుని దర్శించవలెనన్నచో, ద్వంద్వమును విశ్లేషించవలెను. సమాసములలో అన్ని పదములకు సమ ప్రాధాన్యము గల ద్వంద్వ సమాసము నేనే. దీని అభిప్రాయ మేమనగా, భగవానుడు అన్నింటిలో సమముగా నున్నాడు. రాముడు భగవానుడు. కృష్ణుడు కూడా భగవానుడే. ఏలయన, భగవానుడు అన్ని ప్రాణులలో సమముగా నున్నాడు (సమోఽహం సర్వభూతేషు). ఈ సత్యము మనకు ద్వంద్వ సమాసములో పూర్ణముగా దర్శనమిచ్చును.

తరువాత భగవానుడు ఇట్లు చెప్పుచున్నాడు. : అహం ఏవ అక్షయః కాలః. కాల శబ్దమునకు రెండు అర్థములు గలవు. అక్షరములలో అకారము నేనే, చర్చించు వారిలో వాదము నేనే ఇత్యాదిగా మనమింతవరకు వరుసగా చూచియున్న నిర్ధారణ షష్ఠి ఈ వాక్యములో లేదు. ఈ వాక్యములో భగవానుడు షష్ఠీ సంబంధము లేకుండగా తన స్వరూపమును చెప్పుచున్నాడు. అక్షయమనగా అంతము లేనిది. ఒక రకంగా చూస్తే, కాలము నిరంతరంగా ప్రవహిస్తూ ఉండును. పరమాత్మ యందు కాలము లేదు అనునది యథార్థమే. కాని జగత్ అనే వ్యవస్థిత రచన (frame work) లో కాలము నిరంతరంగా ప్రవహించుచున్నది. వస్తువులన్నియూ కాలములో వచ్చి కాలములో పోవుచున్నవి. అట్టి ప్రవాహ నిత్యమగు కాలము నేనే.

శ్రీ శంకరులు ఇంకోరకంగా కూడా వ్యాఖ్యానించిరి. కాలాతీతమైన అక్షయకాల స్వరూపుడను నేనే. నానుండియే ఈ కాలము పుట్టినది. కాలము యొక్క సత్యము నేనే. కాలాతీతుడనగు నానుండియే కాలము పుట్టినది.

ధాతా అహం విశ్వతో ముఖః. అంతటా ముఖములు గలవాడు విశ్వతో ముఖుడనబడును. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు. ఆయన సర్వప్రాణులకు వారి కర్మల కనురూపముగా కర్మఫలముల నిచ్చును ( ధాతా ). ఆయన తనకు ఇచ్ఛవచ్చిన తీరున ఏకపక్షముగా ఫలములనిచ్చు నను కోరాదు. ప్రతి కర్మకు ఒక ప్రత్యేక ఫలమును ఈయవలెను. భగవానుడు అటులనే చేయుచున్నాడు. భగవానుని సృష్టి నియమములు ఫలముల నన్నిటిని ఉత్పన్నము చేయును. మంచి చెడు కర్మలన్నింటికి

భగవానుడు ఫలము నిచ్చును. ఆయన విశ్వతో ముఖుడు గనుక అట్లు ఇచ్చే అర్హత ఆయనకు గలదు. దీని అభిప్రాయమేమనగా భగవానుని కంటబడకుండా ఏ కర్మయు సంభవించదు. కావున ఫలములన్నీ తమ కారణమగు కర్మలకు అనురూపముగా నుండును.

సర్వము భగవానుని అభివ్యక్తి (manifestation) యే అయినా కొన్ని క్షేత్రములలో ఉత్కర్ష కానవచ్చును. ఆ క్షేత్రములలో మనము భగవానుని దర్శించవచ్చును. వస్తువును మాత్రమే దర్శించినచో, అంతకంటె విశిష్టమగు తత్త్వమును దర్శించలేక పోయెదము. కాని అదే వస్తువును భగవానుని విభూతి రూపముగా దర్శించు వ్యక్తి తనను పూర్ణ తత్త్వముతో కలుపుకున్న వాడగును. అట్లు గానిచో మనము వస్తువుతో విషయ విషయి సంబంధమును మాత్రమే కలుపుకొనుచుందుము. ఈశ్వరుని విభూతిని గుర్తించుట ద్వారా మనము వెంటనే పూర్ణుడగు భగవానునితో సంబంధమును పొందగల్గుదుము. కావున ఉత్కర్ష ఎక్కడ అభివ్యక్తమైననూ, అది భగవానునకు చెందినదేయని తెలుసుకొనుమని భగవానుడు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 10, శ్లోకము 34:**

मृत्युस्सर्वहरश्चाहमुद्भवश्च भविष्यताम् ।
कीर्तिः श्रीर्वाक् च नारीणां स्मृतिर्मेधा धृतिः क्षमा ॥ ३४ ॥

మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తిః శ్రీర్వాక్ చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా (34)

**సర్వహరః** = సర్వమును లాగుకొని పోయే; **మృత్యుః** = మృత్యువు; **చ** = కూడా; **అహం** = నేనే; **భవిష్యతామ్** = భవిష్యత్తులో కలుగబోవు వాటియొక్క; **ఉద్భవః** = ఉన్నతి మరియు ఉన్నతి కారణము; **చ** = మరియు; **నారీణామ్** = స్త్రీ లింగ శబ్దములలో; **కీర్తిః** = కీర్తి; **శ్రీః** = సంపద; **చ** = మరియు; **వాక్** = వాక్కు; **స్మృతిః** = స్మృతి; **మేధా** = జ్ఞానమును గ్రహించి ధరించే శక్తి; **ధృతిః** = ధైర్యము; **క్షమా** = క్షమా గుణము.

> సర్వమును అపహరించే మృత్యువు నేనే. భవిష్యత్తులో కలుగబోవు వాటియొక్క ఉన్నతి మరియు ఉన్నతి కారణము నేనే. స్త్రీలింగ శబ్దములలో కీర్తి, సంపద, వాక్కు, స్మృతి, మేధ (జ్ఞానమును గ్రహించి ధరించే శక్తి), ధైర్యము మరియు క్షమాగుణము నేనే (34).

ఒక వస్తువునకు అంతమును కలిగించునది మృత్యువు. మృత్యువు ద్వివిధమని శ్రీ శంకరులు వివరించిరి. సంపద, అధికారము, పదవి, భూములు, ధనము, ఇతర ఆస్తులు మొదలగు వాటిని అపహరించే మృత్యువునకు ధనహరమని పేరు. ప్రాణములను అపహరించే మృత్యువు ప్రాణహరము.

భగవానుడిచట ఏ రకం మృత్యువును గురించి చెప్పుచున్నాడు? భగవానుడు సున్పష్టముగా 'సర్వహరః' అని చెప్పినాడు. అగా సర్వమును అపహరించునది. మృత్యువు ధనము నపహరించినచో, ధనమును మరల ఎప్పుడైననూ సంపాదించవచ్చును. ఒక చో ధనమును సంపాదించక పోయినా, కొంత జ్ఞానమును సంపాదించి దాని మూలంగా ఆనందముగా జీవించవచ్చును. కావున మృత్యువు ధనము మొదలగు వాటిని అపహరించే పక్షంలో మన ఆనందమును అది ఏమియూ చేయలేదు. కాని మృత్యువు ప్రాణములను అపహరించినచో, మానవుడేమి చేయగలడు? కావుననే మృత్యువు సర్వహరమని వర్ణింపబడినది. సర్వం హరతి ఇతి సర్వహరః. అపహరించి గొనిపోవువాడు హరుడనబడును. హరశబ్దమునకు సర్వశబ్దము విశేషణము. అనగా సమస్తమును అపహరించి గొనిపోవువాడు. నాకంటె మృత్యువు వేరుగా లేదనియు, మృత్యుదేవత నేనే ననియు భగవానుడు చెప్పుచున్నాడు.

అనుశాసించే ప్రభువులను గూడ అనుశాసించే యమదేవతను నేనే (యమః సంయమతాం అహమ్) అని భగవానుడు ఇంతకు ముందు చెప్పియున్నాడు. యమ్ ధాతువునకు నియంత్రించుట అని అర్థము. యముని ఈ రూపము ఇంతకు ముందే వర్ణింపబడినది. సర్వమునకు అంతమును పలికే మృత్యుదేవత ఇచట చెప్పబడినది.

లేదా, ప్రళయ కాలములో సర్వమును తనలో లీనము చేసుకొనే లయకర్తయగు రుద్రదేవుడు నేనే. ''పాలించి పోషించు వాడను నేనే. సృష్టించు వాడను నేనే. సంహారకర్తను కూడా నేనే''. మహాప్రళయములో భగవానుడు సర్వమును నశింపజేసి తనలోనికి ఉపసంహరించును. అట్టి రుద్ర భగవానుడు నేనే నని భగవానుడిచట నిర్దేశించుచున్నాడు.

తరువాత ఉద్భవః అనగా అభీష్టములగు సంపదలు కలుగుట. శ్రీ శంకరులు అభ్యుదయః అని వ్యాఖ్యానించిరి. ఉల్లాసకరమగు అనుభవము గాని, సంపద మొదలగు వాటి వలన లభించే సుఖము గాని అభ్యుదయ మనబడును. మానవునకు అభీష్టములగు రెండు లక్ష్యములు గలవు. ఒకటి అభ్యుదయము. రెండవది నిశ్శ్రేయసము. నిశ్శ్రేయసమనగా మోక్షము. ఇది అభీష్టతమము. నిశ్శ్రేయసము కాని అభీష్టము అభ్యుదయమనబడును. అనగా ధర్మార్థకామములు

అభ్యుదయమగును. ఏలయన, ధర్మార్థకామములు అభీష్ట తమములు కావు. మోక్షము అభీష్టతమము (most desirable).

అభ్యుదయము మాత్రమే గాక, తత్కారణము కూడా నేనే. ధర్మము, పుణ్యము ఇత్యాదులన్నియూ నానుండియే పుట్టినవి. అవి మానవ నిర్మితములని భావించుట సరిగాదు. అవి నా కర్మ నియతిలో అంతర్భాగములు గనుక, నా నుండి మాత్రమే పొందబడు చున్నవి. నాచే సృష్టింపబడేది ఏదైనా నాకంటె భిన్నముగా లేదు. సర్వ మానవులచే ధర్మార్థకామ రూపముగా పొందబడే సర్వము నేనే. ఫలము నేనే. ఆ ఫలమును పొందించు కారణము నేనే. సాధన సాధ్యముల మధ్య గల సంబంధమును నేను సృష్టించితిని. కావున అభ్యుదయహేతువు నేనే.

ఉద్భవః భవిష్యతామ్. కొందరు భవిష్యత్తులో సంపదను పొందెదరు గదా! వారు పొందబోయే ఆ సంపద నేనే. ఈనాడు నేను పుణ్యమును సంపాదించితిని అని నీవు అనుకుంటావు. నీవు సంపాదించిన ఆ పుణ్యము నేనే. ఆ పుణ్యమును సంపాదించినది నీవు గాదు. సంపాదించే శక్తి గూడా నేనే. మరియు, స్త్రీలింగశబ్దములలో (నారీణామ్) కీర్తి, శ్రీ, వాక్, స్మృతి, మేధా, క్షమా అనునవి నేనే. కీర్తి యనగా ధర్మము వలన ప్రాప్తించిన మంచి పేరు. సంపద, ఆరోగ్యము, జ్ఞానము ఇత్యాది అభీష్టములన్నియు శ్రీ అనబడును. వాక్ అనగా హితము, సత్యము మరియు ప్రియము అగు వచనము. భగవానుడు ఉత్కృష్టమగు వాటి గురించి చెప్పుచున్నాడు గదా! కావున వాక్‌లో ఈ లక్షణములన్నియూ సమ్మిళితమై యుండును. గుర్తుంచుకునే సామర్థ్యమునకు స్మృతి అని పేరు. జ్ఞానమును గ్రహించి, నిలబెట్టుకొని మననము చేయు సామర్థ్యమునకు మేధాయని పేరు. మేధ యున్ననో స్మృతి కూడ ఉండును.

ధృతి అనగా ధైర్యము. క్షమా అనగా క్షమించే లక్షణము అని తరుచుగా అనువదిస్తారు. కాని క్షమా అనగా ఆందోళన పడకుండగా నుండగల్గుట. పొగడ్త లభించినా, నింద ఎదురైనా మనస్సులో చెప్పుకోదగ్గ మార్పు రాకుండుట క్షమ యగును. పొగిడితే పొంగిపోడు. తిడితే క్రుంగిపోడు. స్త్రీలింగశబ్దము లన్నింటిలో ఈ శబ్దములు నేనే.

మానవులలో కానవచ్చు యశస్సు ఇత్యాదుల లేశమైననూ భగవానుడే. కొద్ది సంపద కలిగి తాను కృతార్థుడనని మానవుడు తలంచును. అట్టి సంపద యొక్క లేశమైననూ భగవానుడే అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. ఒక వ్యక్తికి చక్కగా మాటలాడే సామర్థ్యము కొద్దిగా కలదనుకొనుడు. భోజనానంతరము అతడు ఏదో కొద్దిగా మాటలాడగానే, అందరు బాగున్నదని

చెప్తే అతడు చాల సంతోషిస్తాడు. అట్టి కీర్తి, శ్రీ, వాక్ మొదలగునవి నేనే. ఇవి అన్నియూ నాయందు పూర్ణముగా నున్నవి గనుక, ఇవి అన్నియూ నాకు చెందినవియే.

**అధ్యాయము 10, శ్లోకము 35:**

बृहत्साम तथा साम्नां गायत्री छन्दसामहम् ।
मासानां मार्गशीर्षोऽहमृतूनां कुसुमाकरः ॥ ३५ ॥

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్
మాసానాం మార్గ శీర్షో హమృతూనాం కుసుమాకరః (35)

**తథా** = అదే విధముగా; **సామ్నామ్** = సామలలో; **బృహత్సామ** = బృహత్సామ; **ఛందసామ్** = ఛందస్సులలో; **గాయత్రీ** = గాయత్రి; **అహమ్** = నేనే; **మాసానామ్** = మాసములలో; **మార్గశీర్షః** = మార్గశీర్షము; **అహమ్** = నేనే; **ఋతూనామ్** = ఋతువులలో; **కుసుమాకరః** = వసంత ఋతువు.

> అదే విధముగా సామలలో బృహత్సామ నేనే. ఛందస్సులలో గాయత్రి నేనే. మాసములలో మార్గశీర్షము నేనే. ఋతువులలో వసంత ఋతువు నేనే (35).

గానము చేయబడే మంత్రములకు సామలని పేరు. మంత్రములు వివిధ రీతులలో గానము చేయబడును. ప్రతి గానరీతికి ఒక పేరు గలదు. వాటిలో ఒకటి మిగతా వాటికంటె క్లిష్టమైనది, మరియు వాటి కంటె వినుటకు ఇంపైనది. దానిపేరు బృహత్సామ. కావున, సామవేద మంత్రములలో బృహత్ నేనే. కొన్ని మంత్రములు మాత్రమే ఆ విశిష్ట రీతిలో గానము చేయబడును. ఆ మంత్రములు గాన శైలితో కలిపి బృహత్సామ అనబడును.

వేదములో ఉష్ణిక్, అనుష్టుప్, త్రిష్టుప్ ఇత్యాది ఛందస్సులనేకము గలవు. 'వాటిలో గాయత్రి నేనే.' సాధారణంగా శ్లోకానికి 4 పాదములు, పాదమునకు 6 అక్షరములు ఉండును. అంటే శ్లోకములోని అక్షరముల సంఖ్య 24. వేదములో గాయత్రీ ఛందస్సునకు 3 పాదములు, పాదమునకు 8 అక్షరములు గలవు. అనగా అక్షరముల సంఖ్య (24)లో మార్పు లేదు.

గాయత్రీ మంత్రములో 'తత్సవితుర్వరేణ్యమ్' అనునది మొదటి పాదము. 'భర్గో దేవస్య

ధీమహి అనునది రెండవ పాదము. 'ధియో యో నః ప్రచోదయాత్' అనునది మూడవ పాదము. తత్ స వి తుర్ వ రే ణ్యమ్ భర్ గో దే వ స్య ధీ మ హి ధి యో యో నః ప్ర చో ద యాత్ అని వెరసి 24 అక్షరములు. వివిధ ఛందస్సులలో గాయత్రి నేనే.

ఇతర ఛందస్సుల కంటె గాయత్రి శ్రేష్ఠము ఎట్లు అగును? ఋగ్వేదములోని మొట్ట మొదటి మంత్రము గాయత్రీ ఛందస్సులో నున్నది. మరియు దేవతలందరికీ గాయత్రీ ఛందస్సులో ఒక్కొక్క మంత్రము గలదు.

ఇచట గాయత్రి యనగా లోకప్రియమగు గాయత్రీ మంత్రమేనని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. గాయత్రి ఛందస్సులో అనేక మంత్రములున్ననూ, గాయత్రీ మంత్రము అనే విశిష్ట నామము గల మంత్రము ఒక్కటియే గలదు. ఈ పదము 'రామ' అను పదము వంటిది. రామ శబ్దమునకు వ్యుత్పత్త్యర్థము (యోగార్థము) ఉన్ననూ, లోక ప్రియమగు అర్థము దశరథ పుత్రుడగు రాముడనియే. ఇట్టి ప్రసిద్ధమగు అర్థమునకు రూఢియని పేరు.

'గాంధీ' అనగానే మనకు తెలిసే గాంధీ ఒక్కరే. ఇతర గాంధీలు తమ అసలు పేరును గాంధీ పదమునకు విశేషణముగా జోడించాలి. అదే విధముగా గాయత్రి అనేది అనేక ఛందస్సులలో ఒకటి అయినా, దానికి లోక ప్రసిద్ధమగు మంత్రమునే అర్థముగా స్వీకరించవలెను.

## గాయత్రీ మంత్రార్థము

ఈ మంత్రము భగవంతుడే అనుటలో దాని లోకప్రియత ఒక్కటియే కారణము గాదు. బ్రహ్మ విద్య అంతయూ దాని అర్థములో ఇమిడి యున్నది. మనము దాని అర్థమును పరిశీలించెదము. భూః భువః సువః అను వ్యాహృతులు స్థూల సూక్ష్మ కారణ ప్రపంచములను మూడింటిని నిర్దేశించును. ఈ మూడు కలిసి ఓమ్ అగును. ఓమ్‌లో సర్వము గలదు.

తత్, అది (భగవానుడు). ఆరాధింపదగిన వాటిలో సర్వోత్తమమైనది వరేణ్యమ్ అనబడును. ధీమహి అనగా మేము సాధనా రూపముగా ధ్యానము చేయుచున్నాము. లేదా మేము గుర్తించు చున్నాము, తెలుసుకొనుచున్నాము. వాస్తవంలో మున్ముందు ఈ మంత్రమును సాధనగా జపిస్తారు. అది తెలిసిన తరువాత దాని అర్థమును నిధి ధ్యాసనము చేస్తారు. స్వయం ప్రకాశము (దేవస్య), సర్వజ్ఞము (సవితుః) అగు పరమేశ్వర తత్త్వమును మేము ధ్యానించెదము. సర్వజ్ఞ తత్త్వమునకు సవిత (సూర్యుడు) ప్రతీక. ఏలయన, సూర్యప్రకాశములో అజ్ఞాన విహ్నమగు

చీకటి లేశమైననూ లేదు. చంద్రునిలో మచ్చ గలదు. కాని సూర్యునిలో చీకటి మచ్చలు లేవు. అందువలననే, సూర్యుని యందు మానవులు సర్వదా భగవానుని దర్శిస్తారు. సర్వజ్ఞుడగు (భర్గః) ఆ భగవానుడు (యః), మా యొక్క (నః) బుద్ధులను (ధియః) ప్రకాశింపజేయుగాక, (ప్రచోదయాత్). ఇది ఒక ప్రార్థన. సర్వజ్ఞుడు, ఆత్మరూపుడు అగు భగవానుడు మా బుద్ధి వృత్తులను ప్రకాశింపజేయును అను అర్థముపై నిది ధ్యాసనమును చేసెదము.

ఈ గాయత్రీ మంత్రములో చాల గంభీరమగు అర్థము సార రూపముగా నున్నది. ఈ మంత్రమును తెలుసుకుంటే, వేదముల నన్నిటినీ చదివినట్లే అగునని పెద్దలు చెప్పెదరు. బ్రాహ్మణ కుటుంబములలో ఈ నాటికీ ఒక ఆచారమును పాటిస్తారు. ఉపనయనములో గాయత్రీ మంత్ర దీక్షను పొందిన బాలకుడు పెద్దలకు, లేక విద్వాంసులకు సాష్టాంగ ప్రణామము చేసి, లేచి నిలబడి, తనను తాను ఇట్లు పరిచయము చేసుకొనును: నేను ఫలానా ఋషి (భరద్వాజ ఇత్యాది) వంశములో జన్మించితిని. నేను ఫలానా ధర్మ సూత్రము (ఆపస్తంబసూత్ర, బోధాయన సూత్ర ఇత్యాది) ను అనుసరించి వివిధ కర్మలను చేయుచుందును. నేను ఫలానా వేదశాఖను అధ్యయనము చేసితిని (అహం యజుశ్శాఖాధ్యాయీ, ఋక్ శాఖాధ్యాయీ, సామశాఖాధ్యాయీ ఇత్యాది)''. ఆ కుర్రవాడు వేద పుస్తకమును తెరిచి చూచినవాడు కాక పోవచ్చును. కాని గాయత్రీ మంత్ర జపము ఏదో ఒక వేదమును అధ్యయనము చేసిన దానితో సమానమని పరిగణింపబడినది. 'నేను యజుశ్శాఖాధ్యాయిని' అని బాలుడు చెప్పిన మాట సత్యము కాదు. కాని ఆ బాలుడు గాయత్రీ ఉపదేశమును పొందినవాడు గనుక అతనికి అసత్య దోషము అంటదు. గాయత్రి జపించువానిని బ్రాహ్మణుని చేయును. బ్రాహ్మణుడనగా ఎవరో మనము చూచి యుంటిమి.

మాసములలో (మాసానామ్) మార్గ శీర్షము నేనే. ఈ మాసము పూర్తి కాగానే దక్షిణాయనము అంతమగును. ఈ మాసములో సూర్యుడు మకరరాశిలో నుండును. మార్గశీర్షమాసము (నవంబరు– డిశంబరు) జ్యోతిశ్శాస్త్ర రీత్యా ధార్మిక వ్రతములకు అనువైన కాలము. ఈ మాసమును శుభమాసము చేయు మహిమ నేనే.

ఋతువులలో వసంతము నేనే. వసంతములో వృక్షలతా గుల్మాదులన్నియూ ఆ సమయము కొరకై వేచియున్నవా యన్నట్లు ఒక్కసారి విరగబడి పూయును. పుష్పములకు నిలయమగు ఋతువు అగుటచే ఇది కుసుమాకరమనబడును. ఇంతే గాక ప్రధానమగు ఒక అగ్నిహోత్ర కర్మను ఈ ఋతువులో చేయవలెనని వేదము విధించుచున్నది (వసంతే వసంతే జ్యోతి షా యజేత).

**అధ్యాయము 10, శ్లోకము 36:**

**द्यूतं छलयतामस्मि तेजस्तेजस्विनामहम् ।**
**जयोऽस्मि व्यवसायोऽस्मि सत्त्वं सत्त्ववतामहम् ॥ ३६ ॥**

ద్యూతం ఛలయతామస్మి తేజస్తే జస్వినామహమ్
జయోస్మి వ్యవసాయోస్మి సత్త్వం సత్త్వవతామహమ్ (36)

**ఛలయతామ్** = మోసము చేయువాటిలో; **ద్యూతమ్** = జూదము; **అస్మి** = అగుచున్నాను; **అహమ్** = నేను; **తేజస్వినామ్** = తేజశ్శాలురలో; **తేజః** = తేజస్సు; **జయః** = (విజేతల) విజయము; **అస్మి** = అగుచున్నాను; **వ్యవసాయః** = (సుస్పష్ట జ్ఞానము గలవారి) నిశ్చయ బుద్ధి, **అస్మి** = అగు చున్నాను; **అహమ్** = నేను; **సత్త్వవతామ్** = సత్త్వ గుణ ప్రధానమగు స్వభావము గలవారి యొక్క; **సత్త్వమ్** = సత్త్వ గుణము.

మోసము చేయువాటిలో జూదము నేనే. తేజశ్శాలురలోని తేజస్సు నేనే. విజేతల విజయము నేనే. సుస్పష్ట జ్ఞానము గలవారి నిశ్చయ బుద్ధి నేనే. సత్త్వగుణ ప్రధానమగు స్వభావము గలవారి సత్త్వ గుణము నేనే (36).

ఛలమనగా మోసము. మానవులను భ్రష్టులను చేయువాటిలో ద్యూతక్రీడ నేనే. ద్యూత క్రీడలో ధర్మపుత్రుడు సర్వమును పోగొట్టు కొనెను. వేదము ద్యూత క్రీడను నిషేధించుచున్నది. పాచికలాడరాదు (అక్షైః మా దీవ్య) అని వేదము చెప్పుచున్నది. లేదా, మరియొక విధముగా చెప్పవచ్చును. ద్యూతములో విజయమును కలిగించే అదృష్టము నేనే.

ఏ విజ్ఞాన శాఖలో నైననూ ప్రతిభను కనబరుచువారిలోని ఆ ప్రతిభ నేనే. వారిలో ప్రతిభ ఎంత ఉన్ననూ, అది వారిది కాదు. పూర్ణ ప్రకాశము, పూర్ణశక్తి, అనంత జ్ఞానము గల ఆత్మ అనే మూలస్రోతస్సు నుండి వారు ప్రతిభాలేశమును పొందినారు. మానవుల యందు గల సర్వ ప్రతిభలు ఆ మూలస్రోతస్సునుండి ఉద్భవించినవే. ఈశ్వరాభిన్నమగు సచ్చిదానంద ఆత్మయందు సర్వము నిగూఢముగా నున్నది. ఒక విశిష్ట ఉపాధిలో అనంత ప్రతిభ ఉండజాలదు. ఏలయన మూల స్వరూపమందలి అనంత ప్రతిభ దాని వికారములలో కొంతవరకు మాత్రమే లభించును. ఆత్మ అనంతము గనుక, జీవుడు స్వరూపదృష్ట్యా ఈశ్వరుని కంటె వేరు గాదు. ఆ అనంత స్వరూపము పరిచ్ఛిన్నమగు ప్రతిభలకు అతీతమైనది.

కాని ఆత్మ వికారమగు అంతఃకరణములో పరిచ్ఛిన్నమగు తేజస్సు మాత్రమే ఉండగల్గును. కావున ఏకాలము నందైననూ ఏ అంతః కరణము నందైననూ కానవచ్చే తేజస్సు ఈశ్వరుని అభివ్యక్తి మాత్రమే. తేజశ్శాలురలోని తేజస్సు నేనే.

సత్త్వగుణ ప్రధానులగు వ్యక్తులలోని సత్త్వగుణము నేనే. ప్రతి మానవుడు సత్త్వరజస్తమోగుణముల కలయిక. ధ్యాన శీలము, విచారము, జ్ఞానము, ఉల్లాసము అనునవి సత్త్వగుణ కార్యములు. ఉన్నత పదాకాంక్ష, ఉత్సాహ శక్తి మొదలగునవి రజోగుణము వలన కలుగును. తమోగుణము జడత్వమునకు హేతువు. సత్త్వగుణ ప్రధానుడగు వ్యక్తి 'నేను సాత్త్వికుడను' అనుకోడు. అట్లు తలంచువాడు రజోగుణ ప్రధానుడగును. సత్త్వరజోగుణములు రెండు ఈశ్వర కార్యములే అయినా, సత్త్వము భగవానుని విభూతి. రజస్సు విభూతి కాదు. సత్త్వగుణాభివ్యక్తియగు ధ్యాన శీలము నా స్వరూపమేనని భగవానుడు చెప్పుచున్నాడు.

మనము ధ్యానమునకు ఉపకరించు వస్తువుల గురించి చర్చించుచున్నాము. కావున కల్యాణ గుణములన్నిటియందు మనము ఈశ్వరుని దర్శించెదము. సద్గుణము ఎచ్చట నున్ననూ అది భగవానుని విభూతి మాత్రమే. ఈ సత్యమును గుర్తించి ధ్యానించవలెను.

**అధ్యాయము 10, శ్లోకము 37:**

वृष्णीनां वासुदेवोऽस्मि पाण्डवानां धनञ्जयः ।
मुनीनामप्यहं व्यासः कवीनामुशना कविः ॥ ३७ ॥

వృష్ణీనాం వాసుదేవోస్మి పాండవానాం ధనంజయః
మునీనామప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః (37)

**వృష్ణీనామ్** = యాదవులలో; **వాసుదేవః** = వాసుదేవుడను (కృష్ణుడను); **అస్మి** = అగుచున్నాను; **పాండవానామ్** = పాండవులలో; **ధనంజయః** = అర్జునుడను; **అపి** = మరియు; **మునీనామ్** = మునులలో; **వ్యాసః** = వ్యాసుడను; **అహమ్** = నేనే; **కవీనామ్** = జ్ఞానులగు మహర్షులలో; **కవిః** = ద్రష్టయగు; **ఉశనా** = ఉశనుడను.

యాదవులలో వాసుదేవుడను ([illegible]డను) నేనే. పాండవులలో

అర్జునుడను నేనే. మునులలో వ్యాసుడను నేనే. జ్ఞానులగు మహర్షులలో ద్రష్టయగు ఉశనుడను నేనే (37).

నేను ఈశ్వరుడను. సర్వము నా స్వరూపమే అని భగవానుడు ఇంతవరకు చెప్పినాడు. భగవానుడిపుడు తాను అవతారమని చెప్పుచున్నాడు. ఒక స్థూల దేహముతో కూడియున్న భగవానునకు వాసుదేవుడు (వసుదేవుని కుమారుడు) అని పేరు.వృష్ణి వంశమునకు చెందిన యాదవులలో నేను వాసుదేవుడను (అహం వాసుదేవః). భగవానుడిచట కార్యకారణ సంఘాతముతో కూడియున్న వాసుదేవునిగా మాటలాడుచున్నాడే గాని, పరమేశ్వరునిగా కాదు. యాదవులలో శ్రీకృష్ణుడు అని గుర్తింపబడే దేహేంద్రియ మనస్సంఘాతము నేనే. శ్రీకృష్ణునియందు జ్ఞానము, శక్తి ఇత్యాదులు మహోత్కృష్టముగ నుండెడివి అని మనకు భాగవత మహాభారతములలోని ఆయన జీవిత గాథలో స్పష్టమగును. ఈ గ్రంథములను పఠించినచో ఆయన మహోన్నత పురుషుడని మనకు స్పష్టమగును. ఆ ఉత్కర్ష వలననే ఆ కార్యకరణ సంఘాతముతో ఆయన యాదవులలో ప్రత్యేక వ్యక్తిగా గుర్తింపబడినాడు.

'పాండు పుత్రులలో ధనంజయుడను నేనే'. అర్జునుడు అనేక రాజ్యములను జయించెను. సోదరులందరిలో ధనుర్విద్య, యుద్ధ నీతి ఇత్యాది విషయములయందు అతడు ముఖ్యుడనే మాన్యతను పొందియుండెను. శ్రీకృష్ణుడు అర్జునునితో 'నీవు నేనే' అని చెప్పుచున్నాడు. నీయందు గల పరాక్రమము, ప్రావీణ్యము ఈశ్వర (నా) విభూతి యొక్క అభివ్యక్తియే.

గీతను బోధించుటకు భగవానుడు అర్జునుని ఎన్నుకొనెను. ఆయన మరియొకనికి ఎవనికైనను బోధించి యుండవచ్చును. కాని అర్జునుడు అత్యధిక యోగ్యత గలవాడని ఆయన భావించెను. పైగా అర్జునుడు తనకు బోధించుమని కోరియుండెను.

'విద్వాంసులలో, ఋషులలో, ఆలోచించి ధారణ చేయగలిగే శక్తిగల వారిలో (మునీనామ్) నేను వేదవ్యాసుడను'. వ్యాసుడు నాల్గు వేదములను ఏర్చి కూర్చి వర్గీకరించుటయే గాక, మహాభారతమును, 18 పురాణములను రచించినాడు. వ్యాసునకు పూర్వము వేదము బహు విస్తారముగా నుండి మౌఖిక సంప్రదాయ పద్ధతిలో పరిరక్షించబడెడిది. వ్యాసుడు మంత్రములను నాల్గు వర్గములుగా విభజించి వాటి పరిరక్షణను సులభము చేసెను. ప్రతి కుటుంబము ఒక వేదమును రక్షించవలెను. ప్రతివ్యక్తి ఒక వేదమును అధ్యయనముచేసి తరువాతి తరమునకు అందియవలెననే నియమము కూడ గలదు. వ్యాసుడు ఇట్లు విభాగము చేసి వేదాధ్యయనమును సులభతరము

చేసెను. ఒక వేదమును అధ్యయనము చేయుటకు 12 సంవత్సరములు పట్టును. వ్యాసుడు సార్థక నామధేయుడు. వ్యాస శబ్దమునకు విభాగము చేయువాడు (విభజతే) అని యర్థము.

వేదాంత శాస్త్రము అను విషయ వస్తువును విశ్లేషణాత్మకముగా నిరూపించే బ్రహ్మ సూత్రములను కూడా ఆయనయే రచించెను. ఈ సూత్రములలో వేదాంత విరుద్ధములగు వాదనలు త్రోసిపుచ్చబడి వేదాంత దర్శనము సుస్థాపితమగును. ఈ రచన వలననే ఆయనకు సూత్రకారుడనే పేరు వచ్చినది. శ్రీ శంకరులు భాష్యకారులు. శివుని అవతారమే శ్రీ శంకరుడని, వ్యాసుడు నారాయణుని అవతారమని పరంపర గలదు. ఈ సంప్రదాయములో వీరిద్దరు సంయోజకులు గనుక, మనము వీరిద్దరికీ నమస్కరించెదము. ఈ తీరున మహర్షులలో వ్యాసునిది అగ్రస్థానము. ఆయన లేనిచో, మనకు ఏమియూ మిగిలెడిది గాదు. వైదిక సంప్రదాయములో ఆయన చాల ప్రముఖ వ్యక్తి.

భూత భవిష్యద్వర్తమాన కాలములను దర్శించ గలవాడు కవి యనబడును. బుద్ధి యొక్క పరిధికి అందని విషయములను కూడ దర్శించే సామర్థ్యము గల ఇట్టి వ్యక్తులలో నేను శుక్రాచార్యుడను( ఉశనా). శుక్రుడు అసురులందరికీ గురువు. వారికి ఏ సందేహము వచ్చినను శుక్రుని సంప్రదించెదరు. కాని వారాయన మాటను పాటించనివారై కష్టములను కొని తెచ్చుకునేవారు. ఉశనుడు నీతిశాస్త్ర (శుక్రనీతి) కర్తగా కూడ లోక ప్రసిద్ధిని గాంచినాడు.

**అధ్యాయము 10, శ్లోకము 39:**

दंडो दमयतामस्मि नीतिरस्मि जिगीषताम्।
मौनं चैवास्मि गुह्यानां ज्ञानं ज्ञानवतामहम्॥ ३८॥

దండో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్ (38)

దమయతామ్ = శాసకులలోని; దండః = అనుశాసనము; అస్మి = అగుచున్నాను; జిగీషతామ్ = విజయమును కోరువారిలోని; నీతిః = నీతి; అస్మి = అగుచున్నాను; గుహ్యానామ్ = రహస్యములలో; మౌనమ్ = మౌనము; అస్మి = అగుచున్నాను; చ ఏవ = మరియు; అహమ్ = నేను; జ్ఞానవతామ్ = జ్ఞానము గలవారియొక్క; జ్ఞానమ్ = జ్ఞానము.

శాసకులలోని అనుశాసనము నేనే. విజయమును కోరువారిలోని నీతి నేనే.
రహస్యములలో మౌనము నేనే. జ్ఞానులలోని జ్ఞానము నేనే (38).

అనుశాసనమును బలపూర్వకముగా పాటింపజేస్తూ, ఉల్లంఘించువారిని శిక్షించే వారిలోని (దమయతామ్) అనుశాసనము నేనే. నీవు స్వయం-అనుశాసనము గలవాడవైనచో, ఆ అను శాసనము నా స్వరూపమేనని భగవానుడు చెప్పుచున్నాడు. నీలో స్వయం-అనుశాసనము లేనిచో, బల పూర్వకముగ నైననూ దానిని పాటించుట మంచిది. అను శాసనమును బలపూర్వకముగ పాటింప జేయువాడను నేనే.

విజయమును గోరి దాని కొరకు పాటుపడు వారిలోని (జిగీషతామ్) న్యాయ బుద్ధి (నీతి) నేనే. మనము పొందే విజయము న్యాయసంరచనకు లోబడి ఉండాలి. అట్లు గానిచో, దానిని విజయముగా పరిగణించరాదు. పరిణతి చెందిన వ్యక్తి దృష్టిలో న్యాయమునకు తిలోదకములిచ్చి సంపాదించిన విజయము అర్థ రహితము. ఆతని దృష్టిలో సాధనమునకు సాధ్యముతో సమానమగు ప్రాముఖ్యము గలదు. నైతిక బలము లేని వ్యక్తికి సాధ్యము మాత్రమే ప్రముఖమగును. కాని విజయములో న్యాయము ప్రముఖముగ నుండుటయే గాదు: న్యాయము అత్యవసరము. విజేతలలోని విజయము నేనేనని భగవానుడిదివరలో చెప్పియున్నాడు. విజయము ఉన్నచోట, ఆ విజయమును సాధించి పెట్టిన నీతి నేనేనని భగవానుడిచట చెప్పుచున్నాడు.

రహస్యములలో మౌనము నేనే. రహస్యమును రక్షించుటకు వినియోగించే యుక్తులన్నింటిలో మౌనము ఉత్తమోత్తమమైనది. మనము ఇతరునితో చెప్పిన రహస్యము అంతటా తిరిగి తిరిగి రూపు మారి మరల మన వద్దకు చేరుకొనును. కాని రహస్యమును పరిరక్షించే సర్వోత్తమమగు ఉపాయము ఒకే ఒకటి గలదు. అదియే మౌనము.

ఆత్మజ్ఞానము గలవారి ఆత్మ స్వరూపమగు జ్ఞానము నేనే. జ్ఞానము వేరు, ఈశ్వరుడు వేరు గాదు. ఈశ్వర స్వరూపమగు జ్ఞానము నేనే.

**అధ్యాయము 10, శ్లోకము 39 :**

यच्चापि सर्वभूतानां बीजं तदहमर्जुन ।
न तदस्ति विना यत् स्यान्मया भूतं चराचरम् ॥ ३९ ॥

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున
న తదస్తి వినా యత్ స్యాన్మయా భూతం చరాచరమ్ (39)

**చ** = మరియు; **సర్వభూతానాం అపి** = సర్వప్రాణులకు కూడా; **యత్** = ఏ; **బీజమ్** = కారణము గలదో; **తత్** = అది; **అహమ్** = నేనే; **అర్జున** = ఓ అర్జునా!; **యత్** = ఏది; **మయా వినా** = నేను లేకుండగా; **స్యాత్** = ఉండగల్గునో; **తత్** = అట్టి; **చరాచరమ్** = కదలాడే మరియు కదలాడని, లేదా చేతనము మరియు జడము అగు; **భూతమ్** = ప్రాణి / పదార్థము; **న అస్తి** = లేదు.

> మరియు సర్వప్రాణులకు ఏ కారణము గలదో, అది నేనే. ఓ అర్జునా! కదలాడేది, కదలాడనిది, చేతనము లేదా జడము అగు ప్రాణిగాని, పదార్థముగాని నేను లేకుండగా మనగలిగేది లేదు (39).

బీజమ్ అనగా విత్తనము. కాని ఈ పదమును కారణము అనే అర్థములో తరచుగా వాడెదరు. వృక్షమునకు కారణము విత్తనము గదా! అందుచేత, లక్షణావృత్తిచే ఈ పదమును కారణము అనే అర్థములో సాధారణంగా వాడెదరు. కారణములు, కార్యములు అనేకములు గలవు. 'బీజానాం మధ్యే' అను పదమును అధ్యాహారము చేసుకోవాలి. సర్వప్రాణులకు, సర్వ పదార్థములకు గల వివిధ కారణములలో మూలకారణము నేనే. భూత శబ్దమునకు ఆకాశ, వాయు, అగ్ని, ఆపః, పృథివీ అను పంచభూతములు అని గాని, లేదా ప్రాణులు అనిగాని అర్థమును చెప్పవచ్చును. వీటన్నింటి యొక్క బీజము నేనే. అనగా, ఒక్క మాటలో చెప్పాలంటే జగత్కారణము నేనే.

ఏదేని ఒక కారణమును పరిశీలించుడు. అది దాని కార్యము దృష్ట్యా మాత్రమే కారణమగును. ఇంకో దృష్టికోణంలో చూస్తే అది తన కారణము నుండి పుట్టిన కార్యమే యగును. కావున యథార్థమగు బీజము ఏది? నేనే అని భగవానుడు చెప్పుచున్నాడు. ఆత్మకంటె వ్యతిరిక్తముగా ప్రకృతికి ఉనికి లేదు. సర్వమునకు ఉపాదాన కారణము నేనే (ప్రకృతిః అహం అస్మి).

భగవానుడిపుడు భగవద్విభూతి అను విషయమును సారరూపముగా చెప్పి ఉపసంహరించుచున్నాడు. నేను లేనిది ఏదీ లేదు. కదిలేది గాని, కదలనిది గాని నేను లేనిది ఏదీ లేదు (న తత్ అస్తి వినా యత్ స్యాత్ మయా భూతం చరా చరమ్). సృష్టి సర్వము కదిలేవి, లేదా కదలనివి అని రెండు భాగములుగా విభజింపబడి యున్నది. ఇది ఒక వ్యాఖ్యానము. లేదా

చరములనగా చేతనములు. అచరములనగా అచేతనములని చెప్పవచ్చును. అచర శబ్దమునకు కదలనిది అని అర్థమును చెప్పినచో, చేతనమగు వృక్షము కూడా అచరమే యగును. ఏ అర్థమును చెప్పినా, భగవానుడు లేని వస్తువునకు ఉనికియే లేదు.

సద్రూపుడగు పరమేశ్వరుడు సర్వమునకు అభిన్న నిమిత్తోపాదాన కారణమై యుండగా, ఏ వస్తువు తన ఉపాదాన కారణమునకు దూరముగా మనగలదు? సద్రూపుడనగు నేను లేని వస్తువు నిరాత్మకము, శూన్యము అగును. దానికి ఉనికియే ఉండదు. ఉనికి గల వస్తువు ఏదైనా స్వకారణమగు ఉనికి కంటె భిన్నముగా మనజాలదు. సర్వకార్యములు కారణముపై పూర్ణముగా ఆధారపడియుండును. అంతిమకారణము ఈశ్వరుడు.

భగవంతుడింతవరకు తన విభూతులనేకరువు పెట్టినాడు. కాని ఈ జాబితాకు అంతము లేదు. కావున, దీనిని కొనసాగించుట సంభవము కాదని భగవానుడు చెప్పవలసిన సమయమాసన్నమైనది.

**విభూతులవన్నిటిని నిర్దేశించుట అసంభవము**

**అధ్యాయము 10, శ్లోకము 40:**

नान्तोऽस्ति मम दिव्यानां विभूतीनां परन्तप।
एष तूद्देशतः प्रोक्तो विभूतेर्विस्तरो मया॥ ४०॥

నాంతోస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా (40)

పరంతప = ఓ అర్జునా!; దివ్యానామ్ = దివ్యములగు; మమ = నా యొక్క; విభూతీనామ్ = విభూతులకు; అంతః = అంతము; న అస్తి = లేదు; తు = కాని; ఏషః = ఈ; విభూతేః = విభూతియొక్క; విస్తరః = విస్తారము; మయా = నాచేత; ఉద్దేశతః = కొన్ని ప్రముఖమైన వాటిని పరిగణించి; ప్రోక్తః = చెప్పబడినది.

ఓ అర్జునా! నా దివ్య విభూతులకు అంతము లేదు. కాని నేను ప్రముఖమైన వాటిని పరిగణించి ఈ విభూతియొక్క విస్తారమును వర్ణించితిని (40).

శత్రువులను సర్వదా జయించువాడా! (పరంతప) అని శ్రీ కృష్ణుడిచట అర్జునుని సంబోధించుచున్నాడు.

ఓ అర్జునా! ఈ విభూతులు లోకములో తేలికగా కానరావు. నా దివ్య విభూతులకు (దివ్యానాం విభూతీనామ్) అంతము లేదు (న అంతః అస్తి). వాటికి అంతము లేనే లేదు గనుక నేను ఈ జాబితాను ఆపాలి. కావున ఇచట ఆపుచున్నాను.

నా అనంత విభూతుల సంగ్రహ స్వరూపమును మాత్రమే నేనిచట చెప్పియున్నాను. ఈ జాబితా అనంతము గనుక పూర్తి వివరముల వర్ణన ఎన్నటికీ పూర్తి కాదు. నేను ఏవో కొన్నిటిని మాత్రమే చెప్పగల్గుదును.

అట్లైనచో, ఈ వర్ణనను మొదలిడుటకు కారణమేమి? భగవద్విభూతులను గురించి అవగాహనను కలిగించుట మాత్రమే భగవానుని తాత్పర్యము. విభూతుల జాబితాను నింపుట తాత్పర్యము కాదు. ఉత్కర్ష ఎచ్చట నున్ననూ అది యథార్థముగా నా ఉత్కర్షయేనను సత్యమును నీవు తెలుసుకోవాలని నా ఆకాంక్ష. ఇంతవరకు వర్ణించిన విభూతులకు తాత్పర్యమేమనగా, ఒక సామాన్య నియమమును నిరూపించవలసి యున్నది. ఆ నియమము తరువాతి శ్లోకములో చెప్పబడును.

**అధ్యాయము 10, శ్లోకము 41:**

यद्यद्विभूतिमत्सत्त्वं श्रीमदूर्जितमेव वा ।
तत्तदेवावगच्छ त्वं मम तेजोंश संभवम् ॥ ४१ ॥

యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జితమేవ వా
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంశ సంభవమ్ (41)

**యత్ యత్** = ఏయే; **సత్త్వమ్** = ఉనికిగల పదార్థము; **విభూతి మత్** = విభూతిని కలిగియున్నదో; **శ్రీమత్** = సంపదను లేక విలువను ఏదో ఒక రూపములో కలిగియున్నదో; **వా** = లేదా; **ఊర్జితం ఏవ** = శక్తిశాలి లేదా విఖ్యాతమైనది; **తత్ తత్** = అయ్యది; **మమ** = నా యొక్క; **తేజోంశ సంభవమ్** = తేజస్సులోని ఒక అంశమునుండి పుట్టినది అని; **త్వం** = నీవు; **ఏవ** = నిశ్చయముగా; **అవగచ్ఛ** = తెలుసుకొనుము.

ఉనికి గల ఏయే పదార్థము విభూతిని గాని, ఏదో ఒక రూపములో సంపద లేక విలువను గాని కలిగి యున్నదో, లేక శక్తిశాలి, విఖ్యాతము అయి ఉన్నదో, అయ్యది నా తేజస్సులోని ఒక అంశము నుండి పుట్టినదని నిశ్చయముగా తెలుసుకొనుము (41).

జ్ఞానము, అధికారము, సౌందర్యము, కొంత ఉత్కర్ష, నిపుణత, ఏదో కొంత కీర్తి మొదలుగా గల విభూతిని కొద్దో గొప్పో కలిగియున్న, ఉనికి గల వస్తువు ఏదైననూ శ్రీమత్ అనబడునని భగవానుడు చెప్పుచున్నాడు. ఆకర్షణ, లేదా కాంతి శ్రీ యనబడును. నీతి, కీర్తి, ధనము, ధాన్యము, సంతానము, గృహమునందలి సుఖము, అంతా బాగుంది అనే మానసిక భావన (సౌభాగ్యము), వరము, జ్ఞానము అనునవి అన్నియూ శ్రీ శబ్దవాచ్యములే. శ్రీమత్ అనగా శ్రీని కలిగియున్న వస్తువు. శ్రీమత్ శబ్దము వాస్తవంలో సర్వ విభూతులను నిర్దేశించగల్గును.

శక్తివంతమైనది, లబ్ధ ప్రతిష్ఠమైనది, మరియు బలముగా ఆకర్షించునది ఏదైనా ఊర్జితమనబడును.

ఇట్టి పదార్థము లన్నియూ (తత్తద్ ఏవ) నా తేజస్సుయొక్క అంశము నుండి జన్మించినవి మాత్రమేనని తెలుసుకొనుము (అవగచ్ఛ). ఇచట తేజస్సు అనగా భగవానునిలోని భగశబ్దార్థము. ఈశ్వరుని ఆరు గుణములకు భగమని పేరు. అవి : పూర్ణ సంపద (శ్రీ), పూర్ణ అధీశ్వరత్వము (ఐశ్వర్యము), పూర్ణకీర్తి (యశస్), పూర్ణమగు విరక్తి (వైరాగ్య), అనంతమగు ఎరుక (జ్ఞానము), అనంత శక్తి, సృష్టిస్థితిలయ సామర్థ్యము (వీర్య). మనము వీటిని ఇదివరలో చూచియున్నాము.

పరమేశ్వరుని అనంత ఐశ్వర్యమును క్లుప్తముగా విభాగము చేయు ప్రయత్నమే ఈ భగమనబడే షడ్గుణ–ఐశ్వర్యము. దీని నుండియే విభూతులన్నియూ ఉద్భవించినవి.

ఈ విభూతులన్నియూ నా తేజస్సు యొక్క లేశమునుండి మాత్రమే ఉద్భవించినవి. ఇవి తేజస్సునుండి పుట్టలేదు. భగవానుని అనంత తేజస్సు యొక్క అంశమునుండి పుట్టినవి. ఈశ్వరుని అంశము మాత్రమే ఈ విభూతులన్నింటిలో వ్యక్తమగుచున్నది. వాస్తవంలో ఈ జగత్తు అంతయూ ఈశ్వరుని ఒక అంశము మాత్రమే. భగవానునిలో అంశములు లేక పోయిననూ, మాయచే నానారూపములుగా భాసించుచున్నాడు. ఉదాహరణకు, ఆకాశము నిరవయవము. కాని ఘటాకాశము, మఠాకాశము ఇత్యాదిగా విభజింపబడినట్లు కానవచ్చును. ఈ విభాగములన్నియు మహాకాశములో అంశములా యున్నట్లు భాసించుచున్నది.

తాత్పర్యమేమనగా, ఈ జగత్తులోని సర్వము మాయచే కల్పించబడినది (మాయయా కల్పితమ్). అర్జునా! ప్రతి వ్యక్తి యూ నా విభూతియొక్క లేశమునుండి జన్మించినాడు. దీనికి అపవాదము లేదు. నీవీ సత్యము నెరుంగుము.

## ఉత్కర్షలేని వస్తువులు ఈశ్వరుడు కాదా?

లేశమైననూ ఉత్కర్షగల వస్తువులన్నియు భగవానుని విభూతి లేశమునుండి పుట్టినవి; అనగా అవి పరమేశ్వరుని పూర్ణ ఐశ్వర్యము (భగ) యొక్క లేశమాత్రపు అభివ్యక్తి మాత్రమే అని మనము చూచియున్నాము. కాని ఇచట ఒక సమస్య గలదు. మిగిలిన వస్తువులన్నింటి మాట యేమి? లెక్కలేనంత మంది పుడుతూ గిడుతూ ఉంటారు. వారి దగ్గర బంధువులు తక్క ఇతరులు వారి నామములనైననూ స్మరించరు. ప్రతి తరములో కోట్లాది మానవులు జీవించి ఉంటారు. ప్రపంచములో వస్తువులు, పశువులు ఇత్యాదులు అసంఖ్యాకముగా గలవు. వాటి నామము లైననూ ఎవ్వరికీ తెలియవు. ప్రత్యేకమైన ఉత్కర్ష అనే గుర్తింపు వాటికి లేదు. అవి భగవానుని తేజస్సు (భగ) నుండి పుట్టినవి కావని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడా?

జ్ఞానము, సంపద, అధీశ్వరత్వము, శక్తి, యశస్సు మరియు వైరాగ్యము అనే షడ్గుణముల పూర్ణ ఐశ్వర్యములోని ఒక లేశమునుండి ఈ విభూతులు పుట్టినవని చెప్పుటకు ప్రయోజనము ఒక్కటియే. ఆదిత్యుడు మొదలగు విశిష్ట రూపములలో భగవానుని ధ్యానించవలెను. మనమీ విషయమును స్పష్టముగా నెరుంగవలెను. ఇది ఒక వ్యాఖ్యానము.

మరియొక వ్యాఖ్యానము ఇట్లున్నది. విభూతి ఎచట ఉన్ననూ, అది ఈశ్వరుని విభూతియే అను సామాన్యనియమమును ప్రతిపాదించుటయే ఈ శ్లోకముల తాత్పర్యము. ఏ వ్యక్తియైననూ ఒక ఉపలబ్ధిని గురించి 'ఇది నాది' అని చెప్పుట యుక్తియుక్తము గాదు. ఉపలబ్ధులు అన్నియూ భగవానుని విభూతులే. కావున మనము ఇతరులపై ఈర్ష్యపడే ప్రసక్తియే లేదు. ఏలయన, మనము సాధించలేనిది మరియొకడు సాధించినప్పుడు మాత్రమే ఈర్ష్యకు అవకాశమేర్పడును గదా!

సర్వము ఈశ్వరుని విభూతి అని నీవు దర్శించ గల్గినచో, ఆ విభూతి అనేకరూపములలో దర్శనమిచ్చును. ప్రతి గడ్డిపరక ఈశ్వర విభూతియే. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు ఇత్యాదులన్నీ ఈశ్వర విభూతులే. ఒక వ్యక్తి పాడగల్గుతున్నాడంటే, మరియొక వ్యక్తి నాట్యము

చేయగల్గుమన్నచో, అది అంతా భగవానుని విభూతియే. ఆ విభూతి ఒక చోట ఎక్కువగను, మరియొకచోట తక్కువగను అభివ్యక్తము కావచ్చును. కాని దానివలన విభూతిలో భేదమేమియూలేదు. ఆ సర్వము ఈశ్వర విభూతియే.

మరియు ఆ విభూతిని నేను గుర్తింప గల్గినచో, నేను భగవానుని విభూతి అగుదును. సౌందర్యమును ఆస్వాదించగలిగే సామర్థ్యము కూడా ఈశ్వర విభూతియే. మానవులలో ఆస్వాదించగలిగే సామర్థ్యము లేని కారణంగా, ఈశ్వరుని అద్భుతవిభూతులు అనేకము గుర్తింపునకు నోచుకొనవు. దర్శించగలిగే సామర్థ్యము లేని వ్యక్తి తన ఎదుటనున్న విభూతినైననూ దర్శించలేడు. ఎందరో మహాత్ములు గుర్తింపులేకుండా మిగిలి యుండెదరు. కర్త ఎవరో తెలియని కారణంగా ఎన్నో గొప్ప పుస్తకాలకు చదివేవారు ఉండరు. ఈ తీరున గుర్తింపునకు నోచుకోని మహిమలు అసంఖ్యాకముగా గలవు.

కొందరు గాయకులు కీర్తిప్రతిష్ఠలను సంపాదిస్తారు. కాని వారితో సమముగా గాని, వారికంటె గొప్పగా గాని గానము చేయగల్గి కూడా అజ్ఞాతంగా ఎందరో మిగిలి ఉంటారు. నాకు తెలిసిన ఒక అమ్మాయి అద్భుతంగా వీణను వాయిస్తుంది. పేరు మోసిన వైణికులందరి కంటె ఆమె గొప్పగా వీణను వాయించగలదు. కాని ఆమె ఎవరో ఎవరికీ తెలియదు. ఆమె ఇంటిలోని వారికి, ఆమెతో దగ్గర పరిచయము గలవారికి మాత్రమే ఆమె సంగీతమును వినే భాగ్యము కలిగినది. ఇట్టి వ్యక్తులు లోకములో చాలమంది గలరు. కావున, విభూతి ఎక్కడ అభివ్యక్తమైనా, అది ఈశ్వర విభూతియే. ఒకప్పుడు జనులు దానిని గుర్తిస్తారు. మరియొకప్పుడు గుర్తించరు.

### మహిమను గుర్తించిన తరువాతనే ఈర్ష్య పుట్టును

పరిశీలించి తెలియగలిగే సామర్థ్యము గల వ్యక్తి మాత్రమే ఇతరులలోని మహిమను గుర్తింప గల్గుతాడు. ఇతర వ్యక్తిలోని ఉత్కర్షను చూచి గుర్తించగలవాడు మాత్రమే అతనిపై ఈర్ష్యనుపొందే అవకాశము గలదు. అట్లుగానిచో, ఈర్ష్య ఎట్లు సంభవమగును? ఆ సామర్థ్యము నీయందు గల ఉత్కర్షయే. రసికుడు లేనిచో గాయకుడేడి? గానమును ఆస్వాదించే వ్యక్తి ఒకడు ఉండాలి. ఉత్కర్ష అంతా భగవానునిదే అని తెలియగలిగే వ్యక్తిలో ఈర్ష్యకు తావు లేదు. మనకు ఒక వ్యక్తిపై ఈర్ష్య కలిగే అవకాశము గలదు. కాని ఈశ్వరునిపై ఈర్ష్య కలుగదు. ఏలయన, సదృశమగు స్థాయికి చెందిన వారి మధ్య మాత్రమే ఈర్ష్యకు తావు ఉండును. సాదృశ్యము లేని వ్యక్తుల మధ్య ఈర్ష్య

ఉండదు. గరుడ పక్షి చాల ఎక్కువ ఎత్తువరకు ఎగురగలదు. కాని మనకు దానిపై ఈర్ష్య కలుగదు. అటులనే ఈశ్వరునిపై ఈర్ష్య కలుగదు. గరుడపక్షివలె ఎగురవలెననే కోరిక ఉండుట సంభవమే. కాని దానిపై ఈర్ష్య కలుగదు. ఏలయిన, దానికి మనకు మధ్యలో పోలిక ఏమియూ లేదు.

అదే విధంగా, ఈశ్వరుడు మానవజాతికి చెందినవాడు గాదు. కావున ఈశ్వరునిపై ఈర్ష్యపడుట అను ప్రసక్తి ఏది? ఈ సామాన్యనియమము మనలోని ఈర్ష్యను రూపుమాపి, మన వ్యక్తిగత సంబంధవములలో గల ఘర్షణను నివారించును. ఇట్టి మానసిక ప్రవృత్తిని అవిష్కరించుకొనుటలో ఈ అందమైన విభూతి యోగము సహకరించును.

ఈర్ష్య లేశమైననూ లేనివాడు మహర్షియని నేను చెప్పగలను. ఏలయన, ఈర్ష్య శతాధిక సూక్ష్మరూపములలో బహిర్గతమగును. సాధువులలో కూడ ఈర్ష్య కానవచ్చును. వారిలో ఒకరికంటె మరియొకరు అధికలోక ప్రియులగుటచే ఈర్ష్య కలుగును. వాస్తవంలో వ్యక్తుల ప్రసిద్ధి పెరిగేకొలది వారికి తెలిసినది తక్కువగా నుండును; లేదా వారికి తెలిసినది తప్పు కావచ్చును. గంభీర జ్ఞానము గల వ్యక్తి లోక ప్రియుడగుట కష్టతరము. ఏలయన అట్టి జ్ఞాని వచనములు గంభీరముగనుండుటచే లోక ప్రియము కాజాలవు. లోకములో కీర్తి పెరగాలంటే, కథలను హాస్యోక్తులను చెప్పాలి. అర్థము లేకపోయినా ఆకర్షకముగా ఉండే శబ్దజాలమును ప్రయోగిస్తూ ఉండాలి. గొరిల్లాయై పుట్టినచో, కావలసినంత లోక ప్రియత లభించును. ఒకప్పుడు మిల్వాకీ నగరములో ఎవరు ఎక్కువ లోక ప్రియులు? అను విషయముపై ఎన్నిక జరుగగా, అచటి జంతు ప్రదర్శనశాలలోని గొరిల్లా నెగ్గినది. అది అచట ప్రశాంతముగా కూర్చుండి లోక ప్రియమైనది. కావున ఈ లోక ప్రియత అర్థరహితమైనది.

ఈ విభూతి యోగమును మీరు మరల చదవండి. ఉత్కర్ష గాని, కౌశలము గాని ఎక్కడ ఉన్నా అది ఈశ్వరుని విభూతియని మీరు గుర్తించగలగాలి. కొద్దిపాటి తెలివి గలవాడైననూ అట్లు గుర్తించ గల్గును. మనకు గల ఈ సామర్థ్యము లన్నియూ ఈశ్వరుడు ఇచ్చినవే అని దర్శించుటకు పెద్ద పాండిత్యముతో పనిలేదు. ఎవ్వరైననూ దేనినైననూ వాస్తవంగా సృష్టించుట లేదు. స్వీయ జీవితమును, స్వీయ సామర్థ్యములను పరిశీలించినంత మాత్రాన వ్యక్తికి ఇదంతా ఈశ్వరదత్తమని స్పష్టమగును. పూర్ణజగత్తు ఈశ్వరదత్తము. నీవు దేనిని సృజించితివి? వస్తువులను దగ్గరకు చేర్చి నిర్మించే సామర్థ్యము మానవునకు గలదు. కాని అదికూడా ఈశ్వరుడు ఇచ్చినదియే. మనము వాస్తవంగా సృష్టించేది ఏది లేదు. ఈ సత్యమును నీవు ఎంత అధికంగా గుర్తించగల్గితే, నీ అహంకారమునకు అంత అధికమగు వాస్తవిక దృష్టి అలవడును. వాస్తవిక దృష్టిగల అహంకారము

సాక్షాత్కారముగల అహంకారముతో సమానము కాకపోయినా, అహంకారములేని స్థితితో సమానమగును. భక్తిభావనా సంపన్నమైన అట్టి అహంకారము ఆత్మ సాక్షాత్కారమునకు అర్హమగును. అట్టి అహంకారము శుద్ధముగ నుండి శుద్ధాత్మ దర్శన సమర్థమగును.

ఇట్టి ఈశ్వరవిభూతి దర్శనమును సాధకుడు ముందుగా యోజనచేసి చేస్తాడు. క్రమంగా ఆ దర్శనము సహజధోరణిగా మారును. సాధకుడు యథార్థంగా దర్శించ లేకపోయినా, పదే పదే ధ్యానము చేస్తూ ఉంటే, ఆ దర్శనము యథార్థముగా సిద్ధించును. ఏలయన, అది వాస్తవమే గాని, అధ్యారోపము కాదు. విభూతి దర్శనము మున్ముందు పూర్తి అవగాహనకు రాకపోయినా, అది కాల క్రమంలో సుస్పష్టమగును. ఈ దర్శనములోని అగాధమహత్త్వము ఆరంభములో స్పష్టముగాక పోయిననూ, ప్రయత్నపూర్వకముగా విభూతి దర్శనము చేసిననూ చాలును. మైత్రిలో గాని, ప్రేమలోగాని పరిస్థితి ఇటులనే ఉండును. ఉదాహరణకు నీవు ఒక వ్యక్తిపై ప్రేమను చూపించలేక పోయినావనుకో. నీవు ప్రయత్నపూర్వకముగా మంచి మాటలను కొన్నింటిని పలుకుము. ప్రేమయొక్క ఆవిష్కారము ఆరంభమైనట్లు నీవు గ్రహిస్తావు. ప్రేమను వ్యక్తము చేసే క్రియ ప్రేమను ఆవిష్కరించుకొనుటలో సహకరించును. అదే విధముగా ఇక్కడ కూడా ఆరంభములో విభూతి దర్శనమును ప్రయత్న పూర్వకముగా చేస్తూ ఉంటే, క్రమంగా అది వాస్తవరూపమును దాల్చును. విభూతి దర్శనమునకు ఆధారము సత్యముగను క, దానిని ఏదీ ఆపలేదు.

కావున, భక్తుడు ఈశ్వరునిపై ఈర్ష్య పడలేడు గదా! ఈశ్వరుడు అర్థమైతే, అంతా నీవే. నీవు గడపదాటి జగత్తు అంతా ఈశ్వరుడని దర్శిస్తే, ఆ ఈశ్వరుడు నీవే. ఏలయిన, సచ్చిదానంద ఆత్మకంటె భిన్నముగా ఈశ్వరుడు లేడు. కాబట్టి, ఈ విభూతి అంతా నీదే.

విభూతి అని గుర్తింప వీలులేని పదార్థముల మాటయేమి? దీనికి సమాధానముగా, జగత్తు అంతా నా విభూతియేనని భగవానుడు చెప్పుచున్నాడు. మరియు నా పూర్ణ విభూతిలో ఈ జగత్తు నాల్గవవంతు మాత్రమేనని (పాదోऽస్య విశ్వా భూతాని) భగవానుడు చెప్పినాడు. మిగిలిన మూడు వంతులు పరబ్రహ్మ రూపములో నీ హృదయమునందు దాగి యున్నవి (త్రిపాదస్యామృతం దివి). మూడు వంతులు చైతన్య ఆత్మలో అంతర్ధానమైనవి. ఏడు ఊర్ధ్వలోకములు, ఏడు అధోలోకములు, వెరసి పదునాల్గు లోకములు కలిసి ఒక పాదము మాత్రమే. దీని తాత్పర్యమేమనగా జగత్తు అంతా కలిసి అనంత పరబ్రహ్మమును నిరూపించజాలదు.

**అధ్యాయము 10, శ్లోకము 42:**

अथवा बहुनैतेन किं ज्ञातेन तवार्जुन।
विष्टभ्याहमिदं कृत्स्नमेकांशेन स्थितो जगत् ॥ ४२ ॥

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్ట భ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ (42)

**అథవా** = లేదా; **అర్జున** = ఓ అర్జునా!; **ఏతేన** = ఈ; **బహునా** = బహువిషయకమైన; **జ్ఞాతేన** = తెలుసుకొనుట చేత; **తవ** = నీకు; **కిమ్** = ఏమి ప్రయోజనము?; **అహమ్** = నేను; **ఇదం** = ఈ; **కృత్స్నమ్** = సమస్తమైన; **జగత్** = జగత్తును; **ఏకాంశేన** = ఒక అంశముచే; **విష్టభ్య** = వ్యాపించి; **స్థితః** = ఉన్నాను.

లేదా వీటినన్నింటినీ తెలియుటవలన నీకేమి ప్రయోజనము? ఓ అర్జునా!
నేనీ సమస్త జగత్తును ఒకే అంశముచే వ్యాపించియున్నాను (42).

అథవా అను పదము మరియొక దృష్టికోణమును నిర్దేశించును. విభూతి గల సర్వము నా తేజస్సులోని ఒక లేశమునుండి మాత్రమే పుట్టినదని (మమ తేజోంశ సంభవమ్) భగవానుడు చెప్పెను. దానిని బట్టి విభూతి గల పదార్థములు మాత్రమే భగవానుని నుండి పుట్టినవనియు, ఇతరములు కావనియు ఎవ్వరైనా తలచే అవకాశము గలదు. ఈ భ్రాంతిని తొలగించుటకై భగవానుడు 'అథవా' అని మొదలిడెను.

వృక్షములలో పవిత్రమగు రావి వృక్షము నేనే, నదులలో గంగానది నేనే ఇత్యాది బహు విషయములను తెలియుట వలన (బహునా ఏతేన జ్ఞాతేన), ఓ అర్జునా! నీకేమి లాభము గలదు (కిం తవ అర్జున)? నా విభూతి అనంతము గనుక అధిక ప్రయోజనము లేదు. మరియు విభూతుల జాబితాను పూర్తిచేయుట నాకు సంభవము కాదు. ఈ జ్ఞానము కలిగిన తరువాత కూడా ఇంకనూ తెలియవలసినది గలదు (సావశేషణ జ్ఞాతేన) అని శ్రీ శంకరులనిరి. కావున ఇది ఈశ్వర విభూతి యొక్క అసంపూర్ణ జ్ఞానమే యగును గదా! దీనివలన లాభమేమి?

'సర్వము నేనే' అను దర్శనమును మనకు తెలుపుడు చేయుటయే భగవానుని ఉపదేశమునకు ఏకైక ప్రయోజనమై యున్నది. 'వాస్తవంలో ఈ సర్వము నాలోని ఒక పాదము

మాత్రమే. నేను నాలోని ఒక పాదముచే మాత్రమే ఈ జగత్తు నంతనూ వ్యాపించియున్నాను. నేను ఈ సర్వపదార్థరూపములో జగత్తునకు స్థిరత్వమును కలిగించెదను. జగద్రూపముగా నేనే ఉన్నాను (అహం స్థితః). అట్లుగానిచో ఈసర్వము ఎట్లు మనగల్గును? ఇదంతా మిథ్య మాత్రమే. దీనికి ఉపాదానకారణమగు నావలననే వాస్తవికత సిద్ధించును'.

నీ దృష్టికోణంలో నీవు జగత్తును పరిశీలించుము. నీ అంతఃకరణలోని సామగ్రి కంటె అదనముగా జగత్తు లేదు. అనగా నీకు తెలిసేది, నీవు చూచేది అల్పమైన జగత్తు మాత్రమే. నీవు చూసే సూక్ష్మ ప్రపంచము గాని, స్థూల ప్రపంచము గాని, ఏదైనా నీ నాల్గవ అంశము మాత్రమే. నాల్గింట మూడువంతులు నీ బుద్ధిలో దాగియున్నది. ఇది నీ యథార్థ స్వరూపము. నీవు అనంతుడవు, పరిచ్ఛేదములు లేని వాడవు. ఇచట నాల్గింట మూడు అనుదాని తాత్పర్యము ఖచ్చితముగా అంతే అని గాదు. దానితో కలిపి ఇది పూర్ణమగునని చెప్పుటయే తాత్పర్యము. ఆ మూడు పాదములు లేనిదే జగత్తు అనే ఈ నాల్గవ పాదము అపూర్ణముగ మిగిలిపోవును. జగత్తు బ్రహ్మకంటె భిన్నముగా లేదు గనుక, ఇది పూర్ణములో నాల్గవ అంశము అని చెప్పబడినది. ఇదే భావమును వెలిబుచ్చు మంత్రము (పాదోఽస్య విశ్వా భూతాని) ను శ్రీ శంకరులు ఉదహరించిరి. ఈ కన్నులన్నియు ఆయన కన్నులే ఇత్యాదిగా ఈ సర్వము ఆయనలో నాల్గవ అంశము. ఇది గాక ఇంకా మూడు పాదములు దేశకాలములకు అతీతములై యున్నవి (త్రిపాదస్యామృతం దివి). బ్రహ్మము దాగియున్నది అని చెప్పుటలో అభిప్రాయమేమనగా, అది మన ఇంద్రియములకు గోచరము కాదు. కావున, ఓ అర్జునా! నీవు చూచేది అత్యల్పము. నీవు యథార్థముగా చూడవలసినది మిగిలిన మూడు పాదములు, అనగా అనంతబ్రహ్మ. ఆ మూడు పాదములను చూచినచో, ఆ దర్శనము పూర్ణమై, సర్వము అనంత పరబ్రహ్మ అను సాక్షాత్కారము కలుగును. దానిలో వాస్తవమగు అంశములు లేవు.

బ్రహ్మ విభాగాధీనము కాదు (నిరంశమ్). మనము సులభముగా తెలియగల్గుటకై ఈ విభాగము కల్పించబడినది.

వ్యాసవిరచితమగు మహా భారతములో పదివేల శ్లోకములు గల భీష్మ పర్వములో, బ్రహ్మ విద్యయే విషయవస్తువుగా గలది యగుటచే ఉపనిషత్తుతో సమానమైనది, యోగశాస్త్రము కూడా అయి ఉన్నది, శ్రీకృష్ణార్జునుల మధ్య సంవాదరూపమైనది అగు శ్రీ మద్భగవద్గీతలో భగవాను విభూతులు విషయ వస్తువుగా గల పదియవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్

# 11వ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగము

నేను నా ఒక అంశముతో జగత్తును వ్యాపించి జగత్తులో నుండెదను (ఏకాంశేన అహం స్థితః) అని భగవానుడు పదవ అధ్యాయములో అంతిమ శ్లోకములో చెప్పియున్నాడు. దీని ఆధారంగా అర్జునుడు కొత్తగా ఒక ప్రార్థనను చేయును. 'నేను ఈ జగద్రూపములో స్థిరముగా నున్నాను' అని భగవానుడు అనగానే, ఆ వచనము అక్షరాలా సత్యమేనా యను శంక అర్జునునకు కలుగుట సహజమే. చిన్ని కృష్ణుడు మన్ను తినగా, తల్లి యశోద నోటిని తెరువుమని ఆజ్ఞాపిస్తే, అప్పుడు ఏమి జరిగినదో అర్జునుడు వినియున్నాడు. ఆమెకు చిన్ని కృష్ణుని నోటిలో జగత్తు అంతయూ కనబడెను. ఇప్పుడు తన యెదుట నిలిచియున్న కృష్ణుని రూపములో విశ్వరూపమును తాను చూడగల్గుదునా యను విషయమును అర్జునుడు తెలియ గోరెను.

విశ్వరూపము మనకు సరిగా తెలియాలంటే, మనము ఈశ్వరుని రూపమును తెలుసుకోవాలి. ఈశ్వరుని వివిధ దృష్టికోణములలో దర్శించవచ్చునని మనము చూచియున్నాము. జీవుని యథార్థ స్వరూపము, ఈశ్వరుని యథార్థ స్వరూపము చైతన్య బ్రహ్మయే. జీవుని తాత్త్విక స్వరూపము సచ్చిదానంద అద్వయ బ్రహ్మ. ఈశ్వరుని స్వరూపము కూడా బ్రహ్మమే. ఈశ్వరుని తెలుసుకొనుటలో ఇది ఒక స్థాయి. మరియొక స్థాయి కూడా గలదు. పరబ్రహ్మ మాయాశబలితమై ఈశ్వరుడగును. ఈశ్వరుడు జగత్కారణమగును. శుద్ధ అనంత చైతన్య స్వరూపమగు బ్రహ్మ మరియొక శక్తియొక్క సహకారము లేనిదే, స్వయముగా జగత్కారణము కాజాలదు. ఈ జగత్తును దర్శించే జీవుడను నేను. కాన నేను జగత్కారణమును అన్వేషించుట సహజమే. ఒక విశిష్ట శక్తితో గూడిన పరబ్రహ్మ జగత్కారణమని శ్రుతి ప్రదర్శించుచున్నది. శుద్ధబ్రహ్మ జగత్కారణము కాజాలదు.

పరబ్రహ్మ ఈశ్వరుడై సర్వజగత్స్రష్ట అగుటకు సర్వజ్ఞత్వము మరియు సముచితమగు శక్తి ఆవశ్యకమగును. సముచితమగు శక్తి యనగా జగత్తు యొక్క స్వరూపమునకు అనురూపమైన శక్తి. జగత్తు యొక్క సత్యత్వశ్రేణి కూడా అదియే కావాలి. ఈ జగత్తును విశ్లేషిస్తే మిథ్యయని తేలును. కావున దానిని సృజించిన శక్తి కూడా మిథ్యాశక్తి అయి ఉండాలి. ఆ శక్తికే మాయా అని పేరు. మిథ్యాత్వమనగా అధిష్ఠాన–అనన్యత్వమని నిర్వచనము. అనగా నిర్వచనామ సారముగా

ృ్య సృష్టికి బ్రహ్మము కంటె భిన్నముగా స్వతంత్రమగు ఉనికి లేదు. ఈ నిర్వచనము ్కరణమగు మాయకు కూడా వర్తించును. మాయ బ్రహ్మము కంటె భిన్నముగా లేదు. నా ంట జగత్తు కానవచ్చుచున్నది గాన, మాయచే పరిచ్ఛిన్నుడైనట్లు కన్పట్టే బ్రహ్మము జగత్కారణమని ్పింపబడును. ఈ సంగతి మనకెట్లు తెలియును? దీనికి ప్రమాణము శ్రుతి మాత్రమే. సృష్టికి ్హ్మ కారణము అని శాస్త్రము మనకు ప్రదర్శించుచున్నది. మరియు ఆ సత్య జ్ఞాన అనంత ్హ్మము నీవేనని శాస్త్రము నిరూపించుచున్నది. ఈ సత్యమును సాక్షాత్కరించుకొనుట (అపరోక్ష ్రము) సుసంభవము. అపుడు ఈ జగత్తుయొక్క స్వరూపమును అంచనావేయుట అను సమస్య యుండును. ఈ జగత్తు సృష్టింపబడుటకు, బ్రహ్మమునందు ఒక అంతశ్శక్తి ఉండాలి. ఆ ్యొక్క సత్యత్వము, మరియు జగత్తు యొక్క సత్యత్వము ఒకే శ్రేణికి చెందియుండును. ాయా అనే అంతర్నిహిత శక్తి వలన బ్రహ్మ జగత్కారణత్వ విశిష్టముగునని కూడా మనకు శాస్త్రము ల నే తెలిసినది. మాయ గలదు అను సత్యమును మనము అనుమాన ప్రమాణముచే గ్రహించి ాస్త్రోపదేశమును పుష్టి చేయవచ్చును. కావున జీవేశ్వరులకు సమానాధిష్ఠానమైన ఏకైక చైతన్యము ాయతోడు అయినప్పుడు మాత్రమే జగత్కారణమగును. మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్ (శ్వేతాశ్వతర ఉపనిషద్). ఈ జగత్తు మిథ్య అని తేలినది. కావున మిథ్యా కారణము ఉండి తీరాలి. ఇదియే అనుమానము. మనము శ్రుతి తాత్పర్యమును వంట బట్టించుకొనుటలో ఇట్టి యుక్తి సహకరించును.

ఈ విధముగా ఈశ్వరునకు రెండు రూపములు గలవు: ఒకటి శుద్ధ అనంత చైతన్యము. రెండవది మాయా–అవచ్ఛిన్న–చైతన్యము. మూడవ రూపము కూడ గలదా? ఈశ్వరుని స్వరూపము చైతన్యము. ఆ స్వరూపమే ఇచట కూడా జీవరూపములో ఉపలభ్యమగుచున్నది. మన అంతఃకరణములో ఉపలభ్యమగుచూ, దానిచే ఉపహితమై (conditioned) ఉన్న చైతన్యమునకే జీవుడని పేరు. అనగా అంతఃకరణ– అవచ్ఛిన్న–చైతన్యము ఈశ్వరుని మరియొక రూపము. అంతఃకరణ–ఉపహిత–చైతన్యమే వ్యక్తియై ప్రమాతయైనది. ఇది మూడవ రూపము.

మనకు రామకృష్ణాద్యవతారములు గలవు. ఈశ్వరుడు స్వీకరించే ఒక విశిష్టరూపమునకు అవతారమని పేరు. కృష్ణుడు, రాముడు ఇత్యాది అవతారములన్నియూ ఈశ్వరుడే. కృష్ణరూపము జీవరూపము గాదు. ఒక విశిష్ట పరిస్థితిలో నున్న అనేక ప్రజలు ప్రార్థించుటచే భగవానుడు ఒక ప్రత్యేకరూపమును స్వీకరించినాడు. ఆ రూపమే శ్రీకృష్ణుడు. మానవుల ప్రార్థనలకు స్పందించి ఈశ్వరుడు తన మాయచే స్వయముగా ఆ పరిస్థితికి అనురూపమగు రూపమును ధరించినాడని

మనము నాల్గవ అధ్యాయములో చూచి యున్నాము. ఆ రూపమే అవతారమబడును. ఇది ఈశ్వరుని నాల్గవ రూపము.

ఈశ్వరుడు స్థూల జగద్రూపములో నున్నాడు. ఇది విరాడ్రూపము. ఈ సృష్టి అంతా ఈశ్వరుని దేహమే అని మనము దర్శించవచ్చును. విశ్వము యొక్క రూపములో భాసించే చైతన్యమునకు విరాట్ అని పేరు.

ఈశ్వరుడు విరాడ్రూపములో నున్నాడని మనకెట్లు తెలియును? జగత్తు మనకు ప్రత్యక్షముగా భాసించుచున్నది. కాని ఈశ్వరుడు ప్రత్యక్షము కాదు. కావున జగత్తు ఈశ్వరుడే యని శాస్త్రము నుండి మాత్రమే మనము తెలుసుకోవాలి. మాయా విశిష్టుడగు ఈశ్వరుడే జగత్తునకు అభిన్న నిమిత్తోపాదాన కారణము అనే శాస్త్రవచనమును తెలుసుకున్న వ్యక్తి ఈ ప్రత్యక్ష జగత్తు ఈశ్వరుని రూపమే యని తెలియగల్గును.

ఇచట అర్జునుడు విశ్వరూపమును చూడగోరినాడు. ఏలయనగా భగవానుడు పదవ అధ్యాయములోని అంతిమశ్లోకములో 'నేను విశ్వము నంతను ఒక పాదముతో ఆక్రమించి వ్యాపించి యున్నాను' అని చెప్పియున్నాడు. అర్జునుడు ఈశ్వరుని అట్టి విశ్వరూపమును చూడగోరెను. విశ్వము తన ఎదుట ప్రత్యక్షమై యుండగా, అతడు విశ్వరూపమును చూడగోరుటకు కారణమేమి? అతని అభిప్రాయమేమనగా, అతడు ఏక కాలములో ఈశ్వరుని సర్వజగద్రూపములో చూడగోరెను. సాధారణముగా మనము ఒక దేశములో మరియు ఒక కాలములో ఒక వస్తువును చూస్తాము. అది విశ్వరూపము కాదు. మనము చూడగలిగే శక్తికి సీమలు గలవు. కావున మనము అల్పమగు వస్తువులను మాత్రమే చూడగల్గుతాము. వాటిలో కొన్నింటిని మనము తప్పుగా చూస్తాము. ఉదాహరణకు నీలి ఆకాశము ఒక భ్రాంతి. మనము సర్వమును ఒక అంశములో మాత్రమే చూడగల్గుతాము. ఒక వస్తువు యొక్క ముందు భాగమును చూడగల్గితే, వెనుక భాగమును చూడజాలము. కంటికి కానరాని వస్తువును మనస్సు కూడ మననము చేయజాలదు. అనగా మనము ఒక సమయములో ఒక వస్తువును మాత్రమే చూడగల్గుతాము. ఇట్టి స్థితిలో విశ్వమును చూచే ప్రసక్తి ఎక్కడిది ? అర్జునుడు చిన్న పిల్లవానివలె విశ్వరూపమును పూర్ణముగా చూడగోరుచున్నాడు. వెనుక నున్నది, ముందు ఉన్నది, ఎడమ వైపున ఉన్నది, కుడి వైపున ఉన్నది, ఆకాశమునకు ఆవల ఉన్నది, స్వర్గములో నున్న సర్వము ఇత్యాది సమస్తమును తాను ఒకే రూపములో చూడ గల్గునా? ఈ విషయమును అర్జునుడు తెలియగోరెను. సత్యమును

చెప్పవలెనన్నచో, ఇది చిన్నపిల్లవాని కోరిక అనవచ్చును. ఇట్టి దర్శనమునకు అర్జునుని కన్నులు చాలవు గదా! అతడు కన్నులతో చూడవలెనన్నచో, భగవానుడు అతనికి దివ్యచక్షుస్సులను ఈయవలసి యుండును. దివ్య నేత్రమనగా బహుశః ఒక విశిష్టమైన అంతర్నేత్రము కావచ్చును. అది ఏమైనా, ఈశ్వరుని మాయ మాత్రమే యగును. శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును అతనికి చూపించెను. ఇది వాస్తవముగా జరిగిన ఘటనయని స్వీకరించవచ్చును. లేదా, 'ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదను విషయవస్తువును ప్రతిపాదించే విశిష్ట పద్ధతి ఇది' అని కూడా స్వీకరించవచ్చును.

వివిధం రాజతే ఇతి విరాట్. విభిన్నరూపములలో కన్పట్టువాడు గనుక విరాట్ అనబడును. ఏ రూపములో ఇతర రూపములన్నియూ అంతర్గతమగునో, ఆ ఏకైకరూపమునకు విరాట్–స్వరూపమని పేరు. ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదనే సత్యమును అది నిరూపించును. ఆ సత్యమును గుర్తించే వ్యక్తి యొక్క హృదయములో ఈశ్వర భక్తి ఆవిష్కృతమగును. అట్టి భక్తియే తరువాతి అధ్యాయమునకు విషయవస్తువు (భక్తియోగము). విశ్వరూపమును తెలుసుకొనుట ద్వారా, భగవానుడు సర్వనియామకుడు అను సత్యమును గుర్తించ గల్గుతాము. "నేను ఏమి చేసిననూ, దానికి నేను బాధ్యుడను కాను; నేను ఉన్న స్థితికి నేను కారణము కాదు' అని తప్పించుకొనుట దీని అభిప్రాయము కానే కాదు. వాస్తవంలో నీ ప్రస్తుత స్థితికి, నీవు ఒక విశిష్టవంశములో జన్మించుటకు బాధ్యత నీదేనని కర్మసిద్ధాంతము బోధించుచున్నది. నీవు ఇతరులపై నిందను వేయకుండగా ఆ బాధ్యతను ఆనందముగా స్వీకరించెదవు. నీ ప్రస్తుత స్థితికి పూర్వకర్మలే హేతువు గనుక, నీవు బాధ్యతను అంగీకరించెదవు. నీ ప్రస్తుత స్థితికి ఇతర శక్తులు తమవంతు తోడ్పడి యుండవచ్చును. కాని నీకు ఇచ్ఛా స్వాతంత్ర్యము గలదను సత్యమును నీవు ఎరుంగుదువు. నీవు నీ పరిస్థితిని మెరుగు పరుచుకొనవచ్చును; లేదా మార్పులు చేర్పులు చేసి పునర్వ్యవస్థీకరించవచ్చును; సున్నితమగు భావావేగము కలవాడవు కావచ్చును; లేదా కఠినమగు మనస్సు కలవాడవు కావచ్చును. ఇదంతా నీ అధీనములో నున్నది. కాని అదే సమయములో ఒక వ్యక్తిగా, ఒక జీవునిగా నీచేతిలో పూర్ణనియంత్రణ లేదు.

విశ్వరూపమును అర్థము చేసుకున్నచో, భగవానునియందు భక్తి కలుగును. ఈ అధ్యాయములో విశ్వరూపము సుందరముగా కవితా ధోరణిలో వర్ణించబడినది. దీనిలోని పదచిత్రణము స్వర్గాది లోకములను మన కళ్ల ముందు కనబడునట్లు చేయును. స్వర్గాది లోకములు, వాటిలో నివసించు ప్రాణులు ఇత్యాది సర్వము ఒక మహా విశ్వరూపములో దర్శనమిచ్చును.

సర్వము దానిలో అంతర్భూతమై యుండును. ఇంత చక్కగా వర్ణించబడినా, అర్జునుడు దానిని తప్పుగా అర్థము చేసుకొని, తనను తాను పూర్ణము కంటె భిన్నమైన వ్యక్తిగా దర్శించినాడు. అతడు భయభీతుడగుటను బట్టి మనకీ విషయము తెలిసినది.

కాల చక్రము సర్వమును నాశనము చేయుచున్న దృశ్యమును అతడు విశ్వరూపములో గాంచెను. సృష్టి సంహారములు నిరంతరముగా కొనసాగుచున్నవని వర్ణింపబడెను. మనకు వయస్సు పైబడేకొలదీ దేహములో సూక్ష్మమగు మార్పులు జరుగుతూ ఉంటాయి. విశ్వరూపములోని పరిస్థితి కూడా అంతే. ఈ మార్పుల నన్నిటినీ చూస్తే మనకు భయము కలుగుతుంది. అర్జునునకు అటులనే జరిగినది. ఈ విశ్వరూపములో మానవులందరు మృత్యువు కోరలలో చిక్కుకొని ఉండగా అర్జునుడు చూచినాడు. వాస్తవంలో మృత్యువు భగవానుడే. మృత్యువు సర్వప్రాణులను తన కోరల మధ్య నమిలివేయుచుండెను. మార్పు వచ్చే ప్రక్రియయే ఈ నమిలివేయుట. ప్రాణులన్నియు పెద్దనోటిలోని కోరల మధ్య అతుకుకొని నలిగిపోవుచుండెను. అపుడాతనికి విశ్వరూపములో యుద్ధరంగము, తనవారు, ఇతరులు కానవచ్చిరి. వారందరు తనకంటె బాహ్యముగా నుండిరని అతని భావన. ఇపుడు వారందరు ఒకే రూపము లోపల ఉన్నారు. దానికి బయట ఏదీ లేదు. కాని అర్జునుడు తనను తాను విశ్వరూపము కంటె భిన్నముగా దర్శించినాడు. అట్లు దర్శించుట ఎట్లు సంభవమయ్యెనో! ఆశ్చర్యము. అతడట్లు దర్శించుట చేతనే భయభీతుడైనాడు. సచ్చిదానంద ఆత్మను దర్శించినవాడు మాత్రమే 'విశ్వరూపము నేనే' అని చెప్పగల్గును. లేనిచో, అది ఒక ఇంద్రజాలము మాత్రమే అగును.అర్జునుని దృష్టిలో అటులనే అయినది. విరాట్ స్వరూపుని ఈ అద్భుత దృశ్యమును శ్రీ కృష్ణుని కృపతో మాత్రమే అర్జునుడు చూడగలిగెను. చూచిన తరువాత 'ఓ భగవాన్! నాకు చాల భయమగుచున్నది. దయతో మరల నీ పూర్వరూపమును ధరించుము' అని అతడు కోరెను. అతడు కోరిన విధముగా శ్రీకృష్ణుడు మరల దరహాసముతో గూడిన తన పూర్వరూపమును స్వీకరించెను. అర్జునుడు ఆ రూపముతో తేలికగా వ్యవహరించగలడు. అట్లుగానిచో ఈ విశ్వరూప కృష్ణునితో వ్యవహరించుట యెట్లు ? ఎవరిని సంబోధించవలెను ? ఏమని సంబోధించవలెను ? కావున అర్జునునకు, ఇతరులకు అలవాటైన పూర్వరూపమును ఆయన మరల స్వీకరించెను.

11వ అధ్యాయము యొక్క సారాంశమిది. 'భగవానుని విభూతులను వర్ణించుట పూర్తి అయినది' అంటూ శ్రీ శంకరులు ఈ అధ్యాయమును ఉపక్రమించిరి. ఏవో కొన్ని విభూతులను మాత్రమే చెప్పినా, భగవానుని అనంత మహిమను తెలుసుకొనుటకు ఆ జాబితా చాలును. 'జగత్తంతయూ నాలోని ఒక పాదముచే వ్యాప్తమై యున్నది' అను భగవానుని వచనము అర్జునుని

దృష్టిని ఆకర్షించినది. జగత్తు అంతా కలిపి ఈశ్వరుని ఒక పాదము మాత్రమే అయినచో, ఇంకనూ మూడు పాదములు దాగియుండును. మనమీ విషయమును గమనించవలెను. సముద్రములో తేలియాడే మంచుకొండలో అగ్ర భాగము మాత్రమే కానవచ్చును. శేష భాగము నీటియడుగున ఉండును. అదే విధముగా, ఇచట కూడా ఇంత మాత్రమే కనబడుచున్నది. ఆత్మయొక్క అనంత స్వరూపము కానరాకున్నది. అది బుద్ధియందు అహం రూపములో నిగూఢమై యున్నది. మనమీ సత్యమును గ్రహించవలెను. అర్జునుడు విశ్వరూపమును ప్రత్యక్షముగా చూడగోరెను. విశ్వరూపమును పదముల ద్వారా నైననూ చూచుట సంభవమే. కాని అర్జునుడు స్వీయనేత్రములతో చూడగోరెను. 'నేను జగద్రూపముగా నున్నాను' అని భగవానుడు చెప్పియున్నాడు. కావున భగవానుని ఈ జగద్రూపములో చూడగోరి ఇట్లు పలికెను:

**అధ్యాయము 11, శ్లోకము 1:**

अर्जुन उवाच।
मदनुग्रहाय परमं गुह्यमध्यात्मसंज्ञितम्।
यत्त्वयोक्तं वचस्तेन मोहोऽयं विगतो मम॥ १॥

అర్జున ఉవాచ।
మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ (1)

**అర్జునః** = అర్జునుడు; **ఉవాచ** = పలికెను; **త్వయా** = నీచేత; **మదనుగ్రహాయ** = నన్ను అనుగ్రహించుట కొరకు; **పరమమ్** = సర్వోత్కృష్టము; **గుహ్యమ్** = రహస్యము, **అధ్యాత్మ సంజ్ఞితమ్** = అధ్యాత్మము (ఆత్మపై కేంద్రితమైనది) అని పేరు గన్న; **యత్** = ఏ; **వచః** = మాట; **ఉక్తమ్** = చెప్పబడినదో; **తేన** = దానిచేత; **అయమ్** = ఈ; **మమ** = నా; **మోహః** = మోహము; **విగతః** = తొలగిపోయినది.

**అర్జునుడిట్లు పలికెను–**

నీవు నన్ను అనుగ్రహించుట కొరకై సర్వోత్కృష్టము, రహస్యము, అధ్యాత్మము (ఆత్మపై కేంద్రితమైనది) అని పేరు గన్నది అగు ఏ వచనమును చెప్పితివో, దానిచే నా ఈ మోహము తొలగిపోయినది (1).

రెండవ అధ్యాయము ఆరంభములో అర్జునుడు తనను తాను శిష్యునిగా ప్రకటించి, శ్రీకృష్ణ భగవానుని తనకు మోక్షము నిచ్చి అనుగ్రహించుమని ప్రార్థించెను (యత్ శ్రేయః స్యాత్ నిశ్చితం బ్రూహి తత్ మే, శిష్యః తే అహమ్). అర్జునునకు తాను కోరేది ఏది అను విషయములో స్పష్టమగు కల్పన గలదు. భగవంతుడు కూడ షరతులు ఏమియూ లేకుండగా ఉపదేశించెను. ఇంతవరకు ఉపదేశమునంతనూ శ్రవణము చేసిన అర్జునుడు ఇట్లు పలుకుచున్నాడు. 'మదనుగ్రహాయ, నన్ను అనుగ్రహించుట కొరకు, యత్ త్వయా ఉక్తమ్, నాకు నీచే బోధింపబడినది, పరమం గుహ్యమ్, గొప్ప రహస్యము'. దీనికి కారణమేమనగా, ఇది శాస్త్రము తక్క మరియొక జ్ఞానసాధనముచే ఉపలభ్యము కాదు. మనము పూర్తిగా బహిర్ముఖులమై ఉన్న కారణంగా, జ్ఞాన సాధనము లభించిననూ ఆత్మ రహస్యముగనే మిగిలిపోవును.

మనకు తెలియని రహస్యములు ఎన్నియో గలవు. వాటికి విలువ ఏమి గలదు? కాని ఇది పరమ రహస్యము. మహత్త్వములో దీనితో సరిదూగునది మరియొకటి లేదు. ఇది గుప్త నిధి.

అధ్యాత్మ సంజ్ఞితమ్ అనగా ఆత్మవిద్య. ఇది గొప్ప గుప్తనిధి. 'దీనిని నీవు నాకు బోధించితివి (త్వయా ఉక్తమ్)'. ఉక్తమ్ అనగా మామూలుగా చెప్పుట కాదు; బోధించుట. ''నీ ఈ వచనములచే (తేన వచసా), ఏది ఆత్మ, ఏది అనాత్మ అను విషయములో నా భ్రాంతి తొలగిపోయినది (మోహః అయం విగతః మమ). ఆత్మ జ్ఞానమనగా ఆత్మానాత్మ వివేక జ్ఞానము తక్క వేరు గాదు. ఏది ఆత్మ, ఏది అనాత్మ, ఏది ధర్మము, ఏది అధర్మము అను విషయములో అర్జునునకు గల మోహము, తాను యుద్ధములో చంపబోయే వ్యక్తులందరి గురించిన శోకముగా అభివ్యక్తమై, అతనియందు సంఘర్షణము కలిగించినది. అది ఇప్పుడు ఇంచుమించు పూర్తిగా తొలగిపోయినది. తొమ్మిది అధ్యాయములు పూర్తియగు సరికి అతని మోహములో చాల భాగము కరిగి పోయినది. అయిననూ, అతనిలో ఇంకనూ కొన్ని సందేహములు గలవు. శ్రీ శంకరులు 'అవివేక బుద్ధిః అపహతా' అనిరి. అనగా వివేకము పూర్ణముగా ఉదయించినట్లు కాదు. అవివేక బుద్ధి మాత్రమే తొలగినది. వివేకోదయము కలిగిన వ్యక్తి 'నేను అవివేకిని' అని చెప్పడు గదా! అర్జునునిలో వివేకము ఉదయించకుండగా కొన్ని అవరోధకములగు అంశములు బాధించుచున్నవి యని తోచును.

**అధ్యాయము 11, శ్లోకము 2:**

भवाप्ययौ हि भूतानां श्रुतौ विस्तरशो मया।
त्वत्तः कमलपत्राक्ष माहात्म्यमपि चाव्ययम् ॥ २ ॥

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమల పత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ (2)

కమల పత్రాక్ష = పద్మ పత్రముల వంటి కన్నులు గల ఓ శ్రీ కృష్ణా!; భూతానామ్ = ప్రాణులయొక్క; భవాప్యయౌ = సృష్టిలయములు; మయా = నాచేత; విస్తరశః = విస్తారముగా; త్వత్తః = నీనుండి; శ్రుతౌ = వినబడినవి; చ = మరియు; అవ్యయమ్ = వినాశములేని; మాహాత్మ్యం అపి = మహిమ కూడా (వినబడినది); హి = నిశ్చయము.

పద్మ పత్రములు వంటి కన్నులు గల ఓ శ్రీ కృష్ణా! ప్రాణుల సృష్టిలయములను నేను నీ నుండి విస్తారముగా వింటిని. మరియు వినాశము లేని నీ మహిమను గురించి కూడా వింటిని (2).

అర్జునుడీ శ్లోకములో శ్రీకృష్ణుని 'కమల పత్రాక్ష' అని సంబోధించెను. ఇది చాలా అందమైన ప్రయోగము, కమల శబ్దమునకు పద్మమనియు, పత్రమనగా రేక అనియు అర్థము. పద్మపత్రము మిక్కిలి కోమలముగా నుండి కంటిని పోలియుండును. కోమలము, ఆహ్లాదకరము అగు కన్నులను పద్మ పత్రములతో పోల్చెదరు. పద్మ పత్రములవలె అతి స్వచ్ఛము, అతి కోమలము అగు కన్నులు గలవాడా అని శ్రీకృష్ణుని అర్జునుడు సంబోధించెను. దీనిని మరియొక విధముగా వ్యాఖ్యానించవచ్చును. ఇట్టి వ్యాఖ్యానములలో సంస్కృత పండితులు రమించెదరు. కం అనగా బ్రహ్మ సుఖము; అనగా ఆత్మయొక్క స్వరూప భూతమైన ఆనందము. 'అలతి' అనగా ఆ బ్రహ్మ సుఖమును ప్రకాశింప చేయుచున్నది అని యర్థము. కావున కమలమనగా ఆత్మానందమును ప్రకాశింపజేసే ఆత్మ జ్ఞానము. పతనాత్ త్రాయతే ఇతి పత్రమ్. జారిపోకుండా రక్షించేది పత్రము. ఆత్మజ్ఞానము మానవుని సంసారమునుండి రక్షించును. సంసారము నుండి రక్షించే అట్టి ఆత్మజ్ఞానము కమల పత్రము అగును. అక్ష్యతే ఇతి అక్షః. అనగా పొందబడేది, తెలియబడేది. ఆత్మ జ్ఞానముచే ఆత్మరూపునిగా తెలియబడి సంసారము నుండి మనలను రక్షించే ఈశ్వరుడు కమల పత్రాక్షుడు అనబడును. ఈ అర్థము దూరార్థమే అయినా, సంస్కృతభాషలో ఇట్టి అర్థము సంభవమే. ఒక విలక్షణమగు అర్థము సంభవమై, అది శాస్త్రవిరుద్ధము కానిచో, అట్టి అర్థమును తరచి చూచుటలో ఉల్లాసము కలుగును.

ఈ జగత్తులోని సర్వము అంతర్గతమగు విధంబున ఈశ్వరుని రూపమును ఈ

అధ్యాయము వర్ణించును. విరాట్ స్వరూపమునకు బాహ్యముగా ఏదీ లేదు. కావున ఈ అధ్యాయములో కవితా వర్ణన అధికముగా నుండును. ఆ దృష్టితో చూస్తే ఇది చాలా అభిరుచిని కలిగించే అధ్యాయము. ద్వైత భక్తుల దృష్టిలో ఇది సర్వోత్కృష్టమగు అధ్యాయము. జిజ్ఞాసువు ఈ అధ్యాయమును సరియగు రీతిలో అర్థము చేసుకొనవలెను. జగత్తులోని సమస్త అంశములు విరాడ్రూపములో అంతర్గతమగును. భగవానుడు తాను అభివ్యక్తమయ్యే వేర్వేరు రూపములను ఇంతకుముందు చెప్పియున్నాడు. ఇప్పుడు ఒకే రూపములో సర్వము అంతర్భూతమగును. దారము పూసలన్నింటి గుండా దూరి వాటినన్నిటినీ ఒక చోటకు చేర్చిన విధంబున (సూత్రే మణిగణా ఇవ), ఈశ్వరుడు సర్వమునందు అంతర్నిహితుడై యున్నాడు. ఎచ్చట ఏ విభూతి అభివ్యక్తమైనా, అది భగవానునిదే. ఈ అధ్యాయములో వర్ణింపబడే విశ్వరూపములో సర్వము అంతర్గతమై యున్నది. విభూతి యోగములో భగవానుని అంతర్యామిత్వము నిర్దేశింపబడగా, ఇచట సర్వరూపములను తనలో ఇముడ్చుకున్న భగవానుని స్వీయరూపము నిర్దేశింపబడినది.

'నేను రెండు విషయములను వింటిని (భూతానాం భవ-అప్యయౌ)' అని అర్జునుడు చెప్పుచున్నాడు. భవమనగా సృష్టి. అప్యయమనగా ప్రళయము. నేను సర్వప్రాణుల (భూతానామ్) సృష్టిలయముల గురించి విన్నాను. స్థూల సూక్ష్మ ఉపాధులు మరియు ఆకాశ, వాయు, అగ్ని, అపః, పృథివి అనే పంచ భూతములు, వాటి సృష్టిలయములు అను విషయముల గురించి అతడు వినియున్నాడు. ఎట్లు? విస్తారముగా (విస్తరశః). ఎవరినుండి? నీ నుండి (త్వత్తః). '' భగవాన్! నీ కృపవలన ఈ విషయముల నన్నింటినీ నీ నుండి వింటిని''. సంక్షిప్తముగా గాక, విస్తారముగా వినినాడు. ఏలయన, ఏడవ అధ్యాయమునుండి మొదలిడి భగవానుని మహిమను గూర్చి భగవానుడే స్వయముగా వర్ణించినాడు. మరియు సృష్టి ప్రక్రియను, లయమును, మరణమును, మరణానంతర గతిని వివరించినాడు. ఈ సర్వము చర్చించబడినది.

ఇంకనూ చెప్పినాడు. మాహాత్మ్యం చ అవ్యయమ్. సర్వవ్యాపకమగు గొప్ప (మహాన్) ఆత్మ గలవాడు మహాత్ముడు. ఇచట మహాత్ముడనగా ఈశ్వరుడు. మహాత్ముని స్వభావము మాహాత్మ్యము. అనగా ఈశ్వరుని మహిమ. అర్జునుడు ఈ అధ్యాయములలో ఈశ్వరుని మహిమను గురించి శ్రవణము చేసినాడు. ఈ మహిమ అవ్యయమైనది. ఇచట అవ్యయమనగా శాశ్వతమని యర్థము. ప్రవాహ నిత్యమని గాదు. ఈ మహిమ సృష్టులన్నిటియందు మరల మరల వ్యక్తమగుచుండును. ఓ భగవాన్! నీ మహిమ, నీ ఐశ్వర్యము వినాశి గాదు. అది అవ్యయము. ఈశ్వరుని గుణములు పూర్ణములు గనుక, కాలాధీనములు గావు. వాక్యము పూర్తియగుట కొరకై

్రుతమ్ అను పదమును జోడించుకొనవలెను. మాహాత్మ్యం చ అవ్యయం శ్రుతమ్.

తరువాతి శ్లోకములో అర్జునుడు తన అకాంక్షను సుస్పష్టముగా ప్రకటించుచున్నాడు:

**యాయము 11, శ్లోకము 3:**

एवमेतद्यथात्थ त्वमात्मानं परमेश्वर।
द्रष्टुमिच्छामि ते रूपमैश्वरं पुरुषोत्तम ॥ ३॥

ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ (3)

పరమేశ్వర = ఓ పరమేశ్వరా!; త్వమ్ = నీవు; ఆత్మానమ్ = నీ గురించి; యథా = ఏ గా; ఆత్థ = చెప్పితివో; ఏ తత్ = ఇది; ఏవమ్ = అటులనే యున్నది; పురుషోత్తమ = ఓ షోత్తమా!; తే = నీ యొక్క; ఐశ్వరమ్ = ఈశ్వర సంబంధియగు; రూపమ్ = రూపమును; ష్టుమ్ = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

ఓ పరమేశ్వరా! నీవు నీగురించి ఎట్లు చెప్పితివో, అదంతయూ బాగున్నది.
ఓ పురుషోత్తమా! నేను నీ ఈశ్వరీయ రూపమును చూడగోరుచున్నాను
(3).

'ఓ భగవాన్! నీవు నీ గురించి నాతో చెప్పినదంతయూ (త్వం ఆత్మానం యథా ఆత్థ)' పరమ అనగా దేశ కాల వస్తు పరిచ్ఛేదరహితుడు. ఈశ్వర అనగా సర్వకారణుడు, సర్వమునకు అధీశ్వరుడు. ఓ పరమేశ్వరా! ఏవమేతత్. నీవు నీ రూపమును గురించి చెప్పినదంతయూ సత్యమని నేను అంగీకరించు చున్నాను.'తద్భిన్నము కాదు' అని శ్రీ శంకరులు జోడించిరి. నీవు చెప్పినది సత్యమని నేను తెలుసుకున్నాను. తెలిసినది గనుక అంగీకరించుచున్నాను. ఇచటి తాత్పర్యము ఇది. శ్రీ కృష్ణుడు చెప్పినదానిని అర్జునుడు ప్రమాణీకరించు చున్నాడను కోరాదు. 'నేను ఇది, నేను అది అని నీవు నీ గురించి చెప్పినప్పుడు, నీవు నీ సర్వవ్యాపకత్వమును గురించి చెప్పినావు''.

అర్జునుడు భగవానుని బ్రతిమిలాడుచున్నాడు గనుక, పురుషోత్తమ అని మరియొక సంబోధనము ప్రయోగించినాడు. సర్వ ప్రాణులలో ఉత్తముడు గనుక పురుషోత్తముడనబడును.

శ్రీకృష్ణుని రూపము ఈశ్వరుని రూపమే గనుక, అర్జునుడు 'ఐశ్వరం రూపమ్' అని ప్రయోగించినాడు. 'జ్ఞానము, అధీశ్వరత్వము, శక్తి, బలము, సృష్టించే సామర్థ్యము మరియు మహిమలతో సంపన్నమైనవాడు (జ్ఞాన-ఐశ్వర్య-శక్తి-బల-వీర్య-తేజోభిః సంపన్నః)' అని శ్రీ శంకరులు ఈశ్వర శబ్దమును నిర్వచించిరి★. ఇది విద్యాసంప్రదాయములో భగవాన్ అనుపదమునకు ఈయబడే మరియొక నిర్వచనము.

ఈ రూపము ఈశ్వరునికి చెందినది గాన 'ఐశ్వరం రూపమ్' అనబడును. దానిని అర్జునుడు చూడగోరుచున్నాడు (ద్రష్టుం ఇచ్ఛామి). శ్రీ కృష్ణభగవానుని తన విశ్వరూపమును చూపుమని గోరుటకు ఇది చక్కని అవకాశమని అర్జునుడు ఎరుంగును. కాని భగవానుడు చూపించునా, చూపించడా యను శంక అతనిలో కొద్దిగా గలదు. దానిని అతడు తరువాతి శ్లోకములో వ్యక్తము చేయుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 4:**

मन्यसे यदि तच्छक्यं मया द्रष्टुमिति प्रभो ।
योगेश्वर ततो मे त्वं दर्शयात्मानमव्ययम् ॥ ४ ॥

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ (4)

ప్రభో = ఓ ప్రభో!; యోగేశ్వర = యోగులలో ఈశ్వరుడా!; మయా = నాచేత; తత్ = ఆ విశ్వరూపము; ద్రష్టుమ్ = చూచుటకు; శక్యమ్ = శక్యము; ఇతి = అని, యది మన్యసే = నీవు తలంచినచో; తతః = అప్పుడు; త్వమ్ = నీవు; మే = నాకు; అవ్యయమ్ = వినాశము లేని; ఆత్మానమ్ = నీ రూపమును; దర్శయ = చూపించుము.

ఓ ప్రభూ! యోగులలో సర్వోత్తముడైన వాడా! నేను ఆ విశ్వరూపమును చూచుట సంభవమేనని నీవు తలంచినచో, నాకు నీ వినాశములేని రూపమును చూపించుము (4).

---

★ జ్ఞాన, ఐశ్వర్య, వైరాగ్య, యశస్, శ్రీ, వీర్యములు గలవాడు భగవానుడు అనే ప్రసిద్ధమగు నిర్వచనమును మనమింతకు ముందు చూచియున్నాము.

చూడాలనే ఆకాంక్ష అర్జునునకు గలదు. కాని తుది నిర్ణయము భగవానునిదే. మానవులు చాల అధికమును కోరే సందర్భాలలో 'నేను చాల అధికమును కోరుట లేదనుకుంటాను...' అని ఆరంభిస్తారు. అది అధికమును కోరుటకు ఉపయోగించే ఉపోద్ఘాతము. కావున అర్జునుడు ఇట్లు అనుచున్నాడు. ఓ భగవాన్! నేను ఆ రూపమును చూచుట సంభవమేనని నీవు తలంచినచో (మన్యసే యది తత్ శక్యం మయా ద్రష్టుం ఇతి ప్రభో). తనకు గల ప్రాకృత చక్షువులు చాలవనియు, తాను అర్హుడు కాదనియు అతడు ఎరుంగును. విశ్వరూపమును దర్శించుటకు అధిక దర్శన శక్తి గల కన్ను అవశ్యకమగును. అట్టి కన్నును ఇమ్మని అంతరార్థము వచ్చునట్లు పలికినాడు. అతడు శ్రీ కృష్ణుని 'ప్రభో!' అనగా 'సర్వమును ఇచ్చే భగవానుడా!' అని సంబోధించినాడు. ఈ అధ్యాయము సంబోధనలతో నిండియున్నదని మనకు స్పష్టము కాగలదు. అర్జునుడింకనూ 'యోగులకు అధీశ్వరా! (యోగేశ్వర)' అని సంబోధించుచున్నాడు. సన్న్యాసులు పొందే మోక్షము అనే లక్ష్యమును సాధించినవాడు యోగి అనబడును. అట్టి యోగము గలవాడు యోగః అని, లేదా యోగీ అని పిలువబడును. యోగులు అనేకులు గలరు. వారందరికీ అధీశ్వరుడు శ్రీకృష్ణుడు. ఆయన యోగులలో సర్వశ్రేష్ఠుడు. ఆయన యోగమాయను తన వశము చేసుకున్న మాయావి.

యోగి ఎవ్వరైననూ చేయగలిగే కనీస కర్తవ్యము శరీరమును తన వశములో నుంచుకొనుట. దానికి ఆసన సిద్ధి యని పేరు. తరువాత అతడు యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యాన, సమాధులచే తన ఆరోగ్యమును పరి రక్షించుకొనుటయే గాక, ఇంద్రియములను కూడ జయించగల్గును. యోగి ఆత్మ నియంత్రణను సాధించుటలో ఈ అష్టాంగయోగము సహకరించును. యోగి యొక్క జీవనము పొందికగా నుండును. అట్టి యోగి మా యాంతర్గతములైన అణిమా, లఘిమా ఇత్యాది విశిష్ట అంతశ్శక్తులను (సిద్ధులను) నియంత్రణలో ఉంచుకొన గల్గును. యోగ సూత్రములలో ఈ సిద్ధులను బోధించే ప్రత్యేక ప్రకరణము గలదు. ఇట్టి యోగులు ప్రాచీనకాలములో మాత్రమే ఉండెడివారని తోచును. ఇతరయోగులు ఏవో కొన్నింటిని మాత్రమే వశము చేసుకొనగా, శ్రీ కృష్ణ భగవానుడు సర్వమును తన వశములో నుంచుకున్న యోగీశ్వరుడు. ఆయన యోగమాయతో జగత్తును ఆడించే మాయావి. 'మాయా సహకారముతో ఈ విశిష్ట రూపమును ధరించి నేను అవతరించినాను (ఆత్మ మాయయా అహం సంభవామి)' అని ఆయన స్వయముగా చెప్పినాడు. కావున అర్జునుడు 'యోగేశ్వర' అని చేసిన సంబోధన స్పష్టముగా తెలిసి చేసిన సంబోధనయే గాని మరియొకటి కాదు. "నీవు యోగేశ్వరుడవు గనుక నీ శక్తులలో కొన్నింటిని తేలికగా నాకు ఈయగలవు. నేను అప్పుడు నీ ఉజ్జ్వల రూపమును దర్శించెదను. కావున ఇది సంభవమేనని నీవు తలంచినచో (తతః), నాకొరకై దయతో నీ నాశము లేని (అవ్యయ)

ఈశ్వరీయ రూపమును (ఆత్మానమ్) నాకు చూపించుము (దర్శయ)'. కాలాధీనమగు జగత్తు ప్రలయములో నశించిననూ, అది మరల ఉద్భవించును గనుక, జగత్తు ప్రవాహనిత్యము.

అర్జునుడు ఇట్లు ప్రార్థించినాడు గనుక, దానిని మన్నించాలా, వద్దా అను విషయమును శ్రీ కృష్ణుడు నిర్ణయించవలెను. ఆయన తిరస్కరించి, చర్చా విషయమును మార్చి వేయవచ్చును. కాని ఆయన ఆ పరిస్థితిలో ఉపదేశమునకు అనువైన అవకాశమును దర్శించినాడు. ఆయన తన విశ్వరూపమును ఉపదేశములో భాగముగా చూపించవచ్చును. ఆయన ఇంతవరకు మౌఖికముగా ఉపదేశించెను. కంటికి కనబడునట్లు ఉండే (Visual) ప్రక్రియతో ఉపదేశించే అవకాశము ఇప్పుడు వచ్చినది. అట్టి బోధవలన అర్జునునకు మేలు జరుగగలదని శ్రీకృష్ణుడు తలంచెను. 'ఈ సమస్యలన్నింటికీ నేను కారణమగుట నాకు సమ్మతము కాదు. నాకు పాపము చుట్టు కొనును' అని అర్జునుడు మొదటి అధ్యాయములో చెప్పినాడు గదా! అపుడాతని అంతఃకరణములో ఈ సర్వమునకు తానే కర్తననే అతిశయించిన ధారణ ఉండెను. కావున ఒకే ఒక పురుషుడు గలడనియు, 'మిగిలినది' అంతా ప్రకృతియేననియు స్పష్టముగా నిరూపించే అవసరమాసన్నమైనదని శ్రీ కృష్ణుడు తలపోసి యుండవచ్చును. ఆ ఏకైక పురుషుడే పురుషోత్తముడు. ఆయనయే ఆత్మ. సర్వశాస్త్రోపదేశ సారము అదియే. ఇంతకు మించి మరియొకటి లేదు.

'యుద్ధము చేస్తే పాపము చుట్టుకొనును' ఇత్యాదిగా అర్జునుడు యుద్ధమును వ్యతిరేకిస్తూ చేసిన ప్రకటనలన్నింటికీ ఈ దృశ్యబోధనా ప్రక్రియ చక్కని సమాధానము కాగలదు. భగవానుడీ సత్యమును ముందుగనే దర్శించి తన విశ్వరూపమును అర్జునునకు చూపవలెనని నిశ్చయించెను.

**అధ్యాయము 11, శ్లోకము 5:**

श्रीभगवानुवाच ।
पश्य मे पार्थ रूपाणि शतशोऽथ सहस्र शः ।
नानाविधानि दिव्यानि नानावर्णाकृतीनि च ॥ ५ ॥

శ్రీ భగవానువాచ
పశ్య మే పార్థ రూపాణి శతశోஉథ సహస్ర శః
నానా విధాని దివ్యాని నానా వర్ణాకృతీని చ (5)

శ్రీ భగవాన్ = శ్రీ భగవంతుడు; ఉవాచ = పలికెను; పార్థ = ఓ అర్జునా!; నానావిధాని

= అనేక రకములైన; దివ్యాని = ప్రకాశవంతములైన; చ = మరియు; నానా వర్ణాకృతాని = వివిధ వర్ణములు ఆకారములు గల; మే = నాయొక్క; రూపాణి = రూపములను; శతశః = వందలాదిగా; అథ = మరియు; సహస్రశః = వేలాదిగా; పశ్య = చూడుము.

శ్రీ భగవంతుడు ఇట్లు పలికెను -

ఓ అర్జునా! అనేకరకములు, ప్రకాశవంతములు, మరియు వివిధ వర్ణములు, ఆకారములు గల నా వందలాది వేలాది రూపములను చూడుము (5).

'చూడుము (పశ్య)' అని భగవానుడనుచున్నాడు. కాని భగవానుడు వెంటనే తన రూపమును చూపుట లేదు. కావున, ఇది ప్రకరణమునకు ఉపక్రమము మాత్రమే. ఇచట 'చూడుము' అనే భగవానుని వచనమునకు 'నీవు చూడబోతావు' అని అర్థము. విధులు రెండు రకములుగా నున్నవి. సంస్కృత వ్యాకరణములో వాటికి లోట్ అని పేరు. మనలను ఒక పనిని చేయుమని తిన్నగా చెప్పే విధి ఒకటి. ఉదా: కురు (చేయుము), పశ్య (చూడుము). రెండవ విధి ఆ పనిని చేసే అర్హతను సూచించును (అర్హే లోట్). ఇచట లోట్ ఈ అర్థములో వాడబడినది. 'నీకు అర్హతగలదు. నీవు ఇప్పుడు చూడబోతావు'. కావున, భగవానుడు అర్జునుని సావధానుని చేయుచున్నవాడై 'దయచేసి చూడుము (పశ్య)' అనినాడు. అయన అర్జునుని కుంతీపుత్రా! (పార్థ) అని సంబోధించుచున్నాడు. అతడు చూడవలసినది ఏది?

మే రూపాణి, నా రూపములను. అవి వందలాది (శతశః), మరియు వేలాది (సహస్రశః) సంఖ్యలో గలవు. ఇచట శతసహస్ర శబ్దములకు లెక్కలేనన్ని అని యర్థము. అవి సంఖ్యాపరంగా లెక్కలేనన్ని ఉండుటయే గాదు. అనంత వైవిధ్యము కలిగియున్నవి (నానా విధాని). ప్రతిరూపము మిగిలిన రూపములకంటె భిన్నమగు లక్షణములను కలిగియున్నది. మరియు వాటిలో మనకు తెలిసిన ఇహలోక రూపములు మాత్రమే గాక, మనము ఊహింపలేనివి, స్వర్గాది ఇతర లోకములలో నుండునవి (దివ్యాని) అగు రూపములు కూడ గలవు. ఈ రూపములన్నియూ విభిన్న వర్ణములు కలవి మాత్రమే గాక, విభిన్న ఆకారములను కూడ కలిగియుండెను. 'నీవు ఈ గోళముపై గల జంతువులను, మానవులను మాత్రమే ఎరుంగుదువు. ఈ భూగోళమునందైననూ నీవు ఎరుంగని జన జాతులు, ప్రాణిజాతులు అసంఖ్యాకముగా గలవు. ఇపుడు నీవు వివిధరూపములను నాయందు దర్శింపగలవు. మీ ఊరిలోని వస్తువులు మాత్రమే కానవచ్చునని తలంచకుము. నీవు ఏనాడూ

ఎరుంగని అన్ని రకముల వస్తువులను నీవు చూడగలవు' అని చెప్పి భగవానుడు అర్జునుని హెచ్చరించి సావధానుని చేయుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 6:**

पश्यादित्यान् वसून् रुद्रानश्विनौ मरुतस्तथा ।
बहून्यदृष्टपूर्वाणि पश्याश्चर्याणि भारत ॥ ६ ॥

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా
బహూన్యదృష్ట పూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత (6)

**భారత** = ఓ అర్జునా!; **ఆదిత్యాన్** = ఆదిత్యులను; **వసూన్** = వసువులను; **రుద్రాన్** = రుద్రులను; **అశ్వినౌ** = అశ్వినీ దేవతలను; **మరుతః** = మరుద్గణములను; **తథా** = మరియు; **బహూని** = అనేకములైన; **అదృష్ట పూర్వాణి** = ఇంతకు ముందు కనని; **ఆశ్చర్యాణి** = ఆశ్చర్యములను; **పశ్య** = చూడుము.

> ఓ అర్జునా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ దేవతలను, మరుద్గణములను, మరియు అనేకములైన ఇంతకు ముందు కనని ఆశ్చర్యములను చూడుము (6).

ఓ అర్జునా! వీరు పన్నెండుగురు ఆదిత్య దేవతలు. వీరు అష్టవసువులు. వీరు ఏకాదశ రుద్రులు. వీరిద్దరు అశ్వినీ దేవతలు. వీరు ఘ్రాణేంద్రియమునకు అధిష్ఠాన దేవతలని శాస్త్రము చెప్పుచున్నది. వీరు ఏడు మరుద్గణములు. నీవుగాని, మరియొకరు గాని పూర్వములో వీరిని ఎన్నడునూ చూచియుండలేదు (పూర్వం అదృష్టాని). ఇంకనూ అనేక అద్భుతరూపములు (బహూని ఆశ్చర్యాణి) గలవు. నీవు ఈ రూపములను మరియొక తీరున చూడగల్గుట అసంభవము. ఒకే రూపములో చూడగల్గుట అసంభవము. ఇంతమాత్రమే గాదు.

**అధ్యాయము 11, శ్లోకము 7:**

इहैकस्थं जगत् कृत्स्नं पश्याद्य सचराचरम् ।
मम देहे गुडाकेश यच्चान्यद् द्रष्टु मिच्छसि ॥ ७ ॥

ఇహైక స్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ ద్రష్టు మిచ్ఛసి (7)

గుడాకేశ = ఇంద్రియములను జయించిన ఓ అర్జునా!; మమ = నాయొక్క; ఇహ = ఈ; దేహే = దేహమునందు; సచరాచరమ్ = స్థావర జంగమాత్మకమగు; కృత్స్నం = సమస్తమగు; జగత్ = జగత్తును; ఏకస్థమ్ = ఒకే స్థానమునందున్న; చ = మరియు; అన్యత్ = ఇతరమును; యత్ = దేనిని; ద్రష్టుమ్ = చూచుటకు; ఇచ్ఛసి = కోరుచున్నావో; అద్య = ఇప్పుడు; పశ్య = చూడుము.

ఇంద్రియములను జయించిన ఓ అర్జునా! నా ఈ దేహమునందు ఒక్క స్థానమునందున్న స్థావర జంగమాత్మకమగు సమస్త జగత్తును, మరియు ఇంకనూ నీవు చూడగోరే ఇతరమును ఇప్పుడు చూడుము (7).

భగవానుడు అర్జునుని 'గుడాకేశా' అని పిలిచి సావధానుని చేయుచున్నాడు. గుడాకేశుడనగా తన జ్ఞానేంద్రియములను నియంత్రించిన వాడని మనము చూచియున్నాము. 'ఇచట ఒకే స్థానమునందు నా దేహములో నివసించియున్న సర్వజగత్తును ఈ క్షణములో చూడుము'. ఈ జగత్తు కదిలేవి, కదలనివి అని రెండు రకములుగా విభజింపబడియున్నది. 'ఓ అర్జునా! ఈ సర్వమును ఒకే స్థానములో నా దేహమునందు చూడుము. అంత మాత్రమే గాదు. ఇంకను నీవు దేనిని చూడ గోరెదవో దానిని కూడ చూడుము (యచ్చ అన్యద్ ద్రష్టుం ఇచ్ఛసి)'. ఇంకనూ అధికముగా ఏది ఉండును? సర్వము ఈ రూపములోనే గలదు. ఈ యుద్ధములో విజయమును ఎవరు పొందెదరు? అను ప్రశ్న ఒక్కటియే మిగిలి ఉండెనని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. తమ పక్షమునకు విజయము లభించునా? లభించదా? యను సందేహము అర్జునునకు గలదు. అతనితో భగవానుడిట్లు చెప్పుచున్నాడు: 'నీవు ఆ సందేహమును, మిగిలిన సమస్త సందేహములను కూడ ఇపుడు తీర్చుకొనవచ్చును. ఈ యుద్ధమునకు రాబోవు పరిణామముతో సహా భవిష్యత్తును నీవు దర్శింపగలవు. సర్వము పూర్వమే నిర్ధారితమై యున్నది. దుర్యోధనుడు తన దుశ్చర్యలచే ఇప్పటికే తన వంశమును నాశనము చేసినాడు. నీవు నీ పాత్రను నిర్వహించుము. అంతకు మించి నీవు చేయవలసినది లేదు. ఇది బాగా ముగ్గిన పండువంటి పరిస్థితి. అట్టి పండును స్పృశించగనే నేల రాలును. అదే విధముగా దుర్యోధనుడు వినాశమునకు తయారుగా నున్నాడు. నీవు కొన్ని బాణములను ప్రయోగించిన చాలును. అంతకు మించి చేయదగినది లేదు. అతడు స్వీయకర్మచే ఇప్పటికే పతనమునకు చాల దగ్గరలో నున్నాడు. అందువలననే ఈ యుద్ధము ఆరంభమగుచున్నది.

ఈ మొత్తం ప్రక్రియలో నీవు నిమిత్తమాత్రుడవు'. ఈ మాటను కూడా భగవానుడు తరువాత చెప్పబోతాడు. ''కావున, ఈ యుద్ధము యొక్క పరిణామము ఇత్యాది ఇతర విషయములను నీవు చూడగోరుచున్నచో (యచ్చాన్యద్ ద్రష్టు మిచ్ఛసి), సర్వమును నా ఈ రూపమునందు నీవు చూడగలవు.''

**అధ్యాయము 11, శ్లోకము 8:**

न तु मां शक्यसे द्रष्टुमनेनैव स्वचक्षुषा।
दिव्यं ददामि ते चक्षुः पश्य मे योगमैश्वरम्॥ ८॥

న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వ చక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ (8)

తు = కాని; మామ్ = నన్ను; అనేన = ఈ; స్వచక్షుషా = స్వీయ నేత్రములతో మాత్రము; ద్రష్టుమ్ = చూచుటకు, న శక్యసే = సమర్థుడవు కావు; తే = నీ కొరకు; దివ్యమ్ = దివ్యమగు; చక్షుః = నేత్రమును; దదామి = ఇచ్చెదను; మే = నా యొక్క; ఐశ్వరమ్ = ఈశ్వరీయమగు; యోగమ్ = రూపమును; పశ్య = చూడుము.

కాని నీవు నన్ను నీ ఈ కన్నులతో చూడ జాలవు. కావున నీకు దివ్యమగు నేత్రమును ఇచ్చెదను. ఈశ్వరుడనగు నా రూపమును చూడుము (8).

''ఈ సర్వము నా రూపమునందు కానవచ్చుట సంభవమే. అయిననూ, ఒక సమస్య గలదు. నా ఈ విశ్వరూపమును చూచుటకు నీ కన్నులు చాలవు''.

మానవులకు సహజసిద్ధములైన కన్నులు ఏవో కొన్ని విషయములను చూడగలవే గాని, ఇంతటి పెద్ద విశ్వ రూపమును చూడలేవు. దానికి ప్రత్యేకమగు కన్నులు కావలెను. దానికి మనము జ్ఞాననేత్రము అని పేరివడమ్చును. లేదా, శ్రీకృష్ణభగవానుడు తన మాయాశక్తిచే సృష్టించిన అసాధారణ నేత్రము అనవచ్చును. ఏది ఏమైనా, భగవానుడు అర్జునునకు తన విశ్వరూపమును దర్శించే సామర్థ్యమును ఇచ్చి, 'నేను నీకు దివ్య నేత్రము నిచ్చుచున్నాను' అని చెప్పెను.

'నా అద్భుతమగు శక్తిని చూడుము (పశ్య మే యోగ మైశ్వరమ్)'. ఇచట యోగమనగా

మాయాశక్తి. దానికి సాటి మరియొకటి లేదు. తెలియగలిగే సామర్థ్యము (జ్ఞానశక్తి), సర్వ విధముల కర్మణ్యత (క్రియాశక్తి), సమస్త కామనలు (ఇచ్ఛాశక్తి) దానియందు అంతర్గతమగును. ఈ రూపములో మాయ యొక్క అద్భుతశక్తిని నీవు చూడుము. తన మాయాశక్తిని కన్నుల యెదుట చూడగలిగే సామర్థ్యమును భగవానుడు అర్జునునకిచ్చెను.

ఇపుడు దృశ్యము మారును. ఈ సంవాదమును సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుచున్నాడనే సంగతి మనకు గుర్తు చేయబడును. శ్రీ కృష్ణార్జున సంవాదమంతయూ ఉదాహృత ప్రసంగము (quote) మాత్రమే. ఇపుడు సంజయుడు తిన్నగా ధృతరాష్ట్రునితో మాటలాడుచున్నాడు. విశ్వరూపమును అతడు కూడా దర్శించినాడు గనుక, అతనికి కూడా దివ్యనేత్రము గలదు. సంజయుడిట్లు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 9 :**

संजय उवाच
एवमुक्त्वा ततो राजन् महायोगेश्वरो हरिः ।
दर्शयामास पार्थाय परमं रूपमैश्वरम् ॥ ९ ॥

సంజయ ఉవాచ
ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ (9)

**సంజయః** = సంజయుడు; **ఉవాచ** = పలికెను; **రాజన్** = ఓ మహారాజా!; **తతః** = అప్పుడు; **మహాయోగేశ్వరః** = యోగులందరికీ అనంత ప్రభువు అగు; **హరిః** = సర్వపాపములను హరించు భగవానుడు; **ఏవమ్** = ఇట్లు; **ఉక్త్వా** = పలికి; **పరమమ్** = సర్వమును తనయందు ఇముడ్చుకున్న; **ఐశ్వరమ్** = ఈశ్వరీయమగు; **రూపమ్** = రూపమును; **పార్థాయ** = అర్జునుని కొరకు; **దర్శయామాస** = చూపించెను.

ఓ మహారాజా! అప్పుడు యోగులందరికీ అనంత ప్రభువు సర్వపాపహారకుడు అగు భగవానుడు ఇట్లు పలికి సర్వమును తనయందు ఇముడ్చుకున్న ఈశ్వరీయమగు రూపమును అర్జునుని కొరకు చూపించెను (9).

'మహారాజా! అర్జునుడిట్లు పలుకగానే, భగవానుడు ఆతనికి తన రూపమును చూపించినాడు'. సంజయుడిచట శ్రీ కృష్ణుని రెండు విశేషణములతో వర్ణించినాడు. అనంతుడు, మరియు యోగులందరికీ ప్రభువు (మహాయోగేశ్వరః); తన కృపచే పాపములన్నిటినీ దహించువాడు (హరిః). ఆయన అర్జునకు చూపించిన రూపములో ఇతర రూపములన్నియూ అంతర్గతమై యుండును గనుక, అది పరమమనబడును. ఒక విశిష్టరూపము ఇతర రూపముల నన్నిటినీ నిషేధించును. ఇది సామాన్య నియమము. కాని ఇచట ఈ ఒక్క రూపములో ఇతరరూపములన్నియు తమ స్వీయరూపములను నిలబెట్టుకుంటూనే అంతర్గతమగును. ఇది దీనిలోని సౌందర్యము. మైనపు బొమ్మలనన్నింటినీ కరిగించి ముద్ద చేస్తే, ఆ వేర్వేరు రూపములన్నీ అదృశ్యమగును. కాని ఇచట ఏకైక విస్తృత దర్శనములో రూపములన్నియూ కానవచ్చును. ఇట్టి విశ్వరూపమును భగవానుడు అర్జుననకు చూపించెను. సంజయుడు ఆ ఘట్టమునంతనూ స్వీయవచనములలో ఇంకను ఇట్లు వర్ణించుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 10:**

अनेक वक्त्रनयन मनेकाद्भुत दर्शनम् ।
अनेक दिव्याभरणं दिव्यानेकोद्यतायुधम् ॥ १० ॥

అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం దివ్యానే కోద్యతాయుధమ్ (10)

**అనేక వక్త్ర నయనమ్** = లెక్కలేనన్ని నోళ్ళు, కన్నులు గలిగినట్టియు; **అనేక – అద్భుత దర్శనమ్** = లెక్కలేనన్ని వింత దృశ్యములు కలిగినట్టియు; **అనేక దివ్య–అభరణమ్** = లెక్కలేనన్ని దివ్యములైన అభరణములు కలిగి నట్టియు, **దివ్యా నేకోద్యతాయుధమ్** = ప్రయోగమునకు సిద్ధముగా నున్న లెక్కలేనన్ని దివ్యములగు ఆయుధములు కలిగినట్టియు.

ఆ విశ్వరూపము లెక్కలేనన్ని నోళ్లు, కన్నులు కలిగి యుండెను. దానిలో లెక్కనేనన్ని వింతదృశ్యములుండెను. లెక్కలేనన్ని దివ్యాభరణములతో అది ప్రకాశించెను. విశ్వరూపుడగు పరమేశ్వరుడు ప్రయోగించుటకు సిద్ధముగా లెక్కలేనన్ని దివ్యాయుధములను ధరించియుండెను (10).

మాయాశక్తి. దానికి సాటి మరియొకటి లేదు. తెలియగలిగే సామర్థ్యము (జ్ఞానశక్తి), సర్వ విధముల కర్మశీలత (క్రియాశక్తి), సమస్త కామనలు (ఇచ్ఛాశక్తి) దానియందు అంతర్గతమగును. ఈ రూపములో మాయ యొక్క అద్భుతశక్తిని నీవు చూడుము. తన మాయాశక్తిని కన్నుల యెదుట చూడగలిగే సామర్థ్యమును భగవానుడు అర్జునునకిచ్చెను.

ఇపుడు దృశ్యము మారును. ఈ సంవాదమును సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుచున్నాడనే సంగతి మనకు గుర్తు చేయబడును. శ్రీ కృష్ణార్జున సంవాదమంతయూ ఉదాహృత ప్రసంగము (quote) మాత్రమే. ఇపుడు సంజయుడు తిన్నగా ధృతరాష్ట్రునితో మాటలాడుచున్నాడు. విశ్వరూపమును అతడు కూడా దర్శించినాడు గనుక, అతనికి కూడా దివ్యనేత్రము గలదు. సంజయుడిట్లు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 9 :**

संजय उवाच
एवमुक्त्वा ततो राजन् महायोगेश्वरो हरिः ।
दर्शयामास पार्थाय परमं रूपमैश्वरम् ॥ ९ ॥

సంజయ ఉవాచ
ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్ (9)

సంజయః = సంజయుడు; ఉవాచ = పలికెను; రాజన్ = ఓ మహారాజా!; తతః = అప్పుడు; మహాయోగేశ్వరః = యోగులందరికి అనంత ప్రభువు అగు; హరిః = సర్వపాపములను హరించు భగవానుడు; ఏవమ్ = ఇట్లు; ఉక్త్వా = పలికి; పరమమ్ = సర్వమును తనయందు ఇముడ్చుకున్న; ఐశ్వరమ్ = ఐశ్వర్యయుతమగు; రూపమ్ = రూపమును; పార్థాయ = అర్జునుని కొరకు; దర్శయామాస = చూపించెను.

ఓ మహారాజా! అప్పుడు యోగులందరికి అనంత ప్రభువు సర్వపాపహారకుడు అగు భగవానుడు ఇట్లు పలికి సర్వమును తనయందు ఇముడ్చుకున్న ఐశ్వర్యయుతమగు రూపమును అర్జునుని కొరకు చూపించెను (9).

'మహారాజా! అర్జునుడిట్లు పలుకగానే, భగవానుడు అతనికి తన రూపమును చూపించినాడు'. సంజయుడిచట శ్రీ కృష్ణుని రెండు విశేషణములతో వర్ణించినాడు. అనంతుడు, మరియు యోగులందరికీ ప్రభువు (మహాయోగేశ్వరః); తన కృపచే పాపములన్నిటినీ దహించువాడు (హరిః). ఆయన అర్జునకు చూపించిన రూపములో ఇతర రూపములన్నియూ అంతర్గతమై యుండును గనుక, అది పరమమనబడును. ఒక విశిష్టరూపము ఇతర రూపముల నన్నిటినీ నిషేధించును. ఇది సామాన్య నియమము. కాని ఇచట ఈ ఒక్క రూపములో ఇతరరూపములన్నియు తమ స్వీయరూపములను నిలబెట్టుకుంటూనే అంతర్గతమగును. ఇది దీనిలోని సౌందర్యము. మైనపు బొమ్మలనన్నింటినీ కరిగించి ముద్ద చేస్తే, ఆ వేర్వేరు రూపములన్నీ అదృశ్యమగును. కాని ఇచట ఏకైక విస్తృత దర్శనములో రూపములన్నియూ కానవచ్చును. ఇట్టి విశ్వరూపమును భగవానుడు అర్జునునకు చూపించెను. సంజయుడు ఆ ఘట్టమునంతనూ స్వీయవచనములలో ఇంకను ఇట్లు వర్ణించుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 10:**

अनेक वक्त्रनयन मनेकाद्भुत दर्शनम् ।
अनेक दिव्याभरणं दिव्यानेकोद्यतायुधम् ॥ १० ॥

అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్
అనేక దివ్యాభరణం దివ్యానే కోద్యతాయుధమ్ (10)

**అనేక వక్త్ర నయనమ్** = లెక్కలేనన్ని నోళ్ళు, కన్నులు గలిగినట్టియు; **అనేక –అద్భుత దర్శనమ్** = లెక్కలేనన్ని వింత దృశ్యములు కలిగినట్టియు; **అనేక దివ్య–ఆభరణమ్** = లెక్క లేనన్ని దివ్యములైన ఆభరణములు కలిగి నట్టియు, **దివ్యా నేకోద్యతాయుధమ్** = ప్రయోగమునకు సిద్ధముగా నున్న లెక్కలేనన్ని దివ్యములగు ఆయుధములు కలిగినట్టియు.

> ఆ విశ్వరూపము లెక్కలేనన్ని నోళ్లు, కన్నులు కలిగి యుండెను. దానిలో లెక్కనేనన్ని వింతదృశ్యములుండెను. లెక్కలేనన్ని దివ్యాభరణములతో అది ప్రకాశించెను. విశ్వరూపుడగు పరమేశ్వరుడు ప్రయోగించుటకు సిద్ధముగా లెక్కలేనన్ని దివ్యాయుధములను ధరించియుండెను (10).

**అధ్యాయము 11, శ్లోకము 11:**

दिव्यमाल्यांबरधरं दिव्यगन्धानुलेपनम् ।
सर्वाश्चर्यमयं देवमनन्तं विश्वतो मुखम् ॥ ११ ॥

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధాను లేపనమ్
సర్వాశ్చర్యమయం దేవమనంతం విశ్వతో ముఖమ్ (11)

**దివ్యమాల్యాంబరధరమ్** = దివ్యమగు పుష్పమాలలను వస్త్రములను ధరించి ఉన్నట్టియు; **దివ్యగంధాను లేపనమ్** = దివ్యమైన గంధముతో చర్చితమైనట్టియు; **సర్వాశ్చర్యమయమ్** = సర్వవిధముల ఆశ్చర్యములతో నిండి ఉన్నట్టియు; **దేవమ్** = ప్రకాశవంతమైనట్టియు; **అనంతమ్** = అంతము లేనట్టియు; **విశ్వతో ముఖమ్** = అన్ని దిక్కులయందు విస్తరించి ఉన్నట్టియు.

దివ్యమగు పుష్పమాలలను, వస్త్రములను ధరించి దివ్యగంధముతో చర్చితమైయున్న ఆ విశ్వరూపము ఆశ్చర్యములతో నిండియుండెను. ప్రకాశవంతమగు ఆ అనంతమగు విశ్వరూపము దిక్కులన్నింటియందు విస్తరించి యుండెను (11).

శ్రీ కృష్ణుడు అర్జునునకు చూపిన రూపము ఈశ్వరుని మాయా శక్తి. దానినే సంజయుడు కూడ చూచినాడు. అతిశయించిన విస్తారముగల ఆ రూపమునకు నోరు ఒకటి కాదు. కోట్లాది నోళ్లు (అనేక వక్త్ర) మరియు కళ్లు (అనేక నయన) ఉండెను. ఆ రూపము ఇచట నాటకీయముగా వర్ణింపబడుచున్నది. అసంఖ్యాకములగు ఆశ్చర్య జనకములైన వస్తువులతో గూడిన ఆ రూపము విస్మయమును గలిగించినదని (అనేక అద్భుత దర్శనమ్) శ్రీ శంకరులు వివరించిరి. ఇంతకు ముందెన్నడూ చూడని రూపములు ఒక దానిని మించి మరియొకటి మనస్సుపై ముద్రను వేయజాలి యుండెను. మరియు ఆ విశ్వరూపము ఊహింపశక్యము గాని వేలాది ఉజ్జ్వలా భరణములతో నిండియుండెను (అనేక దివ్యాభరణమ్). ఇంతేగాక వినాశ సమర్థములగు గొప్ప గొప్ప మారణాయుధములు ఆ విశ్వరూపములో సన్నద్ధముగా నుండెను (దివ్య-అనేక-ఉద్యత-ఆయుధమ్). అవి మనకు తెలిసిన సామాన్య ఆయుధములు కావు. అవి ఈ లోకమునకు చెందని దివ్య ఆయుధములు. ఈ విశ్వరూపములో నిరంతరముగా వినాశము కొనసాగుచుండెను. కావున అన్ని విధముల వినాశమునకు అనురూపమైన ఆయుధములు ఏ

క్షణములోనైననూ ప్రయోగించుటకు సిద్ధముగా నుండెను. అర్జునుడు దీనినంతయూ చూచెను.

ఆ విశ్వరూపము ఊహకు అందని దివ్యపుష్పమాలలతో, మరియు దివ్యాభరణములతో అలంకరింపబడి యుండెను (దివ్య-మాల్య-అంబర-ధరమ్). ఆ రూపము దివ్య సుగంధ చందన చర్చితో ప్రకాశించెను (దివ్య-గంధ-అనులేపనమ్). ఆ విశ్వరూపమంతయూ అనంతమగు మహాద్భుతము (సర్వ-ఆశ్చర్యమయం అనంతమ్), మరియు ప్రకాశవంతము (దేవమ్). అర్జునుడు ఎటు చూచినా, అంతటా అనంతమగు విశ్వరూపమే కానవచ్చెను. దానికి ఆది కాని, అంతము కాని లేకుండెను. అది నిస్సీమమగు పరిమాణము గలదై దిక్కులన్నిటియందు వ్యాపించి యుండెను (విశ్వతోముఖమ్).సర్వరూపములను తనలో నింపుకున్నది, సర్వరూపముల సారభూతమగు ఆత్మ మరియు విశ్వరూపము ఒక్కటియే. అర్జునుడు అట్టి విశ్వరూపమును చూచెను.

తరువాత సంజయుడు విశ్వరూపముయొక్క దీప్తికి ఒక దృష్టాంతమును ఇచ్చుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 12:**

दिवि सूर्यसहस्रस्य भवेद्युगपदुत्थिता।
यदि भास्सदृशी सा स्याद्भासस्तस्य महात्मनः ॥ १२ ॥

దివి సూర్య సహస్రస్య భవేద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సా స్యాద్భా సస్తస్య మహాత్మనః (12)

**దివి** = అంతరిక్షమునందు; **యుగపత్** = ఒక్కసారిగా; **సూర్యసహస్రస్య** = వేయి సూర్యుల; **ఉత్థితా భవేత్ యది** = ఉదయము కలిగినచో; **సా** = ఆ; **భాః** = కాంతి; **తస్య** = ఆ మహాత్ముని; **భాసః** = కాంతికి; **సదృశీ** = సమానమైనది; **స్యాత్** = అగును.

> అంతరిక్షమునందు ఒక్కసారిగా వేయి సూర్యులు ఉదయించినచో, ఆ కాంతి ఆ మహాత్ముని కాంతికి సమమగును (12).

వేసవిలో తీక్ష్ణముగా ఎండలు కాయుచున్న సమయములో సూర్యుని దీప్తిని ఊహించుడు. అట్టి వేయి సూర్యులు ఏకకాలములో ఆకాశమునందు ఉదయించినారనుకొనుడు. ఆ ప్రకాశము ఎట్లుండును? ఈశ్వరుని విశ్వరూపము యొక్క ప్రకాశము దానికి సరిదూగియున్నదని

సంజయుడు చెప్పుచున్నాడు. ఈశ్వరుని విశ్వరూపము వేయి సూర్యులతో సమముగా ప్రకాశించుట మాత్రమే గాక, వేయి సూర్యులకంటె అతిశయించిన ప్రకాశము గలదని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. భగవానుడు పోలికలన్నింటికీ అతీతుడు గనుక, దృష్టాంతమేదియూ సరిదూగదు. ఆ మహిమ ఊహకు కూడా అందరాదు. ఇందువలననే, వేయి సూర్యులు ఒక్కసారి ఉదయించినట్లున్నదని సంజయుడు వర్ణించినాడు. అట్లు జరుగుట సంభవము కాదు. ఆ దృశ్యమును ఊహించుటయూ కష్టమే. వేయి సూర్యులు ఆకాశములో ఒక్కసారి ఉదయించుటను నీవు ఊహించగల్గినచో, ఆ ప్రకాశము విశ్వరూపములోని ఈశ్వరుని ప్రకాశమును బోలియుండును. ఈ ఉపమ పూర్వానుభవము ఆధారంగా చెప్పినది కాదు. ఏలయన, అట్టి అనుభవమేదియూ లేదు. కావుననే 'నీవు ఊహించుము' అని సూచింపబడినది. సంస్కృత సాహిత్యములో ఇట్టి ఉపమకు సంభావిత ఉపమ అనిపేరు.

**అధ్యాయము 11, శ్లోకము 13:**

तत्रैकस्थं जगत् कृत्स्नं प्रविभक्तमनेकधा ।
अपश्यद्देवदेवस्य शरीरे पाण्डवस्तदा ॥ १३ ॥

తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్యద్దేవ దేవస్య శరీరే పాండవస్తదా (13)

**తదా** = అపుడు; **తత్ర** = ఆ; **దేవదేవస్య** = దేవదేవుని; **శరీరే** = శరీరమునందు; **అనేకధా** = అనేక విధములుగా; **ప్రవిభక్తమ్** = విభాగమును చెందియున్న; **ఏకస్థమ్** = ఒకే రూపమునందు అంతర్గతమైయున్న; **కృత్స్నమ్** = సమస్తమగు; **జగత్** = జగత్తును; **పాండవః** = అర్జునుడు; **అపశ్యత్** = చూచెను.

అపుడా దేవదేవుని శరీరమునందు అనేక విధములుగా విభాగమును చెంది ఒకే రూపమునందు అంతర్గతమై యున్న సమస్త జగత్తును అర్జునుడు చూచెను (13).

జగత్తు అంతయూ ఆ విశ్వరూపము యొక్క సీమల లోపల ఒకే రూపములో ఇమిడి యున్ననూ, జగత్తులోని వివిధవస్తువులు తమ తమ రూపములను నిలబెట్టుకొని యుండెను. దేవతలు, మానవులు, పితరులు ఇత్యాది అనేక రూపములలో జగత్తు విభజింపబడి యుండెనని

శ్రీ శంకరులు వివరించిరి. పశువులు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు ఇత్యాది సర్వులు ఒకే రూపములో అంతర్భూతులై యుండిరి. దేవదేవుడగు భగవానుని విశ్వరూప దేహమునందు అర్జునుడీ సర్వమును గాంచెను. తరువాత ఏమైనది?

**అధ్యాయము 11, శ్లోకము 14:**

ततस्स विस्मयाविष्टो हृष्टरोमा धनं जयः ।
प्रणम्य शिरसा देवं कृताञ्जलिरभाषत ॥ १४ ॥

తతస్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత (14)

**తతః** = అపుడు; **విస్మయ –ఆవిష్టః** = ఆశ్చర్యముతో నిండిన హృదయము గల; **హృష్టరోమా** = శరీరములో గగుర్పాటును పొందియున్న; **సః** = ఆ; **ధనంజయః** = అర్జునుడు; **కృతాంజలిః** = చేతులను జోడించిన వాడై; **దేవమ్** = భగవానుని; **శిరసా** = శిరస్సుతో; **ప్రణమ్య** = నమస్కరించి, **అభాషత** = పలికెను.

> అపుడు ఆశ్చర్యముతో నిండిన హృదయము గల, శరీరములో గగుర్పాటును పొందియున్న ఆ అర్జునుడు చేతులను జోడించి భగవానునకు శిరస్సుతో నమస్కరించి ఇట్లు పలికెను (14).

అర్జునుడీ సర్వమును ప్రత్యక్షముగా చూచుచుండెను. అతని స్థితి ఎట్లుండెను? అతనికి నవ్వాలో ఏడవాలో తెలియకుండెను. కొన్ని పరిస్థితులలో భావావేశములు కలగా పులగంగా ఉంటాయి. వాటి మధ్య భేదము అల్పముగా నుండును. ఒక రకం భావావేశము కలిగితే మానవుడు ఏడుస్తాడు. మరియొక భావావేశంలో నవ్వుతాడు. కాని విశ్వరూపమును చూచిన అర్జునుని భయాశ్చర్యములు ముంచెత్తినవి. అతడీ సంగతిని స్వయముగా చెప్పబోవుచున్నాడు. అతనికి అంతా కలగాపులగంగా కనబడినది. ఆ విశ్వరూపదృశ్యము అతనికి అఘాతము వలె తగిలి రోమములు నిక్కబొడుచుకొనెను. అందువలననే అతడు 'హృష్టరోమా' అని వర్ణింపబడినాడు. అర్జునుడు తలవంచి చేతులు జోడించి భగవానుని ఈ విధముగా ప్రార్థించుచున్నాడు.

అర్జునుడు స్వీయ అనుభవమును ప్రకటించుచున్నాడని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి.

**అధ్యాయము 11, శ్లోకము 15:**

अर्जुन उवाच।
पश्यामि देवांस्तव देव देहे सर्वांस्तथा भूतविशेषसंघान्।
ब्रह्माणमीशं कमलासनस्थमृषींश्च सर्वानुरगांश्च दिव्यान्॥ १५

అర్జున ఉవాచ
పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్ (15)

**అర్జునః** = అర్జునుడు; **ఉవాచ** = పలికెను; **దేవ** = ఓ దేవా!; **తవ** = నీ; **దేహే** = దేహమునందు; **సర్వాన్** = సమస్తమైన; **దేవాన్** = దేవతలను; **తథా** = అదే విధముగా; **భూతవిశేష సంఘాన్** = విభిన్న ప్రాణుల సముదాయములను; **ఈశమ్** = అధీశ్వరుడు; **కమలాసనస్థమ్** = బ్రహ్మలోకమునందు నివసించినవాడునగు; **బ్రహ్మాణమ్** = బ్రహ్మగారిని; **చ** = మరియు; **సర్వాన్** = సమస్తమగు; **ఋషీన్** = ఋషులను; **చ** = మరియు; **దివ్యాన్** =దేవలోకమునందుండే; **ఉరగాన్** = నాగులను; **పశ్యామి** = చూచుచున్నాను.

> ఓ దేవా! నీ దేహమునందు సమస్త దేవతలను, అదే విధముగా విభిన్న ప్రాణుల సముదాయములను, బ్రహ్మలోకమునందు నివసించువాడు అధీశ్వరుడునగు బ్రహ్మగారిని, సమస్త మహర్షులను మరియు దివ్యనాగులను చూచుచున్నాను (15).

'నీవు చూపిన ఈ విశ్వరూపమును నేను చూచుచున్నాను. నీ విరాడ్దేహము లోపల నేను సమస్త దేవతలను గాంచుచున్నాను (సర్వాన్ దేవాన్ పశ్యామి). వివిధ దేహములతో నలరారుచున్న విభిన్న ప్రాణుల సమూహములను గనుచున్నాను (భూతవిశేష సంఘాన్)'' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఈ ప్రాణులలో కొన్ని స్థిరముగా నుండే చెట్లు చేమలు (స్థావర) కాగా, మరికొన్ని నడయాడే పశు పక్ష్యాదులు, మానవులు ఇత్యాది (జంగమ) అని శ్రీ శంకరులు వివరించిరి. ''విభిన్న సముదాయములుగా వర్గీకరింపబడియున్న ఈ వివిధ ప్రాణులను నీయందు నేను చూచు చున్నాను.''

సర్వమును సృష్టించిన చతుర్ముఖ బ్రహ్మదేవుని (బ్రహ్మాణమీశమ్) అర్జునుడు చూచెను.

ఈ బ్రహ్మ శబ్దమునకు ఇచట పరం బ్రహ్మ అర్థము కాదు. అర్జునుడు ఆత్మాభిన్నమగు పరబ్రహ్మమును దర్శించుట లేదు. అతడు చూచుచున్నది సర్వము పరమేశ్వరునికంటె భిన్నము కాకపోయిననూ, అపరావిద్యాంతర్గతమైనదియే. ఈ బ్రహ్మగారు బ్రహ్మలోకమునందు ఉపవిష్టుడై యుండును (కమలాసనస్థః). అనగా అర్జునుడు బ్రహ్మలోకమును చూచుచున్నాడనియే గదా! 'మరియు దేవతారూపములో నున్న ఋషులను, వాసుకి మొదలగు దేవ సర్పములను (ఉరగ) నేను చూచు చున్నాను' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఉరస్ అనగా వక్షస్స్థలము. గ అనగా నడుచుట. ఉరసా గచ్ఛతి ఇతి ఉరగః. అనగా వక్షస్స్థలముతో నడుచునది. అనగా పాము. దేవలోకములోని నాగములలో వాసుకి మిక్కిలి ప్రఖ్యాతి గాంచెను. ఆ వాసుకిని ఇప్పుడు అర్జునుడు చూచుచున్నాడు. భూలోకమునందలి సర్పములు కూడ విశ్వరూపములోనివే. కాని అర్జునుడు వాసుక మొదలగు దేవలోక సర్పములను చూచుచున్నాడు గనుక, ఇవి పరిగణనలోనికి రావు.

మరియు,

**అధ్యాయము 11, శ్లోకము 16:**

अनेकबाहूदरवक्त्र नेत्रं पश्यामि त्वां सर्वतोऽनन्तरूपम् ।
नान्तं न मध्यं न पुनस्तवादिं पश्यामि विश्वेश्वर विश्वरूप ॥ १६ ॥

అనేక బాహూదరవక్త్ర నేత్రం పశ్యామి త్వాం సర్వతోనంతరూపమ్
నాంతం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప (16)

**విశ్వేశ్వర** = జగత్ప్రభూ!; **విశ్వరూప** = జగద్రూపములో నున్నవాడా!; **అనేక బాహూదర వక్త్ర నేత్రమ్** = లెక్కలేనన్ని బాహువులు, ఉదరములు, నోళ్లు, కన్నులు కలిగిన, **సర్వతః** = అన్నివైపులనుండియూ; **అనంతరూపమ్** = అంతము లేని రూపములు గల; **త్వామ్** = నిన్ను; **పశ్యామి** = చూచు చున్నాను; **తవ** = నీ; **అంతమ్** = అంతమును; **న పశ్యామి** = కనలేకున్నాను; **మధ్యమ్** = మధ్యభాగమును; **న** = కనలేకున్నాను; **పునః** =మరియు; **ఆదిమ్** = ఆరంభమును; **న** = కనలేకున్నాను.

ఓ జగత్ప్రభూ! జగద్రూపములో నున్నవాడా! లెక్కలేనన్ని చేతులు, ఉదరములు, నోళ్లు, కన్నులు కలిగి అన్నివైపుల నుండియూ అంతములేని

రూపములు గల నిన్ను చూచు చున్నాను. నీ రూపము యొక్క ఆదిని
గాని, అంతమును గాని, మధ్య భాగమును గాని కనలేకున్నాను (16).

'నీకు అసంఖ్యాకములగు చేతులు, ఉదరములు, నోళ్లు, మరియు కన్నులు గలవు' అని అర్జునుడు కొనసాగించుచున్నాడు. 'అనేక' అను శబ్దమునకు 'ఒకటి కాదు' అని అర్థము. అనగా రెండు కూడా కావచ్చును. కాని ఈ సందర్భములో 'అసంఖ్యాకములు' అని అర్థము. 'నేను నీ అనంతరూపములను (అనంత రూపమ్) చూచుచున్నాను'. ఇది అంతా భగవానుని మాయ గనుక, అర్జునుడు పురాణములలో చదివిన, విన్న దేవతలను, యక్షులను, ఇతర దేవగణములను అందరినీ ఇప్పుడు చూడగల్గుచున్నాడు.

అర్జునునకు ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని తెలిసిన సర్వము భగవానుడు చూపించిన విశ్వరూపములో అంతర్భాగమై యుండెను. తనకు తెలిసిన సర్వము విశ్వరూపములో కనబడినప్పుడు మాత్రమే అర్జునునకు శ్రద్ధ కుదురును. యక్షుడు అనేవాడు ఉన్నా లేకపోయినా భగవానుడు యక్షుని చూపించినాడు. ఏలయన, అర్జునునకు యక్ష, రాక్షస, అసుర, సిద్ధ, ఋషుల యందు విశ్వాసము గలదు. వీరందరు పురాణములలో వర్ణింపబడినారు. విశ్వములో ఏమేమి ఉండును? అను విషయములో అర్జునునకు ఒక కల్పన గలదు. 'నాకు విశ్వరూపమును చూపించుము' అని కోరిన అర్జునుడు వీరందరూ దానిలో కనబడుదురని అపేక్షించును గదా! అతనికి వీరందరూ కనబడిరి. మనకు తెలిసిన విశ్వములో ఉపగ్రహములు, అంధకార గర్తములు (black holes) ఇత్యాదులు గలవు. మనముందు శ్రీ కృష్ణుడు విశ్వరూపమును చూపించినచో, ఈ అంధకారగర్తములు మొదలగు వాటిని, దానిలో అంతర్భాగము చేసి యుండెడి వాడు. అప్పుడు మన దృష్టిలో సర్వము దానిలో అంతర్భాగమగును.

'దీని అంతము నాకు కానవచ్చుట లేదు (నాంతం పశ్యామి)'. దీనికి అగ్రము గాని, అడుగు భాగము గాని లేదు. ఎటు చూసినా అది అనంతముగా నుండెను. ఈ ప్రకరణములోని ఈ అంతము సాపేక్షికమైనది (relative). 'నాకు మధ్యము గాని (న మధ్యమ్), ఆదిగాని (న ఆదిమ్) కానవచ్చుట లేదు.' ఆది శబ్దమునకు శిరస్సు అనియు, అంతశబ్దమునకు పాదములనియు అర్థము చెప్పవచ్చును. రూపము ఏదైనా, ఎంత పెద్దది అయినా, సాధారణంగా మనము దాని అవధి పర్యంత చూడగల్గుతాము. కాని విశ్వరూపములో అట్లు గాదు. ఆద్యంతములు లేనప్పుడు మధ్యము కూడా ఉండదు గదా! వాస్తవంలో సర్వము మధ్యలో నున్నట్లు కానవచ్చును. అర్జునుడు

చూచిన విశ్వరూపసారమిట్లున్నది. అర్జునుడు శ్రీ కృష్ణుని 'విశ్వేశ్వర (జగత్తునకు అధీశ్వరుడు)' అని సంబోధించుచున్నాడు. 'విశ్వరూప' అని కూడ సంబోధించినాడు. ఆ రూపము ఆతని కళ్ల యెదుటనే ఉన్నది.

**అధ్యాయము 11, శ్లోకము 17:**

किरीटिनं गदिनं चक्रिणं च तेजोराशिं सर्वतो दीप्तिमन्तम् ।
पश्यामि त्वां दुर्निरीक्ष्यं समन्ताद् दीप्तानलार्कद्युति मप्रमेयम् ॥ १७ ॥

కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాద్ దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్ (17)

**కిరీటినమ్** = కిరీటము కలిగినట్టియు; **గదినమ్** = గదను కలిగినట్టియు; **చక్రిణమ్** = చక్రము కలిగినట్టియు; **చ** = మరియు; **సర్వతః** = అన్ని వైపులా; **దీప్తిమంతమ్** = ప్రకాశము గల; **తేజోరాశిమ్** = తేజస్సుయొక్క రాశి అయినట్టియు; **దుర్నిరీక్ష్యమ్** = కన్నులు ఎత్తి చూడశక్యము కానట్టియు, **సమంతాత్** = అన్నివైపులనుండి; **దీప్తానలార్కద్యుతిమ్** = మండే అగ్నిహోత్రముతో మరియు సూర్యునితో సమమగు కాంతి కలిగినట్టియు; **అప్రమేయమ్** = పరిచ్ఛిన్న వస్తువు వలె అంచనా వేయశక్యము కాని; **త్వామ్** = నిన్ను; **పశ్యామి** = చూచున్నాను.

కిరీటమును, గదను, చక్రమును ధరించినట్టియు, అన్నివైపులా ప్రకాశిస్తూ, మండుచున్న అగ్నిహోత్రముతో మరియు సూర్యునితో సమమగు కాంతులను విరజిమ్ముతూ, కన్ను ఎత్తి చూడశక్యము కాని తేజస్సు యొక్క రాశి అయినట్టియు, ఇతర పరిచ్ఛిన్న వస్తువుల వలె తెలియశక్యముగాని నిన్ను నేను చూచుచున్నాను (17).

"నేను నిన్ను నిత్యము ఆరాధించి ప్రార్థించే రూపము కూడ నాకు కానవచ్చుచున్నది. శిరముపై కిరీటమును, ఒక చేతితో గదను, మరియొక చేతితో చక్రమును నీవు ధరించియున్నావు". భగవానుడు మూడవ హస్తమును చాచి అభయమును, శరణాగతిని సూచించే ముద్రను పట్టియున్నాడు. నాల్గవ హస్తముతో తన పాదములను చూపి వాటి వద్దకు చేరుకొనుడని మనలకు బోధించుచున్నాడు. "నీవు వచ్చి శరణాగతి చేసినచో నేను నిన్ను రక్షించెదను" అని భగవానుడు

యాచించుచున్నాడు. ఇంకో రెండు హస్తములు వినాశము కొరకు కేటాయించబడినవి. నీవు భయపడవలసిన అవసరము లేదు. ఏలయన, భగవానుని వద్ద నిన్ను రక్షించుటకు కావలసిన అస్త్రములన్నియు గలవు. దగ్గరలో పొంచియున్న ప్రమాదము నెదుర్కొనుటకు గధ, దూరమునందలి విపత్తులకు చక్రము వినియోగమునకు వచ్చును. ఈ దగ్గర దూరములు దేశ దృష్టితో గాని, కాల దృష్టితో గాని కావచ్చును. చక్రము చాల శక్తి గల ఆయుధము. అది మైళ్ళ దూరము పయనించి సంహరించును. భగవానుడు ఈ తీరున నీకు అభయమిచ్చుచున్నాడు. నిన్ను రక్షించుటకై ఆయన సంసార భయమును నశింపజేయవలెను. ఈ భయము తత్కాలీనము కావచ్చును. సుదూరమునందున్నది కావచ్చును. కావుననే ఆయన వద్ద రెండు రకముల ఆయుధములు గలవు. మానవులు విష్ణుభగవానుని ఏ రూపములో ఆరాధించెదరో, అదే రూపములో అర్జునుడు శ్రీకృష్ణుని విశ్వరూపాంతర్గతముగా దర్శించెను.

అర్జునునకు విశ్వరూపము తేజోరాశివలె కన్పట్టెను. ఎక్కడ చూచినా అద్వితీయ చైతన్యమే భాసిల్లుచున్నదనియు, సర్వము దానియందే భాసించుచున్నదనియు శ్రీ శంకరులు వివరించిరి. ఇంతటి జాజ్వల్యమానముగా ప్రకాశించే రూపమును చూచుట చాల కష్టము.

అన్నివైపులకు వ్యాపించియున్న ఆ ప్రకాశము అగ్నిని, సూర్యుని, విద్యుత్తును పోలియుండెను (దీప్త-అనల-అర్క-ద్యుతి). భగభగమండే అగ్నితో, మండిపడే సూర్యునితో సమమగు ప్రకాశము గల విశ్వరూపమును అర్జునుడు చూచుచుండెను.

మరియు ఆ విశ్వరూపము అప్రమేయము. శ్రీ శంకరులీ పదమును స్పష్టముగా వ్యాఖ్యానించిరి. మన జ్ఞానములో విషయమగు వస్తువు ప్రమేయమనబడును. మనము పువ్వును చూచినాము. ఒక చిన్న జ్ఞానము కలిగినది. అప్పుడే మగును? పుష్పమును ఒక మనోవృత్తి పరిచ్ఛిన్నము చేయును. పుష్పమునకు ఒక రూపము కలదు గనుక, మన అంతఃకరణము ఇతర సర్వవస్తువులను వ్యావృత్తము చేసి (excluding) పుష్పమును జ్ఞానములో విషయముగా చేయగల్గును. పుష్పముచే మనస్సు ఆరూఢ (loaded) మగును. ఇతరవస్తువులన్నియు ప్రక్కకు త్రోసివేయబడి, మనము పుష్పము అనే ఈ వస్తువును విస్పష్టముగా చూడగల్గుదుము. ఇట్లు ఒక వస్తువుగా గాక, ఆత్మకంటె అభిన్నముగా దర్శింపబడేది అప్రమేయమనబడును. కాని విశ్వరూపమును అర్జునుడు దృశ్యమును వలె దర్శించి జ్ఞానవిషయముగా చేయుచున్నాడు గదా! కాని విశ్వరూపము ఎంత పెద్దది అంటే, అర్జునుడు దానిని ఒక్క మనోవృత్తిలో ఇముడ్చలేడు. కావున అది అప్రమేయ

మనబడినది. శ్రీ శంకరులు దానిని 'సీమల మధ్య బంధింప శక్యము కానిది (అశక్య పరిచ్ఛేద)' అని జాగరూకతతో నిర్వచించిరి. అనగా విశ్వరూపము నిర్దిష్ట రూపములో చూచుటకు, లేక తెలియుటకు ఉపలభ్యము కాదు. చిన్న వస్తువును గాని, పెద్ద వస్తువును గాని ఈ తీరున దర్శించవచ్చును. కాని సర్వవస్తువులను తనలో కలిగియున్న విశ్వరూపమునకు సీమలను నిర్ధారించుట యెట్లు సంభవమగును? దానిని పరిచ్ఛిన్న రూపముగా దర్శించి తెలుసుకొనుట సంభవము కాదు. అందువలన అది విశ్వరూపమైనది. కావున 'అప్రమేయం పశ్యామి' అనగా 'సర్వము నీవే గనుక, ఇది నీవు అని నేను ఇదమిత్థముగా చెప్పజాలను' అని యర్థము. అప్రమేయమనగా 'జ్ఞానములో విషయము గాదు' అని వాస్తవమగు యర్థము. ఆత్మ దృశ్యము కాదు గనుక, ఆత్మ నీ స్వరూపము గనుక, ఆత్మ అప్రమేయము. కాని ఇచట అప్రమేయము ఆ అర్థములో ప్రయోగింపబడలేదు.

సర్వము విశ్వరూపములో అంతర్గతమై యుండుటను గాంచిన అర్జునుడు ఇపుడు ఒక అనుమితి (inference)ని చేయుచున్నాడని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి.

**అధ్యాయము 11, శ్లోకము 18:**

त्वमक्षरं परमं वेदितव्यं त्वमस्य विश्वस्य परं निधानम् ।
त्वमव्ययश्शाश्वतधर्मगोप्ता सनातनस्त्वं पुरुषो मतो मे ॥ १८ ॥

త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
త్వమవ్యయశ్శాశ్వత ధర్మ గోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే (18)

**వేదితవ్యమ్** = తెలియదగిన; **అక్షరం** = వినాశము లేని; **పరమమ్** = పరబ్రహ్మ; **త్వమ్** = నీవే; **అస్య** = ఈ; **విశ్వస్య** = జగత్తునకు; **పరమ్** = చరమమగు; **నిధానమ్** = కారణము (అధిష్ఠానము); **త్వమ్** = నీవే; **త్వమ్** = నీవు; **అవ్యయః** = వికారములు లేనివాడవు; **శాశ్వత ధర్మగోప్తా** = ప్రవాహనిత్యమగు ధర్మములను రక్షించువాడవు; **త్వమ్** = నీవు; **సనాతనః** = శాశ్వతుడగు; **పురుషః** = పురుషుడవు అని; **మే** = నా యొక్క, **మతః** = అభిప్రాయము.

తెలియదగిన వినాశము లేని పరబ్రహ్మవు నీవే. ఈ జగత్తునకు చరమ కారణము (అధిష్ఠానము) నీవే. నీవు వికార రహితుడవు; ప్రవాహ నిత్యమగు

ధర్మములను రక్షించు వాడవు. శాశ్వతుడగు పురుషుడవు నీవే అని నా అభిప్రాయము (18).

సర్వము శ్రీ కృష్ణుని విశ్వరూపములో అంతర్గతమై యుండుటను గాంచిన అర్జునునకు ఆయనయే జగత్కారణమగు పరం బ్రహ్మ అని స్పష్టమైనది. తాను శాస్త్రమునుండి విన్నది ఇప్పుడాతని కన్నుల యెదుట సత్యమై ప్రత్యక్షమైనది. ''నీవే పరబ్రహ్మవు. సాధకులందరు తెలియదగిన సత్యము (వేది తవ్యమ్) నీవే. ఈ విషయమును నేను తెలుసుకున్నాను''.

పరా, అపరా అని జ్ఞానము ద్వివిధము (ద్వే విద్యే వేదితవ్యే పరా చ అపరా చ) అని శ్రుతి చెప్పుచున్నది. అవిక్రియ పరబ్రహ్మ (అక్షరము) విషయవస్తువుగా గల జ్ఞానము పరా. అది ఆత్మాభిన్నమని వేదములన్నియూ బోధించుచున్నవి. దానిని మానవుడు తెలియవలెను. విశ్వరూపమును దర్శించి ఈ సత్యమును అనుమితి చేయుట సంభవమే. విశ్వరూపములో సర్వము కానవచ్చుచున్నది. ఏదియూ విడువకుండగా, సర్వరూపములు దానియందు కానవచ్చుచుండెను. మరియు ఆ రూపములన్నియు దృశ్యములే గనుక మిథ్య యగును. వాటి సారభూతమగు అధిష్ఠానము పరబ్రహ్మయేనని శ్రుతి చెప్పుచున్నది. వీటికి అధిష్ఠానమై మార్పు లేనిదియే ఆత్మ. దానియందు సర్వరూపములు భాసిల్లుచున్నవి. అర్జునుని అనుమితి అంత దూరము వరకు పోజాలదు. శ్రీ కృష్ణుడు జగత్కారణము అని మాత్రమే ఆతనికి అర్థమైనది.

నిధానమనగా మరియొక దానికి ఆధారమైనది. ఉదాహరణకు చక్రములోని ఆకులకు ఇరుసు నిధానమగును. సర్వము శ్రీకృష్ణునియందు నిహితమై ఉన్నదనియు, సర్వమునకు ఆయనయే నిధానమనియు అర్జునుడు గుర్తించినాడు. ''సర్వమునకు చరమ అధిష్ఠానము నీవేనని నాకు తెలిసినది''. ప్రతి వస్తువునకు అధిష్ఠానము గలదు. కుండకు మట్టి అధిష్ఠానము. హారమునకు బంగారము అధిష్ఠానము. కాని చరమ అధిష్ఠానము 'నీవే' అని అర్జునుడు చెప్పుచున్నాడు. పరం నిధానమ్ అనగా పరమ నిధానము, అనగా ఈ సందర్భములో పరమకారణము. అర్జునునకు సత్యము అవగతమైనది.

త్వం అవ్యయః. ''నీలో మార్పులు ఏమియూ లేవు''. ఎందువలన? ''ఈ రూపములన్నియు నీపై ఆధారపడి యున్నవి. కావున నీలో మార్పులు ఏమియూ ఉండవు. నీవు అవ్యయుడవు అని నేను ఊహించుచున్నాను.''

'నీవు శాశ్వతమగు ధర్మములను రక్షించువాడవు (శాశ్వతధర్మగోప్తా)' అని కూడ అర్జునుడు అనుమితి చేయుచున్నాడు. ఎన్నటికీ మార్పు చెందనివి, ఒక సృష్టి తరువాత మరియొక సృష్టి ఏకరూపములో ఆవిర్భవించుటకు హేతు భూతమైనవి అగు ధర్మములు నిత్యధర్మములనబడునని శ్రీ శంకరులు వివరించిరి. "ఆ ధర్మమును రక్షించువాడవు నీవే. నీవే ఈశ్వరుడవని నేను చూడగల్గుచున్నాను' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఆయనను పరం బ్రహ్మగా, మరియు పరమేశ్వరునిగా అర్జునుడు గుర్తించినాడు.

'సనాతనః. నీవు శాశ్వతుడవు. ఈ సత్యమును నేను గుర్తించి నాను (మే మతః)' అని కూడ అర్జునుడు చెప్పుచున్నాడు. ఇందువలననే ఈ శ్లోకమునకు ఉపక్రమములో శ్రీ శంకరులు 'అనుమినోమి (నేను అనుమితి చేయుచున్నాను)' అని వ్రాసినారు. అర్జునుడిట్లు చెప్పుచున్నాడు: "నీవు పరం బ్రహ్మవు. జగత్కారణము నీవే. నీవు మార్పులకు అధీనము కాని వాడవు (అవ్యయః). శాస్త్రము నీ గురించి చేసిన ఇట్టి వర్ణనలు నాకు ఇప్పుడు అవగతమైనవి. ఈ వచన ములన్నియూ సత్యమని నేనిపుడు తెలియుచున్నాను. సర్వమును నీలో ఇముడ్చుకున్న, సర్వమునకు అధిష్ఠానమైన పూర్ణపురుషుడవు నీవే". విశ్వరూపమును ప్రత్యక్షముగా దర్శించిన అర్జునుడు అది ఆధారంగా ఒక అనుమితిని చేయుచున్నాడు. అది కేవల అనుమితి మాత్రమే కాదు. ఏలయన, అతని నిర్ణయము శాస్త్రోపదేశము ఒక్కటియే. కాని అతడు 'మే మతః' అనినాడు గనుక, అతనికి పరోక్షజ్ఞానము మాత్రమే గలదని మనకు తెలియుచున్నది. కావుననే,'అనుమినోమి (నేను అనుమితి చేయుచున్నాను)' అని శ్రీ శంకరులు జోడించిరి.

ఈ దృశ్య చిత్రణమంతయు ఒక ఉపనిషద్వాక్యమును తేట తెల్లము చేయుట కొరకై ఉద్దేశింపబడినది. తైత్తిరీయోపనిషత్తులోని రెండవ అధ్యాయములో 'యదా హ్యేవైష ఏతస్మిన్ ఉదరం అంతరం కురుతే' అను వాక్యము గలదు. అచట సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ అగు, సర్వజగత్కారణము అగు ఆత్మ చర్చింపబడు చుండెను. ఆ బ్రహ్మను తెలియుటలో ఎవరైననూ అణుమాత్రము భేదమును చేయునో (ఉదరం అంతరం కురుతే)★, అట్టి వానికి భయము కలుగును (అథ తస్య భయం భవతి). అర్జునుడు తనను విశ్వరూపము కంటె భిన్నముగా దర్శించుట అట్టి భేదదృష్టియే. అర్జునుడు తనను విశ్వరూపములో భాగముగా దర్శించలేదు గనుక, అతనికి భయము కలుగబోవుచున్నది. అర్జునుడు తాను శ్రుతి నుండి విన్నదానిని, మరియు ప్రత్యక్షముగా చూచిన

---

★ ఉత్ = అయిననూ, అరమ్ = లేశము, అంతరమ్ = భేదము .

ఆది, మధ్యభాగము, అంతము లేనట్టియు, అనంతమగు శక్తి కలిగినట్టియు, అంతములేని బాహువులు కలిగినట్టియు, సూర్యచంద్రులే నేత్రములుగా కలిగినట్టియు, మండే అగ్నిహోత్రుడే నోరుగా కలిగినట్టియు, ఈ జగత్తునకు తన తేజస్సుచే శక్తిని ఇచ్చునట్టి నిన్ను చూచుచున్నాను (19).

"ఈ విశ్వరూపములో ఆదిగాని, అంతముగాని, మధ్యభాగముగాని నాకు కానవచ్చుట లేదు". అర్జునుడు ఎటు చూచినా, అన్ని దిక్కులయందు విశ్వరూపమే వ్యాపించి యుండెను. ఇంతేగాక, అర్జునుడు శ్రీకృష్ణుని అనంతశక్తిని చూచెను. "నీ శక్తి అనంతము (అనంత వీర్యమ్)". మరియు అంతటా చేతులతో (మరియు కాళ్లతో) నిండియున్న భగవానుని రూపమును (అనంత బాహుమ్) అర్జునుడు గాంచెను. మరియు ఆ విశ్వరూపములో సూర్యచంద్రులే భగవానుని నేత్రములాయెను (శశి సూర్యనేత్రమ్). విశ్వరూపమును మనోనేత్రముతో దర్శించి ధ్యానించుటకు ఈ ఉదాత్తమగు వర్ణన ఈయబడినది. సూర్య చంద్రులు భగవానుని నేత్రములు; ఆకాశము దేహము; ద్యులోకము శిరస్సు; పృథివి పాదము. భగవానుని విశ్వరూపమును భూ గోళము నుండి చూచుట సంభవమైనచో ఆయన కన్నులు సూర్య చంద్రులు గాక మరియేమగును?

తనకు అర్పించబడిన సర్వమును భక్షించు అగ్నికి 'హుతాశః' అని పేరు. భగభగ మండుచున్న అగ్నికి 'దీప్త హుతాశః' అని పేరు. "జ్వాలలతో మండుచున్న అగ్నియే నీ నోరు (వక్త్రమ్). ఈ జగత్తునకు అంతకూ వేడిని, వెలుతురును నీవే ఇచ్చుచున్నావు (స్వతేజసా విశ్వమిదం తపం తమ్)".

హరిః ఓం తత్సత్

శ్రీగణేశాయనమః

**అధ్యాయము 11, శ్లోకము 20:**

द्यावापृथिव्योरिदमंतरं हि व्याप्तं त्वयैकेन दिशश्च सर्वा : ।
दृष्ट्वाद्भुतं रूपमुग्रं तवेदं लोकत्रयं प्रव्यथितं महात्मन् ॥ २० ॥

ద్యావాపృథివ్యోరిదమంతరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ (20)

**ద్యావాపృథివ్యోః** = స్వర్గమునకు, భూమికి; **అంతరమ్** = మధ్యలో గల; **ఇదమ్** = ఈ ఆకాశము; **చ** = మరియు; **సర్వాః** = సమస్తమైన; **దిశః** = దిక్కులు; **త్వయా ఏకేన** = నీ ఒక్కనిచే; **వ్యాప్తమ్** = వ్యాపింపబడి యుండెను; **హి** = నిశ్చయము; **మహాత్మన్** = ఓ మహాత్మా!; **తవ** = నీయొక్క; **ఇదమ్** = ఈ; **అద్భుతమ్** = అద్భుతమైన; **ఉగ్రమ్** = భయంకరమైన; **రూపమ్** = రూపమును; **దృష్ట్వా** = చూచి; **లోకత్రయమ్** = ముల్లోకములు; **ప్రవ్యథితమ్** = భయముతో వణుకుచున్నవి.

స్వర్గమునకు భూమికి మధ్యలో గల ఈ ఆకాశము మరియు సమస్త దిక్కులు నీ ఒక్కనిచే నిశ్చయముగా వ్యాపించబడియున్నవి. ఓ మహాత్మా! నీ ఈ అద్భుతమైన భయంకరమగు రూపమును చూచి ముల్లోకములు భయముతో వణుకుచున్నవి (20).

''ద్యులోకమునకు, భూమికి మధ్య గల ఆకాశము (అంతరిక్షము) నీ ఒక్క వ్యక్తిచే వ్యాప్తమై నాకు కానవచ్చుచున్నది.'' శ్రీకృష్ణుని ఈ విశ్వరూపముచే ఆకసమంతయూ వ్యాప్తమై యుండుటను అర్జునుడు గాంచెను. అదే తీరున, తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము, ఆగ్నేయము, వాయవ్యము, ఈశాన్యము, నైరృతి ఇత్యాది ''దిక్కులన్నియు (దిశశ్చ సర్వాః) నీ ఒక్కనిచే వ్యాప్తమై యున్నవి. ఎటు చూచినా నీ రూపమే కనబడుచున్నది'' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఈ జగత్తంతయూ ఈశ్వరుడేనని అతడు గనినాడు. కావున, సర్వము దానిలో అంతర్గతమై యుండుట సహజమే గదా!

అర్జునుడిచట శ్రీకృష్ణుని 'మహాత్మా' అని సంబోధించినాడు. మహాత్ముడనగా సృష్టినంతయూ తనలో ఇముడ్చుకున్న సర్వవ్యాపకమగు (మహాన్) ఆత్మ గలవాడు అని యర్థము.

ఈ విశ్వరూపము అద్భుతముగా నుండెను. ఇట్టి అద్భుతమును అతడు ఇంతకు మునుపెన్నడునూ చూడలేదు. మరియు ఈ విశ్వరూపము మిక్కిలి భయంకరముగా (ఉగ్రమ్) నుండెను. విశ్వరూపమును గాంచి (దృష్ట్వా), ముల్లోకములు (లోకత్రయమ్) భయముతో వణుకు చుండెను (ప్రవ్యథితమ్). వాస్తవంగా ముల్లోకములు వణికినవని తాత్పర్యము కాదు. అర్జునుడు తన భయమును ప్రకటించే తీరు అది. ఆ విశ్వరూపము ఎంతటి భయమును గొల్పుచున్నదో! దానిని చూచి ముల్లోకములలోని ప్రజలందరు భయముతో వణికి తీరవలెను. విశ్వరూపము భయమును గొల్పుటకు కారణమేమి? దానిని తనకంటె భిన్నముగా చూచుటయే భయహేతువు. అర్జునుని సమస్య అదియే. తన రూపమునాతడు దానిలో సమ్మిళితము చేసినచో, భయము ఉండెడిది కాదు. సర్వము తానే యగు వ్యక్తి దేనివలన భయపడును? ద్వితీయవస్తువు వలన మాత్రమే భయమునకు అవకాశము గలదు (ద్వైతాద్ధి భయం భవతి). అర్జునుడు తనను విశ్వరూపములో భాగముగా దర్శించినచో, రెండవ వస్తువు ఉండెడిది కాదు. విశ్వరూపమును దర్శించిన తరువాత కూడ అర్జునునిలో మౌలికమగు మార్పు లేదు. అతడు కొంత మెత్తబడినాడు. కొన్ని క్రొత్త సంగతులు నెరింగినాడు. అంతకు మించి ఏమీ లేదు. అతడు యథార్థమగు విశ్వరూపమును దర్శించనే లేదు. తనను భిన్నముగా నుంచుకొని చూచినది విశ్వరూపమెట్లు కాగల్గును? ఇది తరంగము తనను మినహాయించుకొని సముద్రమునంతనూ చూచినట్లున్నది. అది పూర్ణసముద్ర దర్శనము కాజాలదు. అర్జునుడు శ్రీకృష్ణుని దేహములో అంతర్గతమైయున్న ఒక ప్రపంచమును మాత్రమే చూచినాడు. అందువలననే భయపడినాడు. అర్జునుడు తరువాతి శ్లోకములో తన భీతిని వర్ణించుచున్నాడు.

ద్వితీయాధ్యాయములోని అర్జునుని ధర్మసంకటమును గుర్తుచేస్తూ శ్రీశంకరులీ శ్లోకమును ఉపక్రమించినారు. 'ఈ యుద్ధములో విజయమును పొందుట శ్రేష్ఠమా? ఓడుటయే శ్రేష్ఠమా?' అను సందేహము తనకు తీరకున్నదని అర్జునుడు అచట చెప్పెను. ''ఎవరిని సంహరించినచో జీవించి యుండవలెనను కోరిక తొలగిపోవునో, అట్టి వ్యక్తులు నా యెదుట నిలబడియున్నారు (తే అవస్థితాః ప్రముఖే)''. ఈ సందేహమును తొలగించుటకై, పాండవ వంశమునకు నిర్ణాయకము ఖచ్చితము అగు విజయమును, ధార్తరాష్ట్రులకు పట్టబోయే గతిని నిరూపించే అనేక లక్షణములను భగవానుడు అర్జునుని కొరకై ఈ విశ్వరూపములో విశేషించినాడు. వాటిని చూచిన అర్జునుడు ఇట్లు పలుకుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 21:**

अमी हि त्वां सुरसङ्घा विशन्ति केचिद्भीता: प्राञ्जलयो गृणन्ति ।
स्वस्तीत्युक्त्वा महर्षिसिद्धसङ्घास्स्तुवन्ति त्वां स्तुतिभि: पुष्कलाभि: ॥ २१ ॥

అమీ హి త్వాం సురసంఘా విశంతి కే చిద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాస్స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః (21)

**అమీ** = ఈ; **సురసంఘాః** = సత్పురుషుల సమూహములు; **త్వామ్** = నిన్ను; **హి** = నిశ్చయముగా; **విశంతి** = ప్రవేశించుచున్నవి; **కేచిత్** = కొందరు; **భీతాః** = భయపడిన వారై; **ప్రాంజలయః** = చేతులను జోడించిన వారై; **గృణంతి** = ప్రార్థించుచున్నారు; **మహర్షి సిద్ధ సంఘాః** = మహర్షుల, సిద్ధుల (యోగుల) సమూహములు, **స్వస్తి** = మంగళమగు గాక!; **ఇతి** = అని; **ఉక్త్వా** = పలికి; **త్వామ్** = నిన్ను; **పుష్కలాభిః** = అర్థముతో నిండియున్న; **స్తుతిభిః** = స్తోత్రములతో; **స్తువంతి** = స్తుతించుచున్నారు.

> ఈ సత్పురుషులు నీయందు గుంపులు గుంపులుగా ప్రవేశించుచున్నారు. ఇది నిశ్చయము. కొందరు భయపడి చేతులను జోడించి ప్రార్థించుచున్నారు. మహర్షులు, సిద్ధులు (యోగులు) సమూహములుగా చేరి, 'మంగళమగు గాక!' అని పలుకుతూ గంభీరమగు అర్థముతో గూడిన స్తోత్రములతో నిన్ను స్తుతించుచున్నారు (21).

ఈ సుర సంఘములు నిన్ను ప్రవేశించుచున్నవి. సుర సంఘములనగా వసువులు మొదలగు దేవతా గణములనియు, వారు భూభారమును తొలగించుటకై భూమిపై అవతరించిన సజ్జనులనియు శ్రీ శంకరులు వివరించిరి. భూభారమనగా జనుల భారము కాదు. కాని మాల్థస్ మహాశయుని జన బాహుళ్య సిద్ధాంతము దీనికి విరుద్ధమైనది. ఆహారోత్పత్తి కంటె అధిక వేగముతో జనాభా పెరుగుననియు, యుద్ధము మొదలగు ఉపాయముల ద్వారా ఈ పెరుగుదల అరికట్టబడనిచో, దారిద్ర్యము, దుర్భరపరిస్థితులు సర్వత్రా విలయతాండవము చేయుననియు మాల్థస్ మహాశయుడు సిద్ధాంతీకరించినాడు. కాని భూమికి బరువు అయ్యేది జనాభా కాదు. అధర్మము యొక్క ఉత్థానము భూమికి బరువు అగును. సజ్జనులు ఎందరు ఉన్నా గడబిడ ఉండదు. కాని చెడు వ్యక్తి ఒక్కడు ఉన్ననూ సర్వమును నాశనము చేయును. ఇది పుచ్చిన వేరు సెనగకాయను నములుట వంటిది.

మిగిలిన కాయలు అన్నీ ఎంత మధురముగా నున్ననూ, పుచ్చిన కాయను నమిలిన వెంటనే ఆ మాధుర్యమంతయూ అంతమగును. నోరు చెడును. ఉదరము చెడును. అదే విధముగా అధర్మము పెరుగుటయే (ప్రాచుర్యము) భూమికి బరువు. అందుచేతనే జనాభా పెరిగినప్పుడు నేను అవతరించెదనని భగవానుడు చెప్పలేదు. ధర్మము క్షీణించినపుడు నేను వచ్చెదను (యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి) అని చెప్పినాడు. అధర్మ భారమును నశింపజేయుటకై ఈ సజ్జనులు (సురసంఘాః) వచ్చెదరు. వ్యక్తి గతముగా చూచిననూ, అధర్మము మనిషిని క్రుంగదీయును. తప్పు పనిని చేసినప్పుడు హృదయములో బాధ కలుగును. అదియే భారము. భూమిపై అధర్మము పెచ్చు పెరిగినప్పుడు ఈ దేవతలందరు మనుష్యరూపమును దాల్చి భూమిపై అవతరించెదరు. 'వారందరు నీలోనికి ప్రవేశించుచున్నారు' అని అర్జునుడు చెప్పుచున్నాడు. దేవలోకముల నుండి భూమి పైకి విచ్చేసిన ఈ మనుష్యులందరు భగవానుని లోనికి ప్రవేశించుచున్నారు. అనగా అర్థమేమి? ''వారు మరణించుచుండుటను నేను గాంచుచున్నాను.''

యుద్ధరంగమునకు చేరిన వారిలో కొందరు (కేచిత్) భయపడుచుండిరి. రెండు పక్షములలోని సిపాయీలు, మహావీరులు మరియు సేనాపతులు కూడ భయపడుచుండిరి. ద్రోణ, భీష్మ, కర్ణ, సాత్యకి, అభిమన్యు మొదలగు వారు సామాన్యులు కారు. కాని వారు కూడ భయపడుచుండిరి. అయిననూ వారచటకు విచ్చేసిరి. వారిలో కొందరు ఆ యుద్ధము ధర్మయుద్ధమనే నమ్మకము వలన వచ్చిరి. మరి కొందరిని దుర్యోధన మహారాజు తన పక్షములో చేర్చుకొని తీసుకు వచ్చినాడు. 'యుద్ధము చేసి తీరాలి' అనే దృఢనిశ్చయము గల వ్యక్తికి కూడా ఆ సమయము వచ్చి ఆ పరిస్థితి సిద్ధమగు సరికి సర్వము భిన్నముగా భాసించును. ప్రతిజ్ఞలను చేసినప్పుడు ఉన్న ధైర్యము, యుద్ధముయొక్క వాస్తవిక పరిస్థితులు ఎదురయ్యేసరికి హరించిపోవును. సమస్యలన్నీ అదే సమయములో తలయెత్తును. యుద్ధమును చేయగోరి యుద్ధమునకు వచ్చిన యోద్ధకు గాని, సభను ఉద్దేశించి ప్రసంగించుటకు విచ్చేసిన వక్తకు గాని, ఇటువంటి ఇతరపరిస్థితుల నెదుర్కొను వారికి గాని, ఆఖరు క్షణములో భయము తప్పదు.

ఇట్లు భయపడియున్న యుద్ధవీరులందరు ప్రశాంతముగా భగవానునకు చేతులు జోడించి నమస్కరించుచుండిరి (ప్రాంజలయః గృణంతి). వారు దుర్భేద్యమగు కవచములను ధరించి యుద్ధ మధ్యములో నిలబడి యుండిరి. వారి కవచములు దృఢముగా కర్కశముగా నున్ననూ, వారు లోపల భయపడుతూ, భగవానునకు ప్రణమిల్లుచుండిరి. కష్టములో భగవానుని ప్రార్థించే వీరు ఆర్త భక్తులు. వారు చిన్నప్పుడు వల్లె వేసిన ప్రార్థనా శ్లోకముల నన్నింటినీ వరుసగ పఠించుచుండిరి

(గృణంతి). వారిలో కొందరు తీవ్రమగు భయమునకు గురియై పారిపోవుటకైననూ సమర్థత లేనివారై యుండిరని శ్రీ శంకరులు వివరించిరి. పారిపోవు వారిని దుర్యోధనుడు చంపివేయునని వారు ఎరుంగుదురు. అట్టి స్థితిలో ఎట్లు పారిపోగలరు? వారు కూడ తమ మనస్సులో భగవానుని ఆర్తితో ప్రార్థించుచుండిరి.

సాధుజనులు కూడా స్తుతించుచుండిరి. సాధువులలో రెండు రకములు గలరు: వసిష్ఠాది మహర్షులు (వైదికులు); కపిలాది సిద్ధులు (యోగులు). రాబోవు వినాశమును సూచించే దుశ్శకునములను ఈ రెండు రకముల సాధుజనులు యుద్ధరంగము నందు దర్శించిరని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. అందువలననే, "సర్వత్రా శుభము కలుగు గాక (స్వస్తి)। రాబోవు వినాశము తక్కువగా నుండుగాక!" అని వారు ప్రార్థించుచుండిరి. ఇట్లు ప్రార్థించి వారు అర్థగర్భితములగు స్తోత్రములతో నిన్ను స్తుతించుచుండిరి (స్వస్తి ఇతి ఉక్త్వా స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః). రాబోవు వినాశము సాధ్యమైనంత తక్కువగా ఉండాలని వారు ఆశించుచుండిరి.

దివ్యనేత్రము నీయకుండగనే విశ్వరూపమును చూడగల మరికొందరు గలరు. అర్జునుడు అట్టివారిని గురించి తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 22:**

रुद्रादित्या वसवो ये च साध्या विश्वेऽश्विनौ मरुतश्चोष्मपाश्च ।
गन्धर्वयक्षासुरसिद्धसङ्घा वीक्षन्ते त्वां विस्मिताश्चैव सर्वे ॥ २२ ॥

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ
గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘా వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే (22)

**రుద్రాదిత్యాః** = రుద్రులు, ఆదిత్యులు; **వసవః** = వసువులు; **చ** = మరియు; **యే** = ఏ; **సాధ్యాః** = సాధ్యులు గలరో; **విశ్వే** = విశ్వేదేవతలు; **చ** = మరియు; **ఊష్మపాః** = ఊష్మపులు; **చ** = మరియు; **గంధర్వ యక్షాసుర సిద్ధ సంఘాః** = గంధర్వ, యక్ష, రాక్షస, సిద్ధుల సముదాయములు; **సర్వే** = అందరు; **త్వాం ఏవ** = నిన్ను మాత్రమే; **వీక్షంతే** = చూచుచున్నారు; **విస్మితాః** = ఆశ్చర్య చకితులై.

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, ఊష్మపులు, గంధర్వులు,

యక్షులు, రాక్షసులు, సిద్ధులు అందరు గుంపులుగా చేరి ఆశ్చర్యముతో
నిన్ను మాత్రమే చూచుచున్నారు (22).

ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, సాధ్యులనబడే దేవతాగణములు మరియు ఇతర దేవతలు అందరు అర్జునునితో బాటు ఈ విశ్వరూపమును దర్శించు చుండిరి. మరియు విశ్వేదేవతలు, ఇద్దరు అశ్విని దేవతలు, ఏడు మరుద్గణములు కూడ చూచుచుండిరి. మరియు పితృలోక నివాసులగు ఊష్మపులు, గంధర్వ యక్ష అసుర సిద్ధ గణములు కూడ చూచుచుండిరి. ''వీరందరు నిన్ను చూచి దిగ్భ్రాంతులగుచున్నారు (వీక్షంతే త్వాం విస్మితాః చ సర్వే)'. గంధర్వులు దేవగాయకులు. వారిలో కొందరికి హాహా, హూహూ, హీహీ వంటి పేర్లు గలవు. ఈ పేర్లు వారి గానమును అనుకరించు చున్నవి. మరియొక దేవగణమునకు యక్షులని పేరు. సంపదలకు అధిదేవతయగు కుబేరుడు వారికి అధిపతి. ఇచట అసురులనగా సామాన్య రాక్షసులు కారు. ఏలయన దుష్ట జీవనము గలవారు ఈశ్వరుని చూడజాలరు గదా! నమ్మలేనంత గొప్పగా ధర్మమార్గములోనికి మారిపోయిన విరోచనుడు మొదలగు మహాత్ములను అసుర శబ్దము నిర్దేశించును. కపిలాది సిద్ధులు కూడ కలరు. 'వీరందరు నిన్ను గొప్ప ఆశ్చర్యముతో చూచుచున్నారు' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఈ దేవతా గణములన్నియూ ఆశ్చర్య చకితులై విశ్వరూపమును దర్శించు చుండగా అర్జునుడు గాంచెను. అర్జునుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 23:**

रूपं महत्ते बहुवक्त्रनेत्रं महाबाहो बहुबाहूरुपादम् ।
बहूदरं बहुदंष्ट्राकरालं दृष्ट्वा लोकाः प्रव्यथितास्तथाहम् ॥ २३ ॥

రూపం మహత్తే బహువక్త్ర నేత్రం మహాబాహో బహుబాహూరుపాదమ్
బహూదరం బహు దంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాః ప్రవ్యథితాస్తథాహమ్ (23)

బహువక్త్ర నేత్రమ్ = అనేకములగు నోళ్ళు, కన్నులు కలిగినట్టియు; బహుబాహూరుపాదమ్ కములగు బాహువులు, ఊరువులు మరియు పాదములు కలిగినట్టియు; బహూదరమ్ = ములగు ఉదరములు కలిగినట్టియు; బహుదంష్ట్రాకరాలమ్ = అనేకములగు కోరలతో ను గొల్పు; తే = నీయొక్క; మహత్ = పెద్దదియగు; రూపమ్ = రూపమును; దృష్ట్వా ; మహాబాహో = ఓ గొప్ప బాహువులు గలవాడా!; లోకాః = జనులు; తథా = మరియు; = నేను; ప్రవ్యథితాః = భయభీతులగుచున్నాము.

> గొప్ప బాహువులు గల ఓ శ్రీకృష్ణా! అనేకములగు నోళ్లు, కన్నులు, చేతులు, ఊరువులు, పాదములు మరియు ఉదరములు కలిగి, అనేక దంష్ట్రలచే భయమును గొల్పు నీ పెద్ద రూపమును గని జనులు మరియు నేను భయ భీతులగుచున్నాము (23).

'ఓ భగవాన్! నీ రూపము చాల పెద్దది (మహత్)'. ఊహకు అందనిది. దాని ఒడ్డు, పొడుగులను కొలుచుట శక్యము కాదు. అది అద్భుతమగు రూపము. కాని ఒక సమస్య గలదు. అర్జుననకు భయము వేసినది. అతడీ విషయమునిచట స్పష్టము చేయుచున్నాడు. ఇటువంటి మహారూపముతో ఎట్లు వ్యవహరించవలెనో అతనికి అర్థమగుట లేదు. మరియొక గ్రహమునుండి వచ్చిన ప్రాణి ఒకటి మనకు కనబడినదనుకొనుడు. మన ప్రతిక్రియ ఎట్లుండును? అది హాని కలిగించునది కాకపోవచ్చును. కాని మనకు భయము కలుగును. ఏలయన, మన మస్తిష్కములు వర్గీకరణ పద్ధతితో పురోగమిస్తాయి. ఒక కొత్త ప్రాణి కంట పడగానే మనము ఏదో ఒక వర్గములో దానిని జమకట్టవలెను. ఆ తరువాతనే మనకు భద్రతా భావన ఏర్పడును. కాని మనము వర్గీకరింప జాలనిది ఏదైనా, పొంచియున్న ప్రమాదము వలె భాసించి సమస్య యగును.

అర్జునుడు విశ్వరూపములో లెక్కలేనన్ని నోళ్లను, లక్షలాది రకముల కన్నులను చూచెను. కొన్ని నేత్రములు నీలవర్ణము గలవి, మరి కొన్ని నేత్రములు పసుపుపచ్చని రంగుతో, ఇంకొన్ని ఆకుపచ్చని రంగుతో, ఎర్రని రంగుతో ప్రకాశించినవి. ఇవి అన్నీ ఒకే ఒక రూపమునందు గానవచ్చెను.

అర్జునుడు విశ్వరూపములో శ్రీకృష్ణుని మహాబాహునిగా గాంచి 'మహాబాహో' అని సంబోధించుచున్నాడు. ఆయనకు చేతులు రెండు గావు. ఆయనకు చాల చేతులు (బహు బాహు), మరియు చాల ఊరువులు (బహు-ఊరు), చాల పాదములు (బహు-పాద) కూడ గలవు. ఇవి మాత్రమే గాక, విశ్వరూపము యొక్క తెరచియున్న నోటినుండి బయటకు పొడుచుకు వచ్చిన అనేక కోరలను (బహుదంష్ట్రాకరాలమ్) అర్జునుడు చూచెను. అందువలననే అతడు చాల భయపడెను. రాక్షసులకు సాధారణంగా బయటకు పొడుచుకు వచ్చే రెండు కోరలు ఉండును. వాటివలన రాక్షసులను చూచినంతనే భయము కలుగును. అనేక కోరలు గల విశ్వరూపమును గాంచిన అర్జునుడు మదిలో ఎంతటి భయముమ పొందియుండునో? ఇంతే గాక, అనేక ఉదరములు ఉండెను (బహూదర). తిమింగలము వలె సగము దేహము కోరలు, ఇంకో సగము ఉదరము కాబోలు!

''ఈదృశ్యమును గాంచిన ప్రజలు భయపడుచున్నారు. నాకు కూడ భయము గలుగుచున్నది''. ఈ రూపము చాలమంది జనులకు కానరాదు. చూడగలిగిన కొద్దిమంది భయముతో వణుకుచుండిరని శ్రీ శంకరులు వివరించిరి. వారికి భయము కలిగినా, కలుగక పోయినా, 'నాకు భయము కలుగుచున్నది' అని అర్జునుడు చెప్పుచున్నాడు.

అర్జునుడు మున్ముందు ఇట్లు చెప్పును. ''నీ నోరు సర్వదా తెరిచియే యుండును గాబోలు! అగ్నిలో ప్రవేశించు శలభములవలె ధార్తరాష్ట్రులందరు నీ నోటిలో ప్రవేశించుటను నేను గాంచుచున్నాను. వారందరు నీ కోరల మధ్య తగుల్కొని యున్నారు. కాలము అనబడే మృత్యువు తన దవడల మధ్య వారిని చప్పరించి నమిలివేయుచున్నది. నీవు వారినందరినీ కబళించుచుండగా నేను గాంచుచున్నాను. నాకు చాల భయము కలుగుచున్నది.'' అపుడు అర్జునుడు 'నీవు ఎవరు? చెప్పుము' అని ప్రశ్నించును. విశ్వరూపమును చూపుమని కోరిన సమయములో అర్జునుడు తాను చూడబోయేది ఇట్లు ఉండునని ఊహించలేదు. తాను చూపమని కోరిన భయంకరరూపమును తాను తట్టుకొనలేననే సత్యము ఇపుడాతనికి తెలిసి వచ్చినది. అందువలననే, అతడు శ్రీకృష్ణుని తన మామూలు రూపమును దాల్చి, మరల జ్ఞానోపదేశమును కొనసాగించుమని గోరెను.

సృష్టి త్రికాలములయందు భగవానునికంటె భిన్నముగా లేదు. సృష్టి నిరపేక్షముగా భగవానుడు గలడు. కాని భగవంతుని కంటె స్వతంత్రముగా సృష్టి ఏ కాలమునందైననూ లేదు. సృష్టి ఈశ్వరుని కంటె భిన్నము కాకపోయినా, మన ఇంద్రియములకు గ్రహించే సామర్థ్యము సీమితముగా నుండుటచే, ఈశ్వరుడు మనకు కానవచ్చుట లేదు. జ్ఞానేంద్రియములకు గల విషయగ్రహణ సామర్థ్యము అల్పము. మరియు ఇంద్రియములలో మరియొక దోషము గలదు. అవి వస్తువును యథాతథముగా చూడలేవు. కొన్ని సమయములలో అవి, లేని వస్తువులను కూడ దర్శిస్తాయి. మన జ్ఞానేంద్రియములు దోషరహితములైన పక్షంలో కూడా, మనము ఎదుట నున్న వస్తువులోని ఒక చిన్న అంశమును మాత్రమే చూడగల్గుతాము గావ, పూర్ణవస్తు స్వరూపము మనకు తెలిసే అవకాశము లేదు. ప్రస్తుతంలో శ్రీకృష్ణుని అనుగ్రహముచే అర్జునునకు ఇంచుమించు పూర్ణవస్తువును (తాను మినహాయించుకొని) దర్శించే భాగ్యము లభించినది. విశ్వరూపమును దర్శించిన తరువాత శ్రీకృష్ణుడే జగత్కారణమనియు, ఆయన స్వరూపము నెరుంగవలెననియు అర్జునుడు స్పష్టమగు అనుమితిని చేయగల్గినాడు. కావున, జ్ఞానేంద్రియములు, ప్రధానముగా కన్ను చూడగల్గిన దానికంటె అధికమును చూచే భాగ్యము అర్జునునకు కలిగినది.

అతడు తనను తాను విశ్వరూపము కంటె భిన్నముగా దర్శించుటచే భయపడినాడు. భగవానుడు ఈ విషయమునిచట నిర్దేశించుచున్నాడు. అతడు విశ్వరూపములో తనను కూడా కలుపుకొని యున్నచో, అది దివ్య చక్షువు గాక జ్ఞాన చక్షువు అయి ఉండెడిది. అతడు అద్వయతత్త్వమును దర్శించినచో, అభయమును పొంది యుండెడివాడు (అభయం ప్రతిష్ఠాం విందతే). మనకంటె భిన్నమగు వస్తువు మాత్రమే భయహేతువు అగును. అద్వయ దర్శనములో ద్వితీయవస్తువు ఉండదు గాన భయహేతువు ఉండజాలదు. కాని మనకంటె భిన్నముగా మరియొక వస్తువు ఉన్నచో, అది ఎంత చిన్నదైనా, భయమును కలిగించుటకు అది చాలును. ఇతరము సర్వము భయహేతువు అగును. మనకంటె భిన్నమైనది అతిశయించిన విస్తారమును కలిగియున్నది. అనంతముగా నున్నది . వ్యక్తి చాల చిన్నవాడు, మహత్త్వము లేనివాడు. కావున మనము అర్జునుని వలె తమను తాము మినహాయించు కొని మిక్కిలి పెద్దదియగు సమస్త విశ్వమును దర్శించినచో, మనకు అర్జునుని కంటె అధికమగు భయము కలుగును. అల్పశక్తి గల మన ఇంద్రియముల దర్శన శక్తికి అందుబాటులో నుండే అల్పమగు జగత్తుతో వ్యవహరించుట మన శక్తికి మించినపని అగుచున్నది. సర్వము చాల పెద్దదిగా భాసించుచున్నది.

నక్షత్రములకు, భూమికి మధ్యగల దూరమును అంచనావేసినచో, మనకు మతి పోవును. మనము కన్నులు చూడగల్గుచున్నదానికంటె అధికముగా చూడగల్గినచో, భయభీతులగుట నిశ్చయము. అర్జునునకు అటులనే జరిగినది. అతడు విశ్వరూపమును చూడగోరిన మాట వాస్తవమే అయినా, అది ఇంత భయానకముగా నుండునని అతడు ఊహించలేకపోయెను. ఇపుడాతనికి కొంత మనశ్శాంతి కావాలి. ఈ పరిస్థితి విశ్వరూప దర్శనము వలన ఏర్పడినది.

అర్జునుని భయకారణము తరువాతి శ్లోకములో ప్రస్తుతించబడునని శ్రీ శంకరులు వివరించిరి:

అధ్యాయము 11, శ్లోకము 24:

नभः स्पृशं दीप्तमनेकवर्णं व्यात्ताननं दीप्तविशालनेत्रम् ।
दृष्ट्वा हि त्वां प्रव्यथितांतरात्मा धृतिं न विन्दामि शमं च विष्णो ॥ २४ ॥

నభః స్పృశం దీప్త మనేక వర్ణం వ్యాత్తాననం దీప్తవిశాల నేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాం తరాత్మా ధృతిం న విందామి శమం చ విష్ణో (24)

= ఓ విష్ణో!; నభః స్పృశమ్ = ఆకాశమును స్పృశించునట్టియు; దీప్తమ్ =
నట్టియు; అనేకవర్ణమ్ = అనేకరూపములు కల్గినట్టియు; వ్యాత్తాననమ్ = తెరచిన
నట్టియు; దీప్త విశాలనేత్రమ్ = ప్రకాశించే పెద్ద కన్నులు కలిగినట్టి; త్వామ్ = నిన్ను;
చూచి; ప్రవ్యథితాంతరాత్మా = మిక్కిలి భయమును పొందిన అంతః కరణము గల నేను;
ధైర్యమును; చ = మరియు; శమమ్ = మనశ్శాంతిని; న విందామి = పొందలేకున్నాను;
యము.

ఓ విష్ణో! ఆకాశమునంటి ప్రకాశించే, అనేక రూపములతో నొప్పారు, తెరచిన నోరు ప్రకాశించే పెద్ద కన్నులు గల నిన్ను చూచిన నేను మిక్కిలి భయపడిన అంతః కరణము గలవాడనై ధైర్యమును మరియు మనశ్శాంతిని పొందలేకున్నాను. ఇది నిశ్చయము (24).

అర్జునుడు సర్వత్ర శ్రీకృష్ణుని గాంచుటచే, ఇప్పుడాయనను సముచితమగు రీతిలో 'విష్ణో
్యాపకుడా)!' అని సంబోధించుచున్నాడు. ఈ సందర్భములో భగవానుని విష్ణుత్వము
బడుటచే, ఈ సంబోధన అన్వర్థమైనది.

శ్రీకృష్ణుడు తన విశ్వరూపముతో స్వర్గలోకమును స్పృశించుచుండగా (నభస్స్పృశమ్)
ుడు గాంచెను. దాని యర్థమేమనగా సర్వవ్యాపకుడగు అయనకు అంతము లేదు. మరియు
ూపము దీప్తమై, అనేక వర్ణమై ప్రకాశించుచున్నది. వర్ణ్యతే అనేన ఇతి వర్ణః. ఒక వస్తువు దేనిచేత
ునో అది దాని వర్ణము అగును. అనగా రూపము గాని, రంగు గాని కావచ్చును.
ములో వర్ణమనగా రూపము. 'భయమును గొల్పు అనేక రూపములు' అని శ్రీ శంకరులు
రి. భయమును కలిగించు వస్తువులు కొన్ని మనకు పరిచితములే. పామును చూస్తే భయం
ది. బొద్దింకను చూచినా భయము కలుగును. కొన్ని సముద్ర జంతువులు చాల భయంకరముగా
ును. మనము ఎన్నడూ చూడజాలని రూపములను అర్జునుడు ఈ క్షణములో చూచుచున్నాడు.
న్నింటికి కొమ్ములు గలవు. మరికొన్నింటికి కోరలు గలవు. ఈ దృశ్యము నిశ్చితముగా భయమును
ల్పును. వాటి ఆకార విన్యాసములు వివిధముగా నుండెనని (నానా సంస్థానాః) శ్రీ శంకరులు
్యానించిరి. వాటి అవయవములు విభిన్నరీతులలో అమర్చబడియుండెను. ఇట్టి విభిన్న
నములతో వివిధరకముల పాములు, ఎగిరే జంతువులు, నడిచే జంతువులు, పాకే జంతువులు
త్రమే గాక, వివిధ రకముల మానవులు మరియు దేవతలు కూడ కానవచ్చిరి. వారిలో కొందరు

సుందరాకారులనుటలో సందియము లేదు. కాని మరికొందరు భయమును గొల్పుచుండిరి. వివిధ విన్యాసములతో గూడిన ప్రాణులను కలిగియుండుటచే ఈ విశ్వరూపము 'అనేకవర్ణమ్' వర్ణింపబడినది. విశ్వరూపము ఒక్కటియే. కాని ఈ విభిన్న రూపముల నన్నిటినీ అర్జునుడు భేద దృష్టితో గాంచి భయభీతుడైనాడు.

'నీ నోరు తెరచియున్నది (వ్యాత్తాననమ్). నీవు సర్వమును కబళించు కాల స్వరూపుడవు' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఆ రూపములో ప్రకాశించే పెద్ద కన్నులు ఎన్నియో గలవు (దీప్త విశాల నేత్రమ్). ఇట్టి రూపములో శ్రీకృష్ణుని గాంచి అర్జునుడు ''నా మనస్సు చాల కల్లోలముగా నున్నది (ప్రవ్యథిత - అంతర - ఆత్మా)'' అనుచున్నాడు. అతనికి చాలా భయము కలుగుచుండెను. అతడు మిక్కిలి భయపడి ఉన్నాడని (ప్రభీతః) శ్రీ శంకరులు వ్రాసిరి. 'నాకు ధైర్యము కలుగుట లేదు (ధృతిం న విందామి)' అని అతడు వాపోవుచుండెను. అతడా ఉగ్రరూపమును ఇకపై ఒక్క క్షణమైననూ చూచి భరించలేడు. విశ్వరూపములో మంచి అంశములు, భయానక అంశములు కూడ గలవు. కాని భయానక అంశములు మంచి అంశముల నన్నింటినీ ముంచెత్తి కప్పివేసినవి. ముందుగా అతడు విశ్వరూపము యొక్క భవ్యవైభవమును గాంచి విస్మయావిష్టుడయ్యెను. తరువాత క్రమముగా అతని దృష్టి విశ్వరూపములోని భయానక అంశములపై పడినది. అతడు చూపును వాటినుండి ప్రక్కకు మరల్చ జాలక వాటినే చూచుచుండెను. మనస్సు పనిచేయు తీరుతెన్నులు ఇటులనే యుండును. మనము విపరీత విషయములను చూచుట ఆరంభించగానే, తొందరలోనే మనకు సర్వము విపరీతముగా కనబడుట ఆరంభమగును. మనస్సు ఇట్టి స్థిరీకరణ స్వభావమును (fixation) నిర్మాణము చేయును. అందువలననే, 'నీ ఈ రూపమును ఇంకనూ చూచే ధైర్యము నాకు లేదు; నామనస్సునకు స్థైర్యము (శమము) లేదు' అని అర్జునుడు చెప్పుచున్నాడు. పదవ అధ్యాయములో అర్జునుడు ఆశ్చర్యమును పొందుచుండెను. విశ్వరూపమును దర్శించిన మొదటి క్షణములలో కూడా అతని మనస్సు ఆశ్చర్యముతో నిండియుండెను. ఇపుడు అది అంతా భయముగా మారిపోయెను. దీనికి కారణమేమి? అర్జునుడు తరువాతి శ్లోకములో వివరించుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 25:**

दंष्ट्राकरालानि च ते मुखानि दृष्ट्वैव कालानलसन्निभानि ।
दिशो न जाने न लभे च शर्म प्रसीद देवेश जगन्निवास ॥ २५ ॥

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస (25)

దేవేశ = ఓ దేవదేవా!; దంష్ట్రాకరాలాని = కోరలతో భయమును గొల్పుచున్నవి; కాలానలసన్నిభాని = ప్రలయకాలాగ్ని వలె భాసించుచున్నవి; చ = మరియు; తే = నీయొక్క; ముఖాని = ముఖములను; దృష్ట్వా ఏవ = చూడగనే; దిశః = దిక్కులను; న జానే = తెలియకున్నాను; చ = మరియు; శర్మ =మనశ్శాంతిని; న లభే = పొందకున్నాను; జగన్నివాస జగత్తునకు ఆధారమైనవాడా!; ప్రసీద = ప్రసన్నుడవు కమ్ము.

> ఓ దేవదేవా! కోరలతో భయమును గొల్పుచున్న, ప్రలయకాలాగ్ని వలె భాసిల్లే నీ ముఖములను చూచిన నేను నిశ్చయముగా దిక్కులను తెలియకున్నాను. నాకు మనశ్శాంతి కలుగుటలేదు. జగత్తునకు ఆశ్రయమైనవాడా! ప్రసన్నుడవు కమ్ము (25).

'నీ ముఖములన్నియు కోరలతో భయమును గొల్పుచున్నవి (దంష్ట్రాకరాలాని చ తే ముఖాని)'. విశ్వరూపములోని ముఖము లన్నియు ఈ దంష్ట్రల వలన ఏహ్య భావమును, భయమును గొల్పు చుండెను. కోరలు జంతువులకే గాక మానవులకైననూ శోభనీయవు. పిల్లి కోరలు, కుక్క కోరలు కూడ భయమును గొల్పును. పెద్దపులి వంటి అడవి మృగముల కోరలు మరింత భయమును గొల్పును. కోరలు మాంసమును చీల్చుటకు ఉద్దేశింపబడినవి గాన వాటి దర్శనము సర్వదా భయంకరమైనదియే. విశ్వరూపములో అర్జునుడు చూచిన ముఖములన్నియూ తెరచిన నోళ్లతో, కోరలతో భయమును గొల్పుమండెను. కోరలు గల మృగములన్నియూ హింసను వేయక పోవచ్చును. కాని వాటి దర్శనము భయమును గొల్పును. అట్టి ప్రాణులు పాపయోనులనబడును. చూడగానే భయమును గొల్పు ప్రాణులన్నియూ పాపశరీరులుగనే పరిగణింపబడును. ఆ కోరలను చూచి అర్జునుడు భయముతో వణికి పోయెను.

అర్జునుడు తాను చూచిన దృశ్యమును ప్రళయముతో పోల్చుకొనెను. ప్రళయములో ఘోరమగు అగ్నికాండమునందు సృష్టి సర్వము నశించునని చెప్పెదరు. కాల – అనల మనబడే, సర్వమును నశింపజేయు ఆ అగ్నిలో సర్వపదార్థములు కాలిపోవును. అలం న విద్యతే యస్య ఇతి అనలః. 'ఇక చాలును' అను పరిస్థితి ఎరుంగని అగ్నికి అనలమని పేరు. అగ్నిలో ఇంధనమును

వేసే కొలదియూ, అది ఇంకా కావాలంటుంది. అందుచేతనే అది అనలమైనది. బయటకు చొచ్చుకు వచ్చిన కోరలతో కనబడిన సర్వమును నమిలివేయుచున్న అనేక ముఖములను చూచిన అర్జునుడు ఆ విశ్వరూపమును కల్పాంతమునందు సర్వమును దహించివేసే ప్రళయాగ్నితో పోల్చుచున్నాడు.

అర్జునుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు: 'నాకు దిక్కులు తోచుట లేదు (దిశః న జానే). ఈ రూపమును చూచిన తరువాత తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము అను వివేకము నశించినది. ఎటు చూచిననూ నీవే కానవచ్చుటచే, ఏది ఏ దిక్కు అను విషయము తెలియకున్నది'. సూర్యుడు ఉదయించేది ఎటు, అస్తమించేది ఎటు అను విషయమాతనికి తెలియకున్నది. పైగా అతనికి ఏవేవో సూర్య గోళములు, చంద్ర గ్రహములు కానవచ్చు చుండెను. కావున అది రాత్రియా, పగలా అను విషయమైననూ అతనికి తెలియవచ్చుట లేదు. ఏకకాలములో సూర్య చంద్రులిద్దరూ ప్రకాశించుచుండిరి. 'నాకు ఆనందము కలుగుటలేదు (న లభే చ శర్మ)' అని అతడు చెప్పుచున్నాడు. అనగా ఇది అతనికి ఒక సమస్య అగుచున్నది. ఆరంభములో అతనికి కొంత మనోరంజనమును కలిగించినది. కాని ఇపుడు పరిస్థితి పూర్తిగా మారిపోయినది. ఈ విశ్వరూపమును ఇంకనూ దర్శించుటలో అతనికి ఆనందమేమియూ కలుగుట లేదు.

అపుడాతడు తనకు మనశ్శాంతిని కలిగించుమని భగవానుని ప్రార్థించుచున్నాడు. అర్జునుడు భగవానుని 'దేవేశ !(దేవతలందరికీ ప్రభువు)' అని సంబోధించి ' నాయందు దయను చూపుము (ప్రసీద)' అని కోరినాడు. తన విన్నపమునకు బలమును చేకూర్చుటకై అర్జునుడు శ్రీకృష్ణుని రెండవసారి 'జగన్నివాస (జగత్తునకు అధిష్ఠానమైనవాడా)!' అని సంబోధించెను. 'దయతో నన్ను ఆశీర్వదించుము' అని అర్జునుడు ప్రార్థించెను.

యుద్ధములో విజయము ఎవరిది? అను అర్జునుని సందేహము ఇపుడాతడు చూచుచున్న దృశ్యములో తొలగిపోవుచున్నది:

**అధ్యాయము 11, శ్లోకము 26:**

अमी च त्वां धृतराष्ट्रस्य पुत्रास्सर्वे सहैवावनिपालसंघैः ।
भीष्मो द्रोणस्सूतपुत्रस्तथासौ सहास्मदीयैरपि योधमुख्यैः ॥ २६ ॥

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాస్సర్వే సహైవావని పాలసంఘైః
భీష్మో ద్రోణస్సూత పుత్రస్తథా సౌ సహాస్మదీయైరపి యోధముఖ్యైః (26)

**అమీ** = ఈ; **సర్వే** = అందరు; **ధృతరాష్ట్రస్య** = ధృతరాష్ట్రుని; **పుత్రాః** = పుత్రులు; **అవనిపాల సంఘైః సహ** = రాజుల సమూహములతో గూడి; **చ** = మరియు; **భీష్మః** = భీష్ముడు; **ద్రోణః** = ద్రోణుడు; **తథా** = అదే విధముగా; **అసౌ** = ఈ, **సూతపుత్రః** = కర్ణుడు; **అస్మదీయైః** = మావారు అగు; **యోధముఖ్యైః అపి** = ముఖ్యులైన వీరులతో కూడి; **త్వామ్** = నిన్ను.

రాజుల సమూహములతో గూడియున్న ఈ ధృతరాష్ట్ర పుత్రులందరు, భీష్ముడు, ద్రోణుడు, మరియు ఈ కర్ణుడు మావారైన ప్రముఖ వీరులతో గూడి నిన్ను (ప్రవేశించుచున్నారు) (26).

**అధ్యాయము 11, శ్లోకము 27:**

वक्त्राणि ते त्वरमाणा विशन्ति दंष्ट्राकरालानि भयानकानि।
केचिद्विलग्ना दशनान्तरेषु संदृश्यन्ते चूर्णितैरुत्तमाङ्गैः ॥ २७ ॥

వక్త్రాణి తే త్వరమాణా విశంతి దంష్ట్రా కరాలాని భయానకాని
కేచిద్విలగ్నా దశనాంతరేషు సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః (27)

**త్వరమాణాః** = కంగారుపడుచున్నవారై; **దంష్ట్రా కరాలాని** = కోరలతో ఉగ్రముగా నున్న; **భయానకాని** = భయమును గొల్పు; **తే** = నీయొక్క; **వక్త్రాణి** = నోళ్లను; **విశంతి** = ప్రవేశించుచున్నారు; **కేచిత్** = కొందరు; **చూర్ణితైః** = చూర్ణము చేయబడిన; **ఉత్తమాంగైః** = శిరస్సులతో; **దశనాంతరేషు** = పళ్ల మధ్యలో; **విలగ్నాః** = తగుల్కొని; **సందృశ్యంతే** = కానవచ్చు చున్నారు.

వారు కంగారు పడుతూ కోరలతో ఉగ్రముగా నుండి భయమును గొల్పు నీ నోళ్లలో ప్రవేశించుచున్నారు. వారిలో కొందరు చూర్ణమైన శిరస్సులు గలవారై పళ్ల మధ్యలో తగుల్కొని కానవచ్చు చున్నారు (27).

"అహా ప్రసారితములైన కోరలతో భీతిని గొల్పు నీ నోళ్లయందు వీరందరు ప్రవేశించుచున్నారు (అమీ...వక్త్రాణి తే విశంతి దంష్ట్రాకరాలాని భయానకాని)" అని ప్రత్యక్ష ప్రసారము చేయుచున్న రీతిలో అర్జునుడు చెప్పుచున్నాడు. అతడు చూచుచున్నది ఏమిటి?

ధృతరాష్ట్ర కుమారులందరు (ధృతరాష్ట్రస్య అమీ సర్వే పుత్రాః) అనేక రాజన్యులతో గూడి (సహైవ అవనిపాల సంఘైః) ఈ నోళ్లలోనికి ప్రవేశిస్తూ కానవచ్చిరి. అవని యనగా భూమి. భూమిని ఏలు రాజులు అవని పాలు రనబడుదురు. ఎందరో రాజులు, సేనాధ్యక్షులు జరుగబోవు యుద్ధము కొరకై ఒక్కచోట గూడి యుండిరి. వారందరు విశ్వరూపుని నోళ్లలోనికి ప్రవేశించుచుండగా అర్జునుడు గాంచెను. మరియు కురువంశ పితామహుడు, మహాబలుడు, అజేయుడు నగు భీష్ముడు కూడ అతనికి కానవచ్చెను. తనకు ధనుర్విద్యను నేర్పిన ద్రోణాచార్యుడు కూడ కనబడెను. వీరిద్దరు మరియు సూతపుత్రుడగు కర్ణుడు ప్రతిపక్షములోని వారు. కర్ణుడు కుంతీపుత్రుడు. కాని ఈ సత్యము కుంతికి, శ్రీకృష్ణునకు తక్క ఇతరులకు తెలియదు. శత్రు పక్షములో నున్న కర్ణుడు తన సోదరుడే యను సంగతి అర్జునునకు కూడ ఇంకనూ తెలియదు. వీరే గాక, తన పక్షములో ప్రధానవీరులు (యోధముఖ్యాః) అగు ధృష్టద్యుమ్నుడు, సాత్యకి మొదలగు తనవారు కూడ (అస్మదీయాః) కానవచ్చిరి.

'వారందరు నీ నోటిలోనికి ప్రవేశించుచుండిరి! నమిలి నాశనము చేసే ఈ నోళ్లలోనికి వారు మెల్లగా వెళ్లుట లేదు; వాటి లోనికి పరువులెత్తుచున్నారు. చాల వేగముగా వారు ప్రవేశించు చున్నారు (త్వరమాణా విశంతి)'. ఆ నోళ్లు ఎట్లున్నవి? అన్ని వైపులనుండి బయటకు పొడుచుకు వచ్చిన కోరల వరుసలతో (దంష్ట్రాకరాలాని) ఆ నోళ్లు భీతిని గొల్పుచున్నవి (భయానకాని). నోళ్లలోనికి ప్రవేశించిన వారిలో కొందరు ఆ కోరల మధ్య నలిగి వ్రేలాడుచున్నారు (విలగ్నాః దశనాంతరేషు). 'భీష్మ ద్రోణ దుర్యోధనాదులందరు వరుసగా నీచే కబళించి వేయబడుచున్నారు'. రాబోవు పరిస్థితిని అర్జునునకు శ్రీకృష్ణుడు చూపినాడు. కాలపు కోరలు వారినందరినీ నమిలి వేయుచున్నవి. నీవు పెరిగి పెద్దవాడవగు చుండగా తీసిన సినిమాను వేగముగా చూపించే చిత్రదర్శిని (Projection) సహాయముతో చూచితివనుకొనుము. ఆ చిత్రములో మహావేగముతో కలిగే మార్పులను చూచిన నీకు భయము కలుగును. అర్జునుని పరిస్థితి అట్లున్నది. శరీరము పెరిగి పెద్ద దై వృద్ధాప్యము మీదబడుట అను ప్రక్రియ మహావేగముగా జరుగుచున్నట్లు చూపించినచో భయము కలుగును. ఇచటి పరిస్థితి అటులనే యున్నది. జీవిత చక్రమును మహావేగముతో త్రిప్పి భగవానుడు అర్జునునకు చూపినాడు. వీరందరి తలలు దంతముల మధ్య పడి చూర్ణమగుచుండగా (చూర్ణితైః ఉత్తమాంగైః) అర్జునుడు గాంచినాడు (సందృశ్యంతే). ఉత్తమాంగమనగా ప్రధానమైన అవయవము; అనగా తల. కాలపురుషుని నోరు చూర్ణమైన వారి శిరములను చప్పరించుచుండెను.

ఈ జనులందరు వినాశకరమగు ఆ నోళ్లలోనికి ప్రవేశించే తీరు ఎట్లున్నది? అర్జునుడీ విషయమును రెండు దృష్టాంతములతో వర్ణించుచున్నాడు :

**అధ్యాయము 11, శ్లోకము 28:**

यथा नदीनां बहवोऽम्बुवेगास्समुद्रमेवाभिमुखा द्रवन्ति ।
तथा तवामी नरलोक वीरा विशन्ति वक्त्राण्यभिविज्वलन्ति ॥ २८ ॥

యథా నదీనాం బహవోంబువేగాస్సముద్రమేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోక వీరా విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి (28)

**యథా** = ఏ విధముగానైతే; **నదీనామ్** = నదులయొక్క; **బహవః** = అనేకములైన; **అంబువేగాః** = జలప్రవాహములు; **సముద్రం ఏవ** = సముద్రమును మాత్రమే; **అభిముఖాః** = అభిముఖముగా చేసుకొని; **ద్రవంతి** = ప్రవహించుచున్నవో; **తథా** = అదే విధముగా; **అమీ** = ఈ; **నరలోకవీరాః** = మానవ వీరులు; **తవ** = నీ, **అభివిజ్వలంతి** = మండుచున్న; **వక్త్రాణి** = నోళ్లను; **విశంతి** = ప్రవేశించుచున్నారు.

ఏ విధముగానైతే నదులయొక్క అనేక జల ప్రవాహములు సముద్రమును మాత్రమే అభిముఖముగా చేసుకొని ప్రవహించుచున్నవో, అదే విధముగా ఈ మానవవీరులు మండుచున్న నీ నోళ్లలోనికి ప్రవేశించుచున్నారు (28).

**అధ్యాయము 11, శ్లోకము 29:**

यथा प्रदीप्तं ज्वलनं पतङ्गा विशन्ति नाशाय समृद्धवेगाः ।
तथैव नाशाय विशन्ति लोकास्तवापि वक्त्राणि समृद्धवेगाः ॥ २९ ॥

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా విశంతి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశంతి లోకాస్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః (29)

**యథా** = ఏ విధముగా నైతే; **పతంగాః** = మిడతలు, **సమృద్ధవేగాః** = అతిశయించిన వేగము గలవై; **ప్రదీప్తమ్** = మండుచున్న; **జ్వలనమ్** = అగ్నిని; **నాశాయ** = నాశము కొరకు; **విశంతి** = ప్రవేశించునో; **తథైవ** = అదే విధముగా; **లోకాః** = మానవులు; **సమృద్ధవేగాః** = అతిశయించిన వేగము గలవారై; **తవ** = నీ; **వక్త్రాణి అపి** = నోళ్లను కూడా; **నాశాయ** = వినాశము కొరకు; **విశంతి** = ప్రవేశించు చున్నారు.

ఏ విధముగానైతే మిడతలు మహావేగముతో వినాశము కొరకు మండుచున్న అగ్నిలోనికి ప్రవేశించునో, అదే విధముగా మానవులు నీ నోళ్లయందు కూడా మహావేగముతో వినాశము కొరకు ప్రవేశించుచున్నారు (29).

నదీ జలములు సర్వదా సముద్రాభిముఖముగా పయనిస్తూ వేగముగా సముద్రములో ప్రవేశించు విధముగా, ఈ జనులందరు మృత్యువు యొక్క కోరలలోనికి పరుగులిడుచున్నారు. నదిజలములు విసుగు విరామము లేకుండగా వేగముగా సముద్రము వైపునకు పరుగిడు తీరున, ఈ జనులు మంటలను విరజిమ్ముచున్న (అభివిజ్వలంతి) విశ్వరూపములోని నోళ్లలోనికి ప్రవేశించుచున్నారని అర్జునుడు చెప్పుచున్నాడు. మనుష్యలోకములో భీష్ముని వంటి మహావీరులు (నరలోక వీరాః) గలరు. ఇచట భగవానుని విరాడ్రూపము సముద్రముతో పోల్చబడుచున్నది. విశ్వరూపములోని నోళ్లు నదీసాగర సంగమముల వంటివి. మృత్యు ముఖములోనికి మిక్కిలి వేగముతో ప్రవేశించుచున్న ఈ మహావీరులందరు నదిజలముల వంటివారు.

శ్రీకృష్ణుడు తన మాయా ప్రభావముచే అర్జునునకు రాబోవు ఘటనలను ప్రదర్శించుచున్నాడు. సర్వము ముందుగనే నిర్ధారితమై యున్నది. అర్జునుడు యుద్ధమును చేసినా, చేయకపోయినా, ఈ జనులందరు మరణించ బోవుచున్నారు. అందువలననే, శ్రీకృష్ణుడు ముమ్ముందు అతనితో 'నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము (నిమిత్త మాత్రం భవ)' అని చెప్పబోతాడు.

వారు ఈ నోళ్లలోనికి దేనికొరకు ప్రవేశించుచున్నారు? అగ్నిలో ప్రవేశించు శలభములవలె వారు తమ వినాశము కొరకు (నాశాయ) మాత్రమే ప్రవేశించుచున్నారు. కాంతి ఎక్కడ ఉంటే అక్కడికి శలభములు ఆకర్షింపబడును. అవి అచట నశించును. అవి రెట్టించిన ఉత్సాహముతో వేగముగా, ప్రకాశించే కాంతి పుంజములోనికి దుమికి నశిస్తాయి. అదే విధముగా ఈ జనులందరు మండుచున్న ఈ నోళ్లలోనికి ప్రవేశిస్తున్నారు (విశన్తి లోకాః). వారు ప్రాణములతో మరలి రారు. ఇంతే గాదు. భగవానుడు ఈ పరిస్థితినంతయూ ఉల్లాసముగా ఆనందించుచున్నాడా యనిపించును.

**అధ్యాయము 11, శ్లోకము 30:**

लेलिह्यसे ग्रसमानस्समन्ताल्लोकान् समग्रान् वदनैर्ज्वलद्भि : ।
तेजोभिरापूर्य जगत्समग्रं भासस्तवोग्राः प्रतपन्ति विष्णो ॥ ३० ॥

లేలిహ్యసే గ్రసమానస్సమంతాల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః
తేజోభిరాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో (30)

**జ్వలద్భిః** = మండుచున్న; వదనైః = ముఖములతో; సమగ్రాన్ = సమస్తమైన; **లోకాన్** = మానవులను; **సమంతాత్** = పూర్ణముగా; గ్రసమానః = మ్రింగువాడవై; **లేలిహ్యసే** = ఆస్వాదించుచున్నావు; **విష్ణో** = హే విష్ణో!; **తవ** = నీ ; **ఉగ్రాః** = క్రూరమైన ; **భాసః** = జ్వాలలు; **జగత్** = జగత్తును; **తేజోభిః** = తేజస్సులతో; **ఆపూర్య** = నింపివేసి; **ప్రతపంతి** = అతిశయించిన తాపమును కలిగించుచున్నవి.

మండుచున్న నీ ముఖములతో మానవులనందరినీ పూర్ణముగా మ్రింగి ఆస్వాదించుచున్నావు. ఓ విష్ణో! నీ క్రూరమైన జ్వాలలు తేజస్సుతో జగత్తు నంతనూ నింపివేసి, అతిశయించిన తాపమును కలిగించుచున్నవి (30).

ఈ సందర్భములో భగవానుడు దయను లేశమైననూ చూపించుట లేదని పించును. పైగా, అయన ఈ వినాశమును ఆస్వాదించుచున్నాడా యన్నట్లు కన్పట్టును. అయన నాలుకతో పెదవులను స్పృశిస్తూ కంట బడిన సర్వమును ఉల్లాసముతో కబళించి వేయుచుండెను. 'లేలిహ్యసే' అనగా మనము తేనెను ఆస్వాదించు విధంబున భగవానుడు తన నాలుకను బయటకు చాచి ఆస్వాదించుచున్నాడని యర్థము. భగవంతునకు ఈ వినాశములో రుచి గలదా యనిపించును. అయన సర్వులను పూర్తిగా (సమంతాత్) కబళించుచున్నాడు. వారెవరు? అయన నోటిలోనికి ప్రవేశించే జనులందరినీ (లోకాన్ సమగ్రాన్) కబళించుచున్నాడు.

అయన ఆస్వాదించే తీరు యెట్లున్నది? తేజోమయములై మండుచున్న నోళ్లతో (జ్వలద్భిః వదనైః) మ్రింగివేయుచున్నాడు. మరియు 'నీవు జగత్తునంతనూ మ్రింగివేసి భయంకరమగు జ్వాలలలో దహించు చున్నావు (తవోగ్రాః భాసః సమగ్రం ప్రతపన్తి)' అని అర్జునుడు చెప్పుచున్నాడు. ఈ భయంకరమగు జ్వాలలు సర్వమును చుట్టుముట్టి భక్షించుచున్నవి. విశ్వరూపములో ఘటిల్లుచున్న వినాశప్రక్రియను అర్జునుడు ఈ విధముగా వర్ణించెను.

అర్జునుడు ఒక అద్భుత దృశ్యమును చూడగోరి విశ్వరూపమును చూపుమని గోరెను. అతడు కోరిన విధముగా అద్భుతమును చూచినాడు. కాని విశ్వరూపము యొక్క ఈ వినాశ లక్షణమును చూచుటకు అతడు సంసిద్ధుడు గాకుండెను. భగవంతుడు సర్వమును పాలించి

పోషించువాడు మాత్రమే గాదు. సంహారకుడు కూడా ఆయనయే. సృష్టిలో నిరంతరముగా జరిగే వినాశమును అర్జునుడు విశ్వరూపములో చూచుచున్నాడు. వినాశము కూడా సృష్టిలో ఉండి తీరవలసిన భాగము. కావున విశ్వరూప దర్శనములో వినాశము కూడా అంతర్భాగము కావాలి. నిరంతరముగా ఘటిల్లే సృష్టిస్థితిలయ ప్రక్రియ ఈశ్వర స్వరూపమే. కాని ఈశ్వరుని వినాశకర రూపమును చూచుట సరళము కాదు. ఇట్టి రూపమును తాను చూచెదననే ఊహయే తనకు లేకుండెనని అర్జునుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 31:**

आख्याहि मे को भवानुग्ररूपो नमोऽस्तु ते देववर प्रसीद।
विज्ञातुमिच्छामि भवन्तमाद्यं न हि प्रजानामि तव प्रवृत्तिम् ॥ ३१ ॥

ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమోస్తు తే దేవవర ప్రసీద
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ (31)

**ఉగ్రరూపః** = భయంకరాకారుడవగు; **భవాన్** = నీవు; **కః** = ఎవరివి; **మే** = నాకొరకు; **ఆఖ్యాహి** = చెప్పుము; **దేవవర** = దేవతలలో శ్రేష్ఠుడైనవాడా!; **తే** = నీకొరకు; **నమః** = నమస్కారము; **అస్తు** = అగుగాక!; **ప్రసీద** = ప్రసన్నుడవు కమ్ము; **ఆద్యమ్** = సర్వకారణుడవగు; **భవన్తమ్** = నిన్ను; **విజ్ఞాతుమ్** = తెలియుటకు; **ఇచ్ఛామి** = కోరుచున్నాను; **హి** = ఏలయనగా, **తవ** = నీ; **ప్రవృత్తిమ్** = క్రియాకలాపమును; **న ప్రజానామి** = లేశమైననూ యెరుంగను.

భయంకరాకారుడవగు నీవెవరివి ? నాకొరకు దయచేసి చెప్పుము. దేవతలలో శ్రేష్ఠుడైనవాడా! నీ కొరకు నమస్కారము అగుగాక! ప్రసన్నుడవు కమ్ము. సర్వ కారణుడవగు నిన్ను తెలియగోరుచున్నాను. ఏలయన, నీ క్రియా కలాపము లేశమైననూ నాకు తెలియదు (31).

ఈ వినాశమును, భవిష్యత్తులో జరుగబోవు ఘటనలను విశ్వరూపములో గాంచి అర్జునుడు తికమకపడినాడు. అందువలననే 'ఇంతటి భయంకరమగు ఆకారము గల నీవు ఎవరివో దయచేసి నాకు చెప్పుము' అని అతడు ప్రార్థించుచున్నాడు. 'ఓ దేవోత్తమా! నీకు నమస్కారములు. దయను చూపుము' అని వేడుకొనుచున్నాడు. 'శ్రీకృష్ణుడే జగత్కారణము' అను విషయమును

అర్జునుడిపుడు స్పష్టముగా తెలియగోరినాడు. "ఆదిపురుషుడవగు నీ స్వరూపమును నేను స్పష్టముగా తెలియ గోరుచున్నాను (విజ్ఞాతుం ఇచ్ఛామి భవంతం ఆద్యమ్)". ఎందులకు? "ఏలయన, నీ చేష్టలు నాకేమియును అర్థము గాకున్నవి" జానామి అను ధాతువు యొక్క అర్థమును ప్ర అను ఉపసర్గ అతిశయింప జేయుచున్నది. 'వీరినందరినీ నశింప జేయుటయే నీ ఉద్దేశ్యముగా కనపడుచున్నది. నీవెవరివి? నీవు సర్వులను రక్షించే విష్ణుడవని నేను తలంచితిని. కాని నీవిపుడు సర్వమును నాశనము చేయుచుండగా నేను గాంచితిని. నీవు రక్షకుడగు విష్ణుడవా? లేక సంహారకుడగు శివుడవా? నాకు తెలియకున్నది. కావున దయచేసి నాకు చెప్పుము'.

భగవంతుడు సమాధానము నిచ్చుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 32:**

श्रीभगवानुवाच ।
कालोऽस्मि लोकक्षयकृत्प्रवृद्धो लोकान् समाहर्तुमिह प्रवृत्तः ।
ऋतेऽपि त्वा न भविष्यन्ति सर्वे येऽवस्थिताः प्रत्यनीकेषु योधाः ॥ ३२ ॥

శ్రీ భగవానువాచ ।
కాలోస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః.
ఋతేపి త్వా న భవిష్యంతి సర్వే, యేవస్థితాః ప్రత్యనీకేషు యోధాః (32)

**ప్రవృద్ధః** = విస్తరించి; **లోకక్షయకృత్** = ప్రాణులను సంహరించే; **కాలః** = కాలము; **అస్మి** = అగుచున్నాను; **లోకాన్** = జనులను, **సమాహర్తుమ్** = నశింపజేయుటకు; **ఇహ** = ఇచట, **ప్రవృత్తః** = ప్రవర్తిల్లుచున్నాను, **ఋతే అపి త్వా** = నీవు లేకున్ననూ, **ప్రత్యనీకేషు** = శత్రుపక్షములలో; **యే** = ఏ; **యోధాః** = యోధులు. **అవస్థితాః** = నిలబడియున్నారో వారు; **సర్వే** = అందరు; **న భవిష్యంతి** = ఉండబోరు.

> విస్తరించి ప్రాణులను సంహరించే కాలము నేనే. నేను జనులను సంహరించుటకు ఇచట ప్రవర్తిల్లుచున్నాను. ఈ శత్రుపక్షములలోని యోధులందరు నీవు లేకున్ననూ జీవించి యుండబోరు (32).

తనయొక్క మిక్కిలి అందమైన పాలనపోషణ లక్షణము మాత్రమే గాక, సంహార

లక్షణము కూడా గలదని భగవానుడు చెప్పుచున్నాడు. 'జనులను సంహరించే (లోకక్షయకృత్) కాలుడను నేనే' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇచట లోక శబ్దమునకు జనులు అని యర్థము. 'జనుల జీవితమునంతము చేయు మృత్యుదేవతే నేనే'. ఆ మృత్యుదేవతయే పెరిగి పెద్దదై (ప్రవృద్ధః) విశ్వరూపమైనది. అందువలననే అర్జునునకు విశ్వరూపములో వినాశము తక్క మరియొకటి కానరాలేదు. భగవానుని ప్రవృత్తి (చేయు పనులు)ని గూర్చి అర్జునుడు తెలియగోరెను. 'ఈ లోకమునందలి ప్రజలను ఈ కాలములో సంహరించుటయే నా పని' అని తిన్నగా భగవానుడు బదులిడినాడు. ఇహ అనగా ఈ లోకములో ఈ కాలములో అని యర్థము. కావున అర్జునుడు సంహార కర్తయగు భగవానుని రుద్రరూపమును గాంచుచున్నాడు.

సర్వము భగవానుడే యను విషయమునీ ప్రకరణము నిరూపించుచున్నది. సృష్టికర్త, స్థితికర్త మాత్రమే గాక లయకర్త కూడా భగవానుడే. సృష్టిస్థితిలయములను ఘటిల్లజేయు నియతి (Law) భగవానుడే. కావున 'నీవు లేకున్నా (ఋతే అపి త్వా) వీరందరు ఉండబోవుట లేదు (న భవిష్యంతి)''. ఇరుపక్షములయందు (ప్రత్యనీకేషు) యుద్ధ సన్నద్ధులై నిలబడియున్న (యే అవస్థితాః) వీరులందరు (సర్వే యోధాః) జీవించి యుండబోరు (న భవిష్యంతి). ఈ యుద్ధము పూర్తియగు సరికి ఇరుపక్షములయందు యుద్ధమునకు సన్నద్ధులై ఇప్పుడు నిలబడియున్న వీరులందరు మరణించెదరు. వారి మరణము నిర్ధారితమై యున్నది. వారి వారి కర్మలు ఆ తీరున అభివ్యక్తమగును. దీనిని ఎవ్వరూ ఆపలేరు. కావున, ఓ అర్జునా! నీవు లేకున్నా వారు నశించెదరు! ఒకవో సంధి కుదిరినా, కాలరూపములో మరియు కర్మనియతి రూపములో నున్న భగవానుడు వారిని మరియొక మార్గములో సంహరించగలడు. పిద పవారు మరియొక జన్మను పొందెదరు. ఇట్టి స్థితిలో,

**అధ్యాయము 11, శ్లోకము 33:**

तस्मा त्त्वमुत्तिष्ठ यशो लभस्व जित्वा शत्रून् भुंक्ष्व राज्यं समृद्धम् ।
मयैवैते निहताः पूर्वमेव निमित्त मात्रं भव सव्य साचिन् ॥ ३३ ॥

తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయ్యైవైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్య సాచిన్ (33).

**తస్మాత్** = అందువలన; **త్వమ్** = నీవు; **ఉత్తిష్ఠ** = లేచి నిలబడుము; **యశః** = కీర్తిని,

లభస్వ = పొందుము; శత్రూన్ = శత్రువులను; జిత్వా = జయించి, సమృద్ధమ్ = సంపదలతో గూడియున్న; రాజ్యమ్ = రాజ్యమును; భుంక్ష్వ = అనుభవించుము; ఏతే = వీరు; మయైవ = నాచేతనే; పూర్వమేవ = పూర్వమే; నిహతాః = సంహరింపబడినారు; సవ్యసాచిన్ = ఓ సవ్యసాచీ!; నిమిత్తమాత్రమ్ = నిమిత్త మాత్రుడవు; భవ = కమ్ము.

> అందువలన నీవు లేచి నిలబడి కీర్తిని పొందుము. శత్రువులను జయించి సంపదలతో గూడియున్న రాజ్యము ననుభవించుము. వీరు పూర్వమే నాచేతనే సంహరింపబడినారు. ఓ సవ్యసాచీ! నీవు నిమిత్త మాత్రుడవు కమ్ము (33).

తస్మాత్ త్వం ఉత్తిష్ఠ. కావున నీవు లేచి నిలబడుము. నిలబడి యుద్ధమును చేయుము. ప్రధాన తాత్పర్యమేమనగా 'నీ ధర్మమును నీవు నిర్వర్తించుము'. గీతలో సర్వత్రా కానవచ్చు సందేశము ఇదియే. మోక్షసాధనము జ్ఞానము మాత్రమే! ఇతరము కాదు అని గీత ముందుగా స్పష్టము చేయును. నీవు మోక్షమును కోరుచున్నచో, జ్ఞానమును సంపాదించవలెను. జ్ఞానమును పొందుటకు ఉపకరించే రెండు విశిష్టజీవనశైలులు గలవు. ఒకటి సన్న్యాస జీవనము, రెండవది స్వధర్మానుష్ఠానము (కర్మయోగము). ఒకప్పుడు యుద్ధమును చేయుట స్వధర్మమగును. ప్రస్తుతములో అటులనే అయినది. ఇది యుద్ధమాత్రము కాదు. ఇది ధర్మ యుద్ధము. కర్మనియతి ఈ పరిస్థితుల నన్నిటినీ నిర్మించినది. కలలోనైననూ అర్జునుడీ యుద్ధమును కోరుకొనలేదు. కాని అతడు క్షత్రియుడు. సమాజములో అతనికి గల స్థానమును బట్టి అతడు ధర్మమును, న్యాయమును రక్షించవలెను. అతడీ యుద్ధమును చేయవలెను. ఇది అతని విధి. 'కావున, ఓ అర్జునా! లేచి నిలబడుము' అని భగవానుడు చెప్పినాడు. అనగా 'నీ విధిని నీవు నిర్వర్తించుము; ధర్మమును రక్షించుట నీ కర్తవ్యము. కావున నీ కర్తవ్యమును అనుష్ఠించుము' అని భగవానుని అభిప్రాయము.

అట్లు చేయుట వలన అతనికి కొన్ని అదనపు లాభములు చేకూరగలవు. " నీవు కీర్తిని పొందుము (యశః లభస్వ)". అర్జునుడు ధర్మము కొరకై నడుము కట్టిన వాడని దేశములోని మారుమూల ప్రాంతము వారికి కూడ తెలియును. అర్జునుడు భయము నెరుంగడు. భీష్మద్రోణాది మహావీరుల నెదిరించి నిలబడే పరిస్థితిలో కూడా అతడు వెనుదిరుగలేదు. అతడు యుద్ధరంగమునందు నిలబడి ధర్మము కొరకు మాత్రమే పోరాడినాడు. అర్జునునకు ఇట్టి కీర్తి

లభించును. ''నీవు శత్రువులపై విజయమును పొంది (శత్రూన్ జిత్వా), సిరిసంపదలతో నలరారే రాజ్యమును భోగించుము (భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్)''.

భీష్మాది మహావీరులు వేలాది రథికులతో గూడిన సైన్యమును నడుపగలరు. వారిని దేవతలైననూ నిర్జించలేరు. కాని అర్జునుడు వారిని జయించిన సంగతిని శ్రీ శంకరులు గుర్తు చేసినారు. వారిని జయించుటచే అతనికి గొప్ప కీర్తి దక్కినది. అట్టి కీర్తి గొప్ప పుణ్యమును చేసుకున్న పుణ్యపురుషులకు మాత్రమే దక్కును; సామాన్యులకు కాదు. వీరిని జయించిన పిదప అర్జునుడు శ్రమ లేకుండగా, శత్రుభయములేని సమృద్ధమగు రాజ్యమును అనుభవించ గల్గునని శ్రీ శంకరులు వివరించినారు.

''వీరినందరినీ నిశ్చితముగా నేను ఇదివరకే సంహరించినాను (మయా ఏవ ఏతే నిహతాః పూర్వం ఏవ)'' అను భగవానుని వచనము చాల ప్రముఖమైనది. కర్మనియతికి అధీశ్వరుడు, కాల స్వరూపుడు అగు భగవానుడు ఇప్పటికే వారిని నశింపజేసినాడు. సమయము ఇపుడు వచ్చినది. ''నీవు ఒక సాధనము మాత్రమే'' అని శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పుచున్నాడు. మిగుల ముగ్గిన పండు గాలి వీచగానే నేల గూలును. అది నేలగూలుటలో గాలి నిమిత్త మాత్రమే. ఆ పండు పడుటకు సిద్ధముగా నున్నది.

భగవానుడిచట అర్జునుని సవ్యసాచిన్ (ఎడమ చేతితో కూడా బాణములను ప్రయోగించ గలవాడు) అని సంబోధించినాడు. అర్జునుడు యుద్ధములో ఉభయ హస్తకుశలుడు. అతడు కుడి చేతితో యుద్ధము చేయుట సహజమే. ఇంతేగాక, అవసరము వచ్చినప్పుడు ఎడమచేతితో యుద్ధమును చేయుటలో వెసులు బాటు అధికముగా నున్నచో, అతడు అట్లు యుద్ధమును చేయగలడు. యుద్ధమును చేసే ప్రేరణను ఇచ్చుటకై భగవానుడు అర్జునునకు అతని బలపరాక్రమములను గుర్తు చేయుచున్నాడు కాబోలు! ''కావున ఓ అర్జునా! నీవు నిమిత్తమాత్రుడవు కమ్ము'' అని భగవానుడు చెప్పుచున్నాడు. అతడు చేయవలసిన పని కొన్ని బాణములను ప్రయోగించుట మాత్రమే. ఈ యోజనలో అతని పాత్ర అంతే. ఇపుడు అతడు ఉన్న పరిస్థితి అతడు కోరుకున్నది కాదు. కాని ప్రారబ్ధవశమున అతడీ యుద్ధమును చేయవలసి వచ్చినది. దీనికంతకు వెనుక ఒక యోజన గలదు. 'కావున నీవు నీ ఇష్టానిష్టములను దీనిలో ప్రవేశపెట్టకుము. ఈ వ్యవహారమునంతనూ నీవు చెడగొట్టకుము. నీవు నీ ఇష్టానిష్టములు ఆధారముగా ఈ విషయములో నిర్ణయిస్తే, అది అధర్మమగును. నీవు చేసే పని నీ కర్తవ్యమునకు అనురూపముగా

అయుర్వేదము వలె ధనుర్వేదము కూడా అరు ఉపవేదములలో నొకటి. ప్రక్షేపాస్త్రముల సామర్థ్యమును పెంచే మంత్రములు, దివ్యాస్త్రములను సంపాదించి వినియోగించే ఉపాయములు ఈ ధనుర్వేదములో గలవు. ద్రోణుడు ధనుర్వేదములో నిష్ణాతుడు. పైగా, ఆయన అర్జునుని ఆచార్యుడు. ఆయన ఎదుట నిలిచి అర్జునుడు యుద్ధము నెట్లు చేయవలెను? ఇకపోతే, భీష్ముడు స్వచ్ఛందమరణము గలవాడు. కురువంశపితామహుడు, సమ్మాన్యుడు అగు భీష్ముడు అవతారపురుషుడగు పరశురామునితో ద్వంద్వయుద్ధమును చేసిన దిట్ట. ఇట్టి పరాక్రమశాలురగు శత్రువుల నెదుర్కొని జయించుట సంభవమేనా యను అశంక అర్జునునకు కలుగుట సహజమే. జయద్రథుడు తండ్రి నుండి ఒక వరమును పొంది యున్నాడు. ఎవరైతే జయద్రథుని తలను నేలపై బడునట్లు చేయునో, వాని శిరస్సు ప్రక్కలగును. అర్జునుని బద్ధ శత్రువగు కర్ణుడు శస్త్రాస్త్ర సంపత్తిలో మరియు పరాక్రమములో అర్జునునకు దీటైనవాడు. శత్రుపక్షములో అతడు కూడ నిలబడియున్నాడు.

అతడు కుంతియందు సూర్యభగవానుని అనుగ్రహముచే జన్మించెను. మహేంద్రుడు అతనికి శక్తి అనే ఒక గొప్ప అయుధమును ఇచ్చి యుండెను. ఇట్టి మహావీరులను స్పృశించుటయైననూ అసంభవము. వారందరు దుర్యోధనుని సైన్యములో ప్రముఖయోద్ధలు. వారందరు ఈ క్షణములో అర్జునుని ఎదుట నుండిరి. ఇట్టి అజేయులగు మహావీరులపై తాను నెగ్గగలనా యను సందేహము అర్జునునకు నిశ్చితముగా గలదు.

వీరు మాత్రమే గాక ఇంకనూ ఎందరో మహావీరులు (యోధవీరాన్) గలరు. కాని 'వారందరినీ నేను ఎప్పుడో సంహరించినాను (మయా హతాన్)' అని శ్రీకృష్ణుడు అర్జునునకు భరోసానిచ్చుచున్నాడు. వాస్తవంలో ఏ కర్మనైననూ ఆయన స్వయముగా చేయడు. వారు తమ వినాశమును తామే కొనితెచ్చుకొనిరి. వారు కర్మనియతి ననుసరించి తమ వినాశమునకు తామే కారణభూతులగు చున్నారు. శ్రీ కృష్ణభగవానుడు కేవలము ఆ కర్మనియతిపై అధ్యక్షుడు మాత్రమే. కర్మనియతిని ఎవ్వరైననూ ఆపజాలరు. అందువలననే 'నీవు వారిని సంహరించుము' అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. 'నీవుకేవలము నిమిత్త మాత్రుడవు అగుము (నిమిత్త మాత్రమ్)' అని ఆయన పూర్వ శ్లోకములో చెప్పి యున్నాడు. వారు పక్వమై వినాశమునకు సంసిద్ధముగా నున్నారు. వారి నాశమును ఆపగలవారు లేరు. "కావున భయపడకుము (మా వ్యథిష్ఠాః). యుద్ధములో శత్రువులపై విజయము నీదే (జేతాసి రణే సపత్నాన్). యుద్ధమును చేయుము (యుధ్యస్వ)" అని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ మహావీరు లందరికి విశిష్ట శక్తులు గలవను

భయముతో నిండిపోయెను. అదే సమయములో అతని హృదయపు లోతుల నుండి హర్షాతిశయము, ప్రేమ పెల్లుబుకు చుండెను. పరస్పర విరుద్ధములగు ఇట్టి తీవ్ర భావావేశముల వలన అతని కన్నులు నీటితో నిండి కంఠము గద్గదమయ్యెను. అందువలననే అతని పలుకులు అస్పష్టముగా నుండెను. కంఠము బొంగురు వోయెను. పైగా అతడు భయాతిరేకముచే పరాజితుడై యుండెను. అతడు అనేక పర్యాయములు ప్రణమిల్లెను.

ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పుటలో సంజయుని మనస్సునందు ఒక అభిప్రాయము ఉండెనని శ్రీశంకరులిచట సూచించిరి. ఒక క్షణము క్రితమే ద్రోణుడు, భీష్ముడు, జయద్రథుడు, కర్ణుడు ఇత్యాది వీరులందరూ అప్పటికే నాచే సంహరింపబడినారని శ్రీకృష్ణభగవానుడు చెప్పియుండెను. అర్జునుడు నిమిత్త మాత్రుడిగా నుండి యుద్ధమును చేసిన చాలును. దుర్యోధనుని బలమంతయూ ఈ వీరులే. వీరు నశించినచో, అతనికి నడుము విరిగినట్లు అగును. ఈ నలుగురు లేనిచో దుర్యోధనుడు యుద్ధము నారంభించి యుండెడివాడు కాదు. ఈ విషయమును ధృతరాష్ట్రుడు ఎరుంగును. వారు నశించినారని ధృతరాష్ట్రుడు ఇప్పుడు వినినాడు. అనగా తన కుమారుడు కూడ నశించినట్లేనని ధృతరాష్ట్రుడు యెరుంగును. వీరు నలుగురు లేనిచో, భీముడు దుర్యోధనుని సంహరించి తన ప్రతిజ్ఞను నెరవేర్చు కొనగల్గును. శ్రీకృష్ణభగవానుని ఈ మాటలను వినిన తరువాతనైననూ, దుర్యోధనుని విజయముపై ఆశను విడనాడి ధృతరాష్ట్రుడు సంధియత్నములను చేయునని సంజయుడు ఆశపడెను. ధృతరాష్ట్రుడు ఆదేశించినచో, దుర్యోధనుడు సంధికి అంగీకరించక తప్పదు. అతడు ధృతరాష్ట్రుని మాటను జవదాటినచో భీష్మద్రోణాదులు అతని పక్షమున యుద్ధము చేయబోరు. వారు అట్టి సదవకాశము కొరకు ఎదురు చూచుచుండిరి. కావున, తండ్రి మాటను దుర్యోధనుడు నిరాకరింప జాలడు. కాని, ధృతరాష్ట్రుడు భగవానుని వచనములను వినలేదు. ఇంత స్పష్టమైన సందేశము నాతడు పెడచెవిని పెట్టుటకు కారణమేమి? విధి నిర్ణయము బలీయమైనది (భవితవ్యవశాత్). విధి నిర్ణయమట్లున్నది. మరియు, యుద్ధము ఆగిపోయినచో, దుర్యోధనుడు చేసిన పాపములకు శిక్షపడకుండా తప్పించుకొనగల్గును. ధృతరాష్ట్రుని వివేకశక్తి అతనికి పుత్రులపై గల వెర్రిప్రేమచే కలుషీకృతమయ్యెను. దుర్యోధనుని వినాశము విధిలిఖితము. కావుననే ధృతరాష్ట్రుడు యుద్ధమును నిలుపు జేయలేకపోయినాడు.

**అధ్యాయము 11, శ్లోకము 36:**

अर्जुन उवाच।
स्थाने हृषीकेश तव प्रकीर्त्या जगत्प्रहृष्यत्यनुरज्यते च।
रक्षांसि भीतानि दिशो द्रवंति सर्वे नमस्यन्ति च सिद्धसंघाः ॥ ३६ ॥

అర్జున ఉవాచ
స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్ర హృష్యత్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః (36)

**స్థానే** = ఇది యుక్తముగా నున్నది; **హృషీకేశ** = ఓ శ్రీకృష్ణా!; **తవ** = నీ; **ప్రకీర్త్యా** = గుణ గానముచే; **జగత్** = జగత్తు; **ప్రహృష్యతి** = గొప్ప ఆనందమును పొందుచున్నది; **చ** = మరియు; **అనురజ్యతే** = (నీయందు) అనురాగమును కలిగియున్నది; **రక్షాంసి** = రాక్షసులు; **భీతాని** = భయపడినవారై; **దిశః** = అన్ని దిక్కులను (యందు); **ద్రవంతి** = పరుగులెత్తుచున్నారు; **చ** = మరియు; **సర్వే** = సమస్తమైన; **సిద్ధసంఘాః** = సిద్ధుల సమూహములు; **నమస్యంతి** = (నిన్ను) నమస్కరించుచున్నారు.

> ఓ శ్రీకృష్ణా! ఇది యుక్తముగా నున్నది. నీ గుణగానముచే జగత్తు గొప్ప ఆనందమును పొందుచున్నది; మరియు, నీయందు అనురాగమును కలిగియున్నది. రాక్షసులు భయపడి అన్ని దిక్కులయందు పరుగు లెత్తుచున్నారు. మరియు సిద్ధుల సమూహము లన్నియు నీకు నమస్కరించు చున్నవి (36).

ఈ భాగమును సాధారణంగా ప్రార్థనా శ్లోకముల రూపంలో పఠిస్తారు. అర్జునుడిచట శ్రీకృష్ణుని 'హృషీకేశ' అని సంబోధించినాడు. హృషీకాణాం ఇంద్రియాణాం ఈశః అను వ్యుత్పత్తిని మనమిదివరలో చూచియున్నాము. అనగా ఇంద్రియములకు ప్రభువు అనగా పరమాత్మ అని ఆ పదమునకు అర్థము. స్థానే అను అవ్యయమునకు 'యోగ్యముగా నున్నది' అని యర్థము. ఏది యోగ్యముగానున్నది? నీ మహిమను శ్లాఘించుటచే (తవ ప్రకీర్త్యా) జగత్తు ఆనందించుచున్నది (జగత్ ప్రహృష్యతి). భగవానుని మహిమను గానము చేయుటలో, మరియు వినుటలో ఈ జగత్తులోని జనులకు మహానందము కలుగునని శ్రీ శంకరులు వివరించిరి. కాన భగవానుని

కీర్తించుట చాల యోగ్యముగా నుండును (స్థానే). భగవానుని వర్ణనలో అతిశయోక్తి సంభవము గాదని అర్జునునకు ఇప్పుడు అర్థమయ్యెను. అందుచేతనే అతడు ఇట్లు చెప్పగలిగినాడు. కీర్తింపబడే వస్తువు అల్పజ్ఞానము, అల్పశక్తి, అల్ప గుణములు గలదైనచో, కీర్తించుటలో అతిశయోక్తికి అవకాశముండును. ఒక వ్యక్తిని ఉద్దేశించి 'నీవు దయాసముద్రుడవు' అన్నచో, వేచి చూడవలెను. అతనికి దయ కలుగని సందర్భములు ఉండును. అతడు దయామయుడు కావచ్చును. కాని దయా సముద్రుడనుట అతిశయోక్తి యగును. ఒక వ్యక్తిని ఉద్దేశించి చేసే పొగడ్తలో అతిశయోక్తి కొంత శాతము ఉండి తీరును. కాని అనంతగుణోపేతుని గురించి చేసే వర్ణన ఎంత పెద్దదియైననూ అతిశయోక్తి కాజాలదు. పైగా మనము భగవానుని ఎంత వర్ణించినా, అది అపర్యాప్తమే (inadequate) యగును. మన అల్పజ్ఞానముతో భగవానుని సర్వజ్ఞత్వము మనకెట్లు తెలియును? మనకు భగవానుని సర్వజ్ఞత్వము యథార్థముగా తెలిసినచో, అప్పుడు మాత్రమే మనము భగవానుని మహిమను యథాతథముగా వర్ణించగల్గుదుము. మన స్తోత్రముల కంటె భగవానుడు సర్వదా అధికుడుగనే యుండును. కావున మనము ఎంత స్తుతించిననూ, దానియందు అతిశయోక్తి దోషమునకు అవకాశము ఉండబోదు. మరియు ఇట్లు భగవానుని స్తుతించుటలో ఆనందము అవిష్కృతమగును. భగవంతుని స్వరూపము ఆనందము గనుక, ఆనందము లభించుట యుక్తియుక్తమే గదా! ''ఓ భగవాన్! నీ మహిమను దర్శించువానికి ఆనందము లభించి తీరును''. భగవంతుని విభూతులను దర్శించువారికి ఆనందము కరతలామలకము అగును.

'ఇంతమాత్రమే గాదు. వారు నిన్ను ప్రేమించెదరు కూడా (అనురజ్యతే చ). నీవు ప్రేమకు అర్హుడవు గనుక, ఇదియూ యుక్తి యుక్తముగనే యున్నది'. సమగ్రముగా స్తుతింప శక్యము కానివాడు, సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడునగు భగవంతుడు సర్వమానవులకు మిక్కిలి తేలికగా లభించుచున్నాడు. దీనికొరకై మధ్యవర్తులతో పనిలేదు. కావున భగవానుని మానవులు ప్రేమించుట అతి సహజము, యుక్తి సంగతము గదా!

భగవానుడు ప్రేమానురాగములకు ఆస్పదమైనవాడు. ఇది యోగ్యముగా నున్నది (స్థానే). దీనికి విరుద్ధముగా, ధర్మమును ఆచరించనివారు ఆయన వలన భయపడెదరు. అదియూ యోగ్యముగనే యున్నది (స్థానే). ''ధర్మనియతికి విరుద్ధముగా ప్రవర్తిల్లు రాక్షసులు (రక్షాంసి) నీవలన భయపడి (భీతాని) నలుదిక్కులకు పారిపోవుచున్నారు (దిశో ద్రవంతి)''. భయ, అభయములు రెండింటికీ కారణము భగవానుడే గనుక, ఇదియూ యుక్తి సంగతముగనే యున్నది. మనకు తోడుగా భగవానుడున్నచో, భయము ఉండదు. భగవంతుని జ్ఞానములో ద్వితీయ వస్తువు

లేదు గనుక, భయము సమూలముగా నిర్మూలింపబడును. నీవే పరమాత్మవు. భక్తుని స్థాయిలోనైననూ భయములేదు. ఏలయన, భక్తునకు తోడునీడగా భగవంతుడుండును. కాని, ధర్మమును ఉల్లంఘించువారలకు భగవంతుడు కర్మ నియతిని అనుసరించి దండమును విధించును. నిప్పును తాకినచో, చేయి కాలును. నియతి అనగా నిదియే. నిప్పు అన్నమును వండుకొనుటకు, చలి కాచుకొనుటకు ఉపకరించును. కాని తాకినచో కాల్చును. ఏలయన, నిప్పు కాల్చకుండ నుండ జాలదు. కావున దాని ధర్మమును మనము యెరింగి తదను రూపముగా దానితో వ్యవహరించవలెను. కావున భగవంతుని ధర్మాను శాసనమును ఉల్లంఘించువారు నలుదిక్కులయందు చెల్లాచెదరై నశించెదరు.

సిద్ధులుగా ప్రసిద్ధి గాంచిన కపిలాదులు నీకు నమస్కరించుచున్నారు (సర్వే సిద్ధ సంఘాః నమస్యంతి). వారు భగవానునకు ప్రణమిల్లుట యుక్తియుక్తముగా నున్నది (స్థానే). మహాత్ములగు ఈ సిద్ధులు భగవానుని విభూతులను, ఈ సృష్టిలోని నియతిని ఎరింగినవారై, భగవానునకు ప్రణమిల్లుచున్నారు (నమస్యంతి). వారు భగవానుని ధర్మనియతికి ప్రతిరోధమును కలిగించరు.

ఈ మహాత్ములందరు భగవానుని ప్రణమిల్లుటకు కారణమేమి? అర్జునుడు ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 37:**

कस्माच्च ते न नमेरन् महात्मन् गरीयसे ब्रह्मणोऽप्यादिकर्त्रे ।
अनन्त देवेश जगन्निवास त्वमक्षरं सदसत्तत्परं यत् ॥ ३७ ॥

కస్మాచ్చ తే న నమేరన్ మహాత్మన్ గరీయసే బ్రహ్మణోప్యాది కర్త్రే
అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్ (37)

**మహాత్మన్** = ఓ మహాత్మా!; **గరీయసే** = (ఇతర దేవతలకంటె) శ్రేష్ఠుడైనట్టియు; **బ్రహ్మణః అపి** = బ్రహ్మగారికి కూడా; **ఆదికర్త్రే** = సృష్ట్యాదియందు సృజించిన నీ కొరకు; **తే** = వారు; **కస్మాత్** = ఏల; **న నమేరన్** = నమస్కరించరు?; **చ** = మరియు; **అనంత** = అంతము లేని వాడా!; **దేవేశ** = దేవ దేవా!; **జగన్నివాస** = జగత్తునకు ఆధారమైన వాడా!; **త్వమ్** = నీవు; **అక్షరమ్** = వినాశములేని; **తత్** = ఆ, **పరమ్** = పరమాత్మవు; **యత్** = ఏది; **సత్** = కారణము; **అసత్** = కార్యము.

ఓ మహాత్మా! ఇతర దేవతల కంటె శ్రేష్ఠుడవైనట్టియు, సృష్ట్యాదియందు బ్రహ్మగారిని కూడ సృజించిన నీ కొరకు వారేల నమస్కరించకుందురు? అంతము లేనివాడా! దేవదేవా! జగత్తునకు ఆధారమైన వాడా! వినాశము లేనిది, కారణ కార్యములు రెండు తానే అయి ఉన్నది అగు పరమాత్మ తత్త్వము నీవే (37).

సృష్టికర్తయగు బ్రహ్మకంటె శ్రీకృష్ణుడు గొప్పవాడని అర్జునుడు గుర్తించెను. కావున సిద్ధులు కూడా ఆయనకు నమస్కరించుటను గాంచిన అర్జునునకు ఆశ్చర్యము కలుగలేదు. అందువలననే, అతడీ ప్రశ్నను అడుగుచున్నాడు: 'బ్రహ్మగారి కంటె గొప్ప వాడవు, బ్రహ్మగారిని కూడ సృష్టించిన ఆదికర్తవు అగు నీకు వీరు ఏల నమస్కరించకుందురు?' బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు దేవతలను కూడ సృష్టించి రక్షించువాడు భగవానుడే. కావున ఆయన మహిమను ఎరింగిన వారందరు ఆయనను శరణు జొచ్చుట యుక్తమే (స్థానే). మరో మాటలో చెప్పాలంటే, శరణాగతి చేయదగిన చరమవేది (ultimate altar) భగవానుడు మాత్రమే. మానవుడు తాను సాధించిన విజయముల నన్నిటినీ భగవానుని విభూతులుగా దర్శించవలెను. అట్లు దర్శించు మానవుడు తన జీవితములో వాస్తవిక దృష్టి మరియు వైరాగ్యము కలవాడగును. అట్టి వానికి కూడ అహంకారము ఉండును. కాని అది చాల పలుచబడి యుండును. అట్టి అహంకారము వ్యక్తికి, జగత్తునకు మధ్యగల సమరసతకు భంగ కారి కాబోదు. జగత్తు సర్వము భగవానుని విభూతియే గదా! ఇట్టి శరణాగతికే యోగమని పేరు. '' సర్వ భూతములలో నేను సమముగా నున్నాను (సమోఽహం సర్వభూతేషు)'' ఇత్యాది వాక్యములచే ప్రదర్శించబడే జీవేశ్వరుల ఐక్యము సాక్షాత్కరించినవాడు, అట్టి జ్ఞానోదయములో అహంకారము యొక్క చరమ శరణాగతి సంపన్నమగును. ఇట్టి సాక్షాత్కారములో జ్ఞానమునకు, శరణాగతికి అభేదము నెలకొనును. ఇందువలననే 'నాల్గవరకము భక్తుడైన జ్ఞాని నా కంటె వేరుగాదు (జ్ఞానీ తు ఆత్మా ఏవ)' అని భగవానుడు చెప్పియున్నాడు.

అర్జునుడు భగవానుని అనంత, దేవేశ, జగన్నివాస అని సంబోధించి, 'దేవతలు కూడ భగవానుని ప్రార్థించుట, మరియు రాక్షసులు శరణు లభించక నలుదిక్కులలో చెల్లా చెదరగుట అను ఘటనలు యుక్తి యుక్తముగ నున్నవి' అనే తన అవగాహనను వ్యక్తము చేయుచున్నాడు. అర్జునుడు తాను తెలుసుకున్న ఈశ్వర స్వరూపమును కూడ ప్రకటించుచున్నాడు. ''మార్పులు లేని (అక్షరమ్), అనంతమైన (పరమ్) బ్రహ్మము (తత్) నీవే. కారణము (సత్), కార్యము (అసత్) అనే రెండూ పరబ్రహ్మస్వరూపములే. అనగా, నీవు సర్వవ్యాపివి, అంతర్యామివి మాత్రమే

గాక, లోకాతీతుడవు కూడా నీవే. నీవు స్వయం సిద్ధుడవు. దేశకాల పరిచ్ఛేదము లేని అక్షర పరబ్రహ్మ స్వరూపుడవు. మిథ్యాభూతమగు ఈ జగత్తు (అసత్) కారణ స్వరూపుడవగు (సత్) నీ కంటె వేరుగా లేదు'. శ్రీకృష్ణభగవానుడే జగత్కారణమనే సత్యమును అర్జునుడు గుర్తించినాడు.

**అధ్యాయము 11, శ్లోకము 38:**

त्वमादिदेवः पुरुषः पुराणस्त्वमस्य विश्वस्य परं निधानम् ।
वेत्तासि वेद्यं च परं च धाम त्वया ततं विश्वमनंतरूप ॥ ३८ ॥

త్వమాది దేవః పురుషః పురాణస్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనంతరూప (38).

త్వమ్ = నీవు; ఆదిదేవః = దేవతలలో మొదటి వాడవు (సృష్టికి కారణమగు దేవుడవు); పురుషః = సర్వమును వ్యాపించియున్న వాడవు; పురాణః = సనాతనుడవు; త్వమ్ = నీవు; అస్య = ఈ; విశ్వస్య = జగత్తునకు; పరమ్ = అంతిమమగు; నిధానమ్ = లయస్థానము; వేత్తా = తెలియువాడవు; అసి = అగుచున్నావు; చ = మరియు; వేద్యమ్ = తెలియదగినది; చ = మరియు; పరం ధామ = చరమమగు ధామము (నివాసస్థానము); అనంతరూప = అంతములేని రూపములు గలవాడా!; త్వయా = నీచే; విశ్వమ్ = జగత్తు; తతమ్ = వ్యాప్తమై యున్నది.

> దేవతలలో మొదటి వాడవు (సృష్టికి కారణమగు దేవుడవు) అగు నీవు సర్వమును వ్యాపించియున్నావు. సనాతనుడ వగు నీవు ఈ జగత్తునకు అంతిమలయస్థానమై యున్నావు. తెలియువాడవు నీవే; తెలియబడునది నీవే. ఓ అనంతరూపా! పరంధాముడ (అంతిమ శరణ్య స్థానము)వగు నీచే ఈ జగత్తు వ్యాపించబడి యున్నది (38).

దేవతలలో ప్రథముడవు (ఆదిదేవః) నీవేనని అర్జునుడు భగవానుని స్తుతిని కొనసాగించుచున్నాడు. ఆదిదేవః అను సమాసపదమునకు ఆదిశ్చ అసౌ దేవశ్చ అను విగ్రహమునుసరించి, సృష్ట్యాదియందు ఉన్నవాడు మరియు భగవానుడు అని కూడ అర్థమును చెప్పవచ్చును. ఆయన సృష్ట్యాదియందు కారణరూపుడై (ఆది) యుండెను. ఆయన సర్వజ్ఞుడు, స్వయం ప్రకాశస్వరూపుడు గనుక దేవుడనబడును.

అయన జగత్తు అంతయూ నిండియున్నాడు గనుక పురుషుడనబడును. పురుషుడనగా పూర్వమునందు కూడ ఉన్నవాడనియు, పురాతనుడైననూ నూతనుడనియు అర్థము గలదు. భగవానుడు జగత్కారణము మాత్రమే గాదు. ఈ సృష్టింపబడిన జగత్తు సర్వము విలీనమయ్యే స్థానము కూడ భగవానుడే (నిధీయతే అస్మిన్ ఇతి నిధానమ్). భగవానుడు అనంతుడు (పరమ్). స్వప్నములో స్వప్న ప్రపంచమునకు కారణము, మరియు స్వప్న ప్రపంచము విలీనమయ్యే స్థానము కూడ స్వప్నద్రష్టయే గదా! జగత్తులోని పదార్థములన్నియూ అంతిమకాలములో విలీనమయ్యే తత్త్వమునకు 'పరం నిధానమ్' అనిపేరు. 'నిధీయతే అస్మిన్ జగత్ సర్వం మహా ప్రలయాదౌ' అని శ్రీ శంకరులు నిధాన శబ్దమును వివరించిరి. అనగా మహాప్రలయము మొదలగు సమయములలో జగత్తు సర్వము దేనియందు నిక్షేపించబడునో అట్టి చరమకారణమునకు పరం నిధానమ్ అని పేరు. అది సృష్టి అంతయూ అవ్యక్తములో విలీనమయ్యే మహాప్రలయము కావచ్చును; లేదా ముక్తి - అవస్థయూ కావచ్చును. జీవన్ముక్తి అవస్థయందు మరియు విదేహముక్తి అవస్థయందు జీవుడు విలీనమయ్యే తత్త్వము పరమాత్మయే గదా! జీవత్వము మిథ్య. కావున అది స్వకారణమందు లీనమగును.

నీవు జ్ఞాతవు (వేత్తా అసి). సాక్షి - ఆత్మ అనే దృష్టి కోణంలో సర్వమును తెలుసుకొనే అంతిమ జ్ఞాతవు నీవే. సర్వజ్ఞత్వ దృష్టికోణములో తెలియదగిన సర్వమును తెలుసుకొనే జ్ఞాతవు నీవే. తెలియదగిన సర్వము కూడా నీవే (వేద్యం చ). సృష్టిలో తెలియగలిగే వివిధ పదార్థములు అన్నియు శ్రీకృష్ణరూపములే నని అర్జునుడిచట గుర్తించుచున్నాడు. దీనిని మరియొక విధముగా వ్యాఖ్యానించవచ్చును. హే కృష్ణా! సర్వోత్కృష్ట చరమ జ్ఞేయవస్తువు నీవే.

మనము ఉల్లాసముతో చేరుకునే అభీష్టమగు స్థలమునకు ధామ అని పేరు. భగవానుడు పరంధాముడు. అనగా మనము అంతిమముగా చేరవలసిన స్థానము. ఈ జగత్తులోని స్థలము లన్నియూ మనము ఇంతకు ముందే చూచియున్న కొన్ని వస్తువుల సమ్మేళనములు మాత్రమే. కావున, మనము ఎచటకు వెళ్లిననూ ఆ స్థలము పై విసుగెత్తి దానిని విడనాడుట తథ్యము. మనము స్వర్గమును పొందినా మనుకొనుడు. దాని తరువాత ఎచటకు వెళ్లెదము? మరియొక చోటకు వెళ్లవలెననే కోరికను కలుగనీయని స్థలము ఏది గలదు? అట్టి చరమ ఆవాస స్థానము (పరం ధామ) ఏది? అట్టి స్థానమును పొందిన పిదప పునరావృత్తి ఉండబోదు. అదియే మోక్షస్థానము. జీవుడు దానియందు పూర్ణముగా విలీనమై ఈశ్వరునితో ఐక్యమగును. అది విష్ణువు యొక్క చరమ పదము (పరమం పదం వైష్ణవమ్); మోక్షము. విష్ణువు అనగా ఈ విశ్వమునంతనూ వ్యాపించి

యుండువాడు. విభిన్న మనోవృత్తులచే జగత్తు చిత్రవిచిత్రమగు వైవిధ్యము కలదిగా గ్రహింపబడుచున్నది గాన, జగత్తునకు విశ్వము (వివిధ ప్రత్యయ గమ్యమ్) అను పేరు వచ్చినది. జగత్తును బోధించే ఈ పదము ఎంత సుందరముగ నున్నదియో! "విశ్వము అనబడే ఈ నామరూపాత్మక ప్రపంచమును నీవు వ్యాపించియున్నావు. హే విష్ణో! నీవే ఉపాదాన కారణము గనుక, నీకంటె భిన్నముగా ఏదీ లేదు". అర్జునుడు విశ్వరూపమును చూచినాడు గాన, అతనికి ఈ విషయములో సందియమేమియూ లేదు. విశ్వమంతయు భగవానుని స్వీయ రూపమై యుండుటను అతడు ప్రత్యక్షముగా గాంచినాడు. శ్రీకృష్ణుడు విశ్వరూపములో సర్వమును వ్యాపించియున్నాడు. అనంతములైన రూపములు గలవాడా! (అనంతరూప) అని అర్జునుడు శ్రీకృష్ణుని ఇచట సంబోధించుచున్నాడు. ఇతర రూపములన్నియు భగవానుని విశ్వరూపములో అంతర్గతమగును. ఇంతేగాక,

**అధ్యాయము 11, శ్లోకము 39:**

वायुर्यमोऽग्निर्वरुणश्शशाङ्कः प्रजापतिस्त्वं प्रपितामहश्च ।
नमो नमस्तेऽस्तु सहस्र कृत्वः पुनश्च भूयोऽपि नमो नमस्ते ॥ ३९ ॥

వాయుర్యమోగ్నిర్వరుణ శ్శశాంకః ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ
నమో నమస్తేస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోపి నమో నమస్తే (39)

**వాయుః** = వాయుదేవుడు; **యమః** = యమధర్మరాజు; **వరుణః** = వరుణ దేవుడు; **శశాంకః** = చంద్రుడు; **ప్రజాపతిః** = ప్రజాపతి; **త్వమ్** = నీవే; **చ** = మరియు; **ప్రపితామహః** = తండ్రుల దండ్రుల తండ్రివి (సర్వకారణము); **నమః** = నమస్కారము; **తే** = నీ కొరకు; **సహస్ర కృత్వః** = వేయి పర్యాయములు; **నమః** = నమస్కారము; **అస్తు** = అగుగాక!; **అపి** = మరియు; **పునః చ భూయః** = మరల మరల; **తే** = నీ కొరకు; **నమః** = నమస్కారము; **నమః** = నమస్కారము.

వాయుదేవుడు, యమధర్మరాజు, వరుణదేవుడు, చంద్ర గ్రహాధి ష్ఠాన దేవత మరియు ప్రజాపతి నీవే! తండ్రుల దండ్రుల దండ్రివి (సర్వకారణము) నీవే. నీకు వేయి పర్యాయములు నమస్కారములు. నీకు మరల మరల నమస్కరించుచున్నాను (39).

ఇవి అన్నీ భగవానుని విభూతులే. వాయుదేవుడు భగవానుడే. మరియు మృత్యుదేవత (యమః) కూడా భగవానుడే. '' ఈ దేవతలందరు నీ కంటె భిన్నముగా లేరు'' అని అర్జునుడు చెప్పుచున్నాడు. అర్జునుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు. ''చంద్రునిలోని అధిష్ఠాన దేవత (శశాంకః) నీవే. సృష్టిలోని ప్రథమ జీవుడగు ప్రజాపతి నీవే. మా అందరి పితరుల పితరుల అంతిమ పితరుడవు (ప్రపితామహః) నీవే''. పరం బ్రహ్మ నుండి బ్రహ్మగారు జన్మించెను. ఆయనకు పితామహుడు అని పేరు. కాన ప్రపితామహుడు అనగా పితామహుని తండ్రి, అనగా పరం బ్రహ్మ అని యర్థము. 'నీకు పునః పునః నమస్కరించు చున్నాను (నమః నమః తే అస్తు)'. ఎన్నిసార్లు? వేయిసార్లు (సహస్ర కృత్వః).

అంత మాత్రమే గాదు. ''నీకు ఇంకా మరల మరల నమస్కరించుచున్నాను (పునః చ భూయః అపి నమః నమః తే)''. వేయిసార్లు అని చెప్పి 'మరల నీకు నమస్కరించుచున్నాను' అని చెప్పుటలో అభిప్రాయమేమి? అర్జునునకు తృప్తి కలుగలేదు. భగవానుని విశ్వరూపమును చూచిన అర్జునుని హృదయములో భక్తి శ్రద్ధలు ఉప్పొంగి యుండెను. కాన ఏదో చేయాలనే తపన అతనికి కలిగెను. కాని అతడు చేయగలిగినది నమస్కారము మాత్రమే. అంతకు మించి అతడేమి చేయగలడు? అతడు అనేక పర్యాయములు నమస్కరించినాడు. అయిననూ, అతనిలో తృప్తి కలుగుట లేదు. ఏమి చేసినా, ఎంత చేసినా, అల్పమే గదా! కృతజ్ఞతా భారముతో నిండిన మనస్సు గలవారు ఎదుటి వ్యక్తితో ''ఏమి చెప్పవలెనో తెలియకున్నది. మీకు ఎట్టి ప్రత్యుపకారమును చేయవలెనో తెలియకున్నది. మీకు ఎట్టి ప్రత్యుపకారము చేయవలెనో అర్థమగుట లేదు'' అని పలుకుట మనకు తెలిసిన విషయమే. అర్జునుని పరిస్థితి కూడ అటులనే యున్నది. ఏమి చేయవలెనో అతనికి తెలియకుండెను. మరియు భగవంతుడు కోరేది ఏమియూ లేదు. ఆయన పాదములపై పడుట తప్ప అర్జునుడు చేయగలిగినది మరియొకటి లేదు. అతడు ఆ పనిని మాత్రమే చేయుచుండెను. పునః చ భూయః అపి నమో నమస్తే ఇతి. కాని అతడు యథార్థముగా వేయిగాని, అంతకంటె అధికము గాని నమస్కారములను చేయజాలడు. అన్ని నమస్కారములను చేసే సమయము లేదు. యుద్ధము ఆరంభము కాబోవుచుండెను. కావున అతడు శారీరకముగా చేయజాలని పనిని వాచికముగా చేయుచున్నాడు.

అర్జునుడు ఎట్లు నమస్కరించవలెను? సాధారణముగా వ్యక్తికి ఎదురుగా పాదములకు వందన మాచరించవలెను. కాని ప్రస్తుతములో ముందు భాగము, వెనుక భాగము అను భేదము అర్జునునకు గానరాలేదు. సర్వము పరమేశ్వర స్వరూపమే అయి ఉన్నది.

**అధ్యాయము 11, శ్లోకము 40:**

नमः पुरस्तादथ पृष्ठतस्ते नमोऽस्तु ते सर्वत एव सर्व ।
अनन्तवीर्यामितविक्रमस्त्वं सर्वं समाप्नोषि ततोऽसि सर्वः ॥ ४० ॥

నమః పురస్తాదథ పృష్ఠతస్తే నమోస్తు తే సర్వత ఏవ సర్వ
అనంత వీర్యామిత విక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతోసి సర్వః (40)

**తే** = నీ కొరకు; **పురస్తాత్** = తూర్పు దిక్కునందు; **నమః** = నమస్కారము; **అథ** = తరువాత; **పృష్ఠతః** = పశ్చిమ దిక్కునందు; **నమః** = నమస్కారము; **సర్వ** = సర్వము తానే అయినవాడా!; **తే** = నీ కొరకు; **సర్వతః** = అన్ని దిక్కుల యందు; **ఏవ** = నిశ్చయముగా; **నమః** = నమస్కారము, **అస్తు** = అగు గాక!; **అనంతవీర్య** = ఎల్లలు లేని బలము గలవాడా!; **త్వమ్** = నీవు; **అమిత విక్రమః** = హద్దులేని పరాక్రమము గలవాడవు; **సర్వమ్** = సర్వమును; **సమాప్నోషి** = పూర్ణముగా వ్యాపించి యున్నావు; **తతః** = అందువలన; **సర్వః** = సర్వము; **అపి** = అగుచున్నావు.

నీకు తూర్పు, పశ్చిమ దిక్కుల యందు నమస్కారము. సర్వము తానే అయినవాడా! అన్ని దిక్కులయందు నిశ్చయముగా నీకు నమస్కారమగు గాక! ఎల్లలు లేని బలము గలవాడా! నీవు హద్దులేని పరాక్రమము గల వాడవు. సర్వమును పూర్ణముగా వ్యాపించియున్నావు. కావుననే, సర్వము నీవే అయి ఉన్నావు (40).

'నీకు తూర్పు దిక్కునందు నమస్కారములు' అని అర్జునుడు చెప్పుచున్నాడు. దేవళములో సాధారణంగా భగవంతుడు తూర్పునకు అభిముఖుడై యుండును. కాని ఇచట అర్జునుడు భగవానుని తూర్పు దిక్కు నందు నమస్కరించుచున్నాడు. అంత మాత్రమే గాదు. '' పశ్చిమ దిక్కునందు నీకు నమస్కారములు (అథ పృష్ఠతః తే నమః అస్తు). మరియు అన్ని దిక్కులయందు నీకు నమస్కారమగు గాక (తే సర్వతః ఏవ సర్వ)!' ఎందువలన? ఏలయన, అర్జునునకు అన్ని దిక్కులయందు భగవానుడు కానవచ్చుచుండెను. భగవానుడు తూర్పు, పడమర, ఉత్తరము, దక్షిణము అను దిక్కులయందు మాత్రమే గాక, ఆగ్నేయ వాయవ్యాది మూలలయందు కూడ వ్యాపించి యుండెను. అందుచేతనే 'సర్వము తానే అయినవాడా! (సర్వ)' అని అర్జునుడు ఆయనను ఇచట సంబోధించుచున్నాడు.

అర్జునుడింకనూ చెప్పుచున్నాడు : ''నీవు అనంతశక్తిమంతుడవు (అనంతవీర్య). నీ పరాక్రమము అమితమైనది (అమిత విక్రమ). నీవు సర్వమును పూర్ణముగా వ్యాపించియున్నావు (సమాప్నోషి)''. ఆప్నోషి అను క్రియాపదమునకు ముందు సమ్ అను ఉపసర్గ ఉన్నది గనుక, 'దేనినీ విడువకుండగా సర్వమును వ్యాపించియున్నావు' అను అర్థము వచ్చును. ''నీవీ విశ్వములోని సర్వపదార్థములయందు వ్యాపించియున్నావు. నీ కంటె బాహ్యముగా ఏదీ లేదు. ఈ కారణంగా సర్వము నీవే (తతః అసి సర్వః)''. ఇచటి తాత్పర్యమేమనగా, 'నీవు లేని వస్తువు లేనే లేదు' అని శ్రీ శంకరులు వివరించిరి. జగత్తులోని రూపములన్నిటియందు భగవానుడు నిండియుండుటను అర్జునుడు గాంచుచున్నాడు. నామరూపములన్నియు భగవానునిచే స్థితిని కలిగియున్నవి. అంతేగాక, నామరూపములన్నియూ భగవానుడే. కావున భగవానుడు లేనిదే, వస్తువునకు ఉనికి సుతరాము లేకుండెను.

శ్రీకృష్ణార్జునులు యువకులుగా నున్నప్పుడే అనేక విహారములను, అల్లరిపనులను చేసినవారే. అప్పుడు అర్జునుడు శ్రీ కృష్ణునితో చాల చనువుగా నుండెడివాడు. నిన్నగాక మొన్న అతడు శ్రీకృష్ణుని తన రథమునకు సారథి కమ్మని అడిగినాడు. మరియు రథమును రెండు సైన్యముల మధ్యలో నిలుపుమని ఆజ్ఞాపించినాడు. ఆ విషయములన్నియు గుర్తుకు వచ్చి అతడు కొంత పశ్చాత్తాపమును పొందుచుండెను. శ్రీకృష్ణుడు అసాధారణ వ్యక్తియని అతడు ఎరుంగును. ఇంతే గాక, శ్రీకృష్ణుడు అవతారపురుషుడని అర్జునుడు వినియుండెను. కాని అవతారమనగా వాస్తవమగు అర్థమేమియో అతనికి తెలియకుండెను. శ్రీకృష్ణుని పరమేశ్వరుడేయని అతడు ఊహించలేకపోయెను. అందుచేతనే, ఆయనతో తాను వ్యవహరించిన తీరునకు అతడిపుడు పశ్చాత్తాపపడుచుండెను. ఈ కారణము చేతనే, అతడు క్షమించుమని కోరుచుండెను.

'నీ మహిమ నాకు తెలియకుండుటచే నేను చేయరాని అనేక అపరాధములను చేసితిని. కావున, నన్ను క్షమించుమని కోరుతున్నాను' అని అర్జునుడు ప్రార్థించుచున్నాడని శ్రీశంకరులు వివరించిరి. ఈ విషయము తరువాతి శ్లోకములో వచ్చుచున్నది :

**అధ్యాయము 11, శ్లోకము 41:**

सखेऽति मत्वा प्रसभं यदुक्तं हे कृष्ण हे यादव हे सखेति ।
अजानता महिमानं तवेदं मया प्रमादात्प्रणयेन वापि ॥ ४१॥

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి
అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి (41)

సఖా = మిత్రుడు; ఇతి = అని; మత్వా = తలంచి; తవ = నీ; ఇదమ్ = ఈ; మహిమానమ్ = మహిమను; అజానతా = ఎరుంగని; మయా = నాచేత; ప్రమాదాత్ = అజాగ్రత్త వలన గాని; అపి = మరియు; ప్రణయేన వా = అనురాగముతో గాని, ప్రసభమ్ = దురుసుగా; హే కృష్ణ = ఓ కృష్ణా!; హే యాదవ = యదువంశములో పుట్టినవాడా!; హే సఖా = ఓ మిత్రమా!; ఇతి = అని; యత్ = ఏ వచనము; ఉక్తమ్ = పలుకబడినదో.

> నీవు మిత్రుడవని తలపోసి నీ ఈ మహిమను ఎరుంగని నేను అజాగ్రత్త వలన గాని, అనురాగముతో గాని దురుసుగా ' కృష్ణా! యదువంశములో పుట్టినవాడా! ఓ మిత్రమా!' అని పలికి యుంటిని (41).

''నీవు సామాన్యమగు మిత్రుడవని తలంచిన నేను (సఖా ఇతి మత్వా) నిన్ను 'కృష్ణా! యాదవా!' అని సంబోధించెడివాడను'. అర్జునుడు ఎన్నోసార్లు యథాలాపంగా భుజముపై చేయివేసి కృష్ణా! అని సంబోధించెడివాడు. నీవు ఒక సందర్భమును ఊహించుము. నీ అనుంగు మిత్రుడొకడు హఠాత్తుగా విశ్వరూపునిగా దర్శనమిచ్చినాడనుకో. నీ ఆలోచనలు ఎట్లుండును? తాను కృష్ణునితో దురుసుగా (ప్రసభమ్) మాట్లాడినానని అర్జునుడు భావింపదొచ్చెను. అట్లు మాటలాడుటకు కారణము శ్రీకృష్ణుని యథార్థ స్వరూపమును గుర్తించకపోవుటయే (విపరీతబుద్ధ్యా) అని శ్రీశంకరులు వివరించిరి. అర్జునుడు భగవానుని యథార్థ స్వరూపమును గుర్తించక పోవుటచే 'పశువులను పాలించువాడా! (యాదవ)' అనియు, మరియు సరళముగా 'కృష్ణా!' అనియు, లేదా 'మిత్రమా! (సఖా)' అనియు సంబోధించెడి వాడు. 'నీ ఈ మహిమను (తవ ఇదం మహిమానమ్) ఎరుంగని నాచే (మయా అజానతా) అట్లు చేయబడినది'. నపుంసక లింగ శబ్దమగు 'ఇదమ్' మహిమానమ్ అను పుంలింగ శబ్దమునకు విశేషణముగా ప్రయోగింపబడినది. అందువలననే, శ్రీ శంకరులు భాష్యములో 'తవ ఇమం మహిమానమ్' అని వ్రాసిరి. భగవానుని మహిమను ఎరుంగని అర్జునుడు అసావధానత వలన, మరియు మైత్రి వలన (ప్రణయేన వా అపి) అట్లు సంబోధించుట సహజమే. స్నేహము వలన లభించే చనువుతో అర్జునుడు శ్రీకృష్ణుని తరచుగా హే కృష్ణ, హే యాదవ, హే సఖా ఇత్యాదిగా సంబోధించెడివాడు. అట్లు సంబోధించి నందులకు క్షమించుమని అర్జునుడు తరువాతి శ్లోకములో కోరుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 42:**

यच्चावहासार्थमसत्कृतोऽसि विहारशय्यासन भोजनेषु ।
एकोऽथ वाप्यच्युत तत्समक्षं तत् क्षामये त्वामहमप्रमेयम् ॥ ४२ ॥

యచ్చావహాసార్థ మసత్కృతోసి విహారశయ్యాసన భోజనేషు
ఏకోథ వాప్యచ్యుత తత్సమక్షం తత్ క్షామయే త్వామహమప్రమేయమ్ (42)

**చ** = మరియు; **విహారశయ్యాసన భోజనేషు** = నడుచునప్పుడు, పరుండినప్పుడు కూర్చునప్పుడు మరియు భుజించుచున్నప్పుడు; **ఏకః** = ఒంటరిగా నున్నప్పుడు; **అథవా** = లేదా; **తత్సమక్షమ్ అపి** = నలుగురిలో ఉన్నప్పుడు కూడా; **అవహాసార్థమ్** = పరిహాసము కొరకై; **యత్** = ఏ విధముగా; **అసత్కృతః** = అమర్యాద చేయబడినవాడవు; **అసి** = అగుదువో; **అచ్యుత** = ఓ శ్రీకృష్ణా!; **అహమ్** = నేను; **అప్రమేయమ్** = ప్రమాణ గోచరము కాని; **త్వామ్** = నిన్ను; **తత్** = దానికి అంతకు; **క్షామయే** = క్షమించుమని కోరుచున్నాను.

> మరియు నడుచుచున్నప్పుడు, పరుండినప్పుడు, కూర్చున్నప్పుడు, భుజించుచున్నప్పుడు, నీవు ఏకాంతముగా నున్నప్పుడు, లేదా నలుగురిలో నైననూ నేను నిన్ను పరిహాసము కొరకై అమర్యాదకు గురి చేసితిని. ఓ శ్రీకృష్ణా! ప్రమాణ గోచరము కాని నిన్ను దానికి అంతకు క్షమించుమని కోరుచున్నాను (42).

అవహాస మనగా ఇతరులను వేళాకోళము చేయుట. అర్జునుడు అనేక పర్యాయములు శ్రీకృష్ణుని పరిహాస భాజనుని చేసి విసిగించినాడు. ఆ అపరాధమును గుర్తించిన అర్జునుడు "నీయందు తప్పుగా ప్రవర్తించితిని (అసత్కృతః అసి)" అని పలుకుచున్నాడు. సత్కృతః అనగా ఆదరింపబడినవాడు. కావున అసత్కృతః అనగా అమర్యాద చేయబడినవాడు. అట్లు ఎప్పుడు జరిగెను? అన్నిరకముల పరిస్థితులలో, అనగా నడిచేటప్పుడు, పరుండినపుడు, కూర్చుండినపుడు మరియు భుజించునపుడు (విహారశయ్యాసన భోజనేషు). అనేక ప్రదేశములకు యాత్రను చేసిన సందర్భములలోని సంభాషణలలో, మరియు వ్యాయామము చేయుచున్నప్పుడు తాను శ్రీకృష్ణుని విషయములో అమర్యాదగా ప్రవర్తించితినని అర్జునుడు గుర్తించెను. విశ్రాంతి తీసుకునే సమయములో గాని, లేదా వారిద్దరు కలిసి అరణ్యములో తిరుగాడినప్పుడు గాని, సంభాషణలలో

అతడు శ్రీకృష్ణుని అపహాస్యము చేసియుండును. ఇటువంటి అనేక సందర్భములలో తాను భగవానుని అవమానించితినని అర్జునుడు దుఃఖింపదొడ్చెను. మరియు తాను శ్రీకృష్ణుని ఏకాంతములో (ఏకః) మాత్రమే గాక, నల్గురి ముందు (సమక్షమ్) కూడ అవమానము చేసి యుందునని అతడు భావించెను.

ఈ అపరాధముల నన్నిటినీ మన్నించుము (అహం క్షామయే త్వామ్) అని అర్జునుడు పలుకుచున్నాడు. అర్జునుడు 'త్వామ్' అను పదమునకు 'అప్రమేయమ్' అను విశేషణమును ప్రయోగించినాడు. దీని అభిప్రాయమేమనగా – ''నీవు ప్రమాణములకు వేటికీ అందవు గాన, నన్ను తప్పు పట్టుట సరిగాదు. నీవు ప్రత్యక్షానుమానాది ప్రమాణ గోచరుడవు కావు. కాన నేను క్షమించుమని నిన్ను కోరుచున్నాను. నిన్ను తెలియు ఉపాయము నావద్ద లేకుండెను. అందువలననే, అజ్ఞానముచే నేను నీయందు అపరాధమొనర్చితిని. ఇప్పుడు నాకు తెలిసినది''.

**అధ్యాయము 11, శ్లోకము 43:**

पितासि लोकस्य चराचरस्य त्वमस्य पूज्यश्च गुरुर्गरीयान् ।
न त्वत्समोऽस्त्यभ्यधिकः कुतोऽन्यो लोकत्रयेऽप्यप्रतिम प्रभाव ॥ ४३ ॥

పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్
న త్వత్సమోస్త్యభ్యధికః కుతోన్యో లోకత్రయేప్యప్రతిమ ప్రభావ (43).

**త్వమ్** = నీవు; **అస్య** = ఈ; **చరాచరస్య** = స్థావర జంగమాత్మకమగు; **లోకస్య** = జగత్తునకు; **పితా** = తండ్రివి; **అసి** = అగుచున్నావు; **పూజ్యః** = పూజింపదగినవాడవు; **చ** = మరియు; **గరీయాన్** = మొట్ట మొదటి, **గురుః** = ఆచార్యుడవు; **అప్రతిమ ప్రభావ** = సాటిలేని మహిమ గలవాడా!; **లోకత్రయే అపి** = ముల్లోకముల యందైననూ; **త్వత్సమః** = నీతో సమానమైనవాడు; **న అస్తి** = లేడు; **అభ్యధికః** = నీకంటె గొప్పవాడు; **కుతః** = ఎట్లు ఉండును?

నీవే స్థావరజంగమాత్మకమగు జగత్తునకు తండ్రివి. నీవు పూజింపదగిన మొట్టమొదటి ఆచార్యుడవు. సాటిలేని మహిమ గలవాడా! ముల్లోకములలో నీతో సమానమైనవాడు లేడు. నీకంటె గొప్పవాడు ఎట్లుండును? (43).

భగవానుని వర్ణనను అర్జునుడింకనూ కొనసాగించుచున్నాడు. 'కదిలేవి, చేతనములు (చర) మరియు కదలనివి, జడములు (అచర) అగు పదార్థములతో గూడి యున్న ఈ లోకమునకు (అస్య లోకస్య) కారణము, తండ్రి (పితా) నీవే. జగత్పితవు గనుక నీవు సర్వోత్తముడగు పూజ్యుడవు'. వివిధ రకముల పూజలలో విభిన్న దేవతలు పూజింపబడుదురు. కాని పూజలన్నియూ పరమేశ్వరుని మాత్రమే చేరును. కావున 'పూజింపదగినవాడవు (పూజ్యః) నీవే. నీవు ఆచార్యుడవు (గురుః)'. సామాన్యుడగు గురువు కాదు. గొప్ప (గరీయాన్) గురువు. మొట్టమొదటి గురువు భగవానుడే. సర్వజ్ఞాన నిధి భగవానుడే. ఆయనయే బ్రహ్మగారికి వేదములను బోధించెను.

సర్వప్రాణులను సృష్టించునది (జనయితా ప్రాణిజాతస్య) భగవానుడే అని శ్రీ శంకరులు వివరించిరి. భగవానుడు జీవులను సృష్టించడు. కాని సమస్తములగు స్థూల సూక్ష్మ దేహములను (స్థూల సూక్ష్మ శరీరాణి), మరియు పర్వతములు మొదలగు కదలని ఇతర పదార్థములన్నిటినీ భగవానుడే సృష్టించెను. భగవాముడు ఈ సృష్టికి తండ్రి మాత్రమే గాక, సర్వప్రార్థనలకు, పూజలకు అర్హమైన వాడు (పూజ్యః) అని శ్రీశంకరులు వివరించిరి.

'నీతో సమమైనవాడు (త్వత్సమః) మరియొకడు లేడు (న అన్యః అస్తి)'. ఇద్దరు ఈశ్వరులు ఏకాలమునందైననూ ఉండే ప్రసక్తి లేదు (న హి ఈశ్వర ద్వయం సంభవతి) అని శ్రీ శంకరులు వివరించిరి. ఇద్దరు ఈశ్వరులున్నచో, వారిద్దరికీ వేర్వేరు అధికార క్షేత్రములు ఉండును. అనగా వారిద్దరిలో ఏ ఒక్కరికైననూ పూర్ణ అధీశ్వరత్వము ఉండదు. ఈశ్వరునకు పూర్ణ అధీశ్వరత్వము (ఐశ్వర్యము) ఉండవలెను గదా! అది వారిద్దరిలో లేదు గనుక, వారిలో ఏ ఒక్కరైననూ యథార్థమగు ఈశ్వరుడు కాజాలడు. కాన ఈశ్వరుడు ఒక్కడే గలడు. మరియు, అనేక ఈశ్వరులుండే పక్షంలో జగద్వ్యవహారమునకు ముప్పు వచ్చును. ఒక ఈశ్వరుని గురుత్వాకర్షణ నియమము ననుసరించి వస్తువులు పై నుండి క్రిందకు 32 అడుగులు / సెకండు/ సెకండు వేగవృద్ధితో పడవలసి యుండగా, ఆ వేగవృద్ధి 40 అడుగులు /సెకండు/సెకండు ఉండవలెనని మరియొక ఈశ్వరుడు సంకల్పించును. వ్యవహారమంతయు భగ్నమగును.

ఇచట ఒక శంక కలుగును. బ్రహ్మవిష్ణురుద్రుల మాటయేమి? వారందరు ఈశ్వరులు కారా? వారు ఈశ్వరులైనచో, ఇప్పటికే ముగ్గురు ఈశ్వరులైనారు. ఇది సరిగాదు. ఒకే ఒక ఈశ్వరుడు గలడు. వేర్వేరు కార్యముల దృష్ట్యా మనము ఒకే ఈశ్వరుని వివిధ నామములతో పిలుస్తాము. సృష్టించువాడు బ్రహ్మ, పోషించి పాలించువాడు విష్ణువు, సంహరించువాడు రుద్రుడు.

వారిని వేర్వేరుగా ప్రార్థించే పక్షంలో, వారు మహోన్నతులగు జీవులు మాత్రమే అగుదురు. తత్త్వ దృష్ట్యా అందరు ఈశ్వరుడే అయినా, ఉపాధి దృష్ట్యా బ్రహ్మ విష్ణు రుద్రులు జీవులు అగుదురు. వారిలో అజ్ఞానము లేదు గనుక, వారు పరమేశ్వరుని కంటె వేరు గాదు. వాస్తవంలో వారి ముగ్గురినీ కలిపి మనము పరమేశ్వరుడని వ్యవహరిస్తాము.

'నీతో సమమైన వ్యక్తి ఎప్పుడూ లేడు. అట్టిచో నీకంటె గొప్పవాడు ఉండుట ఎట్లు సంభవము (అభ్యధికః కుతః అన్యః)?'' అట్లు ఉండుట సంభవము కాదు. అట్టి గొప్పవాడు ఈ లోకములో లేకున్ననూ, మరియొక లోకములో ఉండవచ్చునేమో! కాదు. ముల్లోకముల యందైననూ (లోకత్రయే అపి) లేడు. ఏలయన, జగత్తు అంతయూ పరమేశ్వరుడే. పరమేశ్వరునితో సమానమగు వాడు గాని, అధికుడు గాని లేడు.

'సాటిలేని మహిమ గలవాడా (అప్రతిమ ప్రభావ)!' అని శ్రీకృష్ణుని అర్జునుడు ఇచట సంబోధించుచున్నాడు. భగవానుని శక్తితో సరిదూగే శక్తి ఎక్కడనూ లేదు. ఒక వస్తువు యొక్క స్వరూపమును తెలుపుడు చేయగలిగే మరియొక వస్తువునకు ప్రతిమయని పేరు. ఉదాహరణకు ఒక వ్యక్తి యొక్క రూపురేఖలను ఆ వ్యక్తిని బోలియున్న శిలావిగ్రహములో గాంచవచ్చును. వ్యక్తిని పోలియుండునట్లు నిర్మింపబడిన విగ్రహమును చూచి దానిలో ఆ వ్యక్తి యొక్క రూపురేఖలను గుర్తించవచ్చును. కాన ఆ విగ్రహమును ఆ వ్యక్తికి ప్రతినిధిగా స్వీకరించ వచ్చును. మనము ఈశ్వరుని బోలియుండు ప్రతిమను నిర్మించవలె ననుకొనుడు. ఎట్లు నిర్మించవలెను? జగత్తు అంతయూ ఈశ్వరుడే. ఈశ్వరుని మహిమను అనుకరించుట అసంభవము. పరమేశ్వరునకు ప్రతినిధి యనదగిన చిహ్నమును సృష్టించుటయూ అసంభవమే. మనము ఒక ప్రతిమను నిర్మించి అది ఈశ్వరునకు చిహ్నమని భావించెదము. ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదియూ లేదు గనుక, మనము పరమేశ్వరునకు యథార్థమగు ప్రతిమను నిర్మించజాలము. భగవానుని మహిమను, శక్తిని ఇతరములతో పోల్చుట అసంభవము. అర్జునుడు తనకు తెలిసినంతవరకు పరమేశ్వరుని స్తుతించుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 44 :**

तस्मात्प्रणम्य प्रणिधाय कायं प्रसादये त्वामहमीशमीड्यम् ।
पितेव पुत्रस्य सखेव सख्युः प्रियः प्रियायार्हसि देव सोढुम् ॥ ४४ ॥

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ (44)

**దేవ** = ఓ దేవా; **తస్మాత్** = అందువలన; **అహమ్** = నేను; **ఈశమ్** = ఈశ్వరుడవు; **ఈడ్యమ్** = కొనియాడదగిన వాడవునగు; **త్వామ్** = నిన్ను; **కాయమ్** = దేహమును; **ప్రణిధాయ** = సాష్టాంగముగా చేసి; **ప్రణమ్య** = ప్రణమిల్లి; **ప్రసాదయే** = అనుగ్రహమును ప్రార్థించుచున్నాను; **పితా** = తండ్రి; **పుత్రస్య ఇవ** = కుమారుని (దోషములను) వలె, **సఖా** = మిత్రుడు, **సఖ్యుః ఇవ** = మిత్రుని (దోషములను) వలె; **ప్రియః** = ప్రియుడు; **ప్రియాయాః** = ప్రియురాలి (దోషములను) వలె, **సోఢుమ్** = సహించుటకు; **అర్హసి** = తగుదువు.

> ఓ దేవా! అందువలన నేను ఈశ్వరుడవు, కొనియాడ దగిన వాడవు నగు నీకు సాష్టాంగ దండ ప్రణామము లాచరించి, అనుగ్రహమును ప్రార్థించుచున్నాను. తండ్రి పుత్రుని దోషములను, మిత్రుడు మిత్రుని దోషములను, ప్రియుడు ప్రియురాలి దోషములను మన్నించు తీరున నీవు నా దోషములను మన్నింపదగుదువు (44).

"కావున (తస్మాత్) నీకు సాష్టాంగ నమస్కారమును చేసి (కాయం ప్రణిధాయ ప్రణమ్య), నేను నీ ఆశీస్సులను కోరుచున్నాను (ప్రసాదయే)" అతడు ఎవరికి ప్రణమిల్లుచున్నాడు? "అత్యధికముగా కొనియాడదగిన (ఈడ్య) ఈశుడవగు నీకు. గొప్పగా కొనియాడదగిన ఓ దేవా! నీ పాదములపై బడి నేను నీ ఆశీస్సులను అర్థిస్తున్నాను. సర్వము నీవే గావున, నీవు నన్ను క్షమించదగును. నీవు నన్ను క్షమించి తీరవలెను" ఎట్లు? "తండ్రి తన కుమారుని తప్పులను మన్నించు తీరున (పితా ఇవ పుత్రస్య). తెలిసి గాని, తెలియక గాని చేసిన హెచ్చు తగ్గులను, తప్పులను దయతో మన్నించుము". తండ్రి తన కుమారుని తప్పులను, అపరాధములను క్షమించగల్గును. మిత్రుడు తప్పులను పట్టించుకొనకుండగా మైత్రిని కొనసాగించగలడు. భర్తకు భార్యయందు ప్రేమ ఉండుటచే ఆమెలోని లోటు పాట్లను విస్మరించగల్గును. "అదే తీరున, నీవు కూడా నా తప్పులను మన్నించదగును". అర్జునుడు ఈ మూడు దృష్టాంతముల నిచ్చుటకు కారణమేమి? అతనికి, శ్రీకృష్ణునకు గల సంబంధమును గూర్చి అతనికి గల అవగాహన ఈ దృష్టాంతములలో ప్రతిఫలించుచున్నది. శ్రీకృష్ణుడు శరీరాదుల దృష్ట్యా పుత్రుని వంటివాడే అయినా, వాస్తవంలో జగత్తును సృష్టించినవాడు ఆయనయే. ఒక ఉపాధిచే అవచ్ఛిన్నుడై యున్న జీవుడు పుత్రుని వంటి వాడు. పరమేశ్వరుడు తండ్రివంటి వాడు. ఈ భావన అర్జునునియందు గలదు.

అంతర్యామి రూపములో నుండు పరమేశ్వరుడు జీవునకు నిత్య మిత్రుని వంటివాడు. అర్జునుడీ సత్యమును గుర్తించియే 'నీవు నా మిత్రుడవు' అని శ్రీకృష్ణునితో చెప్పుచున్నాడు. జీవుని అల్లరి చిల్లరి పరిభ్రమణములన్నింటిలో భగవానుడు తోడుగా వచ్చుచుండును. బుద్ధి పరిభ్రమించే స్థలములన్నింటిలో ఆత్మ మిత్రునివలె, కాదనకుండగా తోడు వచ్చును. కావున, నీవు బుద్ధి సాక్షివి గనుక, నీవు మిత్రుని వంటివాడవు. మరియు, నీవు ఆనంద స్వరూపుడవు గనుక ప్రియుడవు. నేను ఆనంద నిధానమగు నిన్ను అన్వేషించే సాధకుడను. ఆనందమే ఆత్మ కావున, నేను ఆనందమును ప్రేమించెదను. అనగా ప్రేమకు లక్ష్యము నేనే అగుచున్నాను.

**అధ్యాయము 11, శ్లోకము 45:**

अदृष्टपूर्वं हृषितोऽस्मि दृष्ट्वा भयेन च प्रव्यथितं मनो मे ।
तदेव मे दर्शय देव रूपं प्रसीद देवेश जगन्निवास ॥ ४५ ॥

అదృష్ట పూర్వం హృషితోస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస (45).

**అదృష్టపూర్వమ్** = ఇంతకు ముందు చూడని దానిని; **దృష్ట్వా** = చూచి; **హృషితః** = హర్షమును పొందిన వాడను; **అస్మి** = అగుచున్నాను; **చ** =మరియు; **మే** = నా యొక్క; **మనః** = మనస్సు; **భయేన** = భయముతో; **ప్రవ్యథితమ్** = మిక్కిలి వ్యథను పొందియున్నది; **దేవ** = ఓ దేవా!; **మే** = నాకొరకు; **తత్** = ఆ, **రూపం ఏవ** = రూపమును మాత్రమే; **దర్శయ** = చూపించుము; **దేవేశ** = దేవదేవా!; **జగన్నివాస** = జగత్తునకు అధిష్ఠానమైనవాడా!; **ప్రసీద** = ప్రసన్నుడవు కమ్ము.

ఇంతకు మునుపెన్నడూ చూడని అద్భుతమును గాంచిన నాకు మిక్కుటమగు ఆనందము కలుగుచున్నది. మరియు, నా మనస్సు భయముతో మిక్కిలి వ్యథను పొందియున్నది. ఓ దేవా! నాకు ఆ (మామూలు) రూపమును మాత్రమే చూపించుము. ఓ దేవదేవా! జగత్తునకు అధిష్ఠానమైనవాడా! ప్రసన్నుడవు కమ్ము (45).

ఈ విశ్వరూపమును ఇంతకు ముందు ఇతరులెవ్వరూ చూచియుండలేదు. అర్జునుడు

చూచియుండక పోవుట మాత్రమే గాక, ఇతరులెవ్వరూ కూడ చూచి యుండలేదు. ''నాకు చాల ఆనందముగ నున్నది (హృషితః అస్మి)'' అని అర్జునుడు చెప్పుచున్నాడు. కాని అతని మనస్సులో చెలరేగే ఆలోచనలన్నియూ సంకీర్ణముగా నుండెను. విశ్వరూపదర్శనము అద్భుతముగా నుండెను. కాని ఆ వినాశమునంతనూ చూచిన అతనికి భయము కలిగెను. 'నా మనస్సు భయముచే పీడితమై యున్నది (భయేన చ ప్రవ్యథితం మనః మే)'. అర్జునుని మనస్స్థితి కారము, తీపి అను రెండు రుచులను కలిగియుండు గుజరాతీ ఊరగాయను బోలియుండెను. ఇతరులెవ్వరూ చూడని దృశ్యమును చూచినందులకు అతని మనస్సు హర్షముతో నిండియుండెను. 'ఇతరులందరికంటె నేను అధిక భాగ్యశాలిని' అనే భావనను అతడీ శ్లోకములో ప్రకటించుచున్నాడు. అత్యద్భుత దృశ్యమును చూడగా కలిగిన మహానందముతో బాటు, అతనిలో భాగ్యశాలిననే ఈ భావన అదనముగా కలిగినది. కాని అదే సమయములో అతనికి విపరీతమగు భయము కూడ కలిగెను. అతని మనస్సు భయాందోళనలతో అల్లకల్లోలమగుచుండెను.

అందువలననే, 'నాకు ఆ పూర్వరూపమును మాత్రమే చూపుము (తదేవ మే దర్శయ రూపమ్)' అని అతడు కోరినాడు. ఆ రూపమునందాతనికి 'ఈతడు మంచి మిత్రుడు' అను భావన మాత్రమే ఉండెను గదా! అతడీ శ్లోకములో శ్రీకృష్ణుని 'దేవేశ (దేవతలకు ప్రభువు)' అనియు, జగన్నివాస (జగత్తునకు అధిష్ఠానమైనవాడు) అనియు సంబోధించి ''నాకు దయతో పూర్వరూపమును చూపుము'' అని ప్రార్థించినాడు. కాని, ఆ పూర్వరూపమును చూచుటకు ముందుగా మరియొక రూపమునాతడు చూడగోరుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 46:**

किरीटिनं गदिनं चक्रहस्तमिच्छामि त्वां द्रष्टुमहं तथैव ।
तेनैव रूपेण चतुर्भुजेन सहस्रबाहो भव विश्वमूर्ते ॥ ४६ ॥

కిరీటినం గదినం చక్రహస్తమిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే (46)

తథా ఏవ = అదే విధముగా; కిరీటినమ్ = కిరీటము కలిగినట్టియు; గదినమ్ = గదను కలిగినట్టియు; చక్రహస్తమ్ = చక్రమును చేతబట్టిన; త్వామ్ = నిన్ను; అహమ్ = నేను; ద్రష్టుమ్ = చూచుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను; సహస్రబాహో = వేయి చేతులు

గలవాడా!; విశ్వమూర్తే = జగద్రూపములో నున్న భగవానుడా!; చతుర్భుజేన = నాల్గు భుజములు గల; తేన = ఆ, రూపేణ ఏవ = రూపముతో మాత్రమే; భవ = అగుము.

> అదే విధముగా కిరీటము, గద, చక్రములను ధరించియున్న నీ రూపమును నేను చూడగోరుచున్నాను. వేయి చేతులు గలవాడా! జగద్రూపములో నున్న భగవానుడా! నాల్గు భుజములు గల అట్టి రూపముతో మాత్రమే దర్శనము నిమ్ము (46).

జనులు విష్ణు భగవానుని పూజించే లోకప్రియమగు రూపము ఇదియే. భాగవతములో, మరియు ఇతర పురాణములలో ఈ రూపము పలుమార్లు వర్ణింపబడినది. ఈ రూపములో భగవానుడు చతుర్భుజుడు. అయనకు ఒక చేతిలో శంఖము, మరియొక చేతిలో చక్రము, మూడవచేతిలో గద ఉండును. నాల్గవ చేయి అభయముద్రలో నుండును. జనులు ఆరాధించే ఇట్టి రూపమును అర్జునుడు చూడగోరెను. మామూలు రూపమును తిరిగి పొందుటకు ముందుగా ఈ విశిష్ట రూపములో దర్శనము నిమ్మని అర్జునుడు శ్రీకృష్ణుని ప్రార్థించుచున్నాడు. ''అదే విధముగా, కిరీటమును ధరించిన (కిరీటీ), గదను చేతబట్టిన (గదీ), చక్రమును చేతిలో ధరించిన (చక్రహస్త) నీ రూపమును నేను చూడగోరుచున్నాను''. కామ క్రోధములనే శత్రువులను నశింపజేయుటకు చక్రము ఉపకరించును. భగవంతుని చేరుకొనుడు అని మానవుని ఆహ్వానించే వేదములే శంఖము. మనము భగవంతుని పొందే మార్గములో కామక్రోధములు ఆటంకములగును. కావున ఈశ్వరుని అను గ్రహముచే చక్రము కామక్రోధములను నశింపజేయును. గద అహంకారమును నశింపజేయును. పాదములను మనకు చూపించే నాల్గవ హస్తము ''నీవు నన్ను శరణు జొచ్చినచో, ఈ మహాకార్యములను పూర్ణముగా సాధించగలవు'' అని సూచించుచున్నది. భగవానుని సర్వజనులు ఈ రూపములో నారాధింతురు. అర్జునుడు ఈ రూపమును చూడగోరెను. తథైవ = అదే విధముగా. అనగా అర్జునుడు శ్రీకృష్ణుని మామూలు రూపమును మాత్రమే గాక, ఈ రూపమును గూడ చూడగోరి ప్రార్థించు చున్నాడు.

''విశ్వమూర్తే! బ్రహ్మాండ రూపములో విరాజిల్లే భగవానుడా! అనంతములగు బాహువులు గల ఓ దైవమా (సహస్రబాహో)! నాల్గు భుజములతో మాత్రమే విరాజిల్లు రూపమును స్వీకరించుము (తేనైవ రూపేణ చతుర్భుజేన)''. శ్రీకృష్ణుని రెండు రూపములు అర్జునునకు సుపరిచితములే. ఒక రూపము అతనికి మిత్రుడైన శ్రీకృష్ణుడు కాగా, రెండవ రూపము అతడు

ఆరాధించే విష్ణుభగవానుడు. అతడీ రెండు రూపములను చూడగోరెను. విశ్వరూపము
అతడిపుడు చూడగోరుట లేదు.

తరువాతి శ్లోకమునకు ఉపక్రమములో శ్రీ శంకరులిట్లు వివరించిరి: అర్జునుడు భయ
భీతుడైన సంగతిని శ్రీకృష్ణుడు గుర్తించినాడు. ఆయన తన విశ్వరూపమును ఉపసంహరించి ప్రేమ
పూర్ణములగు వచనములతో అర్జునుని ఓదార్చుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 47:**

श्रीभगवानुवाच ।
मया प्रसन्नेन तवार्जुनेदं रूपं परं दर्शितमात्मयोगात् ।
तेजोमयं विश्वमनंतमाद्यं यन्मे त्वदन्येन न दृष्टपूर्वम् ॥ ४७ ॥

శ్రీ భగవాను వాచ
మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శితమాత్మయోగాత్
తేజోమయం విశ్వమనంతమాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ (47)

**శ్రీ భగవాన్** = శ్రీ భగవంతుడు; **ఉవాచ** = పలికెను; **అర్జున** = ఓ అర్జునా!; **ప్రసన్నేన** = ప్రసన్నుడనగు; **మయా** = నాచేత; **ఆత్మయోగాత్** = స్వీయశక్తిచే; **తేజోమయమ్** = ప్రకాశముతో నిండియున్నది; **విశ్వమ్** = జగద్రూపమైనది; **అనంతమ్** = అంతములేనిది; **ఆద్యమ్** = సర్వకారణమైనది; **పరమ్** = పరిచ్ఛేదములు లేనిది; **ఇదమ్** = ఈ, **రూపమ్** = రూపము; **తవ** = నీకు; **దర్శితమ్** = చూపించబడినది; **మే** = నాయొక్క; **యత్** = ఏ రూపము; **త్వదన్యేన** = నీవు తక్క ఇతరులచే; **న దృష్టపూర్వమ్** = ఇంతకు ముందు చూడబడలేదో.

**శ్రీ భగవానుడిట్లు పలికెను –**

> ఓ అర్జునా! ప్రసన్నుడనగు నాచేత స్వీయ శక్తిచే ప్రకాశముతో నిండినది, జగద్రూపమైనది, అనంతము, సర్వకారణము, పరిచ్ఛేదరహితము అగు నా ఈ రూపము నీకు చూపబడినది. దీనిని నీవు తక్క ఇతరులెవ్వరూ ఇంతకు ముందు చూచి యుండలేదు (47).

భగవానుని మాయాశక్తిచే ఈ విశ్వరూపము అర్జునునకు చూపబడెను. గొప్పగా ప్రకాశించు (తేజోమయమ్) ఈ రూపములో సర్వము ఇమిడి యుండెను (విశ్వమ్). అంతములేని (అనంతమ్) ఈ రూపము సర్వరూపములను తనలో అంతర్గతము చేసుకున్న మౌలిక (ఆద్యమ్) రూపము. మున్ముందు విశ్వరూపము ప్రకటమయ్యెను. ఆ విశ్వరూపములో నిరంతరముగా పుడుతూ ఉండే ఇతర రూపములు ఎన్నియో గలవు. 'నీవు తక్క (త్వదన్యేన) మరియెవ్వరూ ఇంతకు ముందు ఈ రూపమును చూచి యుండలేదు (న దృష్ట పూర్వమ్)'. అర్జునుడీ రూపము నెట్లు చూడగల్గెను? 'నా అనుగ్రహముచేత (మయా ప్రసన్నేన)' అని భగవానుడు చెప్పుచున్నాడు.

'నేను నీయందు ప్రసన్నుడనైతిని. కావుననే సర్వరూపములు అంతర్గతమై ఉండే ఈ తేజోమయ రూపమును నేను నీకు నా శక్తిచే (ఆత్మయోగాత్) చూపించితిని. నీవు తక్క మరియెవ్వరూ ఈ రూపమును చూచియుండలేదు'.

విశ్వరూపమును చూచి అర్జునుడు భయపడినాడు. అందువలననే, భయమును తొలగించి అతనిని మామూలు మనిషిని చేయుట కొరకై భగవానుడు కొన్ని ఓదార్పు మాటలను పలుకుచున్నాడు. విశ్వరూప దర్శనము దుర్లభమని చెప్పి భగవానుడు ఆ దర్శనమును స్తుతించుచున్నాడు.

శ్రీ శంకరులు తరువాతి శ్లోకము యొక్క ఉపక్రమములో నిట్లు ప్రస్తావించిరి. "నా రూపమును చూడవలెననే నీ ఆకాంక్ష నెరవేరినది. నీవు కృతార్థుడవైతివి" అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 48:**

न वेदयज्ञाध्ययनैर्न दानैर्न च क्रियाभिर्न तपोभिरुग्रैः ।
एवं रूपः शक्य अहं नृलोके द्रष्टुं त्वदन्येन कुरुप्रवीर ॥ ४८ ॥

న వేదయజ్ఞాధ్యయనైర్న దానైర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః
ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర (48)

కురుప్రవీర = కురువులందరిలో వీరుడైన అర్జునా; నృలోకే = మానవలోకమునందు; త్వదన్యేన = నీవు తక్క ఇతరుని చేత; ఏవం రూపః = ఇటువంటి రూపము గల; అహమ్ =

నేను; వేదయ జ్ఞాధ్యయనైః = వేదములను యజ్ఞ విధానమును వల్లె వేయుటచే; ద్రష్టుమ్ = చూచుటకు; న శక్యః = శక్యుడను గాను; దానైః = దానములచే; న = శక్యుడను గాను; చ = మరియు; క్రియాభిః = వేదోక్త కర్మలచే; న = కాను; ఉగ్రైః = కఠినమగు; తపోభిః = తపస్సులచే; న = కాను.

> కురువంశజాలలో వీరుడవగు ఓ అర్జునా! మానవలోకమునందు నీవు తక్క ఇతరునిచేత ఇటువంటి రూపము గల నేను, వేదములను యజ్ఞ విధానమును వల్లె వేయుటచే గాని, దానములచే గాని, వేదోక్త కర్మలను అనుష్ఠించుటచే గాని, కఠినమగు తపస్సులచే గాని చూడ శక్యముగాను (48).

'ఈ రూపములో నున్న నన్ను (ఏవం రూప అహమ్) చూచుట శక్యము కాదు (న శక్యః ద్రష్టుమ్)'. అల్ప సామర్థ్యము గల జ్ఞానేంద్రియములు విశ్వరూపము నంతనూ చుట్టు పెట్ట లేవు. ఒక్కొక్క జ్ఞానేంద్రియము ఒక్కొక్క విషయవస్తువును మాత్రమే గ్రహించగల్గును. కన్నులు రంగును రూపమును, చెవులు శబ్దమును ఇత్యాదిగా మాత్రమే మనకు చూపగలవు. మరియు ఒక విశిష్ట పరిధికి లోబడి ఉండే జ్ఞానమును మాత్రమే ఇంద్రియములు సమకూర్చగలవు. ఆ పరిధిని దాటి వెళ్లే శక్తి ఇంద్రియములకు లేదు. మరియు మనస్సునకు గల ఊహాశక్తియు ఇంద్రియ జ్ఞానముపై పూర్తిగా ఆధారపడి యుండును. ఎంత కష్టపడినా, ఈ ఊహాశక్తి విశ్వరూపమును అందుకొనలేదు. అందువలననే, అర్జునుడు విశ్వరూపమును గాంచి భయభీతుడైనాడు. విశ్వరూపము అత్యద్భుతముగా నుండి, గగుర్పాటును కల్గించిన మాట వాస్తవమే. కాని, అదే సమయములో ఆ రూపమునందు కానవచ్చిన సంహారకాండ తీవ్రమగు భయమును కలిగించెను.

నేను వేదాధ్యయనమును చేసి తి ననుకొనుడు. నేను విశ్వరూపమును చూడగల్గుదునా? వేదాధ్యయనముచే విశ్వరూపదర్శనము సంభవము కాదని (న వేదాధ్యయనైః) శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. కేవల వేదాధ్యయనము చాలదు. దానికి విచారము తోడు కావాలి. గురువు వద్ద నుండి వేదమంత్రములను వల్లె వేయుటను నేర్చినచో, అది వేదాధ్యయనమనబడును. నాల్గు వేదములను అధ్యయనము చేసిననూ, విశ్వరూపదర్శనము సంభవము కాదని చెప్పుటకై భగవానుడిచట అధ్యయన శబ్దమును బహువచనములో ప్రయోగించినాడు. వేదాధ్యయనములో యజ్ఞాధ్యయనము అంతర్గతమై యుండును గదా! యజ్ఞాధ్యయనమును మరల ప్రత్యేకముగా చెప్పనేల? ఒక వ్యక్తికి యజ్ఞముల గురించిన సమాచారమంతయూ తెలిసి యుండవచ్చును. కాని

యజ్ఞమును చేయు విధానము అతనికి తెలియక పోవచ్చును. దానిని తెలిపే ప్రత్యేకశాస్త్రము గలదు. దానికి మీమాంస యని పేరు. మీమాంస యనగా విచారము. యజ్ఞాధ్యయనములో విస్తారవుగు విచారవు అంతర్భాగమై యుండును. యజ్ఞమును చేసే విధివిధానవు (యజ్ఞవిజ్ఞానము)ను నిర్దేశించుటకై యజ్ఞాధ్యయనము ప్రత్యేకముగా ప్రస్తావింపబడినదని శ్రీశంకరులు వివరించిరి. ''కేవల వేదాధ్యయనము చేతగాని, యజ్ఞ విజ్ఞానము చేతగాని నా ఈ రూపమును దర్శించుట సంభవము కాదు''. భగవానుడు లక్ష్యముగా గల సాధకుడు ఆచరించదగినవి యజ్ఞయాగాదులే గదా! భగవత్ప్రాప్తిని కలిగించే సామర్థ్యము యజ్ఞయాగాది కర్మలకు గలదు. అందువలననే భగవానుడు వాటిని ఇచట ప్రస్తావించుచున్నాడు. కాని ఈ రూపమును చూచుటకు ఆ పుణ్యము చాలదు. అదియే ఇచటి ప్రముఖ విషయము. ఈ దర్శనము దానములచేతనైననూ సిద్ధించేది కాదు. దానము చాలా గొప్ప కర్మ. దానము మహాపుణ్యమని శాస్త్రము చెప్పుచున్నది. అయిననూ, ఈ దర్శనమునకు ఆ పుణ్యము చాలదు.

వ్యక్తి తన ఎత్తు బంగారమును దానము చేసిననూ (తులా పురుషదానము), ఆ పుణ్యము చాలదని శ్రీశంకరులు వివరించిరి. తులా పురుష దానము మహాదానమే అయినా, ఈ రూపమును చూచుటకు ఆ పుణ్యము చాలదు. పూజాదులు కూడా ఈ దర్శనమునకు చాలవు (న చ క్రియాభిః). వేదములలో వర్ణింపబడిన అగ్నిహోత్రాది కర్మలన్నియూ కలిసియైననూ ఈ విశ్వరూపదర్శనము నీయజాలవు. అతి కఠోరమగు తపస్సు కూడా దీనిని ఈయజాలదు (న అపి తపోభిః ఉగ్రైః). చాంద్రాయణము మొదలగు అతి కఠిన వ్రతములైననూ చాలవని శ్రీశంకరులు చెప్పిరి. ఒక విశిష్ట పద్ధతిలో ఉపవాసమును చేస్తూ జపమును చేసే వ్రతమునకు చాంద్రాయణమని పేరు. పూర్ణిమనాడు మామూలు పరిమాణంలో భోజనమును చేసి ఈ వ్రతమును ఆరంభించవలెను. మరునాడు ఆ పరిమాణములో 1/15వంతును, ఆ మరునాడు ఇంకో 1/15 వంతును, ఈ విధంగా క్రమంగా తగ్గించి భుజించవలెను. 15వ రోజు, అనగా పాడ్యమినాడు భోజనము ఉండదు. ఆ మరునాడు మామూలు పరిమాణంలో 1/15 వంతు మాత్రమే భుజించవలెను. మరునాడు ఇంకో 1/15 వంతు పెంచవలెను. ఇట్లు క్రమంగా పెంచుకుంటూ పోవాలి. పదునైదవరోజు మామూలు భోజనమును చేయవలెను. ఈ విధంగా చంద్రుని వృద్ధి క్షయములకు అనురూపముగా భోజనములో కూడ వృద్ధి క్షయములు ఉండును. ఇది చాల కఠినమగు వ్రతము గనుక శ్రీ శంకరులు దీనిని ప్రత్యేకముగా ప్రస్తావించినారు. కాని, ఇంతటి కఠోరతపస్సును చేసినా, విశ్వరూప దర్శనము లభించదు. ఇట్టి మహోన్నత కార్యముల నాచరించిన వారెవ్వరికీ విశ్వరూప దర్శనము లభించలేదు. ''ఓ అర్జునా! నీవు తప్ప''. అర్జునకు చాల తేలికగా అడిగినదే తడవుగా లభించినది.

ఇచటి ప్రముఖవిషయమదియే. కురువంశములో అత్యధిక ధైర్యసాహసములు గలవాడా! (కురు ప్రవీర) అని శ్రీకృష్ణుడాతనిని సంబోధించుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 49:**

मा ते व्यथा मा च विमूढभावो दृष्ट्वा रूपं घोरमीदृङ्‌ ममेदम् ।
व्यपेतभीः प्रीतमनाः पुनस्त्वं तदेव मे रूपमिदं प्रपश्य ॥ ४९ ॥

మా తే వ్యథా మా చ విమూఢ భావో దృష్ట్వా రూపం ఘోర మీదృజ్ మమేదమ్
వ్యపేత భీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూపమిదం ప్రపశ్య (49)

**మమ** = నాయొక్క; **ఇదమ్** = ఈ; **ఈదృక్** = ఇటువంటి; **ఘోరమ్** = భయంకరమగు; **రూపమ్** = రూపమును; **దృష్ట్వా** = చూచి; **తే** = నీకు; **వ్యథా** = భయము; **మా** = కలుగ కుండు గాక!; **చ** = మరియు; **విమూఢ భావః** = సమ్మోహస్థితి; **మా** = కలుగకుండు గాక!; **త్వమ్** = నీవు; **వ్యపేతభీః** = తొలగిన భయము గలవాడవై; **ప్రీతమనాః** = ఆనందముతో గూడిన మనస్సు గలవాడవై; **మే** = నాయొక్క; **తత్** = ఆ (పూర్వమునందలి); **రూపం ఏవ** = రూపమును మాత్రమే; **ఇదమ్** = ఇదిగో; **పునః** = మరల; **ప్రపశ్య** = చక్కగా చూడుము.

> నా ఇటువంటి ఈ భయంకరమగు రూపమును గాంచి నీవు భయమును, సమ్మోహస్థితిని పొందకుండెదవు గాక! నీవు భయమును వీడి, ఆనందముతో నిండిన మనస్సు గలవాడవై, నా ఈ పూర్వరూపమునే మరల చక్కగా దర్శింపుము (49).

ఒక్కొక్కప్పుడు క్రూరముగా భయంకరముగా (ఘోర) నుండే తన విశ్వరూపమును చూచి భయపడవలసిన అవశ్యకత లేదని శ్రీకృష్ణుడిపుడు అర్జునునితో చెప్పుచున్నాడు. 'నీవు భయపడకుము (మా తే వ్యథా)' అని ఆయన చెప్పుచున్నాడు. 'నేను ఉపసంహరించుచున్నాను' అని ఆయన అభిప్రాయము. కుడి ఎడమలు గాని, ఉత్తర దక్షిణములు గాని తెలియక అర్జునుడు చాల వ్యథను చెందియున్నాడు. అందువలనే 'నీవు సమ్మోహమును చెందకుండెదవు గాక! (మా చ విమూఢ భావః)' అని భగవానుడు చెప్పుచున్నాడు. అపుడాతడు శ్రీకృష్ణుని ఆశీస్సులచే భయము నుంచి విముక్తుడైనాడు. భయమునుండి విముక్తిని పొందిన వ్యక్తి ఉదాసీనుడై ఉండవచ్చును. కాని అర్జునుడట్లు కాదు.

అర్జునునకు ఇప్పుడు భయములేదు. పైగా అతడు మిక్కిలి ఆనందముగా నున్నాడు (వ్యపేతభీః ప్రీతమనాః పునః). 'నీవు ఈ రూపమునే చూచుచుండుము (తదేవ ఇదం రూపం ప్రపశ్య)'. శంఖచక్రములను ధరించియున్న రూపము అని అయన అభిప్రాయము. మామూలు రూపమునకు తోడుగా అర్జునుడీ రూపమును కూడ చూడ గోరెను గదా! ఈ రూపము అర్జునుని ఇష్ట దైవము; అనగా అర్జునుడు భగవానుని ఆరాధించుటకు ఇష్టపడే రూపము ఇదియే. అర్జునుడు ఈ రూపముపై మనస్సును నిలుపగల్గును. కావున, అతని ఆరాధనకు ఈ రూపము లక్ష్యము అగును. అందువలననే, 'ఈ రూపమును చూడుము (ప్రపశ్య)' అని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. ఇపుడు సంజయుడా పరిస్థితిని వర్ణించుచున్నాడు.

**అధ్యాయము 11, శ్లోకము 50:**

सञ्जय उवाच ।
इत्यर्जुनं वासुदेवस्तथोक्त्वा स्वकं रूपं दर्शयामास भूयः ।
आश्वासयामास च भीतमेनं भूत्वा पुनस्सौम्यवपुर्महात्मा ॥ ५० ॥

సంజయ ఉవాచ
ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా (50)

**సంజయః** = సంజయుడు; **ఉవాచ** = పలికెను; **వాసుదేవః** = శ్రీకృష్ణుడు; **అర్జునమ్** = అర్జునుని ఉద్దేశించి; **ఇతి** = ఈ విధముగా; **ఉక్త్వా** = పలికి; **తథా** = మరియు; **స్వకమ్** = తన; **రూపమ్** = రూపమును; **భూయః** = మరల; **దర్శయామాస** = చూపించెను; **చ** = మరియు; **మహాత్మా** = మహాత్ముడగు శ్రీకృష్ణుడు; **పునః** = మరల; **సౌమ్యవపుః** = ఉల్లాసమునిచ్చే రూపము గలవాడు; **భూత్వా** = అయి; **భీతమ్** = భయపడియున్న; **ఏనమ్** = ఈ అర్జునుని; **ఆశ్వాసయామాస** = ఓదార్చెను.

**సంజయుడిట్లు పలికెను –**

శ్రీకృష్ణుడు అర్జునునితో ఇట్లు పలికి తన రూపమును మరల చూపించెను. మరియు మహాత్ముడగు శ్రీకృష్ణుడు ఉల్లాసకరమగు రూపము గలవాడై భయపడియున్న అర్జునుని ఓదార్చెను (50).

అర్జునునితో నిట్లు పలికినవాడై శ్రీకృష్ణుడు (ఇతి అర్జునం వాసుదేవః తథా ఉక్త్వా) మరల తన ఈ విశిష్ట రూపమును చూపించి (స్వకం రూపం దర్శయామాస భూయః), అతనిని ఓదార్చెను (ఆశ్వాసయామాస చ). భయపడియున్న (భీతమ్) అర్జునుని శ్రీకృష్ణుడు తన మామూలు రూపమును దాల్చి శాంతపరచెను. ఆయన అర్జునునకు పరిచితమైన ఆనందదాయకమగు రూపమును దాల్చెను. ఇచట భగవానుడు మహాత్మా అని వర్ణింపబడినాడు. అనగా సర్వము ఆయనయే. సర్వప్రాణుల ఆత్మ ఆయనయే (మహాన్ చ అసౌ ఆత్మా). ఇపుడాయన మనస్సునకు మిక్కిలి ఆనందమును కలిగించే దేహమును దాల్చినాడు (సౌమ్యవపుః). ఈ రూపములో ఆయనతో వ్యవహరించుట చాల సరళము. విశ్వరూపములో అర్జునునకు ఆయన దేహము యొక్క సీమలు కానరాలేదు. ఆ రూపము బ్రహ్మాండమునంతనూ వ్యాపించి యుండెను. శ్రీకృష్ణుని ఈ సాధారణ రూపమును గాంచిన పిదప మరల అర్జునుని ఇంద్రియముల ఉద్వేగము తొలగెను. అతనికి ఉపశమము కలిగెను. అతడా విషయమును తన మాటలలో నిట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 51:**

अर्जुन उवाच ।
दृष्ट्वेदं मानुषं रूपं तव सौम्यं जनार्दन ।
इदानीमस्मि संवृत्तः सचेताः प्रकृतिं गतः ॥ ५१ ॥

అర్జున ఉవాచ ।
దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః (51)

అర్జునః = అర్జునుడు; ఉవాచ = పలికెను; జనార్దన = ఓ శ్రీకృష్ణా!; తవ = నీ యొక్క; ఇదమ్ = ఈ; సౌమ్యమ్ = ఆహ్లాదకరమగు; మానుషం రూపమ్ = మనుష్యరూపమును; దృష్ట్వా = చూచి; ఇదానీమ్ = ఇప్పుడు; సచేతాః = ఉత్సాహవంతుడను; సంవృత్తః = అయితిని; ప్రకృతిమ్ = సాధారణ మనస్స్థితిని; గతః = పొందితిని.

అర్జునుడిట్లు పలికెను –

ఓ శ్రీకృష్ణా! నీ ఈ ఆహ్లాదకరమగు మనుష్యరూపమును గాంచిన నాకు

ఉల్లాసము కలుగుచున్నది. నా మామూలు మనస్స్థితి మరల లభించినది (51).

శ్రీకృష్ణ భగవానుడు తన మామూలు రూపములోనికి తిరిగి వచ్చుట తోడనే, గీతకూడ తన మూలఛందస్సులోనికి తిరిగి వచ్చినది. గీతలో చాల భాగము అనుష్టుప్ ఛందస్సులో నున్నది. కాని అర్జునుడు విశ్వరూపమును చూచినది మొదలు ఇంతవరకు త్రిష్టుప్ ఛందస్సులో సాగినది. ఇప్పుడు మరల అనుష్టుప్ ఛందస్సులో కొనసాగుచున్నది.

ఇపుడు శ్రీకృష్ణుడు అందరకీ పరిచితమైన మానవాకృతిని దాల్చియున్నాడు. ఆహ్లాదకరమగు (సౌమ్యమ్) ఈ మానవాకృతిని గాంచిన (ఇదం మానుషం రూపం దృష్ట్వా) అర్జునుడు భగవానుని జనార్దన అని సంబోధించి, ఇట్లు పలుకుచున్నాడు. ''నేనిప్పుడు నన్ను నిలద్రొక్కుకొని యున్నాను (ఇదానీం సంవృత్తః అస్మి). నేను ఆనందముగా ఉల్లాసముగా (సచేతాః) ఉన్నాను. నా మనస్సు తన సహజస్థితికి చేరుకున్నది (ప్రకృతిం గతః)'. ఇంతకు ముందు అతడు భయముతో, మరియు దుఃఖముతో పీడితుడై యుండెను. ఇపుడు సుపరిచితమగు ఈ శ్రీకృష్ణరూపమును చూచి అతడు ప్రహృష్టుడయ్యెను. ఉల్లాసముతో నిండియున్న అర్జునుని మనస్సునకు మరింత ఉత్సాహమును కలిగించువాడై, శ్రీకృష్ణ భగవానుడు అతని సౌభాగ్యమును వర్ణించుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 52:**

श्रीभगवानुवाच ।
सुदुर्दर्शमिदं रूपं दृष्टवानसि यन्मम ।
देवा अप्यस्य रूपस्य नित्यं दर्शनकांक्षिणः ॥ ५२ ॥

శ్రీ భగవానువాచ
సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః (52)

శ్రీ భగవాన్ = శ్రీ కృష్ణభగవానుడు, ఉవాచ = పలికెను; మమ = నాయొక్క, యత్ = ఏ, ఇదమ్ = ఈ, సుదుర్దర్శమ్ = మిక్కిలి చూడ శక్యము కాని; రూపమ్ = రూపమును; దృష్టవానసి = చూచియుంటివో; అస్య = అట్టి ఈ, రూపస్య = రూపమును; దేవాః అపి = దేవతలు కూడా; నిత్యమ్ = ఎల్లవేళలా; దర్శనకాంక్షిణః = చూడగోరుచుందురు.

శ్రీ భగవానుడిట్లు పలికెను-

నీవు చూచిన నా ఈ రూపము మిక్కిలి చూడ శక్యము కానిది. దేవతలు కూడ ఈ రూపమును గాంచవలెనని ఎల్లవేళలా కోరుచుందురు (52).

అర్జునుడు ఇంతవరకు చూచియున్న విశ్వరూపము అత్యంత దుర్లభమని (సుదుర్దర్శమ్) శ్రీకృష్ణుడాతనితో చెప్పుచున్నాడు. అది చూచుటకు తేలికగా లభించేది కాదు. వాస్తవంలో ఇట్టి దర్శనము ఇంచుమించు అసంభవము. 'ఈ రూపమును నీవు చూచితివి (దృష్టవాన్ అసి త్వమ్) దేవతలు కూడ ఈ రూపమును చూడవలెనని నిత్యము తహ తహలాడు చుందురు (దేవాః అపి అస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః)'. ఇట్టి విశ్వరూప సందర్శనము కొరకై దేవతలు అనవరతము ప్రార్థించెదరు. ' అర్జునా! నీవు భాగ్యవంతుడవు. ఏలయన, ఇతరులెవ్వరూ చూడ జాలని రూపమును నీవు చూచినావు' అని శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పగోరెను. అర్జునుడు భాగ్యవంతుడని శ్రీకృష్ణుడు అనుటకు కారణమేమి?

**అధ్యాయము 11, శ్లోకము 53:**

नाहं वेदैर्न तपसा न दानेन न चेज्यया ।
शक्य एवंविधो द्रष्टुं दृष्टवानसि मां यथा ॥ ५३ ॥

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా (53).

**మామ్** = నన్ను; **యథా** = ఏరూపముగా; **దృష్టవాన్ అసి** = చూచియుంటివో; **ఏవం విధః** = అట్టి రూపములో నున్న; **అహమ్** = నేను; **వేదైః** = వేదములచే; **ద్రష్టుమ్** = చూచుటకు; **న శక్యః** = శక్యుడను గాను; **తపసా** = తపస్సుచేత; **న** = కాను; **దానేన** = దానముచేత; **న** = కాను; **చ** = మరియు; **ఇజ్యయా** = పూజానుష్ఠానముచేత; **న** = కాను.

నీవు ఏ రూపములో నన్ను చూచియుంటివో, అట్టి నా రూపమును చూచుట వేదములచే గాని, తపస్సుచే గాని, దానముచే గాని, పూజానుష్ఠానముచే గాని సంభవము కాదు (53).

ఇంతకు ముందు చెప్పిన మాటను భగవానుడీ శ్లోకములో పునరావృత్తి చేయుచున్నాడు. పునరుక్తి దోషమని సాధారణముగా భావిస్తారు. కాని బోధనలో పునరుక్తి దోషము కాదు. ఈ శ్లోకము రాబోవు రెండు అత్యంత ప్రముఖ శ్లోకములకు ఉపక్రమము.

నాల్గు వేదములను వల్లించినా (న వేదైః), కఠిన తపస్సును ఆచరించి నా (న తపసా), దానములను చేసినా (న దానేన), మరియు పూజల నను ష్ఠించినమా (ఇజ్యయా), ఈ దర్శనము దుర్లభము. పూర్వ శ్లోకములో భగవానుడు ప్రయోగించిన యజ్ఞశబ్దము వైదికమగు క్రతువులను నిర్దేశించును. ఈ శ్లోకములోని ఇజ్యా శబ్దము పూజాది స్మార్త కర్మలను నిర్దేశించును. ఇట్టి వివిధ కర్మలనన్నింటినీ ఆచరించినమా, నా ఈ రూపమును దర్శించుట దుర్లభము (అహం ఏవం విధః ద్రష్టుం న శక్యః). అర్జునుడు చూడగల్గిన విశ్వరూపమును గొప్ప ప్రయత్నమును చేసియూ ఇతరులు చూడజాలరు. ఈ శ్లోకములో పూర్వశ్లోకమునందలి విషయము పునరుక్తమైననూ, ఈ శ్లోకము ఒక ప్రశ్నను ఉద్భావితము చేయుచున్నది. యజ్ఞము, దానము, తపస్సు ఇత్యాది మహాపుణ్య కర్మలన్నింటిచే ఈ దర్శనము పొంద శక్యము గానిచో, నిన్ను దర్శించుట ఎట్లు సంభవమగును?

ఈ ప్రశ్నకు సమాధానమును భగవానుడు తరువాతి శ్లోకములో చెప్పుచున్నాడు:

**అధ్యాయము 11, శ్లోకము 54:**

भक्त्या त्वनन्यया शक्य अहमेवंविधोऽर्जुन ।
ज्ञातुं द्रष्टुं च तत्त्वेन प्रवेष्टुं च परंतप ॥ ५४ ॥

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప (54)

అర్జున = ఓ అర్జునా!; పరంతప = శత్రువులను తపింపజేయువాడా!; తు = కాని; అనన్యయా = ఇతరము నెరుంగని; భక్త్యా = భక్తిచే; ఏవం విధః = ఇట్టి రూపముగల, అహమ్ = నేను; జ్ఞాతుమ్ = తెలియుటకు; చ = మరియు; ద్రష్టుమ్ = చూచుటకు; చ = మరియు; తత్త్వేన = వాస్తవముగా; ప్రవేష్టుమ్ = ప్రవేశింముటకు; శక్యః = శక్యుడను.

శత్రువులను తపింపజేయు అర్జునా! కాని ఇతరము నెరుంగని భక్తిచే ఇట్టి

రూపము గల నేను తెలియుటకు, చూచుటకు మరియు వాస్తవముగా ప్రవేశించుటకు శక్యుడను (54).

ఇది పూర్ణముగా శాస్త్రమునకు అనురూపమై యున్నది. దీనిలో ఇంద్రజాలము లేశమైననూ లేదు. ఇతరమునకు తావులేని భక్తిచే (అనన్యయా భక్త్యా) ఈ నా రూపములో నన్ను చూచుట సంభవమేనని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. అన్యము అనగా ఇతరము. ఇతరము లేనిది అనన్యము. ఇతరము అంతర్గతము కాని భక్తికి అనన్యభక్తి అని పేరు. దీని అర్థమేమి? రామాది ఇతరదేవతలను వీడి శ్రీకృష్ణుని యందు మాత్రమే భక్తి గలవారు ఈ ఈశ్వరరూపమును దర్శించగల్గుదురని కొందరు వ్యాఖ్యానించిరి. ఇది సరిగాదు. ఇచట తాత్పర్య మేమనగా, ఈశ్వరుడు తక్క ఇతరములేని భక్తిచే ఈశ్వర దర్శనము లభించును.

సాధారణంగా మనము ధనము, భార్యభర్త, ఉద్యోగము ఇత్యాది అనేకములకు అంకితమైన, అనేకములను ఆరాధించే జీవనమును గడుపుతాము. మనలో భగవానునిపై భక్తి కూడ కొద్దిగా గలదు. వారములోని కొన్ని రోజులలో గాని, లేక రోజులోని కొన్ని నిర్దిష్ట సమయముల యందు గాని, మనము దృష్టిని భగవానునివైపు మళ్లిస్తాము. మన ఆరాధన అనేక విషయములపై విభక్తమై యున్నది గనుక, భగవానుడు తన వంతు వచ్చు వరకు ఆగి యుండవలెను. ధనమును సంపాదించుట, లెక్కపెట్టుకొనుట పూర్తి అయిన తరువాత, సంగీతము మొదలగు అనేక విషయములపై గల అనురక్తి పరిపూర్ణమైన పిదప, భగవానుని వంతు వచ్చును. అన్నింటి తరువాతనే ఈ వంతు వచ్చును. మరియు వ్యక్తికి భగవంతునిపై గల కొద్దిపాటి భక్తి మరికొన్ని వస్తువులపైకి విస్తరించుట కూడ ఆరంభమగును. క్రమముగా మానవుని జీవితములో ధనమే దైవము అగును; భార్య దైవము అగును; పిల్లలే దైవము అగును. ఇట్లు క్రమముగా విస్తరించి, జగత్తు అంతయూ దైవము అగును. అదియే అనన్య భక్తి. దీనిలో భక్తి భగవంతుని పైకి తక్క ఇతరము పైకి ప్రసరించదు. కాని ఇది చిరకాల విచారముచేత మాత్రమే సాధ్యమగును. అట్టి భక్తుడు ఎంత లోతుగా పరిశీలిస్తే, అంత అధికముగా సర్వత్రా ఈశ్వరుడు కన్పట్టును. ఈశ్వరుని కంటె భిన్నముగా ఏదీ లేదు. భగవత్స్వరూపము యొక్క అవగాహన పెరిగే కొలదియూ, భగవంతుని యందలి భక్తి కూడ వృద్ధి చెందును. అట్టి భక్తుడు సర్వమునందు భగవానుని దర్శించు పర్యంతము భక్తి విస్తరిల్లును. ఇదియే అనన్య భక్తి. భక్తి అనన్యభక్తియైనప్పుడు, జగత్తంతయూ భగవానుడగును. విశ్వరూపమంతయు భగవానుడు తక్క మరియేమగును? అర్జునుడు విశ్వరూపదర్శనము నుండి తనను తాను మినహాయించుకొనినాడు. కాని అనన్యభక్తిలో భక్తునితో

సహా సర్వము భగవానునిలో అంతర్గతమగును. కావున యథార్థమగు విశ్వరూపదర్శనము జ్ఞానము ద్వారా మాత్రమే సంభవమగును. ఈ దర్శనములో ద్రష్ట అంతర్గతము కావలెను. అట్లు కానిచో అది అసంపూర్ణమగునే గాని, విశ్వదర్శనము కాజాలదు. తత్త్వేన (యథార్థముగా) అను పదమును జోడించి శ్రీకృష్ణుడీ విషయమును స్పష్టము జేసినాడు. 'నన్ను ఈ రూపములో యథార్థముగా దర్శించుట అనన్య భక్తిచే మాత్రమే సంభవమగును'.

నన్ను చూడవచ్చును, మరియు తెలుసుకొనవచ్చును (అహం జ్ఞాతుం ద్రష్టుం శక్యః). భగవానుడు 'ద్రష్టుమ్' అనినాడు గనుక, ఇది శాస్త్రపఠనము వలన లభించిన కేవల పరోక్ష జ్ఞానము గాదు. ఇది స్పష్టమైన అపరోక్ష జ్ఞానము. అనంతుడు, సృష్టికారణుడు అగు బ్రహ్మము గలదు అనునది పరోక్షజ్ఞానము. కాని సృష్టికారణమగు బ్రహ్మ నేనేయని ఎరింగినచో, అది అపరోక్ష జ్ఞానమగును. ఇది చాల పెద్ద ముందడుగు. దీనికే దర్శనమని పేరు. ఈ దర్శనములో ద్రష్టకూడ అంతర్గతమైనాడు గాన, ఇది యథార్థమగు (తత్త్వేన) దర్శనము. వ్యక్తి అంతర్గతమై ఉండే ఈశ్వర జ్ఞానమునకు తత్త్వజ్ఞానమని పేరు.

దీని ఫలమేమి? ఈ దర్శనము గల వ్యక్తి మోక్షమును పొందును; భగవంతునిలో చేరి ఐక్యమగును. దేహత్యాగానంతరమైననూ అతనికి, భగవానునకు భేదము ఉండదు. ప్రవేష్టుమ్ అనగా ప్రవేశించుటకు. ఈ ప్రవేశము తరంగము సముద్రములో ప్రవేశించుట వంటిది. తరంగము తరంగము కాదనియు, జలమేనని తెలుసుకొనుటయే ప్రవేశమనబడును. తరంగము సముద్రముకంటె విభిన్నమైన తత్త్వము అనే భ్రాంతి జ్ఞానము ద్వారా తొలగింపబడుటయే ప్రవేశమని వర్ణింపబడుచున్నది. దీనికే మోక్షమనిపేరు. ఇది అనన్యభక్తిచే లభ్యమగునని శ్రీకృష్ణుడిచట చెప్పుచున్నాడు.

'ఈశ్వరుని కంటె భిన్నమైన వస్తువు మరియొకటి లేదనే ఎరుకగలవాడు మాత్రమే నా ఈ మౌలిక రూపమును చూచుట సంభవమగును'. అర్జునుడు చూచినది యథార్థమగు విశ్వరూపము గాదు. తాను కూడ విశ్వరూపములో అంతర్భాగమనే ఎరుకయే వాస్తవమగు విశ్వరూప దర్శనమగును. ఈ విషయము లన్నింటి గురించి స్పష్టమగు పరిజ్ఞానము ఉండవలెను. సరియగు ఎరుకలేని భక్తులు తాము పూజాదులను తీవ్రతరము చేసి నిరంతర శ్రమకు ఉపక్రమించిననూ ప్రయోజనము ఉండబోదు. ఒకచో భక్తుడు దర్శనమును పొందిననూ, అర్జునుని వలె భయభీతుడగును. కావున అనన్య భక్తి యనగా భగవానుడు తక్క ఇతరమేదియు లేదను

ఎరుకయే. ఇట్టి భక్తి జ్ఞానము ద్వారా మాత్రమే సిద్ధించును. ఈ జ్ఞానములో జ్ఞాత కూడా అంతర్గతుడై యుండును.

ఇంతవరకు చేసిన బోధయొక్క సారమును చెప్పి, భగవానుడు తరువాతి శ్లోకములో అధ్యాయమును ఉపసంహరించు చున్నాడు. ఈశ్లోకము సమస్త గీతాశాస్త్రమునకు సారభూతమైన అర్థముతో విరాజిల్లు చున్నదనియు, గీతాశాస్త్రమునకు ప్రయోజనము మోక్షమనియు, సాధకుడు జిజ్ఞాసువుయైనచో జ్ఞానము కొరకు, కర్మయోగి యైనచో కర్మను అనుష్ఠించే సముచితమగు మానసిక ప్రవృత్తిని అలవరచుకొనుటకై ఈ శ్లోకము అలంబనమగు ననియు శ్రీశంకరులు వివరించిరి. ఈ శ్లోకము ఇంతవరకు చేయబడిన ఉపదేశమునకు మాత్రమే గాక, తరువాత చేయబోవు ఉపదేశమునకు కూడ సారభూతమై యున్నది. ఈ విషయమును నిర్ధారించుకొని, భగవానుడిట్లు చెప్పబోవుచున్నాడు :

**అధ్యాయము 11, శ్లోకము 55:**

मत्कर्मकृन्मत्परमो मद्भक्तस्संगवर्जितः ।
निर्वैरस्सर्वभूतेषु यस्स मामेति पांडव ॥ ५५ ॥

మత్కర్మకృన్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాండవ (55)

**పాండవ** = ఓ అర్జునా!; **సర్వభూతేషు** = సర్వమానవులలో; **యః** = ఎవరైతే; **మత్కర్మ కృత్** = నాకొరకు మాత్రమే కర్మల నన్నిటినీ చేయునో; **మత్పరమః** = నేను మాత్రమే సర్వోత్కృష్ట లక్ష్యముగా కలిగియుండునో; **మద్భక్తః** = నాయందు భక్తి కలిగియుండునో; **సంగవర్జితః** = ఆసక్తి లేనివాడో; **నిర్వైరః** = వైరభావము లేనివాడో; **సః** = అతడు; **మామ్** = నన్ను; **ఏతి** = పొందును.

మానవులందరిలో ఎవడైతే నా కొరకు మాత్రమే కర్మలనన్నిటినీ చేయునో,
నేను మాత్రమే చరమ లక్ష్యముగా కలిగియుండునో, భక్తుడై యుండునో,
ఓ అర్జునా! అట్టివాడు నన్ను పొందును (55).

ఈ శ్లోకములో చెప్పబడిన లక్షణములన్నియు గల సాధకుడు నన్ను పొందును (యః

మాం ఏతి) అని శ్రీకృష్ణుడు అర్జునునితో పాండుపుత్రా (పాండవ)! అని సంబోధించి చెప్పుచున్నాడు. ఆ సాధకుడెట్టివాడు?

మత్కర్మకృత్. కర్మకృత్ అనగా కర్మను చేయువాడు. కర్మను దేనికొరకు చేయుచున్నాడు? అనునది ఇచటి ప్రముఖ విషయము. తన నిత్య విధులనన్నిటినీ ధర్మార్థకామముల కొరకు గాక, ఈశ్వర స్వరూపమగు మోక్షము కొరకు ఆచరించే వ్యక్తిని గురించి మనమిచట వర్ణించు చున్నాము. ఇట్టి సాధకుడా చరించే కర్మలన్నిటికీ ఈశ్వరుడు కేంద్రముగా నుండును. అతని లక్ష్యము ఈశ్వరుడే గాని మరియొకటి కాదు. అతడు మత్కర్మకృత్. అతడు కర్మలను రాగద్వేషప్రేరితుడై గాక, ధర్మాధర్మ వివేకముతో నాచరించును. ఈ విషయమును మనము స్పష్టముగా నెరుంగవలెను. భగవంతుని కొరకు కర్మను ఆచరించుట యనగా నేమి? మనకు ఈ మాట తరచుగా వినబడుచునే యుండును. కాని దాని తాత్పర్యమేమి?

నేను ఈశ్వరుని కొరకు కర్మను ఎట్లు చేయగల్గుదును? ఈశ్వరుడు తన కొరకై ఒక కర్మను చేయుమని నన్ను ప్రత్యేకముగా కోరినచో, నేను చేయగల్గుదును. మనము ఇతరుల విషయములో తరుచుగా ఇటులనే చేయుదుము గదా! కాని ఈశ్వరుడు దేని కొరకైననూ స్వయముగా వచ్చి నన్ను కోరడు. అయనకు ఏది ఇష్టము? కర్మల నన్నింటినీ నారాయణ స్మరణ పూర్వకముగా చేయవలెనని కొందరు చెప్పెదరు. కాని కేవల నామస్మరణ చేసినంత మాత్రాన కర్మ అయనకు ఎట్లు సమర్పితమగును? నా కర్మను నేను భగవానునకు సమర్పించు విధమెట్టిది? ''ఓ భగవానుడా! నేనీ కర్మను నీకు సమర్పించుచున్నాను'' అని నేను పలికిననూ, ఆ కర్మగాని, దాని ఫలముగాని భగవంతుని చేరబోదు. గీతలోని పదములలో, అస్పష్టముగా మాత్రమే జనులచే తెలియబడే అనేక పదములలో 'మత్కర్మకృత్' ఒకటి. కాని ఈ పదమును భగవానుడు సుస్పష్టముగా ఇంతకు ముందే ఇట్లు వివరించియున్నాడు. రాగద్వేషములకు వశము కారాదు. (రాగద్వేషయోః వశం న ఆగచ్ఛేత్). స్వధర్మమునందు మరణించుటయే శ్రేష్ఠము (స్వధర్మే నిధనం శ్రేయః). పరధర్మము భయహేతువు (పరధర్మో భయావహః).

ఒక విశిష్ట పరిస్థితిలో వ్యక్తి చేయవలసిన విధికి స్వధర్మమని పేరు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర విభాగము గల సమాజములో స్వధర్మము లేక స్వకర్మ స్పష్టముగా తెలియుచుండును. కొన్ని సమాజములలో ఈ వ్యవస్థ లేదు. భారతదేశములో నైననూ ఇప్పుడీ వ్యవస్థలేదు. ఇట్టి స్థితిలో, ఒక విశిష్టపరిస్థితికి అనురూపమైన యోగ్యమగు కర్మాచరణమే స్వకర్మయగును. ఈ స్వకర్మకు, నా ఇష్టానిష్టములకు మధ్య ఘర్షణ తలయెత్తుటకు అవకాశము గలదు. స్వకర్మ నా

రాగమునకు, నిషిద్ధ కర్మ నా ద్వేషమునకు అనురూపముగా నున్నంతవరకు సమస్య లేదు. కాని తరచుగా ధర్మాధర్మములకు, రాగద్వేషములకు మధ్య ఘర్షణ తప్పని సరి యగుచుండును. దేవాసుర యుద్ధమనగా నిదియే. రాగద్వేషములు కర్తవ్యకర్మకు అనురూపముగా నున్నప్పుడు వాటికి ధర్మము అనే స్థాయి లభించును. వాస్తవంలో ధర్మమునకు విరుద్ధముగాని మనోవృత్తులకు రాగద్వేషములని పేరిడుట సమంజసము కాదు. ధార్మికనియతి భగవత్స్వరూపమే గాన, ధర్మమునకు విరుద్ధమైన కర్మ భగవద్విరుద్ధమగును. మనము ఇతరమానవులతో వ్యవహరించునప్పుడు ఈ ప్రకృతినియమములు మనకు తెలుస్తూ ఉంటాయి. మన ప్రవర్తన వాటికి అనురూపముగా నుండునట్లు మనము అభ్యసిస్తాము. కాని ఈ నియమములను మనము సృష్టించలేదు. ఇవి ఈశ్వర సృష్టిలో భాగమై యున్నవి. కావున ఇవి విశ్వజనీనములు. చదువు లేకపోయినా, మానవులందరికీ ధర్మాధర్మపరిజ్ఞానము గలదు. ఇతరులు మనకు ఏమి చేయవలెను? ఏమి చేయరాదు? అను విషయములో మనకు స్పష్టమగు కల్పన కలదు గదా! అవి మనందరికీ తెలుస్తూనే ఉంటాయి. మనందరికీ సమానముగా ఏది తెలియునో, అదియే నియతి. మరియు ఈ ధర్మనియతికి, ఇచ్ఛాస్వాతంత్ర్యమునకు మధ్య సంబంధము గలదు. చేయదగిన కర్మను ఎన్నుకునే హక్కు, మరియు వివేకము మనకు గలవు. ఆ స్వేచ్ఛ మనకు లేనిచో, మన జీవనము పశువులకు వలె పూర్ణముగా పూర్వనిర్ధారితమై (programmed) ఉండెడిది. అట్టి స్థితిలో ధర్మనియతికి ఆవశ్యకత ఉండెడిది గాదు. కాని మనకు ఇచ్ఛా స్వాతంత్రము గలదు. అది ధర్మ నియతితో ప్రగాఢ సంబంధమును కలిగియున్నది. నాకు ఇచ్ఛా స్వాతంత్ర్యము కలదు గనుక, నేను దానిని సర్వదా నా రాగద్వేషములకు అనురూపముగా తీర్చి దిద్ది, ధర్మవిరుద్ధముగా ఆచరించుటకు అవకాశము గలదు. ఇచ్ఛా స్వాతంత్ర్యము అన్నివేళలా ధర్మానురూపముగా నుండదు.

ధర్మనియతి (moral order) ఈశ్వర సృష్టియని మనకు తెలుస్తూనే ఉంటుంది. మనము దానిని ఇంకొక అడుగు ముందుకు గొనిపోదాము. సృష్టింపబడినది సృష్టికర్త కంటె భిన్నము కాదని ఎరింగినవాడే జ్ఞాని. అట్టి జ్ఞాని ధర్మముతో సహజముగా సమరసతను కలిగియుండును. ఈ జ్ఞానములేని సాధకుడు ధర్మనియతిని భగవదాదేశముగా స్వీకరించి శిరసా వహించవలెను. ధర్మము భగవత్సృష్టియని యెరింగి, సాధకుడు ధర్మానురూపముగా నడవడిని తీర్చి దిద్దుకొనవలెను. కర్మను ఈశ్వరుని కొరకు చేయుట యనగా రాగద్వేషముల కొరకు గాక, ధర్మము కొరకు చేయుట యని అర్థము. కర్మయోగికి ధర్మార్థ కామములయందు అభిరుచి

ఉండదు. అతనికి రాగద్వేషములున్ననూ, కర్మలను మోక్షము కొరకై యోగబుద్ధితో నాచరించును. అనగా అతడు మత్కర్మకృత్ అగును. మానవుడు భగవానుని ఆరాధించువాడే అయినా, ఆ ఆరాధన స్వర్గము కొరకుగాని, ఇతర లక్ష్యముల కొరకుగాని అయినచో, అతడు మత్కర్మకృత్ కాజాలడు. వాస్తవంలో అతడా కర్మను స్వీయరాగద్వేషముల కొరకు మాత్రమే ఆచరించుచున్నాడు. ముముక్షువు అగు కర్మయోగి మత్కర్మకృత్ అగును. అతని లక్ష్యము మోక్షము. కాని సన్న్యాసి కాడు గనుక, అతడు కొన్ని విధులను తప్పని సరిగా నిర్వర్తించవలసి యుండును.

భగవానుడు అతి ప్రముఖమైన అంశముగా గల వ్యక్తి మత్పరమః అనబడును. అట్టి వ్యక్తికి, ఈశ్వరునకు మధ్యలో సేవక సేవ్య భావము ఉండునని శ్రీశంకరులు వివరించిరి. సేవకుడు సర్వమును యజమానియొక్క సంతోషము కొరకు చేయు విధంబున, సాధకుడు సర్వకార్యములను ఈశ్వరప్రీతి కొరకు మాత్రమే చేయును. ఒక కార్యమును మరియొక వ్యక్తి కొరకు చేయుటకు, భగవంతుని కొరకు చేయుటకు కొద్ది భేదము గలదు. ఒక వ్యక్తి కొరకు చేసే కర్మలో ఆ వ్యక్తిని సంతోషపెట్టాలనే ఆకాంక్ష ఉన్ననూ, లక్ష్యభావన ఆ వ్యక్తిపై కేంద్రితమై ఉండదు. కాని ఈశ్వరుని కొరకు చేసే కర్మలో ఏకైక ప్రయోజనము (పరమా గతిః) ఈశ్వరునితో ఒకటి అగుటయే. ఇది పరమ గతి. దీనిని పొందిన పిదప మరియొక గతి సంభవము కాదు; అభీష్టము కాదు. కర్మయోగమునకు ఫలము అదియే. కర్మయోగి తన విధులను నిర్వర్తిస్తూనే, జ్ఞానసాధనను కొనసాగించును. కర్మయోగ ప్రభావముచే నాతడు అంతఃకరణ శుద్ధిని, తద్ద్వారా జ్ఞానమును పొందును. ఈశ్వరుడు మాత్రమే పొందదగిన అంతిమలక్ష్యముగా గలవాడు మత్పరమః అనబడును. సాధకుడు తన దృష్టిని ఈ లక్ష్యము నుండి ప్రక్కకు మరల్పడు.

మత్పరముడైన సాధకుడు జీవించు విధమెట్టిది? అతడు మద్భక్తుడై జీవించును. అతని హృదయము, మరియు ఆత్మ పూర్ణముగా భగవద్భక్తితో నిండియుండును. శాస్త్ర పఠనము, జపము, భగవంతుని మహిమను గానము చేయుట ఇత్యాది కార్యముల నన్నిటినీ అతడు మహోత్సాహముతో చేయును. ఈ ఉత్సాహము సహజమే. ఏలయన, మానవుడు తాను ప్రేమించు వస్తువుపై సర్వదా ఉత్సాహభరితుడై యుండును. ఈశ్వరుడు పొందదగిన చరమ లక్ష్యమనియు, ఆ లక్ష్యసాధనకై తాను కర్మయోగమును చేపట్టినాననియు, అతడు సుస్పష్టముగా నెరుంగును. మత్పరమః, మత్కర్మకృత్ అను విశేషణములను చెప్పిన తరువాత మద్భక్తః అని చెప్పవలసిన ఆవశ్యకత ఏమి గలదు? భక్తిలేనిచో, అతడు కర్మయోగిగా చేయవలసిన పనులన్నిటినీ చేయజాలడు. అతడు స్వకర్మను చేయుచున్ననూ, మోక్షమును గురించి అతనికి గల అవగాహన అస్పష్టముగ

నున్నచో, అతని భక్తి కూడ అస్పష్టముగనే ఉండును. కావున, అతనికి గల శ్రద్ధను సూచించుటకై భగవానుడిచట మద్భక్తః అని ప్రయోగించినాడు. అతనికి పూర్ణమగు అంకిత భావము గలదని దీనిని బట్టి తెలియుచున్నది.

మరియు నాతడు సంగవర్జితుడు, అనగా ఆసక్తి నుండి విముక్తిని పొందినవాడు. మానవులకు ధనము, పుత్రుడు, పుత్రిక, మిత్రుడు, భార్య, బంధువులు ఇత్యాదులపై ఆసక్తి మెండుగ నుండునని శ్రీ శంకరులు వివరించిరి. మానవునకు మిత్రులపై, పుత్రాదులపై, ధనధాన్యాదులపై సమ్మోహము (Obsession) ఉండును. ఇట్టి సమ్మోహాత్మకమగు అనురక్తి (attachment) నుండి విముక్తుడైన వ్యక్తి సంగవర్జితుడనబడును. వాస్తవములో ఈ ఆసక్తి మానసిక పరాధీనత (emotional dependence) మాత్రమే. సంగవర్జితునియందు కూడా ప్రేమ, అనురాగము మొదలగునవి ఉండును. కాని అవి అతని ఉల్లాసమునకు, కల్యాణ భావనకు ఆధారములు గాకుండును.

సంగము ఉన్నచో, దానితో బాటు అదుర్దా, దుఃఖము ఇత్యాది ఇతర సమస్యలు కూడ ఉదయించి, రాగద్వేషములు ప్రబలమగును.ఇది జీవితములో ముందుకు కొనసాగే సమస్య. బంధువులతో ఏదో ఒక వైమనస్యము కలుగక మానదు. దానిని పరిష్కరించుటకు ముందుగనే భార్యతో గాని, సంతానముతో గాని మరియొక సమస్య ఉదయించును. ఇతరులను సంతోష పెట్టుటలో జీవితమంతయూ గడిచిపోవును. ఈ వైమనస్యములకు అంతము ఉండదు. కావున మనము ఈ సమస్యనంతనూ మౌలికముగా విశ్లేషించే నిశ్చయమునకు రావాలి. మనము మనస్సు యొక్క స్వరూపము నెరింగి, వైరాగ్యమును గురించి అవగాహనను పెంపొందించుకోవాలి. భావాత్మకమగు (emotional) అత్యాసక్తి (excessive involvement) వలన ఉత్పన్నమయ్యే సమస్యలు కొద్దో గొప్పో అందరికీ పరిచితమైనవే. ఇది విశ్వజనీనమగు సమస్య. కావున భావాత్మకమగు అత్యాసక్తికి మనము అధీనులమై ఉన్నామనే సత్యమును గుర్తించి, దాని స్వరూపమును విశ్లేషించే ప్రయత్నమును చేయవలెను. ఈ అవగాహన గల వ్యక్తికి మానవీయ సంబంధములు సమస్యా జనకములు కాకుండగా ఉల్లాస హేతువులగును. పైగా ఈ సంబంధములు మన అభివృద్ధికి తోడ్పడును. మనకు ఇతర వ్యక్తులతో సంబంధము లేనిచో, మనలో భావాత్మకమగు అసంగము ఉన్నదా, లేదా యని తెలియుట యెట్లు? మనలో ఉన్న ఒక లోపమునుండి, లేదా మనకు గల ఒక ఆవశ్యకత నుండి ఈ ఆసక్తి పుట్టి సమస్యలకు మూలమగును. ఈ లోపమును, ఆవశ్యకతను మనము గుర్తించి కొంత వైరాగ్యమును పెంపొందించు కొనవలెను. కాని అవగాహన లేనిదే

వైరాగ్యము కలుగదు. ఈ విచార ప్రక్రియలో మన గురించి మనకు ఒక అవగాహన ఏర్పడి, మన ప్రవర్తన మనకు విదితమగును. 'భావాత్మకమగు అత్యాసక్తిలో ఇరుకు-కొనకుండగా ఇతరులతో నేను సంబంధమును ఏర్పరచుకొనగలను' అనే ధైర్యము వచ్చేవరకు కొన్ని పరిస్థితులకు దూరముగా ఉండే ప్రయత్నమును చేయుచుండవలెను. ఆ ధైర్యము వచ్చిన తరువాత మనము ఇతరులతో ఇచ్చుట అనే సంబంధమును మాత్రమే కలిగియుందుము. మనము ఇతరులనుండి తీసుకొనుచున్నంతవరకు, వారిపై ఆధారపడుట తప్పదు. కాని వైరాగ్యము ఉదయించిన వ్యక్తి ఇట్లు ఆధారపడకుండగా ప్రేమానురాగవములను, దయను నిరాటంకముగా ఇతరులకు పంచియిచ్చును.

మరియు ఆ సాధకునియందు వైరభావము లేదు (నిర్వైరః). కొన్ని సందర్భములలో కొందరు మనతో శత్రుభావముతో వ్యవహరించెదరు. కాని నీవు నీ మానసిక పరిణతికి కట్టుబడి యున్నవాడవైనచో, ఆత్మ విమర్శనమును చేసుకొనెదవు. "బహుశః నేనే వారిలో శత్రు భావమును కలిగించి యుందును. అట్లు గానిచో, అతడు నాతో విరోధమునేల బూనవలెను?" మనము సర్వమును అంతఃకరణములో స్థాపితము చేసుకొని దుఃఖించవలెనని నేను చెప్పుటలేదు. కాని మన భావావేశములకు, చర్యలకు మనమే బాధ్యత వహించాలి. ప్రతి వ్యక్తి తన మనోభావములకు అనురూపముగా ప్రవర్తించును. ఈ సత్యమును మనము గుర్తిస్తే, సమస్యలు చాలవరకు తగ్గిపోవును. మనలను చికాకు పెట్టే పశువులు, దోమలు మొదలగు వాటిని మనము నిందించము గదా! భగవానుడే పూర్వమే నిర్ణీతము చేసియుంచిన పద్ధతిలో మాత్రమే అవి జీవించును. కుట్టినదనే కారణంగా మనము దోమను తిట్టము. కాని దానికి దూరంగా ఉండే ప్రయత్నమును చేస్తాము. మానవుల విషయంలో కూడా పరిస్థితి ఇంచుమించు ఇంతే. కొందరు మనపై కక్షగట్టి శత్రుత్వమును కొనసాగించవచ్చును. అయిననూ, వారు గతవుచే ప్రభావితులై నిస్సహాయులై అట్లు ప్రవర్తించుచున్నారనే సత్యమును మనము గుర్తించవలెను. అటువంటి గతము మనకు ఉన్నచో, మనము కూడ అటులనే ప్రవర్తించి యుండెడి వారము. ఈ సత్యమును గుర్తించినచో, వైరము మటుమాయమగును. ఇతరులను వారి మానాన వారిని వదిలివేయుట మంచిది. ఇట్టి వైరాగ్యము విశిష్టమగు పరిపక్వతగల మనస్సులో మాత్రమే ఉదయించును. దానిని సంపాదించుటకై మనము స్వీయ ప్రతిక్రియలను, స్పందనలను విశ్లేషించుకొనవలెను.

ఈ లక్షణములన్నియు కలిగియున్న సాధకుడు నాతో ఐక్యము అగును (మాం ఏతి). అతనికి నేనే చరమ లక్ష్యము; ఏకైక లక్ష్యము. నీవు భగవంతునిలో ఐక్యమైనావనుకో. అపుడు

నీవేమి చేసెదవు? నీవు ఏమి చేయజాలవు? నీవు విముక్తుడవు; నీవు పూర్ణుడవు. నీవు ఈశ్వరునికంటె భిన్నముగా లేవు. ఇది అత్యంత అభిలషణీయమైన ఉపదేశము. అర్జునుడీ ఉపదేశమును కోరుకొనెను. శ్రీకృష్ణుడు సర్వమును అతనికి ఉపదేశించెను.

ఉపనిషత్సార భూతమైనది, శ్రీకృష్ణార్జునుల మధ్య సంవాద రూపమైనది అగు భగవద్గీతలో విశ్వరూపసందర్శనము విషయ వస్తువుగా గల 11వ అధ్యాయము ముగిసినది.

## 12వ అధ్యాయము

### ఉపక్రమము

12వ అధ్యాయములో భక్తి ప్రముఖమగు విషయవస్తువు. సేవించుట అను అర్థముగల భజ్ ధాతువునుండి భక్తి అనుపదము పుట్టినది. ధర్మరూపములో నున్న భగవానునకు అంకితభావముతో చేయు సేవ భక్తి యనబడును. అధర్మమును పరిహరించి, ధర్మమునకు అనురూపముగా జీవిస్తూ, ధర్మమే ఈశ్వరుడను ధారణ గలవాడు భక్తుడు మరియు కర్మయోగి యగును.

ఈ అధ్యాయము అర్జునుని ప్రశ్నతో ఆరంభమగును. అర్జునుని ఈ ప్రశ్న కూడా అతని ఇతర ప్రశ్నల ధోరణిలోనే యున్నది. అతని మనస్సు సన్న్యాసముపై నున్నది. కాని అతనిని విధి ఆహ్వానించుచున్నది. ఇందువలన అతని హృదయములో ఒక ఘర్షణ చెలరేగినది. ప్రతి మానవుని హృదయములో ఏదో ఒక రూపములో ఇట్టి ఘర్షణతో దినము ఆరంభమై, ఈ ఘర్షణ వివిధరూపములలో కొనసాగుచునే యుండును. అర్జునుని మనస్సు ఇంకనూ ఒక నిర్ణయమునకు రాలేదు. తనకు రాజ్యకాంక్షగాని, భోగాసక్తి గాని లేదనియు, భిక్షాటన చేస్తూ జీవించుట తనకు అభిమతమనియు అతడు రెండవ అధ్యాయములో ప్రకటించి యున్నాడు. భిక్షా అను పదమును ప్రయోగించిన పిదప, అతని మనస్సులో సన్న్యాసమునందు పట్టుదల కలిగెను.

అతడు వాస్తవంలో శ్రేయస్సునకు అంకితమైనాడు. దానికొరకై శ్రేయస్సును కాంక్షించినాడు. అతడు ఇపుడు చేయవలసిన కర్మ క్రూరమైనది. అతడు యుద్ధమును చేయవలసియున్నది. సంధ్యావందనము గాని, అగ్నిహోత్రాది వైదిక కర్మగాని అయినచో, సమస్య ఉండెడిది గాదు. అతడు ఎంతో ఆదరించే భీష్మ ద్రోణాది మహాత్ములనందరి నీ అతడు సంహరించవలెను. ఇది అతనికి మింగుడు పడుట లేదు. పూజ్యులైన వ్యక్తులతో అతడు యుద్ధము నెట్లు చేయగలడు? ఇట్టి యుద్ధమును చేయుట తనవలన కాని పనియని అతడు అదే అధ్యాయములో చెప్పియున్నాడు. ఇంతకంటె సాధువువలె బిచ్చమెత్తుకొని జీవించుట మేలని అతని తలంపు. ఇట్టి జీవనము బ్రహ్మచారికి, సర్వమును పరిత్యజించిన సన్న్యాసికి మాత్రమే సంభవమగును. అర్జునుడు ఇపుడు బ్రహ్మచారి కాజాలడు. అయన వివాహితుడు. అయనకు పెరిగి పెద్దవాడైన కొడుకు కూడ గలడు. ఇక మిగిలినది సన్న్యాసము మాత్రమే. అందుచేతనే అతడిపుడు సన్న్యాసమును స్వీకరింపగోరెను. అతడీ విషయమును స్పష్టమగు పదములలో

వ్యక్తముచేసి యుండెను. 'నాకు రాజ్యము వద్దు. రాజ్యము నా దుఃఖమును పోగొట్టుననే ఆశ నాకు లేదు. నాకు శ్రేయస్సు కావాలి. నేను నీ శిష్యుడను. దయతో నాకు ఉపదేశించుము (శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్)''. ఈ జ్ఞానము కొరకు అంకిత భావము అర్జునునకు గలదు. అతడు కోరునది శ్రేయస్సు; సన్న్యాసము కాదు. కాని శ్రేయస్సును పొందుటకు సన్న్యాసము మరింత సానుకూల పడునని అతడు తలపోసెను.

అపుడు శ్రీకృష్ణ భగవానుడు రెండవ అధ్యాయములో అతనికి ఆత్మ స్వరూపమును బోధించెను. వేదములన్నియు త్రిగుణాత్మకమగు సంసారమును దాటిపోవనియు, అవి బోధించు లక్ష్యములు సంసారాంతర్గతములుగనే ఉండుననియు కూడ ఆయన చెప్పియున్నాడు. 'కావున, ఓ అర్జునా! నీవు ఈ త్రిగుణములకు అతీతుడవు కమ్ము' అని కూడ ఆయవ బోధించినాడు. అవుడాయన లేచి నిలబడి యుద్ధమును చేయుమని (తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః) చెప్పి, కర్మయోగమును గురించి వివరించెను. ''నీకు కర్మయందు మాత్రమే ఎంచుకునే అవకాశము గలదు. ఫలమునందు ఏనాడూ ఇట్టి స్వేచ్ఛ లేదు (కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన)'' అని కూడా చెప్పినాడు.

అపుడు అర్జునుడొక ప్రశ్నను వేసెను. అతడు స్థితప్రజ్ఞుని (జ్ఞాని) లక్షణములను తెలియగోరెను (స్థితప్రజ్ఞస్య కా భాషా). జ్ఞాని కూడా మనవలెనే ప్రపంచములో వ్యవహరిస్తూ పనులన్నిటినీ చేస్తూ ఉంటాడా? అని అతడు పరోక్షముగా ప్రశ్నించెను. తనలో తాను ఆనందముగా నుండు వాడే జ్ఞానియని భగవానుడు బదులిడెను. అజ్ఞానుల రాత్రి జ్ఞానికి పగలు. అజ్ఞానుల పగలు జ్ఞానికి రాత్రి. అనగా అజ్ఞానులకు ఏది సత్యమో, అది జ్ఞానికి అసత్యము. అజ్ఞానులకు ఏది అసత్యమో, అది జ్ఞానికి సత్యము (యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః). ఇట్టి స్థితిలో భగవానుడు స్థితప్రజ్ఞుని లక్షణములను, స్థితప్రజ్ఞుడు కానివానికి ఎట్లు వర్ణించి చెప్పగల్గును?

నీవు జ్ఞానివి కానిచో, జ్ఞాని యొక్క వర్ణన నీకు ఉపకరించదు. ఏలయన, జ్ఞాని గురించి మరియొక జ్ఞాని మాత్రమే తెలియగలడు. నీవు ఇప్పటికే జ్ఞానివి (స్థితప్రజ్ఞుడవు) అయి ఉన్నచో, నీకు జ్ఞాని స్వరూపమును గురించి చెప్పబనిలేదు. అయిననూ, శ్రీకృష్ణుడు ఒక దృష్టాంతము నిచ్చి వర్ణించుటకు ప్రయత్నించెను. పూర్ణ సముద్రములోనికి ప్రవహించు జలములు సముద్రములో మార్పును తీసుకు రాలేవు. అటులనే, విషయవస్తువులన్నియు జ్ఞాని హృదయములోనికి ప్రవేశించి

నిర్గమించిననూ, వాటి ప్రభావము లేశమైననూ అతనిపై పడదు. అతడు ఆనందస్వరూపుడు. అతనికి హర్షమును కలిగించేది గాని, నిరుత్సాహపరచేది గాని ఏదీ లేదు.

తరువాత అర్జునుడు మరియొక ప్రశ్నను వేసెను. మానవుడు జ్ఞానము వలన మాత్రమే స్థితప్రజ్ఞుడు కాగల్గును. అందువలననే శ్రీకృష్ణునకు జ్ఞానము అత్యంతప్రియము. ఈ విషయమును అర్జునుడెరుంగును. ''ఇట్టి స్థితిలో నీవు నన్ను యుద్ధమును చేయుమని ఏల చెప్పుచున్నావు?'' అను ప్రశ్నను అర్జునుడు వేసెను. మోక్షసాధనము జ్ఞానము గనుక, అర్జునుడు జ్ఞానమునే అన్వేషించ గోరెను. శ్రీకృష్ణుడు చేయుమని చెప్పుచున్న ఈ కర్మలన్నిటికి అతని దృష్టిలో మహత్త్వము లేదు. ''నీవు పరస్పర విరోధముతో గూడిన వచనములను పలుకుచున్నావు. ఒకవైపు జ్ఞానమును స్తుతించి, మరియొకవైపు నన్ను కర్మను చేయుమని ప్రోత్సహించుచున్నావు ''అని అతడు ఆయనతో చెప్పెను. శ్రేయస్ అనగా మోక్షమనియు, అది జ్ఞానసాధ్యమనియు స్పష్టముగా తెలియుచున్నది. అయిననూ, తాను కర్మను చేయవలెనని ఉపదేశింపబడినది. పైగా ఆ కర్మ సరళమైనది కాదు. యుద్ధములో రక్తమును చిందించవలెను. తన దృష్టిని మరియొక దిశలోనికి మళ్లించి, శ్రీకృష్ణుడు తనను శ్రేయోమార్గమునకు దూరము చేయుచున్నాడా యేమి? అని అర్జునునకు భాసించెను. ఈ భావమునంతనూ అర్జునుడు మనసులో నిడుకొని '' ఓ కృష్ణా! నీ దృష్టిలో ఏది శ్రేష్ఠము? కర్మయా? జ్ఞానమా? (జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన) అని శ్రీకృష్ణుని ప్రశ్నించెను. ఈ ప్రశ్నకు సమాధానము మూడవ అధ్యాయము. శ్రీకృష్ణ భగవానుడు అతనికి ఖచ్చితమగు సమాధానము నీయలేదు. సన్న్యసమనగా నేమి? కర్మయోగమనగా నేమి? అను విషయములను మాత్రమే ఆయన వివరించెను. ఈ రెండింటికి ప్రయోజనము జ్ఞానమే. జీవనశైలిలో మాత్రమే వాటి మధ్య భేదము గలదు (లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా). ఒకటి త్యాగమయ జీవితము కాగా, మరియొకటి సముచిత మానసిక ప్రవృత్తితో గూడిన కర్మణ్యతతో నిండి యుండును. ఇట్టి కర్మయోగము వలన చిత్త శుద్ధి లభించును. చిత్తశుద్ధి లభించిన తరువాతనే శాస్త్రోపదేశము అవగాహనకు వచ్చును.

నీవు సన్న్యసమునకు సంసిద్ధుడవైనచో, సన్న్యసివి కమ్ము. లేదా కర్మయోగివి కమ్ము. వాస్తవంలో ఇచట ఎంచుకోవలసిన పరిస్థితి లేదు. 15 సంవత్సరముల బాలునకు మరుచటి సంవత్సరము వయస్సు ఎంత ఉండును? పదహారా? ఇరవై అయిదా? సన్న్యసమనగా మానసిక పరిపక్వత. పరిపక్వత లభించాలంటే, కర్మయోగమును అనుష్ఠించవలెను. కావున కర్మయోగమా? సన్న్యసమా? అను ఎంపికకు తావు లేదు. నీవు ఎంతవరకు సంసిద్ధుడుగా నున్నావు? అను

విషయముపై ఆధారపడి ఆ సంగతిని నిర్ణయించవలెను. శ్రీకృష్ణుడు సన్న్యాస కర్మయోగములను శ్రద్ధగా వివరించి, అర్జునుడిట్టి ప్రశ్నను అడుగబోడని ఆశించెను. కాని కొంత సమయము వేచియున్న తరువాత, అర్జునుడు అయిదవ అధ్యాయములో అదే ప్రశ్నను మరో రూపములో అడిగెను. తాను మున్ముందు అడిగిన ప్రశ్నను శ్రీకృష్ణుడు బహుశః విస్మరించి యుండునని భావించి, అర్జునుడు ఇట్లు ప్రశ్నించెను. ''ఓ కృష్ణా! నీవు యోగ సన్న్యాసములను రెండింటినీ స్తుతించుచున్నావు. ఈ రెండింటిలో నాకు ఏది శ్రేష్ఠమని నీవు తలంచెదవో ఖచ్చితముగా తెల్పి చెప్పుము (సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి, యచ్ఛ్రేయ ఏతయోరే కం తన్మే బ్రూహి సునిశ్చితమ్)''. ముందుగా జ్ఞానము, కర్మ అను వాటిని గురించి ఇదే తీరున అర్జునుడు ప్రశ్నించియున్నాడు. ఇపుడు వాటి స్థానములో సన్న్యాస, యోగ శబ్దములను ప్రయోగించినాడు.

ఈ రెండు ప్రశ్నలు ఒక్కటియే. పదములు మాత్రమే మారినవి. ఈ పర్యాయము కూడా శ్రీకృష్ణుడు తిన్నగా సమాధానము నీయలేదు. ఆయన ఇట్లు బదులిడెను. సన్న్యాసముచే ఏది సిద్ధించునో, అది కర్మయోగులకు కూడ లభించును (యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే). మరియు, సన్న్యాసకర్మ యోగములను ఏకత్వ (అనగా ఒకే ఫలమును ఇచ్చునవి అనే) బుద్ధితో ఎవడు దర్శించునో వాడే జ్ఞాని (ఏకం యోగం చ సాంఖ్యం చ యః పశ్యతి స పశ్యతి).

మరల ఇచట 12వ అధ్యాయములో అర్జునుడు అదే ప్రశ్నను కొద్దిగా రూపమును మార్చి అడుగుచున్నాడు. కొందరు నిర్గుణ బ్రహ్మను ఆరాధించెదరు. అనగా నిర్గుణ పరబ్రహ్మ ప్రత్యగాత్మకంటె అభిన్నము అను జ్ఞానమును నిదిధ్యాసనము చేసెదరు. వీరు ఒక సముదాయము. అర్జునుడు కొద్దిసేపు క్రితమే ఏదో ఒక రకంగా దర్శించిన విశ్వరూపమేది గలదో, దానిని మరికొందరు ఉపాసించెదరు. ఇది రెండవ సముదాయము. వీరిద్దరిలో ఎవరు గొప్పవారు? అను విషయమును అర్జునుడు తెలియగోరెను.

కర్మయోగి తనకు కుటుంబ, సమాజ, స్వరాష్ట్రముల విషయములో గల విధులను మాత్రమే గాక, దేవతల విషయములో గల విధులను కూడ ఈశ్వరార్పణ బుద్ధితో నిర్వర్తిస్తూ, సగుణ బ్రహ్మను ధ్యానించును. సన్న్యాసికి ఈ విధులేమియూ ఉండవు. అతని జీవితము జ్ఞానాన్వేషణకు మాత్రమే అంకితమగును; అచట ఇతరమునకు తావు లేదు. సాధకుడు వేదవిహితమైన ఒక కర్మను అనుష్ఠించి, చెట్లు చేమలతో, పశుపక్ష్యాదులతో, మానవులతో మరియు సర్వదేవతలతో సహా సకల ప్రాణికోటికి తనవలన హాని కలుగబోదని ప్రతిజ్ఞను చేసి సన్న్యాసి యగును. అతడు ధరించే కాషాయ వస్త్రము, రుద్రాక్షమాల మరియు కమండలము అను బాహ్య

చిహ్నములు అతని జ్ఞానసాధనను ప్రకటించును. అతడు సర్వప్రాణులకు అభయము నొసంగును. అతడు ఇతరము సర్వమును పరిత్యజించి నిర్గుణ బ్రహ్మను ధ్యానించును. ఈ ధ్యానమునకు గూడ ఉపాసన అని పేరు ఉన్ననూ, నిర్గుణ బ్రహ్మ జ్ఞేయమే గాని ధ్యేయము గాదు. గుణము లేనిది, పైగా సాధకుని స్వరూపమే అయినది అగు నిర్గుణ బ్రహ్మను ధ్యానించుట ఎట్లు సంభవమగును? నిర్గుణబ్రహ్మోపాసనమనగా జ్ఞానసాధనయే. ''నన్ను పరమాత్మరూపునిగా ఎవరు ధ్యానించెదరో (తం యే పర్యుపాసతే), వారు తిన్నగా నన్ను పొందెదరు (తే మాం ఏవ యాంతి). వారు ధ్యానించేది ఆత్మ గమక, సర్వప్రాణుల ఆత్మ నేనే గనుక, వారు నేనే. నేను ఆత్మరూపుడనని వారు ఎరింగి, నాతో ఐక్యమగుదురు'' అని భగవానుడు చెప్పుచున్నాడు.

అర్జునుడు తన ప్రశ్నను కర్మణ్యతకు చెందిన పద జాలముతో గాక, ధ్యాన సంబంధి పదములతో యోజన చేసెను. కాని ప్రశ్న అదియే. జీవనశైలి దృష్ట్యా సన్న్యాసము గొప్పదా? కర్మయోగము గొప్పదా? అని అర్జునుడు ప్రశ్నించెను. కాని ఇచట ప్రశ్న, ధ్యానము అనే విషయవస్తువు ఆధారముగా వేయబడినది. కర్మయోగికి సగుణబ్రహ్మ (ఈశ్వరుడు), సన్న్యాసికి నిర్గుణబ్రహ్మ విషయవస్తువులు అగును.

అర్జునుని ఈ ప్రశ్నకు, మూడవ మరియు అయిదవ అధ్యాయములలో అతడు వేసిన ప్రశ్నలకు భేదమేమి గలదు? భేదము లేదు. 18వ అధ్యాయములో అర్జునుడు ఇదే ప్రశ్నను ఇంకనూ మరియొక తీరున వేసినాడు. కర్మఫల త్యాగము (త్యాగము) గొప్పదా? సన్న్యాసము గొప్పదా? అపుడు మరల శ్రీకృష్ణ భగవానుడు సమాధానము నిచ్చును. దానితో అర్జునుని ప్రశ్నలు అంతమగును. 18వ అధ్యాయములో అర్జునుడిట్లు చెప్పును: నా మోహము తొలగినది. నా ఇంద్రియములు స్పష్టతను పొందినవి. నేను నీవు చెప్పినట్లు చేయగలను (నష్టో మోహః స్మృతిర్లబ్ధా....కరిష్యే వచనం తవ).

ఈ అధ్యాయమునకు భక్తి యోగమని పేరు ఉండుటచే, ఇది ఇంకో క్రొత్త యోగమనే ఊహ చాలమందిలో గలదు. ఇతర అధ్యాయములలో వలెనే ఇచట కూడా యోగమనగా విషయవస్తువు అని యర్థము. భక్తియోగమనే స్వతంత్రమగు సాధనము మరియొకటి లేదు. మోక్షసాధనము జ్ఞానమేననియు, జ్ఞానమును కోరు వ్యక్తి సన్న్యాస కర్మయోగములనే ద్వివిధ జ్ఞానశైలులలో ఒక దానిని స్వీకరించవచ్చుననియు శ్రీకృష్ణుడు స్పష్టము చేసియున్నాడు. ఈ రెండింటికి లక్ష్యము ఒక్కటియే. సన్న్యాసికి ఏది సిద్ధించునో, కర్మయోగికి కూడా అదియే

సిద్ధించును. ఈ రెండింటికీ ఫలము ఒక్కటియే అను దర్శనము గలవాడు మాత్రమే యథార్థ దర్శనము గలవాడు అగును (ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి).

ఇంత విస్తారముగా వివరించినా, అర్జునుడింకనూ ప్రశ్నించుచున్నాడు. ఆత్మ జ్ఞానరూపమగు నిర్గుణ బ్రహ్మోపాసన శ్రేష్ఠమా? లేక విశ్వరూపము అనే సగుణ బ్రహ్మను ఉపాసించే కర్మయోగము శ్రేష్ఠమా? సర్వజగద్రూపముగా భాసించే ఈశ్వరుని ఆరాధిస్తూ, ధర్మ నియతికి అనురూపముగా జీవిస్తూ, ధర్మమే ఈశ్వరుడను దర్శనము గల సాధకుడే కర్మయోగి మరియు భక్తుడు కూడా అగుచున్నాడు.

ధర్మమును పాటించువారు అనేకులు గలరు. కాని వారు ధర్మము ఈశ్వర స్వరూపమని తలంచరు. ఇతరులు తమ యెడల ఎట్లు ప్రవర్తించ వలెనని మనము అపేక్షిస్తామో, ఇతరుల యెడ మనము అదే తీరున ప్రవర్తించవలెను. ఈ సత్యమును వారు గుర్తించెదరు. వారు ధర్మమునకు అనురూపముగా జీవించువారే అయినా, ఈశ్వరుని అంగీకరించనిచో కర్మయోగులు కాజాలరు. ఏలయన, ధర్మము ఈశ్వరుడే యను దర్శనము లేనిచో, ఈశ్వరార్పణ బుద్ధి ఉండబోదు. కాని కర్మయోగి కర్మలనన్నిటినీ ఈశ్వరునకు సమర్పించి, ఈశ్వరుని ధ్యానించును. ఈ రెండు ఈశ్వరారాధనలో భాగములే. అగ్నిహోత్రాది వైదిక కర్మలు అన్నీ ఈశ్వరారాధనలే. ఈ కర్మలకు ఉపాసనను జోడించినచో, ఆ ఆరాధన మరింత వీర్యవత్తరమగును. ఉపాసన యనగా మానసిక కర్మ. ఆరాధనా రూపములన్నియూ కర్మయోగములో అంతర్గతమగును. వేదమును వల్లెవేసినా, మనస్సులో ప్రార్థనను భావన చేసినా, అది కర్మయే యగును. కావున కర్మ యోగమనగా కేవల సేవ మాత్రమే గాదు. ఈశ్వరుని ఉద్దేశించి చేసే ప్రార్థన, ధ్యానము ఇత్యాది కర్మలన్నియూ కర్మయోగమే యగును. కాయికము, వాచికము, మానసికము అని కర్మ త్రివిధముగా నున్నది. ఈ త్రివిధ కర్మలలో ఏదో ఒక విధమైన కర్మను చేసి ఈశ్వరుని తద్వారా ఆరాధించినచో, అది కర్మయోగము అగును. భక్తియోగమనేది దీనికంటె వేరుగ లేదు. ఈ మాటను నేను మరల ఇచట చెప్పుచున్నాను. ఏలయన, ఈ భ్రాంతి జనులలో ప్రబలముగ నున్నది. జ్ఞానయోగము, కర్మయోగము, భక్తియోగము, హఠయోగము అను నాల్గు యోగములు గలవను అపోహ జనులలో అధికముగ వ్యాపించియున్నది.

సన్న్యాసి విహిత కర్మలనన్నిటినీ పరిత్యజించును; అనగా ప్రతిదినము చేయవలసిన నిత్యకర్మలను, మరియు నిమిత్తము కలిగినప్పుడు చేయదగిన నైమిత్తిక కర్మలను గూడ పరిత్యజించును. ఇంతేగాక, కుటుంబము, సమాజము, రాష్ట్రముల విషయములో ఉండే

విధులతోబాటు,దేవతల విషయములోని విధులను కూడ పరిత్యజించును. అతడు చేసే ఏకైక సాధనము జ్ఞానము. కాని కర్మయోగి విషయములో పరిస్థితి వేరు. అతడు విహిత కర్మల నన్నిటినీ అనుష్ఠించుచుండవలెను. కావున, మన యెదుట రెండు రకముల వ్యక్తులు గలరు. ఒకడు ఇతరమును సర్వమును విడనాడి జ్ఞాన సాధనను చేయు సన్న్యాసి, లేక జ్ఞానయోగి. మరియొకడు కర్మను యోగముగా అనుష్ఠిస్తూ దానితోబాటు జ్ఞానాభ్యాసమును కూడా చేసే కర్మయోగి.

భక్తియోగి అనువాడొకడు కలడనుకొనుడు. అతనికి విధులు గలవా? లేవా? అతడు నిత్యపూజ చేసి, పురాణాదులను పఠించుచో, అవి అన్నియూ కర్మలే. కాబట్టి భక్తియోగము కర్మ కంటె ఏ విధముగా భిన్నమగును? అతడు యథార్థ భక్తుడైనచో, లౌకిక కర్మల నాచరించు సమయములో అభక్తుడు (non-devotee) కాబోడు. యథార్థ భక్తుడు సర్వకాలములలో భక్తుడై యుండును. అట్టి భక్తి కుదురుట కొరకు మాత్రమే భక్తుడు ఈ పూజాదికృత్యముల నన్నిటినీ అనుష్ఠించును. కర్మయోగికి భక్తి లేదని మనమెట్లు చెప్పగలము? కర్మయోగి ఆచరించే కర్మలలో ఈశ్వరారాధన గాని కర్మయే లేదు. నీతికి కట్టుబడి జీవించే వ్యక్తి, ఎంతటి మహాత్ముడైననూ, ఈశ్వరుని అంగీకరించనిచో, కర్మయోగి కాజాలడని నేను చెప్పియున్నాను. మత్కర్మకృత్ అయి, ధర్మమును ఈశ్వరరూపముగా దర్శించి, కర్మలనన్నిటినీ ఈశ్వరుని కొరకు చేయువాడు కర్మయోగి యగును. కావున కర్మయోగికి భక్తి ఉండదని మనమెన్నటికీ చెప్పజాలము. మరియు భక్తిలేని సన్న్యాసి కూడా లేడు. సన్న్యాసము ఈశ్వర సాక్షాత్కారము కొరకు మాత్రమే స్వీకరింపబడును. కావున భక్తియోగి భిన్నముగా లేడు. ఈ లోకములో మోక్షమునకు అంకితమైన ద్వివిధ జీవనశైలులు గలవనియు, ఒకటి సన్న్యాస జీవనమనియు, రెండవది కర్మయోగమనియు (లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా) శ్రీకృష్ణ భగవానుడు చెప్పియున్నాడు.

నాల్గు విభిన్నయోగముల ననుష్ఠించే నాల్గు రకముల యోగులు గలరని ఈ సత్యము నెరుంగని వారు చెప్పెదరు. బుద్ధి జీవులకు జ్ఞానయోగము, భావావేగపరులకు భక్తియోగము, బహిర్ముఖులకు కర్మయోగము, మంద బుద్ధులకు హఠయోగము ఉద్దేశింపబడినవని వారు చెప్పెదరు.

మనమందరము బుద్ధి జీవులమే. భావావేగములు లేని వాడెవడు గలడు? బహిర్ముఖుడు కాని వాడెవ్వడు? గొప్ప అంతర్ముఖునకైననూ కొన్ని బహిర్ముఖ కార్యములు తప్పవు. కొంత వ్యాయామము అవసరము కాని వాడెవ్వడు? సన్న్యాసులు, కర్మయోగులు మరియు శరీరమును ఆరోగ్యముగా ఉంచుకోవాలనే ఆకాంక్ష గలవారు కూడ ఆసనములను వేసెదరు. వీటిలో అందరికీ

అక్కరలేనిది ఏది గలదు? సన్న్యాసమనగా నేమి? కర్మయోగమనగా నేమి? జ్ఞానమనగా నేమి? మోక్షమనగా నేమి? ఈ విషయములపై సరియగు అవగాహన లేకపోవుటయే అపోహలకు మూలము.

కావున ఇచట భక్తియోగమనే నూతనవిషయము బోధింపబడుట లేదు. ఈ అధ్యాయము భక్తిని, విశేషించి సగుణబ్రహ్మోపాసనను, నిరూపించును.

పరబ్రహ్మ (పరమాత్మ) మార్పులకు లోను కాదు (అక్షరమ్). అది నిర్గుణము. దాని జ్ఞానములో ఉపాధులన్నియు నిషేధింపబడును. ఈ విషయము రెండవ అధ్యాయముతో మొదలిడి పదవ అధ్యాయము (విభూతి యోగము) వరకు చర్చించబడినదని శ్రీశంకరులు అధ్యాయ–ఉపక్రమ భాష్యములో వివరించిరి. ఇంతేగాక, ఈశ్వరుని విభూతులు, ఆయన యొక్క అధీశ్వరత్వము (ఐశ్వర్యము), సర్వజ్ఞత్వము ఇత్యాదులు కూడ నిర్దేశించబడినవి. సృష్ట్యాదియందు ఉన్నవాడు, ఇప్పుడు జగద్రూపముగా నున్నవాడు అగు ఆ ఈశ్వరుని సగుణరూపము 11వ అధ్యాయములో నిరూపించబడినది. 'మత్కర్మకృత్' అనదగిన కర్మయోగులు ఆ రూపమును ధ్యానించెదరు. ఈ విషయముపై అర్జునుడు ఇపుడొక ప్రశ్నను వేయుచున్నాడు :

**అధ్యాయము 12, శ్లోకము 1:**

अर्जुन उवाच ।
एवं सततयुक्ता ये भक्तास्त्वां पर्युपासते ।
ये चाप्यक्षरमव्यक्तं तेषां के योगवित्तमाः ॥ १ ॥

అర్జున ఉవాచ
ఏవం సతత యుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః (1)

అర్జునః = అర్జునుడు; ఉవాచ = పలికెను; ఏవమ్ = ఈవిధముగా; యే = ఏ; భక్తాః = భక్తులు; సతతయుక్తాః = నిరంతరమగు అంకిత భావము గలవారై, త్వామ్ = నిన్ను; పర్యుపాసతే = ధ్యానించెదరో; చ = మరియు; యే అపి = ఎవ్వరైతే; అవ్యక్తమ్ = ఇంద్రియగోచరము కాని; అక్షరమ్ = అవినాశియగు (పరమాత్మను ఉపాసించెదరో); తేషామ్ = వారిలో; కే = ఎవరు; యోగవిత్తమాః = యోగవేత్తలలో శ్రేష్ఠులు.

అర్జునుడిట్లు పలికెను –

ఈ విధముగా నిన్ను సతతము అంకితభావముతో ఉపాసించువారు,
మరియు ఇంద్రియ గోచరము కాని అక్షర పరబ్రహ్మను ఉపాసించువారు
అను వారిద్దరిలో శ్రేష్ఠతమమగు యోగవేత్తలు ఎవరు? (1).

విశ్వరూపమును చూచిన పిదప తాను గాంచిన దృశ్యము ఆధారముగా అర్జునుడీ ప్రశ్నను వేయుచున్నాడు. అతడీ ప్రశ్నను వేయుటను బట్టి, విశ్వరూప సందర్శనము ఆతని సమస్యను పరిష్కరించలేదని నిరూపణ యగుచున్నది. ఆతనిలో ఇంకనూ భేదబుద్ధి గలదు. ఉపాసన చేయు కర్మయోగి గొప్పవాడా? లేక జ్ఞాని గొప్పవాడా? అను సంగతిని అర్జునుడు తెలియగోరెను. విశ్వరూపమును ధ్యానించువాడు కర్మయోగి. అక్షర పరబ్రహ్మను నిదిధ్యాసనము చేయువాడు సన్న్యాసి. కర్మయోగి సగుణ బ్రహ్మను, జ్ఞాని నిర్గుణ బ్రహ్మను ఉపాసించుచున్నారు. ఏది శ్రేష్ఠతరము? ఈ ప్రశ్నలో కొన్ని విశిష్టార్థములు అంతర్నిహితములై ఉన్నవి. వీరిద్దరిలో ఎవడు మహాత్ముడు? అనునది ప్రశ్న గాదు. వీరిద్దరిలో ఎవరు మోక్షమునకు దగ్గరలో నున్నారు? అని ప్రశ్నకు తాత్పర్యము.

ఏవమ్ అను పదము ఇంతకు ముందు వర్ణింపబడిన దానితో సంబంధమును కలుపును. పూర్వ శ్లోకములో భగవానుడు కర్మయోగిని గురించి 'మత్కర్మ కృత్' ఇత్యాదిగా వర్ణించెను. ఏవమ్ అను పదము ఆ వర్ణనను పరామర్శించుచున్నది. ఏవమ్ అని ప్రయోగించి అర్జునుడు శ్రీకృష్ణభగవానుని దృష్టిని 11వ అధ్యాయములోని అంతిమ శ్లోకములో చెప్పబడిన విషయము వైపునకు ఆకర్షించినాడు.

సతతమ్ అనగా ఎల్లవేళలా. యుక్తుడనగా అంకితమైనవాడు. వీరు ఈ తీరున ఎల్లవేళలా అంకితభావము గలవారై (ఏవం సతత యుక్తాః), కర్మల నన్నిటినీ భగవానుని కొరకు చేస్తూ, పూర్వశ్లోకములో వివరించిన విధంబున కర్మయోగమునకు అంకితమైన జీవనమును గడుపుచుందురు. వారు భక్తులే. ఏలయన, వారు ధర్మమును ఈశ్వర స్వరూపముగా గుర్తించి, కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేసెదరు. భగవానుడు తక్క ఇతరమగు ఆశ్రయము లేనివారు (అనన్యశరణాః) భక్తులని శ్రీ శంకరులు నిర్వచించిరి. అర్థార్థులగు ఇతరులు తమ పనులను సిద్ధింపజేసుకొనుటకై భగవానుని వాడుకొనెదరు. ధనము, అధికారము మొదలగు వాటియందు మాత్రమే వారి శరణము గలదు; ఈశ్వరుని యందు కాదు. కాని మోక్షమును గోరు భక్తులు

తమ శరణును ఈశ్వరుని యందు మాత్రమే దర్శించెదరు. వారికి ఈశ్వరుడే మోక్షము. కర్మను చేయుటయే గాక, వారు విశ్వరూపదర్శనములో చూపబడిన విధంబున సర్వాత్మకుడగు భగవానుని ధ్యానించెదరు (పర్యుపాసతే).

ఈ అధ్యాయములో అనేకములగు క్రొత్త విషయములు ప్రదర్శించబడును. కాని గీతలోని అధ్యాయములన్నింటిలో ఎక్కువ అపోహలకు ఆస్కారము నిచ్చునది ఈ అధ్యాయమే. గొప్ప సంస్కారము ఆధార భూమిగా గలవాడు మాత్రమే దీనిని సరియగు రీతిలో తెలుసుకొనగల్గును. ఉపాసన, ధ్యానము, కర్మ, యోగము, మరియు జ్ఞానము అనువాటి గురించి సరియగు కల్పన ఉన్నవానికి మాత్రమే ఇది అవగాహనకు వచ్చును. ఈ అధ్యాయములో ప్రస్తావించిన విషయములను ఇంతకు ముందు అధ్యాయములలో ప్రస్తావించుట సంభవము కాదు. ఏలయన పైన చెప్పిన విషయములనన్నిటినీ వివరించనిదే, ఈ అధ్యాయములోని విషయవస్తువు అవగాహనకు రాదు.

ధ్యానము చేయు కర్మయోగులు ఒక సముదాయము. మార్పులకు లోను గానిది (అక్షరమ్), దృశ్యరూపములో ఉపలభ్యము కానిది (అవ్యక్త), ఆత్మ స్వరూపమైనది అగు పరబ్రహ్మను ఉపాసించువారు రెండవ సముదాయము. ఈ రెండు సముదాయములలో మోక్షమునకు దగ్గరలో ఉన్నది ఎవరు? అను విషయమును అర్జునుడు తెలియగోరెను.

గీతలో సర్వత్రా పరబ్రహ్మ అక్షరమని వర్ణించబడును. న క్షరతి ఇతి అక్షరమ్. అపక్షయము (decline) లేనిది అక్షరమనబడును. గుణము లేనిది, సర్వోపాధి వినిర్ముక్తమైనది అగు బ్రహ్మము అవ్యక్తమనబడును. కాని గడచిన 10,11 అధ్యాయములలో పరబ్రహ్మ సగుణమని వర్ణింపబడినది. రెండు రకముల బ్రహ్మలు గలవా యేమి? లేవు. ఉన్నది ఒకే బ్రహ్మ. దాని స్వరూపము నిర్గుణము. అది సర్వ విశేష వినిర్ముక్తమగు శుద్ధచైతన్యము. మాయోపాధి ప్రభావముచే అది సగుణమగును. సగుణ బ్రహ్మకు గుణములు గలవు. నిర్గుణ బ్రహ్మకు గుణములు లేవు. భేదము ఇంతియే.

అవ్యక్తమనగా ప్రకటము కానిది, దృశ్యవస్తువు రూపములో ఉపలభ్యము కానిది. అవ్యక్తమనగా జగత్కారణమగు మాయ కావచ్చును. కాని ఇచట అవ్యక్తమనగా ఇంద్రియములకు గోచరము కానిది (అకరణ గోచరమ్) అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. మనకు అయిదు జ్ఞానేంద్రియములు, మనస్సు అనే అంతరింద్రియము గలవు. వీటిచే తెలియబడే వస్తువు కరణగోచరమనబడును. ఈ జ్ఞానేంద్రియములకు విషయము కానిది అకరణ గోచరమనబడును. అనగా దానిని తెలియుట అసంభవమని అర్థము కాదు. జ్ఞానేంద్రియములచే గ్రహింపబడదు అని

మాత్రమే దానికి అర్థము. నాకంటె భిన్నమైనది, నాచే వివిధ జ్ఞానసాధనముల ద్వారా తెలియబడునది అగు వస్తువు దృశ్యము అనబడును. కాని ఆత్మ నీ స్వరూపమే గనుక, దృశ్యవస్తువు కాదు. ఇట్లు దృశ్యరూపముగా ఉపలభ్యము కానిది ఏదైనా అవ్యక్తమే. శ్రీ శంకరులు ఈ పదముయొక్క వ్యుత్పత్తిని వివరించిరి. 'వ్యక్త' అను పదము అంజ్ అను ధాతువు నుండి పుట్టినది (వి+ అంజ్ = వ్యంజ్). ఈ పదమునకు కర్మయొక్క ఆకాంక్ష గలదు. కర్మ లేనిచో అది అవ్యక్త మగును. ఆత్మ దేనికీ దృశ్యము కాదు. అది సర్వదా ద్రష్ట. అవ్యక్తమనగా తెలియబడనిది అని అర్థము కాదు. దృశ్యము కానిది అని మాత్రమే అర్థము. ద్రష్టయొక్క స్వరూప భూత చైతన్యము సర్వకాలములలో అవ్యక్తమే.

నిర్గుణ బ్రహ్మోపాసకులగు సన్న్యాసులు గొప్పవారా? లేక కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తూ సగుణ బ్రహ్మోపాసన చేయు కర్మయోగులు గొప్పవారా? అనునది ఇచటి ప్రశ్న. వాస్తవంలో సర్వోత్కృష్టము అను అర్థమునిచ్చే 'తమ' ప్రత్యయము ప్రయోగింపబడినది. ఎవరు సర్వోత్కృష్టులు? ఈ సర్వోత్కృష్టత్వమునకు అర్థమేమి? మోక్షమునకు దగ్గరలో ఎవరు ఉన్నారు? అను విషయమును అర్జునుడు తెలియగోరెను.

సన్న్యాసి పూర్ణముగా జ్ఞానమునకు అంకితమై యుండును గాన గీతాశాస్త్ర దృష్టిలో సన్న్యాసి యనగా జ్ఞాని అనియే అర్థము. మరియు, జ్ఞాని నా స్వరూపమేనని (జ్ఞానీ తు ఆత్మా ఏవ మే మతమ్) శ్రీకృష్ణుడు చెప్పియున్నాడు. జ్ఞానిని కర్మయోగితో పోల్చుట సరిగాదు. సగుణ బ్రహ్మోపాసకులగు కర్మయోగులే శ్రేష్ఠతములని శ్రీకృష్ణుడు చెప్పబోవుచున్నాడు.

తరువాతి శ్లోకమునకు ఉపక్రమములో శ్రీ శంకరులు ఇట్లు వివరించిరి: అక్షర పరబ్రహ్మను నిదిధ్యాసనము చేయు జ్ఞానులకు అపరోక్షబ్రహ్మ సాక్షాత్కారము గలదు. వారు త్రివిధ కామనల నుండి విముక్తులైనారు. కావున ఈ పోలికలతో వారికి సంబంధము లేదు. వారు ఎప్పుడో సన్న్యాసులైనారు. 'వారు నేనే' అని భగవానుడు చెప్పియున్నాడు. కావున మనము వారి గురించి చర్చింపబనిలేదు. వారికి కర్మయోగులతో లేశమైననూ పోలిక లేదు. ఉపాసన చేయు కర్మయోగులను, ఉపాసనను ఎరుంగని కేవల కర్మయోగులతో పోల్చుటయే యుక్తి యుక్తముగ నుండును. కర్తవ్యమునకు, మరియు నిత్యము చేసే ఈశ్వరారాధనకు కర్మ యని పేరు. ధ్యానమునకు ఉపాసనయని పేరు. ఉపాసన కూడా ఆరాధనయే. కాని అది మానసిక ఆరాధన గనుక, ఉపాసనను కర్మకంటె భిన్నముగా పరిగణిస్తాము. కర్మయోగి ఈశ్వరార్పణ బుద్ధితో కర్మల నాచరించును. ఈశ్వరుడు కర్మల ఫలముల నిచ్చువాడనియు (కర్మఫలదాతా), కర్మనియతికి

ఆయన అధ్యక్షుడనియు (కర్మాధ్యక్షః) కర్మ యోగి గుర్తించును. ఈశ్వరుని గుర్తించి కర్మయోగి కర్మల నాచరించును. ఈ కర్మలు కాయికము గాని, వాచికము గాని కావచ్చును. కాని ధ్యానము ఇట్టి కర్మగాదు. క్రియ కేవలమానసికముగా నుండి, సగుణబ్రహ్మ విషయముగా గలది అయినప్పుడు, అది ధ్యానము అగును. కేవల మానసిక క్రియయే ధ్యానము అయ్యే పక్షములో మానసిక చింతకూడా ధ్యానము అగును గదా! కర్మకు, ధ్యానమునకు గల భేదమును స్పష్టపరుచుటకై, ధ్యానమనగా సగుణ బ్రహ్మవిషయ మానస వ్యాపారము అని నిర్వచింపబడినది. కర్మ, ఉపాసన అను రెండింటికి వ్యాపారము సమానమే. అగ్నిహోత్రానుష్ఠానములో సగుణ బ్రహ్మ విషయ వ్యాపారము గలదు. కాని భేదమేమనగా, ధ్యానములో ఈ వ్యాపారము కేవల మానసికము కాగా, వేదవిహిత కర్మలలో అట్లు గాదు. కావున ఉపాసన, ధ్యానము అను పదములు ఎక్కడ వచ్చినా, అవి మానస వ్యాపారమును నిర్దేశించును. తాము ఆచరించే నిత్యకర్మలను ఈశ్వరధ్యానముతో సముచ్చయము చేయు కర్మయోగులు ఇచట యుక్తతములు అని నిర్దేశింపబడెదరు.

జ్ఞానులగు సన్న్యాసులను ఇట్టి పోలికలలోనికి లాగరాదు. ఉదాహరణకు ఒక వ్యక్తి పట్ట భద్రుడు కావాలని కోరెననుకొనుడు. 'పట్ట భద్రులైనవారు అతనికంటె గొప్పవారు' అని మనము చెప్పజాలము. మనము ఇట్టి పోలికలకు వారిని దూరముగా నుంచెదము. సన్న్యాసి విషయములో కూడా పరిస్థితి ఇంతే. అక్షర పరబ్రహ్మ ఎంత గొప్పదియో, సన్న్యాసి కూడా అంత గొప్పవాడు. కావున తారతమ్య ప్రసక్తియే తల యెత్తదు. అది సర్వ మానవులు కోరే చరమ లక్ష్యము. అందువలననే సన్న్యాసులగు జ్ఞానులను అట్లు ఉండనిండు (తావత్ తిష్ఠంతు) అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. భగవానుడు వారిని గూర్చి తరువాత చెప్పగలడు.

ఈ రెండు రకముల కర్మయోగుల గురించి భగవానుడిట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 12, శ్లోకము 2:**

श्रीभगवानुवाच ।
मय्यावेश्य मनो ये मां नित्ययुक्ता उपासते ।
श्रद्धया परयोपेतास्ते मे युक्ततमा मताः ॥ २ ॥

శ్రీ భగవానువాచ
మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్త తమా మతాః (2).

శ్రీ భగవాన్ = శ్రీ భగవానుడు; ఉవాచ = పలికెను; యే = ఎవ్వరైతే; మనః = మనస్సును; మయి = నాయందు; ఆవేశ్య = లగ్నముచేసి; నిత్యయుక్తాః = నాతో నిత్యసంబంధము కలవారై; మామ్ = నన్ను; పరయా = సర్వశ్రేష్ఠమగు; శ్రద్ధయా = శ్రద్ధతో; ఉపేతాః = కూడినవారై; ఉపాసతే = ఉపాసన చేసెదరో; తే = వారు; యుక్తతమాః = మహోన్నతులని; మతాః = నా అభిప్రాయము.

శ్రీ భగవానుడిట్లు పలికెను

> ఎవ్వరైతే మనస్సును నాయందు లగ్నము చేసి, నాతో నిత్య సంబంధము గలవారై నన్ను పరమ శ్రద్ధతో ఉపాసించెదరో, వారు యుక్తతములు (మహోన్నతులు) అని నా అభిప్రాయము (2).

కర్మయోగులు తమ మనస్సును పరమేశ్వరునకు అంకితముచేసి ఆరాధించెదరని మనము గడచిన అధ్యాయములో చూచియున్నాము. యోగులకు మరియు మహాత్ములగు సమస్త దేవతలకు అధీశ్వరుడు, సర్వజ్ఞుడు, రాగద్వేషాది చిత్త క్లేశములచే ప్రతిబద్ధము కాని దృష్టి గలవాడు (విముక్త రాగాది క్లేశ తిమిర దృష్టిః) నగు పరమేశ్వరుని కర్మయోగులు భక్తితో ఆరాధించెదరని శ్రీ శంకరులు వివరించిరి. కంటిలో శుక్లములు ఏర్పడి చూపునకు ఆటంకము కలిగే వ్యాధికి తిమిర దృష్టి అని పేరు. ఈ వ్యాధి అంధత్వము కాదు. ఆ శుక్లములను తొలగించినచో, దృష్టిదోషము తొలగి పోవును. భగవానునకు తిమిర దృష్టి లేదని ఇచట వర్ణింపబడినది. దీని అర్థమేమనగా మనందరికీ గల దృష్టిదోషము ఆయనకు లేదని మాత్రమే. అవిద్యా (అజ్ఞానము), అస్మితా (అహంకారము), రాగము, ద్వేషము మరియు అభినివేశము (దేహాసక్తి) అనే అయిదు చిత్తక్లేశములు భగవానునకు లేవని యర్థము. ఈ అయిదు క్లేశములు మన దృష్టిని కలుషీకృతము చేయుటచే, మనము ఈశ్వరుని గుర్తించలేకున్నాము. ఇట్టి ఈశ్వరుని కర్మయోగులు ధ్యానించెదరు (ఉపాసతే).

వారు కర్మయోగులు గనుక గొప్ప శ్రద్ధ (పరా శ్రద్ధా) తో ధ్యానించెదరు. శ్రుతికి బద్ధుడై యుండుటయే శ్రద్ధ యనబడును. తెలిసినా, తెలియక పోయినా, వారు శ్రుతివచనము నందు

విశ్వాసము కలిగియుందురు. శ్రుతి చేయు ఉపదేశము తెలుసుకో దగినది అని వారు ఎరుంగుదురు. శ్రుతి సత్యత్వమును ఈ తీరున సత్యత్వస్థాపనకు పూర్వమే తత్కాలీనముగా (provisional) అంగీకరించుట శ్రద్ధ యనబడును. ఈ శ్రద్ధ ఎట్టిది? పరా. అనగా దృఢమైనది. దీనివలననే వారికి కొన్ని సందర్భములలో పూర్ణ పరిజ్ఞానము లేకపోయిననూ, కర్మలను ఉచిత రీతిలో నిర్వర్తించగల్గుదురు. నా అభిప్రాయములో (మే మతాః) వీరు నిశ్చితముగా చాల గొప్పవారు (యుక్తతమాః). వీరు మోక్షమునకు చాల దగ్గరలో నున్నారు.

అవ్యక్త అక్షర బ్రహ్మను నిదిధ్యాసనము చేయువారు ఈశ్వరుని కంటె అభిన్నులే అయినా, అర్జునుడు వారితో సమమగు స్థాయిలో ధ్యానమునకు పూనుకొనుట భగవానునకు సమ్మతము కాదు. అర్జునుడు కర్మయోగులను ఆదర్శముగా స్వీకరించినచో అది అతనికి హితకారి కాగలదు. కావుననే అయన ఈ కర్మయోగులు తనకు దగ్గరగా నున్నారని ప్రతిపాదించుచున్నాడు. కాళిదాసుని నాటకములను చదువవలెనా? లేక పిల్లల కొరకై కాళిదాసుని నాటకములను సంగ్రహించి కథారూపముగా వెలువరించిన పుస్తకమును చదువవలెనా? అని పది సంవత్సరముల వయస్సుగల బాలకుడు ప్రశ్నించినాడనుకొనుడు. పిల్లల పుస్తకమును చదువు మనియే మనము సలహా నీయవలెను. ఏలయన, అతనికి అది మాత్రమే ఉపయుక్తముగా నుండును. అది అతనికి అర్థమగును. అతడు దానినుండి కొంత జ్ఞానమును నేర్వగల్గును. ఇచట కూడ పరిస్థితి అదియే. ఈ రెండింటిలో ఏది గొప్పది? అని అర్జునుడు ప్రశ్నించుటను బట్టి అతడు కర్మయోగమునననుసరించుట ఆవశ్యకమని సూచితమగుచున్నది. అతనికి అదియే హితకారి యగును. కావుననే, ఉపాసకులగు కర్మయోగులే యుక్తతములని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా జ్ఞానులు తక్కువ వారని యర్థమా?

**అధ్యాయము 12, శ్లోకము 3:**

ये त्वक्षरमनिर्देश्यमव्यक्तं पर्युपासते ।
सर्वत्रगमचिंत्यं च कूटस्थमचलं ध्रुवम् ॥ ३ ॥

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ (3)

తు = కాని; యే = ఎవరైతే; అక్షరమ్ = అపక్షయము లేనిది; అనిర్దేశ్యమ్ =

ంపశక్యము కానిది; అవ్యక్తమ్ = దృశ్యరూపముగా ఉపలభ్యము కానిది; సర్వత్రగమ్ = ర్వవ్యాపకమైనది; అచింత్యమ్ = మనోవృత్తులకు విషయము కానిది; కూటస్థమ్ = మాయ పాధిగా గలది; అచలమ్ = కదలిక లేనిది; చ = మరియు; ధ్రువమ్ = శాశ్వతమైనది అగు రబ్రహ్మను; ఉపాసతే = ఉపాసించెదరో.

కాని ఎవరైతే అపక్షయము లేనిది, వర్ణింప శక్యము కానిది, దృశ్యరూపముగా ఉపలభ్యము కానిది, సర్వవ్యాపకమైనది, మనోవృత్తులకు విషయము కానిది, మాయ ఉపాధిగా గలది, కదలిక లేనిది, మరియు శాశ్వతమైనది అగు పరబ్రహ్మను ఉపాసించెదరో ... (3)

అధ్యాయము 12, శ్లోకము 4:

संनियम्येन्द्रियग्रामं सर्वत्र समबुद्धयः ।
ते प्राप्नुवन्ति मामेव सर्वभूतहिते रताः ॥ ४ ॥

సంనియమ్యేంద్రియ గ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః (4)

ఇంద్రియగ్రామమ్ = ఇంద్రియముల సముదాయమును; సంనియమ్య = చక్కగా నియంత్రించి; సర్వత్ర = అన్ని కాలములయందు; సమబుద్ధయః = ఒకే విధమగు మనస్సు గలవారై; తే = వారు; సర్వభూతహితే = సర్వప్రాణుల సురక్షయందు; రతాః = అభిరుచి గలవారై; మామేవ = నన్ను మాత్రమే; ప్రాప్నువన్తి = పొందెదరు.

ఇంద్రియముల సముదాయమును చక్కగా నియంత్రించి, అన్నికాలములయందు ఒకే విధమగు మనస్సు గలవారై, వారు సర్వప్రాణుల సురక్షయందు అభిరుచి గలవారై నన్ను మాత్రమే పొందెదరు (4).

ఈ ప్రశ్నలోని రెండవ భాగమునకు సమాధానము నిడుటలో శ్రీకృష్ణ భగవానుడు తన వక్తృత్వ కౌశలమును ప్రదర్శించినాడు. సన్న్యాసము ఏరికోరి ఎంచుకొనేది కాదనియు, అది తెలియదగిన జ్ఞానమనియు ప్రదర్శించుటకై శ్రీకృష్ణుడే పదములన్నిటినీ తన సమాధానములో

దర్శించి ప్రయోగించినాడు. ''బ్రహ్మను ఆరాధించు ఈ వ్యక్తులందరు నన్ను పొందెదరు. అక్షరుడను నేనే. అవ్యక్తము నేనే. అనిర్దేశ్యము కూడా నేనే. కావున వారు నేనే. ఈ పదముల అర్థము వారికి సాక్షాత్కరించిన నాడు వారు నన్ను సాక్షాత్కరించెదరు. ఈ సాక్షాత్కారములో వారికి, నాకు మధ్య భేదము సమసిపోవును.''

మోక్షమును గోరి సగుణ బ్రహ్మోపాసనను చేస్తూ కర్మయోగము ననుష్ఠించు వారు ఒక సముదాయము. నిర్గుణ పరబ్రహ్మకు అంకితమైనవారు రెండవ సముదాయము. వీరిలో ఎవరు గొప్ప? అని అర్జునుడు ప్రశ్నించెను. అనగా, మోక్షమునకు ఎవరు దగ్గరగా నున్నారు? శ్రీకృష్ణ భగవానుడిట్లు చెప్పెను. ''సగుణబ్రహ్మోపాసనను చేస్తూ, కర్మయోగ జీవనమును గడుపువారు యోగవిత్తములు.'' ఇట్లు సన్న్యాసులను పోల్చుట సంభవము కాదని భగవానుడీ శ్లోకములో ప్రదర్శించుచున్నాడు. లక్ష్యమగు భగవానునిలో ఐక్యమును పొందిన జ్ఞాని పోలికలకు అతీతుడు. అక్షరపర బ్రహ్మోపాసన చేయగలవారు సామాన్యవ్యక్తులు గాదు. ఈ కర్మయోగులు దేనిని సాధించుటకు యత్నించుచున్నారో, అది వారికి సిద్ధించియున్నది.

ఒకసారి అక్బరు దర్బారులో అర్జునుని ప్రశ్నవంటి ప్రశ్న తలయెత్తెను. భారతదేశములోని నదులలో ఏది మిక్కిలి పవిత్రమైనది? అందరు గంగ అనిరి. కాని గంగ కాదనియు, యమున అనియు బీర్‌బల్ చెప్పెను. గంగయే పరమ పవిత్రమైనది అని చెప్పే అనేక శాస్త్ర వచనముల నుదహరిస్తూ అందరు అతనిపై విరుచుకు పడిరి. అపుడాతడు ఇట్లు వాదించెను: 'మీరు గమనించుడు. నదులలో మిక్కిలి పవిత్రమైనది ఏది? అనునది ప్రశ్న. యమునా నదీ తీరముపై శ్రీకృష్ణుడు పుట్టి పెరిగెను. ఆయన సన్నిధిచే అది పవిత్రమయ్యెను. కావున నదులలో యమున పరమపవిత్రమైనది'. అపుడు 'గంగ మాట యేమి?' అని అతనిని గద్దించగా, 'గంగ నదియని చెప్పువారెవరు? గంగ జ్ఞానమే' అని అతడు బదులిడెను. గంగ నది కాదు గనుక, దానిని ఇతర నదులతో పోల్చరాదు.

అదే విధముగా, కర్మలను చేయు మానవులలో అనేకరకములు గలరు. కొందరికి ఈశ్వరునిపై విశ్వాసము లేదు. వారే నాస్తికులు. వారిలో నీతి బద్ధులు, నీతి బద్ధులు కానివారు అను రెండు రకములు గలరు. నీతి బద్ధులు నీతి విరోధుల కంటె శ్రేష్ఠమైనవారు. ఈశ్వరుని విశ్వసించి ఆరాధించే ఆస్తికులు గలరు. వారు కూడ కర్మలను చేయుదురు. ఒక విశిష్ట మానసిక పరిపక్వత గలవారు మాత్రమే ఈశ్వరుని గుర్తించ గల్గుదురు. కావున ఆస్తికులు నాస్తికుల కంటె

గొప్ప వారు. ఆస్తికులలో కొందరు ఆపద వచ్చినప్పుడు మాత్రమే ఈశ్వరుని జోలికి పోయెదరు. వారు ఆర్త భక్తులు. ఆపద వచ్చినప్పుడు మాత్రమే గాక, ఒక విశిష్ట కార్యమును సాధించవలసిన సందర్భములో కూడ భగవానుని శరణుజొచ్చే అర్థార్థి భక్తులు వారికంటె గొప్పవారు. మోక్షమును అనగా ఈశ్వరుని మాత్రమే గోరు కర్మయోగులు అర్థార్థుల కంటె ఇంకనూ గొప్పవారు. అట్టి కర్మయోగులలో కొందరు కర్మయోగ జీవనమును స్వీకరించుట మాత్రమే గాక, సగుణ బ్రహ్మోపాసనను కూడ చేయుదురు. వీరు సర్వోత్కృష్టులు (యోగవిత్తమాః). శ్రీకృష్ణ భగవానుడిచ్చిన సమాధానము ఇదియే.

భగవానుని దృష్టిలో సన్న్యాసులనగా జ్ఞానులు. ఈ శ్లోకములోని 'తు' అను పదము వారిని ఇతరులందరి నుండి వేరు చేసి చూపును. యే పర్యుపాసతే అనగా నిర్గుణ బ్రహ్మను ధ్యానించువారు. అనగా శ్రవణ మనన నిదిధ్యాసనములచే నిర్గుణ బ్రహ్మ జ్ఞానమునకు అంకితమైన వారు. ఆ బ్రహ్మ ఎట్టిది? అర్జునుడు రెండు విశేషణములను (అక్షర, అవ్యక్త) వాడినాడు. భగవానుడు ఆ పదములనే పునరావృత్తి చేసినాడు. అక్షరమనగా పరివర్తన శీలము కానిది. బ్రహ్మ మార్పులకు లోనుగాదు. సన్న్యాసులు అక్షరబ్రహ్మపై నిది ధ్యాసనమును చేసెదరు. బ్రహ్మ అవ్యక్తము. అనగా ఇంద్రియ గోచరమగు వస్తువు రూపములో ఉప లభ్యము కాదు. ఇట్టి స్థితిలో, బ్రహ్మను వర్ణించుట యెట్లు? బ్రహ్మను ఇదమిత్థముగా చూపించజాలము. బ్రహ్మ నిర్దేశింప శక్యము గానిది (అనిర్దేశ్యమ్). ఇందువలననే, అక్షర, అవ్యక్త ఇత్యాది విశేషణము లన్నియూ నిషేధ రూపములో నున్నవి. ఒక పదమునకు బ్రహ్మ విషయము కాదు (అశబ్దగోచరమ్) గనుక, దానిని వర్ణించుట శక్యము గాదని శ్రీ శంకరులు వివరించిరి. సర్వము బ్రహ్మము. బ్రహ్మ సర్వస్వతంత్రము. అట్టి బ్రహ్మను నిర్దేశించుటకు మనము ఏ పదమును వాడగలము? ఏ పదమును వాడినా, అది అపర్యాప్తము (inadequate) గనే ఉండును.

బ్రహ్మ సర్వమునకు అతీతమైనది (సర్వాతీతము) అను మాటయైననూ మనము చూచే జగత్తు అనే దృష్టికోణములో చెప్పినదియే. మనకు కళ్లయెదుట ఒక జగత్తు కానవచ్చుచున్నది గావ, బ్రహ్మ జగత్తునకు అతీతమైనది అని మనము అంటాము. వాస్తవంలో బ్రహ్మయందు జగత్తునకు అతీతముగ నుండుట అనేది ఏదీ లేదు. ఉన్నది బ్రహ్మ మాత్రమే. మనము వ్యావహారిక దృష్టి కోణములో మాత్రమే బ్రహ్మను వర్ణించు పదములను ప్రయోగించెదము. కాని వాస్తవంలో బ్రహ్మ ఒక శబ్దమునకు వాచ్యమగు అర్థరూపములో ఉపలభ్యమయ్యేది (శబ్దవాచ్యమ్) కాదు. కావున బ్రహ్మ అశబ్ద గోచరము. కాని పదము యొక్క లక్ష్యార్థ రూపములో అది శబ్దగోచరమగును.

ఇందువలననే, ఏ ప్రమాణమునకైననూ దృశ్యరూపముగా ఉపలభ్యము కానిదే అయిననూ, బ్రహ్మ సర్వోపనిషత్తులచే 'తత్త్వమసి' అను సిద్ధాంతరూపముగా నిరూపించబడుచున్నది అని వివేకచూడామణిలో వర్ణింపబడినది. దృశ్యము కాని బ్రహ్మ ఉపనిషద్వచనములచే మాత్రమే తెలియదగును. బ్రహ్మ చైతన్యరూపమగు ఆత్మయందు కానవచ్చునని తలంచుట సరిగాదు. మరియు 'బ్రహ్మ ఆత్మ యొక్క ఒక గుణము; ఇంతకు ముందు అది కానరాలేదు; ఇపుడు వేదాంతాధ్యయనము తరువాత కానవచ్చినది' అనుటయూ సరిగాదు. ఆధునిక చిత్రములలో పరిస్థితి ఇటులనే ఉండును. ముందుగా మనకు ఏవో కొన్ని రంగుల కలయిక మాత్రమే అనిపించును. కాని ఒక పర్వత గుహలో విశ్రమించుచున్న ఒక ప్రాణి ఆ చిత్రములో గలదని ఒక వ్యక్తి చెప్పినాడు. కాని అట్టి ప్రాణి ఏదియూ దానియందు కానరాలేదు. అపుడా చిత్రకారుడు ఆ ప్రాణి యొక్క ముక్కును చిత్రములో చూపించినాడు. ముక్కును మనము గుర్తుపట్టినాము. క్రమముగా ఇతర అవయవములు కానవచ్చినవి. పూర్ణచిత్రము కూడ కానవచ్చినది. మరియు పర్వతము కూడ కానవచ్చినది. చిత్రములోని ఒక అంశమును గుర్తించ గల్గినచో, పూర్ణచిత్రమును గుర్తించుట చాల సరళమగును. ఆత్మ విషయములో పరిస్థితి ఇది గాదు. ఆత్మను గురించి మనకు గల భ్రాంతధారణ నిషేధింపబడును. అపుడు సర్వ పరిచ్ఛేద వినిర్ముక్తమగు ఆత్మను మనము గుర్తించెదము.

కొన్ని వస్తువులను మనము వర్ణించలేము. కాని అవి మన అవగాహనకు వచ్చుచునే యుండును. దీనికి దృష్టాంతము తియ్యదనము. తియ్యదనము అనిర్దేశ్యము. జ్ఞానదేవతయగు సరస్వతి తన వాగ్మిత్వము నంతనూ ఉపయోగించిననూ తియ్యదనమును వర్ణింపజాలదు. తియ్యదనమును తెలుసుకునే ఉపాయమొక్కటియే గలదు. దానిని రుచి చూడవలెను. తియ్యదనమును వర్ణింప జాలము. కాని తియ్యదనము ఇంద్రియ గోచరమగు అనుభవాత్మక జ్ఞానము. బ్రహ్మ విషయములో పరిస్థితి ఇట్లు గాదు. ఏలయన, బ్రహ్మ ఇంద్రియములకు గాని, మనస్సునకు గాని గోచరము కాదు. బ్రహ్మ అనుభవములో విషయము కూడ కాదు. సర్వానుభవముల సారభూత స్వరూపమే బ్రహ్మ. బ్రహ్మ సర్వదా ఉండును. ఇట్టి స్థితిలో, ఆత్మయందు బ్రహ్మను దర్శించుట యెట్లు? ఆత్మయే బ్రహ్మ. ఆత్మ సర్వకాలములయందు బ్రహ్మ భిన్నము గనుక, నాకు ఇపుడు అనుభవములో ఏ 'నేను' గలదో, ఆ 'నేను' బ్రహ్మమే యగును. బ్రహ్మ ఒక విశిష్ట దేశములో విశిష్ట వస్తురూపములో కానరాదు. ఇప్పుడు నేను ఎరింగియున్న 'నేను' అనునదియే బ్రహ్మము అని గుర్తించవలెను. కావున బ్రహ్మ అనిర్దేశ్యము. అనగా బ్రహ్మ

శబ్దమునకు వాచ్యార్థము కాజాలదనియు, పదమునకు లక్ష్యార్థము అగుననియు తెలియవలెను. మనమీ తేడాను గుర్తించవలెను. ఏలయన, బ్రహ్మ సర్వథా శబ్దవాచ్యము గానిచో, శాస్త్రమునకు ప్రయోజనమేమి గలదు? శాస్త్రము యొక్క ప్రమాణ స్వరూపమును సరిగా ఎరుంగని వ్యక్తి, శాస్త్రము ఒక సిద్ధాంతము మాత్రమే ననియు, బ్రహ్మ అనుభవ గోచరమగుననియు నిష్కర్ష చేయును. కాని వాస్తవమేమనగా, బ్రహ్మ శాస్త్రములోని పదములచే వాచ్యార్థరూపములో గాక, లక్ష్యార్థరూపములో ప్రదర్శింపబడును. లక్ష్యార్థమనగానే, అది కేవలము వస్తువును పరోక్షముగా నిర్దేశించునే గాని, సాక్షాత్కార హేతువు కాజాలదు అను అపోహ కలుగ వచ్చును. కాని పదము యొక్క లక్ష్యార్థము అపరోక్ష జ్ఞానహేతువు కాగల్గును. 'తెల్లనిది పరుగెత్తు చున్నది (శ్వేతో ధావతి)' అను వాక్యము ఎవరిని ఉద్దేశించి ప్రయోగింపబడునో, ఆ వ్యక్తికి 'తెల్లని గుర్రము పరుగెత్తుచున్నది' అని తెలియును. ఈ వాక్యములో 'తెల్లనిది' అను పదమునకు లక్ష్యార్థము తెల్లని గుర్రము. ఈ లక్ష్యార్థము కలిగించు జ్ఞానము అపరోక్ష జ్ఞానమే గదా!

హరిః ఓం తత్సత్

श्रीगणेशाय नमः

ఒక లక్ష్యార్థమును ఉద్దేశించి పదమును ప్రయోగించినప్పుడు, మనకు ఆ అర్థము స్ఫురించుటకు ఒక క్షణము సమయము పట్ట వచ్చును. కాని తత్త్వమసి అను వాక్యములో ఆ ఇబ్బంది లేదు. ఇది సరళమగు వాక్యము. ఇది నీ గురించి నీకు గల అజ్ఞానమును తొలగించును. బ్రహ్మ ఒక పదార్థము కాదు. బ్రహ్మ నీవే. నీవు ఈ గ్రంథమును చదువ గల్గుటకు హేతువు అగు నీ ఆత్మయే బ్రహ్మ. కావున ఈ గ్రంథమును పఠించు వాడు బ్రహ్మ. పాఠకుడనగు నేను బ్రహ్మను అను గుర్తింపు శాస్త్రము నీకు కల్గునట్లు చేయును.

మరియు ఈ బ్రహ్మ ఏ ప్రమాణమునకైననూ దృశ్యరూపముగా వ్యక్తము కాదు (అవ్యక్తమ్). వేదాంత ప్రమాణము అవ్యక్త బ్రహ్మ యొక్క అపరోక్షజ్ఞానమును కలిగించును. కాని వేదాంత ప్రమాణము దానిని దృశ్యముగా చేయబోదు. ఇట్టి బ్రహ్మను సన్న్యాసులు నిదిధ్యాసనము చేసెదరు (అవ్యక్తం పర్యుపాసతే).

శ్రీ శంకరులు ఉపాసనా శబ్దమునకు సామాన్యార్థము నిచ్చిరి. ఉప అనగా సమీపమునందు, ఆసన అనగా కూర్చుండుట. సమీపమునందు కూర్చుండునది యేది? మనస్సు. దేనికి సమీపములో? ఉపాస్య వస్తువు ఏదైతే, దానికి సమీపములో. ఇచట తాత్పర్య మేమనగా, ఇది కేవల మానసిక క్రియ. ధ్యేయ వస్తువునకు మానసికముగా దగ్గరలో నుండుట, అనగా ధ్యేయ వస్తువుపై మనస్సును ఏకాగ్రము చేయుట ఉపాసనయనబడును. దానిని గూర్చి ఇంకనూ వివరిస్తూ, ఉపాసనను శాస్త్రోపదేశము నతిక్రమించకుండగా (యథాశాస్త్రమ్) చేయవలెనని శ్రీ శంకగులు చెప్పిరి. ఉపాసనలో శాస్త్రము ఉపదేశించిన అంశముల కంటె తక్కువ గాని, ఎక్కువ గాని ఉం డవు. శాస్త్రము నిరూపించిన పద్ధతికి అను రూపముగా ధ్యేయవస్తువుపై మనస్సును లగ్నము చేసిన సాధకుడు ధ్యేయవస్తువునకు చాల దగ్గరకు చేరును. దగ్గరకు చేరుట యనగా ధ్యేయ వస్తువును మానసికముగా దర్శించి, దానిపై మనస్సును ఏకాగ్రము చేయుట కంటె వేరు గాదు.

మనస్సులోని ఆలోచనలు నిరంతరంగా మారిపోతూ ఉంటాయి గనుక, మానసిక ప్రత్యక్షీకరణము (Visualisation) సరళము కాదు. ధ్యానములో సంతతముగా మనోవృత్తులలో ఉపాస్య వస్తువు మాత్రమే విషయమగు చుండును. దీనిని తైలధారతో పోల్చవచ్చును. తైలధారలో ఏ భాగమును పరికించినా ఒకే నూనె కానవచ్చును. అదే తీరున ధ్యానములో వృత్తులు

మారుచున్ననూ, ప్రతి వృత్తి యందు ఒకే ఒక ఉపాస్య వస్తువు విషయమగుచుండును. ఇట్టి సజాతీయ వృత్తి ప్రవాహము కొంత సమయము వరకు కొనసాగును.

ప్రత్యగాత్మ కంటె అభిన్నమగు పరం బ్రహ్మ ఇచటి ఉపాస్యము. సన్న్యాసులు 'అహం బ్రహ్మాస్మి' అని నిదిధ్యాసనము చేసెదరు. వారి దర్శనములో ఉపాస్యమగు బ్రహ్మ ప్రత్యగాత్మ కంటె వేరుగాదు. కావున వారు సత్య, జ్ఞాన, అనంత శబ్దములకు లక్ష్యార్థమగు పరం బ్రహ్మ యందు ఏకాగ్రమైన మనస్సుగలవారై కూర్చుండెదరు. అనిర్దేశ్యము మరియు అవ్యక్తమునగు అక్షరపరబ్రహ్మ ఆత్మకంటె భిన్నము కాదని వారు ధ్యానించెదరు. ఈ విశేషణములన్నియూ నిషేధరూపములే. మరియు ఆత్మ యొక్క స్వరూపమే పరబ్రహ్మ. సకారాత్మకమగు భాషలో పరంబ్రహ్మ సత్యం జ్ఞానం అనంతమే. ఈ పదములన్నియూ తెలిసినచో, పరబ్రహ్మ తెలియబడును. సన్న్యాసులు అట్టి పరబ్రహ్మను ధ్యానించెదరు (పర్యుపాసతే).

సన్న్యాసి విచారముచే మనస్సును పరబ్రహ్మపై ఏకాగ్రము చేయును. అతని దర్శనముల జ్ఞేయవస్తువే ధ్యేయవస్తువు అగును. దీనిని ఖచ్చితముగా ధ్యానము అనుటకు వీలు లేదు. ఏలయన, ఒక ఫలమును గోరి చేయు ధ్యానములో బ్రహ్మ విషయము కాబోదు. కావున ఇచట 'పర్యుపాసతే' అను పదమునకు అర్థము పూర్తిగా మారి పోవును. శాస్త్రవచనముల ద్వారా నిరూపింపబడిన జ్ఞేయ బ్రహ్మను మరల మనస్సులో దర్శించుట అని ఆ పదమునకు అర్థము. కావున శ్రవణము ఉపాసన యగును. మనన నిది ధ్యాసనములు కూడ ఉపాసన యగును. శ్రవణమనగా శాస్త్రమును తెలుసుకొనుట. సందేహములను తొలగించు కొనుటకు మననము సహకరించును. నిదిధ్యాసనము విరుద్ధ మానసిక ప్రవృత్తులను (విపరీత భావనా) తొలగించి, సాక్షాత్కారమునకు గల ఆటంకములను నిర్మూలించును. మరియు జ్ఞానములోని ఆనందమును ఆస్వాదించుటకు నిదిధ్యాసనము తోడ్పడును. ఈ సందర్భములో 'ఉపాసనా' అను పదము ఈ మూడింటినీ నిర్దేశించుచున్నది. కాని ఆ పదమునకు గల అర్థము వీటికంటె భిన్నమైనది. అయిననూ, పర బ్రహ్మపై మనస్సును ప్రతిష్ఠితము చేయుటలో ఒక విశిష్టమగు ఎరుక, మరియు గుర్తింపు (ప్రత్యయ) అవశ్యకమగును. కావున, ఈ అర్థములో 'ఉపాసనా' అను పదమును వాడుట యుక్తి యుక్తమే యగును. నిన్నటి తరగతిలోని విషయము బ్రహ్మ. ఈ రోజు తరగతిలోని విషయము బ్రహ్మ. రేపు కూడ విషయము బ్రహ్మయే. భోజనము చేయు సమయములోనైననూ సర్వము బ్రహ్మయే (బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః ......). సన్న్యాసి జీవించే తీరు ఎన్నులు ఇట్లుండును. అతడు దానిని గురించి ఆలోచించును (తచ్చింతనమ్); దానినే మాటలాడును (తత్కథనమ్); మరియు తనకు

తెలిసిన దానిని ఇతరులతో పంచుకొనును (అన్యోన్యం తత్ప్ర బోధనమ్). దీనికి బ్రహ్మాభ్యాసమని పేరు. ఇట్లు ఒకే తత్త్వమునకు పూర్ణముగా జీవితము అంకితమగుటచే, శ్రీకృష్ణుడు 'పర్యుపాసతే' అను పదమును ప్రయోగించినాడు. వారు సర్వకాలములలో ధ్యానించెదరు. సన్న్యాసి మాత్రమే ఇట్లు చేయగలడు. ఇతరులకు అనేక వ్యాసంగములుండును.

ఉపాసతే అను క్రియా పదమునకు పరి అను ఉపసర్గను జోడించుటచే, 'పూర్ణముగా అంకితమైన' అను అర్థము వచ్చును. సర్వజ్ఞత్వాది గుణములతో కూడియున్న సగుణ బ్రహ్మ ధ్యానము, లేదా భగవానుని ఒక విశిష్టరూపములో ధ్యానించుట అను అర్థములో ఉపాసనా అను పదమును సాధారణముగా ప్రయోగించెదరు. యథార్థమగు ధ్యేయవస్తువు సగుణ బ్రహ్మ మాత్రమే యగును. తద్భిన్నముగా అక్షర నిర్గుణ బ్రహ్మ తెలియబడవలెను (జ్ఞేయమ్). ఇట్టి నిర్గుణ పరబ్రహ్మను 'పర్యుపాసతే'. అనగా పరమాత్మను శ్రవణ మనన నిదిధ్యాసనముల ద్వారా తెలుసుకునే ప్రయత్నమును చేయుట అని యర్థము.

బ్రహ్మను బోధించు ఈ పదములన్నియు బ్రహ్మను ఇతర సజాతీయ బ్రహ్మల నుండి వేరు చేసి చూపించుట (distinguish) కొరకు గాదు. ఈ పదములు బ్రహ్మను నిర్వచించును. కావున ఇవి బ్రహ్మకు లక్షణములు. భాషా శాస్త్ర దృష్ట్యా ఇవి విశేషణములే అయినా, చేసే పని (స్వరూప నిరూపణము)ని బట్టి ఇవి లక్షణములగు చున్నవి. బ్రహ్మ అద్వితీయ మగుటయే దీనికి కారణము.

సర్వత్ర గచ్ఛతి ఇతి సర్వత్రగమ్. అన్ని స్థలములకు వెళ్లునది అని యర్థము. బ్రహ్మ సర్వత్రా ఉన్నది. బ్రహ్మ ఆకాశము వలె సర్వవ్యాపి (వ్యోమవద్ వ్యాపి) అని శ్రీ శంకరులు వివరించిరి. సృష్టిలోని సర్వము ఆకాశముచే వ్యాప్తమై యున్నది. కాని చైతన్యము ఆకాశముచే వ్యాప్తము కాదు. పైగా ఆకాశము చైతన్యముచే వ్యాప్తమగును. ఆకాశము యొక్క ఉనికి చైతన్య ఆత్మ యందు అనగా బ్రహ్మమునందు గలదు. కావున సర్వకారణమగు బ్రహ్మము కంటె భిన్నముగా ఏదీ లేదు. ఈ జగత్తు అంతయూ మిథ్యాభూతమగు కార్యము. ఆకాశము యొక్క ఉనికి కూడా చైతన్యము నందు మాత్రమే గలదు. ఆకాశము పూర్తిగా చైతన్యముపై ఆధారపడి యున్నది. ఆకాశము యొక్క ఉనికి మరియు అభావము కూడ పూర్తిగా చైతన్యముపై ఆధారపడి యున్నవి. కాని చైతన్య ఆత్మ కాలాకాశములతో సహా దేనిపైననూ ఆధారపడి లేదు. కావున అది సర్వ వ్యాపకము.

ఆత్మ మనోవృత్తులలో విషయము కాదు (అచింత్యమ్). బ్రహ్మను దృశ్యముగా చేయుట (objectification) సంభవము కాదు. సర్వదృశ్యవస్తువుల ఉనికికి ఆధారమైనది బ్రహ్మ. మనోవృత్తికి

బ్రహ్మ విషయము కాబోదు. ఆ మనోవృత్తి యొక్క స్వరూపమే బ్రహ్మ. కాని బ్రహ్మ మనోవృత్తి నిరపేక్షమగు ఉనికి గలది. వృత్తి స్వరూపమైయున్న బ్రహ్మ వృత్తిగోచరము కాబోదు. శ్రీ శంకరులిట్లు వివరించిరి: జ్ఞానేంద్రియములకు ఉపలభ్యమగు వాటిని మాత్రమే మనస్సు భావన చేయగలదు. కాని అక్షరపరబ్రహ్మ జ్ఞానేంద్రియములకు ఉపలభ్యము కాదు గనుక, మనోగోచరము కాదు. బ్రహ్మ జ్ఞానేంద్రియగోచరము కాకపోవుట మాత్రమే గాక, సాక్షికి కూడ ఉపలభ్యము గాదు. ఎందువలన? సాక్షియే బ్రహ్మ గనుక. ఏ విధంగా చూచినా బ్రహ్మ దృశ్యవస్తు రూపములో ఉపలభ్యము కానిచో, నేను బ్రహ్మను తెలియుట యెట్లు? తెలియబడేది ఏదైనా, ఘటాదికము వలె, ఆ వస్తువు వృత్తిలో విషయము కావాలి. వృత్తిలో విషయము కాకుండా వస్తువు యొక్క జ్ఞానము సంభవమే కాదు. తాత్పర్యమేమనగా, తెలియబడేది ఏదైనా, ఘటాదికము వలె, తెలియబడుట అను కారణముచే వృత్తిలో విషయము అయి తీరును. ఘటము మనచే తెలియబడును. అనగా ఘటము వృత్తిలో విషయమగును. ఇది సత్యమే. ఈ వ్యాప్తి (generalisation)ని బ్రహ్మవరకు పొడిగించినచో, బ్రహ్మ తెలియబడవలెను గనుక, వృత్తిలో విషయము కావలెను. మనము బ్రహ్మను తెలియవలసిన ఆవశ్యకత ఉన్నది గదా! లేనిచో, శాస్త్రమును పఠించుట యేల? బ్రహ్మ తెలియబడేది కానిచో, ఆధ్యాత్మిక సాధనల వెనుక పడుట యెందులకు? బ్రహ్మ జ్ఞానము ముక్తిదాయకము గదా! బ్రహ్మను తెలియుట సంభవము గానిచో, ఆ జ్ఞానము కొరకు నేను సాధన చేయుట ఎట్లు సంభవమగును? ఇది ఎట్లున్నదనగా- కుందేటి కొమ్ము వలన కేన్సరు వ్యాధి నయమగునని తెలిసినదనుకొనుడు. అది సత్యమే కావచ్చును. కాని కుందేటి కొమ్ము అను వస్తువు లేదు గనుక, నేను దాని కొరకు అన్వేషించుటను మొదలిడజాలను. అదే విధముగా బ్రహ్మ జ్ఞానము వలన సంసారము నుండి నాకు విముక్తి లభించును. కాని బ్రహ్మ అచింత్యము గనుక, జ్ఞాన విషయమై ఉపలభ్యమగుట లేదు. దానిని నేను ఎట్లు వెదకి పట్టుకొనవలెను?

అచింత్యము అనగా వృత్తిలో విషయము కాదు అని యర్థము. ఈ అర్థము నెరుంగుట చాల ముఖ్యము. బ్రహ్మ అచింత్యమే అయినా, వృత్తి యొక్క సార భూతస్వరూపము బ్రహ్మయే. అది ఆత్మరూపము గనుక, స్వయం ప్రకాశము. కావున నీవు నీ గురించి నీకు గల తప్పుధారణలను ప్రక్కన బెట్టిన చాలును. చేయవలసినది ఇంతే. ఆత్మ కంటితో చూడదగిన వస్తువు కాదు. ఆత్మ ద్రష్ట. కాని మనము అజ్ఞానముచే దృశ్యమునందు ఆత్మను ఆరోపించెదము. ఆ తప్పును సరిదిద్దుకోవాలి. 'నేను బ్రహ్మను' అను జ్ఞానమును ఉదయింప జేసే ఒక విశిష్ట వృత్తి గలదు. ఆ వృత్తి ఆత్మాకారమును పొందివేయుటచే ద్రష్టృ-దృశ్య సంబంధము లుప్తమగును.

జ్ఞానములన్నింటిలో ఒక జ్ఞాత, ఒక తెలియబడే వస్తువు, వాటి మధ్య ద్రష్టృ–దృశ్యభేదము ఉండును. కాని ఇచట అట్టి విభాగము లేదు. ఈ జ్ఞానములో జ్ఞాత అంతర్గతమై యున్నాడు. కాని దృశ్యరూపముగా కాదు. అదే సమయములో, అజ్ఞానమును వృత్తి మాత్రమే నశింప చేయగలదు గాన, వృత్తి కూడా ఆవశ్యకమగును. అజ్ఞానమును చైతన్యము నశింప చేయలేదు. చైతన్యము నశింప చేయగల్గినచో, నాకు అజ్ఞానము ఉండెడిది గాదు.

'స్వరూప జ్ఞానం న అజ్ఞాన విరోధి' అని ఎరుంగుట చాల ముఖ్యము. ఆత్మ స్వరూపమైన చైతన్యము, లేక నిర్విశేష జ్ఞానము అజ్ఞాన విరోధి కాదు. ఆత్మ విషయక అజ్ఞానమునకు గాని, ఇతర అజ్ఞానములకు గాని ఆత్మ చైతన్యము విరోధి గాదు. నాకు చీనా భాష రాదు. ఆ సంగతి నాకు తెలియును. కాని ఈ తెలివిడి ఆ అజ్ఞానమును ప్రభావితము చేయుట లేదు గదా! కావున మనకు గల ఆత్మ విషయక అజ్ఞానము నిరవధికముగా కొనసాగగలదు. కాని ఒక వృత్తి రూపములో ఉదయించే జ్ఞానము (వృత్తి జ్ఞానము) అజ్ఞాన విరోధి.

'మనసా ఏవ అను ద్రష్టవ్యమ్' అని చెప్పబడినది. అనగా, మనస్సుచే మాత్రమే తెలియదగును. కాని 'మనసా అచింత్యమ్ (మనస్సుచే చింతింప శక్యము గానిది)' అని కూడా చెప్పబడినది. ఈ రెండు వాక్యములను పరికించినచో 'మనస్సునకు గోచరము కాని బ్రహ్మను మనస్సుచే తెలియవలెను' అని చెప్పినట్లు తేలినది. దీని యర్థమేమి?

దానిని మనస్సుచే మాత్రమే తెలియవలెను. కాని దానిని తెలియ దగిన మనస్సు లేనే లేదు. దీనిలో విరోధము లేదు. దీనిని చక్కగా వివరించవచ్చును. ఇవి జపాన్‌లోని జెన్ బౌద్ధులు చెప్పే పరస్పర విరుద్ధ వచనములు వలె మన బుద్ధి శక్తిని కుంటుపరచుటకు ఉద్దేశించబడిన వచనములు గావు. ఈ వచనములు సత్యమును ప్రదర్శించుటకు ఉద్దేశింపబడినవి. ఆత్మ ద్రష్ట. కావున నీ ఆలోచనకు విషయము కాబోదు. కాని బ్రహ్మను తెలియాలంటే బ్రహ్మను గురించిన అజ్ఞానమును నశింపజేయు వృత్తి మనస్సులో ఉదయించి తీరవలెను. ఆ వృత్తి బ్రహ్మను ప్రకాశింప జేసేది కావక్కరలేదు. ఏలయన, సర్వవృత్తులను ప్రకాశింపజేయునది బ్రహ్మము మాత్రమే.

ఒక వస్తువును ప్రకాశింపజేయు సామర్థ్యము మనస్సునకు గలదు. వస్తువు తెలియాలంటే, మనస్సు యొక్క ఉపస్థితి అత్యావశ్యకము. మనస్సు లేనిచో రెండు వికల్పములు ఉండును. సర్వమును ఏకకాలములో తెలియుట మొదటిది. ఏమియూ తెలియకుండుట రెండవది. కాని మనము సర్వదా ఒక నిర్దిష్ట వస్తువును చూచెదము. కావున, మనకు వస్తువును ప్రకాశింపజేసే

హ్మ విషయము కాబోదు. ఆ మనోవృత్తి యొక్క స్వరూపమే బ్రహ్మ. కాని బ్రహ్మ మనోవృత్తి పేక్షమగు ఉనికి గలది. వృత్తి స్వరూపమైయున్న బ్రహ్మ వృత్తిగోచరము కాబోదు. శ్రీ కరులిట్లు వివరించిరి: జ్ఞానేంద్రియములకు ఉపలభ్యమగు వాటిని మాత్రమే మనస్సు భావన యుగలదు. కాని అక్షరపరబ్రహ్మ జ్ఞానేంద్రియములకు ఉపలభ్యము కాదు గనుక, మనోగోచరము దు. బ్రహ్మ జ్ఞానేంద్రియగోచరము కాకపోవుట మాత్రమే గాక, సాక్షికి కూడ ఉపలభ్యము దు. ఎందువలన? సాక్షియే బ్రహ్మ గనుక. ఏ విధంగా చూచినా బ్రహ్మ దృశ్యవస్తు రూపములో లభ్యము కానిచో, నేను బ్రహ్మను తెలియుట యెట్లు? తెలియబడేది ఏదైనా, ఘటాదికము ఆ వస్తువు వృత్తిలో విషయము కావాలి. వృత్తిలో విషయము కాకుండా వస్తువు యొక్క ము సంభవమే కాదు. తాత్పర్యమేమనగా, తెలియబడేది ఏదైనా, ఘటాదికము వలె, యబడుట అను కారణముచే వృత్తిలో విషయము అయి తీరును. ఘటము మనచే లియబడును. అనగా ఘటము వృత్తిలో విషయమగును. ఇది సత్యమే. ఈ వ్యాప్తి eralisation)ని బ్రహ్మవరకు పొడిగించినచో, బ్రహ్మ తెలియబడవలెను గనుక, వృత్తిలో ము కావలెను. మనము బ్రహ్మను తెలియవలసిన ఆవశ్యకత ఉన్నది గదా! లేనిచో, స్త్రమును పఠించుట యేల? బ్రహ్మ తెలియబడేది కానిచో, ఆధ్యాత్మిక సాధనల వెనుక పడుట దులకు? బ్రహ్మ జ్ఞానము ముక్తిదాయకము గదా! బ్రహ్మను తెలియుట సంభవము గానిచో, జ్ఞానము కొరకు నేను సాధన చేయుట ఎట్లు సంభవమగును? ఇది ఎట్లున్నదనగా– కుందేటి మ్ము వలన కేన్సరు వ్యాధి నయమగునని తెలిసినదనుకొనుడు. అది సత్యమే కావచ్చును. కాని ందేటి కొమ్ము అను వస్తువు లేదు గనుక, నేను దాని కొరకు అన్వేషించుటను మొదలిడజాలను. విధముగా బ్రహ్మ జ్ఞానము వలన సంసారము నుండి నాకు విముక్తి లభించును. కాని బ్రహ్మ చింత్యము గనుక, జ్ఞాన విషయమై ఉపలభ్యమగుట లేదు. దానిని నేను ఎట్లు వెదకి ట్టుకొనవలెను?

అచింత్యము అనగా వృత్తిలో విషయము కాదు అని యర్థము. ఈ అర్థము నెరుంగుట చాల ముఖ్యము. బ్రహ్మ అచింత్యమే అయినా, వృత్తి యొక్క సార భూతస్వరూపము బ్రహ్మయే. అది ఆత్మరూపము గనుక, స్వయం ప్రకాశము. కావున నీవు నీ గురించి నీకు గల తప్పుధారణలను ప్రక్కన బెట్టిన చాలును. చేయవలసినది ఇంతే. ఆత్మ కంటితో చూడదగిన వస్తువు కాదు. ఆత్మ ద్రష్ట. కాని మనము అజ్ఞానముచే దృశ్యమునందు ఆత్మను ఆరోపించెదము. ఆ తప్పును సరిదిద్దుకోవాలి. 'నేను బ్రహ్మను' అను జ్ఞానమును ఉదయింప జేసే ఒక విశిష్ట వృత్తి గలదు. ఆ వృత్తి ఆత్మాకారమును పొందివేయుటచే ద్రష్టృ-దృశ్య సంబంధము లుప్తమగును.

జ్ఞానములన్నింటిలో ఒక జ్ఞాత, ఒక తెలియబడే వస్తువు, వాటి మధ్య ద్రష్ట-దృశ్యభేదము ఉండును. కాని ఇచట అట్టి విభాగము లేదు. ఈ జ్ఞానములో జ్ఞాత అంతర్గతమై యున్నాడు. కాని దృశ్యరూపముగా కాదు. అదే సమయములో, అజ్ఞానమును వృత్తి మాత్రమే నశింప చేయగలదు గాన, వృత్తి కూడా ఆవశ్యకమగును. అజ్ఞానమును చైతన్యము నశింప చేయలేదు. చైతన్యము నశింప చేయగల్గినచో, నాకు అజ్ఞానము ఉండెడిది గాదు.

'స్వరూప జ్ఞానం న అజ్ఞాన విరోధి' అని ఎరుంగుట చాల ముఖ్యము. ఆత్మ స్వరూపమైన చైతన్యము, లేక నిర్విశేష జ్ఞానము అజ్ఞాన విరోధి కాదు. ఆత్మ విషయక అజ్ఞానమునకు గాని, ఇతర అజ్ఞానములకు గాని ఆత్మ చైతన్యము విరోధి గాదు. నాకు చీనా భాష రాదు. ఆ సంగతి నాకు తెలియును. కాని ఈ తెలివిడి ఆ అజ్ఞానమును ప్రభావితము చేయుట లేదు గదా! కావున మనకు గల ఆత్మ విషయక అజ్ఞానము నిరవధికముగా కొనసాగగలదు. కాని ఒక వృత్తి రూపములో ఉదయించే జ్ఞానము (వృత్తి జ్ఞానము) అజ్ఞాన విరోధి.

'మనసా ఏవ అను ద్రష్టవ్యమ్' అని చెప్పబడినది. అనగా, మనస్సుచే మాత్రమే తెలియదగును. కాని 'మనసా అచింత్యమ్ (మనస్సుచే చింతింప శక్యము గానిది)' అని కూడా చెప్పబడినది. ఈ రెండు వాక్యములను పరికించినచో 'మనస్సునకు గోచరము కాని బ్రహ్మను మనస్సుచే తెలియవలెను' అని చెప్పినట్లు తేలినది. దీని యర్థమేమి?

దానిని మనస్సుచే మాత్రమే తెలియవలెను. కాని దానిని తెలియ దగిన మనస్సు లేనే లేదు. దీనిలో విరోధము లేదు. దీనిని చక్కగా వివరించవచ్చును. ఇవి జపాన్‌లోని జెన్ బౌద్ధులు చెప్పే పరస్పర విరుద్ధ వచనములు వలె మన బుద్ధి శక్తిని కుంటుపరచుటకు ఉద్దేశించబడిన వచనములు గావు. ఈ వచనములు సత్యమును ప్రదర్శించుటకు ఉద్దేశింపబడినవి. ఆత్మ ద్రష్ట, కావున నీ ఆలోచనకు విషయము కాబోదు. కాని బ్రహ్మను తెలియాలంటే బ్రహ్మను గురించిన అజ్ఞానమును నశింపజేయు వృత్తి మనస్సులో ఉదయించి తీరవలెను. ఆ వృత్తి బ్రహ్మను ప్రకాశింప జేసేది కానక్కరలేదు. ఏలయన, సర్వవృత్తులను ప్రకాశింపజేయునది బ్రహ్మము మాత్రమే.

ఒక వస్తువును ప్రకాశింపజేయు సామర్థ్యము మనస్సునకు గలదు. వస్తువు తెలియాలంటే, మనస్సు యొక్క ఉపస్థితి అత్యావశ్యకము. మనస్సు లేనిచో రెండు వికల్పములు ఉండును. సర్వమును ఏకకాలములో తెలియుట మొదటిది. ఏమియూ తెలియకుండుట రెండవది. కాని మనము సర్వదా ఒక నిర్దిష్ట వస్తువును చూచెదము. కావున, మనకు వస్తువును ప్రకాశింపజేసే

(వ్యంజకత్వ) సామర్థ్యము గల మనస్సు ఉన్నదని స్పష్టమగుచున్నది. ఒక నిర్దిష్ట వస్తువును తెలియుటకై ఆ మనస్సు ఒక విశిష్టమగు వికారమును పొందవలెను. కాని ఆత్మ విషయములో పరిస్థితి ఇది గాదు. ఏలయన, ఏ చైతన్య ప్రకాశములో మనస్సు మనన సమర్థమగు చున్నదో, అది ఆత్మ చైతన్యమే. కావున, ఆత్మను దర్శించుటకు జ్ఞానసాధనము (ప్రమాణము) వలన పుట్టే మనోవృత్తితో పనిలేదు. వాస్తవంలో మనోవృత్తిని ప్రకాశింపజేసేది ఆత్మయే. ఆత్మ సదా స్వయం ప్రకాశము. స్వయం ప్రకాశ స్వరూపుడవగు నీ ఉనికిని నిరూపించబనిలేదు. ఆత్మ యొుక్క ఉనికిని కూడా నిరూపించాలంటే, ఎవరిముందు నిరూపించవలెను? మరియొక ఆత్మ లేదు. ఈ సృష్టిలో స్వయంప్రకాశతత్త్వము ఆత్మ ఒక్కటియే. ఇతరము సర్వము తన ఉనికిని నిరూపించుట కొరకై ఆత్మచే ప్రకాశింప చేయబడవలెను. ఆత్మ స్వయం ప్రకాశము. ఇతర ప్రకాశములతో దానికి పనిలేదు. సర్వమును ప్రకాశింప జేయునది ఆత్మయే. స్వయం ప్రకాశ మగు ఆత్మ సత్య జ్ఞానానంతమగు బ్రహ్మము కంటె వేరు గాదని మనము తెలియ జాలకున్నాము. ఈ అజ్ఞానమును తొలగించిన చాలును. అజ్ఞాననివృత్తి జరిగే చోటు మనస్సు. కావున మనస్సుచే తెలియనగును అని చెప్పుట యుక్తి యుక్తమే. అదే సమయములో, ఆత్మ మనస్సుచే తెలియబడు వస్తువు గాదు. ఇట్టి విరోధాభాసలు మన బుద్ధికి విషయ వస్తువును ప్రకాశింప జేయుటకై ఉద్దేశింపబడినవే గాని, మన ఆలోచనాశక్తిని స్తంభింప చేయుట కొరకు గాదు.

కూటస్థమ్. కూట శబ్దమునకు గల అసత్యము అనే ప్రసిద్ధమైన అర్థమును స్వీకరించి శ్రీ శంకరులీ పదమును వ్యాఖ్యానించిరి. ఉదాహరణకు, కూటరూపమ్ అనగా అసత్యరూపము. కూటసాక్ష్యమ్ అనగా అసత్య సాక్ష్యము. పై పైన చూచినప్పుడు ఒక విధంగా కనబడి, లోతుగా పరిశీలించినపుడు మరియొకటి తేలే వస్తువునకు కూట రూపకమ్ అని పేరు. అనగా తప్పు రూపములో కానవచ్చునది. సాక్ష్యము నిచ్చేటప్పుడు సత్యమే అనిపించినమూ, వాస్తవంలో అది సత్యదూరమైనచో, దానికి కూట సాక్ష్యమని పేరు.

కూటమునందు ప్రతిష్ఠితమై యుండునది కూటస్థమనబడును (కూటే తిష్ఠతి ఇతి కూటస్థః). ఇచట కూటమనగా మాయ. మాయకు వెనుక ఉంటూ, మాయకు సాక్షిగా ఉండే ఆత్మ కూటస్థమగును. శ్వేతాశ్వతరోపనిషత్తు (4.10) లో ఇట్లు చెప్పబడినది : మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్. అనగా సర్వమునకు అవ్యవహితకారణము మాయ అనియు, ఈ మాయను వశము చేసుకొని చెలాయించు వాడు ఈశ్వరుడనియు తెలియవలెను. సర్వకారణమగు మాయ సర్వవ్యాపకమగును. కాని బ్రహ్మకంటె భిన్నముగా దానికి ఉనికి లేదు.

అనగా బ్రహ్మ సర్వవ్యాపకము అయి తీరవలెను. బ్రహ్మ కంటె భిన్నమగు ఉనికి మాయకు లేదు గాన, చరమకారణము బ్రహ్మ యగును. మాయ సత్యమా యన్నట్లు కన్పట్టును. కాని పరిశీలించి చూచినచో, దానికి ఉనికి లేదు. అది కూటము. దానికి అవ్యాకృతమనియూ పేరు గలదు. అనగా విభిన్న నామరూపములుగా ప్రకటము కానిది. 'నా మాయను దాటుట చాల కష్టము (మమ మాయా దురత్యయా)' అని ఈశ్వరుడు స్వయముగా చెప్పి యున్నాడు. కూటమగు అట్టి మాయయందు బ్రహ్మ ఉన్నాడు (కూటే స్థితం కూటస్థమ్). 'మాయయందు (కూటే)' అను సప్తమీ విభక్తిని మనమిచట జాగ్రత్తగా తెలియవలెను. 'కుండయందు నీరు గలదు' అన్నప్పుడు కుండ ఆధారము; నీరు ఆధేయము. అదే విధముగా 'బ్రహ్మ మాయయందు గలదు' అన్నప్పుడు మాయ ఆధారము, బ్రహ్మ ఆధేయము అగునా? బ్రహ్మ మాయపై ఆధారపడి యున్నచో, బ్రహ్మ నామ రూపాత్మకమై, సృష్టిలోని వస్తువులలో ఒకటి యగును. కావున ఇచట అర్థమేమనగా, సర్పము నందు త్రాడు వలె, బంగరు గొలుసునందు బంగారమువలె, కూటము (మాయ) నందు బ్రహ్మ అధ్యక్ష రూపములో (అధిష్ఠాన) ఉపలభ్యమగుచున్నది.

శ్రీ శంకరులీ పదమును మరియొక విధముగా వ్యాఖ్యానించిరి. గ్రహరాశి చక్రము నందలి రాశికి కూటమని పేరు. గ్రహములు పరిభ్రమిస్తూ ఉన్నా, వాటి వాటి రాశులు స్థిరముగా నుండును. నిశ్చలముగా నుండే ఈ రాశుల (తారామండలముల) దృష్టికోణము నుండి గ్రహముల పరిభ్రమణములు పరిశీలింపబడును. గ్రహచలనములను లెక్క కట్టుటకు స్థిరమగు మూలాధారముగా రాశి స్వీకరింపబడును. అదే తీరున, నిరంతర పరివర్తన శీలమగు మాయ యొక్క స్థిరమూలాధారము బ్రహ్మము. బ్రహ్మమును ఆధారముగా చేసుకొని మాయ పరివర్తన చెందుచుండును.

కూటమనగా కమ్మరివాని దాగలి అని కూడ మరియొక అర్థము గలదు. కూటవత్ తిష్ఠతి ఇతి కూటస్థమ్. కూటము వలె నుండును గాన కూటస్థ మనబడును. కమ్మరి ఇనుప ముక్కలను కాల్చి దాగలిపై నుంచి సుత్తితో కొడుతూ విభిన్నమగు ఆకారములుగా మలచును. కాని ఆ దాగలిలో మార్పు రాదు. కాని ఇనుప ముక్కలో వచ్చే మార్పులన్నిటికీ అది ఆధారముగా, మార్పులకు సహకరించును. అటులనే కూటస్థ-ఆత్మ మాయకు ఆధారముగా నుండును. అది సర్వవ్యాపకము గాన చలనము లేనిది. న చలతి ఇతి అచలః. అది వెళ్ళదగిన ప్రదేశమేదియూ లేదు. ఆత్మ కూటస్థము గనుక, మార్పులకు లోనుగాదు. కావున అది శాశ్వతము, ధ్రువము అగుట సహజమే. దేశకాలములచే పరిచ్ఛిన్నము కాని ఆత్మ సదా ఏకరూపము (నిత్య)గా నుండును.

మరియు అక్షర బ్రహ్మోపాసకు లేమి చేసెదరు? వారికి లభించు ఫలమేమి?

బ్రహ్మను గురించి చేసే నిదిధ్యాసనము అక్షర బ్రహ్మోపాసనలో అంతర్భాగముగ నుండును. దీనికి ఒక విశిష్ట మనోనియంత్రణ ఆవశ్యకమగును. సన్నియమ్య ఇంద్రియ గ్రామమ్ అనగా ఇంద్రియముల సముదాయముపై పూర్ణమగు నియంత్రణను కలిగియున్నవాడై. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు మరియు మనస్సు కలిసి ఇంద్రియ గ్రామమగును. ఇచట సన్నియమ్య అనగా జ్ఞానేంద్రియముల మరియు కర్మేంద్రియముల అను శాసనము (దమము) మాత్రమే గాక, వ్యక్తికి తన భావావేగములపై మరియు ఆలోచనాధోరణులపై గల విశిష్టమైన నియంత్రణ (శమము) అని కూడ అర్థము వచ్చును. అక్షర పరబ్రహ్మను నిదిధ్యాసనము చేయుటకు అంతరంగ ప్రసన్నత అత్యావశ్యకము. మనము అట్టి నిదిధ్యాసనమును గురించి చర్చించుచున్నాము గనుక, శమమును కూడ జోడించవలెను. ఉన్నదానితో సంతుష్టి జెంది, అనుశాసనయుతమగు జీవితమును గడుపుతూ విశిష్ట జీవన మూల్యములను, మనః ప్రవృత్తులను అలవరచుకున్న వ్యక్తికి మాత్రమే శమము సంపన్నమగును. శమము నుండి అలవడే అనేక లక్షణములలో సర్వప్రాణుల యెడ సమబుద్ధిని కలిగి యుండుట (సర్వత్ర సమబుద్ధిః) ఒకటి.

ఈ లక్షణములను కలిగి యుండి అక్షరబ్రహ్మను ఉపాసించువారు నన్ను మాత్రమే పొందెదరని (తే ప్రాప్నువంతి మాం ఏవ) భగవానుడు చెప్పుచున్నాడు. సర్వవ్యాపకుడు, సర్వవస్తువులతో సర్వదా సంబద్ధుడై ఉండువాడు (సర్వత్రగ), సర్వమునకు అధిష్ఠానమైన వాడు (కూటస్థ), మరియు చలనము లేనివాడు (అచల) అని పూర్వశ్లోకములో వర్ణింపబడిన భగవానుని వారు పొందెదరు.

ఈ పదములు వారి సాధన యొక్క సారస్వరూపమును వర్ణించును. కాని వారు ఇంకనూ తమ తమ జీవితములను గడుపవలసి యున్నది. వారు సర్వకాలములలో కూటస్థ–ఆత్మను గురించి మాత్రమే ఆలోచించెదరని భావించరాదు. వారు జనులతో వ్యవహరించవలెను. వారు సన్న్యాసులే. కాని వారికి ఎదురయ్యే పరిస్థితులు అన్నీ ఉల్లాసకరముగా నుండబోవు. వారు అక్షర బ్రహ్మకు అంకితమైన వారే. అయినా, వారింకనూ ప్రపంచమును ఎదుర్కొనవలసి యున్నది. సన్న్యాసి విభిన్న పరిస్థితులను ఎదుర్కొనుచూ, స్థూలదేహమును రక్షించుకొనవలెను. సన్నియమ్యేంద్రియగ్రామమ్ అను ప్రయోగము వివిధ పరిస్థితులలో అతని ప్రతిస్పందనమ నిర్దేశించుచున్నది.

సర్వత్ర అనగా అన్ని స్థలముల యందు అనిగాని, అన్ని కాలములలో అనిగాని అర్థమును

చెప్పబడుచున్నను. పరిస్థితులు ఎట్లున్ననూ (సర్వత్ర), వీరు సమానమైన మానసిక స్థితిని, నియంత్రణము కలిగియుందురు (సమబుద్ధయః). జీవితములోని విభిన్నపరిస్థితులలో మనస్సుయొక్క ప్రతిక్రియలు విభిన్నముగా నుండును. మార్పు మనస్సునకు స్వభావము. కావున ఆలోచనలు, మనః ప్రవృత్తులు మరియు మనోదశలు నిరంతరముగా మారిపోతూ యుండును. ఒక విశిష్ట పరిస్థితి మనస్సునకు క్షోభను కలిగించును. ఇంకొక పరిస్థితి మనస్సును ప్రఫుల్లము చేయును. మరొక పరిస్థితి చిరాకును, క్రోధమును కలిగించును. మానవులందరి భాగధేయము ఇటులనే యున్నది. కాని కర్మయోగ జీవనము యొక్క అనుశాసనమును పాటించిన వ్యక్తులు మనస్సు యొక్క అల్లరిచిల్లరి వేషములకు అధీనులు కారు. పరిస్థితి ఎట్లున్ననూ, వారు మనోనియంత్రణమును ప్రసన్నతను నిలబెట్టుకొనెదరు. మనస్సు ఆలోచించే తీరుతెన్నులు అనేక రకములుగా నున్నవి. కాబట్టి అవి సమస్యలను వేటిని సృష్టించలేవు. ప్రతిక్రియకు అధీనుడై యుండుట యందు మాత్రమే సమస్యకు మూలము నిహితమై యున్నది. ప్రార్థనా మయమగు జీవితమును గడుపుతూ, రాగద్వేషములను ప్రభావహీనములుగా చేసుకున్నవారు 'సర్వత్ర సమబుద్ధయః' అను వర్ణనకు అర్హులగుదురు. కర్మయోగమ్ము యొక్క ప్రత్యేకలక్షణము ఈశ్వరార్పణబుద్ధి. దీనివలన వ్యక్తి సాపేక్షికమగు మనోనియంత్రణ (సమ బుద్ధి)ను సంపాదించగల్గును.

మరియు వారి ప్రతిస్పందనను పరిశీలించినచో, వారు సర్వప్రాణుల క్షేమమునందు ఆనందమును పొందెదరు (సర్వభూతహితే రతాః). దీనికి చాల పరిపక్వత కావాలి. సాధారణంగా మానవుడు ఇతరుల సంక్షేమమును గాంచి ఆనందించలేడు. కాని వీరియందు అట్టి సంకుచిత భావము లేశమైననూ లేదు. పైగా వారిలో దయాగుణము గలదు. వారు ఇతరుల సంక్షేమమును గాంచి ఆనందించుట మాత్రమే గాక, దానిని సాధించుటకు శ్రమించెదరు. వీరు తమంత తాముగా రంగములోనికి దిగి ఒక వ్యక్తికి కావలసిన సాహాయ్యమును చేయక పోవచ్చును. కాని వారు అట్టి సాహాయ్యమును ఏర్పాటు చేయుటలో చేతనైన యత్నమును చేసెదరు. మరియు వారు సహజధోరణిలో ఇతరుల సంక్షేమము కొరకు భగవంతుని ప్రార్థించెదరు. అట్టి ప్రార్థనయే ఆ వ్యక్తిని సర్వభూతహితమునందు రతునిగా చేయును. ఇట్టి వ్యక్తులు పరిణతమైన, దయాపూర్ణమైన జీవితమును గడిపెదరు. నిదిధ్యాసనమునకు అవశ్యకమగు మనస్సు సంపన్నమగుటకు ఇట్టి జీవితము అతి ప్రముఖమైనది.

సాధకుడు ఈ లక్షణములను అలవర్చుకొనవలెనని నిర్దేశించుటకై భగవానుడు వాటిని ప్రస్తావించుచున్నాడు.

1918

అక్షర పరబ్రహ్మను తెలుసుకొని వారు నన్ను మాత్రమే పొందెదరు (తే మాం ఏవ ప్రాప్నువంతి) అని భగవానుడు చెప్పుచున్నాడు. లేదా ఈ 'ఏవ' అను పదమును ప్రక్కకు జరిపి, వారు మాత్రమే నన్ను పొందెదరు (తే ఏవ మాం ప్రాప్నువంతి) అని చెప్పవచ్చును. వారు కర్మయోగ జీవనమును గడిపి యున్నారు. కావున 'నన్ను' తెలుసుకొని, తద్ద్వారా 'నన్ను' పొందుటకు కావలసిన అంతఃకరణ శుద్ధి తగు పరిమాణములో వారి వద్ద గలదు. ఇట్టి వారు మాత్రమే (తే ఏవ) ఎట్టి ఆటంకములు గాని, జారి పోవుట గాని లేకుండగా, జ్ఞానము ద్వారా అక్షర బ్రహ్మమును పొందెదరు. వారికి పరిపక్వమగు వివేకము కలదు గాన, వారు 'నన్ను' పొందకుండగా ఏదీ ఆపలేదు. కావున వారిని గురించి చెప్పదగినది ఏదియూ లేదు (న తు తేషాం వక్తవ్యం కించిత్) అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి.

వారు నన్ను పొందెదరని చెప్పుటయూ అర్థరహితమే. ఏలయన, పొందుట అను ప్రసక్తి యేమున్నది? జ్ఞానమునకు, ప్రాప్తికి మధ్యలో వ్యవధానము గలదా యేమి? లేదు. 'నన్ను' ఎరింగినవాడు నిశ్చయముగా నేనే అని నా అభిప్రాయము (జ్ఞానీ తు ఆత్మైవ మే మతిః) అని భగవానుడు ఇంతకు ముందే చెప్పి యున్నాడు. దీనికి భిన్నముగా నుండజాలదు. కావున విశ్వరూపధ్యానమును చేయు కర్మయోగులతో వీరిని పోల్చరాదు. అక్షర పరబ్రహ్మోపాసకులు నా స్వరూపమే గనుక, 'మోక్షమునకు దగ్గర, దూరము' అను అంశములో వారు పోలికకు అతీతులు. వారు ఇప్పటికే ముక్తులై యున్నారు. ఇందువలనే 'వారి గురించి వ్యాఖ్యానించవలసినది ఏదియూ లేదు' అని శ్రీ శంకరులు నుడివినారు.

ఇట్టి స్థితిలో సగుణ బ్రహ్మోపాసకులగు కర్మయోగులు యుక్తతములని చెప్పి, మరల 'అక్షర బ్రహ్మోపాసకులగు సన్న్యాసులు నన్ను పొందెదరు' అని భగవానుడు చెప్పుటకు కారణమేమి? కర్మయోగులు యుక్తతములు అని భగవానుడు చెప్పినమా, 'వారు నన్ను చేరెదరు' అని ఆయన చెప్పలేదు. భగవత్ప్రాప్తి కొరకు చేయు సాధనకంటె భగవత్ప్రాప్తి తక్కువదియా? కర్మయోగులకు యుక్తతములనే ముద్దుపేరు పెట్టి, వారి కర్మయోగవు పాట్లకు వారు వదలి వేయబడగా, ఇతరులు ప్రశాంతముగా భగవానుని గూడి యున్నారు. చాల కష్టపడిననూ, వారు భగవానుని ఇంకనూ చేరుట లేదు. దీనికి భిన్నంగా, చెట్టు క్రింద కులాసాగా కూర్చుండే సన్న్యాసులు సర్వమును పొందుచున్నారు. ఈ విధముగా కానవచ్చే అన్యాయమునకు కారణమేమి?

భగవానుని పొందవలసినవారు అనే దృష్టికోణంలో చూస్తే, సగుణ బ్రహ్మోపాసన చేయు కర్మయోగులు యుక్తతములు అగుదురు. ఈ శ్లోకములో వర్ణించిన లక్షణములు దృఢమగు

కర్మయోగము లేనిదే అభ్యేవి కావు. ఇవి ఉన్న వ్యక్తి ఇంచుమించు జ్ఞానియని చెప్పవచ్చును. పరిస్థితి ఏదైనా చికాకు పడకుండా ఎల్లవేళలా ప్రసన్నముగా నుండు వ్యక్తి ఎక్కడ గలడు? కావున సాధన చేయు వ్యక్తులలోని అధికారిత్వమును బట్టి, వీరు యుక్తతములనబడినారు.

కొంతదూరము వెళ్లవలసియున్నది. సైకిలు మరియు ఎద్దుబండి లభ్యముగా నున్నవి. ఏది మంచి సాధనము? అది అనేక విషయములపై ఆధారపడియుండును. ఈ ప్రశ్నను వేయు వ్యక్తి కుంటివాడు గాని సైకిలు తొక్కుట చేతగాని వాడు గాని అయినచో, ఎద్దు బండి కంటె సైకిలు వేగము అధికమే అయినా, అది ఆతనికి నిరుపయోగము. ఆతనికి ఎద్దుబండియే మంచిది. అది కూడా మరల పరిస్థితులపై ఆధారపడి యుండును. రెండు అడుగులు వెడల్పు మాత్రమే గల కొండబాటయైనచో, సైకిలు మరియు ఎడ్లబండి రెండూ నిరుపయోగమే. కావున, 'సర్వోత్తమము' అనేది ఏదీ లేదు. ఎవరికి ఏది కావాలి? అను దానిపై సర్వము ఆధారపడి యుండును.

**అధ్యాయము 12, శ్లోకము 5:**

क्लेशोऽधिकतरस्तेषा मव्यक्तासक्त चेतसाम् ।
अव्यक्ता हि गतिर्दुःखं देहवद्भिरवाप्यते ॥ ५ ॥

క్లేశోఽధిక తరస్తేషా మవ్యక్తాసక్త చేతసామ్
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే (5)

**అవ్యక్తా సక్త చేతసామ్** = దృశ్యరూపముగా ఇంద్రియగోచరము కాని తత్త్వమునకు అంకితమైన మనస్సు గల, **తేషామ్** = వారికి, **క్లేశః** = కష్టము, **అధిక తరః** = ఇంకనూ ఎక్కువ, **హి** = ఏలయనగా, **దేహవద్భిః** = దేహాభిమానము గలవారిచే, **అవ్యక్తా** = దృశ్యరూపములో ఇంద్రియ గోచరము కాని, **గతిః** = లక్ష్యము, **దుఃఖమ్** = కష్టముతో, **అవాప్యతే** = పొందబడుచున్నది.

> దృశ్యరూపముగా ఇంద్రియగోచరము కాని తత్త్వమునకు అంకితమైన మనస్సు గల సాధకులకు క్లేశము ఇంకనూ ఎక్కువ. ఏలయనగా, దేహాభిమానము గల వారిచే దృశ్యరూపములో ఇంద్రియ గోచరము కాని లక్ష్యము కష్టముతో పొందబడు చున్నది (5).

క్లేశః అధికతరః తేషామ్. ఈ అక్షర బ్రహ్మోపాసకుల క్లేశము మరింత ఎక్కువగా నుండును. దేనికంటె ఎక్కువ? ఏది అధికము అను సంగతిని నిరూపించిన తరువాత మాత్రమే అధికతరమును గురించి చెప్పగల్గుదుము గదా! సగుణ బ్రహ్మోపాసకులగు కర్మయోగులకు క్లేశము గలదు. వారు కాయిక క్లేశము, మరియు భావావేగ పరమగు క్లేశములతో గూడిన సాధనను చేయు చుందురు. కర్మయోగి అన్ని వేళలా తనకు నచ్చిన కర్మలను మాత్రమే చేయజాలడు. ఏది ఉల్లాసకరము? ఏది సుఖకరము? అనునది అతని కర్మలకు అలంబనము కాదు. అతడు ధర్మాధర్మములను పరీక్షించి కర్మలను చేయును. చాలా తరచుగా ధర్మమునకు రాగమునకు మధ్యలో ఘర్షణ చెలరేగి మనస్సుకు క్లేశము కలుగుచుండును. ఇట్టి మనః క్లేశము శరీర దుఃఖమునకు కూడ దారితీయును.

సగుణ బ్రహ్మోపాసకుడగు కర్మయోగి విశ్వరూపమును ధ్యానించునని మనము చూచియున్నాము. ఈ ధ్యానమును మనమిపుడు పరిశీలించెదము. సగుణ బ్రహ్మను ధ్యానించవలెననే మాట బాగుగనే యున్నది. కాని ధ్యానించుట యెట్లు? విశ్వరూపములోని ఒక అంశమును మనస్సులో దర్శించినచో, ఇతరాంశములనన్నిటినీ వదిలి పెట్టినట్లే గదా! సూర్యుని, నక్షత్రములను భావన చేసినచో, వాటి క్రిందనుండు సర్వమును ప్రక్కన పెట్టినట్లు అగును. సృష్టిలోని వస్తువులనన్నింటినీ ఒక దాని తరువాత మరియొకటిగా మనస్సులో భావనచేసి, విశ్వరూపమును భావన చేయుట సంభవము కాదు. పైగా, సృష్టిలో మనకు తెలియని వస్తువులు ఎన్నియో గలవు. అందువలననే, మనము ఒక రూపమును స్వీకరించి, రూపములనన్నింటినీ దాని యందు భావన చేసెదము. విశ్వరూపములో సర్వము అంతర్గతమగునని నీకు తెలిసినచో, ఉపాసన కొరకై నీవు తెలియదగినది అంత మాత్రమే. ఒక్క రూపముపై మనస్సును ఏకాగ్రము చేయుటయే కష్టమగుచున్నది. నీవు విష్ణువు యొక్క పాదములను భావన చేసినచో, అది చాలును. శిరస్సుతో మొదలిడి, నీవు పాదముల వద్దకు వచ్చి, మనస్సును అచట నిలిపి యుంచవలెను. కాని మనస్సు అట్లు నిలబడదు గదా! కావున, దానిని ఏకాగ్రము చేయుటలో క్లేశము గలదు.

భగవానునకు పూర్తిగా అంకితమై 'మత్కర్మకృత్' అగు కర్మ యోగికి అధిక క్లేశము గలదు. కాని అక్షర బ్రహ్మోపాసకుల క్లేశము మరింత అధికము (క్లేశః అధికతరః). భగవానుడిచట పోలికను నిర్దేశించు తర ప్రత్యయమును ప్రయోగించినాడు.

వారికి దేహాభిమానము కలదు గాన, క్లేశము మరింత అధికముగా నుండును. దీని అర్థమేమనగా, వారికి ఆత్మానాత్మవివేకము పూర్ణముగా లేదు. వివేకము లేని సన్న్యాసులు

తాదాత్మ్యమును పొంది 'నేను మర్త్యుడను' అని భావించును. దీనినుండి మృత్యుభయము కలుగును. భయములలో కెల్ల గొప్పది మృత్యుభయము. మానవునకు గల ఇతర భయము లన్నియూ మృత్యుభయము ముందు తీసికట్టు. పరమలుబ్ధాగ్రేసరుడైననూ తన ప్రాణములను రక్షించుకొనుటకై తన సర్వస్వమును ఖర్చు చేయును. కర్మయోగ జీవనముచే ఈ మృత్యుభయము తగ్గును. కాని తాను దేహము కాదు అని తెలిసిన వ్యక్తికి, అనగా దేహాభిమానము లేని వ్యక్తికి మాత్రమే ఇది పూర్తిగా దూరమగును.

శాస్త్రాధ్యయనమును చేసినచో, మనకీ సంగతి తెలియుచునే యుండును. కాని ఇట్టి జ్ఞానముతో లేశమాత్రమైననూ సంబంధము లేని సమాంతర ఆలోచనా ప్రవాహము ఒకటి గలదేమో యనిపించును. దృఢముగా పాతుకు పోయిన ధోరణులను విరోధించే జ్ఞానములన్నింటిలో పరిస్థితి ఇటులనే యున్నది. కోపగించుట వలన ప్రయోజనమేదియూ లేదని నీవెరుంగుదువను కొనుము. మరల ఏనాడూ నీకు కోపము రాకుండగా ఆ ఎరుక ఆపగల్గు చున్నదా? ఎరుక ఉన్ననూ, కోపము వచ్చుచునే యుండును. నిరాశ, దుఃఖము ఇత్యాది మానసిక పీడలను ఎవరు కోరుకుందురు? ధర్మాధర్మములకు సంబంధించిన సరళమైన జ్ఞానములో కూడా రెండు సమాంతర రేఖలు గలవు. కొన్ని ఆలోచనాధోరణులు మనకు గల జ్ఞానమును పరాజితము చేయును. ఏది ధర్మము? ఏది అధర్మము? అను తెలివిడి నీకు గలదు. అయిననూ, నీవు తదనురూపముగా ఆచరించ లేక పోవుటకు కారణమేమి? నీ ఆలోచనా ధోరణి నీ వివేకము యొక్క అనుమతిని కోరదు. ఆలోచనలు విభిన్నమగు సత్యత్వశ్రేణికి చెందియుండును కాబోలు! ఇట్టి జ్ఞానమునకు సప్రతిబంధ జ్ఞానమని పేరు.

దేహాభిమానమును సాపేక్షికంగానైనా విడిచి పెట్టాలంటే, ఈ దేహముతో సహా సర్వము ఈశ్వరునకు చెందినదియే అను అవగాహన ఉండవలెను. వ్యష్టి సమష్టిలో అంతర్భాగమే యగును. కర్మయోగి తెలునుకొని మమత్వ (ఇది నాది అనే) భావనను విడనాడును. దీనివలన దేహాత్మ బుద్ధి సడలుచబడును. ఆ స్థితినుండి జ్ఞానము ఉదయించును. తన స్వరూపము నెరుంగని వ్యక్తిలో ఈ దేహాత్మ బుద్ధి పూర్ణముగా నుండుటచే, అక్షర బ్రహ్మోపాసనకు యత్నించిననూ ఫలితము ఉండబోదు. ఇది తెలుసుకో దగిన విషయము గనుక, బోధ సమయములో తెలుసుకొనలేక పోయిన వ్యక్తి ఎట్లు ధ్యానించగల్గును? 'నేను బ్రహ్మను' అనే జ్ఞానము నీకు కలగాలంటే, నీవు ఉద్వేగమును పూర్తిగా విడనాడగలగాలి. నీ గురించి నీకు గల ధారణలనన్నింటిని ప్రక్కన బెట్టి, నీవు వేదాంత బోధచే నీ స్వరూపమును ఉద్భాసితము చేసుకోవాలి. అప్పుడు మాత్రమే 'నేను

బ్రహ్మను' అని నీవు చెప్పగల్గుదువు. అట్లు గానిచో, 'నేను బ్రహ్మను ఎట్లు కాగల్గుదును?' అను ప్రశ్న మిగిలియే యుండును.

కావున దేహముతో తాదాత్మ్యమును పొంది యున్న వ్యక్తులు (దేహవద్భిః) దీనిని కష్టముతో మాత్రమే సాధించగల్గుదురు. 'దుఃఖమ్ (క్లేశముతో)' అని భగవానుడు చెప్పుటలో అభిప్రాయమేమి? వాస్తవంలో, దేహముతో తాదాత్మ్యము ఉన్నంతవరకు దీనిని సాధించుట సంభవము కాదు. దేహాభిమానమును సంపూర్ణముగా విడిచి పెట్టినవాడు మాత్రమే బ్రహ్మైక్యమును సాక్షాత్కరించు కొనగలడు. వాస్తవంలో ఇది వస్తువు వలె పరిత్యజించ దగినది కాదు. ఇది తెలియదగిన సత్యము.

ఇది కఠినము అని చెప్పుటలో భగవానుని తాత్పర్యమే మనగా, నీవు పరిపక్వుడవు కావాలి. దానికి సమయము పట్టును. అది సంకల్ప శక్తితో మాత్రమే లభించేది కాదు. అరటికాయ ముగ్గవలెననుకొనుడు. దానిని బలవంతపెట్టి ముగ్గునట్లు చేయజాలము. కొంత సమయము దానికి వదిలినచో, దానంతట అదియే ముగ్గును. మనము చేయవలసినది ఏదియూ లేదు. అదే విధముగా, ఈ జ్ఞానము లభించుటకు కావలసిన పరిపక్వత కలుగుటకు సమయము పట్టును. మరియు వివేకయుక్తమగు జీవనము కూడ అవశ్యకమగును. కర్మయోగమనే మానసిక ప్రవృత్తితో అనుభవములను ఎదుర్కొంటూ ఉంటే, దేహాభిమానము క్షీణమగును. కాని దానికి కొంత సమయము పట్టును. దీనిని బట్టి భగవానుడు కర్మయోగులను యోగవిత్తములని వర్ణించుటలో గల కారణము స్పష్టమగుచున్నది. ఆ వర్ణనకు భావము వారు సర్వోత్తములని గాదు. వారి సాధన మిక్కిలి యోగ్యమైనదని దాని భావము. సంసిద్ధులు కాని వ్యక్తులు సర్వకాలములయందు నిదిధ్యాసనను చేయజాలరు. అది సంభవము కాదు. ''ఓ అర్జునా! కర్మయోగము లేకుండగా కర్మసన్న్యాసమును చేయుట చాల కష్టముతో గూడిన పని. కాని వివేకశక్తి గలవాడై కర్మయోగ జీవితమునకు అంకితమైన వ్యక్తి శీఘ్రముగా బ్రహ్మను పొందును★'' అని భగవానుడు 5వ అధ్యాయములో చెప్పియున్నాడు. ఆయన దానినే మరల చెప్పుచున్నాడు.

కర్మను ఆచరించు వారందరిలో సగుణ బ్రహ్మోపాసకులగు కర్మ యోగులు యుక్తతములు. అక్షర బ్రహ్మోపాసకులను ఈ పోలికలకు బయట ఉంచవలెను. వారు జ్ఞానులు

---

★ సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి

గనుక, వారికి ఈశ్వరునితో భేదము లేదు (జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్). కర్మయోగులు ఏ లక్ష్యము కొరకు సాధనను చేయు చున్నారో, దానిని వారు చేరియున్నారు. కాన వారిని పోలికలలోనికి లాగుట తగదు. సామ్యము గలవాటి మధ్య మాత్రమే పోలిక పొసగును. విభిన్న లక్ష్యములను పరస్పరము పోల్చుట న్యాయసమ్మతమే. కాని లక్ష్యమును సాధనముతో పోల్చరాదు. కావున, సగుణ బ్రహ్మోపాసకులగు కర్మయోగులు యోగవిత్తములు అని మాత్రమే శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు.

దేహాభిమానమనగా ఆత్మను దేహముతో తాదాత్మ్యము చేయుట. దీనిని విడుచుట నిశ్చయముగా తేలిక కాదు. ఆత్మ స్వరూపమును తెలియుటలో మానవుడు విఫలుడగుటచే అనాత్మయగు దేహము ఆత్మయందు ఆరోపింపబడుచున్నది. కావున ఆత్మ యొక్క స్వరూపమును స్పష్టముగా గుర్తించుట ఈ బోధనను అవగాహన చేసుకొనుటలో ప్రముఖపాత్రను వహించును. తత్ త్వం అసి (అది నీవే అయి ఉన్నావు) అను వాక్యములోని త్వం పదార్థమును సరిగా గుర్తించనిదే ఈ వాక్యము యొక్క తాత్పర్యము నెరుంగుట సంభవము కాదు. ఈ వాక్యములో సృష్టికారణమగు తత్‌నకు నీతో అభేదము చెప్పబడినది. 'నేను' అను దాని సారస్వరూపమును నీవెరింగినచో, ఈ అభేదవాక్యము సుస్పష్టమగును. అట్లుగానిచో ఈ వాక్యమునకు అర్థమేమియూ లేదు. ''సృష్టికారణమగు భగవానుడవు నీవే'' అని నేను చెప్పెదను. కాని నీవు నీ అనుభవముల నాధారంగా చేసుకొని నీ స్వరూపమును అంచనా వేసుకొని యున్నచో, వాక్యములోని 'నీవు' అను పదమునకు గల అర్థము సరిగా గుర్తింపబడ జాలదు. అపుడీ సమీకరణము విరుద్ధార్థమును బోధించినట్లు అగును. దేహాభిమానము గల నీవు నిన్ను గురించి 'మర్త్యుడను, సుఖిని, దుఃఖిని, వ్యష్టిని, కార్యమును' అని తలపోసెదవే గాని, 'సర్వకారణము నేనే' అని తలపోయవు గదా!

కావున దేహముతో తాదాత్మ్యమును పొందియున్న వారు దీనిని పొందుట క్లేశముతో గూడిన పని (దేహవద్భిః దుఃఖం అవాప్యతే). కర్మయోగబుద్ధి గల మస్తిష్కము ఆత్మస్వరూపమును గుర్తెరుంగుటకు తయారుగా నుండును. కావున భక్తుడు కనీసము ప్రత్యగాత్మను గుర్తించగల్గినచో, ఆత్మ స్వరూప జ్ఞానము దానివెనుకనే ఉదయించును.

ఈ అధ్యాయములో తరువాతి శ్లోకములో అక్షర బ్రహ్మ సాక్షాత్కారము గల జ్ఞానుల ప్రవృత్తి వర్ణింపబడునని శ్రీ శంకరులు తరువాతి శ్లోకమునకు అవతారికలో వివరించిరి. ప్రస్తుతము మన దృష్టిని సగుణ బ్రహ్మోపాసకులగు కర్మయోగులపైకి సారిద్దాము.

**అధ్యాయము 12, శ్లోకము 6:**

ये तु सर्वाणि कर्माणि मयि सन्न्यस्य मत्पराः ।
अनन्येनैव योगेन मां ध्यायन्त उपासते ॥ ६ ॥

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే (6)

**తు** =కాని, **యే** = ఎవ్వరైతే, **సర్వాణి** = సమస్తములైన, **కర్మాణి** = కర్మలను, **మయి** = నాయందు, **సన్న్యస్య** = విడిచి పెట్టి, **మత్పరాః** = నేనే చరమ లక్ష్యముగా గలవారై, **ఏవ** = నిశ్చయముగా, **అనన్యేన** = ఇతరము నెరుంగని, **యోగేన** = అంకిత భావముతో, **మామ్** = నన్ను, **ధ్యాయంతః** = ధ్యానము చేయుచూ, **ఉపాసతే** = ఆరాధించెదరో.

కాని ఎవరైతే సమస్త కర్మలను నా యందు పరిత్యజించి నేనే చరమలక్ష్యముగా గలవారై నిశ్చయముగా ఇతరము లేని అంకిత భావముతో నన్ను ధ్యానిస్తూ ఆరాధించెదరో (6).

**అధ్యాయము 12, శ్లోకము 7 :**

तेषामहं समुद्धर्ता मृत्युसंसारसागरात् ।
भवामि न चिरात्पार्थ मय्यावेशितचेतसाम् ॥ ७ ॥

తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్ (7).

**పార్థ** = ఓ అర్జునా!, **మయి** = నాయందు, **ఆవేశిత చేతసామ్** = తల్లీనమైన మనస్సులు గల, **తేషామ్** = వారికి, **అహమ్** = నేను, **న చిరాత్** = శీఘ్రముగా, **మృత్యుసంసార సాగరాత్** = మృత్యువుతో నిండియున్న సంసార సముద్రము నుండి, **సముద్ధర్తా** = ఉద్ధరించువాడను, **భవామి** = అగుదును.

ఓ అర్జునా! నాయందు తల్లీనమైన మనస్సులు గల వారిని నేను శీఘ్రముగా మృత్యువుతో నిండి యున్న సంసార సముద్రము నుండి ఉద్ధరించెదను (7).

రెండు శ్లోకములు కలిసి ఒకే భావమును పూర్ణముగా బోధించే సందర్భాలలో మనము ఆ రెండు శ్లోకములను కలిపి చర్చిస్తాము. 3,4 శ్లోకాలను కలిపి చదివినట్లుగానే, ఇప్పుడు 6,7 శ్లోకములను కలిపి చర్చించెదము.

'తు' అనగా 'దానికి భిన్నముగా' అని యర్థము. ఈ పదము కర్మయోగులకు, అక్షర పరబ్రహ్మోపాసకులకు గల భేదమును ప్రదర్శించును. యే మత్పరాః అనగా ఎవరికైతే నేను చరమ లక్ష్యమై ఉన్నానో వారు. సేవకునకు స్వామివలె, వారికి భగవానుడే సర్వస్వము. వారు ఈశ్వరుని ఆధ్యాదేశములను పరిపూర్తి చేసి తమకు ఈశ్వరుని యందు గల అంకిత భావమును వ్యక్తము చేయుదురు అని శ్రీ శంకరులు వివరించిరి. సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య అనగా వారు కర్మలనన్నిటినీ పరమేశ్వరుడనగు నాకు సమర్పించి నన్ను ధ్యానించెదరు. ధార్మికము, లౌకికము అని కర్మణ్యత ద్వివిధముగా నున్నది. యజ్ఞయాగాదులు, ప్రార్థనలు మొదలగునవి ధార్మిక కర్మలు. ఇవి శ్రుతిచే విధింపబడినవి (శ్రౌతకర్మలు) గాని, స్మృతి విహితములు (స్మార్తకర్మలు) గాని కావచ్చును. ఇవి గాక లౌకిక కర్మలు గలవు. ప్రపంచ వ్యవహారములలో మనము ప్రతిదినము చేయవలసిన విధులు గలవు. ఈ కర్మలనన్నిటినీ ఈశ్వరునకు సమర్పించి (మయి సన్న్యస్య) చేసినచో, లౌకిక కర్మలలోని లౌకికత్వము సమాప్తమగును. ఇచట భగవానుడు 'నాయందు' అని ప్రయోగించినాడు. కావున ఇచట సన్న్యాసమనగా జ్ఞానము వలన సంపన్నమయ్యే పరమార్థ కర్మ సన్న్యాసము గాదు. ఇచట సన్న్యాసమనగా ఈశ్వరుని కొరకు ఈశ్వరార్పణ బుద్ధితో కర్మలను చేయుట అని యర్థము.

భగవానునకు సమర్పించు విధమెట్టిది? రాగ ద్వేషానుకూలముగా గాక, ధర్మాధర్మాను రూపముగా కర్మాచరణమే ఈశ్వరసమర్పణ మగునని మనమింతకు ముందు చూచి యున్నాము. మానవులమగు మనకు ఎన్నుకొనే శక్తి అనుగ్రహింపబడి యున్నది. అందరికీ అంగీకారమయ్యే సామాన్యనియమములకు లోబడి, ఒక కర్మను చేయుటకు గాని, మానుటకు గాని మనకు స్వేచ్ఛ గలదు. ఈ నియమములను మానవుడు సృష్టించలేదు. అవి సృష్టిలో భాగముగా నున్నవి. కావున వాటికి అనురూపముగా జీవించినచో, ఈశ్వరునితో మనకు గల అభేదమును గుర్తించినట్లే యగును. ఇతర ప్రకృతి నియమముల వలెనే, ధర్మము కంటికి కనబడే ఈశ్వరాధ్యాదేశము (mandate of Ishwara) కాదు. ఉదాహరణకు గురుత్వాకర్షణ నియమము మన కంటికి కానరాదు. కాని అది క్రిందకు పడుచున్న వస్తువులో ప్రకటమగుటను మాత్రమే మనము చూడగలము. అదే తీరున, ధర్మము మన కంటికి కానరాదు. 'నాకు హాని కలుగరాదు' ఇత్యాది సహజ సిద్ధములగు అంతః

ప్రేరణలలో ఆ ధర్మము ప్రకటమగుచుండును. ఆ ప్రేరణను బట్టి అహింస ధర్మము అని మనము గ్రహిస్తాము. ఇందువలననే, అంతరాత్మయే భగవానుడని చెప్పెదరు. ఏది మంచి, ఏది చెడు అనే సామాన్య వివేకము మనకు గలదు. ధర్మాధర్మములనగా నివియే. అంతరాత్మయనగా ఈ వివేకము కంటె వేరుగా లేదు. దానికి అనురూపముగా జీవించుటయే ఈశ్వరార్చన యగును. దీనిని నొక్కి చెప్పవలసిన ఆవశ్యకత గలదు. ఏలయనగా, మనకు ఇష్టా నిష్టములు గలవు. అవి ఈ ధర్మవివేకమునకు అను రూపముగా నుండగలవనే హామీ లేదు. వాటిని ధర్మాధర్మముల అధీనములో నుండునట్లు చేసుకున్న వ్యక్తి కర్మయోగి యగును.

స్వీయధర్మములో మరణించుట మేలు, పరధర్మము భయమునకు మూలము (స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయా వహః) అనియు, మానవుడు రాగద్వేషములకు వశుడు కారాదనియు (తయోః వశం న ఆగచ్ఛేత్) భగవానుడిదివరలో చెప్పి యున్నాడు. ఈ వాక్యములన్నియూ ఇచట బోధించబడే విషయమునకు ఉపోద్ఘలకములగును.

ధార్మిక జీవనము ఈశ్వరారాధన ఎట్లగును? వారు ఈశ్వరునకు మాత్రమే అంకితమైనవారు (మత్పరాః) గనుక. వారికి చరమ లక్ష్యము పరమేశ్వరుడు. ఈశ్వరుడు అంతిమ లక్ష్యము మాత్రమే కాదు; ఏకైక లక్ష్యము కూడా. ఈశ్వరుడు మోక్ష స్వరూపుడని నిర్ధారించు కొని వారు మోక్షము కొరకు మోక్షమును గోరెదరు. తాము ఈశ్వరజ్ఞానమును పొంది తీరవలెనని వారు ఎరుంగుదురు. అది వారికి అంతిమ లక్ష్యము మాత్రమే గాక, తత్కాలీన లక్ష్యము కూడ అదియే. అదియే ఏకైక లక్ష్యము అగు వ్యక్తి సన్న్యాసి యగును. ఆ లక్ష్యమును పొందుటకై అంతః కరణ శుద్ధిని పొంది సంసిద్ధము కావలెనని గుర్తించిన వ్యక్తి కర్మయోగి యగును. అతడు రాగ ద్వేషములను ప్రభావహీనములుగా చేయుట కొరకై కర్మయోగమయమగు జీవనమును గడుపును. కాని వీరిద్దరికీ లక్ష్యము సమానము. మరియు ఆ లక్ష్యమును దృష్టిలో నిడుకొని చేసే జ్ఞానసాధన కూడ సమానమే.

కర్మయోగులు ఫలాసక్తిని వీడి అంతఃకరణశుద్ధి కొరకై కర్మలను చేయుదురని (యోగినః కర్మ కుర్వంతి సంగ త్యక్త్వా ఆత్మ శుద్ధయే) ఇంతకు ముందు చెప్పబడినది. నేను అన్వేషించేది ఏది? అను నిశ్చయము (పురుషార్థనిశ్చయము)ను కలిగి యుండుట చాల ప్రముఖమైనది అనే విషయము మనకు దీనిని బట్టి స్పష్టమగు చున్నది. మౌలిక సమస్యను గురించి ఇంతకు ముందు చెప్పబడిన విషయమంతయూ సుసంగతమగుటచే ఈ పుటలలో సర్వత్రా స్మరింపబడు చుండును.

13వ అధ్యాయములో ఈ జ్ఞానమునకు దారిని సుగమము చేయు జీవనమూల్యములు వర్ణింపబడినవి. వాటిలో అఖరి జీవనమూల్యము(తత్త్వజ్ఞానార్థదర్శనమ్) నకు మొదటి దానికి భేదము లేదు. మోక్షము అనే చరమ ఫలమును దృష్టిలో నిడుకొని సర్వము చేయబడును. అట్లు గానిచో, తత్క్షణమే శ్రద్ధ చూపవలసిన విషయములు సర్వదా ఉండుటచే ఈ జ్ఞానసాధన వాయిదా పడుచుండును. ఈ వాయిదాలకు అంతము లేదు. మనము కోరేది ఏది? అనునది సుస్పష్టముగా తెలియనంత వరకు, అసంఖ్యాకములగు విభిన్న విషయములపై మన దృష్టి కేంద్రితమై యుండును. మోక్షము వేచి యుండును. కావున, మనము చరమలక్ష్యము కొరకై ఆవశ్యక మగు సాధనపై దృష్టిని నిలిపి ముందునకు సాగవలెను.

ఈ విషయమును నిర్ధారించుకున్న వారు మత్పరాః అనబడుదురు. వారి చరమలక్ష్యము ఈశ్వరుడు. సర్వము దానికి సహకారియగును. వంటవాడు అన్నమును వండుచున్నాడనుకొనుడు. అతడు గిన్నెలో నీరు పోయును. కూరలను తరుగును. వంటగదిని శుభ్రము చేయును. ఇంకనూ ఇట్టి పనులను అనేకము చేయును. వీటిలో ఏ పనియైననూ అన్నము వండుట కాదు. వండుట యనగా ఒక వస్తువును నిప్పులపై బెట్టి ఉడికించుట. కాని ఈ పనులన్నియూ అన్నము వండుట అను ప్రధానకర్మతో సంబద్ధములై యున్నవి గనుక, దానిలో అంతర్భాగములగును. ఇదే విధముగా, మనము జీవితము యొక్క ప్రధానలక్ష్యమును నిర్ణయించుకున్నచో, జీవితములో చేసే ప్రతి పని దానితో సంబంధమును కలిగియుండును.

ఈ జీవితమునకు సైంటిస్టు జీవితమునకు పెద్ద తేడా లేదు. సైంటిస్టు ఒక సైన్సు సంబంధి సమస్యను పట్టుకుంటాడు. ఆ తరువాత అతడు దానికి అంకితమై జీవిస్తాడు. అతడు కూడా భోజనం చేస్తాడు, స్నానం చేస్తాడు, ఇంకా ఎన్నో పనులను చేస్తాడు. కాని అతని పరిశోధనావిషయము సర్వదా అతని మదిలో మెదులు చుండును. అతడు ఏవో కొన్ని సమయములలో ఆ విషయమును సావధానచిత్తుడై పరిశోధించుననుకోరాదు. అది సర్వదా అతని మదిలో నుండును. నీవు జీవితములో ఒక సాధనకు ఒకసారి అంకితమైనచో, ఇతరము సర్వమునకు దానితో సంబంధము నెలకొనును. ప్రస్తుతంలో మత్పరులగు వారు చేసే కర్మలన్నియూ మోక్షమునకు సంబద్ధములై యుండును. వారు కర్మలను తమ రాగద్వేషముల కనురూపముగా ఆచరించరు. వారు ఈశ్వరుని కర్మనియతి రూపములో గుర్తించి ధర్మాధర్మములకు అవిరుద్ధముగా కర్మలను చేయుదురు. వారి కర్మణ్యత ఏ రూపములోనున్ననూ, వారి దృష్టి మోక్షము అనే లక్ష్యము నుండి క్షణమైననూ ప్రక్కకు మరలదు.

మాం ధ్యాయన్త ఉపాసతే. ఈ ఉపాసకులు 'నన్ను' ధ్యానించెదరు. 'నన్ను' అనగా సర్వకారణమైనవాడు, సర్వజగద్రూపముగానున్న భగవానుడు. వారు కర్మను ఈశ్వరార్పణ బుద్ధితో చేయుట మాత్రమే గాక, సగుణ బ్రహ్మధ్యానమును కూడ చేసెదరు. ఎట్లు?

పరమేశ్వరుని తక్క ఇతరమునెరుంగని అంకిత భావముతో (అనన్యేన యోగేన). వారి మనస్సునకు విశ్రాంతి స్థానము (ఆలంబన) విశ్వరూపము తక్క మరియొకటి లేదు. వారికి స్వరూపముపై గల ప్రేమచే, వారు కర్మయోగము ననుష్ఠించ గల్గుచున్నారు. వారి నిత్యప్రార్థనాదులకు కూడ ప్రభావశాలియగు ధ్యానమే ప్రయోజనము. వారు కర్మయోగులు గనుక, వారి మనస్సులో ఈశ్వరుడు ఉండుట సహజమే. వారి ధ్యానములో పరమేశ్వరుడు తక్క ఇతరము లేదు. వృత్తి మారుతూ ఉండవచ్చును. ఆలోచనలు మారుతూ ఉంటాయి. కాని వాటన్నింటిలో భగవానుడు ఉండును. ఈశ్వరుని ఒక విశిష్టరూపములో ప్రార్థించవచ్చును. ఆ రూపము కూడా ఈశ్వరుడే గదా! కర్మలనన్నిటినీ భగవానునకు సమర్పించి, భగవానుడే ఏకైక లక్ష్యము అనే అంకిత భావము గలవారై, ఈ విశ్వ రూపమును ధ్యానించు సాధకులకు భగవానుడు తక్క ఇతరము లేదు.

ఇట్టి వారిని ఉద్దేశించి భగవానుడు 'నేను వారిని గట్టెక్కించెదను (తేషాం అహం సముద్ధర్తా భవామి)' అని చెప్పుచున్నాడు భగవానుడు వారిని దేనినుండి గట్టెక్కించును? మృత్యువుతో నిండియున్న సంసారమనే సముద్రము నుండి (మృత్యు సంసారసాగరాత్). ఈ సమాసమునకు మధ్యలో 'యుక్త' అను ఒక పదము లోపించినది. ఇట్టి సమాసమునకు మధ్యమపదలోప సమాసమని పేరు. మృత్యుయుక్త సంసారసాగరాత్ అనునది పూర్ణ సమాసము. 'నేను వారిని మృత్యువుతో నిండియున్న సంసారమనే సముద్రము నుండి పైకి లాగెదను' అని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుడు మాత్రమే తన కృపచే వారిని ఈ సముద్రమునుండి గట్టెక్కించగల్గును. వారు భక్తులే గదా! ప్రార్థనా యుతమగు జీవితమును గడిపిన ఆ భక్తులు అంతఃకరణ శుద్ధిని పొందెదరు. ఇది దృష్టఫలము. ఇంతే గాక, పుణ్యము అనే అదృష్టఫలము కూడ లభించును. ఆ పుణ్యము వలన వారికి ఉపదేశము ద్వారా జ్ఞాన ప్రకాశమును పొందే అవకాశము తరచుగా లభించును. భగవంతుని ఆత్మయే తమ ఆత్మ అని తెలియుటకు అవశ్యకమగు సర్వము వారికి ఈశ్వరకృపచే సంపన్నమగును. వారు అట్టి కృపను సంపాదించుకొనినారు. వారికి తత్త్వమసి అను సమీకరణము స్పష్టముగా తెలియును.

వారు ఈశ్వరుని ధ్యానించెదరనియు, కర్మలనన్నిటినీ ఈశ్వరునకు సమర్పించెదరనియు, మనము చూచి యున్నాము. ఇట్టి అంకిత భావముతో గూడిన జీవితమును గడుపు సాధకులను

భగవానుడు ఉద్ధరించును (సముద్ధర్తా). శ్రీకృష్ణుడు గీతలో 'అహమ్'ను ప్రయోగించిన సందర్భములలో 'ఈశ్వరుడనగు నేను' అను అర్థములో ప్రయోగించును. దేవకీనందనుడగు చారిత్రక శ్రీకృష్ణుడు అను అర్థములో కాదు. శ్రీకృష్ణుడు చారిత్రిక పురుషుడగునా, కాదా అనునది ప్రముఖ విషయము గాదు. రూపములన్నియూ భగవానుని రూపములే యను ఇచటి భగవానుని బోధను మనము తెలుసుకున్నచో చాలును.

నేను ఉద్ధరించెదనని భగవానుడు చెప్పుచున్నాడు గదా! ఆయన ఉద్ధరించేది ఎవరిని? దేనినుండి? ఈశ్వరుడు భక్తులగు ఈ జీవులను మృత్యువుతో నిండియున్న సంసారము అనే సముద్రమునుండి రక్షించును. సంతత పరివర్తన శీలము, కాలపరిచ్ఛిన్నము అగు జీవితమునకు సంసారమని పేరు. సంసారమును సముద్రముతో పోల్చుటకు కారణమేమి? సంసారమును దాటుట చాల కష్టము గనుక అని శ్రీశంకరులు వివరించిరి. సముద్రము చాల పెద్దది, మరియు కనబడని అగాధములతో నిండియున్నది. సంసారము కూడ అట్టిదియే. కావున దానిని తరించుట తేలిక కాదు. అజ్ఞానమును తొలిగించనిదే, సంసారమును దాటే అవకాశమే లేదు. పురుష ప్రయత్నముచే అజ్ఞానమును తొలగించుట సాధ్యము కాదు. కాని అజ్ఞాననివృత్తికి అత్యావశ్యకమగు మానసిక సంసిద్ధత పురుష ప్రయత్నమునపేక్షించును. నీవు ఎలక్ట్రానిక్స్‌లో గాని, కలనగణితములో గాని నీకు గల అజ్ఞానమును తొలగించ నిచ్ఛగించినచో, బోధింపబడే ఆ విషయవస్తువును అర్థము చేసుకోగలిగే స్థాయికి నీవు చేరుకోవాలి. దానికొరకై నీవు సముచితమగు కృషిని దృఢదీక్షతో చేయవలసి యుండును. జ్ఞానమును పొందుటలో కష్టము లేదు. దానికి కావలసిన సంసిద్ధతను నిర్మాణము చేయుటలో మాత్రమే కష్టము గలదు. ఆ సంసిద్ధతను భగవానుడు ఇచ్చును. ఎట్లు?

సాధకుడు చేయు ఉపాసనకు ఫలరూపములో ఈశ్వరుడాతనికి మనస్సును ఏకాగ్రము చేయు శక్తిని ఇచ్చును. అతడు కర్మయోగమువలన అంతఃకరణశుద్ధిని పొందును. ఈ రెండూ అవసరమే. ఒకటి రెండవ దానిని వృద్ధి పొందించును. ధ్యానము వలన మనస్సునకు ప్రసన్నత ఏర్పడును. అట్టి ప్రసన్నమగు మనస్సు గల సాధకుడు కర్మనియతిని మరింత బాగా అర్థము చేసుకొన గల్గును. ఆ అవగాహన వలన ప్రసన్నత మరింత వృద్ధి చెంది, మనః ప్రవృత్తిలో మార్పును తెచ్చును. ఈ మార్పు పరిణతమైన ప్రవర్తనకు, మరియు స్వభావమునకు మూలమగును. కేవల ధ్యాననైపుణ్యము వలన ఇది సిద్ధించదు. ధ్యానము వలన మనస్సును లగ్నము చేయగలిగే శక్తి లభించును. నేరస్థుడు కూడా మనస్సును బాగుగా ఏకాగ్రము చేయగల్గును. ఇతర వ్యక్తిని తుపాకీతో కాల్చి చంపే సమయములో హంతకునకు ఉన్నత శ్రేణికి చెందిన ఏకాగ్రత ఉండును. అనగా

అతనికి మనస్సును లగ్నము చేసే శక్తి గలదు. రావణునకు ఇట్టి శక్తి అత్యధికముగ నుండెను. కాని మనిషికి పరిపక్వతనీయ గలిగే కర్మయోగమును అతడు ఎరుంగడు. కేవలము మనస్సును లగ్నము చేయ గలిగే శక్తి గాని, ప్రసన్నము చేయగలిగే శక్తిగాని చాలదు. ఆలోచించుట చేతగాని వాని మనస్సు కూడా చాల ప్రశాంతముగ నుండును. ఈ జ్ఞానము ప్రయోజనకారి కావాలంటే, వ్యక్తిలో పరిణతి, మరియు దానిని అనుసరించి వచ్చే ప్రసన్నత ఉండవలెను. అనగా రాగద్వేషములను చాలవరకు ప్రభావహీనములుగా చేయవలసి యుండును. కర్మయోగ జీవితమును గడుపుతూ ఈశ్వరుని కూడా ధ్యానించు వారికి శీఘ్రఫలము లభించును. కర్తవ్యకర్మ అప్రియమే అయిననూ, వారు దానిని ఆచరించి, తద్ద్వారా మానసిక సంఘర్షణ నుండి విముక్తిని అనుభవించెదరు. అప్రియకర్మను ఆచరించుటకు పూర్వములో సంఘర్షణ ఉండును. ఏలయన, రాగ ద్వేషములకు కర్తవ్యకర్మ విరుద్ధము కావచ్చును. వారు కర్మయోగులు గనుక, రాగ ద్వేషములను ప్రక్కన బెట్టి, ఈశ్వరస్వరూపమగు ధర్మమును పాటించెదరు. అందువలన వారికి ఆ తరువాత సంఘర్షణ ఉండబోదు. కాని నీవు కర్మను రాగద్వేషానురూపముగా ఆచరించినచో, ముందు వెనుక మాత్రమే గాక, కర్మానుష్ఠాన సమయమునందు గూడ మానసిక సంఘర్షణ తప్పదు. ఈ తీరున, ధర్మమునకు అనురూపముగా ఆచరించినా, లేక ప్రతికూలముగ ఆచరించినా, రెండింటికీ దృష్టఫలము గలదు. ఒక విశిష్ట ప్రసన్నత మరియు మనస్సును ఒక దానిపై లగ్నము చేసే సామర్థ్యము అనునవి ధ్యానమునకు దృష్టఫలములు. ధ్యానము ప్రార్థనారూపమైన కర్మ గనుక, అదృష్టఫలము కూడ గలదు. దానికే మనము ఈశ్వరకృప యని పేరిడితిమి. ఆ కృప జ్ఞానోదయమునకు సహకారియగు పరిస్థితులను నిర్మాణము చేయును.

దీనికి ఎంత సమయము పట్టును? చాలకాలము పట్టదని (న చిరాత్) శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు. ఈ కాలము పూర్తిగా వ్యక్తిపై ఆధారపడి యుండును. నీవు నిత్యముక్తుడవు గనుక, దీనికి ఒక నిశ్చితమగు కాల క్రమసూచి (time table) లేదు. ఒక వస్తువును నిర్మించవలెనన్నచో, కాలక్రమసూచిని ఈయవచ్చును. నీవు నిత్యముక్తుడవు గనుక, నీ మనస్సు పరిపక్వమై ఆ సత్యమును తెలియవలెను. 'న చిరాత్' అను పదము ఖచ్చితమగు కాలమును నిర్దేశించదు. కాని ఎక్కువ సమయము పట్టదని స్పష్టము చేయును. కర్మయోగము మరియు ఉపాసన గల వ్యక్తికి జ్ఞానోదయము కాకుండా ఏది ఆపగలదు?

ఈ మహాత్ములెవ్వరు? మయి ఆవేశిత చేతసః, పరమేశ్వరుడనగు నాయందు తల్లీనమైన మనస్సు గలవారు. వీరు పరమేశ్వరునకు మాత్రమే అంకితమైన వ్యక్తులు. వీరి మనస్సు ధ్యాన

సమయమునందు మాత్రమే గాక, నిత్యకృత్యములను చేయునప్పుడు కూడ పరమేశ్వరునియందు తల్లీనమగు చుండును. 'అట్టి వారిని నేను రక్షించెదను'. రక్షింపబడుట యనగా మోక్షమును పొందుట. మోక్షమును పొందే ఉపాయము మరియొకటి గలదని దీని అభిప్రాయమా?

జ్ఞానమువలన మోక్షము కలుగును (జ్ఞానాత్ మోక్షః) అని గీతలో సర్వత్రా చెప్పబడినది. కాని ఇచట కర్మయోగము వలన, మరియు ఉపాసన వలన మోక్షము కలుగునా యన్నట్లు కన్పట్టు చున్నది. అంటే రెండు భిన్న మార్గములు గలవని తేలును. ఒకటి జ్ఞానము (జ్ఞానాత్ మోక్షః). రెండవది కర్మ (కర్మణా మోక్షః). ఏలయన మానసిక కర్మయగు ఉపాసన కూడ కర్మయే గదా! ఇచటనే జనులు భ్రాంతి పడుదురు. మానసికమైనా, వాచిక మైనా, కాయికమైనా, కర్మ కర్మయే. కర్మ ఏదైనా, కర్త ఉండి తీరును. జ్ఞానము లేనిదే కర్తను బాధింప (negate) శక్యము కాదు. కర్తను బాధించనిదే, మోక్షము లేదు. కర్తృత్వభావనయే సమస్యలన్నిటికీ మూలమగు చున్నది. ఈశ్వరార్పణ బుద్ధిగల వారెవ్వరు? కర్తయే. 'భగవానునకు సమర్పించుము' అని చెప్పెదరు. సమర్పించేది ఎవరు? సర్వము భగవానునకు చెందియుండగా, నీవు భగవానునకు దేనిని సమర్పించగలవు? 'ఇది నాది' అని నీచే భావింపబడే వస్తువును మాత్రమే నీవు సమర్పించగల్గుదువు. నీకు ఉన్నది అంతా భగవానుడు ఇచ్చినదే అను గుర్తింపు నీకు ఉన్ననూ, ఈ మాటను చెప్పునది ఎవరు? కర్మయోగము యొక్క ఈ స్థాయిలో నీవు చేయగలిగిన అత్యధిక త్యాగము మమత్వ (ఇది నాది అను భావన) త్యాగము. కాని అహంకారము (నేను అనే ధారణ) మిగిలి యుండును. అహంకారము తొలగకుండా 'నేను సంసారిని' అను నిష్కర్ష తొలగుట యెట్లు? నీవు సమర్పించలేనిది ఒకటి గలదు. అదియే అహంకారము. ఏలయన సమర్పించవలసినది అహంకారమే. 'అహంకారమును సమర్పించుము' అని ఒకాయన చెప్పినాడనుకొనుడు. ఆయన ఎవరిని ఉద్దేశించి చెప్పినాడు? సచ్చిదానంద ఆత్మనా? లేక అహంకారమునా? సచ్చిదానంద ఆత్మకు అహంకారము లేదు. పైగా అది ఒక వస్తువు కాదు గనుక, దానిని సంశోధించుటయూ సంభవము కాదు. ఇకపోతే, అహంకారము తనను తాను ఎట్లు సమర్పించును? కావున ఈ సమర్పణ సంభవమయ్యేది కాదు. తరతరములనుండి జనులు ఇట్టి సమర్పణకు ప్రయత్నించుచునే యున్నారు. అహంకారము తనను తాను సమర్పించ లేదు. నీవు ఏమేమి చేసినా, అజ్ఞానము ఉన్నంతవరకు, నీవు ఈశ్వరుని నీకంటె భిన్నముగా దర్శించుచున్నంత వరకు, ఆత్మసమర్పణము లేదు. భక్తిని కలిగియుండుట జ్ఞానమీయదు. భగవానుని ఆరాధించే కర్మయోగులు యోగవిత్తములని భగవానుడు స్వయముగా చెప్పుచున్నాడు. అట్టి కర్మయోగులు పరిపక్వత చెందినవారు (mature) అనుటలో సందేహము లేదు. కాని వారిలో ఇంకనూ అహంకారము మిగిలి యుండును.

కావున, మోక్షము జ్ఞానము వలన కలుగనే గాని (జ్ఞానాత్ ఏవ), కర్మవలన, లేక మరియొక దాని వలన కలుగదు. నీకు, ఈశ్వరునకు ఏనాడూ భేదము లేదు. ఈ సత్యమును గుర్తెరుంగటయే మోక్షము. అది మోక్షము కానిచో, మోక్షమే లేదు. ఏలయన, ఈ క్షణములో నీవు అనంతుడవు కానిచో, అనంతుడవు అయ్యే అవకాశము లేనే లేదు. తమిళంలో ఒక సామెత గలదు. గోరుచుట్టు వ్యాధి సోకిన బొటనవ్రేలు వాచి నారింజకాయంత కావచ్చునే గాని, గుమ్మిడికాయంత కాలేదు.

అదేవిధంగా, అహంకారము ఎంతటి అనుగ్రహరాశిని ప్రోగుచేసుకున్ననూ, ఎటువంటి మహానందమునననుభవించిననూ, అది అహంకారముయొక్క ఆనందమే యగును గాని, ఆనంద-అనంత బ్రహ్మ కాజాలదు.

నేను ప్రకృతిచే బద్ధుడనై, సర్వమునుండి వేరు చేయబడి యున్నచో, నేను శాశ్వతముగా బంధింపబడినట్లే యగును. కాని లోతుగా పరిశీలించినచో, ఇట్టి వేర్పాటు యథార్థముగా సంభవము కాదు. భౌతిక పదార్థములన్నియూ భౌతిక జగత్తునకు, సూక్ష్మములన్నియు సూక్ష్మ జగత్తునకు చెందియుండును. భౌతిక ప్రపంచములో ఉంటూ ఒక భౌతిక దేహమును భౌతిక ప్రపంచమునుండి వేరు చేసి, 'ఇది భౌతిక ప్రపంచము కంటె భిన్నమైనది' అని చెప్పుట ఎట్లు సంభవమగును? ఇది, చెట్టు కొమ్మ 'నాకు చెట్టుతో సంబంధము లేదు, నేను స్వతంత్రురాలను' అని చెప్పినట్లుండును. ఏ భౌతిక పదార్థమైననూ భౌతిక ప్రపంచముతో సంబంధము లేని స్వాతంత్ర్యమును కలిగి యుండలేదు. భౌతిక పదార్థము భౌతిక ప్రపంచమునకు చెందియుండును. ఏ స్థాయిలోనైననూ వేర్పాటు సంభవము కాదు. ఉన్నది ఒక్కటి మాత్రమే. ఆ ఒక్కటి నీవే. ఈ సత్యమును నీవు తెలియవలెను. అంతా కలిపి చేయవలసినది ఇంత మాత్రమే. ఈ సత్యము నిత్య సిద్ధమై యున్నది. ముక్తిని పొందుటకై నీవు అజ్ఞానమును పారద్రోలి, జ్ఞానమును పొందవలెను (జ్ఞానాదేవ మోక్షః).

నేను వారిని ఉద్ధరించెదను (తేషాం అహం సముద్ధర్తా) అని భగవానుడు చెప్పెను. అనగా మోక్షమును కలిగించు జ్ఞానమునిచ్చెదనని వారి అభిప్రాయము. ఇచట మరల దీని తాత్పర్యమును మనము నిశ్చితముగా తెలియవలెను. కొందరు మానవుని వద్ద నుండి ఉపదేశమును పొందుటకు ఇష్టపడరు. సాక్షాత్తుగా భగవానుడే తమకు బోధించాలని వారి ఆకాంక్ష. ఇది ఒక సమస్య. వారికి గురువు, బోధ అను వాటి స్వరూపము తెలియదు. ఈశ్వరుని కృప యనగా బోధనకు సహకరించే అవకాశములు లభించునట్లు చేయుట తక్క మరియొకటి గాదు. సముచితమగు మనః

ప్రవృత్తులన్నియు నీకు గలవనుకో. 'బ్రహ్మవు నీవే' అని నీకు బోధించే అవకాశము ఒక్కటి చాలును. నీవు రాగద్వేషముల వశములో లేవు. కర్మయోగ ప్రభావముచే నీకు అంతఃకరణశుద్ధి కలిగినది. ఇప్పుడు నీకు కావలసినది బోధ మాత్రమే. ఆ బోధను కూడా భగవానుడు శ్రుతి ద్వారా ఈయగలడు. నీవు సంసిద్ధుడవైనచో, నీకు గురువు లభించగలడు. అది వెను వెంటనే దానంతట అది జరుగును. సరియగు పద్ధతి ఇదియే. ఈ అర్హతలన్నియు గల వ్యక్తికి బోధన యథార్థమగును. సాధకుడు కర్మయోగమయమగు జీవితమును గడుపుతూ, ఉపాసనతో బాటు జ్ఞానసాధనను కూడా చేస్తూ ఉంటే, ఇంతకు ముందు అస్పష్టమగు అభిప్రాయ రూపములో నున్నట్టియు, బహుశః అయి ఉండవచ్చును అను స్థితిలో ఉన్న ధారణలు, మరియు ఏదో కొంత అంతర్దృష్టి అంతకంతకు అధికముగా స్పష్టము కాజొచ్చును. ఇందువలననే, 'మృత్యువుతో నిండియున్న సంసారమనే సముద్రమునుండి (మృత్యుసంసారసాగరాత్) నేను వారిని జ్ఞానమునిచ్చి (జ్ఞానప్రదానేన) ఉద్ధరించెదను (అహం సముద్ధర్తా తేషాం భవామి)' అని భగవానుడు చెప్పుచున్నాడు. మౌలికమగు పాపములనుండి నిన్ను రక్షించి, స్వర్గమునకు నిన్ను గొనిపోయి, నిన్ను అక్కడ ఉంచే రక్షకుడు ఈ భగవానుడు కాదు. జ్ఞానము లేనిదే మోక్ష ప్రసక్తి లేదు.

ఈశ్వరుడు మోక్షమును పంచిపెట్టడని ఒక వ్యాఖ్యాత ఇచట అభిప్రాయపడినాడు. ఇది వాస్తవము. మోక్షము ఒక వస్తువు గాదు. కాన దానిని పంచిపెట్టుట సంభవము కాదు. పైగా, అది నిత్యసిద్ధము కూడా. భగవానుడు సర్వశక్తిమంతుడు గనుక, దేనినైననూ ఈయగలడని కొందరు వాదించెదరు. కాని సర్వశక్తిమంతుడగు భగవానుడైననూ నీకు భుజములపైకి ఒక తలను ఈయజాలడు. ఆయన దయామయుడైనచో, కొంత సమయమును వెచ్చించి, నీ భుజములపై తల ఉన్నదని నీకు నచ్చ జెప్పును. కాని నీకు ఇంతకు ముందే ఉన్న తలను ఆయన ఈయజాలడు. అదే తీరున, నీవు నిత్యముక్తుడవు. మోక్షము ఈయదగ్గ వస్తువు అయినచో, అనిత్యమగును. ఇంతకు ముందు నీ వద్ద లేని మోక్షము ఇపుడు నీకు వచ్చియున్న పక్షములో, దానిని నీవు కాపాడవలసి యుండును. ఏలయన, కాలము నందు లభించినది ఏదైనా కాలమునందు నష్టమగును. నీకు తాత్కాలికమగు మోక్షమే కావలయునన్నచో, సరే. అటులనే కానిమ్ము. నీకు అది ప్రతిదినము నిద్రలో లభించుననే యున్నది.

మరియు, ఈశ్వరానుగ్రహ ఫలరూపముగా జీవుడు ఈశ్వరునితో ఐక్యమగుటయే మోక్షము అనుట సరిగాదు. ఒక సూత్రము గలదు. సంయోజనము చేయబడినది ఏదైనా వియోజనమును పొంది తీరును. కావున ఈ సాయుజ్య వాదము నిరాధారమైనది. జీవేశ్వరులు

క్రొత్తగా కలిసేది ఏది లేదు. ఏలయన, వారి కలయిక నిత్యసిద్ధము. అది నిత్యసిద్ధము గానిచో, సృష్టిలోని ఏ శక్తియైననూ వాటిని కలిపి ఉంచలేదు. ఏకత్వము నిత్యసిద్ధమై యుండగా, ఈశ్వరుని అనుగ్రహముచే సాయుజ్యము కలుగునని (ఈశ్వరానుగ్రహాత్ సాయుజ్యమ్) చెప్పుట సరిగాదు. కావున ఈ సాయుజ్యమునకు కావలసినది జ్ఞానము మాత్రమే.

జీవుని ఆత్మ ప్రత్యగాత్మ; ఈశ్వరుని ఆత్మ పరమాత్మ అను వాదము కూడ సరిగాదు. జీవుని 'నేను' పరమాత్మయే. నేను బద్ధుడను అను ధారణ ఈ అద్వయమగు 'నేను' పై కేంద్రితమై యున్నది. అనాత్మ జడము గనుక (జడత్వాత్), ఈ ధారణ దానికి చెందియుండదు. 'నేను సంసారిని; నన్ను స్వామీజీ వద్దకు గొని పొమ్ము' అని దేహము నిన్ను గోరదు. దానికి ఏమీ తెలియదు (దేహో న జానాతి). ఆత్మయైననూ సంసారి కాదు; ఆత్మకు జననమరణములు లేవు. (న జాయతే మ్రియతే వా కదాచిత్). ఈ రెండింటి మధ్యలో జీవుడు గలడు. ఆత్మానాత్మ అవివేకము నుండి సంసారి ఉద్భవించును. ఈశ్వరుని అనుగ్రహముచే జ్ఞానము కలుగునన్నచో, ఈ మాట చాల బాగున్నది. మనము ఈశ్వరానుగ్రహమును ఉపేక్షించము. కాని ఈశ్వరానుగ్రహము చేయునది ఏది అను విషయములో మనకు స్పష్టమగు అవగాహన ఉండవలెను. జ్ఞానము వలన మాత్రమే ముక్తి లభించును. కర్మ యోగ, ధ్యానములను కలిపి అనుష్ఠించినచో, ఈశ్వరానుగ్రహము తప్పక లభించును. తద్ద్వారా మోక్షరూపమగు జ్ఞానము ఉదయించుటకు అనుకూలమగు పరిస్థితి నిర్మాణమగును.

ధ్యానము వలన లభించే అంతఃకరణనైశ్చల్యము, మరియు కర్మయోగము వలన లభించు అంతః కరణ శుద్ధి కలిసి సాధకుని జ్ఞానమునకు అర్హునిగా తీర్చిదిద్దును. అస్పష్టముగా నున్న జ్ఞానము సుస్పష్టమగును. ఈశ్వరుడు తిన్నగా మోక్షము నీయజాలడు. ఏలయన, సాధకుని స్వరూపమే ఈశ్వరుడు. ఆయన జ్ఞానమును మాత్రమే ఈయగలడు. ఆ పనిని చేయుటకు ఆయన ప్రత్యేకమగు రూపమును దాల్ప బనిలేదు. ఈ జ్ఞానము గల ఆచార్యుడెవ్వరైననూ ఈశ్వరునితో సమానమే యగును. జ్ఞానము ఉదయించే అవకాశమును మాత్రమే ఈశ్వరుడు ఈయగల్గును. అది నీ ప్రార్థనల యొక్క అదృష్టకర్మఫలము. దాని వలన నీకు విఘ్నములు తొలగి సానుకూల పరిస్థితి నిర్మాణమై, నీవు జ్ఞానమును పొందెదవు.

భక్తి భావన యొక్క అభివ్యక్తియే కర్మ యోగము. అట్టి జీవితమును గడుపు సాధకుడు మహాపుణ్యమును పొంది, దాని ప్రభావముచే ఈశ్వరానుగ్రహమునకు పాత్రుడగును.

మోక్షము నిత్యసిద్ధమనియు, సాధ్యము (created) కాదనియు అంగీకరించిన పిదప, ఈశ్వరానుగ్రహము దుఃఖమును నశింపజేయునని మనము చెప్పవచ్చునా? మోక్షమనగా అప్రియము నుండి విముక్తియే గదా! దుఃఖము ఏ రూపములో నున్నా ప్రియము కాదు గదా! ఈ వాదము కూడా స్వీకార్యము గాదు. నీవు సహజముగా అపూర్ణుడవైనచో, ఈశ్వరుడు నీ ఆ అపూర్ణత్వమును త్రోసివుచ్చి, నీకు పరమ సుఖము నీయదగును. నీ దుఃఖము ఈశ్వరానుగ్రహముచే తొలగి పోవును. కాని ఆత్మ అన్ని వేళలా ఆనంద స్వరూపమే. దుఖనాశము ఆత్మ యందు కలుగునా? అనాత్మయందు కలుగునా? ఆత్మ యొక్క స్వరూపము దుఃఖమైనచో, ఆత్మను నశింపజేయకుండగా, దుఃఖమును నశింపజేయుట ఎట్లు సంభవమగును? దుఃఖము ఆత్మ స్వరూపము గానిచో, నశింప చేయదగిన దుఃఖమే లేదు. ఆత్మయే ఆనందము. ఆత్మ మనస్సు మొదలగు వాటితో కలిసి దుఃఖి యగునని చెప్పుట పొసగదు. అసంగమగు ఆత్మ ఇతరముతో కలిసే ప్రసక్తియే లేనప్పుడు, అది ఇతర గుణమును తాను పొందుట అను ప్రసక్తి యెక్కడిది? కావున ఈశ్వరానుగ్రహము దుఃఖమును పోగొట్టునను మాట కూడ నిరాధారమే. ఈశ్వరానుగ్రహము జ్ఞానము కొరకు ఉపకరించును. మనమీ విషయమునిచట నిరూపించినాము.

ఒక విశిష్టమగు వృత్తిని పుట్టించి తద్వారా సుఖమునిచ్చే పరిస్థితులు కొన్ని గలవు. కాని దుఃఖము కేవలము అవివేకము నుండి పుట్టినది. అది మనోధర్మమని మనము తాత్కాలికముగా అంగీకరించవచ్చును. కాని అది ఆత్మకు చెందినది గాదు.

మరియొక ధారణ గలదు. జీవుడు అప్పుడప్పుడు లభించే కొద్దిపాటి సుఖమును మాత్రమే ఎరుంగును. కాని ఈశ్వరానుగ్రహముచే అతనికి బ్రహ్మానందము లభించును. ఈ వాదము సరిగాదు. ఈశ్వరుడు బ్రహ్మానందమును పంచిపెట్టడు. అది నిత్యసిద్ధమై యున్నది. ఏలయన, ఆత్మ యొక్క స్వరూపము బ్రహ్మయే. పైగా, ఈయబడే వస్తువు అయినచో, అది జారిపోవుట నిశ్చయము.

మరియొక వాదము గలదు : బ్రహ్మానందము ఆత్మస్వరూపమేనని అంగీకారమే. కాని నేను భగవానుని ప్రార్థించి అనుగ్రహమును సంపాదిస్తాను. దాని ప్రభావముచే నేను ఆత్మ నిష్ఠుడను కాగల్గుతాను. ఈ వాదము కూడ సరిగాదు. ఏదైననూ తన స్వరూపము నుండి క్షణమైననూ దూరము కాగల్గునా? మంచు చల్లగా నుండుటకు, నిప్పు వేడిగా నుండుటకు ఏమి అనుగ్రహము కావలెను? నిప్పు వేడిగా అగుటకు ఏమి ప్రయత్నము ఆవశ్యకమగును? ఈశ్వరుని అనుగ్రహము

గాని, మరియొకని అనుగ్రహము గాని లేకుండగనే, వస్తువు యొక్క స్వరూపము స్థిరముగా నుండును. ఆత్మ నిష్ఠుడై యుండుటకు ఈశ్వరానుగ్రహము కావలెననుట శాస్త్ర తాత్పర్యము నెరుంగని కేవల కల్పన మాత్రమే. జ్ఞానోదయమునకు పూర్వమే నీవు బ్రహ్మానంద స్వరూపుడవు. ఇందువలననే 'నీవు బ్రహ్మవు కాబోతావు' అని శ్రుతి చెప్పుట లేదు. 'నీవు బ్రహ్మవు అయి ఉన్నావు' అని శ్రుతి చెప్పుచున్నది.

'నేను బ్రహ్మను' అను జ్ఞానము లేని వ్యక్తిని ఉద్దేశించి శాస్త్రము బోధించుచున్నది. 'నీవు బ్రహ్మవు' అని ఆచార్యుడు చెప్పే సందర్భములో ఆయన ఆ వ్యక్తిని బ్రహ్మగా చూచునా? లేక, అబ్రహ్మగా చూచునా? అతడు అబ్రహ్మయైనచో, నీవు బ్రహ్మవని ఆచార్యుడు అతనితో ఎట్లు చెప్పగల్గును? అనగా అది భ్రమ యగునే గాని, ప్రమ (జ్ఞానము) కాజాలదు. ఆత్మ బ్రహ్మయై ఉన్నప్పుడు మాత్రమే 'నీవు బ్రహ్మవు' అని ఆయన చెప్పగల్గును. అదియే జ్ఞానము. ఈ జ్ఞానమును పొందుటలో మాత్రమే అనుగ్రహము సహకరించును. మోక్షములో గాదు.

జ్ఞానోదయమునకు పూర్వమే అతడు బ్రహ్మయై ఉన్నాడు. అందువలననే, 'నీవు బ్రహ్మవు' అని చెప్పుట సంభవమగు చున్నది. పైగా ఏది స్వరూపమో, అది తొలగిపోదు. ఆత్మ యొక్క యథార్థ స్వరూపము త్రికాలముల యందు బ్రహ్మమై యున్నది. 'స్వరూపనిష్ఠుడై యుండును' అని మనము అన్నప్పుడు జీవుడు ఒక స్థానమునకు చేరుకొని, అచట స్థిరముగా నుండునని అర్థము కాదు. ఆత్మయే బ్రహ్మ. ఆత్మ ఆరంభములో ఆనందమనియు, తరువాత ఇంకేదో రూపములోనికి మారి మరల ఇప్పుడు తన స్వరూపములోనికి మరలి వచ్చినదనియు చెప్పుట సరిగాదు. ఆత్మ అవిక్రియము. అది ఎట్టి మార్పుల కైననూ లోను గాదు. ఆత్మ నిత్య ఆనందము. నిత్య సిద్ధమగు ఆత్మానందము నీచే పొందబడదగిన భిన్న వస్తువు ఎట్లు కాగల్గును? ఆనందము బయట నుండి సంపాదించ దగిన వస్తువు అని ఎవరైననూ తలంచినచో, వారికి ఆత్మను గురించి, మరియు మోక్షమును గురించి అవగాహనలో సమస్య ఉన్నదని స్పష్టమగును.

జీవేశ్వరుల మధ్య గల అభేదమును తెలుసుకొనే ప్రయత్నమును చేయు సందర్భములో నీకు ఈశ్వరానుగ్రహము ప్రకటమగును. అద్వైతము సంభవమేనని అంగీకరించుటకైననూ ఈశ్వరుని అనుగ్రహము ఉండవలెను (ఈశ్వరానుగ్రహాత్ ఏవ పుంసాం అద్వైతవాసనా). ఈ సంసార సముద్రము అత్యంత విస్తృతమైనది. సంసారమనే సమస్యకు అద్వైతమే పరిష్కారమని వివేచించి, యోగ్యమగు వ్యక్తిని సహాయకునిగా పొందుటకు ఈశ్వరుని కృప అత్యావశ్యకమగును.

మోక్షము కృతిసాధ్యము కాదు. కాన ఈశ్వరాను గ్రహము మోక్షహేతువు కాజాలదు. కాని జ్ఞానోదయమునకు అవశ్యకమగు పరిస్థితిని ఈశ్వరాను గ్రహము కల్పించగలదు. త్రాడు తెలియక పోవుటయే సర్పమునకు కారణము అగును. అటులనే, సత్యవస్తువు యొక్క అజ్ఞానము సంసారమునకు కారణమగుచున్నది. త్రాడు తెలియగనే సర్పాను భూతి, మరియు దానిని అనుసరించి వచ్చిన భయము తొలగి పోవును. అదే విధముగా, ఆత్మ యొక్క యథార్థ స్వరూపము తెలియగనే, అనాత్మబుద్ధి మరియు దానిపై ఆధారపడి ఉండే సంసారిత్వము తొలగి పోవును.

వివేకమును గోల్పోయిన జనులు ఆత్మను అనాత్మపై, మరియు అనాత్మను ఆత్మపై అధ్యారోపము చేయుదురు. వారిలో కొద్దిపాటి వివేకము ఉదయించగనే, కర్మయోగ జీవితమును గడుపుట ఆరంభమగును. ఇది సాధారణమగు విషయము కాదు. ఇది వారికి భక్తి వలన మాత్రమే సంభవమైనది. కర్మఫలదాతయగు ఈశ్వరుడు దీని ప్రతిఫలమును వారికి ఇచ్చును. ఈశ్వరుని అనుగ్రహముచే వారికి సత్పురుషులతోడి సంగము లభించి, వివేకమును పెంపొందించుటకు అవసరమగు బోధ (teaching) వారికి లభించును. వారికి ఆత్మానాత్మ వివేకము లభించి, అధ్యారోపములు తొలగిపోవును. అట్టి జ్ఞానులు ఆత్మ స్వరూప జ్ఞానమును బడయుదురు.

ఈ తీరున పరిశీలిస్తే, భగవానుడు వారికి మోక్షమునిచ్చునన్నట్లు కన్పట్టును. కాని, వాస్తవంలో వారు ఈశ్వరుని అనుగ్రహము కొరకు ప్రార్థించుట ద్వారా, మోక్షమునకు కావలసిన షరతులనన్నింటినీ సంపాదించెదరు. రక్షకుడు ఎక్కడనో దూరముగా లేడు. నీ జీవితమునకు నీవే బాధ్యత వహించవలెను. ఫలములు దాని వెనుకనే వచ్చును. మన జీవితమును మనమే తీర్చి దిద్దు కొనవలెను. ఈశ్వరానుగ్రహము కొరకు యత్నించుట దానిలో భాగమే. నీకు ఆరోగ్యము సరిగా లేనిచో, వైద్యుని వద్దకు వెళ్లెదవు. నీవు స్వయముగా వెళ్లలేనిచో, మరియొకరి సహకారమును స్వీకరించెదవు. తెలివితేటలతో గూడిన జీవితము ఇటులనే ఉండును. ఈశ్వరాను గ్రహము ఒక విచిత్ర రూపములో రాదు. అది నీ కృషి ఫలితమే. నేను జ్ఞానమునిచ్చి వారిని రక్షించెదను (తేషాం అహం సముద్ధర్తా) అని భగవానుడు చెప్పుటలో తాత్పర్యమిదియే. ఇది తెలుసు కోదగిన ప్రముఖమైన విషయము.

మృత్యువుతో నిండియున్న సంసారము నుండి విముక్తిని పొందుటకు మనమేమి చేయవలెను?

**అధ్యాయము 12, శ్లోకము 8 :**

मय्येव मन आधत्स्व मयि बुद्धिं निवेशय।
निवसिष्यसि मय्येव अत ऊर्ध्वं न संशयः ॥ ८ ॥

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః (8).

**మయి ఏవ** = నా యందు మాత్రమే, **మనః** = మనస్సును, **ఆధత్స్వ** = నిలిపి యుంచుము, **బుద్ధిమ్** = బుద్ధిని, **మయి** = నా యందు, **నివేశయ** = ప్రవేశ పెట్టుము, **అతః ఊర్ధ్వమ్** = అటు పిమ్మట, **మయి ఏవ** = నా యందు మాత్రమే, **నివసిష్యసి** = నివసించి యుండగలవు, **సంశయః** = సంశయము, **న** = లేదు.

నా యందు మాత్రమే మనస్సును నిలిపి యుంచుము. బుద్ధిని నా యందు ప్రవేశ పెట్టుము. అటు పిమ్మట నా యందు మాత్రమే నివసించి యుండగలవు. సందేహము లేదు (8).

మయి ఏవ = నా యందు మాత్రమే. ఈ 'నేను' విశ్వరూపమును నిర్దేశించునని శ్రీ శంకరులు వివరించిరి. నీ మనస్సును నాకు అంకితము చేయుము (మయ్యేవ మన ఆధత్స్వ). మనః బుద్ధిః అను రెండు పదములకు అర్థము అంతః కరణమే. కాని రెండింటినీ ఒకే చోట ప్రయోగించిన ఇటు వంటి సందర్భములలో వాటిని సంకోచము చేసి అర్థభేదమును చెప్పవలెను. ఈ రెండు అంతః కరణవృత్తులే అయినా, ఆలోచించే పద్ధతిని బట్టి వాటి మధ్య భేదము గలదు. నిశ్చయమునకు, అనిశ్చితస్థితికి మధ్యలో మనస్సు కొట్టు మిట్టు లాడుచుండును (సంకల్ప వికల్పాత్మకమ్). బాగుగా నిర్ధారింపబడిన నిష్కర్షకు దారి తీసే పనిని బుద్ధి చేయును (నిశ్చయాత్మికా). ఈ రెండు 'నా యందు' ఉండవలెనని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ రెండింటినీ ఆయన వేర్వేరుగా చెప్పుటకు కారణమేమి? మనస్సును ఈశ్వరుని యందు ఉంచినచో, బుద్ధిని కూడ తప్పని సరిగా ఈశ్వరుని యందు ఉంచినట్లు అగును గదా? పరిస్థితి ఇది కానే కాదు. నాకు ఏది కావాలి? అను విషయమును ఖచ్చితముగా తెలుసుకొని, ఆ తెలివిడిని బాగుగా జీర్ణము చేసుకున్నప్పుడు ఉదయించే అంకిత భావము (పురుషార్థ నిశ్చయము) వ్యక్తి యందు లేక పోవచ్చును. ఈశ్వరుడనగా నేమి? నేనీ పనిని ఏల చేయుచున్నాను? నేను అన్వేషించు ఫలమేది?

అను విషయములపై ఖచ్చితమగు నిశ్చయము ఉండవలెను. అదియే నిశ్చయాత్మికా బుద్ధిః అనబడును. అట్టి బుద్ధి గల వ్యక్తి మనస్సును ఈశ్వరునిపై నుంచినచో అది అచట నిలబడును. అట్లు గానిచో, సాధన యొక్క ఆవశ్యకతను గురించి, ఈశ్వర స్వరూపమును గురించి అస్పష్టత ఉండును. అపుడు ఇతర అభిరుచులు కూడ వ్యక్తిని వివశుని చేయును. అతని మనస్సు మార్గము నుండి విచలితమగుట సహజమే. దీనికి భిన్నముగా, ఏది కావాలి? అను విషయములో నీకు నిశ్చయమున్నచో, నీ సాధన సరియగు దిశలో కొనసాగి అర్థవంతమగును. ఇందువలననే, తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ అను లక్షణము తరువాతి అధ్యాయములో నిరూపించ బడినది. నిరంతరముగా వేదాంతమును అధ్యయనము చేయుట (అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వమ్) అను జీవన మూల్యము కూడ అక్కడ చెప్పబడినది. కాని అది ఒక్కటి మాత్రమే చాలదు. ఆ జీవన మూల్యములో చాల అస్పష్టత గలదు. కావుననే అధ్యయనము యొక్క ప్రయోజనము ఆత్మ స్వరూపము నెరుంగుట (తత్త్వజ్ఞానార్థ దర్శనమ్) అను దృష్టితో అధ్యయనమును చేయవలెనని శ్రీకృష్ణుడు చెప్పును. పురుషార్థ నిశ్చయమనగా నిదియే.

నేను జీవితములో యథార్థముగా అన్వేషించునది ఏది గలదో, అదియే మోక్షము. అది తత్త్వ జ్ఞానము వలన లభించును. ఈ రెండింటికీ మధ్య సంబంధమును నెలకొల్పవలెను. నీవు కోరేది విముక్తియని నీకు స్పష్టముగా తెలియాలి. నేను కోరేది విముక్తి అని తెలిసిననూ, అది మాత్రమే సరిపడదు. దుఃఖ విముక్తిని గోరి మానవులు విభిన్న కార్యముల ననుష్ఠించుచుందురు. వారు చేయు దానికి, వారు వాస్తవముగా కోరుదానికి సంబంధము లేశమైననూ ఉండదు. ఏలయన, మోక్ష స్వరూపమును, తత్సాధనమును వారు స్పష్టముగా నెరుంగరు. అందువలననే భగవానుడు తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ అని చెప్పినాడు. మోక్షము ఆత్మ స్వరూపమే ననియు, ఆత్మ ఈశ్వర స్వరూపము కంటె వేరు గాదనియు, ఈశ్వరుడు తానే స్వయముగా ఈ జగద్రూపములో కనబడు చున్నాడనియు స్పష్టమగు అవగాహన ఉండవలెను. భగవానుడు ఎక్కడనో ఒకచోట గూర్చుండి కొందరికి పారితోషికములను ఇచ్చి, మరి కొందరికి శిక్ష వేసి న్యాయమును పరిరక్షించు చుండుననే అస్పష్ట ధారణ వలన ప్రయోజనము లేదు. ఇటువంటి ఈశ్వరుని స్థానము నందు సగుణ బ్రహ్మ రూపములో నున్న ఈశ్వరుడు బోధింపబడినాడు. కావున 'నీవు నీ మనోబుద్ధులను రెండింటినీ ఈశ్వరునకు సమర్పింపుము'. ఇది ఒక అర్థము.

ఇంకొరకముగా వ్యాఖ్యానించవచ్చును. 'నేను కావాలని నీవు కోరినావు గనుక, నీ మనస్సును నాపై సంలగ్నము చేసి, నీ బుద్ధిని నాలో ప్రవేశపెట్టుము'. విచారముచే మాత్రమే బుద్ధిని

ఈశ్వరుని యందు ప్రవేశ పెట్టదగును. ఈ విచారము సక్రమముగా నుండవలెను. నేను ఎవరిని? అని నీవు అదే పనిగా ప్రశ్నిస్తే, నీకు ఏమి సమాధానము లభించును? ప్రశ్నను అడిగే నీ గురించి నీకు ఇప్పటికే తెలిసియున్న సమాచారము మాత్రమే సమాధానముగా లభించును. నీవు అధికముగా ప్రశ్నించే కొలదీ, నీకు గల భ్రాంతి మరింత బయట పడుచుండును. ఆత్మ తనను తాను చూపెట్టదు. ఏలయన, ఆత్మ ప్రశ్నించు వానిలో సదా సాక్షిరూపమున నున్నది. ఆత్మ యొక్క సార స్వరూపమును దర్శించలేక పోవుటకు ప్రశ్నించక పోవుట కారణము కాదు. ఇటువంటి విచారము వలన లభించే అత్యధిక ప్రయోజన మేమనగా, నిద్రలో వలె, లేదా ఆనందము కలిగిన ఘడియలలో వలె, అహంకారము కొంత వరకు లయమగును. అది కేవలము ఒక అవస్థ మాత్రమే గాని జ్ఞానము కాదు. ఇట్టి విచారము నుండి బయటకు వచ్చిన తరువాత నీకు నీ గురించి అధికముగా తెలిసినది ఏదీ ఉండదు. 'నేనెవరిని?' అను ప్రశ్న వలన లభించే అత్యధిక ఫలము లయము. దాని వలన జ్ఞానమెట్లు కలుగును? ప్రక్కనే ఎవడో దగ్గగానే, అహంకారము పునరుద్బుద్ధమై సమాధి సమాప్తమగును. ఏలయన, అహంకారము సూక్ష్మరూపములో మిగిలియే యుండును. కాని, దీనికి భిన్నంగా నీవు జ్ఞాన ప్రభావముచే అహంకారము తోడి తాదాత్మ్యమును పూర్తిగా నిర్మూలించినచో, దానికి పునరావృత్తి ఉండే ప్రసక్తి లేదు. అహంకారము ఉన్ననూ, అది యథార్థమగు అహంకారము కాదు. ఏలయన, ఆత్మ అహంకార వినిర్ముక్తము, స్వతంత్రము. కాని అహంకారము ఆత్మ కంటె స్వతంత్రముగా లేదు. అట్టి అహంకారము సమస్యలను సృష్టించదు. ఇదియే జ్ఞానము. దీనిని ఎట్లు పొందవలెను?

ఆత్మ ఇప్పటికంటె అధికముగా వ్యక్తము కాజాలదు. నీవు నీ గురించి తెలుసు కోకపోతే, ఆత్మ అడ్డు చెప్పదు. ఆత్మ ధర్నా చేయదు. నీవు చదువుతున్న విషయమునకు కాంతి అడ్డు చెప్పదు. అటులనే నీవు చేయు ఆలోచనలకు ఆత్మ చైతన్యము విరోధి కాదు. 'నేను కోతిని' అని నీవు భావిస్తే, ఆత్మ చైతన్యము ఇతర భావనలను వలె ఆ భావనను కూడా ప్రకాశింపచేయును. అజ్ఞానము ఉన్నప్పుడు జ్ఞానము ఉన్నది. అజ్ఞానము లేకున్ననూ జ్ఞానము ఉండును. ఆత్మ స్వరూపమును నిరూపించే ఒక వృత్తి బుద్ధిలో ఉదయించినప్పుడు, ఆ వృత్తి మాత్రమే ఆత్మ-విషయక-అజ్ఞానమునకు విరోధి యగును. ఆత్మ యొక్క స్వరూప భూతచైతన్యము అజ్ఞాన విరోధి గాదు. కావున కేవలము 'నేనెవరిని?' అని ప్రశ్నించు కున్నచో ప్రయోజనము లేదు. నీకు సముచిత మగు జ్ఞాన సాధనము (ప్రమాణము) ఒకటి కావాలి. ఆత్మను గుర్తించక పోవుట, ఆ కారణంగా దాని విషయములో భ్రాంతికి లోనగుట అనునది ఇచటి సమస్య. ఆ భ్రాంతిని నివారించుటకు నీకు ఆత్మ జ్ఞానము కావాలి. ఆత్మ జ్ఞానమును పొందుటకు ప్రమాణము ఉండాలి.

ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములు అనాత్మను మాత్రమే ప్రదర్శించ గలవనియు, ఆత్మను కాదనియు మనము చూచి యున్నాము. కావున, 'నేనెవరిని?' అను ప్రశ్నకు నీవు సమాధానమును నీ లోపల గాక, ప్రమాణ భూతమగు శాస్త్రములో వెదుక వలయును. నీవు శాస్త్రమును చదివినప్పుడు పరమేశ్వరునకు అంకితమగుదువు. మయి బుద్ధిం నివేశయ అనగా పరమేశ్వరుని గురించి విచారింపుము అని యర్థము. ఇది వేదాంత విచారము తక్క మరియొకటి గాదు. వేదాంత విచారమనగా 'తత్త్వమసి' ఇత్యాది వాక్యముల తాత్పర్యమును గురించి విచారము చేయుట. ఇచటి అభిప్రాయమేమనగా, నీవు మనస్సులో సగుణ బ్రహ్మను ధ్యానిస్తూ, కర్మయోగ జీవితమును గడుపు చుండుము. బుద్ధిని ఈశ్వరవిచారమునకు కట్టుబడి యుండునట్లు చేయుము. అపుడు నీవు ఈశ్వరసాక్షాత్కారమును పొందకుండగా ఏదీ ఆపలేదు.

తరువాత నీవు 'నా యందు' మాత్రమే ప్రవేశించగలవు (అతః మయి ఏవ నివసిష్యసి). భక్తుడగు జీవుడు భగవంతునిలోనికి, అమీబా ఉదరములోనికి వలె, ప్రవేశించునా యేమి? అటులనే అయినచో, జీవుడు ఈశ్వరుని కంటె భిన్నముగా మిగిలియుండును. కావుననే, 'నీవు ఆత్మ రూపుడవై నాలోనికి ప్రవేశించెదవు' అని శ్రీ శంకరులు వివరించిరి. ఈశ్వరుని ఆత్మ, జీవుని ఆత్మ అను భేదము సమసి పోవును. అనంతమగు ఒకే ఒక ఆత్మ గలదు. జీవునకు తన గురించి గల ధారణలు విలీనమగును. ఈశ్వరుని లోనికి ప్రవేశించుట యనగా నిదియే. కర్మయోగ జీవితమును గడుపుతూ విచార సహకృతమైన ఉపాసనకు ఇట్టి మహాఫలము లభించును.

నీవు ఆ తరువాత 'నాయందు' ప్రవేశించగలవనుటలో సందియము లేదు (అత ఊర్ధ్వం న సంశయః). 'ఆ తరువాత' అనగా 'ఈ జ్ఞానమును పొందిన తరువాత' అని కావచ్చును. లేదా 'మరణానంతరము' అని కావచ్చును. ఆ తరువాత ఈశ్వరుడు మాత్రమే ఉండును; జీవుడు ఉండడు. కావున సంశయమునకు అవకాశము లేదు. ఇట్టి జ్ఞాని మరణించిన తరువాత మరల జన్మించడు (న పునరావర్తతే). దీనిని ఇంకో రకముగా వ్యాఖ్యానించవచ్చును. జీవించి యుండగా నీవు నాతో ఉన్నచో, మరణించునది ఎవరు? ఈశ్వరుడు మరణించనిదే, నీవు మరణించవు. ఏలయన, నీవే ఈశ్వరుడవు. ఈశ్వరుడు నిత్యుడు. కావున, నీవు మరణించే సంభావనయే లేదు.

విషయవస్తువును బోధించిన పిదప, నీ కర్తవ్యము నీకు సుస్పష్టముగా తెలియుచునే యుండును. దాని యందు సందేహమునకు తావు ఉండనే ఉండదు. కాని 'న సంశయః' అని పలుకుట ఆవశ్యకము. ఏలయన, అర్జునుడు ప్రశ్నించుటను బట్టి అతనికి సందేహములు గలవని తెలియుచున్నది. అందువలననే, 'నీవీ విధముగా జీవించినచో, నాలో ఐక్యమగుదువనుటలో

సంశయము లేదు' అని భగవానుడు చెప్పుచున్నాడు. నిర్గుణ బ్రహ్మను ఉపాసన చేయువారు, మరియు కర్మయోగ జీవనమును గడుపుతూ సగుణ బ్రహ్మను ధ్యానించువారు అను ఇరువురిలో ఎవరు గొప్పవారు? అనగా మోక్షమునకు ఎవరు దగ్గరలో నున్నారు? అను విషయమును అర్జునుడు తెలియగోరెను. పరమేశ్వరుని విశ్వరూపమును ధ్యానించే కర్మయోగులు భగవానునకు దగ్గరలో నున్నారని శ్రీకృష్ణుడు సమాధానము నిచ్చెను. వారు యోగవిత్తములని ఆయన చెప్పెను. నిర్గుణ బ్రహ్మోపాసకుల గురించి ఆయన మాటలాడదలచలేదు. ఏలయన, వారు పోలికలకు అందరు. కర్మయోగము మాత్రమే అనుగ్రహించగల ఆవశ్యకమగు లక్షణములన్నియూ కలిగియున్న జ్ఞానులు వారు.

కర్మయోగులనుద్దేశించి భగవానుడిట్లు చెప్పెను : నీవు నీ మనస్సును నాపై సంలగ్నము చేయుము. నా గురించి తెలుసుకొని ఆ తెలివిడిని ఆధారముగా చేసుకొని నీ బుద్ధిని నాకు కట్టుబడి యుండునట్లు (నిశ్చయ) చేయుము. నీవీ తీరున పరమేశ్వరుని ధ్యానించినచో, నీ అంతః కరణము శుద్ధమై, నీవు నాతో ఐక్యమును పొందగలవు. అనగా నీవు జీవేశ్వరుల మధ్య గల అభేదమును సాక్షాత్కరించు కొనగలవు.

జ్ఞానమును పొందుటకు ఆవశ్యకమగు అంతః కరణశుద్ధి కొరకై కర్మయోగమును చేపట్టిన కర్మ యోగియే భక్తుడనబడును. ఈ ప్రక్రియను అతడు శీఘ్రతరము చేయగోరి విఫలమగుచున్నాడు. నీవు నీ మనస్సును ధ్యేయవస్తువు నందు ప్రవేశింప జేయుటకై ఈ క్రింద వివరించిన సోపానములను అనుసరించుమని భగవానుడు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 12, శ్లోకము 9 :**

अथ चित्तं समाधातुं न शक्नोषि मयि स्थिरम् ।
अभ्यासयोगेन ततो मामिच्छाप्तुं धनंजय ॥ ९ ॥

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ (9)

**అథ** = అపుడు, **మయి** = నా యందు, **చిత్తమ్** = మనస్సును, **స్థిరమ్** = స్థిరముగా, **సమాధాతుమ్** = సంలగ్నము చేయుటకు, **న శక్నోషి** = సమర్థుడవు కానిచో, **తతః** = అప్పుడు,

ధనం జయ = ఓ అర్జునా!, అభ్యాసయోగేన = యోగాభ్యాసముచే, మామ్ = నన్ను, ఆప్తుమ్ = పొందుటకు, ఇచ్ఛ = ప్రయత్నించుము.

> ఓ అర్జునా! నీవు మనస్సును నా యందు స్థిరముగా సంలగ్నము చేయుటకు సమర్థుడవు కానిచో, అప్పుడు యోగాభ్యాసముచే నన్ను పొందుటకు ప్రయత్నించుము (9).

మయి అనగా సగుణ బ్రహ్మ రూపుడను, పరమేశ్వరుడను అగు నా యందు. కొంత సమయము వరకు మనస్సును ఒకే వస్తువుపై నిలుపుట ధ్యానమనబడును. నీవు 'నా యందు' మనస్సును నిలిపి ధ్యానమును చేయుట సంభవము కానిచో, ఏమి చేయవలెను?

''అట్టి స్థితిలో నీవు నన్ను అభ్యాసయోగము ద్వారా చేరుకొనే ప్రయత్నమును చేయుము''. ఒకే పనిని మరల మరల (పునః పునః) చేయుట అభ్యాసమనబడును. అనగా యాంత్రికముగా చేయుట కాదు. సావధానతతో చేయవలెను. మానవులకు గల నైపుణ్యములన్నియు పూర్ణముగా అభ్యాసముపైననే ఆధారపడి యున్నవి. అనేక గంటలు సరియగు విధానములో అభ్యసించిన తరువాతనే డ్రైవరు కారును, పైలట్ విమానమును నడుపగల్గుదురు.

ఇచట కూడా పరిస్థితి అంతే. అభ్యాసము లేకపోవుటచే మనస్సు ధ్యేయవస్తువుపై నిలకడగా ఉండలేకపోతున్నది. మనస్సును నిలకడగా ఉంచే నైపుణ్యమును మనము నేర్వలేదు. మనము జీవితమునంతనూ ద్వైధీభావములో మరియు అన్యమనస్కతతో గడిపి యుంటిమి. మనము తొక్కిపెట్టనిచో, మనస్సు దేనిపైననూ ఏకాగ్రతతో నిలువరించదు. ధ్యానములో మనలను ఇతరులెవ్వరూ నిగ్రహించరు. మనము వివిధనైపుణ్యములను సంపాదించి యుండవచ్చును. కాని ప్రశాంతముగా కొద్ది నిముషములు కూర్చుండు మన్నచో, అది మనవలన గాదు. మనలో వెంటనే అస్థిరత నెలకొనును. మానవుని మనస్సులో ఈ సమస్య గలదు. కాని దానిని ఒక పనిని చేయుమని నిగ్రహించినచో, అది చేయగలదు. వార్తా పత్రికలోని ఒక వ్యాసమునందలి విషయవస్తువు నీ మనస్సునకు నచ్చినదనుకో. దానిని నీవు చదువకుండా ఉండలేవు. నీ మనస్సు కొంత సమయము వరకు దానిపై లీనమగును. అపుడు మాత్రమే నీకు ఆ వ్యాసము అవగాహనకు వచ్చును. డిటెక్టివ్ నవలను తెరచి, నీవు నిద్రను విడనాడి, ముందు అట్ట నుండి వెనుక అట్ట వరకు ఏక బిగిన చదువగలవు. నీ మనస్సు దాని యందు స్థిరమగును. ఇటునటు చెదరిపోదు. కాని నీవు ధ్యేయవస్తువును ఎన్నుకొని ధ్యానము నారంభించగనే, నీ మనస్సు సర్వత్రా విహరించుచుండుట నీకు అనుభవమే.

కావున, 'నీవు నీ మనస్సును నాయందు నిలకడగా నుంచుటకు (మయి సమాధాతుమ్) సమర్థుడవు కానిచో (న శక్నోషి)' అను స్థితిని భగవానుడు సహృదయమ అర్థము చేసుకొనినాడు. నీవు నీ మనస్సును ఒక వస్తువుపై తల్లీనము చేసి, ప్రయత్నము లేకుం నిలకడగా దానియందు ఉంచగల్గినచో, దానికి చిత్తసమాధానము అని పేరు. అది నీకు సాధ్య గానిచో, యోగాభ్యాసమును మొదలిడుము. ఇచట యోగమనగా అష్టాంగయోగము. మన కర్మయోగిని గురించి చర్చించు చున్నాము గనుక, అతని యందు యమనియమములు అప్ప సంపన్నమైనవని మనమెరుంగుదుము. అతడు ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధార నభ్యసించినచో, ధ్యానమును చేయు సామర్థ్యము (ధ్యానసిద్ధి) కలుగును. ఇది సిద్ధించుటకై శాస్త్ర నిర్దిష్టమైన అంగములను అనుసరించును. నీవు కూర్చుండి ధ్యానించుటకు అనుకూ భంగిమలు అనేకము గలవు. వాటికి ఆసనములని పేరు. కొంత సమయము వరకు కూర్చుండ సామర్థ్యము (ఆసనసిద్ధి) ను అభ్యాసము చేసి సంపాదించవచ్చును. అనుశాసనయుతమ శ్వాసక్రియకు ప్రాణాయామమని పేరు. నీవు ప్రయత్నపూర్వకముగా నిర్దిష్టపరిమాణములో గా పీల్చి వదులు చుండవలెను. పీల్చిన గాలిని ఒక నిర్దిష్ట సమయము వరకు బంధించి ఉంచవలె గాలిని విడిచిన తరువాత ఆ నిర్దిష్ట సమయము వరకు మరల గాలిని పీల్చరాదు. ప్రత్యాహారమను తృష్ణ లేకుండుటను పెంపొందించే అనుశాసనము. ప్రతి వస్తువును పట్టి దాచుకునే అలవాటు ప్రక్కన బెట్టుట మనకు చేతగావాలి. మరియు నిరుపయోగకరమగు వస్తువులను పరిత్యజించు మనకు తెలియాలి. గదిలోని చెత్త సామానును మనము ముందుగా బయట పారవేయవలెన కాని ఇది కష్టమైన పని. ఏలయన, ఏదో ఒకనాడు ఉపయోగమునకు వచ్చుననే భావన మన సర్వదా ఉండును. పది సంవత్సరములనుండి మూలపడియుండియూ అక్కరకు రా వస్తువునైననూ మనము పారవేయజాలము. ప్రత్యాహారాభ్యాసము ఇక్కడ ఆరంభమగును మనస్సును ఏకాగ్రము చేయు అభ్యాసమునకు ధారణయని పేరు. ముందుగా మనము ప్రేమిం వస్తువులపై మనస్సును నిలిపే ప్రయత్నమును చేయవలెను. మనస్సును లీనము చేయుటలో అభిరు గల వస్తువుతో ఏకాగ్రతను అభ్యసించుట ఆరంభించినచో, అట్టి అభ్యాసము సరళముగా నుండును.

ఈ అంగములన్ని కలసి అభ్యాసయోగమనబడును. ఇవి ధ్యానమునకు మార్గమును సుగమము చేయు సోపానములు. ఈ అనుశాసనములను పాటించు వ్యక్తికి ఇవి ధ్యానమును చేయగలిగే శక్తిని ప్రసాదించును. నీవు ధ్యానమును చేస్తూ, అదే సమయములో శాస్త్రమును అధ్యయనము చేయవలెను. నీవీ సృష్టిలో ఒక భాగస్వామివి గనుక, కొన్ని విశిష్ట కర్మలను చేయాలని

అపేక్షింపబడే పరిస్థితులు నీకు ఎదురగుట సహజమే. ఇట్టి కర్తవ్య కర్మకు విధి యని పేరు. ఈ విధి నైతిక నియతి (ధర్మము)కి అనురూపముగా నుండును. ఈ ధర్మము ఈశ్వర స్వరూపము అను దర్శనమే కర్మయోగమగును.

మనస్సు ధ్యేయవస్తువు నుండి చెదిరిపోయిన ప్రతి పర్యాయము మరల మరల ధ్యేయవస్తువు మీదకు తీసుకు వచ్చి నిలుపుటయే అభ్యాసయోగమనబడునని శ్రీ శంకరులు నిర్వచించిరి. మరల మరల (పునః పునః) అనుటకు కారణమేమి? మనస్సు విచలితమగు చుండును గనుక మనస్సును మరల మరల ధ్యేయవస్తువు పైకి మరల్చుటయే ధ్యానమని నిర్వచింపబడినది. ధ్యాన సమయములో మనస్సు పరిభ్రమించుచున్నదని వేదనను చెందుట వృథా. ఏలయన, అట్లు విచలితమగు చుండుటయే ధ్యానమునకు అలంబనమైనది. మనస్సు తల్లీనమై స్థిరముగా నున్నచో, అది సమాధియగును. ధ్యానములో మనస్సు పరిభ్రమించు చుండును. అది విచలితమైన ప్రతి పర్యాయము దానిని ధ్యేయవస్తువుపైకి మరల్చవలెను. అది మరల పారిపోయినచో, మరల దానిని వెనుకకు గొని రమ్ము. అభ్యాసమనగా నిదియే. ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణలు ధ్యానమునకు అంగములని భావించవచ్చును. 'ఓ అర్జునా! కావున నీవు యోగాభ్యాసముచే నన్ను చేరుకునే యత్నమును గావించుము (తతః అభ్యాస యోగేన అప్తుం ఇచ్ఛ)' అని శ్రీ కృష్ణుడు చెప్పుచున్నాడు.

తరువాత, భగవానుడిట్లు చెప్పుచున్నాడు :

**అధ్యాయము 12, శ్లోకము 10 :**

अभ्यासेप्यसमर्थोसि मत्कर्मपरमो भव ।
मदर्थमपि कर्माणि कुर्वन् सिद्धि मवाप्स्यसि ॥ १० ॥

అభ్యాసేప్యసమర్థోసి మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి (10).

**అభ్యాసే అపి** = అభ్యాసమునందైననూ, **అసమర్థః అసి** = సమర్థుడవు గానిచో, **మత్కర్మపరమః** = నాకు అర్పించబడే కర్మలు పరమలక్ష్యముగా గలవాడవై, **భవ** = అగుము, **మదర్థమ్** = నా కొరకు, **కర్మాణి** = కర్మలను, **కుర్వన్ అపి** = చేయుచున్ననూ, **సిద్ధిమ్** = విజయమును, **అవాప్స్యసి** = పొందగలవు.

అభ్యాసమునందైననూ సమర్థుడవు గానిచో, నాకు అర్పింపబడే కర్మలు పరమ తాత్పర్యముగా గలవాడవు అగుము. నా కొరకు కర్మలను చేయుచున్ననూ విజయమును పొందగలవు (10).

ఇది కూడా చేత కాలేదనుకో. ఏమియూ చేయకుండగా స్థిరముగా కూర్చుండుట చాల కష్టము. అపుడే సగుణ బ్రహ్మ ధ్యానమును ప్రక్కన బెట్టి, నీవు నీ నిత్యప్రార్థనలను, విధులను ఈశ్వరార్పణ బుద్ధితో అనుష్ఠించుము. ధర్మము ఈశ్వర రూపము అని గుర్తించి, దానికి అనురూపముగా నుండుటయే అర్పణమనబడును. భగవానుడు 18వ అధ్యాయములో నిట్లు చెప్పబోవుచున్నాడు.

యతః ప్రవృత్తి ర్భూతానాం యేన సర్వమిదం తతమ్
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః (46)

భూతములన్నియు పరమేశ్వరుని నుండి ఉద్భవించినవి. పరమేశ్వరుడు సర్వమును భరించి పోషించుచున్నాడు. ఈ సత్యమును గుర్తించి మానవుడు ఒక విశిష్ట పరిస్థితిలో ఒక విశిష్ట కాలములో తన యెదుట సంప్రాప్తమైన కర్తవ్యకర్మను ఆచరించుట ద్వారా భగవానుని ఆరాధించవలెను (స్వకర్మణా తమభ్యర్చ్య). ఇచట స్వకర్మయనగా ఒక విశిష్ట పూజానుష్ఠానము గాదు. ఇచటి తాత్పర్యమేమనగా, ధర్మము ఈశ్వర స్వరూపమని గుర్తించి, తదనురూపముగా జీవించవలెను. ఇట్లు చేయు మానవుడు విజయమును పొందును (సిద్ధిం విందతి మానవః). ఇచట విజయమనగా జ్ఞానోదయమునకు ఆవశ్యకమగు అంతః కరణశుద్ధి. వాస్తవికమగు విజయము మోక్షము.

కావున నీకు ధ్యానము కుదరనిచో, నిన్ను నీవు నిందించు కొనవలదు. నీవు కర్మయోగరూపముగా ఏ కర్మను అనుష్ఠించు చుంటివో, దానినే కొనసాగించుము. అది చాలును. నీకు సర్వము సిద్ధించును. ధర్మమును ఈశ్వర రూపముగా దర్శించుట చేతగానిచో, భగవానుడు తరువాతి శ్లోకములో మరి యొక వికల్పమును మనముందు ఉంచుచున్నాడు. నీవు రాగ ద్వేషములను ధర్మానురూపముగా పరిపూర్తి చేసుకుంటూ, కర్మలనన్నిటినీ చేయుము. ఫలము లభించగానే, ముందుగా దానిని పరమేశ్వరునకు నివేదించి, తరువాత స్వీకరించుము. భారత దేశములో ఇది సర్వజన సాధారణమగు ఆచారము. జనులకు దాని వెనుకనున్న గూఢార్థము తెలియక పోవచ్చును. కాని వారు ఈ ఆచారమును పాటించెదరు. వంట కాగానే, ఆహారమును భగవానునకు నివేదన చేసి తరువాత భుజించెదరు. ఇల్లు కట్టిన తరువాత, ముందుగా దానిని

భగవానునకు సమర్పించి, తరువాత దానిలో ప్రవేశించెదరు. క్రొత్త వస్తువుల నన్నింటినీ భగవంతునకు నివేదించెదరు. క్రొత్తగా పుట్టిన శిశువును భగవంతునకు సమర్పించెదరు. అనగా ఆ శిశువు ప్రసాదము అగును. భగవంతుని నుండి మనకు లభించేది ప్రసాదమనబడును. ఈ పనిని ఎవ్వరైనను చేయగల్గుదురు. వాస్తవముగా ఈ వికల్పములలో పరస్పరభేదము అధికముగా లేదు. ఒక దాని నుండి మరియొక దానికి ప్రాధాన్యత మాత్రమే మారుతూ వచ్చినది. అంతే. కాని ఒక విషయము స్పష్టమగుచున్నది. కర్మయోగ జీవనమును గడుపుతూ, దానితో బాటు ఈశ్వరుని సగుణరూపమును ధ్యానించు సాధకుడు యోగవిత్తముడు. ఈ శ్రేష్ఠత్వమునకు తాత్పర్యమేమనగా అతడు మోక్షమునకు చాల దగ్గరలో నున్నాడు.

తతః మాం ఆప్తుం ఇచ్ఛ. నన్ను ధ్యానించవలెనని కోరుకొనుము. ఆప్తుమ్ అనగా పొందుట. కాని ఈ సందర్భములో ధ్యానించుటకు (ధ్యాతుమ్) అని అర్థము. అంతతో గత్వా అది ఒక ఉపలబ్ధియే గనుక, ఆప్తుమ్ అనగా పొందుటకు అను అర్థము కూడ సమీచీనమే. నీవు ధ్యానించి, జ్ఞానమును పొంది నన్ను పొందవలెనని కోరుకొనుము.

నీవు ఈ అభ్యాసమును కూడ చేయ సమర్థుడవు కానిచో (అభ్యాసే అపి అసమర్థః అసి), కర్మయోగ జీవనమును గడుపుము. అది సరిపడును. ఈశ్వరుని కొరకు కర్మల నాచరించుటయే పరమలక్ష్యముగా కలిగి జీవించుము (మత్కర్మ పరమో భవ). ఇచట పరమ లక్ష్యమనగా- జ్ఞానోదయమునకు అంతః కరణ శుద్ధి ఆవశ్యకము. దానికి సాధనము కర్మయోగము. దానికి సాధకుడు కటిబద్ధుడగును.

ఈశ్వరుని కొరకు కర్మను చేయుట అనగా నేమి? యజమాని సేవకుని సేవలను అపేక్షించు విధంబున, ఈశ్వరుడు నీ కర్మను అపేక్షించునా? యజమాని సేవకునకు కర్తవ్య కర్మను గురించి ఖచ్చితమగు ఆదేశములను జారీ చేయును. సేవకుడు ఆ ఆదేశములను పాటించి కొంత జీతమును ప్రతిఫలముగా పొందును. ఈ వ్యవహారములో వారిద్దరకీ లబ్ధి గలదు. అదే తీరున భగవానుడు కూడ ఒక సాధ్యమును సాధింపగోరి నీకు కొన్ని పనులను చేయుమని నిర్దేశించునా? నీ కర్మణ్యత వలన ఆయన లబ్ధిని ఆశించునా? అట్లైనచో, ఆయన ఈశ్వరుడే కాదు. భగవానుడనగా పూర్ణుడని నిర్వచనము. కావున, ఈశ్వరుని కొరకు భక్తుడు చేయు కర్మల నుండి ఈశ్వరునకు లాభము కలుగదు. మనము దేనిని కోరగలమో అది సర్వము ఈశ్వరుని యందు పూర్ణ పరిమాణములో గలదు. కావున కర్మ ఈశ్వరుని లబ్ధికొరకు గాదు. నీవు కర్మను నీ కొరకు చేసినచో, అది కర్మయోగము కాదు. నీవు కర్మఠుడ వగుదువు.

ఈశ్వరుని కొరకు కర్మను చేయుట యనగా నీకు ఈశ్వరుని యందు గల భక్తికి అభివ్యక్తియే. ఈశ్వరార్థం కర్మ అనగా నిదియే. ఇంతే గాక ఈశ్వరుడు ధర్మరూపములో విరాజిల్లు చున్నాడు. వైదిక సంప్రదాయమునకు సనాతన ధర్మమని పేరు. వేద ప్రతిపాదితమైన ఈ ధర్మము సనాతనము. సనాతనశ్చ అసౌ ధర్మః. ఈ ధర్మములో ఈశ్వరుడు జగత్తునకు ఉపాదాన కారణమని మనము దర్శించెదము. జగత్తులోని నియతి (order) ఈశ్వరస్వరూపమే. లేదా, ఈ పదమును మరియొక విధముగా వ్యాఖ్యానించవచ్చును. సనాతనస్య ధర్మః. శాశ్వతుడగు ఈశ్వరుని ధర్మము. ఈ వ్యాఖ్యానములో ఈశ్వరుడు నిమిత్త కారణమగును. ఈ నియతికి అనురూపమగు ఆచరణ ఈశ్వరార్పిత కర్మ యగును. 'నేనీ కర్మను ఈశ్వరుని కొరకు చేయుచున్నాను'. లేదా, 'నేను ధర్మాను రూపముగా ఆచరించుట ద్వారా ఈశ్వరుని ఆరాధించుచున్నాను' అను ఈ రెండు భావనల తాత్పర్యము ఒక్కటియే.

దీనిని ఇంకొక విధముగా (మూడవది) వ్యాఖ్యానించవచ్చును. 'ఈ కర్మను చేయునది ఈశ్వరుడే గాని నేను కాదు' అని నీవు గుర్తించినచో, నీలో ఒక విశిష్ట మనః ప్రవృత్తి పెంపొందును. దాని వలన అహం కారము గాలి తీసివేసిన బుడగవలె అగును. కర్మయొక్క కర్తృత్వము ఈశ్వరుని యందు సమర్పించబడును. ఇది కూడా 'మదర్థం కర్మ' యే యగును. ఆ పరమేశ్వరుని విభూతి వలననే నా కాళ్లు నడువగల్గు చున్నవి; నా జిహ్వ మాటలాడగల్గుచున్నది; నా మనస్సు ఆలోచించ గల్గుచున్నది. ఈ సర్వము ఈశ్వరుడే. సృష్టికి, సృష్టికర్తకు మధ్యలో భేదము లేదు. ఈశ్వరుడే ప్రకృతి రూపములో నున్నవాడై సర్వకార్యములను నిర్వర్తించును. ఈశ్వరుడే సూర్యుడై ప్రకాశించును; భూమియై ప్రాణులను ధరించును. ఈశ్వరుడే దేహేంద్రియ మనోరూపుడై వివిధ కర్మల నాచరించును. కర్మల నాచరించేది నేను గాదు.

దీనికంతకూ రాగద్వేష నిరసన పూర్వక ధర్మానురూప జీవనము ఆవశ్యకము. రాగ ద్వేషములకు మూలము అహంకారము కాగా, ధర్మమునకు మూలము ఈశ్వరుడు. కావున నీవు రాగద్వేషములను నిరాకరించి ధర్మానురూపముగా ఆచరించినచో, నీ అహంకారము అణగారి, నీవు ఈశ్వరునితో సంయోగమును పొందెదవు. కర్మయోగ రూపమగు ఈశ్వరారాధన ఇదియే. కేవలము నీ అహంకారముపై కేంద్రితమై యున్న నీ రాగ ద్వేషములను ఆరంభములో నొక్కి పెట్టి యుంచినచో, కాలక్రమములో అవి పరిశుద్ధమై ఉన్నతమగు ధర్మస్థాయికి చేరును. ధర్మము యొక్క మహత్త్వమును నీవు గుర్తించిననాడు, రాగద్వేషములు అతి సహజముగా తెరవెనుకకు మరుగు అగును. అపుడు వాటిని అణగార్చి ఉంచే పని ఉండదు. ఇదియే సాధకుని పరిణతి మరియు

స్థితి. ఇదియే అతని విజయము. ధర్మస్వరూపము నెరుంగని స్థితిలో రాగద్వేషములను క్కిపెట్టుట జరుగును. రాగద్వేషములు అభివ్యక్తమగు అవకాశము ఉండదు. ఒక బాలునకు కోపము వచ్చినదనుకొనుడు. కాని గృహములోని నియమములు కోపము యొక్క అభివ్యక్తిని షేధించును. ఏడ్చుటకు గాని, కొన్ని మాటలను పలుకుటకు గాని అనుమతి లేదు. అపుడా వు దమనము (suppression) కు గురియగును. దుఃఖమునుండి క్రోధము పుట్టును. గద్వేషములు పరిపూర్తి గానిచో దుఃఖము పుట్టును. ఇందువలననే కోపమును వెళ్లగ్రక్కిన పిదప ని పశ్చాత్పరిమాణము దానికి మూలమగు దుఃఖము అగును. మనకు అర్థము కాని ములను మనము పాటించవలసినచో, అది దమనముతో సమానమగును. కావుననే జీవనమూల్యముల మహత్త్వము నెరుంగుట అత్యంత ప్రముఖమైన విషయము అగును. సరళముగా చెప్పాలంటే, పరిపక్వత యనగా ఇట్టి అవగాహనయే.

వయస్సు పెరిగే కొలదీ ధర్మము యొక్క అవగాహన పెరగాలి. ప్రతి దినము మనము ఎన్నుకొని పనులను చేయవలసి యుండును. ఏది మంచి, ఏది చెడు అను విషయములో మనము విమూఢులమైనచో, అంతకంటె పశువు అగుట ఉత్తమము. పశువునకు సమ్మోహమేమియూ లేదు. దాని మదిలో ఘర్షణలు చెలరేగవు. ధర్మమును గురించి అవగాహన గల మానవుడు మాత్రమే పరిణతి గలవాడని చెప్పదగును. ధర్మమూలము ఈశ్వరుని యందు గలదు. కావున ధర్మము నందు ప్రేమ యనగా ఈశ్వరుని యందు ప్రేమయే యగును. కావున అట్టి ప్రేమ గల వ్యక్తికి రాగద్వేషములను అణగద్రొక్కవలసిన పని లేదు. అదియే భక్తి. కర్మను రాగద్వేష పరిపూర్తి కొరకు గాక, ధర్మ స్వరూపుడగు ఈశ్వరుని కొరకు చేయు వ్యక్తి 'మత్కర్మపరమః' అనబడును. ఈశ్వరుడు ధర్మ స్వరూపుడు అను అవగాహన కర్మయోగ జీవనమునకు అత్యావశ్యకము. అట్టి జీవనము మాత్రమే జాగృత జీవనము అనదగును.

కర్మయోగి యనగా అసంఖ్యాకములగు కర్మలను చేయువాడు గాదు. కర్మయోగి అధిక క్రియాశీలుడై యుండవచ్చును. కాని దానివలన అతడు కర్మయోగి కాలేడు. న్యూయార్క్‌లో వాల్‌స్ట్రీట్‌నకు వెళ్లినచో, అచట మతి పోవునంతటి హడావుడి కానవచ్చును. ఒక ఏజెంటు ఏకకాలములో ఎనిమిది టెలిఫోనుల సాయముతో వ్యవహారమును నడుపు చుండును. కావున ఎంత ఎక్కువ కర్మను చేసినాడు? అను దానిపై వ్యక్తి కర్మయోగి కాలేడు. ఒక విశిష్టమనః ప్రవృత్తి వ్యక్తిని కర్మయోగిగా తీర్చిదిద్దును. కర్మయోగి వివిధ కార్యముల యందు నిమగ్నుడై యున్ననూ, తాను చేయుచున్న కర్మను గురించి అతనికి ఆదుర్దా ఉండదు. అతనియందు భయాందోళనలు

ఉండవు. అతడు ఏ పనిని చేసినా అంతరంగమునందు విశ్రాంతిని కలిగి చేయును. అత
సర్వమును ఈశ్వరుని కొరకు చేయును. అదియే కర్మయోగము. అతని అహంకారము
తీసిన బుడగ వంటిది. అతని యందు రాగద్వేషములు ప్రభావహీనములుగా నుండును.

ధర్మమును నీవు రక్షించినచో, అది నిన్ను రక్షించును (రక్షితః ధర్మః రక్షతి త్వామ్
ధర్మము నిన్ను రక్షించు విధమెట్టిది? ధర్మము రక్షించేది నీ ఆయుర్దాయమును కాదు. ధర్మ
నీ సుఖమును, నీ మనశ్శాంతిని కాపాడును. కేవలము ఆయుర్దాయమును రక్షించుట అర్థరహిత
వ్యథాతప్తుడై ఇంకో పదేళ్లు జీవించి పదిమందికి అదే వ్యథను పంచి ఇచ్చుటలో సారమేమి గ
శాంతినెరుంగని మనస్సు గల వ్యక్తి ఇతరులపై శాంతిని ప్రసరింప చేయలేడు. అశాంత మనసు
యెదుట కూర్చున్నచో, మనకు గల కొద్ది పాటి శాంతి కూడ దూరమగును. ధర్మము
రక్షించనిచో, అహంకారము పెరిగి పెద్దది యగును. రాగద్వేషములు వినాశమును గొని తెచ్చు
ఎల్లవేళలా నీ మాట చెల్లుబాటు కాదు గదా! కావున నీకు క్రోధము కలుగుచుండును. నీ అ
భగ్నమగును. నీవు నిరాశోపహతుడవు గాక తప్పదు. అహంకారము పెరిగి పెద్దది య
చుట్టుప్రక్కల వారితో, మరియు పరిస్థితులతో ఘర్షణలు తలయెత్తును. కాని ధర్మము
పాలించినచో, సమరసత నెలకొనును. నీవు ధర్మమును పూర్ణముగా అనుష్ఠించలేక పోయినను
ఆ దిశలో చేయు ప్రయత్నము చాలును. నీ చుట్టు ప్రక్కల నున్నవారు కూడ విద్యావంతులై
తాము చేయుచున్న పనిని గురించి కొంత అవగాహన కలవారైనచో, వారు కూడ ధర్మానురూపము
జీవించుటకు ప్రయత్నించువారైనచో, అచట సర్వుల ఉన్నతికి అనుకూలించే వాతావరణము
సాక్షాత్కరించును. దీనికి భిన్నముగా, ప్రతివాని దృష్టి 'నేను, నాది' అను వాటిపై కేంద్రీకృతమైనచో
అభివృద్ధి కుంటుపడును. వ్యష్టిభావన సుందరమైనదియే. కాని అది తీవ్రమగు వైయక్తిక రాగ
ద్వేషములను కూడ సృష్టించును. అవి చాల ప్రముఖమై మనము ఇతరమును దేనినీ దరికి చేరనీయని
స్వభావము ఏర్పడును. రాగద్వేషములు అంత తీవ్రముగా నున్నప్పుడు వాటిని పరిపూర్తి చేసి
తీరవలసినదిగా మనస్సు పట్టుపట్టును. కాని ఎల్లవేళలా పరిస్థితులు మనకు అనుకూలముగా
నుండవు. కావున ఘర్షణలు చెలరేగును. వ్యక్తుల సముదాయములో ప్రతి వ్యక్తి తన ఇచ్ఛననుసరించి
సర్వము నడువవలెనని కాంక్షించును. కాని దురదృష్టవశాత్తు ఇతర వ్యక్తి యొక్క ఆకాంక్ష నీ
ఆకాంక్షకు పూర్తి విరుద్ధముగా నుండును. ఈ స్థితిలో నీవు రాగద్వేషములనెట్లు పరిపూర్తి చేసుకొన
గల్గుదువు? అది అసంభవము. నీ అహంకారము వాటి పరిపూర్తి కొరకు పట్టుబట్టును. నీకు
శాంతి ఎట్లు లభించును? శాంతి లేనిదే సుఖమెక్కడిది (అశాంతస్య కుతస్సుఖమ్)?

కావున నీవు ధర్మమును రక్షించినచో, అది నీ సుఖమును తద్వారా నీవు సాధించగోరే నీ పురుషార్థమును రక్షించును. ధర్మమును రక్షించినచో, నీ జ్ఞానము కూడ రక్షింపబడును. అట్లు గానిచో, నీవు రాగద్వేషములను దినదిన ప్రవర్ధమానము చేసెదవు. వాటిని సంతృప్తి పరుచుట ఎన్నటికీ సంభవము కాదు. అవి కూడా అగ్ని వలె అనలములు; అనగా 'ఇక చాలును' అను మాటలను ఎరుంగవు. వాటిని పోషించే కొలదీ, అవి 'ఇంకా కావాలి' అంటూ ఉంటాయి.

నీకు ధ్యానము చేతగానిచో, కర్మయోగివి కమ్ము. కర్మలనన్నిటినీ నా కొరకు చేయుచుండుము (మదర్థం కర్మాణి కుర్వన్). నీవు సిద్ధిని పొందగలవు (సిద్ధిం అవాప్స్యసి). కర్మయోగికి సిద్ధియనగా నేమి? సిద్ధి యనగా మోక్షము. అది జ్ఞానోదయము ద్వారా లభించునని శ్రీ శంకరులిచట వివరించిరి.

ఈశ్వరుని కొరకు కర్మలను చేయుచున్నంత మాత్రాన సిద్ధి లభించదు. కర్మలనన్నిటినీ ఈశ్వరుని కొరకు చేయు చున్నచో, నీ అహంకారము నిర్వీర్యమై రాగద్వేషములు ప్రభావహీనములగును. దాని వలన అధికమగు మనః ప్రసన్నత లభించును. తద్వారా నీవు ధ్యానమును చేయగల్గుదువు. ఆపైన జ్ఞానము లభించును.

నీవు అక్షరబ్రహ్మను ఉపాసించినచో 'నన్ను' పొందగలవు. నీవు 'నన్ను' ధ్యానించి కర్మయోగము ననుష్ఠించినచో, నన్ను పొందగలవు. అది చేతగానిచో, నీవు కర్మయోగము ననుష్ఠించుము. అప్పుడైననూ నీవు 'నన్ను' చేరగలవు. దీనిని బట్టి మోక్షమునకు విభిన్న మార్గములు గలవని తోచును. ఈ ధారణను త్రోసిపుచ్చుటకై శ్రీ శంకరులు 'యోగ జ్ఞానప్రాప్తి ద్వారేణ అవాప్స్యసి' అను పదమును జోడించినారు. అనగా కర్మయోగముచే పరిపక్వతను పొంది, పిదప జ్ఞానము ద్వారా నీవు మోక్షమును పొందగలవు. ఈ విషయమును సుస్పష్టముగా నెరుంగవలెను. దీని విషయములో రాజీలకు, సర్దుబాట్లకు అవకాశమేదియూ లేదు.

మనస్సులో ప్రసన్నతను పెంపొందించుకొని, ఒక వస్తువుపై కొద్ది సమయము వరకు మనస్సును ఏకాగ్రము చేసి నిలుపుటకు అష్టాంగయోగాభ్యాసము సహకరించును. ఇట్టి ధారణాశక్తియే అభ్యాసమునకు లక్ష్యము అగును. దాని వలన సాధకుడు విశ్వరూపమును ధ్యానించగల్గును. కావున పరమేశ్వరుని సగుణ బ్రహ్మ ధ్యానములో, అనగా విశ్వరూప ధ్యానములో అభ్యాసము ఒక అంగము. నీకు అది కూడా చేతగానిచో, ఈశ్వరుని కొరకు కర్మలను చేయుము నీకు సిద్ధి లభించగలదు. ఇచట సిద్ధి యనగా రాగద్వేషముల పట్టు నుండి విముక్తమైన విశుద్ధమగు

అంతః కరణమును పొందుటయే (అంతఃకరణ శుద్ధి). అపుడు ప్రతి బంధములు తొలగి నీలో జ్ఞానము ఉదయించగలదు. జ్ఞానధ్యానములు మానసిక తయారీపై ఆధారపడి యుండునని శ్రీ శంకరులిచట నిర్దేశించినారు.

సంసిద్ధమైన మనస్సు గల సాధకునిలో ధ్యానజ్ఞానములకు కావలసిన సామర్థ్యము నెలకొనును. తద్వారా సాధకుడు సిద్ధిని పొందును. ఈ సందర్భములో సిద్ధి యనగా మోక్షము. ఈశ్వరార్పిత కర్మ అత్యంత ప్రముఖ సాధనగా గలవాడు మత్కర్మపరముడగును. ఇదియైననూ సరళము కాదు. ఇది సిద్ధించాలంటే, కర్మలను చేయు కాలములో నీ యందు ఒకానొక ఈశ్వరీయ జ్ఞానము ఉండవలెను. మరియు నీ వ్యక్తిగత రాగద్వేషములను ధర్మాధర్మములకు సహాయకారులుగా తీర్చిదిద్దే సామర్థ్యము నీ యందు ఉండవలెను. నీవు ధర్మాధర్మములకు అనురూపముగా జీవించువాడవే అయిననూ, నీకు వ్యక్తిగతమగు అభిరుచులు ఉన్నంత వరకు, నీవు కర్మలనన్నిటినీ ఈశ్వరార్పణ చేయ జాలవు. నీకు నీ వ్యక్తి గత భద్రత గురించి, సుఖము గురించి వివిధ రాగ ద్వేషములు గలవనుకో. ఒకవైపు నీవు వాటిని పూర్తి చేసుకోవాలి. మరోవైపు నీకు మోక్షము కూడా కావాలి. దీని అర్థమేమనగా, నీలోని మానసిక తయారీ చాలదు. నీలో పరిపక్వత మరియు వైరాగ్యము లేవని యర్థము. తగినంత వైరాగ్యము లేకుండగా కర్మలనన్నిటినీ ఈశ్వరునకు అర్పించుట చాల కష్టము. ఏలయన, వ్యక్తి గత స్వార్థము అడ్డుపడును. దీని గురించి మనము ఏమి చేయవలెను? కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేయుట శక్యము గానిచో, అనగా నీవింకనూ రాగద్వేషముల వశములో నున్నచో, విచారించకుము. భగవానుడు తరువాతి శ్లోకములో మరియొక వికల్పమును మన ముందు ఉంచుచున్నాడు.

**అధ్యాయము 12, శ్లోకము 11 :**

अथैतदप्यशक्तोसि कर्तुं मद्योगमाश्रितः ।
सर्वकर्मफलत्यागं ततः कुरु यतात्मवान् ॥ ११ ॥

అథైతదప్యశక్తోసి కర్తుం మద్యోగమాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్ (11)

అథ = అపుడు, మద్యోగమ్ = నాకు కర్మలనన్నిటినీ సమర్పించుట అను అంకిత భావమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడవై, ఏతత్ = దీనిని, కర్తుమ్ = చేయుటకు, అశక్తః

అపి అపి = అసమర్థుడవైననూ, తతః = అపుడు, యతాత్మవాన్ = మనోనియంత్రణ గలవాడవై, సర్వకర్మ ఫలత్యాగమ్ = కర్మలన్నింటి యొక్క ఫలమును (నా కొరకు) విడుచుటను, కురు = చేయుము.

> కర్మలనన్నిటినీ నాకు సమర్పించుట అను వ్రతమునైననూ నీవు ఆచరించలేక పోయినచో, అపుడు నీవు మనస్సును నియంత్రించి సర్వకర్మల ఫలమును నాకు సమర్పించుము (11).

నీవు కర్మల నన్నిటినీ నాకు సమర్పించుట అను వ్రతమును అనుష్ఠించ లేకపోయిననూ (అథ ఏతద్ అపి అశక్తోసి కర్తుం మద్యోగం ఆశ్రితః), నీకు అనుశాసన బద్ధమగు మనస్సు ఉన్నచో, సమస్య లేదు. నీ మనస్సు అనుశాసనము లేనిదై, అల్లకల్లోలముగ నున్నచో, ఈ వికల్పము పనికి రాదు. నీవు ముందుగా నీ మనస్సును ప్రసన్నము చేసుకోవాలి. కాని నీపై నీకు కొంత నియంత్రణ ఉండియూ, కర్మలన్నిటినీ ఈశ్వరార్పణము చేయలేక పోయినచో, కర్మఫలమును విడిచి పెట్టుము (సర్వకర్మఫలత్యాగం కురు) అని భగవానుడు చెప్పుచున్నాడు. అనగా నీవు రాగద్వేషప్రేరితుడవై కర్మలను చేయు చుండుము. అవి స్వార్థమే ప్రయోజనముగా గల కర్మలే అయిననూ, ధర్మోల్లంఘనము చేయనంత వరకు పరవాలేదు. కాని ఫలములనన్నిటిని పరిత్యజించుము. అనగా ఫలములు సంప్రాప్తమైనప్పుడు వాటిని ఈశ్వర ప్రసాదము అనే బుద్ధితో భద్రముగా స్వీకరించుము.

శ్రీ కృష్ణుడిచట సర్వకర్మసన్న్యాసమును గురించి చెప్పుట లేదు. అది జ్ఞాన సన్న్యాసమనియు, ఆత్మ అకర్తయను జ్ఞానము వలన మాత్రమే అది సిద్ధించుననియు మనము నాల్గవ అధ్యాయములో చూచి యున్నాము. ఆ జ్ఞానము గల వ్యక్తి విడిచి పెట్టేది కర్మణ్యతను కాదు. అతడు కర్మలను చేస్తూనే ఆత్మ యందు క్రియా సంబంధమేమియూ లేదని యెరుంగును. వీరు గాక కర్మలనన్నిటినీ ఈశ్వరార్పణ బుద్ధితో చేస్తూ, కర్మఫలమును ఈశ్వరదత్తమగు ప్రసాదమనే బుద్ధితో స్వీకరించే కర్మయోగులు గలరు. కర్మ మరియు ఫలము అనే రెండు స్థాయిలలో ఈశ్వరుడు సమ్మిళితుడై యుండును. ఇదియే వాస్తవమగు కర్మయోగము. దీనిలో మొదటి భాగము చేతగానిచో, నీవు రెండవ భాగమును స్వీకరించి, కర్మఫలములనన్నింటినీ త్యాగము చేయుము (సర్వకర్మఫలత్యాగం కురు). కర్మఫలములనన్నింటినీ త్యజించు విధమెట్టిది? ఏ ఫలము లభించిననూ, దానిని ఈశ్వరదత్తమని స్వీకరించుము. నీవు కర్తవు అగుము. కర్మఫలముల నిచ్చువాడు (కర్మఫలదాతా) భగవానుడు. ఈశ్వరుడు రెండు పనులను చేయును. ఆయన

కర్మాధ్యక్షుడు. అనగా కర్మసూత్రములపై అధీశ్వరుడు ఆయనయే. ఈ సూత్రములు లేనిదే కర్మ సంభవము కాదు. ఇది ఒక పని. ఈ సత్యము అవగాహనకు వచ్చినచో, నీ రాగద్వేషములు మిక్కిలి సన్నగిల్లి యుండును. అట్లుగాక రాగద్వేషములు తీవ్రముగా నుండుటచే కర్మలనన్నిటినీ ఈశ్వరునకు సమర్పించుట సంభవము కానిచో, కర్మఫలము సంప్రాప్తమైనప్పుడు, దానిని ఈశ్వర ప్రసాదముగా స్వీకరించుము. దీనియర్థమేమన, నీవు కర్మఫలమును ఈశ్వరునకు సమర్పించినావు. ఈ ప్రవృత్తి భారత్‌లో సర్వత్రా కానవచ్చును. భారతీయులు అన్నమును వండునప్పుడు ఈశ్వరుని స్మరించక పోవచ్చును. వారు పరిమళభరితములగు వివిధ భక్ష్యములను తయారు చేయు సమయములో వాటిని భక్షించబోవు వ్యక్తుల అభిరుచిని గురించి మాత్రమే తలపోయుదురు. వారు భగవానుని అభిరుచి గురించి నిశ్చయముగా తలపోయుట లేదు. కాని వంట పూర్తి అయిన పిదప, వారు ఆ పదార్థములను ఈశ్వరునకు నివేదించెదరు. వండిన వంటకముల బాగోగులు ఈశ్వరుని నియతిచే నిర్ధారింపబడును. ఈ దినుసులను ఈ విధముగా వండినచో ఈ రకపు భక్ష్యము సిద్ధించును అను నియతి గలదు. కాన 'ఈశ్వరుని నియతి సూత్రములు మారినవి గనుక ఈ వంటకము చెడినది' అని నీవు చెప్పజాలవు. నీవు చేసిన కర్మలో దోషము ఉండుటచే వంటకము చెడును. కాని ఈశ్వర నియతి పొరపాట్లను చేయదు. కాబట్టి వంట పూర్తి అయిన పిదప నీకు లభించిన భక్ష్యము (కర్మఫలము) ఈశ్వరానుగ్రహమే. ఇంత మాత్రము ఎరుకను పెంపొందించు కొనుటలో క్లేశము లేదు. కావున సర్వకర్మఫలత్యాగము మిగిలిన వికల్పములతో పోలిస్తే సరళమైనది.

సర్వకర్మ ఫలత్యాగములో ఈశ్వరుడు కర్మఫలదాతయను పరిజ్ఞానము గలదు. నేను కర్మలను స్వీయ రాగ ద్వేష నిర్వాహము కొరకు మాత్రమే చేసిననూ, కర్మఫలము ఈశ్వరీయ సూత్రముల ననుసరించి లభించును. కావున నేను దానిని విరోధించకుండగా స్వీకరించెదను. తద్ద్వారా అది ఈశ్వరునకు సమర్పితమగును. ఆ కర్మను కూడా పరంపరయా ఈశ్వరునకు సమర్పించినట్లే యగును. ఏలయన, కర్మను ఈశ్వరునకు సమర్పించనిదే, కర్మఫలమును ఇచ్చువాడు ఈశ్వరుడు అను దర్శనము కలుగదు. కర్మఫలదాత ఈశ్వరుడని స్వీకరించుట ద్వారా నీవు నీ కర్మను ప్రత్యేక ప్రయత్నము లేకుండగనే ఈశ్వరునకు సమర్పించిన వాడవగుదువు.

కర్మఫలము ఈశ్వరుని నుండి లభించును అని నీవు స్వీకరించినచో, దానివలన నీ రాగద్వేషములు ప్రభావహీనములగును. ఎట్లు? సాధారణంగా ఫలము అభిలషణీయమైనచో, ఉల్లాసము కలుగును. ఫలము అనభిలషితమైనచో, నిరాశ కలుగును. ఇది అంతఃకరణ స్వభావము. అది ఆటు పోటులకు, ఉత్పతన అధఃపతనములకు వశమై యుండును. అశుద్ధి అనగా నిదియే.

రాగద్వేషముల నుండి పుట్టినది. నీవు నిరాశను కోరుకొనవు. కాని అది నిన్ను వశము సుకొనును. ఏలయన, నీవు ద్వేషముచే నియంత్రింపబడి యున్నావు. భావావేగము (emotion) చెందిన క్లేశములన్నింటికీ రాగద్వేషములే మూలమై యున్నవి. వాటిని అధిగమించుటకై, ర్మఫలము సంప్రాప్తమైనప్పుడు నేను దాని ప్రసాద బుద్ధితో, ప్రసన్నమగు మనస్సుతో స్వీకరించెదను. ఇట్టి సాధకునిలో రాగ ద్వేషములింకనూ కొనసాగు చుండును. కాని వాటికి ప్రహర్షమును, నిరాశను కలిగించే సామర్థ్యము ఉండదు. అవి కేవలము నీవు చేయు కర్మలన్నింటికీ ఆధారమగుచుండును. ఈ కర్మలు ధర్మాను రూపములు మాత్రమేనని మరువరాదు. సర్వకర్మఫలత్యాగముచే రాగద్వేషములు ప్రభావహీనములగుటచే ఫలము ఎట్లున్ననూ మనస్సులో సంతులనము ఉండును. మనస్సు యొక్క ఈ సమత్వము కర్మయోగి లక్షణము. ప్రసాదబుద్ధి ఉన్నప్పుడు మాత్రమే ఇది సిద్ధించును.

కావున నీవు కర్మను ఈశ్వరునకు సమర్పించ లేక పోయిననూ, పరవా లేదు. నీవు ఆయన వద్దనుండి వచ్చే ఫలమును స్వీకరించుము. కర్మలను ఈశ్వరార్పణము చేయుట కంటె ఇది తక్కువది కాదు. దీనియందు కూడ కర్మలను ఈశ్వరార్పణము చేసినట్లే యగును. దీని యందు త్యాగము ప్రముఖమైన అంశము. అదియే ఇచట స్తుతింపబడుచున్నది. సర్వకర్మఫలత్యాగము కామనా త్యాగముతో సమానమగును. కామనల నన్నిటినీ ఈశ్వరునకు సమర్పించినచో, నీపై రాగద్వేషముల పట్టు సడలిపోవును. కామమనగా రాగద్వేషములే. ఫలము రాగద్వేషములకు అనుకూలించినా, అనుకూలించకపోయినా, నీవు దానిని స్వీకరించెదవు. అనగా కామమును పరిత్యజించినట్లే యగుచున్నది. అనగా దానికి నీపై గల పట్టు సడలిపోయినది. అంతః కరణము నందు జ్ఞానము ఉదయించగలదు. కావున సర్వకర్మల ఫలములను పరిత్యజించుము (తతః సర్వకర్మఫలత్యాగం కురు).

అనుశాసనయుతమగు జీవితమును గడిపే సాధకుడు (యతాత్మవాన్) చేసే కర్మఫలత్యాగము కర్మయోగము (మద్యోగః) తో సమమైన మహత్త్వము గలది. కర్మయోగ మనగా కర్మను ఈశ్వరుని కొరకు అనుష్ఠించి, ఫలమును ప్రసాద బుద్ధితో స్వీకరించుటయే గదా! ఈ నాల్గవ వికల్పములో నీవు ఫలప్రాప్తి సమయములో ఈశ్వరుని స్మరించిన చాలును. నీవు కారును తోలుకుంటూ రహదారి మీదకు వచ్చినప్పుడు ఈశ్వరుని స్మరించుము. కారు ఆగిపోయినప్పుడు ఈశ్వరుని స్మరించుము. లక్ష్యమును చేరగానే ఈశ్వరుని స్మరించుము. గమ్యస్థానమునకు కుశలముగా చేరిన పిదప ఈశ్వరుని స్మరించుము. మధ్యలో ప్రమాదము జరిగి గాయములైనచో,

ఇంకనూ జీవించి యున్నందులకు ఈశ్వరుని స్మరించుము. ఈ తీరున సమస్త కర్మఫలములను ఈశ్వరదత్తములని స్వీకరించవలెను. ఈ ప్రక్రియలో నీ రాగద్వేషములు ప్రభావహీనములగును. దీనిని మనము ఆచరణలో పెట్టవలెను. ఇది కేవలము తెలుసుకొనేది మాత్రమే కాదు. తెలుసుకొనుట అవశ్యకమే. కాని కర్మఫలము ఈశ్వరుని నుండి వచ్చినది అని గుర్తిస్తూ ఉంటే, నీలో ఆ మనః ప్రవృత్తి దృఢమగును. ఈ గుర్తింపును యాంత్రికముగా గాక భావనతో ఆవృత్తి చేసినచో, నీ యందు ప్రసాదబుద్ధి పెంపొందును. దీనికి ఒక దృష్టాంతమునీయవచ్చును. మనకు కృతజ్ఞతలు (Thanks) అని చెప్పే అలవాటు గలదనుకొనుడు. దానివలన నీలో కృతజ్ఞతా భావన పెంపొందును. కొన్ని సమయములలో ఇది యాంత్రికముగా మాత్రమే జరుగుచుండవచ్చును. కాని దానిని ఆవృత్తి చేయుచున్నచో, ఒక మానసిక ప్రవృత్తి నిర్మాణమగును. అదియే ఇచటి ప్రముఖ విషయము. కృతజ్ఞతలు (thanks) అని నీవు చెప్పే ప్రతి పర్యాయము దాని వెనుక గంభీరమగు భావన ఉండకపోవచ్చును. ఒకాయన నీకొరకు తలుపును తీసినాడు. నీవు thanks అనెదవు. నీవు నడిచే దారిలో ఒకడు ప్రక్కకు జరిగి స్థలమునిచ్చినాడు. నీవు మరల thanks అనెదవు. బహుశః ఇది యాంత్రికమే అయి ఉండవచ్చును. కాని నీవు ఆ అలవాటును పూర్తిగా విడనాడినచో, మనస్సు నుండి కృతజ్ఞతా భావనయే దూరమగును. కావున, ఆ అలవాటును ఒక ప్రతీకగా నిలిపి యుంచుకొనవలెను. అప్పుడు మాత్రమే దాని వెనుక గల స్ఫూర్తి ఆవిష్కారమగును. ఈ స్ఫూర్తి కొద్దో గొప్పో అన్ని వేళలా ఉంటుంది గనుక, దానిని ఆవిష్కరించు కొనుట సంభవమే. కృతజ్ఞతా భావన లేశమైననూ లేకుండగా నీవు thanks అని చెప్పజాలవు.

అదే విధముగా ఇచట కూడా 'ఇది ఈశ్వర ప్రసాదము' అని గాని, అదే అర్థము నిచ్చే మరియొక వాక్యమును గాని ఆవృత్తి చేయుచుండవలెను. ఏది లభించినా, అది ఈశ్వరుని నుండి వచ్చినదియే అను విషయమును మనము సంకల్ప పూర్వకముగా స్వీకరించుచుండవలెను. భగవానుడే కర్మ ఫలదాత. ఈ పరిజ్ఞానమును ఏదో ఒక రూపములో వ్యక్తము చేస్తూ నిలబెట్టు కోవాలి. అప్పుడు అది యథార్థమగు కర్మఫలత్యాగము అగును. ఆ ప్రక్రియలో కామత్యాగము సిద్ధించును. కాని కర్తృత్వత్యాగము ఉండదు. కావుననే అది జ్ఞానము కాదు. కర్తృత్వము ఉన్నంత వరకు కర్మయోగము మాత్రమే సంభవమగును. దాని ద్వారా మానవుడు జీవితమును ఉన్నంతలో ఆనందముగా గడుపగల్గును.

కాని శాస్త్రము ఒకే ఒక ప్రహారముతో కర్తృత్వమును నిర్మూలించగల్గును. రాగ ద్వేషములు ప్రభావహీనములు కాగానే, అహంకారము నిర్వీర్యమగును. అట్టి స్థితిలో నీకు 'నీవ

రమేశ్వరుడవు' అని చెప్పిన చాలును. ఆ జ్ఞానమునకు ప్రతిబంధకము లేనిచో, సమస్యలన్నియూ ంతటితో సమాప్తమగును.

'అది కూడా చేతగానిచో, దీనిని చేయుము' అని భగవానుడు చెప్పియున్నాడు గనుక, కర్మఫలత్యాగము అధమ పక్షము అని తలంచుట సరిగాదు. 'నీ వంటికి మిరియాలు వికటించే పక్షంలో సొంఠిని సేవించుము' అని చెప్పినచో, సొంఠి అధమము అని అభిప్రాయము కాదు. రెండింటి ప్రయోజనము ఒక్కటియే. కొన్ని రకముల ఆహారపదార్థములు నీ ఆరోగ్యమునకు పడని పక్షములో వాటిని విడిచి ఇతర పదార్థములను స్వీకరించవలెను. శరీర పుష్టికి రెండూ సమానమే. ఒక రకం వ్యాయామమును నీవు చేయలేక పోయినచో, మరియొక రకం వ్యాయామమును చేయుము. ఆ రెండు వ్యాయామములు శరీరదార్ఢ్యమును కలిగించునవియే. ఇచటి పరిస్థితి కూడా అంతే. ఒకటి రెండవదానికంటె తక్కువది గాదు. ఇతర వికల్పములు ఎంత గొప్పవియో, కర్మఫలత్యాగము కూడ అంత గొప్పదియే. నీ రాగద్వేషములను పరిపూర్తి చేసుకొను చుండుము. కాని నీ కర్మల ఫలమును ఈశ్వరునకు విడిచి పెట్టుము (కర్మఫలత్యాగం కురు). దీనిలో ఒక మంచి గలదు. భగవానుడు సర్వవ్యాపకుడు గనుక, నీవు సమర్పించిన ఫలమును దాచుకొనే చోటు ఆయనకు లేదు. కావున నీ ఫలములు నీవద్దనే ఉండును. అవి మానసికముగా మాత్రమే సమర్పించబడును. సర్వఫలత్యాగమనగా నిదియే. భగవానుడు సూచించిన వికల్పములలో ఇది అంతమునందు ఉన్ననూ, ఇది ఇతర వికల్పముల కంటె ఏ విధముగనైననూ తక్కువది కాదు. ఏలయన, ఇతరముల వలె ఇది కూడా ఒకే గమ్యమునకు చేర్చును. వాస్తవంలో ఇతర వికల్పముల కంటె ఇదియే శ్రేష్ఠతరమని తరువాతి శ్లోకము ప్రకటించుచున్నది. తరువాతి శ్లోకము కర్మఫలత్యాగమును ప్రశంసించుచున్నది.

కర్మఫలత్యాగము అంతిమముగా ప్రస్తావింపబడిననూ, అది తత్పూర్వము నందు చెప్పబడిన ఇతర వికల్పముల కంటె తీసి కట్టు కాదనియు, ఏలయన అది సాధకునకు శాంతిని ఒసంగుననియు భగవానుడు ఇపుడు కర్మ ఫలత్యాగమును ప్రశంసించు చున్నాడు:

**అధ్యాయము 12, శ్లోకము 12 :**

श्रेयो हि ज्ञानमभ्यासात् ज्ञानाद्ध्यानं विशिष्यते ।
ध्यानात्कर्मफलत्या गस्त्यागाच्छांतिरनंतरम् ॥ १२ ॥

శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగాచ్ఛాంతిరనంతరమ్ (12)

**జ్ఞానమ్** = జ్ఞానము, **అభ్యాసాత్** = యోగాభ్యాసము కంటె, **శ్రేయః** = శ్రేయస్కరమైనది, **హి** = నిశ్చయము, **జ్ఞానాత్** = జ్ఞానము కంటె, **ధ్యానమ్** = ధ్యానము, **విశిష్యతే** = గొప్పది, **ధ్యానాత్** = ధ్యానము కంటె, **కర్మ ఫలత్యాగః** = కర్మల ఫలములను విడిచి పెట్టుట (గొప్పది), **త్యాగాత్** = త్యాగము వలన, **అనంతరమ్** = వెను వెంటనే, **శాంతిః** = శాంతి.

> యోగాభ్యాసము కంటె జ్ఞానము గొప్పది. జ్ఞానము కంటె ధ్యానము గొప్పది. ధ్యానము కంటె కర్మ ఫలత్యాగము గొప్పది. త్యాగము వలన వెనువెంటనే శాంతి లభించును (12).

ధ్యానము వరకు గల (ధ్యానమును వినహాయించి) అష్టాంగ యోగమును, అభ్యసించుట కంటె నీకు కర్మఫలత్యాగమే అధిక శ్రేయస్కరము. ఈ అభ్యాసమునకు శ్రీ శంకరులు 'అవివేకపూర్వక' అను విశేషణమును జోడించిరి. అనగా వీటిని నేను ఎందులకు చేయుచున్నాను? అను పురుషార్థ వివేకము లేకుండగా, లేదా ఏది నిత్యము? ఏది కాదు? అను నిత్యానిత్యవస్తు వివేకము లేకుండగా కేవలము యాంత్రికముగా ఆసనప్రాణాయామాదుల నభ్యసించుట అని యర్థము. చాలినంత వివేకము లేని వ్యక్తిలో వైరాగ్యము కూడ అంతంత మాత్రముగనే ఉండును. నాకు యథార్థముగా ఏమి కావాలి? అను విషయము నాతడు నిశ్చయించు కొనజాలడు. ఇచట 'జ్ఞానమ్' అనగా వివేక రహితమైన పురుషార్థ జ్ఞానము. కావున అభ్యాసము కూడా అట్టిదియే అగును. అనగా నేను ఖచ్చితముగా కోరునది యేది? దానిని సాధించుటకు నేను ఏమి చేయుచున్నాను? అను వివేకములేని అభ్యాసము ఇచట ప్రస్తావించబడినది.

అష్టాంగయోగమును అభ్యసించుటకు వివేకముతో పని లేదు. దానిని అభ్యసించువారిలో చాల మందికి ఆత్మానాత్మ వివేకము గాని నిత్యానిత్యవస్తు వివేకము గాని లేదు. తరచుగా వారికి కేవలదేహ సౌందర్యము, లేక దేహదార్ఢ్యమే పురుషార్థమగుచుండును. వారు అత్యాధునిక వ్యాయామ పద్ధతులను (Aerobics మొదలగునవి) అవలంబించవచ్చును. లేదా యోగాసనములు వారికి మరింత హితవును గూర్చును. ఏలయన అధిక వేగముతో తీవ్ర వ్యాయామమును చేయువారు అధికాహారమును తినవలయును. యోగములో ఆ ఇబ్బంది లేదు. పైగా మనకు యోగాసనములు

ఋషిపరంపరలో లభించినవి గనుక, వాటియందు ఒక పవిత్రత గలదు. కాని మోక్షమును గురించి యోగులకు గల ధారణను పరిశీలించినచో, దాని యందు సమస్యలు గానవచ్చును. కావున అభ్యాసము కొరకు మోక్షమనగా నేమియో తెలిసి యుండనక్కరలేదు. అభ్యాసమునకు వివేకముతో పనిలేదు. అభ్యాసమనగా ఏ అనుశాసనమైననూ కావచ్చును. అనుశాసనమును పాటించుటలో ఒక దుఃఖము గలదు. కావున, అది వ్యక్తి వికాసమునకు ఆధారము కాగల్గును. కావున, అనుశాసనము లేని స్థితి కంటె అనుశాసనము ఉండుటయే మంచిది. అభ్యాసమేదైనా దుఃఖకరముగ నుండును. ఏలయన, కొన్ని సమయములలో దానిని పాటించుట కష్టమగును. ఈ కష్టముల నధిగమించే ప్రయత్నములో వ్యక్తి వికాసము కలుగును. కాని వివేకము లేకుండగా పాటించే అనుశాసనము వివేకము కంటె తక్కువ స్థాయి లోనిది యగును. అందువలననే, జ్ఞానము అభ్యాసము కంటె మంచిది (శ్రేయో హి జ్ఞానమ్) అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇచట జ్ఞానమనగా పురుషార్థ జ్ఞానము; ఆత్మ జ్ఞానము కాదు.

అభ్యాసయుక్తమైన కేవల పురుషార్థ జ్ఞానమైననూ సరిపడదు. (ఈ వికాసక్రమము (progression) లోని ద్వితీయ శ్రేణిలో జ్ఞానముతో బాటు అభ్యాసము కూడ స్వీకరింపబడునని గ్రహించవలెను). కావున, ఈశ్వరధ్యానము కేవల పురుషార్థ జ్ఞానము కంటె శ్రేష్ఠతరము (జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే) అని భగవానుడు చెప్పుచున్నాడు. ధ్యానములో కర్మయోగము కూడ అంతర్గతమగునని మనము చూచి యున్నాము. ఆసన ప్రాణాయామాదుల అభ్యాసముతో గూడిన పురుషార్థ జ్ఞానము కంటె కర్మయోగ విశిష్టమగు ధ్యానము శ్రేష్ఠతరము (విశిష్యతే).

ధ్యానము కంటె కర్మఫలత్యాగము గొప్పది యని భగవానుడు ఆఖరున చెప్పినాడు. ఆఖరున చెప్పబడినది గనుక, ఇది అన్నిటి కంటె సరళతమమైనది, మరియు శ్రేష్ఠతమమైనది. ఎందువలన? దానివలన లభించే ఫలము వలన.

త్యాగాత్ శాంతిః అనంతరమ్. త్యాగము వలన వెనువెంటనే శాంతి లభించును. ఒక వస్తువును ఈశ్వర ప్రసాదముగా గుర్తించిన క్షణములో ఉల్లాసము, ప్రసన్నత మరియు శాంతి కలుగును. వీటి వలన ఆత్మ యొక్క అపరోక్ష జ్ఞానమునకు కావలసిన అర్హత లభించును. ప్రతిబంధకములు తొలగి పోయి అక్షరబ్రహ్మ సాక్షాత్కరించును. మరియు కర్మఫలత్యాగము వలన వెనువెంటనే శాంతి లభించును. శాంతి లభించుటలో విలంబము లేదు. కర్మ ఫలములనన్నిటినీ ప్రసాదబుద్ధితో స్వీకరించు వ్యక్తి హర్షమునకు గాని, నిరాశకు గాని అధీనుడు కాడు. కావున ఈ ప్రసాద బుద్ధి సుఖదుఃఖములకు, లాభాలాభములకు, జయాపజయములకు విరుగుడు మందు

అగును. విజయము ప్రసాదము. అపజయము కూడా ప్రసాదమే. ఉదాహరణకు, తీయ్య ప్రసాదము. విభూతి కూడా ప్రసాదమే. ఆ ప్రసాద బుద్ధియే ఇచట కర్మఫలత్యాగమ రూపములో ప్రశంసింపబడు చున్నది. ఇట్టి బుద్ధియందు శాంతి నెలకొని, జ్ఞానసమర్థమగు

కర్మఫలత్యాగము ఇచట స్తుతించబడినది. అయిననూ, ఇతరమును దేనినీ సామర్థ్యము లేని వ్యక్తి కొరకు ఇది ఉద్దేశింపబడినది అని అనుకొనుటకు ఆస్కారము ఒక క్రమములో ఇది ఆఖరున ఉన్నది. భగవానుడు ఈ క్రమములో ఒక విశిష్ట సా ఉపదేశించిన ప్రతి పర్యాయములో 'నీవు దీనిని చేయ సమర్థుడవు గానిచో (అశక్తోసి అని ప్రయోగిస్తూ వచ్చినాడు. కాని భగవానుని ఈ పదప్రయోగము అర్జునుని ప్రశ్నకు మా అనురూపముగా నున్నది. అక్షర పరబ్రహ్మోపాసకుడు, మరియు విశ్వరూపమును ధ్యా కర్మయోగి అను ఇద్దరిలో ఎవరు గొప్పవారు? అనగా ఎవరు మోక్షమునకు దగ్గరలో ను అని అతడు ప్రశ్నించెను.

ఈ ప్రశ్నకు సమాధానమునిస్తూ, సగుణ బ్రహ్మ ధ్యానమును చేస్తూ కర్మయో జీవనమును గడుపు వ్యక్తి నిశ్చితముగా మోక్షమునకు దగ్గరలో నున్నాడని శ్రీకృష్ణ భగవాను ముందుగా చెప్పినాడు. కాని రెండవవాడు ఇప్పటికే ముక్తుడు. ఏలయన శాస్త్రదృష్టిలో సన్న్యా యనగా ఇంచుమించు ముక్త పురుషుడే. సన్న్యాసియగు వ్యక్తి పరిణతుడై యుండును గన ఆతనికి జ్ఞానమార్గములో ప్రతిబంధకములు ఉండవు. ఈ కారణము చేతనే ఆతడు జ్ఞానియ వ్యవహరింపబడినాడు. ఆతనిని అజ్ఞానులతో పోల్చదగదు. ఈ జ్ఞానులు నిశ్చయముగా నా ఐక్యమగుదురని భగవానుడు తరువాత చెప్పినాడు. తరువాత భగవానుడు మరల కర్మయో గూర్చి చెపుతూ 'నేను వారిని ఉద్ధరించెదను (తేషా మహం సముద్ధర్తా)' అనినాడు. వా ఉపాసకులు గనుక, ఉపాసన కూడ కర్మయే గనుక, కర్మ ఫలదాతయగు భగవానుడు ఫలమున తీరవలెను. భగవానుడు ఆ ఫలమును జ్ఞానోదయమునకు అనుకూలమగు అవకాశముల కల్గించుట ద్వారా ఇచ్చును. తద్ద్వారా వారిని జ్ఞానయోగ్యులను చేసి, పరంపరయా వారిని ఉద్ధరించును.

కాని, అక్షర పరబ్రహ్మోపాసకులు ఈశ్వరుని హస్తక్షేపము (intervention) ను అపేక్షించరు. ఏలయన, వారు ఈశ్వరానుగ్రహమును ఎప్పుడో పొందియున్నారు. అందువలననే, వారీ ఉపాసనను కొనసాగించుచున్నారు. ఈశ్వరానుగ్రహముచే మాత్రమే మానవుడు అద్వైతము వైపుకు మొగ్గు చూపును (పుంసాం అద్వైతవాసనా ఈశ్వరానుగ్రహాదేవ) అని మనము చూచియున్నాము.

ఋషిపరంపరలో లభించినవి గనుక, వాటియందు ఒక పవిత్రత గలదు. కాని మోక్షమును గురించి యోగులకు గల ధారణను పరిశీలించినచో, దాని యందు సమస్యలు గానవచ్చును. కావున అభ్యాసము కొరకు మోక్షమనగా నేమియో తెలిసి యుండనక్కరలేదు. అభ్యాసమునకు వివేకముతో పనిలేదు. అభ్యాసమనగా ఏ అనుశాసనమైననూ కావచ్చును. అనుశాసనమును పాటించుటలో దుఃఖము గలదు. కావున, అది వ్యక్తి వికాసమునకు ఆధారము కాగల్గును. కావున, అనుశాసనము లేని స్థితి కంటె అనుశాసనము ఉండుటయే మంచిది. అభ్యాసమేదైనా దుఃఖకరముగ నుండును. ఏలయన, కొన్ని సమయములలో దానిని పాటించుట కష్టమగును. ఈ కష్టముల నధిగమించే ప్రయత్నములో వ్యక్తి వికాసము కలుగును. కాని వివేకము లేకుండగా పాటించే అనుశాసనము వివేకము కంటె తక్కువ స్థాయి లోనిది యగును. అందువలననే, జ్ఞానము అభ్యాసము కంటె మంచిది (శ్రేయో హి జ్ఞానమ్) అని భగవానుడు చెప్పుచున్నాడు. ఇచట జ్ఞానమనగా పురుషార్థ జ్ఞానము; ఆత్మ జ్ఞానము కాదు.

అభ్యాసయుక్తమైన కేవల పురుషార్థ జ్ఞానమైననూ సరిపడదు. (ఈ వికాసక్రమము (progression) లోని ద్వితీయ శ్రేణిలో జ్ఞానముతో బాటు అభ్యాసము కూడ స్వీకరింపబడునని గ్రహించవలెను). కావున, ఈశ్వరధ్యానము కేవల పురుషార్థ జ్ఞానము కంటె శ్రేష్ఠతరము (జ్ఞానాత్ ధ్యానం విశిష్యతే) అని భగవానుడు చెప్పుచున్నాడు. ధ్యానములో కర్మయోగము కూడ అంతర్గతమగునని మనము చూచి యున్నాము. ఆసన ప్రాణాయామాదుల అభ్యాసముతో గూడిన పురుషార్థ జ్ఞానము కంటె కర్మయోగ విశిష్టమగు ధ్యానము శ్రేష్ఠతరము (విశిష్యతే).

ధ్యానము కంటె కర్మఫలత్యాగము గొప్పది యని భగవానుడు ఆఖరున చెప్పినాడు. ఆఖరున చెప్పబడినది గనుక, ఇది అన్నిటి కంటె సరళతమమైనది, మరియు శ్రేష్ఠతమమైనది. ఎందువలన? దానివలన లభించే ఫలము వలన.

త్యాగాత్ శాంతిః అనంతరమ్. త్యాగము వలన వెనువెంటనే శాంతి లభించును. ఒక వస్తువును ఈశ్వర ప్రసాదముగా గుర్తించిన క్షణములో ఉల్లాసము, ప్రసన్నత మరియు శాంతి కలుగును. వీటి వలన ఆత్మ యొక్క అపరోక్ష జ్ఞానమునకు కావలసిన అర్హత లభించును. ప్రతిబంధకములు తొలగి పోయి అక్షరబ్రహ్మ సాక్షాత్కరించును. మరియు కర్మఫలత్యాగము వలన వెనువెంటనే శాంతి లభించును. శాంతి లభించుటలో విలంబము లేదు. కర్మ ఫలములనన్నిటినీ ప్రసాదబుద్ధితో స్వీకరించు వ్యక్తి హర్షమునకు గాని, నిరాశకు గాని అధీనుడు కాడు. కావున ఈ ప్రసాద బుద్ధి సుఖదుఃఖములకు, లాభాలాభములకు, జయాపజయములకు విరుగుడు మందు

అగును. విజయము ప్రసాదము. అపజయము కూడా ప్రసాదమే. ఉదాహరణకు, తియ్యని లడ్డు ప్రసాదము. విభూతి కూడా ప్రసాదమే. ఆ ప్రసాద బుద్ధియే ఇచట కర్మఫలత్యాగము అను రూపములో ప్రశంసింపబడు చున్నది. ఇట్టి బుద్ధియందు శాంతి నెలకొని, జ్ఞానసమర్థమగును.

కర్మఫలత్యాగము ఇచట స్తుతించబడినది. అయిననూ, ఇతరమును దేనినీ చేయ సామర్థ్యము లేని వ్యక్తి కొరకు ఇది ఉద్దేశింపబడినది అని అనుకొనుటకు అస్కారము గలదు. ఒక క్రమములో ఇది ఆఖరున ఉన్నది. భగవానుడు ఈ క్రమములో ఒక విశిష్ట సాధనను ఉపదేశించిన ప్రతి పర్యాయములో 'నీవు దీనిని చేయ సమర్థుడవు గానిచో (అశక్తోసి యది)' అని ప్రయోగిస్తూ వచ్చినాడు. కాని భగవానుని ఈ పదప్రయోగము అర్జునుని ప్రశ్నకు మాత్రమే అనురూపముగా నున్నది. అక్షర పరబ్రహ్మోపాసకుడు, మరియు విశ్వరూపమును ధ్యానించు కర్మయోగి అను ఇద్దరిలో ఎవరు గొప్పవారు? అనగా ఎవరు మోక్షమునకు దగ్గరలో నున్నారు? అని అతడు ప్రశ్నించెను.

ఈ ప్రశ్నకు సమాధానమునిస్తూ, సగుణ బ్రహ్మ ధ్యానమును చేస్తూ కర్మయోగ జీవనమును గడుపు వ్యక్తి నిశ్చితముగా మోక్షమునకు దగ్గరలో నున్నాడని శ్రీకృష్ణ భగవానుడు ముందుగా చెప్పినాడు. కాని రెండవవాడు ఇప్పటికే ముక్తుడు. ఏలయన శాస్త్రదృష్టిలో సన్న్యాసి యనగా ఇంచుమించు ముక్త పురుషుడే. సన్న్యాసియగు వ్యక్తి పరిణతుడై యుండును గనుక అతనికి జ్ఞానమార్గములో ప్రతిబంధకములు ఉండవు. ఈ కారణము చేతనే అతడు జ్ఞానియని వ్యవహరింపబడినాడు. అతనిని అజ్ఞానులతో పోల్చదగదు. ఈ జ్ఞానులు నిశ్చయముగా నాతో ఐక్యమగుదురని భగవానుడు తరువాత చెప్పినాడు. తరువాత భగవానుడు మరల కర్మయోగిని గూర్చి చెపుతూ 'నేను వారిని ఉద్ధరించెదను (తేషా మహం సముద్ధర్తా)' అనినాడు. వారు ఉపాసకులు గనుక, ఉపాసన కూడ కర్మయే గనుక, కర్మ ఫలదాతయగు భగవానుడు ఫలమునిచ్చి తీరవలెను. భగవానుడు ఆ ఫలమును జ్ఞానోదయమునకు అనుకూలమగు అవకాశములను కల్గించుట ద్వారా ఇచ్చును. తద్ద్వారా వారిని జ్ఞానయోగ్యులను చేసి, పరంపరయా వారిని ఉద్ధరించును.

కాని, అక్షర పరబ్రహ్మోపాసకులు ఈశ్వరుని హస్తక్షేపము (intervention) ను అపేక్షించరు. ఏలయన, వారు ఈశ్వరానుగ్రహమును ఎప్పుడో పొందియున్నారు. అందువలననే, వారీ ఉపాసనను కొనసాగించుచున్నారు. ఈశ్వరానుగ్రహముచే మాత్రమే మానవుడు అద్వైతము వైపుకు మొగ్గు చూపును (పుంసాం అద్వైతవాసనా ఈశ్వరానుగ్రహాదేవ) అని మనము చూచియున్నాము.

ఈశ్వరానుగ్రహ సంపన్నునకు మాత్రమే ఈ ఉపాసనను చేసే సంస్కారములు ఉండును. ఇట్టి వ్యక్తికి ఈశ్వరుని హస్తక్షేపము యొక్క అపేక్ష లేదు. ఏలయన, అతడు ఈశ్వరుని కంటె భిన్నుడు కాడు. మరియు సమస్య ఏదియు లేదనే సత్యమును అతడు సాక్షాత్కరించుకొనినాడు. కావున సన్న్యాసియని కూడా పిలువబడే జ్ఞానయోగి ఈశ్వరుని కంటె భిన్నుడు కాడు. కాని ఇతరులకు అంతః కరణశుద్ధిని, అంతః కరణ నైశ్చల్యమును పొందుట కొరకై ఈశ్వర కృప అవశ్యకమగును. వారిని ఈశ్వరుడు ఉద్ధరించును. 'జ్ఞానులు నాలో ఐక్యమగుదురు. కర్మయోగులను నేను ఉద్ధరించెదను' అని శ్రీ కృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. జ్ఞానికి, అజ్ఞానికి గల భేదము ఇదియే.

భగవానుడీ శ్లోకములో అజ్ఞానులను గురించి మాత్రమే మాటలాడు చున్నాడు. ఆయన ఈ చర్చలో జ్ఞానులను ప్రక్కన బెట్టినాడు. ఏలయన జ్ఞానులను అజ్ఞానులతో పోల్చుటకు వీలులేదు. తరువాత భగవానుడు మరల వారిని గురించి చెప్పగలడు.

కర్మయోగ సహకృతమైన ఈ సగుణ బ్రహ్మోపాసనలో జీవేశ్వర భేదము అంగీకరింపబడునని శ్రీ శంకరులు తరువాతి శ్లోకము యొక్క అవతారికలో ప్రస్తావించిరి. ఈశ్వరుని కొరకు కర్మను చేయుట (ఈశ్వరార్థం కర్మానుష్ఠానమ్) అనే కర్మయోగమునందు, మరియు ధ్యానము చేయువాడు, ధ్యేయ వస్తువు అను వాటితో గూడి యుండు ధ్యానము నందు, సాధకునకు తాను ఈశ్వరుని కంటె, జగత్తు కంటె మరియు ఇతరవ్యక్తుల కంటె భిన్నుడను అనే భేదజ్ఞానము దృఢముగా నుండును. అతడు శ్రద్ధామూలకముగా అభేదము నంగీకరించు గాక! కాని అతనికి అభేద జ్ఞానము లేదు. ఈ అభేద జ్ఞానము లేని వ్యక్తుల నుద్దేశించి (అశక్తోసి యది) భగవానుడు కొన్ని వికల్పములను ప్రస్తావించినాడు.

అంతఃకరణ శుద్ధి మరియు అంతః కరణనైశ్చల్యము సిద్ధించుట కొరకు సహకరించే ఉపాయముల విషయములో మాత్రమే వికల్పములు, ఎంచుకునే స్వేచ్ఛ గలవు. కాని మోక్షోపాయము జ్ఞానము అను విషయములో వికల్పము లేనే లేదు. వికల్పములు ఉన్న సందర్భములో మాత్రమే ఎన్నుకునే స్వేచ్ఛ ఉండును. నీవు రంగును చూడవలెనను కొనుము. రంగును కన్నులతో చూడవలెనా? లేక చెవులతో చూడవలెనా? అని ఎంచుకునే అవకాశము నీకు ఉన్నదా? నీకు అట్టి అవకాశము లేనే లేదు. అదే విధముగా మోక్షము జ్ఞానము వలన మాత్రమే లభించును (జ్ఞానా దేవ మోక్షః). ఆత్మ నిత్యముక్తము. ముక్తి సగుణ బ్రహ్మోపాసన అనే మానసిక కర్మ చేతగాని, లేక ఇతర విధములగు కర్మల చేతగాని సాధింపబడేది కాదు. అట్టి అవశ్యకతయూ లేదు. ఈ ఉపాసన అజ్ఞాననివృత్తి కొరకు గాదు. అంతః కరణనైశ్చల్యమును ప్రసాదించే

ఈశ్వరానుగ్రహమును స్వంతము చేసుకొనుటకై ఈ ఉపాసన ఉద్దేశింపబడినది. అంతః కర శుద్ధికి సాధనము కర్మయోగము. రాగద్వేషపూర్ణమైన ప్రపంచములోని సుఖదుఃఖము జంఝాటములో ఉంటూనే నీవు సముచితమగు మానసిక ప్రవృత్తితో వాటిని ప్రభావహీనములుగ చేసి వికాసమును సాధించవచ్చును. కావున అంతఃకరణ పరిపక్వత, లేక శుద్ధి కొరకు నీకు యోగము ఆవశ్యకము. అంతః కరణనైర్మల్యము కొరకు ఉపాసన అవసరమగును. ఈ విషయమే ఇచట స్తుతింపబడుచున్నది. దీనిని అనుష్ఠించువాడు యోగవిత్తముడని ఇంతకు ముంతె స్తుతింపబడినాడు. కావున, ఈ ప్రకరణమంతయు అజ్ఞానిని గురించి మాత్రమే పాదించుచున్నది.

నీవు జ్ఞానమును పొందలేకపోయినచో, కర్మయోగము ననుష్ఠించవచ్చును అని చెప్పినప్పుడ మోక్షమునకు వివిధ స్వతంత్రమార్గములు గలవనియు, మనకు నచ్చిన దాని ఎన్నుకొనవచ్చుననియు అనిపించును. కాని ఇది సరిగాదు. నీవు నిత్యముక్తుడవైనచో, విషయమును తెలుసుకున్నచో చాలును. నీవు ముక్తుడవు గానిచో, ముక్తిని పొందుట సంభవమ గాదు. ఆత్మ బద్ధమైనచో, అది శాశ్వత బంధమే యగును. ఆత్మ ముక్తమైనచో, ఇప్పుడు కూడ ముక్తమే. ఆత్మ నిత్యముక్తమై యుండి, ఆత్మ బద్ధమని నీవు తలంచినచో, అపుడు అజ్ఞానమ నీకు గల సమస్య యగును. దానిని తొలగించుటకు నీకు వేదాంత ప్రమాణము అపేక్షితమగును మరేదియు అక్కరలేదు. అంతఃకరణ శుద్ధి మొదలగు వాటిని సాధించుటకు ప్రార్థన ఇత్యాది అనేక ఉపాయములు గలవు. ఈ వికల్పములు ఆధారంగా మతములన్నియు ఒకే లక్ష్యమునకు చేర్చున ఎవరైననూ వాదించినచో, ఆ వాదము అజ్ఞానము యొక్క పరిధిలో మాత్రమే అన్వయించును. శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, శివుడు ఇత్యాది రూపములలో నీవు ఏ రూపమును ప్రార్థించినన ద్వైతము గలదు గనుక, దానికి జ్ఞానముతో సంబంధము లేదు.

ద్వైతమునందు నీకు దేశములో గాని, కాలములో గాని దూరముగా నున్న ఒక వస్తువును పొందే ప్రయత్నము గలదు. లేదా, ఇప్పుడు నీ యందు ఉన్న ఒక అనిష్ట విషయమును తొలగించుటకు ప్రయత్నము గలదు. ఇట్టి ద్వైతరచన అనే చక్రమునకు లోబడి మాత్రమే ఉపాయమును ఎంచుకునే అవకాశము గలదు. పైన చెప్పిన రెండు రకముల లక్ష్యములు కర్మచే మాత్రమే సిద్ధించును. ఉదాహరణకు నీ లక్ష్యము ధనార్జన అనుకో. దీనికి లాటరీ టిక్కెట్టును కొనుటతో సహా శతాధిక ఉపాయములు గలవు. వాటిలో ఒక దానిని ఎన్నుకొని నీవు ప్రయత్నమును చేయవలెను. ఇది కర్మ సాధ్యము. అనగా, నీ వద్ద ఇప్పుడు ధనము లేదు. నీవు దానిని

సంపాదించుటకొరకై కర్మను చేయవలెను. అది ఈ జన్మలో చేయవచ్చును. లేదా పూర్వజన్మలో చేసి యుండవచ్చును. ఆస్తి వారసత్వము, లాటరీ తగులుట, షేర్లలో లాభము ఇత్యాదులను కర్మనియతి దృష్ట్యా ప్రమాణీకరించుటకై పూర్వజన్మలయందలి కర్మను స్వీకరించవలెను. ఇవి కూడా కర్మచే సంపాదించ బడినవియే. ప్రధాన విషయమేమనగా, కర్మచే సాధింపదగిన లక్ష్యము ఏదైననూ, దాని విషయములో ఎన్నుకునే స్వేచ్ఛ నీకు గలదు. నీవు ఒక కర్మను చేయవచ్చును; చేయక పోవచ్చును; లేదా మరియొక విధముగా చేయవచ్చును (కర్మ కర్తుం శక్యమ్, అకర్తుం శక్యమ్, అన్యథా వా కర్తుం శక్యమ్). కాని జ్ఞానము విషయములో పరిస్థితి ఇది కాదు. ఒక వస్తువు యొక్క రంగును నీవు చూచే సందర్భములో, నీకు ఎటు వంటి స్వేచ్ఛ గలదు? నీవు నీ కళ్లను తెరిచి చూడవలెను. నీకు నేత్రదోషము లేనిచో, కళ్లను తెరచిన పిదప వస్తువునకు గల రంగు మాత్రమే కనబడును. మరియొక రంగు కనపడదు. జ్ఞానము వైయక్తిక ఇచ్ఛకు అధీనమై ఉండదు. జ్ఞానసాధనము సక్రమముగా నున్నచో, వస్తువు ఎంత సత్యమో, వస్తు జ్ఞానము కూడ అంతే సత్యము అగును. అనగా జ్ఞానము వస్తుతంత్రమే గాని పురుషతంత్రము గాదు.

కావున భగవానుడీ శ్లోకములలో ప్రస్తావించిన వికల్పములన్నియు అజ్ఞానము యొక్క పరిధిలోనివి మాత్రమే. వీటికి జ్ఞానముతో సంబంధము లేదు. నీవు ధ్యానమును చేయలేక పోయినచో, యోగాభ్యాసమును చేయుము. దానివలన ధ్యానమునకు అపేక్షితమగు మనః ప్రసన్నత నీకు అలవడును. అది కూడా నీకు చేతకాకపోయినచో, కర్మయోగ జీవితమును స్వీకరించుము. అనగా ధర్మనియతి ఈశ్వరుడే యని గుర్తించి, ఆ నియతికి అనురూపముగా కర్మలను ఈశ్వరుని కొరకు చేయుము. ఇది కూడా చేతకాకపోతే, కర్మఫలములను త్యజించుము (కర్మఫలత్యాగం కురు). అనగా నీ కర్మల ఫలరూపముగా ఏది సంప్రాప్తమైననూ ఈశ్వరానుగ్రహము అను బుద్ధితో స్వీకరించుము. దీనివలన నీకు శాంతి లభించును. కావున కర్మఫలత్యాగము ఇతర సాధనల కంటె తీసికట్టు అని తలంపరాదు. ఏలయన, దాని ఫలమగు శాంతి మనస్సును జ్ఞానోదయమునకు, తద్ద్వారా మోక్షమునకు సంసిద్ధము చేయును.

పరబ్రహ్మవు నీవే (తత్ త్వం అసి) అనునది సమస్తశాస్త్రసారము. అందువలననే, నీవు నిత్యముక్తుడవు. నీవు అట్లు గానిచో, నీకు ముక్తి లేదు. ఏలయన, నీవు ఈశ్వరుని కంటె భిన్నుడవగుదువు. కావున జ్ఞానము వలననే మోక్షము లభించును. ఈ మాటను చెప్పునది గీత మాత్రమే కాదు. పురాణములు, ఇతిహాసములు అన్నియూ ఈ మాటలనే పదేపదే చెప్పుచున్నవి. ప్రమాణ భూతమైన శాస్త్రము కూడ ఇటులనే చెప్పుచున్నదని స్పష్టమే గదా!

శ్రీశంకరులు మరోసారి దీనిని స్పష్టము జేసినారు. అజ్ఞాని కొరకు ఉద్దేశింపబడిన వివిధ చిత్త శుద్ధి సాధనముల మధ్య పోలిక గలదు. ఈ మీమాంసలోనికి జ్ఞానులను లాగవద్దు (తత్ర తిష్ఠంతు). ఈ సాధనములలో ఒకటి ప్రార్థన. దాని స్వరూపము ఏదైనా, ఫలము నిశ్చితము. ఒకడు ఉన్నత స్థాయికి చెందిన పరిష్కృతమగు విధానములో ప్రార్థించవచ్చును. గిరిజనుని ప్రార్థన మోటుగా నుండవచ్చును. కాని వారు ప్రార్థించే ఈశ్వరుడు ఒక్కడే. పరిష్కృతమగు ప్రార్థనను చేసే నాజూకు వ్యక్తి, మరియు మోటు మనిషి ఇద్దరు అజ్ఞానులే. ఈశ్వరుడు తమ మొరను ఆలకించుచున్నాడనియే వారిద్దరు విశ్వసించెదరు. భేదము లేశమైననూ లేదు.

'నీవే నేను' అని భగవానుడు చెప్పినాడు. ఈ అంశములో మాత్రమే ప్రార్థనా భేదము గలదు. జిజ్ఞాసువునకు ఈ వాక్యము నందు మౌలిక శ్రద్ధ గలదు. అతని ప్రార్థనలో కూడ భేదదృష్టి గలదు. కాని అది తత్కాలీనము మాత్రమే. ఆ సమయములో భేదము ఉన్నట్లు కానవచ్చిననూ, భేదమే సత్యమని అతడు స్వీకరించడు. ఆ సత్యము నెరుంగవలెననియే అతడు ప్రార్థించుచున్నాడు. అతనిలో అభేద బుద్ధి ఇంకనూ ఉదయించలేదు. కాని దాని యందు అతనికి శ్రద్ధ ఉండుటచే ఆ సత్యసాక్షాత్కారము కొరకై శాస్త్రము నధ్యయనము చేయును. అతని సాధన మరియు ప్రార్థన పైన ఉదహరించిన ప్రార్థన కంటె పూర్తి విలక్షణమైనది. ఈ ప్రార్థనను చేయునప్పుడు ఉండే మనఃప్రవృత్తి మరియు లక్ష్యభావన విలక్షణముగా నుండును. అందువలననే, ఇట్టి సాధనలో మతపరమగు సంరచనకు కూడ ప్రాముఖ్యము గలదు. చరమలక్ష్యము అద్వైతము గనుక, మతము దానికి సహకరించునదిగా నుండవలెను. వైదిక క్రతువులలో సంకల్పము ఈ లక్ష్యమునకు అనురూపముగ నుండును. ఇట్టి ధార్మిక సంరచనకు వేదాంతముతో సమమగు ప్రాముఖ్యము గలదు. ఇట్టి మతము వేదాంత సాక్షాత్కారమునకు సహకారి యగును. మతమనగా కేవల ప్రార్థన మాత్రమే గాదు. దానిలో ఈశ్వర మీమాంస (theology) అంతర్భాగమై యుండును. ఈశ్వరమీమాంసకు మూలములో భేదము స్థిరముగా నుండి, 'నేను ఈశ్వరుడను' అని తలపోయుటయే మహాపాపము మరియు ఈశ్వరనింద యని పరిగణింపబడినచో, అది సాధనను పూర్తిగా పాడుచేయును. ఇట్లు గాక శాస్త్రపరిజ్ఞానము గల హృదయముతో అభేదము కొరకు మాత్రమే చేయబడే ప్రార్థనలో సాధకుని మనఃప్రవృత్తి పూర్తి విలక్షణముగా నుండును. ప్రార్థన ఏరూపములో నున్నా అజ్ఞానమే. కాని ఆ అజ్ఞానము నుండి సాధకుడు బయట పడుటకు ప్రార్థన సహకరించును.

మనకు గల సంకల్పశక్తి ప్రార్థనలో వినియోగమునకు వచ్చును. వాస్తవంలో సంకల్పశక్తి

యొక్క సర్వోన్నతమగు అభివ్యక్తి ప్రార్థనయే. నీకు ధనమును సంపాదించవలెననే సంకల్పము ఉండుటలో ఆశ్చర్యము లేదు. ఏలయన, ధనము వలన నీ జీవితములో వెనువెంటనే ఒక అభిలషణీయమగు మార్పు వచ్చును. ఇదే విధముగా నీవు పేరుప్రతిష్ఠలు, అధికారము ఇత్యాదులను కోరి వాటిని పొందుటకు సంకల్పశక్తిని ఉద్యతము చేయవలెను. ఇది అసాధారణ విషయమేమీ కాదు. కాని ప్రార్థనలో తత్‌క్షణ ఫలమేమియూ లేదు. అయిననూ, నీవు ఉత్సాహముతో ప్రార్థించెదవు.

దీని యర్థమేమనగా, ప్రార్థన శుద్ధ సంకల్పశక్తి యొక్క సర్వోత్కృష్టమగు అభివ్యక్తి. సాధకులు ప్రార్థన ఇత్యాదులచే ఒక విశిష్టమగు మనోనియంత్రణము సంపాదించి జ్ఞానమును పొంది జ్ఞానులు అగుదురు. ముముక్షువు వారి దృష్టాంతమునమనుసరించును. ప్రస్తుతంలో అర్జునుడు ముముక్షువు. అతడు మోక్షమును గోరు చున్నాడు. కావున ముముక్షువుల కొరకు మాత్రమే ఉద్దేశింపబడిన ఈ వికల్పములన్నింటినీ శ్రీకృష్ణుడు అతని ముందు ప్రస్తావించుచున్నాడు. కాని మోక్షము జ్ఞానరూపము గనుక, దాని యందు వికల్పము లేదు.

వివిధ వికల్పముల గురించి వర్ణించిన పిదప, వాటన్నింటికి ఫలము ఒకటియే ననియు భగవానుడు చెప్పుచున్నాడు. కర్మయోగ జీవనమును గడుపుతూ ధ్యానమును చేయు ఉపాసకుడు ఆ శాంతిని పొందును. కర్మయోగములో మానసికమగు ఘర్షణ నుండి విముక్తి యుండును గనుక, అది కూడా శాంతిని ఇచ్చును. ధ్యానము కూడా శాంతిని ఇచ్చును. కర్మఫలత్యాగమును చేయు మామూలు కర్మయోగి యందు కూడా ప్రసాదబుద్ధి ప్రముఖముగా నుండును. ఏది లభించినా కర్మఫలదాతయగు పరమేశ్వరుని నుండియే లభించుననే గుర్తింపు అతనిలో నుండును. మనము కర్మను చేయగలమే గాని, సృష్టించలేము. ఈ సత్యము నాతడెరుంగును. కర్మఫలముతో సహా సర్వము ఈశ్వరస్వరూపమగు నియతి ప్రకారమే జరుగును.

భగవానుడిపుడు అర్జునుని కొరకు జ్ఞాని యొక్క లక్షణములను మరల వర్ణించుచున్నాడు. జ్ఞానమే మోక్షము. జ్ఞాని లక్షణములను వర్ణించి, ఆ జ్ఞానికి తనతో గల అభేదమును ఆయన మరల నిరూపించుచున్నాడు. జ్ఞానము గలవాడు జ్ఞాని అనునది యథార్థమగు నిర్వచనము. జ్ఞానమునకు జ్ఞానియొక్క బాహ్యాకారముతో గాని, మాటలాడే శైలితోగాని సంబంధమేమియు లేదు. కాని జ్ఞాని ప్రపంచముతో వ్యవహరించు సందర్భములు కొన్ని గలవు. ఉదాహరణకు, జ్ఞానికి ఆకలి దప్పికలు ఉండును గదా! జ్ఞాని కొన్ని పరిస్థితులను ఎదుర్కొనును గదా! ఆ సందర్భములలో అతని మనః ప్రవృత్తి కొన్ని విశిష్ట లక్షణముల రూపములో వ్యక్తమగును. వ్యక్తులతో మాత్రమే

గాక, సర్వప్రాణులతో అతడు వ్యవహరించే తీరు తెన్నులు ముముక్షువునకు సాధనములగును. ముముక్షువు ఈ సాధనముల స్వరూపమును తెలుసుకొని అనుష్ఠించదగును.

రెండవ అధ్యాయములో అర్జునుడు స్థితప్రజ్ఞ (జ్ఞాని) లక్షణములను తెలియగోరగా, అవి కొన్ని శ్లోకములలో వర్ణింపబడినవి. ఇచట జ్ఞానియొక్క వర్ణన మరి కొంత ఈయబడినది. ఈ వర్ణన ముముక్షువునకు ఉపకరించును. ఏలయన ఏది జ్ఞానికి సహజ లక్షణమో, దానిని ముముక్షువు తెలుసుకొని తన జీవితములో దానిని జీవన మూల్యరూపములో స్వంతము చేసుకొనుటకు ప్రయత్నించవచ్చును. ఈ జీవన మూల్యములు జ్ఞానియందు సహజముగా నుండును. ఏలయన ఇవి ధర్మాను రూపములు గనుక ఈశ్వరుని స్వరూపమే యగును. ప్రతి సద్గుణము ఒక విశిష్టసృష్టి నియమము యొక్క అభివ్యక్తియే గాన, ముముక్షువు వాటిని తెలియవలెను. ప్రేమ, సానుభూతి, దయ ఇత్యాదులు మనము సాధారణంగా అనుభవించేవి కానే కావు. ఏలయన, మన అవగాహనలోని సంకుచితత్వము వాటి అభివ్యక్తిని దూషితము చేయును. ఇవి మనందరి అనుభవములో ఉన్న గుణములే అయినా, మనము వాటిని ఇంకనూ స్వంతము చేసుకొనవలసి యున్నది.

ఇచట వర్ణింపబడే గుణములను అవగాహన చేసుకొని, వాటికి అనురూపముగా జీవించు వ్యక్తి పరిపక్వతను పొందును. తద్ద్వారా అతడు జ్ఞానమును పొందగలడు. జ్ఞాని నిత్యజీవితములో వ్యవహరించు తీరుతెన్నులు అజ్ఞానియగు సాధకునకు సాధనలగును. కాని ఇవి జ్ఞానికి ఆభరణములు మాత్రమే.

**అధ్యాయము 12, శ్లోకము 13 :**

अद्वेष्टा सर्वभूतानां मैत्रः करुण एव च ।
निर्ममो निरहंकारस्सम दुःखसुखः क्षमी ॥ १३ ॥

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకార స్సమ దుఃఖ సుఖః క్షమీ (13)

సర్వభూతానామ్ = సమస్త ప్రాణులను, అద్వేష్టా = ద్వేషించనివాడు, మైత్రః = స్నేహశీలి, చ = మరియు, ఏవ = నిశ్చయముగా, కరుణః = దయాళువు, నిర్మమః = ఇది నాది అను శీలము లేనివాడు, నిరహంకారః = అహంకారము లేనివాడు, సమదుఃఖ సుఖః =

సుఖ దుఃఖములలో సమానముగ నుండువాడు, క్షమీ = సహజముగా సర్దుబాటు చేసుకొనే (సహించే) స్వభావము గలవాడు.

> సర్వప్రాణులను ద్వేషించని స్నేహశీలి, నిశ్చయముగా దయాళువు, అహంకార మమకారములు లేనివాడు, సుఖదుఃఖములలో సమానముగ నుండువాడు మరియు సహజముగా సహించి సర్దుబాటు చేసుకొనే స్వభావము గలవాడు (13).

ఈ శ్లోకముతో మొదలిడి అధ్యాయమునందలి ఆఖరి శ్లోకము వరకు జ్ఞానియగు సన్న్యాసి యొక్క లక్షణములు వర్ణించబడినవి. అట్టి భక్తుడు నాకు ప్రియుడు (స భక్తః మే ప్రియః) అని తరువాత భగవానుడు చెప్పును. మన దృష్టిలో భక్తుడనగా తనకంటె భిన్నంగా ఈశ్వరుని దర్శించు సాధకుడు. కాని భగవానుడు అట్టి అజ్ఞానిని గురించి ఇచట మాటలాడుట లేదు. జీవేశ్వరులు వేర్వేరు అను భావన గల భక్తునకు ఈ శ్లోకములో చెప్పిన గుణములు ఉండజాలవు. 'నా స్వరూపము అపరిచ్ఛిన్నము' అని ఎరింగి తద్ద్వారా కృతార్థతను పొందియున్న (కృతకృత్యః) జ్ఞానియందు మాత్రమే ఈ గుణములు ఉండును. అట్టి జ్ఞాని ద్వేషాది గుణముల నుండి సహజముగా వినిర్ముక్తుడై యుండును. కావున ఈ లక్షణములు జ్ఞానిని వర్ణించుటకు ఉద్దేశించినవే గాని, భక్తుని లేదా కర్మయోగిని వర్ణించునవి గావు. అయిననూ, సాధకుని దృష్టిలో నిడుకొని ఇవి చెప్పబడుచున్నవి. నీవు ద్వేషము నుండి విముక్తిని గోరుచున్నావా? బాగున్నది. అది ఆత్మ యొక్క సహజలక్షణమై యున్నది. ఆత్మ స్వరూపతః పూర్ణము, ఆనంద ఘనము అను జ్ఞానములో సంశయము గాని, అస్పష్టత గాని లేని వ్యక్తి యొక్క లోకవ్యవహారము ఆ మూలభూతమగు ఆనందము యొక్క వ్యక్తీకరణ యగుచుండును. ఆ స్వరూప భూత ఆనందము ప్రేమరూపములో బహిర్గతమగు చుండును. మూలము నందున్న ఈ ప్రేమయే పరిస్థితుల కనుగుణముగా దయా, మైత్రి ఇత్యాది రూపాంతరములలోనికి పరిణమించు చుండును. ఇవి అన్నియూ ఒకే ఆనందము యొక్క అభివ్యక్త రూపములు. ఈ లక్షణములు జ్ఞానిని వర్ణించునవియే అయినా, ఒక వ్యక్తి జ్ఞాని యగునా? కాదా? అనే తీర్పును జారీ చేయుటకు ఈ వర్ణన ఉద్దేశింపబడలేదు. ఇది కేవలము సాధకుడు పెంపొందించు కొనదగిన జీవనమూల్యములు మరియు మనఃప్రవృత్తుల నిరూపణము మాత్రమే.

అద్వేష్టా సర్వభూతానామ్. సర్వప్రాణుల యెడ ద్వేషభావము లేనివాడు. సన్న్యాసి లక్షణములలో ఇది చాల ప్రముఖమైనది. తనకు పీడను కలిగించు వారి యెడనైననూ జ్ఞాని

ద్వేషమును గాని, దుర్భావనను గాని మనస్సులో పెట్టుకొనవడని శ్రీ శంకరులు చెప్పిరి. జ్ఞాని సర్వప్రాణులను ఆత్మ రూపముగా దర్శించును గాన, అద్వేషము అతనికి అతి సహజముగా అబ్బును. శాస్త్రములో అద్వేష్టా అను ప్రయోగము ఉన్ననూ, మనోవిజ్ఞాన దృష్టితో పరిశీలిస్తే, ఈ గుణము నెలకొను తీరు ఇదియే. ఇతరులు మనకు దుఃఖమును కలిగించినప్పుడు మాత్రమే ద్వేషము ఉదయించును. ఇతరులు నిన్ను మోసగించినపుడు, నేను మోసగించబడితినను ధారణ నీకు కలిగినపుడు, నీవా వ్యక్తిని ద్వేషించెదవు. నీవు అనేక పర్యాయములు మోసగింపబడితివి. ఘోరమగు అవమానములకు గురి అయితివి. నీవు ప్రపంచముపై ఆధారపడినచో, నీవు ప్రపంచమును, నిశ్చితముగా రాగద్వేషములపై ఆధారపడి, ఇష్ట, అనిష్ట వస్తువులు అను రెండు రాశులుగా విభజించెదవు. నీకు దుఃఖమును కలిగించు వస్తువును నీవు ద్వేషించుట సహజమే. కాని నీవు నీ పూర్ణత కొరకు ప్రపంచముపై ఆధారపడనిచో, నీకు అట్టి అంతరంగిక స్వాతంత్ర్యము ఉన్నచో, నీకు వాస్తవిక దృష్టి అలవడి, అతిసహజముగా ప్రేమను పంచి ఈయగల్గుదువు. ఇతరవ్యక్తులు పురుషులు గాని, స్త్రీలు గాని, తాము ఉన్న తీరున ఉండుటకు నీవైపు నుండి అభ్యంతరమేమియూ ఉండదు. వారిలో మార్పు వచ్చినచో, సమాజమంతయూ మారునని నీకు తెలిసిననూ, నీవు వారిని మార్చలేక పోవచ్చును. జ్ఞాని చుట్టూ చాల మంది ఉండెదరు. వారిలో కొందరు అతని శిష్యులు కావచ్చును. వారైననూ అతడు పూర్తిగా మార్చలేడు. వ్యక్తులలో మార్పు వచ్చుట చాల కష్టమైన పని. మానవులు సమస్త సద్గుణములను జ్ఞానియందారోపించి స్తుతించెదరు. కాని ఆ గుణములను తమయందారోపించు కొనరు. 'నీవే సర్వము' అని ఆచార్యుడు మొత్తుకొనుచుండును. నీవు సద్గుణములను ఇతరుల యందారోపించి దర్శించుచున్నచో, నీవు ఉన్న స్థితిలో మాత్రమే కొనసాగెదవు. మారుటలో క్లేశము గలదు. ఉన్నస్థితిలో కొనసాగుట సరళముగ నుండును.

మరో విధంగా చూస్తే, నీవు మారకపోయినచో, అది కూడా దుఃఖదాయకమే యగును. కాన అవశ్యకమగు మార్పులను పొందుటకై మనము ఈశ్వరుని అనుగ్రహమును ప్రార్థించెదము. 'అవశ్యకమగు మార్పును పొందుటకు నేను కటి బద్ధుడను' అని నేను ప్రార్థించినచో, ఆ మార్పు సహజముగా వచ్చును. జ్ఞాని ద్వేషించడు అని చెప్పినచో, అజ్ఞాని ద్వేషించవచ్చుననే అభ్యమజ్ఞ దానియందు లేదు. ఒక వ్యక్తి ఒక విధముగా నుండుటకు కారణము అతడు మరియొక విధముగా నుండలేకపోవుటయే. అతడు మరియొక విధముగా నుండగల్గినచో, తప్పక మారి యుండెడివాడు. కావున, ఇచటి తాత్పర్యమేమనగా, మానవుడు ఇతరులను ద్వేషించుటకు తగిన కారణము లేదే లేదు. ఇతరులకు హాని కలిగించే ప్రవృత్తి అట్లు ప్రవర్తిల్లు వ్యక్తికి కూడా హానిని కలిగించును.

కావున ఇట్టి ప్రవృత్తిని విడనాడి తాను మారాలని ప్రతి వ్యక్తి కోరుకొనును. కాని అతడు మారుట లేదనగా, మారే శక్తి అతనిలో లేదని స్పష్టమగుచున్నది. ప్రపంచము పూర్తిగా నా అభీష్టములకు అనురూపముగా నుండవలెననుకొనుట మూర్ఖత్వమగును. నా అభీష్టములు న్యాయబద్ధమైనవే కావచ్చును. నీ దృష్టిననుసరించి ఒక వ్యక్తిలో కొన్ని మార్పులు రావలసి యున్నది. ఆ మార్పులు అతని ప్రవర్తనకు సంబంధించినవి, మరియు అతనికి హితమును కలిగించునవి అనుటలో సందేహము లేదు. కాని ఒక సమస్య గలదు. నీ దృష్టిలో ఏవి మహత్త్వపూర్ణములో, అవి అతని దృష్టిలో అట్లు గాక పోవచ్చును. ఒకవో అతని దృష్టి నీ దృష్టితో సమానముగా నున్ననూ, మహత్త్వపూర్ణమగు జీవనమూల్యములకు అనురూపముగా వ్యక్తి మారుట కేవల సంకల్పశక్తిచే సులభముగా సిద్ధించేది కాదు. క్రియా సాధ్యములగు లక్ష్యములను సంకల్పబలముచే సాధించవచ్చును. నేను ప్రతి దినము ఒక మైలు దూరము నడిచెదనని నీవు నిశ్చయించుకొని అట్లు చేయగల్గుదువు. నీవు నీ అభీష్టమునకు విరుద్ధమైన క్రియను బలవంతముగానైననూ చేయగల్గుదువు. కాని అంతరంగములో మార్పు వచ్చుట దీనికి పూర్తిగా భిన్నమైన ప్రక్రియ. దీనిలో సంకల్ప శక్తిని ప్రవేశపెట్టినచో, పరిస్థితి అవకతవకగా తయారగును. 'నేను మారాలి' అనే కటి బద్ధత మంచిదే. కాని కేవల సంకల్ప బలముచే మనిషి మారలేడు. ఒక వ్యక్తి తనను ప్రేమించుమని నిన్ను కోరినాడనుకొనుము. అతనిని ప్రేమించుట నీ అధీనములో లేదు. ఆ ప్రేమ తనంత తానుగా పుట్టుకు రావాలి. మానవులు మారే అవకాశము ఒక్కటి మాత్రమే గలదు. అదియే ప్రార్థన.

ఒక వ్యక్తి ఒక ప్రత్యేక పద్ధతిలో ప్రవర్తించుటకు అతని నిస్సహాయతయే కారణమనియు, అట్లు ప్రవర్తించకుండా ఉండజాలడనియు నీవు తెలుసుకున్నచో, అతని పరిస్థితిని అతని దృష్టి కోణమునుండి నీవు పరిశీలించినచో, మారవలసినది నీవేనని నీకు స్పష్టమగును. మనము సర్వదా ఎదుటి వ్యక్తి మారాలని అపేక్షిస్తాము. బాగున్నది. కాని నీవు మారాలని అపేక్షించే హక్కు అతనికి కూడా గలదు. నీవు సావధానతతో విశ్లేషించినచో, ఇతరులు మారాలని కోరే హక్కు నీకు లేదని స్పష్టమగును. నీవు చేయగలిగినది నీవు మారుట మాత్రమే. ఇతరులు తమ ఇచ్ఛ వచ్చిన రీతిని జీవించే అవకాశమును వారికి ఇమ్ము. ఇట్లు చేసినచో నీ నుండి ద్వేషము దూరమగును. ఇతర వ్యక్తి మనకు దుఃఖమును కలిగించినప్పుడు మాత్రమే ద్వేషము ఉదయించునని నేను ముందుగనే చెప్పి యుంటిని. కాని వాస్తవంలో నీకు దుఃఖమును ఇతరు లెవ్వరూ ఈయజాలరు.

ఇతరుల ప్రవర్తనను అంతరంగములో నిక్షిప్తము చేసుకొనుట వలన సమస్య నిర్మాణ మగును. ఇతర వ్యక్తి నీకు నచ్చని పనిని చేసినా, మాటను పలికినా నీకు కోపము వచ్చును. కాని

తనను తలపోటు పీడించుచున్నదని ఇతర వ్యక్తి నీతో చెప్పినచో, నీకు కోపము రాదు. ఇతర వ్యక్తిలో కొన్ని మానసిక సమస్యలు ఉండుటచే కొన్ని రకముల ప్రవర్తనను అతడు ప్రదర్శించును. ఇది కూడా తలపోటు వంటిది మాత్రమే. కాన నీవు కోపించుట అర్థరహితమగును. ఆ సమస్య ఆ వ్యక్తికి సంబంధించినది. నీవు చేసే పనులకు, నీ మానసిక భావావేగములకు బాధ్యత నీది యగును. కాని ఇతరుల చేష్టలకు, మానసిక భావావేగములకు బాధ్యత నీది కాదు. వాటి నియంత్రణ నీ అధీనములో నున్నచో, వాటి పూర్తి బాధ్యత నీది యగును. నీ స్వంత భావావేగములపై నీకు నియంత్రణ లేని స్థితిలో, ఇతరుల పనులకు నీవు బాధ్యతను స్వీకరించే ప్రసక్తి ఎక్కడిది? నీవు తెలిసి గాని, తెలియక గాని ఒక పనిని చేసి యున్నచో, దాని బాధ్యతను నీవు స్వీకరించి తప్పును దిద్దుకొనవచ్చును. నీ భావనల విషయములో నీవు నిష్కపటముగా నున్నచో, చక్కని మార్పులకు అదియే శుభారంభమగును. నీలోని లోటుపాట్లను నీవు సరిదిద్దుకొన గల్గుదువు. కాని ఇతరుల లోటుపాట్ల మాటయేమి? వాటి విషయములో నీవు ఎట్లు బాధ్యుడవగుదువు? కాని ఇతరుల లోటు పాట్లు నిన్ను చాల అధికముగా ప్రభావితము చేయుచున్నట్లు కన్పట్టుచున్నది. ఏలయన ఇతరుల లోటుపాట్లను నీవు మరుక్షణములో నీ మనస్సులో నిక్షేపించుకొనెదవు (internalisation). ఆత్మ విమర్శ మొదలగు కొన్ని విశిష్ట ఆలోచనా ధోరణులు మనలో గతకాలీన సంస్కారరూపముగా దాగియుండును. కొన్ని రకముల ప్రవర్తన, మరియు కొన్ని రకముల మాటలు మనలో దాగి యున్న ఆ భావావేగములను ఒక్క ఉదుటున పైకి తీసుకొని వచ్చును. సరిగా విశ్లేషించినచో, ద్వేషము జ్ఞానికి మాత్రమే గాక ఎవరికైననూ అర్థరహితమే. ఇతరులను నియంత్రించ వలెననే కామననుండి ద్వేషము, క్రోధము ఇత్యాదులు పుట్టును. ఈ ప్రపంచమును 'రక్షించవలె' ననే ప్రయత్నమును చాల మంది చేసి యున్నారు. కాని అంతతో గత్యా వారందరు వినాశమును పొందినారు. పైగా అతి సూక్ష్మమగు ప్రాణుల చేతిలో వినాశమును పొందినారు. నీవు మార్పును తీసుకు రాగల్గిన స్థానము ఒక్కటి మాత్రమే గలదు. అదియే నీవు. నీకు స్వాతంత్ర్యము గలదు. కావున నీవు మారవచ్చును. ఇతరులు కూడ తమకు ఇష్టమైనచో మారెదరు. ప్రతి మానవుడు నిగూఢముగా నున్న సాధువే. ఏలయన, సాధుత్వమనగా నీ స్వరూపము యొక్క అభివ్యక్తియే. ఈ సత్యమును నీవు గుర్తించినచో, ఇతరులను నియంత్రింప బూనుట, మరియు ఇతరులపై ద్వేషభావమును కలిగియుండుట అను సమస్యలు నీ నుండి దూరమగును. నీకు స్వేచ్ఛ గలదు. నీవు ఇతరులతో కొట్లాటకు దిగవలసిన అవసరమే ఉండదు. నీవు వస్తుస్థితికి అను రూపమగు రీతి (pragmatism) లో మాత్రమే వ్యవహరించగల్గుదువు. ఎంతవరకు నీవు చేయగలవో, అంత వరకు చేయుము. సాధ్యము కాని దానిని యథాతథముగా స్వీకరించుము.

ఈ సత్యము నెరింగిన వ్యక్తికి ఏ ప్రాణియందైననూ ద్వేషముగాని, క్రోధము గాని ...మైననూ ఉండదు (అద్వేష్టా సర్వభూతానామ్). సర్వమును ఆత్మ రూపముగా దర్శించు జ్ఞానికి ...ంతటా స్వాతంత్ర్యము గలదు. అతని హృదయమునకు పీడ కలిగించేది ఏదీ లేదు. అజ్ఞాని హృదయమునకు గాయము కలిగించే పరిస్థితులను తానే నిర్మించు కొనును. కాని జ్ఞాని ...ట్లు చేయడు. పరిస్థితులన్నియూ ఆత్మరూపుడగు తనను అనుసరించి ప్రకాశించుచున్నవని అతడు ...ర్శించును. ఈ సత్యమునాతడు యథాతథముగా దర్శించుటచే, సర్వప్రాణుల యెడ దుర్భావన ... నుండి అతి సహజముగా దూరమగును (అద్వేష్టా సర్వభూతానామ్). నీ మనస్సునకు ...ఖము కలుగనిదే నీవు ఇతర వ్యక్తిని ద్వేషించలేవు. నీవు దృశ్యము కానంతవరకు ఇతరులు ...కు దుఃఖమును కలుగజేయలేరు. ఇంద్రియగోచరమగు వస్తువు నందు మాత్రమే ఎట్టి ...కారమునైననూ కలిగింప వచ్చును. ఇంద్రియగోచరమగు తత్త్వమునకు పీడను కలిగించవచ్చును. ...ాని ఆత్మ ఇంద్రియ గోచరము కాదు. సర్వజగత్తు దృశ్యరూపముగా ఏ చైతన్యముచే ప్రకాశింప చేయబడు చున్నదో, అట్టి చైతన్యమును ఎవరు దృశ్యముగా చేయగలరు? నీకు బాధను కలిగించే కర్మను కూడ ప్రకాశింపజేసేది అసంగుడవగు నీవే. అట్టి చైతన్యము దుఃఖమునకు గురియగుట ఎట్లు సంభవము? కావున ఇతరుల చేష్టలు చేష్టలుగనే మిగిలియుండును. నీవు వాటి విషయములో వాస్తవిక దృష్టితో స్పందించెదవు.

ఇట్టి వ్యక్తి యందు మైత్రీ భావన అతి సహజముగా నుండును. ఇట్టి వ్యక్తి మైత్రః అనబడును. మిత్రమ్ (స్నేహితుడు) అని చెప్పకుండగా భగవానుడు మైత్రః అను భావవాచక పదమును ప్రయోగించుటకు కారణమేమి? మిత్రుడు ఎవరైననూ కావచ్చును. పెంపుడు జంతువైననూ మిత్రుడు కావచ్చును. మిత్రమ్ అను పదముపై భావవాచక ప్రత్యయమును చేసినచో, మిత్రస్య భావః మైత్రి (స్నేహధర్మము) అగును. అట్టి మైత్రి గలవాడు మైత్రః అగును. అట్టి వ్యక్తికి ఎవరిపైననూ దుర్భావన ఉండదు. కాని అతడు అంటీముట్టనట్లు ఉండడు. అతడు స్నేహమును నెరపును. క్రోధము గాని, లేక ఇతరుల యెదుట నిలబడుటకు భయము గాని గల వ్యక్తి అంటీముట్టనట్లు ఉండును. ఇది వ్యక్తి వికాసమునకు ఆటంకము అగును. ఏలయన, నలుగురి మధ్యలో మసిలినప్పుడు మాత్రమే వ్యక్తి వికసించును. అంటీముట్టనట్లు ఉండే వ్యక్తి పది మంది మధ్యలోనికి రాగానే అతని సమస్య పదింతలగును. నీ వ్యక్తిత్వములోని వివిధాంశములు విభిన్న మనస్తత్వములు గల వ్యక్తులతో వ్యవహరించినప్పుడు మాత్రమే వికసించును. అప్పుడు మాత్రమే వీ గురించి నీకు అవగాహన ఏర్పడును. జ్ఞాని నలుగురితో స్నేహముగా నుండుట మాత్రమే గాక, అతనికి భయము ఉండదని భగవానుడు చెప్పబోవు చున్నాడు. ఆత్మ ఆనందఘనమని అతడు

ఎరుంగును. అట్టి ఆనందస్వరూపుడైన జ్ఞాని వివిధ వ్యక్తులతో సంబంధమును ఏర్పరుచుకున్నప్పుడు ఆ ఆనందమే విభిన్న భావావేశముల రూపములో ప్రకటమగును. వాటిలో మైత్రి ఒకటి.

కరుణః అనగా దయ గలవాడు. ఇట్టి వ్యక్తి ఇతరులలోని లోటుపాట్లను ఉపేక్షించగలడు. ప్రేమ లేక మైత్రి రూపములో వ్యక్తమయ్యే ఆనందమే పీడితుల యెడ దయ అనురూపములో కూడ వ్యక్తమగును. ఇట్టి సన్న్యాసి సర్వులకు శరణము నీయగల్గునని శ్రీ శంకరులు చెప్పిరి. సూర్యుడు, గురువు మరియు పంచభూతముల సాక్షిగా సన్న్యాసి సర్వప్రాణులనుద్దేశించి 'భయపడకుడు (మా భైష్ట)' అని ప్రకటించును. అతని వలన ఎవ్వరికైనను భయము లేదు. ఏలయన, ఇతరుల సంపదను గాని, పదవిని గాని అతడు కాంక్షించడు. చెట్లు చేమలు, పశుపక్ష్యాదులు అయిననూ అతని వలన భయపడవలసిన పనిలేదు. అతడు సర్వప్రాణులకు అభయము నిచ్చును. అతని యందు దయ లేనిచో, అతడు ఇతరులకు బోధించుట ఎట్లు సంభవమగును? తాను బోధించు తత్త్వమును యథార్థముగా నెరింగిన ఆచార్యుని దృష్టిలో నీవు సమస్యలు ఏమియూ లేని సచ్చిదానంద స్వరూపుడవు. ఆచార్యుని దృష్టిలో తనకు గాని, ఇతరులకు గాని సమస్యలు ఏమియూ లేవు. ఇతరుల దుఃఖముచే విచలితుడు గాని వ్యక్తికి బోధించవలసిన ఆవశ్యకత ఎట్లు కానవచ్చును? అతడు తన శిష్యుల దుఃఖమును తొలగించి సహకరించుట ఎట్లు సంభవమగును? అతని సహజస్వరూపమగు ఆనందము దయగా పరిణమించును. వ్యక్తుల ప్రవర్తనను అతడు గమనించడని అనుకోరాదు. వాస్తవంలో అతడు ఇతరుల కంటె అధిక సంవేదనాశీలుడై యుండును. కాని అతని ప్రతిక్రియలో దయ తొణికిసలాడు చుండును. జ్ఞానియందు దయ పూర్ణముగా నుండును. జ్ఞాని ఆనంద స్వరూపుడు గనుక, సమస్యలు అతనికి కానరావు గనుక, అతనికి మానవులకుండే భావావేశములు (emotions) ఉండవు గనుక, అతడు జ్ఞానమును బోధించడు అనుకోరాదు. అదియే సత్యమైనచో, బోధనా సంప్రదాయము ఏనాడో నిలిచి పోయి ఉండెడిది. తత్త్వము నెరుంగనివారు మాత్రమే బోధించెడి వారు. తత్త్వము నెరింగిన వారు బోధించి యుండెడివారు కాదు. 'ఓ గురూ! నేను దుఃఖితుడనై యున్నాను. దయచేసి నాకు ఉపదేశించుము' అని శిష్యుడు కోరినప్పుడు, గురువు 'నీవు సచ్చిదానందుడవు, నీకు సమస్య లేదు' అని చెప్పడు. మరియు సంసారి యొక్క దుఃఖముతో పూర్ణముగా తాదాత్మ్యమును చెంది, తాను కూడా సమానమగు దుఃఖము ననుభవించడు. లోకములో మహాత్ముల గురించి తప్పు అభిప్రాయము గలదు. భక్తునితో సమానమగు దుఃఖము మహాత్ముడు అనుభవించునని కొందరు చెప్పెదరు. అది మహాత్ముని మహత్త్వమని వారు తలపోయుదురు. కాని వాస్తవములో మహాత్ముని గురించి అట్లు చెప్పినచో, అది మహాత్ముని పొగిడినట్లు గాక, ములకన చేసినట్లే యగును.

పరమేశ్వరుడు పరిపూర్ణ దయామయుడని వర్ణించెదరు. పరమేశ్వరుని సారస్వరూపము సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ. అయిననూ పరమేశ్వరుడు దయా మొదలగు గుణములకు నిధానమని భావించవచ్చును. అతని యందు దుర్భావన గాని, ద్వేషము గాని లేదు గాన, అతడు సర్వదా జనులకు ఏదో ఒక మంచిని చేయగోరుచుండును. అతడు అతి సహజ ధోరణిలో ఇతరులకు సహకరించును.

జ్ఞానిలో ఈ దయ మత విశ్వాసియగు వ్యక్తిలో కంటె కూడా అధికముగ నుండును. వైదిక కర్మానుష్ఠానపరులు యజ్ఞయాగాదులలో వివిధ వృక్షములను వినియోగించెదరు. కాని సన్న్యాసి ఎన్నడైననూ చెట్లను నరకడు. జ్ఞాని వలన ఇతరులకు అణుమాత్రమైననూ హాని లేదు. కావున, జ్ఞానిని గాంచి ఎవ్వరూ భయపడరు. అతడు సమాజమునుండి దేనినీ కోరడు. పైగా అతడు సర్వులకు అభయము నిచ్చును. అతడు ఇంద్రాది దేవతలతో మరియు వృక్షములతో గూడ 'ఈపైన నా వలన మీరు భయపడకుడు' అని చెప్పును. పరిణతి చెందిన వ్యక్తి మాత్రమే ఆ స్థితికి చేరుకొనగల్గును. అట్టి వ్యక్తి అపైన జ్ఞానమును పొందినప్పుడు, ఏది ఎట్లు వచ్చిననూ, ఆ జ్ఞానము స్థిరముగా నుండును. అతడు అభయము నిచ్చి యున్నాడు గాన, అమాయక శిశువువలె నిర్భయుడై యుండును. జ్ఞానిని తరుచుగా శిశువుతో పోల్చెదరు. జ్ఞానిని పిచ్చి వానితో (ఉన్మత్త) గూడ పోల్చెదరు. ఏ కారణము లేకుండగానే ఆనందముగా నుండుట అను అంశములో ఈ పోలిక వర్తించును. ఆనందమునకు కారణము ఉంటే ఉండుగాక! కాని మనకు తెలిసినంత వరకు కారణము లేదని అభిప్రాయము. జ్ఞాని యొక్క ఆనందము బాహ్యపరిస్థితుల నుండి పుట్టేది గాదు. అది అతని స్వరూప భూతమైన ఆనందము. మరియు నాతడు శిశువు వలె రాగ ద్వేష వినిర్ముక్తుడై యుండును. మనము బాలుని వలన భయపడము. అటులనే జ్ఞాని వలన మనకు భయము లేదు. జ్ఞాని సుఖదుఃఖములను సమముగా చూచును. జ్ఞాని ఇతరుల దోషములను క్షమించగల్గును.

ఏ ప్రాణియెడలనైననూ ద్వేషభావము లేనివాడే జ్ఞాని. పైగా జ్ఞానియందు మైత్రి మరియు పూర్ణదయ ఉండును. ఈ మనోగుణములన్నియు జీవనమూల్యములు మరియు సాధనములు మాత్రమే గాదు. ప్రకరణమును బట్టి ఇవి జ్ఞానియొక్క లక్షణములని అవగతమగుచున్నది. తరువాతి అధ్యాయమునలో అమానిత్వము, అదంభిత్వము, అహింస మొదలగు సాధనములు జ్ఞానసాధనములనియు, వాటిని తప్పక పెంపొందించు కొనవలెననియు నిరూపింపబడును. కాని ఆత్మ యొక్క స్వరూపము స్వాతంత్ర్యము మరియు పూర్ణత్వము అని యెరింగిన జ్ఞాని యొక్క లక్షణములు కూడా ఇవియే. జ్ఞాని ప్రపంచముతో వ్యవహరించునప్పుడు 'అద్వేష్టా సర్వభూతానామ్' ఇత్యాది రూపములలో తన స్వరూపమును ప్రకటించును.

నిర్మమః కొన్ని వస్తువుల యెడ 'ఇది నాది' అను ధారణ నుండి విముక్తి చెందిన వాడు. సర్వసంపత్తులను పరిత్యజించిన సన్న్యాసి యందు కూడ ఈ మమకార భావన మిగిలి యుండుటకు అవకాశము గలదు. సన్న్యాసికి గృహక్షేత్రాదులు, బ్యాంకులో ధనము ఇత్యాదులు ఉండకపోవచ్చును. కాని అతని యందు 'నా దేహము, నా మాల, నా కమండలము' ఇత్యాది ధారణలు ఇంకనూ మిగిలి యుండవచ్చును. 'నేను ఈ దేహము మాత్రమే' అను పరిచ్ఛిన్న ధారణ రూపములో వ్యక్తమయ్యే అహంకారము తొలగినప్పుడు మాత్రమే ఈ మమకారము తొలగును. స్థూలదేహమునందు 'నేను' అను ధారణ (దేహ ఆత్మ బుద్ధిః) ఉన్నంత వరకు 'నేను సర్వము కంటె వేరుగా నున్న వ్యక్తిని' అను ధారణ ఉండును. అది ఉన్నంత వరకు 'నాది' అను ధారణ (మమత్వ ప్రత్యయము) ను వదిలించుకొనుట అసంభవము. మానవుడు ఎన్ని వస్తువులను త్యజించగోరునో, అన్నింటినీ త్యజించగల్గును. కాని ఈ మమత్వప్రత్యయము మాత్రము అహంకారము ఉన్నంతవరకు అతనిని వీడి పోదు. వాస్తవంలో పోయేది అహంకారము కాదు. అహంకారము సత్యము అను ధారణ మాత్రమే పోవును. జ్ఞానియగు వ్యక్తిలో ఇట్టి ధారణాత్మకమగు అహంకారము ఉండదు. ఏలయన, ఆత్మ విషయక - అజ్ఞానము నుండి మాత్రమే ఈ ధారణ ఉదయించును.

అహంకార మమకారములు ఒకదాని ఉనికికి మరియొకటి ఆధారమగుచుండును. 'ఈ వస్తువులు నావి' అని నీవు చెప్పకుండగా, అహంకారమును వాస్తవముగా విడిచిపెట్టుకొనుట సంభవము కాదు. కాని విచారణ చేసినచో, అజ్ఞానము యొక్క పరిధిలోనైనను వ్యక్తి 'ఇది నాదే' అని గట్టిగా చెప్పగలిగేది ఏదీ లేదు. మనః పరిపక్వత గల వ్యక్తి 'సర్వము ఈశ్వరునకు మాత్రమే చెందినది' అని దర్శించును. అతడు తన వద్దనున్న కొద్దిపాటి వస్తువుల విషయములో 'నేను న్యాససంరక్షకుడను (trustee) మాత్రమే' అను ప్రవృత్తిని కలిగియుండును. 'నా వద్ద నున్న వస్తువులన్నియును నేను సంపాదించినవియే' అను ప్రస్ఫుటమగు అహంకారము అతనిని పీడించదు. ఇట్టి ధారణకు మూలము అజ్ఞానము. కాని సాధకుడు వివేకము పొంది పరిపక్వతను సంపాదించి అహంకార భావన నుండి ఇంచు మించు విముక్తుడై యుండును. భవిష్యత్తులో జరుగ బోయేది అతనికి ఇంచు మించుగా తెలిసినట్లే ఉంటుంది. అతడు ఒక నిశ్చలమగు మానసిక విశ్రాంతిని అనుభవిస్తూ, రాబోవు పరిస్థితులను ఎదుర్కొనుటకు సంసిద్ధుడై ఉండును. అతనికి ఆత్మ విశ్వాసము కలదు. ఈశ్వరుని యందు విశ్వాసము గలదు. కావున అతనిలో మానసిక స్వాతంత్ర్యము అబ్బి స్వతంత్రుడుగా నుండును. అతనికి గల అహంకారము పరిపక్వమై యుండును.

కానీ ఐనకూ అతనికి జ్ఞానోదయము గానిచో, కొద్ది మమకారము మిగిలియుండును. కర్మయోగి, [illegible] అను సాధకుని లోని అహంకారము ప్రాకృత జనులకు గల స్థాయిలో నుండదు.

కానీ మనమీ శ్లోకములో వర్ణించుచున్న జ్ఞానికి అహం ప్రత్యయము లేదు. దేహాదుల [illegible] ఆత్మస్వరూపము నెరుంగని వానికి మాత్రమే ఉండును. గురువు యొక్క [illegible] అతడు శాస్త్రవిచారణము చేసి, ఒక్క స్థూలదేహము తాను అనే స్థితి నుండి [illegible] వర్తమానములో తాను సర్వము అనే సత్యమును సాక్షాత్కరించుకొనినాడు. 'ఈ సర్వము [illegible] (వాసుదేవః సర్వమ్)' అను దర్శనము గల జ్ఞానికి వైయక్తిక మగు 'నేను' అను ధారణ [illegible] మాయమగును. ఇట్టి సాక్షాత్కారము గల వానిని జ్ఞాని అని మాత్రమే నిర్దేశించదగును. [illegible] ప్రసిద్ధముగా వాడబడే 'భక్త' అను పదము ఇట్టి మహాత్ముని నిర్దేశించదు. ఈ [illegible] భక్త శబ్దము సాధారణముగా అజ్ఞానిని నిర్దేశించును. ఏలయన, మనకు తెలిసిన [illegible] తాము ఆరాధించే దేవునకు, తమకు మధ్యలో భేదమును దర్శించెదరు.

[illegible] 'జ్ఞాని భక్తుడు కాజాలడు' అని కాదు. భగవానుడు నిరూపించిన నాల్గు [illegible] జ్ఞాని కూడా ఒకడని మనము చూచియున్నాము. ఆపద వచ్చినప్పుడు మాత్రమే [illegible] ఆర్తుడు. తాను పొందవలసిన వివిధ లక్ష్యములను సంపాదించుటలో [illegible] సహాయమును కోరువాడు అర్థార్థి. భగవానుడనగా ఎవరు? అను విషయమును [illegible] స్వరూపత ఆత్మ కంటె భిన్నుడు కాడనే సాక్షాత్కారము [illegible] విషయములో భక్తి పూర్ణముగా సఫలమైనది గనుక, జ్ఞాని మాత్రమే [illegible] యథార్థభక్తులగుటకై అర్హతను సంపాదించే ప్రయత్నములో [illegible]. అయినను, 'జ్ఞాని నేనే (జ్ఞానీ తు ఆత్మా ఏవ)' [illegible] ఇట్టి జ్ఞానిని గురించి ఇచట చర్చించుచున్నాము.

[illegible] సుఖదుఃఖములు సమానమైనవాడు. సుఖదుఃఖములు కలుగుటకు [illegible] పరివర్తనము (వికారము) కలుగుట ఆవశ్యకము అగును. ఇట్టి స్థితిలో ఎవ్వరైనను సుఖదుఃఖములలో సమముగా నుండుట ఎట్లు సంభవమగును? నీలో భావావేగరూపమగు దుఃఖము కలిగినప్పుడు ఉన్న మనస్సు, ప్రశాంతముగా నున్నప్పటి మనస్సు ఏకరూపము కాజాలదు. మనస్సులో పరివర్తనము అనివార్యము. అదే విధముగా, మనస్సులో పరివర్తన లేకుండగా, సుఖానుభవము సంభవము కాదు. కానీ ఇచట జ్ఞానియగు వ్యక్తి సుఖదుఃఖముల యందు సముడని [illegible]. ఇది విరోధభాసవలె కన్పట్టుచున్నది. ఈ వచనమును బట్టి, జ్ఞానికి

సుఖదుఃఖములున్నచో, సముడెట్లగును? సుఖదుఃఖములు రెండింటి యందు మనస్సు పరివర్తితమగును. వాటితో తాదాత్మ్యమును పొందిన వ్యక్తి 'నేను సుఖిని' అనిగాని 'నేను దుఃఖిని' అనిగాని చెప్పును. 'నేను' అను ధారణ లేనిదే సుఖదుఃఖములు ఉండజాలవు. అట్లైనచో, మనస్సునకు సుఖము గాని, దుఃఖముగాని కలిగినప్పుడు జ్ఞాని కేవలము సాక్షియై దర్శించును గాబోలు! కాని జ్ఞాని సాక్షియైనచో, అతని అనుభవమును సుఖము లేక దుఃఖము అని నిర్దేశించుట తగదు. మనమిచట ఒక చిక్కులో పడినట్లున్నది. సుఖదుఃఖములనగా సుఖమును గాని, దుఃఖమును గాని కలిగించు పరిస్థితులు అని యర్థము. సాధారణంగా ఆ పరిస్థితులలో మనము అభినందనలను, లేక సంతాపమును ప్రకటించ వలసి యుండును. ఒక వ్యక్తి మరణించినపుడు మనము అతని బంధువులకు సానుభూతిని తెలిపెదము. ఏలయన మరణించిన వ్యక్తి యొక్క దగ్గర బంధువులకు ఆ మరణము దుఃఖదాయకమగునని మనము ఒక సామాజిక సత్యముగా పరిగణించెదము. ప్రతి సమాజములో దుఃఖప్రాపకములగు పరిస్థితులు, మరియు సుఖప్రాపకములగు పరిస్థితులను గురించి సర్వజనులకు అంగీకారమయ్యే కొన్ని నిర్ణయములు ఉండును. అట్టి పరిస్థితి ఉదయించినపుడు సమదుఃఖసుఖుడగు వ్యక్తి ప్రకృష్టమగు హర్షమును గాని, లేక నిరాశను గాని పొందకుండగా సమతౌల్య స్థితిలో నిలిచియుండును. ఆనందము కొరకు బాహ్యపరిస్థితులపై ఆధారపడని వ్యక్తికి మాత్రమే ఇట్టి సమత్వము సంభవమగును. బాహ్య పరిస్థితులపై ఆధారపడే వ్యక్తి యొక్క భావావేగస్థితి అస్థిరముగా నుండుటచే, అతడు అనుకూల పరిస్థితులలో ప్రహర్షమును, ప్రతికూల పరిస్థితులలో నిరాశను పొందుచుండును. ఇట్లు గాక సమమగు మనః స్థితి గల వ్యక్తి సమదుఃఖసుఖి అవబడును.

'నీవు సుఖదుఃఖములలో సముడవై ఉండవలెను' అని చెప్పుట చాల తేలిక. కాని ఇచట ఒక సలహా పారవేయబడుచున్నది అను కోరాదు. ఇచట తాత్పర్యమేమనగా, తన కల్యాణము కొరకు బాహ్య పరిస్థితులపై ఆధారపడి యుండు వ్యక్తి భావాత్మక ఉత్పతన, అధః పతనములకు (emotional ups and downs) అధీనుడై యుండును. ఆత్మ పూర్ణ మనియు, ఆత్మను మరింత మెరుగు పరుచుట అనేది అసంభవము అనావశ్యకము అనియు, ఆత్మయందు పూర్ణమగు భద్రత కలదనియు, ఆత్మ కాలాతీతము (సత్యమ్) అనియు ఎరింగిన వ్యక్తి అట్లు ఆధారపడడు. సుఖశాంతులకు ప్రతికూలమైన దుఃఖకరమగు పరిస్థితులలో అతడు దుఃఖి కాడు. అనగా ఒక క్లిష్టపరిస్థితిని అతడు సహించుచున్నాడనుకోరాదు. ఆ పనిని ఎవరైననూ చేయగలరు. కాని జ్ఞాని జ్ఞాన బలముచే సముడై యుండును. 'ఈశ్వరుని అధ్యాదేశము (mandate) గనుక, నేను ఇట్లు ఉండవలెను' అని కాదు.

కాని ఇంకనూ అతనికి జ్ఞానోదయము గానిచో, కొద్ది మమకారము మిగిలియుండును. కర్మయోగి, భక్తుడు అగు సాధకుని లోని అహంకారము ప్రాకృత జనులకు గల స్థాయిలో నుండదు.

కాని మనమీ శ్లోకములో వర్ణించుచున్న జ్ఞానికి అహం ప్రత్యయము లేదు. దేహాదుల యందు అహంబుద్ధి ఆత్మస్వరూపము నెరుంగని వానికి మాత్రమే ఉండును. గురువు యొక్క సహకారముతో అతడు శాస్త్రవిచారమును చేసి, ఒక్క స్థూలదేహము తాను అనే స్థితి నుండి విముక్తుడై, వాస్తవములో తాను సర్వము అనే సత్యమును సాక్షాత్కరించుకొనినాడు. 'ఈ సర్వము నేనే (అహం ఇదం సర్వమ్)' అను దర్శనము గల జ్ఞానికి వైయక్తిక మగు 'నేను' అను ధారణ మటు మాయమగును. ఇట్టి సాక్షాత్కారము గల వానిని జ్ఞాని అని మాత్రమే నిర్దేశించదగును. లోకములో ప్రసిద్ధముగా వాడబడే 'భక్త' అను పదము ఇట్టి మహాత్ముని నిర్దేశించదు. ఈ లోకప్రఖ్యాతమైన భక్త శబ్దము నిశ్చితముగా అజ్ఞానిని నిర్దేశించును. ఏలయన, మనకు తెలిసిన భక్తులు తాము ఆరాధించే ఈశ్వరునకు, తమకు మధ్యలో భేదమును దర్శించెదరు.

దీని అర్థము 'జ్ఞాని భక్తుడు కాజాలడు' అని కాదు. భగవానుడు నిరూపించిన నాల్గు రకముల భక్తులలో జ్ఞాని కూడా ఒకడని మనము చూచియున్నాము. ఆపద వచ్చినప్పుడు మాత్రమే ఈశ్వరుని ఆరాధించువాడు ఆర్తుడు. తాను పొందవలసిన వివిధ లక్ష్యములను సంపాదించుటలో ఈశ్వరుని సహాయోగమును స్వీకరించువాడు అర్థార్థి. భగవానుడనగా ఎవరు? అను విషయమును తెలియగోరువాడు జిజ్ఞాసువు. ఈశ్వరుడు స్వరూపతః ఆత్మ కంటె భిన్నుడు కాడనే సాక్షాత్కారము గలవాడు జ్ఞాని. జ్ఞాని విషయములో భక్తి పూర్ణముగా సఫలమైనది గనుక, జ్ఞాని మాత్రమే యథార్థమగు భక్తుడు. ఇతరులందరు యథార్థభక్తులగుటకై అర్హతను సంపాదించే ప్రయత్నములో న్నారు. వీరందరు ఈశ్వరునకు ప్రీతిపాత్రులే. అయిననూ, 'జ్ఞాని నేనే (జ్ఞానీ తు ఆత్మా ఏవ)' అని ఈశ్వరుడు చెప్పియున్నాడు. మనము అట్టి జ్ఞానిని గురించి ఇచట చర్చించుచున్నాము.

సుఖదుఃఖే సమః సుఖదుఃఖములు సమానమైనవాడు. సుఖదుఃఖములు కలుగుటకు మనస్సులో పరివర్తనము (వికారము) కలుగుట ఆవశ్యకము అగును. ఇట్టి స్థితిలో ఎవరైననూ సుఖదుఃఖములలో సమముగా నుండుట ఎట్లు సంభవమగును? నీలో భావావేగరూపమగు దుఃఖము కలిగినపుడు ఉన్న మనస్సు, ప్రశాంతముగా నున్నప్పటి మనస్సు ఏకరూపము కాజాలదు. మనస్సులో పరివర్తనము అనివార్యము. అదే విధముగా, మనస్సులో పరివర్తన లేకుండగా, సుఖానుభవము సంభవము కాదు. కాని ఇచట జ్ఞానియగు వ్యక్తి సుఖదుఃఖముల యందు సముడని చెప్పబడుచున్నది. ఇది విరోధమువలె కనపట్టు చున్నది. ఈ వచనమును బట్టి, జ్ఞానికి

సుఖదుఃఖములున్నచో, సముడెట్లగును? సుఖదుఃఖములు రెండింటి యందు మనస్సు పరివర్తితమగును. వాటితో తాదాత్మ్యమును పొందిన వ్యక్తి 'నేను సుఖిని' అనిగాని 'నేను దుఃఖిని' అనిగాని చెప్పును. 'నేను' అను ధారణ లేనిదే సుఖదుఃఖములు ఉండజాలవు. అట్లైనచో, మనస్సునకు సుఖము గాని, దుఃఖముగాని కలిగినప్పుడు జ్ఞాని కేవలము సాక్షియై దర్శించును గాబోలు! కాని జ్ఞాని సాక్షియైనచో, అతని అనుభవమును సుఖము లేక దుఃఖము అని నిర్దేశింపుట తగదు. మనమిచట ఒక చిక్కులో పడినట్లున్నది. సుఖదుఃఖములనగా సుఖమును గాని, దుఃఖమును గాని కలిగించు పరిస్థితులు అని యర్థము. సాధారణంగా ఆ పరిస్థితులలో మనము అభినందనలను, లేక సంతాపమును ప్రకటించ వలసి యుండును. ఒక వ్యక్తి మరణించినపుడు మనము అతని బంధువులకు సానుభూతిని తెలిపెదము. ఏలయన మరణించిన వ్యక్తి యొక్క దగ్గర బంధువులకు ఆ మరణము దుఃఖదాయకమగునని మనము ఒక సామాజిక సత్యముగా పరిగణించెదము. ప్రతి సమాజములో దుఃఖప్రావకములగు పరిస్థితులు, మరియు సుఖప్రావకములగు పరిస్థితులను గురించి సర్వజనులకు అంగీకారమయ్యే కొన్ని నిర్ణయములు ఉండును. అట్టి పరిస్థితి ఉదయించినపుడు సమదుఃఖసుఖుడగు వ్యక్తి ప్రకృష్టమగు హర్షమును గాని, లేక నిరాశను గాని పొందకుండగా సమతౌల్య స్థితిలో నిలిచియుండును. ఆనందము కొరకు బాహ్యపరిస్థితులపై ఆధారపడని వ్యక్తికి మాత్రమే ఇట్టి సమత్వము సంభవమగును. బాహ్య పరిస్థితులపై ఆధారపడే వ్యక్తి యొక్క భావావేగస్థితి అస్థిరముగా నుండుటచే, అతడు అనుకూల పరిస్థితులలో ప్రహర్షమును, ప్రతికూల పరిస్థితులలో నిరాశను పొందుచుండును. ఇట్లు గాక సమమగు మనః స్థితి గల వ్యక్తి సమదుఃఖసుఖః అనబడును.

'నీవు సుఖదుఃఖములలో సముడవై ఉండవలెను' అని చెప్పుట చాల తేలిక. కాని ఇచట ఒక సలహా పారవేయబడుచున్నది అను కోరాదు. ఇచట తాత్పర్యమేమనగా, తన కల్యాణము కొరకు బాహ్య పరిస్థితులపై ఆధారపడి యుండు వ్యక్తి భావాత్మక ఉత్పతన, అధః పతనములకు (emotional ups and downs) అధీనుడై యుండును. ఆత్మ పూర్ణ మనియు, ఆత్మను మరింత మెరుగు పరుచుట అనేది అసంభవము అనావశ్యకము అనియు, ఆత్మయందు పూర్ణమగు భద్రత కలదనియు, ఆత్మ కాలాతీతము (సత్యమ్) అనియు ఎరింగిన వ్యక్తి అట్లు ఆధారపడడు. సుఖశాంతులకు ప్రతికూలమైన దుఃఖకరమగు పరిస్థితులలో అతడు దుఃఖి కాడు. అనగా ఒక క్లిష్టపరిస్థితిని అతడు సహించుచున్నాడనుకోరాదు. ఆ పనిని ఎవ్వరైననూ చేయగలరు. కాని జ్ఞాని జ్ఞాన బలముచే సముడై యుండును. 'ఈశ్వరుని అధ్యాదేశము (mandate) గనుక, నేను ఇట్లు ఉండవలెను' అని కాదు.

'సుఖ కారకములు మరియు దుఃఖకారకములు అగు పరిస్థితులలో సమముగా నుండుము' ధ్యాదేశములు మనస్సును ఒక చట్రములో బిగించే ప్రయత్నమును చేయును. దాని ానసిక ఒత్తిడి నిర్మాణమగును. ఇట్టి ఒత్తిడి కాలక్రమములో వ్యక్తిని బలిగొనును, లేదా ని చేయును. కావున ఇట్టి వాక్యములలో ప్రాసంగిక సత్యత్వము ఉన్ననూ, వీటిని కతతో అర్థము చేసుకొనవలెను. ఇట్టి అధ్యాదేశములు మానవుని మదిలో సైద్ధాంతిక ములను నిర్మాణము చేయును. ఇట్టి ఆదర్శములకు మానవుడు దూరముకాక తప్పదు. ట్లు ఉండవలెను' అనేది ఆదర్శమైతే, వాస్తవస్థితిలో నేను అట్లు ఉండుట లేదు. ఇట్టి ధముల జాబితా పెద్దది అగు కొలదియూ, వ్యక్తి తనయందు తాను అధికాధికమగు పెంచుకొనును. ఏదో ఒకనాడు వ్యక్తి ఈ ఆదర్శములనన్నింటినీ ప్రక్కన బెట్టగల్గినచో, ాగానే ఉంటిననే సత్యమును ఆతడు గ్రహించును. జీవితములో వ్యక్తికి కొన్ని ములుండుటలో తప్పు లేదు. ఆ పరిస్థితి వేరు. ఈ రోజు ఒక లక్ష్యము కొరకు కృషిచేసి, మరియొక లక్ష్యము కొరకు కృషి చేసినచో, దాని వలన ఒరిగేది లేదు. నీవు రెండు ్సరములలో ఒక లక్ష్యమును సాధింపబూనుకున్నచో, దాని కొరకు యోజన చేయుము. అది లక్ష్యమే గాని, ఆదర్శము కాదు. కొంతకాలము తరువాత నీకు కొంగ్రొత్త జ్ఞానము ఆ లక్ష్యసాధనను పూర్తిగా విడిచి పెట్టవచ్చును. నీ ధారణలను యథోచితముగా ర్చుకొనుటకు సంసిద్ధుడవై జీవితములో ఎదురయ్యే సవాళ్లను వాస్తవిక దృష్టితో ఎదుర్కొనుట మగును. సుఖదుఃఖములలో సమముగా నుండుట అనునది ఒక ఆదర్శరూపములో యుక్తి తము కాదు. ఏలయన, ఆత్మ స్వరూపము నెరుంగని వ్యక్తి అట్లు ఉండుట సంభవము కాదు. ాని సుఖదుఃఖ పరిస్థితులను మానవుడు ఆపేక్షికమైన సమత్వముతో ఎదుర్కొనగల్గును. యోగమనగా నదియే (సమత్వం యోగ ఉచ్యతే). నీవు కర్మఫలములను ప్రసాదబుద్ధితో స్వీకరించి, తద్వారా యోగికి ఉండే వశ్యమగు మనస్సును సంపాదించవచ్చును. కాని, జ్ఞానోదయము కలిగిన వ్యక్తి విషయములో పరిస్థితి దీనికి భిన్నముగా నుండును. జ్ఞానము వలన వ్యక్తికి తన కల్యాణము కొరకు భద్రత కొరకు మరియు ఆనందము కొరకు బాహ్యపరిస్థితులపై ఆధారపడుట అను స్థితి నుండి విముక్తి కలుగును.

కావునే, జ్ఞాని క్షమాగుణమును, సహనశక్తిని కలిగియుండును (క్షమీ). జ్ఞాని ప్రతికూల పరిస్థితులలో గూడ మనఃప్రసన్నతను నిలబెట్టుకొనగల్గును. ఇది కూడా మరల ఆదర్శము కాదు. నీవు దీనిని ఆదర్శముగా స్వీకరించినచో, దానివలన ఒత్తిడి పెరిగి, సాధనా స్వరూపమే దూషితమగును. కావున క్షమ ఒక ఆదర్శము అను ధారణను ప్రక్కన బెట్టుము. క్షమాగుణము

పెంపొందే విధమెయ్యది? అను విషయమును తెలుసుకొనుము. క్షమను ఒక ఆదర్శముగా స్వీకరించి, దానిని పొందలేక పోయినందులకు నిన్ను నీవు నిందించుకున్నచో, దాని వలన ఉద్వేగము మాత్రమే పెరుగును. దాని వలన నీలో దానిని పొందాలనే తహతహ పెరిగి, మానసిక సంఘర్షణ నిర్మాణమగును. ఇట్లు గాక జీవితములో ఆదర్శములను ప్రక్కన బెట్టి, వాటి బదులుగా కొన్ని జీవన మూల్యములను అహగాహన చేసుకున్న వ్యక్తి జిజ్ఞాసువు అయిన సాధకుడు అగును. ఇది చాల అల్పమైన పరివర్తనమే అయిననూ, దీని విశిష్టత చాల గొప్పది.

జ్ఞాని విషయములో క్షమ స్వరూపము యొక్క స్వతః ప్రవర్తితమైన సహజసిద్ధ అభివ్యక్తి. దానిని తెలుసుకొని స్వంతము చేసుకొనుట ఒక సాధన.

క్షమ అనగా నేమి? సర్వప్రతికూల పరిస్థితులలో ప్రసన్నముగా నిలబడుటకు ఏమి చేయవలెను? నీవు అతి పెద్ద విపత్తునకు కూడ సంసిద్ధుడవైనచో, ఇది సంభవమగును. మానవునకు వచే విపత్తులన్నింటిలో అతి పెద్దది మృత్యువు. దీనిని జ్ఞాని మాత్రమే ఎదుర్కొనగలడు. 'కాలము సృష్టినంతనూ కబలించును, కాని నేను కాలమును కబలించెదను (అనగా నేను జగత్తునంతను కబలించెదననియే గదా!)' అని జ్ఞాని ఎరుంగును. దీని అర్థమేమనగా, ఆత్మ కాలాతీతము. మృత్యువును ఎదుర్కొనుట అనేది జ్ఞానికి సమస్య కాదు. ఏలయన, మృత్యువు లేదు. అదెట్లు? శరీరము నశించును గదా! శరీరము ప్రతిక్షణము నశించుచునే యున్నది యని జ్ఞాని చెప్పును. జీవకణములు సంతతము పరివర్తన చెందు చునే యుండును. మరియు దేహము ఇంద్రియగోచరము గనుక, నశించుట దాని స్వభావమై యున్నది (దృష్ట నష్ట స్వభావః). ఒక విశిష్ట సమయములో మాత్రమే దేహము నశించుననుకోరాదు. దేహము సర్వదా పరివర్తనను చెందుచునే యుండును. ఆలోచనలన్నియు క్షణికములే గనుక, మనస్సు కూడా ప్రతిక్షణము నశించుచునే యుండును. వీటికి భిన్నముగా, ఆత్మ కాలాధీనము కాదు గనుక, మార్పులకు లోను గాదు. కావున 'నేను' నశించదు. భాసించే జగత్తునకు స్వతంత్రమగు ఉనికి లేదనియు, సత్స్వరూపమగు ఆత్మకు అభావము లేదనియు, అనగా అది ఎన్నటికీ నశించదనియు (నాసతో విద్యతే భావః నాభావో విద్యతే సతః) శ్రీకృష్ణ భగవానుడు గీతారంభములో వక్కాణించినాడు. మరణించేది మాత్రమే మరణించు చున్నది. ఈ సత్యమును సర్వజనులు అంగీకరించెదరు. 'నేను' నశించినచో, అది సమస్యయే యగును. సూర్యుడు అస్తమించినపుడు మనము దుఃఖించము. ఏలయన జగత్తులోని వివిధ వస్తువుల యందు అట్టి మార్పులు కలుగుచుండట సహజసిద్ధమని మనకు తెలియును. ఒక వస్తువు యొక్క సహజ గుణము మనకు తెలిసిన పిదప, అది మారాలని మనము అపేక్షించము.

పంచదార తియ్యగా నున్నదనియు, చింతపండు పుల్లగానున్నదనియు మనము ఫిర్యాదును చేయబోము. ఏలయన, అది వాటి స్వభావమని మనకు తెలియును. దేహమునకు, మనస్సునకు మార్పు సహజలక్షణమై యున్నది. కాని ఆత్మ ఎన్నటికీ మారేది కాదు. మార్పు లేకపోవుట దాని సహజ గుణమగుట చేతనే అది మారుట లేదు. ఆత్మ మారునట్లు, దేహము మారకుండునట్లు చేయుట ఎన్నటికీ సంభవము కాదు. నీవు ఘటనాక్రమమును మార్చజాలవు. అట్టి స్థితిలో దానిని గురించి దుఃఖించనేల? ఈ జ్ఞానప్రభావముచే జ్ఞాని ఉత్తేజితుడు కాడు. జ్ఞాని శరీరమునకు గాయము తగిలినప్పుడు, గాయపడినది శరీరము మాత్రమేనని ఆతడు ఎరుంగును. తాను గాయపడితి నను ధారణ జ్ఞానియందు ఉండదు. ఇతర వ్యక్తి బుద్ధి పూర్వకముగా గాయపరచిన సందర్భములో జ్ఞాని యందు తాను అవమానింపబడితిననే ధారణ ఉండదు. స్థూలశరీరము నల్లగా గాని, నీలముగా గాని ఉండవచ్చును. కాని తన స్వరూపము పూర్ణమగు ఆత్మ అని యెరింగిన జ్ఞానికి భావాత్మకమగు మానసిక గాయములు ఉండవు.

కాబట్టి చక్కని అవగాహన ఆధారముగా వ్యక్తిలో క్షమ అనే మనః ప్రవృత్తి నిర్మాణమగును. క్షమ యనగా క్షమించే గుణము అని కూడా అర్థమును చెప్పవచ్చును. జ్ఞానికి క్షమ యనునది అతి సహజముగా నుండే గుణము. కాని ఆదర్శ రూపములో క్షమ చాల ప్రమాదకరమైనది. క్షమించుటకు మనమెవ్వరము? సమస్త జగత్తు మనలను క్షమించి, మనమీ తీరున జీవించుటకు అభ్యనుజ్ఞను ఇచ్చుచున్నది. ఈ క్షమించుట అను ధారణ వ్యక్తుల మధ్య దూరమును పెంచును. కావున క్షమించవలసినది ఏదియూ లేదు. మనము ఒకరినొకరు అర్థము చేసుకున్నచో చాలును. మనందరిలో విభిన్నలక్షణములు గలవు. మన ఆలోచనా ధోరణులలో, మరియు మనము పుట్టి పెరిగిన వాతావరణములలో భేదములు గలవు. మనమందరము పరిపక్వతను పొందే ప్రక్రియలో నున్నాము. ఈ సత్యమును గుర్తించినచో, మనకు ఇతరులలో మంచి, చెడు అనే భేదములు గానరావు. కావున క్షమి అనగా సహజముగా ఇతరులతో సర్దుబాటు చేసుకొనువాడు అని యర్థము.

**అధ్యాయము 12, శ్లోకము 14 :**

संतुष्टस्सततं योगी यतात्मा दृढनिश्चयः ।
मय्यर्पितमनोबुद्धिर्यो मद्भक्तस्स मे प्रियः ॥ १४ ॥

సంతుష్టస్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియః (14)

సతతమ్ = ఎల్లవేళలా, సంతుష్టః = సంతోషము గలవాడు, యోగీ = భగవంతునితో నిత్యసంబంధము గలవాడు, యతాత్మా = మనోనియంత్రణ గలవాడు, దృఢనిశ్చయః = దృఢమగు నిశ్చయము గలవాడు, మయి = నాయందు, అర్పిత మనోబుద్ధిః = అర్పించబడిన మనస్సు మరియు బుద్ధి గలవాడు, యః = ఎవడైతే, మద్భక్తః = నా భక్తుడు గలడో, సః = వాడు, మే = నాకు, ప్రియః = ప్రియమైనవాడు.

> ఎల్లవేళలా సంతోషము గలవాడు, భగవంతునితో నిత్యసంబంధము గలవాడు, మనోనియంత్రణ గలవాడు, దృఢమగు నిశ్చయము గలవాడు, నాయందు అర్పించబడిన మనస్సు మరియు బుద్ధి గలవాడు అగు నా భక్తుడు ఎవడు గలడో, అతడు నాకు ప్రియమైన వాడు (14).

ఇట్టి జ్ఞాని నాకు ప్రియమైన వాడు (మే ప్రియః) అని శ్రీ కృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. ఇచట షష్ఠీ విభక్తికి అభేదము అర్థము. మమ ఆత్మా అను ప్రయోగమునకు అర్థము 'నేను' అని మాత్రమే. అటులనే, మే ప్రియః (నాకు ప్రియమైన వాడు ) అనగా 'నాతో ఏకమైనవాడు' అని అర్థము. ఇచ్చట షష్ఠీ విభక్తికి రాహోశ్శిరవత్ (రాహువు యొక్క శిరస్సువలె) అను దృష్టాంతమును తరచుగా చెప్పెదరు. భారతీయ జ్యోతి శ్శాస్త్రములో రాహువు అను గ్రహము గలదు. రాక్షసుని శిరస్సు రాహువు అయినది. ఇచట శిరస్సునకు రాహువుతో స్వస్వామి సంబంధము కుదరదు. ఏలయన రాహువు, శిరస్సు అను రెండు వేర్వేరు వస్తువులు ఉన్నచో ఒకటి రెండవ దానిని కలిగి యుండుట అను భావన పొసగును. కాని రెండు వస్తువులు లేవు. అయినమా, రాహువు యొక్క శిరస్సు అను ప్రయోగము మనకు గలదు. అదే విధముగా మే ప్రియః అనగా మే ఆనందః అని అర్థము. ఈ జగత్తులో అత్యంత ప్రియతమమగు వస్తువు ఆత్మ. ఇతరము సర్వము ఆత్మకొరకు మాత్రమే ప్రియమగు చున్నది (ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి). జ్ఞాని నేనే (జ్ఞానీ తు ఆత్మా ఏవ) అని పూర్వములో భగవానుడు చెప్పియున్నాడు. ఇచట స మే ప్రియః అని చెప్పుచున్నాడు. ఈ రెండు వాక్యములకు అర్థము సమానమే. కాని భగవానుడిచట భక్తః అను పదమును, అచట జ్ఞానీ అను పదమును ప్రయోగించినాడు.

సంతుష్టః సతతమ్. ఇచట సతతమ్ అనునది ప్రముఖమైన పదము. ప్రతి వ్యక్తి అయా సమయములలో, సానుకూల పరిస్థితులు తారసిల్లినపుడు సంతుష్టుడుగనే యుండును. ఉద్యోగము, జీవిత సహధర్మచారిణి, సంతానము అను విషయములలో నీవు సంతుష్టుడవు అయి ఉండవచ్చును. కాని నేను ఈ జాబితాను కొనసాగిస్తూ ఉంటే, నీకు సంతుష్టి లేని విషయము ఒకటి శీఘ్రమే

బయటపడును. సంసారి కొన్ని విషయములలో మాత్రమే సంతుష్టుడై యుండును. సంసారి సర్వదా సంతుష్టుడుగ (సతతం సంతుష్టః) నుండజాలడు. ఆ లక్షణము సన్న్యాసి (జ్ఞాని) యందు ఉండును. సర్వమును గురించి 'ఇక చాలును' అను ధారణ (అలం ప్రత్యయః) జ్ఞానికి ఉండునని శ్రీ శంకరులు వివరించిరి. జ్ఞానికి ఏ విషయములోనైననూ తనతో గాని, జగత్తుతోగాని, భగవానునితో గాని పేచీ లేదు. అతడు తనతో తాను సంతుష్టుడై యుండును. సాధారణంగా మనకు భగవంతునితో గల పేచీ విషయములైననూ ఇంకనూ ఒక కొలిక్కి వచ్చి యుండవు. ఇక ప్రపంచము గురించి చెప్పున దేమున్నది? మనకు వివిధ వ్యక్తులతో మరియు పరిస్థితులతో పరిష్కరించు కొనవలసిన కలహములు మరియు విభేద హేతువులగు అంశములు ఎన్నియో గలవు. ఇంతే గాక, మనకు మన మనస్సుతో, ఇంద్రియములతో, మరియు దేహముతో పరిష్కరించు కొనదగిన సమస్యలు ఎన్నియో గలవు. ఇట్టి స్థితిలో, నిరంతరమగు అలంప్రత్యయమును కలిగియుండుట అసంభవము.

మానవుడు 'చాలును' అని చెప్పగలిగే వస్తువులు రెండు మాత్రమే గలవు. ఒకటి ఆహారము. నీకు ఒకానొక భక్ష్యము ఎంత ప్రీతికరమైనది అయిననూ, కొంత భుజించిన తరువాత, 'ఇక చాలును (అలమ్)' అని చెప్పెదవు. ఇందువలననే, సర్వోత్కృష్టములగు దానములు రెండు గలవనియు, వాటిలో ఒకటి అన్నదానమనియు పెద్దలు చెప్పెదరు. నీవు ఒక వ్యక్తికి భోజనమును పెట్టినచో, అతడు కొద్దిసేపట్లో 'ఇక చాలును' అనును. కాని ధనము ఇత్యాదులలో 'చాలును' అను మాటకు తావు లేదు. బ్రహ్మ జ్ఞానము విషయములో కూడా అలం ప్రత్యయము కల్గును. లౌకిక విద్య (అపరా విద్యా) లలో అలం అనుమాట ఎన్నటికీ లేదు. ఏలయన, అధికముగా చదివే కొలదియూ, నా అజ్ఞానము మరింత విస్తృతమైనదని నాకు స్పష్టమగుచుండును. 'నేను పూర్ణుడను' అను జ్ఞానము నాకు కలిగినప్పుడు మాత్రమే 'అలమ్' అను భావన ఉదయించగల్గును. ఏలయన, పూర్ణత్వము కంటె అతిశయము గల తత్త్వము మరియొకటి లేదు. ఈ రెండు దానములలో వేదాంత విజ్ఞానము గొప్పది. ఏలయన, మృష్టాన్న భోజనము తాత్కాలికమగు అలం ప్రత్యయమును మాత్రమే కలిగించగా, వేదాంత విజ్ఞానము శాశ్వతమగు అలం ప్రత్యయమును కలిగించును. పైవాద విషయములన్నిటినీ పరిష్కరించుకున్న వ్యక్తి సతతం సంతుష్టః అనబడును. సన్న్యాసియగు జ్ఞానికి దేహధారణకు ఆహారము ఇత్యాది కనీసావసరములు ఉన్నచో చాలును. అవి ఉన్ననో అతడు సంతుష్టుడగును. అవి లేకున్ననూ, అతడు సంతుష్టుడుగనే ఉండును. పుష్టికరమైన, రుచి కరమైన ఆహారము లభించినప్పుడు, మరియు దానికి విరుద్ధమగు ఆహారము లభించినప్పుడు కూడ అతడు సంతుష్టుడై యుండును. ఈ లక్షణమును అభ్యాసముచే కూడ

సంపాదించవచ్చును. మానసికమగు చిక్కుముడులనన్నిటినీ పరిష్కరించుకున్న వ్యక్తిలో ఈ లక్షణము అతి సహజముగా ప్రవృత్తమగును.

సతతమ్ అను పదము యోగీ అను పదముతో కూడ అన్వయించి, దాని అర్థములో ఒక విశేషతను ఆపాదించును. యుజ్ అను ధాతువునకు రెండు అర్థములు గలవు. దాని నుండి వ్యుత్పన్నమైన యోగీ అను పదమునకు కూడ రెండు అర్థములు వచ్చును. ధాతువునకు నిరోధము (నియంత్రించుట, వశము చేసుకొనుట) అను అర్థమును చెప్పినచో, యోగమనగా చిత్తవృత్తి నిరోధము (ఆలోచనలపై నియంత్రణ) అను అర్థము వచ్చును. అది కలవాడు యోగి. యుజ్ ధాతువునకు రెండవ అర్థము కలుపుట. ఈ అర్థములో ఈ పదమిచట ప్రయోగింపబడినది. కావున ఈశ్వరునితో అభేద జ్ఞానము గలవాడు యోగియగును. జ్ఞాని యొక్క మనస్సు సర్వదా ప్రసన్నముగ నుండును (చిత్త సమాధానమ్). కాని ఇది సంకల్ప శక్తి యొక్క బలముచే సంపాదించినది గాదు. కావున ఈ అర్థములోనైననూ జ్ఞానిని యోగీ అని వర్ణించ వచ్చును. శాంతిని ఎరుంగని మనస్సులో వివేక కర్మయోగముల ప్రభావముచే శాంతి నెలకొనినది. అపుడా మనస్సు వేదాంత ప్రమాణముచే ఉద్భాసితమై, సత్య స్వరూపమును గుర్తించి కృతకృత్యమైనది. జ్ఞాని మనస్సునందు 'నేను' అను తాదాత్మ్యమును కలిగి యుండడు గాన, మనస్సు అతనికి సమస్యలను సృష్టించదు. 'మనస్సు నేను కాదు' అను సత్యము నాతడు స్పష్టముగా నెరుంగును గాన, మనోదశలు ఆధారంగా అతడు తనను తాను అంచనా వేసుకోడు. అతడు సర్వకాలములలో (సతతమ్) యోగి, ప్రతి వానికి కొద్దో గొప్పో చిత్త సమాధానము ఉండును గాన, ప్రతివాడు ఒకరకంగా అప్పుడప్పుడు యోగియే యగును. కాని ఇచట భగవానుడు జ్ఞానిని గురించి చెప్పుచున్నాడు కావున జ్ఞాని 'సతతం యోగీ' అని భగవానుడు చెప్పగల్గును.

సతతమ్ అను పదము సంతుష్టః యోగీ అను రెండు పదముల మధ్యలో నున్నది గనుక, ఆ రెండింటికీ విశేషణము కాగల్గును. ఈ పద్ధతికి కాకాక్షి న్యాయమని పేరు. కాకి ఒకే కనుగ్రుడ్డుతో కుడి ఎడమ రెండువైపులకు చూడగల్గును. ఇచట కూడా పరిస్థితి అట్టిదియే. రెండు నామవాచకముల మధ్య నుండే విశేషణము ఆ రెండింటికీ అన్వయించగలదు. ఈ పరిస్థితిని వర్ణించే న్యాయము మరియొకటి గలదు. దానికి దేహలీ దీపన్యాయమని పేరు. గడపపై పెట్టిన దీపము ఏకకాలములో లోపల, బయట కూడా తన ప్రకాశమును విరజిమ్మును. అదే విధముగా ఇచట కూడా సతతమ్ అను పదము ఏకకాలములో సంతుష్టః, యోగీ అను రెండు పదములకు విశేషణము అగును.

సతతం యోగికి మనః ప్రసన్నత (చిత్త సమాధానమ్) నిరంతరముగా నుండును. అతనికి మనస్సుతో చేయదగిన పనిలేదు గనుకనే ఇది సంభవమగును. అతడు మనస్సుపై నియంత్రణను పొంది (యతాత్మా), సతతం యోగి అయినాడని శ్రీ శంకరులు వివరించిరి. చంచలత్వము మనస్సు యొక్క స్వభావము. బాహ్యపరిస్థితులు మనస్సును తేలికగా విచలితము చేయును. ఆత్మయందు లీనమైన మనస్సు ఈ దోషస్వభావమునకు వశములో నుండదు. అట్టి మనస్సు గలవాడు సతతం యోగీ అనబడును.

దృఢనిశ్చయః అనగా చక్కగా నిర్ణీతమైన జ్ఞానము గలవాడు. ఆత్మ స్వరూపమును గురించి అతనికి స్పష్టమగు నిశ్చయము గలదు. ఆ నిశ్చయము దృఢమైనది. అనగా సందేహము లేనిది. దృఢత్వమనగా కర్కశత్వము కాదు. ఆత్మ స్వరూపమును గురించి అతనికి స్పష్టమగు అవగాహన కలదు అని అభిప్రాయము.

ఆత్మయే బ్రహ్మ అను స్పష్టమగు దర్శనము గల వ్యక్తి యొక్క హృదయ గ్రంథి భేదింపబడును (భిద్యతే). ఆత్మకు, దేహమునకు మధ్యలో ఒక ముడి గలదు. ఈ ముడిని అవిద్య వేసినది. అవిద్య వలన కామము పుట్టును. కర్మ కామముననుసరించును. పూర్వములో చేసిన కర్మలు, ఇప్పుడు చేయుచున్న కర్మలు కామముననుసరించి చేసినవియే. అవిద్యాకామ కర్మలనే ఈ మూడు పోచల త్రాడునకు హృదయ గ్రంథి యని పేరు. ఈ ముడి వ్యక్తిని బంధించును. దానిని విప్పినచో వ్యక్తి విముక్తుడగును. వివిధ కర్మలను చేయుట వలన ఆ ముడి మరింత బిగిసిపోవును. ఏలయన, మౌలిక సమస్యను గురించి అవగాహన లేక పోవుట చేత, ఆ అజ్ఞానము నుండి పరంపరయా కర్మ పుట్టును. దారపు చుట్ట చిక్కు పడినపుడు దారములను తప్పుగా లాగుచున్నచో, ఆ చిక్కు మరింత జటిలమగును. ఆ చిక్కును విప్పే చాక చక్యము నీకు ఉన్నచో, అది విడిపోవును. ఆధ్యాత్మిక విషయములో కూడా, సంసారాంతర్గతముగా సమస్యను పరిష్కరింప బూనుకున్నచో, సమస్య మరింత జటిల మగునని మనము ముమ్మందుగా తెలియవలెను. అజ్ఞానమే సమస్య. దీనిని గుర్తించుటకు వివేకము కావాలి. సంసారమనే దారపు చుట్ట చిక్కు పడి యున్నది. దీనిలో ధర్మార్థ కామ మోక్షములనే నాలుగు దారములు వ్రేలాడుచున్నవి. వీటిలో మొదటి మూడింటిని లాగుచున్నచో, చిక్కుముడి మరింత బిగియు చుండును. అర్థకామములను మాత్రమే వెంటాడినచో, మరిన్ని సమస్యలు ఉత్పన్నమగును. ధర్మము సమస్యలను కొంతవరకు పరిష్కరించగల్గును. కాని ధర్మము మౌలికమగు హృదయ గ్రంథిని విడదీయ జాలదు. అది జరగాలంటే అవిద్యను పారద్రోలవలెను. అవిద్యను పారద్రోలినచో, చిక్కుముడి విడిపోవును.

ఏలయన, అవిద్య తొలగిపోయన పిదప, ఆత్మ బ్రహ్మయగునా? ఆత్మ పరిచ్ఛిన్న మగునేమో? ఆత్మ కర్తయా? అకర్తయా? భోక్తయా? అభోక్తయా? ఇత్యాది సంశయములన్నియు నశించును. ఈ ప్రశ్నలనన్నిటినీ మనము వేర్వేరుగా పరిశీలించవలెను. ఏలయన, ఆత్మ అకర్తయే గాని, భోక్త యగునను వాదమొకటి గలదు. ఆత్మ అణుపరిమాణము గలది యను వాదము మరియొకటి గలదు. ఆత్మ బ్రహ్మయే యని అంగీకరించిననూ, అది సగుణమా? నిర్గుణమా? అనేక సంశయములకు అవకాశము గలదు. వాటిలో ఇవి కొన్ని మాత్రమే. ఆత్మ విషయములో దృఢనిశ్చయము గల వ్యక్తికి ఈ సంశయము లేవియూ ఉండవు.

మయ్యర్పితమనోబుద్ధిః. మనస్సు మరియు బుద్ధి నిర్వహించు కార్యములు భిన్నముగా నుండుటచే, ఇచట వేర్వేరుగా ప్రస్తావించబడినవి. సంకల్పము, దానికి విరుద్ధమగు వికల్పము అనువాటి మధ్యలో ఊగిసలాడుట మనస్సు యొక్క సహజలక్షణము. జ్ఞాని ఈ రెండింటినీ నాకు సమర్పించునని (మయి అర్పితే) భగవానుడు చెప్పుచున్నాడు. పరమేశ్వర జ్ఞానము ఉదయించగానే, సంశయములన్నియూ తొలగిపోవును. మనస్సును, బుద్ధిని, సర్వమును పరమాత్మ యందు ఉంచుట యనగా సంశయములు లేవని యర్థము. ఏలయన, జ్ఞాని పరమాత్మ విషయములో జాగృతి గలవాడై యుండును. అతని దృఢనిశ్చయమునకు హేతువు ఇదియే. అదే విధముగా, జ్ఞాని యతాత్ముడు గనుక, యోగి యగును. రెండు పదముల మధ్య గల ఈ కారణ కార్య సంబంధమునకు హేతు హేతుమద్భావమని పేరు. మయ్యర్పితమనో బుద్ధిః అనునది హేతువు. అతనికి గల దృఢనిశ్చయము దాని కార్యము. అనగా కార్యము పుట్టవలసిన అంతరంగములో కారణము ఉన్నది (హేతుమత్). ఇట్టి పారిభాషిక ప్రయోగములు మనకు శాస్త్రము నెరుంగటలో సహకరించును.

ఈ విధముగా నుండువాడు నా భక్తుడు (మద్భక్తః) అని భగవానుడు చెప్పుచున్నాడు. భగవానుడు 'నా' అని ప్రయోగించిన ప్రతి సందర్భములో సంశయ బీజము గలదు. 'నా సేవకుడు' అని నేను అన్నచో, నేను వేరు, సేవకుడు వేరు. అటులనే భగవానునకు భిన్నముగా మరియొకటి గలదని ఆ ప్రయోగమును బట్టి తోచును. నా భక్తుడు (మద్భక్తః) నాకు ప్రియమైన వాడు (స మే ప్రియః) అని భగవానుడు చెప్పుచున్నాడు. కావున ఆయనను స్తుతించు వారి యెడల ఆయన పక్షపాతముతో వ్యవహరించునా యనిపించును. లోకములో పొగడ్తలకు లొంగిపోవు వ్యక్తులు ఎందరో గలరు. భగవానుడు కూడ అట్టి వాడేనా? ఉదాహరణకు పంచదారపై వ్యక్తిత్వము నారోపించి, 'ఓ పంచదారా! నీవు చాల మధురముగా నున్నావు' అని పలికినచో, అది మిథ్యాప్రశంస

కాదు. ఏలయన, మాధుర్యము దాని స్వభావము. కాని అదే మాటను ఒక వ్యక్తితో అతడు సంతోషపడవచ్చును. ఏలయన, ఎన్నో సమస్యలతో సతమతమయ్యే వ్యక్తి ంటి ఉల్లాస కరమగు ప్రశంసవలన తాత్కాలికముగా వాటిని మరచి ప్రసన్నుడగును.

భగవానుని ఎంత పొగిడినా తక్కువే. భగవానుడు దయామయుడు అని మనము ము. కాని దయ గురించి మనకు తెలిసినది చాల తక్కువ. ఇట్టి మాటలకు విలువ ఎంత? లేశమాత్రపు దయ గలదు. దానితో మొదలిడి మనము మన ఊహాశక్తిలో పూర్ణ మయుని ఇమిడ్చే ప్రయత్నమును చేస్తాము. సర్వజ్ఞత్వము మరియు ఇతర పూర్ణ గుణముల ులలో మన ఊహలు ఇటులనే యుండును. మనకు వాటి గురించి ఏమియూ తెలియదు వాటి గురించి మాటలాడుట నిరర్థకము. ఐన్‌స్టీన్‌తో అతని డ్రైవరు 'అయ్యా! మీరు చాలా ్భుతమగు సైంటిస్టు' అన్నాడట. ఇట్టి పొగడ్తను సాటి సైంటిస్టు గాని, లేక అంత కంటె ్నవాడు గాని చేసినచో, అది సార్థకమగును. అట్లు గానిచో, అట్టి వచనములు ఎదుటివాని ుర్థ్యము కంటె తక్కువ స్థాయిలో మాత్రమే ఉండును. మనకు గల జ్ఞానము అల్పము. దానితో ు భగవానుని స్తుతించెదము. భగవానుడు ఎంతటి స్తుతికి అర్హుడో, ఆ దరిదాపులకు కూడ ు చేరలేము. భగవానుడు ఈ స్తోత్రములకు పొంగిపోయినచో, ఆయనలో ఏదో ఒక సమస్య యుండును. కాని భగవానుడు పొంగి పోడు. నీవు ఎంత పొగిడినా, అది తన స్వరూపము ంటె తక్కువయేనని భగవానుడు ఎరుంగును.

ఇట్టి స్థితిలో 'అతడు నాకు ప్రియుడు, అతడు నాకు భక్తుడు' అని భగవానుడు ఎట్లు చెప్పగల్గును? సమస్తద్వైత సంప్రదాయములకు ఇదియే మూలమై యున్నది. ఈ వచనములో రెండు వేర్వేరు తత్త్వములు ధ్వనించుచున్నవి. ఒకటి శ్రీ కృష్ణుడు. రెండవది ఆయన భక్తుడు. కాని భగవానుడు సంతుష్ట స్సతతం యోగీ అగు వ్యక్తి గురించి మాటలాడు చున్నాడు. జ్ఞాని మాత్రమే అట్టి వాడు కాగలడు. అట్లుగాక, ఆ వ్యక్తి మామూలు భక్తుడు (కర్మయోగి) అయినచో, అతడు ఆపేక్షికముగా మాత్రమే సంతుష్టుడై యుండును. కాని సతతం సంతుష్టః కాలేడు. అతడు ఒక స్థాయికి చెందిన యోగి కాగల్గునే గాని, సతతం యోగీ కాజాలడు. మామూలు భక్తుడు ఈ శ్వరునితో తనకు గల అభేదమును గూర్చి సందేహములతో సతమతమగు చుండును గాన, అతడు దృఢనిశ్చయః కాలేడు. కావున భగవానుడిచట మాటలాడేది జ్ఞాని గురించియే గాని, భక్తుని గురించి కాదు. జ్ఞాని భగవానునకు ప్రియుడు అనగా జ్ఞాని భగవానుని కంటె అభిన్నుడు అని యర్థము. ఒక వ్యక్తి నీకు ప్రియతముడను కొనుము. ఈ ప్రేమను నీవెచట దర్శించెదవు? ఈ ప్రేమ ఆ వ్యక్తి యొక్క ఒకానొక విశిష్ట గుణరూపముగా నుండునని కోరాదు. అది నీ మనస్సులో

గలదు. ఆ వ్యక్తి యొక్క సన్నిధిలో, లేదా ఆ వ్యక్తి స్మరణకు వచ్చినంత మాత్రాన, నీవు ఆ వ్యక్తిని పూర్ణముగా అంగీకరిస్తావు. నీవు అతనిచే అంగీకరింపబడెదవు. ఈ విధముగా ఇద్దరు వ్యక్తులు ప్రేమలో లీనమై, పరస్పర ప్రేమకు అస్పదులగుదురు. దీనిలో ఐక్యము గలదు. భావావేగాత్మకమగు ఈ ఐక్యమును ప్రియః అను పదము నిర్దేశించును. ఈ వ్యక్తి నాకు ప్రియుడు అనగా ఈ వ్యక్తి నాకంటె అభిన్నుడు అని యర్థము. ఒక విశిష్టమగు మనస్సు, దేహేంద్రియ సంఘాతము మరియు వ్యక్తిత్వము గల వ్యక్తిగా జ్ఞాని ఇచట గుర్తింపబడినాడు. అయినమా, తనకు జ్ఞానికి స్వరూపములో భేదము లేదనియు, కాన నా భక్తుడు నాకు ప్రియుడనియు (మద్భక్తస్స మే ప్రియః) భగవానుడు చెప్పుచున్నాడు.

జ్ఞానికి నేను అత్యంత ప్రియతముడను (ప్రియః హి జ్ఞానినః అత్యర్థం అహమ్) అని భగవానుడు 7వ అధ్యాయములో చెప్పియున్నాడు. 'అతడు నాకు ప్రియుడు (స మే ప్రియః)' అని చెప్పి భగవానుడు దానిని ఇచట పూర్తి చేసినాడు. దీనిని ఇటునుండి అటు, అటునుండి ఇటు తెలుసుకొనవలెను. అపుడది మహావాక్యము అగును. అట్లు గానిచో, భగవానుడు నేను అయినా, నేను భగవానుడు కాకపోవచ్చును. ఉదాహరణకు మనస్సు నేనే అయినా నేను మనస్సు కాదు గదా! కాని ఇచట భగవానుడు నేను మాత్రమే గాక, నేను భగవానుడను కూడా. అందువలనే, అహం బ్రహ్మాస్మి, బ్రహ్మ అహం అస్మి అను రెండు వాక్యములను మనము చెప్పెదము. అనగా భేదము లేనే లేదని తాత్పర్యము.

జీవేశ్వర అభేదమును తెలిపే ప్రార్థన కూడా ఒకటి గలదు. మా అహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోత్. అనగా నేను బ్రహ్మను తిరస్కరించకుందును గాక! బ్రహ్మ (ఈశ్వర రూపములో) నన్ను నిరాకరించకుండును గాక! నన్ను నేను భిన్నముగా దర్శించు నంతవరకు ఈశ్వరుడు అనుగ్రహప్రదాత యగును. జీవేశ్వర అభేదమును తెలియుటకై నేను ఆ అనుగ్రహమును ప్రార్థించెదను. ఆ అనుగ్రహముచే భగవానుడిచట చెప్పిన 'స మే ప్రియః' అను వాక్యమును నేను సాక్షాత్కరించు కొనెదను.

ఇచట ప్రియః అనునది లాక్షణిక ప్రయోగము. నీకు ఈ సృష్టిలో నీకంటె అధిక ప్రియమగు వస్తువు లేదు. ఒక వ్యక్తి నీకు ప్రియతముడగుటకు, అతడు నీకు ఆనందమును కలిగించుటయే కారణము. నీవు వాస్తవముగా ప్రేమించేది ఆనందితుడవగు నిన్ను మాత్రమే. నీలో అట్టి ఆనందయుతమగు వ్యక్తిత్వమును ఉద్బుద్ధము చేయగల పదార్థము కొరకు నీవు సర్వదా వెతుకు చుందువు. కావున ఆత్మ మాత్రమే ప్రియమగును. కావున, భగవానుడు చెప్పిన 'స మే ప్రియః'

ఆ వాక్యమునకు 'ఆతడు ఆనంద స్వరూపుడనగు నేనే' అని యర్థము. కావున ఇచట మే ప్రియః అనగా 'మమ స్వరూపః' అని యర్థము.

జ్ఞాని గురించి ఇంకనూ వర్ణిస్తూ భగవానుడిట్లు పలుకుచున్నాడు :

అధ్యాయము 12, శ్లోకము 15 :

यस्मान्नोद्विजते लोको लोकान्नोद्विजते च यः ।
हर्षामर्षभयोद्वेगैर्मुक्तो यस्स च मे प्रियः ॥ १५ ॥

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః (15)

యస్మాత్ = ఎవని వలన, లోకః = లోకములో ప్రజలు, న ఉద్విజతే = ఉద్వేగమును పొందరో, చ = మరియు, యః = ఎవడు, లోకాత్ = లోకములోని ప్రజలవలన, న ఉద్విజతే = ఉద్వేగమును పొందడో, హర్షా మర్ష భయోద్వేగైః = ప్రహర్షము, అసహనము, భయము మరియు ఉద్వేగములనే, యః = ఎవడు, ముక్తః = విడువబడియుండునో, సః = అతడు, మే = నాకు, ప్రియః = ప్రియుడు.

ఎవని వలన ఇతరులు ఉద్వేగమును పొందరో, ఎవడు ఇతరుల వలన ఉద్వేగమును పొందడో, ఎవడు ప్రహర్షము అసహనము భయము మరియు ఉద్వేగము అను వాటి నుండి విముక్తుడై యుండునో, అట్టి వాడు నాకు ప్రియుడు (15).

యస్మాత్ న ఉద్విజతే లోకః, ఎవని కారణముగా ప్రజలు ఉద్వేగమును పొందరో. లోకః అనునది సమూహావాచక ఏకవచన పదము. జ్ఞాని ఏ ప్రాణికైననూ ఉద్వేగపడుటకు కారణ భూతుడు కాడు. మరియు, అతడు ప్రపంచము వలన ఉద్వేగమును పొందడు (లోకాన్నో ద్విజతే చ యః). జ్ఞాని యొక్క ఈ స్వతః ప్రవృత్త (spontaneous) భావాభివ్యక్తి (expression) ముముక్షువులకు ప్రముఖమగు సాధన యగును.

ప్రపంచమునకు భయపడక పోవుట గొప్ప ఉపలబ్ధియే కావచ్చును. కాని అది చాలదు. సాధారణ మానవుడు కూడ ప్రపంచమునకు భయపడునని తోచదు. కాని ప్రపంచమునకు అతని

వలన భయము లేదని (యస్మాన్నోద్విజతే లోకః) చెప్ప జాలము. కాబట్టి ఈ రెండు విశేషణములను చెప్పవలెను. ప్రపంచము వలన భయపడుట, మరియు ఆ కారణంగా ప్రపంచముపై ఆధారపడుట అనునవి ప్రధానముగా వ్యక్తి తనను గురించి తాను చేసుకొనే న్యూనతాభావనపై ఆధారపడి యుండును. వ్యక్తి తనను గురించి తాను చేసుకొనే నిష్కర్షలలో రెండు అంశములు గలవు. ఒకటి తనను గురించి తనకు గల అంచనా. ఇతరులు తనను గురించి ఏమి అనుకుంటున్నారో అనునది రెండవది. వ్యక్తి తనను గురించి తాను చేసుకొనే నిష్కర్షలో ఇది ప్రముఖ పాత్ర వహించును. మరియు ఇతరులు నీ గురించి అనుకునే దానికి, వారు అనుకునే దాని గురించి నీవు వేసే అంచనాకి మధ్యలో మరల భేదము ఉండును. దీనితో పరిస్థితి మరింత జటిలమగును. మనము ఇట్టి భావనా ప్రపంచములో ఎంత గాఢముగా కూరుకుపోయి జీవించు చున్నామో అర్థము చేసుకొనవచ్చును. ఈ భావనలలో గల భ్రాంతులను కొన్నిటిని మనము గమనించెదము. నా గురించి నాకు గల అంచనాను శాస్త్రము అసత్యమని త్రోసి పుచ్చుచున్నది. ఇతరులు నా గురించి ఏమనుకుంటున్నారు? అనేది నాకు ఖచ్చితముగా తెలియదు. వారు తమ సంస్కారములను ఆరోపించి బాహ్య ప్రపంచమును దర్శించెరు. వారి ఈ అధ్యారోపముల గురించి నాకు సరియగు అవగాహన లేదు. మరియు నాకు గల భయములు, ఆదుర్దాలు నా వాస్తవిక దృష్టిని కప్పివేయు చున్నవి. నా గురించి నాకు గల అంచనా చెప్పుకో దగ్గది కాదు. ఇతరులు నా గురించి అనుకునే దాని గురించి నేను చేసే భావన ఎట్లుండునో ఊహించుట కష్టమేమీ కాదు. నా గురించి నాకు గల అంచనాలకు కట్టుబడి, ఇతరులు నా గురించి చేసే అంచనాలను నేను నిర్ణయిస్తాను. ఇతరులు నా గురించి ఏమనుకుంటున్నారు అనేది నాకు చాల ప్రముఖమైన విషయమై కూర్చున్నది. ఇతరులు నా గురించి అనుకునేది సరిగాదని వారిని ఒప్పించుటకై మనము ఎంతో సమయమును, శక్తిని ఖర్చు పెట్టెదము. దీనికంతకూ కారణమేమనగా, నా భద్రత మరియు ఆనందము ఇతరులకు నాపై గల అభిప్రాయములు అను ప్రపంచముపై ఆధారపడి యుండుటయే. ఇతరులు ముఖమును చిట్లిస్తే నాకు దుఃఖము. వారు నవ్వితే నాకు ఆనందము. పరిస్థితి ఇట్లున్నది. కాని జ్ఞాని అట్లు కాదు. ప్రపంచము తనను విచలితుని చేయునేమో యను భయము అతనికి లేదు. దుస్సాహసి యగు వ్యక్తియైననూ పరిస్థితులను నిర్భయముగా ఎదుర్కొనుట సంభవమే. కాని కాలక్రమములో అతడు అశాంతికి గురియగును. భగవానుడిచట వర్ణించే నిర్భయత్వము జ్ఞానికి సంబంధించినదియే గాని, దుస్సాహసికి, లేక నిరంకుశ శాసకునకు సంబంధించినది గాదు.

నీవు అవకాశమును ఇచ్చినంత మేరకు మాత్రమే ఇతరులు నీకు అశాంతిని కలిగించెదరు. 'నేను కులాసాగా మున్నాను' అను కల్యాణభావన కొరకై నీవు ఇతరులపై ఆధారపడి యున్నంతవరకు

ఇతరులు నీకు క్షోభను కలిగించుమనే యుందురు. 'నేను మర్త్యుడను, కొన్ని సీమలకు లోబడి బ్రతికే అల్పుడను, నేను అపూర్ణుడను, నాలో అనేక లోపములు గలవు' అని భావించే వాని వ్యక్తిత్వము ఈ ధారణలన్నింటి సమాహారమై యుండును. అట్టి వ్యక్తి పరిస్థితులపై ఆధారపడకుండా నుండుట అసంభవము. అట్టివాడు భగవానుని కూడా సంతోషపెట్టుటకు యత్నించును. మనకు పరిచితులైన వ్యక్తులకు మనపై సదభిప్రాయము ఉండవచ్చును. కాని వారు చేయగలిగిన సాహాయ్యము అల్పమేనని మనకు తెలియుచుండును. కావున మనకు ఈశ్వరకృప ఆవశ్యకమగు చుండును. అశాంతికి మూలములో తన స్వరూపముపై కేంద్రితమై యున్న మౌలిక మగు అపూర్ణ భావన గలదు. నేను ఆత్మ జ్ఞానమును పొంది తద్ద్వారా ఈ అపూర్ణ భావన నుండి విముక్తిని పొందునంతవరకు ఈ పరిస్థితిలో మార్పును తీసుకొని వచ్చుట సంభవము కాదు.

అక్షర బ్రహ్మ ఆత్మ కంటె భిన్నము కాదు అనే జ్ఞానమును అన్వేషించి సాధించే వ్యక్తిని గురించి భగవానుడిచట చర్చించుచున్నాడు. దేహము, ఇంద్రియములు మరియు మనస్సు సదోషములు మరియు అపూర్ణములు అయిననూ, వీటి ధర్మము లేవియు ఆత్మకు అంటవు. ఈ సత్యము నెరింగిన జ్ఞాని అపూర్ణభావన నుండి విముక్తుడగును. అపూర్ణత అనాత్మధర్మము. అనాత్మ మిథ్య. కావున అనాత్మ ఏవిధంబునైననూ సత్య-ఆత్మను ప్రతిబద్ధము చేయజాలదు. అనాత్మ తన ఉనికిని ఆత్మనుండి పొందును. ఈ జ్ఞానము ఉదయించిన వ్యక్తిలో అశాంతికి తావు లేదు. లోకాత్ న ఉద్విజతే.

ఈ వాక్యమును సాధనారూపముగా కూడ పరిగణించ వచ్చును. అపుడు యః లోకాత్ న ఉద్విజతే అనగా ఇతరుల ధారణల గురించి చింతిల్లనివాడు అని అర్థమును చెప్పవచ్చును. నీవు నీ భావావేగములకు, చర్యలకు బాధ్యుడవగుదువే గాని, ఇతరుల భావనలకు, చర్యలకు కాదు. ఇతరుల చర్యలను అంతరంగములో సుస్థిరము చేసుకొనరాదని దీని అభిప్రాయము. కాని ఇది నిష్ఠురత, క్రూరత్వము, శ్రద్ధ వహించక పోవుట కారాదు. నీ ప్రవర్తన ఇతరులకు ఇబ్బంది కలిగించకుండగా నీవు జాగ్రత్త పడవలెను. వాస్తవంగా నీవు చేయగలిగినది ఇంత మాత్రమే. అయిననూ, అప్పుడప్పుడు ఇతరులు ఇబ్బంది పడుతూనే ఉంటారు. దానికి నీవు బాధ్యుడవు కావు. భగవానుని ప్రార్థించుట తక్క నీవు చేయగలిగినది లేదు. కావున నీవు నీ చర్యలకు, భావావేగములకు బాధ్యతను స్వీకరింపుము. ఇతరుల చర్యలు, ధారణలు నిన్ను అశాంతికి గురిచేయ నీయకుము. ఇది ఒక సాధన.

నీవు సమాజములోని ఇతరులకు ప్రతిస్పర్ధివైనచో, నీ వలన ప్రపంచమునకు భయము

తప్పదు. కాని జ్ఞాని వలన ప్రపంచమునకు భయము లేదు. ఇందువలననే జ్ఞాని సన్న్యాసియని చెప్పబడినాడు. అతడు స్వతంత్రుడై తనతో తాను ఆనందముగా నుండును గనుక, వస్తువులను ప్రోగుచేసి తన సామర్థ్యమును నిరూపించవలసిన పని అతనికి లేదు. సంపాదించే ప్రయత్నములన్నింటిలో స్పర్ధ తప్పని సరిగా అంతర్భాగమై యుండును. సమాజములో పోటీపడే వ్యక్తి వలన ఎవరో ఒకరికి అశాంతి తప్పనిసరి యగును. ఎవని వలన ప్రపంచమునకు భయమేమియూ లేదో, అట్టి వాడు అగుట కొరకై సన్న్యాసి అహింసావ్రతమును స్వీకరించునని మనము చూచియున్నాము. సన్న్యాసి స్వర్గాది వాసులగు దేవతలను కూడ పేరు పెట్టి పిలిచి 'భయపడకుడు, నేను మీ పదవి కొరకు లోభపడుట లేదు' అని ప్రకటించును. దేవతలతో మొదలిడి చెట్టు చేమల వరకు గల సర్వ ప్రాణులకు ఏ విధమైన హానిని ఏనాడూ కలిగించను అని సన్న్యాసి మున్ముందుగా శపథమును చేయును. ఆ తరువాతనే అతనికి సన్న్యాసమీయబడును. అక్షర బ్రహ్మజ్ఞానమును పొందగోరి, సన్న్యాసి సర్వప్రాణులకు ఇట్టి అభయము నిచ్చి, తన విద్యావ్యాసంగమును కొనసాగించును. ఆ జీవితము యొక్క స్వరూపమును మీరు ఊహించ గల్గుదురు. ఇతరులకు ఎవ్వరికీ హానిని కలిగించని వ్యక్తి సర్వదా సావధానుడై యుండును.

ఇతరులకు నీవు ఇబ్బందిని కలిగించక పోయినా, ఇతరులు నీకు ఇబ్బందిని కలిగించవచ్చును గదా! అప్రియమగు పరిస్థితులు వ్యక్తిని ఉత్తేజితుని చేసి క్రోధహేతువులగును. క్రోధమును వెళ్ల గ్రక్కనిచో, అది లోపల అణగారి యుండుటచే వ్యక్తిత్వ మంతయూ వికృతమగును. నీవు ఒక పరిస్థితిని ఊహించుము. ప్రపంచము వలన ఇబ్బందికి గురికాని వ్యక్తివి నీవేననుకో. ఏది ఎట్లు జరిగినా, ఎవరేమి పలికినా, లేక చేసినా, నీవు అశాంతికి గురికావు. కాని ఇతరులకు ఇబ్బంది లేని విధముగా నీ కర్తవ్యమును నీవు చేస్తూనే ఉంటావు. అప్పుడు నీ వ్యక్తిత్వమెట్లుండునో నీవే ఊహించుము. నీవు స్వతంత్రుడవనే సత్యమును దర్శించెదవు. స్వాతంత్ర్యమనేది నీ యందు కేంద్రితమై ఉండునే గాని బయట ఉండేది గాదు. సమస్తకర్తృత్వ భోక్తృత్వధారణలకు మూలమగు అహంకారము జ్ఞానోదయముతో బాటు విలీనమగును. అప్పుడు మాత్రమే ఇతరులకు అశాంతిని కలిగించకుండుట, మరియు ఇతరులచే అశాంతికి గురిచేయబడకుండుట అనునవి సంభవమగును. ఈ సత్యమును స్పష్టముగా నెరుంగనిదే, ఈ గుణమును పూర్ణముగా సంపాదించుట సంభవము కాదు. నీలోని క్షమా గుణమును పెంపొందించు కొనుటకై ఈ లక్షణమును ఒక విశిష్ట జీవన మూల్యముగా స్వీకరించి సాధన చేయవచ్చును. కాని అది అక్షర బ్రహ్మ సాక్షాత్కారము కలిగినప్పుడు మాత్రమే పూర్ణమగును.

హరిః ఓం తత్సత్ - శ్రీకృష్ణార్పణమస్తు

శ్రీ గణేశాయ నమః

భగవానుడు జ్ఞానిని ఇంకనూ ఇట్లు వర్ణించుచున్నాడు: హర్ష-అమర్ష-భయ-ఉద్వేగైః ముక్తః యః, అనగా హర్షము, సహించలేక పోవుట, భయము మరియు ఆదుర్దా అనువాటి నుండి విముక్తుడైన వాడు. నీవు దృఢముగా కోరుకొనిన వస్తువును సంపాదించిన వెంటనే కలిగే మానసికోల్లాస స్థితికి హర్షము అని పేరు. అది ఒక విజయానంతర ఉల్లాస స్థితి. రోమాంచము, ఆనంద బాష్పములు ఆ స్థితికి చిహ్నములని శ్రీ శంకరులు వివరించిరి. ఇట్టి అతిశయానంద భరితమగు మనస్స్థితిని పొందిన మానవునకు తద్విపరీతస్థితి దగ్గరలోననే యుండును.

అమర్షమనగా సహించలేకపోవుట (అసహిష్ణత). తరచుగా దీనికి మూలములో మాత్సర్యము ఉండును. ఒకడు చాల అభివృద్ధికి వచ్చి, ఆనందముగా నున్నాడు. ఆ సంగతిని గమనించిన నీకు హృదయములో బాధ కలిగినది. అనగా నీవు మాత్సర్యముతో బాధపడుచున్నావని యర్థము. ఇతర వ్యక్తిలోని గుణములను ప్రక్కన బెట్టి, దోషములను వెదికే లక్షణమునకు అసూయ అని పేరు. అమర్షము అసూయారూపములో కూడ అభివ్యక్తమగు చుండును. ఇతర వ్యక్తిలో గల మంచి గుణమును చూచి ఏల ఆనందించరాదు? అసూయాపరుడు ఇతరుని సద్గుణములను అవహేళనచేసి, అతనిలోని దోషములను అన్వేషించుటలో తత్పరుడగును. ప్రతి మానవునిలో దోషములు గలవు. మాత్సర్యము, అసూయలకు కలిపి అమర్షమని పేరు. మానవుడు కోరుకున్న విధముగా పరిస్థితులు అనుకూలించక పోవుటచే, తనపై మరియు ప్రపంచముపై అసహనము ఉదయించి, ప్రపంచము తనను వంచించినదనే బాధను పొందియున్నచో, అది అమర్షమనబడును.

కాని విజయములన్నియు ఆత్మ యొక్క మహిమలో అంతర్భాగములేనని జ్ఞాని గుర్తించును. జ్ఞాన ప్రభావముచే జ్ఞాని కూడా శ్రీకృష్ణునితో సమానముగా 'నేను మనువును; నేను ఇంద్రుడను; నాకంటె భిన్నముగా ఏదీ లేదు; కావున సర్వమానవుల విభూతి నా విభూతియే' అని చెప్పగల్గును. సర్వవిభూతులకు ఆశ్రయమగు ఈశ్వరుడు బ్రహ్మము కంటె వేరు గాదు. బ్రహ్మము ఆత్మ కంటె వేరు గాదు. కావున సర్వదేశములలోని సర్వవిభూతులు ఆత్మ విభూతులే. ఈశ్వరుని మహిమ అనంతము. ఈ జ్ఞానము గల వ్యక్తి సర్వత్రా ఈశ్వర విభూతులను దర్శించుచునే యుండును. మరియు ఆ విభూతులు ఆత్మ కంటె భిన్నముగా లేవు. కావున జ్ఞానియందు అమర్షము గాని, అసూయ గాని, అసహిష్ణత గాని లేనే లేవు.

జ్ఞాని భయము నుండి గూడ విముక్తుడై యుండును. కర్మయోగి యగు జీవుని స్థాయిలో

ఈశ్వర స్వరూపమగు ధర్మనియతి యందు విశ్వాసమును కలిగియుండును గావున, హితమగు జీవితమును గడుపును. నీ జీవితములో ఈశ్వరుని పాత్రను నీవు ఎంత .ముగా గుర్తించగల్గితే, నీవు అంత అధికముగా విశ్రాంతిని పొందగల్గుతావు. గతములో సర్వమును నీవు విస్మరించి, భవిష్యత్తులో జరుగబోవు సర్వమును గురించి చింతను ఇతరులు ఏమి అనుకుంటారో అనే ఆదుర్దాను ప్రక్కన బెట్టి, నీవు నీ కర్తవ్యకర్మను చుండుము. ఇది ఒక విలక్షణమైన మనః ప్రవృత్తి. ఇది ప్రార్థన ద్వారా మాత్రమే గును. నీవు ఈశ్వరుని ఎంత అధికంగా గుర్తిస్తే, నీలో భయము అంత తక్కువ యగు ను. ఇది ఆపేక్షికమగు (తాత్కాలిక) అభయోపాయము. ద్వితీయవస్తువు లేదు అను ు నుండి మాత్రమే ఆత్యంతిక (absolute) అభయము లభించును. ఏలయన, నాతో ానమగు యథార్థత (reality) గల ద్వితీయవస్తువు నుండి మాత్రమే భయము పుట్టును. పరబ్రహ్మనే అయినా, రెండవ పరబ్రహ్మ ఉన్నచో, పృథక్కరణము (isolation), జనము మరియు అపాయము అనునవి సంభవమే గనుక, భయము తప్పదు. 'నేను జితుడనగుదు నేమో!, మోసగింపబడుదు నేమో!' ఇత్యాది భయములు రెండవ వస్తువు ప్పుడు మాత్రమే కలుగును. భగవానుడు కూడ భిన్నముగ నున్నచో, 'నన్ను దండించు ' యను భయము వెంటాడు చుండును. భిన్నముగా దర్శించినచో, అభయస్థానము దగిన భగవానుడు కూడ భయహేతువు అగును. భగవానుని ఆత్మాభిన్నముగ దర్శించినచో, భయమునకు మూలము లేదు గనుక భయము ఉండదు. వాయువు వీచుటకు, సూర్యుడు దయించుటకు, అగ్ని ఇంద్రుడు మరియు మృత్యుదేవత తమ తమ విధులను నిర్వర్తించుటకు భయమే కారణమని (భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః, భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి) తైత్తిరీయోప నిషత్తులో చెప్పబడినది. ప్రకృతి శక్తులన్నియు ఒకానొక అధ్యాదేశము వలన మాత్రమే ఆయా రీతులలో ప్రవర్తిల్లు చున్నవి. తాత్పర్యమేమనగా, వ్యక్తులు భయము వలన కర్మలను చేయుదురు. దండ భయము, అపహాస్యము పాలగుదు మేమోయను భయము, తిరస్కార భయము, వినాశ భయము, అంతతో గల్వా ద్వితీయ వస్తువు వలన భయము ఇత్యాది భయములు మానవులను కార్యోన్ముఖులను చేయుచున్నవి. ఈ భాసించే నానాత్వమే సత్యమని ఎవడు దర్శించునో, వాడు ఒక మృత్యువు నుండి మరియొక మృత్యువు లోనికి పయనించుచుండునని మరియొక చోట చెప్పబడినది. కావున ఏ విధముగా చూచినమా, సత్యమును దర్శించు వ్యక్తికి ఒకే ఒక వస్తువు గలదు. ఆత్మ యొక్క దృష్టి కోణములో సర్వము ఆత్మ యందు ఉనికిని కలిగి యున్నది గాన, రెండవ వస్తువు లేదు.

ఆత్మను పూర్ణముగా దర్శించువాని దృష్టిలో పూర్ణములు అనేకము ఉండజాలవు. అనంతములో అంశములు ఉండలేవు గదా! కావున ఇట్టి అద్వైతదర్శికి భయము అనే ప్రసక్తి ఉదయించదు.

ఆత్మ అసంగము మరియు ఆనందము. కావున దుఃఖము, ఉద్వేగము అనునవి ఆత్మ జ్ఞాని యందు ఉండవు.

వీటన్నింటి నుండియు విముక్తుడైన వ్యక్తి (హర్షామర్ష భయోద్వేగైర్ముక్తః) నాకు ప్రియుడు (ప్రియః), అనగా నా కంటె అభిన్నుడు.

**అధ్యాయము 12, శ్లోకము 16 :**

अनपेक्षश्शुचिर्दक्ष उदासीनो गतव्यथः ।
सर्वारंभ परित्यागी यो मद्भक्तस्स मे प्रियः ॥ १६ ॥

అనపేక్షశ్శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః (16)

అనపేక్షః = ఇతరముపై ఆధారపడని వాడు, శుచిః = శౌచము గలవాడు, దక్షః = సామర్థ్యము గలవాడు, ఉదాసీనః = తటస్థముగా నుండువాడు, గతవ్యథః = తొలగి పోయిన భయము గలవాడు, సర్వారంభ పరిత్యాగీ = ఆరంభములనన్నిటినీ పరిత్యజించిన వాడు, యః = ఏ, మద్భక్తః = నా భక్తుడు గలడో, సః = వాడు, మే = నాకు, ప్రియః = ప్రియుడు.

ఇతరముపై ఆధారపడని వాడు, శౌచము సామర్థ్యము గలవాడు, తటస్థముగా నుండువాడు, తొలగిపోయిన భయము గలవాడు, ఆరంభములనన్నిటినీ పరిత్యజించిన వాడు అగు నా భక్తుడు నాకు ప్రియుడు (16).

అనపేక్షః, అనగా స్థూలదేహమునకు మరియు ఇంద్రియములకు ఇంద్రియ గోచరములగు విషయములతో ఏ సంబంధము గలదో, తన కళ్యాణ భావనకు (sense of well-being) ఆ సంబంధము పై ఆధారపడని వాడు అని శ్రీ శంకరులు వ్యాఖ్యానించిరి. తాను ఇతర అంశములు వేటిపైననూ ఆధారపడని స్వయంసిద్ధుడని అతడు ఎరుంగును. దేహము జీవించి యున్నంతవరకు

[illegible] తాను జీవించి యుందునని భ్రాంతి అతనిని పీడించదు. దేహమునకు జీవమునిచ్చే ప్రాణము ఆత్మపై ఆధారపడి యున్నది. మరియు ఆత్మ శ్వాసక్రియను చేయదు. శ్వాసక్రియను [illegible] అదియు [illegible]. కావున ఆత్మ రూపుడనగు నేను సర్వదా జీవించి [illegible]. కావున అది తన ఉనికి కొరకై ప్రాణమనోబుద్ధ్యాదులపై [illegible] పైగా, [illegible] అన్నియూ ఆత్మపై ఆధారపడి భాసించు చున్నవి. కాని [illegible] ఉనికిని స్థాపించు కొనుట కొరకు ఇతరముపై దేనిపైననూ [illegible] నుండి విముక్తమై పూర్ణము అగుటకు ఆత్మ ఇతరము [illegible] సర్వ ఆనందాను భవముల సారస్వరూపము ఆత్మయే. [illegible] వాడు ఏ విధముగనైననూ దేనిపైననూ ఆధారపడని స్వతంత్రుడు, [illegible]

[illegible] అధిష్ఠానము ఆత్మయే. సర్వము ఆత్మయందే స్థితిని కలిగియున్నది. [illegible] జ్ఞానికి ఈ సత్యము విదితమే. కావున 'నేను ఎక్కడ నివసించవలెను?' [illegible] జ్ఞాని చింతిల్లడు. 'ఆత్మ సర్వజగదధిష్ఠానము' అని విలుక [illegible] జ్ఞాని ఆత్మయందు ఆ సత్యమును దర్శించును. కావున అతడు [illegible] ఆధారపడ యుండడు.

[illegible] మరియు బాహ్యము నందు పరిశుద్ధి నిండినవాడు. స్థాని [illegible] నివసించే చోటు మాత్రమే గాక సర్వ జన సంబంధి [illegible] పరిశుద్ధిని పాటించుట బాహ్యశౌచమగును. అంతరశౌచమును [illegible] గలవు. వాటిలో ఒకటి ప్రతి పక్ష భావన. అనగా మన [illegible] ప్రతిద్వంద్వియగు భావమును సంకల్ప పూర్వకముగా [illegible] మనకు ఇతరులపై గల ద్వేషము, క్రోధము, మాత్సర్యము [illegible] ఇతరులకు లేశమైననూ హానిని తలపెట్టని జ్ఞాని యొక్క [illegible] చోటు లేదు.

[illegible] తముగా తెలియగలవాడు ఈ ప్రకరణములో దక్షః [illegible] పరిస్థితిని తొందరగా అంచనా వేసి వేయవలసిన పనిని [illegible] పరిస్థితిలో నీ కర్తవ్య మేమి? అను విషయము ఆ పరిస్థితిపై

నీకు గల అంచనాపై పూర్తిగా ఆధారపడును. నీ అంచనా వాస్తవికమైనచో, నీ యందు భయాందోళనలు ఉత్పన్నమై పరిస్థితిని మరింత దూషితము చేసే అవకాశము ఉండదు. పరిస్థితి ఎట్లున్ననూ, జ్ఞాని దానిని ప్రశాంత చిత్తముతో విచారణ చేయగల్గును. కావుననే జ్ఞాని దక్షుడైనాడు. ఇంత మాత్రమే గాదు. జ్ఞానియందు ఇట్టి ఆపేక్షిక దక్షత మాత్రమే గాక, ఆత్యంతిక (absolute) దక్షత కూడ గలదు. ఏలయన, కారణత్వ రూపములో కారణము, మరియు నామరూపాత్మకమగు సర్వకార్యములు మిథ్యయని ఆతడెరుంగును. అతని దృష్టిలో వాటికి వ్యావహారిక సత్త మాత్రమే గలదు. అనగా అవి ద్వితీయ సత్యతత్త్వరూపములో అతనిని నిలదీయలేవు. కాన వాటితో అతనికి సంఘట్టనము (impact) ఉండదు. అవి అన్నియూ ఆత్మరూపములేననియు ఆత్మకంటె భిన్నముగా ఏదీ లేదనియు, ఆతడు ఎరుంగను. అతని దృష్టిలో దృక్-దృశ్య విభాగము భాసించుచున్ననూ, బాధితమగును. విచారము దృక్-దృశ్య వివేకముతో ఆరంభమగును. కాని తరువాత ఆ విభాగము యొక్క సత్యత్వము బాధింపబడును. ఈ దృక్-దృశ్య విభాగములో 'నేను' తప్ప మరియొకటి లేదు. కాన అది ప్రాతిభాసికము మాత్రమే. కావున తనకు భగవానునకు స్వరూపములో భేదము లేదని యెరింగి, భగవంతునితో అభేదమును పొందియున్నవాడు దక్షుడనబడును. భగవానుని నామములలో దక్షః ఒకటి. సృష్టి స్థితి లయములను చేయు సమర్థుడు అని దాని యర్థము. లేదా, వేద స్మృతి పురాణ ఇతిహాసములలో విశేష జ్ఞానము కలవాడు దక్షుడనబడును. సుందరమగు ఈ శబ్దమునకు అనేకార్థములు గలవు.

మిత్రుని పక్షములో గాని, శత్రువు పక్షములో గాని చేరనివాడు ఉదాసీనః అనబడును. వాదములన్నియూ ఆపేక్షికములే. ఆర్థికవ్యవస్థ, రాజకీయ వ్యవస్థ, ఒక జీవనశైలి, లేక ఒక అనుశాసనము వంటి సర్వసందర్భములలో చెలరేగే వాదములన్నింటిలో, మనము వాటిని పరిశీలించే దృష్టికోణమును బట్టి మంచిచెడులు, లాభనష్టములు రెండు ఉండును. కావున ఇట్టి ప్రాసంగిక వివాదములలో ఒక పక్షమును సమర్థించుట వివేకము కాబోదు. జ్ఞాని రెండు పక్షములకు సరిపడునట్లు యుక్తి సంగతముగా ప్రతిపాదించగలడు. కాని ఆతడు ఏ పక్షములో నైననూ చేరకుండా, ఉదాసీనుడై యుండును. వేదాంత సాధనలో ఇది ప్రముఖమగు అంశము. ఏలయన, అతి వాదములలోనికి చొరబడని మనస్సుతో మాత్రమే మనము వేదాంతమును తెలియగల్గుదుము. తటస్థముగ, నిష్పక్షముగ నున్న మనస్సు మాత్రమే మనకు అభిరుచి సత్యము నందు గలదు. ఒక వాదములో నీవు ఒక పక్షమును సమర్థించినచో, అవలి పక్షము సత్యమును దర్శించగల్గును. కాని నీవు మధ్యస్థముగా నున్నచో, రెండు పక్షములను నీకు కానరాకుండగా కప్పివేయబడును.

చూడగల్గుదువు. కావున నిష్పక్షముగా నుండు వ్యక్తి మాత్రమే వాస్తవికతను దర్శించి ఆనందించగలడు. వస్తుసత్యతను ఎరుంగుటలో ఇది చాల ప్రముఖమైన అంశము. అన్ని పక్షములలో అన్ని కాలములయందు ఏదో కొంత సత్యము ఉండును. ఉదాసీనుడగు వ్యక్తి ఈ సత్యమునెరుంగును గాన, ప్రాసంగిక వివాదములలో చాల నిష్పక్షముగా వ్యవహరించును.

గతవ్యథః అనగా భయము లేనివాడు. గతశబ్ద ప్రయోగముచే, ఒకప్పుడాతనికి భయము ఉండెడిదని భగవానుడు సూచించుచున్నాడు. జ్ఞానోదయము కాగానే ఆ భయము దూరమైనది. భయము ద్వైతభావన నుండి పుట్టునని మనము చూచియున్నాము. కావున కర్మయోగి గతవ్యథుడని చెప్పజాలము. కర్మయోగి సాపేక్షికముగా మాత్రమే భయరహితుడై యుండును. కాని గత వ్యథుడగు వ్యక్తి మరణభయముతో సహా సర్వభయములనుండి విముక్తుడై యుండును. జ్ఞానోదయము కలవానికి మాత్రమే ఇది సంభవమగును.

సర్వారంభ పరిత్యాగి అనునది మరియొక ప్రముఖమగు పదము. యోజన చేసి మొదలు పెట్టే కార్యము ఆరంభమనబడును. కర్మలన్నియూ సంకల్పపూర్వకములే గనుక ఆరంభములే యగును. శ్రీ శంకరులు ఒక కాలాంశములో భాష్యరచనకు ఆరంభించిరి. శ్రీ కృష్ణులు కూడ అటులనే గీతోపదేశమును ఆరంభించెను. ఆరంభము లేని వాడు లేడు. ఆరంభమునకు హేతువు కామము. వైదిక స్మార్త లౌకిక కర్మలన్నియు ఇహపరలోకములలో ఫలములనుద్దేశించి చేయబడును. కర్మయోగి కూడ ఈ కర్మలను చేయును. అతడు వాటిని మోక్షము కొరకు చేసిననూ, అతడు ఇంకనూ సర్వారంభ పరిత్యాగి కాజాలడు. కాని అతడు కర్మలను ఈశ్వరార్పణ బుద్ధితో చేయును గనుక, సర్వకర్మఫలత్యాగి యగును. జ్ఞానోదయము కలిగి కర్తృత్వమును పరిత్యజించినవాడు మాత్రమే సర్వారంభపరిత్యాగి కాగల్గును. నీవు ఎంత కష్టపడిననూ కర్తృత్వమును విడనాడే ఉపాయము మరియొకటి లేదు. ఏలయన, ఆ ఉపాయమును అనుష్ఠించవలసినది కర్తయే. ఈ సర్వారంభపరిత్యాగి యెవరు?

అతడు నా భక్తుడు (స మద్భక్తః), మరియు నాకు ప్రియుడు (మే ప్రియః). ఏలయన, అతడు నాకు అత్యంత ప్రియతమమైన ఆత్మ స్వరూపుడేనని శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు. ఈ వాక్యములకు సంబంధార్థమును స్వీకరించినచో, ఇంకనూ జ్ఞానోదయము కాని సాధకుడు ఈశ్వరుని కృపను పొందును. ఇది జ్ఞానోదయమునకు దారిని సుగమము చేయును. జ్ఞానికి అత్యంత సహజ సిద్ధములగు ఈ లక్షణములన్నియూ సాధకునకు సాధనలగును.

భగవానుడింకనూ ఇట్లు చెప్పుచున్నాడు.

**అధ్యాయము 12, శ్లోకము 17 :**

यो न हृष्यति न द्वेष्टि न शोचति न कांक्षति ।
शुभाशुभपरित्यागी भक्तिमान् यस्स मे प्रियः ॥ १७ ॥

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః (17)

**యః** = ఎవడైతే, న **హృష్యతి** = ప్రహర్షమును పొందడో, న **ద్వేష్టి** = ద్వేషించడో, న **శోచతి** = దుఃఖించడో, న **కాంక్షతి** = కామనలను కలిగి యుండడో, **యః** = ఎవడైతే, **శుభాశుభ పరిత్యాగీ** = శుభా శుభ కర్మలను సంపూర్ణముగా విడిచి పెట్టునో, **భక్తిమాన్** = భక్తి గల, **సః** = అతడు, **మే** = నాకు, **ప్రియః** = ప్రియుడు.

ఎవడైతే ప్రహర్షమును పొందడో, ద్వేషించడో, దుఃఖించడో, కామనలను కలిగియుండడో, శుభాశుభకర్మలను సంపూర్ణముగా విడిచి పెట్టునో, అట్టి భక్తుడు నాకు ప్రియుడు (17).

యః న హృష్యతి. అనగా కోరిక తీరిన సమయములో హర్షాతి రేకమును పొందని వాడు. జ్ఞాని యొక్క ఇచ్ఛాస్వాతంత్ర్యము జ్ఞానోదయవేళ కబళించి వేయబడి, ప్రారబ్ధకర్మ మాత్రమే మిగిలి యుండును. ప్రారబ్ధము మూడు రకములు. వ్యక్తి యొక్క మనస్సులో ఇచ్ఛారూపముగా ఉదయించి, ఆ పిదప ఆరంభింపబడే కర్మకు ఇచ్ఛాప్రారబ్ధమని పేరు. జ్ఞాని యొక్క మనస్సులో గాక, ఇతర వ్యక్తి యొక్క మనస్సులో ఉదయించిన ఇచ్ఛచే కర్మ ప్రేరితమైనచో, అపుడది పరేచ్ఛా ప్రారబ్ధమనబడును. ఉదాహరణకు జ్ఞాని పాఠమును చెప్పుట, రచనలను చేయుట అను కర్మలు ప్రాయశః ఇతరుల ఇచ్ఛ ననుసరించి మాత్రమే చేయబడును. ఆ కర్మలను చేయు వ్యక్తికి వాటి ఫలముతో పనిలేదు. వాటిని కోరి చేయించిన వ్యక్తికి వాటి ఫలము దక్కును. మూడవరకము ప్రారబ్ధము జ్ఞానిచే గాని, ఇతరులచే గాని కోరబడేది కాదు. ఈ ప్రారబ్ధము అభిలషితము లేక అభీష్టము అగుట సంభవమే. కాని చాల అరుదు. ప్రాయశః ఇది అనిష్టము అయి ఉండును. ఉదాహరణకు రోగము ఇట్టి ప్రారబ్ధము. రోగమును కోరువారు లేరు. కాని రోగములు వచ్చుచునే

యుండును. అభీష్టము సంప్రాప్తమైనప్పుడు జ్ఞాని హర్షాతిరేకమును పొందడు (న హృష్యతి). అనిష్టము సంక్రమించినపుడాతడు ద్వేషమును పొందడు (న ద్వేష్టి). ఏది జరిగినా, అతడు దుఃఖమును గాని, పశ్చాత్తాపమును గాని పొందడు.

అతనికి ప్రియ తమమైన వస్తువు, లేక వ్యక్తి నశించినమా అతడు దుఃఖించడు (న శోచతి). వినాశము సృష్టిలోని అనివార్యమగు అంశమై యున్నది. ఈ సత్యము నాతడు గుర్తించి, తనకు ప్రియమగు వస్తువులు దూరమైన సందర్భములో దుఃఖమునకు గురికాడు. ఈ సృష్టి అనే సంపూర్ణ యోజనలో అది కూడా ఒక భాగము అనే సత్యము నాతడు దర్శించును. ఇట్టి వినాశములు ప్రతిదినము ఘటిల్లుచునే యుండును. ఎక్కడో ఒక చోట ఎవడో ఒకడు బంధునాశము వలన దుఃఖించుచుండును. కాని వ్యక్తిగతముగా నాకు ఒక పెద్ద నష్టము కలుగనంతవరకు, నేనీ సత్యమును గుర్తించక పోవుట సహజమే. ఇట్టి నష్టము కలిగిన తరువాతనైననూ దుఃఖమునెరుంగని జ్ఞాని గురించి మనమిచట చర్చించుచున్నాము. అతని యందు సానుభూతి ఉండునే గాని, దుఃఖము ఉండదు. 'నీవు దుఃఖించకుము' అని గీత బోధించుటలేదు. ఈ విషయమును తెలియుట చాల ముఖ్యము. నీ యందు దుఃఖము ఉన్నచో, నీవా సత్యమును అంగీకరించి, దానిని సమాధానపరుచు కొనవలెను. లేనిచో నీ యందు మానసిక సమస్యలు తలయెత్తును. కాని మనమిచట చర్చిస్తున్న జ్ఞానికి దుఃఖము లేదని గీత చెప్పుచున్నది. ఇది సత్యము.

న కాంక్షతి. అతని యందు 'చాలును' అనే భావము (అలం ప్రత్యయము) గలదు. ఇతరులు ఒక వస్తువును సమర్పించినపుడు జ్ఞానియందు కలిగే ప్రథమ స్పందన 'వద్దు' అనియే. అలం ప్రత్యయ స్వభావము అట్లుండును. కావున అతడు తన వద్ద లేనిదాని కొరకు అర్రులు చాచడని (న కాంక్షతి) భగవానుడు చెప్పుచున్నాడు.

శుభాశుభపరిత్యాగీ. అనగా శుభములను మరియు అశుభములను పూర్తిగా త్యాగము చేసినవాడు. అతడు శుభకర్మ (పుణ్యము) లను సంచితము చేయడు. అశుభకర్మ (పాపము)లను చేయడని చెప్పబనిలేదు. అతడు అధ్యాపనము ఇత్యాది అనేక పుణ్యకర్మలను చేయును. కాని పుణ్యమును పొందడు. అతడు అన్యేచ్ఛా ప్రారబ్ధముచే గాని, ఇచ్ఛా ప్రారబ్ధముచే గాని అధ్యాపనము చేసినమా, శుభాశుభ పరిత్యాగి యగుటచే, ఆ కర్మల నాతడు పుణ్యము కొరకు చేయడు. పాపము కొరకు కర్మలను ఎవ్వరైననూ చేయరు. కాని మానవులు తాము కోరే వస్తువులను సంపాదించే ప్రక్రియలో కొన్ని పాపకర్మలను చేయు చుందురు. కాని జ్ఞానికి పొందవలసినది ఏదీ లేదు గనుక, పాప కర్మను చేయవలసిన హేతువు లేదు. పుణ్యము సుఖమునిచ్చును గదా! కాని జ్ఞాని తనను

సుఖ స్వరూపునిగా దర్శించును. కావున అతనికి పుణ్యమును చేయదగిన హేతువు కూడ లేదు. పుణ్యపములన్నియు అతని జ్ఞానవములో విలీనమగును గావున, అతడు శుభాశుభ పరిత్యాగియనబడును. భక్తి గల ఆ జ్ఞాని (యః భక్తి మాన్) నాకు ప్రియమైన వాడు (స మే ప్రియః). అనగా అతడు నేనే (ఆత్మ).

**అధ్యాయము 12, శ్లోకము 18 :**

समश्शत्रौ च मित्रे च तथा मानावमानयोः ।
शीतोष्णसुखदुःखेषु समस्संगविवर्जितः ॥ १८ ॥

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః (18)

శత్రౌ = శత్రువు నందు, చ = మరియు, మిత్రే = మిత్రుని యందు, సమః = సమమైనవాడు, తథా = అదే విధముగా, మాన-అవమానయోః = సన్మానము, అవమానముల విషయములో, చ = మరియు, శీత-ఉష్ణ-సుఖ-దుఃఖేషు = చలి, వేడి, సుఖము, దుఃఖము అను వాటి విషయములో, సమః = సమమైనవాడు, సంగ-వివర్జితః = ఆసక్తి నుండి విముక్తుడైన వాడు.

శత్రుమిత్రుల విషయములో మానావ మానములలో, శీతోష్ణములలో
మరియు సుఖదుఃఖములలో సమమైనవాడు, ఆసక్తి లేనివాడు (18).

సమః శత్రౌ చ మిత్రే చ. శత్రువు మరియు మిత్రుని విషయములో సమానముగ నుండువాడు. నీ యందు ప్రేమతో నీ హితమును గోరు వ్యక్తి మిత్రుడనబడును. నీకు ఏదో విధంగా హానిని తలపెట్టువాడు శత్రువు అనబడును. ఇచట ఒక ప్రశ్న ఉదయించును. జ్ఞానికి శత్రువు ఉండుట ఎట్లు సంభవము? జ్ఞాని ముందుగా శత్రువును నిర్మించు కొని, ఆ తరువాత అతని విషయములో సమభావమును చూపునేల? జ్ఞాని శత్రుత్వమును కొని తెచ్చుకొనడు. అతడు తన దారిన తాను ఉన్ననూ, శత్రువులు తమంత తాము బయలుదేరెదరు. ఉదాహరణకు ఒక జ్ఞాని ఏ పనినీ చేయకుండగా చెట్టు క్రింద కూర్చుండి యున్నాడను కొనుడు. ఆ తీరున చెట్టు క్రింద తాను కూర్చుండి యుండలేక పోవుటచే అట్లు కూర్చుండి యున్న జ్ఞానిని చూచి ఓర్వలేనివాడు ఒకడు ఉండి తీరును. జ్ఞానికి పెద్ద ప్రాసాదము ఉన్ననూ, లేక చెట్టు క్రింద

యుండును. అభీష్టము సంప్రాప్తమైనప్పుడు జ్ఞాని హర్షాతిరేకమును పొందడు (న హృష్యతి). అనిష్టము సంక్రమించినపుడాతడు ద్వేషమును పొందడు (న ద్వేష్టి). ఏది జరిగినా, అతడు దుఃఖమును గాని, పశ్చాత్తాపమును గాని పొందడు.

అతనికి ప్రియ తమమైన వస్తువు, లేక వ్యక్తి నశించిననూ అతడు దుఃఖించడు (న శోచతి). వినాశము సృష్టిలోని అనివార్యమగు అంశమై యున్నది. ఈ సత్యము నాతడు గుర్తించి, తనకు ప్రియమగు వస్తువులు దూరమైన సందర్భములో దుఃఖమునకు గురికాడు. ఈ సృష్టి అనే సంపూర్ణ యోజనలో అది కూడా ఒక భాగము అనే సత్యము నాతడు దర్శించును. ఇట్టి వినాశములు ప్రతిదినము ఘటిల్లుచునే యుండును. ఎక్కడో ఒక చోట ఎవడో ఒకడు బంధునాశము వలన దుఃఖించుచుండును. కాని వ్యక్తిగతముగా నాకు ఒక పెద్ద నష్టము కలుగనంతవరకు, నేనీ సత్యమును గుర్తించక పోవుట సహజమే. ఇట్టి నష్టము కలిగిన తరువాతనైననూ దుఃఖమునెరుంగని జ్ఞాని గురించి మనమిచట చర్చించుచున్నాము. అతని యందు సానుభూతి ఉండునే గాని, దుఃఖము ఉండదు. 'నీవు దుఃఖించకుము' అని గీత బోధించుటలేదు. ఈ విషయమును తెలియుట చాల ముఖ్యము. నీ యందు దుఃఖము ఉన్నచో, నీవా సత్యమును అంగీకరించి, దానిని సమాధానపరుచు కొనవలెను. లేనిచో నీ యందు మానసిక సమస్యలు తలయెత్తును. కాని మనమిచట చర్చిస్తున్న జ్ఞానికి దుఃఖము లేదని గీత చెప్పుచున్నది. ఇది సత్యము.

న కాంక్షతి. అతని యందు 'చాలును' అనే భావము (అలం ప్రత్యయము) గలదు. ఇతరులు ఒక వస్తువును సమర్పించినపుడు జ్ఞానియందు కలిగే ప్రథమ స్పందన 'వద్దు' అనియే. అలం ప్రత్యయ స్వభావము అట్లుండును. కావున అతడు తన వద్ద లేనిదాని కొరకు అర్రులు చాచడని (న కాంక్షతి) భగవానుడు చెప్పుచున్నాడు.

శుభాశుభపరిత్యాగీ. అనగా శుభములను మరియు అశుభములను పూర్తిగా త్యాగము చేసినవాడు. అతడు శుభకర్మ (పుణ్యము) లను సంచితము చేయడు. అశుభకర్మ (పాపము)లను చేయడని చెప్పబనిలేదు. అతడు అధ్యాపనము ఇత్యాది అనేక పుణ్యకర్మలను చేయును. కాని పుణ్యమును పొందడు. అతడు అన్యేచ్ఛా ప్రారబ్ధముచే గాని, ఇచ్ఛా ప్రారబ్ధముచే గాని అధ్యాపనము చేసిననూ, శుభాశుభ పరిత్యాగి యగుటచే, ఆ కర్మల నాతడు పుణ్యము కొరకు చేయడు. పాపము కొరకు కర్మలను ఎవ్వరైననూ చేయరు. కాని మానవులు తాము కోరే వస్తువులను సంపాదించే ప్రక్రియలో కొన్ని పాపకర్మలను చేయు చుందురు. కాని జ్ఞానికి పొందవలసినది ఏదీ లేదు గనుక, పాప కర్మను చేయవలసిన హేతువు లేదు. పుణ్యము సుఖమునిచ్చును గదా! కాని జ్ఞాని తనను

సుఖ స్వరూపునిగా దర్శించును. కావున అతనికి పుణ్యమును చేయదగిన హేతువు కూడ లేదు. పుణ్యములన్నియు అతని జ్ఞానములో విలీనమగును గావున, అతడు శుభాశుభ పరిత్యాగియనబడును. భక్తి గల ఆ జ్ఞాని (యః భక్తి మాన్) నాకు ప్రియమైన వాడు (స మే ప్రియః). అనగా అతడు నేనే (ఆత్మ).

**అధ్యాయము 12, శ్లోకము 18 :**

समश्शत्रौ च मित्रे च तथा मानावमानयोः ।
शीतोष्णसुखदुःखेषु समस्संगविवर्जितः ॥ १८ ॥

సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః (18)

శత్రౌ = శత్రువు నందు, చ = మరియు, మిత్రే = మిత్రుని యందు, సమః = సమమైనవాడు, తథా = అదే విధముగా, మాన-అవమానయోః = సన్మానము, అవమానముల విషయములో, చ = మరియు, శీత-ఉష్ణ-సుఖ-దుఃఖేషు = చలి, వేడి, సుఖము, దుఃఖము అను వాటి విషయములో, సమః = సమమైనవాడు, సంగ-వివర్జితః = ఆసక్తి నుండి విముక్తుడైన వాడు.

శత్రుమిత్రుల విషయములో మానావ మానములలో, శీతోష్ణములలో
మరియు సుఖదుఃఖములలో సమమైనవాడు, ఆసక్తి లేనివాడు (18).

సమః శత్రౌ చ మిత్రే చ. శత్రువు మరియు మిత్రుని విషయములో సమానముగ నుండువాడు. నీ యందు ప్రేమతో నీ హితమును గోరు వ్యక్తి మిత్రుడనబడును. నీకు ఏదో విధంగా హానిని తలపెట్టువాడు శత్రువు అనబడును. ఇచట ఒక ప్రశ్న ఉదయించును. జ్ఞానికి శత్రువు ఉండుట ఎట్లు సంభవము? జ్ఞాని ముందుగా శత్రువును నిర్మించు కొని, ఆ తరువాత అతని విషయములో సమభావమును చూపనేల? జ్ఞాని శత్రుత్వమును కొని తెచ్చుకొనడు. అతడు తన దారిన తాను ఉన్నను, శత్రువులు తమంత తాము బయలుదేరెదరు. ఉదాహరణకు ఒక జ్ఞాని ఏ పనిని చేయకుండగా చెట్టు క్రింద కూర్చుండి యున్నాడను కొనుడు. ఆ తీరున చెట్టు క్రింద తాను కూర్చుండి యుండలేక పోవుటచే అట్లు కూర్చుండి యున్న జ్ఞానిని చూచి ఓర్వలేనివాడు ఒకడు ఉండి తీరును. జ్ఞానికి పెద్ద ప్రాసాదము ఉన్నను, లేక చెట్టు క్రింద

కూర్చున్ననూ, ఓర్వలేనివాడు ఒకడు ఉండి తీరును. శత్రుత్వమునకు కారణములనేకము. నీవు ఏమియూ చేయకపోయిననూ, నీ ముక్కు యొక్క ఆకారము శత్రువు నిర్మాణమగుటకు హేతువు కాగల్గును. అకారణవైరమనగా నిదియే. నీలో ఏదో ఒక లక్షణమును ఇతర వ్యక్తి చూచినాడనుకొనుడు. వెంటనే అతనికి పూర్వములో హానిని తలపెట్టిన వ్యక్తి స్మరణకు వచ్చినచో, అతని యందు నీపై వైరభావము ఉద్బుద్ధమగును. ఇట్టి శత్రువులతో ఎట్లు వ్యవహరించవలెను? జ్ఞాని సముడై యుండునని భగవానుడు చెప్పుచున్నాడు. శత్రువు సమీపించినా, లేక మిత్రుడు సమీపించినా, అతని అంతఃకరణ వృత్తిలో భేదము ఉండదు. శత్రువు అతనికి క్షోభను కలిగించడు. మిత్రుని వలన అతనిలో భద్రతా భావన పెరుగుట గాని, లేక హర్షము కలుగుట గాని ఉండదు. వారిద్దరి విషయములో అతడు సముడై యుండును.

అదే విధముగా సన్మానము జరిగినా, అవమానము జరిగినా అతడు సముడై యుండును. కొందరు అతనిని ఆరాధించెదరు. మరికొందరు అనాదరించెదరు. ఇంకొందరు అవమానించెదరు. అయిననూ జ్ఞాని సముడై యుండును.

శీతోష్ణ సుఖదుఃఖేషు సమః. అనగా చలిలో, వేడిలో, ఉల్లాసకర పరిస్థితిలో మరియు దుఃఖదాయకమగు స్థితిలో జ్ఞాని సమముగా నుండును. కాని సంసారి అట్లు ఉండలేడు. సంసారికి వాతావరణము కూడ నిరంతరముగ చీకాకును కల్గించు చుండును. వేసవిలో 'ఎంత వేడిగా నున్నదియో!' అని మనము చింతిల్లెదము. చలికాలములో చలిని గురించి మనము ఫిర్యాదును చేసెదము. వర్షము కురిసినప్పుడు, మరియు పొడిగా నున్నప్పుడు కూడ మనవద్ద ఫిర్యాదులకు లోటు లేదు. ఒకచో వాతావరణము దివ్యముగా నున్ననూ, పనులు ఉండుటచే విహారమునకు వెళ్లలేక పోయినందులకు మనము చింతిల్లెదము. కాని జ్ఞాని ఇట్టి ద్వంద్వములన్నిటి యందు సమముగ నుండును. అనగా జ్ఞానికి వాటి అనుభవము విలక్షణముగా నుండునని అనుకోరాదు. అతనికి కూడ వేడి వేడియే, చలి చలియే. కాని వాటి విషయములో అతని మనస్సు ఆందోళనకు గురికాకుండును.

సంగవివర్జితః. ఏ విధమైన ఆసక్తియు లేనివాడు. మనకు అనేక విధముల ఆసక్తులు ఉండే అవకాశము గలదు. భార్యాబిడ్డలను విడిచి పెట్టిన సన్న్యాసి కూడా వారి గురించి ఆదుర్దాపడుట సంభవమే. సంగవివర్జితుడగు వ్యక్తి యందు ఇతర వ్యక్తులపై, లేక వస్తువులపై మానసిక పరాధీనత (emotional dependence) ఉండదు. ఈ లక్షణము అతని దేహము వరకు కూడ కొనసాగును. శరీరమును పెంచే మల్లయోధులు మొదలగు వారికి ఇతర వస్తువుల విషయములో పరాధీనత

లేక పోయిననూ, వారి ధ్యానమంతయు దేహముపై కేంద్రితమై యుండును. దేహముపై ఇట్టి అతి పరాధీనత కంటే ఇతరులపై కొంత మానసిక పరాధీనత ఉండుటయే శ్రేయస్కరము. ఈ పరాధీనత దేహముతో మొదలిడి భార్య, బిడ్డలు, ఇల్లు, టివాచీ, వస్తుసామగ్రి ఇత్యాదులకు విస్తరింమను. కాని జ్ఞాని ఇట్టి సర్వవిధముల పరాధీనత నుండి విముక్తుడై యుండును.

తరువాతి శ్లోకములో ఆత్మ జ్ఞానము గల వ్యక్తి యొక్క వర్ణన ముగియు చున్నది.

**అధ్యాయము 12, శ్లోకము 19 :**

तुल्यनिन्दास्तुतिर्मौनी सन्तुष्टो येन केनचित् ।
अनिकेतः स्थिरमतिर्भक्तिमान्मे प्रियो नरः ॥ १९ ॥

తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతిర్భక్తి మాన్మే ప్రియో నరః (19)

**తుల్యనిందాస్తుతిః** = నిందకు, స్తుతికి సమముగా నుండువాడు, **మౌనీ** = వాక్కులో నియమము గలవాడు, **యేన కేనచిత్** = ఏది లభిస్తే దానితో, **సంతుష్టః** = సంతోషమును పొందువాడు, **అనికేతః** = స్వంతము అనదగ్గ స్థానము లేనివాడు, **స్థిరమతిః** = దృఢమగు జ్ఞానము గలవాడు, **భక్తిమాన్** = భక్తి గలవాడు అగు, **నరః** = మానవుడు, **మే** = నాకు, **ప్రియః** = ప్రియమైనవాడు.

> నిందాస్తుతులకు సమముగా నుండువాడు, వాఙ్నియమము గలవాడు, ఏది లభిస్తే దానితో సంతోషించువాడు, స్వంతము అనదగ్గ స్థానము లేని వాడు, దృఢమగు జ్ఞానము గలవాడు, మరియు భక్తుడు అగు మానవుడు నాకు ప్రియమైన వాడు (19).

జ్ఞాని మానావమానముల యందు సముడై యుండునని పూర్వ శ్లోకములో చెప్పబడినది. విమర్శల వర్షమును కురిపించి నిందావచనములతో అవమానించిననూ, లేదా స్తుతించిననూ జ్ఞాని సముడై యుండునని భగవానుడీ శ్లోకములో చెప్పుచున్నాడు. అజ్ఞానులు జ్ఞానిని గురించి చేసే స్తోత్రము గాని, నింద గాని నిరర్థకమే యగును. జ్ఞానికి పరమేశ్వరునకు భేదము లేదు. కావున ఎవరు ఎంత స్తుతించినా, తాను అంతకంటె అధికుడనని జ్ఞాని యెరుంగును. అతనిలో

న్యూనతాభావన ఉండదు గాన, అతడు స్తోత్రములను విని పొంగిపోడు. ప్రజలు అతనిని నిందించదలచినచో, నిందించవచ్చును. అతనిని నిందించుటకై వారికి పూర్ణస్వాతంత్ర్యము గలదు.

అతనికి నిందాస్తుతులు రెండు సమానమే. అనగా నిందయైనా, స్తుతియైనా అతని మనస్సులో చెప్పుకోదగ్గ వికారమును కలిగించదు. కొద్ది వికారము కలుగు గాక! ఏలయన, జ్ఞాని విషయములో దృష్ట సుఖము, దృష్ట దుఃఖము ఉండునని మనము అంగీకరించెదము. ఒక విశిష్ట పరిస్థితిలో జ్ఞాని మనస్సు నందు ఒక వృత్తి విశేషము ఉదయించవచ్చును. జ్ఞాని కూడా ఒకప్పుడు నవ్వుట, మరియొకప్పుడు గంభీరముగా నుండుట అనునవి సహజమే. కాని ఈ మనోదశలన్నింటి వెనుక పూర్ణత్వమనే సత్యము ఉన్నది. ఇందువలననే జ్ఞాని యొక్క మనస్సును సముద్రముతో పోల్చెదరు. సముద్రము ఒకప్పుడు ప్రశాంతముగ నుండును. మరియొకప్పుడు పెద్ద పెద్ద కెరటములతో ఎగిరిపడే పూర్ణత; మరియొకప్పుడు పిల్లకెరటములతో గూడిన పూర్ణత. కాని తనలో ప్రవేశించే నదీ జలములపై గాని, వర్షజలముపై గాని ఆధారపడని పూర్ణత్వము సముద్రమునకు సొత్తు. అనగా ఇతర జలాశయములపై జలముల కొరకు ఆధారపడకుండగా, సముద్రము తన సముద్రత్వము నందు ప్రతిష్ఠితమై యుండును. అదే విధముగా, జ్ఞాని దృష్ట సుఖ దుఃఖముల వశుడై యున్ననూ, వాటి వెనుక ఉన్నది అజ్ఞానము కాదు. జ్ఞాని మనోదశలయందు ఆత్మ తాదాత్మ్యమును పొందడు. అతడు ఒకచో తాదాత్మ్యమును పొందిననూ, అవివేక మూలక తాదాత్మ్యము కాదు. అది వివేకమూలక తాదాత్మ్యమే యగు చుండును.

మౌని. ఇది జ్ఞానికి గల గొప్ప లక్షణము. అనగా జ్ఞాని మాటలాడడని అర్థము కాదు. జ్ఞాని మాటలాడని పక్షములో ఉపదేశము ఉండెడిది కాదు. ఇచటి తాత్పర్యమేమనగా, జ్ఞాని యొక్క వాగింద్రియము సునియంత్రితమై యుండును. అతడు అచి తూచి మాటలాడును. తాను నమ్మిన సత్యమును మాత్రమే పలుకును. ఇది అధ్యాదేశము కాదు. ఇది కూడా జ్ఞానిలో అతి సహజముగా వ్యక్తమయ్యే లక్షణమే. జ్ఞానికి అతిగా వాగే పని లేదు. మనస్సులో అశాంతి నెలకొని యున్ననో, అది వాగుడు రూపములో వ్యక్తమగును. మనస్సులో అశాంతి యొక్క ఒత్తిడి అధికమైనప్పుడు, మాటలాడుట తప్పని సరియగును. అట్లు మాటలాడుట మంచిది కూడా కాని జ్ఞాని యొక్క మనస్సులో ఇట్టి ఒత్తిడి ఉండదు గాన, అతనికి మాటలాడుట అవశ్యకము కాదు. దీనిని సాధనా రూపములో కూడ అభ్యసించవచ్చును. కాని దీనిని ఆదర్శముగా పెట్టుకొనరాదు. వివేకవంతమైన, ప్రయోజన పూర్ణమైన పలుకులను పలుకవలెను. చాల ఎక్కువ గాని, చాల తక్కువ గాని మాటలాడరాదు.

సంతుష్టః యేన కేనచిత్. జ్ఞాని తనలో తాను ఆనందముగా నుండును గనుక, ఏది లభించిననూ ఆనందించగల్గును. దేహపరిరక్షణకు అవశ్యకమగు పనులనాతడు చేసుకొనును. కాని తన చాకచక్యముతో చుట్టూ ఉన్న ప్రపంచము నుండి ప్రయోజనమును పొందవలెననే యోజన అతని వద్ద లేదు. ఒక మనిషి జీవించుటకు కావలసిన కనీసావసరములను మాత్రమే అతడు సంపాదించు కొనును. ఏది లభించినా, ఎంత లభించినా, అతడు పూర్తిగా సంతోషించును. అతడు ఫిర్యాదులను చేయుట యెరుంగని వ్యక్తి.

ఇదే అర్థమును బోధించే మహాభారత శ్లోకము నొకదానిని శ్రీ శంకరులిచట గుర్తు చేసినారు.

యేన కేనఛిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః
యత్ర క్వచన శాయీ చ తం దేవా బ్రాహ్మణం విదుః (శాంతి పర్వ, 245-12).

'ఏదో ఒక జీర్ణవస్త్రమును ధరించి, లభించిన ఆహారముతో సంతృప్తిని చెంది, ఎక్కడ ఆశ్రయము దొరికితే అక్కడ నడుమును వాల్చి విశ్రమించువాడు బ్రాహ్మణుడని సర్వదేవతలు చెప్పెదరు'. దీని యర్థమేమనగా, అతనికి ఆనందము కొరకై బాహ్యసుఖసాధనములతో పనిలేదు. మానవులకు ఉల్లాసముగా నుండుటకై సాధారణముగా అనేక వస్తువులు అవసరమగును. కొందరికి సంగీతము, భోజనము, మిత్రులు, ఆఖరికి చర్చనీయాంశములు కూడా తమకు నచ్చినవై ఉండాలి. [illegible]నిచో, వారు కంగారు పడెదరు. తాము పాల్గొన శక్తిలేని చర్చ జరుగుచున్నచో, కొందరు దానిని సహించలేరు. కొంతమంది ఉల్లాసముగా నుండుట కొరకై ఆకాశములో మేఘములు ఉండరాదు. దీనికి భిన్నముగా, జ్ఞాని సర్వదా తనతో తాను సంతుష్టుడై యుండును గనుక, ఏది లభించిననూ సంతుష్టుడగును. నీతో నీవు సంతుష్టుడవై యున్నచో, నీకు సంతోషము కలుగుట కొరకై ప్రపంచము [illegible] మరియు, ప్రపంచము నీకు దుఃఖము నీయలేదు.

[illegible]వలసినది అల్పముగానుండ[illegible] లేదు. అయినను, ఆనందముగా నున్నాడు.
[illegible] పైకప్పు ఉండరాదని అర్థము కాదు. 'ఇది నా
అనికేతః, [illegible] అర్థము. మమత్వ బుద్ధి లేని వాడు అనికేతః
[illegible] అతని [illegible]
[illegible] చూపెట్టును. యథార్థమగు భక్తుడు
[illegible]తము [illegible]
[illegible]డును [illegible]

న్యూనతాభావన ఉండదు గాన, అతడు స్తోత్రములను విని పొంగిపోడు. ప్రజలు అతనిని నిందించదలచినచో, నిందించవచ్చును. అతనిని నిందించుటకై వారికి పూర్ణస్వాతంత్ర్యము గలదు.

అతనికి నిందాస్తుతులు రెండు సమానమే. అనగా నిందయైనా, స్తుతియైనా అతని మనస్సులో చెప్పుకోదగ్గ వికారమును కలిగించదు. కొద్ది వికారము కలుగు గాక! ఏలయన, జ్ఞాని విషయములో దృష్ట సుఖము, దృష్ట దుఃఖము ఉండునని మనము అంగీకరించెదము. ఒక విశిష్ట పరిస్థితిలో జ్ఞాని మనస్సు నందు ఒక వృత్తి విశేషము ఉదయించవచ్చును. జ్ఞాని కూడా ఒకప్పుడు నవ్వుట, మరియొకప్పుడు గంభీరముగా నుండుట అనునవి సహజమే. కాని ఈ మనోదశలన్నింటి వెనుక పూర్ణత్వమనే సత్యము ఉన్నది. ఇందువలననే జ్ఞాని యొక్క మనస్సును సముద్రముతో పోల్చెదరు. సముద్రము ఒకప్పుడు ప్రశాంతముగ నుండును. మరియొకప్పుడు పెద్ద పెద్ద కెరటములతో ఎగిరిపడే పూర్ణత; మరియొకప్పుడు పిల్లకెరటములతో గూడిన పూర్ణత. కాని తనలో ప్రవేశించే నదీ జలములపై గాని, వర్షజలముపై గాని ఆధారపడని పూర్ణత్వము సముద్రమునకు సొత్తు. అనగా ఇతర జలాశయములపై జలముల కొరకు ఆధారపడకుండగా, సముద్రము తన సముద్రత్వము నందు ప్రతిష్ఠితమై యుండును. అదే విధముగా, జ్ఞాని దృష్ట సుఖ దుఃఖముల వశుడై యున్ననూ, వాటి వెనుక ఉన్నది అజ్ఞానము కాదు. జ్ఞాని మనోదశలయందు ఆత్మ తాదాత్మ్యమును పొందడు. అతడు ఒకచో తాదాత్మ్యమును పొందిననూ, అవివేక మూలక తాదాత్మ్యము కాదు. అది వివేకమూలక తాదాత్మ్యమే యగు చుండును.

మౌని. ఇది జ్ఞానికి గల గొప్ప లక్షణము. అనగా జ్ఞాని మాటలాడడని అర్థము కాదు. జ్ఞాని మాటలాడని పక్షములో ఉపదేశము ఉండెడిది కాదు. ఇచటి తాత్పర్యమేమనగా, జ్ఞాని యొక్క వాగింద్రియము సునియంత్రితమై యుండును. అతడు ఆచి తూచి మాటలాడును. తాను నమ్మిన సత్యమును మాత్రమే పలుకును. ఇది అధ్యాదేశము కాదు. ఇది కూడా జ్ఞానిలో అతి సహజముగా వ్యక్తమయ్యే లక్షణమే. జ్ఞానికి అతిగా వాగే పని లేదు. మనస్సులో అశాంతి నెలకొని యున్నచో, అది వాగుడు రూపములో వ్యక్తమగును. మనస్సులో అశాంతి యొక్క ఒత్తిడి అధికమైనప్పుడు, మాటలాడుట తప్పని సరియగును. అట్లు మాటలాడుట మంచిది కూడా కాని జ్ఞాని యొక్క మనస్సులో ఇట్టి ఒత్తిడి ఉండదు గాన, అతనికి మాటలాడుట అవశ్యకము కాదు. దీనిని సాధనా రూపములో కూడ అభ్యసించవచ్చును. కాని దీనిని ఆదర్శముగా పెట్టుకొనరాదు. వివేకవంతమైన, ప్రయోజన పూర్ణమైన పలుకులను పలుకవలెను. చాల ఎక్కువ గాని, చాల తక్కువ గాని మాటలాడరాదు.

సంతుష్టః యేన కేనచిత్. జ్ఞాని తనలో తాను ఆనందముగా నుండును గనుక, ఏది లభించిననూ ఆనందించగల్గును. దేహపరిరక్షణకు ఆవశ్యకమగు పనులనాతడు చేసుకొనును. కాని తన చాకచక్యముతో చుట్టూ ఉన్న ప్రపంచము నుండి ప్రయోజనమును పొందవలెననే యోజన అతని వద్ద లేదు. ఒక మనిషి జీవించుటకు కావలసిన కనీసావసరములను మాత్రమే అతడు సంపాదించు కొనును. ఏది లభించినా, ఎంత లభించినా, అతడు పూర్తిగా సంతోషించును. అతడు ఫిర్యాదులను చేయుట యెరుంగని వ్యక్తి.

ఇదే అర్థమును బోధించే మహాభారత శ్లోకము నొకదానిని శ్రీ శంకరులిచట గుర్తు చేసినారు.

యేన కేనచిదాచ్ఛన్నో యేన కేనచిదాశితః
యత్ర క్వచన శాయీ చ తం దేవా బ్రాహ్మణం విదుః (శాంతి పర్వ, 245-12).

'ఏదో ఒక జీర్ణవస్త్రమును ధరించి, లభించిన ఆహారముతో సంతృప్తిని చెంది, ఎక్కడ ఆశ్రయము దొరికితే అక్కడ నడుమును వాల్చి విశ్రమించువాడు బ్రాహ్మణుడని సర్వదేవతలు చెప్పెదరు'. దీని యర్థమేమనగా, అతనికి ఆనందము కొరకై బాహ్యసుఖసాధనములతో పనిలేదు. మానవులకు ఉల్లాసముగా నుండుటకై సాధారణముగా అనేక వస్తువులు అవసరమగును. కొందరికి సంగీతము, భోజనము, మిత్రులు, ఆఖరికి చర్చనీయాంశములు కూడా తమకు నచ్చినవై ఉండాలి. లేనిచో, వారు కంగారు పడెదరు. తాము పాల్గొన శక్తిలేని చర్చ జరుగుచున్నచో, కొందరు దానిని సహించలేరు. కొంతమంది ఉల్లాసముగా నుండుట కొరకై ఆకాశములో మేఘములు ఉండరాదు. దీనికి భిన్నముగా, జ్ఞాని సర్వదా తనతో తాను సంతుష్టుడై యుండును గనుక, ఏది లభించిననూ సంతుష్టుడగును. నీతో నీవు సంతుష్టుడవై యున్నచో, నీకు సంతోషము కలుగుట కొరకై ప్రపంచము చేయవలసినది అల్పముగానుండును. మరియు, ప్రపంచము నీకు దుఃఖము నీయలేదు.

అనికేతః, అతనికి నివసించుటకు ఇల్లు లేదు. అయిననూ, ఆనందముగా నున్నాడు. అనగా అతని శిరమునకు పై భాగములో ఇంటి పైకప్పు ఉండరాదని అర్థము కాదు. 'ఇది నా స్వంతము' అని చెప్పదగ్గ ప్రదేశము అతనికి లేదని యర్థము. మమత్వ బుద్ధి లేని వాడు అనికేతః అనబడును.

ఈ పదములన్నియు అతని వ్యక్తిత్వమును మనకు చూపెట్టును. యథార్థమగు భక్తుడు

స్థిరమతియై యుండునని భగవానుడు ఆఖరున చెప్పుచున్నాడు. దృఢనిశ్చయః (పరిపూర్ణమైన పురుషార్థ నిశ్చయము గలవాడు) అని భగవానుడిది వరలో చెప్పియున్నాడు. దానినే పునరావృత్తి చేసి భగవానుడు ఉపసంహరించుచున్నాడు. స్థిరమతిః అనగా స్థిరమైన, అనగా పూర్ణమైన, అవగాహన గల వాడు. అతని జ్ఞానములో అస్పష్టత గాని, సంశయము గాని లేదు.

ఇచట ఒక ప్రశ్న ఉదయించును. ఒక వ్యక్తి ధనసంపాదనకు పూర్తిగా అంకితమైనాడనుకొనుడు. ధనము విషయములో అతడు స్థిరమతి యని చెప్పవచ్చునా? ఇది సరిగాదు. ఏలయన ధనము ఇత్యాది అనాత్మ విషయములలో మతి సర్వదా అస్థిరమై యుండును. ఏలయన ధ్యేయవస్తువు స్థిరమైనది అయినప్పుడు మాత్రమే దానిమీద వుండే బుద్ధి స్థిరమగును. వస్తువు నిత్యమై ఉండవలెను. దానిలో మార్పులు రాకూడదు. మరియు అది పూర్ణము కూడ అయి ఉన్నచో, అప్పుడు దానిపై మతి స్థిరమగును. మనస్సు యొక్క స్వరూపము ఆత్మయే. కావున ఆత్మ స్వరూప జ్ఞానము మనస్సులో ఉదయించిన వ్యక్తి మార్పులకు లోనుగాడు. వస్తువు స్థిరమైనచో, మనస్సు కూడ స్థిరమగును. జ్ఞాని పరమార్థ సత్యవస్తువు విషయములో జాగృతుడై యుండును. అదియే బ్రహ్మ. అదియే ఆత్మ. ఇంతవరకు చెప్పిన గుణములన్నియు జ్ఞాని యొక్క అభివ్యక్తి (expression) ని బోధించును. ఈ అభివ్యక్తి పూర్ణమైనప్పుడు, అతడు స్థిరమతి యగును. ఒకప్పుడు ఈ గుణములు ఆపేక్షికములు మాత్రమే కావచ్చును. ఉదాహరణకు నీతి బద్ధమగు సువ్యవస్థిత జీవనమును గడిపే కొందరిలో ఈ గుణములు కొంతవరకు కానవచ్చును. కాని అంత మాత్రముచే వారు జ్ఞానులు కానక్కరలేదు. కాబట్టి ఒక వ్యక్తి జ్ఞాని యగునా, కాదా అని ఖచ్చితముగా వేరు చేసి చూప గలిగే గుణములు లేవు. అంతలో గత్వా వ్యక్తి జ్ఞాని యగునా కాదా యను సంగతిని స్థిరమతిత్వము నిర్ణయించును. ఆత్మ బ్రహ్మాభిన్నము అను సత్యము యొక్క జ్ఞానము స్థిరముగా గల జ్ఞానిపై సంశయములు ఎన్నటికి దాడిని చేయలేవు.

భక్తిమాన్ స నరః, ఆ వ్యక్తి భక్తి గలవాడు. నరశబ్దమునకు సరళమగు రూఢ్యర్థము మనిషి. కాని దాని వ్యుత్పత్త్యర్థమేమనగా న రీయతే ఇతి నరః, అనగా నశించని వాడు. ఇది పరమాత్మను సూచించే పదము. జ్ఞాని ఆత్మ జ్ఞానము గలవాడు గనుకనే నరుడైనాడు.

జ్ఞానికి భక్తిమాన్ (భక్తి గలవాడు) అను మరియొక విశేషణము గలదు. ఇచట భక్తి యనగా జ్ఞాన స్వరూప భక్తి. అతడు నాకు ప్రియుడు (మే ప్రియః). అనగా అతడు నా ఆత్మ యని అర్థము. ఈ విషయమును మనము చూచి యున్నాము. అతడు ఈశ్వరుని కంటె భిన్నముగా లేడు. ఇచట భక్తిమాన్ అను పదము జ్ఞాని అను అర్థములో ప్రయోగించబడినది. వివర్తులో

ఈశ్వరుని ప్రార్థించువాడు, ఒక ఫలమును గోరి భక్తిని చేయువాడు, జ్ఞాన సాధన చేయు ముముక్షువు మరియు జ్ఞాని అని భక్తులు నాల్గు రకములు అను విషయమును మనము చూచి యున్నాము. అచటనే 'జ్ఞాని నేనే' అని భగవానుడు ఉద్ఘాటించి యున్నాడు. ఆ భక్తుడే ఇచట వర్ణింపబడుచున్నాడు. భక్తుడనగా మనము సామాన్యార్థములో ఈశ్వరారాధకుడు అని స్వీకరించినచో ఇబ్బందులు తప్పవు. భక్త శబ్దము భజ్ ధాతువు నుండి పుట్టినది. ఆ ధాతువునకు సాధనను చేయుట మరియు పొందుట అను రెండు అర్థములు గలవు. భగవానుడిపుడు ఉపసంహరించు చున్నాడు. ఈ అంతిమ శ్లోకము యొక్క అవతారికలో శ్రీ శంకరులిట్లు వివరించిరి. యథార్థవస్తువు యొక్క స్పష్టమైన జ్ఞానమును కలిగి, ధనము, సంతానము మరియు పరలోకము అనే త్రివిధ ఏషణ (desire) ల నుండి విముక్తిని పొంది, అక్షర పరబ్రహ్మోపాసనకు అంకితులైన సన్న్యాసుల యొక్క గుణముల జాబితాను చెప్పుట మొదలిడి భగవానుడిపుడు ఇచట దానిని ఉపసంహరించు చున్నాడు.

ఇంతవరకు బోధింపబడిన గుణములన్నియు ఈ అంతిమశ్లోకములో సారరూపముగా ప్రదర్శింపబడుచున్నవి.

**అధ్యాయము 12, శ్లోకము 20 :**

ये तु धर्म्यामृतमिदं यथोक्तं पर्युपासते ।
श्रद्दधाना मत्परमा भक्तास्तेतीव मे प्रियाः ॥ २० ॥

I.M.P.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేతీవ మే ప్రియాః (20)

యే తు = ఎవరైతే, శ్రద్దధానాః = శ్రద్ధాసంపన్నులై, మత్పరమాః = నేనే చరమ లక్ష్యముగా గలవారై, యథోక్తమ్ = చెప్పబడిన విధముగా, ఇదమ్ = ఈ, ధర్మ్యామృతమ్ = అమృతత్వమునకు దారితీయు ధర్మబద్ధ జీవనమును, పర్యుపాసతే = అను సరించెదరో, తే = అట్టి, భక్తాః = భక్తులు, మే = నాకు, అతీవ = మిక్కిలి, ప్రియాః = ప్రియమైన వారు.

ఎవరైతే శ్రద్ధాసంపన్నులై నేనే చరమలక్ష్యముగా గలవారై చెప్పబడిన తీరున అమృతత్వమునకు దారి తీయు ఈ ధర్మ బద్ధ జీవనమునను సరించెదరో, అట్టి భక్తులు నాకు మిక్కిలి ప్రియమైన వారగుదురు (20).

ధర్మ్యామృతమ్. ధర్మమునకు దూరము కానిది (ధర్మాత్ అనపేతమ్) ధర్మ్యమ్ అనబడును. ఇది అమృతత్వ సాధనము గనుక అమృతమనబడును. ఈ ధర్మ జీవనము, అనగా ఇంతవరకు వర్ణించబడిన (యథోక్త) జ్ఞానియొక్క లక్షణముల కనురూపముగా జీవితమును తీర్చిదిద్దుకొనుట, మరియు అక్షర బ్రహ్మోపాసన ముక్తిహేతువులగును. మైత్రి, కరుణ, ద్వేషము లేకుండుట ఇత్యాది జ్ఞాని యొక్క సహజాభివ్యక్త రూపమగు గుణములు ఈ జ్ఞానమును కోరువారికి అనుసరించదగిన జీవనమూల్యములగును. అక్షర బ్రహ్మను ఉపాసన చేయు ముముక్షువులు కూడా ఈ జీవన మూల్యములను సాపేక్షికముగా సాధన చేయుదురు.

వారికి తమ యందు, ఆచార్యుని యందు, శాస్త్రము నందు మరియు ఈశ్వరుని యందు శ్రద్ధ ఉండుటచే అక్షర బ్రహ్మో పాసనను చక్కగా ఉత్సాహముతో కొనసాగించ గల్గుదురు. ఈ నాల్గింటి అనుగ్రహము ఆవశ్యకమే. ప్రార్థనచే మనము ఈశ్వరకృపను సంపాదించవలెను. ఆ ఈశ్వర కృపయే శ్రద్ధారూపములో అభివ్యక్తమగును. శాస్త్రము నందు శ్రద్ధ ఉండుటచే శాస్త్ర కృప సిద్ధించి, తద్వారా శాస్త్ర బోధ చక్కగా అవగాహనకు వచ్చును. అది లేనిచో, శాస్త్రమును పరిపరి విధముల వ్యాఖ్యానించు అవకాశము గలదు. ఇందువలననే ఒకే శాస్త్రము నుండి విభిన్న సిద్ధాంతములు బయలు దేరినవి. మూడవది గురుకృప. నాల్గవది నీ (ఆత్మ) కృప. ఇవి అన్నీ కలిసి వచ్చినప్పుడు, పరిస్థితులు మరియు వాతావరణము సానుకూలమై, ఆత్మ విశ్వాసము పెంపొంది, తద్వారా ఈ జ్ఞానము ఉదయించును. శ్రద్ధా అనునది విశ్వతో ముఖమగు పదము. అది గలవారు శ్రద్ధధానులు అనబడుదురు.

శ్రీకృష్ణుడిచట ఈ ప్రసంగమును ఉపసంహరిస్తూ, మత్పరమాః (నాకు అంకితమైన వారు) అని ప్రయోగించి విషయమును సుస్పష్టము చేయుచున్నాడు. నీవు ఈశ్వరకృపను ఆరోగ్యము కొరకు, ఆర్థికాభివృద్ధి కొరకు, లేక ఇతర ప్రయోజనము కొరకు అర్థించు చున్నచో, నీవు ఆయా విషయములకు మాత్రమే అంకితమైన వాడవు అగుదువు. నీ అంకిత భావము ఈశ్వరుని యందు లేదు. ఇది తప్పేమీ కాదు. కాని మత్పరముడై యుండుట దీనికంటె పూర్తిగా భిన్నమైన సాధన. ఇచట భక్తుని లక్ష్యము ఈశ్వరసాక్షాత్కారము. అతడు ముముక్షువు. ఈశ్వరుని కంటె మోక్షము భిన్నముగా లేదు. ఈశ్వరుడే మోక్షస్వరూపుడు. కావున ఈశ్వరసాక్షాత్కారమును గోరు భక్తుడు తప్పని సరిగా ఈశ్వరపరముడై యుండవలెను.

ఇది విశ్వరూప-ఉపాసన కాదని శ్రీ శంకరులు స్పష్టము జేసిరి. ఇచట శ్రీకృష్ణ భగవానుడు ప్రయోగించిన అహం శబ్దమునకు అవినాశి-ఆత్మ(అక్షర-ఆత్మ) అని అర్థము. అదియే

చరమ లక్ష్యము (పరమా గతిః). తత్కాలీన లక్ష్యము కూడా అదియే. అది చరమ లక్ష్యము మాత్రమే అయినచో, దానిని వాయిదా వేయవచ్చును. కాని, చరమ లక్ష్యము, తత్కాలీన లక్ష్యము ఒక్కటియే అయినప్పుడు అది పూర్ణమగు అంకితభావము అగును. ఇది సంభవమే. ఏలయన, ఇది సాటిలేని గతి (నిరతిశయా గతిః). ఇట్టి భక్తుని సాధనకు మూలములో కేవల విశ్వాసము మాత్రమే గాక తాను కోరే లక్ష్యమును, మరియు తాను అన్వేషించే తత్త్వమును గురించి స్పష్టమగు అవగాహన గలదు.

వీరు భక్తులు అనబడుదురు. పరమార్థ వస్తు జ్ఞానము వీరి భక్తి యొక్క విశిష్ట లక్షణము. వారి ఈ జ్ఞానము బాధితము కాదు గనుక, యథార్థము. వీరిని గురించి వర్ణిస్తూ, వీరు నాకు ప్రియతములు (తే అతీవ మే ప్రియాః) అని భగవానుడు చెప్పుచున్నాడు. శ్రీకృష్ణుడు అతీవ అను శబ్దమును ప్రయోగించుటచే, గౌణభక్తులను గురించి గాక, జ్ఞానియగు భక్తుని గురించి మాటలాడుచున్నాడని స్పష్టమగు చున్నది. భగవానునకు కర్మయోగులు కూడా ప్రియులే. కాని జ్ఞానులు భగవానునకు పూర్ణముగా ప్రియులు. ఏలయన, జ్ఞాని భగవానుని కంటె వేరు గాదు. వారి భక్తి జ్ఞానరూపములో సఫలమైనది. సాఫల్యమును చెందిన భక్తి కూడా భక్తియే గనుక, జ్ఞానికి భక్తుడని పేరు వచ్చినది. అతని సాధన యొక్క ఆరంభములో ఉన్నది జ్ఞానమే. అంతములో కూడ ఉన్నది జ్ఞానమే.

సాధకుడు శ్రవణము చేసి ఈ జీవన మూల్యములను తనలో వృద్ధి పొందించు కొనుటకు ఆవశ్యకమగు ప్రయత్నములనన్నిటినీ చేయు చుండును. ఈ జీవన మూల్యములు వాటంతట అవి వృద్ధి చెందవు. సాధకుడు తన సంకల్పబలముతో వీటిని పెంపొందించుకొని, జ్ఞానోదయమునకు అనురూపమగు పరిస్థితిని నిర్మాణము చేసుకొనవలెను.

ఈ సాధకుడు పెద్ద ఎక్కువగా శ్రమిస్తున్నట్లు కానరాదు. ఈ సాధన యొక్క స్వరూపమట్టిది. ఇది గణితములోని చిక్కుప్రశ్నకు సమాధానమును కనుగొనుట వంటిది. ఒకసారి అది బుర్రలోనికి ప్రవేశించిన తరువాత, ఆ వ్యక్తికి విసుగు పుట్టి దానిని పరిష్కరించే ప్రయత్నమును తీవ్రముగా చేయక పోయిననూ, అంతరంగములో అతని మనస్సులో ఆ ప్రశ్నయే సర్వదా కదలాడు చుండును. అతడు అనేక ఇతర పనులలో వ్యాపృతుడై యున్ననూ, మనస్సు లోతులలో ఆ సమస్యను విశ్లేషించుచునే యుండును. ఒకనాడు హఠాత్తుగా అతని మదిలో సమాధానము మెరుపువలె తళుక్కుమనును. దీనిని జనులు అంతః ప్రజ్ఞ (intuition) అని వర్ణించెదరు. కాని ఆ సమస్యను గురించి లోతైన విచారమును చేయని వ్యక్తిలో ఇట్టి అంతః ప్రజ్ఞ ఎన్నటికీ ఉదయించదు.

సంబంధి ప్రశ్నకు గణిత శాస్త్రజ్ఞుడు మాత్రమే సమాధానమును కనుగొన గలడు. ప్రాథమిక మైననూ లేని వ్యక్తి కనుగొన లేడు గదా! అటులనే మౌలిక సమస్యను వివేచించిన వ్యక్తికి త్రమే దాని పరిష్కారము లభించును.

ఇవి యాదృచ్ఛికముగా జరిగేవి కావు. వీటికి వెనుక ప్రయత్నము ఉండవలెను. నీవు దీనిని తెలుసుకొనవలెను. ఈ జ్ఞానము అనుకోకుండా హఠాత్తుగా దొరికేది కాదు. సాధనము అత్యావశ్యకము. సరియగు జ్ఞానసాధనమును కనుగొనుటకు ఈశ్వర కృప లెను. ఆ కృప ప్రయత్నలభ్యము. ఒక వ్యక్తి దాని ప్రక్కనుండి మరలి పోవును. మరియొకడు గురించి విని కూడా లెక్కచేయకుండా దూరమగును. ఇట్టి స్థితిలో నీవు దానివైపునకు దృచ్ఛికముగా సాగిపోవుటకు కారణమేమున్నది? అది ప్రయత్నము వలన మాత్రమే లభించును. పుణ్యమును చేసిన వానికి మాత్రమే అద్వైత సంస్కారము కలుగును. కావున దారిలో దురయ్యే విఘ్నములను దాటి ముందుకు సాగాలంటే, నీవు కష్టపడాలి. అన్వేషణలన్నింటిలో ఇబ్బందులు తప్పవు. జ్ఞానాన్వేషణలో కూడా అంతే. విఘ్నములు ఎదురైనప్పుడు మానవులు ఉత్సాహమును గోల్పోయి సాధనను పరిత్యజించెదరు. తాము కోరుచున్నది ఏదియో వారికి స్పష్టముగా తెలియక పోవుటయే దీనికి కారణము. కొంత ప్రయత్నముతో, సంకల్పబలముతో ఇబ్బందులనెదుర్కొన వచ్చును. సంకల్ప శక్తి యొక్క చరమ అభివ్యక్తి ప్రార్థనయేనని నేను మీకు చెప్పి యున్నాను. చరమ లక్ష్యము అత్యంత ప్రియమైనది, మరియు ఆత్మ రూపమైనది. దానిని పొందగోరు సాధకుడు ప్రయత్నమును చేయవలెను.

ఓం తత్ సత్ భక్తి విషయవస్తువుగా గల 12వ అధ్యాయము ముగిసినది.

అక్షర బ్రహ్మను ఉపాసన చేయువాడు, మరియు సగుణ బ్రహ్మధ్యానసహితముగా కర్మయోగమునను ష్ఠించు వాడు అను ఇద్దరు భక్తులే. ఈ అధ్యాయములో భక్తి శబ్దము బహు విధ అర్థములలో వాడబడినది. కావున ఈ అధ్యాయమునకు విషయ వస్తువు భక్తి.

భక్తి యోగము అనే ప్రత్యేకమగు విద్య ఏదియూ లేదు. ఇతర అధ్యాయములన్నింటిలో వలె ఇచట కూడ యోగమనగా విషయ వస్తువు. సత్యవస్తు జ్ఞానము విశేషలక్షణముగా గల భక్తి మరియు పరమేశ్వరుని తత్పరతతో ధ్యానించుట విశేష లక్షణముగా గల భక్తి అనే ద్వివిధ భక్తులు ఈ అధ్యాయములో చెప్పబడినవి. అధ్యాయాంతములో 'వారు నాకు మిక్కిలి ప్రియులు (తే అతీవ మే ప్రియాః)' అని భగవానుడు చెప్పియున్నాడు.

# పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞుల స్వరూపము

'తత్త్వమసి (అది నీవే అయి ఉన్నావు)' అను మహావాక్యము ఉపనిషద్-వేదాంత-ఉపదేశసారము. ఇదియే పూర్ణ గీతాశాస్త్రమునకు విషయవస్తువు అని సంప్రదాయ విదులు భావించెదరు. 'నీవు' అనగా సంబోధింపబడే వ్యక్తి. అనగా జ్ఞానమును గోరు జీవుడు. 'అది' అనగా భగవానుడు. తత్ త్వం అసి అను ఈ వాక్యము జీవునకు ఈశ్వరునితో అభేదమును బోధించుచున్నది.

గీతా శాస్త్రములోని మొదటి ఆరు అధ్యాయములలో త్వం పదార్థము నిరూపించబడినది. మొదటి అధ్యాయములో అర్జునుని విషాదము వర్ణించబడినది. వ్యక్తి (జీవుడు) సదా దుఃఖియై ఉండును. కొన్ని సమయములలో ఈ దుఃఖము తీవ్రముగా నుండును. ఇతర సమయములయందు మామూలు స్థాయిలో సాగు చుండును. ఈ దీర్ఘకాలీన దుఃఖమును సహించుటలో నాట్యము, సంగీతము, సినిమాలు, ఘనకార్యములను సాధించుట, నైపుణ్య ప్రదర్శనము ఇత్యాది పలాయనోపాయములు సహకరించును. కాని అప్పుడప్పుడు ఆ దుఃఖము తీవ్రమగు చుండును. అర్జునునకు అటులనే అయినది. అతనికి దీని నుండి పారిపోవు ఉపాయమును స్వీకరించుటకు మనస్సు ఒప్పలేదు. అతడీ సమస్యను విశ్లేషించవలెనని తలంచినాడు. అపుడాతడు శ్రీకృష్ణునిలోని జగద్గురువును గుర్తించి, పరిష్కారమును గోరి, భగవానుని పాదముల వద్ద శరణు పొంది శిష్యుడైనాడు. మనమీ విషయమును రెండవ అధ్యాయములో చూచినాము. శ్రీ కృష్ణ భగవానుడు అంగీకరించి ఉపదేశించ మొదలిడెను. శ్రీకృష్ణుడు సలహానిచ్చి ఊరకుండలేదు. ఈ ఉపదేశము ఆరంభమైన తీరు ఇట్లున్నది. త్వం పదార్థము యొక్క వాస్తవికార్థము వినాశములేని (అవినాశి), నిత్యమగు, పుట్టుక లేని (అజ), వికారములు లేని (అవ్యయ) ప్రత్యగాత్మ. ఆత్మ ఇతరమునకు హానిని కలిగించదు. ఇతరముచే హానిని పొందదు (వేద అవినాశినం నిత్యం య ఏనం అజం అవ్యయమ్, కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్). అనగా ఆత్మ కర్త కాదు. కర్మ కాదు. ఆయుధములు ఆత్మను సంహరించలేవు; అగ్ని కాల్చలేదు (న ఏనం ఛిందంతి శస్త్రాణి న ఏనం దహతి పావకః). ఈ వివిధ వాక్యములలో ప్రత్యగాత్మ స్వరూపము ప్రదర్శింపబడినది. జ్ఞానోపదేశ మారంభమైనది. ఈ ప్రత్యగాత్మకు ఈశ్వరునితో అభేదము ప్రదర్శింపబడినది.

జీవేశ్వరులు ఒక్కటియే అయినా, వారి మధ్య విభేదము కన్పట్టును. ఈశ్వరుడు

వజ్ఞుడు, సర్వకారణుడు. దీనికి భిన్నంగా, జీవుడు అల్పజ్ఞుడు; వివిధ ప్రకృతి నియమములు దలగు వాటికి కట్టుబడి యుండువాడు. వీరిద్దరి మధ్య అభేదము ఎట్లు పొసగును? కావున 'త్వం' పదమునకు అర్థమును తెలియవలసి యున్నది. 'నీవు' అను పదమునకు వాస్తవికార్థము త్యగాత్మయని భగవానుడు నిరూపించినాడు.

ఈ జ్ఞానమును పొందుటలో సాధనమగు కర్మయోగమును శ్రీకృష్ణ భగవానుడు 2వ ధ్యాయములో ప్రతిపాదించినాడు. సన్న్యాస జీవనము, మరియు కర్మయోగము అను రెండు కొరకు ఉద్దేశింపబడినవియే గాన, వాటిలో తాను దేనిని అవలంబించవలెనని అర్జునుడు మూడవ అధ్యాయములో ఒక సందేహమును వెలిబుచ్చినాడు.

కర్మలను జ్ఞానము ద్వారా విడిచి పెట్టుట (జ్ఞానకర్మసన్న్యాసము) యే యథార్థమగు సన్న్యాసమగుననియు, ఏ క్రియలోనైననూ ప్రత్యగాత్మ హేతువు కాదనియు, ప్రత్యగాత్మ అకర్త యనియు 4వ అధ్యాయములో ప్రదర్శింపబడినది. కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను ఎవడు దర్శించునో, వాడే వివేకి; వాడే యుక్తుడు (నాతో కలిసి యున్నవాడు). అట్టి జ్ఞాని కర్తవ్య కర్మలనన్నిటినీ చేసినట్లే యగును (కర్మణి అకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః, స బుద్ధిమాన్ మనుష్యేషు స యుక్తః కృత్స్న కర్మకృత్).

ఐదవ అధ్యాయములో సన్న్యాస స్వరూప నిరూపణమింకనూ కొనసాగును. ప్రత్యగాత్మ కర్త కాదు (అకర్తా), భోక్త కాదు (అభోక్తా). ఆత్మజ్ఞాని చూచుచున్ననూ, వినుచున్ననూ, స్పృశించు చున్ననూ, అఘ్రాణించు చున్ననూ, భుజించు చున్ననూ, నడుచుచున్నను, నిద్రించుచున్నను, వదలిపెట్టుచున్నను, పట్టుకొనుచున్నను, కన్నులు మూసిననూ, ఇంకనూ అనేక కర్మలను చేయు చున్ననూ, ఆత్మ కర్మలను వేటినీ చేయుట లేదు (పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్, ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్ అపి, ఇంద్రియాణి ఇంద్రియార్థేషు వర్తంతే ఇతి ధారయన్, నైవ కించిత్ కరోమి ఇతి యుక్తో మన్యేత తత్త్వవిత్). ఆరవ అధ్యాయములో ప్రత్యగాత్మ ధ్యానము నిరూపించబడినది. మనస్సును ఆత్మయందు సమాహితము చేసి, ఇతరమును దేనినీ (ఆత్మ భిన్నముగా) భావించవలదు (ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్). ఇచట ఆత్మేశ్వరుల అభేదము చూపబడిననూ, ఇది ప్రధానముగా త్వం పదార్థమే. ఈ తీరున, తత్ త్వం అసి అను వాక్యములోని త్వం పదముపై మొదటి ఆరు అధ్యాయములు కేంద్రితమై / యున్నవి.

ఏడవ అధ్యాయము వరకు వచ్చుసరికి మొదటి శ్లోకములోనే విషయవస్తుప్రతిపాదనము నాటకీయముగా తత్పదార్థము మీదికి మళ్లినది. తత్పదవాచ్యమగు ఈశ్వరుడు సర్వజగత్కారణము. భగవానుడు 10వ అధ్యాయములో ఈశ్వర విభూతులను వర్ణించినాడు. 11వ అధ్యాయములో తన విశ్వరూపమును ప్రదర్శించి, 12వ అధ్యాయములో ఉపాసనను నిరూపించినాడు. ఈశ్వర నిరూపణ సందర్భములో జీవుడు భక్తుడగును. ఈ తీరున ద్వితీయ షట్కము (7-12 అధ్యాయములు)లో ప్రధానముగా ఈశ్వరుని నిరూపణము గలదు.

గీతలోని తృతీయ షట్కము (13-18 అధ్యాయములు) జీవేశ్వరుల అభేదమును గురించి, దానిని తెలుసు కొనే ఉపాయమును గురించి వివరించును. అందువలననే, ఈ అధ్యాయములలో కొన్ని విశిష్ట జీవన మూల్యములు మరియు మానసిక ప్రవృత్తులు చర్చించబడును.

శ్రీశంకరులు 13వ అధ్యాయమునకు విస్తారమగు ఉపక్రమమును వ్రాసిరి. దీనిని బట్టి గీతలో దీనికి గల ప్రాముఖ్యము సూచితమగు చున్నది. ఈ అధ్యాయము జీవేశ్వరుల అభేదమును ప్రదర్శించుటయే గాక, కొన్ని అస్పష్టమగు పదములను చర్చించి స్పష్టపరుచును. కొన్ని గీతా ప్రతులలో 13వ అధ్యాయము ఈ క్రింది శ్లోకముతో ఆరంభమగును. శ్రీశంకరుల చేతికి చిక్కిన ప్రతితో సహా కొన్ని ఇతరప్రతులలో ఈ శ్లోకము లేదు. ఈ శ్లోకము ఉన్నచో, శ్రీశంకరుల ఉపక్రమము చాల భిన్నముగా నుండెడిది. అర్జునుని ప్రశ్నను వర్ణించిన ఈ శ్లోకములో 13వ అధ్యాయములోని వివిధ అంశములు నిర్దేశింపబడినవి. ఇది బహుశః తరువాతి కాలములో అదనముగా చేర్చబడిన శ్లోకము కావచ్చును. ఏది ఏమైనా, 13వ అధ్యాయమును ఉపక్రమించుటలో ఈ శ్లోకము కనబరచే ప్రతిభ గొప్పది. ఏలయన, ఈ శ్లోకము అధ్యాయ స్వరూపమును పూర్ణముగా ప్రతిబింబించుచున్నది.

అర్జునుడిట్లు ప్రశ్నించు చున్నాడు :

प्रकृतिं पुरुषं चैव क्षेत्रं क्षेत्रज्ञमेव च ।
एतद् वेदितुमिच्छामि ज्ञानं ज्ञेयं च केशव ॥

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞమేవ చ
ఏతద్ వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ

**ప్రకృతిమ్** = ప్రకృతిని, **చ**= మరియు, **పురుషమ్** = పురుషుని, **ఏవ** = నిశ్చయముగా,

క్షేత్రమ్ = క్షేత్రమును, క్షేత్రజ్ఞమేవ చ = మరియు క్షేత్రజ్ఞుని, జ్ఞానమ్ = జ్ఞానమును, చ = మరియు, జ్ఞేయమ్ = జ్ఞేయమును, ఏతత్ = దీనిని, వేదితుమ్ = తెలుసుకొనుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, కేశవ = ఓ కేశవా!

> ఓ కేశవా ! ప్రకృతి పురుషులను, క్షేత్రక్షేత్రజ్ఞులను మరియు జ్ఞాన (జ్ఞానసాధన) జ్ఞేయ (తెలియదగినది) ములను నిశ్చితముగా తెలియ గోరు చున్నాను.

అర్జునుడు తెలియ గోరిన విషయము మూడు జంట పదములుగా కూర్చబడినది. ప్రకృతి, పురుషుడు (ప్రకృతిం పురుషం చ ఏవ) అను రెండు పదముల అర్థమేమి? ఈ పారిభాషిక పదములు సాంఖ్యవేదాంతములు రెండింటిలో కానవచ్చును. ఇదే తీరున, క్షేత్ర, క్షేత్రజ్ఞ అను పదముల అర్థమును అతడు తెలియగోరెను. క్షేత్రము నెరుంగువాడు క్షేత్రజ్ఞుడనబడును. అటులనే జ్ఞానజ్ఞేయముల అర్థమును కూడ అతడు తెలియగోరెను. పురుష, క్షేత్రజ్ఞ, జ్ఞేయశబ్దముల అర్థము ఒక్కటియే. అటులనే, ప్రకృతి, క్షేత్ర శబ్దముల అర్థము సమానము. కాని అర్జునుడు ఈ పదముల విషయములో తికమక పడి వాటి నిర్వచనములను తెలియగోరెను.

జ్ఞేయమనగా నేమి? జ్ఞేయమనగా జ్ఞానయోగ్యము; అనగా మానవుడు జీవితములో తప్పక తెలియదగినది. అది క్షేత్రజ్ఞుని కంటె, పురుషుని కంటె, బ్రహ్మకంటె వేరుగాదు. కావున జ్ఞేయమనగా బ్రహ్మ. ఆ బ్రహ్మను తెలియాలంటే, ఏ రకమైన మస్తిష్కము (జ్ఞాన) కావలెను? అని అర్జునుడు తెలియగోరుచున్నాడు. ఇచట జ్ఞానమనగా అమానిత్వాది జీవన మూల్యములతో విశిష్టమైన అంతః కరణము. దేని ద్వారా ఒక వస్తువును మనము తెలియగల్గుతామో అది కూడా జ్ఞానమనబడును. ఈ విషయమును భగవానుడు తరువాత మరింత స్పష్టము జేయును.

పదమూడవ అధ్యాయము అంతా కలిపి ఈ ప్రశ్నకు సమాధానము తక్క అన్యము లేదు. శ్రీ శంకరుల యెదుట ఈ శ్లోకము లేకుండుటచే వారు ఈ అధ్యాయ భాష్యమును ఈ క్రింది విధముగా నుపక్రమించిరి.

7వ అధ్యాయములో పరమేశ్వరుని ద్వివిధ ప్రకృతులు సంక్షిప్తముగా వర్ణించబడినవి. ఒకటి త్రిగుణాత్మక ప్రకృతి. అదియే ఎనిమిది అంశములుగా విడివడినది (అష్టధా భిన్నా). అది సంసార హేతువు గనుక, దానికి అపరాప్రకృతి యని పేరు. రెండవది పరాప్రకృతి. జీవుని సారభూత స్వరూపమదియే. (అనుభవ) క్షేత్రమును తెలియుట దాని లక్షణము. ఈశ్వరుని స్వరూపము

కూడా అదియే. అది వినాశము లేనిది (అక్షర), పరిచ్ఛేదము (limit) లేనిది (పరమ), మార్పులకు లోనుగానిది (అవ్యయ) అని ఇంతకు ముందు వర్ణించబడినది. ఈ రెండు ప్రకృతుల వలననే, ఈశ్వరుడు ఈ జగత్తునకు సృష్టి స్థితి లయ కర్త అను స్థాయిని పొందియున్నాడు. ప్రకృతి శబ్దమునకు రెండు అర్థములు గలవు. ఒకటి స్వభావము. రెండవది కారణము. ఆత్మ ప్రకృతియే. మాయ కూడ ప్రకృతియే. ఏలయన, ఈ రెండు జగత్కారణములే. ఆత్మ ఒక్కటి మాత్రమే జగత్కారణము కాదు. ఆత్మ లేకుండా మాయ జగత్కారణము కాదు. కావున రెండింటికి కలిపి ప్రకృతి అనియే పేరు. ఆ ప్రకృతియే రెండుగా విభాగము చేయబడినది. ఒకటి త్రిగుణాత్మిక యగు అపరాప్రకృతి. రెండవది సచ్చిదాత్మిక యగు పరాప్రకృతి. ఈశ్వరుడు సర్వజగత్కారణమగుట ఈ ద్వివిధ ప్రకృతి మూలముననే ఘటిల్లుచున్నది. అపరాప్రకృతికే మరియొక పేరు క్షేత్రము. క్షేత్రమును ఎరింగే పరాప్రకృతియే క్షేత్రజ్ఞుడు. సంప్రదాయ బద్ధమగు వేదాంత బోధనా ప్రక్రియలలో ఇది ఒకటి. దీనికే దృక్-దృశ్య లేక విషయి-విషయ ప్రక్రియ అని పేరు. ఈ ప్రక్రియలో ఈశ్వరుని స్వరూపము నిరూపించ బడును. శ్రీశంకరులు అనుసరించిన వ్రాత ప్రతిలో నూతన విషయవస్తువు హఠాత్తుగా ఆరంభమగుటచే, ఈ ఉపోద్ఘాతము నీయవలసిన ఆవశ్యకత ఏర్పడినది. తరువాతి కాలములో వచ్చిన ప్రతులలో కానవచ్చు ప్రశ్నరూపమగు అధ్యాయారంభ శ్లోకము వారి ప్రతిలో లేకుండెను.

12వ అధ్యాయములో అద్వేష్టా సర్వభూతానామ్ తో మొదలిడి అధ్యాయాంతము వరకు, సత్యసాక్షాత్కారము గల జ్ఞాని యొక్క అభివ్యక్తి (expression) వర్ణించబడినది. ఇట్టి సర్వసంగపరిత్యాగులగు జ్ఞానులు తనకు మిక్కిలి ప్రియులని (స మే ప్రియః) భగవానుడు చెప్పియున్నాడు. సాధకుడు ఏ జ్ఞానము యొక్క మహిమచే భగవానునకు అంతటి ప్రియుడైనాడు? ఈ జ్ఞానము జీవేశ్వర-అభేద జ్ఞానము తక్క మరియొకటి కాదని ఉద్ఘాటించ వలసి యున్నది. అందుకొరకై 13వ అధ్యాయము ఆరంభమగు చున్నది.

మరియు త్రిగుణాత్మిక ప్రకృతి పరిణామమును చెంది జీవుని కర్మఫలానుభవము కొరకై, లేదా మోక్షము కొరకై దేహేంద్రియ మనస్సంఘాత రూపముగా సమావిష్టమైనది. ఇదియే అపరాప్రకృతి. ఇది మార్పులను చెంది జీవుని భోగమోక్షముల కొరకై స్థూల సూక్ష్మ శరీరములను నిర్మించి ఇచ్చును. కావుననే శ్రీకృష్ణ భగవానుడు దృక్ - దృశ్య - వివేక ప్రక్రియను వినియోగించి ఈ క్షేత్రజ్ఞుని ఖచ్చితమగు స్వరూపమును నిరూపించే ఉపదేశమును ఆరంభిస్తూ 'ఇదం శరీరమ్' అని మొదలు పెట్టుచున్నాడు.

**ధ్యాయము 13, శ్లోకము 1 :**

श्री भगवानुवाच ।
इदं शरीरं कौंतेय क्षेत्रमित्यभिधीयते ।
एतद्यो वेत्ति तं प्राहुः क्षेत्रज्ञ इति तद्विदः ॥ १ ॥

శ్రీభగవానువాచ
ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః (1)

శ్రీ భగవాన్ = శ్రీ భగవానుడు, ఉవాచ = పలికెను, కౌంతేయ = కుంతీపుత్రా! ఇదమ్ = ఈ, శరీరమ్ = శరీరము, క్షేత్రమ్ = క్షేత్రము, ఇతి = అని, అభిధీయతే = ...బడుచున్నది, యః = ఎవడైతే, ఏతత్ = దీనిని, వేత్తి = తెలియునో, తద్విద: = దానిని ...వారు, తమ్ = వానిని, క్షేత్రజ్ఞః = క్షేత్రజ్ఞుడు, ఇతి = అని, ప్రాహుః = పిలిచెదరు.

శ్రీ భగవానుడు ఇట్లు పలికెను –
ఓ కుంతీ పుత్రా! ఈ శరీరమునకు క్షేత్రమని పేరు. ఈ శరీరమును తెలియుచుండువాడు క్షేత్రజ్ఞుడనబడునని ఆ జ్ఞానము గలవారు చెప్పెదరు (1).

శ్రీకృష్ణుడు తాను ఇచ్చిన ప్రత్యుత్తరములో ప్రశ్నను పునర్వ్యవస్థీకరించినాడు. అర్జునుని ప్రశ్నలో ముందుగా ప్రకృతి పురుషులు వచ్చిరి. కాని శ్రీకృష్ణుడు క్షేత్ర క్షేత్రజ్ఞులను నిర్వచించుటకు ...యించుకొనెను. ఏలయన, ప్రకృతి పురుషులనగా నివియే. సాంఖ్యులు ప్రకృతి పురుషశబ్దములపై తమకు అనుకూలమగు అర్థములను రుద్దియున్నారు. కాని ఈ ఇబ్బంది క్షేత్రక్షేత్రజ్ఞ శబ్దములలో లేదు. కావున వాటిలో భ్రాంతికి అవకాశము తక్కువ. వాటిని తేలికగా తెలుసు కొనవచ్చును. కావుననే శ్రీకృష్ణుడు ముందుగా క్షేత్రక్షేత్రజ్ఞులను, తరువాత జ్ఞేయ జ్ఞానములను నిరూపించ బూనినాడని మనము ఊహించవచ్చును. అంతములో ఆయన ప్రకృతి పురుషుల గురించి చెప్పగలడు.

శ్రీకృష్ణుడిచట అర్జునుని కుంతీపుత్రా! (కౌంతేయ) అని సంబోధించుచున్నాడు.

తల్లిదండ్రులకు సమప్రాధాన్య ముండుటచే సంస్కృతములో పిల్లలకు పేర్లను పెట్టుటలో తండ్రి వంశావళి మాత్రమే గాక, తల్లి వంశము కూడ పరిగణనకు వచ్చును.

ఇదం శరీరమ్ అనగా ఈ దేహము. దేశములో మరియు కాలములో దూరము కాని వస్తువును నిర్దేశించుటకు ఇదమ్ శబ్దమును వాడెదరు. నీ కళ్లముందు ఉన్న వస్తువును మాత్రమే 'ఇది' అను పదము నిర్దేశించును గదా! బహుశః శ్రీకృష్ణుడు తన దేహమును వ్రేలితో చూపి 'ఈ శరీరము (ఇదం శరీరమ్) క్షేత్రమనబడును' అని చెప్పియుండును. ఈ శరీరమును (ఏతత్) ఎవడు తెలుసుకొనునో (యః వేత్తి) వానిని క్షేత్రజ్ఞుడందురని శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. వారెవరు? క్షేత్రక్షేత్రజ్ఞ విభాగమును చక్కగా తెలిసిన వారు (తత్త్వవిదః). ఇచట తెలియ దగిన విషయము చాల గలదు. కాని ముందుగా మనము క్షేత్రశబ్దార్థమును పరిశీలించెదము.

క్షేత్రమనగా ప్రదేశము. తీర్థయాత్ర చేయదగిన ప్రదేశము అనియు, వ్యవసాయము చేసే ప్రదేశము అనియు ఈ పదమునకు విశేషార్థములు గలవు. ఫలమును పొంది అనుభవించే స్థానము అని సామాన్యార్థము. ధర్మక్షేత్రే కురుక్షేత్రే అని గీత ఆరంభమగును. ఈ దేహమునందు జీవుడు పుణ్యపాపముల ఫలమునను భవించును గాన, దీనికి క్షేత్రమని పేరు. ఈ దేహమే ధర్మ క్షేత్రము. జీవునకు ఇచ్ఛా స్వాతంత్ర్యము అనుగ్రహింపబడినది గాన, కర్మాధికారము గలదు. కావున ఈ దేహము కర్మక్షేత్రము కాదా. కాని ఇంకొక పదమును కూడ జోడించవలెను గదా! క్షేత్రమనగా ఈ మనుష్యశరీరము (ఇదం మనుష్య శరీరమ్). సర్వదృశ్య వస్తువులు అంతర్గతమగు విధంబున ఈ శబ్దమునకు భగవానుడు తరువాత వ్యాపకమగు అర్థమును చెప్పగలడు. అట్లైనచో, ఇచట క్షేత్రమనగా ఈ శరీరము (ఇదం శరీరం) అనే సీమితమగు నిర్వచనము ఈయబడుటకు కారణమేమి? ఇతర వస్తువులు క్షేత్రమని చెప్పినచో తెలియుట తేలిక. కాని దేహమే క్షేత్రము అను మాట అంత తొందరగా అవగాహనకు రాదు. మనకు దేహమునందు క్షేత్రజ్ఞ (సర్వవస్తువులను ఎరుంగువాడు) భ్రాంతి గలదు. అనగా నేను దేహమునందు అనాత్మ భావన గాక, ఆత్మ (నేను) భావనను కలిగియున్నాను. దేహభిన్నమగు వస్తువుల విషయములో ఆత్మ-అనాత్మ వివేకము నన్ను బాధించుట లేదు. కావున నేను క్షేత్రజ్ఞుని దేహము నుండి మాత్రమే వేరు చేయవలసియున్నది. గుమ్మడి కాయను చూచి 'నేను' అను భ్రాంతి నాకు లేదు. కావున అచట వివేకముతో పని లేదు. 'నీవు గుమ్మడి కాయవు కావు' అని నీకు గంభీరమగు ఉపదేశమును ఈయబనిలేదు. అవివేకము ఉన్న స్థలములో మాత్రమే వివేకము అవశ్యకమగును. దేహభిన్నమగు వస్తువునకు, తనకు మధ్య అవివేకము గల వారెవ్వరూ లేరు. బాహ్యవస్తువును గాంచి 'నేను' అని భ్రాంతి పడే

అవకాశము లేదు గనుక, వివేకముతో బనిలేదు. భగవానుడు అవివేక కేంద్రమగు దేహముతో ఆరంభించినాడు. స్థూలదేహమునందు 'నేను' అను ధారణ సర్వజన సాధారణము. ఉదాహరణకు మేజాబల్ల కూడా క్షేత్రమే అయినా, దాని యందు 'నేను' అను భ్రాంతి లేకుండుటచే, అది ఇచట ప్రస్తావింపబడలేదు.

స్థూలదేహమే క్షేత్రజ్ఞుడని భ్రాంతిపడుముందురు. కావున, క్షేత్రజ్ఞ పదమును కూడా నిర్వచించవలెను. క్షేత్రజ్ఞుడనగా నెవరు? క్షేత్రము నెరుంగువాడు క్షేత్రజ్ఞుడన్నచో, నా స్థూలదేహమును పరికించుచున్న ఎలుక కూడా క్షేత్రజ్ఞుడగును. కాని అది సరిగాదు. ఈ దేహములోపల ఉంటూ ఈ దేహమును చూచువాడు, అనగా దీనిలోపల ఉంటూ బాహ్యప్రపంచమును విషయరూపముగా దర్శించు విధంబుననే, ఈ దేహమును కూడా విషయరూపముగా దర్శించువాడు క్షేత్రజ్ఞుడగును. కావున ఈ శ్లోకములో స్థూలదేహమే క్షేత్రము. స్థూలదేహములోపల ఉంటూ, దానిని విషయ వస్తురూపములో దర్శించువాడు (దృక్) క్షేత్రజ్ఞుడు.

శరీరము అనగా విడిపోయే స్వభావము గలది (శీర్యమాణ స్వభావం శరీరమ్). దానికే దేహము అని పేరు. దహించుటకు యోగ్యమైనది (దహనయోగ్యమ్) కనుక దేహము. సూక్ష్మకారణదేహములు, శరీరాంతర్వర్తి పాకాదిక్రియలు మరియు అంతరంగ (psychological) భేదములు అను వాటితో కూడియున్న స్థూలదేహమునకు క్షేత్రమని పేరు. దానిని తెలియువాడు క్షేత్రజ్ఞుడు. శ్రీశంకరులు మరికొంత వివరణము ఇచ్చిరి.

భగవానుడు శరీరమునకు 'ఇదమ్' అను విశేషణమును వేసి, క్షేత్రమును నిర్వచించినాడు. క్షేత్రశబ్దమునకు జనసామాన్యములో గల అర్థమును మనము చూచినాము. శ్రీ శంకరులు దాని వ్యుత్పత్త్యర్థమును ఇచ్చినారు. దేహము జీవుని పతనము గాకుండా రక్షించును (క్షతత్రాణాత్) గనుక, క్షేత్రమైనది. ఈ శరీరముతో మానవుడు ధర్మము ననుష్ఠించి, తద్ద్వారా పుణ్యమును సంపాదించి నీచయోనులలో జన్మించకుండగా తనను తాను రక్షించుకొనును. ఈ దేహము మోక్షమును కూడ ఈయగలదు. ఇందువలననే ఈ దేహము పుణ్యక్షేత్రమైనది. జీవుడు నీచయోనులలో జన్మించకుండగా ఆత్మరక్షణకు ఈ దేహము ఉపకరించుట మాత్రమే గాదు. చైతన్యవంతమైన ఈ దేహములో మనస్సు ఇత్యాదులుండుటచే జీవుడు తనను తాను సంసారము నుండి రక్షించుకొనగల్గును. కావున సంసారమునుండి ఆపేక్షికముగా గాని, ఆత్యంతికముగా గాని రక్షించును గనుక, దీనికి క్షేత్రమను పేరు తగియున్నది.

గీత ఈ క్రింది శ్లోకముతో ఆరంభమగును.

ధర్మ క్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ

ఈ శ్లోకమును వ్యక్తిపరముగా కూడ వ్యాఖ్యానించవచ్చును. ధర్మ జన్యమైన పుణ్యముచే ఈ దేహము ఆరంభమైనది గనుక, ఇది ధర్మక్షేత్రమగును. మానవ జన్మ మిక్కిలి దుర్లభమైనది (నరజన్మ దుర్లభమ్). పుణ్యము పాలు ఎక్కువ, పాపము పాలు తక్కువ ఉన్నప్పుడు మాత్రమే మానవ జన్మ లభించును. కావున, దీనికి ధర్మక్షేత్రమను పేరు తగియున్నది. ఇంతే గాక, మానవ శరీరముతో మాత్రమే పుణ్యమును సంపాదించుట సంభవమగును. దేహము ధర్మక్షేత్రమనుటలో ఇది మరియొక కారణము. మరియు ఈ దేహముతో ధర్మార్థ కామమోక్షములనే పురుషార్థములను జీవుడు సాధించగల్గును గాన, దీనికి కురుక్షేత్రమని కూడ పేరు గలదు. ధర్మక్షేత్రము మరియు కురుక్షేత్రము అగు ఈ దేహము నందు రెండు సముదాయములు యుద్ధమును చేయగోరి సమావేశమైనవి (సమవేతా యుయుత్సవః). మనస్సే యుద్ధరంగము. అచట సమగూడిన రెండు సైన్యములలో ఒకటి పాండుపుత్రులకు చెందినది. పాండు అనగా తెల్లని అని యర్థము. ఈ శబ్దము వివేకమునకు ప్రతీక. వివేక జ్ఞానము వలన పుట్టే ఆలోచనా ధోరణి, జీవన మూల్యములు ఇత్యాదులు వివేకము యొక్క సంతానము వంటివి. రెండవసైన్యము మామకులది (నాకు సంబంధించిన వారిది). అహంకారము నుండి పుట్టిన రాగద్వేషముల పుట్టయే ఆ సైన్యము. అహంకారమునకు మూలము అజ్ఞానము. అజ్ఞాన సంతతి యగు ఈ రాగద్వేషముల మూకలు వివేక జ్ఞానముతో యుద్ధమునకు దిగినవి. తన ఈ శరీరములో ఈ రెండు శక్తుల మధ్య జరుగుచున్న యుద్ధము యొుక్క పరిణామమును గురించి ధృతరాష్ట్రుడు తెలియగోరెను. దాని తరువాత గీతాశాస్త్రమంతయూ ప్రవర్తిల్లెను.

ఇది కేవలము వ్యక్తి పరమగు వ్యాఖ్యానము మాత్రమే కాదని గ్రహించుట ఇచట చాల ముఖ్యము. ఇట్టి యుద్ధము బయట జరుగుటకు ముందుగా మనస్సులో యుద్ధము చెలరేగును. మనస్సులో యుద్ధము లేనిచో, బయట దానికి ఎన్నటికీ అభివ్యక్తి ఉండదు. బాహ్యము నందు కానవచ్చే సంఘర్షణలన్నియు మున్ముందుగా మనస్సులో ఉదయించును. హిట్లరు యుద్ధమును ప్రకటించుటకు ముందే అతని మనస్సులో యుద్ధము చెలరేగు చుండెను. బాహ్యములో యుద్ధము ఏమియూ జరుగలేదని మనము చెప్పుట లేదు. ముందుగా యుద్ధము మనస్సులో జరిగినదని మాత్రమే చెప్పుచున్నాము. బాహ్యములో కానవచ్చు సర్వము లోపల ఉన్నదాని అభివ్యక్తి తక్క

మరియొకటి గాదు. కావున బాహ్యములో జరిగే ఘటనలను వ్యక్తి పరముగా కూడ విశ్లేషించవచ్చును. ఈ విషయమును గ్రహించుట అవశ్యకము. ఏలయన, ఇట్టి వ్యక్తి పరకమగు మహాభారత వివేచనములో చరిత్రను తిరస్కరించే ప్రమాదము గలదు. చరిత్రని త్రోసిపుచ్చవలసిన అవశ్యకత లేదు.

ఈ దేహము క్షేత్రము. ఇది అఖరికి ఛిన్నాభిన్నము అగునదియే అయినా, మానవ దేహము అగుటచే, నాశమగుట మాత్రమే దీని ఫలము కాదు. ఇది క్షేత్రమై జీవునకు సేవ చేయవలసి యున్నది. జీవుని వినాశము నుండి రక్షించి (క్షయాత్ త్రాయతే), దుఃఖమునధిగమించుటలో సహకరించును గాన, దీనికి క్షేత్రమని పేరు వచ్చినది. నిరర్థక వినాశము నుండి ఇది జీవుని రక్షించును (క్షరణాత్ త్రాయతే). ఈ నాశము ఆపేక్షికము గాని, అత్యంతికము గాని కావచ్చును. మరియు జీవుడు దీని నుండి కర్మఫలములను పొంది అనుభవించును గాన, ఇది వ్యవసాయ క్షేత్రము వంటిది.

ఈ దేహము క్షేత్రము అని ఎరింగినవాడు క్షేత్రజ్ఞుడు. ఈ విషయమునెట్లు తెలియవలెను? శ్రీ శంకరులిట్లు వివరించిరి. జ్ఞానేంద్రియములలో ఒకటి యగు స్పర్శ దేహమంతయూ వ్యాపించి యున్నది. కావున పాదము మొదలు శిరస్సు వరకు (ఆపాదతలమస్తక) గల దేహమంతయు సచేతనముగా తెలియబడుచున్నది. ఈ దేహము చైతన్య – ఆత్మను మనకు చూపు చున్నది. క్షేత్రజ్ఞుని వాస్తవస్వరూపమదియే. క్షేత్రజ్ఞుని వలన మాత్రమే దేహము జ్ఞానవిషయమగు చున్నది. ఈ దేహమును జ్ఞానములో విషయము చేసి దర్శించువాడే క్షేత్రజ్ఞుడు. మరియు క్షేత్రజ్ఞుడు ఈ పనిని బోధించనవసరము లేకుండగా అతి సహజముగా (స్వాభావికేన) చేయుచుండును. లేదా, గురువు వద్ద శాస్త్రము నధ్యయనము చేసి తద్ద్వారా ఈ దేహమును విషయముగా చేసి దర్శించే సామర్థ్యము (ఔపదేశిక) ను కలిగియుండును. దేహము జ్ఞానేంద్రియ గోచరమగు విషయవస్తువు గనుక, బోధనలో పని లేకుండగనే క్షేత్రజ్ఞుడు దీనిని దర్శించవచ్చును. కాని దేహమునకు దేహద్రష్టకు మధ్య గల భేదమును నిర్దేశించుటకు ఆచార్యుడు అవశ్యకమగును. లేనిచో, దేహమే క్షేత్రజ్ఞ-ఆత్మయను భ్రాంతికి అవకాశము గలదు. శరీరము నుండి ఆత్మను వేరు చేసి దర్శించుటలో శాస్త్రము సహకరించుట మాత్రమే గాక, ఒకప్పుడు అత్యావశ్యకమగును. అందువలననే శ్రీ శంకరులిచట ఔపదేశిక పదమును ప్రయోగించిరి. ఉపదేశప్రభావముచే గాని, లేక స్వతంత్ర పరిశీలనచే గాని, ఈ దేహములోని ప్రతి అవయవమును జ్ఞానములో విషయముగా దృశ్యముగా చేసి దర్శించగలవాడు క్షేత్రజ్ఞుడనబడును.

ఇట్లు నామకరణమును చేయుచున్న వారెవరు? క్షేత్ర క్షేత్రజ్ఞుల గురించి ఎరుక గల తత్త్వ విదులు.

కాని సాధారణంగా ఇంత మాత్రమే తెలియుచుండును. ఇంద్రియములు, మనస్సుతో సహా ఈ దేహము క్షేత్రమనే ఎరుక గలవాడు క్షేత్రజ్ఞుడు. కాని తెలియదగినది ఇంత మాత్రమే కాదు. శాస్త్రము ఈ క్షేత్రజ్ఞుని గురించి ఒక సత్యమును ప్రదర్శించవలసి యున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 2 :**

क्षेत्रज्ञं चापि मां विद्धि सर्वक्षेत्रेषु भारत । మహాభారతం
क्षेत्रक्षेत्रज्ञयोर् ज्ञानं यत्तज्ज्ञानं मतं मम ॥ २ ॥ I.M.P

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తద్ జ్ఞానం మతం మమ (2)

**భారత** = ఓ అర్జునా! **చ** = మరియు, **సర్వక్షేత్రేషు** = క్షేత్రములన్నింటి యందు గల, **క్షేత్రజ్ఞం అపి** = క్షేత్రజ్ఞునిగా కూడా, **మామ్** = నన్ను, **విద్ధి** = తెలుసుకొనుము, **యత్** = ఏ, **క్షేత్రక్షేత్రజ్ఞయోః** = క్షేత్ర–క్షేత్రజ్ఞుల యొక్క, **జ్ఞానమ్** = జ్ఞానము గలదో, **తత్** = అది, **జ్ఞానమ్** = జ్ఞానము అని, **మమ** = నా యొక్క, **మతమ్** = దర్శనము.

> భరతవంశములో జన్మించిన ఓ అర్జునా! సర్వక్షేత్రములలోని క్షేత్రజ్ఞుడను నేనేనని కూడా నీవు తెలియుము. క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానము ఏది గలదో, అదియే జ్ఞానమని నా అభిప్రాయము (దర్శనము, vision) (2).

శాస్త్రసారము ఈ ఒక్క శ్లోకములో ప్రదర్శింపబడుచున్నది. 'సర్వక్షేత్రములలో నున్న క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడనగు నేనే'. శ్లోకములో మిగిలిన భాగము స్తుతి మాత్రమే. దేహేంద్రియ మనస్సంఘాతరూపమగు క్షేత్రము నెరుంగు ఆ క్షేత్రజ్ఞుడు పరమేశ్వరుడనగు నేనే యని తెలుసుకొనుము. శ్రీ కృష్ణుడిచట ఉత్తమ పురుష ఏకవచనమును పరమేశ్వరుడు అను అర్థములో ప్రయోగించినాడు. పరమేశ్వరుడెవ్వరు? సంసారమునకు వశుడు కానివాడని శ్రీ శంకరులు వివరించిరి. క్షేత్రజ్ఞుడు సంసారియని సర్వులు తలపోయుదురు. కాని క్షేత్రజ్ఞుడు ఈశ్వర అభిన్నుడని ఇచట భగవానుడు చెప్పుచున్నాడు.

ఏదో ఒక విశిష్ట దేహమునందు మాత్రమే భగవానుడు క్షేత్రజ్ఞుడై ఉన్నాడని తలంచరాదు. సర్వ దేహములలోని (సర్వక్షేత్రేషు) క్షేత్రజ్ఞుడు భగవానుడే. 'ఇది నా దేహము' అని తెలుసుకుంటూ సర్వదేహముల యందు ఉపలభ్యమయ్యే చైతన్యము క్షేత్రజ్ఞుడనబడును. ఆ చైతన్యము నేనేనని భగవానుడు చెప్పుచున్నాడు. మరోమాటలో చెప్పాలంటే 'నీవు నేనే; సర్వజీవుల స్వరూపము పరమేశ్వరుడనగు నేనే'. ఒకే క్షేత్రజ్ఞుడు బ్రహ్మాదిస్తంబపర్యంతము గల అసంఖ్యాక రూపములలో విభజింపబడియున్నట్లుగా గోచరించునని శ్రీ శంకరులు వివరించిరి. 'విభజింపబడి యున్నట్లు' అనుట యేల? భేదము ఉపాధి కృతము మాత్రమే. స్వరూపములో భేదము లేదు. ఒకే సూర్యుడు అనేక అద్దములలో ప్రతిఫలించినపుడు అనేక సూర్యులు ఉన్నట్లు కానవచ్చిననూ, వాస్తవముగా ఉన్న సూర్యుడు ఒక్కడే. అదే విధముగా, బ్రహ్మ – ఇంద్ర–వరుణ–అగ్ని ఇత్యాది దేవతారూపములలో, మరియు గంధర్వయక్షనరపశుక్రిమి ఇత్యాదులలో, సూక్ష్మజీవులలో, వృక్ష గుల్మాదులలో ఉపాధి భేదము వలన ఒకే పరమేశ్వరుడు క్షేత్రజ్ఞుడై వేర్వేరుగా ఉన్నట్లు కన్పట్టుచున్నాడు. వాస్తవంలో క్షేత్రజ్ఞుని యందు విభాగము లేశమైననూ లేదు. ఉపాధికృతమగు విభేదము లేవియూ క్షేత్రజ్ఞుని యందు లేవు. క్షేత్రములన్నిటి యందు ఒకే పరమేశ్వరుడు గలడు. ఆ పరమేశ్వరుడే నీవు (ఆత్మ). ఉన్నవాటిని (సత్), మరియు లేనివాటిని (అసత్) మాత్రమే పదములు బోధించగల్గును. అట్టి పదములు ఆత్మస్వరూపమును బోధించలేవని శ్రీ శంకరులు వివరించిరి. గుమ్మిడికాయ సత్, అనగా అది ఉనికి గల ఒక వస్తువు రూపములో మనకు గోచరమగుచున్నది. కాని దాని గెడ్డము అసత్. అనగా అది ఉనికి లేనివస్తువు అని నీకు తెలియుచున్నది. ఈ విధముగా ఉనికి గల మరియు ఉనికి లేని వస్తువుల జ్ఞానము మనకు ఆయా ప్రమాణముల ద్వారా తెలియుచున్నది. ఈ ప్రమాణమును వినియోగించే నీవు తెలియబడే వస్తువు కంటె భిన్నుడవని స్పష్టమే. కాని ఆత్మ ఉనికి గల ఒకానొక వస్తువుగా మనచే తెలియబడుట లేదు. సర్వము ఆత్మవలన మాత్రమే ఉనికిని కలిగియున్నది. ఆత్మ స్వరూపతః స్వయంసిద్ధము, మరియు స్వయం ప్రకాశము. అట్టి క్షేత్రజ్ఞ ఆత్మను తెలుసుకొనుము.

భగవానుడు అర్జునుని 'భారత' అని సంబోధించుచున్నాడు. ఈ శబ్దమునకు భరతవంశములో పుట్టినవాడు అను సరళమగు అర్థమును స్వీకరించవచ్చును. కాని ఈ ప్రకరణమునకు అనురూపమగు వ్యుత్పత్త్యర్థము కూడ గలదు. భా అనగా బ్రహ్మవిద్య. దాని యందు రమించువాడు (అస్యాం రమతే ఇతి భారతః) గనుక భారతుడనబడును. 'భా'యనగా ప్రకాశము. ఈ పదము బ్రహ్మ విద్యను బోధించును. చైతన్యరూపమగు ఆత్మయే బ్రహ్మయనబడును. ఆత్మ బ్రహ్మాభిన్నమను జ్ఞానమే బ్రహ్మ విద్య. ఈ బ్రహ్మ విద్యాప్రకాశములో ఉద్భాసితుడై రమించువాడు భారతుడనబడును.

క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే జ్ఞానము అని ఈశ్వరుని దర్శనము (యత్తద్ జ్ఞానం మతం మమ). ఇచట మతమనగా అభిప్రాయము, లేక వాదము కాదు. మతమనగా సత్యదర్శనము. ఈ పదము శాస్త్రములో ఎక్కడ వచ్చిననూ వాదము అను అర్థమును గాక సిద్ధాంతము అను అర్థమును స్వీకరించవలెను.

క్షేత్రము మరియు ఈశ్వరస్వరూపమగు క్షేత్రజ్ఞుడు అను వాటి యథార్థ జ్ఞానమును మించి తెలియదగిన వస్తువు మరియొకటి లేదు. ఏలయన, సర్వము ఈశ్వరుడే అయి ఉన్నాడు. స్థూలదేహము మాత్రమే గాక, మనస్సు ఇంద్రియములు మొదలగునవి, మరియు సమస్త భౌతిక ప్రపంచము కూడ క్షేత్రమే యగును. విషయమంతయు ఈ శ్లోకములో ధ్వని రూపములో నున్నది. ఈ విషయమే రాబోవు శ్లోకములలో నిరూపింపబడును. స్థూలదేహమే క్షేత్రజ్ఞ ఆత్మయని మనమిదివరలో తలచియుంటిమి. కాని మనకు కానవచ్చే ఈ జగత్తు మాత్రమే గాక, మన స్థూలదేహము, దాని లోపల ఉండే బుద్ధి, ఇంద్రియములు ఇత్యాది సర్వము కూడా క్షేత్రమే. కాన ఈ దృశ్యప్రపంచము సర్వము క్షేత్రము. ఇక మనము క్షేత్రజ్ఞుల గురించి తెలియ వలసి యున్నది. క్షేత్రజ్ఞులు అనేకము అని మనకు తోచవచ్చును. కాని క్షేత్రజ్ఞుడు ఒక్కడే. క్షేత్రజ్ఞుడు, క్షేత్రము అను రెండింటిలో సర్వము అంతర్గతమగును. వాటి కంటె భిన్నముగా ఏదీ మిగులదు. కావున క్షేత్రక్షేత్రజ్ఞ జ్ఞానమే యథార్థజ్ఞానమని చెప్పవచ్చును. ఇది తెలిసినచో తెలియదగినది ఏదియూ మిగిలి యుండదు. శ్రీకృష్ణుడీ విషయమును ఇంకనూ వివరించగలడు. ఈ జ్ఞానములో విడువబడిన అంశము ఏదియూ లేదు గనుక, ఇది పూర్ణవస్తువు యొక్క జ్ఞానము అగును. ఇతర జ్ఞానరూపములన్నియు పాక్షిక జ్ఞానములు మాత్రమే. అనగా ఆ జ్ఞానములు అజ్ఞాన దూషితములై యుండును గనుక, అజ్ఞానాంతర్గతములే యగును. క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడే అని యెరింగి, క్షేత్రమును కూడ తెలుసుకున్నచో, నీ జ్ఞానము పూర్ణమగును. ఇది ఈశ్వరీయ దర్శనము.

స్థూల సూక్ష్మ కారణదేహములనే త్రివిధ దేహములు మాత్రమే గాక, ఈ జగత్తంతయు క్షేత్రములో అంతర్గతమగును. ఈ విషయము తరువాత మరల వివరింపబడును. ఈ సర్వమునకు సాక్షియగు ప్రత్యగాత్మ ఇచట క్షేత్రజ్ఞుడనబడును. ఈ క్షేత్రజ్ఞునకు ఈశ్వరునితో అభేదము బోధింపబడినది. కావున ఈ శ్లోకము మహావాక్యము అగును. క్షేత్రములన్నింటిలోని క్షేత్రజ్ఞుడను నేనేనని ఎరుంగుము (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత) అని భగవానుడు చెప్పుచున్నాడు. దీనిని బట్టి క్షేత్రజ్ఞులు అనేకులు కాదని తెలియుచున్నది. ఒకే ఒక క్షేత్రజ్ఞుడు గలడు. ఆ క్షేత్రజ్ఞుడు ఈశ్వరుని కంటె వేరుగా లేడు. ఈశ్వరుడు అసంసారి, మరియు సర్వ జగత్కారణుడు. ఈ క్షేత్రమును గురించి క్షేత్రజ్ఞుని గురించి నీవు తెలుసుకొనుము. లోకములో

ఈ విషయమై భ్రాంతి గలదు. క్షేత్రము నెరుంగు క్షేత్రజ్ఞుడు స్థూలదేహమేనని జనులు తలంతురు. కావుననే ఇట్లు చెప్పవలసి వచ్చినది. కావున, క్షేత్రజ్ఞుడనగు నేను ఈశ్వరుని కంటె వేరు గాదనియు, క్షేత్రమగు ఇతరము సర్వము ఆ క్షేత్రజ్ఞునిపై ఆధారపడి యుండు ననియు తెలుసు కొనుటయే జ్ఞానమనదగును. ఇతరము ఏదైననూ అజ్ఞానమే. జీవేశ్వరులు ఒక్కటియే అనునది సత్యము. కావున, ఈశ్వరుని నీ కంటె భిన్నముగా దర్శించినచో, అది అజ్ఞానము అగును. ఈశ్వరుని దర్శనము ఇదియే.

ఈ శ్లోకము మహావాక్యము గనుక, శ్రీశంకరులు విస్తృతమగు భాష్యమును వ్రాసిరి. వ్యక్తివి, క్షేత్రజ్ఞుడవు అగు నీవు ఈశ్వరుని కంటె భిన్నముగా లేవు. ఈశ్వరుడు ఒక్కడే. అనగా క్షేత్రజ్ఞ – ఆత్మ ఒక్కటియే గాని, అనేకము కాదు. కావున శాస్త్రదృష్టిలో సర్వము సచ్చిదానంద–అద్వయ–బ్రహ్మ. కావున నీవు పూర్ణుడవు. ఈ దర్శనము సర్వశాస్త్రసారమని నిరూపించే ఆవశ్యకత గలదని శ్రీశంకరులు భావించి, ఇచట విస్తృతమగు విచారమును చేసిరి. ఈ దర్శనమును విరోధించే పూర్వపక్షియొక్క వాదముతో వారి విచారము నారంభించిరి. ఏలయన, తెలియదగిన వస్తువు విషయములో విభిన్న దృక్పథములు ఉన్న సందర్భములో విచారము ఆవశ్యకమగును. అవిద్య యొక్క పరిధికి లోబడి ఎన్ని వాదములైననూ ఉండవచ్చును. ఈ దర్శనమును తెలుసుకొనుటకై ఆ వాదము లన్నింటికీ సమాధానము నీయవలెను. జ్ఞానము అని ఈ శ్లోకములో ప్రకటింపబడిన సత్యము రాబోయే చర్చలో స్థిరీకరింపబడును.

సాక్షి–ఆత్మయై క్షేత్రమును ప్రకాశింప జేయువాడే క్షేత్రము నెరుంగు వాడగునని ముమ్మందుగా తెలియుట చాల ముఖ్యము. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు అను వాక్యములో ఈశ్వరుని కంటె అభిన్నము అని చెప్పబడిన తత్త్వము ఆ క్షేత్రజ్ఞుడు మాత్రమే.

క్షేత్రజ్ఞ–ఈశ్వరులకు అభేదమును చెప్పే ఈ వాక్యముపై ఒక ఆక్షేపము లేవదీయబడినది. క్షేత్రములన్నింటిలో గల క్షేత్రజ్ఞుడను నేనే అని తెలుసుకొనుము (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు) అని భగవానుడు చెప్పినాడు. 'నేను' అనే క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడనియే భగవానుని వాస్తవమగు తాత్పర్యమా? అట్లైనచో, క్షేత్రజ్ఞ–ఈశ్వరుల మధ్య అభేదము నిర్దేశింపబడుచున్నదా? లేక, క్షేత్రజ్ఞ–ఈశ్వరుల మధ్య ఒక రకమైన సంబంధము బోధింపబడుచున్నదా? ఈ రెండవ పక్షమునకు తాత్పర్యమేమనగా– క్షేత్రజ్ఞుడు ఈశ్వరునిలో అంతర్గతుడే అయినా, ఈశ్వరుడు క్షేత్రజ్ఞుడు కానక్కరలేదు. ఉదాహరణకు, వృక్షము అడవిలో అంతర్గతమగును. కాని అడవి ఏ ఒక్క వృక్షమైననూ కాబోదు. అటులనే, అనేక జలబిందువుల సముదాయమే సముద్రము

అయిననూ, ఒకానొక జలబిందువు సముద్రము కాదని చెప్పగలము. ఇదే తీరున, జీవుడు ఈశ్వరుని ఒకానొక అంశము మాత్రమేనని ఈ వాదము యొక్క సారాంశము. గీతలోని 15వ అధ్యాయములో గల 'మమైవాంశో జీవలోకే జీవభూతః' (నాలోని ఒక అంశము మాత్రమే జగత్తులో జీవుల రూపములో నున్నది) ఇత్యాది వాక్యములు ఈ వాదనకు ఉపోద్బలకములని తదనుయాయుల అభిప్రాయమై యున్నది. ఇదే విధముగా, ముండకోపనిషత్తులో 'ద్వా సువర్ణా సయుజా సఖాయా' అని ఆరంభమయ్యే మంత్రము ఒకటి గలదు. దాని యర్థమేమనగా, సంసార వృక్షముపై రెండు పక్షులు గలవు. వాటిలో ఒకటి కర్మఫలములను భక్షించుచుండగా, రెండవది తాను తినకుండా తినుచున్న మొదటి పక్షిని పరిశీలించుచుండును. ఏమియూ తినని పక్షి ఈశ్వరుడనియు, ఆయన సర్వాతీతుడనియు, తినుచున్న పక్షి జీవుడనియు ద్వైతులు చెప్పెదరు. ఈశ్వరుని అనుగ్రహముచే ఈ జీవుడు స్వర్గములో ప్రవేశించే అర్హతను పొంది, అచట ఒక విశిష్టమగు పరమ సుఖమును అనుభవించును. వీరి మూలసిద్ధాంత మేమనగా, జీవుడవగు నీకు ఈశ్వరునితో గల భేదము నిత్యము. ఆయన నీపై అనుగ్రహించి, నిన్ను రక్షించగోరి దుఃఖములు లేని గొప్ప స్థానమునకు నిన్ను గొని పోవును. ద్వైత మతములన్నింటిలో గల ఈశ్వరమీమాంస (theology) యొక్క సారమిదియే. వారు తమ ద్వైత సిద్ధాంతమునకు ఉపోద్బలకముగా ఇట్టి మంత్రములను ఉదాహరించి, మహావాక్యములనన్నిటినీ ద్వైతపరముగా వ్యాఖ్యానించి, పద్మ పురాణ కూర్మపురాణేత్యాది గ్రంథములలోని శ్లోకములతో తమ వాదమునకు పుష్టిని చేగూర్చెదరు. కాని వారు ఎంత గొప్పగా వాదించిననూ, ఈ ద్వైతములో అందరికీ సమస్యలే అనుభవమునకు వచ్చు చుండును. జీవేశ్వరుల మధ్యగాని, జగత్-ఈశ్వరుల మధ్య గాని, జగత్-జీవుల మధ్య గాని, జీవ-జీవుల మధ్యగాని ఎవడైతే లేశమైననూ భేదమును చేయునో (ఉదరమంతరం కురుతే), వానికి భయము తప్పదు (అథ తస్య భయం భవతి) అని శాస్త్రము చెప్పుచున్నది. అద్వైతములో మాత్రమే భయవిముక్తి (అభయము) గలదు. సమస్యలన్నింటికి భయము కారణమై యున్నది. భయములన్నింటిలో ప్రముఖమైనది మృత్యు భయము. నశించుననే భయము సర్వసాధారణము. ప్రతి వ్యక్తి భయపడును; భయము యొక్క హెచ్చు తగ్గులలో మాత్రమే తేడాలు గలవు. భయము బాల్యావస్థలో ఆరంభమగును. జగత్తు యొక్క విస్తారము శిశువును భయభీతుని చేయును. ఇంత విశాలమగు జగత్తులో వ్యవహారమును చేయవలెననే తలంపు భయకారణమగును. సర్వము చాల పెద్దదిగా భాసించును. యాపిల్ పండు కూడ నోరు పట్టని పెద్ద పరిమాణములో కన్పట్టును. ప్రకృతి శక్తుల విజృంభణను గాంచిన పిదప, భయము కలుగుట సహజము. జీవుని స్వరూపమిట్లున్నది. మానవులలో కొందరు సర్పములతో వ్యవహరించగలరు. కొందరు బొద్దింకలతో వేగగలరు. మరికొందరు ఈగను మించి తట్టుకొనజాలరు. సంసారమిట్లుండును.

తెలియదగిన ప్రముఖ విషయమేమనగా, భయమే సంసారము. జీవుడు మర్త్యుడు, సర్వము కంటె వేరుగా నున్న ఒంటరి వ్యక్తి. ఈ జగచ్చక్రములో నేను అత్యంత అల్పుడను. నా కంటె భిన్నమైనది అనంతముగా నున్నది. నేను సర్వకాలములలో జగత్తు యొక్క, ప్రకృతి శక్తుల యొక్క దయాదాక్షిణ్యములపై బ్రతుకు చున్నాను. కావున, ద్వైతములో సమస్యకు పరిష్కారము లేదని స్పష్టమగుచునే యున్నది. అయిననూ, ద్వైతవాదులు దాని యందు పరిష్కారమును కనుగొనుటకు ప్రయత్నించుచుందురు. ఈశ్వరుని దయను నీవు పొందగల్గినచో, అయన నీకు కొంత ఆనందమును అనుగ్రహించును. అనగా నీకు ఒక అసాధారణ అనుభవము గాని, లేక పుణ్యలోకము గాని సంప్రాప్తమగును (లోకప్రాప్తి). ద్వైతుల వాదము యొక్క సాధారణ స్వరూపము ఇట్లుండును.

సర్వదేహములలో ఉండే 'నేను (ఆత్మ)' ఒక్కటియే అయినచో, ఆ 'నేను' అద్వితీయ–ఈశ్వరుడైనచో, ఈశ్వరుని కంటె భిన్నముగా మరియొక వ్యక్తి లేకుండును. సచ్చిదానంద ఈశ్వరుడు సంసారాధీనుడు కాజాలడు గనుక, కర్తగాని కర్మఫలభోక్త గాని కాజాలడు. అట్టి స్థితిలో భోక్త గాని, కర్తగాని ఉండడు. ఈ 'నేను' అనే ఆత్మయే ఈశ్వరుడైనచో, నేను భోక్తను కాదనియే గదా! కాని నా గురించి నాకు గల అనుభవము అట్లు లేదు. అట్లు గాక, ఈశ్వరుడు కూడ భోక్తయే నన్నచో, 'ఆ ఈశ్వరుడు నేనే' అని ఎరుంగుటలో ప్రయోజనము లేదు. నేను అదే సంసారిగా కొనసాగు చుందును. కాని ఈశ్వరుడు సంసారమునకతీతుడు అని పెద్దలు చెప్పెదరు. ఆ ఈశ్వరుడే 'అహమ్' అయినచో, వేరే భోక్త లేడు. ఆత్మ భోక్తయని నేనింత వరకు తలపోసితిని. నా సుఖదుఃఖములు నేనే అనుభవించుచున్నాను గదా! నా అనుభవములన్నియు నేనే భోక్తనని తెలుపుచున్నవి. కాని ఆత్మ ఈశ్వరుడేనని మీరు ఇప్పుడు చెప్పుచున్నారు. నేను మాత్రమే సంసారినని నేనింతవరకు తలంచుచుంటిని. ఈశ్వరుడు కూడా సంసారియేనని ఇప్పుడు తెలియవచ్చినది. జీవేశ్వరులకు భేదము లేనిచో, రెండవ భోక్త లేడు గనుక, ఈశ్వరుడే ఒక సంసారి యగును.

ఈశ్వరుడు అయితే సంసారి కావాలి; లేదా సంసారమనేది లేకుండా పోవలెను. ఈ రెండు పక్షములు అంగీకారము కాదు. జీవేశ్వరులు అభిన్నులు గనుక, ఈశ్వరుడు సంసారియగు పక్షములో, మోక్షము అనేది లేదు. బంధమోక్షములు పరస్పరాశ్రితములు గనుక, మోక్షము లేనిచో బంధము కూడ లేదు. కాని ఈ పరిస్థితి మన అనుభవమునకు అనురూపముగా లేదు. బంధత్వభావన మనకు అనుభవములో గలదనుట నిశ్చయము. ఈశ్వరుడు కూడా సంసారియే అయినచో, నీవు సాధింవగలిగే అత్యున్నత స్థితి ఈశ్వరునితో ఐక్యము గనుక, ఒక సంసారితో మరియొక సంసారి యొక్క కలయిక ఎంత మహోన్నతమైనది అయిననూ, సంసారమనే సమస్యను

పరిష్కరించ జాలదు. క్రిందకి పైకి ఊగిసలాడే భావావేగములు, విషయి-విషయ సంబంధి సమస్యలు, భయము, జన్మమరణములు మిగిలియే యుండును. బంధము శాశ్వతమగును. ఇది ఏ మాత్రమూ అభిలషణీయము గాదు.

దీనికి భిన్నముగా ఈశ్వరుడు అసంసారియై, జీవేశ్వరులకు భేదము లేనిచో, జీవునకు సంసారమే లేకుండును. అట్టి స్థితిలో, శాస్త్రమునకు ప్రయోజనమేమి? సంసారబంధము నుండి విముక్తియే మోక్షమనియు, అదియే శాస్త్రప్రయోజన మనియు ఉద్ఘోషింపబడుచున్నది. ప్రమాణ భూతమగు శాస్త్రము జ్ఞానహేతువై, ఆ జ్ఞానము మోక్షహేతువు అగును. కాని ఇచట పరిస్థితి చాల దురదృష్టకరముగ నున్నది. సంసారము లేదు. బంధము లేదు. కాన మోక్షముతో పని లేదు. కావున శాస్త్రము వ్యర్థము. సంసారము లేదు గనుక, శాస్త్రము అనావశ్యకమని అంగీకరించినచో, దాని ఫలస్వరూపమేమనగా పునర్జన్మ లేదు, కర్మ లేదు, పుణ్యము లేదు, పాపము లేదు, సుఖము లేదు, దుఃఖము లేదు. దృక్ - దృశ్య సంబంధము లేకుండుటచే, ద్వైతగంధమైననూ లేకుండును. కాని మన అనుభవము అట్లు లేదు. శాస్త్రము మన అనుభవములను కూడా లెక్కలోనికి తీసుకొనవలెను గదా! ఏ ఉపదేశమైననూ మన అనుభవములను గురించి మాటలాడి, విశ్లేషించి, వాటి వాస్తవికతను మనకు నిరూపించవలెను. కాని ఉపదేశము మన అనుభవమునకు విరుద్ధముగ నుండరాదు. ఉపదేశము నుండి లభించే జ్ఞానము యొక్క ప్రకాశములో అనుభవములను గురించి మనకు గల నిష్కర్షలు మారవచ్చునేమో గాని, అనుభవము అటులనే యుండును. ఉదాహరణకు, గాజు పాత్రలోని నీటిలో పుల్లను ఉంచినచో, అది వంగియున్నట్లు కానవచ్చును. ప్రత్యక్షజ్ఞానము అను అంశములో అది సత్యమే. కాని వాస్తవికత అను అంశములో అది సత్యము కాదు.

ఒక విశిష్ట ప్రత్యక్ష జ్ఞానమును శాస్త్రజ్ఞానము విశ్లేషించి బాధించ (negate) గలదు. కాని ప్రత్యక్ష, అనుమాన ఇత్యాది ప్రమాణములకు విరుద్ధమైన అంశమును ఏ శాస్త్రమైననూ బోధించజాలదు. ఉదాహరణకు, స్వర్గము అనునది ప్రత్యక్ష, అనుమానముల పరిధిలోనికి రాదు గనుక, వాటికి విరుద్ధము కాదు. కావున శాస్త్రము స్వర్గమును ఉపదేశించవచ్చును. కాని అదే శాస్త్రము స్వర్గములో నీవు శాశ్వత కాలము నివసించ వచ్చునని చెప్పినచో, అది సమస్య యగును. ఏలయన, అది అనుమానాది ప్రమాణ విరుద్ధము, యుక్తి విరుద్ధము అగును. సాక్షి ప్రత్యక్షము, మరియు ఇంద్రియ ప్రత్యక్షము అని ప్రత్యక్షము ద్వివిధముగ నున్నది.

సుఖదుఃఖములు, వాటి కారణములు, జయాపజయములు, మరియు శీతోష్ణాది ద్వంద్వములు ఈ సంసారము యొక్క విశిష్ట లక్షణములు. సంసారి సర్వథా భవిష్యత్తును గురించి

లిల్లును. కాని సాధువు అట్లు గాక సర్వదా వర్తమానములో జీవించు చుండును. జీవుని యందు సంసారము లేదని త్రోసిపుచ్చుట సంభవము గాదు. ఏలయన, జీవుడు ప్రత్యక్షాది స్వీయ సాధనములతో స్వయముగా సంసారము ననుభవించుచున్నాడు. మరియు మనస్సులో సుఖదుఃఖములు జీవునకు సాక్షిభాస్యములగుచునే యున్నవి. సంసార సారము సుఖదుఃఖములే. సుఖదుఃఖహేతువులగు శీతోష్ణాదులు ఇంద్రియ గ్రాహ్యములగుచునే యున్నవి. అభిలషితములు మరియు అనభిలషితములు అగు విషయములనన్నిటినీ జీవుడు సుఖదుఃఖరూపముగా ననుభవించుచునే యున్నాడు. కావున సంసారము లేదని త్రోసిపుచ్చుట తగదు.

ఇంతే గాక, జీవుల సంఖ్యను బట్టి మరియు వైచిత్రిని బట్టి సంసారము గలదని ఊహించగల్గుదుము. ఇన్ని రకముల జీవులు కానవచ్చుటకు కారణమేమి? ఏదో ఒక కారణము ఉండి తీరాలి. ఒకడు పుట్టుక నుండియు సంపన్నుడై యుండగా, మరియొకడు బీదవాడుగా పుట్టుచున్నాడు. మరియొకడు దరిద్రుడై పుట్టి జీవితమంతయు దరిద్రుడుగనే మిగిలి యున్నాడు. సంపద, ఆరోగ్యము, వివాహము, సంతానము, పౌరసత్వము, ప్రతిభ, ఉద్యోగములో ప్రగతి ఇత్యాది అనేకాంశములలో జీవుల మధ్య భేదము మనకు కన్పట్టును. ఇవి అన్నియూ పూర్తిగా యోజన చేసి సంపాదించుకునేవి కావు. దీనిని బట్టి అంతర్లీనముగా అనేక కారణములు గలవని మనము ఊహించగలము. అట్లు గానిచో, ఈ భేదముల నన్నిటినీ ఏమని వివరించవలెను? ఈ భేదములను వివరించే అనువంశిక నమూనా (genetic model) కి కూడా మూలకారణముగా కర్మ ఆధారముగా గల నమూనాను ప్రతిపాదించ దగును. స్థూలదేహము కంటె భిన్నముగా జీవుడు గలడనియు, దేహము నశించిననూ జీవుడు నశించడనియు, తన కర్మాశయముచే నిర్ణీతమయ్యే విభిన్న పరిస్థితులలో నూతన జన్మను జీవుడు పొందుచుండుననియు శాస్త్రీయమైన అనుమాన ప్రమాణముచే సాధించవచ్చును. జీవునియందు స్త్రీపురుష లింగ భేదము లేదు. ఏ కర్మ సముదాయము పరిపక్వమై యున్నది? అను అంశముపై ఆధారపడి జీవుడు పురుషునిగా గాని, లేక స్త్రీయై గాని జన్మించవచ్చును. అనగా ప్రతి జీవుడు కర్త మరియు భోక్త అగుచున్నాడు. దీనిని బట్టి ధర్మా ధర్మములనుండి పుట్టే పుణ్యపాపములు సంసారహేతువులని మనము నిర్ణయించవచ్చును.

క్షేత్రజ్ఞ-ఆత్మ మరియు ఈశ్వరుడు ఒక్కటియేనన్నచో, వీటినన్నిటినీ త్రోసిపుచ్చుట తప్పని సరియగును. అట్లు చేయనిచో ఈ అభేదములో సమస్యలు నిలిచి యుండును. సంసారము లేదనుట మన అనుభవములో నున్న ప్రత్యక్ష-అనుమానాది సర్వ ప్రమాణములకు విరుద్ధముగా నుండును.

ఈ వాదము సరిగాదని శ్రీ శంకరులు వివరించిరి. జీవేశ్వరులు అభిన్నమైనచో, జీవునకు సంసారము లేదనియే గదా! శాస్త్రము బోధించేది ఖచ్చితముగా నిదియే. ఈ అభేదమును నీవు గుర్తించనంతవరకు నీకు సంసారము ఉండును. అంతా బాగానే ఉన్నది. జ్ఞాన, అజ్ఞానములు పరస్పర విరుద్ధములు. అజ్ఞాన సంమోహములో ఇది అంతయు సంభవమగుచున్నది. దేని వలన ఏది సంభవమగు చున్నది అను విషయమును మనము పరిశీలించవలసి యున్నది. దీనిని వివరించుటకై శ్రీ శంకరులు అనేక వాక్యముల నుదాహరించిరి. 'అజ్ఞానము, జ్ఞానము అనబడే ఈ రెండు మార్గములకు మధ్యలో చాల అంతరము గలదు; ఇవి పరస్పర విరుద్ధములు' అని కఠోపనిషత్తు చెప్పుచున్నది. అదే ఉపనిషత్తు తరువాత ఈ రెండు మార్గములకు గల ఫలభేదమును బోధిస్తూ, శ్రేయస్, ప్రేయస్ అనునవి వేర్వేరు అని చెప్పినది. స్వర్గాది కామనలు ప్రేయస్ అనబడును. ఇది అవిద్యాకార్యము. 'నేను కర్తను' అనే అజ్ఞానము నా యందు ఉండుటచే నేను కర్తృత్వమును నా యందు ఆరోపించుకొని కర్మను అనుష్ఠించెదను. అంతా సక్రమముగా జరిగినచో, కర్మఫలము లభించును. అదియే ప్రేయస్. విద్యా ఫలమగు మోక్షము దీనికి పూర్తిగా విరుద్ధమైనది.

సంప్రదాయ పరంపరలో వ్యాసుడు ఒక ప్రధాన సంయోజకుడు గనుక, ఆయనను తరచుగా ఉదాహరించెదరు. శ్రీశంకరులిచట 'ద్వౌ ఇమౌ అథ పంథానౌ' అను వ్యాసుని వాక్యమును ఉదాహరించిరి. దీని అర్థమేమనగా – రెండు మార్గములు గలవు. ఒకటి జ్ఞాన మార్గము. దీనికి ఫలము శ్రేయస్సు. రెండవది కర్మమార్గము. దీనికి ఫలము ప్రేయస్సు. అజ్ఞాన సంమోహముచే జీవుడు ఈశ్వరుని కంటె భిన్నముగా కన్పట్టును. అజ్ఞాని యగు జీవుడు కర్తృత్వ భోక్తృత్వ ధారణలకు బలియై పుణ్యపాపములు, సుఖదుఃఖములు ఇత్యాది ద్వంద్వములకు వశుడగు చుండును. జ్ఞానముచే ఇది అంతయూ పూర్తిగా అప్రామాణికమని తెలిపోవును. కాని అజ్ఞానము ఉన్నంతవరకు బంధము ఉండును. బంధములో కర్మఫలము, సుఖదుఃఖానుభవములు జీవుని వెంటాడును. అట్టి స్థితిలో మోక్షశాస్త్రము ప్రమాణమగును. గీతలో కూడ ద్వివిధ నిష్ఠలు బోధించబడినవి. ఒకటి మోక్షమునకు, రెండవది పునర్జన్మలకు దారి తీయును. కావున, జీవుడే ఈశ్వరుడైనచో, ఈశ్వరుడు సంసారి యగుననియు, లేదా ఈశ్వరుడు సంసారి కాజాలని పక్షములో సంసారమే లేదనియు చెప్పే ఈ వాదము శ్రుతిస్మృతులకు, సమ్యగ్వ్యవహారమునకు విరుద్ధమని మనకు స్పష్టమగు చున్నది.

ఈశ్వరుడు సంసారియనుట ఈశ్వరనిర్వచనమునకు విరుద్ధమగుటయే గాక, మోక్షము యొక్క సంభావన (possibility)ను నిరాకరించును. సర్వాధీశ్వరుడగు భగవానుడు సంసారి కాజాలడు. జీవునకు ఈశ్వరునితో భేదము లేనిచో, ఈశ్వరుడు సంసారవిముక్తుడు గనుక, జీవుడు

కూడ సంసారవిముక్తుడే యగును. కాని ఇది మన అనుభవమునకు విరుద్ధముగా నున్నది. కాని జ్ఞాన, అజ్ఞానములను పరిగణనలోనికి తీసుకున్నచో, ఈ సమస్య తొలగి పోవును. జీవుడు ఈశ్వరుడే యైనచో, జీవునకు సంసారము ఉండరాదని ప్రతివాది వాదము. అది యథార్థమే. నీవు ఈశ్వరుడవనే సత్యమును గుర్తించినచో, సంసారము లేదు. నీకీ సత్యము తెలియనిచో 'నేను సంసారిని' అని నీవు నిశ్చితముగా భావించెదవు. 'నేను ఈశ్వరుడను; కాని ఇంకనూ సంసారిని' అని నీవు ఎన్నటికీ చెప్పజాలవు. కావున ఇంతటి భేదమునకు మూలములో జ్ఞాన, అజ్ఞానములు గలవు.

ప్రతిపక్షికి జీవ-ఈశ్వర-అభేద స్వరూపము తెలియక పోవుటచే ఇట్టి వాదమునకు ఒడిగట్టుచున్నాడు. 'నేను' అను పదమునకు మనకు తెలిసిన అర్థముతో, క్షేత్రజ్ఞ-ఈశ్వర అభేదమును చెప్పినచో, సుఖదుఃఖములకు వివిధపరిచ్ఛేదములకు అంతలో గత్వా జన్మమృత్యువులకు వశుడై యుండే జీవునితో అభేదమును పొందిన ఈశ్వరుడు కూడా సంసారి యగును. సర్వజ్ఞత్వ సర్వశక్తి మత్వాది లక్షణములతో నిర్వచింపబడే ఈశ్వరుని యందు సంసారిత్వము పొసగదు. ఇట్లు గాక, ఈశ్వరుడు సంసారి కాడనియు, జీవ-ఈశ్వరులకు భేదము లేదనియు చెప్పినచో, సంసారమే లేకుండును. అనగా నాకు పరిచ్ఛేదములు లేకుండవలెను. కాని ఇది నా అనుభవమునకు విరుద్ధముగా నున్నది. ఈ పూర్వపక్షమును శ్రీ శంకరులు ప్రస్తావించి, ఇది అంతయూ అజ్ఞానముచే మరియు జ్ఞానముచే సంభవమగునని నిరూపించిరి. నీకు ఈశ్వరునితో భేదము లేదు. కాని నీవా సత్యము నెరుంగవలెను. నీవా సత్యము నెరుంగనిచో, నీకు సంసారము తప్పదు. ఈ పరిచ్ఛేదములన్నియూ కేవల ఉపాధి వలన సంక్రమించినవే గాని, ఆత్మ యొక్క స్వరూప ధర్మములు గావు. ఆత్మయే బ్రహ్మ. అనంత-అపరిచ్ఛిన్న-పూర్ణ-తత్త్వము ఒక్కటి మాత్రమే ఉండగల్గును. రెండు అనంతతత్త్వములు ఉండలేవు. కావున, నీవు ఆ అనంత అపరిచ్ఛిన్న పూర్ణతత్త్వము కంటె భిన్నుము కాజాలవు. మరియు, ఆ పూర్ణతత్త్వము నందు అంశములు ఉండుటకు వీలు లేదు. కావున, జ్ఞాన అజ్ఞానములు ఈ విచిత్ర పరిస్థితిని పొసగునట్లు చేయునని శ్రీ శంకరులు సమాధానము నిచ్చిరి.

ఈశ్వరునితో అభిన్నుడైననూ జీవుడు పరిచ్ఛిన్నభావము ననుభవించుచున్నాడు అన్నచో, అది యుక్తి సంగతముగనే యున్నది. జీవుడు తన ఆత్మ పరమాత్మయేనని ఎరుంగక పోవుటచే ఇది సంప్రాప్తమైనది. కావున ఈ అజ్ఞానమును తత్కార్యములగు పరిచ్ఛేదములతో సహా జ్ఞానముచే పెకలించి వేయవలెనని శ్రీ శంకరులు వివరించిరి. ఈ జ్ఞానము కొరకై మనకు శ్రుతి (వేదము), దానికి ఉపోద్బలకములగు గీతాది స్మృతి గ్రంథములు, మరియు శ్రుతి సమర్థకములగు యుక్తి

(న్యాయము) ఉపలభ్యమగు చున్నవి. ఈ మూడు కూడా ప్రముఖమైనవియే. ఈ జ్ఞానమునకు మూలస్రోతస్సు అనదగినది వేదము. ఈ జ్ఞానమును ఇప్పుడు ఈ జన్మలో పొందుట సంభవము. ఆత్మ ఈశ్వర-అభిన్నమని నీవెరింగినచో, సర్వపరిచ్ఛేద భావనలనుండి విముక్తుడవగుదువు. దేహము, మనస్సు మరియు ఇంద్రియములకు వాటికి గల పరిచ్ఛేదములు కొనసాగుచునే యుండును. కాని వాటి పరిచ్ఛేదములు ఆత్మను పరిచ్ఛిన్నము చేయజాలవు. దేహమునకు హద్దులు గలవనుటలో సమస్య లేదు. 'నాకు పరిచ్ఛేదము గలదు' అని దేహము అనుకోదు. మనస్సు అనగా ఆలోచనా శక్తి మాత్రమే. జ్ఞానము, స్మృతి, భావావేగములు ఇత్యాది వివిధ రూపములలో మనస్సు పనిచేయును. కాని మనస్సునకు కూడా అల్పత్వభావన లేదు. ఈ అల్పత్వ భావన అహంకారముపై కేంద్రితమై యున్నది. విచారము చేసినప్పుడు, ఈ 'నేను (అహంకారము)' మరియొక మనోవృత్తి రూపముగా పరిణమించదు. కర్తయగు ఈ అహంకారము సర్వమనోవృత్తుల సారభూతమగు చైతన్యములో విలీనమగును. అట్టి ప్రత్యగాత్మ (నేను) కు ఈశ్వరునితో ఐక్యమును దర్శించువాడు ఆ క్షణములో సర్వపరిచ్ఛేదముల నుండి విముక్తుడగును. సర్వము యొక్క సత్యము తానేనని అతడు ఎరుంగును. అందువలననే, మానవుడు ఈ జన్మలో (దీనిని) తెలుసుకున్నచో, సత్యము గలదు (ఇహ చేత్ అవేదీత్ అథ సత్యం అస్తి). అట్లు గాక, ఇచట ఈ జన్మలో తెలియక పోయినచో, అది చాల పెద్ద నష్టము అగును (న చేత్ ఇహ అవేదీత్ మహతీ వినష్టిః). వాస్తవంలో, ఈ నష్టము అనంతమైనది. ఏలయన, ఏ అనంతత్వమును మాత్రమే ఖచ్చితముగా సంపాదించవలెనని నీవు గోరుచున్నావో, అదే అనంతత్వమును నీవు గోల్పోయెదవు. పరిచ్ఛేద (limitation) వినిర్ముక్తి నిత్యసిద్ధమగు సత్యమై యున్నది. కాని, ఈ సత్యము నీకు తెలియక పోవుటచే, నీవు నీ స్వరూపమును యథార్థమగు అనంతము కంటె భిన్నముగా స్వీకరించెదవు. అది అల్పము తక్క మరియొకటి కాజాలదు. అనుభవము మరియు లోకవ్యవహారము ఈ అల్పత్వమునే సమర్థించు చుండును. ఇట్టి స్థితిలో మానవుడు అల్పత్వప్రయుక్తమగు దుఃఖమును అనుభవించుట తప్ప చేయుగలిగినది లేదు. కావుననే, ఉన్న స్థితిలో పరివర్తనను తెచ్చే ప్రయత్నము ఆరంభమై నిరంతరముగా కొనసాగుచుండును. ఏమి చేసిననూ, పరిచ్ఛిన్నమగు వ్యక్తిత్వములో మార్పు రాదు. ఈ ప్రయత్నములు వ్యర్థమనే సత్యమును మానవుడు గుర్తించలేక ప్రయత్నించుచునే యుండును. అజ్ఞానము వలన మానవుడు బద్ధుడగుననియు, జ్ఞానముదయించినచో విముక్తుడగుననియు ఎరుంగువాడు ఇచటనే అమృతుడగును (తం ఏవం విద్వాన్ అమృత ఇహ భవతి) అని మరియొక శ్రుతి చెప్పుచున్నది. అనగా ఈ ఆత్మను ఈ తీరున బ్రహ్మాభిన్నముగా నెరుంగువాడు అమృతుడగును. ఈ జ్ఞానోదయమునకు పూర్వము తాను కాలాధీనుడననియు, కావున మర్త్యుడననియు మానవుడు భావించును. ఆత్మ కాలాతీతమనే సత్యమును కనుగొన్న మానవుడు

ఇంకెంత మాత్రము తాను కాలవశుడననే దురభిప్రాయములో నుండడు. ఇచట కాలశబ్దము సర్వవిధపరిచ్ఛేదములకు ఉపలక్షకము (stands for) అగును. దేహము కాలాధీనముగనే కొనసాగును. కాని తన స్వరూపము కాలవశము కాదని అతడు ఎరుంగును. తాను మర్త్యుడననే ధారణ పూర్తిగా నిషేధింపబడి, ఆత్మ (నేను) కాలాదికృతమగు అల్పత్వములనుండి విముక్తమై యుండును. ఈ విముక్తి ఇచట ఈ జన్మలో లభింపునదియే గాని, మరణము వరకు వేచియుండ బనిలేదు. దేహము మరణించిననూ జీవాత్మ మరణించదు. కాని జీవాత్మగనే కొనసాగుచుండును. జీవాత్మ యొక్క నిర్వచనమును బట్టి అల్పత్వభావన నుండి విముక్తి జీవాత్మయై ఉండగా సంభవము కాదు. ఈ జ్ఞానమును ఇప్పుడు ఈ మానవ దేహములో పొందుట శక్యమే. అనగా ఈ దేహము ఈ జ్ఞానమునకు యోగ్యమైనదని స్పష్టమగు చున్నది.

పరిచ్ఛిన్న వ్యక్తిత్వము నుండి ఈ విముక్తిని పొందుటకు జ్ఞానము తక్క మరియొక మార్గము లేదని (న అన్యః పంథా విద్యతే అయనాయ) శ్రుతి స్వయముగా స్పష్టము చేయుచున్నది. సమస్య అంతయూ అజ్ఞాన జన్యమై యుండగా, మరియొక మార్గము ఎట్లు సంభవమగును? ఒక సత్యము నాకు తెలియనిచో, దాని జ్ఞానము విముక్తిహేతువు అయినచో, నేను దానిని తప్పక తెలియవలెను. ఆ విముక్తి అనుభవమువలన సాధ్యమయ్యేది కాదు. ఆత్మానుభవము సర్వకాలములలో గలదు. పైగా చిద్ఘనమగు ఆత్మ వలననే అనుభవములన్నియు సంభవమగు చున్నవి. వ్యక్తి-నిష్ఠ-అనుభవము గాని, లేక ఇంద్రియములకు బాహ్యమునందు గల వస్తువునకు సంబంధించిన అనుభవము గాని, అనుభవమేదైనా చైతన్య సన్నిధిని ఆధారముగా చేసుకొని ఉదయించును. ఉదాహరణకు, రూప ప్రత్యక్షమును పరిశీలింపుడు. అది చైతన్యమునకు జోడింపబడిన ప్రత్యక్ష విషయము (రూపము) తక్క మరియొకటి కాదు. అదే విధముగా, శబ్ద గంధ రస స్పర్శ ప్రత్యక్షములు, మానసిక ఊహలు, స్వప్నములు మొదలగునవి అన్నియూ ఒకే చైతన్యము యొక్క వివర్తములు. వీటిలో భేదము ఉన్ననూ, చైతన్యములో భేదము లేదు. ఆత్మను ప్రత్యేకముగా అనుభవమునకు తెచ్చుకొనవలసిన పనిలేదు. ఏలయన, ఆత్మ సర్వదా స్వయంప్రకాశము. ఆత్మ వలననే ఇతరానుభవములన్నియు కలుగుచున్నవి. కావున విముక్తి ఆత్మయాథార్థ్య జ్ఞానము వలన కలుగును. వాస్తవమేమనగా, మోక్షము నీ స్వరూపము కంటె వేరుగా లేదు. మోక్షము ఉత్పాద్యము (created) కాదు. అట్లైనచో, దాని నాశము తథ్యమగును. మోక్షము అనేది ఉన్నచో, అది ముముక్షువు అగు వ్యక్తి యొక్క తాత్త్వికస్వరూపమై యుండవలెను. ముముక్షువు ఏ మోక్షమును అన్వేషించుచున్నాడో, అది తన స్వరూపము కంటె భిన్నము కాదని తెలిసినవాడే అది లభించును. ఈ విషయమును 'నాన్యః పంథా విద్యతేఽయనాయ' అను శ్రుతి వాక్యము కంటె స్పష్టతరముగా చెప్పుట సంభవము కాదు.

ఈ వాక్యము యజుర్వేద పురుష సూక్తములోనిది. ఇదే వాక్యము కొద్ది తేడాలతో ఇతర వేద శాఖలలో కూడ కానవచ్చును. బ్రహ్మా నందము నెరింగినవాడు ఎన్నడూ భయపడడని (ఆనందం బ్రహ్మణో విద్వాన్, న బిభేతి కదాచనేతి) తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. సర్వులకు ఆనందము ఏదో ఒక రూపములో తెలియుచునే యుండును. వివిధ పదార్థములు లభించినపుడు వివిధ రకముల, వివిధ స్థాయిల ఆనందములను జీవులు అనుభవించు చున్నారు. దీనిని బట్టి హద్దులు, బంధములు ఉన్ననూ జీవుడు ఆనందమును పొందగల్గునని స్పష్టమగు చున్నది. దీని అర్థమేమనగా, నీవు పొందే ఏ పాటి ఆనందమైననూ ఆత్మ స్వరూపానందము యొక్క అల్పాంశము మాత్రమే. ఇట్టి స్థితిలో 'బ్రహ్మ యొక్క ఆనందమును తెలియువాడు' అను మాటకు అర్థమేమి? బ్రహ్మ ఒక పదార్థము కాదు. ఆత్మయే బ్రహ్మ. అనగా ఈ ఆనందము అనంత, పూర్ణ స్వరూపమగు ఆత్మ యొక్క ఆనందమే. ఈ సత్యము నెరింగిన వాడు ఇతరము వలన భయపడక పోవుట సహజమే. ఏలయన, ఆత్మ కంటె భిన్నముగా ఇతరము లేదు. ద్వితీయ వస్తువును దర్శిస్తూ, అదే కాలములో పూర్ణ స్వరూపుడై యుండుట సంభవము కాదు. పూర్ణమగు ఆత్మ కంటె భిన్నముగా భాసించేది ఉపాధికృతము (incidental), మరియు నామరూపాత్మకము మాత్రమే. నామరూపముల సారస్వరూపము నీవే. ఆకాశము, కాలము, సర్వనామరూపములు ఆత్మయే. అవి ఆత్మ కంటె స్వతంత్రమగు ఉనికిని కలిగి లేవు. ఆత్మ వాటన్నింటి కంటె స్వతంత్రమైనది. ఈ జ్ఞానము గల వ్యక్తికి భయము దూరమగును. తన స్వరూపము మాత్రమే గాక, ఇతరతరంగములన్నింటి స్వరూపము, సముద్రస్వరూపము కూడా జలమేనని తెలుసుకున్న తరంగము భగ్నోర్మి (breaker) గురించి భయపడదు. భగ్నోర్మి కూడా తనవలెనే మరియొక రూపమనియు, ఈ రెండు రూపములు కేవలము దేశకాలకృతములే (incidental) అనియు అది ఎరుంగును.

ఆత్మ జ్ఞానము మాత్రమే మోక్షహేతువు అని చెప్పే అనేక శ్రుతి వాక్యములను శ్రీ శంకరులు ఉదహరించిరి. దీనిని సమర్థిస్తూ అజ్ఞాన వ్యామోహములో నుండే వ్యక్తి యొక్క పరిస్థితిని వర్ణించే వాక్యములను కూడ వారు ఉదహరించిరి. తైత్తిరీయములో ఒక వాక్యము గలదు. ఈ ఆత్మ యందు ఎవరైతే భేదమును లేశమైననూ చేసెదరో, వారికి భయము కలుగును (అథ తస్య భయం భవతి). భేదలేశమనగా, అనంతములో నేను అంశమును మాత్రమే గాని, నేను అనంతుడను గాను అను ధారణ కావచ్చును. ఉదాహరణకు, సముద్రములో తరంగములు అంతర్భాగమే అయిననూ, తరంగము సముద్రస్థాయికి చేరలేదు గదా! తరంగము ఏదో ఒక సంబంధమును బట్టి సముద్రమునకు చెందినదియై ఉండును. తరంగమును ఒక విశిష్టపదార్థము (లేక వ్యక్తి)

గను, సముద్రమును మరియొక తత్త్వముగను పరిగణించినచో, ఇది సత్యమే యగును. అట్లుగాక, జలమును చూచుచున్నచో, తరంగ సముద్రములనే రెండు పదార్థములలో వివిధ రూపములను దాల్చి యున్న ఒకే జలము కానవచ్చును. ఈ రూపముల సత్యతత్త్వము జలమే గనుక, ఇవి మిథ్య అనబడే సత్యత్వశ్రేణికి చెందును. తరంగమునకు ఉనికియే లేదనుట సరిగాదు. అటులనే, జలము కంటె భిన్నముగా తరంగము స్వతంత్రముగ నున్నది అనుటయూ సరిగాదు. అదే విధముగా, జీవేశ్వరుల స్వరూపము ఒక్కటియే. ఈ సత్యమును గ్రహించిన జీవుడు భయముగాని, దుఃఖముగాని లేకుండగా ఏ పాత్రనైననూ పోషించగలడు. వ్యక్తిగా నీకొక చరిత్ర గలదు. ఒక విశిష్ట కాలములో జన్మించి పెరిగి పెద్దయైనావు. జీవితములో కొన్ని పర్యాయములు విజయమును, మరికొన్ని పర్యాయములు అపజయమును చవిచూచినావు. రూపమునకు ఇవి అన్నియూ వర్తించును. కాని ఆ రూపము యొక్క సారస్వరూపమగు అద్వితీయ అవిక్రియ చైతన్యమునకు ఇవి ఏమియూ వర్తించవు. ఇట్లు గాక, భగవానుడు ఆత్మయే అయినా, ఆత్మ భగవానుడు కాదు అనే భేదలేశమునైననూ చేయు మానవుడు ఎచటకు వెళ్లిననూ, ఏమి చేసిననూ, భయము నుండి విముక్తిని పొందే సంభావనయే లేదు. ఒక వ్యక్తిగా జీవుడు మృత్యుభయము నుండి, ఒంటరి తనము వలన భయము నుండి, సంసారసముద్రములో మునిగి పోదునేమో యను భయము నుండి తప్పించు కొనలేడు. ఇట్టి అనేక చింతలతో గూడి యుండు జీవునకు అంతరంగ విశ్రాంతి మృగ్యమగును.

జ్ఞాని గురించి తెలియాలంటే, నీవు జ్ఞానివై ఉండవలెను. కావున ఆత్మ జ్ఞానము గల గురువు వద్ద అభ్యసించే అవకాశము మానవునకు ఈశ్వరుని విశిష్టకృప వలన మాత్రమే లభించును. కాని తరుచుగా జరిగేది ఏమంటే, సాధకుడు అజ్ఞాని యగు గురువును ఎన్నుకొని ఆశ్రయించుటచే, గ్రుడ్డివాడు గ్రుడ్డివానికి దారిని చూపినట్లు అగును. ఒక వ్యక్తికి కొంత అంతర్దృష్టి ఉండవచ్చును. లేదా శాస్త్రమును బాగుగా నెరింగిన పండితుడే కావచ్చును. అయిననూ అతడు వ్యామోహ ప్రభావముచే 'నేను సత్యము నెరింగిన జ్ఞానిని' అనియు, 'నేను ఇతరులకు బోధింప సమర్థుడను' అనియు భ్రాంతిపడును. నీకు సత్యము తెలియని స్థితిలో, ఎదుటి వానికి తెలియునా? తెలియదా? అను విషయమును నీవు ఎట్లు నిర్ణయించగలవు? నీవా విషయమును నిర్ణయించగల్గినచో, నీకు ఆచార్యునితో పని లేదు. కావున సాధకులు అజ్ఞానులగు ఉపదేశకుల వలలో చిక్కుటలో ఆశ్చర్యము లేదని స్పష్టమగుచున్నది.

తరచుగా ఎదురయ్యే సమస్య ఏమనగా, జనులు బోధన విషయములో జనాకర్షణ అనే అంశమునకు అధిక ప్రాధాన్యమునిచ్చెదరు. ఒక వ్యక్తి లబ్ధప్రతిష్ఠుడైనచో, అతడు

అనుసరింపయోగ్యుడగుననే కల్పనను జనులు తరుచుగా చేసెదరు. ఉదాహరణకు ఛార్లెస్ రాజకుమారుడు సింహాసనమును పరిత్యజించి ఆధ్యాత్మిక సాధనలోనికి దిగినాడనుకొనుడు. అతనికి ఏమియూ తెలియక పోయిననూ, అనుయాయి వర్గమునకు లోటు ఉండబోదు. సిద్ధార్థుడు రాజ్యమును త్యాగము చేసెను గదా! తరువాత ఏమైనదో గమనించుడు. పొరుగు దేశపు అధిపతి యగు బింబిసారుడు, సత్యమును సాత్కరించుకున్నచో తాను సిద్ధార్థునకు శిష్యుడనగుదునని చెప్పెను. శిష్యవర్గము కొరకై అతనికి జ్ఞానముతో పనిలేదు. అతడు రాజకుమారుడు గనుక, అతని త్యాగము చాలును. ఆధ్యాత్మిక సాధన కొరకై ప్రతి దినము ఎందరో మహాత్ములు తమ జీవితములను త్యాగము చేయుచుందురు. కాని వారిని గురించి ఎవ్వరూ పట్టించు కోరు. కాని అదే పనిని యశస్వియగు వ్యక్తి చేసినచో, అది వార్తా పత్రిక మొదటి పుటలో ప్రచురించబడును. దీనిని పరావర్తిత ప్రకాశము (reflected glory) అనదగును. ప్రఖ్యాతికి, జ్ఞానమునకు మధ్య గల భేదమును వివేచించుట జనులకు చాల కష్టమైన పని యని తోచును. కావున జనులు ఇట్టి వారిని అనుసరించినచో, గ్రుడ్డివానికి గ్రుడ్డివాడు దారి చూపే పరిస్థితి తయారగును.

సంసారమనే సమస్యకు మూలము అజ్ఞానములో నున్నదని మనము చూచి యున్నాము. దాని పరిష్కారము జ్ఞానమునందు మాత్రమే గలదు. 'బ్రహ్మను ఎరుంగువాడు బ్రహ్మ యగును (బ్రహ్మ వేద బ్రహ్మ ఏవ భవతి)' అను మరియొక శ్రుతిని శ్రీశంకరులు ఉదహరించిరి. అనంతబ్రహ్మను ఎరుంగువాడు అనంతుడై తీరవలెను. ఏలయన, నిర్వచనము ప్రకారంగా ద్రష్ట అంతర్గతము కాని దృశ్యము అనంతత్వము కాదు. అనంతత్వము అయితే నీ స్వరూపము కావాలి; లేదా అనంతత్వము అనేది లేదు. ఈ బ్రహ్మ దర్శనము కంటె విలక్షణమైన దర్శనమును శ్రుతి ఇట్లు వర్ణించినది: ఈశ్వరుడు వేరు, నేను వేరు అని చెప్పువాడు అజ్ఞాని. ఈ అజ్ఞానముచే అతడు దేవతలకు పశువు వంటివాడు అగును (అన్యోఽసౌ అన్యోఽహం అస్మీతి న స వేద యథా పశురేవం స దేవానామ్). తాను భగవానుని కంటె భిన్నుడనని తలంచువాడు వివిధ సేవలనందించే ఖచ్చితమైన గోవు వంటివాడు అగును. వ్యవసాయ ప్రధానమగు సమాజములో గోవు పాలను ఇచ్చును; ఎద్దులు పొలమును దున్నుటయే గాక, బరువులను మోయుచుండును. వేదకాలములో వ్యవసాయము ప్రధానవృత్తిగా నుండెడిది. ఈ పశువులు మానవులకు సేవ చేసినట్లుగనే, తాము భగవానుని కంటె భిన్నుల మనుకొనే మానవులు కూడా దేవతలకు సేవ చేయుచుందురు. ఇచట దేవతలనగా అగ్ని, ఇంద్రుడు, వరుణుడు మొదలగు వారు. వీరు ఈ దేవతలకు అనేక రకముల హవిస్సులను సమర్పించి సేవ చేసెదరు. తాత్పర్యమేమనగా, వీరు కర్మఠులు. వీరు దేవతలను సంతోషపెట్టి అల్పఫలములను పొందుచుందురు. అంతే. పశువులు కొంత దాణా కొరకై పగలంతా పని చేయును. అటులనే

వీరు కొద్ది పాటి పుణ్యము కొరకై వివిధ యాగాదుల ననుష్ఠిస్తూ, దేవతల చేతిలో కీలు బొమ్మల వలె, పెంపుడు జంతువుల వలె అగుదురు. పెంపుడు జంతువు సర్వదా యజమాని కనుసన్నలలో మెలుగుచుండును గాన, దానిని అధికముగా లాలించి తినిపించెదరు. అటులనే, తమకు సేవను చేయు మానవులకు దేవతలు ఫలములనిచ్చు చుందురు. దీనిలో తప్పేమీ లేదు. కాని ఇది సంసారమనే సమస్యకు పరిష్కారము కాదు.

శ్వేతాశ్వర-ఉపనిషత్తులోని ఒక మంత్రము ఇట్లు చెప్పుచున్నది: ఈ చర్మము (దేహము)నకు బట్టలు తొడిగిన విధంబున ఆకాశమునకు కూడ బట్టలను తొడగగల్గినచో, అపుడు ఆత్మ జ్ఞానము లేకుండగనే దుఃఖము నిర్మూలింపబడును. దీని తాత్పర్యమేమనగా, ఆత్మ జ్ఞానము లేనిదే సంసారమునకు పరిసమాప్తి లేదు. ఇదే విషయమును బృహదారణ్య కోపనిషత్తు అన్వయముఖముగా నిట్లు చెప్పుచున్నది. 'ఈ సత్యము నెరింగిన వాడు ఈ సర్వము అగును (స ఇదం సర్వం భవతి)'.

జ్ఞానము మోక్షమునకు, అజ్ఞానము (అవిద్య) బంధమునకు హేతువులని చెప్పే శ్రుతి వాక్యములు వేలాదిగా గలవని శ్రీ శంకరులిచట వాక్రుచ్చిరి. కావున ఈశ్వరునకు జీవునితో అభేదమును చెప్పగానే, ఈశ్వరుడు సంసారి కాబోడు. సంసారమును తొలగించుటకు ఈ సత్యము చెప్పబడుచున్నది. ఈశ్వరుని సంసారిని చేయుట కొరకు ఈ మాట చెప్పబడుట లేదు. ఈశ్వరుని స్వరూపమగు చైతన్యమేది గలదో, అదియే త్వం పదార్థమని నిరూపించిన తరువాత తత్ త్వం అసి అను వాక్యము జీవేశ్వరుల స్వరూపము నందలి ఐక్యమును ప్రదర్శించును. కావున ఇచట విరోధమేమియూ లేదు. విరోధాభాసలన్నింటికీ సమాధానము జ్ఞాన, అజ్ఞానములయందు గలదు.

శ్రీశంకరులు స్మృతిని కూడ ఉదాహరించిరి. మహర్షులు వేదవచనములను స్మరించి, తదనురూపముగా చేసిన స్వతంత్ర రచనలకు స్మృతులని పేరు. శ్రీశంకరులు గీతలోని 5వ అధ్యాయము నుండి ఒక శ్లోకమును ఉదహరించిరి. ఈ జ్ఞానము (బుద్ధి) అజ్ఞానముచే కప్పబడి యుండుటచే జీవులు మోహితులై దుఃఖముల పాలబడుచున్నారు (అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః).

సర్వమునందు సమముగా విలసిల్లే పరమాత్మ యందు ఎవరి మనస్సు స్థిరముగా నుండునో, వారిచే ఈ సంసారము జయింపబడును (ఇహైవ తైర్జితః సర్గః యేషాం సామ్యే స్థితం మనః). సర్వప్రాణుల యందు సమముగా నుండునది, లేశమైననూ భేదము లేనిది,

సర్వకాలములయందు ఏకరసమైనది, అందువలననే అనంతమైనది అగు తత్త్వమునకు సామ్యమని పేరు. దాని యందు లగ్నమైన మనస్సు గలవారు జ్ఞాననిష్ఠులనబడుదురు.

సర్వత్ర సమమును చూచు వ్యక్తి (సమం పశ్యన్ హి సర్వత్ర) అజ్ఞానకృతమగు ఆత్మ వినాశమును పారద్రోలి, విముక్తుడగునని శ్రీకృష్ణుడు ఇదే అధ్యాయములో తరువాత చెప్పగలడు.

వీటిలో మొదటి స్మృతి వాక్యమును బట్టి అజ్ఞానమే సమస్య అనియు, రెండవస్మృతి వాక్యమును బట్టి జ్ఞానము మోక్షమునిచ్చుననియు స్పష్టమగు చున్నది. ఈ వాక్యములో, జ్ఞాని తనకు తాను వినాశమును కొని దెచ్చుకొనడు (న హినస్తి ఆత్మనాత్మానమ్) అని చెప్పుటచే, ఈ దర్శనము లేనివాడు, అనగా ఈ జ్ఞానము లేనివాడు ఆత్మ వినాశమును కొనిదెచ్చుకొనునని స్పష్టమగుచున్నది.

తరువాత శ్రీ శంకరులీ విషయమును యుక్తి (న్యాయ)తో సమర్థించిరి. దృష్టాంతముతో గూడియున్న ఒక శ్లోకమును అయన మహాభారతము నుండి ఉదహరించిరి. ఈ దృష్టాంతము ఒక వ్యాప్తి లేక న్యాయము (postulate) ను ప్రదర్శించును. ఒకటి ఉన్నచో రెండవది తప్పని సరిగా ఉండుట అనే పరిస్థితిని వ్యాప్తి అందురు. ఉదాహరణకు, దృశ్యమగు వస్తువు ఏదైననూ ఘటమువలె వినాశాధీనమై యుండును అని చెప్పినచో, అది ఒక న్యాయము అగును. ఈ న్యాయమునననుసరించి, దేహము కూడా ఘటవమువలె దృశ్యము గనుక, వినాశమును పొందును అని మనము నిర్ణయించగలము. ఆ మహాభారత శ్లోకము ఇట్లున్నది :

సర్పాన్ కుశాగ్రాణి తథోదపానం జ్ఞాత్వా మనుష్యాః పరివర్జయంతి
అజ్ఞానతస్తత్ర పతంతి కేచిత్ జ్ఞానే ఫలం పశ్య యథా విశిష్టమ్

ఆ స్థలములో పాములు, వాడియగు దర్భముళ్ళు, మరియు గుర్రపుడెక్క (water weed) కు క్రింద నీటి పడియ ఉన్నవి అని ఎరింగిన జనులు దానిని చుట్టి వెళ్లెదరు. కాని కొందరికి ఈ సంగతి తెలియకపోవుటచే, దానిలో కూలబడెదరు. చూడుము. జ్ఞానమునకు గల విశిష్టఫలమును గమనించుము.

ఇచటి తాత్పర్యమేమనగా, జ్ఞానము ఉన్నచో నిన్ను నీవు రక్షించుకొనగలవు. గుర్రపుడెక్క నీటిని కప్పివేసియున్నది అను జ్ఞానము లేనిచో, నీవు ఆ నీటి పడియలో కూలబడెదవు. అనగా ఈ దృష్టాంతములో, జ్ఞానమున్నచో బ్రతికి పోవును; జ్ఞానము లేనిచో మరణించును. అజ్ఞానముచే

వ్యక్తి ఆ నీటిలో మునిగిపోవుట ఎట్లు తథ్యమో, అటులనే మానవుడు సంసారములో చిక్కుకొనును. దేహేంద్రియాదులయందు అహం ప్రత్యయము గల వ్యక్తి అజ్ఞానియనియు, కావుననే రాగద్వేషములకు, క్రోధభయాదులకు వశుడై యుండుననియు మనకు శ్రుతిస్మృతి న్యాయములను బట్టి తెలియుచున్నది. అజ్ఞానియందు ఒంటరితనపు భావన, దుఃఖము, అభద్రత, మరణస్వభావము మరియు అపూర్ణత నిశ్చితముగా నుండును. అజ్ఞాని తన మనస్సులో ఈ నిష్కర్షల నుండి తప్పించుకొనలేడు. పైగా ఈ నిష్కర్షలు రాగద్వేషములను పుష్టిచేసి వాటిని ముందుకు నడిపించును. ఈ రాగద్వేషములను పరిపూర్తి చేయుటకై మానవుడు ఆచరించే కర్మలలో కొన్ని ధర్మములు కాగా, మరికొన్ని అధర్మములై పుణ్యపాపములను సంపాదించి పెట్టును. దేహ భిన్నమగు ఆత్మ గలదని విశ్వసించే ఆస్తికుడు అనుసరించే న్యాయము ఇదియే.

దీనిని విశ్వసించని నాస్తికునకు మనము పుణ్యపాపములు గలవనియు, వాటి వలన జీవునకు పునః పునః జన్మ కలుగుననియు నిరూపించ వలయును. సుఖదుఃఖముల సమస్యలు నాస్తికులకు కూడ అను భవములో నున్నవియే గదా!

రాగద్వేషములు తొలగి పోయినచో మోక్షము లభించునని తార్కికులు కూడ అంగీకరించెదరు. శ్రీ శంకరులు కూడా అదే యుక్తిని వినియోగించుచున్నారు. 'నేను పూర్ణుడను; నా యందు పరిచ్ఛేదము లేమియూ లేవు' అని ఎరింగిన వ్యక్తి యందు రాగద్వేషములు ఎట్లు ఉండగల్గును? రాగద్వేషములు నశించినచో లేదా ప్రభావహీనములైనచో, పుణ్యపాపకర్మల వెనుకబడే ప్రవృత్తి ఉపశమించును. ఉపశమము అను పదము ఈ సందర్భమునకు మిక్కిలి ఉచితమైనది. ప్రజ్వరిల్లుచున్న అగ్ని ఇంధనము ఖర్చుకాగానే ఏమగును? ఉపశమించును. వేడి కొద్ది సేపు మిగిలి యుండవచ్చును. అదియే ప్రారబ్ధకర్మమనబడును. ఆత్మ పూర్ణము అను జ్ఞానము కలుగగానే వివిధ అన్వేషణలకు ఇంధనముగా పనిచేసే రాగద్వేషములు నశించును. ఆ అన్వేషణలు ఉపశమించును. అట్టి వ్యక్తి ముక్తుడగును. ఎవరైననూ దీనిని యుక్తి పూర్వకముగా నిరాకరించజాలరు.

అజ్ఞానము యొక్క ప్రభావమును వివరించుటకు శ్రీ శంకరులు ఒక దృష్టాంతమునిచ్చిరి. చెట్టు మోడును చూచి ఒకడు మనిషియని భ్రమపడినాడను కొనుడు. ఆ భ్రమ ఉన్నంతవరకు భయము ఉండును. ఆ మనిషి చోరుడని అతడు భావించును. అదే విధముగా స్థూలదేహము, మనస్సు మరియు ఇంద్రియముల ధర్మములను ఆత్మపై ఆరోపించి మానవుడు సంసారియగును.

ఆత్మ, అనాత్మల మధ్యలో అధ్యాస గలదు అని నిరూపించుట కొరకై ఈయబడిన, చెట్టు మోడును చూచి మనిషి అని భ్రమపడే దృష్టాంతముపై ప్రతి పక్షి ఇపుడు ఒక అభ్యంతరమును లేవనెత్తును. ఈ దృష్టాంతవము సరిగాదు. ఆత్మకు, దేహమునకు మధ్యగల అధ్యాస (superimposition), చెట్టు మోడునకు మనిషికి మధ్య గల అధ్యాస ఒకటి కాదు. దృష్టాంతములో మోడు, మనిషి అనునవి రెండు ఇంద్రియగోచరములే. మోడును గాని, మనిషిని గాని చూచి ఆత్మ అని భ్రమపడే అవకాశము లేదు. జ్ఞానసాధనము (ఇంద్రియము) లో ఏదో ఒక దోషము ఉండుటచే మనకు ఒక వస్తువు నందు అచట లేని మరియొక వస్తువు భాసించును (అతస్మిన్ తద్బుద్ధిః). ఇదియే అధ్యాస నిర్వచనము. ఆత్మ-అనాత్మల మధ్యగల అధ్యాసకు అనాత్మ - అనాత్మల మధ్య నుండే అధ్యాసను దృష్టాంతముగా నిచ్చుట సరిగాదు. ఏలయన, తనకంటె భిన్నమగు వస్తువు నందు తాను అనే అధ్యాస ఎవ్వరికైననూ కలుగదు. చెట్టు మోడును చూచి నేను అనే భ్రమ ఎవ్వరికైననూ కలుగదు గదా! కాని ఇట్టి నియమమేదియూ అధ్యాసలో లేదని శ్రీ శంకరులు సూత్ర భాష్య ఉపోద్ఘాతములో నిరూపించిరి. ఏ వస్తువును చూచియైననూ, దేనినైననూ దాని యందు ఆరోపించవచ్చును. అజ్ఞాన స్వరూపము అట్టిది. అది దేనినైననూ దేని నుండియైననూ సృష్టించగలదు.

స్థూలత్వము ఇత్యాదులు దేహధర్మములే అయినా, తెలియబడుచున్నవి గనుక, జ్ఞాతయొక్క ధర్మములగునని ప్రతిపక్షి వాదించును. మోడు - మనిషి దృష్టాంతములో ఆ రెండు అనాత్మలే. కాని ప్రస్తుతంలో ఒకటి అనాత్మ కాగా, రెండవది ఆత్మ. కావున స్థూలదేహధర్మములు నా ధర్మములే యని తలంచుటలో భ్రాంతిలేదు. పైగా ఇది ఒక సత్యమును గుర్తించుట మాత్రమే. సంయోగము ( కలయిక) చే దేహధర్మములను జ్ఞాత స్వీయ ధర్మములుగా స్వీకరించును. మేఘము నుండి ఆవిర్భవించిన నీరు శుద్ధముగ నుండును. కాని నేలపై పడుసరికి సంయోగము వలన మలిన మగును. పుష్పములను గ్రుచ్చిన దారమునకు సుగంధము కలుగును. దీనికి కారణము సంయోగమే గాని అధ్యాస గాదు. అదే విధముగా, ఇచట కూడా జీవాత్మ దేహము కంటె భిన్నమైనదియే అయినా, దేహముతో కలయికను పొంది, జరామరణాది దేహధర్మములను తనవిగా చేసుకొనును. ఈ వాదములోని సారమేమనగా, జరామరణములు దేహమునకు చెందినవియే అయినా, జీవుడు సంయోగముచే ఈ ధర్మములనన్నిటినీ తనవిగా చేసుకొనును. దీనిని బట్టి సంసారిత్వమునకు వశమై ఉండే దేహముతోడి సంయోగము వలన ఆత్మ సంసారియని స్పష్టమగుచున్నది. ఆత్మ సంసారియైనచో, ఈశ్వరునితో అభేదము పొసగదు. కావున మరణించిన తరువాత పుణ్యలోకమును పొందుటకై ఈశ్వరుని కృప అవశ్యకమగును. ఇదియే మోక్షమనే ధారణతో శాస్త్రమును చదివినచో, ఆ చదువు పూర్తి విలక్షణముగా నుండును. ప్రతి పక్షి

వాదమునకు, సిద్ధాంతమునకు పెద్ద భేదము లేదని కొన్ని సందర్భములలో అనిపించినమా, ఆ భేదమును సమగ్రముగా తెలియుట చాల అవశ్యకము. అట్లు తెలియనిచో, మోక్ష స్వరూపము యొక్క ధారణ భిన్నముగా నుండి దానికొరకు చేయదగిన సాధన కూడ మారిపోవును.

నైయాయికులు ఇట్లు వాదింతురు. వారి దృష్టిలో ఆత్మ కర్త మరియు భోక్త. ఆత్మ అసంగమని సాంఖ్యులు చెప్పెదరు. కాని వారు ఆత్మయందు భోక్తృత్వము నారోపించెదరు. మీమాంసకుల దృష్టిలో సర్వము కర్మపై కేంద్రితమై యుండును గాన, ఆత్మ సర్వదా కర్త అని వారి అభిప్రాయము.

ఇచట ముందుగా శ్రీ శంకరులు ప్రతిపక్షికి సంక్షేపముగా సమాధానము నిచ్చు చున్నారు: ఈ వాదము సరిగాదు. ఏలయన, దీనిని అంగీకరించినచో, చైతన్యాభావము అనే అవాంఛిత పరిణామము సంప్రాప్తమగును. శ్రీ శంకరులు దీనిని ఇట్లు వివరించిరి: మృతదేహము జడము అనే సత్యము నుండి దేహము జడము అని మనము ఊహించవచ్చును. దేహసంయోగముచే ఆత్మకు దేహధర్మములు సంక్రమించునన్నచో, ఆత్మ దేహసంయోగముచే జడము అగును. ఆత్మ జడమైనచో, దానికి మోక్షముతో పని ఉండదు. ఆత్మ జడమైనచో, ప్రత్యక్షముగాని, అనుమానముగాని సంభవము కావు గనుక, జగత్తు ఆత్మకు అనుభవమునకు రాదు. జగదనుభవము లేనిచో, సంసారము లేదు. కాని ఈ నిర్ణయము ప్రతిపక్షి అనుభవమునకు కూడ పూర్తిగా విరుద్ధమైనది. ప్రతిపక్షి చేతనుడు గనుకనే, ఇట్టి వాదములను ప్రస్తుతించ గల్గుచున్నాడు గదా! అదే విధముగా, దేహధర్మములను ఆత్మ తనవిగా చేసుకునే పక్షములో ఆత్మ కూడా అనిత్యమగును. అనగా ఆత్మలో వికారము కలుగును. అంటే, మోక్షము సంభవము కాదు. పైగా, ఆ స్థితిలో ఆత్మానాత్మ వివేకము అసంభవమగును. మనము ఇపుడు దేహముతో వ్యవహరించు తీరులో అపుడు వ్యవహరించుట సంభవము కాకుండును. మనము దేహము దృశ్యవస్తువు అను తీరుతో వ్యవహరించు చున్నాము. దేహాత్మల మధ్య ఇట్టి దృశ్య-దృక్ సంబంధము అపుడు అసంభవమగును. ఇది కూడా మన అనుభవమునకు విరుద్ధమే. ఆత్మ సాక్షి, చేతనము, అద్వయము మరియు గుణ వినిర్ముక్తము (సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ) అను శాస్త్రమునకు కూడ ఈ వాదము విరుద్ధమే యగును.

ఇంకొకరు ఇట్లు వాదించవచ్చును: క్షేత్రధర్మముల నన్నిటినీ ఆత్మ తనవిగా చేసుకొనదు. కొన్ని ఆత్మకు నైసర్గిక గుణములు కాగా, మరికొన్ని ఆత్మయందు అధ్యారోపము చేయబడును. ఆత్మను గురించి మనకు తెలిసిన, కొన్ని వివాదాంశములు కాని సత్యములను నిరూపించుటకై ఇట్లు చెప్పక తప్పదు. ఆత్మ చేతనము గనుక, దేహధర్మమగు జడత్వమును స్వీకరించదని చెప్పక

తప్పదు. సుఖదుఃఖములు, భ్రాంతి, ఇష్టానిష్టములు మొదలగునవి కూడా ఆత్మయొక్క సహజ గుణములని చెప్పవలసి యుండును. ఇవి మనస్సు యొక్క వివిధ దశలు మాత్రమేనని మనకు అనుభవములోనున్ననూ, ఇవి అధ్యారోపితములని ఈ వాది స్వీకరించుట లేదు. ఏలయన, ఈతని దృష్టిలో ఆత్మ సంసారియే గనుక, ఇవి ఆత్మయొక్క సహజగుణములే యగును. కాని దేహభిన్నమగు ఆత్మను అంగీకరించే ఈ వాది దృష్టిలో, 'నేను స్థూలుడను, నేను వృద్ధుడను' ఇత్యాది ధారణలు అజ్ఞానకృతములగును. ఈ వాదములోని సారమేమనగా ఆత్మ సంసారి. కాని ఆత్మ స్థూలదేహము కంటె భిన్నమగుటచే, దేహము మరణించిననూ ఆత్మ నశించదు.

శ్రీశంకరులిపుడు ఈ వాదమునకు ప్రత్యుత్తరము నిచ్చుచున్నారు. స్థూలత్వము, జరామరణములు ఇత్యాది కొన్ని దేహధర్మములు మాత్రమే ఆత్మయందు అధ్యారోపము చేయబడుననియు, సుఖదుఃఖాది ఇతర ధర్మములు అధ్యారోపములు కాదనియు చెప్పుటకు ఒక ప్రత్యేక హేతువును చూపవలసియుండును.

శ్రీశంకరుల సిద్ధాంతములోని మొదటి యుక్తి ఏమనగా – క్షేత్రధర్మము క్షేత్రమునకు చెందునే గాని, క్షేత్రమును తెలుసుకునే క్షేత్రజ్ఞునకు కాదు. సూత్రభాష్య ఆరంభవాక్యములోనే శ్రీశంకరులు ఈ విషయమును స్పష్టము జేసిరి. విషయము విషయి పరస్పర విరుద్ధములు గనుక, వాటి మధ్యలో ఎటువంటి సంయోగమైననూ సంభవము కాదు. విషయి చేతనము, జ్ఞాత. విషయము జ్ఞానగోచరము, మరియు జడము. విషయి స్వయంప్రకాశము; విషయము ప్రమాణ గమ్యము. ఒకటి ప్రకాశకము, రెండవది ప్రకాశ్యము. వీటి మధ్య సంయోగమునకు అవకాశమే లేదు. కాని అవిద్యాప్రభావముచే సంయోగము ఉన్నట్లు కానవచ్చును. మృత్యువు ఇత్యాది కొన్ని ధర్మములు క్షేత్రజ్ఞునిపై అధ్యారోపితములనియు, దుఃఖాది ఇతర ధర్మములు క్షేత్రజ్ఞునకు సహజములనియు చెప్పుటలో హేతువు లేదు. ఈ వాదములో దోషము గలదు. గ్రుడ్డులో ఒక సగము తినుటకు, మరియొక సగము పొదుగుటకు అని చెప్పినట్లు(అర్ధాండన్యాయము) ఉన్నది. ప్రతి వాది యొక్క వాదమునే వానికి అన్వయించి, ఈ ద్వివిధ ధర్మములు అజ్ఞానముచేతనే అధ్యారోపితములైనవని నిరూపించి, శ్రీశంకరులీ వాదమును త్రోసిపుచ్చిరి.

రెండవ యుక్తి ఏమనగా, సహజధర్మమును దేనినీ పరిత్యజించుట సంభవము కాదు. ఆత్మ స్వరూపము చైతన్యము. దానిని విడిచి పెట్టి నీవు ఒకప్పుడు చేతనుడుగను, మరియొకప్పుడు అచేతనుడుగను కాగలవా? అసంభవము. కాని నీవు నీవుగా ఉండగనే సుఖదుఃఖములు వచ్చి పోవుచుండును. కావున అవి ఆత్మకు స్వరూప భూతమైన ధర్మములు కావని స్పష్టమగుచున్నది.

పైగా, అవి ఆత్మ స్వరూపమునకు విరుద్ధములు. ఒకే వస్తువు యొక్క స్వరూపము నందు రెండు పరస్పర విరుద్ధ ధర్మములు ఉండుట సంభవము కాదు. ఆత్మ సుఖస్వరూపమైనచో, ఆత్మయందు దుఃఖము ఉండుట సంభవము కాదు. మరియు, నేను నేనై ఉండగా సుఖదుఃఖములు వచ్చి వెళ్లినచో, వాటిలో ఏ ఒక్కటియైననూ నాకు చెందినది కాజాలదు. నేను ఒక కాలములో తెలివిగా నుండెదను. మరియొక కాలములో కలను గనుచుందును. ఇంకో కాలములో గాఢ నిద్రలో నుండెదను. కావున నేను జాగ్రత్స్వప్న సుషుప్తులకు అభిమానిని కాజాలను. ఈ మూడు అవస్థలలో అనువృత్తమయ్యే నేను అవికారిని అగుదును. అదే విధముగా, ప్రస్తుతములో నేను సుఖిని గాను, దుఃఖిని గాను. ఆ రెండు అవస్థలలో అంతర్నిహితముగా నుండే చైతన్యము నేనే. సుఖ వృత్తి ఆత్మధర్మము కాదు. కాని సుఖములో ఆత్మ గలదు. అటులనే దుఃఖములో ఆత్మ గలదు. ఆత్మ లేనిదే సుఖదుఃఖ వృత్తులు లేవు. అయిననూ, వృత్తులు వచ్చి పోవుచుండగా, ఆత్మ వాటినుండి విముక్తమై యుండును. వాటిని ఆత్మ త్యజించనూ గలదు; మరియు స్వీకరించనూ గలదు. ఆత్మ యందు అవి అధ్యారోపితములని చెప్పుటకు గల కారణములలో ఇది ఒకటి. ఉదాహరణకు, కామన ఆత్మ ధర్మమను కొనుడు. అపుడు ఒకే ఒక విశిష్టకామనను కలిగియుండుట గాని, లేక ఒక కామనను విడిచి పెట్టుట గాని సంభవము కాదు. అప్పుడు అస్పష్ట-నిర్విశేష-శాశ్వత-కామన ఒకే ఒకటి ఉండును. దానిని తీర్చుకొనుటయూ అసంభవమగును. కామన వస్తువుపై కేంద్రితమై యుండునని మనము ఎరుంగుదుము. కామనలో విషయమగు ఆ వస్తువు లభించు వరకు ఆ కామన ఉండును. లేదా, నేను దానికి పూర్తిగా అతీతుడనై ఎదిగినచో, ఆ కామన తొలగిపోవును. అనగా అది ఒక కాలములో పుట్టి మరియొక కాలములో అంతర్ధానము చెందును. 'నేను కామిని' అను ధారణ అవిద్య నుండి పుట్టును. ఏలయన, కామన క్షేత్రధర్మమే గాని, ఆత్మధర్మము కాదు. అది ఆత్మధర్మమైనచో, ఆత్మరూపమే యగును గనుక, దానిని బయట నుండి పొందుట గాని విడిచి పెట్టుట గాని సంభవము కాకుండును. నన్ను నేను స్వీకరించుట యెట్లు? విడిచి పెట్టుట యెట్లు?

కావున దృశ్యజగద్రూపముగా ఉపలభ్యమగునది, కర్తృత్వభోక్తృత్వ లక్షణ విశిష్టమైనది అగు సంసారము అజ్ఞానముచే ఆత్మ యందు ఆరోపించ బడినదనియు, కావున ఆత్మ దానిచే దూషితము కాదనియు శ్రీశంకరులు నిర్ణయించిరి. నీవు కర్తవై ఉన్నంతవరకు కర్మను చేయు చుందువు. దానివలన కర్మఫలము, దానిని బట్టి భోగము ఉండును. ఇవి క్షేత్రమునకు సంబంధించినవి మాత్రమే అయినా, అవిద్యచే సాక్షిచైతన్యమగు ఆత్మ యందు ఆరోపించబడుచున్నవి. ఒక దానిపై అధ్యారోపము చేయబడిన ఇతరము దానికి లాభమును గాని, నష్టమును గాని చేకూర్చులేదు. ముత్యపు చిప్పను చూచి వెండియని భ్రాంతి పడినవాడు ధనికుడు కాబోడు.

త్రాడును చూచి పాము అని భ్రాంతి పడిన వ్యక్తిని ఆ త్రాడు కరవదు. ముత్యపు చిప్ప యందు గాని, త్రాడునందు గాని కేవలము ఈ భ్రాంతుల మూలకముగా మార్పులేమియు రావు. అదే తీరున, సుఖదుఃఖాది క్షేత్రధర్మములను ఆత్మపై అధ్యారోపము చేయుట వలన ఆత్మ సంసారి కాబోదు. ఆత్మ సంసార వినిర్ముక్తముగనే యుండును. కావున ఆత్మయే ఈశ్వరుడు. అందువలననే, 'ఓ అర్జునా! క్షేత్రములన్నిటి యందు గల క్షేత్రజ్ఞుడను నేనే యని యెరుంగుము' అని శ్రీకృష్ణభగవానుడు ఇచట చెప్పుచున్నాడు.

దేహము నశించిననూ ఆత్మ నశించదనియు, కాని ఆత్మ ఈశ్వరునితో అభిన్నము కాదనియు, ఆత్మ సంసారి అనియు విశ్వసించు వ్యక్తిని ఉద్దేశించి ఈ మాట చెప్పబడినది. విశిష్టాద్వైతులు, హరేకృష్ణ అనుయాయులు, క్రిస్టియన్లు మొదలగు ద్వైతులందరు ఈ కోవకు చెందినవారే. వారు తమ కంటె భిన్నమగు దైవమును విశ్వసించెదరు. దేహము నశించిననూ ఆత్మ మిగిలియే యుండునని వారు అంగీకరింతురు. ఈశ్వరుడే ఆత్మ అని అంగీకరించని వారందరు ద్వైతులే యగుదురు. బౌద్ధులు, శూన్యవాదులు కూడ ద్వైతులే. సర్వమునకు అధిష్ఠానము శూన్యము (ఉనికి లేకుండుట) అని శూన్యవాదులు చెప్పెదరు. శూన్యత్వమును నిరూపించుట అసంభవము. కాన వారు మిథ్య అని చెప్పే సర్వము సత్యమగును. సత్తామీమాంసననుసరించి మిథ్యావస్తువు భాసించుటకు సత్యవస్తువు అధిష్ఠానముగా ఉండి తీరవలెను. మనము అనుభవించే జగత్తు మిథ్యయైనచో, దానికి అధిష్ఠానమగు సత్యతత్త్వము శూన్యమైనచో, మిథ్యకు ఆధారము లేదని తేలును. అనగా మిథ్య లేకుండును. అనగా జగత్తు ఏ ద్వైతరూపములో దర్శనమిచ్చు చున్నదో, అదియే సత్యమగును. పైగా, శూన్యము ఒక తత్త్వమని నిరూపించుట సంభవము కాదు.

మరణము ఇత్యాది ధర్మములు ఆత్మయందు అవిద్యచే ఆరోపించబడిననూ, సుఖదుఃఖాది ఇతరధర్మములు క్షేత్రజ్ఞుని సహజధర్మములని నిరూపించినచో, ఆత్మ సంసారియని నిరూపించబడును. అట్లు గానిచో, ఆత్మ నిర్గుణమై ఈశ్వర స్వరూపము కంటె అభిన్నముగా నుండును. శ్రీ శంకరులు చెప్పినట్లుగా, మరణ భావన ఆత్మపై ఆరోపించబడుటకు, సుఖదుఃఖాదులు అట్లు కాక పోవుటకు తగినంత హేతువు కానరాదు. పైగా సుఖదుఃఖములు ఆత్మకు సహజధర్మములైనచో, వాటిని స్వీకరించుట గాని, పరిత్యజించుట గాని సంభవము కాకుండును. కావున అవి సహజధర్మములు గావు. పైగా, అవి పరస్పర విరుద్ధములగు ద్వంద్వము గనుక, ఒకే అధికరణమునందు నివసించజాలవు. ఉదాహరణకు 'నిలబడి ఉండి వాడు వెళ్లుచున్నాడు

(తిష్ఠన్ గచ్ఛతి)' అని చెప్పుట సంభవము గాదు. వ్యక్తి నిలబడి యుండును; లేదా, నడుచుచుండును. ఏకకాలములో ఆ రెండు పనులను చేయజాలడు. అదే విధముగా, సుఖదుఃఖములు పరస్పర విరుద్ధములు గనుక, సుఖము ఉన్నచో, దుఃఖము ఉండజాలదు. ఒకటి ఉన్నచో, రెండవది ఉండలేదు గనుక, అవి వచ్చి పోవుచుండును. ఇట్టి స్థితిలో, అవి ఆత్మ యొక్క సహజ ధర్మములు కాజాలవు. ఏలయన, సహజ ధర్మమును విడిచి పెట్టుట అసంభవము. సుఖదుఃఖములు మారుచుండును గనుక, ఆత్మ ఆ రెండింటి నుండియూ వినిర్ముక్తము.

సంసారములో పునర్జన్మ కూడా ఒక భాగము. స్వర్గమునకు పోవుట కూడా పునర్జన్మయే. కర్తృత్వ భోక్తృత్వ లక్షణ విశిష్టమగు ఈ సంసారము క్షేత్రజ్ఞునిపై ఆరోపించబడినది. అధ్యారోపము బుద్ధిపూర్వకము కాని సందర్భములో అవిద్యా కృతము అగును. సాలగ్రామ శిలయందు భగవానుని అర్చించుట, ఒక పతాకము నందు రాజ్యాంగము నంతనూ ఆరోపించుట అనునవి బుద్ధిపూర్వకముగా చేయు అధ్యారోపములు. కావున ఈ అధ్యారోపము అజ్ఞానకృతమని చెప్పక తప్పదు. ఇది కేవల అధ్యారోపము మాత్రమే గనుక, ఆత్మ యందు వికారము ఉండదు. ఆత్మ చైతన్య స్వరూపముగనే ఉండును. బాలురు ఆకాశము నందు నీలవర్ణమును దర్శించెదరు. కాని ఆకాశమునకు వాస్తవముగా రంగు లేదు.

ఈ నిర్ణయమును ఆధారముగా చేసుకొని, శ్రీశంకరులు మరియొక ప్రతిపాదనను చేయుచున్నారు. దీనిని బట్టి క్షేత్రములన్నింటిలో క్షేత్రజ్ఞరూపములో భగవానుడే ఉన్నాడు. ప్రత్యగాత్మ జగత్కారణమగు ఈశ్వరుని కంటె భిన్నము కాదు. ఏలయన, క్షేత్రజ్ఞ-ఈశ్వరుల లక్ష్యార్థము ఏకైక-పరం బ్రహ్మ.

క్షేత్రజ్ఞుడై యున్న ఈశ్వరునకు లేశమైననూ (గంధమాత్ర) సంసారము లేదని శ్రీ శంకరులు వివరించిరి. ఈ 'గంధమాత్ర' అను పదము చాల సుందరమైనది. నీవు మురికి వాడ మధ్యలో నున్న ప్రాసాదములో నివసించు చున్నచో, గృహము నిర్మలముగా నున్ననూ, మురికి వాడ నుండి వచ్చే దుర్గంధము ప్రాసాదములో సర్వత్రా వ్యాపించును. కాని ఇచట అంతః కరణ సారమగు ఆత్మ సర్వమనోవృత్తుల స్వరూపమై అంతఃకరణములో విరాజిల్లు చున్నది. అయిననూ, క్షేత్రజ్ఞ-ఆత్మయందు సంసారిత్వము యొక్క గంధమాత్రమైననూ లేదు. కావున, క్షేత్రజ్ఞుడే ఈశ్వరుడని నిరూపించుట సంభవమగు చున్నది.

చెట్టు మోదును చూచి మనిషి యనుకొనుట, ఆత్మ యందు అనాత్మ-అధ్యారోపమునకు

సరియగు దృష్టాంతము కాదనే అభ్యంతరమునకు బదులిడుతూ, శ్రీశంకరులు తన సమాధానములో నిట్లు చెప్పుచున్నారు: ఈ అభ్యంతరము సరిగాదు. ఏలయన, దృష్టాంతమును చెప్పే సందర్భములన్నింటిలో చెప్పువాని వివక్షననుసరించి సమానధర్మములను స్వీకరించవలెను. గవయమృగము గోవును పోలియుండును. గవయమృగము తారసిల్లినపుడు నీవు దానిని గుర్తుపట్టవలెనని నా ఆకాంక్ష. కావున గవయమునకు, గోవునకు గల సామాన్యలక్షణముల వైపునకు నీ దృష్టిని నేను సావధానము చేయగోరుచున్నాను. గోవుతో భేదలేశమైననూ లేని జంతువు కొరకు నీవు అన్వేషించవలెనని నేను కోరుట లేదు. అట్టి అభేదమే ఉన్నచో, ఒకే మృగమునకు రెండు పేర్లు గలవని చెప్పవలసి యుండును. పోలిక (దృష్టాంతము) పోల్చబడే దానిని (దార్ష్టాంతిక) కొన్ని అంశములలో మాత్రమే పోలియుండును. కావున ఆ రెండింటి మధ్య గల సామాన్యాంశము (సాధర్మ్యము)ను మనము కనిపెట్టవలెను. చెట్టు మోడుపై మనుష్యుని ఆరోపించిన విధంబున, క్షేత్రధర్మములు క్షేత్రజ్ఞునిపై ఆరోపించ బడుచున్నవని నేను చెప్పినాను. ఈ రెండింటిలో ఇట్టి భ్రాంతికి కారణమగు సామాన్యధర్మమును మనము నిర్ణయించవలెను. దృష్టాంతము ఏదైనా ఒక విశిష్ట అంశమునకు మాత్రమే వర్తించును. రెండింటి మధ్య పూర్ణ సామ్యము ఉన్నచో, అది దృష్టాంతము గాక, ఐక్యస్థాపన మగును. దృష్టాంతము నుండి ఒక నిష్కర్షను స్వీకరించి దానిని దార్ష్టాంతికమునకు అన్వయించవలెను. చెట్టు మోడును చూచి అజ్ఞానముచే మనము దానిపై మనుష్యుని ఆరోపించు చున్నాము. ఎదుట నున్న వస్తువును సరిగా చూడలేక పోవుటచే, దానియందు మరియొక వస్తువును చూచుట సంభవించినది. అటులనే ప్రకృతములో కూడా, ఆత్మ స్వరూపతః ఈశ్వరాభిన్నమనే గుర్తింపు లేదు. అట్టి స్థితిలో దేహేంద్రియమనస్సుల ధర్మములన్నియు ఆత్మపై అధ్యారోపము చేయబడుచున్నవి. అధ్యారోపమునకు అజ్ఞానము హేతువు అను విషయమును బోధించుటకు మాత్రమే దృష్టాంతము ఉద్దేశింప బడినది. ఆ అంశములో దృష్టాంత దార్ష్టాంతికముల మధ్య విరోధము లేదు. జ్ఞాత అను అంశములో వాటి మధ్య విరోధము గలదన్నచో, అనగా జ్ఞాతయగు ఆత్మపై అధ్యారోపమునకు, జ్ఞేయమగు చెట్టు మోడుపై అధ్యారోపమునకు సాధర్మ్యము లేదన్నచో, శ్రీశంకరులు తత్పూర్వము నందు తాను చెప్పియున్న యుక్తిని గుర్తుచేయుచున్నారు. వృద్ధాప్యము మొదలగు దేహధర్మములను అధ్యారోపము చేసిన దానికి, మనోధర్మములగు సుఖదుఃఖాదులను ఆత్మపై అధ్యారోపము చేసిన దానికి భేదము లేదు. ఏలయన, ఈ రెండు అధ్యారోపములు అజ్ఞాన మూలకములే.

అధ్యారోపము కళ్లముందు కనబడే వస్తువునకు మాత్రమే సీమితమై యుండుననే నియమము ఏదియూ లేదని శ్రీశంకరులు అధ్యాస భాష్యములో నిరూపించి యున్నారు. వస్తువు ప్రకాశించుచున్నచో, అజ్ఞానము ఉన్నచో భ్రాంతికి ఈ లక్షణములు చాలును. ఆత్మ స్వయం

ప్రకాశము. నేను ఉన్నాను అని తెలియుటకు బాహ్యప్రమాణములతో పనిలేదు. నాకు ఈశ్వరునితో గల అభేదమును నేను ఎరుంగనిచో, అధ్యాసకు కావలసిన సామగ్రి పూర్తిగా ఉన్నది. కావున రెండు దృశ్యముల మధ్య మాత్రమే భ్రాంతికి అవకాశము గలదనియు, ద్రష్ట-దృశ్యముల మధ్య ఇతరేతరాధ్యాస సంభవము కాదనియు చెప్పే వాదనము పునః పరిశీలించవదగును.

సంసారము అజ్ఞానముచే ఆత్మ యందు అధ్యారోపితమగునని శాస్త్రము చెప్పుచున్నది. ఈ అజ్ఞానము ఎవరికి చెందియున్నది? మనమింతవరకు చేసిన విచారమును బట్టి, అజ్ఞానము ఆత్మకు చెందియుండును. ఆత్మాశ్రయమగు అవిద్యను అంగీకరించినచో, ఆత్మ సంసారి అనే స్థాయిని పొందును. అజ్ఞానమే సంసారము కాదు. అజ్ఞానము సంసార కారణము. కావున అజ్ఞానము కార్యమగు సంసారమునకు ఆశ్రయము కాజాలదు. ఇక మిగిలినది ఆత్మ. అదియే అజ్ఞానాశ్రయము అగును. కావున, ఆత్మ అజ్ఞానాశ్రయమైనచో, అజ్ఞానకార్యమగు సంసారిత్వము కూడా ఆత్మ యందే ఉండును. అజ్ఞానము మాత్రమే గాక, అంతఃకరణముతో సహా సర్వ సృష్టి ఆత్మ యందే ఉండును. తమః ప్రధానమగు మనస్సు యొక్క అవస్థా విశేషమే అజ్ఞానమని శ్రీశంకరులు వివరించిరి. తమో గుణమునకు ఆవరణ శక్తి గలదు. అది వస్తు స్వరూపము కానరాకుండా (అగ్రహణ) చేసి, దాని గురించి సంశయమును సృష్టించి, ఆ వస్తువు నందు మరియొక వస్తువును చూచునట్లు (విపరీత) చేయును. చెట్టు మోడును గుర్తించుటకు ముందు దాని జ్ఞానము లేదు. దానిని చూడగానే, ఇది మోడా? మనిషా? అను సంశయము కలిగి, అది మనిషియే యను భ్రాంతి పూర్వక నిర్ణయముతో అంతమగును. ఇది అంతా అజ్ఞానముచే కలిగినది. ఇదే విధముగా ఆత్మ బ్రహ్మ యగునా? కాదా? యను సందేహము గలదు. బ్రహ్మ కాదన్నచో, అది అగ్రహణమగును. వివేక జ్ఞానము ఉన్నచోట అజ్ఞానము ఉండదు. చీకటి – వెలుతురుల వలె అవి పరస్పర విరుద్ధములు. ఈ వివేకము ప్రమాణ జన్యవృత్తి రూపములో అంతః కరణము నందు మాత్రమే ఉదయించి, అజ్ఞానమును నశింప జేయును. శ్రీశంకరులు ఒక దృష్టాంతము నిచ్చిరి. వస్తువును చూచుట, తప్పుగా చూచుట, మరియు చూడక పోవుట అను మూడు లక్షణములు కంటి యందు ఉండుటకు అవకాశము గలదు. శుక్లదోషము (cataract) చే చూపు పూర్తిగా పోయినచో, చంద్రుడు కానరాడు. చూపు మందగించినచో, ఒకే చంద్రుడు రెండుగా కానవచ్చును. శుక్లదోషము నివారింపబడి, ఇతర దోషము లేమియూ లేనిచో, చంద్ర స్వరూపము యథాతథముగా దర్శింపబడును. అదే విధముగా, కంటిలో శుక్లమువలె, అంతః కరణములో ఈ తామస- ప్రత్యయరూపములో అజ్ఞానము గలదు. కన్ను ఎట్లు జ్ఞానసాధనమో, మనస్సు కూడ అటులనే. మనస్సులో ఆవరణ దోషమున్నచో, ఆత్మ సరిగా గుర్తింపబడదు. ఆత్మ స్వయం

ప్రకాశము గనుక, 'నేను ఉన్నాను' అని తెలియుచుండును. దీనికి ఇతర ప్రమాణములతో పనిలేదు. ఈ జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడేది కాదు. కాని ఆత్మ బ్రహ్మయే యని ఎరుంగనిచో, దేహేంద్రియమనస్సంఘాతము నందు ఆత్మభ్రాంతి అనివార్యమగును. అన్వయముఖముగా చెప్పాలంటే, వివేకజ్ఞానము ఉన్నచోట అజ్ఞానము లేదు. వ్యతిరేకముఖముగా చెప్పాలంటే, వివేకజ్ఞానము లేనిచో, ఆవరణ దోషము ఉండి తీరును.

ప్రతివాదికి ఈ ప్రసంగములో ఒక యుక్తి చిక్కినది. అది యేదనగా, అజ్ఞానము క్షేత్రజ్ఞ ధర్మము గనుక, క్షేత్రజ్ఞుడు సంసారియగును. కావున క్షేత్రజ్ఞునకు అసంసారియగు ఈశ్వరునితో అభేదము పొసగదు. ఈ వాదమును శ్రీశంకరులు తిరస్కరించిరి. శుక్లదోషము కన్ను అనే కరణము (instrument) నందు మాత్రమే గలదు. అనగా దోషమును తొలగించుటకై కంటికి శస్త్రచికిత్సను చేయవచ్చును; జ్ఞాతకు కాదు.

చూడలేకపోవుట, చూచిననూ తప్పుగా చూచుట అను దోషము కంటి యందు గలదు. ద్రష్టయగు ఆత్మ యందు కాదు. భ్రాంతి జ్ఞానములో ద్రష్టకూడా అంతర్గతుడే. అయిననూ, ఇది సాక్షాత్తుగా ద్రష్టృధర్మము కాదు. చికిత్స ద్వారా కంటిలోని దోషములను నివారించిన తరువాత భ్రాంతి జ్ఞానము ఇత్యాదులు దూరమగును. కావున సమస్య ఉన్నది కరణములోననే గాని, ద్రష్టయందు గాదు. కావున, అన్ని సందర్భములలో, చూడలేకపోవుట, సంశయము మరియు తప్పుగా చూచుట అనునవి కరణగత దోషముచే కలుగుచున్నవి.

మరియు ఈ భ్రాంతి జ్ఞానములు మరియు అజ్ఞానము జ్ఞానవిషయములగు చున్నవి గనుక, జ్ఞాతృధర్మములు కాజాలవు. 'ఆత్మ బ్రహ్మ భిన్నమని నీకు తెలియునా?' అని నేను ప్రశ్నిస్తే, 'నాకు తెలియదు' అని నీవు బదులిడెదవు. ఈ సత్యము యొక్క అజ్ఞానము నీకు విదితమే గదా! సుఖదుఃఖములు, కర్తృత్వభోక్తృత్వములు మరియు ఆత్మను గురించి వివిధ సంశయములు కూడ నీకు విదితములగు చుండును. వాటి మూలకముగనే నిన్ను నీవు సంసారి యని నిర్ణయించు కొంటివి. అవి అన్నియు దీపకాంతివలె జ్ఞానములో విషయములగు చున్నవి. శ్రీ శంకరులు ఘటమునకు బదులుగా దీపమును దృష్టాంతముగా నిచ్చుటలో విశేషము గలదు. దీపము కూడ ఇంద్రియముల వలె, మనస్సువలె వస్తువులను ప్రకాశింపజేయు కరణము. ఘటమును ప్రకాశింపజేయు దీపము జ్ఞేయమే గదా! అటులనే రూపమును ప్రకాశింపజేయు కన్ను, శబ్ద జ్ఞానమునకు హేతువగు చెవి కూడ జ్ఞేయములే. అవి వస్తువును ప్రకాశింపజేయగల కరణములు. అయిననూ, అవి జ్ఞాతచేత తెలియబడు చున్నవి గనుక, జ్ఞాతృధర్మములు కాజాలవు. జ్ఞాత వివిధ

వస్తువులను తెలియుటలో మనస్సు, ఇంద్రియములు ప్రమాణములగు చున్ననూ, అవి కూడా ప్రకాశింపచేయబడు చున్నవి. కావున వాటికి జ్ఞాత యొక్క ధర్మము అను స్థాయి లేదు. ఆత్మ కంటె భిన్నమగు సర్వము తెలియ బడుచుండును గాన, జ్ఞేయస్థాయిలో మాత్రమే నుండును. తెలియబడుట అనునది పుష్కల కారణము. మరియొక కారణముతో బనిలేదు. నేను ఒక వస్తువును నా జ్ఞానములో విషయముగా చేసి దానిని గుర్తించినప్పుడు, అది నా కంటె భిన్నముగా నున్నది గనుక, అనాత్మ యగును. అజ్ఞానముతో బాటు సర్వము అనాత్మలో అంతర్గతమగును. ఈ సర్వము జ్ఞానములో విషయములు అగు చున్నవి గావున, జ్ఞేయములే యగును గాని, జ్ఞాతృధర్మములు కాజాలవు.

దర్శనకారులందరు మోక్షమును గురించి తమ తమ ధారణలను కలిగియున్నారు. బౌద్ధులకు నిర్వాణము గలదు. చార్వాకులకు కూడా ఒక రకముగా మరణమే మోక్షము అగును. ఏలయన, వారి దృష్టిలో పుణ్యపాపాది కర్మఫలము ననుభవించే ఆత్మ మిగిలి యుండదు. వీరందరికీ మోక్షము గురించి గల ధారణలు భిన్నములే యైననూ, అందరికీ అంగీకారమయ్యే అంశము ఒకటి గలదు. మోక్షమును పొందిన తరువాత జీవునకు పునరావృత్తి లేదు. వ్యక్తికి వ్యక్తిత్వభావనమండి విడుదలయే మోక్షము అనబడును. స్వర్గప్రాప్తియే మోక్షమనే పక్షములోనైననూ, జీవుడు అచట ఇష్టానిష్టములనుండి, సుఖదుఃఖములనుండి, మరియు దేహ-ఇంద్రియ-అంతఃకరణముల సర్వగుణములనుండి విముక్తుడై యుండును. ఇవి వాస్తవముగా జీవుని ధర్మములే అయినచో, వాటిని ఈశ్వరుడు ఏదో విధముగా నివృత్తి చేయవలసి యుండును. ఈశ్వరుడు సర్వశక్తి మంతుడు గనుక, ఇది సంభవమేనని వారు చెప్పెదరు. అయిననూ, ఇవి జ్ఞాతయొక్క స్వరూపములో అంతర్గతములై యున్నచో, ఈశ్వరునకైననూ వాటిని త్రోసివుచ్చుట అసంభవమగును. జీవుని స్వరూపమే నష్టమైనచో మోక్షము ఎవరి కొరకు? ఈ వాదుల దృష్టిలో అజ్ఞానము, మనస్సు, ఇంద్రియము ఇత్యాది కరణములు విలీనమైనచో, పునర్జన్మ లేదు. మోక్షావస్థలో జీవుని యందు అజ్ఞానము మిగిలి యుండుట వీరెవ్వరికీ అంగీకారము కాదు.

అగ్నికి వేడివలె, ఆత్మకు సంసారిత్వము సహజగుణమైనచో, ఆ రెండింటినీ విడదీయుట అసంభవమగును. ఏ వస్తువునైననూ, దాని అంతరంగ ధర్మము నుండి విడదీయలేము గదా! కావున, సంసారిత్వము జ్ఞాతకు స్వరూపమైనచో, సంసార విముక్తి అనే మోక్షము అసంభవమగును. కాని అది అజ్ఞానముచే ఆరోపితమై, జ్ఞాత యొక్క సహజ ధర్మము కానిచో, సమస్య లేదు. దీని కంటె భిన్నమగు ధారణలతో గూడిన మోక్షము మోక్షమే కాదు. జ్ఞాత నిత్యముక్తుడు; ఈశ్వరాభిన్నుడు. అజ్ఞానముచే జ్ఞాత యందు ఈశ్వరభేదము కల్పింపబడినది అని ఎవరైననూ

చెప్పినచో, వారు వేదాంతమును మాత్రమే చెప్పుచున్నారు. ఈ సంసారమనే సమస్యకు పరిష్కారము అధ్యారోపనివృత్తి మాత్రమే.

శ్రీ శంకరులు తరువాత మరియొక విషయమును వివరించిరి. ఆత్మ మార్పులకు లోనుగాదు. రూపరహితమగు ఈ ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాపకము. కావున ఆత్మకు సంయోగవియోగములు సంభవించవు. ఆకాశము సాపేక్షికముగా మాత్రమే సర్వవ్యాపకము. ఆత్మ లేనిదే ఆకాశమునకు ఉనికి లేదు. కాని ఆత్మ ఆకాశముకంటె భిన్నమైన స్వతంత్రసత్త గలది. రూపము లేని వస్తువునందు సంయోగవియోగములు ఏ విధముగనైననూ సంభవము కావు. ఉదాహరణకు, ఆకాశము దేనితో జతగూడ గలదు? మరియు, సర్వవ్యాపకమగు ఆకాశము దేనినుండి విడిపోగలదు? ఆకాశము ఇతరము సర్వమును విడిచి పెట్టి, ఒక విశిష్ట వస్తువుతో జతగూడ గల్గునా? అదే విధముగా, నిర్గుణమగు జ్ఞాత సంయోగవశముచే ఇతర గుణములను తనవిగా చేసుకొనడు. స్థూలత్వము, మరణము ఇత్యాది దేహ ధర్మములు మాత్రమే గాక, సుఖము, దుఃఖము, కామన, ద్వేషము ఇత్యాది మనోధర్మములు కూడ జ్ఞాతకు సంయోగముచే సంక్రమించవు. సర్వవ్యాపకము, రూపరహితము అగు ఆత్మకు దేనితోనైననూ సంయోగము ఘటిల్లదు గాన, సంయోగముచే ఆత్మయందు గుణము సంక్రమించుట సంభవము గాదు. ఆకాశము కూడ దూషితము చేయబడజాలని స్థితిలో, ఆకాశమునకు అధిష్ఠానమగు ఆత్మ ఏదో ఒక రకమైన సంయోగముచే దూషితమగుట అసంభవము. ఆత్మ అద్వితీయము. సర్వము ఆరోపింపబడే అధిష్ఠానము ఆత్మయే. అధ్యారోపముతో అధిష్ఠానమునకు సంయోగము లేదు. మరియు అధ్యారోపమునకు అధిష్ఠానసత్తను బోలిన సత్త ఉండదు. త్రాడునకు పాముతో ఎట్టి సంసర్గము గలదు? సత్యవస్తువునకు తన్పై ఆధారపడి భాసించే మిథ్యావస్తువుతో సంయోగమనే ప్రసక్తియే లేదు. ఆత్మ సర్వగుణ వినిర్ముక్తమై యుండును. అట్టి ఆత్మ జగత్కారణమగు ఈశ్వరుని కంటె నిశ్చయముగా భిన్నము కాదు. ఈ తీరున, క్షేత్రజ్ఞ-ఈశ్వరుల ఐక్యము ధ్రువీకరించబడినది. భగవదవతారము అగు శ్రీకృష్ణుని వచనములను సంగ్రహించిన స్మృతిగ్రంథము గీత. దానియందు ఇట్లు వర్ణించబడినది: ఆత్మ అనాది, నిర్గుణము, అనంతము గనుక వినాశమునకు లోను గాదు; దేహమునందు ఉపలభ్యమగుచున్ననూ, కర్త కాదు. అర్జునా! ఆత్మ కర్మచే ప్రభావితము గాదు (అనాదిత్వాత్ నిర్గుణత్వాత్ పరమాత్మా అయం అవ్యయః, శరీరస్థోపి కౌంతేయ న కరోతి న లిప్యతే). జ్ఞాత యొక్క సారస్వరూపమై దేహమునందు ఉపలభ్యమయ్యే ఆత్మ క్రియలనాచరించదు; మరియు కర్మఫలముచే ప్రభావితము కాదు. అసంగమగు ఆత్మ కర్త కాదు; భోక్త కాదు. శ్రీశంకరులు సాక్షాత్తుగా ఈశ్వరుని వచనములను ఉదాహరించినారు గాన, శ్రుతిస్మృతులు రెండు

అదే వచనమునందు అంతర్గతమగును. ఆత్మ సాక్షిచైతన్యము, అద్వయము మరియు నిర్గుణము (సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ) అను ఉపనిషద్వాక్యము కూడా ఈశ్వరవచనమే గదా!

ఈశ్వరుని 'నేను' జీవుని 'నేను' స్వరూపములో నొక్కటియే. ఉపాధికృతమగు వ్యక్తిత్వము ఒక దృష్టికోణము మాత్రమే. కావున, అది ఆత్మ స్వరూపము కాజాలదు. ఆత్మ స్వరూపతః ముక్తము, మరియు అనంతము. ఈశ్వరుని స్వరూపము కూడ అదియే గాన, ఆత్మ జగత్కారణమగు ఈశ్వరుని కంటె భిన్నము కాదు.

వేద ప్రామాణ్యమునంగీకరించి పుణ్యపాపములయందు, దేహము నశించిననూ నశించని ఆత్మ యందు విశ్వాసము గల ఆస్తికుడు ఇచట ఒక ప్రశ్నను లేవనెత్తుచున్నాడు. ఈ ఆస్తికునకు కూడా ఆత్మ వాదిన్ అనియే పేరు. క్షేత్రజ్ఞుడు స్వరూపతః సంసార వినిర్ముక్తుడైనచో, శాస్త్రము నిరర్థకమగును. సంసారిత్వము అను స్థితి అజ్ఞానముచే ఆరోపించబడినది గాన, ఆత్మ సర్వదా సంసార వినిర్ముక్తమై యున్నది. ఇట్టి స్థితిలో, వ్యక్తిని సంసారము నుండి విముక్తుని చేయుటకు ఉద్దేశింపబడిన శాస్త్రమునకు అవకాశము లేదు. మానవుడు ఏ అల్పత్వాది పరిచ్ఛేదముచే దుఃఖితుడగునో, అదియే సంసారమనబడును. ఆత్మ నిత్యముక్తమైనచో, శాస్త్రమునకు విషయవస్తువే లేకుండును. శాస్త్రదృష్టిలో ప్రతి జీవి క్షేత్రజ్ఞ – ఈశ్వరుడే గనుక, బంధము లేదు.

శాస్త్రము ప్రమాణమని అంగీకరించినచో, ఈ వాదమును కూడా సత్యమని అంగీకరించవలెను. ఇట్టి స్థితిలో శాస్త్రమును పఠించి మోక్షము కొరకు సాధన చేయుట అనేది ఎట్లు ఘటిల్లును? శాస్త్ర విహితములగు కర్మలను అనుష్ఠించవలసిన పని యేమున్నది? క్షేత్రజ్ఞుడు సర్వకాలముల యందు ఈశ్వరుడే అయినచో, శాస్త్రము వలన ప్రయోజనమేమి? బంధము ఉండి, దాని నుండి మోక్షము ఉన్నచో, శాస్త్రమునకు విషయవస్తువు ఉండును. అట్లు గానిచో, ఉపదేశించుట కేమియూ ఉండదు గనుక, గురువు యొక్క అవశ్యకత లేదు. నీవు ఇప్పుడే ఈశ్వరుడవై యున్నచో, పొందదగినది (సాధ్య) ఏదియూ లేదు గనుక, సాధన కూడా ఉండదు. ఇది చాల పెద్ద దోషము. శాస్త్రమునకు ప్రయోజనము లేనిచో, దానిపై ఈ భాష్యమును వ్రాయనేల? అను ప్రశ్న ఉదయించును.

శ్రీశంకరులిట్లు బదులిడిరి: ప్రతివాది ఈ అభ్యంతరమును లేవదీయుట తగదు. ఏలయన, బంధవిముక్తి కొరకై శాస్త్రము ప్రమాణము అని ఆత్మ వాదులందరు అంగీకరించెదరు. కావున, ఈ దోషము వారికి కూడ వర్తించును. మానవుడు మోక్షమును పొందిన పిదప సంసారము ఉండదు

గాన, శాస్త్రమునకు ప్రయోజనము ఉండదు. దాని పనిని అది చేసినది. దేహముతో బాటు ఆత్మ నశించదనియు, బంధమోక్షములు గలవనియు విశ్వసించు వారి మతములో కూడ శాస్త్రము నిరర్థకమగుట అనే ఈ దోషము సంక్రమించుచునే యున్నది. బౌద్ధులు కూడ ఇటులనే చెప్పవలసి యుండును. మోక్షము లభించిన తరువాత కూడా, శాస్త్రాధ్యయనమును కొనసాగించినచో, ఆ మోక్షము అర్థరహితమగును. ఈ సమస్య మన ఇద్దరికీ సమానమే గనుక, మనము దీనిని కలిసి పరిష్కరించవలయునని శ్రీ శంకరులు ప్రతివాదితో చెప్పుచున్నారు. మోక్షము లభించిన పిదప, బంధము ఉండదు. కావున బంధ విముక్తికి సాధన మగు శాస్త్రము వ్యర్థమగును.

ఆత్మవాది ఒక అభ్యంతరమును లేవదీయుచున్నాడు. ఈ దోషము అందరికీ వర్తించునని చెప్పుట తగదు. శాస్త్రము మోక్షమునిచ్చును గనుక, సార్థకమే. సంసారము లేదని మేము చెప్పుట లేదు గదా! అద్వైతి మాత్రమే అట్లు చెప్పుచున్నాడు. శాస్త్ర- అనర్థక్యదోషము అద్వైతికి మాత్రమే సంక్రమించును. ఈ ఆత్మ వాదములన్నియు వివిధ మతరూపములలో గలవు. జీవునకు బంధ విముక్తి అనే ఒక మోక్షమును మతానుయాయులు ప్రతి పాదించుట తప్పనిసరి యగును. ఈ విముక్తి, ఈ సంసారాభావము అభీష్టలక్ష్యము గదా! కావున శాస్త్రము నిరర్థకమగునని వారు చెప్పరు. కాని అభీష్టలక్ష్యము నెరవేరిన పిదప శాస్త్రమునకు ప్రయోజనము సమాప్తమగును. అద్వైతుల పరిస్థితి కూడా ఇంతే. క్షేత్రజ్ఞుడు ఈశ్వరునితో తనకు గల అభేదమును గుర్తించిన పిదప, శాస్త్రము తన ప్రయోజనమును నిర్వర్తించినట్లే యగును గాక! తదనంతరము శాస్త్రముతో పని ఉండదు. నదిని దాటుటకు వినియోగించే పడవ నదిని దాటుటలో సహకరించును. దాటిన పిదప దానితో పని పూర్తియగును. అటులనే, ఆత్మ బ్రహ్మయే అను సత్యమును మరుగు పరిచే అజ్ఞానమును నశింప జేయుటకు ఆవశ్యకమగు వృత్తిని శాస్త్రము సమర్పించును. దాని వలన ఆత్మ యందలి అధ్యారోపములు నశించును. ఆ పిదప శాస్త్రముతో పని లేదు. శాస్త్రము అజ్ఞానిని సంబోధించిన సందర్భములో దాని ప్రయోజనము ఉండనే యున్నది. ద్వైతవాదుల పక్షములో కూడ బద్ధావస్థలో మాత్రమే శాస్త్రము సార్థకమగును. శాస్త్రము సార్థకమయ్యేది ముక్తావస్థలో కాదు గదా! ద్వైతవాదుల దృష్టిలో ఈ రెండు అవస్థలు సత్యమే. జీవుడు ఇతర సర్వజీవుల నుండి, ఈశ్వరుని నుండి, మరియు జగత్తు నుండి భిన్నముగా నుండే ప్రత్యేక వ్యక్తియని వారు స్వీకరింతురు. వారి దృష్టిలో ఈ బంధము యథార్థము గనుక, జీవుడు కొంత యథార్థ కర్మను చేసి యథార్థమగు కృపను సంపాదించి, యథార్థమగు మోక్షమును పొందును. పరమేశ్వరుడు అను గ్రహించి జీవునకు ప్రదానము చేసే ఒక విశిష్టమగు ఆనందమే మోక్షమని వారు భావింతురు. ఈ మోక్షవాదమును తాత్కాలికముగా అంగీకరించినమా, సంసారరూపబంధము లేని తరుణములో

శాస్త్రమునకు ప్రయోజనము లేదని ద్వైతి, అద్వైతి కూడా అంగీకరించవలెనని శ్రీ శంకరులు చెప్పుచున్నారు.

ఈ విషయములో తమకు, అద్వైతికి స్థితి సమానమేనను మాటను ద్వైతి అంగీకరించడు. అద్వైతి దృష్టిలో బంధము లేదు; మోక్షము లేదు. అనగా, ఈ రెండు మిథ్యయే. కాని ద్వైతి దృష్టిలో ఈ రెండు అవస్థలు పూర్ణసత్యములు. వాటిని పొందుట గాని, పరిత్యజించుట గాని సంభవమే. తనను కరచేది రజ్జు-సర్పము కాదనియు, యథార్థ సర్పమేననియు, కావున తాను దానినుండి ముక్తిని పొందవలెననియు ద్వైతి భావించును. బంధమును అవలకు నెట్టివేసి మోక్షమును పొందవలెను. అట్లు చేయుటకు ఒక సాధనము ఆవశ్యకము. ధ్యానాదులచే సంపాదింపబడే ఈశ్వరకృపయే అట్టి సాధనమగునని వారు భావింతురు.

'ఇతర ప్రాణులను హింసించరాదు (హింసాం న కుర్యాత్), మద్యమును త్రాగరాదు (సురాం న పిబేత్)' ఇత్యాది శాస్త్రాదేశములను పాటించి, వివిధరకముల అధర్మములకు పాపములకు దూరముగా నుండే వ్యక్తి మాత్రమే సంసారము నుండి తప్పించు కొనగల్గును. మోక్షమును పొందగోరువాడు ఈశ్వరార్చన మొదలగు ధర్మముల నాచరించి పుణ్యమును సంపాదించవలెను. ఇవి అన్నియు సత్యములైనప్పుడు మాత్రమే శాస్త్రము సార్థకమగును.

కాని అద్వైతి దృష్టిలో ద్వైతమునకు అజ్ఞానకల్పితమగు వ్యావహారిక సత్త మాత్రమే గలదు. ఇచట అద్వైతిన్ అను శబ్దము ప్రయోగింపబడినను, శ్రీశంకరులు అద్వైతమును మరియొక వాదము లేక మతము రూపములో ప్రతిపాదించుట లేదని తెలియుట చాల ముఖ్యము. అద్వైతము నీ స్వరూపమై యున్నది. ఇది జ్ఞానసాధనము ద్వారా తెలియుటకు వీలువడే సత్యము. ఇది కేవలము వాదించి ఆ తరువాత స్వీకరించుట, లేక పరిత్యజించుటను చేసే వాదము కాదు. ఇది దర్శింపదగిన సత్యము. మరియు ఇది కొంతమందికి నచ్చుబాటు కాదని అనుకోరాదు. నీవు అనంత ఆనంద బ్రహ్మవు అని శాస్త్రము చెప్పుచున్నది. దీనిలో తిరస్కరించుటకు ఏమి గలదు? జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ విభాగముతో గూడిన ఈ ద్వైతమంతయు అజ్ఞానముచే కల్పితము; కావున పరమార్థ సత్యము కాదు. ఆత్మ యందు బద్ధావస్థ, మరియు సర్వద్వైతము మిథ్యయైనచో, శాస్త్రము ఎవరికొరకు దేనికొరకు ఉద్దేశింపబడినది? క్షేత్రజ్ఞుడు ఈ క్షణములో ఈశ్వరుడై యుండగా, శాస్త్రమునకు విషయవస్తువు లేకుండును. కర్మను చేసే కర్త, ఫలమునమభవించే భోక్త లేనిచో, శాస్త్రము అగ్ని హోత్రాది కర్మను చేయుము అనియైనను విధింపజాలదు. మరియు కర్మఫలములయందు అభిరుచి ఉండదు. ఇట్టి తలవానికి తలమావె ప్రకటనతో పనియేమున్నది? బంధమోక్షములు సత్యము

అని భావించు వానికి శాస్త్రము ఉపకరించును. సంసారము మిథ్యయను ధారణ గలవాని విషయములో శాస్త్రమునకు విషయవస్తువు లేకుండుటచే నిరర్థకమగును.

శ్రీ శంకరులు ముందుగా ద్వైతియొక్క ఈ వాదనను త్రోసిపుచ్చి, తరువాత శాస్త్రము యొక్క సార్థక్యమును స్థాపించెదరు. బంధమోక్షాది విభిన్న అవస్థలకు ఆత్మ అధీనమై యుండునను వాదము నిలబడేది కాదు. ఏలయన, బంధమోక్షములు ఆత్మ యందు ఉండునన్నచో, ఏకకాలమునందు ఉండునా? ఒకదాని తరువాత మరియొకటి ఉండునా? బంధమోక్షములు పరస్పరవిరుద్ధములు గనుక, అవి ఏకకాలములో ఆత్మయందు ఉండుట సంభవము కాదు. నిలబడి ఉండగనే ఆతడు వెళ్ళుచున్నాడు (తిష్ఠన్ గచ్ఛతి) అని చెప్పుట సంభవము కాదు గదా! పరస్పర విరుద్ధ ధర్మములు ఏకకాలములో ఏకదేశము నందు ఉండలేవు. ఆత్మ అయితే బద్ధము కావాలి; లేదా, ముక్తము కావాలి. రెండూ కాలేదు. ఆత్మ యందు ఈ అవస్థలు ఒక కాలమునందు గాక, క్రమముగా నున్నవి యన్నచో, బద్ధావస్థ నుండి ముక్తావస్థకు మార్పు వచ్చినప్పుడు, ఆ మార్పునకు కారణమున్నదా? లేదా? యని ప్రశ్నించవలెను. బాహ్యకారణము గాని, అంతరకారణము గాని లేకుండగానే, స్వభావము చేతనే అట్లు జరిగినదన్నచో, ఆ మోక్షము మోక్షమే కాదు. కారణము లేకుండగనే బద్ధము ముక్తమైనచో, అటులనే యాదృచ్ఛికముగా మరల బంధము సంప్రాప్తమగును. మోక్షము స్వభిన్నమగు కారణముచే సిద్ధించునన్నచో, బంధము మిథ్య యగును. దేనికి స్వతంత్రమగు ఉనికి లేదో, అది మిథ్యయని మనము చూచి యున్నాము. బంధము మిథ్యయగుట ద్వైతికి అంగీకారము కాజాలదు. ఏలయన, ఆతని వాదమంతయూ బంధమోక్షముల సత్యత్వముపై ఆధారపడి యున్నది. కావున, బంధము మిథ్యయని అంగీకరించినచో, ఆతడు మూల సిద్ధాంతమును పరిత్యజించి, అద్వైతమును స్వీకరించినట్లు అగును. ఆత్మ సర్వకాలముల యందు ముక్తము గనుక, బంధమోక్షములు రెండు మిథ్యయే యగును. అజ్ఞానము ఉన్నంతవరకు మాత్రమే బంధము ఉన్నట్లు భాసించును. కావున మోక్షప్రాప్తి ఎల్లవేళలా మిథ్యయే యగును. ఏలయన, మోక్షము పొందబడేది గాదు. కల్పిత బంధమును నివారించుట యనగా కేవలము జ్ఞానసాధనముతో అజ్ఞానమును నివారించుట మాత్రమే.

మరియు, బంధమోక్షములు సత్యమైనచో, ఆత్మ అనిత్యమగును. ద్వైతియైననూ ఈ నిర్ణయమును అంగీకరించడు. ఏలయన మోక్షమును గురించి ఆతడు విశ్వసించే సిద్ధాంతములో కూడా ఆత్మ నిత్యమై యుండుట తప్పనిసరి. పూర్వాపరస్థితులను నిర్ణయించుటలో, మోక్షస్థితికి ముందు బంధస్థితి ఉండునని మనము అంగీకరించవలెను. మోక్షమునకు ముందు ఆత్మ బద్ధావస్థకు

అధీనమై యుండును. అనగా మోక్షమునకు ప్రాగభావము (prior non-existence) గలదు. ఈ బంధము అనాదియై ఉండవలెను. ఈ నియమములు ఉల్లంఘింపబడినచో, మోక్షము అసంభవమగును. ద్వైతి దృష్టిలో బంధము సత్యము. ఆ బంధమునకు ఆది యున్నచో, ఆ ఆది మోక్షమునకు పూర్వమునందు ఉండెనని నిర్ధారించుట సంభవము కాదు. ఆ ఆది మోక్షమునకు పూర్వము నందు లేనిచో, మోక్షమును అనుసరించి బంధము ఉండును. అనగా ఆ మోక్షము అయథార్థమగును. కావున బద్ధావస్థ అనాది యని ద్వైతి అంగీకరించవలెను. ఈ వాద ధోరణి సర్వప్రమాణ విరుద్ధము అనే అభ్యంతరమును లేవదీయవచ్చును. వ్యావహారిక సత్యతకు లోబడి, అంతము గలది ఏదైనా ఆరంభమును కూడా కలిగియుండును. ఘటమే దీనికి దృష్టాంతము. కావున బంధము సత్యమన్నచో, దానికి అంతము మాత్రమే గలదనియు, ఆరంభము లేదనియు చెప్పుట పొసగదు. అదే తీరున, ఆరంభమయ్యే మోక్షము శాశ్వతము కాజాలదు. ఆరంభమయ్యేది ఏదైనా అంతము అయి తీరును. మనము కూడా ఈ మాటనే చెప్పెదము. కాని మన సిద్ధాంతములో బంధము మిథ్య గనుక, ఈ సమస్యలు తలయెత్తవు. బంధము సత్యము అని భావించువానికి, ఆ బంధమునకు అంతము గలదే గాని ఆరంభము లేదు అని చెప్పుట సర్వప్రమాణ విరుద్ధమగును. పైగా ఈ నిర్ణయమును శాస్త్రము సమర్థించుట లేదు.

ఆత్మ మిథ్యయని శాస్త్రము చెప్పుట లేదు. ఆత్మ నిర్విశేషసత్త, సాక్షి, చైతన్యఘనము, అద్వయము, సర్వగుణ వినిర్ముక్తము (సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ) అని శ్రుతి చెప్పుచున్నది. సద్వస్తువు యొక్క ఉనికిని స్థిరీకరించుటకు శాస్త్రమువుతో పనిలేదు. ద్వైతి యొక్క సిద్ధాంతములో, ఏది సత్యరూపముగా ఇంద్రియగోచరమగు చున్నదో, దాని సత్యత్వము ఇతర ప్రమాణములచే స్థాపించబడక పోయిననూ, అది సత్యమే. సూర్యుడు తూర్పున ఉదయించి, పశ్చిమమున అస్తమించును అన్నట్లు కానవచ్చును. కావున, భూమి స్థిరముగా నుండగా, సూర్యుడు తిరుగుచున్నాడని నీవు నిర్ణయించినచో, అది తప్పు. ఇంద్రియములకు సత్యముగా గోచరించేది పరమార్థ సత్యము కానక్కరలేదు. గ్లాసులోని నీటిలో పుల్లను ఉంచినచో, అది నీటిలోపల వంగి యున్నట్లు కానవచ్చును. స్వచ్ఛమగు స్ఫటికము నందు వివిధ వర్ణములు కానవచ్చును. కాని ఈ రెండు కాంతి కిరణములచే కలిగించబడిన దృష్టిభ్రమ (illusion) లు మాత్రమే. ఈ దోషము ఇంద్రియములలో లేదు. సృష్టిలో మార్చుటకు శక్యము కాని కొన్ని సూత్రములు గలవు. వాటి ప్రకారంగా ఇంద్రియములు తమకు గోచరమగు ప్రపంచమును బుద్ధియెదుట యాంత్రికముగా ప్రదర్శించును. ఈ సమాచారములను ఆధారముగా చేసుకొని మానవుడు నిర్ణయములను చేయబూనినచో, దానియందు సమస్యలు ఉత్పన్నమగును. కావున, ప్రత్యక్షాది ప్రమాణములచే

ద్వైతము నిర్ణీతమగు చున్నది యను ద్వైతుల వాదము సరిగాదు. ద్వైతము కేవలము దోషయుక్త మగు నిష్కర్ష మాత్రమే.

ద్వైతము ప్రమాణసిద్ధమని ద్వైతి భావించును గాన, అతని దృష్టిలో మోక్షావస్థ యథార్థమగును. కాని అతని వాదము ప్రకారముగనైననూ ఇది ప్రమాణవిరుద్ధము. ఏలయన, సత్య జగత్తులో, ఆరంభమై అంతములేని వస్తువు మనకు కానరాదు. మోక్షము ఒక విశిష్ట కాలాంశములో ఆరంభమగుచున్నది గనుక, అది కాలాధీనమై కాలక్రమములో మారుచుండవలెను. అట్టి మోక్షము అంతమగుట నిశ్చయము.

శ్రీశంకరులు ఈ వాదమును ఇంకనూ విశ్లేషించిరి. ఆత్మ యందు విభిన్న కాలములలో బంధమోక్షములనే అవస్థలు ఉన్నచో, ఆత్మ అవస్థలకు అధీనమై ఒక దానినుండి మరియొకదానిలోనికి మారుచుండునని తెలును. ఇట్టి స్థితిలో, ఆత్మ శాశ్వతమని నిరూపించుట సంభవము గాకుండును. ఆత్మకు సంబంధించి యున్న అవస్థ మారినచో, ఆత్మ కూడ మారును. ఏలయన, అవస్థ సత్యమైనచో ఆత్మలో భాగమగును. ఉదాహరణకు, ఘటమునకు ఘటత్వము (potness) విశేషణమైనచో, ఘటత్వము మారినప్పుడు ఘటము కూడా మారి పోవును. ఆత్మ యందు సత్యమగు అవస్థ యున్నచో, ఆ అవస్థలో మార్పు వచ్చినప్పుడు, ఆత్మ యందు కూడ మార్పు వచ్చును. అనగా ఆత్మ కాలమునకు వశమై యుండును. అనగా, ఆత్మ అనిత్యమగును. మోక్షము ఒక అనుభవము అని చెప్పువారు ఇట్టి అవస్థను మాత్రమే చెప్పుచున్నారు. కాని మోక్షము ఒక అనుభవవిశేషము కాదు. నిత్యముక్తమగు ఆత్మ యొక్క స్వరూపమే మోక్షము. ఆత్మ జ్ఞానమే మోక్షము. ముక్తమగుటకై ఆత్మ మార్పును చెందనక్కరలేదు. మోక్షప్రాప్తి అనునది మిథ్యాభూతమగు బంధము అనే దృష్టికోణములో మాత్రమే సంభవమగు చున్నది. అజ్ఞానముచే ఆత్మ యందు బంధము ఆరోపింపబడినది. అజ్ఞానము పోగానే, బంధము కూడా పోవును.

మోక్షస్వరూపమును దీనికి భిన్నముగా స్వీకరించినచో, ఆత్మ అనిత్యమగును. అట్టి మోక్షము కూడా అనిత్యమగును.

ఆత్మయందు అనిత్యత్వమనే దోషము సంక్రమించకుండుట కొరకై, బంధమోక్షావస్థలు ఆత్మకు అంటియుండునని చెప్పరాదు. ఆత్మ సంసారమునుండి నిత్యముక్తము. కాని ద్వైతవాది పరిస్థితి దీనికి విరుద్ధముగా నుండును. ఆ వాదములో ఆత్మ నిత్యసంసారి యగును. ఏలయన, ఆత్మ నిత్యము, మరియు బద్ధము అయినచో, బంధము కూడ నిత్యమే గనుక మోక్షము లేకుండగా

పోవును. మోక్షము సిద్ధించుట కొరకై ద్వైతులు తమ మౌలికవాదమునుండి ప్రక్కకు జరిగినచో, మోక్షము లభించిన తరువాత శాస్త్రము నిరర్థకమని వారు అంగీకరించవలయును. కావున శాస్త్రము అనర్థకమగుట అనే దోషమునకు పరిహారము ద్వైతికి కూడ అవశ్యకమగు చున్నదని శ్రీశంకరులు చెప్పుచున్నారు. ఈ సమస్య ద్వైతికి, అద్వైతికి ఇద్దరికీ సమానమే. ఇది శ్రీ శంకరుల మొదటి ప్రత్యుత్తరము.

శ్రీశంకరులింకనూ ఇట్లు వివరించుచున్నారు: అద్వైతికి బద్ధావస్థలో శాస్త్రము సార్థకమగును. కాని ద్వైతికి మోక్షమే లేదు గనుక, బద్ధావస్థలోనైననూ శాస్త్రము వ్యర్థమే యగును. ద్వైతి ఆత్మకు బ్రహ్మతో ఐక్యమును అంగీకరించడు. అంతకు తక్కువ ఏదైననూ మోక్షము కాదు. ద్వైతికి బంధము సత్యము గనుక, మోక్షము అసంభవమగును. శాస్త్రము అజ్ఞానిని ఉద్దేశించి ప్రవర్తిల్లును. ఈ అజ్ఞానము మానవునకు సహజసిద్ధమై యున్నది. ఆత్మను గురించి, జగత్తును గురించి అజ్ఞానము మానవునకు జన్మసిద్ధమై యున్నది. జగత్తును గురించిన అజ్ఞానమును కొంతవరకు తొలగించుకొనుటకై మనకు వివిధ ప్రమాణములు ఉపలభ్యమగు చున్నవి. కాని ఆత్మను గురించిన అజ్ఞానమును నివారించుటకు ఒకే ఒక ప్రమాణము గలదు. అదియే శాస్త్రము. ఆత్మ స్వరూపము నెరుంగని వారిని ఉద్దేశించి శాస్త్రము ప్రవర్తిల్లును. ప్రపంచములో అజ్ఞానులు కోకొల్లలుగా నున్నారు గనుక, శాస్త్రము సార్థకమగుచున్నది. ఈ అజ్ఞానము మాత్రమే సంసారమునకు హేతువు అగుచున్నది. నీవు బద్ధుడవు కాదనియు, నీవు త్రికాలముల యందు స్వరూపతః ముక్తుడవనియు శాస్త్రము బోధించుచున్నది. రజ్జువు నందు త్రికాలములలో సర్పము లేదు. రజ్జువునందు స్వీయదృష్టి కోణములో సర్పభావన లేనే లేదు. అదే విధముగా, ఆత్మ యందు బద్ధ భావన లేదు. ఆత్మ జ్ఞానము లేనివాని దృష్టిలో మాత్రమే బంధము కలదు. జ్ఞానముచే ఆ అజ్ఞానమును తొలగించగానే, బంధము కూడ తొలగిపోవును. కావున, అద్వైతులకు శాస్త్రము పూర్ణముగా సార్థకమగుచున్నది. అజ్ఞాని అనాత్మ యందు ఆత్మను దర్శించి, తత్కారణముగా కర్మలనాచరించి, ఫలములను భోగించును. అట్టి జీవుని అజ్ఞానమును తొలగించుటలో శాస్త్రము మిక్కిలి సహకరించును. స్వర్గములో దేవదేహమును స్వంతము చేసుకొనుటకు ఈ స్థూలదేహము సాధనమగును. ఏలయన, ఆ దేహమును సంపాదించుటకు అవశ్యకమగు పుణ్యమును ఈ దేహముతో కర్మలను చేసి పొందవచ్చును. కావున ఈ రెండు దేహములు అనాత్మలే. కాని అజ్ఞాని వాటి యందు ఆత్మను దర్శించును.

ఈ దేహము, రాబోవు దేహము కూడా మిథ్యయే అనియు, ఆత్మ సత్యమనియు ఎరుంగు జ్ఞానికి కర్మజ్ఞానములను నిరూపించే సంపూర్ణ శాస్త్రము నిరర్థకమగును. ఏలయన, శాస్త్రము

అతని విషయములో చేయవలసిన పనిని చేసి కృతకృత్యమైనది. కాని దేహభిన్నమగు ఆత్మను అంగీకరించిననూ ఈ జ్ఞానము లేనివారు మరల జన్మించి కర్మఫలముల ననుభవించెదరు.

ఆత్మ స్థూలదేహాదుల కంటె భిన్నము అను వివేకజ్ఞానము గలవారు, ఈ దేహముతో చేసిన పుణ్యముచే భవిష్యత్తులో దేవాది దేహములను పొందిననూ, ఆయా దేహములయందు ఆత్మ బుద్ధిని కలిగియుండుట సంభవము కాదు. వారి దృష్టిలో 'నేను' అను మాటకు అర్థము స్థూలదేహము కాదు. వారు పుణ్యకర్మల ప్రభావముచే భవిష్యత్తులో పొందబోయే దేహముల విషయములో కూడా ఇదే పరిస్థితి కొనసాగును. ఉదాహరణకు, ఎంతటి మూర్ఖుడైననూ నిప్పు, నీరు ఒకటి అనుకోడు గదా! అట్టి స్థితిలో, ఆత్మ జ్ఞానము గల వ్యక్తి ఆత్మ-అనాత్మల పరస్పరవైరుధ్యము నెరింగినవాడు గనుక, అనాత్మయందు ఆత్మయనే భ్రాంతిని పొందుట ఎట్లు సంభవమగును? అనాత్మ ఆత్మపై ఆధారపడి యున్ననూ, అవి రెండు పూర్తిగా పరస్పర విరుద్ధములు. ఆత్మ కాలాతీతము, అనాత్మ కాలాధీనము. ఆత్మ చేతనము, అనాత్మ జడము. ఆత్మ వికార్యము కాదు. కాని కాలాధీనమై ఉండే అనాత్మ వికారములకు లోనగును. అనాత్మ యందు సంబంధములు గలవు; ఆత్మయందు ఏ విధమైన సంబంధములు లేవు. ఈ అనాత్మ ధర్మములను ఆత్మ యందు ఆరోపించుట వలననే బంధము ఏర్పడు చున్నది.

కావున విధి నిషేధములను బోధించు శాస్త్రము అజ్ఞాని కొరకు ఉద్దేశింపబడినది. ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యః (మిత్రమా! ఆత్మను దర్శించవలెను, శ్రవణము చేయవలెను) ఇత్యాది వాక్యములలో కానవచ్చే విధి-ఆభాసయైననూ మనుజుని ప్రవృత్తి పరాయణుని చేయుటకు ఉద్దేశింపబడలేదు. సమస్యల పరిష్కారము కొరకు సర్వదా బాహ్యవస్తువులపైకి ప్రసరించుట మనస్సునకు సహజ లక్షణము. అట్టి ప్రవణత నుండి మనస్సును మళ్లించుటయే ఈ వచనములకు తాత్పర్యము. సమస్యకు కేంద్రము 'నేను' గనుక పరిష్కారమును కూడ 'నేను' లో వెతుకవలెనను సత్యమును సాధకుడు గుర్తించవలెను. ఇట్టి గుర్తింపును కలుగజేయుటలో ఇట్టి వాక్యములు సహకరించును. వాటి ఉద్దేశ్యము అదియే. నీ ధ్యానమును అంతర్ముఖము చేయుటకు ఉద్దేశింపబడిన వాక్యమే అయిననూ, దీనికి కూడా విధి అనే మాన్యత గలదు. కర్మఫలములకంటె, కర్మహేతువు అగు స్థూలదేహము కంటె ఆత్మ భిన్నమనే వివేక జ్ఞానము గల వ్యక్తికి ఎట్టి విధులతో నైననూ పనిలేదు. అతని దర్శనములో ఆత్మ కర్త కాదు, భోక్త కాదు. కర్త లేడు అన్నచో క్రియల నాచరించువాడు లేడు. భోక్త లేడని వేరుగ చెప్పవలెనా? కావున అట్టి జ్ఞానికి శాస్త్రము యొక్క విధినిషేధములతో పనిలేదు. శ్రీ శంకరులు దీనికి ఒక దృష్టాంతము నిచ్చిరి. దేవదత్తుని చేయుమని చెప్పిన పనిని చేయుటకు విష్ణు మిత్రుడు పూనుకొనడు. ఏలయన, అతని దృష్టిలో ఆ విధి తన

కొరకు గాదు. అదే విధముగా ఆత్మ పూర్ణము, కర్తృత్వ వినిర్ముక్తము, నిర్గుణము అను దర్శనము గల వ్యక్తికి విభిన్న ఆశ్రమ వర్ణ సంబంధి విహిత కర్మలను చేయవలెననే ప్రేరణ ఉండదు. అజ్ఞానముచే ఆత్మపై అధ్యారోపము చేయబడిన కర్తృత్వముపై ఆధారపడి ఈ విధులన్నియూ ప్రవర్తిల్లును. అట్టి స్థితిలో మాత్రమే మానవుడు కర్మలను బోధించే ఈ విధులవైపు తన దృష్టిని ప్రసరింప జేయును. అట్లు గానిచో, నేను ఇంతకు ముందు చెప్పిన విధంబున, బట్ట తలవానికి కేశతైల ప్రకటనపై దృష్టి మళ్లని విధంబున, జ్ఞాని దృష్టి వీటిపైకి ప్రసరించదు. విధివాక్యమును విన్ననూ, ఆతడు దానిచే ప్రేరితుడు గాడు. దేవదత్తునకు ఉద్దేశింపబడిన ఆజ్ఞావాక్యమును విష్ణుమిత్రుడు వినియున్ననూ, ఆతడు దానిపై స్పందించడు. అట్లు గాక, ఆత్మ-అనాత్మల మధ్య గల భేదమును గురించి సుస్పష్టమగు అవగాహన లేని వ్యక్తి ఫలాకాంక్షియై కర్మల నాచరించును.

ఇప్పుడు ద్వైతి ఇట్లు వాదించుచున్నాడు: ఆత్మ తాను స్వయముగా కర్మలను వేటినీ చేయక పోయిననూ, దేహేంద్రియమనస్సంఘాతరూపములో నున్న ప్రకృతితో సంయోగమును పొంది కర్మను చేయవచ్చును. 'నేను కర్తను గాను' అని చెప్పుటయు వాచిక కర్మయే గదా! ఈ సంయోగముచేత వేదము యొక్క విషయవస్తువు సార్థకమగును. ఆత్మ కర్మఫలముల నుండి, కర్మాధిష్ఠానమగు దేహమునుండి వివిక్తమైనది యను జ్ఞానము గల వ్యక్తి, ఆత్మ యందు కర్తృత్వ భోక్తృత్వములను దర్శించకపోయిననూ, అభీష్టఫలములనిచ్చు కర్మలను నిశ్చితముగా ఆచరించుచూ నిషిద్ధకర్మలకు దూరముగా నుండును. సత్యమును పలుకుము (సత్యం వద), హింసించకుము (హింసాం న కుర్యాత్) ఇత్యాది వచనములు జ్ఞానియందు కూడ సార్థకమగును. జ్ఞాని యందు కర్తృత్వము లేకున్ననూ, దేహేంద్రియమనస్సంఘాతముతో సంయోగము కలదు గదా! కావున, విధులు ఆత్మతో సంయోగమును కలిగి యున్న దేహేంద్రియ సంఘాతమునకు వర్తించుచుండును. దీనికి ఒక దృష్టాంతమును చెప్పవచ్చును. తండ్రి, కొడుకు తాము పరస్పరము భిన్నులమని ఎరుంగుదురు. కాని, వారి మధ్య నున్న సంబంధమును పురస్కరించు కొని, తండ్రి కుమారుని కొరకు, కుమారుడు తండ్రి కొరకు కొన్ని పనులను చేయుచుందురు. అదే విధముగా, శాస్త్రము సాక్షాత్తుగా అకర్తృ-ఆత్మను సంబోధించుట లేదు. కాని దానికి దేహేంద్రియ సంఘాతముతో గల సంబంధమును పురస్కరించుకొని, శాస్త్రము కొన్ని కర్మలను చేయుమని విధించుచున్నది.

శ్రీ శంకరులు ఇట్లు ప్రత్యుత్తరమునిచ్చుచున్నారు: ఆత్మ-అనాత్మ వివేక జ్ఞానము ఉదయించుటకు పూర్వమునందు మాత్రమే ఆత్మకు దేహేంద్రియ మనస్సంఘాతముతో తాదాత్మ్యభావము కలదు గనుక, ఆ స్థితిలో మాత్రమే కర్మను బోధించు విధులు వర్తించును.

'కర్మను చేయుచున్ననూ అతడు కర్త కాడు (కుర్వన్ అపి న కరోతి)' అని గీత చెప్పుచున్నది. చూచుట, వినుట, అఘ్రాణించుట, ఆస్వాదించుట, మాటలాడుట, కనురెప్పలను మూయుట, తెరచుట ఇత్యాది దైహిక, ఇంద్రియక కర్మలన్నియు జరుగుచున్ననూ, ఆత్మజ్ఞాని కర్మలను వేటినీ చేయుట లేదు. కావున, ఆత్మకు వాస్తవమగు సంబంధము లేదు. సంబంధము మిథ్య మాత్రమే. సత్యము నెరింగిన తరువాత అది బాధితమగును. అయిననూ, ఉన్నట్లుగనే కన్పట్టు చుండును. వాస్తవమగు సంబంధము లేదు గనుక, శాస్త్రము విధులను ఆత్మజ్ఞానికొరకు విధించుట లేదు.

ఫలహేతువుల (కర్త, భోక్త) కంటె ఆత్మ వివిక్తము (distinct) అను జ్ఞానమును పొందిన వ్యక్తి యందు వేద విహితములగు విధుల జ్ఞానము, మరియు నిషిద్ధ కర్మల జ్ఞానము కూడ ఇప్పటికే గలదు. మానవుడు ముందుగా వేద ప్రామాణ్యము నంగీకరించి ఆస్తికుడై జీవుడు అనాదియనియు, పూర్వపుణ్య విశేషముచే మానవ దేహమును పొంది తన దారిని తాను ఎన్నుకొనే ఇచ్ఛా స్వాతంత్ర్యము అనుగ్రహింపబడినదనియు ఎరుంగును. కావున మానవుడు ధర్మార్థ కామములనే పురుషార్థములలో దేనినైననూ ఎన్నుకొనవచ్చును. మానవుడు సహజసిద్ధముగా ఎన్నుకొనేది అర్థకామములే గాని, ధర్మము కాదు. కాని పూర్వపుణ్య విశేషముచే అతడు శాస్త్రము నందు శ్రద్ధను పొంది, తద్ద్వారా విహిత కర్మలను, నిషిద్ధకర్మలను గురించి తెలుసుకొనును. ఈ విధినిషేధములకు విరుద్ధమైన రాగద్వేషములు తనలో ఉన్ననూ, అతడు ధర్మానురూపముగా ప్రవర్తిల్లును. దానిచే అతని మనస్సు సంఘర్షణలనుండి విముక్తిని పొంది, ఒక విశిష్టమగు ప్రసన్నతకు నిలయమగును. ఇట్టి మనోదశలో అతని యందు మౌలికమగు ప్రశ్నలు తలయెత్తును. ఏ శాస్త్రము అతనిని ధర్మమార్గములో నడిపినదో, అదే శాస్త్రము అతనిలో ఈ ప్రశ్నలను రేకెత్తించును. ధర్మముకంటె పైన మోక్షము అనేది ఒకటి గలదనియు, దానిని ఈ జన్మలో సాక్షాత్కరించుకొనుట సంభవమే ననియు శాస్త్రమే చెప్పును. దేనిని ముందు చేయాలి? దేనిని తరువాత? అను విషయము శాస్త్రమునకు బాగుగా తెలియును. ముందుగా శాస్త్రము పూజాది కర్మలను, ఉపాసనలను, జీవనమూల్యములను బోధించి, ఆ పిదప తత్త్వములను బోధించును. దానిని తెలియుటలో ప్రతిబంధకములున్నచో, మనస్సును సంసిద్ధము చేయుటకై మార్గములను, సాధనములను బోధించును. కావున జ్ఞానోదయము తరువాత ఆత్మకు దేహాదులతో వాస్తవమగు సంయోగము లేదని శ్రీ శంకరులు చెప్పుచున్నారు. కావున విధిప్రతిషేధశాస్త్రములు ఆత్మానాత్మ వివేకము లేనివాని కొరకు మాత్రమే ఉద్దేశింపబడినవని స్థిరపర్చుటమైనది.

ఇచట మరియొక అభ్యంతరము గలదు. స్వర్గమును గోరువాడు యజ్ఞమును చేయవలెను (స్వర్గకామః యజేత) అనునది విధికి, మాంసమును భక్షించరాదు (న కలంజం భక్షయేత్)

అనునది నిషేధమునకు దృష్టాంతములు. దేహాది భిన్నమగు ఆత్మను దర్శించే జ్ఞానులకు ఇటువంటి కామనలేమియు లేవు. వారు తమ స్వరూపము నందు కర్తృత్వమును దర్శించరు. బ్రహ్మాభిన్నమగు ఆత్మ అకర్తయని వారెరుంగుదురు. మరియు దేహము, మనస్సు మరియు ఇంద్రియములే ఆత్మ యనియు, దేహము నశించిన పిదప ఆత్మ మిగిలి ఉండదనియు భావించే నాస్తికుడు కూడా ఈ విధినిషేధములను పాటించడు. పునర్జన్మను, అదృష్టములగు కర్మఫలములను అంగీకరించని వాని దృష్టిలో కర్మసిద్ధాంతము నిరర్థకము. 'హింసించరాదు (హింసాం న కుర్యాత్)' ఇత్యాది ఆదేశముల యందు అతనికి అభిరుచి ఉండదు. అతనికి తన సౌకర్యమే విధి యగును. 'ఇట్లు నీవు చేయరాదు. చేసినచో నీవు బంధమునకు శిక్షకు పాత్రుడవగుదువు' అని అతనికి చెప్పినచో, 'అట్టి విపత్తునకు సిద్ధపడియే నేనీ పనిని చేయుచున్నాను' అని అతడు బదులు చెప్పును. అంతటితో వాదన సమాప్తమగును. కర్మనియతి నిన్ను శిక్షించునని చెప్పినచో, అట్టి కంటికి కానరాని వాటిని తాను విశ్వసించనని అతడు చెప్పును. ఏది దృశ్యమో అదియే సత్యమని అతని విశ్వాసము. కాన అతడు శాస్త్రానుయాయి కాడు. జ్ఞాని కూడా శాస్త్రాను యాయి కాడు. ఇట్లు శాస్త్రమును పాటించువారు ఒక్కరైననూ లేక పోవుటచే శాస్త్రము నిరర్థకమగును.

ఈ వాదము సరిగాదని శ్రీ శంకరులు చెప్పుచున్నారు. దేహాది భిన్నమగు ఆత్మను అంగీకరించియూ, ఆ ఆత్మ అకర్తయని యెరుంగని వ్యక్తిని ఉద్దేశించి శాస్త్రము ప్రవర్తిల్లును. శాస్త్ర చోదితమగు కర్మయందు అతడు ప్రేరితుడగును; మరియు నిషిద్ధకర్మలకు దూరముగా నుండును.

ఆత్మ స్థూలదేహాదుల కంటె భిన్నమైనదనియు, ఆత్మ కర్త అనియు, దేహము నశించిననూ ఆత్మ నశించదనియు అతడు విశ్వసించును. 'ఆత్మ ఈశ్వరాభిన్నము, సర్వమునకు అధిష్ఠానము; కాని సర్వముపై ఆధారపడదు' ఇత్యాది జ్ఞానము అతనికి లేదు. అందువలన అతనికి స్వర్గాది ఫలములయందు ఆకాంక్ష గలదు. దేహము నశించిననూ ఆత్మ నశించదను మాట గొప్ప ఊరటనిచ్చును. కాని ఆ తరువాత ఏమగునో యను చింత కలుగుట సహజము. కావున ఈ జన్మలో మాత్రమే గాక రాబోవు జన్మలో కూడ పరిస్థితి మెరుగైనచో, బాగుండుననే ఆకాంక్ష అతనియందు ఉండును. ఈ కామన పరిపూర్తియగుట కొరకై అతడు కర్మను అనుష్ఠించును. కర్మకొరకు కర్మను చేయు వారెవ్వరూ లేరు. కర్మానుష్ఠానములో ఇబ్బందులు గలవని తెలిసిననూ ముముక్షువు కూడా అంతఃకరణ శుద్ధి కొరకై కర్మను చేయును. కావున, శాస్త్రము సార్థకమే యగుచున్నది.

ద్వైతి ఇంకనూ ఇట్లు వాదించును: ప్రాకృత జనులకు జ్ఞాని ఒక ఆదర్శము. కావున జ్ఞాని వేదవిహిత కర్మల నాచరించనిచో, ఇతరులు కూడ ఆచరించరు. శ్రేష్ఠపురుషుడు ఏ పనిని చేయునో, సాధారణముగా జనులు దానిని మాత్రమే చేయుచుందురు (యద్యద్ ఆచరతి శ్రేష్ఠ స్తత్తదేవ ఇతరో జనః) అని గీతయే స్వయముగా చెప్పుచున్నది. సరియగు ఆదర్శము లేనిచో, కర్మను చేయువారు మిగిలి యుండరు. ఆచరించువాడు లేక పోవుటచే శాస్త్రము వ్యర్థమగును.

శ్రీశంకరు లిట్లు సమాధానము నిచ్చుచున్నారు: శాస్త్ర ప్రమాణము ద్వారా ఒక వ్యక్తి జ్ఞాని అయినంత మాత్రాన సమాజమంతయూ జ్ఞానులు కారు. ఒక కోరిక తీరిన పిదప అది తీరుటకు ఉపకరించిన సాధనములు వ్యర్థమను మాట వాస్తవమే. అటులనే, జ్ఞానమును పొందిన పిదప వ్యక్తికి శాస్త్రముతో పని ఉండదు. కాని కోటి మందిలో ఒకడు జ్ఞాని యగును గనుక, ఒక వ్యక్తి విషయములో శాస్త్రము కృతార్థమైననూ, శాస్త్రముయొక్క ఆవశ్యకత మిగిలియే యుండును. శ్రీరాముని కాలములో కూడా ఒక రావణుడు ఉండెను. శ్రీకృష్ణుని కాలములో ఒక దుర్యోధనుడు ఉండెను. ఈ కాలములో కూడా అజ్ఞాన మోహితులగు జనులు చాల అధిక సంఖ్యలో నున్నారు. వారి యందు వివేకము లేదు. పైగా వారు జ్ఞాని యొక్క ప్రవృత్తిని అనుకరించెదరనుట కల్ల. మానవుల ప్రవృత్తికి ప్రేరణ నిచ్చేది వారి వారి రాగద్వేషములే గాని, జ్ఞాని యొక్క ఆచరణ కానే కాదు. సమాజములో జ్ఞానులు ఉన్ననూ, మానవులు వారిని అనుసరించెదరనే నియమము లేదు. శత్రు సంహారము కొరకు చేయు అభిచారాది కర్మలను జ్ఞాని ఎన్నడైననూ చేయడు. కాని ఇతరులు వాటిని చేయుచునే యుందురు. అజ్ఞానికి వైదిక కర్మలతో సహా సర్వకర్మల యందు ప్రేరణనిచ్చేది రాగ ద్వేషములు మాత్రమే. ఈ రాగద్వేషముల వెంటపడుట మానవ స్వభావమై యున్నదని (స్వభావస్తు ప్రవర్తతే) మనము 5వ అధ్యాయములో చూచి యున్నాము. మానవుని దేహాది వ్యవస్థ అంతయూ దానికొరకు సజ్జితమై యున్నది. భగవానుడు ఇంద్రియములను బహిర్ముఖములుగా సృష్టించినాడు. కావున మానవుడు బాహ్యములను చూచునే గాని, అంతస్స్థమగు ఆత్మను చూడడు (పరాంచి ఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాఙ్ పశ్యతి నాంతరాత్మన్). కావున మానవులు ఇంద్రియ సుఖముల వెంట పడుట సహజమే. అజ్ఞానము ఈ రూపములో బయటపడు చుండును. అజ్ఞానము వలననే అల్పత్వధారణ ఉదయించి, దాని నుండి విముక్తిని పొందుటకు యత్నము ఆవశ్యకమగు చున్నది. అజ్ఞానము ఏ రూపములో వ్యక్తమగును? అనునది మానవుని జన్మజాత (in born) ప్రవణతలు, పెంపకము, సంస్కృతి ఇత్యాదులపై ఆధారపడును. దీనికి జ్ఞానుల ఆచరణతో సంబంధము లేదు.

ఇంతకు ముందు వచ్చిన అభ్యంతరములన్నిటికీ సమాధానమును చెప్పి, శ్రీశంకరులు ఇపుడు మరల మూలసూత్రమును చేబట్టినారు. సంసారము అజ్ఞానము వలన కలిగినదని గుర్తు చేయుచున్నారు. అయితే, ఈ విషయములో ఒక అభ్యంతరము గలదు. సంసారమునకు కారణము అజ్ఞానమైనా, మరియొకటి అయినా, ఫలితము సమానమే గదా! త్రాడు నందు భ్రాంతిచే ఆరోపింపబడిన సర్పమైనా, వాస్తవిక సర్పమైనా, భయము సమానమే గదా! అదే విధముగా సంసారము అజ్ఞానజన్యము కావచ్చును. లేదా, ఈశ్వరసృష్టము కావచ్చును. సత్యము కావచ్చును; మిథ్య కావచ్చును; ఏది ఏమైనా, అది క్షేత్రజ్ఞని ప్రభావితుని చేయునని ప్రతివాది ప్రస్తావించుచున్నాడు.

శ్రీశంకరులిట్లు సమాధానము నిచ్చుచున్నారు: క్షేత్రజ్ఞని స్వరూపమునందు అజ్ఞానము గాని, అజ్ఞానకార్యమగు సంసారము గాని లేవు. క్షేత్రజ్ఞుడు సచ్చిదానందుడుగనే యుండును. ఏ కాలము నందైననూ క్షేత్రజ్ఞుడు అజ్ఞానముచే ప్రభావితుడు గాడు; సంసర్గమును పొందడు. అటులనే, అవిద్యాకార్యమగు సంసారము క్షేత్రజ్ఞనకు లేదు. అజ్ఞాన కార్యమగు సంసారముచే ఆత్మ దుఃఖి యగు చున్నది యన్నచో, శ్రీశంకరులీ విషయమై ఒక ప్రశ్నను వేసెదరు: ఈ అజ్ఞానము ఎవరికి చెందును? ఆత్మకా? జీవునకా? (జీవుడు ఆత్మ కంటె భిన్నుడా ఏమి?) ఈ ప్రశ్నకు వారిచ్చిన సమాధానమును మనము తరువాత చూచెదము. శ్రీ శంకరులిచట ఇట్లు చెప్పుచున్నారు : మిథ్యాజ్ఞానము సత్య వస్తువును ప్రభావితము చేయజాలదు. ఊహాకల్పితమగు సర్పము త్రాడును ఏ విధముగా ప్రభావితము చేయును? సత్యవస్తువు అగు త్రాటిపై సర్పము అధ్యారోపము చేయబడిననూ, త్రాడు సర్పము యొక్క గుణములచే లేశమైననూ దూషితము కాదు. పరమార్థ వస్తువు త్రికాలములయందు యథాతథముగ నుండును. శాస్త్రములో ఇది చాల ప్రముఖమైన విషయము. ఆత్మ అవిక్రియము గనుకనే, తత్త్వమసి అను ఉపదేశము సంభవమగు చున్నది. అట్లు గానిచో, 'నీవు బ్రహ్మవు' అని శాస్త్రము చెప్పజాలదు. ఆత్మలో మార్పులు వచ్చియున్నచో, 'నీవు కొన్ని విశిష్ట కర్మల నాచరించినచో, బ్రహ్మవు కాగల్గుదువు' అని శాస్త్రము చెప్పవలసియుండును. 'నీవే బ్రహ్మవు' అనునది దీనికి పూర్తిగా భిన్నము. నిత్య సిద్ధమై యున్న ఒక సత్యమును ఈ వాక్యము ప్రదర్శించుచున్నది. ఆ సత్యము నీ అజ్ఞానముచే ఎన్నటికీ ప్రభావితము కాదు. శ్రీ శంకరులు దీనికి ఒక దృష్టాంతము నిచ్చిరి. ఎండమావులలోని నీటి వలన ఎడారిలో బురద ఏర్పడదు. అటులనే, మిథ్యారూపమగు అజ్ఞానము సత్యవస్తువును ప్రభావితము చేయజాలదు. 'మిథ్యా' అను పదమునకు రెండు నిర్వచనములు గలవు. ఇతరమునందు ఆధారపడిన ఉనికి గలది (అధిష్ఠాన-అనన్య); ఉన్నది అని గాని, లేదని గాని ఖచ్చితముగా నిర్వచింప శక్యము

కానిది (సద్–అసద్భ్యామనిర్వచనీయ). అజ్ఞానము సత్యమైనచో, దానిని తొలగించుట సంభవము కాకుండును (సత్ చేత్ న బాధ్యేత). కాని జ్ఞానోదయము కాగానే అజ్ఞానము తొలగిపోవుట మన అనుభవములో నున్నది. అది లేదని చెప్పుట పొసగదు. ఏలయన, జ్ఞానము దానిని తొలగించునంతవరకు, అది జ్ఞానవిరోధియై నిలచియుండును. ప్రతి ప్రశ్నలో దాని ఉనికి కానవచ్చు చుండును. జ్ఞానము లేకుండుటయే అజ్ఞానమనుకోరాదు. ఇది చాల ప్రముఖమైన విషయము. జ్ఞానాభావము ఘటము నందు కూడ గలదు. కాని ఘటము అజ్ఞాని అని మనము చెప్పుట లేదు. జ్ఞానమునకు యోగ్యత గల వ్యక్తి యందు మాత్రమే ఇప్పుడు అజ్ఞానము గలదు. అజ్ఞానము భావరూపమగు 'ఒకానొకటి'. ఇది జ్ఞాన విరోధి, మరియు జ్ఞానముచే నశింపచేయబడునది. అజ్ఞానమును అసత్యమని త్రోసిపుచ్చ వీలు లేదు. సత్యమని స్వీకరించుట కుదరదు. కావున అది ఈ రెండింటికీ మధ్యలో ఉన్న మిథ్య. అజ్ఞానము మిథ్య గనుక దాని కార్యమగు సంసారము కూడ మిథ్యయే. క్షేత్రజ్ఞుని విషయములో ఆ రెండింటికీ వాస్తవికత లేదు గనుక, అవి క్షేత్రజ్ఞుని ఏ విధముగనైననూ ప్రభావితము చేయలేవు. ఎండమావులలోని నీరు ఎడారిని తడిగా చేయలేదు. అధ్యారోపము చేయబడే అధిష్ఠానము అధ్యారోపిత వస్తువుచే ప్రభావితము గాదు. కావున, ఈశ్వర–అభిన్నమగు క్షేత్రజ్ఞ–ఆత్మ అజ్ఞానముచే గాని, దాని కార్యముచే గాని ఏ కాలము నందైననూ ప్రభావితము గాదు. కావున క్షేత్రజ్ఞ–అభిన్నుడగు ఈశ్వరుని యందు కూడ సంసారము లేదు. అనగా ఈశ్వరుడు సంసారి కాడు.

క్షేత్రజ్ఞుడు ఈశ్వరుడైనచో, మానవులు సంసారుల వలె ప్రవర్తించుటకు కారణమేమి? అను ప్రశ్న ఉదయించును. ఈ ప్రశ్నకు భగవానుడు సమాధానము నిచ్చి యున్నాడు. బుద్ధి అజ్ఞానముచే ఆవరింపబడి యుండుటచే, మానవులు సమ్మోహితులగు చున్నారు (అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః). కావున, క్షేత్రజ్ఞుడను నేనేనని యెరుంగుము (క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి) అని భగవానుడు చెప్పు చున్నాడు.

ఈ సందర్భములో మరియొక ప్రశ్న ఉదయించును. అజ్ఞానముచే ఆత్మ సంసారివలె కన్పట్టుచున్నది యున్నచో, శాస్త్రములను చదివి తెలుసుకున్న పండితుడు కూడా దేహేంద్రియాదులతో తాదాత్మ్యమును పొందియుండుటకు కారణమేమి? క్షేత్రజ్ఞునకు దేహము ఉన్నచో, బ్రహ్మాండమంతయు అతని దేహమే యగునని శాస్త్రము నిరూపించు చున్నది. కాని విద్వాంసుడు కూడ ఒక విశిష్ట దేహముతో తాదాత్మ్యమును పొంది వ్యవహరించుచున్నాడు. ఇట్టి వ్యక్తి యొక్క శాస్త్రపాండిత్యమును శ్రీ శంకరులు అపహాస్యము చేసిరి. శాస్త్రాధ్యయనము తరువాత

కూడ వ్యక్తి తాను ఒక విశిష్టదేహేంద్రియ సంఘాతముచే పరిచ్ఛిన్నుడనని తలంచినచో, అది యేటి పాండిత్యము? తనను గురించి అజ్ఞానికి కూడా అట్టి దృష్టికోణమే కలదు గదా! అతడు గొప్ప విద్వాంసుడై అపరావిద్య, భాషాశాస్త్ర జ్ఞానము ఇత్యాదులలో నిష్ణాతుడే అయిననూ, ఇచట మనము పరావిద్యను గురించి చర్చిస్తున్నాము గనుక, అతడు అజ్ఞానిగనే పరిగణింపబడును. కాని అతడు ఈ దృష్టికోణములో జ్ఞానియై ఉండి, దేహము విషయములో 'నా దేహము' అని వ్యవహరించిననూ, అది కేవలము ఉపచారము (figurative) మాత్రమే యగును. ఏలయన, అతని జ్ఞానము దేహ తాదాత్మ్యము యొక్క యథార్థతను బాధించి వేయును. ఇట్టి ఉపచారమునకు బాధితానువృత్తి అని పేరు.

ఇచట ఒక అభ్యంతరము గలదు. 'నేను నిర్వికారుడనగు క్షేత్రజ్ఞుడను' అను సాక్షాత్కారము గల జ్ఞానికి పొందదగిన భోగము ఉండదు. ఏదో విధంగా తన పరిస్థితిని మెరుగు పరుచు కోవాలి అనే ఆదుర్దా అతనికి ఉండదు. కాని ఇట్టి జ్ఞానులు ఉపదేశ గ్రంథ రచనాది రూపములో చాల కర్మలను చేసినారు. దీనిని బట్టి వారికి కీర్తికాంక్ష ఇత్యాది కామనలు గలవని సూచింపబడుచున్నది. ఇది సత్యమైనచో, వారు అజ్ఞానులు అగుదురు. వారిలో ఇట్టి కామనలు లేనిచో, ఈశ్వర అభిన్నము అవికారి అగు ఆత్మస్వరూపమును వారెరింగిన పక్షములో, ఆత్మ యందు వారు మార్పును గోరుట ఎట్లు సంభవమగును? సాధారణముగా మానవులు తమలోని దుఃఖమును పోగొట్టు కొనుటకు, కొంత సుఖమును సంపాదించుటకు, తద్వారా తమ పరిస్థితిలో ఉచితమగు మార్పును దెచ్చి మెరుగు పరుచుకొనుటకు వివిధ కర్మలను చేయుచుందురు. దీనికి మూలమేమనగా – 'ఆత్మ కర్త; కర్మలను చేసి వాటి ఫలములను అనుభవించి ఆత్మ భోక్త యగును' అను ధారణయే. కర్మను చేయుట యందు, ఫలమును భోగించుట యందు కూడ వికారము గలదు. క్రియ ఏదైనా నిశ్చితముగా మార్పును కలిగించును. కర్మను చేసే ప్రేరణ నా యందు ఉన్నచో, ఆత్మ వికారములను పొందుననే ధారణ కూడ నా యందు ఉండి తీరవలెను. ఇపుడు నేను దుఃఖినై ఒక అవస్థలో మన్నాను. నేను సుఖిని కాగలననే ఆశతో కర్మను చేస్తాను. అనగా ఆత్మ యందు ఒక మార్పు వచ్చునని నేను తలంచుచున్నాను. కాని ఆత్మ రూపుడనగు నా యందు వికారము లేవియు లేవని నేను ఎరింగియున్నచో, నా యందు ప్రవృత్తి గాని, నివృత్తి గాని ఎట్లు ఉండగల్గును? ఈ కర్తృత్వ భోక్తృత్వములు ఆత్మధర్మములు అని స్వీకరించు మానవుడు మాత్రమే కర్మను చేయవలెననే కామనను కలిగియుండును. ఏ ఆత్మ యందు కర్తృత్వభోక్తృత్వములు అధ్యారోపము చేయబడినవో, ఆ ఆత్మ కర్తృత్వ భోక్తృత్వ వినిర్ముక్తమని ఏ మానవుడు ఎరుంగునో, అట్టివాడు చేయు కర్మలన్నియు ఉపచారములు మాత్రమే. వాని దృష్టిలో కర్మ మిథ్యయగును.

ఆత్మ మార్పులకు లోనుగాదని జ్ఞాని యెరుంగును. కాన ఆత్మ కర్తగాని, భోక్త గాని యగుట అసంభవమనియు అతడెరుంగును. ఇట్టి స్థితిలో జ్ఞాని కర్మఫలభోగము కొరకై ఒక కర్మను ఆచరించుట అను ప్రసక్తి ఉదయించదు. వైదిక కర్మలలో గాని, లౌకిక కర్మలలో గాని అజ్ఞాని మాత్రమే వ్యాపృతుడగును. ఏలయన, వివిధ ఫలములను కోరే ప్రవృత్తి అజ్ఞాని యందు మాత్రమే గలదు. ఆత్మ అవికారి యను దర్శనము గల జ్ఞాని యందు తనలో మార్పును గోరి దాని కొరకై కర్మను అనుష్ఠించవలెననే కామన ఉండజాలదు. జ్ఞానికి అటువంటి కర్మ ప్రవృత్తి విలీనమగును. అతనియందు ప్రవృత్తి లేకుండుటచే నివృత్తి వున్నట్లు గానవచ్చును. ప్రారబ్ధకర్మవలన సంప్రాప్తమైన ప్రవృత్తి మాత్రమే మిగిలియుండును. స్వీయప్రేరణతో చేసే కర్మలు ఏమియూ ఉండవు. 'నేను సర్వకర్మల నుండి విరమించుకున్నాను' అను ధారణ కూడా జ్ఞానియందు ఉండదు. కొంత కర్తృత్వాభిమానము మరియు సంకల్పము ఉన్నప్పుడు మాత్రమే ఇట్టి నివృత్తి ధారణకు అవకాశము ఉండును. అవి ఉన్నచో, ఆత్మ నివృత్తి యను కర్మయందు అభిమానముండుటచే, ఆత్మ కర్తగనే మిగిలి యుండును. అకర్మ యనగా క్రియలు లేకుండుట గాదని శ్రీ కృష్ణుడు ఇంతకు ముందు చెప్పి యున్నాడు. కర్మల నుండి ఉపరతి అను దానియందు కూడ కర్త సమ్మిలితుడై యుండును. కాని జ్ఞాని ఈ ప్రవృత్తి–ఉపసంహారము నందు తాను కర్తననే అభిమానమును కలిగియుండడు. అది అతనికి అతి సహజముగా సిద్ధించును. ఏలయన, అతనిలో ఫలాకాంక్ష అనే మానసిక స్థితి లోపించినది. అతడు దేహేంద్రియ మనస్సంఘాతముపై 'కర్మలను చేయవద్దు' అను తన సంకల్పమును రుద్దుట లేదు. ఇటునటు కొంతసేపు ఊగి లోలకము (pendulum) ఆగిపోవును. అటులనే దేహేంద్రియ సంఘాతము కూడ తనంత తానుగా ఉపరమించును.

వేదమును వల్లించి దాని యర్థము నెరింగి వివిధ కర్మలను అనుష్ఠించే వైదిక పండితులు పరావిద్యలో పండితులుగా పరిగణించబడరు. ఏలయన, ఆత్మ అవిక్రియము అనే స్పష్టమగు అవగాహన వారికి లేదు.

'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' అని ఈశ్వరుడు స్పష్టముగా చెప్పుచున్నాడు. అయినను, ద్వైతులు ఈ శ్లోకమును చదివిన తరువాత కూడా జీవుడు క్షేత్రము కంటె భిన్నుడగుట మాత్రమే గాక, ఈశ్వరుని కంటె కూడా భిన్నుడని వాదించెదరు. జీవుని యందు సుఖదుఃఖములు, జన్మమరణములు ఉన్నవి గనుక, జీవుడు ఈశ్వరుని కంటె భిన్నుడని వారి అభిప్రాయము. కాని సుఖదుఃఖములు ద్వైతికైనను స్వీకార్యము కావు గనుక, ద్వైతి కూడ సంసారము తొలగిపోయి మోక్షమును పొందవలెనని ప్రయత్నించును. ద్వైతి దృష్టిలో జీవుని కర్తృత్వ భోక్తృత్వములు,

జగత్తు మరియు ఈశ్వరుడు అను ఈ సర్వము సత్యమే. సంసారము నుండి విముక్తి కొరకై అతడు ఈశ్వరుని శరణు వేడును. ఇతర జీవులు ఈ విషయములో తనకు సహాయమును చేయజాలరని అతడు ఎరుంగును. అతని వాదములో, క్షేత్రజ్ఞుడగు ఈశ్వరుడు ఈ క్షేత్రమును సృష్టించెను. ఈశ్వరుని గురించి ఎంత అధికంగా తెలిస్తే, అంత అధికంగా ధ్యానించవచ్చును. క్షేత్రక్షేత్రజ్ఞుల గురించిన జ్ఞానము కొరకై శాస్త్రము ఉద్దేశింపబడినది. ఈశ్వరుడు మాత్రమే తన స్వరూపమును నిరూపించగలడు. కావున ఈశ్వరుని గురించి తెలియుట కొరకు శాస్త్రము అవశ్యకమగును. ముందుగా నీవు విజ్ఞానమును సంపాదించి, దాని సహాయముతో ధ్యానమును చేయవలెను. శాస్త్రము బోధించిన విధములో ఈశ్వరుని భావన చేయవలెను. ఈశ్వరుని కృపవలన పరమానందము మొదలగు ఈశ్వర గుణములు లభించును.

ఈ వాదములో అనేక ఇబ్బందులు గలవు. జీవుడు ఈశ్వరుని ధ్యానించు సమయములో తన జీవత్వమును విడిచి పెట్టునా? విడిచి పెట్టడా? విడిచి పెట్టే పక్షంలో ఈ జీవత్వము యథార్థమా? కల్పితమా? యథార్థమైనచో, ఎట్లు విడిచి పెట్టును? కల్పితమన్నచో, ఈశ్వరుడు ఒక్కడే గలడని నీవు అంగీకరించి, ద్వైతమును నిషేధించినట్లు అగును. అట్లు గాక, జీవుడు యథార్థమన్నచో, జీవునకు ఏది లభించినా, అది అతని జీవత్వమునకు తగ్గట్లు ఉండును. తమిళములో ఒక సామెత గలదు. బొటనవ్రేలు ఎంత వాచిననూ, నిమ్మకాయంత అగునే గాని, గుమ్మడి కాయంత కాలేదు. మరియు , ఆ వాపునకు గల కారణము తొలగిపోగానే, వాపు తగ్గి మామూలు స్థాయికి వచ్చును. అదే విధముగా, జీవుడు ఈశ్వర గుణములను పొందుట అనేది కూడా జీవునకు గల హద్దులకు లోబడియే యుండును. ఒక పిల్ల తరంగము సముద్రమును ధ్యానించి పెద్ద భగ్నోర్మి (breaker) కాగలదు. అంతకు మించి కాలేదు. అదే విధముగా అల్పవ్యక్తి యగు జీవుడు ఎంత ప్రఫుల్లితుడైనా, పరిచ్ఛిన్నుడుగనే మిగిలి యుండును. భేదవాదులు శ్రీకృష్ణభగవానుని 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అను వాక్యమును సరిగా తెలియకుండిరి. ఇట్టి అల్ప పండితులు శ్రుతి చెప్పిన దానిని చెడగొట్టి, చెప్పని దానిని కల్పించెదరని శ్రీశంకరులు పలికిరి. శాస్త్రము సార్థకమగుట కొరకై మోక్షము వాస్తవము అయి ఉండవలెను. దాని కొరకై సంసారము యథార్థము కావలెనని ద్వైతవాదుల అభిప్రాయము.

ఈ వాదము యొక్క సత్స్వరూపము నెరుంగ జాలక ద్వైతవాది తన వినాశమును తానే కొని తెచ్చుకొనునని శ్రీ శంకరులు చెప్పినారు. సంసారము యథార్థమైనచో, దానిని పోగొట్టు కొనుట ఎట్లు సంభవమగును? ఇట్టి అల్పపండితులు వేద, తర్క, సాహిత్యాదులను చదివి యున్నారు

గనుక, జనుల దృష్టిలో వారు పండితులుగా చెలామణీ అగుదురు. జనులు వారినుండి జ్ఞానమును పొందుటకు ముందుకు వచ్చెదరు. కాని వారు భ్రాంతులై యుండుటచే, ఇతరులను కూడ భ్రాంతిలో పడవేయుదురు. జీవుడు క్షేత్రము కంటె భిన్నుడు; ఈశ్వరుని కంటె కూడా భిన్నుడు; నీవు ఐశ్వర్యమును పొందగోరినచో, ఈశ్వరుని ధ్యానించవలెను. అదియే మోక్షము అని వారు చెప్పెదరు. ఇట్టి వారు శాస్త్రమును చదివిన వారే అయిననూ, సంప్రదాయ సిద్ధమగు శాస్త్రజ్ఞానము వారిలో కరువై యున్నది. సృష్ట్యాది నుండి వ్యాసుని వరకు, తరువాత శంకరుని వరకు ఒక సంప్రదాయము గలదు. దీని ప్రకారంగా 'నీవు ఈశ్వరుడవు' అనునది శాస్త్ర దర్శనమై యున్నది. సంప్రదాయమునననుసరించు వారు ఆ దర్శనమును పొందగల్గుదురు. సంప్రదాయము నెరుంగని వారికి ప్రతి వాక్యము ఇతర వాక్యముల కంటె భిన్నముగా భాసించుటచే సమగ్రదర్శనము అసంభవమగును. ద్వైతమును సమర్థించు చున్నట్లు వ్యాఖ్యానించుటకు వీలుపడే వాక్యములపై ద్వైతి తన దృష్టిని కేంద్రీకరించి తన వాదమును సమర్థించు కొనును. కాని 'తత్త్వమసి' ఇత్యాది వాక్యముల వద్దకు వచ్చు సరికి తన వాదమును నిలబెట్టుకొనుటకు అతడు చాల ఘర్షణ పడుచుండును. వారు ఎంత కష్టపడి ప్రయత్నించిననూ, ద్వైతమును నిలబెట్టుట అసంభవము. ఏలయన, ద్వైతము సత్యము కాదు. ఇంత కష్టపడినందులకు ప్రయోజనము శూన్యము. ఇంత కష్టపడిన తరువాత అతనికి తాను సంసారియని తెలును. ఆరంభములో అతనికి గల ఫిర్యాదు సంసారియై ఉండుట. ఇంత విస్తృతమగు విచారమును చేసిన పిదప తాను వాస్తవముగా సంసారియనే నిర్ణయమునకు అతడు వచ్చును. ఇంత కష్టపడి నందులకు మిగిలినది శూన్యము. అప్పుడాతడు ధ్యానము ద్వారా తాను వైకుంఠమును చేరగలనని ఆశపడు చుండును. వీరు శాస్త్రవచనమును పాడు జేసి, శాస్త్రము చెప్పని దానిని కల్పించు కొని, తాము విమోహితులగుటయే గాక, ఇతరులను కూడ మోహింపజేసెదరు. కావున, మానవుడు సంసారమనే సమస్యకు పరిష్కారమును కనుగొనుటకై సంప్రదాయ వేత్తను ఆశ్రయించవలెను. జీవునకు అది లేదనియు, జీవుడు స్వరూపతః ఈశ్వరుని కంటె భిన్నుడు కాదనియు, మరియు ఈ దృశ్యమాన జగత్తు అంతయూ ఆత్మ కంటె భిన్నముగా లేదనియు ఎరుంగువాడే సంప్రదాయవిత్ అనబడును.

ఈ చర్చ అంతయూ శాస్త్రము సార్థకమని నిరూపించుటకై చేయబడినది. కాని జీవత్వము ఇత్యాదులు యథార్థమని చెప్పినచో, శాస్త్రము యొక్క ప్రామాణ్యము నిలబడదు. శాస్త్రము అనధిగత జ్ఞాన రూపము అయినప్పుడు మాత్రమే ప్రమాణము అగును. అనగా జ్ఞానేంద్రియములకు, వాటిపై ఆధారపడే ఇతర ప్రమాణములకు అందని జ్ఞానమును శాస్త్రము ఈయవలెను. మరియు ఆ జ్ఞానము అబాధితమై యుండవలెను. బాధితమైనచో, అది జ్ఞానమే

కాదు. శాస్త్రము ఇట్టి జ్ఞానమును ఇచ్చునా? ఈయదా? అను దానిపై దాని ప్రామాణ్యము ఆధారపడి యుండును. జీవేశ్వరులకు భేదము ఉన్నదని నీవు అన్నచో, ఇది ప్రత్యక్ష ప్రమాణ సిద్ధమని చెప్పుటకు వీలు లేదు. ఈశ్వరుడు ఇతర వ్యక్తి రూపములో గోచరించుట లేదు. అట్లు గోచరించినచో, ఈశ్వరుడు జీవుని కంటె భిన్నుడని చెప్పుటకు వీలుపడెడిది. ఇట్టి స్థితిలో ఏ ప్రమాణమును బట్టి నీవీ భేదమును స్థాపించెదవు? ద్వైతము కేవల ఊహాజనితము మాత్రమే. ఇద్దరు వేర్వేరు వ్యక్తులను చూపించి, 'వీరిలో ఒకడిని నేను; రెండవ వాడిని నేను కాదు' అని గుర్తు పట్టినచో, 'నేను ఈశ్వరుని కంటె భిన్నుడను' అని నీవు చెప్పగల్గుదువు. కాని అంత వరకు ఈ భేదమును స్థిరపర్చుటకు వీలు పడదు. కాని 'నాలో ఒక వ్యక్తిత్వధారణ (sense of individuality) గలదు' అని మాత్రము నీవు చెప్పగల్గుదువు. జీవునకు, జగత్తునకు మధ్య భేదము గలదని నీవు చెప్పినచో, అది వేరే విషయము అగును. దానిని మనము విశ్లేషించి, ఎంత భేదము గలదు? అను విషయమును తెలుసుకుందాము. కాని, జీవునకు, ఈశ్వరునకు భేదము గలదని నీవెట్లు చెప్పుచున్నావు? నీవీ నిర్ణయమునకు వచ్చుటకు ముందు ఈశ్వరుని చూచియున్నావా? ఈశ్వరుని విషయములో శాస్త్రమే ఏకైక ప్రమాణము. భేదము లేదని శాస్త్రము చెప్పుచున్నది.

స్థూలదేహములో నివసించే జీవునకు ఇదమిత్థముగా నిర్దేశించగలిగే రూపము లేదు. అట్టి జీవుని ఈశ్వరుని కంటె భిన్నుడని వివేచించుట రూపము ఆధారముగా ఎట్లు సంభవమగును? కుండ, వస్త్రము అను వాటి మధ్య రూపమును బట్టి భేదము సంభవమగును. ఉప్పు, కప్పురము ఒకే రూపమును కలిగి యుండును. కావున వాటిని రూపముచే వివేచించలేము. కాని అవి వేర్వేరు ధర్మములను కలిగియున్నవి. అదే విధముగా జీవేశ్వరుల మధ్య రూపభేదము లేకున్ననూ, బహుశః గుణభేదము గలదేమో! ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అని శాస్త్రము చెప్పుచున్నది. కాని వ్యక్తులమగు మనకు అల్పశక్తి, అల్పజ్ఞానము మాత్రమే గలవని మనకు అనుభవములో నున్నది. అనగా గుణభేదము ఉన్నట్లే కానవచ్చుచున్నది. కాని ఈశ్వరుడు సర్వ గుణ వినిర్ముక్తుడు; సత్య-జ్ఞాన-అనంత స్వరూపుడు అని కూడా శాస్త్రము చెప్పుచున్నది. మరియు ఆత్మ కూడా సత్య-జ్ఞాన-అనంతమేనని యు, కావున ఈశ్వరాభిన్నమనియు శాస్త్రము బోధించుచున్నది. జ్ఞానము, శక్తి ఇత్యాదులలో జీవేశ్వరుల మధ్య గల భేదము వాస్తవమగు భేదమును స్థాపించజాలదు. రెండు విభిన్న తత్త్వములు ఉన్నపుడు మాత్రమే వాస్తవమగు భేదము స్థాపితమగును. కాని రెండు వస్తువులు స్వరూపములో ఒకటియై ఉండి, ఉపాధిచే భిన్నములుగా భాసించు చున్నచో, అది వాస్తవమగు భేదమును స్థాపించలేదు. ఈశ్వరుడు పృథక్ తత్త్వము (separte entity) గా నుండి

సర్వజ్ఞుడు కాజాలడు. ఏలయన పృథక్ తత్త్వమునకు స్వీయదేహము, మరియు మనస్సు ఉండవలెను. ఈశ్వరునకు మనస్సు ఉన్నచో, ఆయనకు ఒక కాలములో ఒక ఆలోచన మాత్రమే ఉండును. అనగా ఇతరము సర్వము అజ్ఞాతమై యుండును. అనగా ఆయన సర్వజ్ఞుడు కాజాలడు. ఇదే విధముగా భగవానుడు నీ కంటె భిన్నముగా నున్నచో, నీ యందు గల శక్తి ఆయన యందు లేదు గనుక, ఆయన యందు సర్వశక్తి మత్త్వమును నిలబెట్టుట అసంభవమగును. జీవేశ్వరులకు రూపములో గాని, గుణములో గాని భేదము లేకపోయిననూ, వారు ఒకే రకంగా ఉన్న రెండు కుండల వలె వేర్వేరు తత్త్వములు కావచ్చును గదా? అని ప్రతిపక్షి వాదించును. ఈశ్వరుడు ఒక వస్తువు అయినచో, ఆయనకు 'ఏకమేవాద్వితీయమ్' అను శాస్త్ర వర్ణన పొసగదు. మనకు ఈశ్వరుని గురించి తెలిపేది శాస్త్రము మాత్రమే. ఈశ్వరుడు ఒక పదార్థము అగుట గాని, రెండవ వస్తువు ఉండుట గాని శాస్త్రవిరుద్ధము. వాస్తవంలో మనము విశ్లేషించ నారంభించినచో, ఈ జగత్తులో ఈశ్వరుని కంటె భిన్నమైన ద్వితీయ వస్తువు యొక్క ఉనికిని నిరూపించ జాలము. ఒక దృష్టికోణములో మాత్రమే ద్వితీయ వస్తువు ఉనికిని కలిగియున్నది. మనము స్థూలదేహమును పరిశీలించెదము. భౌతిక ప్రపంచము కంటె అది భిన్నముగా నున్నదా? అట్లు లేని పక్షములో స్థూలదేహమును, భౌతిక ప్రపంచమును రెండు వేర్వేరు వస్తువులు అని నిరూపించుట ఎట్లు సంభవమగును? మరియు, ఈ భౌతిక ప్రపంచములో మనోవృత్తిచే తెలియబడుతూ, మనోవృత్తి కంటె భిన్నముగా నున్న వస్తువు యొక్క ఉనికిని స్థాపించుట సంభవము కాదు. జ్ఞాతకు, వృత్తికి స్వరూపము ఒకే చైతన్యము అని నీవు గుర్తించగల్గినచో, రెండవ వస్తువు ఎచ్చట గలదు?

బహుశః జీవేశ్వరులు ఒకటియేయైననూ, వాయు–ఆకాశములవలె విభిన్నమగు గుణములను కలిగి యుండవచ్చును గదా! ఆకాశ వాయువులు రెండూ భూతములే అయిననూ, వాయువునకు స్పర్శ స్వీయధర్మము కాగా, ఆకాశమునకు శబ్దము స్వీయ ధర్మమగును. అదే విధముగా ఈశ్వరుని యందు సమస్త కల్యాణ గుణములు ఉండగా, జీవుని యందు కొన్ని మాత్రమే గలవు. ఈ వాదములో కూడా మనము పూర్వము చూచి యున్న సమస్యలు తప్పవు. ఈశ్వరుని యందు గుణములున్నచో, ఆయన మరియొక పదార్థము అగును. ఈశ్వరుడు సగుణుడనే భావనకు శాస్త్ర సమర్థన లేదు. ఈశ్వరుడు, ఆత్మ నిర్గుణములని శాస్త్రము చెప్పుచున్నది. గుణములు లేవు గనుక గుణముల వలన కలిగే భేదము సంభవము కాదు.

రూపములో గాని, గుణములో గాని భేదము లేకున్ననూ, నామములో భేదము ఉండవచ్చును గదా! అని ద్వైతి మరల సూచించవచ్చును. ఉదాహరణకు కుండకు ఘటము, కలశము అను

రెండు వేర్వేరు నామములు గలవు. బాగున్నది. ఇది అంగీకారమే. ఒక ఉపాధి దృష్ట్యా అనంత చైతన్యమునకు ఈశ్వరుడనియు, మరియొక ఉపాధి దృష్ట్యా జీవుడనియు నామము కలుగును. ఉదాహరణకు, ఒకే వ్యక్తి ఒక దృష్టికోణములో తండ్రి అనియు, మరియొక దృష్టి కోణములో పుత్రుడనియు పిలువబడును. అదే విధముగా అదే సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ ఒక విశిష్ట-అంతఃకరణముచే అవచ్ఛిన్నమై జీవుడనియు, మాయోపాధి-అవచ్ఛిన్నమై ఈశ్వరుడనియు పిలువబడును. కాని ఈ భేదములో సారము లేదు. ఏలయన, మనము పరిగణించేది వస్తువునే గాని, అవస్తువును గాదు. కావున, జీవేశ్వరుల మధ్య భేదము నిలబడేది గాదు.

ప్రతివాది మరియొక వాదముతో ముందుకు వచ్చుచున్నాడు: జీవేశ్వరుల మధ్య అభేదమును స్థాపించవలసిన పరిస్థితి ఉన్నది గాన, అద్వైతులు మున్ముందుగా భేదమును అంగీకరించినట్లు అగుచున్నది. దీనికి ఉత్తరమేమనగా, మా అంగీకారము తాత్కాలికము మాత్రమే. భేదము ప్రస్తావింపబడినది గాన, అభేదమును ప్రదర్శించవలసిన ఆవశ్యకత ఏర్పడినది. అజ్ఞానుల దృష్టిలో జీవేశ్వర భేదము గలదు. ఈ అజ్ఞానము ఉన్నంతవరకు, దానిని తొలగించుటకై శాస్త్రము ఆవశ్యకమగును.

మాయోపాధి-అవచ్ఛిన్నమగు చైతన్యము ఈశ్వరుడనియు, అదే చైతన్యము అంతఃకరణ-అవచ్ఛిన్నమై జీవుడు అగుననియు చెప్పుట ద్వారా భేదమును అంగీకరించినట్లే యగునని మరల ద్వైతి వాదించును. దీనికి ఉత్తరమేమనగా, శుద్ధచైతన్యము దేనిచే అవచ్ఛిన్నమైననూ, గుణములను వేటినీ స్వంతము చేసుకొనదు. అంతఃకరణము ఉపాధి అన్నప్పుడు, ఉపాధి ఆత్మ కంటె భిన్నమగు మరియొక వస్తువు కాదని తెలియుట చాల ముఖ్యము. మిథ్యయగు ఉపాధికి సత్య-ఆత్మ లేనిదే ఉనికి లేదు. అనంత మగు చైతన్యమును అంతః కరణాదులు సీమితము చేయలేవు. అనంతమగు ఆకాశమును ఘటము సీమితము చేసినట్లు కన్పట్టును. అదే విధముగా చైతన్యము కూడ పరిచ్ఛేదము చేయబడినట్లు కానవచ్చును. పూర్ణమగు ఆత్మను అంతః కరణము గాని, ఇతరముగాని ఎట్లు పరిచ్ఛిన్నము చేయగల్గును? ఆత్మ సర్వదా పూర్ణమై యుండును. నీవు నీ 'నేను'ను అంతః కరణముతో తాదాత్మ్యమును పొందించి, 'నేను' అల్పుడను అని చెప్పెదవు. అట్లు గాక, నీవు నీ 'నేను'ను చైతన్యములో ఐక్యము చేసినచో, పరిచ్ఛేదమెచ్చట గలదు? ఘట మఠాదులు ఆకాశమునందు వాస్తవమగు విభాగమును కలిగించలేవు. అటులనే, పూర్ణమగు ఆత్మ యందు కన్పట్టు భేదము యథార్థము కాదు. అదే విధముగా, మాయోపాధికి, అంతఃకరణ-ఉపాధికి మధ్యలో ఉపాధి కృతభేదము మాత్రమే గలదు. వస్తు కృతభేదము లేదు. ఉపాధి

వస్తువు నందు భేదమును కలిగించలేదు. అందువలననే, దానికి ఉపాధియని పేరు వచ్చినది. ఎర్రని పుష్పము ప్రక్కనే ఉన్న స్ఫటికము ఎర్రగా ఉన్నట్లు కన్పట్టును. పుష్పము స్ఫటికములో వాస్తవమగు మార్పును సృష్టించలేదు. వాస్తవమగు మార్పును కలిగించినచో, అది ఉపాధి కాదు.

జీవేశ్వరుల మధ్య భేదము గలదు అను ధారణను త్రోసిపుచ్చుటలో, మనము భక్తితో ఈశ్వరుని ఆరాధించు వ్యక్తిని విమర్శించుట లేదని ఇచట గమనించవలసి యున్నది. అట్లు భగవంతుని ఆరాధించుటలో సమస్య లేదు. భేదము వాస్తవమని స్థాపించుటకు చేయు ప్రయత్నములో మాత్రమే సమస్య గలదు. అట్లు స్థాపించుటకు ఆ భేదమును ఇతరులచే ఒప్పించుటకు వ్యక్తి కటి బద్ధుడై యున్నప్పుడు, దానిని చర్చించి తీరవలెను. ఏలయన, అద్వైత దర్శనమును వంట బట్టించు కొనుటలో ద్వైత నిరాకరణము తప్పని సరిగా అంతర్భాగమై యుండును.

హరిః ఓం తత్సత్

శ్రీకృష్ణార్పణమస్తు

**श्रीगणेशाय नमः**

ఇపుడు శ్రీ శంకరులు మరియొక విషయవస్తువును ఉపక్రమించబోతూ, ఇంతవరకు చేసిన చర్చను సారసంగ్రహరూపముగా ప్రతిపాదించుచున్నారు. ఏలయన, తరువాత రాబోవు మీమాంసకు ఈ చర్చ ఆధారమగును. క్షేత్రజ్ఞ–ఈశ్వరులకు అభేదమన్నచో, ఈశ్వరుడు సంసారి యగును. అట్లుగాక, అభేదము యథార్థమై, ఈశ్వరుడు సంసారి కాడన్నచో, సంసారము లేకుండును. ఇది మన అనుభవమునకు విరుద్ధము. ఈ అభ్యంతరము ఇంతకు ముందు లేవదీయబడినది. శ్రీ శంకరులు దానికి సమాధానమునిచ్చి యున్నారు. ఇచట శ్రీ శంకరులు పరిస్థితిని అంతను ఒకే ఒక వాక్యములో సారరూపముగా సమీక్షించుచున్నారు. ఈ సర్వము జ్ఞాన–అజ్ఞానముల మధ్య గల భేదముననుసరించి ఘటిల్లుచున్నది. జీవ–ఈశ్వరులు ఒక్కటియే అగుటచే, జీవుడు గాని, ఈశ్వరుడు గాని సంసారి కాడు. కాని ఈ సత్యము నెరుంగక పోవుటచే సంసారిత్వము గలదు. కావున, ఐక్యములో దోషము లేదు. పై అభ్యంతరము నిలబడదు. 'నీవు సంసారివి కాదు' అను సత్యమును జీవునిచే గుర్తింప జేయుట కొరకై, 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి' అని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ సత్యము నెరింగిన వాడు తాను సంసారినని భ్రమపడడు. కావున జ్ఞాన–అజ్ఞానముల మధ్య భేదమనగా సంసారిత్వ–అసంసారిత్వముల మధ్య గల భేదమని యర్థము. అజ్ఞాన కల్పితమైన పరిచ్ఛేదము, లేక దోషము సత్యవస్తువును ప్రభావితము చేయజాలదు. ఎండమావులలోని నీటి వలన ఎడారిలో తడి ఏర్పడదను దృష్టాంతమును శ్రీశంకరులీ సందర్భములో ఇచ్చి యుండిరి. ఇదే తీరున, నీవు అజ్ఞానముచే ఆత్మ సంసారియని ఊహించుకున్నచో, ఆ సంసారిత్వము ఆత్మను ప్రభావితము చేయదు. ఈ సత్యము నెరుంగక మునుపు, ఎరింగిన తరువాత కూడ ఆత్మ ఈశ్వరుడే. ఈ సత్యమును నీవెరింగినచో, సంసారిత్వము లేదు. ఈశ్వరుడు ముందుగా జీవుడై, ఆ పిదప జ్ఞానముచే సంసారము నుండి విముక్తిని పొందునని అనుకోరాదు. అజ్ఞానావస్థలో నైననూ ఆత్మ దానిచే ప్రభావితము కాదు. సంసారిత్వము ఆత్మ ధర్మము కాదు. కాని అజ్ఞానము ఉన్నంత వరకు ఆత్మ సంసారియనే భ్రాంతి తప్పదు.

ఇట్టి పునరావృత్తి ఉపదేశప్రక్రియలో భాగముగా స్వీకరింపబడినది. ఈ పునరావృత్తి సూత్రమునకు సింహావలోకనన్యాయమని పేరు. సింహము నడుమనప్పుడు కొద్ది అడుగులు ముందుకు వేసి, ఆగి వెనుకకు చూచును. అదే విధముగా ఒక విషయమును బోధించు సమయములో ఆచార్యుడు వెనుకకు చూచును. అనగా చెప్పిన దాని సారాంశమును సంక్షేపముగా మరల వక్కాణించి ఆపైన ముందుకు సాగును.

క్షేత్రజ్ఞునకు అవిద్య వలన మాత్రమే సంసారము గలదు. ఈ జ్ఞానమును దృఢపరచుటకై ఇచట మరింత చర్చ గలదు. ఇట్టి చర్చకు స్థూణా-నిఖనన-న్యాయము అని పేరు. రాటను గోతిలో పాతి దాని చుట్టూ మట్టిని కూరి, అది కదలని విధముగా మట్టితో మరింత బిగియునట్లు చేసెదరు. ఆ తరువాత ఆ రాటను ఇటునటు ఊపి దాని బలమును పరీక్షించెదరు గదా! ఇదే సూత్రమును బోధనలో కూడ వాడెదరు. ఒక సత్యమును ప్రతిపాదించి, దానికి విరుద్ధమగు వాదనలను లేవదీసి, వాటి ద్వారా ఆ సత్యమును ఇటునటు పరీక్షకు గురి చేసెదరు. ఆ పరీక్షలను ఎదుర్కొనుట ద్వారా సత్యము ప్రతిష్ఠాపితమగును.

శ్రీ శంకరులు ఈ విషయము నంతనూ ఇచట పునరావృత్తి చేయుటకు కారణమేమనగా- ఒక అభ్యంతరమును లేవనెత్తి తద్ద్వారా ఒక విషయమును సుస్పష్టము చేయవలెనని వారి ఆకాంక్ష. ఆ అభ్యంతరమేదనగా - సంసారిత్వము అజ్ఞానముచే బయట దర్శించేది (అవిద్యా కల్పితము, projected) మాత్రమే అన్నచో, ఇది ఎవరికి చెందును? అవిద్య క్షేత్రజ్ఞునకు చెందునన్నచో, అవిద్యాసహితుడగు ఈ క్షేత్రజ్ఞుడు ఈశ్వర-అభిన్నుడు ఎట్లు కాగల్గును?

అవిద్య వలన సంసారము కలుగుచున్నదని అంగీకరించే నీవు ఆ అవిద్య క్షేత్రజ్ఞునకు చెందునని అంగీకరించెదవు గదా! అవిద్య ఉన్నచో, సుఖిత్వ-దుఃఖిత్వ-జన్మ-మరణ-ఇత్యాది-అవిద్యా-కార్యములన్నియూ ఉన్నట్లే. అనగా మనము ప్రత్యక్షముగా అనుభవిస్తూ పరివేదనను ప్రకటిస్తూ ఉండే సర్వము ఉన్నట్లే. అజ్ఞానము వలననే మనమీ సమస్యలనన్నిటినీ కలిగియున్నాము. అనగా క్షేత్రజ్ఞుని యందు అజ్ఞానమనే దోషము ఉన్నది.

శ్రీ శంకరులిట్లు ప్రశ్నించుచున్నారు : ఈ అజ్ఞానము తెలియబడునా? తెలియబడదా? ఆత్మ సచ్చిదానంద బ్రహ్మ అని నీకు తెలిసినచో, నీలో అవిద్య లేదు; అట్లు తెలియనిచో, అవిద్య గలదు. ఈ అవిద్య నీచే తెలియబడుచున్నదా? తెలియబడుట లేదా? అవిద్య తెలియబడే పక్షంలో, అది జ్ఞానములో విషయమగు చున్నది. తెలియబడేది తెలుసుకునే క్షేత్రజ్ఞుని కంటె భిన్నముగ నుండునని మనము పూర్వము నిరూపించి యున్నాము. అజ్ఞానము స్వయం ప్రకాశము కాదు గదా! అది జడము గనుక, ఘటము వలె నీచే తెలియబడు చున్నది. ఈ అధ్యాయములో తరువాత శ్రీ కృష్ణుడు క్షేత్రమును విస్తారముగా వర్ణించగలడు. ఆ క్షేత్రములో అవ్యక్తము కూడ అంతర్గతమగును. అవ్యక్తమనగా మాయ, లేక అవిద్య. నీచే తెలియబడేది ఏదైనా క్షేత్రములో భాగమగును. అది క్షేత్రజ్ఞునకు విశేషణమయ్యే అవకాశము లేదు. మరియు అది క్షేత్రజ్ఞుని స్వరూపమును ప్రభావితము చేయుటయూ సంభవము కాదు. కావున దోషము లేదు.

మనము స్థూలదేహమును పరిశీలించెదము. దానికి వార్ధక్యము గలదు. కాని క్షేత్రజ్ఞ-ఆత్మకు వార్ధక్యము లేదు. ఏలయన, క్షేత్రమునకు సంబంధించినది క్షేత్రగుణము అగును. అది బోధరూపుడగు క్షేత్రజ్ఞుని ప్రభావితము చేయదు. సూర్యకాంతిలో ప్రకాశించే వస్తువులచే సూర్యుడు ప్రభావితుడు గాడు. అటులనే, ఆత్మచే ప్రకాశింప చేయబడే సర్వము, అవిద్యతో సహా, క్షేత్రజ్ఞ-ఆత్మను ప్రభావితము చేయదు. క్షేత్రజ్ఞుడు సర్వదా అసంగుడుగనే యుండును. శ్రీ శంకరులు దీనినింకనూ వివరించిరి. ఈ దోషజాలమంతయు క్షేత్ర ధర్మము మాత్రమే. దానికి క్షేత్రజ్ఞునితో లేశమైననూ సంబంధము లేదు. ఏదేని మరియొక చిన్న దోషము నీయందు నీకు కానవచ్చిననూ, అది నీచే తెలియబడు చున్నది గనుక, క్షేత్ర ధర్మమగునే గాని, క్షేత్రజ్ఞ ధర్మము కాబోదు. సుఖదుఃఖములు, మరణము, స్థూలత్వము ఇత్యాది ధర్మములన్నియు నీచే తెలియబడుచున్నవి గనుక, అవి విషయములు (objects) అగును. ఇవి క్షేత్రజ్ఞునిపై ఆరోపించబడు చున్నవి. ఇవి వాస్తవముగా క్షేత్రజ్ఞ ధర్మములు కాజాలవు. సుఖిత్వ-దుఃఖిత్వ-కర్తృత్వ-భోక్తృత్వాది-విశిష్ట మగు సంసారిత్వము అనే స్థితి గురించి నీకు ఫిర్యాదు గలదు. ఆత్మపై ఆరోపించ బడే ఈ దోషములన్నియు నీచే తెలియబడు చున్నవా? లేదా? గాఢనిద్రలో వలె ఈ దోషములు నీకు తెలియకున్నచో, సమస్య లేదు. అవి నీకు తెలియుచున్నచో, క్షేత్రధర్మములే యగును గాని, క్షేత్రజ్ఞుడవగు నీ ధర్మములు కావు గనుక, సమస్య లేదు. ఇట్టి స్థితిలో మనము సంసారులమనే అనుభవము కలుగుటకు కారణమేమి? ఆత్మ-అనాత్మల వివేకము లేక పోవుటయే ఇచటి సమస్య. క్షేత్రజ్ఞునిపై ఆరోపించబడే పరిచ్ఛేదములు (limitations) అన్నియు తెలియబడే విషయములు అను క్షేత్రస్థాయిలో మాత్రమే గలవు. కావున, అవి అన్నియు క్షేత్ర ధర్మములే యగును గాని క్షేత్రజ్ఞ ధర్మములు గావు.

బహుశః సంయోగముచే అట్లు కావచ్చును గదా! ఉదాహరణకు, జలము నందు వాసన, రంగు లేవు. కాని భూమితో సంయోగము వలన ఈ గుణములు జలమునకు సంక్రమించును. అదే విధముగా, క్షేత్రజ్ఞుడు క్షేత్ర వినిర్ముక్తుడే అయిననూ, సంయోగము వలన క్షేత్ర ధర్మములను తనవిగా చేసుకొన వచ్చును గదా! క్షేత్రజ్ఞుడు ఉపలబ్ధమయ్యేది క్షేత్రములోననే గదా! క్షేత్రధర్మములు క్షేత్రజ్ఞునకు సంక్రమించకుండునా? సంక్రమించవు. క్షేత్రజ్ఞుడు అవిద్యను మాత్రమే గాక, అది సృష్టించే సర్వమును తెలుసుకుంటూ ఉంటాడు. ఇట్లు తెలుసుకునే క్షేత్రజ్ఞుడు తనచే తెలియబడు దానిచే దేని చేతనైననూ ప్రభావితుడు గాడు. దీనికి ఖచ్చితముగా సరిపడే దృష్టాంతము నీయ జాలము. ఏలయన, క్షేత్రజ్ఞుడు సత్యము కాగా, తెలియబడే క్షేత్రము మిథ్య. వాటి సత్యత్వ శ్రేణులు

ఒకటి కాదు. కాని, సూర్యుడు తనచే ప్రకాశింప చేయబడే సర్వముచే ప్రభావితుడు గాడు అనే దృష్టాంతమును సాధారణముగా నిచ్చెదరు. మిథ్య తన ఉనికికి సత్యముపై ఆధారపడును. అట్టి మిథ్య సత్యమునెట్లు ప్రభావితము చేయును? జ్ఞాతచే తెలియబడే వస్తువునకు జ్ఞాత యొక్క స్వరూపముతో సంయోగము సంభవము కాదు. ఇది నీకు, నీ నీడకి మధ్య సంయోగము వంటిది. ఒకటి సత్యము కాగా, రెండవది మిథ్య. వీటి మధ్య సంయోగము సంభవము కాదు.

మరియు అవి పరస్పర విరుద్ధములు. పరస్పర విరుద్ధములగు వస్తువుల మధ్య ఎట్టి సంబంధము ఉండజాలును? 'నేను' అను శబ్దప్రత్యయమునకు, 'ఇది' అను శబ్ద ప్రత్యయమునకు మధ్యలో సంబంధము లేదు. ఏలయన, ఒకటి చేతనము కాగా, రెండవది జడము. వస్తువును ప్రకాశింపజేసే కాంతి ఆ వస్తువుతో సంయోగము పొందుట గాని, ఆ వస్తు గుణములను తనవిగా చేసుకొనుట గాని జరుగదు. పైగా, కాంతి వలన మాత్రమే వస్తువు చూడబడు చున్నది. కాంతిలో ఒకడు పూజను చేయగా, మరియొకడు హత్యను చేయును. వీటి మంచి–చెడులతో కాంతికి సంబంధము లేదు. కావున, క్షేత్రజ్ఞునకు సంయోగవశముచే సమస్యలు ఉత్పన్నమగుటయూ సంభవము కాదు. పైగా, సంయోగము ఉన్నచో, జ్ఞేయవస్తువు జ్ఞాతలో ఐక్యమగును; మరియు, జ్ఞాత జ్ఞేయ మగును. అట్టి స్థితిలో, తెలుసుకొనేది ఎవరు? తెలియబడేది ఏది? సంయోగము నంగీకరించినచో, జ్ఞాత మిగలడు. కావున, ఏ రకమైన సంయోగమైననూ సంభవము కాదు. అవిద్య, మరియు తత్కార్యములగు సుఖిత్వ–దుఃఖిత్వాదులు ఆత్మధర్మములైనచో, ప్రతివాది ఇంతకు ముందు వాదించిన తీరున, అవి ప్రత్యక్షముగా అనుభవింపబడుట ఎట్లు సంభవమగును? సర్వమును తెలియునది ఆత్మయే గదా! ఏక కాలములో ఒకే ఆత్మ, జ్ఞేయము మరియు జ్ఞాత ఎట్లు కాగల్గును? ఈ ధర్మములను ఆత్మ ప్రత్యక్షముగా అనుభవించునని స్వీకరించినచో, ఇవి క్షేత్రజ్ఞ–ఆత్మ యొక్క ధర్మములగుటకు వీలు లేదు.

సరళంగా చెప్పాలంటే, తెలియబడేది సర్వము క్షేత్రము (జ్ఞేయం చ సర్వం క్షేత్రమ్) అని మనము గుర్తించవలెనని శ్రీ శంకరులు చెప్పినారు. అజ్ఞానము, దుఃఖిత్వాది వివిధ అవస్థలు క్షేత్రజ్ఞుని ధర్మములు అని నిర్ధారించినచో, 'వాటిని నేను స్వయముగా అనుభవించు చున్నాను' అని చెప్పుట పొసగదు. ఇది కేవలము అజ్ఞాన జనితమగు విరోధము మాత్రమే. నేను సంసారిని అని నీవంటే, సంసారిత్వము అవిద్యచే కలిగినదని శాస్త్రము చెప్పుచున్నది. సంసారము ఆత్మపై కేంద్రితమై యున్నది. దానికి ఆధారము ఆత్మయే. ఆత్మ సత్యము. ఇతరము సర్వము మిథ్య. కావున సర్వక్షేత్రమునకు ఆశ్రయము ఆత్మయే. ఇవి రెండు సమాంతర సత్యములు కావు. ఇచట

ఉన్నది ఒకే ఒక వస్తువు. అదియే సత్యం-జ్ఞానం-అనంతం-బ్రహ్మ. ఆత్మవస్తువుపై ఆధారపడి ఉండే అజ్ఞానము మిథ్యయే. మిథ్య గానిచో అజ్ఞానము తొలగి పోయే ప్రసక్తి లేదు. అవిద్యకు ఉనికి లేదని మనము చెప్పుట లేదు. అవిద్య ఉన్నంత వరకు ఆత్మాశ్రయమై ఉండును. అది ఆత్మను గురించిన అజ్ఞానము గనుక, శ్రుతి తక్క ఇతర ప్రమాణము దానిని తొలగించ లేదు. ఏలయన, ఇతర ప్రమాణములతో వ్యవహరించేది జ్ఞాతయే గదా! జ్ఞాతకు ప్రత్యక్ష, అనుమానములనే రెండు ప్రమాణములు ఉపలభ్యమగు చున్నవి. ఈ రెండు ప్రమాణములు అనాత్మ వస్తు బోధను మాత్రమే కలిగించ గలవు. ఆత్మ స్వరూపము నెరుంగుటలో జ్ఞాత (ఆత్మ) కు ఇతర ప్రమాణము లేవియూ ఉపకరించేవి కావు. కావున శ్రుతి మాత్రమే ఏకైక ప్రమాణము.

ఇచట మరియొక ప్రశ్న ఉదయించును. క్షేత్రజ్ఞుడు సచ్చిదానంద లక్షణుడైనచో, ఆ సచ్చిదానందములు దృశ్యరూపముగా తెలియబడుట లేదా? అవి క్షేత్రజ్ఞునిచే తెలియబడని పక్షములో వాటికి ఉనికియే లేదు గదా! ఈ విషయమును మనము ఇదివరలో చూచి యున్నాము. సత్, చిత్, ఆనందములు ఆత్మకు గుణములు కావు. అవియే ఆత్మ. ఆనంద శబ్దము అనంత శబ్దముతో సమానార్థకము. ఈ పదము చాల భ్రాంతికి నిలయమగు చున్నది. ఆనందమనగా ప్రకృష్టమగు హర్షము కాదు. ఆనందమనగా అనంతత్వము. సుఖము కలిగిన సందర్భము లన్నింటిలో ఒక విశిష్టమగు పూర్ణత గలదు. ఆ పూర్ణతను నిర్దేశించుట కొరకై శాస్త్రము ఆనంద శబ్దమును ప్రయోగించు చున్నది. కాన ఆనందము ఆత్మకు ధర్మము కాదు. ఆత్మ యొక్క సారస్వరూపమే ఆనందము. పైగా, ఆత్మ నిర్గుణమని శ్రుతి నిర్దేశించుచున్నది. మరియు సచ్చిదానందములు ఆత్మకు ధర్మములైనచో, వాటిని దర్శించునది ఎవరు? వాటిని దర్శించుటకై మరియొక ఆత్మ ఆవశ్యకమగును. ఆ మరియొక ఆత్మ యొక్క స్వరూపము ఏది? సమస్య మరల మొదటికి వచ్చును. ఆత్మ యొక్క స్వరూపము ఉనికి (సత్) మరియు జ్ఞానము (చిత్). అదియే అనంతత్వము (ఆనంద).

జ్ఞాత ఆనందమును సుఖాకారమనోవృత్తి రూపములో అనుభవించు చుండును. ఇందువలననే, దీనిని తెలియుటలో ఇబ్బంది తల యెత్తుచున్నది. ఈ సుఖానుభవములో అనుభవమును పొందువాడు, అనుభవింపబడేది అనే ద్వైతము నిహితమై యున్నది గనుక, ఇది క్షేత్రజ్ఞ స్వరూపము కాజాలదు. వాస్తవ మగు పూర్ణత్వ (fullness) రూపములో ఆనందము ఉన్న సందర్భములో ద్వితీయవస్తువు ఉండదు. ఉన్నచో, అది పూర్ణత్వము కంటె తక్కువ స్థితి యగును. పూర్ణత్వములో, 'నేను ఘటమును చూచు చున్నాను' అని చెప్పినట్లుగా, 'నేను ఆనందమునను

భవించుచున్నాను' అని పలుకుట సంభవము కాదు. ఏలయన, ఆనందము ఎన్నటికీ దృశ్యవస్తువు కాజాలదు. ఆనందము నిత్యము, ఆత్మ-స్వరూపము. గాఢ నిద్రలో మరియు మూర్ఛలో కూడ జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞాన విభాగము లేకుండుటచే, అచట అనుభవింపబడేది సత్య-జ్ఞాన-అనంత-ఆత్మ తక్క మరియొకటి కాదు. కాని అపుడు అంతః కరణములో తదనురూపమగు వృత్తి లేని కారణంగా ఆ ఆత్మ నేనే అను గుర్తింపు కలుగుట లేదు. అట్లు గాని యెడల, నిద్రించినంత మాత్రాన మానవుడు జ్ఞాని కాగల్గును. వృత్తి లేక పోవుటచే జ్ఞానము కలుగుట లేదు. కాని ఆ సమయములో అంతః కరణనిర్మితమగు జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞానములనే త్రిపుటి లుప్తమై కేవల-ఆత్మ-స్వరూపము మాత్రమే గలదు. మనకు ఉల్లాసము, హర్షము అనుభవమునకు వచ్చినపుడు అది అంతః కరణ కార్యము అగును. అపుడు అంతఃకరణము తాత్కాలికముగా సాధక-సాధ్య భేదము ఉపశమించిన వృత్తిరూపమును దాల్చును. ఈ సమయములో అనుభవమునకు వచ్చే సుఖము అంతఃకరణ ధర్మము. కాని దానియందు గల ఆనందము ఆత్మ-స్వరూపము. అనుభవములన్నింటిలో పరిస్థితి ఇదియే. ఘటవృత్తి అంతఃకరణ ధర్మము. వృత్తి యందు వ్యాపించి యున్న చైతన్యము స్వరూపము. నామ రూపములు అంతః కరణమునకు చెందును. కాని ఉనికి (సత్య) స్వరూపమునకు చెందును. సర్వసుఖాకార వృత్తుల యందున్న ఆనందము కూడ స్వరూపమే. మరియు ఆనందము సర్వదా ఉన్నది. అది గొప్ప సుఖానుభవరూపము అనుకోరాదు. సుఖానుభవము ఏదైనా విశిష్ట-అంతః కరణ-వృత్తి మాత్రమే. దాని యందలి స్వరూపము అనంతత్వము (ఆనందము) అని గుర్తించవలెను. ఆత్మ సచ్చిదానందమని మనము నిర్వచించెదము. ఆత్మ దృశ్యవస్తు రహితమగు శుద్ధ చైతన్యము. దాని యందు జ్ఞాతృ-జ్ఞేయ-జ్ఞాన విభాగము లేదు. దాని యందు విశిష్ట గుణము లేవియూ లేవు. సర్వాను భవములలో ఆత్మ యందు పరివర్తనము గాని, వికారము గాని లేవు. సచ్చిదానందములు ఆత్మ-గుణములు కావు. ఏలయన, గుణములు నిశ్చితముగా నామ రూపాత్మకములై యుండును. అవి సచ్చిదానంద-ఆత్మపై ఆధారపడి యుండును. సచ్చిదానందములు దృశ్యములు కావు. అవి గుణరూపములో తెలియబడేవి కాదు. క్షేత్రజ్ఞుడు క్షేత్రధర్మములచే ప్రభావితుడగునను కేవలము అవిద్యాజనిత భ్రాంతి మాత్రమే.

అవిద్య సంసార కారణమని అంగీకరించినచో, సర్వము మిథ్యయై అద్వైతము తనంత తానుగా ప్రతిష్ఠితమగును. కావుననే ద్వైతులు సంసార కారణము అవిద్యయను సిద్ధాంతమును త్రోసి వుచ్చే ప్రయత్నములోభాగముగా, 'ఈ అవిద్య ఎవరికి? దానికి ఆశ్రయమేది? అది అనాత్మకు సంబంధించినదా? లేక ఆత్మకు చెందినదా?' ఇత్యాది ప్రశ్నలను లేవనెత్తుచుందురు. సంసారమునకంతకూ కారణము అవిద్య కాదని స్వీకరించినచో, ద్వైతమును స్థాపించవచ్చును.

కావున అవిద్య లేదనియు, జగత్తును భగవానుడనే ఒక విశిష్ట వ్యక్తి సృష్టించినాడనియు నిరూపించుట ద్వైతికి అత్యావశ్యకము అగును. అతడిట్లు వాదించును. ఆత్మకు దేనితో నైననూ సంగము లేదు గదా! అట్టి అసంగ-ఆత్మ అవిద్యకు ఆశ్రయము కాజాలదు. పైగా, ఆత్మ-స్వరూపము జ్ఞానము (చైతన్యము). జ్ఞానము అవిద్యకు విరోధి. కావున ఆత్మ అవిద్యకు ఆశ్రయము కాజాలదు. అనగా ఆత్మకు అవిద్యతో ఎట్టి సంబంధమైననూ ఉండ జాలదు. ఈ వాదము మనకు కూడా అంగీకారమే. కాని ఈ వాదము మన దృష్టిలో భూషణము కాగా, ద్వైతి దృష్టిలో దూషణమగును. అవిద్యకు ఆత్మతో ఎట్టి సంబంధమైననూ లేకపోవుటచే, అవిద్య జ్ఞానము ఉదయించు వరకు మాత్రమే ఉండుటచే, అది మిథ్య యగును. ద్వైతి ఇట్లు వాదించును: అవిద్యకు ఆత్మతో సంబంధము లేదు గనుక, అవిద్యకు ఆత్మ ఆశ్రయమని చెప్పుట పొసగదు. మరియు, అవిద్య చేతనవస్తువునందు మాత్రమే ఉండుట సంభవము గనుక, అవిద్యకు జడ-అనాత్మ ఆశ్రయము కాజాలదు. మేజా బల్ల యందు 'నేను అజ్ఞానిని' అను ధారణ ఉండదు. ఏలయన, చేతన తత్త్వము మాత్రమే తన అజ్ఞానమును గుర్తించగల్గును. ఆత్మ శుద్ధచైతన్యము గనుక, దానికి అజ్ఞానముతో సంబంధము లేదు. చేతన తత్త్వమునందు మాత్రమే ఉండగలిగే అజ్ఞానమునకు జడమగు అనాత్మ ఆశ్రయము కాజాలదు. కావున అవిద్య ఆత్మ యందు లేదు; అనాత్మయందు కూడ లేదు. కాని దాని ఉనికిని మనము నిరాకరించజాలము. కావున అది ఆత్మ వలె ఒక విశిష్టమైన స్వీయమగు ఉనికిని కలిగియున్నది. ఇందువలననే మనకు రెండు సమాంతర సత్య తత్త్వములు గలవు.

శ్రీ శంకరులీ వాదమునకు ఘాటైన ప్రత్యుత్తరము నొసంగిరి. ఈ అవిద్యను ఎవరు గుర్తిస్తే, వారికి అది చెందియుండును. దానికి ఆత్మ గాని, అనాత్మ గాని ఆశ్రయమని వారు చెప్పుట లేదు. దానిని ఎవరు దర్శిస్తే, అది వారికి చెందునని మాత్రమే వారు చెప్పుచున్నారు. అట్లైనచో, దానిని గుర్తించునది ఎవరు? అని ప్రతివాది ప్రశ్నించును. ఈ ప్రశ్న నిరర్థకమని శ్రీశంకరులు సమాధానము నిచ్చిరి. అవిద్యను ఎవరు దర్శిస్తే, వారికి అది చెంది యుండును. అనగా, ఎవరు దానిని గుర్తిస్తారో, వారిని అది ఆశ్రయించి ఉండును. అవిద్యను గుర్తించినచో, అవిద్యకు ఆశ్రయమై అవిద్యను దర్శించువాడు కూడా గుర్తింపబడును. 'నాకు అజ్ఞానము గలదు', లేదా 'వానికి అజ్ఞానము గలదు' అని చెప్పే సందర్భాలలో అవిద్య గుర్తింపబడుచున్నది గదా! చేతిలో కర్రను పట్టుకొని ఒక వ్యక్తి కనబడినాడు. ఆ కర్ర ఎవని వద్ద గలదు? అని ప్రశ్నించుట అనవసరము. కర్ర, మరియు దానిని ధరించిన వాడు ఏక కాలములో కానవచ్చుచుండగా, ఆ ప్రశ్న నిరర్థకమగును. అదే విధముగా, అజ్ఞానమును చూచినప్పుడు, అది గల వ్యక్తి కూడ గుర్తింప బడుచుండును. నీకు అజ్ఞానము కానవచ్చినచో, అది కలవాడవు నీవే. అజ్ఞానము ఎవరికి చెందును? అని ప్రశ్నించుట

ఉచితము కాదు. శ్రీ శంకరులు ఒక దృష్టాంతము నిచ్చిరి. ఒక వ్యక్తి ఆవుల మంద వెంట ఉండెనను కొనుడు. ఈ ఆవులు ఎవరివి? అను ప్రశ్నకు అవకాశము లేదు. అటులనే, నీవు అవిద్యను గుర్తించినచో, అవిద్య గలవాడవు నీవే అగుదువు. అవిద్యను గుర్తించుటలో అవిద్యాశ్రయము కూడ దానంతట అదియే గుర్తింపబడును గదా!

ఈ దృష్టాంతముపై ఒక అభ్యంతరము గలదు. ఆవుల మంద మరియు దాని యజమాని మనకు స్పష్టముగా కానవచ్చెదరు. కాని అజ్ఞానము మరియు అది గల అజ్ఞాని మనకు స్పష్టముగా ప్రత్యక్షరూపములో కానవచ్చుట లేదు గదా! అట్లైనచో, సిద్ధాంతి ఒక ప్రశ్నను అడుగు చున్నాడు. అజ్ఞానము గలదని నీకు ఎట్లు తెలిసినది? ప్రతి వాది ఇట్లు చెప్పును: అజ్ఞానము మరియు అజ్ఞాని ప్రత్యక్ష గోచరము అగుట లేదు. ప్రత్యక్షగోచరమైనచో, 'అజ్ఞాని ఎవరు?' అను ప్రశ్న నిరర్థకమగును. అజ్ఞానమునకు ఆశ్రయమేది? అను విషయమును నేను తెలియగోరుట స్వాభావికమే గదా! నా ప్రశ్న అర్థరహితమని నీవెట్లు చెప్పగలవు? శ్రీ శంకరులు మరియొక ప్రశ్నను వేసి ఇట్లు బదులిడు చున్నారు: నేను నీ ప్రశ్నకు సమాధానమును చెప్పినచో, నా వచనముల ద్వారా అజ్ఞానమునకు, అజ్ఞానికి గల సంబంధము నీకు సాక్షాత్తుగా తెలిసినదనుకొనుము. తద్వారా నీవు ఏమి సాధించ గోరుచున్నావు? 'సంసారమంతయు అవిద్యామూలకమైనచో, దానిని తొలగించవలెను గదా! కావుననే నేను తెలియ గోరుచున్నాను' అని ప్రతిపక్షి వాదించును. శ్రీ శంకరులు ఇట్లు చెప్పుచున్నారు: 'నీకు అజ్ఞానము ప్రత్యక్షముగా కానరాని పక్షములో, దాని గురించి చింత యేల? అజ్ఞానము ఎవనికి ప్రత్యక్షముగా అనుభవమునకు వచ్చునో, వాడే దానిని తొలగించు కొనవలెను'. 'నాకు అజ్ఞానము గలదు; నేను దానిని తొలగించ గోరు చున్నాను' అని ప్రతిపక్షి అపుడు అంగీకరించును. అట్టి స్థితిలో శ్రీ శంకరుల మౌలిక సిద్ధాంతము స్థిరమగు చున్నది. అవిద్యను తెలుసు కొనేది నీవు గనుక అవిద్య గలవాడవు నీవే. నీకు గలదని ఎట్లు చెప్పవచ్చును? నీవు దానిని సాక్షాత్తుగా దర్శించే పక్షములో అది నీకు చెందును. అది ఎవరికి చెందును? అని నీవు ప్రశ్నించుట యుక్తి యుక్తము గాదు. సంసారకారణము యొక్క అవిద్యయైనా, అణు-అంతర్గత-కణము యొక్క అవిద్యయైనా-అవిద్య ఏదైనా-జ్ఞానోదయము కాగానే తొలగిపోవును. కావున నీవు వేయవలసిన ప్రశ్న ఒకే ఒకటి గలదు: ఆత్మ అనగా నేమి?

'అజ్ఞానము నాకు ప్రత్యక్ష గోచరము కాదు. అజ్ఞాన కార్యములగు దుఃఖాదులను బట్టి దాని ఉనికిని నేను ఊహించు చున్నాను' అని నీవు చెప్పవచ్చును. అయిననూ, నీవు అజ్ఞానమును మరియు అజ్ఞానిని కూడ గుర్తించినట్లే గదా! 'ఆత్మయందు అవిద్య గలదు' అనే సంబంధమును

నీవెట్లు స్థాపించెదవు? అవిద్యకు, ఆత్మకు మధ్యలో ఒక సంయోగము ఉన్నప్పుడు మాత్రమే ఆత్మ అజ్ఞానియగును. ఆత్మ ఆశ్రయము కావలెను. అవిద్య దానిపై ఆధారపడి ఉండవలెను. మరో మాటలో చెప్పాలంటే, అజ్ఞానియందు అజ్ఞానము గలదు. ఆత్మయందు అజ్ఞానము గలదని గుర్తించుట సంభవము కావాలంటే, అజ్ఞానము దృశ్యము కారాదు. అజ్ఞానము దృశ్యమైనచో, ఆత్మతో దానికి సంబంధము లేదు. 'ఆత్మ యందు అజ్ఞానము గలదు' అను జ్ఞానము నీకు కలిగినచో, ఆత్మ–అజ్ఞానములకు మధ్య సంబంధము గలదని తెలియవచ్చును. ఆత్మ యందు అజ్ఞానము గలదని నీవు అనుమితి (inference) చే గుర్తించాలంటే, మరియొక జ్ఞాత ఉండి తీరవలెను. అజ్ఞాని యగు ఆత్మను తెలియుటకై మరియొక జ్ఞాత అవశ్యకమగును. ఆ జ్ఞాత గలడని తెలియుటకు మరియొక జ్ఞాత ఉండవలెను. ఇట్లు అనవస్థా దోషము (అనంత తిరోగమనము, infinite regression) సంప్రాప్తమగును. ఆత్మ స్వయంప్రకాశము అను సత్యము వైపునకు శ్రీశంకరులు ప్రతిపక్షిని నెట్టు కొని వచ్చు చున్నారు. జ్ఞాత స్వయం ప్రకాశమైనచో, ఈ దోషము ఉండదు. నీవు స్వయం ప్రకాశ స్వరూపుడవు. కావున, అజ్ఞానము నీ యందు ఉన్నంత వరకు అది నీకు గోచరమగు చుండును. మరియు, అజ్ఞానమును తెలియువాడవు నీవు గనుక, అది కూడా మిథ్యయే. కాన అది జ్ఞాతను ఏవిధముగనైననూ ప్రభావితము చేయబోదు.

'జ్ఞాత తెలియబడవలెను' అంటే అనవస్థా దోషము అనివార్యమగును. కాని ఆత్మ సర్వమును తెలుసుకొనే జ్ఞాత. అది తెలియబడే జ్ఞేయము కాదు. జ్ఞాత సర్వదా జ్ఞాతముగను, జ్ఞేయము సర్వదా జ్ఞేయముగను ఉండును. వాటిలో పరస్పర వినిమయము సంభవము కాదు. ఇట్టి స్థితిలో, అజ్ఞానము మరియు అజ్ఞాన కార్యములగు దుఃఖాదులు జ్ఞాతను ఏవిధముగనైననూ ప్రభావితము చేయజాలవు. జ్ఞాత అసంగుడై యుండును.

అవిద్య సాక్షిచే తెలియబడుచుండును (సాక్షిభాస్యము). అది భాసించు చున్నంతవరకు మాత్రమే ఉండును. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల సహయోగము లేకుండగానే, ఆత్మచే తెలియబడే తత్త్వము ఒకటి గలదను సత్యము, ఆత్మ స్వయం ప్రకాశమనే సత్యమును స్థిరపరచును. 'నేను అజ్ఞానిని' అని మనము అన్నప్పుడు ఆత్మ స్వయం ప్రకాశమై మనచే తెలియబడే అజ్ఞానమును ఆత్మయందు అధ్యారోపము చేసి, ఈ వాక్యము ప్రయోగించబడినది.

అవిద్యకు ఆశ్రయము అంతః కరణము కాదు. అనాత్మ యగు అంతఃకరణము అవిద్యా కార్యము. అవిద్య ఆత్మాశ్రయమై యుండును. అనగా అవిద్య ఆత్మపై కూర్చుండి

యుండుననుకోరాదు. అవిద్య ఆత్మపై ఆధారపడే, స్వతంత్రమగు ఉనికి లేని మిథ్య. అవిద్య సత్యమన్నచో, దాని ఆశ్రయమును కనుగొని, దాని స్వరూపమును మనము నిరూపించ వలసి యుండును. అది మిథ్య గనుక, ఇతర అనాత్మల వలె అది కూడా ఆత్మాశ్రయమై ఉండును. అది ఆత్మ ధర్మము కాదు. అవిద్య వలన ఆత్మ యందు కర్త, భోక్త, సంసారియను భ్రాంతి కలుగు చున్నది. కావుననే, అవిద్యానాశము కొరకు శాస్త్రమును శరణు పొందవలెను.

మనము తెలియగోరేది అవిద్య కాదు. మనకు వస్తుజ్ఞానము లేదు. కావున వస్తువును తెలియగోరుచున్నాము. ఆత్మ (వస్తువు) కర్త, భోక్త అని నా ధారణ. కాని నేను సచ్చిదానంద-అద్వయ-బ్రహ్మనని శ్రుతి చెప్పుచున్నది. ఈ తీరున మన యెదుట రెండు విభిన్న దర్శనములున్నవి. కాని వీటిలో శ్రుతియొక్క ఉపదేశము అత్యంత-అభిలషణీయముగనున్నది. కావున ఆ దర్శనము యథార్థమేనా? అను విషయమును నేను తెలియగోరుచున్నాను. లేదా, అది యథార్థమేనని స్వీకరించి, దానిని అవగాహన చేసుకొనే ప్రయత్నమును అరంభించ వచ్చును. ఏ పక్షములోనైననూ, విచారము ఆరంభమగును.

సర్వ స్థూలదేహములలో నున్న క్షేత్రజ్ఞ-ఆత్మ భగవానుడేనని తెలుసుకొనుమని గీత బోధించుచున్నది. ఈ సత్యమును నేను ఎరుంగక పోవుట (అజ్ఞానము) చేతనే నాకు సంసార-అనుభవము కలుగుచున్నది. కావున అజ్ఞానము ఎవరికి చెందును? అని ప్రశ్నించుట సముచితముగా లేదు. ఆ ప్రశ్నను అడుగు వాని యందే అజ్ఞానము గలదని స్పష్టమగుచునే యున్నది. ఇది ప్రశ్నను త్రోసిపుచ్చే ధోరణితో ఇచ్చిన సమాధానము కాదు. మనమిచట అజ్ఞానమును స్థాపించుట కొరకు గాక, దానిని తొలిగించుటకు ప్రయత్నించు చున్నాము. మనము వస్తుస్వరూపమును గూర్చి విచారించు చున్నాము. కావున ఈ సమాధానము చాల సముచితముగ నున్నది.

మరియు, అజ్ఞానమనేది ఒక పదార్థము కాదు. అది ఉన్నంత కాలములో దానికి ఒక రకమైన ఉనికి గలదు. అది కూడా ఇతరము సర్వము వలెనే మిథ్య. అది వస్తువు అయినచో, దానిని మనము విశ్లేషించవచ్చును. అప్పుడు దాని ఆశ్రయమేది? ఇత్యాది ప్రశ్నలకు కొంత మాన్యత ఉండును. పైగా సర్వదా ఏదో ఒకటి అజ్ఞానములో విషయము అగుచుండును. ఆత్మను గురించి గల అజ్ఞానము మూల-అవిద్య అనబడును. నన్ను నేను జ్ఞాతయని భావించుట అనే సమస్యకు ఈ అవిద్య హేతువు అగుటచే దీనికి మూల-అవిద్య యని పేరు. అవిద్య ఒక యథార్థతత్త్వము కాదు గనుక, దాని విచారము సంభవము కాదు. మనము ఆత్మ వస్తువును గురించి మాత్రమే

విచారించగలము. ఆ వస్తువు యొక్క అజ్ఞానము విచారమును చేయనంతవరకు కొనసాగు చుండును. మనము వేసుకొనవలసిన ప్రముఖమైన ప్రశ్న యేదనగా - 'నేను జ్ఞాతనా?' క్షేత్రజ్ఞుడు అనే శ్రీకృష్ణుని ప్రయోగమునందలి జ్ఞాతృత్వము లాక్షణికమే (figurative) గాని, వాస్తవము కాదు. ఆత్మ స్వరూపము శుద్ధ జ్ఞానము. కాని ఇతరము సర్వము 'జ్ఞేయము' అని స్వీకరింపబడు చున్నది గనుక, ఆత్మ జ్ఞాత యనబడు చున్నది. జ్ఞాత యనగా చైతన్య-ఆత్మ అని తాత్పర్యము. ద్రష్ట, మంత ఇత్యాది పదములతో మనము జ్ఞాతను నిర్దేశిస్తూ ఉంటాము. జ్ఞాతృధర్మములుగా మనచే గుర్తింపబడే ఈ ద్రష్టా, మంతా ఇత్యాదులన్నియు జ్ఞేయములే యగును. వాస్తవమగు జ్ఞాత చైతన్యము మాత్రమే. చైతన్యము నందు జ్ఞాత అను శబ్దప్రయోగము కేవల లాక్షణికము మాత్రమే.

అజ్ఞానమును ఖచ్చితముగా ఉన్నది అని గాని, లేదు అని గాని నిర్వచించుట సంభవము కాదు (సద్-అసద్భ్యాం అనిర్వచనీయమ్). త్రాడును చూచి మనము తరచుగా పాము అని భ్రాంతి పడెదము. కావున అజ్ఞానమునకు ఉనికిలేదని చెప్పుటకు వలనుపడదు. అజ్ఞానము వస్తువును కప్పివుచ్చుటయే గాక, లేని వస్తువును సృష్టించే సామర్థ్యమును కలిగియున్నది. కావున దాని ఉనికికి ఇదియే నిదర్శనమగు చున్నది. కేవలము జ్ఞానము యొక్క అభావము మాత్రమే అజ్ఞానమని అనుకోరాదు. సృష్టి సర్వము బయట భాసించునట్లు చేయునది అజ్ఞానమే. ఒక వస్తువు యొక్క అభావమునుండి ఏదియూ ఉద్భవించలేదు. జ్ఞాన-అభావము విషయములో కూడా అంతే. అజ్ఞానమునకు ఒక వస్తువును సృష్టించే సామర్థ్యము కలదు. కావున, దానికి ఏదో ఒక రకమైన ఉనికి గలదని మనము అంగీకరించవలెను. కాని అజ్ఞానము తన కాళ్లపై తాను స్వతంత్రముగా నిలబడ జాలదు. అది తన ఉనికి కొరకై ఇతరముపై ఆధారపడును. కావున అవిద్యకు స్వతంత్రమగు ఉనికి లేదు. స్వతంత్రమగు ఉనికి లేకపోవుటచే అది సత్యమని చెప్పజాలము. అది సృష్టిని చేయగల సామర్థ్యము కలది గనుక, దానికి ఉనికి లేదని చెప్పజాలము. అది మిథ్య మాత్రమే. కావున అది సద్వస్తువు అగు ఆత్మను ఆశ్రయించి ఉండును. వస్తురూపముగా నిర్వచించగలిగేది ఆత్మ ఒక్కటి మాత్రమే. ఏలయన, ఆత్మ నిరవయవము. ఒక వస్తువునందు అవయవములు ఉన్నచో, ఆ అవయవములకు మరల అవయవములను మనము కనుగొన గల్గుతాము. కావున, అట్టి స్థితిలో ఖచ్చితముగా వస్తువును నిర్వచించుట అసంభవమగును. చరమ జ్ఞానమునకు ఆత్మ-బ్రహ్మైక్యము నందు తక్క ఇతరమునందు పర్యవసానము కుదరదు. ఆత్మ-బ్రహ్మ-ఐక్య-బోధ పూర్ణ జ్ఞానము గనుక సమగ్ర బోధ యగును. దాని యందు మార్పునకు అవకాశము లేదు. దానిని మరింత మెరుగు పరుచుట సంభవము కాదు.

కావున, 'నేను సంసారిని' అనే నిష్కర్ష తొలగాలంటే అవిద్య తొలగి పోవాలి. ఆ నిష్కర్షకు ఆశ్రయము అంతః కరణము. అంతః కరణమునకు ఆశ్రయము అవిద్య. అవిద్యకు ఆశ్రయము ఆత్మ. ఆ అవిద్యను తొలగించుటకు ఒక వృత్తి ఆవశ్యకమగును. ఆత్మ-అజ్ఞానమును పోగొట్టే అట్టి వృత్తిని వేదాంతము ఉత్పన్నము చేయును. ఆత్మ స్వయంప్రకాశము. దృశ్యమగు అవిద్య, ఇతరమగు సమస్త సంసారము వలెనే, ఆత్మను ఆశ్రయించి ఉన్నది.

ఈ విషయములో మరియొక అభ్యంతరము గలదు. క్షేత్రము దోషభూయిష్ఠమై యున్నది. దేహమునకు వృద్ధాప్యము, నొప్పి ఇత్యాది సమస్యలు గలవు. జ్ఞానేంద్రియముల శక్తికి హద్దులు గలవు. అంతః కరణము యొక్క సామర్థ్యము కూడ సీమితమై యున్నది. పైగా, అంతః కరణము దుఃఖపీడితమగు చుండును. ఇన్ని దోషములతో నిండియున్న క్షేత్రమును ఆత్మ సాక్షి రూపములో దర్శించుచున్నది. ఇది నేరస్థుడగు పుత్రుని తండ్రి గాంచుచున్నట్లు లేదా? అట్టి పుత్రుని గాంచిన తండ్రికి రక్తపోటు అధికమగును. అదే విధముగా, అనేక దోష భూయిష్ఠమగు క్షేత్రమును గాంచు క్షేత్రజ్ఞుడు కలవరపడుట తప్పదు. సర్వ క్షేత్రములు సమస్యలకు నిలయములై యున్నవి. కావున, క్షేత్ర సాక్షియగు క్షేత్రజ్ఞునకు ఆనందము కల్లయగును. ఇట్టి దర్శనము క్షేత్రజ్ఞుని ప్రభావితము చేసి తీరును. ఇది పూర్వ పక్షము.

ఇది సరి గాదని శ్రీ శంకరులు వివరించిరి. ఆత్మ క్షేత్రమును తెలియుచుండునను మాట వాస్తవమే అయిననూ, ఈ తెలియుట ఔపచారిక (figurative) జ్ఞానము మాత్రమే. ఆత్మ అవిక్రియము (మార్పులు లేనిది) గనుక, ఆత్మ యందు వాస్తవముగా తెలుసుకొనుట అను క్రియ ఉండజాలదు. ఆత్మ యథార్థముగా జ్ఞాత యైనచో, తెలియుటకై ఆత్మ యందు మార్పు వచ్చుట తప్పని సరియగును. ఆత్మ-స్వరూపము అవిక్రియ-చైతన్యము. కావున, ఆత్మ తన సన్నిధి మాత్రము చేతనే క్షేత్రమును ప్రకాశింప చేయును. ఆత్మ ప్రకాశింప జేయుట అను క్రియను చేయుట లేదు. 'అగ్ని కాల్చు చున్నది' అను దృష్టాంతమును శ్రీ శంకరులిచట ప్రస్తావించిరి. కాల్చుట అను క్రియను అగ్ని చేయుట లేదు. కాని వేడి దాని స్వరూపము గనుక, అగ్ని కాల్చు చున్నది. కాల్చుట అగ్ని చేసే క్రియయైనచో, అగ్ని ఒక కాలములో కాల్చి మరియొక కాలములో కాల్చకుండును. కాని అగ్నితో సంపర్కమునకు వచ్చే వస్తువు ఏదైననూ నిశ్చితముగా కాల్చబడును; లేదా, వేడెక్కును. అగ్ని ఉన్నచోట వేడి ఉండి తీరును. కావున, 'అగ్ని కాల్చు చున్నది' అనునది లాక్షణిక ప్రయోగము. ఇది ఉచితమగు ప్రయోగమే అయినా, దానిని మనము యథాతథముగా స్వీకరింప రాదు. క్రియను చేయకుండగనే నిప్పు కాల్చు విధంబున, ఆత్మ క్షేత్రమునంతనూ ప్రకాశింప జేయును.

ప్రకాశింప జేసెదనని నిర్ణయించు కొని ఆత్మ ప్రకాశింప జేయుట లేదు. చైతన్యము ఆత్మ స్వరూపము గనుక, సన్నిధి మాత్రముచే ఆత్మ ప్రకాశింప జేయును. ఆత్మ జ్ఞాత అని మనము అన్నప్పుడు, ఆత్మ జ్ఞాత యొక్క స్వరూపమని యెరుంగుట చాల ముఖ్యము. ఆత్మ ప్రకాశింప జేయుచున్నది గనుక, ఆత్మ జ్ఞాత యని మనము అంటాము. కాని ఆత్మ అవిక్రియము గనుక, క్రియనాచరించదు. కావుననే, ఆత్మ యందు జ్ఞాతృత్వము వలన వచ్చే సమస్యలు లేవు. ఉల్లాసయుతమైన, లేక తద్విరుద్ధమైన క్షేత్రమును దర్శించుట వలన, ఆత్మ ఏ విధముగ నైననూ ప్రభావితము కాదు.

గీతలో మరియొక సందర్భములో భగవానుడిట్లు నిరూపించినాడు: ఆత్మ యందు కర్మ లేదు. క్రియను ఆచరించుటకు ఆవశ్యకమగు కారకములేవియూ ఆత్మ యందు లేవు. మరియు క్రియాఫలము ఆత్మకు చెందదు. ఆత్మ ఏ క్రియలోనైననూ విషయము కాదు. ఆయుధములు ఆత్మను ఛేదించలేవు (నైనం ఛిందంతి శస్త్రాణి). ఆత్మ కర్త కాదు. ఆత్మ దేనినీ నశింప జేయదు (నాయం హంతి). మరియు సుఖదుఃఖరూపములగు ఫలములను వేటినీ ఆత్మ భోగించదు. సర్వవ్యాపకమగు ఆత్మ జీవులచే ఆచరింపబడే ధర్మ-అధర్మముల ఫలమును తాను స్వీకరించదు (నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః). అనగా కర్మఫలరూపమగు పుణ్యపాపములచే ఆత్మ ఏవిధముగానైనను ప్రభావితము కాదు. ఆకాశమును మరింత అందముగా తీర్చిదిద్దుట గాని, కలుషితము చేయుట గాని సంభవము కాదు. ఏలయన ఆకాశము నిరవయవము, సర్వవ్యాపకము గనుక, ఇట్టి క్రియలకు అది ఉపలభ్యము కాదు. అటులనే, ఆత్మకు పాపపుణ్యములు సంక్రమించవు.

అవిద్యచే ఆత్మ యందు పుణ్యపాపములు ఆరోపించబడును. ఆ కారణముచే మానవుడు కర్త యగు చున్నాడు. కాని నీవు అవిద్యచే ఆత్మ కర్తయని తలపోయు కాలమునందైననూ ఆత్మ కర్త కాదు. 'ఆత్మ నశింపజేయునది అని తలంచువాడు, ఆత్మ నశింపచేయబడునది అని తలంచువాడు వీరిద్దరు అజ్ఞానులే (య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్, ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే)' అని భగవానుడు చెప్పియున్నాడు. ఆత్మ కర్త కాదు. క్రియలో విషయము కాదు. ఉపాధి యొక్క గుణములు మాత్రమే క్రియలనాచరించుచున్నవి (ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః) అని కూడ భగవానుడు చెప్పినాడు. మనము చేయు కొన్ని క్రియాకలాపములు సత్త్వము నుండి పుట్టి రజస్సుచే సమర్థితములగును. మరికొన్ని రజస్సు నుండి పుట్టి సత్త్వము చేతను, రజస్సు నుండి పుట్టి తమస్సు చేతను, లేదా తమస్సు నుండి పుట్టి రజస్సు చేతను సమర్థితములగును. ప్రకృతి గుణములచే ప్రేరితులమై మనము చేయు

2.అ.6. 19. శ్లో

పములనన్నింటినీ ఈ నాల్గు రకములుగా వర్గీకరించవచ్చును. ఉపాధి (ప్రకృతి) యందు ఉపలభ్యమయ్యే ఆత్మ (పురుషుడు) కర్మలను వేటినీ చేయడు. 'కర్మలనన్నింటినీ మనస్సుచే పరిత్యజించి, దేహమునందు నివసించు పురుషుడు వశియై తాను క్రియలను చేయకుండగా, ఇతరులచే చేయించకుండగా, ఈ నవద్వారములు గల నగరములో కులాసాగా కూర్చుండి యుండును (సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ, నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్)'.

ఆత్మజ్ఞాని కర్మలను వేటినీ ఆచరించడు. ఆయన సన్నిధిలో క్రియలు జరుగుచుండును. చూచుట, వినుట, స్పృశించుట, ఆఘ్రాణించుట, తినుట, నడచుట, గాలిని పీల్చుట, మాటలాడుట, విడిచి పెట్టుట, పట్టుకొనుట, కన్నులను తెరచుట, మూయుట అను క్రియలలో ఇంద్రియములు ఇంద్రియగోచరమగు పదార్థములతో వ్యవహరించు చుండును. ఈ సత్యము నెరింగిన జ్ఞాని 'నేను కర్మలను వేటినీ చేయుట లేదు' అని గుర్తించునని (పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్, ప్రలపన్ విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్ అపి, ఇంద్రియాణి ఇంద్రియార్థేషు వర్తంతే ఇతి ధారయన్, నైవ కించిత్ కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్) భగవానుడు చెప్పుచున్నాడు. కర్మ యందు అకర్మను, అకర్మయందు కర్మను దర్శించువాడు జ్ఞాని (కర్మణి అకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మ యః, స బుద్ధిమాన్ మనుష్యేషు) అని కూడ గీత ప్రతిపాదించు చున్నది. 'నేను కర్తను', 'భగవానుడు సృష్టి కర్త' అను ధారణలు పూర్తిగా ఔపచారికములు (figurative) మాత్రమే. ఆత్మ యందు వికారము లేవియు లేవు గనుక, ఆత్మ కర్మలను వేటినీ చేయుట లేదు. అదే విధముగా, 'ఈ జగత్తునకంతుకూ నేను కర్తనని యెరుంగుము. మరియు నేను వికారములు లేనివాడననియు, అకర్తననియు యెరుంగుము' అని భగవానుడు చెప్పియున్నాడు.

ఈ జ్ఞానమును భగవానుడు గీతలోని అనేక స్థలములలో ప్రదర్శించినాడు. ఆయా స్థలములలో శ్రీశంకరులు, మరియు సంప్రదాయజ్ఞులగు ఆచార్యులు ఈ జ్ఞానమును వివరించిరి. ఇది తెలియదగిన జ్ఞానము గనుక, దీనిని ఎవరికి నచ్చిన దృష్టికోణములో వారు వ్యాఖ్యానించుట సబబు గాదు.

ఇచట అంతిమమగు పూర్వపక్షము ఒకటి ప్రస్తావించబడినది. ఇంతకు ముందు ప్రస్తావించబడిన పూర్వపక్షమునకు ఇది ప్రతి రూపమని చెప్పవచ్చును. ఆత్మ యందు కర్మ లేదు. వివిధ కర్మల కర్తృత్వము ఆత్మయందు లేదు. మరియు ఆత్మకు ఫలముతో సంయోగము లేదు.

ఇవి అన్నియు అవిద్యవలన మాత్రమే ఆత్మ యందు అధ్యారోపితమగు చున్నవి. ఇట్టి స్థితిలో శాస్త్ర విహితమగు కర్మలను ఎవరు చేయవలెను? అజ్ఞానులు మాత్రమే ఆ కర్మలను చేయుటకు అర్హులగుదురు. కాని పండితులు కర్మలనాచరించుట మనకు కానవచ్చుచున్నది. అనగా శాస్త్రము అజ్ఞానుల కొరకు మాత్రమే ఉపయోగపడు చున్నది. కావున, శాస్త్రము నిరర్థకమగునని మరల ప్రతి పక్షి వాదించును.

ఈ అభిప్రాయము సత్యమేనని శ్రీశంకరులు బదులిడిరి. శాస్త్రము కర్మను అవిద్వాంసుని కొరకు మాత్రమే విధించు చున్నది. విద్వాంసుని కొరకు కాదు. వివిధ ఫలముల కొరకై వివిధ కర్మలను విధించిన శాస్త్రమే, పుణ్యపాపముల నుండి కర్మ చక్రము నుండి పూర్తిగా విముక్తిని పొందుట కొరకై మానవుడు కర్తృత్వమును విడనాడవలెనని బోధించు చున్నది. ఇది శరణాగతి వలన సాధ్యమయ్యేది కాదు. ఏలయన, శరణాగతిని చేయువాడు కర్తయే గదా! ఆత్మ అకర్త యను జ్ఞానము ఉదయించగానే, కర్తృత్వము అదృశ్యమగును. ఈ సత్యము నెరింగిన జ్ఞానికి చేయదగిన కర్తవ్యము మిగిలి యుండదు. ఆత్మ యందు సంతోషమును సాక్షాత్కరించుకున్న వానికి చేయవలసిన పని ఏదియూ ఉండదు (ఆత్మని ఏవ చ సంతుష్టః తస్య కార్యం న విద్యతే). పరిపూర్ణత అనగా నిదియే. అతడు చేయవలసిన పనులనన్నిటినీ చేసినట్లే యగును.

ఈ దేహము క్షేత్రము; ఈ దేహమును తెలుసుకొనుచుండు వాడు క్షేత్రజ్ఞుడు అని సూత్రప్రాయముగా మాత్రమే మొదటి శ్లోకములో చెప్పబడినది. కావున దీనిని వివరించవలసిన అవశ్యకత గలదు. దేహము మాత్రమే క్షేత్రమని ఈ వచనమునకు తాత్పర్యమా? లేక, ప్రపంచము కూడ క్షేత్రమేనా? క్షేత్రమనగా స్థూలదేహమా? సూక్ష్మదేహమా? ముందుగా ఈ విషయములు తరువాతి రెండు శ్లోకములలో వివరించబడును. అటు పిమ్మట మరికొన్ని శ్లోకములు ఈ విషయవస్తువును వ్యాఖ్యానించును.

**అధ్యాయము 13, శ్లోకము 3 :**

तत् क्षेत्रं यच्च यादृक् च यद्विकारि यतश्च यत् ।
स च यो यत्प्रभावश्च तत्समासेन मे शृणु ॥ ३ ॥

తత్ క్షేత్రం యచ్చ యాదృక్ చ యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు (3).

తత్ = ఆ, క్షేత్రమ్ = క్షేత్రము, యత్ చ = ఏదియో, యాదృక్ చ = ఎట్టిదియో, యద్వికారి = ఏ వికారములను కలిగియున్నదియో, యతశ్చ యత్ = ఏది దేని నుండి ఉద్భవించినదో, యః = ఏ క్షేత్రజ్ఞుడు గలడో, సః చ = ఆ క్షేత్రజ్ఞుడు కూడా, యత్-ప్రభావః చ = ఎట్టి మహిమ గలవాడో, తత్ = ఆ విషయమును, సమాసేన = సంగ్రహముగా, మే = నేను చెప్పగా, శృణు = వినుము.

> ఆ క్షేత్రము ఏది? అది యెట్టిది? దాని వికారములు ఏవి? ఏది దేనినుండి ఉద్భవించినది? క్షేత్రజ్ఞుని మహిమ ఎట్టిది? ఈ విషయములను నేను సంగ్రహముగా చెప్పెదను. వినుము (3).

ఈ శరీరము (ఇదం శరీరమ్) క్షేత్రమని మొదటి శ్లోకములో చెప్పబడినది. ఈ క్షేత్రము యొక్క స్వరూపమెట్టిది? అను విషయము ఇప్పుడు నిరూపింపబడును. దాని నిర్మాణములో అంతర్గతములైయున్న మూల పదార్థములను వివరించుట ద్వారా దాని స్వరూపము ప్రదర్శింపబడును. ఇంత మాత్రమే గాదు. అది ఎట్టి వికారములకు అధీనమై యుండును (యద్వికారి)? అది దేని నుండి పుట్టినది (యతశ్చ)? క్షేత్రాంతర్గతములై యున్న కార్యకారణ సంబంధములెయ్యవి (యతశ్చ యత్)? ఉపాధితో గూడి యున్న క్షేత్రజ్ఞునకు ఎట్టి శక్తులు గలవు (స చ యో యత్ప్రభావశ్చ)? ఇత్యాది విషయములన్నియు నిరూపింపబడును. క్షేత్రజ్ఞ శబ్దము పుంలింగము. క్షేత్రశబ్దము నపుంసక లింగము. కావున ఇచట యః అను పదము క్షేత్రజ్ఞుని నిర్దేశించును. క్షేత్రజ్ఞుడు కేవలుడు, సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ స్వరూపుడు. శుద్ధ క్షేత్రజ్ఞునకు సృష్టించే సామర్థ్యము లేదు. కాని మాయా-ఉపాధిని బట్టి క్షేత్రజ్ఞుడే సర్వము అగును. వివిధ ఉపాధులలో వివిధ-విభూతులను కలిగియున్న ఆ క్షేత్రజ్ఞుడెట్టివాడు? ఈ విషయమునంతను భగవానుడిచట సంగ్రహముగా (సమాసేన) చెప్పగలడు. 'నా మాటను వినుము' అని భగవానుడు అర్జునునితో చెప్పుచున్నాడు. తాను చాల సంగ్రహముగా మాత్రమే చెప్పబోవు చున్నాడు గనుక అర్జునుని 'సావధానుడవు కమ్ము' అని హెచ్చరించుటకై భగవానుడిట్లు చెప్పెను.

క్షేత్ర-క్షేత్రజ్ఞుల స్వరూపమును గూర్చి తాను చెప్పబోవు విషయముపై శ్రోతకు మనస్సున ఉత్సుకతను రేకెత్తించుట కొరకై భగవానుడు తరువాతి శ్లోకములో ఈ విషయవస్తువును ప్రశంసించు చున్నాడు.

**అధ్యాయము 13, శ్లోకము 4:**

ऋषिभिर्बहुधा गीतं छन्दोभिर्विविधैः पृथक् ।
ब्रह्म सूत्रपदैश्चैव हेतुमद्भिर्विनिश्चितैः ॥ ४ ॥

ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్
బ్రహ్మ సూత్రపదైశ్చై వ హేతుమద్భిర్వినిశ్చితైః (4).

**ఋషిభిః** = ఋషులచే, **బహుధా** = అనేక విధములుగా, **వివిధైః** = వివిధములగు, **ఛందోభిః** = వేదములచే, **పృథక్** = సుస్పష్టముగా, **చ** = మరియు, **హేతుమద్భిః** = యుక్తియుక్తములు, **వినిశ్చితైః** = సంశయరహితములు అగు, **బ్రహ్మ సూత్ర పదైః** = బ్రహ్మను లక్ష్యముగా ప్రదర్శించే వాక్యములచే, **ఏవ** = నిశ్చయముగా, **గీతమ్** = గానము చేయబడినది.

అది ఋషులచే అనేక విధములుగా వివిధ వేదముల ద్వారా సుస్పష్టముగా, యుక్తియుక్తములు సంశయ రహితములు అగు, బ్రహ్మను లక్ష్యముగా ప్రదర్శించే వాక్యములచే నిశ్చయముగా గానము చేయబడినది (4).

గీతమ్, పాడబడినది. అనగా మంత్రరూపములో గాని, ఉల్లాసకరమగు వచనములలో గాని చెప్పబడినది. బహుధా, అనేక ప్రకారములుగా, ఋషిభిః, ఋషులచే. వారు ఎట్లు చెప్పిరి? వేదముల ద్వారా (ఛందోభిః). ఛందస్ అనగా వృత్తము (metre). వేదములోని మంత్రములు ఛందోబద్ధములై యుండుటచే, ఛందశ్శబ్దము వేదమును నిర్దేశించును. నాల్గు వేదముల మంత్రములు వివిధ పద్ధతులలో ఈ విషయమును ప్రతిపాదించుచున్నవి. క్షేత్ర మనబడే అయిదు భూతములతో సృష్టి ఆరంభమైనదనియు, క్షేత్రజ్ఞుడు సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ స్వరూపుడనియు తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. ఇతర ఉపనిషత్తులు కూడా క్షేత్రక్షేత్రజ్ఞులను విభిన్న రూపములలో వర్ణించియున్నవి. క్షేత్ర-క్షేత్రజ్ఞుల స్వరూపములో గల భేదమును ఈ ఉపనిషత్తులన్నియు వక్కాణించుచున్నవి. వాటిలో క్షేత్రజ్ఞుడు ఆత్మ కాగా, క్షేత్రము అనాత్మ. మొదటిది కారణము కాగా, రెండవది కార్యము. మొదటిది సత్యము. రెండవది మిథ్య.

బ్రహ్మను బోధించుటయందు తాత్పర్యము గల వాక్యములలోని పదములచే (బ్రహ్మ సూత్రపదైః) ఈ జ్ఞానము బోధింపబడు చున్నది. మనకు ఒక విషయమును తెలుపుడు జేయు వర్ణసముదాయమునకు పదమని (పద్యతే, జ్ఞాయతే అనేవ) పేరు. ఈ బ్రహ్మ సూత్ర పదములు

బ్రహ్మ స్వరూపమును బోధించును. కాని వాటి బోధను సంశయములు లేని విధముగా తెలుసుకొని స్వంతము చేసుకొనవలెను. దీని కొరకై ఉపనిషత్తు స్వయముగా ఒక వివేచనా ప్రక్రియను ప్రదర్శించును. ఉపనిషత్తు ఒక సత్యమును ప్రకటించి అంత మాత్రముతో విరమించదు. ఆ సత్యమును సమర్థించే యుక్తులను కూడ ఉపనిషత్తు వివరించును. కావున, ఉపనిషద్వాక్యము హేతుమత్ అనబడును. తైత్తిరీయోపనిషత్తు సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ అని చెప్పి విరమించదు. ఆ విషయమును నిరూపించును. ఛాందోగ్యోపనిషత్తు కుండ-మట్టి, ఆభరణము-బంగారము, కత్తి-లోహము అను దృష్టాంతములను వివేచించి నామరూపాత్మకమగు జగత్తు మిథ్య అనియు, సత్యవస్తువు అగు బ్రహ్మమే సత్యమనియు నిరూపించును. దృష్టాంత మీయబడిన సందర్భములన్నింటిలో హేతుపూర్వక వివేచనము ఉండును. జ్ఞానసాధనము (ప్రమాణము) అగు వచనమును పుష్టిచేయుటకై శాస్త్రము అనేక యుక్తులను ప్రస్తుతించుట మనకు తరచుగా కానవచ్చును. "ఇచట ఈ లోకములో ఏ పనిని చేసిననూ దాని ఫలము పరిచ్ఛిన్నమై (finite) యుండుట మనకు అనుభవమే. అటులనే కర్మ ఫలరూపమగు పుణ్యముచే లభించు పరలోక సుఖములు కూడ నశ్వరములే (యథా ఇహ కర్మచితో లోకః క్షీయతే తథా అముత్ర పుణ్యచితో లోకః క్షీయతే)" అని శాస్త్రము చెప్పుచున్నది. నీవు ఏ పనిని చేసినా, దాని ఫలము కొంతకాలమగునరికి నశించును. కావున కర్మ వలన సమస్యకు పరిష్కారము లేదు. ఈ జ్ఞానమును పొందవలసిన తీరును ఛాందోగ్యోపనిషత్తు ఒక దృష్టాంతరూపమగు గాథలో వివరించినది: గంధార నగరనివాసి యగు ఒక వ్యక్తిని బందిపోటు దొంగలు అపహరించి, కళ్లకు గంతలు కట్టి, చేతులను కాళ్లను బంధించి అడవిలో విడిచి పెట్టిరి. అదృష్టవశాత్తు ఒక దయామయుడు వానిని చూచి కట్లను విప్పి గంధారనగరమునకు వెళ్ళు దారిని చూపించెను. అతడు తెలివైనవాడు (మేధావీ) గనుక, ఆ పుణ్యాత్ముడు చెప్పిన కొద్ది పాటి సూచనలను పాటిస్తూ దారిలో ఎదురైన కష్టముల నధిగమిస్తూ, గంధారమును చేరెను. ఈ కథలో గంధారము మోక్షమునకు ప్రతీక. ఉపనిషత్తు ఈ దృష్టాంతములో సాధకుడు బంధ విముక్తిని పొందు మార్గమును వివరించినది. ఈ తీరున వేదములలో ఉపదేశసారము బోధింపబడుటయే గాక, దానిని గ్రహించుటకు ఆవశ్యకమగు యుక్తులు, వివిధ ప్రక్రియలు కూడ నిర్దేశించబడినవి.

సంశయమునకు తావీయని వాక్యముల ద్వారా (వినిశ్చితైః) వేదము క్షేత్ర-క్షేత్రజ్ఞుల స్వరూపమును గురించి చెప్పుచున్నది. ఖచ్చితమగు జ్ఞానము నీయగల్గిన 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాది వాక్యములు గలవు. క్షేత్రజ్ఞ-ఈశ్వర-అభేదము ఈ వాక్యములో స్పష్టముగా తెలియుచున్నది.

భగవానుడు అర్జునుని సావధానుని చేసి ముందుగా క్షేత్రమును నిరూపించి తరువాత క్షేత్రజ్ఞుని ప్రభావమును వివరించగలడు. దానితో ఉపదేశము సమగ్రమగును. అర్జునుని వినుమని హెచ్చరించి భగవానుడిపుడు ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 13, శ్లోకము 5, 6:**

महाभूतान्यहंकारो बुद्धिरव्यक्तमेव च ।
इन्द्रियाणि दशैकं च पंच चेंद्रियगोचराः ॥ ५ ॥

మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియ గోచరాః (5).

**మహాభూతాని** = సూక్ష్మ భూతములు, **అహంకారః** = అహంకారము (కర్తృత్వధారణ), **బుద్ధిః** = బుద్ధి (తెలుసుకొనే శక్తి), **చ** = మరియు, **అవ్యక్తమ్** = అవ్యాకృతము (కారణము), **ఏవ** = నిశ్చయముగా, **దశ** = పది, **ఇంద్రియాణి** = ఇంద్రియములు, **చ** = మరియు, **ఏకమ్** = ఒకటి (మనస్సు), **చ** = మరియు, **పంచ** = అయిదు, **ఇంద్రియగోచరాః** = ఇంద్రియ విషయములు.

इच्छा द्वेषस्सुखं दुःखं संघातश्चेतना धृतिः ।
एतत् क्षेत्रं समासेन सविकारमुदाहृतम् ॥ ६ ॥

ఇచ్ఛా ద్వేషస్సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్ (6).

**ఇచ్ఛా** = కోరిక, **ద్వేషః** = ద్వేషము, **సుఖమ్** = సుఖము, **దుఃఖమ్** = దుఃఖము, **సంఘాతః** = స్థూలదేహము, **చేతనా** = జ్ఞానము, **ధృతిః** = ధైర్యము, **సమాసేన** = సంగ్రహముగా, **ఏతత్** = ఈ, **సవికారమ్** = రూపాంతరములతో గూడిన, **క్షేత్రమ్** = క్షేత్రము, **ఉదాహృతమ్** = చెప్పబడినది.

సూక్ష్మ భూతములు, కర్తృత్వ ధారణ, బుద్ధి, అవ్యాకృతము, పది ఇంద్రియములు, మనస్సు అనే అంతరింద్రియము, ఇంద్రియగోచరములగు

అయిదు విషయములు, కోరిక, ద్వేషము, సుఖము, దుఃఖము, స్థూలదేహము, జ్ఞానము, ధైర్యము-ఇవి వికార సహితమగు క్షేత్రమగునని సంగ్రహముగా చెప్పబడినది (5, 6).

క్షేత్రమనగా పంచమహాభూతములు. భగవానుడు తరువాతి పాదములో ఇంద్రియ గోచరములగు స్థూలభూతములను చెప్పబోవు చున్నాడు గనుక 'మహా భూతాని ' అనుపదము సూక్ష్మ భూతములను నిర్దేశించును. ఈ భూతముల కంటె భిన్నముగా సృష్టి లేదు. సృష్టి అంతయూ వీటిచే వ్యాప్తమై యున్నది. కావున వీటికి'మహత్' అను విశేషణమీయబడినది. మరియు సూక్ష్మభూతముల నుండి స్థూలభూతములు పుట్టినవి. అనగా కార్యజగత్తున కంతకు అవియే పరంపరయా కారణమగు చున్నవి. వాటి ఈ కారణత్వ స్థాయిని నిర్దేశించుట కొరకై మహత్ అను విశేషణమీయబడినది.

ఈ భూతములు వికారమును పొంది బుద్ధి (అంతః కరణము) నిర్మాణమగును. అంతః కరణమునందు 'నేను చేయుచున్నాను' అను రూపములో, అనగా కర్తృత్వధారణారూపములో ప్రకటమయ్యే వృత్తికి అహంకారమని పేరు. ఇవి అన్నియు అవ్యక్తము నుండి పుట్టినవి. దానికే అవిద్య, లేక మాయ అని పేరు. సృష్టికి పూర్వమునందుండిన అవ్యాకృత (unmanifest) స్థితిని ఈ నామములన్నియు నిర్దేశించును. అవ్యక్తమునందు మార్పులు (పరిణామము)వచ్చి బుద్ధి, అహంకారము ఇత్యాది క్రమములో మహాభూతములు నిర్మాణమగును. అంతః కరణముతో బాటు అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు (ఇంద్రియాణి దశ ఏకం చ) కూడ పుట్టినవి. మనస్సు లేకుండగా ఈ ఇంద్రియములు పని చేయ జాలవు. కావున మనస్సు ఒక కరణమై (instrument) పని చేయుచుండును. మనస్సు కూడా జ్ఞానసాధనమే. జ్ఞానేంద్రియములు తనముందు ప్రవేశపెట్టే ఐంద్రియక-ప్రత్యక్షము (sense perception) నకు అను రూపముగా మనస్సు మార్పులకు లోనగు చుండును. అయిదు ఇంద్రియములకు గోచరమయ్యే అయిదు స్థూలభూతములు గలవు. వీటితో కలిసి సర్వము లెక్కలోనికి వచ్చినది. సూర్యుడు, చంద్రుడు ఇత్యాది ప్రత్యక్ష ప్రమాణసిద్ధమగు సర్వము మరియు అనుమాన ప్రమాణముచే గాని, లేక విశ్వాసము ఆధారముగా విశ్వములో ఉన్నదని భావింపబడే సర్వము 'ఇంద్రియగోచరము' అను వర్గములోనికి వచ్చును.

తరువాత శ్రీకృష్ణుడు కొన్ని అంతః కరణ వికారములను నిర్దేశించినాడు. ఏలయన, అవి

కూడ క్షేత్రమేనని మనము గుర్తించవలసి యున్నది. ఇవి ఆత్మ ధర్మములని మనము తరచుగా భ్రాంతిపడెదము. క్షేత్రజ్ఞ-ఆత్మయందు ఈ గుణములేవియూ లేవు.

కోరిక (ఇచ్ఛా) అంతః కరణమునకు చెందిన ఒక వృత్తి. దీనిని 'నేను'తో కలిపివేసి, మానవుడు 'నేను కోరువాడను' అని తలపోయును. ఇందువలననే, కోరిక క్షేత్రము మాత్రమేనని భగవానుడు నిర్దేశించు చున్నాడు. ద్వేషము కూడ క్షేత్రమునకు చెందినదియే. కాని అది క్షేత్రజ్ఞునకు చెందినదా యన్నట్లు మానవుడు ప్రవర్తించును. 'క్షేత్రమునకు కోరిక గలదు' అనునది మన అనుభవములో లేదు. 'నాకు కోరిక గలదు' అని మాత్రమే మన అనుభవము. అటులనే, 'క్షేత్రమునకు ద్వేషము గలదు' అని గాక, 'నాకు ద్వేషము కలుగుచున్నది' అని మనకు అనుభవము కలుగుచున్నది. ఘట జ్ఞానము ఇత్యాది జ్ఞానాంశములకు చైతన్య యని పేరు. ధృతి యనగా ధైర్యము. వీటితో పాటు భయము, సిగ్గు (హ్రీః) ఇత్యాది భావావేగములు (emotions) కూడ క్షేత్రములో అంతర్గతమగునని మనము తెలియవలెను. శరీరములోని వివిధ అవయవములు, జ్ఞానేంద్రియములు, మరియు కర్మేంద్రియములు అన్నీ కలిసి యున్న స్థూలదేహమునకు సంఘాతమని పేరు.

స్థూల శరీరము, సూక్ష్మశరీరము, కారణ శరీరము (అవ్యక్తము) మరియు ఇంద్రియగోచరమగు ప్రపంచము అను సర్వము క్షేత్రములో అంతర్గతమగునని ఈ శ్లోకములు వర్ణించుచున్నవి. ఈ శ్లోకములు సంక్షేపముగా నున్ననూ ఏదియూ పరిత్యజింపబడలేదు. ఈ సర్వక్షేత్రమును తెలియువాడు మాత్రమే మిగిలియున్నాడు. క్షేత్రమునకు ఆధారము వాడే. క్షేత్రములోని ప్రతి అంశము యొక్క ఉనికి వానిపై ఆధారపడి యున్నది. ఇట్లు వికారసహితమగు (సవికారమ్) ఈ క్షేత్రము సంక్షేపముగా నిరూపించబడినది (ఉదాహృతమ్).

ఈ రెండు శ్లోకములలో భగవానుడు సామాన్యాకారముగా క్షేత్రమును వర్ణించినాడు. తరువాత ఆయన జ్ఞానమునకు అవశ్యకమగు అర్హతలను చెప్పగలడు. వీటికి కూడ జ్ఞానమనియే పేరు. తరువాత, ఆయన అర్జునుని ప్రశ్నకు బదులిడుతూ క్షేత్రజ్ఞుని గూర్చి వివరించగలడు.

శ్రీ కృష్ణుడు అర్జునుని ప్రశ్నల క్రమమును మార్చి, మూడవ ప్రశ్నలోని మొదటి అంశము (జ్ఞానమనగా నేమి?) నకిపుడు సమాధానము చెప్పుచున్నాడు. జ్ఞానమనగా ఎరుకయని సుగమమే గదా! కాని జ్ఞానసాధనము (తెలిసే ఉపాయము) అను అర్థములో కూడ జ్ఞానశబ్దము ప్రయోగింపబడును. ఇచట ప్రమాణము (జ్ఞానసాధనము) మాత్రమే గాక, జ్ఞానము ఉదయించవలసిన అంతః కరణము సర్వము జ్ఞానశబ్దముచే నిర్దేశింపబడు చున్నది. అంతఃకరణము

నందు కొన్ని విశిష్ట లక్షణములు గల వ్యక్తికి 'జగత్కారణమగు పరబ్రహ్మయే క్షేత్రజ్ఞుడు' అను జ్ఞానము ఉదయించుటకు కావలసిన అర్హత లభించును. కొన్ని విశిష్ట మూల్యములు మరియు మానసిక ప్రవృత్తులు మానవునకు ఉన్నచో, ఈ జ్ఞానము లభించుటలో అవి సహకరించును. అవి కూడా జ్ఞానశబ్దము చేతనే నిర్దేశింపబడుచున్నవి.

**అధ్యాయము 13, శ్లోకము 7 :**

अमानित्वमदंभित्वमहिंसा क्षान्तिरार्जवम् ।
आचार्योपासनं शौचं स्थैर्यमात्मविनिग्रहः ॥ ७ ॥

అమానిత్వమదంభిత్వమహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః (7).

అమానిత్వమ్ = గర్వము లేకుండుట, అదంభిత్వమ్ = దంభము లేకుండుట, అహింసా = అహింస, క్షాంతిః = సహనగుణము, ఆర్జవమ్ = ఋజు స్వభావము, ఆచార్యోపాసనమ్ = ఆచార్యుని సేవించుట, శౌచమ్ = శుచిత్వము, ఆత్మ వినిగ్రహః = స్వీయ–అనుశాసనము.

గర్వము లేకుండుట, దంభము లేకుండుట, అహింస, సహనశక్తి, ఋజుస్వభావము, ఆచార్యుని సేవించుట, శుచిత్వము, స్వీయ–అనుశాసనము (7).

మానము అనగా తనను తాను పొగుడు కొనుట (ఆత్మనః శ్లాఘనమ్). మానము గలవాడు (మానః అస్య అస్తి ఇతి) మాని యనబడును. తన సుగుణములను ఇతరుల యెదుట ప్రకటించి వారినుండి మానమర్యాదలను అపేక్షించు వ్యక్తి మాని యనబడును. మాని యొక్క స్వభావము మానిత్వమనబడును. అమానిత్వమనగా మానిత్వము లేకుండుట. వ్యక్తి యందు సుగుణములున్నచో చాల మంచిది. కాని వాటిని ఇతరులు ఏల గుర్తించవలెను? ఒక విశిష్ట గుణము విషయములో ప్రత్యేకమగు మహత్త్వభావన గల వ్యక్తి మాత్రమే, ఇతరకారణములు అడ్డురాని యెడల, ఆ గుణమును గుర్తించును. నీకు గీతయందు గల పరిజ్ఞానమును జెబుదాంగ గుర్తించడు గదా, నీకు గల నైపుణ్యములను, నీవు సాధించిన ఘనతలను వాటి యందు మహత్త్వ భావన గల వ్యక్తులు మాత్రమే గుర్తించి శ్లాఘించెదరు. ఇతరులకు వాటిని గుర్తించవలసిన ఆవశ్యకత లేదు.

మనకు గల సమస్యలలో చాల వాటికి మూల కారణమేమనగా- ఇతరులు మనలోని సుగుణములను గుర్తించక పోవుటయే. గుర్తింపును కోరుట సర్వసాధారణము. ఇది న్యాయసమ్మతము కూడా. నీలో ఒక సుగుణమున్నచో, దానిని ఇతరులు గుర్తించుట మంచిది. కాని అట్టి గుర్తింపు గురించి అఱ్ఱులు చాచుట సమస్యలకు మూలమగును. గుర్తింపును నీవే గాక, ఇతరులు కూడ కోరెదరు. సర్వదా ఇతరులు నన్ను గుర్తించవలెనని నేను పట్టుపట్టినచో ఇతరులలో మంచిని సరిగా గుర్తించే పరిస్థితి నాలో లుప్తమగును. దీని వలన నాకు ఇతరులతో గల సంబంధములలో నిరంతరమగు ఉద్వేగము (tension) నిర్మాణమగును. మానమర్యాదలు ఇతరుల నుండి సహజ రీతిలో ప్రకటము కావలెను. వాటిని గురించి నేను అఱ్ఱులు చాచినచో, అది ఒక మానసిక సమస్యయై సతమతమగుచుండును.

నేను చేసిన ఘనకార్యములను ఇతరులు గుర్తించ వలెనని పట్టుబట్టుటకు కారణమేమి? నేను యథార్థముగా ఘనకార్యములను వేటినీ చేయలేదని నేను నమ్ముటయే దీనికి కారణము. నేను సాధించిన కార్యములపై నాకు వాస్తవిక జ్ఞానము గలదు. అయిననూ, మనస్సు లోపలి పొరలలో 'నేను విజయమును సాధించలేక పోతిని' అను భావన దాగియున్నది. ఈ భావన బాల్యము నుండి పాదుకొని యున్నది. తల్లిదండ్రులు మరియు ఉపాధ్యాయుడు కోపపడినపుడు పిల్లవాని మనస్సులో ఏర్పడిన గాయములు ఇంకనూ పూర్తిగా మానకపోవుటచే ఈ భావన విడనాడకుండా కొనసాగు చుండును. బాలుర మనస్సులలో యోగ్యమగు ఆత్మ గౌరవము ( ఆత్మ విశ్వాసము) నెలకొనుటలో అనేక పరిస్థితులు ఆటంకములగు చుండును. ఆత్మ న్యూనతా భావము గల వ్యక్తి తన విలువను గుర్తించుట చాల కష్టము. అట్టి వ్యక్తి తన విలువను నిరూపించుకొనుట కొరకై నిరంతరముగా ఘనకార్యములను సాధించవలెననే తపనతో సతమతమగుచుండును. ఆతడు ఆదరించే ప్రముఖ వ్యక్తుల దృష్టిలో తాను చులకన యగుటను అతడు భరించలేడు. దీనిని లోతుగా అవగాహన చేసుకోవాలి. 'మానిత్వమ్ ' అను గుణము నా యందు ఉన్నచో, నన్ను నేను నిందించుకొని నా ఆత్మ విశ్వాసమును మరింత దిగజార్చు కొనుట పద్ధతి కాదు. దీనిని తెలుసుకొనే ప్రయత్నమును చేయవలెను. నేను ఇతరులనుండి మానమర్యాదల నేల అపేక్షించవలెను? ఇది చాలా అనావశ్యకము. దీనిని లోతుగా పరిశీలించినచో, ఇతరుల నుండి మానమర్యాదలను అపేక్షించే స్వభావము వలుచబడును.

గౌరవమర్యాదలను పొందే అర్హత, అధికారము నా యందు ఉన్నచో, ఇతరులు గౌరవించినారా? లేదా? అనునది సమస్య కాబోదు. అట్టి వ్యక్తి యందు ఆత్మ గౌరవము ఉండును.

నాలోని లోపమేమి? అని నేను విశ్లేషించినచో, ఆత్మ స్వరూపతః సచ్చిదానందమనియు, దానికంటె ఉత్కృష్టమైనది మరియొకటి లేదనియు నేను కనుగొనెదను. ఈ ఘనకార్యములతో సహా సర్వము అనాత్మయే. అపరావిద్యలో ఒకడు అధికపరిజ్ఞానము కలవాడు కాగా, మరియొకడు అల్పజ్ఞుడగును. కాని సర్వదా ఈ జ్ఞానమునకు ఒక హద్దు గలదు. ఒకనికి ఒక విషయములో నైపుణ్యమున్నచో, మరియొకనికి ఇంకో విషయములో నైపుణ్యము ఉండును. ఒకడు రచనలను చేయగల్గితే, మరియొకడు పాడగల్గును. వీరిలో ఎవరు గొప్ప? ఎవరు తక్కువ? మానవులలో అనేకములగు అంతశ్శక్తులు (potentials) నిగూఢముగా నున్నవి. ప్రతివ్యక్తి తనలోని శక్తిని గుర్తించి దానిని వికసింపజేసే అవకాశములను వినియోగించుకొనుటపై అతని అభివృద్ధి ఆధారపడియుండును. కాని మానవునకు ఎన్ని ప్రతిభలు ఉన్ననూ, అవి క్షేత్రమునకు చెందియుండును. మరియు అవి స్వభావతః కొన్ని హద్దులకు లోబడి యుండును. ఒక వ్యక్తిలో గల ఒక విశిష్ట ప్రతిభను అతడు ఎంత అధికముగా వికసింపజేసిననూ, అది సర్వదా ఒక హద్దునకు లోబడి యుండును. వికాసము ఆ హద్దును దాటి పోలేదు. బరువునెత్తే పోటీలో ప్రపంచవిజేత యగు వ్యక్తియైననూ పర్వతమును ఎత్త జాలడు. అదే విధముగా, బుద్ధి యందు తెలుసుకునే సామర్థ్యము కలదు గాన, బుద్ధి మంతుడు చాల ఎక్కువ జ్ఞానమును సంపాదించ గల్గునే గాని, సర్వజ్ఞుడు కాజాలడు. జీవితమునంతనూ జ్ఞానసముపార్జనలో ధారపోసిన వ్యక్తియైననూ పుస్తకముల నన్నింటినీ చదువలేడు. ఈ జ్ఞానార్జనము సర్వదా అసంపూర్ణముగానే యుండును. కావున, ఇంద్రియములతో మరియు మస్తిష్కముతో సంపన్నమై యున్న ఈ స్థూలదేహము (క్షేత్రము) నకు కొన్ని శక్తులు గలవు. కాని ఆ శక్తులు పరిమితముగ నుండును.

ఈ సత్యమును గుర్తించిన వ్యక్తి తనను ఇతరులతో పోల్చుకొనుట మానివేయును. దాని వలన, తనను గురించి తాను ప్రతి కూలముగా తీర్మానము చేసుకొనే పరిస్థితి తొలగిపోతుంది. భగవంతుడు నాకు ఈ దేహేంద్రియ సంఘాతము ననుగ్రహించినాడు. ఈ దేహమునందు జ్ఞానశక్తి ఇచ్ఛాశక్తి మరియు క్రియాశక్తి తగు మోతాదులో గలవు. వాటిని నేను వినియోగమునకు తెచ్చి, తద్వారా కొన్ని ఘనకార్యములను సాధించినాను. ఈ సమస్త జగత్తులో ఎవరు గొప్ప? ఎవరు తక్కువ? వేర్వేరు వ్యక్తులు తమలో దాగియున్న వేర్వేరు అంతశ్శక్తులను వినియోగమునకు తెచ్చెదరు. అంతే. ఒకడు స్థూలదేహమును ఒక స్థాయి వరకు వికసింపజేయగా, మరియొకడు మస్తిష్కమును వికసింపజేయును. కాని వ్యక్తి ఎంతటి పరిపక్వతను చెందినాడు? అనునది జీవితములో యథార్థముగా పరిగణింపదగిన అంశము. మానవుని వ్యక్తిత్వమునకు మూలము మనః పరిపక్వత మాత్రమే. తనను ఇతరులు గుర్తించలేదనియు, తనకు నోబుల్ బహుమతి

లభించలేదనియు దుఃఖిస్తూ చికాకు పడే వైజ్ఞానికుడు ఒక చిన్న పిల్ల వానితో సమానము. ఇతరులు చూచు చుండగా పిల్లలు తాము చేసిన ఘనకార్యములను ప్రకటించెదరు. వ్యక్తి తనలోని అంతశ్శక్తిని వికసింపచేయుట నేరమని చెప్పుట దీని తాత్పర్యము కాదు. నీ యందు కొన్ని ప్రతిభలు గలవు. వాటిని ఈశ్వర విభూతుల రూపములో అభివ్యక్తము చేయదగును. కాని ప్రతిభలను ప్రకటించినంత మాత్రాన వ్యక్తిత్వము నిర్మాణము కాబోదు. ఒక కర్మయందు గల ప్రేమ కారణంగా ఆ కర్మను ఆచరించినచో, అది వ్యక్తిత్వ నిర్మాణమునకు హేతువు అగును. అట్లు గాక, ఇతరుల పొగడ్తల నాశించి, తద్వారా వారి దృష్టిలో తాను గొప్పవాడను కావాలనే తపనతో కర్మల నాచరించినచో, అది అవివేకము తప్ప మరియొకటి గాదు.

నాకు నాపై కొంత ఆత్మ గౌరవము ఉండుట ఆవశ్యకము. నా మనస్సు పరిపక్వమైనప్పుడు మాత్రమే అది సంభవమగును. వ్యక్తిత్వమును తీర్చిదిద్దునది ఈ పరిపక్వత మాత్రమే. ధనము ఉన్ననూ, దాని వలన వ్యక్తిత్వ నిర్మాణము జరుగదు. నన్ను గురించి నాకు గల అభిప్రాయము చాల ప్రముఖమైనది. నా దేహమును నేను ఆదరించెదను. నా మనస్సును, ఇంద్రియములను కూడ నేను ఆదరించెదను. ఈ దేహము భగవానుడు నాకు ప్రసాదించిన అందమైన సాధనము. దానిని పూర్ణముగా ఆదరించుటకు ఈ ఒక్క కారణము చాలును. ఇది మనో విజ్ఞాన శాస్త్రములో ప్రస్తావించే సరళమగు ఆత్మ గౌరవము మాత్రమే కాదు. భగవానుడు నాకు ఒసగిన ఈ సుందరమగు వరమునకు నా మనస్సు కృతజ్ఞతతో నిండి యున్నది. నా హృదయములో భక్తి భావన ఉప్పొంగుచున్నది. ఈ దేహము ఒక కళాఖండము. దీనిలోని అస్థిపంజరము యాంత్రిక విజ్ఞానము (engineering) యొక్క సర్వోత్కృష్ట రచన. కాలేయము ఒక రసాయన కర్మాగారము. చర్మము వాతానుకూల యంత్రము (air - conditioner). మనస్సు మిక్కిలి అసాధారణమైన కరణము. కంప్యూటర్ల సామర్థ్యమును గాంచి మనము విస్మయముతో వాటిని కొనియాడెదము. కాని కంప్యూటరును సృష్టించినది మానవుని మస్తిష్కమే గదా! ఈ దేహేంద్రియ సంఘాతము సమగ్ర సుందర సృష్టి. దీనిని నేను యథాతథముగా అనుభవించుటకు పుష్కలమగు హేతువులు గలవు. కావున నాపై నాకు గౌరవము ఉండవలెను. నాలో ఆత్మ గౌరవమున్నచో, నేను ఇతరుల నుండి గౌరవమర్యాదలను అపేక్షించబోను. భక్తి భావముతో నిండిన మనస్సుతో నన్ను నేను పూర్ణముగా స్వీకరించెదను. భక్తి ఎవరి యందు? సర్వేశ్వరుని యందు. ఈశ్వరుడే సృష్టి రూపములో నున్నాడనియు, ఈ సర్వము ఈశ్వరుని మహిమ యొక్క అభివ్యక్తియే ననియు ఎరుంగుదుము. ఈ సత్యము నెరింగిన వ్యక్తి ప్రార్థనాయుతమగు హృదయముతో సర్వమును స్వీకరించును.

మనమీ దేహమును మరింత లోతుగా పరిశీలించినచో, అది సుందరమైన, మిక్కిలి జటిలమైన రచనయని స్పష్టమగును. సరళమైన అవిభాజిత (undifferentiated) తత్త్వము నుండి ఈ జటిలము, సచేతనము అగు దేహము ఉద్భవించినది. మూలతత్త్వములో సర్వము సంకేత (code) రూపములో నుండి నానారూపములలోనికి విస్తరించినది. కాలేయ కణములు వేరు, మస్తిష్కకణములు వేరు. ఆయా కణములు విభిన్న అంగముల రూపములో వ్యవస్థీకృతమై యున్నవి. కాలేయ కణములు మస్తిష్కములోనికి, లేదా మస్తిష్క కణములు కాలేయములోనికి ప్రవేశించినచో, తీవ్రవమగు సమస్యలు తలయెత్తును. మరియు మస్తిష్కమునకు ప్రత్యేక రక్షక కవచము ఆవశ్యకమగును. కపాలము ఆ పనిని నిర్వర్తించు చున్నది. దీని నంతనూ పరిశీలించినచో, ఇది ఒక అర్థపూర్ణమగు కావ్యము వలె భాసిల్లు చున్నది. ఈ విధముగా ఈశ్వరుని మహిమను తెలికగా గుర్తించవచ్చును. అట్లు గుర్తించిన వ్యక్తిలో ఆత్మ నిందకు అవసరము తొలగిపోయి, ఆత్మ గౌరవము నెలకొనును.

నీవు ఉపాధిని అంగీకరించినచో, దాని యందు దోషమేమియూ లేదు. దానిని అంగీకరించనిచో, ఎంత ఉన్ననూ తృప్తి ఉండదు. ఏలయన, ఉపాధి పరిచ్ఛిన్నమైనది గదా! ఈ అల్పత్వము కూడ ఉపాధికి సౌందర్యమునే ఆపాదించు చున్నది. ఏలయన, పరిచ్ఛిన్నమగు ఉపాధితో వ్యవహరించుట సరళము. నీవు వజ్రములు పొదిగిన ఆభరణమును కోరుచుంటి వనుకొనుము. ఆ వజ్రములు సుందరముగా నుండి, ధరింపయోగ్యముగా నుండవలెనన్నచో, ఏ పరిమాణములో నుండవలెను? అరకేజీ బరువు గల వజ్రమును మెడలో ధరించుట సంభవము గాదు. సుందరమైన వస్తువులన్నింటితో మనము నాజూకుగా వ్యవహరించగల్గుదుము. అదే విధముగా పరిచ్ఛిన్నమైనది, అల్పపరిమాణము గలది అగు ఈ స్థూలదేహము ఒక సుందరమగు వస్తువు. అందమును నిర్ణయించేది పరిమాణము కాదు గదా! పర్వతము సుందరమగు సృష్టి. అటులనే, చిన్న వజ్రము కూడ సుందరమగు సృష్టియే. ఈ సృష్టిలో అంతర్భాగమై యున్న ప్రజ్ఞా సౌందర్యములను మనము దర్శించ గల్గిననాడు, బ్రహ్మాండమంతయు సుందర కావ్యము వలె భాసించును. కావున ఈ స్థూలదేహము ఎంత చిన్నదైననూ సమగ్ర సుందర రచనయే. ఈ సత్యమును దర్శించగల్గినచో, నాకు నేను అభిమతుడను (acceptable) అగుదును. సచ్చిదానంద-ఆత్మ స్వరూపము చేతనే అభిమతము కాగా, దేహము కూడ సుందరమైన దగుటచే అభిమతమే యగును. ఈ సత్యమును గుర్తించిన వ్యక్తిలో, అట్టి జ్ఞానము నుండి ఉత్పన్నమైన అతి సహజమగు అమానిత్వము నెలకొనును. ఈ క్షేత్రమునకు కొన్ని శక్తులు గలవు. నేను వాటిని వికసింప జేసెదను. కాని నేను ఎవరికైననూ

దేనినైననూ నిరూపించ నవసరము లేదు. ప్రతి వ్యక్తికి తనదైన క్షేత్రము గలదు. విభిన్న వ్యక్తులు తమ క్షేత్రశక్తులను విభిన్న రూపములలో అభివ్యక్తము చేయుచుందురు. అభివ్యక్తమయ్యే రూపము ఏదైనా, అది ఆ వ్యక్తికి శ్రేష్ఠమైనదే యగును. యథార్థముగా ప్రముఖమైన విషయమేమనగా, దానిని వ్యక్తి సంతోషముగా స్వీకరించవలెను. అదియే మనః పరిపక్వత. అది గల వ్యక్తిలో ఒక గొప్ప సౌందర్యము నెలకొనును. ఇట్టి సంతోషించే స్వభావము గల వ్యక్తి ఇతరుల నుండి ఎన్నటికీ మానమర్యాదలను అపేక్షించడు.

ఇచట ఒక విషయమును నేను మరల చెప్పదలచు కున్నాను. దీనిని ఒక ఆదర్శముగా తీసుకొని, అది ఆధారంగా ఆత్మనింద చేసుకొనరాదు. ఇది వ్యక్తి తనను గురించి విరుద్ధముగా తీర్మానించుకొనుట కొరకు చెప్పబడుట లేదు. మానవుడు ఈ అమానిత్వమును అవగాహన చేసుకొని, అది లభించు ఉపాయము నరయవలెను. అట్లు చేయుట వలన, ఆత్మ దూషణములతో, భూషణములతో మరియు వర్గీకరణము (labelling) లతో పని లేకుండగనే ఈ గుణమును వ్యక్తి తన స్వరూపములో దర్శించవచ్చును. ఆదర్శీకరణము (idealise) చేయువారికి, అట్లు చేయని వారికి మధ్య గల భేదమును తేలికగా పసిగట్ట వచ్చును. ఒక వ్యక్తి గొప్ప ధార్మికుడై యుండవచ్చును. కాని అతని యందు తాను ధార్మికుడననే అభిమానము అధికముగా నుండును. అతడు తన ఆదర్శములనన్నిటినీ ఒక వరుసలో అమర్చుకొని యుండును. భారత దేశములోని ఆశ్రమములలో గోడలపై ఆదర్శవాక్యములు వ్రాయబడి యుండును: మాటలాడుట కంటె మౌనమే మేలు. రాజ్యము నేలుట కంటె మనస్సును వశములోనుంచు కొనుట మంచిది. స్వార్థ సాధన కంటె ముందు పరులను సేవించవలెను. సేవ చేయువాడు అధిక ఫలమును పొందును. ఈ వాక్యములలో ఆఖరి రెండు వాక్యములు పరస్పర విరుద్ధముగా నున్నవి. పదములను ఆదర్శముల రూపములో చిత్రీకరించుట యందు మనకు అభిరుచి లేదు. పదములను వర్గీకరించుట మాని, మనము వాటిని తెలుసుకున్న చాలును. కావున, 'అమానిత్వమ్' అను లక్షణమును కలిగియుండుట ఎట్లు? అను విషయము నెరుంగవలెను.

తరువాత లక్షణము అదంభిత్వము. మరల, మనము ముందుగా దంభమును అర్థము చేసుకొని, దానిని దూరము చేయుట ఎట్లో తెలియవలెను. తనలో లేని మహిమలను ఉన్నట్లుగా చెప్పుకొనుట దంభమగునని శ్రీశంకరులు వివరించిరి. మానిత్వములో అర్హత ఉండి మానమర్యాదలు అపేక్షింపబడగా, ఇచట అర్హత లేకుండగనే మానమర్యాదలు అపేక్షింపబడును. మానవులు చిన్నచిన్న చేష్టలద్వారా మాత్రమే గాక, పెద్ద యోజనలతో దంభమును ప్రదర్శించెదరు.

ఇతరుల గుర్తింపును, పొగడ్తలను పొందుట కొరకై తమలో లేని కల్పిత మహిమలను ఇతరుల యెదుట ప్రకటించు కొనెదరు. కొందరు బ్యాంకులలో ఋణములను దీసుకొని అయిదు వ్రేళ్లకు ఉంగరములను దాల్చి తాము ధనికులమని ఇతరులను నమ్మింపజూసెదరు. అనగా వ్యక్తి వాస్తవముగా ధనికుడు కాకపోయిననూ, ధనికునివలె తనను తాను భావించు కొని ఆనందించును. చేష్టల ద్వారా, వేషభాషల ద్వారా, మరియు మాటలాడే భాష ద్వారా నాలో ఉన్నదాని కంటె అధికమును చూపే ప్రయత్నమునకు దంభిత్వమని పేరు. అట్టి ఆడంబరములు లేకుండుటయే అదంభిత్వమనబడును. నాకు నేను అభిమతము కాకుండుట అను లక్షణము ఆడంబరముల రూపములో బయట పడుచుండును. నాకు నేను అభిమతుడను గానిచో, నేను చేసే అభినయములను బట్టి ఇతరులు నన్ను మెచ్చు కున్ననూ, దాని వలన నాకు ప్రయోజనము ఉండబోదు. నాకు నేను అభిమతమైనచో, ఈ సమస్య కూడా దూరమగును.

ఇతర ప్రాణులకు పీడను కలిగించకుండుట అహింస అనబడును. అహింస స్వీయ దేహములో ఆరంభమై చెట్లు చేమలు వరకు గల ప్రాణులన్నింటికీ విస్తరించును. సన్న్యాసి యొక్క వ్రతములలో ముఖ్యమైనది అహింస. అహింసావ్రతమును పాటించు సన్న్యాసి మాంసాదులను భక్షించు ప్రసక్తియే లేదు. ఈ జీవన మూల్యమును తెలుసుకొనుటలో చాల పరిజ్ఞానము ఇమిడి యున్నది. కావున ఈ గుణమును పాటించుట కష్టముతో గూడిన పని. యుద్ధము ఇత్యాది కొన్ని సందర్భములలో హింస తప్పని సరియగును. గీతలోని పరిస్థితి అదియే గదా! అహింస అను పదమునకు అర్థము తరచు మారి పోవుచుండును. కావున దానికి కాలానుగుణముగా, మారుతున్న పరిస్థితులకు అనురూపముగా అర్థమును చెప్పవలెను. కాని దానిలోని మౌలికమగు స్ఫూర్తిని సుస్పష్టముగా నెరుంగవలెను. బుద్ధి పూర్వకముగా, స్వార్థసాధన కొరకై, ఇతర ప్రాణిని హింసించరాదు. అదియే అహింస.

ఆత్మ బ్రహ్మయే యను జ్ఞానమును పొందుటలో అహింస ఏ విధముగా సహకరించును? బ్రహ్మన్ అనగా పూర్ణము. బ్రహ్మను ఎరుంగుటకు మనస్సు బ్రహ్మ యంతటి విశాలము కావలెను. ఇతరుల బాధలను తెలియగలిగే కోమలమగు హృదయము సాధకునకు ఉండవలెను. కరుణానుభూతిని ఎరుంగని మానవ హృదయము లేదు. కాని సాధారణముగా మనము అనుభూతిని పైకి రానీయము. టెన్నిస్ ఆటలో విజేతయగు క్రీడాకారుని పరిశీలింపుము. విజయము తనను వరించిన క్షణములో ఆటగాడు చేతిలోని బ్యాటును గాలిలోనికి విసిరి విజయోల్లాసముతో కేకవేయును. అతడు ప్రత్యర్థితో చేయిని కలుపుటకై నెట్ వద్దకు మహానందముతో పరుగెత్తును. పరాజితుని

చూపులతో చూపును కలిపిన క్షణములో అతని ముఖకవళికలను గమనించుము. అతని నవ్వు, ఉల్లాసము మాయమగును. తాను నెగ్గినందులకు దుఃఖించుచున్నాడా యన్నట్లు అతడు కన్పట్టును. ఎందువలన? అవలి వ్యక్తి దుఃఖితుడై యున్నాడు గనుక. ఇతరుల దుఃఖమును గుర్తించజాలని హృదయము మానవ జాతిలో లేదు. పరాజయములో గల దుఃఖమునాతడు ఎరుంగును. కావున ఆ దుఃఖములో క్షణకాలమైననూ పాలు పంచుకొనక పోవుట అతని హృదయమునకు చేతకాదు. కాని ఇతరుల దుఃఖమును గాంచిన వెంటనే కలిగే ఇట్టి దుఃఖమును వ్యక్తి తరచుగా ప్రక్కకు నెట్టి వేయును. పైగా, ఇతరుల దుఃఖము హేతుబద్ధమైనదియే యని తలపోయును. ఇట్టి హృదయములో క్రమముగా హింస సమర్ధనీయమే నను భావము నెలకొనును. ఇతరుల దుఃఖమును చూడగానే మున్ముందుగా మన హృదయములో సానుభూతి ఏర్పడును. ఆనందము యొక్క అభివ్యక్తియే ఈ సానుభూతి. కాని ఈ సానుభూతిని కప్పి వేసే ఆలోచనా ధోరణి కొందరిలో నెలకొనును. ఆ తరువాత ఇతరుల దుఃఖమునకు వారిపై ప్రభావమేమియు ఉండదు. నా హృదయములోని పూర్ణత్వము ఇతరులతో వ్యవహరించునప్పుడు సానుభూతి రూపములో వ్యక్తమగును. తన మనస్సులోని భావావేగములపై నియంత్రణ గల వ్యక్తి ఇట్టి సానుభూతిని తన అదుపులో నుంచుకొనును. అట్లు చేత గానిచో, ఆ సానుభూతి కట్టలు త్రెంచుకొని, ఇతరుల దుఃఖమును ఈతని దుఃఖముగా మార్చి వేయును. ఇతరుల బాధను అర్థము చేసుకొనే స్వభావమే అహింస. ఈ స్వభావము గల వ్యక్తి దృష్టిలో ఇతర ప్రాణుల ప్రాణమునకు అత్యధిక మహత్త్వము ఈయబడును. అతడు ఇతర ప్రాణులకు గల జీవించే హక్కును గుర్తించి, వాటి ప్రాణములకు ముప్పును కలుగనీయడు. 'నేను ఇతర ప్రాణులను వాటి మానాన వాటిని బ్రతుకనిచ్చెదను' అను భావన కూడ సమంజసము కాదు. వాస్తవములో ఇతర జీవుల జీవితములపై ఒక వ్యక్తికి లేశమైననూ నియంత్రించే అధికారము లేదు. ఇది ఒక కార్యనీతి (policy) అనుకోరాదు. ప్రతి జీవికి జీవించుట జన్మ హక్కు అను సత్యమును వ్యక్తి గుర్తించినచో, ఆ గుర్తింపు నుండి ఈ అహింసయను సుగుణము ఉద్భవించును. ఈ గుర్తింపు గల వ్యక్తి తాను జీవిస్తూ, ఇతర జీవులను గాంచి ఆనందించును. అట్టి వానికి అహింస సరళమైన, అతి సహజమైన జీవన విధానము అగును. మానవుని హృదయములో మౌలికముగా సానుభూతి మొదలగు గుణములు గలవు. కాని వ్యక్తి జీవితములో నెలకొనిన కొన్ని ప్రాథమికతల (priorities) వలన తప్పుడు ఆలోచనా ధోరణి నిర్మాణమై మౌలిక గుణములను త్రొక్కి వేయును. అహింసను పాటించు వ్యక్తిలో ఈ దుస్స్థితి ఉండదు. కావున, అతనిలో సానుభూతి, సంవేదన శీలము పరవళ్లు త్రొక్కు చుండును.

ఇతరులు అన్యాయము చేసిననూ, వికారమును పొందకుండుట క్షాంతి యనబడునని

శంకరులు చెప్పిరి. ఇతరులు ధర్మ విరుద్ధముగా మాటలాడి, లేక ప్రవర్తించి, ఏదో ఒక విధమగు వినీ కలిగించినప్పుడు పగ దీర్చు కొనవలెననే ఉత్తేజము కలుగును. ఇట్టి స్పందనకు 'విక్రియా' అని పేరు. ముందుగా ఈ వికారము మనస్సులో పుట్టి, తరువాత మాటల రూపములో గాని, చేష్టల రూపములో గాని, బయటపడును. ఇట్టి ప్రతిక్రియ లేకుండుటయే శాంతి యనబడును. తన దృష్టిలో తనకు అన్యాయము జరిగినదని విశ్వసించే వ్యక్తి ప్రతిక్రియనాచరించకుండగా ఎట్లుండగలడు? మనో వైజ్ఞానిక శాస్త్రమునను సరించినచో, ప్రతిక్రియ న్యాయసమ్మతమే యగును. ఒక రకంగా ఇది వాస్తవమే. కాని మనమిచట మరియొక అడుగు ముందుకు వేసెదము. ఆత్మ జ్ఞానమును పొందగోరు సాధకుని విషయములో ఇట్టి ప్రతిక్రియలకు ఔచిత్యము లేశమైననూ లేదు. కోపమును అణిచిపెట్టవలెనని ఇచట బోధింపబడుట లేదు. కాని ప్రతిక్రియకు అతీతుడయ్యే విధానమును పరిశీలించెదము. ఇతరవ్యక్తిని గురించి లోతైన అవగాహన ఉన్నప్పుడు మాత్రమే ఇది సంభవమగును. అతడు అట్లు చేయుటకు ప్రేరణనిచ్చిన అంశమేది? ప్రతివ్యక్తి ఒక పద్ధతిలో ప్రవర్తించుటకు, అతడు మరియొక విధముగా ప్రవర్తించలేక పోవుటయే కారణమగు చున్నది. అతడు మరియొక విధముగా ప్రవర్తించ గల్గినచో, నిశ్చితముగా అట్లు అపకారమును చేసి యుండెడి వాడు గాదు. ఎవరి ప్రవర్తనను మనము సహింపజాలమో, మనము అట్టి వారికి సాధారణముగా దూరములో నుండెదము. కాని నాలోని ప్రతీకారమనే సమస్యకు అది పరిష్కారము కాజాలదు. నేను ఆత్మవిమర్శను చేసుకోవాలి. ఇతర వ్యక్తి యథాతథముగా నుండుట నాకు ఏల అంగీకారమగుట లేదు? ఈ అంశమును నేను శోధించవలెను. అసహనము నుండి ప్రతీకారము పుట్టును. దీనిని మరో విధముగా చెప్పవచ్చును. బాహ్య విషయములను బయటనే వదిలి పెట్టవలెను. అట్లు గాక వాటిని మనస్సులో స్థాపించుకున్నచో (internalisation), ఆ పరిస్థితి నుండి ప్రతీకార భావన ఉదయించును. ఒక వ్యక్తి నా విషయములో తప్పుగా ప్రవర్తించి నాడనుకొనుడు. దానిలో నా బాధ్యత ఏమియూ లేదు. అయిననూ, నేను దానిని నా మనస్సులో పెట్టుకున్నచో, నా మనస్సు గాయపడును. వాస్తవమేమనగా, పెరిగి పెద్దయైన నేను నా చర్యలకు, నా మనోభావములకు మాత్రమే బాధ్యుడనగుదును. వాటిలో దోషమున్నచో, వాటిని నేను ఏనాడైననూ సరిదిద్దుకొనవచ్చును. కాని నేను ఇతరుల చర్యలకు, మనోభావములకు బాధ్యతను వహింపజాలను. నేను ఏయే వ్యక్తులతో వ్యవహరించుట ఆవశ్యకమో, వారు యథాతథముగా నాకు అభిమతము అగునట్లు చూచుకొనవలెను. నేను చేయగలిగినది ఇంతే. ప్రతి వ్యక్తి వెనుక ఒక చరిత్ర (నేపథ్యము, background) ఉండును. ఒక వ్యక్తి పెరిగిన పరిస్థితులలో నేను పెరిగి యున్నచో, నేను కూడ అతనివలెనే ప్రవర్తించి యుండెడి వాడను. కావున ఒక వ్యక్తి యొక్క ప్రవర్తన అతడు పెరిగి పెద్దయైన

పరిస్థితులు, చరిత్ర ఇత్యాది నేపథ్యముపై ఆధారపడి యుండుననే సద్భావన కలిగి ఉండుటయే మనస్సు యొక్క పరిపక్వత యగును.

మానవుని మస్తిష్కము పనిచేయు తీరును నియంత్రించే సూత్రములు గలవు. అందువలననే 'మనో విజ్ఞానము' అనే విజ్ఞాన శాస్త్రశాఖ మనకు గలదు. ఒక విశిష్టమగు చరిత్ర, లేక నేపథ్యము వ్యక్తి యొక్క ఒక విశిష్ట ప్రవర్తనకు హేతువు అగును. దీనిలో బాధ్యత ఎవరిది? ఈ సత్యమును గుర్తించ గలిగితే, వ్యక్తిలో దయ, అవగాహన మరియు వినగలిగే శక్తి ఉండును. అట్టి వాడు ఇతరుని చర్యపై ప్రతి చర్యను చేపట్టుటకు ముందు ఆ వ్యక్తిని అర్థం చేసుకునే ప్రయత్నమును చేయును. దీనికి చాల సహనము కావలెను. ఇతర వ్యక్తిని అర్థము చేసుకొనుట తేలిక కాదు. కొన్ని సందర్భములలో ఇతర వ్యక్తిని అర్థము చేసుకొనుటకు సంవత్సరము పట్టును. వివాహమైన ఇరువది సంవత్సరముల తరువాత దంపతులు పరస్పర-అవగాహన లేని కారణంగా విడిపోయెదరు. ఇతర వ్యక్తిని అర్థం చేసుకోవాలంటే, మనము నిష్కపటముగా నుండవలెను. కాని భయములు, ఆదుర్దాలు ఉన్న కారణంగా మనలో చాల మంది అట్లు ఉండజాలరు. వీటి వలన సంభాషణ మొదలగు వ్యవహారములు నూటికి నూరు పాళ్లు నిష్కపటముగా నుండజాలదు. కావున అన్యోన్య సంబంధము కూడ నిష్కపటముగా నుండదు. ప్రతి వ్యక్తిలో దాచిపెట్టదగిన అంశములు కొన్ని ఉండును. మరియు మైత్రిని కొనసాగించాలనే ఆదుర్దా ప్రవర్తనను ప్రభావితము చేయును. నిష్కపటమగు మనస్సుతో ఇతరవ్యక్తిని అర్థం చేసుకొన లేకపోయినచో, సన్నిహిత సంబంధము వ్యక్తులలో పరిపక్వతకు బదులుగా సమస్యలను సృష్టించును. ఇట్టి నిష్కపట-ఉదార ప్రవృత్తికి క్షాంతి యని పేరు. వ్యక్తి తనకు గల జీవన మూల్య సంరచనలో క్షాంతికి పెద్ద పీట వేసినచో, అతడు నిష్కపటియై ఇతరులను తేలికగా అర్థము చేసుకొనగల్గును.

అట్టి వ్యక్తి ఉచితమగు క్రియను మాత్రమే చేయును. ఒకప్పుడు సరియగు సమాచారము లేని కారణంగా తప్పును చేసియున్ననూ, అతడు దానిని వెంటనే సరిదిద్దుకొనును. కాని ప్రతిక్రియలో నేర్చుకొనుటకు గాని, తప్పును దిద్దుకొనుటకు గాని సావకాశము లేదు. వ్యక్తి యొక్క అవగాహనకు విరుద్ధముగా ప్రతిక్రియ తనంత తానుగా ముందుకు సాగిపోవును. కాని క్రియలో మనము నేర్చుకొనే సావకాశము గలదు. మనము చేసే క్రియలన్నియు విజయవంతము కాకపోవచ్చును. అట్లు అగుటకు కావలసినంత సమాచారము మనవద్ద లేకపోవచ్చును. కాని మనము నేర్చుకొనే అవకాశము నిశ్చితముగా దొరుకును. నేను ఉదార బుద్ధితో దయా పూర్ణ హృదయముతో ఒక వ్యక్తితో వ్యవహరించి నాననుకొనుడు. కాని ఆ వ్యక్తి నా చర్యలను అపార్థము చేసుకొనవచ్చును.

నేనాతనిపై ప్రేమను చూపుచుండగా, పెద్దరికమును చెలాయించు చున్నానని అతడు తలపోయవచ్చును. ఈ పరిస్థితిలో భావప్రకటనము సరళము గాదు. భావప్రకటనములో సమర్థులగు వ్యక్తులకు కూడా ఇట్టి స్థితిలో ఏమి చేయవలెనో పాలు పోదు. కాని మన ప్రయత్నమును మనము చేయవలెను. నేను చేయుచున్న పనిని మరింత సున్నితముగా చేయుటకు ప్రయత్నించవచ్చును; లేదా, నా ప్రవర్తనలో మార్పును దేవచ్చును. నేను ఇతరవ్యక్తి యొక్క హృదయమును తెలుసుకొని మసలుటకు సంసిద్ధుడనై ఉన్నంత వరకు సర్వము సంభవమగును. నాలో శాంతి ఉన్నప్పుడు మాత్రమే ఇతరుల యెడ ఇట్టి ఉదారప్రవృత్తి సంభవమగును.

శాంతికి నేను తరచుగా ఒక దృష్టాంతమునిచ్చెదను. శిశువు తండ్రిని కాలితో తన్నును. తండ్రి శిశువుపై నేరమును మోపడు. పైగా ఆ విషయమును భార్యకు వర్ణించి చెప్పి ఆనందించును. కాని, అదే శిశువు పదిహేను సంవత్సరముల తరువాత తన్నినచో, అతని స్పందన దీనికి పూర్తి భిన్నముగా నుండును. శిశువు తన్నుట వెనుక నున్న నేపథ్యమును తండ్రి ఎరుంగును. కావున, శిశువు తన్నిననూ, అతనిలో ప్రతీకార భావన ఉదయించదు. నేపథ్యములో ఉన్నది అమాయకత్వము మాత్రమేనని అతడు ఎరుంగును. అదే శిశువు పెరిగి పెద్దయై తన్నినచో, దాని వెనుక కూడ ఒక నేపథ్యము ఉండును. బహుశః ఆ యువకుడు మద్యమును త్రాగి, లేదా మాదక ద్రవ్యములను సేవించి యుండవచ్చును. లేదా ఇటువంటి కారణములు వందకు మించి ఉండవచ్చును. కాని తండ్రియందు శాంతి లేనిచో, ఆ నేపథ్యమును ఎన్నటికీ అవగాహన చేసుకొనజాలడు. కావున అతడు ప్రతిక్రియను చూపును. ఈ శాంతి సాధారణమగు జీవన మూల్యము కాదు. జీవన మూల్య సంరచనలో దీనిది అగ్రస్థానమని నా అభిప్రాయము. శాంతి గల వ్యక్తి మహాత్ముడు. అమానిత్వము, అదంభిత్వము, అహింస ఇత్యాది జీవన మూల్యములన్నియు శాంతికి తరువాతివి మాత్రమే. ఏలయన, శాంతి గలవాడు ఇతరుల గురించి గాని, తన గురించి గాని తీర్పుల నిచ్చుట (judgements) మాని, అవగాహన చేసుకొనే ప్రయత్నమును చేయును. నిన్ను నీవు నిందించు కొనుట మానివేసినచో, ఇతరులను కూడ నిందించుటకు బదులుగా, అర్థము చేసుకొనుటకు ప్రయత్నించెదవు. నీవు స్వహిత చింతకుడవైనచో, పరహితమును కూడ పరిగణించెదవు. నీ వ్యక్తిత్వములో నీకు ఆనందము లభించినచో, నీ యందు ఆత్మ గౌరవము దృఢమగును. ఇప్పుడు నీకు గల వ్యక్తిత్వములో లోటు ఏమియూ లేదు. దేహమునకు, మనస్సునకు, ఇంద్రియములకు అనేక హద్దులు ఉన్ననూ, నీవు పూర్ణుడవనియు, కావుననే పూర్ణముగా స్వీకార యోగ్యుడ వనియు వేదాంతము బోధించు చున్నది. ఆత్మ గౌరవము గల వ్యక్తికి ఈ సత్యము నంగీకరించుటలో మానసిక భావనలు అడ్డు రావు. అతనికి ఈ వచనములు సమంజసముగా కన్పట్టును. ఈ వేదాంత

దర్శనము సమగ్రముగా అవగాహనకు వచ్చినచో, సమస్యలన్నియు పరిష్కారమగును. ప్రవర్తించే తీరు తెన్నులలో సర్దుబాట్లు ఆవశ్యకమైనప్పుడు, అట్టి వ్యక్తి ఆత్మనిందకు పాల్పడకుండగా వాటిని చేపట్ట గల్గును.

'మహాత్ముడు' అనునది చాల పెద్ద మాట. మనము మహాత్ముని మహోన్నత స్థానములో కూర్చుండ బెట్టి, మనము ఉన్నచోటనే కొనసాగుటకు ఇష్టపడెదము. మహాత్ముడనగా మనః పరిపక్వత గల వ్యక్తి. ఈ దృష్టితో పరికిస్తే, ప్రతి మానవుడు మహాత్ముడు కావలసియున్నది. నా చర్యలకు, భావావేశముల (emotions) కు బాధ్యతను నేనే వహించవలెను. బాహ్యశక్తులకు నేను ఎంతవరకు అవకాశమిస్తానో, అంతవరకు మాత్రమే అవి నన్ను ప్రభావితుని చేయగలవు. ఈ సత్యమును నేను గుర్తించవలెను. వివిధ కర్మలకు వెనుక నుండి ప్రేరణనిచ్చే దెయ్యము నేనే; దేవత నేనే. నా చేష్టలకు, భావావేశములకు నేను బాధ్యుడను. అటులనే, తమ తమ చర్యలకు, భావావేగములకు ఆయా వ్యక్తులు మాత్రమే బాధ్యులగుదురు. ఇతరలు ఇంతకంటె మంచిగా ప్రవర్తించిన బాగుండునని నేను తలంచుటకు, వారి చరిత్రను మరియు నేపథ్యమును నేను ఎరుంగకుండుటయే కారణము. పరిపక్వతను పొందుటకు ఈ సత్యము నెరుంగుటను మించి మరియొక మార్గము లేదు.

రోగి తలపోటుతో వైద్యుని వద్దకు వెళ్లినాడనుకొనుడు. వైద్యుడు అతని మంచి-చెడులను పరిగణించడు. అతని రోగమునకు మాత్రమే చికిత్సను చేయును. మద్యపానరతుడు చెడిన కాలేయముతో వైద్యుని వద్దకు వెళ్లినాడనుకొనుడు. వైద్యుడు అతని శీలముపై తీర్పునిచ్చుట పరిగాదు. తీవ్రమగు జ్వరములో రోగి సంధి ప్రేలాపనలో పడి వైద్యుని తిట్టినాడనుకొనుడు. ఆ రోగిపై నేరమును మోపి చికిత్సను మాని వేయుట వైద్యునకు తగదు. ప్రవర్తనలో కొన్ని లోపములు గల వ్యక్తి విషయములో కూడ మహాత్ముని స్పందన ఇటులనే యుండును. వ్యక్తులలో మంచి వారు, చెడువారు అను వర్గములు లేవు. ప్రతి వ్యక్తిలో లెక్కలేనన్ని వివిధ అంశములు, మంచి చెడుల కలగా పులగముగా నుండును. ఈ సత్యమును మహాత్ముడు స్పష్టముగా దర్శించును గాన, ఇతరులను గూర్చి ఆయన తీర్పులను వినిపించడు. ఒక వ్యక్తి యొక్క చరిత్ర, నేపథ్యము (background) ల ఆధారంగా అతని ప్రవర్తన యొక్క తీరు తెన్నులను ముందుగా ఊహించవచ్చును. ఒక విశిష్టమైన రకమునకు చెందిన తల్లిదండ్రులు, చుట్టు ప్రక్కల సమాజము, పాఠశాలలో నేర్చిన చదువు అను అంశములను బట్టి ఒక విశిష్టమగు వ్యవహారశైలి నిర్మాణమగును. అయితే మానవునిలో గొప్ప మహిమ ఒకటి గలదు. అది యేదనగా, పూర్వము నిర్మాణమై యున్న శీలమును మానవుడు

మార్చుకొనగల్గును. ప్రౌఢ వయస్సులో నున్న వ్యక్తి చిన్న తనమునుండి మనస్సులో అలవాటుగా వచ్చుచున్న ప్రవర్తనాధోరణులకు విరుగుడులను సృష్టించు కొనవచ్చును. పట్టి జీవన మూల్య సంరచనయే ఇట్టి విరుగుడు మందు. నేను శాంతిని లోతుగా ని, దానికి నా జీవితములో పెద్దపీటను వేసెదను. ఆధునిక ప్రపంచములో ఉత్తేజము, నిని బట్టి విద్వేషము చాల ఎక్కువ స్థాయిలో నున్నవి. శాంతి వంటి ప్రముఖమగు జీవన మును చేపట్టుట మాత్రమే ఈ సమస్యకు పరిష్కారమనియు, మానవుడు పరిపక్వతను -ఉపాయము ఇది మాత్రమే ననియు, నేను దృఢముగా విశ్వసించుచున్నాను.

ఋజు (తిన్నగా నుండుట) అను ధాతువు నుండి 'ఆర్జవమ్' అను పదము పుట్టినది. , వాక్కు మరియు కర్మ అనునవి ఏకరూపములో నుండుట ఆర్జవమనబడును. కర్మ తో, వాక్కు మనస్సుతో అనురూప్యమును కలిగియుండవలెను. ఈ అనురూప్యము ఈ ములో మాత్రమే ఉండును. దీనికి విలోమముగా, మనస్సులో ఉదయించే ప్రతి ఆలోచనను చెప్పి దానిని కార్యాన్వితము చేయనక్కరలేదు. కాని నా చేష్టలు నా మాటలకు, నా చనలకు అవిరుద్ధముగా నుండి తీరవలెను. ఈ అనురూప్యము వలన మానసిక సంఘర్షణ విముక్తి లభించును గాన, ఇది యొక జీవన మూల్యము (value). మనము చెప్పేది ఒకటి, ది మరియొకటి, లేదా తలచేది ఒకటి, చెప్పేది మరియొకటి అయినప్పుడు మనలో ఒక ద్ధము చెలరేగును. ఈ లక్షణమునకు వక్రత్వము (వంకర బుద్ధి) అని పేరు. దీనికి ద్ధమైనది ఆర్జవము. సత్యము దీనిలో ఒక అంశము అగుచున్నది. సత్యమునకు చాల మహత్త్వము ఉపనిషత్తులు కూడ సత్యము యొక్క మహిమను కొనియాడు చున్నవి. ఇతరులు నాతో మును పలుకవలెననే అపేక్ష నా యందు గలదు. కావున వారితో నేను అదే తీరున వహరించవలెను. ఇదియే ఆర్జవము.

విద్యార్థికి 'ఆచార్యోపాసనమ్' అనే జీవనమూల్యము చాల ప్రముఖమైనది. తాను స్వయముగా తెలుసుకొని పాటిస్తూ (స్వయం ఆచరతి), ఇతరులు కూడ తెలుసుకొని పాటించునట్లు చేయువాడు (అన్యాన్ ఆచరయతి) ఆచార్యుడనబడును. 'క్రోధము శత్రువు' అని విద్యార్థులకు బోధించి ఆచార్యుడు తాను కోప పడినాడనుకొనుడు. అపుడు అయన మాటల యందు విద్యార్థులకు గురి ఏర్పడదు. ఆచార్యుడు శ్రుతి వచనములను తెలుసుకొని తాను ఆచరించుట ద్వారా ఇతరుల యెదుట ఒక ఆదర్శ మూర్తి యగును. అయన ఉపదేశమును ఇతరులు తెలుసుకొని పాటించెదరు. విద్యార్థి చదువుకునే కాలములో గురువు వద్ద నివసించును. తాను జ్ఞానమును పొందుచున్నందులకు కృతజ్ఞతా సూచకముగా గురువునకు సేవ చేయును.

గురుకులవాసమును చేయు విద్యార్థి గురుకులములో చేయవలసిన పనులలో భాగము పంచుకొనుట అత్యావశ్యకమగును. ఇట్టి సేవ జీవన మూల్యమగుటకు గల హేతువును పరిశీలించెదము. శ్రుతి ప్రమాణము గదా! శ్రుతికి, దానిని తెలియగోరు విద్యార్థికి మధ్యలో ఆచార్యుడు గలడు. ఆయన సుస్థిరముగా ప్రతిష్ఠితమై యున్న ఉపదేశ ప్రక్రియ (సంప్రదాయము) ననుసరించి శ్రుత్యర్థమును విద్యార్థికి అందజేయును. ఆచార్యుడు లేనిచో శ్రుతిని సరిగా తెలియుట సంభవము కాదు. వాస్తవములో, గురువులేని జ్ఞానము మోక్ష హేతువు కానే కాదు. ఏలయన, జ్ఞానమునిచ్చేది కేవలశ్రుతివచనము కాదు. సంప్రదాయ సహితమైన శ్రుతి జ్ఞానము నిచ్చును. సంప్రదాయ బోధన లేనిచో శ్రుతి వాక్యములు పరస్పరవిరుద్ధములుగా కన్పట్టును. శ్రుతివచనముల సారమును దర్శించ గలిగే వ్యక్తి నుండి ఉపదేశము రావలెను. అప్పుడు మాత్రమే వాటి అర్థము సుస్పష్టమగును. ఆ స్పష్టత ఎంతటిది అంటే, వచనములు మరియు ఆచార్యుడు అదృశ్యమై, కేవలము వాటి అర్థము మాత్రమే మిగిలియుండును. కాని పుస్తకమును చదువునప్పుడు నీవు కర్తవై బుద్ధిని కరణముగా వినియోగించుటకు యత్నించెదవు. కాని జ్ఞానముచే ఈ కర్తను మాత్రమే బాధించవలసి యున్నది (negated). శ్రుతి ప్రమాణము పనిచేయు సమయములో నీవు కర్తవు గావు; శ్రోతవు కూడ కావు. శ్రుతి కూడ కన్ను పని చేసే తీరులో పని చేయును. కన్నులు తెరిచి యుండి, ఎదురుగా వెలుతురులో వస్తువు ఉన్నచో, సంకల్పశక్తి గాని వ్యక్తిత్వభావన గాని లేకుండగనే, నీవు ఆ వస్తువును చూచెదవు. అచట ప్రమాణము, వస్తువు మాత్రమే గలవు. సంకల్పశక్తికి అచట ప్రవేశము లేదు. ఇంద్రియములన్నియు ఈ విధముగనే పని చేయును. అనుమాన ప్రమాణములో కూడ రెండు పదార్థముల మధ్య స్థిరమగు వ్యాప్యవ్యాపక భావము (సహవర్తిత్వము, concomittance) తెలియబడిన వెంటనే నిష్కర్ష కలుగును. తలుపు తీసి చూచినప్పుడు అంతటా తడి కానవచ్చినచో, వర్షము కురిసినదని వెంటనే తెలియును. జ్ఞానసాధనము పనిచేయు తీరు ఇటులనే ఉండును. శ్రుతి కూడా ఒక ప్రమాణము. కాని సంప్రదాయజ్ఞనిచే వినియోగింపబడినప్పుడు మాత్రమే అది కార్యకారి యగును. సంప్రదాయము నెరుంగని వాని చేతిలో అది నిరుపయోగి. అట్టి ఆచార్యుని యందు శ్రద్ధ ఉండుట అత్యావశ్యకము. ఏలయన, శ్రద్ధతో శ్రవణము చేసినచో, నీ అహంకారము అదుపులో ఉండును. తెలిసి ఉపదేశించే ఆచార్యుని విషయములో అహంకారము ఉండే అవకాశమే లేదు. కావున ప్రమాణము తన పనిని చేయుటలో ఆటంకము ఉండదు.

విచారమును ఆరంభించునంతవరకు మాత్రమే అహంకారము మిగిలియుండును. పెండ్లి విందులో పిలుపు లేని అతిథి వంటి ఈ అహంకారము, మన దృష్టిని దానిపైకి సారించగనే, అదృశ్యమగును. ఆ అతిథి యొక్క ఊరు, పేరు గురించి ప్రశ్నించుట ఆరంభించు సరికి ఆయన

అదృశ్యుడగును. 'ఆత్మను నేనే' అని దేహము అనుకోదు. జ్ఞానసాధనములగు ఇంద్రియములు గాని, మనస్సు గాని అట్లు అనుకోవు. ఆత్మ శుద్ధచైతన్యము. ఇట్టి స్థితిలో ఈ అహంకారము యొక్క స్వరూపమేమి? ఈ విచారము నారంభించిన క్షణములో విచారము చేయువాని ప్రమాతృత్వమునకు ముప్పు వాటిల్లును. శ్రవణము చేయు సమయములో అహంకారము అడ్డు పడనిచో, ప్రమాణము తన పనిని గానిచ్చి, దాని సత్యత్వమును బాధించును. ఇట్టి విధముగా వినే సామర్థ్యము శాస్త్రమునందు ఆచార్యుని యందు గల శ్రద్ధచే సుస్థిరమగును. దానిచే అహంకారము తాత్కాలికముగా రద్దు అగును. ఇది చాల ఆవశ్యకము. ఏలయన, ఇచట అహంకారమునకు పాత్ర లేదు. కర్మను ఒక దానిని చేయవలసినచో, అపుడు అహంకారము ఆవశ్యకమగును. తన పాత్రలేని ఈ స్థలములో అహంకారము ప్రవేశించినచో, ప్రమాణము చేయు పనిని అది కలుషితము చేయును. అహంకారమును స్థగితము (suspend) చేసి ఉంచే వాతావరణమును శ్రద్ధ సమకూర్చును. అహంకారము పని చేయు చున్నంతవరకు, మనకు తత్పూర్వములో తెలిసిన విషయములే తెలియును గాని, ప్రమాణము ఇచ్చుటకు సిద్ధముగానున్న జ్ఞానము కలుగదు. వ్యక్తిలో అంతర్భాగమై యున్న ప్రత్యక్షాది ప్రమాణముల యందు వ్యక్తికి సహజమగు శ్రద్ధ ఉండును. కాని ఈ ప్రమాణము బయట నుండి వచ్చేది గనుక దీని యందు శ్రద్ధను మనము ప్రోది చేసుకొనవలెను. నీవు ఒక రూపమును చూచినప్పుడు రూప జ్ఞానములో సాధనమగు కన్ను యొక్క ప్రామాణికతను నీవు శంకించవు. ఒకచో కనబడిన రూపము వికృతముగా నున్నచో (distorted), కంటిలోని దోషమును సరిదిద్దుకోవాలని నీవు భావించెదవు. అప్పుడు కూడా రూపజ్ఞానములో కన్ను సాధనమని నీవు ఎరుంగుదువు. కన్నులతో వికృతరూపము కానవచ్చినది గనుక, చెవులతో చూచు ప్రయత్నమును నీవు చేయవు గదా! కన్ను రూపజ్ఞానమునకు సాధనము అను విషయములో నీకు పూర్ణశ్రద్ధ గలదు.

వేదాంతము ఒక ప్రమాణము. కావుననే, అది పనిచేయాలంటే, నీకు నీ కన్నులపై ఉన్నంత శ్రద్ధ దానిపై ఉండవలెను. వాస్తవంలో, మనము ఇంకో అడుగు ముందునకు వేయవలెను. నీ కన్నులు, దోషము ఏమియూ లేనివే అయిననూ, పరిస్థితులను తప్పుగా గ్రహించే అవకాశము గలదు. కన్నులు ఆకాశము నందు నీలిమను చూచును. కాని వాస్తవంగా ఆకాశమునందు నీలిమ లేదు. కన్నుల సామర్థ్యమునకు సహజముగా కొన్ని హద్దులు గలవు. అందువలన, సూక్ష్మక్రిములు మొదలగు వాటిని అవి చూడజాలవు. కాని వేదాంతము నిషేధింప శక్యము కాని వస్తువును మనచే దర్శింప జేయు ప్రమాణము గనుక, మన పూర్ణ శ్రద్ధకు అర్హమగును. వేదాంతము అనంత తత్త్వమును బోధించును గనుక, దానిని మెరుగు పరుచుట సంభవము కాదు. అది ప్రతి పాదించే

తత్త్వము పరివర్తనీయము కాదు గనుక, అది ఒకానొక దృష్టికోణము కాదు. ప్రత్యక్షము మూల ప్రమాణము. ఇతర ప్రమాణములన్నియు దానిని ఆశ్రయించి ఉండును. కాగా, శబ్దము చరమ ప్రమాణము. ఇతర ప్రమాణములనన్నిటినీ ప్రమాత కార్యాన్వితములుగా చేయును. కాని శబ్దము ప్రమాతకంటె బాహ్యము నందు గలదు. 'శాస్త్ర శ్రవణము చేసిన అహంకారము' అనేది ఉన్న పక్షంలో, అది లోతైన శ్రద్ధగల అహంకారము మాత్రమే యగును. శ్రద్ధయొక్క ప్రాముఖ్యమును వర్ణింప శక్యము కాదు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు 'శ్రద్ధ గలవాడు జ్ఞానమును పొందును (శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్)' అను మహత్త్వ పూర్ణమైన మాటను చెప్పియున్నాడు. 'ఆచార్యుడు గల పురుషుడు ఎరుంగును (ఆచార్యవాన్ పురుషో వేద)' అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఆచార్యుడు ఉండి, ఆయన యందు మరియు శ్రుతి యందు శ్రద్ధ గల వ్యక్తి శ్రుతి తాత్పర్యము నెరుంగక పోవుట అసంభవము.

వస్తువు, ప్రమాణము సిద్ధముగా నున్నవి. ఆటంకములు లేనిచో, ఆచార్యుని నుండి బయల్వెడలు జ్ఞానమును విద్యార్థి సావధాన చిత్తుడై, అదుర్దా గాని, ఉదాసీన భావన గాని లేనివాడై వంట బట్టించు కొనును. జ్ఞానము నందు ప్రేమ, జ్ఞానము యొక్క ఉద్గమ స్థానము నందు అతిశయించిన ఆదరము గల విద్యార్థికి జ్ఞానోదయమునకు కావలసిన సామగ్రి అంతయూ ఉన్నట్లే. ఆచార్య-ఉపాసనమనగా నిదియే. ఆచార్యుని వద్ద కూర్చుండుట అని ఆ పదమునకు అర్థము. ఒక వస్తువుపై మనస్సును నిలిపి శ్రద్ధాబలముచే సంతతముగా దానిని మాత్రమే ధ్యానించు పద్ధతికి కూడ ఉపాసన యని పేరు గలదు. ఆదరము, ప్రేమ కలిసి శ్రద్ధ యగును. ఆచార్యుని పాండిత్యముపై బుద్ధి స్థాయిలో ఆదరమున్ననూ, ఆయన వ్యక్తిత్వముపై ప్రేమ లేనిచో, లేదా ఆయనపై ప్రేమ మాత్రమే ఉండి ఆయన పాండిత్యముపై మహత్త్వభావన లేనిచో, అది శ్రద్ధ కాదు. శ్రద్ధ ఉన్నచో అహంకారము అడ్డు తగలదు గాన, జ్ఞానము సహజముగా వంట బట్టును. అహంకారము యొక్క యథార్థ స్వరూపమును కనుగొని, అది అసత్యమని నిరూపించుటయే శాస్త్రోపదేశమునకు పరమతాత్పర్యము. అట్టి అహంకారమును స్థగితము చేయుటకు శ్రద్ధ అవశ్యకమగును. ఇచట పరిస్థితి 'పెళ్లి-పిచ్చి' అను సామెతను బోలియున్నది. పెళ్లి చేసినగాని పిచ్చి కుదరదు. పిచ్చి కుదిరిన గాని పెళ్లి కాదు. తాత్కాలికముగా నైననూ అహంకారమును స్థగితము చేయనిదే, జ్ఞానము ఉదయించదు. జ్ఞానము ఉదయించిన గాని, అహంకారవ తొలగిపోదు. శ్రద్ధను రంగములోనికి తీసుకు వచ్చినచో, ఈ సమస్యను పూర్తిగా అధిగమించవచ్చును. శ్రద్ధ వలన అహంకారము అణిగి మణిగి ఉండి ప్రమాణము పనిచేయుటలో ఆటంకము కాబోదు.

అపుడు ఇట్టి జ్ఞానము ఉదయించును. ఆ తరువాత, అహంకారము వాస్తవముగా లేదనియు, అది మిథ్య అనియు అవగతమగును.

అంతః కరణము శుద్ధముగా నుండుట మరియు బాహ్యమునందు పరిశుభ్రముగా నుండుట అను రెండు కలిసి 'శౌచమ్' అనబడును. బాహ్య శౌచము బాహ్య పరిసరములతో ఆరంభమగును. నివసించే గృహము, ధరించే వస్త్రములు, మరియు స్థూలదేహము శుచిగా నుండవలెను. ఇవి ప్రతి దినము మురికి యగు చుండును. కావున వాటిని శుభ్రము చేయు చుండవలెను. కారు గాని, దేహము గాని, బట్టలు గాని, పాత్రగాని, దేనిని వాడితే అది మురికి యగును. మనస్సును కూడా మనము అనవరతముగా వినియోగించెదము గాన, అది కూడ అశుచియగు చుండును. దేహాదులను శుభ్రపరచుటకు వివిధ రకముల శోధక పదార్థములు కలవు గావున, వాటిని శుచిగా నుంచుట సరళము. కాని అంతర శౌచమును సాధించుట యెట్లు?

అంతర శౌచమనేమియో ముందుగా పరిశీలించెదము. సాధారణముగా నీకు గాని, ఇతరులకు గాని నచ్చు బాటుగాని క్రోధ-తృష్ణా-స్వార్థపరత్వ-ద్వేషాది గుణములు అంతర-అశౌచమగును. విభిన్న అనుభవములకు వశమగుచుండే మనస్సు ఈ దోషములలో కొన్నింటిని సంగ్రహించుట సహజమే. ఇట్టి మనస్సును ఎట్లు శుద్ధి చేయవలెను?

ప్రార్థన ఒక పద్ధతి. నీకు మరియు ఇతరులకు దుఃఖమును కలిగించే మాత్సర్య, కపట స్వభావ, లోభాది గుణములన్నింటి నుండి విముక్తిని పొందవలెననే దృఢసంకల్పముతో చేయబడే అర్థవంతమైన ప్రార్థన ఏదైనా చిత్త శుద్ధిని కలిగించును. భారతదేశములో సాధారణముగా పాటింపబడే ఆచారము ఒకటి గలదు. స్నానము చేసిన తరువాత అచ్యుతాయ నమః, అనంతాయ నమః, గోవిందాయ నమః అని మూడు సార్లు ఆచమనమును చేసెదరు. ఎన్నటికీ అపక్షయము లేని, వికారములు లేని భగవంతునకు (అచ్యుతాయ) నమస్కారము. అంతము లేనివాడు, పరిచ్ఛేద రహితుడు, సర్వజగద్రూపములో సాక్షాత్కరించువాడు (అనంతాయ) అగు భగవానునకు నా నమస్కారములు. భగవానుడు అచ్యుతుడు, అనంతుడు అని మనకు ఎట్లు తెలియును? శాస్త్రవచనములను బట్టి తెలిసినది. కావున, శాస్త్రవచనములచే తెలియబడు భగవానునకు (గోవిందాయ) నమస్కారము. ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యమ్, ఓం తత్ సవితుర్ వరేణ్యం భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్. మనస్సులో ఈ ప్రార్థనను చేస్తూ ఒక ముక్కుగుండా గాలిని పీల్చి, మరియొక

ముక్కు గుండా విడువవలెను. ఇట్లు పదిసార్లు చేయవలెను. దీనికి ప్రాణాయామమని పేరు. దీని వలన మనస్సు శుద్ధమై, విశిష్టమగు ప్రసన్నతను బొందును.

మాత్సర్య ద్వేషాది వివిధ చిత్త క్లేశములను నివారించుటకు వాటికి విరుద్ధమగు గుణములను భావించుట (ప్రతిపక్ష భావనమ్) అను మరియొక పద్ధతి గలదు. నీకు ఒక వ్యక్తిపై ద్వేషము గలదనుకొనుము. ఆ ద్వేషము నుండి విముక్తిని కోరే పక్షంలో, నీవు ప్రయత్నపూర్వకముగా ఆ వ్యక్తిని ప్రేమించుటను అలవాటు చేసుకొనవలెను. కాని ఒక సమస్య గలదు. ఏ వ్యక్తిని ద్వేషించు చున్నావో, అదే వ్యక్తిని ప్రేమించుట యెట్లు? నీవు ఆ వ్యక్తిలోని ఏ అంశమును ద్వేషిస్తున్నావో వివేచించుము. అతని ముక్కునా? లేక కళ్లనా? అతనిలో గల, నీవు ద్వేషించని, అనేక అంశములు నీ దృష్టికి వచ్చును. అతని ప్రవర్తనలో నైననూ, ఏదో ఒక అంశము మాత్రమే నీ ద్వేషమును రగిల్చినదని నీవు గమనిస్తావు. ఇంకో అడుగు ముందుకు వేస్తే, అతని ప్రవర్తనను నీవు ద్వేషించుటకు హేతువు ఏమి గలదు? అతని ప్రవర్తన తప్పుగా నుండెననియు, అతని ప్రవర్తనతో ఎట్లు వేగవలయునో తెలియలేదనియు నీవు చెప్పువచ్చును. కాని అంత మాత్రాన నీవు ఆ ప్రవర్తనను ద్వేషించనక్కరలేదు. పైగా, ఆ ప్రవర్తన గల వ్యక్తిని ద్వేషించుట అసలే పనికి రాదు. ఒక విశిష్టమగు ప్రవర్తన పూర్ణవ్యక్తి కాబోదు. నీవు కలలో గాని, లేక సన్ని పాతజ్వరములో గాని నిందా వచనములను పలికితి వనుకో. వాటిని బట్టి నీ గురించి నిర్ణయించుట న్యాయము కాబోదు. ఒక చర్య సరియా? కాదా? అని మనము సాధారణముగా ప్రశ్నించవచ్చును. కాని ఈ ప్రశ్న అన్ని సందర్భములలో వేయదగినది కాదు.

వ్యక్తి ఆత్మ విమర్శను చేసుకొనుట కొంత వరకు ఉపయోగకారి యగును. కాని ఈ లక్షణము తరుచుగా ఆత్మనిందకు దారి తీసి హానిని కలిగించును. ప్రతి వ్యక్తి తన గురించి కొద్దో గొప్పో విమర్శించు కొనుట సహజము. ఈ రెండు రకముల ద్వేషములను ఎట్లు అదుపు చేయవలెను? ముందుగా వాటికి విరుద్ధమగు లక్షణమును భావన చేయవలెను. నీలో గల నిశ్చితముగా కొనియాడ దగిన లక్షణములను గమనించుము. నీ గురించి నీవు నిష్ఠుర ధోరణిని అవలంబించకుము. ఆత్మనింద అనే అలవాటు చిన్న వయస్సులో నిర్మాణమగును. సాధారణంగా అలవాట్లు ఓ పట్టాన వదలవు. మానసిక అలవాట్లు మరింత గట్టిగా పట్టియుండును. ఈ అలవాటు కూడ అట్టిదియే. ఈ ఆత్మ నిష్ఠురత అనే లక్షణమును మనకు పెద్దలు నేర్పినారు. కాని వ్యక్తి తన విషయములో తాను ఉదారుడై ఉండవలెను. నిష్ఠురత వలన ప్రయోజనము లేదు. వ్యక్తి తనపై తాను ఎంత దయతో నుండవలెనో చెప్పుటకు ఒక దృష్టాంతము నీయువచ్చును. చేయి

కాలినదనుకొనుము. నీవు ముందుగా బాధతో 'అమ్మా!' అనెదవు. తరువాత ఆ చేతివ్రేళ్లను చాల సున్నితముగా తాకెదవు. వాటిని భద్రముగా పరిరక్షించెదవు. నీవు ఆలోచించే పద్ధతి విషయంలో నీ మనస్సు కూడ అటులనే ఉండవలయును. ఆత్మ నింద మానసిక ఉల్లాసమునకు హాని కలిగించును. కాన దానికి విరుద్ధమగు భావనను స్వీకరించి దానిని తొలగించుము. అలవాటు ఓ పట్టాన వదలదు. ఆత్మ నింద చెడు అలవాటు అనే సత్యమును గ్రహించవలెను. అది ఉన్నందులకై మరల అదే పనికి పూనుకోరాదు. ఈ అలవాటును మానుటకై తద్విరుద్ధమగు భావనకు ఉపక్రమించే ప్రక్రియను నేను చేపట్టవలెను. ఇది తేలిక కాదు. అయిననూ తప్పక ఆచరించదగినది. ఆంతర శౌచమనగా నిదియే.

బాహ్యశౌచము మనకు మరింత అధీనములో నున్నది. శౌచమనే జీవనమూల్యము దీనితో ఆరంభమగును. కావున ఇది ప్రముఖమైనది. పరిసరములు క్రమబద్ధముగా శుచిగా నున్నచో, మనస్సులో కూడ ఒక విశిష్టమగు అనుశాసనము నిర్మాణమగును. అంతశ్శౌచము కలుగుటకు ముందుగా బాహ్యశౌచము ఉండుట అత్యావశ్యకము. ఏలయన, వస్తువులన్నియు చిందరవందరగా పడియున్న స్థలములో గూర్చుండి ధ్యానమును గాని, పూజను గాని చేయజాలము. కారు గ్యారేజీలో ధ్యానమును చేయుటకు బుద్ధి కలుగునా? గ్యారేజీలో ఏకాంతముగా ప్రశాంతముగా నుండును గదా! అచట ధ్యానమునేల చేయరాదు? గ్యారేజీలో మురికి మరియు చెత్త సామాను నిండియుండును. కావున అది ధ్యానమునకు అనుకూలమగు స్థలము కాదని మనకు తెలియుచునే యుండును. అచట స్ఫూర్తి కలుగదు. అచట కూర్చుండి కన్నులు మూసుకున్ననూ, గ్యారేజీలో ఉన్నామనే సత్యమును ఏదో ఒకటి గుర్తునకు తెచ్చు చుండును. ముక్కునకు గ్యారేజీ వాసన తెలియుచుండును. దుమ్ము రేగి ధ్యానమునకు భంగము కలుగవచ్చును. కావున బాహ్యశౌచమునకు చాల ప్రాముఖ్యము గలదు. శుచియగు స్థలములో గూర్చుండి ధ్యానమును చేయవలెనని మనము 6వ అధ్యాయములో చూచి యున్నాము. వ్రాయుటకు, చదువుటకు, లేదా కూర్చుండి ధ్యానమును చేయుటకు ఇది అత్యావశ్యకము. లోపలకు ప్రవేశించగానే అంతర్ముఖుడు కాగలిగే విధంగా ధ్యానస్థలము ఉండవలెను. గదిలోని వస్తువులన్నియు చెల్లాచెదరుగా నున్నచో, అచట నుండి పారిపోవాలనిపించును.

కావున నా చుట్టూ పరిసరములను మరియు నా దేహమును నేను శుభ్రముగా నుంచుకొనవలెను. తద్వారా అంతః కరణశుద్ధి యను అంతరశౌచమునకు అనుకూలమగు వాతావరణము నిర్మాణమగును. అంతరశౌచము శ్రవణమునకు ఆవశ్యకమగు సాధనము.

స్థైర్యమ్ అను పదమును రెండు విధములుగా వ్యాఖ్యానించ వచ్చును. మోక్ష మార్గము నందు సాధకునకు గల అంకితభావము మరియు కటి బద్ధత స్థైర్యమన బడునని శ్రీశంకరులు వివరించిరి. విభిన్న పురుషార్థములను విశ్లేషించి, మోక్షమొక్కటియే తనకు కాంక్షించ దగినది యని సాధకుడు దృఢముగా నిశ్చయించు కొని నిర్ణయించుకున్నచో, దానికే స్థైర్యమని పేరు. అతడు మానవ జీవితములోని మౌలిక సమస్యను వివేకముతో పరిశీలించి, తనకు మోక్షము అపేక్షితమని నిశ్చయించు కొనినాడు. అతని ఈ స్థిరమగు నిర్ణయమును చలింప చేయ గలిగేది ఏదీ లేదు. ఇట్టి వ్యక్తి స్వామి యగు అవకాశము మెండు. ఏలయన, సన్న్యాస మనగా ఇట్టి స్థైర్యము తక్క వేరొండు గాదు. సాధకుడు తనకు తానుగా మరియు ప్రపంచమునకు తాను కోరేది మోక్షము మాత్రమేనని ప్రకటించును. ఈ నిర్ణయము వెనుకనున్న దృఢచిత్తమునకు స్థైర్యమని పేరు. అట్టి సాధకుడు వంద రకముల కార్యములను చేయుచున్ననూ, వాటి అన్నింటి వెనుక నున్న అతని యథార్థమగు అన్వేషణలో రాజీపడే ప్రసక్తి ఉండదు. సర్వము మోక్షము కొరకు మాత్రమే ఉద్దేశింపబడినది. ఇదియే స్థైర్యము.

స్థైర్యము అనగా వ్యక్తి తన విధులకు కట్టుబడి యుండుట అని రెండవ యర్థము. సాధకుడు ఎంతటి కష్టములోనైననూ ధర్మము నాచరించును. ధర్మమునకు అను రూపముగా జీవించుట అనునది కర్మయోగములోని ఒక అంశము. కర్మఫల విషయములో సాధకునకు గల మనః ప్రవృత్తి కర్మయోగములోని రెండవ అంశము అగును. కర్మయోగములో సాధకుడు రాగ ద్వేష పరిపూర్తి కొరకు గాక, వాటిని నిష్ప్రభావితము చేయుట కొరకై కర్మలనాచరించును. స్థైర్యమునకు ఇది రెండవ అర్థము. సాధకుడు మోక్షమును పొందవలెనని నిశ్చయించుకున్న పిదప, దానికి అవశ్యకమగు సర్వమును అనుష్ఠించును. కావున కర్మానుష్ఠానమునందలి స్థైర్యము సహజముగా ప్రముఖ స్థానమును ఆక్రమించును. కావున దృఢమగు ముముక్షుత్వము, మరియు జీవితమును కర్మయోగముగా తీర్చిదిద్దవలెననే స్థిరబుద్ధి అనునవి స్థైర్యము అగును. మోక్షము అనే లక్ష్యమునకు అంకితమైన జీవనము గల సాధకుడు ఆ లక్ష్యము కొరకై ఆచరించే సర్వము యోగము అగును.

దేహేంద్రియ మనస్సంఘాతముపై మనకు నిగ్రహముండవలెను. అప్పుడు మాత్రమే అది మనకు ఉపకరించును. ఇట్టి నియంత్రణకు ఆత్మ వినిగ్రహమని పేరు. ఉదాహరణకు, తెల్లవారు జామున లేచి చదువు కోవాలనే నీ ఆకాంక్షను నీ దేహము నిరాకరించిన దనుకో. అపుడు నీకు ఉపయోగపడే విధముగా దేహేంద్రియ సంఘాతమునకు శిక్షణను ఈయవలసిన ఆవశ్యకత గలదు. సాధకుడు మోక్షమునకావశ్యకమగు సాధనను చేపట్టవలయును. ఈ దేహము ధర్మమునకు

మొట్టమొదటి సాధనము (శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్) అని కాళిదాసు చెప్పినాడు. ఇతర సాధనములన్నియు ఈ దేహముపై ఆధారపడి యున్నవి. దేహము ప్రధానముగా తమోగుణ కార్యము గనుక, దాని యందు సహజముగా కొంత నిష్క్రియత (జడత్వము) గలదు. దీనిని అధిగమింపుటయే ఆత్మ వినిగ్రహమనబడును. దీర్ఘ సూత్రత (పనులను, నిర్ణయములను వాయిదా వేయుచుండుట), అలసత్వము ఇత్యాది రూపములలో తమో గుణము ప్రకటమగును. ప్రతి దినము మైదానములో పరుగెత్తుట, ఆసనములను వేయుట, మితముగా వివేకముతో భుజించుట అను వాటి వలన తమో గుణమును అధిగమించవచ్చును. ఇవి గాక, అవసరమైనచో మరికొన్ని చర్యలను చేపట్టవలెను. శరీరము ప్రతి కూలముగా నున్నచో, అనుకూలించే పరిస్థితికి దానిని గొని రావలెను. మనకు చాల పనులను చేయవలెననే కోరిక ఉండును. కాని మన వద్ద సమయము కొద్ది మాత్రమే గలదు. పైగా మనము సాధించవలసిన అతి ప్రముఖమగు కార్యము ఒకటి గలదు. నా శక్తియుక్తులను పది పనులలో కొద్ది కొద్దిగా ప్రవేశపెట్టినచో, నేను చేబట్టిన పనులను సమర్థవంతముగా నిర్వహించలేకపోవుటయే గాక, నేను సాధించవలసిన లక్ష్యము చేయి జారి పోవును. కావున నేను ఏదో ఒక పనిని చేబట్టి దానిని సమర్థవంతముగా చేయవలెను. నా శక్తిని వివిధ అన్వేషణలలో అపవ్యయము చేయుటకు బదులుగా, సన్మార్గముపై కేంద్రీకరించి ఇతరము సర్వమును ప్రక్కన బెట్టవలెను. సన్మార్గమనగా జ్ఞానులు అనుసరించు మార్గమని శ్రీశంకరులు వివరించిరి. శక్తి యుక్తులు నిష్ఫల కార్యములలో వృథా కారాదు. అనగా కర్మేంద్రియములన్నియూ చక్కటి అనుశాసనములో నుండవలెను. అపుడు నేను నా దృష్టిని నాకు అభీష్టమైన స్థలములో కేంద్రీకరించగల్గుతాను. మోక్షసాధన దేహేంద్రియ సంఘాతము యొక్క సహజ ప్రవృత్తికి విరుద్ధమగు దిశలో నుండును గమక మనమీ ప్రయత్నమును పునః పునః చేయుచుండవలెను.

జ్ఞానుల ఆదర్శమును గైకొని వారు నడిచిన మార్గము (సన్మార్గము)లో ఈ దేహేంద్రియ మనస్సంఘాతమును నడిపించుటయే ఆత్మ వినిగ్రహమనబడును. లేదా, సద్వస్తు విచారమే సన్మార్గమని చెప్పవచ్చును. బుద్ధి మరియు శక్తి జ్ఞానసాధనలో లగ్నమై యున్నచో, అదియే సన్మార్గమనబడును. కావున ఇతర వ్యాసంగములన్నింటి నుండియు సాధకుడు ఉపరమించుట సహజమే గదా! కాని, ఈ ఉపరమము కేవల సంకల్ప శక్తిపై ఆధారపడి యుండదు. సంకల్ప శక్తిపై ఆధారపడి ఉండే పక్షంలో, నీవు చేయగోరేది ఒకటి, చేయబూనుకొనేది మరియొకటి అగు చుండును. సన్మార్గము నాకు తగినది అను దృఢవిశ్వాసము నీకు ఉండవచ్చును. కాని కామనలు కూడ ఈ విశ్వాసముతో సహమతము అయి ఉండవలెను. అట్టి సామరస్యము లేని పక్షంలో, అంతః కరణము నందు ఘర్షణ నిర్మాణమై ఈ సాధనము కలుషితము చేయును. ఈ సాధన

కొనసాగుటకై అంతః కరణములో పూర్ణమగు విశ్రాంతి ఉండవలెను. కావున సాధకు ప్రాథమికతల విషయములో ఉచితమగు అవగాహనను పెంపొందించు కొనవలెను.

**అధ్యాయము 13, శ్లోకము 8 :**

इंद्रियार्थेषु वैराग्यमनहंकार एव च।
जन्म मृत्यु जराव्याधि दुःखदोषानु दर्शनम् ॥ ८ ॥

ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ
జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖదోషాను దర్శనమ్ (8).

ఇంద్రియార్థేషు = ఇంద్రియగోచరములగు వస్తువుల విషయములో, వైరాగ్యమ్ తృష్ణ లేకుండుట, చ = మరియు, అనహంకారః ఏవ = నిశ్చితముగా గర్వము లేకుండుట, జన్మ-మృత్యు-జరా-వ్యాధి-దుఃఖ-దోష-అను-దర్శనమ్ = పుట్టుక, మరణము, వృద్ధాప్యము, వ్యాధి, దుఃఖము అను దోషములను స్పష్టముగా దర్శించుట.

> ఇంద్రియగోచరములగు వస్తువుల విషయములో వైరాగ్యము; గర్వము లేకుండుట; పుట్టుక, మరణము, వార్ధక్యము, వ్యాధి, దుఃఖము అనే దోషములను స్పష్టముగా దర్శించుట .... (8).

జీవితములో ప్రముఖమైన అంశము ఏది? అను విషయమును విశ్లేషించినచో, మనలో ఒక అవగాహన ఏర్పడి ప్రవర్తనలో పరిపక్వతకు, మరియు ఇంద్రియ భోగములపై సహజమగు వైరాగ్యమునకు దారితీయును. తృష్ణ తొలగి పోయిన మానసిక స్థితికి వైరాగ్యమని పేరు. వైరాగ్యము ఉన్న వ్యక్తి మాత్రమే సన్మార్గములో నడువగల్గును. వ్యక్తిలో కామన ఉండవచ్చును. కాని ఫలానా వస్తువు లభిస్తే నాకు ఆనందము, అధికమగు భద్రత సిద్ధించుననే విశ్వాసముతో కూడిన కామన ఉండరాదు. అట్టి కామనలు తొలగిన వ్యక్తి విరాగి యనబడును. అతని మనస్స్థితికి వైరాగ్యమని పేరు. ఏ వస్తువును పొందినను సమస్య పరిష్కారము కాబోదు అను సత్యమును సరిగా తెలుసుకున్న వ్యక్తిలో ఒక వస్తువుపై ఇచ్ఛ ఉన్ననూ, తృష్ణ ఉండదు.

కొందరి జీవితములు ధనమునకు అంకితమగును. సమస్యలన్నిటినీ ధనమే పరిష్కరించునని వారు భావించెదరు. మరికొందరు ధనమును ఖర్చు చేసి అధికారమును

సంపాదించుటకు యత్నించెదరు. అధికారము సమస్యలనన్నిటినీ పరిష్కరించునని వారు భావించెదరు. ఇట్టి భావనలన్నింటికీ శోభనాధ్యాస యని పేరు. వారు ఒక వస్తువునకు ఒక విశిష్ట మహత్త్వమును అంటగట్టెదరు. కాని దురదృష్టవశాత్తు దానియందు ఆ మహత్త్వము లేదు. ధనము వలన ఉపయోగము గలదు. కాని అపరిపూర్ణత, దుఃఖము, ఉత్తేజనము ఇత్యాది సమస్యలను ధనము పరిష్కరించునని ఆశించినచో, నిరాశ తప్పదు. నిరాశ పరచేది ధనము కాదు. ధనములో లేని మహత్తును దానియందారోపించి అపేక్షించుటయే నిరాశకు హేతువు అగును. ధనమనగా లక్ష్మీదేవి. కాన మనము ధనమును ఆదరించెదము. కాని ధనమునకు కొన్ని హద్దులు గలవు. ధనము సమస్యలకు పరిష్కారమా యన్నట్లు ఎవరైననూ దాని వెనుక పడినచో, దాని యందు వారు ఆరోపించిన అవాస్తవిక మహత్త్వమే దానికి కారణమగుచున్నది.

నీవు బాహ్యము నందు ఆరోపించి దర్శించే విషయములు తక్క, నీకు నిరాశను కల్గించ గలిగే పదార్థము ఈ సృష్టిలో ఏదియూ లేదు. ఉదాహరణకు, ఆకసము కేసి చూచి నీవు మంచు కురియునని ఆశించి హిమవిహారమునకు యోజన చేసితివనుకొనుము. అపుడు మంచు కురవనిచో, నీకు నిరాశను కలిగించినది నీవు బాహ్యమునందు చేసిన ఆరోపణ (projection) యే గాని, వాతావరణము కాదు. నీ మనస్సు బాహ్యము నందు దర్శించిన కాల్పనిక ఆరోపిత దృశ్యమును వాతావరణము అనుమోదించలేదు. నీ ఆరోపిత దృశ్యములకు ఆధారము వాస్తవమునకు దగ్గరగా నున్నచో, నిరాశకు అవకాశము చాల తక్కువగా నుండును. మానసిక కల్పనలు వాస్తవ దూరమైనప్పుడు, నిరాశలు తరుచుగా ఎదురగు చుండును. ఒక వస్తువు నందు వాస్తవముగా లేని మహత్త్వమును దానియందు ఆరోపించినచో, అట్టి ఆరోపము నుండి కామన ఉదయించును. ఇట్టి మానసిక కల్పనలను క్రమంగా తొలగిస్తూ పోతే, వైరాగ్యము పెంపొందు చుండును. వైరాగ్యమనగా ఒక వస్తువుపై గల వైముఖ్యము కాదని తెలియవలెను. ఏ వస్తువు విషయములో మనకు మహత్త్వబుద్ధి లేదో, ఆ వస్తువుపై వైముఖ్యము కలుగును. వైరాగ్యమనగా వస్తువులను ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకొనుట. వైరాగ్యమునకు విచారము మూలము. ఎవరైననూ మరణించినప్పుడు ఉండే మానసిక స్థితి వైరాగ్యము కాదు. జీవితము బుద్బుదప్రాయమనే సత్యమును దర్శించిన క్షణములో అర్థరహితములగు అన్వేషణలపై అరుచి ఏర్పడును. కాని ఇది యథార్థమగు వైరాగ్యము కాదు. ఈ అరుచి కొద్ది రోజులలో దూరమై, పూర్వ వ్యవహారములన్నియు మరల ఆరంభమగును. సముచితమగు విచారమును చేసి, ప్రాథమికతలను నిర్ధారించుకొనుట ద్వారా మనస్సులో నిర్మాణమయ్యే వాస్తవికత (objectivity) కు వైరాగ్యమని పేరు. నిరాశా

నిస్పృహల నుండి పుట్టేది వైరాగ్యము కాదు. జీవితములో తాను చేబట్టిన యోజనలు విఫల సర్వమును పోగొట్టుకొని, సాధువు కావాలని నిర్ణయించుకున్న వ్యక్తి యందు ఉన్నది వైరాగ్య కాదు. ఆ విధముగా సాధు జీవితమును ఆరంభించుటకు అభ్యంతరము లేదు. కాని శోభ ధ్యాసల (భ్రమ పూర్ణములైన ఆరోపములు) నన్నిటినీ తొలగించు కొనుట ద్వారా మాత్ర వాస్తవమగు వైరాగ్యమును సంపాదించ వచ్చును. వైరాగ్యమనగా ఒక స్థాయికి చెందిన, వాస్తవిక నుండి ఉదయించే అనాసక్తి. జ్ఞానోదయముతో మాత్రమే వైరాగ్యము పరిపూర్ణము కాగల్గును.

జీవితమునకు ప్రధానలక్ష్యము మోక్షము అనే గుర్తింపు క్రమక్రముగా వికసించిన వ్యక్తి వాస్తవికత (వైరాగ్యము) ఒక విశిష్టస్థాయికి చేరుకొనును. వ్యక్తి యొక్క జీవితములో కాలఖండములో చదువు ప్రధాన లక్ష్యముగా నుండును. ఆ తరువాత బహుశః ధనము లేక లౌకి జీవిత సాఫల్యము ఆ స్థానమును ఆక్రమించును. ఆ సమయములో మోక్షము ప్రాథమికత (priorities) సూచిలో అట్టడుగున ఉండెను. సత్సంగము, జీవితానుభవముల విశ్లేషణము ఇత్యాదు వలన అది సూచిలో క్రమముగా పైపై స్థానమునకు జరుగుచుండును. మోక్షేచ్ఛ తీవ్రమయ్యే కొలదీ, రాగ ద్వేషములు ప్రభావహీనములగును. రాగద్వేషముల బలము తగ్గేకొలదీ, మోక్షమునకు ప్రాముఖ్యము అంతకంతకు పెరిగి, ఆఖరుగా సూచిలో మొదటి స్థానమునాక్రమించును. మోక్షేచ్ఛ చాల గాఢముగా, విస్తారముగా, ఇతరము సర్వమును కబళించి వేయు స్థాయి వరకు పెరుగును. అపుడు ఇతరము సర్వము ఈ లక్ష్యసాధనకు సహాయకారి యగును. అది వైరాగ్యము యొక్క పూర్ణత యగును.

మోక్షము ప్రముఖ స్థానము నాక్రమించినప్పుడు జీవితము ఒక వికాస ప్రక్రియగా మారి పోవును. ఎదుగుదల నిరంతరముగా కొనసాగుటకై సాధకుడు సంకల్పబలముతో ప్రయత్నమును చేయును. 'ఇంద్రియ భోగములయందు వైరాగ్యము' అను రూపములో ఈ ఎదుగుదల అభివ్యక్తమగును. ఇహపరలోకముల యందలి భోగవస్తువుల విలువను ఇట్టి సాధకుడు వివేకపూర్వకముగా అంచనా వేయగల్గును. వాటి వలన మౌలిక సమస్య పరిష్కరింపబడదని అతడు తెలుసు కొనును. అవి వ్యక్తికి కొంత ఉల్లాసమును కలిగించ గలవు. అంతే. వాటి కొరకై వ్యక్తి కష్టములను పడవలయును. 'ఆత్మ యథాతథముగా అంగీకారము కాదు' అనే మౌలిక సమస్య పరిష్కార రహితముగా మిగిలియే యుండును.

ఇంద్రియార్థాః అనగా దృష్టములు మరియు అదృష్టములువగు భోగములని శ్రీశంకరులు

భాష్యములో వివరించితి. నీ కళ్లకు కనబడేవి. లేదా నీవు విని తెలుసుకున్నవి అగు భోగములు నీ మౌలిక సమస్యకు పరిష్కారము నీయ జాలవు గనుక, వాటి యందు నీకు అభిరుచి లేదు. ఇంద్రియ భోగములయందలి ఏహ్య భావము వైరాగ్యమనబడదు. ఇంద్రియభోగముల విలువను వివేక పూర్వకముగా అంచనా వేయుటయే వైరాగ్యమనబడును.

నేను, నన్ను, నాది అను ధారణలకు అహంకారమని పేరు. జ్ఞానోదయము తరువాత మాత్రమే ఈ ధారణలు అదృశ్యమగును. కాని ఇచట అనహంకారమును భగవానుడు జీవన మూల్యరూపములో ప్రస్తుతించినాడు గాన, ఇది జ్ఞానోదయము తరువాత ఉండే అహంకార రహిత స్థితి కానేరదు. ఇచట అహంకారము అనే పదము 'గర్వము లేకుండుట' అనే సంకోచార్థములో వాడబడినది. మనిషి గర్విష్ఠి యగుటకు కారణమేమి? ఒకనికి దేహ సౌందర్యము, చురుకైన బుద్ధి, లేక కొంత సంపద ఉండవచ్చును. మరియొకడు కొన్ని ఘనకార్యములను చేసి యుండవచ్చును. వ్యక్తి తనను తాను ఆ విభూతుల ప్రకాశములో ఇతరుల యెదుట ప్రస్తుతించినచో, అది గర్వమనబడును. ఒక యువకుడు మెడలో బంగరు గొలుసును వేసుకొని తన విశాల వక్షస్స్థలమును నలుగురు చూడాలని అంగీ బొత్తమును పెట్టుకోనిచో, అది గర్వమనబడును. అతని విశాల వక్షస్స్థలము తండ్రి నుండి సంక్రమించినది. తల్లి బంగరు గొలుసును ఇచ్చెను. అంగికి బొత్తమును పెట్టుకొనక పోవుట మాత్రమే అతడు సాధించిన ఘనకార్యము. కొందరిలో ప్రతిభా సంపన్న మగు బుద్ధి శక్తి, మరికొందరిలో కళాత్మకమగు ప్రతిభ ఈశ్వరుని అనుగ్రహముచే సహజముగా నుండును. దాని వలన వారి యందు గర్వము ఉదయించును. తాము సంపాదించిన జ్ఞానము, లేక నైపుణ్యమును బట్టి కొందరు గర్వించెదరు. కొందరిలో వ్యక్తిగతముగా గొప్పదనమేమియూ లేకున్ననూ, వారు తమ పూర్వజుల గొప్పలను చెప్పుచుందురు. మానవుని ప్రతిభలన్నియు ఈశ్వర దత్తములనే సత్యమును గుర్తించలేక పోవుట నుండి ఇట్టి అహంకారము ఉదయించును. భగవంతుడు నాకు కొన్ని నిగూఢ శక్తులను, వాటిని వికసింపజేయుటకు దేహేంద్రియ మనస్సులను ఇచ్చి యున్నాడు. నాకు భగవానుడు బుద్ధి శక్తిని, ఆలోచనాక్షమతను ఇచ్చి, నేను చూచి తెలుసుకొనుటకై వివిధ వస్తువులతో నిండియున్న జగత్తును నా ముందు ఉంచినాడు. దీనిలో నేను సాధించిన ఘనత ఏమీ లేదు. ఈ సత్యమును గుర్తించిన వ్యక్తిలో గర్వమునకు చోటు లేదు (అనహంకారః).

విచారమునెరుంగని వ్యక్తియందు మాత్రమే గర్వము నెలకొనును. కొద్ది అవగాహన గల వ్యక్తియైననూ, అభ్యర్థనకర్తుడగునే గాని, గర్వితుడు గాడు. 'ఈ సర్వమును నాకు ఇచ్చినది

ఎవ్వరు చెప్పుమా!' అని మానవుడు ఆశ్చర్యపడును. 'భగవంతుడు ఇచ్చినాడు' అని సర్వ సాధారణ భక్తుడు విశ్వసించును. ఈ గుర్తింపునకు జ్ఞానము తోడైనచో, ఆ భక్తుడు అంతతో గత్వా (finally) భగవత్స్వరూపమును తెలుసుకొనును. ఈ జగత్తు నంతనూ సృష్టించినది ఎవరు? లేక ఏది? అని నిరీశ్వరవాది ఆశ్చర్యమును పొందును. అది ఎవరో తెలియవలెననే కుతూహలము అతనియందున్నచో, ఆ ఆశ్చర్యము అతనిని జిజ్ఞాసువుగా మార్చివేయును. జగత్కారణము బ్రహ్మయని శాస్త్రము చెప్పుచున్నది అను సంగతిని సాంస్కృతిక నేపథ్యములో పెరిగిన వ్యక్తి తెలుసుకొని బ్రహ్మ జిజ్ఞాసువు అగును. వ్యక్తికి గల పరిజ్ఞానముపై ఆధారపడి అతడు చేయు విచారము కొనసాగును. దీనిలో అహంకారమునకు తావు ఏది? నేర్చుకొనే వ్యక్తి, కర్మలను చేయు వ్యక్తి, భోగించు వ్యక్తి ఇత్యాదులందరి యందు జిజ్ఞాస మాత్రమే గలదు. గర్వమునకు తావు లేదు. అనగా సంకోచార్థములో అనహంకారము గలదు.

జన్మ, మరణము, వార్ధక్యము మరియు వ్యాధి అనువాటి యందు దుఃఖము గలదు అను సత్యమును దర్శించుట (జన్మ-మృత్యు-జరా-వ్యాధి-దుఃఖ-దోష-అనుదర్శనమ్) అనునది తరువాతి జీవన మూల్యము. అనుదర్శనమ్ అనగా స్పష్టముగా పునఃపునః దర్శించుట. ఇది ఒక ఆలోచనా ప్రక్రియ మాత్రమే గాదు. వ్యక్తి ఈ దోషముల నన్నిటినీ లోతుగా పరిశీలించవలెను. ఇట్లు చేయుట వలన మోక్షేచ్ఛ ప్రబలమగును. ఇది సహజములగు జీవన ప్రక్రియలపై వికృతమగు దృష్టికోణము నలవరచుకొనుట అనుకోరాదు. మానవ జీవితములోని దోషములను దర్శించుట వలన, ప్రస్తుత క్షణములో జీవించియుండుట, మరియు పనులను చేయగల్గుట అనువాటి మహత్త్వము గుర్తింపబడును. అనగా ఇప్పుడు ఉన్న పరిస్థితి ఉత్సవము చేసుకొనదగినంత గొప్పది అని గుర్తించి, సాధకుడు వర్తమానమును గురించి సకారాత్మక (positive) దృష్టిని అవలంబించ వలెను.

**అధ్యాయము 13, శ్లోకము 9 :**

असक्तिरनभिष्वंगः पुत्रदारगृहादिषु ।
नित्यं च समचित्तत्वमिष्टानिष्टोपपत्तिषु ॥ ९ ॥

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు (9).

అసక్తిః = వస్తువులపై నేను యజమానిని అనే భావన లేకుండుట, అనభిష్వంగః = తీవ్రమగు అనురాగము లేకుండుట, పుత్ర-దార-గృహ-ఆదిషు = పుత్రుడు, భార్య, ఇల్లు మొదలగు వాటి యందు, చ = మరియు, నిత్యమ్ = అన్నివేళలా, ఇష్ట-అనిష్ట-ఉపపత్తిషు = అభీష్టములు, మరియు అనభీష్టములు లభించిన సందర్భములలో, సమచిత్తత్వమ్ = ఏక రూపమగు మనస్సును కలిగియుండుట.

> వస్తువులపై నేను యజమానిని అనే భావన లేకుండుట, పుత్రుడు, భార్య, ఇల్లు మొదలగు వాటి యందు తీవ్రమగు అనురాగము లేకుండుట, మరియు అన్నివేళలా అభీష్టములు, అనభీష్టములు లభించిన సందర్భములలో ఏకరూపమగు మనస్సును కలిగియుండుట... (9).

సక్తి యనగా తగుల్కొనుట అని సామాన్యార్థము. కోరిక కూడ సక్తి యనబడును. మమకార భావన కూడ సక్తియే. అసక్తి యనగా మమకారము లేకుండుట. ఇది మిక్కిలి అభిరుచికరము, మరియు మహత్త్వపూర్ణము అగు జీవన మూల్యము. ఆధిపత్యము (possession) వేరు; యజమానిత్వము (ownership) వేరు. ఆధిపత్యము ఎవరికైననూ తప్పదు. 'దేహము నేను కాదు; దేహేంద్రియ మనస్సంఘాతము నశించిననూ నేను నశించను' అను అవగాహన గల వ్యక్తి దృష్టిలో దేహేంద్రియాదులు తన అధీనములోనున్న వస్తువులు (possessions) మాత్రమే. సన్న్యాసి కూడ రుద్రాక్షమాల, పుస్తకములు, కమండలము ఇత్యాది కొన్ని వస్తువులను కలిగి యుండును. కావున వ్యక్తికి జీవితములో తన ఆధిపత్యము గల కొన్ని వస్తువులు (possessions) ఉండుట తప్పనిసరి యగును. కాని వ్యక్తి వస్తువుల విషయములో మమకారమును, యజమానిత్వము (ownership) ను పూర్తిగా దూరములో నుంచదగును.

వాస్తవంలో మనకు వస్తువుపై గలది ఆధిపత్యము మాత్రమే. నీ వద్ద గల కొంత భూమిని ప్రభుత్వము స్వాధీనము చేసుకొనవలెనని నిశ్చయించిన దనుకో. ఆ భూమిపై నీకు ఉన్నది ఆధిపత్యమా? యజమానిత్వమా? యజమానిత్వమనేది లేనే లేదు. ప్రతివ్యక్తికి కొన్ని వస్తువులపై కొంతకాలము ఆధిపత్యము మాత్రమే గలదు. యజమానిత్వమనగా వ్యక్తికి ఒక వస్తువుతో తనకు గల సంబంధమును గూర్చి ఉండే మానసిక ధారణ మాత్రమే. 'దీనికి నేను యజమానిని' అని నీవు భావించవచ్చును. లేదా, 'ఈ వస్తువు ఈ సమయములో నా అధీనములో నున్నది' అని కూడ నీవు తలపోయవచ్చును.

ఈ యజమానిత్వములోని సమస్య ఏమనగా, అది నాణెమునకు ఒక వైపు వంటిది. నేను విద్యానగర్‌లోని ఒక ఇంటికి యజమానిని. ఆ నగర్‌లోని ఇతర గృహములన్నింటికి గాని, హైదరాబాదులోని అట్టి బస్తీలన్నింటికి గాని, భారతదేశములోని నగరములన్నింటికి గాని, భూగోళములోని దేశములన్నింటికి గాని, సౌరమండలములోని గ్రహములన్నింటికి గాని, బ్రహ్మాండములోని ఇట్టి గ్రహమండలములన్నింటికి గాని నేను యజమానిని కాదు. ఇప్పుడు నా గురించి నేను ఏమని తలపోయవలెను? ఇది సామాన్యమైన ఆలోచన కాదు. మనము ఆత్మ పరీక్ష చేసుకోవాలి. 'ఫలానా వస్తువునకు యజమానిని నేనే' అను తలంపు నాలో ఉన్నదేమో చూచుకోవాలి. అట్టి తలంపులోపల 'నేను అల్పుడను, సర్వము కంటె భిన్నుడను, వివిక్తుడను (isolated)' అను తలంపు కూడ దాగి యుండును. ఈ తలంపు జ్ఞానోదయమగునంతవరకు పూర్ణముగా తొలగిపోదు. కాని, 'నేను దేనికైననూ యజమానిని కాను; నాకు కొన్ని వస్తువులపై ఆధిపత్యము మాత్రమే గలదు' అని నేను గుర్తించినచో, ఈ ఆసక్తిని చాల వరకు తగ్గించవచ్చును. సర్వము నాకు ఈయబడినది. ఇచ్చిన దానిని ఎప్పుడైననూ మరల లాగు కొనుట సంభవమే. ఈ దేహేంద్రియ మనస్సంఘాతమునకు, దానితో బాటు అనుగ్రహింపబడిన మరికొన్ని వస్తువులకు నేను కార్య నిర్వాహక (managing) న్యాసరక్షకుడను (trustee) మాత్రమే. వీటిలో ఏ ఒక్క దానినీ నేను సృష్టించలేదు. పూర్తిగా నాచే సృష్టింపబడని వస్తువునకు నేను యజమానినని చెప్పుట తగదు. నాకు గల భ్రాంతులు కూడా పూర్తిగా నేను సృష్టించుకున్నవి గావు. ఏలయన, వాటిలో చాలమందికి పాత్ర గలదు. నేను సృష్టించని వాటికి నేను యజమానిని గాను. 'నేను యజమానిని' అను ధారణలో అల్పత్వము, భయము, ఆదుర్దా ఇత్యాదులన్నియు ఇమిడి యుండును. వేటికైననూ నేను యజమానిని కాననియు, కేవలము కొన్ని వస్తువులపై నాకు ఆధిపత్యము మాత్రమే గలదనియు నేను పునః పునః ఈ సత్యమును స్మరించినచో, 'నేను యజమానిని' అను ధారణ తొలగి, వస్తువులను వాస్తవిక దృష్టితో దర్శించ గలిగే పరిపక్వత అబ్బును.

పుత్రుడు, భార్య, గృహము ఇత్యాది (పుత్రదారగృహాది) అని శ్రీకృష్ణ భగవానుడు మన వశములో నుండే కొన్ని వస్తువులను సూచించి యున్నాడు. శ్రీ శంకరులు ఈ జాబితాకు నౌకరుల జత చేసిరి. మోటారు, షేర్లు ఇత్యాదులను మరికొన్నింటిని మనము జోడించవచ్చును. ఈ వస్తువులపై మనకు అతిశయించిన ప్రేమాసక్తులు ఉండును. మానవుని సుఖదుఃఖములు వీటి మంచి–చెడులపై ఆధారపడి యుండును. అభిష్వంగమనగా నిదియే. భార్యాపుత్రాదులతో గల తాదాత్మ్యము ఎంతటి దంటే, వారు బాగున్నప్పుడు వ్యక్తి ఉల్లాసముగా నుండును. వారు బాగుండనిచో, వ్యక్తి దుఃఖాక్రాంతుడగును. ప్రియమైన వ్యక్తి మరణించినప్పుడు తాను కూడ

మరణించినచో బాగుండుననిపించుట సహజము. ఇట్టి అతిశయించిన ఆసక్తి (attachment) కి అభిష్వంగమని పేరు. ఇది సరళమగు ప్రేమకంటె విలక్షణమైనది. ఇట్టి ప్రేమ వారినిద్దరినీ పరాభూతులను చేయును. ఈ ప్రేమలో అతిశయించిన మానసిక పరాధీనత (emotional dependence) గలదు. శిశువును పెంచుట, ఒక వ్యక్తితో ఘనిష్ఠమగు సంబంధమును నెరపుట ఇత్యాది సందర్భములలో అనురాగమును, సంరక్షణను చూపుట అత్యావశ్యకము. యోగ్యము, సకారాత్మకము అగు ఇట్టి భావాభివ్యక్తి మనిషి యొక్క ఎదుగుదలకు సహకరించును. కావున ప్రేమానురాగములలో సమస్య లేదు. మానసిక పరాధీనతలో సమస్య గలదు. అర్జునుడు సన్న్యాసి కాదు గదా! అర్జునుని నిమిత్తముగా చేసుకొని శ్రీకృష్ణుడిచట గృహస్థులందరికీ ఉపదేశించు చున్నాడు. గృహము విషయములో మనిషికి ప్రేమ ఉండక పోయిననూ, చింత, ఆదుర్దా ఉండును. ఇల్లు, మోటారు, వస్తుసామగ్రి అను వాటిపై అతిశయించి అతుకు కొని ఉండే లక్షణము వలన వ్యక్తిలో వాటి గురించి ఆదుర్దా పెరుగును. ఇదియే అభిష్వంగము. వ్యక్తి వాటిపై చూపే మహత్త్వమునకు తగిన యోగ్యత వాటి యందు లేదు. వస్తువులను ఎంతవరకు పరిరక్షించినచో యోగ్యముగా నుండును? అను విషయమును మనము తెలుసుకోవాలి. పరిరక్షణ ముదిరి ఆసక్తిగా మారును. దేని వలన మనస్సునకు దుఃఖము కలుగునో, అది ఆసక్తియే గాని పరిరక్షణ కాదు.

ముందుగా వస్తువులపై మనకు యజమానిత్వము లేదనే సత్యమును గుర్తించవలెను. ఇట్టి గుర్తింపు ఉన్ననూ, నా అధీనములో నున్న కొన్ని వస్తువులపై నేను ప్రత్యేక శ్రద్ధను చూపుట సహజమే. ఏలయన, వాటి విషయములో అట్టి పరిరక్షణ ఆవశ్యకమగును. ఈ స్థితిలో వాటిపై ఆసక్తి నిర్మాణము కాని విధముగా జాగ్రత్త పడవలెను. ప్రేమానురాగములు, పరిరక్షణ మంచివే. కాని అవి హద్దును దాటరాదు. ప్రేమానురాగములు ముదిరి మానసిక పరాధీనత నిర్మాణమైనచో, అది ఆ వ్యక్తికి మాత్రమే గాక, ఇతరులకు కూడ సమస్యయగును. ప్రేమింపబడే వ్యక్తి దుఃఖహేతువు అగును. వీటిగురించి చెప్పుట తేలిక. కాన నిత్య జీవితములో మనము జాగరూకులమై ఉండవలెను. ఒక వస్తువును పరిరక్షించుట, దానిపై ఆసక్తిని పెంచుకొనుట అను వాటి మధ్య భేదము చాల సూక్ష్మముగా నుండి గ్రహించుట దుష్కరమగును. మన ప్రతిక్రియలను బట్టి వీటి భేదమును గ్రహించ వచ్చును. ఇది అంతయు వైరాగ్యములో భాగమే.

ఇష్టము ప్రాప్తించినా, అనిష్టము మీద పడినా ఈ రెండు అవస్థలలో సమమగు మనస్స్థితిని కలిగియుండుట (నిత్యం సమచిత్తత్వం ఇష్ట-అనిష్ట-ఉపపత్తిషు) అనునది తరువాతి గుణము. ఇది మన ప్రవృత్తికి సంబంధించినది. సమత్వము కర్మయోగములో అంతర్భాగమని మనమిదివరలో

చూచి యున్నాము. కర్మలో గాని, ఫలములో గాని సమత్వము సంభవము గాదు. కర్మఫలము లభించగానే మనస్సు స్పందించును. ఇష్టము లభించినా, అనిష్టము లభించినా, మనస్సు యొక్క స్పందనలో సమత్వము సంభవమగును. వ్యక్తులు, పరిస్థితులు, ఆరోగ్యము, ఆహారము, వాతావరణము ఇత్యాదిగా అనేక స్థాయిలలో ఇష్టానిష్టములు గలవు. ఒక స్థాయిలో పరిస్థితి అనుకూలముగా నున్ననూ, మరియొక స్థాయిలో అట్లు కాక పోవచ్చును. అంతిమముగా సర్వము ప్రతికూలము కావచ్చును. ఈనాడు సర్వము అనుకూలముగ నున్ననూ, రేపు అట్లు ఉండక పోవచ్చును. పరిస్థితి ప్రీతికరముగ నున్నచో, చిత్తము ఉల్లాసముగ నుండును. అట్లు లేనిచో, చిత్తము దుఃఖముతో నిండి యుండును. పరిస్థితులు సర్వదా మారుచుండును. వాటితో బాటు మనస్సు కూడ మారే పక్షంలో, మనస్సులో నిరంతర ప్రతిక్రియ నెలకొనును. ప్రీతి పాత్రమగు పరిస్థితిలో హర్షము, ప్రతికూల పరిస్థితులలో నిరాశ తాండవము చేయును. దీనిలోని ఇబ్బంది ఏమనగా, ఇట్టి ప్రతిక్రియాత్మకమగు మనస్సు జ్ఞానార్జనకు సంసిద్ధముగ నుండదు, కాని మన సాధన అంతయు జ్ఞానార్జనయే గదా! కావున పరిస్థితులు అనుకూలంగా ఉన్నా, ప్రతి కూలంగా ఉన్నా, ఎట్లు ఉన్ననూ, మనస్సులో ప్రసన్నతను నిలబెట్టుకునే ప్రయత్నమును చేయవలెను. ప్రసన్నతలోని ఆనందానుభూతికి ఇష్ట-అనిష్ట పరిస్థితులతో పనిలేదు. ఈత వచ్చిన వానికి నీటి లోతుతో పనిలేదు. అదే తీరున మనః ప్రసాదము గలవాని ఆనందము ఇష్ట-అనిష్ట పరిస్థితులపై ఆధారపడదు. పరిస్థితి ఎట్లున్ననూ, ప్రసన్నత కొనసాగవలెను.

జీవితములో ఈశ్వరుని స్వీకరించుట వలన మనః ప్రసన్నత నెలకొనును: 'కర్మలను చేయుట నా వంతు, ఫలములు ఈశ్వరుని నుండి లభించును' అనే దృష్టి ఏర్పడును. దీనికే ప్రసాద బుద్ధి యని పేరు. ఈ మనః ప్రవృత్తి సామాన్యమైనది కాదు. సమచిత్తత్వమును సాధించుటకు దీనిని మించి మరియొక ఉపాయము లేదు. ఇందువలననే శ్రీకృష్ణుడు తరువాతి శ్లోకములో ఇట్లు చెప్పుచున్నాడు:

**అధ్యాయము 13, శ్లోకము 10 :**

मयि चानन्ययोगेन भक्तिरव्यभिचारिणी ।
विविक्तदेशसेवित्वमरतिर्जन संसदि ॥ १० ॥

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ
వివిక్తదేశ సేవిత్వ మరతిర్జన సంసది (10).

చ = మరియు, అనన్యయోగేన = ఇతర సంబంధము లేక పోవుటచే, మయి = నా యందు, అవ్యభిచారిణీ = తిరుగు లేని, భక్తిః = భక్తి, వివిక్త దేశసేవిత్వమ్ = ఏకాంత దేశమును ఇష్టపడే స్వభావము, జన సంసది = జనులతోడి సంగము నందు, అరతిః = అభిరుచి లేకుండుట.

మరియు, ఇతర సంబంధము లేకపోవుటచే నా యందు తిరుగులేని భక్తి, ఏకాంత దేశములో నుండుటకు ఇష్టపడే స్వభావము, జన సంగము నందు అభిరుచి లేకుండట (10).

ఒక విషయముపై భక్తి ఉన్ననూ మనస్సు దాని నుండి ప్రక్కకు మరలిపోవుచున్నచో, దానికి వ్యభిచార భక్తి యని పేరు. విరోధమునకు కూడ వ్యభిచారమని పేరు గలదు. చిరస్థాయి, దృఢము అగు భక్తి అవ్యభిచారి భక్తి యనబడును. దీనిలో భక్తికి విషయమగు వస్తువు నుండి మనస్సు ప్రక్కకు మరలి పోయే ప్రసక్తి లేదు. సాధకుడు ఈశ్వరుని తనకంటె నితాంత (totally) భిన్నుడు అని భావించ వచ్చును; లేదా, ఇంకనూ ఈశ్వరుని గూర్చి పూర్తి అవగాహన లేని సాధకుడు సర్వమునకు కారణమగు ఈశ్వరుడు సర్వము కంటె అభిన్నుడని తలంచవచ్చును. మనమిచట జ్ఞానము గురించి మాటలాడు చున్నాము గనుక, భక్తి యనగా సర్వజ్ఞుడు, సర్వశక్తి మంతుడు, జగత్తును అంతనూ సృష్టించి రక్షించువాడు, మరియు సర్వమును తనలో విలీనము చేసుకొనువాడు అగు ఈశ్వరునిపై గల ప్రేమ.

ఈ ప్రేమను భగవానుడు అనన్యయోగేన భక్తిః అని వర్ణించినాడు. వాసుదేవుని కంటె గొప్పవాడు మరియొకడు లేడు. ఆయన అజుడు, అనంతుడు. ఆయనను అధిగమించిన తత్త్వమేదియూ లేదు అని శ్రీ శంకరులు వివరించిరి. మరియొక అర్థమేమనగా, వాసుదేవుని మించి మరియొక శరణ్యస్థానము లేదు. అనగా ఈశ్వరుని స్వరూపమేమి? అను జ్ఞానమును మాత్రమే నేను పొందగోరు చున్నాను అని యర్థము. సర్వసాధారణమగు ప్రార్థనా రూపముల యందు మనస్సు సంలగ్నమై యుండును. దానిలో తప్పేమీ లేదు. కాని మనమిచట పరమేశ్వర జ్ఞానమును పొందే సాధనమును గూర్చి మాటలాడు చున్నాము. ధార్మికులు ధర్మార్థ కామములనే పురుషార్థముల కొరకై ఈశ్వరుని ఆరాధించెదరు. ముముక్షువునకు ఇవి మోక్షములో విలీనమగును. మోక్షమునకు సాధనము ఆత్మ జ్ఞానము; అనగా ఈశ్వరజ్ఞానమే. కావున ముముక్షువునకు శరణ్యస్థానము భగవానుడు మాత్రమే. అతని సాధనకు సాధ్యము భగవానుడే. ఈ జీవన మూల్యములో రెండు అంశములు సూచింపబడినవి. సాధకునకు తన లక్ష్యము విషయములో

స్పష్టమగు కల్పన (పురుషార్థనిశ్చయము) గలదు. మరియు ఈ వివేకము ఉండుట వలన అహంకారము బలముగా లేదు. ఈశ్వరుడు మాత్రమే శరణ్యస్థానమని గుర్తించిన వ్యక్తి తన శక్తులను కూడ గుర్తించును. ఈ గుర్తింపు అహంకారమును అదుపులో నుంచును. దీని వలన వ్యక్తి యందు 'నేను అల్పుడను' అను భావన కలుగుటకు అవకాశము గలదు. కాని ఈశ్వరుని ఉనికిని గుర్తించిన భక్తునకు ఆసరా లభించినదనే ధైర్యము ఉండును. దాని వలన అతని యందలి నిస్సహాయ భావన దూరమగును.

దేహేంద్రియ మనస్సంఘాతము మరియు జగత్తు అనే సర్వము భగవద్దత్తమనియు, కావున చింతిల్ల వలసిన హేతువు లేదనియు అతడు ఎరుంగును. సృష్టించు వాడను నేనైనచో వైఫల్యము నాది యగును. దేనినీ నేను సృష్టించుట లేదు. కావున, 'నేను విఫలుడనైతిని; నేను నిస్సహాయుడను' ఇత్యాది ధారణలకు తావు లేదు. కావున ఈ దృష్టికోణము సమచిత్తత్వమును పొందుటలో సహకరించును.

సర్వకర్మలపై అధ్యక్షుడు, వాటి ఫలములనిచ్చువాడు ఈశ్వరుడే అను సత్యమును గుర్తించినచో, పరిస్థితులను నా అవసరములకు అనుగుణముగా తీర్చిదిద్ది నియంత్రించవలసిన సమస్య మాయమగును. వాస్తవంలో మనకు దేనిపైనా నియంత్రణ లేదు. కాని గాఢముగా నాటుకొని యున్న అభద్రతా భావన నుండి 'నేను విఫలుడనగుదునేమో' యను భయము ఉత్పన్నమగుట వలన మనము నియంత్రించ గోరెదము. 'నేను ఓడిపోయెదనేమో!' అను భావన ఉండుటచే, వ్యక్తి స్వీయనియంత్రణను విడనాడుటకు ఇచ్ఛగించడు. ఇది కల్పన కాదు. ఇది సత్యము. ప్రతి వ్యక్తి ఓడిపోవుట, లేక పోగొట్టుకొనుట సహజమే. ఏలయన, వ్యక్తి తనకు లాభము కలుగు విధముగా పరిస్థితులనన్నిటినీ నియంత్రించగల్గుట అసంభవము. అట్టి స్థితిలో నియంత్రణను విడనాడుటయే శ్రేష్ఠము. భగవానునిపై వదిలిపెట్టుము. ఈ సర్వమును సృష్టించిన వాడు ఆయనయే. దీనిని ఆయనయే పరిరక్షించగలడు. నాకు చేతనైనది నేను చేస్తాను. అది కూడా భగవానుడే గదా! కావ నియంత్రించబూనుకొనుట అనావశ్యకము. నేను మానవుడను గనుక, నాయందు కొంత ఇచ్ఛా స్వాతంత్ర్యము గలదు. దానిని వినియోగించి నేను కర్మను చేయగలను. కాని ఒకసారి కార్యాచరణ దిశ నిర్దిష్టమైన పిదప, కర్మఫలము యొక్క బాధ్యతను ప్రకృతి నియమములు చేపట్టును. ఈశ్వరుడు కర్మఫలదాత యను గుర్తింపు వలన నాలో ఉన్న వైఫల్యధారణ, పరిస్థితులను అదుపులో పెట్టవలసిన ఆవశ్యకత బలహీనమగును. అపుడు సమత్వము సంభవమగును.

ప్రసన్నతను ఆనందముతో అను భవించుటకు మరియొక ఉపాయము లేదు. 'వ్యతిరేక పరిస్థితులలో దుఃఖించి ప్రయోజనము లేదు' అనే అర్థ క్రియా దృష్టి (pragmatism) వలన కూడ మానసిక ప్రసన్నత కొంత వరకు లభించునను మాట వాస్తవమే. కాని మనకు సత్యము నందు అభిరుచి కలదు గాన, ఇంకో అడుగు ముందుకు వేయవలెను. కర్మ విషయములో వాస్తవమే మనగా, కర్మఫలముల నిచ్చువాడు భగవానుడు. ఈ సత్యమును స్వీకరించగల్గినచో, జీవితము తేలిక యగును. సత్యమునకు విరుద్ధముగా జీవించు వ్యక్తి తాను కూడ దుఃఖమునకు గురియగును. కర్మ ఫలదాత భగవానుడనే సత్యమును సాధకుడు కాలక్రమములో గుర్తించును. 'కర్తను నేను; కాని కర్మఫలదాత భగవానుడు' అను సత్యమును వ్యక్తి ఎంత లోతుగా గుర్తించగల్గునో, అతనికి ప్రసన్నత అంత అధికముగా వశమగును. సర్వము ఈశ్వరుడే యను జ్ఞానము ఉదయించు వరకు, ఈ గుర్తింపు ఆవశ్యకమగును. ఈ జ్ఞానము ఉదయించుటకు మనఃప్రసన్నత చాల ఆవశ్యకము. 'నేను కర్తను మాత్రమే' అనియు, కర్మఫలదాత భగవానుడనియు దర్శించగల్గిన వ్యక్తికి సమత్వము, దృఢభక్తి (అవ్యభి చారిణీ భక్తిః) కరతలామలకములగును. ఈ రెండింటిలో ఒకటి లేనిచో, రెండవది సంభవము కాదు. భక్తి సహకారము ఉన్నపుడు మాత్రమే సమచిత్తత్వము సంభవమగును.

స్వతస్సిద్ధముగా భయహేతువులనుండి విముక్తమై యున్న స్థానమునకు వివిక్త దేశమని పేరు. అట్టి స్థానము నాశ్రయించు వ్యక్తి యందు వివిక్తదేశ సేవిత్వమనే గుణము గలదని చెప్పెదము. కావున విషసర్పములతో, మరియు క్రూరమృగములతో నిండియున్న అడవికి పోవద్దు. ఏలయన, అచట వ్యక్తి క్రూరమృగముల బారిన పడకుండా నిరంతర జాగరూకుడై ఉండవలెను. ఆ భయము వలన మనస్సు ధ్యానములో ఏకాగ్రము కాదు. చోటు ప్రశాంతముగా నుండవలెను. మరియు భయహేతువులు ఉండరాదు. పెద్ద ఉద్యానము అడవిని బోలి యుండును గదా! లేదా, నదీతీరము, పర్వతము, లేక దేవాలయము ధ్యానమునకు అనుకూలముగా నుండును. ఇట్టి స్థలములలో మానవుని మస్తిష్కము వాస్తవిక దృష్టితో పని చేయును. మనస్సు వాటి యందు తన ఇష్టానిష్టములను ఆరోపించదు. లేదా, నీవు ఇంటిలో ఒక ప్రశాంతమగు స్థలమును ఏర్పాటు చేసుకొనవచ్చును. అది సంభవము కానిచో, ఉన్న స్థలములోనే ప్రశాంతి నెలకొనే కాలము తప్పక లభించును. స్థలము ప్రశాంతముగ నున్నచో, మనస్సునకు ఆ కారణంగా ఇటునటు చలించవలసిన ఆవశ్యకత ఉండదు. పర్వతమును చూచి, 'ఇది ఇట్లు గాక, మరియొక విధముగా నుండిన బాగుండును' అను తలంపు మనకు రాదు. కావున మనస్సు యొక్క చంచలత తగ్గును. ఆ స్థలములో పచ్చదనము ఉన్ననూ, లేకున్ననూ, చెట్లు ఉన్ననూ, లేకున్ననూ యథాతథముగా మనస్సునకు ఆనందము కలుగును. సహజముగా నచ్చుబాటు అయ్యే ఇట్టి స్థలములలో మనస్సునకు ఒక విశిష్టమగు ప్రసన్నత

లభించును. ఇట్టి ప్రశాంత స్థలమునకు వెళ్లి కూర్చుండు స్వభావము గలవాడు వివిక్తసేవి అనబడును. అతని మనస్స్థితికి వివిక్త దేశ సేవిత్వము అని పేరు. ఈ గుణము ఉన్నచో మనస్సు ఉల్లాసముగా నుండి నిదిధ్యాసనమునకు ఉన్ముఖముగా నుండును. ప్రసన్నమగు మనస్సునందు మాత్రమే ఆత్మవిచారము సాధ్యమగును. ముందులో ఇది ఒక విలాసము (luxury) వలె నున్ననూ, తరువాత ఇది లేనిదే జీవించలేని పరిస్థితి ఏర్పడును. అనేక పనుల హడావిడిలో నుండగా, ఆత్మ విచారము ఒక విలాసము (luxury) వంటిది. కాని వ్యవహారము జరుపవలసిన వ్యక్తులు ఎవ్వరూ లేని ఏకాంతములో మనస్సు చాల విశ్రాంతిగా నుండుటచే సహజముగా అంతర్ముఖమై ఆత్మ విచారమునందు నిమగ్నమగును. ఇట్టి మనస్సుతో శాస్త్రాధ్యయనము మరియు నిదిధ్యాసనము సంభవమగును. ఇట్టి నిదిధ్యాసనాపూర్ణమగు జీవితమును ఆనందముగా గడుపుటకు కావలసిన మానసిక సంసిద్ధత వివిక్త దేశసేవిత్వము వలన లభించును. సాధారణంగా మనము ఇతర జనుల సాహచర్యము ( జనసంసద్) ను కోరెదము. కావున, మనమీ లక్షణమును పెంపొందించుకొనవలెను.

మనస్సులో చింత, ఆదుర్దాల ఒత్తిడి బాగా పెరిగినప్పుడు ఇతరులతో మాటలాడుట అత్యావశ్యకమగును. క్రమముగా అది అలవాటుగా మారును. అపుడు వ్యక్తి ఏకాంతములో కూర్చుండజాలడు. ఇది తన నుండి తాను పారిపోయే ప్రవణత (tendency) ను సూచించును. అరతిః జన సంసది అనగా ఇతర జనుల సాహచర్యమును కోరకుండుట. ఇది కోరిక లేకపోవుటయే గాని వైముఖ్యము కాదు. ఇతరుల సాహచర్యమునకు భయపడుట, మరియు ఇతరుల సాహచర్యము ఆవశ్యకమగుట అను రెండు ఆ వ్యక్తి యొక్క మనస్సులో సమస్య గలదని సూచించును. తన నుండి తాను పారిపోవనిచ్ఛగించు వాడు ఇతరుల సాహచర్యము కొరకు యత్నించుచుండును. తనను తాను ఎదుర్కొన నిచ్ఛగించని వ్యక్తి ఇతరుల సాహచర్యము వలన భయపడుటయు సంభవమే. ఇతరుల సన్నిధిలో తాను అల్పుడననే భావన ఆరంభమై అతడు చాల ఇబ్బంది పడును. ఈ తీరున ఇతరసాహచర్యమునకు భయపడుట, లేదా దాని కొరకు తహతహలాడుట అను రెండు లక్షణములు లేని మనోభావము (disposition) ను మనము కోరెదము. అనగా నాలో నేను ఆనందించ గలను. మరియు చుట్టూ జనులు ఉన్నప్పుడైననూ నేను ఆందోళన చెందను.

నీలో నీవు ఉండగలవు. అనగా నీ వలన నీవు భయపడవు. సమస్యలను ఎదుర్కొనే ధైర్యము నీకు గలదు. నీకు గల సమస్యలను నీవు గుర్తించినప్పుడు మాత్రమే నీవు వాటిని పరిష్కరించే ఆశ ఉండును. ఒక సమస్యనుండి పారిపోవాలని నీకు అనిపించినా, నీవు దానిని ఎదుర్కొనుటకై సంకల్పపూర్వకముగా ప్రయత్నించినచో, ఆ క్షణము నుండియూ దానిపై నీ

జయము ఆరంభమైనట్లే. ఆ తరువాత ఆ సమస్యను క్షుణ్ణముగా విశ్లేషించి తెలుసుకొను సరికి మటు మాయమగును. కావున, వివిక్త దేశసేవిత్వము జ్ఞానమునకు చాల ప్రముఖమైన సాధనము.

అరతిః జనసంసది యనగా జనుల నుండి దూరముగా పారిపోవుట కాదనియు, నీ సాధనకు ఆటంకమయ్యే వారి సాంగత్యమును పరిహరించుటే ననియు శ్రీ శంకరులు వివరించిరి. వ్యుల సాంగత్యములో నీవు మోహితుడవయ్యే అవకాశము గలదు. వారి ఆలోచనా ధోరణి గాని, జీవన విలువలు గాని వ్యక్తి వికాసమునకు సహకరించబోవు. సాధారణంగా వారు గర్వితులై యుందురు. తరచుగా నిరీశ్వరవాదులై, వారి వాదములతో మన శ్రద్ధను చెడగొట్టెదరు. వారి వాదములన్నిటికీ మన వద్ద సమాధానములు ఉండవు. ఇట్టి సాంగత్యమునకు దూరముగా నుండవలెను. కాని విద్యావంతులు, శమదమాది సంపన్నులు అగు జనులు వ్యక్తి వికాసమునకు తోడ్పడెదరు గాన, మనము వారి సాంగత్యమును పరిహరించరాదు. మంచి వారితోడి సాంగత్యము (సత్సంగము) జ్ఞాన సాధనలో చాల సహాయకారి యగునని మనము చూచి యున్నాము. కావున మనకు ఆటంకముగా ఉంటూ వికాసమునకు సహకరించని వ్యక్తుల సాంగత్యమును త్రోసిపుచ్చి, ఇతర సాధకులతో మరియు ఆచార్యులతో సాహచర్యమును కొనసాగించుట చాల మంచిది. దీని అభిప్రాయము ఇతరులు చెడ్డ వారని కాదు. ప్రస్తుతానికి వారితో మనకు పనిలేదు. మనము నేర్చుకొనే సమయములో విచారశీలమగు బుద్ధిని కలిగి యుండవలెను. మనము శాస్త్రప్రవచనములను విశ్లేషించుటలో నిమగ్నమై యుండగా, మన జ్ఞానసాధనకు ఉపకరించని పరిస్థితులలో తలదూర్చే అభిరుచి మనయందు ఉండదు. తరువాతనైననూ ఇదే పరిస్థితి కొనసాగును. మహాత్ములు కూడ ఇతర సాధకుల సాంగత్యమునపేక్షించియే హృషీకేశ్, హరిద్వార్ ఇత్యాది స్థానములలో తమ ఆశ్రమములను నిర్మించు కొనిరి. ఆరంభములో చూడాలనే కుతూహలముతో గాని, జీవితముపై నిరాశానిస్పృహలతో గాని అచటకు వెళ్లిన వ్యక్తి కూడా అక్కడి వాతావరణముచే ప్రభావితుడై సాధువు కావచ్చును. ఒకప్పుడు అచట విద్వాంసులగు సన్న్యాసులు ఉండెడివారు. వారిలో ఎవరి వద్దనైననూ కూర్చుండి శాస్త్రము నభ్యసించ వచ్చును. సత్సంగమనగా నిదియే.

ఈ మానసిక ప్రవృత్తులు మరియు జీవన మూల్యములు అంతః కరణమునకు పరిపక్వతను కలిగించి జ్ఞానము ఉదయించునట్లు చేయును గనుక, వీటికి జ్ఞానమని పేరు. కాని ఇవి స్వయముగా మోక్షము నీయ జాలవు. మోక్షము యొక్క వాస్తవ సాధనమును భగవానుడిపుడు నిర్దేశించు చున్నాడు.

**అధ్యాయము 13, శ్లోకము 11:**

अध्यात्मज्ञाननित्यत्वं तत्त्वज्ञानार्थदर्शनम् ।
एतद् ज्ञानमिति प्रोक्तमज्ञानं यदतोऽन्यथा ॥ ११ ॥

అధ్యాత్మ జ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్
ఏతద్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోన్యథా (11).

**అధ్యాత్మ-జ్ఞాన-నిత్యత్వమ్** = సర్వదా ఆత్మ జ్ఞాన నిష్ఠను కలిగి యుండుట, **తత్త్వ-జ్ఞాన-అర్థ-దర్శనమ్** = సత్య జ్ఞానము యొక్క ప్రయోజనమును దృష్టిలోనిడు కొనుట, **ఏతత్** = ఇది, **జ్ఞానమ్** = జ్ఞానము, **ఇతి** = అని, **ప్రోక్తమ్** = చెప్పబడినది, **అతః** = దీనికంటె, **యత్** = ఏది, **అన్యథా** = విరుద్ధమైనదో, (**తత్** = అది), **అజ్ఞానమ్** = అజ్ఞానము.

సర్వదా ఆత్మజ్ఞాననిష్ఠను కలిగియుండుట, సత్యజ్ఞానము యొక్క ప్రయోజనమును దృష్టిలో నిడుకొనుట - ఈ గుణములకు జ్ఞానము (జ్ఞానసాధనము) అని పేరు. దీనికి విరుద్ధమైనది అజ్ఞానము (11).

అధ్యాత్మజ్ఞానమనగా ఆత్మయందు కేంద్రితమైన జ్ఞానము. ఆత్మ యనగా దేహము గాని, ప్రాణము గాని, మనస్సు గాని, లేదా ఈ శ్లోకములో వలె, సచ్చిదానంద ప్రత్యగాత్మ గాని కావచ్చును. బ్రహ్మ-ఆత్మ యొక్క జ్ఞానము నందు సదా సావధానుడై యుండు వ్యక్తి యొక్క లక్షణము అధ్యాత్మ జ్ఞాననిత్యత్వము అగును. అట్టి వాడు సర్వదా శ్రవణము నందు, మననము నందు లేదా నిదిధ్యాసనము నందు నిమగ్నుడై యుండును. అతడు ఉపదేశమును శ్రవణము చేసి తన బుద్ధిని వికసింప జేసుకొనును. విద్వాంసుల సామూహిక గోష్ఠిలో పాల్గొని తనకు తెలిసిన దానిని విశ్లేషించు కొనును. తన జ్ఞానమును జిజ్ఞాసువులకు పంచి పెట్టును (తత్ చింతనం తత్ కథనం అన్యోన్యం తత్ ప్రబోధనమ్). స్పష్టమగు ఆత్మజ్ఞానమును గోరు వ్యక్తి సంప్రదాయ బద్ధుడై ఈ జ్ఞానము నందు మాత్రమే వినోదమును పొందును. ఒకే పాఠమును మొదటి సారి విన్నా, ఆఖరి సారి విన్నా, విషయము అదియే ఉండును. కాని పునః పునః ఈ విద్యను ఆవృత్తి చేయుట వలన గొప్ప ప్రయోజనము గలదు. మొదటి పాఠములో, ఆఖరి పాఠములో, మరియు మధ్యపాఠములలో 'బ్రహ్మవు నీవే' యని బోధింపబడును. దానిలో మార్పు లేదు. ఈ విద్యకు నిరంతర శ్రవణమననములు ఆవశ్యకమగును. ఇందువలననే ఈ విద్యలో ఇన్ని గ్రంథములు

ఉదయించినవి. అధ్యాత్మజ్ఞాననిత్యులగు మన పూర్వజులు తమను తాము ఈ జ్ఞానప్రకాశములో వికసింపజేసుకొని, తమ నిరంతర సాధనలో భాగముగా ఒక దాని తరువాత మరియొకటి చొప్పున అనేక గ్రంథములను వెలయించిరి. ఇంతే గాక తాము జ్ఞానమును పొందిన తరువాత లోక కల్యాణమునకు పూనుకొనిన మహాత్ములు వ్రాసిన గ్రంథము లెన్నియో గలవు. ఈ తీరున మనము ఎంతకాలమైనను పఠనపాఠనములను చేయుటకు చాలినంత విషయము గలదు. ప్రమాణము సావకాశముగా గాక, వెనువెంటనే పని చేయును. అయిననూ, మనము ఉపదేశముచే బుద్ధిని వికసింపజేయు కొలదీ మన అవగాహనలో స్పష్టత పెరుగుచుండుట అనుభవమునకు వచ్చును. అధ్యాత్మజ్ఞాననిత్యత్వము అను గుణమునకు అధ్యాత్మజ్ఞాన నిష్ఠ ఫలము. శ్రీ శంకరులీ గుణమును అధికముగా వ్యాఖ్యానించలేదు. కాని ఆయన ఒక సంగతిని చెప్పినారు. అమానిత్వాది జీవన మూల్యములు సాక్షాత్ జ్ఞానసాధనములు కాదు. తత్త్వ జ్ఞానము పరిపక్వతకు హేతువు అగును. ఈ జీవన మూల్యములను పాటించు వ్యక్తి యందు వేదాంత శాస్త్రము జ్ఞానమును ఉదయింప జేయును. మరియు వేదాంత శాస్త్రాధ్యయనము వలన ఈ విలువలు జీవితములో మరింత పరిపక్వమై జ్ఞానము సఫలమగును. ఈ అన్యోన్య సంబంధము వలన అవగాహనలో స్పష్టత పెరుగును. జీవన విలువలలో పరిపక్వత పెరుగుచున్న కొలదియూ, జ్ఞానము మరింత స్పష్టమగు చుండును. జ్ఞానము స్పష్టమగు కొలదియూ, ఈ విలువల విషయములో విస్పష్టత వికసించును. ఇవి రెండు పక్షియొక్క రెండు రెక్కల వంటివి.

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము వలన సాధకుడు తత్త్వజ్ఞానమును పొంది, దాని వలన మోక్షమును పొందును. సంసారము విలీనమగును. ఈ సాక్షాత్కారము (దర్శనమ్) లక్ష్యము (అర్థ)గా గల సాధకుడు నిరంతరముగా అధ్యాత్మ జ్ఞానము వెంటబడును. ఆత్మ బ్రహ్మయే అను ఆత్మ జ్ఞానము మరియు వివిధ జీవన మూల్యములు కలిసి తత్త్వ జ్ఞానమనబడును. ఈ తత్త్వజ్ఞానమునకు ఫలము మోక్షము. సాధకుడు సర్వదా ఈ లక్ష్యమును దృష్టి యందు ఉంచుకొనును.

జీవితములో అనేక కోరికలు ఉదయించి మన శక్తి యుక్తులను కాలమును హరించి వేయుచుండును. కావున సాధకుడు ఈ మోక్షమును దృష్టిలో నుంచుకొనవలెను. నేను వాస్తవముగా కోరేది ఏది? అను విశ్లేషణము కొనసాగించవలెను. మోక్షమునందలి దృష్టి చెదిరి పోకుండా శ్రద్ధ వహించవలెను. అప్రధానములగు విషయములు ప్రధానలక్ష్యమును కప్పివేయకుండగా జాగ్రత్త పడవలెను.

సాధకుని జీవన మూల్యములు పరిపక్వమగు వరకు అధ్యాత్మ జ్ఞాననిత్యత్వము అవశ్యకము. తత్త్వజ్ఞానార్థ దర్శనము ఉన్నప్పుడు మాత్రమే అధ్యాత్మ జ్ఞాననిత్యత్వము సంభవమగును. తత్త్వజ్ఞానార్థమును నిలబెట్టుకున్న సాధకుడు ఏ పనిని చేసినా, అది అర్థవంతముగనే ఉండును.

వేదాంత శాస్త్రము మాత్రమే అధ్యాత్మ జ్ఞానమనబడునని శ్రీ శంకరులు చెప్పిరి. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వముతో గూడిన జీవన మూల్యములను పాటించుట వలన తత్త్వజ్ఞానము ఉదయించును. దాని ప్రయోజనము మోక్షము. మోక్షమనగా సంసారము నుండి విముక్తి. సంసారమనగా వివిధ లక్ష్యముల వెనుక పడుచుండుట. జీవితములోని లక్ష్యాన్వేషణలన్నింటి వెనుక రెండు దోషములు గలవు; (i) తన స్వరూపము తనకు అంగీకారము కాకపోవుట; (ii) న్యూనతా భావముతో గూడియున్న వ్యక్తిత్వము. వ్యక్తి వీటి నుండి విముక్తిని గోరును. ఈ దోషములే సంసారమునకు మూలమునందున్నవని మనము నిత్యము స్మరించవలెను. మనము ఏ పనిని చేసినా, అది మోక్షము కొరకు మాత్రమే. కాని మోక్షము కర్మసాధ్యము కాదు. తత్త్వ జ్ఞాన మొక్కటియే మోక్షము. ఇతర మేదియూ మోక్షములో సాక్షాత్తుగా కారణము కాబోదు. సాధకుడు పునః పునః తనను నియంత్రణలో నుంచు కొనవలెను. లేనిచో అల్పవిషయములకు ప్రాముఖ్యము పెరిగి, సాధన కలుషితమగును. సత్యమును ఎరుంగుట (తత్త్వ జ్ఞానము) అను దాని ఫలము నందు నిష్ఠ ఉన్నప్పుడు మాత్రమే సత్యాన్వేషణ కొనసాగును.

భగవానుడీ ప్రకరణమును ఉపసంహరించుచున్నాడు. అమానిత్వముతో మొదలిడి తత్త్వజ్ఞానార్థ దర్శనము వరకు చెప్పబడిన (ఏతత్ ప్రోక్తమ్) ఈ గుణములు జ్ఞానసాధనములు గనుక, జ్ఞాన శబ్దముచే నిర్దేశింపబడుచున్నవి.

ఈ విషయములను భగవానుడు అన్వయముఖముగా చెప్పిన తరువాత, 'దీనికి విరుద్ధమైనది అజ్ఞానము (అజ్ఞానం యదతోఽన్యథా)' అని నిషేధ ముఖముగా చెప్పుచున్నాడు. దయా, మైత్రీ మొదలగు కొన్ని సద్గుణములు ఇచట చెప్పబడ లేదు. కావున 'అన్యథా' అనగా 'వీటి కంటె భిన్నమైనవి' అని గాక, 'వీటికి విరుద్ధమైనవి' అను అర్థమును చెప్పవలెను. మానిత్వ, దంభిత్వ, హింసా, అక్షాంతి ఇత్యాదులు విరుద్ధ ధర్మములగును. ఇవి జ్ఞాన ప్రతిబంధకములు గనుక, వీటిని త్రోసిపుచ్చవలెను. అమానిత్వాది జీవన మూల్యములు సాధకుని స్వరూపమే గనుక, వాటిని క్రొంగ్రొత్తగా పెంపొందించు కొనవలసిన పనిలేదు. మానిత్వాది దోషములను తొలగించిన చాలును. మనము అహింసను వికసింప చేయనక్కరలేదు. హింసాప్రవృత్తిని విడనాడిన చాలును.

సంసారము కొనసాగుటకు కారణమగు ఈ దోషములను నిర్మూలించవలెనని శ్రీ శంకరులు చెప్పిరి. జీవన విలువలను ఖాతరు చేయని వ్యక్తిని పరిశీలించుడు. అట్టి వాడు హింసా ప్రవృత్తికి దూరము కాలేడు. అట్టివాడు తన గదిలోనికి ప్రవేశించిన పాపానికి సీతాకోక చిలుక వంటి అమాయక ప్రాణినైననూ చంపిలీరును. ప్రపంచమంతయు తన ఆదేశములను పాటించవలెనని అతడు అపేక్షించును (అక్షాంతి). సత్యనిష్ఠకు అతని జీవితములో తావు లేదు (అనార్జవమ్). అతడు అనేకరకముల చేయకూడని పనులను చేయుచుండును (అస్థైర్యమ్). మరియు స్వీయరాగ ద్వేషములచే ప్రేరితుడై మంచి–చెడు అను వివేకము లేనివాడై వివిధ భోగవిలాసముల యందు తేలియాడు చుండును. జీవితములో ఎదురైన విపత్తుల నుండి గుణపాఠములను నేర్చుకొనుటకు బదులుగా, అతడు వాటి గురించి నిరంతరముగా ఫిర్యాదు చేయుచుండును. భార్య, పుత్రుడు, పిల్లలు, మోటారు వాహనము, టివాచీ, కేశాలంకారము ఇత్యాది విషయములపై అతడు గాఢమైన ఆసక్తిని కలిగియుండును. అతని మనస్సు జీవితములోని కష్టసుఖముల ధాటికి గురియై ఆఘాతముల పాలగు చుండును. అతనికి ధనము, లేక అధికారము నందు భక్తి ఉండును; భగవంతుని యందు కాదు. అతడు తనంత తాను ఏకాంతములో నుండజాలడు; కావున సదా క్లబ్బులు, సినిమాలు మొదలగు వాటి వెంట తిరుగు చుండును. మరియు నల్గురు తనను గుర్తించాలని తహతహలాడును. ఎల్లవేళలా దుష్టసంగమును కోరుచుండును. ఇట్టి వ్యక్తి గ్రామీణ క్షేత్రమునకు ఎప్పుడైనా వెళ్లినచో, తనతో బాటు మరోనలుగురిని వెంట బెట్టుకొని పోవును. ఇది చాల శోచనీయమగు స్థితి. ఆత్మ జ్ఞానమునందు ఇచ్ఛ లేకున్ననూ, జీవితములో పరిపక్వత (maturity) యొక్క విలువను గుర్తించగల్గుట గొప్ప వరము. పరిపక్వమగు మనస్సులో ఆ ఇచ్ఛ కాలక్రమములో పుట్టును. ఏలయన, ఈ లక్షణములు మనము సహజరీతిలో సంసారము నుండి ఉపరతులగుటకు సహకరించును.

జ్ఞాన శబ్ద నిర్దిష్టములగు ఈ గుణముల ద్వారా తెలియబడవలసిన వస్తువు (జ్ఞేయమ్) ఏది? జ్ఞానమనగా మానవుని శిష్టాచారమును నిర్దేశించే ఈ నియమములు మాత్రమే కాదు. ఇవి ఒక విశిష్ట వస్తువును బోధించుట లేదు గదా! కావున తెలియదగిన వస్తువు వీటివలన సాక్షాత్తుగా తెలియబడదు. ఇవి అన్నియు అంతః కరణధర్మములు. మరియు ఘట–విషయక–జ్ఞానము వలన అగ్ని ఇత్యాది ఇతర విషయములు తెలియబడవు గదా! కావున, అమానిత్వాది జీవన మూల్యములను తెలియుట వలన తెలియబడవలసిన వస్తువు తెలియబడుట లేదు. వీటిని జ్ఞాన శబ్దముచే నిర్దేశించుట ఎట్లు పొసగును? శ్రీ శంకరులిట్లు సమాధానము నిచ్చిరి. ఈ సద్గుణములన్నింటితో సంపన్నమైన బుద్ధి ఈ జ్ఞానమును పొందగల్గును. కావున ఇవి జ్ఞానహేతువులగు చున్నవి.

సృష్టిఏదైననూ, కర్త మరియు మూలపదార్థము అను రెండు ప్రధానకారణములు గలవు. ఇవి గాక, సృష్టికి సహకరించే కొన్ని సాధనములు కూడ గలవు. ఉదాహరణకు ఘటనిర్మాణములో చక్రము ఇత్యాదులు సహకారులగును. అటులనే, జ్ఞానమునకు ప్రమాణము ప్రధానకారణము కాగా, ఈ జీవన మూల్యములు సహకారులగును.

ఇపుడు భగవానుడు జ్ఞేయమును చెప్పవలసియున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 12 :**

ज्ञेयं यत्तत्प्रवक्ष्यामि यद् ज्ञात्वाऽमृतमश्नुते ।
अनादि मत्परं ब्रह्म न सत्तन्नासदुच्यते ॥ १२ ॥

జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృతమశ్నుతే
అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే (12).

**యత్** = ఏది, **జ్ఞేయమ్** = తెలియదగినదో, **తత్** = దానిని, **ప్రవక్ష్యామి** = స్పష్టముగా చెప్పగలను, **యత్** = దేనిని, **జ్ఞాత్వా** = ఎరింగి, **అమృతమ్** = అమృతత్వమును, **అశ్నుతే** = (మానవుడు) పొందునో, **బ్రహ్మ** = బ్రహ్మ, **అనాది మత్** = ఆరంభము లేనిది, **పరమ్** = అంతము లేనిది, **తత్** = అది, **సత్** = ఉన్నది (వస్తువు రూపములో), **న** = కాదు, **అసత్** = లేనిది, **న** = కాదు అని, **ఉచ్యతే** = చెప్పబడుచున్నది.

> ఏది తెలియదగినదో, దేనిని తెలిసిన మానవుడు అమృతత్వమును పొందునో, దానిని స్పష్టముగా చెప్పెదను. అదియే ఆది, అంతములు లేని బ్రహ్మ. అది వస్తురూపములో ఉన్నది కాదు; లేనిది కాదు అని చెప్పబడుచున్నది (12).

తెలియదగినది బ్రహ్మమే. తెలియవలసిన వస్తువు ఏదైననూ జ్ఞేయమే యగును. కాని వాస్తవముగా తెలియదగినది, తెలియగలిగినది బ్రహ్మము మాత్రమే. కావున ఈ ప్రకరణములో 'జ్ఞేయమ్' అనగా బ్రహ్మ. ఆ జ్ఞేయమును నేను నీకు స్పష్టముగా చెప్పెదనని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ ప్రపంచములో తెలియదగిన వస్తువులు చాల గలవు. కాని దీనిని తెలిసినచో, వ్యక్తి అమృతత్వమును పొందును (అమృతం అశ్నుతే). ఈ విశేషణమును బట్టి జ్ఞేయశబ్దము ఇచట

పరబ్రహ్మయను విశేషార్థములో వాడబడినట్లు స్పష్టమగుచున్నది. అమృతత్వమనగా మృత్యువు నుండి మాత్రమే గాక జన్మ నుండి కూడ మోక్షము అని యర్థము. ఈ దేహము నశించిన పిదప పునర్జన్మ ఉండదు; కావున, మరణము కూడ ఉండబోదు. మరణించేది మాత్రమే మరల జన్మించును. కాని శాశ్వతమగు ఆత్మకు మరణము లేదు. ఈ జ్ఞేయమును ఎరింగినచో జన్మ మరణ విముక్తి కలుగునన్నచో, ఈ జ్ఞేయము కాలాతీతము, శాశ్వతము అయి ఉండవలెను. కాని శాశ్వత వస్తువు అగు ఈ జ్ఞేయము నీ కంటె భిన్నమైనచో, దాని ఎరుక వలన నీవు అమరుడవు ఎట్లు అగుదువు? నిత్యవస్తువును ఎరింగిన వ్యక్తి తాను నిత్యుడు కాజాలడు గదా! ఒక వస్తువును తెలియుట వలన అమృతత్వము లభించే పక్షంలో, ఆ వస్తువు నీ స్వరూపము మాత్రమే అయి ఉండవలెను. ఆత్మ నిత్యము. ఆ సత్యమును నీవు గుర్తించినచో, నీవు నిత్యుడవనే సాక్షాత్కారము నీకు కలుగును.

ఇచట ఒక ఇబ్బంది గలదు. అందరికీ తెలిసే ఏకైక వస్తువు ఆత్మ. నా ఉనికి గురించి, నా ఉపాధిని గురించి నేను ఇతరులను సంప్రదించవలసిన ఆవశ్యకత లేదు. కాని నీ గురించి నీకు తెలిసినది ఇచట బోధింపబడు దానికి విరుద్ధము. నీ గురించి నీకు మర్త్యుడనను భావన గలదు. నీ ఉనికిని స్థిరీకరించుటకై నీకు ఇతర సాహాయ్యము అపేక్షితము కాదు. స్వర్గము ఉన్నదా? లేదా? అను విషయమును స్థిరీకరించుటకై నీకు సహకారము ఆవశ్యకమగును. నీవు అట్టి సహకారమును శాస్త్రము నుండి అపేక్షించెదవు. ఆత్మ నిత్యము అను సత్యమును మాత్రమే శ్రీ శంకరులు నిర్ధారించు చున్నారు.

తరువాతి వాక్యములో జ్ఞేయము అమృతము అను విషయము వివరించబడినది. ఈ జ్ఞేయవస్తువునకు ఆది లేదు (అనాది మత్). ఆది లేని వస్తువునకు అంతము కూడ ఉండదు. అంతేగాక, ఈ జ్ఞేయము పరిచ్ఛేదము లేనిది (పరా) అగుటయూ దాని అనంతత్వమునకు హేతువు అగును. అది కాలము నుండి అత్యంతిక (absolutely) వినిర్ముక్తము; అనగా నిత్యము. ఈ జ్ఞేయ-బ్రహ్మ ఆత్మయేనని యెరుంగవలెను. ఈ పరం-బ్రహ్మ సత్ గాని, అసత్ గాని కాదని శ్రీ కృష్ణుడు ఇంకనూ వివరించు చున్నాడు. మన జ్ఞానము లన్నియు 'ఇది గలదు', 'అది లేదు' అను విధముగా నుండును. నా చేయి గలదు. దాని యందు కుండ లేదు. ఈ జ్ఞేయ తత్త్వము మనుష్య శృంగము వలె అత్యంతిక-అభావమైనచో, దానికి జ్ఞేయమని పేరు పెట్టి, దానిని వర్ణింపబూనుట నిరర్థకము. అట్టి దానిని తెలియుట వ్యర్థము, తెలియుట అసంభవము. కావున, జ్ఞేయము అసత్ కాదని (న అసత్) భగవానుడు చెప్పినాడు. సత్ కాదు (న సత్) అని చెప్పుటచే

ఉనికి గల వస్తువులన్నియు నిషేధింపబడినవి. అనగా, ఇది ఒక వస్తువు కాదని మనకు అర్థమగు చున్నది. 'ఇది ఉన్నది', లేదా 'అది లేదు' అను జ్ఞానము ఈ జ్ఞేయమునకు వర్తించదు గనుక, దీనియందు సత్ అని గాని, అసత్ అని గాని విశేషణము అన్వయించదని శ్రీ శంకరులు వివరించిరి. ఆత్మ ఇంద్రియములకు గాని, మనస్సునకు గాని గోచరమయ్యే విషయవస్తువు కాదు. 'న సత్' అని మాత్రమే చెప్పి యున్నచో, దానిని గురించి మనము తెలియదగినది ఏదియు ఉండెడిది గాదు. కాని 'న అసత్' అని కూడ భగవానుడు జోడించినాడు గనుక, మనము దీనిని గురించి ఆలోచించవలసి యున్నది. ఈ రెండు వర్గములను తీసి ప్రక్కన బెట్టినచో, ఇక మిగిలి యున్నది నీవు మాత్రమేనని స్పష్టమగు చున్నది. జ్ఞేయము సత్ గాని, అసత్ గాని కాదు గనుక, 'ఇది ఉన్నది', లేదా 'ఇది లేదు' అని చెప్పే చేతనుడు మాత్రమే మిగిలి ఉన్నాడు.

'అది గలదు', 'ఇది లేదు' ఇత్యాది ప్రత్యయము (cognition) లకు స్వయంసిద్ధ-ఆత్మ విషయము (object) కాజాలదు. అట్టి ఆత్మయే జగత్కారణ-బ్రహ్మ యని ఇచట ప్రస్తుతింపబడు చున్నది. ఇంద్రియాదులచే తెలియ శక్యము కాని ఈ సత్యమును శబ్ద రూపములో నున్న స్వతంత్ర ప్రమాణమగు శాస్త్రము మనకు ప్రదర్శించు చున్నది. ఈ సత్యము ఇంద్రియాదులకు అతీతమైనది. అయిననూ నేను దానిని తెలియవలెను. ఇదెట్లు సంభవము? దీనిని తెలిపే ప్రమాణము శబ్దము. ఈ శబ్దము బుద్ధి యందు తన పనిని చేయును. ఏలయన, ఏ జ్ఞానమైనా బుద్ధిలోననే ఉదయించవలెను గదా! ఈ జ్ఞానము అనుమాన గమ్యము కాదు గనుక, బుద్ధి తనంత తానుగా ఈ జ్ఞానమును సంపాదించ లేదు. శ్రుతి శబ్దము ద్వారా బుద్ధి యందు వృత్తిని కలిగించును. ఆ వృత్తి బ్రహ్మ-ఆత్మ-అజ్ఞానమును తొలగించును. 'కలదు', మరియు 'లేదు' అను ద్వివిధ ప్రత్యయములకు ఘటాది వస్తువులు ఉపలభ్యమగు చుండును. కాని ఆత్మ అట్టి పదార్థము కాదు. ఆత్మ జ్ఞాత; బ్రహ్మ-అభిన్నము అని శాస్త్రము నిరూపించు చున్నది. కావున ఆత్మను తెలియ వలెను (జ్ఞేయము). ఏలయన, ఆత్మ తెలిస్తే మృత్యువు నుండి విముక్తి లభించును (అమృతం అశ్నుతే). ఆత్మ ప్రత్యక్ష-అనుమాన ప్రమాణములకు గోచరము కాదు గనుక, సత్ గాని, అసత్ గావి కాదు. అయినా, ఆత్మను తెలుసుకోవాలి. తెలుసుకొనుటకై మనకు శబ్ద ప్రమాణము గలదు.

ఇచట ఒక అభ్యంతరము గలదు. తెలియబడు దానికంటె, మరియు తెలియబడని దాని కంటె బ్రహ్మ అతీతమని (విదితాత్ అవిదితాత్ అధి) శ్రుతి చెప్పుచుండగా, అది జ్ఞేయమెట్లగును? నేను దేనిని తెలియవలెనో, దేనిని తెలిసి ముక్తుడనగుదునో, అది తెలియబడేది కాదు; తెలియబడనిది కాదు. ఇట్టి స్థితిలో నేను దానిని ఎరుంగుట ఎప్పటికైనా సంభవమేనా? ఒకడు

స్వర్గమును గోరి యజ్ఞమును చేయ సంకల్పించి, యజ్ఞశాలను కట్టినాడు. అవుడాతడు శాస్త్రములో 'స్వర్గము ఉన్నదా? లేదా?' అని చదివినాడు. ఇచటి పరిస్థితి అటులనే యున్నదని శ్రీ శంకరులు చమత్కరించిరి. శ్రీ శంకరులిట్లు సమాధానము నిచ్చిరి: స్వర్గము ఉన్నదా? లేదా? ఇత్యాది పునర్వర్ణన (restatement) వాక్యములు విధిని గుర్తుచేయుటకై ఉద్దేశింపబడినవి. 'విదితాత్ అవిదితాత్ అధి' ఇత్యాది వాక్యములు ఒక గంభీరమగు అర్థమును బోధించుటకై ఉద్దేశింపబడినవి. పదము లన్నియు ఒక భావమును అందజేయుటకు ఉద్దేశింపబడినదే గదా! శ్రోత ఒక పదమును విన్న వెంటనే, ఆ పదముచే నిర్దేశింపబడే వస్తువు వెంటనే అతనికి స్ఫురించును. ఇట్టి వస్తువులను నాల్గు వర్గములుగా విభజింప వచ్చును. జాతి, క్రియ, గుణము, సంబంధము. ఉదాహరణకు గోవు అను పదము జాతిని బోధించును. వాహకుడు అను పదము క్రియను, తెల్లనిది అను పదము గుణమును, పశుపాలకుడు అను పదము సంబంధమును బోధించు చున్నవి. బ్రహ్మ ఒక జాతికి చెందిన వస్తువు కాదు. కావున 'ఉన్నది' అని గాని, 'లేదు' అని గాని బ్రహ్మను బోధించుట సంభవము కాదు. బ్రహ్మ యందు గుణములేమియు లేవు (నిర్గుణమ్). క్రియను చేయుటకు అవశ్యకమగు వికారము లేవియూ బ్రహ్మ యందు లేవు (నిష్క్రియమ్). బ్రహ్మ ఒక వస్తువు గాదు. బ్రహ్మ కంటె భిన్నముగా రెండవ వస్తువు లేదు. కావున, బ్రహ్మకు ఇతరవస్తువుతో సంబంధము సంభవము కాదు. బోధించ దగిన తత్త్వము యొక్క స్వరూపమిట్లుండగా, ఏ పదములను ఉపయోగించి బోధించదగును? బ్రహ్మ సత్ కాదు; అసత్ కాదు.

ఆ బ్రహ్మను ఏ ఒక్క పదమైననూ నిర్దేశించ జాలదు. 'దేనిని దరిచేర జాలక వాక్కులు వెనుదిరుగు చున్నవో (యతో వాచో నివర్తంతే)' అని శ్రుతి చెప్పుచున్నది. శ్రుతి వాక్యములు తాము చేయగల్గిన ప్రయత్నమునంతనూ చేసి, బ్రహ్మను నిర్దేశించుట అసంభవమని గ్రహించి, మౌనమును దాల్చినవి. మాటలు వర్ణించ జాలని భావావేగములు మొదలగు వాటిని మనస్సు ఊహింపగల్గును. కాని బ్రహ్మ విషయములో పదములతో బాటు మనస్సు కూడా వెనుదిరిగినది (మనసా సహ). ఆత్మను తెలియుటకై మనస్సు వెనుకకు తిరుగవలెను. అది ఆత్మోన్ముఖము కాగానే అంతర్హిత మగును. అనగా, మనస్సు అంటే వృత్తులు తక్క మరియొకటి కాదు గదా! ఆత్మను తెలుసుకునే వృత్తికి ఆకారము ఉండదు (అఖండాకారా). ఆత్మను తెలుసుకునే ప్రయత్నమును మనస్సు స్వయముగా చేయలేదు. మరియు, ఆత్మానుభవము మనస్సుకు సంభవము కాదు. ఏలయన, మనస్సే ఆత్మ. ఆత్మ-అజ్ఞానమును తొలగించుటకు ఒకే ఒక వృత్తి చాలును. అజ్ఞానమును తొలగించి ఆ వృత్తి తాను కూడ తొలగిపోవును. ఆ వృత్తిని వేదాంత వాక్యము కలిగించును. కావున 'న సత్ తత్ న అసత్' అను వచనములో విరోధమేమియూ లేదు. దీనితో

నిషేధాత్మకమగు (negative) వర్ణనము పూర్తి అయినది. ఇంకనూ అన్వయ ముఖముగా (positive) వస్తు నిరూపణము మిగిలియున్నది.

బ్రహ్మ ఘటము వలె సచ్ఛబ్దవాచ్యము కాదు అనగానే, బ్రహ్మకు ఉనికి లేదేమో! య శంక కలుగును. ఈ శంకను నివారించుటకై భగవానుడు తరువాతి శ్లోకములో జ్ఞేయమగు బ్రహ్మ సర్వపదార్థములకు కారణాత్మక-ఉపాధి యని బోధించి, అది సద్వస్తువే య నిరూపించబోవుచున్నాడని శ్రీ శంకరులు శ్లోక-అవతారికలో ప్రస్తావించిరి:

**అధ్యాయము 13, శ్లోకము 13 :**

सर्वतः पाणिपादं तत् सर्वतोक्षिशिरोमुखम्।
सर्वतः श्रुतिमल्लोके सर्वमावृत्य तिष्ठति ॥ १३ ॥

సర్వతః పాణి పాదం తత్ సర్వతోక్షిశిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి (13).

**తత్** = ఆ జ్ఞేయ బ్రహ్మ, **సర్వతః పాణి పాదమ్** = అన్ని వైపుల యందును చేతులు కాళ్లు గలది, **సర్వతోక్షిశిరో ముఖమ్** = అన్ని వైపుల యందు కన్నులు, తలలు, నోళ్లు గలది, **సర్వతః శ్రుతి మత్** = అన్ని వైపుల యందు చెవులు గలది, **లోకే** = లోకము నందు, **సర్వమ్** = సర్వమును, **ఆవృత్య** = వ్యాపించి, **తిష్ఠతి** = ఉన్నది.

ఆ జ్ఞేయ బ్రహ్మ అన్ని వైపుల యందు చేతులు కాళ్లు, కన్నులు, తలలు, నోళ్లు మరియు చెవులు కలిగి, లోకము నందు సర్వమును వ్యాపించి యున్నది (13).

ఈ శ్లోకములో బ్రహ్మ సృష్టిలోని వస్తురూపములో ప్రస్తుతింపబడు చున్నాడని తలంచరాదు. బ్రహ్మ ఉపాధితో గూడి సర్వవస్తురూపములో భాసించు చున్నాడు. అనగా బ్రహ్మ అసత్ కాదని (న అసత్) స్పష్టమైనది. బ్రహ్మ సత్ కాదు (న సత్) అను విషయమును తరువాతి శ్లోకము ప్రదర్శించును. అధ్యారోప (superimposition), అపవాదము (negation) లచే సృష్టి అంతయూ మిథ్య అనియు, బ్రహ్మ సత్యమనియు తెలుసు.

ప్రపంచము కలదు అని మనము తలంచెదము. ఏ ఉనికిచే ఈ జగత్తునకు వ్యావహారికమగు సిద్ధించు చున్నదో, ఆ ఉనికి (పరమార్థ సత్యము) బ్రహ్మయే. సత్య-బ్రహ్మయే సర్వమునకు ని అనుగ్రహించుటచే, జగత్తునందు ఎన్నటికీ అభావ (non-existent) బుద్ధి కలుగుట లేదు. జ్ఞేయ-బ్రహ్మకు ఆది లేదని (అనాదిమత్) పూర్వశ్లోకములో చెప్పబడినది. అందువలననే నము లేకుండ నుండునని (తిష్ఠతి) ఈ శ్లోకములో చెప్పబడు చున్నది. ఈ ఒక్క పదము మును బోధించును. బ్రహ్మ పురాణమనియు, అనంతమనియు (పరమ) పూర్వము చెప్పబడి ది. అది సత్ గాని, అసత్ గాని కాదు గనుక, అదియే ఆత్మ యగును. ఈ జగత్తు బ్రహ్మము భిన్నముగా లేదు. బ్రహ్మ నిర్గుణ మనియు చెప్పబడినది. దీనిని బట్టి సృష్టి బ్రహ్మపై రోపితమని మనకు స్పష్టమగు చున్నది. నామ రూపములకు స్వతంత్రమగు ఉనికి లేదు. ట ఉనికి అంతయూ బ్రహ్మ యొక్క అనుగ్రహమే. ఏ ఒక్క వస్తువును విశ్లేషించిననూ, అది త్మ చైతన్యము (బ్రహ్మ)లో పర్యవసానమును చెందును. బ్రహ్మ కలదు; కాని ప్రపంచములోని ఇతర వస్తువుల వలె కాదు అని ముందుగా నిర్ధారించబడినది. జగత్తు అంతయూ బ్రహ్మమే. కావుననే, బ్రహ్మ కదలిక లేకుండగ నున్నది (తిష్ఠతి). బ్రహ్మ యందు కదలిక గాని, వికారము గాని లేవు. కాని చలన మంతయూ ఆ బ్రహ్మ లోపలనే ఘటిల్లు చున్నది. చలనము లేని బ్రహ్మ సర్వమును వ్యాపించి యున్నది (సర్వం ఆవృత్య తిష్ఠతి). బ్రహ్మ మాయోపాధిచే, ఈ సృష్టి రూపముగా పరిణమించినదా యన్నట్లు భాసించు చున్నది. మనము ఏ వస్తువును విశ్లేషించిననూ, అది చైతన్యములో పర్యవసానమును చెందును. కావున ఈ జగత్తు అంతయూ చైతన్యఘనమగు బ్రహ్మపై అధ్యారోపము చేయబడినట్లు మనకు స్పష్టమగు చున్నది. ఈ చైతన్యము సర్వమును పరిత్యజించి మిగిలి యుండును. కాని ఇతరమేదియు చైతన్యమును కాదని మనజాలదు.

ఇంతవరకు 'న సత్ న అసత్ అనాది మత్ పరం బ్రహ్మ' అని వర్ణింప బడిన ఆ జ్ఞేయ తత్త్వమునకు అన్ని వైపులా కాళ్ళు, చేతులు గలవని (సర్వతః పాణిపాదమ్) చెప్పబడు చున్నది. కాళ్ళు, చేతులు ఎక్కడ ఉన్ననూ, అవి బ్రహ్మ యొక్క కాళ్ళ చేతులే. ఒకే ఒక చైతన్యము పంచభూతాత్మకమగు ఈ సమస్త సృష్టి రూపమున నున్నది. పంచభూతములే కాళ్ళు, చేతులు ఇత్యాదిగా అయినవి. కావున ఇవి అన్నీ పరబ్రహ్మ తక్క మరియొకటి గాదు. పురుష సూక్తములో ఇదే విషయము మరింత విస్తారముగా ప్రతిపాదించబడినది. పురుషునకు అసంఖ్యాకములగు తలలు, కన్నులు మరియు పాదములు గలవు (సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్). అచటి సహస్ర శబ్దము ఇచటి సర్వతః అను పదము సమానార్థకములు. చేతులు, కాళ్ళ అన్నీ, నావీ దోమవి కూడా కలిపి, బ్రహ్మ తక్క మరియొకటి కాదు. మరియు బ్రహ్మకు అన్నివైపులా కళ్ళ

గలవు (సర్వతః అక్షి). ఈ భూగోళములో మాత్రమే గాక, ఇతర లోకములలో కూడ ఎన్ని కళ్లు గలవో, అవి అన్నియూ అయనవే. మరియు తలలు, నోళ్లు (లేదా ముఖములు) అన్నీ అయనవే (సర్వతోక్షి శిరోముఖమ్). లోకములోని (లోకే) చెవులు అన్నియు అయనవే (సర్వతశ్రుతిమత్) వివిధ-అవయవముల కలయిక యగు స్థూలదేహము ఎచట నున్ననూ, అది బ్రహ్మమే. కళ్లను, చెవులను ప్రస్తావించుటచే, స్థూలదేహము మాత్రమే గాక, సూక్ష్మ దేహము కూడా స్వీకరింపబడును. కావున, సర్వ స్థూల సూక్ష్మ ప్రపంచములు బ్రహ్మలో అంతర్భాగమగును. ఆత్మ-అభిన్నమగు బ్రహ్మ ఈ సర్వమును వ్యాపించి యున్నాడు (సర్వమావృత్య తిష్ఠతి). కావున బ్రహ్మ పూర్ణమని మనకు తెలియచున్నది. సర్వమును చెప్పుట సంభవము కాదు గదా! కావున చేతులు, కాళ్లు, కన్నులు, చెవులు అన్నీ బ్రహ్మవే యని చెప్పి కొద్ది గంభీర వచనములలో ఒక సమగ్ర దర్శనమును మనకు ఈ శ్లోకము ఇచ్చుచున్నది. ఎట్టి దర్శనమైననూ సర్వదా ప్రభావ పూర్ణమగు చిన్ని ప్రసంగములో ప్రస్తుతింపబడును. వేదాంత దర్శనము కూడ అంతే. ఆ తరువాత క్రమముగా ఆ దర్శనము విశ్లేషింప బడును. దేహేంద్రియ మనస్సంఘాతములనే ఉపాధుల ద్వారా ఇచట క్షేత్రజ్ఞుని ఉనికి నిర్ధారింప బడుచున్నదని శ్రీ శంకరులు భాష్యములో వివరించిరి. భగవానుడు ప్రాణులను మాత్రమే ఏల ఎన్నుకొనినాడు? పర్వతములు మొదలగు వాటిని ప్రస్తావించి యుండవచ్చును గదా? పర్వతములు, నదులు మొదలగు వాటిని అయన ఇచట స్వీకరించి యున్నచో, బ్రహ్మ జడము కాదని విశేషించి చెప్పవలయును. ప్రాణులను ప్రస్తావించి, బ్రహ్మ చేతన స్వరూపమని అయన నిర్ధారించినాడు.

ఉపాధులన్నియు స్వభావతః మిథ్య. ఏలయన, ఉపహిత (ఆశ్రిత) వస్తువు లేనిదే ఉపాధి (నిర్ధారకము) లేదు.' ఉదాహరణకు రంగు వస్త్రము అనే ఉపాధి సమీపములో స్ఫటికము రంగుగలది వలె నిర్ధారింపబడు చున్నది. సర్వహస్తములు, సర్వపాదములు ఇత్యాదులు బ్రహ్మకు ఉపాధియని నిరూపించుట ద్వారా క్షేత్రజ్ఞ-బ్రహ్మ గలదని స్థాపించబడి, బ్రహ్మ యొక్క అభావము త్రోసిపుచ్చబడినది. క్షేత్రమును బట్టి మాత్రమే బ్రహ్మకు క్షేత్రజ్ఞుడను పేరు వచ్చినది. ఈ క్షేత్రము ఏదో ఒకటి మాత్రమే అనుకోరాదు. ఏలయన క్షేత్రము లన్నింటియందు నన్ను తెలుసుకొనుము (సర్వక్షేత్రేషు మాం విద్ధి) అని భగవానుడు ముందుగనే చెప్పియున్నాడు. సర్వక్షేత్రములలో ఒకే బ్రహ్మ గలదు. అదియే సత్యము. అవగా ఇతరము సర్వము ఉపాధి యగును.

ఈ దేహములన్నియు విశిష్ట స్వీయగుణములు కలిగియున్నవి. ప్రతి దేహమునకు తనదైన వైలక్షణ్యము గలదు. మిథ్యా భూతములు, పరస్పర విలక్షణములు అగు ఈ ఉపాధుల వలన బ్రహ్మ

రూపములలో నున్నట్లు కన్పట్టును. రంగు వస్త్రమునకు సమీపములో నున్న స్ఫటికము రంగు గలది వలె కన్పట్టును. అదే తీరున మిథ్యా-ఉపాధులచే కల్పింపబడిన ఈ భేదములు కూడ మిథ్యయే యగును. స్ఫటికములోని రంగు మిథ్య. దానితో పోలిస్తే, స్ఫటికము సత్యము. కాని దృష్టాంతములో ఒక లోపము గలదు. అంతతో గత్వా (ultimately) స్ఫటికము కూడ మిథ్యయే యగును. కావున ఉపాధి గుణములు మిథ్య అనియు, ఉపాధి సత్యమనియు చెప్పరాదు. గుణములవలె ఉపాధి కూడ మిథ్యయే. ఇచటి ప్రధానతాత్పర్యమేమనగా, ఉపాధి గుణములచే కల్పించబడిన నానారూపములు మిథ్య. స్థూలదేహములలో, ఇంద్రియములలో మరియు మనస్సులలో గల భేదములను బట్టి ఆత్మయందు భేదములున్నట్లు కన్పట్టు చున్నది. ఒకే బ్రహ్మ గుణములతో గూడిన విభిన్న దేహముల రూపములో కానవచ్చు చున్నది. దేహేంద్రియ సంఘాతరూపమగు క్షేత్రము మిథ్య అనియు, క్షేత్రము యొక్క యథార్థత బ్రహ్మమేననియు ఇంతకు ముందే నిరూపించ బడి యున్నది. స్థూలదేహమును విశ్లేషించినచో, కణములు మిగులును; అనగా కణ సమూహము కంటె భిన్నముగా స్థూలదేహము అనే వస్తువు లేదని తెలుసు. కణములు డి. ఎన్. ఏ (DNA) లో అంతర్గతమగును. ఈ విధముగా విశ్లేషించు కుంటూ పోతే, నిర్విశేషసత్త (existence pure) వద్దకు చేరెదము. దానిని ఇంకో దానిలో పర్యవసానము చేయుట సంభవము కాదు. అది మాత్రమే సత్యము. మిగిలిన దంతయూ మిథ్య. ఈ విశేషణములన్నియూ మిథ్యయని తెలియగానే, మనము ఆ మిథ్యను బాధించి, సత్యమును దర్శించెదము.

మట్టికి అనేక రూపములు గలవు. ఈ రూపములన్నియు మిథ్యయని దర్శించగానే, మట్టి సత్యము అగును. అదే విధముగా సర్వ ఉపాధులు, మరియు చేతులు, కాళ్లు, కన్నులు, చెవులు ఇత్యాది వాటి విశేషణములన్నియు మిథ్యయని దర్శించినచో ఈ మిథ్యా ప్రపంచమునకు అధిష్ఠానమగు సత్యవస్తువు (బ్రహ్మ) మిగిలి యుండును. ప్రస్తావింపబడేది మిథ్యయే అయినా, సత్యము లేనిదే మిథ్య మనజాలదు గనుక, తద్ద్వారా సత్యము ప్రకటమగును. మిథ్య తన ఉనికి కొరకై సత్య-అధిష్ఠానముపై ఆధారపడి యుండుట దాని స్వభావము. బ్రహ్మను జగత్-ఉపాధి రూపములో ప్రస్తుతింపుట ద్వారా బ్రహ్మ యొక్క ఉనికిని ప్రస్తుతించినట్లే యగును. చెవులు కన్నులు ఇత్యాది సర్వము బ్రహ్మమే. అనగా అవి ఏమియూ బ్రహ్మ కంటె భిన్నముగా లేవు. కాని, అవి బ్రహ్మ యొక్క స్వరూప ధర్మములు కావు. అవి బ్రహ్మ యందు ఆరోపింపబడిన ఉపాధి ధర్మములు మాత్రమే. సంప్రదాయ బద్ధమగు బోధనా ప్రక్రియ నెరింగిన వారు (సంప్రదాయ విదః) ఇట్లు చెప్పెదరు: అధ్యారోప-అపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే. అనగా అధ్యారోప, అపవాదములచే ఈ పాంచభౌతిక జగత్తు నుండి వినిర్ముక్తమైన తత్త్వము ప్రదర్శింపబడుచున్నది.

మన చేతులు, కాళ్లు ఇత్యాదులన్నియు బ్రహ్మ యొక్క గుణములా యన్నట్లు అధ్యారోప
చేయబడి తరువాత నిషేధింపబడును.

ఇచట ఒక విరోధము ఉన్నట్లు కన్పట్టును. బ్రహ్మ సత్ గాని, అసత్ గాని కాద
ముందుగా చెప్పబడినది. అనగా బ్రహ్మ యందు గుణములు ఏమియూ లేవనియే (నిర్గుణమ్
గదా! 'ఉన్నది' అను రూపములో కానవచ్చే సర్వపదార్థములకు గుణములు గలవు. బ్రహ్మ
గాని, అసత్ గాని కాదు. శూన్యము కూడ కాదు. ఏలయన, జ్ఞేయం బ్రహ్మ అని భగవాను
ముందుగనే చెప్పి యున్నాడు. కావున ఈ బ్రహ్మ నిర్గుణమగు ఆత్మయేనని మనకు స్పష్టమగ
చున్నది. ఈ బ్రహ్మకు కాళ్లు, చేతులు, కళ్లు, చెవులు ఇత్యాదులన్నియు గలవనియు, బ్రహ్మ సర్వ
జగద్రూపముగా నుండియు నిశ్చలముగా నున్నదనియు తరువాత భగవానుడు చెప్పుచున్నాడు.

బ్రహ్మ యొక్క ఉనికిని, మరియు దాని మహిమలను ఇవి అన్నీ సూచించు చున్నవని శ్రీ శంకరులు వివరించిరి. చేతులు, కాళ్లు దేహమునకు అలంకార ప్రాయములగు అవయములు కాదు. వాటికి కొన్ని శక్తులు గలవు. కొన్ని కార్యములను నిర్వహించుటకై అవి ఉద్దేశింపబడినవి. అదే విధముగా కళ్ళు, చెవులు మొదలగు ఇంద్రియము లన్నింటికీ విశిష్టశక్తులు గలవు. సర్వజగత్కారణమగు బ్రహ్మ యందు సృజన శక్తి త్రివిధముగా నున్నది. తెలియ గలిగే శక్తి (జ్ఞాన శక్తి), సంకల్పించ గలిగే శక్తి (ఇచ్ఛా శక్తి), పని చేసే శక్తి (క్రియా శక్తి). ఇవి కార్యమునందు ప్రకటితమగును. చేతులు క్రియాశక్తికి, ఇంద్రియములు జ్ఞాన శక్తికి అభివ్యంజకములు. ఈ శక్తులు మనకు దృష్టిగోచరమగు చున్నవి. దీనిని బట్టి అవి కారణము నందు ఉండి యుండునని స్పష్టమగు చున్నది. కార్యము నందు కారణధర్మములు ఉండి తీరును. ఒక ప్రాణికి కారణము మరియొక ప్రాణి యగును. మట్టి కుండ మట్టినుండి పుట్టి, మట్టి యొక్క గుణములను కలిగియుండును. ప్రతి వ్యక్తి యందు మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అను కరణములు (instruments) గలవు. ఈ శక్తులన్నియు వాటి ద్వారా అభివ్యక్తమగు చుండును. ఈ కార్యశక్తులు స్వీయ కారణమునందు గల శక్తుల నుండి మాత్రమే ఉద్భవించును గనుక, ఇవి కారణము నందు కూడ తప్పని సరిగా ఉండును. కావున ఈ శక్తులతో నిండి యున్న బ్రహ్మ గలదు. చేతులు, కాళ్లు మొదలగునవి అన్నియు బ్రహ్మవే అయినా, ఈ సృష్టిలోని ఒక వస్తువు రూపములో గాక, బ్రహ్మ సమస్త సృష్టి రూపములో నున్నాడు. అచలమగు బ్రహ్మ సర్వమును వ్యాపించి యున్నది. ఇది కారణము కార్యముగా పరిణమించే సర్వేశ్వర వాదము కాదు. సృష్టి అంతయూ పరమేశ్వరుడను మాట వాస్తవమే. కాని సత్య-జ్ఞాన-అనంత-బ్రహ్మ యగు పరమేశ్వరుడు ఈ

ర్వమునకు అతీతుడు. జగత్కారణము జగద్రూపముగా పరిణమించినదని మనము చెప్పుటలేదు. కారణము కంటె భిన్నముగా జగత్తు లేదని మనము చెప్పుచున్నాము. మనచే జగత్తు అని పిలువబడేది మిథ్య. దేశ-కాలముల చట్రము (time-space framework) మిథ్య అగు చుండగా, ఆ చట్రములోపల ఇమిడి ఉండే సర్వము మిథ్య గాక మరి యేమి అగును? ఉదాహరణకు, 'దేహము' అను శబ్దముచే బోధింపబడే విశిష్ట వస్తువు ఏదీ లేదు. చర్మము, మాంసము, నాడులు, ఎముకలు, మజ్జ ఇత్యాది పదములన్నీ బోధించే ఆయా వస్తువులను తొలగించినచో, దేహము అనే వస్తువు మిగులనే మిగులదు. మరియు, చర్మము ఇత్యాది వస్తువులను కూడా వాటి మూల ద్రవ్యములో పర్యవసన్నము (reduced) చేయవచ్చును. మజ్జను విశ్లేషించినచో, అది తయారగుటకు ఉపకరించిన పదార్థము మాత్రమే మిగిలి యుండును. కావున, అదియే సత్యము అగును. ఈ తీరున సర్వవస్తువులు అణువులుగనో, లేక ధారణలు (concepts) గనో పర్యవసానము చెందును. ఏది మిగిలి యుండునో అదియే సత్యము అగును.

నీవు ఒక వస్తువును చూచినప్పుడు కలిగిన వస్తు జ్ఞానము యొక్క స్వరూపమేమి? వస్తుజ్ఞానము కలగాలంటే, బుద్ధి వృత్తి పుట్టవలెను. వృత్తి ఉదయించి నశించుటలో కొంత కాలము గడుచును. ఆ కొంత కాలమును ఈ క్షణములో పరిశీలించినచో, ఆ కాలవ్యవధి అంతర్థానమై చైతన్యము మాత్రమే మిగులును. అదియే సత్యవస్తువు. ఈ కాలవ్యవధిలో ఘటిల్లే విషయములకు మాయా అని పేరు. వాటి సత్యత్వశ్రేణికి మిథ్య అని పేరు.

ఈ అంశమును తరువాతి శ్లోకము స్పష్టీకరించు చున్నది.

**అధ్యాయము 13, శ్లోకము 14 :**

सर्वेंद्रियगुणाभासं सर्वेंद्रियविवर्जितम् ।
असक्तं सर्वभृच्चैव निर्गुणं गुणभोक्तृ च ॥ १४ ॥

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ (14).

సర్వ-ఇంద్రియ-గుణ-అభాసమ్ = అన్ని ఇంద్రియముల యొక్క గుణముల రూపములో ప్రకాశించునది, సర్వ-ఇంద్రియ-వివర్జితమ్ = అన్ని ఇంద్రియముల నుండి విముక్తమైనది, అసక్తమ్ = సంగము లేనిది, చ ఏవ = మరియు నిశ్చయముగా, సర్వభృత్ =

సర్వమును పాలించి పోషించునది, నిర్గుణమ్ = (త్రి) గుణములు లేనిది, చ = మరియు, గుణభోక్తృ = గుణములను భోగించునది.

అన్ని ఇంద్రియ గుణముల రూపములో ప్రకాశిస్తూ అన్ని ఇంద్రియముల నుండి వియుక్తమైనది, సంగము లేనిదయ్యు సర్వమును పాలించి పోషించునది, త్రిగుణ రహితమయ్యు గుణములననుభవించునది (14).

జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియములు కలిసి సర్వేంద్రియములు అగును. జ్ఞానేంద్రియములు గాని, కర్మేంద్రియములు గాని అంతఃకరణము లేనిదే పని చేయజాలవు. కావున, సంకల్ప వికల్పములు (మనస్సు), నిశ్చయము (బుద్ధి) ఇత్యాది వివిధ కార్యములను నిర్వర్తించే అంతః కరణమును కూడ జతచేయవలెను. అంతః కరణము అనే ఉపాధి సహకారముతో, చెవులు, కన్నులు ఇత్యాది ఇంద్రియోపాధులు జీవునకు ప్రత్యక్ష జ్ఞానార్జనలో తోడ్పడును. చేతనాయుతమగు మనస్సు ముందుగా సిద్ధించి, ఆ మనస్సు ఇంద్రియములతో తాదాత్మ్యమును పొందినప్పుడు మాత్రమే అవి స్వీయవిశిష్ట సామర్థ్యములను పొందగలవు. శ్రీ శంకరులీ గుణములలో కొన్నింటిని చెప్పినారు. అనిశ్చితత్వము, సంకల్ప వికల్పములు మనో లక్షణములు. ఈ అనిశ్చితత్వము తొలగి దానిని అనుసరించి కలిగే నిశ్చయము (నిశ్చయాత్మికా అంతః కరణవృత్తిః) బుద్ధి యగును. ఈ సర్వ–ఇంద్రియ–గుణముల రూపములో జ్ఞేయబ్రహ్మయే ప్రకాశించుచున్నది. అదియే ఆత్మయని ఇంతకు ముందే నిరూపించబడినది. బ్రహ్మ ఎచట ఉన్నది? కన్నులు, చెవులు ఇత్యాది సర్వ–ఇంద్రియ కార్యములలో బ్రహ్మ ఆయారూపములలో వెలిగిపోవుచున్నది. నీవు చూచే సమయములో కన్ను అనే ఇంద్రియము యొక్క దర్శన సామర్థ్యరూపములో బ్రహ్మ ప్రకాశించు చున్నది.

బ్రహ్మ సర్వ–ఉపాధి రూపములో కానవచ్చునని ముందుగా చెప్పబడినది. ఉపాధి గుణముల రూపములో కూడ బ్రహ్మయే గలదని ఈ శ్లోకములో నిరూపించబడినది.

దీనిలో ఒక సమస్య గలదు. బ్రహ్మయే సర్వదా ఈ రూపములలో అభివ్యక్తమగు చున్నచో, ఈ గుణములన్నియు బ్రహ్మకు సహజములైనచో, మరియు ఆ బ్రహ్మ ఆత్మయే యైనచో, నేను చూచుట, వినుట మరియు మాటలాడుట ఇత్యాది కార్యములెన్నటికీ ఆపజాలను. కావుననే, భగవానుడిట్లు చెప్పుచున్నాడు: బ్రహ్మ సర్వేంద్రియ వినిర్ముక్తము (సర్వేంద్రియ వివర్జితమ్). కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు మరియు మనస్సు అను సర్వము నుండి బ్రహ్మ వినిర్ముక్తమై

న్నది. ఇందువలననే వాటికి ఉపాధులని పేరు. ఒక స్ఫటికము సహజముగా నీలివర్ణము డైనచో, అది ఉపాధికృతము కాదు. కాని స్వచ్ఛమగు స్ఫటికము నీలివర్ణము గల వస్తువునకు మీపములో నున్నదనుకొనుడు. అపుడు ఆ వస్తువు స్ఫటికమునకు ఉపాధియగును. అనగా స్ఫటికము నీలముగా కన్పట్టుటకు కారణము ఆ వస్తువు అగును. అదే విధముగా సర్వేంద్రియ గుణములు బ్రహ్మ యందు ఉన్నట్లు కన్పట్టినను, బ్రహ్మ ఇంద్రియములకు, వాటి గుణములకు అతీతుడై యుండును. ఇది ఒక విరోధాభాసము. కాని ఈ సత్యమును ఈ విధముగా మాత్రమే నిరూపించుట సంభవమగును. ఆత్మ దేహాదులకు అతీతమైనచో, నాకు దేహము ఉండుటకు కారణమేమి? సత్యము తెలియనంతవరకు ఈ విరోధాభాసములు కొనసాగును. వాటిని వివరించు వరికి విరోధము అదృశ్యమగును. కాని అనంత బ్రహ్మ యొక్క స్వరూపమును నిరూపించుటలో ఈ విరోధాభాసలకు చాల ప్రముఖమైన స్థానము గలదు. బ్రహ్మ కాలాధీనము కాదు. ఇతరము సర్వము తన ఉనికి కొరకై బ్రహ్మపై ఆధారపడును. ముందుగా ఇంద్రియ గుణములన్నియు బ్రహ్మపై అధ్యారోపము చేయబడినవి (సర్వ-ఇంద్రియ-గుణ-ఆభాసమ్). అపుడు బ్రహ్మ ఇంద్రియములన్నిటి నుండి వినిర్ముక్తము (సర్వ-ఇంద్రియ-వివర్జితమ్) అని చెప్పి అపవాదము చేయబడినవి. ఈ అధ్యారోప అపవాదములచే బ్రహ్మ యొక్క యాథార్థ్యము నిరూపించబడినది.

నిష్క్రియమగు బ్రహ్మ సర్వ-ఇంద్రియ-వ్యాపారములను బట్టి సక్రియమా యున్నట్లు కన్పట్టు చున్నది. ఆత్మ ధ్యానించుచున్నట్లు (ధ్యాయతి ఇవ), ఉత్తేజితమై యున్నట్లు (లేలాయతి ఇవ) కానవచ్చు చున్నదని శ్రుతి చెప్పుచున్నది. ఈ సూత్రము సర్వకర్మలకు వర్తించును. దీనికి అపవాదము లేదు. బ్రహ్మ ఆకలి గొన్నదా యన్నట్లు ఉండుటచే, తినుచున్నదా యన్నట్లు ఉండును. సంసారమంతయూ మిథ్యా సత్యముల కలయిక. వాస్తవంలో ఇట్టి కలయికకు అవకాశమే లేదు. కావుననే విరోధాభాసలు చెలరేగు చుండును. ఆత్మ క్రియాశీలము కాకున్నను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనో వ్యాపారములను బట్టి క్రియాశీలమా యున్నట్లు గోచరించును. ఆత్మ సన్నిధి లేనిచో, ఈ వ్యాపారములేవియూ ఘటిల్లవు. దీనిని బట్టి రెండు తత్త్వములు గలవనియు ఆత్మను చేరుటకై ఈ ఇంద్రియములన్నిటిని అధిగమించవలయుననియు తలంచరాదు. ఆత్మ క్రియాశీలయా కన్పట్టినను సర్వాతీతముగ నుండును. అందువలననే ఆత్మ ఆభాసయని శ్రుతి చెప్పుచున్నది. ఇంద్రియములు, మనస్సు మొదలగు వాటి వ్యాపారములలో అభివ్యక్తమయ్యే ఆత్మ క్రియాశీలయా యున్నట్లు కన్పట్టినను, యథార్థముగా సక్రియము కాదు. ఈ భేదమును స్పష్టముగా గుర్తించవలెను లేనిచో, క్రియాశీలమగు తత్త్వము ఒకటి, అట్లు కానిది మరియొకటి అను ద్వైతము వచ్చును. ఆత్మ-సత్త లేనిచో ఈ ఇంద్రియములకు ఉనికి లేదు. ఆత్మ చైతన్యము

లేనిదే అవి స్వీయ వ్యాపారములను చేయలేవు. చైతన్య ఘనమగు ఆత్మను ఈ ఇంద్రియాదులు ప్రతిబింబించి తమ వ్యాపారమునందు సమర్థములగును. వాటిలో ఏ ఒక్క దాని ఉనికియైననూ సద్ఘనమగు ఆత్మకు దూరముగా లేదు.

శ్రీ శంకరులింకనూ ఇట్లు వివరించిరి: ఆత్మ-అభిన్నమగు బ్రహ్మ సర్వదా క్రియాశీల రూపములో నుండునని తలంచరాదు. అట్లైనచో, క్రియలను ఆపివేసినచో, ఆత్మకు అస్తిత్వము లేకుండను. కాని మనము క్రియలను ఆపివేయుచుందుము. మరియు ఒక క్రియనుండి మరియొక క్రియలోనికి మారుచుందుము. ఆత్మ సక్రియము కాదు గనుకనే, ఇది సంభవమగు చున్నది. ''చేతులు లేకుండగనే (ఆత్మ) పట్టుకొనును; కాళ్లు లేకుండగనే పరుగులెత్తును; కన్నులు లేకుండగనే చూచును (అపాణిపాదో జవనో గ్రహీతా పశ్యత్యచక్షుః)'' అని శ్రుతి కూడ చెప్పుచున్నది. ఆత్మ సర్వోపాధి వినిర్ముక్తమనియు, కాని సర్వదా ఉపాధి-అనురూపముగా అభివ్యక్తమగు చుండుననియు దాని యర్థము. చేతులతో గూడి అది పట్టుకొనును. కాళ్లలో చేరి నడచును. చెవులలో దూరి వినును. కావున, సర్వేంద్రియ గుణాభాసమ్, సర్వేంద్రియ వివర్జితమ్ అను రెండు వచనములు పొసగియున్నవి. విరోధమేమియూ లేదు. కాని అర్థము తెలియనంతవరకు విరోధము ఉన్నట్లు కన్పట్టును. మనము మిథ్యాసత్యములతో వ్యవహరించు చున్నాము గనుక, అధ్యారోప-అపవాదములను చేయవలెను. ఉపాధి యొక్క దృష్టికోణములో ఆత్మ కర్మలనన్నిటినీ చేయును. కాని స్వరూప దృష్ట్యా ఆత్మ నిష్క్రియము. శ్రుతి వాక్యములో విరోధము భాసించినప్పుడు మనము ప్రకరణమును పరిశీలించవలెను. అది శ్రుతివాక్యము గనుక, దానిని సరిగా అర్థము చేసుకొనవలసిన ఆవశ్యకత గలదు. బుద్ధిమంతుడగు ఒక వ్యక్తి 'తెల్లనిది పరుగెత్తు చున్నది' అని పలికినాడు. ఆ వాక్యము అర్థరహితమని త్రోసిపుచ్చుటకు వీలు లేదు. సందర్భమును పరిశీలించిన పిదప 'తెల్లని గుర్రము పరుగెత్తు చున్నది' అనే అతని అభిప్రాయము నాకు విదితమయ్యెను. అతడు పలికిన వాక్యములో ఆ అభిప్రాయము అంతర్నిహితమై ధ్వనించు చున్నది. ఇట్టి వాక్యమునకు లక్షణా-వాక్యమని పేరు. సర్వేంద్రియ వివర్జితమ్ అనే లక్ష్యార్థమునకు సర్వేంద్రియ గుణాభాసమ్ అనునది లక్షణమని మనకు స్పష్టమగు చున్నది.

బ్రహ్మ సర్వేంద్రియ వివర్జితము గనుకనే, అసంగము. ఆత్మకు మనస్సుతో గాని, ఇంద్రియములతో గాని సంయోగము లేదు. కావుననే, మనస్సు, మరియు ఇంద్రియముల ద్వారా జగత్తుతో ఆత్మకు సంయోగము లేదు. స్థూల దృష్టితో చూస్తే, వ్రేలికి ఉంగరమును వలె ఒక వస్తువును మరియొక వస్తువుతో సంయోగపరచ వచ్చును. ఇంతే గాక, ప్రపంచముపై

మానసిక-ఆసక్తి ఇత్యాది ఇతర రకముల సంయోజనములు కూడ గలవు. జీవితములో ఇవి తప్పని సరి యగును. కాని ఒకానొక విశిష్ట వస్తువు లేనిచో, జీవితము శూన్యమని భాసించినచో, ఆ వస్తువు ఒక ఆవేశము (obsession) గా మారినదని మనము తెలుసుకొనవలెను. ముందుగా పరిచయము, తరువాత స్నేహము, తరువాత ప్రేమ, తరువాత ఆవేశము, లేదా ఉన్మత్తత నిర్మాణమగును. వస్తువు ప్రేమాస్పదము అను స్థాయి వరకు సమస్య లేదు. కాని అది ఆవేశ స్థాయికి ఎదిగినప్పుడు, దానికి సంశ్లేషము అని పేరు. మనము దేహ-ఇంద్రియ-మనస్సుల ద్వారా జగత్తుతో సంయోగమును పొందుచున్నాము. కాని ఆత్మ సర్వ-ఇంద్రియ-వివర్జితము. ఆత్మకు ఇంద్రియములు మొదలగు వాటితో సంయోగము లేదు గనుక, ఆత్మ అసంగముగ (అసక్త) నుండును.

ఆత్మ అసంగమే అయినా, సర్వమును నిలబెట్టుట ద్వారా సర్వముతో ఒక రకమైన సంయోగమును కలిగియున్నదని చెప్పవచ్చును (సర్వభృత్ ఏవ చ). ఇది త్రాడు సర్పమును నిలబెట్టినట్లు అని చెప్ప వచ్చును. ఏలయన, త్రాడు లేనిదే సర్పము లేదు గదా! మిథ్య సర్పము సత్యముపై ఆధారపడి యుండును. మనస్సు పనిచేయు సమయములో చైతన్యము దానికి అధిష్ఠానమై దానిని నిలబెట్టుచున్నది. అంతే గాక సర్వ-అధిష్ఠానమగు ఆత్మ ఇంద్రియములకు, మరియు సర్వసృష్టికి ధారకమగుచున్నది.

సర్వము యొక్క ఉనికి సదాత్మ యందు గలదు. ఏలయన, మనకు తెలిసిన, మరియు తెలియని సర్వములో 'ఉన్నది' అను ప్రత్యయము (cognition) గలదు. ముందుగా 'ఉన్నది' అనునది సిద్ధమగును. ఆ తరువాత ఇతరము ఏదైననూ సిద్ధించును. 'ఉన్నది' అనే ఉనికి స్వయంసిద్ధము. ఇతరము సర్వము ఆ ఉనికిపై ఆధారపడి జ్ఞానములో విషయమగు చుండును. ఎండమావులలోని నీరు వంటి కల్పిత వస్తువునకు కూడ ఆధారము లేకపోలేదు. మనము త్రాటిని చూచి పాము అని భ్రమపడెదము. ఆ పాము త్రాటిపై ఆధారపడి యున్నది. అనగా ఆ పాము యొక్క ఉనికి త్రాటి యొక్క ఉనికి కంటె వేరుగా లేదు. ఈ సర్వము ధరింపబడి యున్నది. ధరించు అంశము ఒకటి ఉండవలెను. అదియే బ్రహ్మ.

ఇచట ఒక సమస్య గలదు. మాయకు ఆధారము బ్రహ్మ. మాయ త్రిగుణాత్మకము. కావున బ్రహ్మ యందు కూడ మూడు గుణములు ఉండవా? ఉండవని నిషేధించుటకై బ్రహ్మ నిర్గుణమని భగవానుడు చెప్పుచున్నాడు. త్రిగుణాత్మకమగు మాయతో గూడి బ్రహ్మ జగత్కారణమగుననుటలో సందేహము లేదు. కాని సత్యం జ్ఞానం-అనంతమ్ బ్రహ్మ స్వరూపము.

మిథ్యాభూతమగు సృష్టికి ఉపాదాన-పరిణామి-కారణమగు మాయ కూడ మిథ్యయే. కావున బ్రహ్మ సర్వ-గుణ-వినిర్ముక్తుడై యుండును.

కాని అదే సమయములో ఈ జ్ఞేయ-బ్రహ్మ గుణములననుభవించును (గుణభోక్తృ). సత్త్వము, రజస్, తమస్ అను మూడు గుణములు జ్ఞానేంద్రియముల ద్వారా వివిధ రకముల అనుభవములను సృష్టించును. సత్త్వము కొద్ది సుఖమును, లేక ప్రశాంతిని ఈయగల్గును. అన్నిరకముల అందోళనలకు రజస్ కారణము. మోహమునకు, జడత్వమునకు తమస్ కారణము. జ్ఞేయబ్రహ్మయగు ఆత్మ ఈ గుణవికారములనన్నింటినీ అనుభవించును. మనము సత్త్వరజస్తమస్సులను సాక్షాత్తుగా అనుభవించజాలము. వాటి వికారములను మాత్రమే మనము అనుభవించ గల్గుదుము. కావున బ్రహ్మను తెలియుటకై బ్రహ్మలో ఏదో ఒక మార్పు వచ్చి వికారము అగునంతవరకు వేచి యుండ పని లేదని దీని అభిప్రాయము. ఒక విశిష్ట-అనుభవమును మనము భోగించే సమయములో, ఆ అనుభవము కూడ జ్ఞేయ-బ్రహ్మయే. బ్రహ్మ మూలకముగా మాత్రమే ఆ అనుభవము సంభవమగు చున్నది. సత్ వలన మాత్రమే దానికి అస్తిత్వము సిద్ధించినది. ఆ అనుభవము చిత్ కంటె భిన్నము కాదు. దానిలో గల సుఖలేశము ఆనందమే. ఒక చోట ఇట్లు చెప్పబడినది: అస్తి భాతి ప్రియం రూపం నామ చ ఇతి అంశపంచకమ్. ఉన్నది (అస్తి), తెలియబడు చున్నది (భాతి), ప్రియమైనది (ప్రియమ్), రూపము మరియు నామము అనునవి బ్రహ్మ యొక్క అయిదు 'అంశములు'.

సర్వము బ్రహ్మయే గనుక, ఈ అయిదింటిని మించి ఏదీ లేదు. మొదటి మూడు బ్రహ్మ యొక్క స్వరూపము గనుక, వాటిలో మార్పు లేదు. ఆఖరి రెండింటిలో మార్పులు వచ్చుచుండును. కాని మొదటి మూడు వాటి యందు తప్పని సరిగా అంతర్నిహితములై యుండును. ఉదాహరణకు పుష్పము కలదు; తెలియబడు చున్నది; ప్రేమకు ఆస్పదమగు చున్నది. మరియు దానికి ఒక రూపము, ఒక పేరు గలవు. ప్రేమ పాత్రములు కాని వస్తువులు కూడా ప్రియమే. ఏలయన, వాటిపై మనకు గల అరుచి, ఆనంద-అభావము జీవుని స్వరూపమునకు విరుద్ధము అను సత్యమును మాత్రమే ప్రతిబింబించు చున్నది. వస్తువులన్నింటిలో ఈ అస్తి-భాతి-ప్రియమ్ సమముగా నున్నవి. నామ రూపములలో మాత్రమే భేదములు గలవు. వాటికే జగత్తు అని పేరు. సత్ మూలము గనే జగత్తు గలదు; చిత్ వలన జగత్తు తెలియబడు చున్నది; మరియు ఆనంద మూలకముగా సుఖానుభూతిని కలిగించు చున్నది. కావున సచ్చిదానందము సర్వవస్తువులలో గలదు. నిర్గుణ బ్రహ్మ యొక్క ఆవిర్భావము కొరకై మనము వేచి చూడ పనిలేదు. ఏలయన, సర్వ-అనుభూతులకు మూలములో

మండే చేతనమనమగు బ్రహ్మకు మనము దూరముగా లేము. బ్రహ్మను భూతికై సర్వమునకు అతీతుడు కావలసిన పని లేదు. మానవుడు సుఖియైనా, దుఃఖియైనా, మరొకటి అయినా, సర్వము జ్ఞేయ-బ్రహ్మయే.

ఇచట మనకు అనేక విరోధాభాసలు కానవచ్చును. ఒకే సత్యత్వశ్రేణికి చెందిన రెండు వస్తువులతో వ్యవహరించే సందర్భములో మాత్రమే యుక్తి సంగతమగు విరోధమునకు అవకాశము గలదు. కాని మన మిచట మిథ్యా సత్యములతో వ్యవహరించుచున్నాము గనుక, ఇవి విరోధ-ఆభాసలే గాని, వాస్తవమగు విరోధములు కావు. తరువాతి శ్లోకములో ఇంకో రెండు విరోధ-ఆభాసలను మనము చూచెదము :

అధ్యాయము 13, శ్లోకము 15:

बहिरंतश्च भूतानामचरं चरमेव च ।
सूक्ष्मत्वात्तदविज्ञेयं दूरस्थं चान्तिके च तत् ॥ १५ ॥

బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ
సూక్ష్మత్వాత్తదవి జ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ (15).

చ = మరియు, తత్ = ఆ జ్ఞేయ-బ్రహ్మ, భూతానామ్ = ప్రాణుల యొక్క, బహిః = బయట, అంతః = లోపల, అచరమ్ = కదలనిది, చ = మరియు, చరం ఏవ = నిశ్చయముగా కదిలేది, తత్ = అది, సూక్ష్మత్వాత్ = సూక్ష్మము అగుట వలన, అవిజ్ఞేయమ్ = తెలియబడుట లేదు, చ = మరియు, దూరస్థమ్ = దూరముగా నున్నది, చ = మరియు, అంతికే = దగ్గరగా నున్నది.

> మరియు ఆ జ్ఞేయ-బ్రహ్మ ప్రాణులకు బయట, లోపల కూడ గలదు. అది కదలనిది, మరియు కదలేది కూడ నిశ్చయముగా అగుచున్నది. అది సూక్ష్మమగుటచే తెలియ బడుట లేదు. అది దూరము నందు, సమీపము నందు కూడ గలదు (15).

సాధారణంగా, ఒక వస్తువు లోపల ఉన్నచో, బయట లేదనియే గదా! కాని మనము తెలియ దగిన ఈ వస్తువు (జ్ఞేయం వస్తు) లోపల, బయట కూడ గలదు. ముందుగా ఒక స్థిర మగు సాధ్య

(reference) ను నిర్ధారించనిచో, లోపల- బయట అను పదములకు అర్థము లేదు. ఉదాహరణకు, ఒక కారు ఇంటికి బయట, ఇంటి చుట్టు గోడకు లోపల ఉండవచ్చును గదా!

ఆత్మ- అభిన్నమగు జ్ఞేయ- బ్రహ్మ లోపల, బయట కూడ గలదని భగవానుడు చెప్పుచున్నాడు. ఈ లోపల- బయటలకు ఆధారమగు స్థిర రేఖ (reference) ఏది? శ్రీ శంకరులీ విషయమును సుందరముగా వివరించినారు. భోగము కొరకై ఆరబ్ధమైన ఈ దేహమునందు జీవుడు ఆత్మ భావమును కలిగియున్నాడు గనుక, దేహము యొక్క చర్మమును హద్దుగా తీసుకొనవలెను. సర్వప్రాణుల స్థూలదేహములకు బయట ( భూతానాం బహిః) బ్రహ్మము గలదు. అనగా మనకు తెలిసేది మరియు తెలియనిది అగు సకల బాహ్య ప్రపంచము బ్రహ్మమే. స్థూలదేహమును హద్దుగా తీసుకొని, దానిలోపల (అంతః) గల ప్రాణమయాదులన్నియు బ్రహ్మమే. ఈ తీరున లోపల- బయట అంతటా చైతన్య- ఆత్మయే గలదు. సర్పమునకు రజ్జువు వలె, సర్వమునకు అనంత- బ్రహ్మ కారణము. బయట గల సర్వము పరబ్రహ్మయే. లోపల ఉన్న సర్వము పరబ్రహ్మయే. సర్వమునకు ఉనికిని, చైతన్యమును పరం బ్రహ్మయే ఇచ్చుచున్నది.

కాని స్థూలదేహము లెక్కలోనికి రాలేదు. 'అచరం చర మేవ చ' అని చెప్పి భగవానుడు సర్వమును బ్రహ్మలో సమ్మిళితము చేసినాడు. సంకల్ప పూర్వకముగా కదలని పర్వతాదులు అచరములనబడును. వాస్తవంలో బ్రహ్మాండమంతయు కదలుచునే యున్నది. కాని ఇచట కదలిక యనగా సంకల్ప పూర్వకమగు కదలిక. క్రిమికీటకములు, మనుజులు మరియు పశువులు కదిలే ప్రాణులు. పెరుగుదలలో భాగముగా వృక్షములలో కదలిక గలదు. అవి గాలికి కదులు చుండును. కాని ఒకే చోట వ్రేళ్లాని యుండును. అవి అచరములు. అదే విధముగా నది ప్రవహించు చున్ననూ, అది యాంత్రికమగు చలనమే గాని సంకల్ప పూర్వకము కాదు గనుక, నది అచరమగును. కాని ఇటునటు ఎగిరే దోమ చరము. స్థూల దేహము కూడా చరమే. కావున సర్వము బ్రహ్మలో సమ్మిళితమైనది. ఏమియూ విడువ బడలేదు. సూక్ష్మ- శరీరము స్థూలశరీరముతో తాదాత్మ్యమును చెందియున్నది గనుక, అది కూడ సంకల్ప పూర్వక చలనములో భాగము అగును. కాని ప్రాణవిహీనమగు స్థూలదేహము అచరమగును. వర్తమానములో ఉన్న, భూతకాలములో ఉండిన, మరియు భవిష్యత్తులో ఉండబోయే ఈ సర్వము పురుషుడేనని (పురుష ఏవ ఇదం సర్వమ్, యద్ భూతం యచ్చ భవ్యమ్) పురుషసూక్తములో చెప్పబడినది. ఉనికి (సత్) ని దాటి బయట ఏదియూ మనజాలదు. ఒక వస్తువు 'కలదు' అని మనము అన్నచో, ఆ 'కలదు' బ్రహ్మయే. బ్రహ్మ ఎట్లు ఉన్నది? కుండ, ఆకాశము, కాలము, సూర్యుడు, చంద్రుడు ఇత్యాది రూపములలో బ్రహ్మయే ఉన్నది. రజ్జువుపై సర్పము వలె,

లేదా మట్టి యందు కుండవలె ఈ నామరూపాత్మకమగు విశేషణములు బ్రహ్మ యందు ఆరోపించబడు చున్నవి. ఘటమంతయు మృత్తు తక్క మరియొకటి కాదు. కావున ఘటము అనునది నామరూపములు మాత్రమే. అదే విధముగా సమస్త సృష్టి సత్య- బ్రహ్మ యగు సత్- ఆత్మ యందు భాసించు చున్నది. బ్రహ్మను గుర్తించదగిన తీరు ఇదియే.

తరువాత శ్రీ శంకరులు ఒక ప్రశ్నను ప్రస్తావించిరి. మనము మట్టితో చేసిన కుండను చూచినప్పుడు, కుండను మరియు దానికి కారణమగు మట్టిని కూడ చూచెదము గదా! కాని ప్రస్తుతములో మనము కాలమును, ఆకాశమును, మరియు దేశ-కాలముల చక్రములో విభిన్న పదార్థములను మాత్రమే చూచు చున్నాము. బ్రహ్మ ఎచ్చటను గాన వచ్చుట లేదు. సర్వకారణమగు బ్రహ్మయే సర్వము అయినచో, మనకు బ్రహ్మ తక్క మిగిలిన సర్వము కానవచ్చుటకు కారణమేమి? శ్రీ శంకరులిట్లు వివరించిరి : వ్యవహారయోగ్యమగు సర్వము మనకు తెలియుచునే యున్నది. కాని బ్రహ్మ లేశమైననూ తెలియక పోవుటకు కారణమేమి? ఏలయన, బ్రహ్మ ఇది (ఇదమ్) కాదు. ఇది మరియు నేను (అహమ్) కూడ బ్రహ్మయే. కాని అహమ్ తెలియనిదే, ఇదమ్ అహమ్ కంటె వేరు గాదను సత్యము తెలియదు. అహమ్ తెలియనంత వరకు, దేహేంద్రియ మనస్సంఘాతము మాత్రమే ఆత్మ రూపములో స్వీకరింపబడును. అపుడు ఇతరము సర్వము దానికి విలక్షణము, మరియు విరోధి (విరుద్ధ ధర్మములు గలది) అగు చుండును. కావుననే, 'అనేకులలో నేను ఒకడిని' అను పద్ధతిలో మనము మనలను పరిగణించు కొనవలయును.

బ్రహ్మను తెలియుట యెట్లు? శ్రీ కృష్ణుడిట్లు చెప్పుచున్నాడు: బ్రహ్మ 'అహమ్' రూపములో సూక్ష్మరూపములో నుండుటచే తెలియబడుట లేదు (సూక్ష్మత్వాత్ తద్ అవిజ్ఞేయమ్). పంచభూతములలో ఆకాశము సూక్ష్మతమమని పరిగణించబడినది. ఏలయన, దానికి ఒక విశిష్ట రూపము గాని, అవయవములు గాని లేవు. అందుచేతనే అది సర్వవ్యాపకమై ఉండియూ, దేనిచేతనైననూ ప్రభావితమగుట లేదు. ఈ ఆత్మ ఆకాశము కంటెను సూక్ష్మ తరమైనది. శుద్ధచేతనమగు ఆత్మ కంటె సూక్ష్మతరమగు తత్త్వము మరియొకటి లేదు. ఆత్మ మూలకముగనే సర్వము ఉన్నది, మరియు తెలియబడుచున్నది. ఒక వస్తువు తెలియబడు చున్నది యనగా, అది నామరూపములను దోడించిన చైతన్యము మాత్రమే. బ్రహ్మ ఎచట గలదు? బ్రహ్మయే ఆత్మ. అది లేనిది ఎచట?

బ్రహ్మ ఎక్కడ గలదు? అని ప్రశ్నించాలంటే, ముందుగా అది ఎక్కడ లేదో నిర్ణయించుకొని ఉండాలి. అనగా అది స్థానికముగా ఉపలభ్యమగుట లేదనే నిశ్చయమును చేసి ఉండాలి. అట్లైనచో,

నేను ఒక ప్రశ్నను వేసెదను. బ్రహ్మ అనగా నేమి? బ్రహ్మ అనగా ఉనికి అనియు, అది సర్వమునకు కారణమనియు నీకు తెలిసి యున్నచో, 'ఎక్కడ?' అను ప్రశ్నకు తావు లేదు. సర్వస్థానములు బ్రహ్మమే అయి ఉండగా, బ్రహ్మము లేని స్థలము ఏది గలదు? ఇది 'ఆకాశము ఎక్కడ?' అను ప్రశ్నను బోలియున్నది. ఆకాశము సర్వత్రా గలదు. నీ ఎరుకలో ఒక ధారణా రూపమును మినహాయిస్తే, ఆకాశమునకు ఒక విశిష్ట నివేశన స్థానము లేదు. నీ యొక్క స్వయం-సిద్ధ స్వరూపమే బ్రహ్మ. కాని నీవు దానిని వెదుకు చున్నావు. దానిని ఎట్లు గుర్తించెదవు? అది ఒక వస్తువు కాదు. అది నీవే. అది సర్వవస్తువులు కూడ. నీకు ఏది కనబడితే, అదియే బ్రహ్మ. దర్శనము, ద్రష్ట కూడా బ్రహ్మయే. వృత్తి బ్రహ్మయే. వృత్తియనగా ఎరుక యొక్క ఒక రూపమునకు ఈయబడిన ఒక నామము మాత్రమే. ఈ వృత్తిని తెలుసుకొనే జ్ఞాత యొక్క స్వరూపము కూడా చైతన్య ఘనమగు బ్రహ్మ తక్క వేరు గాదు.

బ్రహ్మ అత్యంత సూక్ష్మము గనుక దానిని తెలియుట సంభవము కాదు (అవిజ్ఞేయమ్). అనగా, మనము దానిని ఒక వస్తురూపములో తెలియజాలము. అది నీ స్వరూపము. దానిని ఒక వస్తువు అని భావన చేసినచో, అది చాల దూరములో నున్నది (దూరస్థమ్). దానిని తెలుసుకున్నచో, అది చాల దగ్గరలో నున్నది (అంతికే). అది నీవే. అది తన స్వరూపమేనని గుర్తించని వానికి అది చాల దూరములో నున్నది. బ్రహ్మ ఆత్మయేనని గుర్తించ లేని వ్యక్తికి, దానిని వెదుకుటకు ఎంతకాలము పట్టును? అది నీ కంటె భిన్నమైనచో, ఒక నాడు అది అనుకోకుండగా దొరకవచ్చును. కాని నీ కాలికి నీవే తగులుట ఎంత వరకు సంభవము? అనగా, అది వేయి కోట్ల సంవత్సరములు గడిచిననూ అలభ్యముగనే ఉండునని శ్రీ శంకరులు చెప్పిరి. అది దిగంతము (horizon) వలె సర్వదా దూరముగ నుండును. దిగంతమువైపునకు ఎంత దూరము వెళ్లినా, అది సమీపించదు. బ్రహ్మను అన్వేషించువాడు శాశ్వతకాలము అన్వేషించు చునే యుండును. ఏలయన, అట్టివానిలో 'నేను అన్వేషకుడను' అనే ధారణ ఎన్నటికైననూ తొలగదు. బ్రహ్మ కొరకు నీవు నీ లోపల వెదికినా, నీ కంటె బయట వెదికినా, నీకు బ్రహ్మ దొరకదు. ఏలయన, బ్రహ్మను వెదుకువాడే బ్రహ్మ. ఈ తీరున బ్రహ్మ దూరస్థము మాత్రమే గాక, ఆత్మయే గనుక, సమీపములో (అంతికే) కూడ గలదు. కావున జ్ఞాని దృష్టిలో 'ఈ సర్వము నేనే', 'ఈ సర్వము బ్రహ్మమే' అను రెండు వాక్యములు సమానమేనని శ్రీ శంకరులు నుడివిరి. జ్ఞాని శాస్త్రప్రమాణముచే ఈ సత్యమును గుర్తించును. జ్ఞాని (విద్వాన్) కి బ్రహ్మ జ్ఞానము నిత్యము. ఏలయన, దీనికి స్మృతితో పనిలేదు. ఇచట అజ్ఞాన నిర్మూలనము మాత్రమే గలదు. $E=mc^2$ అను సూత్రమును ఎప్పుడైననూ విస్మరించుటకు అవకాశము గలదు. కాని సత్యం జ్ఞానం అనంతమ్ అనునది సూత్రము (formula) కాదు. అది నీ స్వరూపము. స్మృతికి మూలము ఆ స్వరూపమే గనుక,

అది స్మృతిపై ఆధారపడి ఉండదు. అజ్ఞానమును నిర్మూలించిన చాలును. జ్ఞానుల ఆత్మయే గాక, అజ్ఞానుల ఆత్మ కూడా బ్రహ్మయే. కావున అజ్ఞానికి కూడ ఆత్మ అత్యంత సమీపముగ నున్నది. కాని అజ్ఞానముచే దూరమగు చున్నది. విద్వాంసునకు దీని కంటె దగ్గరగా మరియొకటి లేదు. అవిద్వాంసునకు దీనికంటె దూరముగా మరియొకటి లేదు.

ఒక వస్తువు ఏక కాలములో దగ్గరగా మరియు దూరముగా ఎట్లు ఉండగల్గును? ఈ క్రింది కథ ఈ విషయమును స్పష్టపరచును. ఇద్దరు వ్యక్తులు రాత్రి యందు రైలులో ఒకే బోగీలో కూర్చుండి పయనించుచుండిరి. ఒకని వద్ద చాల ధనము ఉండెను. అతడు దానిని బహిరంగముగ లెక్క పెట్టు కొనుచుండెను. రెండవవాడు దానిని చూచి అపహరించవలెనని నిశ్చయించు కొనెను. ఆ ధనికుడు నిద్రపోవు వరకు వేచియుండి, తరువాత ఈతడు సామానులనన్నిటినీ వెదికెను. కాని ఆ ధనము కానరాలేదు. మరునాడు ఉదయము నిద్రలేచి, కాలకృత్యములను తీర్చుకొనిన తరువాత ఆ ధనికుడు కూర్చుండి మరల తన ధనమును లెక్కించు కొనుచుండెను. ఈ రెండవ వ్యక్తి ఉండబట్టజాలక, 'మీరు రాత్రి ధనమును ఎక్కడ దాచిరిరి?' అని బయట పడి ప్రశ్నించెను. 'నీ తలగడ క్రింద దాచితిని' అని ఆ ధనికుడు బదులిడెను. ఆ ధనము ఈతనికి చాల దగ్గరలో (అంతికే) తన తలగడ క్రిందనే ఉండెను. అయిననూ అతనికి ఆ సంగతి తెలియక పోవుట వలన అది అతనికి చాల దూరములో నుండెను (దూరస్థమ్). ఇదే విధముగా, బ్రహ్మ నీ స్వరూపమే గనుక, నీకు చాల దగ్గరలో నున్నది. అయిననూ, ఆ సత్యమును నీవు ఎరుంగనిచో, అంత దూరముగా ఇతరమేదియూ లేదు.

మరియు,

**అధ్యాయము 13, శ్లోకము 16:**

अविभक्तं च भूतेषु विभक्तमिव च स्थितम्।
भूतभर्तृ च तद् ज्ञेयं ग्रसिष्णु प्रभविष्णु च ॥ १६ ॥

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్
భూతభర్తృ చ తద్ జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ (16).

చ = మరియు, తత్ = ఆ బ్రహ్మ, భూతేషు = ప్రాణుల యందు, అవిభక్తమ్ = విభాగమును పొందనిది, చ = మరియు, విభక్తం ఇవ = వేర్వేరా యున్నట్లు, స్థితమ్ = ఉన్నది, చ

= మరియు, భూత భర్తృ = ప్రాణులను పాలించి పోషించునది, గ్రసిష్ణు = మ్రింగివేయునది, చ మరియు, ప్రభవిష్ణు = సృష్టించునది అని, జ్ఞేయమ్ = తెలియదగును.

> మరియు ఆ బ్రహ్మ వేర్వేరు ప్రాణుల యందు వేర్వేరుగా నున్నట్లు కన్పట్టినను, వాస్తవమగు భేదము లేదు. ప్రాణులను పాలించి పోషించునది, ప్రలయములో సంహరించునది మరియు సృష్టించునది బ్రహ్మయే నని తెలియదగును (16).

అది సర్వప్రాణులయందు ఆకాశమువలె అవిభక్తము (undivided) గ నున్నది. గదిలోని గోడలు మొదలగు వివిధ ప్రతి బంధకములచే (ఉపాధి) ఆకాశము విభక్తమై యున్నట్లు భాసించును. కాని వాస్తవములో అది అవిభక్తముగనే యుండును. మరియు ఇతర భూతములతో పోలిస్తే, సర్వమును వ్యాపించి యుండును. ఉపాధుల వలన ఆకాశము విభక్తమై యున్నట్లు 'కన్పట్టునని' మనము అనుకున్నాము. జ్ఞాన–అజ్ఞానములకు మధ్యలో గల భేదము ఈ 'కన్పట్టుట'. విభక్తమై యున్నట్లు కన్పట్టు చున్నది అన్నచో, అది జ్ఞానము. విభక్తమై యున్నది అన్నచో, అది అజ్ఞానమగును. కావున, మనకు కన్పట్టే భేదములను నిర్మూలింప బనిలేదు. ఏలయన, వాస్తవమగు విభాగములు లేనే లేవు.

ఆ బ్రహ్మ సర్వప్రాణులను మరియు భూతములను ధరించి పాలించి పోషించునని (భూతభర్తృ) తెలియదగును. ఆ బ్రహ్మ ప్రలయకాలములో ఈ జగత్తు నంతనూ మ్రింగివేయును (గ్రసిష్ణు). అనగా సర్వము బ్రహ్మ అనే కారణము నందు విలీనమగును. తరువాత మరల ఈ సర్వము ఆయన నుండియే ఉద్భవించును (ప్రభవిష్ణు). ఆయన సంహర్త, స్రష్ట మాత్రమే గాక, రక్షకుడు కూడ (భూతభర్తృ). సర్వమును సృష్టించిన చతుర్ముఖ బ్రహ్మ, సర్వమును పాలించు విష్ణువు, మరియు సర్వమును తనలో విలీనము చేసుకొనే రుద్రుడు అను త్రిమూర్తులు ఈ జ్ఞేయ బ్రహ్మయే.

సుస్పష్టము మరియు సమగ్రము అగు ఈ శ్లోకములు జ్ఞేయబ్రహ్మ స్వరూపమును ప్రదర్శించు చున్నవి. ఈ శ్లోకములను విశ్లేషించినచో, పూర్ణ శాస్త్రసారము వీటిలో తేట తెల్లమగును. వీటిలోని విరోధాభాసలు మిథ్యాసత్యములను మరియు వేదాంత సారమును ప్రదర్శించు చున్నవి.

**హరిః ఓం తత్సత్ – శ్రీ కృష్ణార్పణమస్తు**